# ఆంధ్రగ్రంథములు.

## కావ్యశాస్త్రములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అప్పకవీయము, కసుగు రామమూర్తిపంతుల విమర్శతో | 3 | 0 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) ... | 6 | 0 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము ... | 8 | 0 |
| ,, ఉత్తమప్రతి, 2 సంపుటములు ... | 10 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు ... | 1 | 8 |
| ,, టీక ... | 4 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | |
| ఆది సభాపర్వములు గల సంపుటము ... | 3 | 0 |
| ఆరణ్యపర్వము ... | (అచ్చు) | |
| విరాటోద్యోగపర్వములు ... | (అచ్చు) | |
| భీష్మద్రోణపర్వములు ... | ,, | |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ... | ,, | |
| శాంతిపర్వము ... | 3 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు ... | 3 | 0 |
| ఆదిపంచకము' ఒకటేసంపుటము ... | (అచ్చు) | |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము ... | ,, | |
| శాంతిసప్తకము ... | 5 | 4 |
| ఆనందరంగరాట్ఛందము ... | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, అట్టబైండు ... | 1 | 4 |
| డిటో క్యాలికోబైండు ... | 1 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు ... | 3 | 8 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ... | 1 | 12 |
| కవికర్ణరసాయనము, (మాంధాతృచరిత్ర) ... | 1 | 8 |
| కాశీఖండము, క్రొత్తకూర్పు ... | 1 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు ... | 10 | 0 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము, క్రొత్తకూర్పు | 1 | 8 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది ... | 1 | 8 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) ... | 1 | 0 |
| జైమినీభారతము, అశ్వమేధపర్వము ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, పద్యము కేతనకవి ... | 1 | 8 |
| దశావతారచరిత్ర, చక్కనిక్రొత్తకూర్పు ... | 3 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, భాగవతములోనిది ... | 0 | 10 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 1 | 0 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్యప్రణీతము | 1 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనామాత్యప్రణీతము | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవిది ... | 1 | 0 |
| " కాలికోబైండు ... | 1 | 6 |
| " వేంకటనాథరాజకవికృతము ... | 1 | 4 |
| " కాలికోబైండు ... | 1 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| " సాంధ్రటీకాతాత్పర్యము ... | 3 | 0 |
| బ్రహ్మోత్తరఖండము, క్రొత్తకూర్పు, శ్రీధరమల్లె వేంకటరామకవి | 1 | 8 |
| బసవపురాణము, పిడపర్తి సోమనాథకవి ... | 2 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనిక్రొత్తకూర్పు ... | 6 | 0 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రితము ... | 4 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 2 | 8 |
| భక్తిరసశతకసంపుటము I 20 శతకములు ... | 3 | 0 |
| " II " ... | 3 | 0 |
| " III " ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I " ... | 3 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు | 3 | 8 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| రాఘవపాండవీయము, సటీక, ద్వ్యర్థిప్రబంధరాజము | ... | 3 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 4 |
| వసుచరిత్రవిమర్శనము | ... | 1 | 4 |
| వసుచరిత్ర, సటీక, రామరాజభూషణప్రణీతము | ... | 5 | 0 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మ | ... | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిది | ... | 1 | 4 |
| విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరనార్యప్రణీతము, లఘుటిప్పణము | ... | 3 | 8 |
| వివేకసింధు, కొండనార్యప్రణీతము | ... | 1 | 0 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మ | ... | 1 | 8 |
| వైశ్యపురాణము, శ్రీగురు భాస్కరాచార్యకృతము | ... | 1 | 4 |
| వీరభద్రవిజయము, పోతనకృతము | ... | 1 | 0 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 1 | 0 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | ... | 1 | 0 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది | ... | 1 | 8 |
| శృంగారశాకుంతలము, పినవీరభద్రకవి | ... | 1 | 0 |
| శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య | ... | 1 | 0 |
| శుకసప్తతి, కదిరీపతికృతము | ... | 1 | 8 |
| సమీరకుమారవిజయము, నూతనముద్రితము | ... | 1 | 8 |
| సానందోపాఖ్యానము, శ్రీ శివరామకవి విరచితము | ... | 1 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, తాత్పర్యము | ... | 4 | 8 |
| ,, అట్టబైండు | ... | 2 | 8 |
| సుదక్షిణాపరిణయము, తెనాలి అన్నయకవి (క్రొత్తకూర్పు) | | 1 | 0 |
| హరివంశము, క్రొత్తకూర్పు, ఎఱ్ఱాప్రగడ | ... | 4 | 8 |
| హరవిలాసము, శ్రీనాథకవి | ... | 1 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవి | ... | 1 | 0 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, రామరాజభూషణకవి | | 3 | 8 |

ఓం.

శ్రీవాసుదేవ పరబ్రహ్మణేనమః.

మోక్ష సుఖాపేక్షకులగు జనులు కృతార్థులగుటకొఱకు
మునిసింహుండని మూడు లోకములయందును
ప్రసిద్ధినొందిన
శ్రీవాల్మీకిమహర్షిచే రచియింపంబడినది.

---

# శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణము
# వచనకావ్యము.

---

ఈ గ్రంథము,

బ్రహ్మశ్రీ - వెన్నెలకంటి - సుందరరామ శర్మ గారిచే
వచనకావ్యముగ రచియింపబడినది.

చన్నపురి,

బరూరు - త్యాగరాయ శాస్త్రులవారి

స్వకీయ
గీర్వాణ భాషా రత్నాకర ముద్రాక్షర శాలయందు
ముద్రింపబడినది. 1918 సం.



[దీనివెల. రూ. ౫-౦-౦ 6/-



# బరరాదు - త్యాగరాయశాస్త్రి

పూర్వాశ్రమ ప్రసిద్ధాభిధాన

రాజయోగి - శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామీ.

---

## ఈ జ్ఞానవాశిష్ఠరామాయణము.

రాజయోగి - శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామ్యాఖ్య
మదీయగుర్వాజ్ఞచే లోకోపకారార్థము ముద్రించి
ప్రసిద్ధి చేయబడినది.

ఇట్లు, సజ్జన విధేయుడు.

బరరాదు - కుప్పుస్వామి శాస్త్రి

శ్రీ

# నూతనగ్రంథముల ప్రకటన.

శ్రీ వేదాంతపంచదశీ - టీకాతాత్పర్య
సహితము రూ ౯-౮-౨

బ్రహ్మసూత్రములు - టీకాతాత్పర్య
సహితము రూ ౩-౮-౦

యల్లాజీయము - తెనుగుతాత్పర్య
సహితము రూ ౩-౮-౪

హేమాద్రి ప్రాయశ్చిత్తకాండము
తెనుగుతాత్పర్యము రూ ౬-౦-౦

ఈ జ్ఞానవాశిష్ఠ రామాయణము-
వచనకావ్యము రూ [illegible]-౦-౦

ఈ గ్రంథములు వలయువారు మదరాస్ - ~~[illegible]~~
~~[illegible]~~
బరూరు - త్యాగరాయశాస్త్రిగారికి వ్రాసి
తెప్పించుకొనవచ్చును.

—*—

# ఓమ్.

## అ వ తా రి క.

ప్రజ్ఞానఘనులారా ! బ్రహ్మమానస పుత్రుడగు శ్రీవశిష్ఠమహర్షి లోకానుగ్రహార్థము పరబ్రహ్మ తత్త్వమును పరంధాముడగు శ్రీరామునకు ఉపదేశించెను. "యతోవాచోనివర్తంతే, అప్రాప్య మనసాసహ" అను శ్రుతిరీతి అవాఙ్మానస గోచరమగు అట్టి పరబ్రహ్మతత్త్వమును కరుణార్ద్రహృదయుడును కవిసింహుడును నగు శ్రీవాల్మీకిమహర్షి కరతలామలకముగ తెలియునట్లు శ్లోకరూపముగ రచియించెను. ఈగ్రంథము బ్రహ్మర్షిశ్రేష్ఠుడగు వశిష్ఠమహర్షి సచ్చిదానందస్వరూపుడైన రఘునందనునకు బోధించుటచేత వాశిష్ఠరామాయణమనియు, యోగవాశిష్ఠ మనియు, చెప్పబడును. కావున అమృతపానము జేసిన ఎట్లుండునో, అనితలంచువారు ఈగ్రంథరాజమును చదివిరేని అమృతపానముయొక్క స్వారస్యమును తెలిసికొనుటయేగాక, పునర్జన్మరహితులగుదురు. పునర్జన్మరహితులగుదు రనగా; జనన జరా మరణ ప్రవాహ రూపమైన ఘోరసంసార సముద్రమునందు తగులుకొనక నిత్యానంద స్వరూపు లగుదురు. ఓసుజ్ఞానులారా ! ఈవిషయమునందు ముమ్మాటికి సంశయింపనక్కరలేదు. సామాన్యముగ శాస్త్రముల యందును వేదముల యందును ఆత్మతత్త్వము విస్పష్టముగా వివరింపబడియే ఉన్నది. అయినను వాని యందు కేవలము తార్కిక యుక్తులు, వాద భేదములు, వాటి నిరాకరణములు, మొదలగునవి మాత్రమే ఉండుటచేత కేవల పండితులకే గాని, అందలి ఉపదేశము రుచింపదు. వారికైనను అత్యల్పకాలములోనే విసుకు పుట్టును. అర్థమును గ్రహించుటయు మిక్కిలి కష్టసాధ్యమై ఉండును. ఇట్లగుటచేతనే కదా వానికి [ వేద శాస్త్రములకు ] వ్యాఖ్యానములపై వ్యాఖ్యానములు పుట్టియున్నవి. శ్రుతిసమన్వయమునకై ప్రత్యేకముగ వ్యాసుడు బ్రహ్మసూత్రమును కూడ రచియించి యున్నాడు. ఈవిధముగ ఆవేదశాస్త్రాదులు పండితులకుగూడ అగమ్యములై ఉన్నవి. పండితుల విషయమే ఇట్లుండ పామరులనుగూర్చి చెప్పవలసినది ఏమి ఉన్నది. వారు ముముక్షువు

లైనను ఆవేద శాస్త్రాదుల వైపునకు బోవ మనస్సునందైన దలంపరు. అవి రసహీనములగుటచేత శుష్కప్రాయములై ఉన్నవికదా! కావున ఈవాశిష్ఠరామాయణము సర్వోత్తమము. ఉపదేశమనునది శిష్యునియొక్క మనస్సును ఆకర్షించునదిగా నుండవలయును. అట్టి ఆకర్షణ లేకున్న గురువాక్యములయందు విశ్వాసము కలుగదు. విషయము నూతనంబును గ్రహించుటకు అశక్యమునుకూడనై ఉండును. కావున అది మనస్సునకు వచ్చునంతకాలమువరకు ఆశిష్యునకు ఓర్పుకూడా కలుగదు. ఈ గ్రంథమునందన్ననో, ఆ ఉపదేశము మిక్కిలి మనోహరముగ చిత్తాకర్షకముగ నున్నది. ఇందు రసపూరితములై వినుటకు ఆరంభించిన పిమ్మట చిత్తమును తన్మయము చేయగల ఇతిహాసములు అనేకములు దృష్టాంతములుగ వర్ణింపబడి ఉన్నవి. అచ్చటచ్చట తత్వబోధయున్నను ఈ ఇతిహాసములవలన అది వేద శాస్త్రాదులయందలి బోధవలె విసుకును పుట్టింపజేయునదిగా లేదు. సరసమైన పదార్థములందును అల్పపరిమాణముగు నీరసపదార్థముకూడ సరసప్రాయమే అగుననుట అనుభవసిద్ధము. ఇట్లగుటచేత ఈగ్రంథము పండిత పామర రంజకమని ప్రత్యేకముగ జెప్ప నక్కఱ లేదు. దీనిని విన నారంభించినవారు సమాప్తి చేయునంతవరకు విడువరని చెప్పుట అతిశయోక్తికాదు. ఇట్లగుటచేతనే దీనికి ఇంతప్రభావము చెప్పబడినది. "వినినంతమాత్రముననే బ్రహ్మజ్ఞానము కలుగును" అని చెప్పబడియున్నది అని తెలిసికొనవలయును. ఒకమాఱు సమాప్తిచేసిన శతాంశమైనను తత్వజ్ఞానము కలుగక ఉండదు. ఆజ్ఞానము ఎంతమాత్రము కలిగినను, మనస్సును కొంతవరకైనను నిర్మలము కావించును. దానిచేత తత్వవిమర్శయందు ఉత్సాహము కలిగి క్రమక్రమముగ అతిశీఘ్రకాలములోనే ముక్తి దొరుకు ననుట దానికి [ ఈరామాయణమును వినగానే ముక్తిదొరుకును అనుటకు ] అభిప్రాయము. కావున ఈగ్రంథమును అత్యాదరముతో పఠించువారు ధర్మార్థ కామ మోక్షములనియెడు చతుర్విధ పురుషార్థములను జెంది బ్రహ్మజ్ఞాన సంపన్నులై కృతార్థులగుదురు గాక.

శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణము నందలి విషయానుక్రమణిక.

—*—

| | పుటసంఖ్య. |
|---|---|

శ్రీజ్ఞానవాశిష్ఠరామాయణమునందలి విషయానుక్రమణిక

ముగిసెను.

శ్రీరస్తు.

# పీ ఠి క.

శా॥ శ్రీకల్యాణ గుణాకరుండగుచు నిస్సీమానుకంపాగతిన్ ।
లోకోల్లాసము నాచరించు నెవఁడాలూనాఘ సంఘాతుఁడై ।
వైకుంఠాజ శివాదినామ పరతన్వాదింతు రెవ్వానిన్ ।
స్తోకాకార మెఱుంగలేక నతనిన్ముద్ధుం బ్రశంసించెదన్ ॥ ౧ ॥

క॥ ఆదట భజింతు మొదలయ ।
థాదేవేయనెడు పలుకు దలచుచు భగవ ।
త్పాదులవిధి తనయవ్యా ।
సాదుల శ్రీరామకృష్ణ సద్బుధవరులన్ ॥ ౨ ॥

తే-గీ॥ సుందరాంబిక పరదేశ సూరిజనకు ।
గడకనుతియించి వెన్నెలకంటికులుఁడ ।
జ్ఞానవాశిష్ఠ సారంబు నుచితఫణితి ।
సుందరాఖ్యుఁడ తెనిగింతు సుజనహితుఁడ ॥ ౩ ॥

మ॥ కమలానాథుఁడు పృచ్ఛకుండు గురుఁడుం గంజాతజాతాత్మజుం ।
డమలబ్రహ్మము బోధ్యమిందరయ గ్రాహ్యాగ్రాహ్య శంకో
ద్భవం । బుమహిన్ లేదు బుధాళికిన్ కృతియు నింపుంగూర్చని
కరంబువా । రిమలాకాంత మటంచు నెంతురొకా సాలిగ్రామ
సంబద్ధమున్ ॥ ౪ ॥

# ఓం.

## శ్రీ పరబ్రహ్మణే నమః.

# మనీషా పంచకము.

శ్లో॥ కదాచి చ్ఛంకరాచార్యః కాశీంప్రతి పురం యయా ।
తస్య జ్ఞాన పరీక్షార్థం కశ్చిద్దేవ స్సమాగతః ॥
చండాల రూపిణం దృష్ట్వా గచ్ఛ గచ్ఛేతి చాబ్రవీత్ ।
శంకరస్యోపి చండాలః తం పునః ప్రాహ శంకరమ్ ॥

తా॥ శ్రీమత్ ఆదిశంకరాచార్యులవారు ఒకానొక సమయమునందు అనేక జనులు గల కాశీపట్టణమునుగూర్చి పోవుచుండగా పరమేశ్వరుడు శ్రీశంకరాచార్యులయొక్క విజ్ఞానము తెలియుటకొఒకు చండాలుని రూపమును ధరించి వచ్చెను. అప్పుడు శ్రీశంకరాచార్యులవారు చండాలరూపధారియగు ఈశ్వరునిజూచి పోపొమ్ము దూరముగ తొలగిపొమ్ము అనిపలికెను. అంత చండాలరూపధారియగు ఈశ్వరుడు ఇట్లనియె.

శ్లో॥ అన్నమయా దన్నమయ మథవా చైతన్యమేవ చైతన్యాత్ ।
యతివర దూరీకర్తుం వాంఛసి కిం బ్రూహి గచ్ఛగచ్ఛేతి ॥

తా॥ ఓయతిశ్రేష్ఠా ! అన్నమయకోశముగల నీశరీరమునుండి అన్నమయకోశముగల నాశరీరమును దూరముగా తొలగిపొమ్ము తొలగిపొమ్ము అనుచున్నావు. అదియునుగాక చేతనరూపమైన నీయొక్క ప్రత్యగాత్మనుండి చేతనరూపమైన నాప్రత్యగాత్మను దూరముగా తొలగిపొమ్ము తొలగిపొమ్ము అనుచున్నావా ? ఏమి ? ఇందుకు సమాధానము చెప్పుము. నీశరీరమును, నాశరీరమును, అన్నముచేతనేర్పట్టైనుగదా ? అట్లుండగ నీశరీరము పరిశుద్ధమైనదిన్ని ? నాశరీరము అపరిశుద్ధమైనదా ? పరిశుద్ధ మయ్యెనేని, ఇద్దరి శరీరములును పరిశుద్ధములు కావలయును. అపరిశుద్ధము లయ్యెనేని ఇద్దరి శరీరములును అపరిశుద్ధములు కావలయును. మన ఇద్దరి శరీరములు సమానగుణములు గలవిగా నుండగా నన్ను దూరముగా తొలగిపొమ్ము అని చెప్పుట న్యాయముగాదు. మఱియును పిపీలికాది బ్రహ్మపర్యంతము గల సకలవిధ ప్రాణుల శరీరములయందును చేతనస్వరూపుడైన ప్రత్య

గాత్మ నిండి ఉన్నాడని వేదము స్పష్టముగ తెలియజేయుచున్నది. కాబట్టి నన్ను తొలగిపొమ్మనుట అన్యాయము.

శ్లో॥ ప్రత్యగ్వస్తుని నిస్తరంగ సహజానందావబోధాంబుధౌ
విప్రోయం శ్వపచోయ మిత్యపి మహాన్ కోయం విభేదభ్రమః।
కిం గంగాంబుని బింబితేంబరమణౌ చండాలవీధీ పయః
పూరేవాంతర మస్తి కాంచనఘటీ మృత్కుంభయో ర్వాంబరే॥

తా॥ ఓశంకరాచార్యా ! కూటస్థునికంటె వేరుగాని పరమాత్మస్వరూపమయ్యును, రాగాది పంచకతరంగ శూన్యమయ్యును,తనయందు జనించిన ఆనంద స్వరూపమగు పరిపూర్ణ జ్ఞానసముద్రమను పరబ్రహ్మయందు, ఇతడు బ్రాహ్మణుడు, ఇతడు చండాలుడు, అనెడి ఈభేదమైన బుద్ధి ఎకుండనుండి వచ్చును? గంగాజలములయందు ప్రతిఫలించన సూర్యునకును, చండాలురు నివసించు వీధులయందు ఉండు జలములయందు ప్రతిఫలించిన సూర్యునకును తారతమ్యము ఏమియున్నది. మఱియును బంగారుకుండయందు ఉన్న ఆకాశమునకును, మట్టికుండయందు ఉన్న ఆకాశమునకును భేదము ఎట్లులేదో, అట్లే పరమాత్మకు భేదములేదు. అని ఇట్లు చండాల వేషధారియగు ఈశ్వరుడు చెప్పగానే సర్వజ్ఞుడగు శ్రీశంకరాచార్యులవారు సర్వమును గ్రహించి లోకోపకారార్థము ఇట్లని ప్రత్యుత్తరము చెప్పెను.

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరాయాసం విదుజ్జృంభతే
యాబ్రహ్మాది పిపీలికాంత తనుషు ప్రోతా జగత్సాక్షిణీ।
సైవాహం నచ దృశ్యవస్త్విత దృఢప్రజ్ఞాహి యస్యాస్తిచే
చ్చండాలోస్తు సతు ద్విజోస్తు గురురిత్యేషా మనీషా మమ॥

తా॥ ఏపరమాత్మ చైతన్యము జ్ఞానస్వరూపమై జాగ్రత్స్వప్నసుషుప్తి అను మూడవస్థలయందును మిక్కిలి స్పష్టముగా ప్రకాశించుచున్నదో, ఏపరమాత్మ చైతన్యము పిపీలికాది బ్రహ్మపర్యంతము గల చరాచరరూప శరీరములయందు ఉన్నదై జగత్సాక్షియై చూచుచున్నదో, అట్టి జ్ఞానస్వరూపమైన పరమాత్మయే నేను. కంటికి కనుపడుచున్న ఈదృశ్యము నేను కాను. అను దృఢమైన జ్ఞానము ఎవనికి గలదో, అట్టివాడు చండాలుడైనను, బ్రాహ్మణుడైనను, నాకు గురువని నానిశ్చయాభిప్రాయము.

శ్లో॥ బ్రహ్మైవాహ మిదం జగచ్చ సకలం చిన్మాత్ర విస్తారితం
సర్వం చైత దవిద్యయా త్రిగుణయా సేశంమయా కల్పితమ్ ।
ఇత్థం యస్య దృఢా మతి స్సుఖతరే నిత్యేపరే నిర్మలే
చండాలోస్తు సతు ద్విజోస్తు గురు రిత్యేషా మనీషా మమ ॥

తా॥ పరబ్రహ్మమగు చిద్రూపముతో నిండియుండు, జీవుడు ఈశ్వరుడు మొదలగు భేదములుగల ఈజగత్తంతయు సత్వ రజ స్తమో గుణాత్మకమగు అజ్ఞానమువలన నాచేతనే కల్పింపబడినది. నేను నిర్మలమగు పరబ్రహ్మ స్వరూపుడను. అని ఈప్రకారముగ పరమానందమై శాశ్వతమై నిర్మలమై యుండునట్టి పరబ్రహ్మమునందు ఎవడు దృఢమైన బుద్ధి గలవాడైయుండునో, అట్టివాడు చండాలుడైనను, బ్రాహ్మణుడైనను, నాకు గురువని నానిశ్చయాభిప్రాయము.

శ్లో॥ శశ్వ న్నశ్వరమేవ విశ్వమఖిలం నిశ్చిత్య వాచా గురో
ర్నిత్యం బ్రహ్మ నిరంతరం విమృశతా నిర్వ్యాజ శాంతాత్మనా।
భూతం భావిచ దుష్కృతం ప్రదహతా సంవిన్మయే పావకే
ప్రారబ్ధాయ సమర్పితం స్వవపు రిత్యేషా మనీషామమ॥

తా॥ కంటికి అగుపడుచుండు ఈదృశ్యమగు సకలప్రపంచము ఎల్లప్పుడును అశాశ్వతమే అను విషయమును తెలిసి నిశ్చయించుకొని గురూపదేశముచేత శాశ్వతమగు బ్రహ్మస్వరూపమునుగూర్చి నిష్కపటమగు శాంతమైన మనస్సుతో ఎల్లప్పుడు విచారణ చేయుచు సంచితాగామి కర్మరూప పాపపుణ్య ఫలమును జ్ఞానరూపాగ్ని యందు దహింపజేసి ప్రారబ్ధానుభవ నిమిత్తము శరీరమునుధరించి యున్నా నని ఏబ్రహ్మజ్ఞాని తలంచుచుండునో, అట్టివాడు నాకు గురువని నాని శ్చయాభిప్రాయము.

శ్లో॥ యా తిర్య జ్నరదేవతాభి రహ మిత్యంత స్స్ఫుటా గృహ్యతే
యద్భాసాహృదయాక్ష దేహ విషయాభాంతి స్వతోచేతనాః।
తాం భాస్యైఃపిహితార్క మణ్డల నిభాం స్ఫూర్తింసదాభావయన్
యోగీనిర్వృత మానసోహి గురు రిత్యేషా మనీషా మమ॥

తా॥ ఏచైతన్యమువలన పక్షులు, పశువులు, దేవతలు, మనుష్యులు, మొదలగువారలచేత తమ మానసములయందు నేను, నేను, అనుతలంపు స్ఫుటముగ గ్రహింపబడుచుండునో, ఏచైతన్య ప్రకాశ

రక్షణముచేత నేత్రాదీంద్రియములయొక్క వ్యాపారములు తాము గా జరిపించుచుండువానివలె జరుగుచున్నవో, అట్టి పరమాత్మ చైత న్యమును " మబ్బువలన ఆవరింపబడిన సూర్యమండలముతో " సమా నమైనదానినిగా తలచువాడే బ్రహ్మజ్ఞాని. వాడే నిశ్చయముగ మనో వృత్తి రహితమైనవాడు. అట్టివాడు నాకు గురువని నా నిశ్చయాభి ప్రాయము.

శ్లో॥ యత్సౌఖ్యాంబుధి లేశలేశత ఇమే శక్రాదయో నిర్వృతాః
యచ్చిత్తే నితరాం ప్రశాంత కలనే లబ్ధ్వాముని ర్నిర్వృతః।
యస్మిన్ నిత్య సుఖాంబుధౌ గళితధీ ర్బ్రహ్మైవ నబ్రహ్మవిత్
యః కశ్చి త్ససురేంద్ర వందిత పదో నూనం మనీషా మమ॥

తా॥ ఏపరమాత్మయొక్క అపరిమితమగు ఆనందస్వరూప సముద్రమునందు దేవేంద్రుడు మొదలగువారు అల్పపరిమాణముగల అణుమాత్రమైన ఆనందముచేత సంతుష్టులైయున్నారో, మనన శీలు డగు బ్రహ్మజ్ఞాని నిస్సంకల్పమగు మనస్సునందు ఏ ఆనందమునుపొంది సంతుష్టుడగుచున్నాడో, ఏశాశ్విత ఆనందమనెడి సముద్రమునంగు మునిగినవాడు తానే స్వయముగ బ్రహ్మస్వరూపు డగుచున్నాడో, బ్రహ్మవేత్తగాడో, అట్టివాడే దేవతలకు ప్రభువగు ఇంద్రుడు మొద లైనవారిచేత నమస్కరింపదగిన వాడని నా నిశ్చయాభిప్రాయము.

వాశిష్ఠే॥ శ్లో॥ దర్శనాఽదర్శనే హిత్వా స్వయం కేవల రూపతః।
యస్తిష్ఠతి సతుబ్రహ్మన్ బ్రహ్మ నబ్రహ్మ విత్స్వయమ్॥

తా ॥ ఏపురుషుడు నేను బ్రహ్మము నెరుగుదును, ఎరుగను, అనెడి వ్యవహార ద్వయమును విడిపించి తాను అద్వితీయ చైతన్య మాత్రరూపముగ నుండునో, అట్టి పురుషుడు తాను పరబ్రహ్మమే అగును గాని, బ్రహ్మవేత్త గాడని తెలిసికొన వలయును.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీమచ్ఛంకర
భగవత్పాదాచార్య విరచిత మనీషాపంచకము

సమాప్తము—ఓంతత్సత్.




శ్రీ పరబ్రహ్మణే నమః.

# బ్రహ్మజ్ఞానావళీమాలా ప్రారంభః.

శ్లో॥ సకృచ్ఛ్రవణ మాత్రేణ బ్రహ్మజ్ఞానం యతోఽభవేత్ ।
బ్రహ్మజ్ఞానావళీమాలా సర్వేషాం మోక్షసిద్ధయే ॥ ౧॥
అసంగోఽహ మసంగోఽహ మసంగోఽహం పునఃపునః ।
సచ్చిదానంద రూపోఽహ మహమేవాహ మవ్యయః ॥ ౨॥
నిత్యశుద్ధ విముక్తోఽహం నిరాకారోఽహ మవ్యయః ।
భూమానంద స్వరూపోఽహ మహమేవాహ మవ్యయః ॥ ౩॥
నిత్యోఽహం నిరవద్యోఽహం నిరాకారోఽహ మచ్యుతః ।
పరమానంద రూపోఽహ మహమేవాహ మవ్యయః ॥ ౪॥
శుద్ధచైతన్య రూపోఽహ మాత్మారామోఽహ మేవచ ।
అఖండానంద రూపోఽహ మహమేవాహ మవ్యయః ॥ ౫॥
ప్రత్యక్చైతన్య రూపోఽహం శాంతోఽహం ప్రకృతేఃపరః ।
శాశ్వతానంద రూపోఽహ మహమేవాహ మవ్యయః ॥ ౬॥
తత్త్వాతీతః పరాత్మాఽహం మధ్యాతీతః పరశ్శివః ।
మాయాతీతః పరంజ్యోతి రహమేవాహ మవ్యయః ॥ ౭॥
నానారూప వ్యతీతోఽహం చిదాకారోఽహ మచ్యుతః ।

సుఖరూప స్వరూపోహ మహమేవాహ మవ్యయః ॥ ౮॥
మాయాతత్కార్య దేహాది మమనాస్త్యేవ సర్వదా ।
స్వప్రకాశైక రూపోహ మహమేవాహ మవ్యయః ॥ ౯॥
గుణత్రయ వ్యతీతోహం బ్రహ్మాదీనాంచ సాక్ష్యహమ్ ।
అనంతా నంతరూపోహ మహమేవాహ మవ్యయః ॥ ౧౦॥
అంతర్యామి స్వరూపోహం కూటస్థ స్సర్వగోస్మ్యహమ్ ।
పరమాత్మ స్వరూపోహ మహమేవాహ మవ్యయః ॥ ౧౧॥
నిష్కళోహం నిష్క్రియోహం సర్వాత్మాద్య స్సనాతనః ।
అపరోక్ష స్వరూపోహ మహమేవాహ మవ్యయః ॥ ౧౨॥
ద్వంద్వాది సాక్షిరూపోహ మచలోహం సనాతనః ।
సర్వసాక్షి స్వరూపోహ మహమేవాహ మవ్యయః ॥ ౧౩॥
ప్రజ్ఞాన ఘనఏవాహం విజ్ఞాన ఘనఏవచ ।
అకర్తాహ మభోక్తాహ మహమేవాహ మవ్యయః ॥ ౧౪॥
నిరాధార స్వరూపోహం సర్వాధారోహ మేవచ ।
ఆప్తకామ స్వరూపోహ మహమేవాహ మవ్యయః ॥ ౧౫॥
తాపత్రయ వినిర్ముక్తో దేహత్రయ విలక్షణః ।
అవస్థాత్రయ సాక్ష్యస్మి చాహమేవాహ మవ్యయః ॥ ౧౬॥
దృగ్దృశ్యౌ ద్వౌపదార్థౌ స్తః పరస్పర విలక్షణౌ ।
దృక్ బ్రహ్మదృశ్యమాయేతి సర్వవేదాంత డిండిమః ॥ ౧౭॥
అహంసాక్షీతి యోవిద్యా ద్వివిచ్యైవం పునఃపునః ।
స ఏవముక్త స్సోవిద్యా నితివేదాంత డిండిమః ॥ ౧౮॥
ఘటకుడ్యాదికం సర్వం మృత్తికామాత్ర మేవచ ।
తద్వద్బ్రహ్మ జగత్సర్వ మితివేదాంత డిండిమః ॥ ౧౯॥
బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవోబ్రహ్మైవ నాపరః ।
అనేన వేద్యం సచ్ఛాస్త్ర మితివేదాంత డిండిమః ॥ ౨౦॥
అంతర్జ్యోతి ర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః ।
జ్యోతిర్జ్యోతి స్స్వయంజ్యోతి రాత్మాజ్యోతి శ్శివోస్మ్యహమ్ ॥

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమచ్ఛంకరాచార్య విరచితం బ్రహ్మజ్ఞానావళీమాలాస్తోత్రం సమాప్తమ్.

# ఓమ్.

## అవతారిక.

ప్రజ్ఞానఘనులారా ! బ్రహ్మమానస పుత్రుడగు శ్రీవశిష్ఠమహర్షి లోకానుగ్రహార్థము పరబ్రహ్మ తత్త్వమును పరంధాముడగు శ్రీరామునకు ఉపదేశించెను. " యతోవాచోనివర్తంతే, అప్రాప్య మనసాసహ " అను శ్రుతిరీతి అవాఙ్మానస గోచరమగు అట్టి పరబ్రహ్మతత్త్వమును కరుణార్ద్రహృదయుడును కవిసింహుడును నగు శ్రీవాల్మీకిమహర్షి కరతలామలకముగ తెలియునట్లు శ్లోకరూపముగ రచియించెను. ఈగ్రంథము బ్రహ్మర్షిశ్రేష్ఠుడగు వశిష్ఠమహర్షి సచ్చిదానందస్వరూపుడైన రఘునందనునకు బోధించుటచేత వాశిష్ఠరామాయణమనియు, యోగవాశిష్ఠ మనియు, చెప్పబడును. కావున అమృతపానము జేసిన ఎట్లుండునో, అనితలంచువారు ఈగ్రంథరాజమును చదివిరేని అమృతపానముయొక్క స్వారస్యమును తెలిసికొనుటయగాక, పునర్జన్మరహితులగుదురు. పునర్జన్మ రహితులగుదు రనగా; జనన జరా మరణ ప్రవాహ రూపమైన ఘోరసంసార సముద్రమునందు తగులుకొనక నిత్యానంద స్వరూపు లగుదురు. ఓసుజ్ఞానులారా ! ఈవిషయమునందు ముమ్మాటికి సంశయింపనక్కరలేదు. సామాన్యముగ శాస్త్రముల యందును వేదముల యందును ఆత్మతత్త్వము విస్పష్టముగా వివరింపబడియే ఉన్నది. అయినను వానియందు కేవలము తార్కిక యుక్తులు, వాద భేదములు, వాటి నిరాకరణములు, మొదలగునవి మాత్రమే ఉండుటచేత కేవల పండితులకే గాని, అందరి ఉపదేశము రుచింపదు. వారికైనను అత్యల్పకాలములోనే విసుకు పుట్టును. అర్థమును గ్రహించుటయు మిక్కిలి కష్టసాధ్యమై ఉండును. ఇట్లగుటచేతనే కదా వానికి [ వేద శాస్త్రములకు ] వ్యాఖ్యానములపై వ్యాఖ్యానములు పుట్టియున్నవి. శ్రుతిసమన్వయమునకై ప్రత్యేకముగ వ్యాసుడు బ్రహ్మసూత్రమును కూడ రచియించి యున్నాడు. ఈవిధముగ ఆవేదశాస్త్రాదులు పండితులకుగూడ అగమ్యములై ఉన్నవి. పండితుల విషయమే ఇట్లుండ పామరులనుగూర్చి చెప్పవలసినది ఏమి ఉన్నది. వారు ముముక్షువు

లైనను ఆవేద శాస్త్రాదుల వైపునకు బోవ మనస్సునందైన దలం పరు. అవి రసహీనములగుటచేత శుష్కప్రాయములై ఉన్నవికదా? కావున ఈవాశిష్ఠరామాయణము సర్వోత్తమము. ఉపదేశమనునది శిష్యునియొక్క మనస్సును ఆకర్షించునదిగా నుండవలయును. అట్టి ఆకర్షణ లేకున్న గురువాక్యములయందు విశ్వాసము కలుగదు. విషయము నూతనంబుగు గ్రహించుటకు అశక్యమునుకూడనై ఉండును. కావున ఆది మనస్సునకు వచ్చునంతకాలమువరకు ఆశిష్యునకు ఓర్పు కూడా కలుగదు. ఈ గ్రంథమునందన్ననో, ఆ ఉపదేశము మిక్కిలి మనోహరముగ చిత్తాకర్షకముగ నున్నది. ఇందు రసపూరితములై వినుటకు ఆరంభించిన పిమ్మట చిత్తమును తన్మయము చేయగల ఇతిహాసములు అనేకములు దృష్టాంతములుగ వర్ణింపబడి ఉన్నవి. అచ్చటచ్చట తత్వబోధయున్నను ఈ ఇతిహాసములవలన అది వేద శాస్త్రాదులయందలి బోధవలె విసుకును పుట్టింపజేయునదిగా లేదు. సరసమైన పదార్థములనడుమ అల్పపరిమాణముగు నీరసపదార్థముకూడ సరసప్రాయమే అగుననుట అనుభవసిద్ధము. ఇట్లగుటచేత ఈగ్రంథము పండిత పామర రంజకమని ప్రత్యేకముగ జెప్ప నక్కఱలేదు. దీనిని విన నారంభించినవారు సమాప్తి చేయునంతవరకు విడువరని చెప్పుట అతిశయోక్తికాదు. ఇట్లగుటచేతనే దీనికి ఇంతప్రభావము చెప్పబడినది. "వినినంతమాత్రముననే బ్రహ్మజ్ఞానము కలుగును" అని చెప్పబడియున్నది అని తెలిసికొనవలయును. ఒక్కమాఱు సమాప్తిచేసిన శతాంశమైనను తత్వజ్ఞానము కలుగక ఉండదు. ఆజ్ఞానము ఎంతమాత్రము కలిగినను, మనస్సును కొంతవరకైనను నిర్మలము కావించును. దానిచేత తత్వవిమర్శయందు ఉత్సాహము కలిగి క్రమక్రమముగ అతిశీఘ్రకాలములోనే ముక్తి దొరుకు ననుట దానికి [ ఈరామాయణమును వినగానే ముక్తిదొరుకును అనుటకు ] అభిప్రాయము. కావున ఈగ్రంథమును అత్యాదరముతో పఠించువారు ధర్మార్థ కామ మోక్షములనియెడు చతుర్విధ పురుషార్థములను జెంది బ్రహ్మజ్ఞాన సంపన్నులై కృతార్థులగుదురుగాక.

శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణము నందలి విషయానుక్రమణిక.

——*——

| పుటసంఖ్య. |
|---|

శ్రీ

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.



# శ్రీజ్ఞానవాశిష్ఠము - వచనకావ్యము-

## వైరాగ్యప్రకరణము-

శ్లో॥ దివిభూమౌతథాకాశే బహిరంతశ్చమేవిభుః ।
యోవిభాత్యవభాసాత్మా తస్మైసర్వాత్మనేనమః ॥

స్వస్వరూపభూతుడును సర్వవ్యాపకుడు నగు ఏచిదాత్మభూమియందును అంతరిక్షమునందును ఆకాశమునందును ఏకరూపుడై ప్రకాశించుచున్నాడో అట్టిబ్రహ్మమునకు నమస్కారము.

—* మోక్షమునందు అధికారియగువానిని నిరూపించుట. *—

"నాకు బంధముకలదు, ముక్తినిజెందవలయును" అని తలంచునట్టి పురుషుడు ఈశాస్త్రమునందు అధికారి. సంపూర్ణ విజ్ఞానవంతునకుగాని అజ్ఞానికిగాని ఇందు అధికారములేదు.

—* భరద్వాజుడు వాల్మీకిమహర్షిని ప్రశ్నచేయుట. *—

ఒకనాడు సర్వజ్ఞుడగువాల్మీకి ఏకాంతప్రదేశమున నుండగా అతని వద్దికి శిష్యుడైన భరద్వాజుడువచ్చి మధురస్వరముతో ఇట్లనిప్రశ్నచేసెను:- ఓగురువా! మహాత్మా! శ్రీరాముడు అతికష్టమగు నీసంసారమునుండి ఎట్లు

వ్యవహరించెను. దానిని తెలిసికొనగోరుచున్నాను. దయచేసి తెలియజే యుమని ప్రార్థించెను. అంతనవ్వాల్మీకి ఇట్లనియె.

—* వాల్మీకి భరద్వాజునకు ఉపదేశించుట. *—

ఓశిష్యుడా! భరద్వాజుడా! నీవుచేసినప్రశ్న మిక్కిలి ఉత్తమమైనది. నీవును తగిన అధికారివగుటచేత సర్వమును వివరించెదను. దానిని తెలిసికొ౦టివేని సమస్తభ్రాంతులును తొలగును. ఓసత్పురుషుడా! భరద్వాజా! వినుము. రూపములేని ఆకాశమునందు నలుపు యెరుపు మొదలగు వర్ణములు తోచినట్లు పరబ్రహ్మమునందే భ్రాంతిచేత ఈ ప్రపంచము తోచుచున్నది. ఇట్టిభ్రాంతిని మఱల ఎప్పటికినిజ్ఞప్తికిరానీయకుండ మరచుటయే సర్వోత్తమమగు స్థితి. మోక్షోపాయము. లేక, మోక్షమే, అని నాయభిప్రాయము. "దృశ్యమగుపదార్థము భ్రాంతిసిద్ధమగుటచేత బొత్తిగలేదు" అను దృఢజ్ఞానముచేత "ఇదిదృశ్యము, ఇదిసాక్షి" అని మనస్సునందున్న భేదము తొలగిపోయెనేని అప్పుడు సర్వోత్తమమగు మోక్షము సిద్ధించినదియే. స్వస్వరూపమునకు బంధము ఎప్పటికిని లేదుకదా. ఇట్లుగాక పరమార్థముయొక్క సూక్ష్మమును తెలిసికొనలేక పాతరలవలె ఎంతతీసినను (విమర్శించినను) తరుగని శాస్త్రములయందుబడి పొరలుచూ నున్నవారికి ఎన్నికల్పములకైన ఆమోక్షము దొరకదు. కావున శాస్త్రవాసన లోకవాసన మొదలగు సర్వవాసనలను సంపూర్ణముగ విడచుటయే మిక్కిలి యుత్తమకార్యము. ప్రపంచభ్రమను వదలినచో నిది అప్రయత్నముగనే సిద్ధించును. ఇదియే సజ్జనులచే మోక్షమనబడును. ఆమోక్షము స్వభావసిద్ధమే. కావున దానికై క్రొత్తప్రయత్నము లేవియు చేయనక్కర లేదుకదా. కావున ఇదియే చక్కనిమార్గము.

—* వాసనాలక్షణము. *—

ఓభరద్వాజా! ఆవాసన శుద్ధవాసనయనియు మలినవాసనయనియు రెండువిధములు. అందు మలినవాసన పునర్జన్మమును గలిగించును. శుద్ధవాసన జన్మమును నశింపజేయును. ఇందు ఆమలినవాసనకు అజ్ఞానమే ఆకారము. అహంకారముకూడా దానితో సంబంధపడియుండును. ఇట్లుండుటచేత ప్రపంచభ్రాంతి నశింపదు. కావున ఆమలినవాసన పురుషునకు పునర్జన్మమును కలిగించునని పెద్దలుచెప్పుదురు. మఱియు పునర్జన్మలను మొలకలనువిడచి అనగా ప్రపంచభ్రాంతి లేకపోవుటచేత పునర్జన్మను కలిగించు స్వభావమును విడిచి యాశుద్ధవాసన వేయించిన విత్తనమువలె స్వరూపమా.

త్రముతోనుండును. జీవన్ముక్తునకుగూడ శరీరముకలదు. కావున నాశరీరమునకై యావాసన అంగీకరింప బడుచుండును. వాసనయనగా సంకల్పమే కావున నదిలేక శరీరము ప్రవర్తింపదుకదా. మఱియు తెలియదగిన విషయము (బ్రహ్మము) తెలియబడెను. కావున దీనికే జ్ఞాత జ్ఞేయ వాసనయని పేరు. బ్రహ్మము నెఱుగకుండిన ప్రపంచభ్రాంతియే తొలగదు. మలినవాసనయే నశింపదుకదా. కావున ఏమహాత్ములు గొప్పబుద్ధిగలవారై బ్రహ్మజ్ఞానమును సంపాదించి దానివలన మలినవాసనను ధ్వంసముచేసి శుద్ధవాసనగలవారై యుందురో పునర్జన్మమును జెందరో అట్టివారిని జీవన్ముక్తులని పెద్దలు చెప్పుదురు.

## —* శ్రీరామవృత్తాంతము. *—

ఓభరద్వాజా! ఇట్టి జీవన్ముక్తస్థితిని జెంది మహాత్ముడగు శ్రీరాముడు విహరించెను. ఈవిషయమునుగూర్చి నీకు బాగుగా వివరించెదను. వినుము. దానిని వినిన జరామరణభయము అనగా సంసారభయముకలుగదు. ఓభరద్వాజా! కమలములవంటి నేత్రములుగల పరంధాముడగు శ్రీరాముడు విద్యాగృహమునుండి వెడలి స్వగృహమునందుచేరి బహువిధములగు క్రీడలతో కాలముపుచ్చుచూ నిర్భయుడైయుండెను. ఇట్లు కొంతకాలము గడచిన పిదప ఆమహాత్మునకు పుణ్యతీర్థములను పుణ్యాశ్రమములను చూడవలయునను వేడుకపుట్టెను. అప్పుడు ఆమహాత్ముడు తండ్రిగొద్దకువచ్చి "హంస పద్మములనుగ్రహించునట్లు" ఆదశరథుని పాదపద్మముల గ్రహించి అనగా నమస్కరించి ఇట్లని ప్రార్థించెను. ఓతండ్రీ! మహాప్రభువా! పుణ్యతీర్థములను దేవాలయములను పుణ్యాశ్రమములను మహాత్ముల నివాసములను జూడవలయునని నామనస్సున నిచ్ఛజనించుచున్నది. కావున నాప్రార్థనమును సఫలము కానింపుడు. ఇదియే మొట్టమొదటి ప్రార్థన. మఱియు నోప్రభువా! నిన్ను జేరిన అర్థి ఎవ్వడును నిరాశుడుకాలేదు.

## —* తీర్థయాత్రాగమనము. *—

ఇట్లు ప్రార్థింపగానే ఆ దశరథమహారాజు వశిష్ఠునితోగూడి విచారించి రాముని తీర్థయాత్రార్థమై పంపించెను- "ఎప్పుడుగాని ఈరాముడు నాకు ఇదికావలయును అదికావలయును" అని బాధించువాడు కాడు. కావున ఈరామునికోరికను అవశ్యముగ దీర్పవలయును. అని రాజునకు దృఢాభిప్రాయము కలిగెను. తరువాత నొకశుభనక్షత్రమున శ్రీరాముడు తమ్ములతోగూడి తీర్థయాత్రకై స్వగృహమునుండి వెడలెను. ఇట్లు బయలువెడలి

తనకోసలరాజ్యము నారంభించి సర్వప్రదేశములయందును సంచరించుచూ క్రమక్రమముగ అనేకనదులును అనేకదేవాలయములును పుణ్యాశ్రమములును వనమధ్యములయందలి వివిధప్రదేశములును సముద్రతీరములును పర్వతాగ్రభాగములును మఱియు అనేకపుణ్యస్థలములునుచూచెను. అచ్చటచ్చట స్నాన దాన జపాదులను ఆచరించెను. ఈవిధముగా దేవతలచేతను కిన్నెరులచేతను మనుష్యులచేతను గౌరవింపబడుచున్న ఆ శ్రీరాముడు భూమినంతయును జుట్టి కొంతకాలమునకు స్వగృహమునకువచ్చిచేరెను. "సర్వదిక్కులయందును సంచరించి యాపరమేశ్వరుడు కైలాసమునకు జేరినవిధమున" ఆ శ్రీరామునియొక్క ఆగమనము సర్వలోక సంతోషకారియయ్యెను. ఇట్లువచ్చి పురజనులందరును పుష్పములును అక్షతలను తనపై మంగళార్థముగ జల్లుచుండ పురప్రవేశమును గావించెను. అది "ఇంద్రునిపుత్రుడగు జయంతుడు అమరావతిని బ్రవేశించినట్లుండెను." అప్పటినుండియు తాను ఆయాదేశములయందు చూచిన బహువిధములగు ఆచారములను అభివర్ణించుచూ సుఖముగ ప్రొద్దుపుచ్చుచుండెను. మఱియు ప్రాతఃకాలమున నిదురలేచి యథావిధిగా సంధ్యావందనమును ఆచరించి పిమ్మట ఇంద్రునివలె సుఖాసీనుడైయున్న తండ్రిని జూడబోవును. ఆసభయందు ఒకజాము వశిష్ఠాది మహామునులతోగూడి వారిచేత ఉపన్యసింపబడుచున్న బ్రహ్మజ్ఞాన బోధకములగు విచిత్ర చరిత్రల వినుచు ప్రొద్దుపుచ్చును. పిమ్మట తండ్రివలన ఆజ్ఞగైకొని గొప్పసేనతోగూడి వేటాడుటకై వరాహ మహిషాదులతోగూడిన మహారణ్యమును ప్రవేశించును. అచ్చటనుండి మఱలి ఇంటికివచ్చి స్నానాదులను ఆచరించి బంధుమిత్రులతోగూడి భుజించి మిత్రసహితుడై రాత్రినిగడుపును. ఇట్టిదినచర్యతో ఆశ్రీరాముడు సోదరసహితుడై స్వగృహమున కాలము గడుపుచుండెను. తీర్థయాత్రనుండి వచ్చినపిమ్మట ఆశ్రీరామునిచరిత్ర పైనవర్ణించినవిధముగ నుండెను. ఈరామునిచర్య రాజవ్యవహారముతోను బాలవ్యవహారముతోను గూడియుండుటచే మిక్కిలి మనోహరమైయుండెను. "వెన్నెల సర్వజనులకు నాహ్లాదమును గలిగించునట్లు" ఆఘనునిచర్య సజ్జనచిత్తములకు ఆనందమును గలిగించుచుండెను. "ఘృతమువలెను అమృతమువలెను మిక్కిలి మనోహరమైయుండెను."

## —* శ్రీరామునకు వైరాగ్యము గలుగుట. *—

ఇట్లు కాలముగడుపుచుండ శ్రీరామునకు పండ్రెండవ సంవత్సరము వచ్చెను. అప్పటి నుండియు "శరత్కాలమునందలి నదివలె" ఆరఘుర

ముడు క్రమక్రమముగా క్షీణింపసాగెను. క్రమక్రమముగా విశాలనేత్రము లుగల యారాముని ముఖము వెల్లనయ్యెను. " రేకులన్నియును పండి తెల్లనై యుండగా తుమ్మెదలు తనపై వ్రాలియుండగా వికసించిన పద్మమునకు వలె " ఆ శ్రీరాముని యొక్క ముఖమునకది ( ఆ తెల్లదనము ) యొక క్రొత్త సౌందర్యమును గలిగించుచుండెను. మఱియు నా రాముడు ఎప్పుడు చూచినను పద్మాసనము వేసికొని కూర్చుండి చెంపక్రిందచేయినుంచుకొని ఏదియో యాలోచించుచూ నుండును. ఒకపనినైనను ఆచరింపడు. ఇట్లుసర్వ కాలములయందును విచారయుక్తుడయ్యే యుండుటచేత కృశించి పోవుచుండెను. ఎప్పుడును అపరిమితమగు దుఃఖము అమ్మహాత్ముని మనస్సును పీడించుచుండెను. ఇట్లగుటచే మనస్స్వాస్థ్యము బొత్తిగా లేనివాడైయుండెను. ఎప్పుడుచూచినను " చిత్ర ప్రతిమవలె " నిశ్చేష్టుడై యుండునుగాని ఎవ్వరితోను మాటలాడడు. పరిజనులు పలుమారు ప్రార్థింపగా నెప్పటికో యొకప్పటికి అతికష్టముతో స్నానభోజనాది దినకృత్యములను ఆచరించును. అట్లాచరించినను, ముఖ్యకాంతి మాత్రము వాడినదే యుండునుగాని ప్రసన్నమై యుండదు. తండ్రియగు దశరథుడు దనతొడపై కూర్చుండ బెట్టుకొని " ఓ పుత్రుడా! రామా! నీకేమిదుఃఖము కలిగినది " అని యడిగి నప్పుడు ఆరాముడు " నాకు దుఃఖమేమియు లేదు" అనిమాత్రమే చెప్పును. పిమ్మట ఎన్ని ప్రశ్నముల జేసినను ఉత్తరమియ్యక నూరకుండును.

—* విశ్వామిత్రుడు రాముని గొనిపోవ వచ్చుట. *—

ఇట్లుండు సమయముననే విశ్వామిత్రుడను పేరు గల మహర్షి కార్యార్థియై అయోధ్యా నాథుడగు ధశరథ మహారాజును జూడవచ్చెను. ఇట్లువచ్చిన తేజోవంతుడగు ఆ విశ్వామిత్రమహర్షిని జూచి దశరథ మహారాజు సువర్ణమయమగు ఆసనము నొసంగెను. షోడశోపచార విధులచే స్వయముగా బూజచేసెను. ఇట్లు పూజింపబడి ఆసనమున సుఖాసీనుడై యున్న యమ్మునికి అర్ఘ్యపాద్యాదులనుగోవులను పలుమారుసమర్పించెను.

—* దశరథ విశ్వామిత్ర సంవాదము. *—

ఈ విధముగ శాస్త్రోక్తవిధానముతో బూజించి బద్ధాంజలియై నిర్మలమగు చిత్తముతో నాదశరథుడు విశ్వామిత్రున కిట్లనియెను. ఓమహాత్మా! తలవని తలంపుగా మీదర్శనము కలుగుటచేత ధన్యుడనైతిని. మీ అనుగ్రహము మాయందు సంపూర్ణముగ నుండుటచేత కృతార్థుడనైతిని "సూర్యోదర్శనమువలన కమలము లుప్పొంగునట్లు " మీ దర్శనమువలన నా హృద

యము ఉప్పొంగుచున్నది. అనాదియై ఎవ్వనిచేతను ఎప్పుడును ఆక్రమింప బడక అనగా " ఆ సుఖము వేఱు నేను వేఱు " అను నభిప్రాయముతో (భేద దృష్టితో ) [ మోక్షమును ] సాధింప దలంచువారిచేత నాక్రమింప బడక నిఱపాయమై అనగా నెప్పటికిని నాశమును జెందక ఏ బ్రహ్మానందము వెల్లు చున్నదో అది ఇప్పుడు నాకు గలిగినది. ఓ మునిశ్రేష్ఠా! మీ దర్శనమువలన ప్రత్యక్షముగ ముక్తినే చెందినట్లున్నది. మఱియు మీరాక మృతి నొందిన వాడు మఱల వచ్చినట్లును, వర్షము లేని సమయమునందు చకచని వర్షము వచ్చినట్లును, గ్రుడ్డివానికి కన్నులు వచ్చినట్లును " మితిమీఱిన సంతోషము నకు కారణమవుచున్నది. ఆకాశమునందు స్వయముగ సంచరింప గలిగిన నెట్టియానందము జనించునో మృతినొందినవాడు మఱలవచ్చిన నెట్టి సంతస ముద్భవించునో ఇప్పుడు నట్టిసంతోషము గలిగినది. ఓ మహాత్మా! ముని శ్రేష్ఠా! నీరాక శుభకరమైన దగుగాక. ఓ తాపసోత్తమా! మీ యభిలాష మెయ్యది. నేను మీకొఱకై దేనిని ఆచరింపవలయును. మీరు సత్పాత్రలలో నుత్తములు. మిక్కిలి ధర్మాత్ములు. నన్ను కృతార్థుని జేయుటకై స్వయము గనే విచ్చేసితిరి. దానమున కింతకంటె నుచితమగు సందర్భము ఏది కలుగ గలదు. గంగాజలమునందు స్నానమును ఆచరించిన నెట్టిసంతోషము కలు గునో మీదర్శనము వలనకూడా నాకట్టిసంతోషమే కలిగినది. మఱియును ఆసంతోషము మనోగతములగు సర్వసంతాపములను చల్లార్చి శాంతినొం దించుచున్నది. సర్వేంద్రియములను చల్లపరచు చున్నట్లున్నది. ఓ బ్రహ్మర్షి శ్రేష్ఠా! మీకుకోరికగాని భయముగాని కోపముగాని లేదు. ఉన్నవస్తువును అనుభవింపవలయుననికాని లేనివస్తువును సంపాదింపవలయుననిగాని కోరిక లేదు. ఇట్లు కామక్రోధాది రహితులరయ్యు మీరు నావద్దకు వచ్చితిరి. ఇది మహాశ్చర్యముగనున్నది. మీకు నొకలోపము కలదనుట ఎప్పటికిని సంభవిం పదు. కావున నావలన నేదియైన నొకదానమును పరిగ్రహించి నన్ను కృతా ర్థుని జేయవలయునను తలంపుతో నిట్లువిచ్చేసితిరి. ఇదీ నిశ్చయము. మీరు ఏకార్యమును తలంచివచ్చితిరో దయచే నన్ను కృతార్థునిగ నొనర్చితిరో ఆకార్యము సిద్ధించేననియే తలంపుడు. మీరు మిక్కిలి గౌరవనీయులు. మీ ఆజ్ఞకు నిచట నాటంకమేమియు నుండదు. ఈవిధముగా దశరథుడు చెప్పిన వాక్యములను విని అవి మిగులవిస్తారముగాను ఆశ్చర్యకరములుగాను ఉండు టకు నావిశ్వామిత్ర మహాముని మిగులసంతసించేను. మఱియు గగుర్పొడు చుచున్న దేహముతో తనసంతోషమును వెల్లడించుచూ నిట్లని మాటలాడ

నారంభించెను. ఓ రాజశ్రేష్ఠా! దశరథమహారాజా! ( ఈ వాక్యసందర్భము భూమిలోనెల్ల నీకుమాత్రమే తగియున్నది. నీవు సర్వ వంశములలో నత్యుత్తమమగు సూర్యవంశమున జన్మించినవాడవు. బ్రహ్మజ్ఞానులలో నధికుడగు వసిష్ఠమహామునికి శిష్యుడవై యమ్మహాత్మునిచే జక్కగా శిక్షింపబడిన వాడవు. ఈవిధముగా వంశమును ఉపాధ్యాయుండును సర్వోత్తము లగుటచేత నీకు ఇట్టియౌదార్యమును వినయమును గలిగెను. సర్వోత్తముడవై తివి. పరులు ఇట్టివారలు ఎన్నటికైనను గానేర్తురే. ప్రకృతము వినుము. నేను మోక్షసిద్ధికై లేక దేవతలకు తృప్తికలుగుటకై ఒకనియమమును అనగా యజ్ఞమును జేయ నుపక్రమించితిని. భయంకరులగు రాక్షసులు అనేకులు జేరి నాప్రయత్నమును విఘ్నయుక్తముగా వించుచున్నారు. కావున నేను ఆర్తుడనై నిన్ను శరణు జొచ్చితిని. నన్ను రక్షింప వలయును. దానికి ఉపాయమును జెప్పెదను వినుము. నాకార్యమునుగూర్చి నీవు స్వయముగా శ్రమదీసికొన నక్కర లేదు. మదించిన బెబ్బులితో సమానమగు పరాక్రమముగల పుత్రుడు నీకు గలడు. ఆతడే శ్రీరాముడు. ఆ తేజస్వి జిష్ణుడు ( జయించువాడు ) అను పౌరుష నామధేయముగల ఇంద్రునితో సమానమగు పరాక్రమముగలవాడు. ఆ మహాత్ముడే సకలరాక్షసులను ఒక్కనిమిషమున ధ్వంసముచేయును. కావున నో రాజశ్రేష్ఠుడా! నీజ్యేష్ఠపుత్రుడగు శ్రీరాముని నాకివ్వుము. అమ్మహాత్ముని పరాక్రమము ఎప్పటికిని చెలించునది అనగా ఫలశూన్యమగు నదికాదు. జులుపాలును ధరించునంతటి పిన్నవైసుగలవాడైనను శౌర్యమున దక్కువ యగువాడు కాడు. మఱియు స్వాభావికముగానే అట్టిమహోన్నత పరాక్రమముగల రాముడు సర్వాస్త్రవేదినగు నాచేత రక్షింపబడుననిన నికనేమి చెప్పవలయును. యజ్ఞమునకు అపకారముజేయు రాక్షసులు వేన వేలుగ నున్నను వారిశిరముల నొక్కక్షణముననే త్రుంచి వేయగలడు. ఈ విషయమున నేమియు సంశయింపకుము. నీపుత్రునికి అపాయము గలుగునేమో యని దిగులు జెందకుము. మఱియునో మహారాజా! పుత్రునియందలి ప్రేమ వలన నీ దానమును నిరాకరించుట నీ బోటివారికి నర్హముకాదు. మహాత్ములగువారికి దానయోగ్యముకాని వస్తువు ఒక్కటియైన నుండదుకదా. ఇది యునుగాక నేను నిశ్చయముగ ప్రతిజ్ఞ చేయుచున్నాను. ఈ రామునిచేత నారాక్షసులు అవశ్యముగ హతులగుదురు. నీవు నాచేతికి రాముని నప్పగించిన క్షణముననే యారాక్షసులు హతులైరనియే తలంపుము. యజ్ఞము నిర్విఘ్నముగ పరిసమాప్తి నొందెననియే నిశ్చయింపుము. ఇది ఏదియెట్లైన

నను తప్పునదికాదు. ఇట్టినిశ్చయము లేకుండిన యోగసంపదచే త్రికాలముల నెఱుంగగల మాబోట్లు సంశయాస్పదములగు విషయములయందు ప్రవర్తింపరుకదా. కావున రాముని ఇచ్చువిషయమున ఇంచుకయైనను సంశయము వలదు. కమలములవంటి నేత్రములుగల యాశ్రీరాముని యథార్థస్వరూప స్వభావములనుగూర్చి నాకు తెలియును. ఆతని ప్రభావము ఎంతయైనదియు నేనెఱుగుదును. మహాతేజస్వియగువశిష్ఠుడెఱుగును. దివ్యజ్ఞాన సంపన్నులగు మునిశ్రేష్ఠులెవ్వరుగలరో వారలందరు నెఱుగుదురు. బహుకాలము నుండియు తపము నాచరించుచూ నత్యధికమగు చిత్తశుద్ధిని సంపాదించిన వారమగుటచే మాకు నీ యథార్థ విషయమును దెలిసికొను సామర్థ్యము గలిగినది. రాజ్య సుఖలోలుడవై చిత్తశుద్ధియందు కొఱతపడియున్న నీవు దీని నెట్లు తెలిసికొనగలవు. ఇంతమాత్రమున మావాక్యములపై అనాదరము నుంపగాదుకదా. కావున నీమనస్సునందు ధర్మమునుగూర్చియు ప్రభావమునుగూర్చియు కీర్తినిగూర్చియు దృఢసంకల్పము కలదేని ఇంచుకయైనను సంశయింపక నాకోరికను సఫలము చేయుము. నేను కోరిన శ్రీరాముని నాకొసంగుము. ధర్మాత్ముడును ఋషిశ్రేష్ఠుడును అగువిశ్వామిత్రుడు ధర్మార్థములతోగూడిన వాక్యమును ఈ విధముగా జెప్పి తనయభిప్రాయమును వెల్లడించి యూరకుండెను. ఈ విధముగా విశ్వామిత్రుడు ఒనర్చిన ఉపన్యాసమును విని రాజశ్రేష్ఠుడగు నాదశరథుడు దుఃఖాధిక్యమువలన గొంతసేపు నిశ్చేష్టుడై యూరకుండెను. పిమ్మట నతిదీనముగ నిట్లనిచెప్పనారంభించెను. ఓ మునిచంద్రా! నా పుత్రుడగు రామునకు ఇప్పుడు పదిరెండు సంవత్సరములు. ఆబాలుని నేత్రములు కమలములవంటివి అగుటచేతనేమో యనునట్లు కమల స్వభావమునుగూడా అనగా సూర్యాస్తమయము కాగానే ముకుళించుటనుగూడా నొందుచున్నవి. రాక్షసులన్ననో నిశాచరులు. వారు గాత్రులయందేకాని సంచరింపరు. కావున బాలుడగు నీ రాముడు వారలతో నెట్లు యుద్ధముచేయగలడు. కావున నీతడు ఇట్టిపని నొనర్చుటకు అర్హుడు కానేరడని తలంచెదను. ఇంతమాత్రమువలన మీ మనోరథము విఫలమయ్యెనని తలంపకుడు. ఇదిగో ఒక యక్షౌహిణిసేన కలదు. దీనిని నేనే స్వయముగా నడుపుకొనుచూవచ్చి యారాక్షసులతో యుద్ధము నొనర్చెదను. రాముడన్ననో బాలుడు తనబలమును పరబలమును ఎఱుగలేడు. ఇప్పటికిని అంతఃపురము నొకటిదానితప్ప నితరమగు నేస్థలమును ఎరుగడు. ముఖ్యముగా యుద్ధభూమిని చూచియైన నెఱుంగడు. మఱియొక విశేషము,

ఓవిశ్వామిత్రుడా! నేను పుట్టినదిమొదలు ఇప్పటికి తొమ్మిదివేల సంవత్సరములు గడచినవి. ఇంతకాలమునుండియు పుత్రులులేక మిక్కిలి దుఃఖమును అనుభవించితిని. పిమ్మట ఇప్పుడు పుత్రకామేష్టి మొదలగు బహువిధ ప్రయత్నములతో ఎట్లెట్లో ఈరామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నలుగురుపుత్రులు ఉదయించిరి. ఆనలుగురిలోను కమలలోచనుడగు శ్రీరాముడే ప్రధానుడు. ఆతడు సమీపమున లేకుండిన దక్కిన మువ్వురును క్షణమాత్రమైనను జీవింపరు. మీరన్నను అట్టిరామునే కోరితిరి. రాక్షసుల కడకు గొనిపోవ సంకల్పించితిరి. రాముడు అట్లు పురమును నిర్గమింపగానే లక్ష్మణ భరత శత్రుఘ్నులు మువ్వురును మృతినొందుదురు. పిమ్మట పుత్రశోకముచేత నేనును మృతి నొందవలసినవాడనే. రాముడు మాత్రము మీ అనుగ్రహమువలన దీర్ఘాయుష్మంతుడుగా నున్నను ఆతని పునరాగమనము వరకు ప్రతీక్షించుటకు మాత్రము ఇచ్చట అవకాశము ఉండదు. మఱియొక విశేషము. ఓమహాత్మా! మీరాచరించు యజ్ఞమును విఘ్నముజేయువాడు రావణుడయ్యేనేని యాదుష్టునిమాత్రము నేను గెల్వజాలను. ఆయాకాలములయందు మహాబలసమృద్ధిగల కొన్ని జంతువులు భూతములలో ఉత్పన్నములగును. అవి అందరకును సాధ్యములు కానేరవు. కాలవశముననే అవి క్రమముగా నశించును. రావణుడుకూడా ఇట్టివాడే. కావున ప్రస్తుతకాలమునందు మేమెన్ని విధముల బలాఢ్యులమైనను శత్రువులగు రావణాదుల యెదుట ఇంచుకసేపయినను నిలువజాలకున్నాము. ఇది దైవసంకల్పము. ఇందు పురుషప్రయత్నము ఏమియును అక్కఱకురాదు. ఈకాలమే మఱియొకవిధముగానున్నది. ఇందు సత్పురుషులందరును దుర్బలులగుచున్నారు. చింతాపరవశు లగుచున్నారు. రఘువంశమున జనించినవాడగుటచే మహాధైర్యవంతుడగుట యట్లుండ, సర్వజ్ఞులరగు మీచేతను "మహాధైర్యశాలి" యని వర్ణింపబడిన శ్రీరాముడుకూడా ఇప్పుడు మిక్కిలి దీనుడైయున్నాడు. కాలస్థితికి ఇంతకంటెను ప్రబలదృష్టాంతము ఏమికావలయును. ఈవిధముగా పుత్రస్నేహముచేత మిక్కిలివ్యాకులుడై దశరథుడు పలికినవాక్యములు విని విశ్వామిత్రమహాముని రోషయుక్తుడై ఆదశరథునితో ఇట్లనియె.

ఓదశరథా! నీవు కోరినదానిని ఇచ్చెదనని ప్రతిజ్ఞచేసియు ఇప్పుడు దానిని విడువ దలచుచున్నావు. ఇట్లు ప్రతిజ్ఞాభంగముచేయునట్టి నీవు సింహకులమునబుట్టియు పిరికియగు లేడి కాగోరుచున్నట్లున్నది. ఇది నీకు యశశ్శోహానికరము కదా. ఇంతచెప్పనక్కఱలేదు. "నేను నీకోరికను నెరవేర్ప

లేను '' అనిన జాలును. నేను నామార్గమును అనుసరించి వెడలి పోయెద ను. అట్టిమహాత్ముడగు కకుత్స్థుని వంశమునబుట్టియు తొలుదొలుత ప్రతిజ్ఞ జేసియు దానిని నిర్వహింపక అపకీర్తికిపాత్రులై పుత్రులతోగూడి నీవే సుఖిం పుము. ఈవిధముగా మహానుభావుడకు విశ్వామిత్రుడు కోపముచెందగానే భూమియంతయు దిరదిర దిరిగెను. దేవతలును భయముచేత వడవడవడం కెరి. ఈవిధముగా ప్రపంచమున కంతకు మిత్రుడగు నవ్విశ్వామిత్రుడు కో పమును జెందగానే మిక్కిలి ధైర్యవంతుడును చక్కని తపోనిష్ఠకలవాడును శ్రేష్ఠమగు బుద్ధికలవాడునగు వశిష్ఠమహర్షి ఇట్లని చెప్పసాగెను. ఓమహా రాజా! దశరథా! ఇక్ష్వాకువంశమున బుట్టియుండి స్వయముగా దశరథు డవై అనగా దశదిశలయందును బ్రసరించిన రథముగలవాడవై ( మహాకీర్తి మంతుడవై ) యుండియును చెప్పినమాటను తప్పుదువేని ఇక ప్రపంచము నందు ఏపురుషుడు సత్యమును పాలించును? మఱియు మీబోటి ప్రభువులు ఏర్పరచిన వ్యవహారములను ఆశ్రయించియే జనులు తమతమ నిబంధనలను అతిక్రమింపకుందురు. ఇట్లుండగా ఆనిబంధనలను నీవే అతిక్రమించిన ఇకగతి యేమి. కావున నీవు ఈప్రతిజ్ఞను ఎట్లును నిర్వహించియే తీరవలయును. పురుషులలో నుత్తముడగు నీవిశ్వామిత్రునిచేత రక్షింపబడుచుండ నీరాము నకు కీడేమియు గలుగదు. శస్త్రవిద్యాభ్యాసమున్నను లేకున్నను సరియే. " గరుడునిచేత రక్షింపబడు అమృతమునకువలె " ఈరామునకు ఎందును హానిగలుగనేరదు. రాక్షసులు ఈశ్రీరాముని యుద్ధమునందు ఏమియుచేయ నేరరు. ఎదుటనైనను నిలువనేరరు. ఈవిధముగ తనకులగురువగు వశిష్ఠుడు పలుకగానే దానమును జేయవలసినదియే యని నిశ్చయించి యాబుద్ధిమంతు డగు దశరథుడు రామభృత్యుని ఒక్కనిబిలచి " రామునిస్థితి ఎట్లున్నది? ఇప్పుడు అతడెచ్చటనున్నాడు? అతని చింత ఎట్లున్నది? " అనిప్రశ్నచేసె ను. అనిన ఆభృత్యు లిట్లనిరి.

ఓదేవా! శ్రీరామచంద్రుడు బ్రాహ్మణులతోగూడి తీర్థయాత్రనుండి ఎప్పుడువచ్చెనో, అప్పటినుండియు దుఃఖసహితుడయ్యే యున్నాడు. మే మెంతయో ప్రార్థింపగా ప్రార్థింపగా ఎప్పటికో స్నానభోజనాది నిత్యకృ త్యములను ఆచరించును. అప్పటికిని అమ్మహాత్ముని ముఖము వికాసవంతమై యుండదు. కొన్నికొన్ని దినములలో మేమెంత ప్రయత్నించినను ఆహా రాదుల సహితము ఆచరింపకుండుటయు గలదు. " సంపదలచేత బ్రయో జనమేమి? ఆపదలుగలిగి పురుషునిబాధించుట యననేది? గృహములతో ఏమి

ప్రయోజనము? కోరిక లేల? అవిసిద్ధించిన నేమి? సిద్ధింపకున్న నేమి? ఇదియంతయు శూన్యరూపమే? " అనుచు ఎవ్వరితో నేమియు మాటలాడక సర్వకాలములయందును ఏకాకియై సంచరించుచుండును. ఇట్లు రాజులకు దగిన వస్త్రములయందును పానములయందును ఆహారములయందును సంపూర్ణముగా ఇష్టము లేకయున్నాడు. ఓ దేవా! ఇట్లుండుట చేత సన్యాసాశ్రమ ధర్మములను అవలంబించిన వానప్రస్థుని బోలియున్నాడు. మఱియు ఎన్నడును ఆరాముడు ఆత్మాభిమానమును జెందడు. రాజుగా ఉన్నాననియు భావింపడు. అట్లుండవలయునను కోరికయున్నూ లేదు. సుఖము వచ్చినప్పుడు సంతసింపడు. దుఃఖమువచ్చినప్పుడు దుఃఖింపడు. " ఆహా, ఎంతప్రమాదము జరిగినది. అనాయాసమగు అనగా పరమానందరూపమగు మోక్షమును బొందుటకు మనము ఒక కార్యమునైన ఆచరింపలేదు. ఆయుష్యమంతయును నిరర్థకముగా గడుపబడెను " అని ఒకటి-కటి-మాఱు మధుర స్వరముతో గానము సేయుచుండును.

" ఓయాచకుడా! నీవు ధనమును కోరుచున్నావా? ఇదియే సర్వానర్థములకు మూలము. అయినను వలసినయెడల అట్లే తీసికొనుము " అని ఉపదేశించుచూ తనను జేరిన యాచకునకు సర్వధనము నొసంగుచున్నాడు. కావున ఓకమలనేత్రా! వీరాగ్రేసరా! ప్రభువా! ఆరామునిచిత్తము ఈవిధముగా వికలమైయున్నది. దీని కేమిచేయవలయునో మాకు తెలియలేదు. తక్కినవిషయములు మీచిత్తము. మా ఉపదేశము లెన్నియైన నిట బనికివచ్చుట లేదు. రాముడు మహాధైర్యశాలి, ఆతనికంటె అధికులు లోకమున లేరు. ఇట్టిరాముడు ప్రకృతిసంబంధములగు సర్వవ్యవహారములను తుదకు భోజనాదులసహితము పరిత్యజించి తనవూనికిని విడువకున్న భృత్యులము అగు మాలో నమ్మహాత్ముని మఱలింపగలవా రెవ్వరు. ఈవిధముగ భృత్యులు చెప్పిన వాక్యములను విని విశ్వామిత్రుడు ఆదరపూర్వకముగా ఇట్లనియె. ఓభృత్యులారా! మీరుచెప్పినది యథార్థమగునేని ఆరాముని ఇటకు శీఘ్రముగ గొనిరండు. ఆడలేళ్ళు తమ యనురాగమునకు పాత్రమైన జింకను ఒకస్థలమునుండి అనుకూలమగు మఱియొకస్థలమునకు గొనిపోవునట్లు రామునకు మిక్కిలి అనురక్తులగు మీరు ఆతని నిటకు దోడితెచ్చిన మిగుల బాగుగ నుండును. జింకయు తనయందు ప్రేమగలిగియున్న లేళ్ళయుద్దేశ్యమునకు మాఱుచేయనట్లు ఆరాముడును మీయుద్దేశమునకు మాఱుపలుకడు. మఱియు తండ్రియొక్కయు మునులయొక్కయు ఆజ్ఞ కూడా రామునిచే అతి

క్రమింపరానిదై మీప్రయత్నమునకు సహాయము చేయును గదా. మఱి యు ఓభృత్యులారా! ఓప్రభువా! ఇందలి యాథార్థ్యమును వినుడు. ఈశ్రీరా మునకు గలిగిన చిత్తవైకల్యము ఆపత్తులవలనగాని కామాదులవలనగాని జనించినది కాదని తెలిసికొనుడు. మఱియేమనిన వివేకవైరాగ్యములచే గలిగిన చిత్తప్రబోధమే ఇది. ఇది మహాసమృద్ధియే యగుటచే శోచనీయము కాదు. అనగా " పుత్రునకిట్లువచ్చెనే, ఈబాధ ఎట్లుతొలగును? " అని మీరు ఇంచుకయైనను విచారింప నక్కఱలేదు. కావున యుక్తులచే ఈచిత్త కాలుష్యమును దొలగించితిమేని అప్పుడు ఆశ్రీరాముడును మావలెనే అన గా మహామునులవలెనే స్వతస్సిద్ధమగు మోక్షమున విశ్రాంతినొందును. మఱియు యథార్థస్థితిలో స్వతస్సిద్ధమగు మోక్షమునకును ప్రకృతిసిద్ధమగు భేద వ్యవహారమునకును విరోధమేమియు లేదు. కావున సర్వవ్యవహారము లను పూర్వమువలెనే యాచరించును. ఇది నిశ్చయము.

—* శ్రీరాముడు సభకువచ్చుట. *—

ఓ భరద్వాజా! ఈ విధముగ విశ్వామిత్రుడు పలుకుచుండగానే తండ్రియాజ్ఞను భృత్యులచే విని శ్రీరాముడును జనకునకు నమస్కరింప వచ్చెను. ఇట్లువచ్చి మొట్టమొదట దండ్రికిని పిమ్మట గౌరవనీయులలో నెల్ల గౌరవనీయులగు మునులకును తరువాత సామాన్యులగు బ్రాహ్మణులకును ఆవెనుక రాజబంధువులకును అక్షరాభ్యాసాదుల నొనర్చిన సామాన్యగురు వులకును క్రమముగా నమస్కరించెను. మఱియుపిమ్మట సామంతరాజులంద రును తనకు నమస్కరింపగా వారలలో గొందరి నమస్కారములను గరుణా మయమగు దృష్టితోను మఱికొందఱి నమస్కారములను ప్రశంసావాచకము లగు వాక్యములతోను మఱికొందఱి నమస్కారములను కొంచెము వంపబడి గౌరవమును సూచించునట్టి శిరముతోను చక్కగా నాదరించెను. పిమ్మట " ఓ పుత్రుడా! నాయొడిలో కూర్చుండుము " అని దశరథుడు పలుకుచుం డగానే ఆ శ్రీరాముడు నేలపై గూర్చుండెను. ఆ ప్రయత్నమునజూచి భృ త్యులును ఒక యాస్తరణమును ( రత్నకంబళము మొదలగునవి యాస్తరణ ములు ) బఱచిరి. ఇట్లుకూర్చుండిన పిమ్మట దశరథుడు పుత్రునితో నిట్లని యె. ఓపుత్రుడా! నీవు సంపూర్ణముగా విద్యనభ్యసించి జ్ఞానవంతుడవై యున్నావు. శుభకరములగు సర్వవిషయములకును ఆశ్రయభూతుడవై అన గా బహువిధ భోగములను అనుభవింప వలసినవాడవై యున్నావు. ఇట్టి నీవు ఏమియు నెఱుగని జడునివలె క్షీణించినబుద్ధితో నిరర్థకముగా దుఃఖిం

పనేటికి? ఆత్మను సర్వవిధములగు వినోదములకు ఆస్పదముగ నొనర్చుటకు మాఱుగా దుఃఖములకు ఆస్పదముగా జేయుచున్నావు. ఇది యుక్తమము కాదు. మఱియు పెద్దలగువారును బ్రాహ్మణులును గురువులును ఉపదేశించిన మార్గమును అనుసరించి నీయట్టి వివేకులు నడుచుచుందురు. అట్లు నడుచుటచే పుణ్యము కలుగును. సద్గతిదొరుకునుగాని యూరక చిత్తవైకల్యము చెందుటచే నేమిలాభము.

ఓపుత్రుడా! మఱియొకవిశేషము. మోహము ఎంతవరకు మనస్సును ఆక్రమింపకుండునో అంతవరకే సకలాపదలును సమీపమునకు జేరరాక దూరముగనే యుండును కాని, మనస్సున నించుకయైనను మోహమునకు నవకాశము దొరికెనేని యాపదలు ఇకవానిని బాధింపక మానవు. ఆపదలకు మనుష్యుని క్షీణింపజేయుటయే స్వభావము కదా. అనెను అంతవశిష్ఠ మహాముని ఇట్లనియె. ఓ రాజపుత్రుడా! శ్రీరామా! ధైర్యశాలి లోకమున శూరుడనిన నీవేశూరుడవు. సామాన్యముగా పరులను జయింపగల శూరులు ఎందరో కలరుగాని అంతశ్శత్రువులగుశబ్దాది విషయములను జయించు వారలు ఎవ్వరునులేరు. ఆవిషయములు ప్రబల శత్రువులని తోచుటకు మాఱుగా సామాన్యుల కందఱకును అత్యంత మిత్రులుగా తోచుచున్నవి. అవి ఇచ్చునట్టి సుఖమే పరమానందమనికదా? సర్వజనులును భ్రాంతులగుచున్నారు. ఈ కారణమువలన ఆ విషయ శత్రువులను ఎవ్వరును జయింపనేరకున్నారు. అట్టివారిని నీవు గెలిచితివి. నీకంటె శూరులు లోకమునలేరు. ఇట్టి వాడవయ్యును ఏమియు నెఱుగని వానివలె అజ్ఞానమున మునిగెదవేల? ఈయజ్ఞాన సముద్రమునకు తరంగములు మెండు. అనగా ఒక విధమునగాక ననేక ప్రకారములుగా నాయజ్ఞానము తనకు వశగతుడైన మనుజుని బాధించును. దీనియందు జడత్వము అత్యధికము. కావున నిది నీవంటివారికితగినదికాదు. అజ్ఞానులకు ఉచితమైనది. కావున నిరర్థకముగా నిట్టి మోహసముద్రమునందు బడనేల? అనెను. అంత విశ్వామిత్రుడు ఇట్లనియే.

ఓ శ్రీరామా! నీమనస్సుననున్న మనోవ్యాధులేవి? ఏకారణమువలన కలిగినవి. అవి ఎన్నిగలవు? ఏఏ విషయమును ఆశ్రయించియున్నవి. "ఎలుకలు ఇంటినిత్రవ్వినట్లు" ఈ వ్యాధులు నిన్ను మిక్కిలి బాధించుచున్నవి గదా. కావున మాయెదుట నించుకయైనను సంశయములేక ఉన్నది యున్నట్లు నీయభీష్టమును జెప్పుము. అది అవశ్యముగ నీకుదొరుకును. ఎట్లైననేమి? ఈ మనోవ్యధలు మఱల నిన్ను బాధింపకుండునట్లు చేసెదము.

ఈ విధముగా మహాబుద్ధిమంతుడగు విశ్వామిత్రుడు పలికిన వాక్యములను విని ఆ వాక్యములు తనయభిప్రాయమునకు అనుగుణములుగా నుండుటకు సంతోషించి రఘువంశభూషణుడగు నా శ్రీరాముడు "ఇకను అభీష్టసిద్ధి కలుగుటకు సంశయము లేదు" అని ఊహచే నిర్ణయించి "మేఘధ్వనిని వినిన నెమలివలె" తన మనస్సులోనుండు సంతాప మంతయును విడచెను.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణము నందు వైరాగ్య ప్రకరణమున వైరాగ్యోత్పత్తినిరూపణమను మొదటిసర్గ ముగిసెను.

—* శ్రీరాముడు తనమనోగత అభిప్రాయమును నెఱిగించుట. *—

ఇట్లు శ్రీరామునకు వైరాగ్యమునుగలిగిన విధమును అభివర్ణించి వాల్మీకి మహర్షి భరద్వాజునితో నిట్లనియె.

ఓ భరద్వాజా! ఈవిధముగ విశ్వామిత్రుడు ప్రశ్నచేయగానే మనస్సున నభీష్టసిద్ధి గలుగునని మిక్కిలి సంతోషించి యాశ్రీరామచంద్రుడు అతి మనోహరముగాను సంపూర్ణార్థయుక్తముగాను ఇట్లని ప్రత్యుత్తరము చెప్ప నారంభించెను. ఓ భగవంతుడా! విశ్వామిత్రమహామునీ! మీ రడుగుటవలన నేను నామనోగతము నంతయు నిప్పుడు వివరింతును. అజ్ఞానినైనను నావాక్యములు ఎట్లున్నను క్షమింపగోరెదను. సత్పురుషులయాజ్ఞను ఎట్టివాడైనను అతిక్రమింపనేరడు కదా. నేను ఈ దశరథమహారాజు ఇంటియందు జన్మించితిని. క్రమక్రమముగా వృద్ధిజెందితిని. విద్యలనేర్చితిని. ఓ మునిశ్రేష్ఠా! విశ్వామిత్రుడా! పిమ్మట సదాచార వంతుడనై తీర్థయాత్రకొఱకు భూమినెల్ల తిరిగితిని. నాలుగు సముద్రములచే జుట్టబడిన భూమియందంతను నేను చూడని తీర్థములు లేవు. ఇప్పటికి నామనస్సున నొక్క విచారము పుట్టినది. అది సంసారమునందలి ఆశను సంపూర్ణముగా దొలగించెను. దాని స్వరూపమును దెలిపెదను వినుడు. సంసారమునందు నిలుచుటవలన నేమిసుఖము గలుచున్నది. ఏమియు గానవచ్చుటలేదు. చచ్చుటకై పుట్టుచున్నారు. పుట్టుటకై మరల చచ్చుచున్నారు. ఇంతకంటె నధికమేమియు గానరాలేదు. "ఇట్లనుటయేల? సంసారమునందు పెక్కుసుఖములను అనుభవించుచుండుటలేదా. అయిశ్వర్యమునకు స్థానములై బహువిధములగు పదార్థములు లేవా?" అందురేమో? వినుడు. ఇవియన్నియును అసత్యములైనవి. ఒకప్పుడు సుఖకరములుగా తోచినను శాశ్వతమైన సుఖమును కలిగించునవి కావు.

ఇట్టి క్షణికసుఖము సుఖమన దగదుగదా. మఱియును ఆపదలకు స్థానము లైనవి. ఈసంపదలను సంపాదింప ప్రయత్నించువాడు లెక్కలేని ఆపదలకు లోబడవలసివచ్చుచుండుట ప్రత్యక్షమే. ఇదియునుగాక పాపములకును ఆకరములైనవి. దేనిని సంపాదింపవలయునన్నను ఏదియో ఒకవిధమగు పాపమును కొంచెముగాగాని అధికముగాగాని ఆచరించియే తీరవలయును. కావున సుఖకరములని తోచు పదార్థములన్నియు సత్పురుషులకు దిరస్కారార్హములగునుగాని అంగీకారార్హములుగానేరవు. ఇట్లే వీనికై ప్రయత్నించు భూతముల చేష్టలును అనర్థకరములైనవే. అనగా నిష్ప్రయోజనములైనవే. ఈ సర్వసాంసారిక పదార్థములున్నూ "ఇనుపచీలలువలె" ఒకదానితో నొకటి సంబంధించినవికావు. అట్లైనను సంకల్పమాత్రము వలననే అనగా ఈశబ్దము నాకు సుఖకరమైనది, అనుమొదలగు సంకల్పములవలన మాత్రమే పురుషునితో సంబంధపడుచున్నవి కాని, మఱేమియులేదు. కావున ఇక నాకు రాజ్యముతో పనియేమి? భోగములతో పనియేమి? ఈ భోగములన్నియును బాగుగ విమర్శించిన శబ్దాది పంచవిషయములేకాని, అన్యములుకావు. వీనిస్వభావమన్ననో, ఒకదానితో సంబంధించుట ఎప్పటికిని లేదు. ఇట్టివానితో సంకల్పరూపమగు మనోమయ సంబంధమును కల్పించుకొనిన ఏమిసుఖము అనుభవింపగలము. మఱియును నేనెవ్వడను? ఇదినాకెట్లువచ్చెను? విషయము లసత్యములైన అసత్యములే యగునుగాక. ఇవి నన్నేల బాధింపవలయును? ఇదియు బొరపాటే. అసత్యములైన పదార్థములు ఎవ్వని నేమియు జేయలేకపోవుటచేత ఇవి నన్నేమియు జేయుట లేదనియే చెప్పవలసి వచ్చుచున్నది.

ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! విశ్వామిత్రా! ఈ విధముగా విమర్శింపగా విమర్శింపగా నాకు సర్వపదార్థములయందును వైరాగ్యము పుట్టెను. మార్గస్థుడగువాడు జలశూన్యప్రదేశమును కంటితోనైన జూడనిభంగి నాకు నీ సాంసారిక విషయములను చూచుటకైన నిష్టములేకున్నది. ఇట్లువైరాగ్యము గలిగి "ఈ సంసారదుఃఖము ఎట్లు నివారణమగును" అను చింతచే రేయింబవలు పరితపించుచున్నాను. "తొఱటలోని అగ్నిచే గాల్ప బడుచున్న పండినచెట్టువలె" నామనస్సు ఈ పరితాపాగ్నిచేత దహింప బడుచున్నది. ఈ విధముగా సంసారదుఃఖమను రాళ్ళచేత గొట్టబడి నాహృదయము ఎంతబాధపడుచున్నను భృత్యమిత్రాది జనులు నిరర్థకముగా దుఃఖింతురను తలంపుచేతమాత్రమే పెద్దగా నేడ్చుటలేదు. మఱియు నీధనము చిం

తాసమూహమనియే చెప్పవలయును. కావున దారిద్ర్యమునుఅనుభవించు వారికి అధికసంతానముతో గూడిన గృహము ఇష్టముకానట్లు నాకు దీని యందు ఇచ్ఛలేదు. ఈ ధనము నాకేమియును ఆనందమును గలిగింపదు.

ఓ మునిశ్రేష్ఠా! విశ్వామిత్రా! సామాన్యముగా నందఱును ధనమును సంసార సారభూతమునుగా దలంచుచున్నారు కాని, అదియును నా చిత్తమునకు సమ్మతముగా లేదు. ఆ ధనమువలన గలుగు సుఖముగూడా క్షణికమైనదియే కాని, శాశ్వతమైనది కాదు. ఇదియునుగాక మనస్సును మోహమందున చిక్కించి యాధనము బహువిధముల కలవరపెట్టును. కావుననదియు సుఖమునిచ్చునది కానేరదు. నిశ్చయము. మఱియు నాధనము "వీడు గుణవంతుడు వీడుగుణహీనుడు" అనినైనను విచారింపదు. పార్శ్వమున నెవ్వడుండిన వానినే యాశ్రయించును. రాజుస్వభావమువలె నెచ్చటను స్థిరముగా నిలచియుండదు. ఇదియంతయును యథార్థమేకదా. ఇదియును గాక నాధనము అభివృద్ధియగుటకు ధర్మకార్యములే కావలయునని లేదు. అధర్మము ఆచరించినను అది యభివృద్ధియగును. "క్షీరములు సర్పమునకు విషమును అభివృద్ధిచేయునట్లు" ఆధనమను క్షీరము కామక్రోధాదులను విషమును అభివృద్ధిచేయును. కావున సామాన్యముగా ధనాభివృద్ధిని గోరు వారలు అధర్మమునే ఆచరింపవలసివచ్చును. సుడిగాలి మంచును గట్టిపరచునట్లు ఎంతకాలమువఱకు మనుష్యుని ధనము కఠినునిగా నొనర్పకూడదునో అంతవఱకే వాడు చల్లగ నుండును. మృదుస్వభావము గలవాడగును. "వీడు పరుడు. నేను." అనువివేకముగలవాడై యుండును. ఎంతబుద్ధిమంతులైనను ఎంతశూరులైనను చేసినమేలును మరువనివారైనను నేర్పరులైనను ఎంత మృదుస్వభావము గలవారైనను ధనముచే క్షణమాత్రమున అతికఠిన స్వభావులుగా నొనర్పబడుదురు. మృత్తికతో సంబంధము గలిగినతోడనే రత్నము కాంతిహీనమగునట్లు రత్నసదృశులగు ఆధర్మాత్ములును ధనముతో సంబంధము గలుగగానే తమ సహజతేజంబును విడచి చెడుదురు. కావుననే లోకమున జననిందాపాత్రముగాని ధనవంతుడును, తన్ను దా బొగడుకొనని శూరుడును, సమదృష్టిగల ప్రభువును, ఈ మువ్వురును దొరకుట అసాధ్యము. బొత్తిగనే లేరనియుం జెప్పవచ్చును. ఈసంపద సర్పములచే జుట్టుకొనబడి పుట్టనుండి జనించిన పూదీగవలె మిక్కిలి భయంకరమయ్యు మనస్సునుమాత్రము ఆకర్షించుచున్నది. మనస్సునకు ఎంతయో ఇంపుగా గానవచ్చుచున్నది. నీచులను సేవించుట మొదలగు ఎట్టి కుచ్ఛిత కార్యముల

జేయవలసి వచ్చినను అట్లుచేసినను కలుగు ఫలము అతిచంచలమేయయ్యె
ను దానినంతయును లోకులు గమనించుటలేదు. ఇంతదృఢముగా ఆధనము
జనులయొక్క చిత్తములను ఆకర్షించుచున్నది. ఇకను ఆయుష్యము ఎట్టిదనిన
వినుము. అది చిగురాకుయొక్క కొనయందున్న మంచుబిందువువలె నతి
చంచలమైనది. నశించుటయే స్వభావముగాగలది. ఉన్నట్లుండి పిచ్చిపట్టిన
దానివలె శరీరమును నిష్కారణముగనే విడచిపోవును. ఇంతమాత్రమేకాదు.
ఆయుస్సువలన గలుగు శ్రమ అందరకును తెలియును. పరిపూర్ణమగు ఆత్మ
జ్ఞానము కలవారికీమాత్రము అంత ఆయాస కరముగా నుండక పోయినను
అట్టివిజ్ఞానములేక శబ్దాది విషయములను సర్పములచేత చిక్కి ఆయాసపడు
వారికి ఆయుష్యమువలన గలుగు శ్రమ ఇంతంతగాదు. ఈ విషయములు
క్రమక్రమముగా ఇంద్రియశక్తులను పాడుచేయునవి యగుటచేత ఇంద్రియ
శక్తి తొలగినపిమ్మట బ్రతుకే మిక్కిలి ఆయాసకరమై యుండునుగదా. కా
వున నో విశ్వామిత్రమహాముని! పైనచెప్పినవిధముగా ఆయు స్వరూపమును
నిర్ణయించి "ఇంతకంటె నధికము ఇందేమియులేదు." అని నిశ్చయించు
కొని యున్నవాడనగుటచే నేను సంసారమను మేఘమునకు మెఱుపువలెనున్న
ఈ ఆయుష్యమును జూచి సంతోషించుటలేదు. దీనివలన సుఖము ఏదియు
నాకుతోచలేదు. వాయువును చాపచుట్టుగా చుట్టవలయునన్నను ఆకాశము
ను ఛేదింపవలయునన్నను అలలను ఒకదానితో మఱియొకదానిని గూర్పవల
యునన్నను, ఒకానొకప్పుడు విశ్వాసము నుంపవచ్చునుగాని ఆయుస్సు
నిలుచుననిన మాత్రము ఎప్పటికిని విశ్వాస ముంపదగదు. ఈ ఆయుస్సు
అతిచంచలమగుటచే శరత్కాల మేఘమువలె, చమురులేని దీపమువలె, అతి
చంచలమగు తరంగమువలె నెప్పటికిని నశించినదియే. ఉన్నట్లు తోచుట
మాత్రమేకాని వాస్తవమున నది ఎప్పటికిని లేదు. లోకమున నశ్వతరియను
నొకమృగము కలదు. ఆమృగము ప్రసవింపగానే మృతి నొందును. అయి
నను అది గర్భమును అనగా గర్భహేతువగు సంగమమును కోరకుండదు
కదా. అట్లే లోకులును ఆయువు దుఃఖకారియని ఎఱిగియు దానినే కో
రుచున్నారు. చిత్తవిశ్రాంతిలేక వారు మూఢత్వమును జెందుచున్నారు.
వారికి దుఃఖమే తుదకు ఫలమగును. అయినను ఎవ్వడు తన ఆయుస్సుచే
పొందదగిన బ్రహ్మవస్తువును పొందునో, సర్వదుఃఖముల పోగొట్టుకొని మ
ఱల నెన్నటికిని దుఃఖింపడో, శాశ్వతమగు పరమానందమును సంపాదించు
నో, ఆపురుషుని జీవితమే జీవితము. అదియు క్షణభంగురమే యైనను సా

ధింపవలసిన దానిని సాధించినదగుటచే సార్థకమయ్యెను. కావున నదీ ( ఆ మహాపురుషుని యాయుస్సు ) స్తోత్రము చేయదగినది. వృక్షములును జీవించుచునే యున్నవి. మృగములును పక్షులును గూడా జీవించుచునేయున్నవి. మూఢుడును జీవించుచునే యున్నాడు. వీరలలో భేదమేమి? ఎవడు విచారణాయుక్తుడై చిత్తశాంతిని సంపాదించునో వానిజీవనమే జీవనము. జ్ఞానమొకటియేకదా వృక్ష మృగ పక్షులకును మనుష్యులకును గలభేదము. ఈ విధముగా తమ ఆయుష్కాలమును సార్థకముగా నుపయోగించి మఱల బుట్టకుండునట్టి ప్రయత్నము గావింతురో, వారే సార్థక జన్మము గలవారు. మిగిలినవారు ముదిగాడిదెలే. వారిజన్మము నిరర్థకము. అవివేకికి శాస్త్రము మిక్కిలిభారము. దానియందలి విషయములు దెలియకుండుటచే అది మిక్కిలి కష్టముగ నుండును. కామాది దోషములచే బీడింపబడువానికి బ్రహ్మజ్ఞానము మిగుల భారము. ఆ జ్ఞానమును సంపాదింప వలసినయెడల మొట్టమొదట కామాదులను బరిత్యజింప వలయును. కావున నదీ కామాది దోషదూషితులకు మిగుల కష్టమై యుండునుగదా. చిత్త శాంతిలేని వానికి ఆ చిత్తము మిక్కిలి భారము. ఏలయనిన శాంతిలేనప్పుడు ఆ చిత్తము వివిధ సంకల్పముల పాలుజేసి పురుషుని గలంచుచుండును. ఇది ఆత్మ. ఇది అనాత్మ. అని ఎఱింగినవానికి శరీరమే మిగుల భారము. శరీరమునందు ఆత్మాభిమానము లేక పోవుటచే అదియుండుటయే ఆతనికి మిగుల నాయాసకారియగును. మఱియు బుద్ధి నిర్మలము కాకుండినయెడల రూపము ఆయుస్సు మనో బుద్ధ్యహంకార రూపమగు నంతఃకరణము సంకల్పము అనునవి అన్నియు బరువు మోయువానికివలె మిక్కిలి భారములే యగును. మనస్సు స్వాస్థము కాకపోవుటచేత నివియన్నియు ఆతనికి దుఃఖమునే కలిగించును. ఇదియునుగాక ఆయువునందు ఒకభాగమగు యౌవనమునుగూర్చి వినుడు లోకమున సత్పురుషుడు ప్రమాదమున నొకదుష్టునితో స్నేహము చేసిన కొద్దికాలములోనే వానిస్వభావమును తెలిసికొని వానియందాదరము విడచి తొలగిపోవునట్లు ఈ యౌవనముగూడా నత్యల్పకాలమే పురుషుని ఆశ్రయించి యుండి పిమ్మట మిగుల ననాదరముగా వానిని విడచి పోవును. స్థిరముగాక సుఖమును గలిగింపక సారభూతమగు నంశమే లేకయుండు నీ యాయుస్సువలె గుణహీనమగునట్టి పదార్థముమఱియొకటి ప్రపంచముననే లేదు,

—* అహంకార స్వరూపము. *—

మఱియు నో విశ్వామిత్రమహామునీ! వీటి కన్నిటి కంటెను భయంక

రుడై సంసారమున అహంకార శత్రువు ఉన్నాడు. ఆతడు కారణములేక యే పుట్టును. కారణములేకయే వ్యవహరించును. స్వరూపమును జూడబోయినను శూన్యమే. ఇట్లుండియును అందరిని బాధించుచున్నాడు. వానినిదలచిన నాకుమిక్కిలి భయముగ నున్నది. ఈ సర్వాపదలను అహంకారము వలననే గలుగును. మనోవ్యథలన్నియును ఆ యహంకారమువలననే సంభవించును. సర్వకామనములను అహంకారమువలననే సంభవించును. ఇవియన్నియు బాధకరములేగదా. కావున అహంకారమునకంటె నితరుడగు శత్రువే లేడు. ఓమునిశ్రేష్ఠా! విశ్వామిత్రా! ఇట్లు అనాదిశత్రువగు నహంకారమును ఆశ్రయించుటచేత నేను భుజించుటయైనను లేదు. జలపానమునైనను ఆచరించుటలేదు. ఇట్లుండగ భోగముల నెట్లు అనుభవింతును. యథార్థస్థితిలో నహంకారము అసత్యమే. కావున దానిని ఆశ్రయించి ఏదేది ఆచరింపబడునో ఏయే హోమాది క్రియలు చేయబడునో ఏది ఏది గ్రహింపబడునో అనుభవింపబడునో అవి అన్నియు యథార్థవస్తువులే కానేరవు. కారణము యథార్థము కాకపోయిన కార్యములు మాత్రము యథార్థములగునా? కావున అహంకారము లేనిది ఏదియో అదియే యథార్థవస్తువు.

ఓ బ్రాహ్మణోత్తమా! విశ్వామిత్రా! అహంకారమను మేఘము ఎంతకాలము విజృంభించునో అంతకాలమువరకును ఆశయను కొండమల్లియ వికసించుచునే యుండును. కావున నో బ్రాహ్మణోత్తమా! విశ్వామిత్రా! నేనా యహంకారమును సంపూర్ణముగా విడచితిని. ఇట్లయ్యును అజ్ఞానమువలన నేమియును దెలియక దుఃఖించుచున్నాను. కావున నీదుఃఖము నివారణయగుటకై ఉపదేశింప వలసినదానిని ఉపదేశించి అనుగ్రహింపుడు. ఓ మహానుభావా! విశ్వామిత్రా! ఆపదల కన్నిటికిని ఆశ్రయ మయినట్టియు మిక్కిలి చంచలమైనట్టియు సద్గుణములేమియును లేనట్టియును అంతఃకరణరూపమైన ఈ అహంకారమును నేను ఆశ్రయింపను. దీనిని విడచి మఱియే విషయమునైనను ఉపదేశించి నన్ను కృతార్థుని జేయుడు.

### —* చిత్తముయొక్క స్వరూపము. *—

ఓ విశ్వామిత్రమహామునీ! ఇదియునుగాక సర్వకార్య సాధనమగు ఈ మనస్సు ఎట్టిదనిన. వినుండు. అది కామక్రోధాది దోషములచేత అతి శిథిలమైయున్నది. ఏదోషము జనించిన దానికనుగుణముగా పరుగిడుచుండును. మఱియు గొప్పవారు ఏదైన సత్కార్యము ఆచరింప బూనినచో నప్పుడు మాత్రము వానికి అనుకూలముగారాక సుడిగాలిలోని నెమలి ఈకవలెనటు

నిటు తిరుగుచుండును. కుక్క గ్రామమునందు ఏమిపనిలేకయే బహుదూర
ముపోయి మఱల వెనకకు దిరుగుచూ నూరకె సంచరించునట్లు ఈ మనస్సు
కూడా నిరర్థకముగా సర్వకాలములయందును చెలించుచునే యుండును.
ఇట్లెంత చెలించినను దీనికి ప్రయోజనముమాత్రము ఏమియులేదు. ఎటుబో
యినను ఏదియు దొరుకదు. ప్రతిసంకల్పమును ఫలవంతము కానేరదుకదా.
ఒకవేళ ఒకానొక సంకల్పము ఫలవంతమై అతిసమృద్ధిగల పదార్థము దొరి
కినను పుట్టలో నీరుబోసిన నెప్పటికిని నిండనట్లు దీనికికూడా ఎప్పటికిని కొ
రత కొరతయే. తృప్తియనుమాట ఎన్నటికిని లేదు. ఈవిధముగ మిగుల
క్రూరమై ఆశయనుభార్యతోగూడి విహరించుచున్న ఈమనస్సు "స్తంభిం
చిన శరీరముగల శవమును కుక్క భక్షించినట్లు నన్ను భక్షించుచున్నది.
మఱియు సుడిగాలిలో బడిన గెడ్డిపోచవలె ఈ మనస్సుచేత నేను బహుదూ
రము గొనిపో బడితిని. ఇకను ఆగెడ్డిపోచవలెనే ఆకస్మికముగ నెప్పుడైనను
అధోగతిపాలు కావలయును. కాకున్న సుఖహీనమై ఏమియులేని అనగా
స్వరూపశూన్యమైన ఈ సంసారమునందైనను నిష్ప్రయోజనముగా దిరుగ
నైనా దిరుగవలయును. ఈ రెండును అనర్థకములేకదా. క్రిందికి బోవుచూ
పైకివచ్చుచూనున్న ఏతపుకట్టె త్రాటితో కట్టబడినట్లు నిరర్థకముగనే పాతా
ళమునుండి భూమికిని భూమినుండి పాతాళమునకును దిరుగుచున్న మనస్సు
చేత నేను కట్టబడియున్నాను. ఆత్రాడు తనఇష్టము వచ్చినట్లుగా నా ఏత
పుకట్టెను త్రిప్పువిధమున నీమనస్సునన్ను త్రిప్పుచున్నది. మఱియును ఈ మన
స్సునకు స్వరూపము ఒకటియున్నట్లు గానవచ్చునుగాని అది సంపూర్ణముగ
నసత్యమే. బాగుగా విచారించినచో మిక్కిలి బాధకరము. ఇట్లైనను
అసత్యరూపుడయ్యు భేతాళుడు అజ్ఞానులగు బాలురను ఆశ్రయించి బాధిం
చునట్లు నన్నీ మనస్సు బాధించుచున్నది. ఓబ్రాహ్మణోత్తమా! విశ్వామి
త్రా! ఈ మనస్సు అనియెడి దయ్యము అగ్నికంటెను వేడిమైనది. కొండ
కంటెను కఠినమైనది. వజ్రాయుధమునకంటెను బలవంతమైనది. ఎట్లును
దానిని జయించుట అసాధ్యము.

ఓసత్పురుషుడా! విశ్వామిత్రా! శ్లో॥ అప్యబ్ధిపానాన్మహతస్సుమే
రూన్మూలనాదపి । అపివహ్న్యశనాత్సాధో విషమశ్చిత్తనిగ్రహః ॥ సముద్ర
మంతయును పానముచేసినను చేయవచ్చును. పదునాలుగు లోకములకును
ఆధారమైయుండు మేరుపర్వతమును అడుగుతో పెళ్ళగించినను పెళ్ళగింప
వచ్చును. అగ్నినైనను భక్షింపవచ్చును కాని, మనస్సును మాత్రము నిగ్ర

హించుట యశక్యము. ఈ మనస్సే సర్వమునకు కారణము. ఈ మనస్సు విజృంభించుచున్న సమయమునందే త్రిలోకములును గానవచ్చును. అది క్షీణించిన లోకములును క్షీణించును. కావున దానికి బాగుగా చికిత్స చేయవలయును. ఎంత ప్రయత్నమునైనను ఆచరించి దానిని శోధింపవలయును.

ఓ మునీంద్రా! విశ్వామిత్రా! ఈ సుఖదుఃఖము లన్నియు కొండనుండి చెట్లుబుట్టినట్లు మనస్సునుండియే జనించెను. కావున జ్ఞానముచేత నా మనస్సు క్షీణించెనేని ఈ సుఖ దుఃఖములుకూడా క్షీణించునుగదా యని తలంచెదను. మనస్సునుండియే సుఖదుఃఖములు పుట్టెననుట యథార్థమగు విషయమే. మనోనాశముగల సుషుప్త్యవస్థయందు ఆ సుఖదుఃఖములు లేవుకదా.

## —* తృష్ణాస్వరూపము. *—

ఓ విశ్వామిత్రమహామునీ! మఱియు ఆశయనునది హృదయమునందు అజ్ఞానాంధకారమును గలిగించునట్టి రాత్రి. ఆరాత్రియందు హృదయాకాశమున కామాదిదోషములను గుడ్లగూబలు మెండుగ విహరించును. నేను ఏఏ సద్గుణముల మిగుల నాచరముతో నాశ్రయింతునో వానినెల్లను ఈ యాశ "ఎలుక దారమును త్రెంచి పాడుచేయునట్లు" పాడుచేయుచున్నది. మఱియు నాకు స్వస్థానము జేరుటకే అవకాశముకలుగకున్నది. "వలయందు చిక్కిన పక్షులవలె మేము (ఇట్టిస్థలములయందు ఉపయోగింపబడిన బహువచనము రాజార్థక బహువచన మనబడును) ఆశాపాశమునందు చిక్కియున్నాము. ఓతండ్రీ! విశ్వామిత్రా! ఆశయనెడు అగ్నిజ్వాలచేత సంపూర్ణముగ దగ్ధుడనైతిని. ఈ తాపము అమృతముచేత స్నానముచేసినను చల్లారునట్లు ఉండలేదు. ఈ యాశ కృష్ణపక్షమునందలి రాత్రియట్లు మిగులధైర్యవంతుని సహితము భయపెట్టును. కన్నులుగలవానినిగూడ గ్రుడ్డివానిని గావించును. అతిశాంతచిత్తునిగూడా నాయాస పరుచును. ఇదియునుంగాక నీయాశ అన్నిచోటులకును పరుగెత్తుచుండును. తాను ఎవ్వని ఆశ్రయింపబోయెనో వానిమనస్సు తనకు అభిముఖముగా నున్నదా లేదా యనియైనను తలంపదు. వయస్సుచెల్లియు కామాతురయగు స్త్రీవలె ఫలమును ఏమాత్రమును జెందదు. ఇట్లుజెందకున్నను దానిస్వభావము మాత్రము ఎప్పటికిని విడువదు. మఱియు మనము తలంచిన కార్యము శక్యమా అశక్యమా యనియైన దలంపక ఎట్టి యసాధ్యకార్యపు విషయమునందైనను ఊరకచిందులు త్రొక్కును. ముసలిదియై బలహీనురాలై యుండియును ఆటకై

వచ్చిన నర్తకివలె ( ఆటకత్తెవలె ) ఆనందకరము గాకుండినను నృత్యమును మాత్రము మానదు. ఈ ఆశ చపలస్వభావముగల కోతివంటిది. తనకు చాటుటకు అశక్యమైన పదార్థమయినను అనగా ఎంత పొందరాని వస్తువైనను దానిపై పదమునుంచును. అనగా దానిని సంపాదించుటకై పరుగులిడును. తలచిన ఫలమును పొందియు తృప్తినిజెందదు. ఎప్పుడును ఒకదాని వెంట మఱియొకదానిని కోరుచునే యుండును. ఒకచోట నిలువదు. హృదయమను పద్మమునందున్న సారమునంతయు అనగా ధైర్యమునంతయు గ్రహించుచుండుటచేత తుమ్మెదవలెనున్న ఈ ఆశ ఒకక్షణమున పాతాళ లోకమునందు విహరించును, మఱియొకక్షణమున ఆకాశమునకు లంఘించును. వేఱొకసమయమున సర్వదిశలయందును విహరించును. కావున సంసారమునందున్న వన్నియు దోషములే యైనను ఈఆశయొక్కటియే మిక్కిలిదుఃఖకరమైనది. అంతఃపురమునందు ఉండువానిని గూడా నిది బహువిధములగు దుఃఖములపాలు జేయును. ఈవిషయమున నిట్టిది మఱియొకటి లేదు. ఈ లోకమునందలి దుఃఖమంతయును నశించుటకు విషయచింతను విడుచుటయే ఉపాయము. విషయచింత లేకున్న ఏదుఃఖమును లేదు. ఉండుటకును వీలు లేదు. విషయచింత యనగా ఆశయొక్క రూపాంతరమే. లేనివాడు విషయములనుగూర్చి తలంపడుగదా. కావున విషూచికారోగము ( కలరా ) వంటి ఈ ఆశకు విషయచింతను విడచుటయే గొప్పమంత్రము. ఆశనుజయించుటకు ఇంతకంటే ఉపాయములేదు. రోగబాధయును స్త్రీయును ఆశయును ఎంతగంభీరుడైన పురుషునినైనను సూర్యకిరణములు కమలములను బయలుపరుచునట్లు " అనగా నీటిలోనుండి పైకిపెఱిగి వచ్చునట్లుగా జేయు విధమున ( వృక్షములు అభివృద్ధినొందుటకు సూర్యకిరణములే ఆధారమగుటచేత నిట్లు చెప్పబడెనని తెలిసికొనునది. ) లేక వికసింపజేయునట్లు ఒక క్షణముననే మిక్కిలి నుప్పొంగునట్లు సేయును. అనగా తమకు అభిముఖుని గావించుకొనగలవు.

ఓ బ్రాహ్మణోత్తమా! విశ్వామిత్రా! పదునుగల కత్తియొక్క అంచుగాని వజ్రాయుధముగాని అగ్నిహోత్రముగాని కాలిన ఇనుప తునకలుగాని ఈ ఆశయంత ఘోరములుగావు. ఇది హృదయమునందేయుండి లోలోపలనే దహించుచుండును. మేరుసమానమగు ధైర్యము గలవాడైనను బుద్ధిమంతుడైనను శూరుడైనను ఎట్టినిశ్చయుడైనను అట్టిపురుషశ్రేష్ఠుని ఈ ఆశ యొక క్షణమున తృణమాత్రుని గావించును.

—* దేహస్వరూపము. *—

ఓ విశ్వామిత్రమహామునీ! ఇవియన్నియుగాక ఈ సంసారమున శరీరమను ఒకపదార్థముకలదుగదా. అది రక్తాదులతో తడసిన పేగులతోను నరములతోను నిండియుండును. పుట్టుక, అభివృద్ధి, క్షయము, పరిణామము, నాశము, అనుమొదలగు వికారములు గలిగియుండును. సమస్త విధములగు రోగములకును తాపములకును ఆశ్రయమైయుండును. కావుననిదియుసుఖకరముకాదు. అయ్యో పాపము, ఈదేహము కొంచముననే సంతోషించును. కొంచముననే దుఃఖించును. ప్రపంచమున నిట్టిగుణహీనమగు లేక నిస్సారమగు పదార్థము ఏదియునులేదు. ఓ మునిచంద్రా! విశ్వామిత్రా! ఈ శరీరము అహంకారమను గృహస్థునకు గొప్పగృహము. ఇది దుఃఖమున నిటునటు బొరలిన నాకేమి? ధైర్యమునొంది నిలచిన నాకేమి? ఈ దేహమను గృహమునందు ఇంద్రియములను పశువులు వరుసగా గట్టివేయబడి యుండును. దీనికి యజమానురాలు అతిచెంచలయగు నాశయను కాంతయే. సర్వసుఖములును సంపాదించు సేవకుడు ఈ గృహమున చిత్తమే. కావున నిట్టి ఈ దేహగృహమునందు నాకిష్టములేదు. ఇది దుఃఖ కరమేగాని సుఖ కరము కానేరదుగదా. మఱియు నా దేహమునకు నోరేవాకిలి. నాలుకయే గడియ. మఱియును అమంగళకరముగ నాద్వారమునందుదంతములవరుసయను ఎముకతునకలు గలవు. ఇట్టి దేహ గృహము నాకిష్టముకాదు. ఎంతరాజ్యమున్ననేమి? ఎట్టి దేహమున్ననేమి? ఎట్టి సత్కర్మ లాచరించిననేమి? అత్యల్ప సంఖ్యగల దినములలోనే కాలము సర్వమును ఖండించి వైచును. ఓ మునీంద్రా! విశ్వామిత్రా! ఈ దేహము లోపలజూచినను వెలుపలజూచినను రక్తమాంస మయము. దీనికెప్పుడును నిలుకడయే లేదు. ఇట్టి శరీరమునందు రమ్యత్వము ఏదికలదు. మఱియును ఈ దేహమునకు తారతమ్యజ్ఞానము లేదు. ఎంతసుఖపెట్టినను ఒకటియే. దరిద్రము మొదలగు కారణముల వలన ఎంతకష్టపెట్టినను ఒకటియే. ముసలితనము వచ్చునట్టి కాలమునందు తప్పక ముసలితనమును జెందియే తీరును. సుఖమును అనుభవించుచున్నాము గదా యని తలంచుచుండిన కాలమువచ్చెనేని పిమ్మట ఒకక్షణమైనను ఆసుఖము నిలువదు. ఇట్లే మరణకాలమురాగానే అవశ్యముగ మృతిని జెందును. ఒకదినమైనను నిలువదు. కావున దీనికి కొంచెమైననువిశ్వాసములేదు. ఓ విశ్వామిత్ర మహామునీ! మెరుపులు, శరత్కాల మేఘములు, మాయాకల్పితములగు పట్టణములు, అనువానిని ఎవ్వడు సత్యములుగా దలంచునో

వాడే ఈ దేహమును సత్యముగా దలంపవలయును. *

—* బాల్యస్వరూపము. *—

ఓ విశ్వామిత్రమహామునీ! ఇది యంతయునుగాక అతి చంచలమగు ఆకారముగలదియు బహువిధ కార్యములనే అలలచేత నిండినదియునగు నీసంసార సముద్రమునందు జన్మించినది మొదలు అన్నియు కష్టములే. అందు బాల్యము సుఖకరమని కొందరు తలంతురుగాని అది మహాకష్టము. ఏలయనిన శక్తిలేకయుండుట సమస్తవిధములగు వ్యాధులు తనివిజెందని ఆశ మాటలాడలేకపోవుట ఏవిషయమును తెలిసికొనలేక పోవుట చేతికిచిక్కిన దానిని మఱియొకనికి ఇయ్యకూడదని లోభత్వము చపలత్వము దైన్యము అనునవియన్నియు బాల్యమునందే సంస్థాపింప బడియున్నవి. ఇకను అదిసుఖమును గలిగించుటయెట్లు? ఓ తండ్రీ! విశ్వామిత్రా! మనస్సనునదియే స్వభావముగా చపలము. బాల్యావస్థయు మిగుల చంచలమైనది. ఈ రెంటికిని సంయోగము కలిగినప్పుడు చాపల్యము ఎప్పటికి ముగియును. ఓబ్రాహ్మణోత్తమా! విశ్వామిత్రా! స్త్రీలనేత్రములును మెఱపులును అగ్నిజ్వాలలును సముద్రపు అలలును, అనునవి యన్నియును అతిచంచలములని లోకమున ప్రసిద్ధికదా. అవికూడా బాలునిచిత్తమునుండియే చపలస్వభావమును నేర్చుకొనినవి అనవలయును. ఈ బాలుడును కుక్కవలె నతిస్వల్పమునకే తృప్తిజెంది స్వాధీనుడగును. అత్యల్పమునకే కోపమును జెందును. "ఇదిపరిశుద్ధము. ఇది అపరిశుద్ధము" అనువిచారములేక ఏవస్తువుదొరకినను సంతోషించును. మఱియు ఏవస్తువును చూచినను సంతసించుచూ దాని గుణదోషములను విచారింపక బాలుడు మూర్ఖుడై అన్నిటిని దినగోరును. ఆకాశమునుండి చంద్రుని క్రిందికి గొనిరాగోరును. ఇట్టి మూర్ఖతగల బాల్యము ఎట్లు సుఖకరమగును. ఇదియునుగాక బాల్యమునందు గురువునకు భయపడవలయును. తల్లిదండ్రులకు భయపడవలయును. మఱియుసర్వజనులకు భయపడవలయును. తనకంటె పెద్దలగు బాలురకుకూడా భయపడ వలయును. కావున బాల్యము భయమునకు నివాసము. కాబట్టి ఓవిశ్వామిత్రమహామునీ! ఈ బాల్యమునందు మనస్సు బహువిధములగు దోషములచేత చెడగొట్టబడును. అజ్ఞానమను పురుషుడు నిరాటంకముగా విజృంభించి క్రీడించును. ఇట్టి బాల్యావస్థ ఏపురుషునకు ఆనందము గలిగింపగలదు? సర్వదోషములను విజృంభించి మనస్సు జెడుటయు, అజ్ఞానము అభివృద్ధియగుటయు, ఎప్పటికిని ఆనందకరములు కానేరవుకదా.

—* యౌవన దూషణము. *—

ఓ విశ్వామిత్రమహామునీ! ఇట్టి బాల్యావస్థను గడపినపిమ్మట పురుషుడు దోషములచేత జెరుపబడిన మనస్సుగలవాడయ్యే అతిత్వరతో యౌవనావస్థను బొందును, అదియును అధోగతికి హేతువే. ఆయౌవనావస్థయందు బహువిధ వికారముల గలిగించునదియును ఇంతవరకు హృద గుహను గుహాయందే దాగియున్నదియును నగు కామపిశాచము బయలువెడలి బలాత్కారముగా నా పురుషుని లోబరచుకొనును. మఱియు వర్షాకాలము నందలి నదివలె నాయవస్థయందు బుద్ధి ఎంత విశాలమైనది యైనను ఎంత నిర్మలమైనదియైనను ఎంత ధర్మవతియైన దైనను కామ పిశాచముచేత ఆక్రమింపబడినదై కాలుష్యమును జెందును. ఆ యౌవనావస్థయందు మనస్సులను లేళ్లు శరీరమను ఎండమావులయందు దోచిన యౌవనమను నీటినిజూచి సత్యమని పరువులిడుచూ విషయములను గోతులయందుబడి సవరించుకొన నేరవు. కావున నిది మనస్సునకు గొప్పబంధము. ఇది యంతయును గాక నా యౌవనమే ఏసమయములయందు అత్యంతాభివృద్ధి జెందునో అప్పుడు కామజ్వరముగూడా తటస్థమగును. దానిచేత నాశమేగాని మఱి యెట్టి ప్రయోజనమును లేదుగదా. కావున నో మహాత్మా! విశ్వామిత్రా! ఏపురుషులు మహాదుఃఖకరమగు నీయౌవనమును సుఖముగా నతిక్రమింతురో అనగా కామపిశాచమునకు లోబడక దుష్కార్యములను ఆచరింపక యౌవనావస్థను గడపుదురో అట్టివారే నమస్కార యోగ్యులు. అట్టివారే మహాత్ములు. ఇంతేల? పురుషులని చెప్పినట్లైన వారినే చెప్పవలయును. వినయము గలిగినదియును, సత్పురుషులచేత గొనియాడబడునదియును దయతో గూడినదియును, దాక్షిణ్యాది గుణములుగలిగి ప్రకాశించునట్టియును, నగు యౌవనావస్థ " ఆకాశమునందుండు ఉద్యానమువలె ఈ లోకమునందెందును దొరకదు. యౌవనావస్థ గలవానికి ఇట్టి గుణములు ఉండుటయే అసంభవము. కావున నీయవస్థ సుఖకారి ఎట్లగును."

—* స్త్రీ దూ ష ణ ము. *—

ఓ మహాత్మా! విశ్వామిత్రా! మఱియు యంత్ర సామర్థ్యము వలన ఇటునటు తిరుగగల ఎముకలయొక్క పంజరమునందు అమర్పబడి నరముల కట్లతో గూడియున్న మాంసపుబొమ్మయగు స్త్రీవలన ఏమి సుఖము గలుగును. చర్మము మాంసము రక్తము వేడితో కూడిననీరు ( ఇవియన్నియు బ్రతికిన వారికి లక్షణములు) అను వానిని బుద్ధిచేవిభాగించి చూడుము. అప్పుడు

కమలములు మీనములు మొదలగు వానితో బోల్పబడు ముఖము నేత్రములు మనోహరములగునేమో విచారింపుము. నిరర్థకముగా మోహమును జెందనేటికి? మఱియు "మేరుపర్వత శిఖరమున గంగాప్రవాహము ప్రవహించినట్లున్నది." అని ముత్యాలహారముతో గూడిన స్త్రీ స్తనములకు పోలిక జెప్పుచున్నారు అట్టి ఆ స్తనములే సమయము వచ్చినప్పుడు శ్మశానములయందుండును. ఇతరములగు బయళ్ళయందుగూడా యుండును. ఊరక యుండుటయే కాదు. చిన్నవియగు అన్నపు ముద్దలవలె కుక్కలచే భక్షింపబడుచుగూడా నుండును. ఈ స్త్రీలు సొగసుగ వెండ్రుకలను అలంకరించుకొని కంఠ్ఠమునకు కాటికను ధరించి ఇతర భూషణములనుగూడా దాల్చి చూచుటకు ఇంపుగానుందురు. స్పృశించుటకు నలవికారు. ఇట్లుండుటచే పాపమనియెడు అగ్నికి జ్వాలలై కాముకుని తృణమువలె గాల్చి వేయుదురు. నరకములను అగ్నిహోత్రములు ఎంతదూరమునందున్నను తాపమును గలిగించుచూ మిగుల ప్రజ్వలించుచుండును. ఆయగ్నులకు ఈ స్త్రీలే కట్టెలు. అనగా కట్టెలు అగ్ని అభివృద్ధియగుటకు హేతువులైనట్లు ఈ స్త్రీలే నరకాగ్ని అభివృద్ధియగుటకు హేతువులు. వీరు నవరస పరిపూర్ణులవలె గానవచ్చుచున్నను రసహీనులే యైయున్నారు. స్త్రీలనగా మన్మథుడను బోయవానిచే మనుష్యులను పక్షులను పట్టుటకై యొడ్డబడిన వలలే. అజ్ఞానులగు పురుషులు ఈవలలయందుజిక్కి మిక్కిలి బాధ నొందుదురు. ఈ పురుషులు జన్మమనెడు చిన్నసరస్సునందు మనస్సనెడు బురదలో చేపలవలె తిరుగుచున్నారు. స్త్రీయనునది దుర్వాసన ( కామము ) అనెడు త్రాటికి గట్టబడిన గాలమై యున్నది. మఱియును ఈ స్త్రీ సమస్త దోషములకును సంపుటము వంటిది. దుఃఖమయమగు సంకెళ్ళ స్వరూపముగాగలది, అనగా దుఃఖము సంకెళ్ళయట్లు పురుషుని బాధించుచున్నది. ఆదుఃఖముగూడా మూడుపాళ్లు స్త్రీవలననే కలుగును. ఇట్టి స్త్రీతో నాకు సంబంధము అక్కఱలేదు. మఱియు నో బ్రాహ్మణోత్తమా! విశ్వామిత్రా! ఈ స్త్రీ ఇదిగో మాంసము క్షీణించినది. ఇదిగో రక్తము క్షీణించినది. ఇదిగో ఎముకలు బయలుపడినవి. అనిచెప్ప బడుచూ అత్యల్పకాలములోనే చెడిపోవును. నశించును.

ఓ విశ్వామిత్రమహాముని!! శ్లో॥ యస్యస్త్రీతస్యభోగేచ్ఛా నిస్త్రీకస్యక్వభోగభూః । స్త్రీయంత్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీభవేత్ ॥ ఎవనికి స్త్రీయుండునో వానికి భోగములందు ఇచ్ఛయుండును. స్త్రీలేకున్న భోగస్థానమగు పదార్థమే లేదుగదా. అప్పుడు ఇచ్ఛయున్నను ప్రయోజన

ము లేదు. కావున ఏమహానుభావుడు మనఃపూర్వకముగా స్త్రీయందలి అభిమానమును విడచునో అట్టివాడు ప్రపంచమును విడచినవాడే. ప్రపంచమునువిడచినయెడల అనగా మనస్సునందు ప్రపంచమునందలి అభిమానమును వదలినయెడల సుఖము గలుగుటలో సంశయములేదు. కావున నోవిశ్వామిత్రమహామునీ! సుఖము వచ్చినప్పుడుమాత్రము సంతోషమును గలిగించునట్లుండును. తత్క్షణమే మనస్సును లోబరుచుకొని అతిక్రమింప నశక్యములై ఎంతకష్టమని తోచినను విడుచుటకు వీలులేనివై తుమ్మెద రేకలవలె నతిచంచలములైయున్న ఈ భోగములయందు నాకు తృప్తిలేదు. అనగా నీ భోగములు నాకు సంతోషకరములు కానేరవు. కావున నేను సన్యాసాశ్రమమును అంగీకరించియైనను లేకయైనను చిత్తశాంతిని పొందెదను. సర్వమును పరిత్యజించి మోక్షమునకై ప్రయత్నించెదను.

—* జరాదూషణము. *—

ఓ విశ్వామిత్రమహామునీ! బాల్యావస్థ ముగిసియు ముగియకమునుపే యౌవనము దానినణచివేయును. అట్లే యౌవనావస్థకూడా ముగిసీ ముగియకమునుపే ముసలితనము దానిని మ్రింగివేయును. ఈ యవస్థలలో పరస్పరముగల కఠినభావమును చూడుడు. కట్టెలు మొదలగువానితో కొట్టకయే బాధపరచునట్టి ఈముసలితనము మనుష్యుని ఆక్రమించేనేని అప్పుడు సవతిచేకొట్టబడిన స్త్రీవలె వానిబుద్ధి పరుగిడిపోవును. భృత్యులును పుత్రులును తుదకు భార్యలును బంధుమిత్రులందరును ముసలితనముచే వణకువానిజూచి నవ్వుదురు. మఱియు ముసలి తనమునందు చూచుటకు సహితము ఇంపుగాకయున్నను గుణములుగాని శక్తిగాని లేక మిక్కిలి హీనుడై యున్నను ఆపురుషుని ముదిచెట్టును గద్ద ఆశ్రయించినట్లు ఆశ ఆశ్రయించును. దీనత్వము నిచ్చునదియు, క్రోధాదిదోషములే స్వరూపముగా గలదియు, అంతకంతకును అభివృద్ధియగు స్వభావముగలదియు, మనస్సునకు తాపము గలిగించునదియు, మఱియు సమస్త ఆపదలకును మిత్రురాలైనదియు, అనగా ఆపదల నన్నిటిని గలిగించునదియు, నగు ఆశ ముసలితనమున మఱింత అభివృద్ధియగును. "పరలోకమునందు నాకు ఎట్టి కష్టము రాబోవుచున్నదో దానికి నేను ఇప్పుడు ఏమిచేయగలను. ఏధర్మమును ఆచరించి చేసిన నా పాపమును పోగొట్టుకొందును" అనుభయము ఒకటి ముసలితనమున మిక్కిలి పెద్దదియగును. మఱియు ముసలితనమునందు ఆశమాత్రము అధికమగును. శక్తిహీనతచేత అనుభవించుటకు అనగా ఇష్టమైన పదార్థ

మును భుజించుటకుగాని మఱి ఏవిధముగానైనను అనుభవించుటకు గాని శక్యముకాదు. మనస్సునందు తాపము ఈ కారణముచేత అధికమగును. మఱియు సర్వశక్తుడగు యమధర్మరాజు ముదిమిచే బూడిద వర్ణముగల శిరస్సునుజూచి పండిన బూడిద గుమ్మడికాయయని తలంచునేమో యనునట్లు శీఘ్రకాలమున మ్రింగివేయును. మరణమను రాజు రాబోవుచుండ ఆతనికిముందుగా మనోవ్యాధులు శరీరవ్యాధులు అను సైనికులతో గూడిన గొప్పసైన్యము నడచును. దానికి ముందుగా ముదిమియను చామరములు నడచుచుండును. అనగా మొదట ముదిమియు పిమ్మట రోగములు తరువాత మరణమును గలుగును. మఱియు ముదిమియను గారచే బూయబడి మిక్కిలి తెల్లగా నొనర్పబడిన శరీరమను మేడయందు శక్తిహీనత, బాధ, ఆపద, అను స్త్రీలు, ముగ్గురును సుఖముగా నివసించుచుందురు.

ఓ తండ్రీ! విశ్వామిత్రా! ముసలితనమును జెందినను జీవమునందలి అభిలాషను విడువనేరడు. ఇట్టి దురభిమానముచేత నీకు ( మనుష్యులకు ) ఏమి ప్రయోజనము. ఇంక నీతప్పేమియు ( పురుషునితప్పేమియు )లేదు. ఆముసలితనముయొక్క స్వభావమే అట్టిది. అది ఆశలన్నిటిని పెంచును. అనగా ఇతర అవస్థలయందుండు ఆశలకంటెను అధికమగు ఆశను ముఖ్యముగ బ్రతుకవలయునను ఆశను మిక్కిలి అభివృద్ధిసేయును.

—* కాలస్వరూపము. *—

ఓ విశ్వామిత్రమహాముని! ఇంతమాత్రమే కాదు. పురుషులకు సంసారమునందు ఏపదార్థమునందైనను సుఖభావన అనగా “ ఇదిసుఖకరము ” అనుతలంపు కలిగియుండెనేని “ ఎలుక దారమును కొరికివేయునట్లు ” యమధర్మరాజు దానినిగూడా కాలానుసారముగా ధ్వంసముచేయును. అనగా సంసారమునందు ఒకపదార్థమైనను సత్యమైనది లేదు. బడబాగ్ని సముద్రమును బీల్చివేయునట్లు కాలము సర్వపదార్థములను నశింపజేయును. దానికి గోచరముగానిది ఒక్కటైనను ప్రపంచమున లేదు. సమస్త ప్రపంచమును నిశ్శేషముగా మ్రింగివేయునట్టియు సర్వమయుడైనట్టియు నా కాలము ఎంత గొప్పవారికొఱకైనను కొంచెము సేపైన కాచియుండదు. కొంచెముసేపైనను నిదానింపదు. ఎంతమనోహరులైనను ఎంతశుభకార్యముల నాచరించువారైనను మేరుపర్వతమువలె నెంతపెద్దవారైనను లేక నెంతపెద్ద పదార్థములైనను గరుత్మంతునిచేత సర్పములు మ్రింగివేయబడి జీర్ణము చేసి కొనబడునట్లు కాలముచే మ్రింగివేయబడును. మఱియును ఈ కాలముతనకడుపు

తాను మింగుచుకొను స్వభావము కలది. గడ్డిపోచయైనను దుమ్మైనను దేవేంద్రుడైనను అక్కైనను సముద్రమైనను అనగా చిన్నపదార్థములైనను పెద్ద పదార్థములైనను గౌరవనీయులైనను అల్పులైనను అందరను తనయధీనముగా చేసికొనదలంచుచున్నది. జీవులను దోమలతోగూడి ఎప్పుడును ఘుమఘుమ ధ్వనులతో క్రిందబడు స్వభావముగల బ్రహ్మాండములను మేడిపండ్లకు నీకాలమే గొప్ప మేడిచెట్టై యున్నది. అనగా ఈకాలమునుండియే అనేక జీవరాసులతోగూడిన బ్రహ్మాండములు పుట్టుచూ నశించుచూ నున్నవి. అని భావము. ఈ కాలపురుషుడు పగలనియెడు రెప్పపాటుగల సూర్యుడను నేత్రముతో ప్రపంచమను జీర్ణారణ్యమును బాగుగా వెదకిచూచి అందు పరిపక్వములైయున్న లోకపాలకులను ఫలములను దినుచుండును. అనగా నాఇంద్రాది లోకపాలకులుకూడా కాలమునకు వశగతులు కావలసినదియె. ఈ కాలము ప్రపంచమనెడు పాత ఇంటియందు ఉన్నగుణవంతులను రత్నములను క్రమక్రమముగా దొంగలించి మిక్కిలి భయంకరమగు అనగా లోతగు రంధ్రముగల మృత్యువను బరిణయందు పెట్టుకొని అపహరించును. జనులను రత్నములచేతను సద్గుణములను దారములచేతను కూర్పబడిన ప్రపంచమను రత్నహారమును ఈకాలపురుషుడు తనకు అలంకారముగా నుండుటకయ్యేమో అనునట్లు కొంతకాలము మాత్రము హానియేమియు లేకుండధరించి పిమ్మట త్రెంచివైచును. మఱియు దీనములైనట్టియు జ్ఞాన శూన్యములైనట్టియు స్వయముగనే శిథిలములైనట్టియు జీవులను మృగములను వేటాడుచూ ప్రపంచమను అరణ్యమున సంచరించి అలసిన ఈ కాలపురుషునకు ప్రళయకాల మహాసముద్రము జలక్రీడా యోగ్యమగు సరస్సు అగుచున్నది. ఆసముద్రమునందు ఒకచోట ప్రకాశించునట్టి బడబాగ్నియే సరస్సు, యందున్న తామరపలె నాతనికి ఆనందమును గలిగించుచున్నది. కారపు చేదు పులుపు అను రుచులుగల బహువిధములగు జంతుమాంసములే వ్యంజనములుగాను (అనుపానములుగాను) నెయ్యి పాలు పెరుగు సముద్రములు నెయ్యి పాలు పెరుగు అను వానియొక్క పాత్రలుగాను ప్రపంచమనునది చలిది అన్నముగాను కాలపురుషుడను రాజకొమారునికి ప్రాతఃకాల భోజనము జరుగుచుండును.

—* చండీ స్వరూపము. *—

ఓ విశ్వామిత్ర మహామునీ! మఱియు నారాజకుమారునకు చండీ అను భార్యకలదు. అది సకల సోదరులతో గూడినదై పులివలె భూతము

లను నాశముచేయుచూ సంసారమను అరణ్యమున స్థిరముగా నిలచియు
న్నది. మిక్కిలి చమత్కారముగా సంచరించుచున్నది. అట్టి భార్యతోగూ
డిన యా కాలపురుషునకు విశాలమగు నీభూమియే త్రాగుటకు పాత్రము.
సర్వజనములును అందలినీరు. లేక మద్యము. ఆనీటిని సువాసన గలదానిని
గా చేయుటకై కమలములయొక్కయు కలువలయొక్కయు సమూహములు
ఆపాత్రమునందు పడవేయబడియున్నది. ప్రస్తుతము మనము సరస్సులయం
దు అంతటను జూచు కమలములన్నియు నవియే. భూమియంతయు పాన
పాత్రమైన నందలి కమలములన్నియు పానపాత్రమునందు వేయబడిన కమ
లములే యగునుకదా. మఱియు భార్యాసహితుడగు నా కాలపురుషునకు
విశేషముగ సింహనాదము చేయు నట్టియు భయంకరముగ భుజాస్ఫాలన
మును జేయునట్టియు అనగా సర్వలోకభయంకరుడై నట్టియు కేసరములతో
నిండిన భుజములుగలిగినట్టియును ఆ నృసింహుడు పంజరములోని యాట
పక్షి అనగా ఆ నృసింహుని ఘోరత్వమునకంటే ఈ కాలునియందు వేయి
మడుగులు అధికమగు ఘోరత్వముకలదు. సొరకాయలచే జేయబడిన వీణె
నుధరించి మనోహరముగా గానము జేయునట్టియు శరత్కాలను నందలి
ఆకాశమువలె పరిశుద్ధమగు కాంతిగలిగినట్టియు రుద్రకింకరుడగు నా మహా
కాళదేవుడుకూడా నీకాలపురుషునకు క్రీడార్థమై పెంపబడు కోకిలవంటివా
డే. మఱియును ఆకాలపురుషుని హస్తమునందు అతివిశాలమగు ఆకారము
గల యొకధనస్సు కలదు. దానికి అభావమనియే పేరు. దానినుండి దుఃఖ
మను బాణములు అపరిమితముగ వర్షింప బడుచుండును.

—* కాళరాత్రిస్వరూపము. *—

ఓ విశ్వామిత్ర మహాముని! మఱియు చండీసహితుడగు నీకాలుడే
స్వయముగా కాళరాత్రి స్వరూపుడై నృత్యము జేయుచుండును. మానస్సంక
ల్పముచేతనే ఈ కాళరాత్రి స్వరూపమును ధరించును. ఆరూపమును దా
ల్చినప్పుడు దేవలోకము మొదలగు సమస్త లోకములును భూషణములై
యుండును. ఈ కాళరాత్రికి పాతాళమే పాదము. అందు నరకముల సమూ
హమే అందెలు. ఆ అందెలు పాపములను దారములయందు గ్రుచ్చబడి
యున్నవి. ఘల్లుఘల్లుమని ధ్వనించుచున్నవి. ఆకాళరాత్రికి ఒకచెవియందు
తెల్లనగు హిమవత్పర్వతమే యెముకచే జేయబడిన పోడవగు జంపుగాను
న్నది. రెండవ చెవియందు సువర్ణమయమగు మేరుపర్వతము బంగారు
కమ్మగానున్నది. మఱియును ఆకాళరాత్రికి గండస్థలములపై వ్రేలునట్టియుండ

లములు సూర్యచంద్రులు. మొలచుట్టునుండు వడ్డ్యాణము లోకాలోక పర్వతము ( ఈపర్వతము భూమిచుట్టూ నున్నది ). ఇట్టి యాకారము గలదై యాశక్తి అతిఘోరముగ నృత్యముజేయును. ఆసమయమున కుమారస్వామి యొక్క నెమళ్లు అనేకములు మృతిజెందినవి. ఆ దేవికి వెనుక భాగమున వ్రేలుచుండును. కేవలము రంధ్రములుగా మాత్రమే యున్న అనగా మృతిజెందుటచేత గ్రుడ్డులొలగిపోయి కేవలము రంధ్రముగా మాత్రమే నిలచియున్న మూడుకన్నులతోను జడలయందు చంద్రునితోనుగూడి శివునియొక్క శిరస్సులు అనేకములు ఇటునటు నెగురుచూ వ్రేలుచుండును. అప్పుడు ఆశిరములయందలి నేత్రరంధ్రములగుండా గాలిప్రవేశించి ఝూంకారము చేయుచుండును. ఈ శివశిరస్సులను ఆదేవి మాలికలుగా ధరించి యుండును. మఱియు మందారపుష్పములు ఇటునటు నెగయుచూ క్రిందబడుచుండ పార్వతీదేవియొక్క తలవెంట్రుకలే యాదేవిచేత చామరములుగా వీవంబడుచుండును. ఆడునట్టివారు చామరములు చేతధరించి యాడుటయు కలదు కదా. కావున నీమెచే పార్వతులు అనేకులు నశింపజేయబడి యుండుటచేత వారి తలవెంట్రుకలు చామరములుగా ధరింపబడినవి. ఇట్లే భైరవదేవతలు అనేకులుకూడా నశింపజేయబడి యుండుటచేత వారియొక్కకడుపులు సొరకాయ బుర్రలుజేసి వాయించుచూ ఆ నృత్యసమయమున పాట పాడుచుండును. మఱియు ఇంద్రులు అనేకులుగూడా నిట్లే నశించి యుండుటచేత అనేక రంధ్రములు గలవారి శరీరములను ముఖ్యముగ శిరస్సులను భిక్షాపాత్రములనుగాను ఉపయోగించును. మఱియు వారియెముకలను మంచపుకోడులుగా ( ఇది కాళరాత్రికి ఆయుధము ) ఉపయోగించుకొనును. ఇట్టి వికృతాకారముతో భూమ్యాకాశములు నిండి అతి భయంకరముగా నృత్యము సేయుచుండును. అప్పుడు ఈ నెమళ్ళు మొదలగునవి అన్నియును ఆకాశమును అంటుచూ నెగయుచుండును. ఈ నృత్యము ఒకప్పుడు తనకే భయంకరమైనకూడా నుండుట కలదు. ఇకను ఇతరులు భయపడుదురనిన ఆశ్చర్యమేమి. ఆమె సకలప్రపంచములను సంహరించునదికదా. ఇదియును గాక నృత్యముజేయునప్పుడెల్లను ఆమె శిరస్సునకు ప్రపంచములను కమలములతో గూర్పబడిన మనోహరమగు పుష్పమాలిక చుట్టబడుచుండును. ఈ విధముగ మహాప్రళయ సమయములయందు ఆదేవి ప్రకాశించుచుండును. ఆమెకు ప్రళయసమయములే నృత్యకాలములు.

ఓ విశ్వామిత్రమహామునీ! కాలము, చండి, కాళరాత్రి, అనువారి

స్వభావము ఇట్లుసర్వమును ధ్వంసముచేయుటయే మైయుండగా కొంచెము విమర్శింపగల నాయట్టివారికి ఈ సంసారమున ఆశ కలుగుటయెట్లు. వాస్తవస్థితిలో దీనిని విచారించిన నిందు సారభూతమగునది ఏదియులేదు. సర్వవిషయములను గ్రహించుటకు సాధనములై అత్యంతోప యోగకారులైయున్న ఇంద్రియములు బాగుగ విచారించిన మనస్సునకు సమ్మోహమును గలిగించునవి అగుటచేత శత్రువులే యగును. సత్యము అని తలంపబడు పదార్థమంతయును బాగుగా విచారించిన అసత్యమేయగును. సర్వసంకల్పములను జేయుచు ఆనందకరమని తలంపబడుచుండు మనస్సే ఆత్మను బాధించును. అది అసత్యములగు వస్తువులయందు ఆత్మకు లేని అభిమానమును గల్పించునుగదా. కావున దానికంటే ప్రబల శత్రువులులేదు.

మఱియు సంసారియగువాడు మనస్సును జయింపలేక పోవుటచేత తన్నుతానే బాధించుకొనుచున్నాడు. మఱియు యథార్థవస్తువు ( బ్రహ్మము ) స్వస్వరూపముతో దెలియబడక శూన్య స్వరూపమని తలంప బడుచున్నది. మనస్సు అహంకారమునకు స్వాధీనము చేయబడియున్నది. భావపదార్థములగు ఘటపటాది పదార్థములు అభావముచేత తిరస్కరింప బడియున్నవి. అనగా ప్రతిభావపదార్థమునకును నాశమున్నది అని తలంపబడుచున్నది. వాస్తవస్థితిలో భావమునకు నాశమేలేదు కదా. మఱియును ఆ భావపదార్థములైనను లెక్కకుమిక్కిలిగానున్నట్లు గానవచ్చుచున్నవి. ఇన్నిభావములు ఉండుటకు వీలులేదుగదా. ఇదియునుగాక ఈ సంసారమునందు మనస్సు ఎప్పటికిని శాంతినొందదు. కామమను రోగము మిగుల అభివృద్ధియగుచుండుటచేత మనస్సు సర్వకాలములయందును పరితపించుచునే యుండును. వైరాగ్యమంతయు ఒక్కడైనను ఇందు కానరాదు. వైరాగ్యములేనిది సుఖములేదు. సుఖమని భావింపబడుచున్న యౌవనము అతిప్రయత్నముతో తొలగిపోవును. సత్పురుష సమాగమమును సుగుణమును సామాన్యముగా నెక్కడనుండదు. ఎటుజూడబోయినను సుఖమునకు మార్గము దొరుకదు. ఏపదార్థమునందు జూడబోయినను సత్యత్వములేదు. మనస్సు సర్వకాలములయందును లోలోపల కృశించుచూ సమ్మోహమును జెందుచున్నట్లు కలవరపడి యుండును. సంతోషమనునది సమీపమునకే రాదు. గుణములలో నుత్తమమని వర్ణింపబడు దయ ఎప్పటికిని గలుగదు. ఇట్లుండుటచేతనే సంసారియగు ప్రతివానికి నీచత్వము అవశ్యము వచ్చును. ఇది యంతయు గాక సంసారి యగువానికి ఎంతధైర్యమున్నను అది క్రమక్రమముగా నశించి

తుదకు అస్థైర్యము వచ్చును. వానికి ఎప్పుడు జూచినను క్రిందికి పడుటయు పైకి లేచుటయును అనునవియే సహజధర్మములై యున్నవి. దుర్జనులతో స్నేహము కావలయుననిన శీఘ్రముగ దొరకును. సజ్జనస్నేహము అట్లు దొరకదు. మనము సత్యములని భావించు సర్వపదార్థములును వచ్చుచూ బోవుచుండు నవియే గాని, స్థిరముగ నిలుచునవిగావు. ఈసంసారమునకును ఆత్మకును వాస్తవస్థితిలో సంబంధము బొత్తిగా లేదు. అయినను మనస్సు ఆ సంబంధమును కల్పించుచున్నది. ఇదియంతయునుగాక ప్రతి దినము నందును సుషుప్త్యవస్థయందు ఈ భూతములన్నియు నెటకో గొనిపోబడుచున్నవి. సకలలోకములను ధ్వంసముచేయగల రాక్షసులు సహితము నాశమగుదురు. శాశ్వతుడనబడు ధ్రువుడును బాగుగ విచారించిన నాశము గలవాడే యగును. ఇంతయేల? అమృతపానమువలన మరణమును నశింప జేసికొనిరని చెప్పబడు దేవతలు సహితము కాలము వచ్చినప్పుడు నశింతురు. ఈ విధముగా సంసారము మిగుల నసత్యమైయుండగ మాబోటివారల విషయములో ఏమినమ్మకము. స్వరూపములేక కేవలము వ్యవహారమునందు మాత్రమే వాడబడుచున్న దిక్కులు సహితము నాశము నొందును. నేలలు నీరగును. నీరు నేలయగును. పర్వతములు సహితము విరిగిపోవును. ఇట్లుండ సామాన్యులమగు మాబోటివారిపై ఏమినమ్మకము. మఱియు సత్తాస్వరూపముచేత అనగా ప్రపంచమునకు అధిష్ఠానమగు పరబ్రహ్మముచేత ఆకాశము మ్రింగబడుచున్నది. సమస్తలోకములును లీనముచేయ బడుచున్నవి. భూమియు ధ్వంసమును జెందును. ఇట్లుండగ మాబోటివారిపై ఏమి నమ్మకము. సముద్రములుకూడా ఎండిపోవును. నక్షత్రములుకూడా రాలును. అణిమాది సిద్ధులుగల మహాత్ములుగూడా నశింతురు. ఇట్లుండగ మాబోటి సామాన్యులపై ఏటినమ్మకము. అత్యుత్తమమగు స్థానమునందున్నను ఆ బ్రహ్మదేవుడుకూడా నశించుచునే యున్నాడు. ఉత్పత్తిలేనివాడైనను ఆ విష్ణువు కూడా నశింప జేయ బడుచున్నాడు. ఎప్పుడునుండువాడు. అను నర్థముగల భవనామముచే వ్యవహరింపబడు ఈశ్వరుడు సహితము నాశమును జెందుచున్నాడు. ఇట్లుండగ మాబోటివారియందు ఏమినమ్మకము. సర్వజనులను ధ్వంసము చేయునట్టి కాలముసహితము మఱియొక పదార్థముచేత (బ్రహ్మముచేత ) ధ్వంసము చేయబడుచున్నది. సర్వజనులను నడపువిధియు ( పూర్వజన్మకర్మమును ) మఱియొక పదార్థముచేత నడపబడుచున్నది. లేకనశింప జేయబడుచున్నది. " అంతములేనిది " అని ప్రసిద్ధిజెందిన ఆకాశము సహి

తము లయించుచున్నది. ఇట్లుండగ మాబోటివారియందు ఏమి నమ్మకము. కావున బాగుగా విచారించినచో వినుటకుగాని చెప్పుటకుగాని చూచుటకు గాని వీలులేనట్టియు జ్ఞానరూపుడైనట్టియును ఒకానొక మాయావంతుని చేత ఈప్రపంచము కపటముచే జూపబడుచున్నది. అనియే తలంప బడ వలసి యున్నదిగాని ఇందు వాస్తవమగు పదార్థము ఒకటొకటియైన నున్నదని తలంచుటకు వీలులేకున్నది.

ఓమహాత్మా! విశ్వామిత్రా! ఈ విషయము నెఱుంగలేక అజ్ఞాను లగు జనులు " ఈ దినము ఉత్సవము. ఇది వసంతఋతువు. నేడు తీర్థయాత్ర. వారు బంధువులు. ఇది సుఖము. ఇది అధికమగు భోగము " అనినిరర్థకముగా అసత్యము లగువానినెల్ల సత్యములుగా దలంచుచూ అతి చంచల మగు బుద్ధి కలిగి క్రమక్రమముగా ధ్వంసమగుదురు. పగలెల్లనూ ఊరక ఇటు అటు విహరించి సత్పురుషులతో సమాగమము ఇంచుకయైనను లేక యున్నవారికి " నేడు పగలు నిరర్థకముగా గడచిపోయెనే, తత్వమును, తెలిసికొనుటకు ఇంచుకయైనను ప్రయత్నింపక పోతిమే " అను చింత కొంచెమైనను లేక, రాత్రులుయందునిదుర ఎట్లుపట్టునో తెలియకయున్నది.

ఓ తండ్రీ! విశ్వామిత్రా! పుత్రులు భార్యలు ధనముమొదలగు సర్వ పదార్థములును బుద్ధిచేత మొట్టమొదట అమృత సమానములుగా కల్పింప బడును. తుదకు నవియే విషమువలన గలిగిన మూర్ఛవలె దుఃఖమును కలి గించునవియే యగుచున్నవి. విషమువలన గలిగిన మూర్ఛ మొట్టమొదట మనస్సునకు మాంద్యము గలిగించుటచేత నిదురవలె కొంత సుఖమును గలి గించునట్లున్నను కట్టకడకు మరణమును గలిగించునదియే యగుటచేత వాస్త వస్థితిలో " నది దుఃఖకరమైనదియే " యని చెప్పవలసి వచ్చును గదా. అట్లే సంసారసుఖములుగూడా మొట్టమొదట కొంత ఆనందమును గలిగించు నట్లున్నను తుదకు ఇంద్రియ దౌర్బల్యమును గలిగించునవి యగుటచేత వానిని ( ఆ సంసార సుఖములను ) దుఃఖకరములనియే చెప్పవలయును. అజ్ఞానము వలన విమర్శింప లేకపోవుటయేగాని ఈ విషయము ( విషయ సుఖములు దుఃఖాత్మకములను విషయము ) సర్వజనులకును విషయ సుఖానుభవ అంత ములందు దోచుచునేయుండును. ఒకపురుషుడు మిగుల ఆ యాసముచేత నెట్లెట్లో శత్రువులనందఱ జయించి అన్నివైపులనుండియు సంపదలను రా బట్టి సుఖమును అనుభవించుటకు ఆరంభింపబోయినను అప్పటికిని ఎటనుండి యో మృత్యుదేవతవచ్చి వానిని మ్రింగి వేయును. అప్పుడు వానికి శ్రమ

యొకటియే ఫలభూతమై మిగులును. సంసారమంతయు విచారించిన ఇట్టి దియే. మఱియు " ఇదిభార్య. వీడు మిత్రుడు. " అను మొదలగు వ్యవహారములన్నియు కేవలము మాయామాత్రములు. " మనము సోదరులవలె నుండ వలయును. నీకు జయంతుడు అని పేరు పెట్టెదను. " అను మొదలగు వ్యవహారములయందువలె వివాహాదులయందు కల్పింప బడిన సంకేతముల మాత్రమే ఆధారముచేసికొని ప్రబలుచుండునవి. ఒకప్పుడు ఒకస్థలము (పురుషుని) యందును మఱియొకప్పుడు మఱియొక స్థలమునందును ఉండునవి. వీడు పూర్వమున నాకు మిత్రుడై యుండెను. ఇప్పుడు పరమ శత్రువై యున్నాడు. నాకు మొట్టమొదట ఒకభార్యయుండెను. ఇప్పుడు ఇది రెండవ భార్య. " అను మొదలగు వ్యవహారములయందు భార్యామిత్రాది సంకేతము, ఒకస్థలమునుండి మఱియొకస్థలమునకు బోవుట స్పష్టముగ తెలియ వచ్చుచున్నది గదా. కావున నీకళత్ర మిత్రాది వ్యవహారములు సంపూర్ణముగ నసత్యములే. బాగుగ విచారించిన తీర్థయాత్రలు మొదలగు స్థలముల యందు బహు దేశములవారందరు ఒకచోటచేరి మరల బోవునట్లు ఈకళత్ర మిత్రాదులును జేరుచూ బోవుచున్నారు. ఇట్లున్నను అజ్ఞానము వలన దీనినంతయును లోకులు సత్యముగ భావించుచున్నారు. ఇదియును గాక. " బ్రహ్మ చిరకాలజీవి, నేను అల్పజీవిని " అనుతలంపులుగూడా యుక్తములు గావు. వాస్తవస్థితిలో కాలము అనంతము. అట్టికాలమున వేయు మహాయుగముల ప్రమాణముగల బ్రహ్మయొక్క ఆయువుమాత్రమెంత? లెక్కపెట్టినచో నామహాకాలమునందు కల్పములుఎన్ని గలవో? మనుష్యుల ఆయువును బట్టిచూచిన యుగములును కల్పములును పెద్దవి యగునుగాన మహాకాలమును బట్టిచూచిన అట్లు కానేరవుగదా.

ఓ మహామునీ! విశ్వామిత్రా! ఎవ్వనిజూడబోయినను లోకమునందు కామమునకు లోబడి అనేక విధములగు వికారచేష్టలను ఆచరించుచునే యున్నాడు. కలలోనైనను సత్పురుషుడు దొరకుటలేదు. ఈ సమయమున చూచుటకైనను తటస్థించుటలేదు. మఱియు లోకమున జరుగుచున్న కార్యములలో దేనినిజూచినను దుఃఖముతో కూడినవేకాని సుఖకరములుకావు. ఇది నిశ్చయము. ఇట్టి ఈలోకమునందు జీవితమును ఎట్లు గడుప వలయునో తెలియకున్నది. ఓ మహాత్మా! విశ్వామిత్రా! దినాత్మకమగు కాలమునుగూర్చి ఇదివరకే చెప్పియున్నాము. మహాత్ముల స్వభావమునుగూడా అచ్చటచ్చట వర్ణించియే యున్నాము. సంపదలకుగల చాంచల్యము మొదలగు దుర్గుణ

ములనుగూడా నిరూపించియున్నాము. కార్యములను గూర్చియు అనగా చేయవలసిన దానినిగూర్చియు తోచినంతవరకు తెలియజేసి యున్నాము. వానిస్వభావములు అన్నియును నాబుద్ధికి వచ్చియున్నవి. కావున వానినంతయును విడచి బ్రహ్మవిచారమునకు బోయెదను. మోక్షమునే శరణుజొచ్చెదను. బ్రహ్మ విష్ణు మహేశ్వరులును సమస్తభూతములును బడబాగ్నియందు సముద్రజలములు ఇనికి నశించునట్లు కాలవశగతములై నశించు నవియే కాని, ఇందొకటియైనను నిత్యముకాదు.

ఓ మహామునీశ్వరా! విశ్వామిత్రా! ఆపదవచ్చినను క్షణకాలమే యుండును. సంపదవచ్చినను క్షణకాలమే యుండును. జననమరణములుకూడా నట్లే యుండును. ఇందు నిత్యమైనది ఏది? అన్నియు క్షణకములే? మఱియును ఒక్కొక్కసమయమున ఎన్నడును యుద్ధమనుమాటనే ఎఱుగనిదుర్బలునిచేతగూడ మహాశూరుడు వధింపబడును. ఒకనిచేతగూడ అనేకులు హతులగుదురు. సామాన్యులే ప్రభువులగుదురు. ప్రభువులును సామాన్యులగుదురు. ఇట్లు ప్రపంచము పలువిధములుగా త్రిప్ప బడుచుండును గాని, "ఇది ఇట్లే ఉండవలయును." అను వ్యవస్థ ఎప్పటికిని లేదు. కావున నో మహాత్మా! విశ్వామిత్రా! నా మనస్సునందు భోగములు కొంచెమైనను స్ఫురింపవు. చవుడు భూములయందు తీవ్రమగు ఎండగాయునప్పుడు గానవచ్చు ఎండమావులు సరస్సులయందు బొత్తిగా గానరానట్లు నా మనస్సునందు అవి తోచుటయే లేదు. సంసారమునందు గానవచ్చు దోషము లను దావాగ్ని నామనస్సును సంపూర్ణముగా గాల్చివేసినది. నాకు మరణమునందు ద్వేషములేదు. దానిని ఎప్పటికిని నిందింపను. జీవితమునుగూడా నిందింపను. అది దోషయుక్తమైనను దానికిని నాకును గలసంబంధము కేవలము మనోమాత్రమే యగుటచేత నా యాయుస్సునందును నాకు ద్వేషములేదు. ఇప్పుడు ఎట్లున్నానో అప్పటికిని అట్లే యుందును. సుఖము వచ్చినప్పుడు సంతోషింపను. దుఃఖమువచ్చినప్పుడు దుఃఖింపను. మఱియు నోమునిశ్రేష్ఠా! విశ్వామిత్రా! ఈ సమయముననే అనగా యౌవనారంభముననే పరిశుద్ధమగు బుద్ధితో మనస్సునకు విచారణారూపమగు చికిత్స చేయబడకున్న అనగా విచారణచేత మనస్సును నిర్మలము చేసికొనకున్న నిక మనశ్శుద్ధికి సమయము ఎప్పుడు దొరకదు. శబ్దాది విషయములే విషము కాని, సర్ప విషముకూడా విషమని చెప్పదగదు. ఈ సర్పవిషము ఒకశరీరమునే సంహరించును. శబ్దాదులన్ననో ప్రతిజన్మమునందును గల శరీరములనన్నిటిని జెరచును

గదా. ఈ విషయమును ఎఱిగిన విద్వాంసునియొక్క చిత్తమునకు సుఖదుఃఖములుగాని బంధుమిత్రులుగాని జన్మమరణములుగాని మఱి యేపదార్థములుగాని బంధహేతువులు కానేరవు.

ఓ విశ్వామిత్ర మహామునీంద్రా! ఆయుస్సు అను నది వాయువుచేత చెదరగొట్టబడిన మేఘములయందలి జలమువలె మిగుల నాశన స్వభావము గలది. సుఖదుఃఖ భోగములన్నియును మేఘముల మధ్యలోనున్న మెఱుపులవలె అతిచంచలములైనవి. యౌవన విలాసమును నదీవేగమువలె అతిశీఘ్రముగ నశించు స్వభావము గలవి. అను నీ విషయములనెల్ల బాగుగ విచారించి ఇట్టిసంసారమునందు ఆసక్తులై యుండువారి విషయమున మిగుల ఆశ్చర్యపడుచున్నాను. నామనస్సునందు నిశ్చయముగ దృఢమగు శాంతి ముద్రను వైచియున్నాను. ఇదియునుగాక ఈ బుద్ధి మగని యింటియందున్న స్త్రీవలె స్థిరముగ సర్వకాలమును ఒక విధముగనే యుండదు. యథేష్టముగ సంచరింపనైనను సంచరింపదు. జీవేశ్వరులకు స్వాధీనమై కొంతకాలము స్థిరముగాను మఱికొంతకాలము చలనముగాను ఉండును.

—* రాముడు మోహనివృత్తికి ఉపాయమడుగుట. *—

కావున నో మహాత్మా! విశ్వామిత్రా! నీచముకానిదియు శ్రమమును గలిగింపనిదియు ఆవరణమునకు సంబంధించిన భ్రాంతిలేనిదియునగు స్థానమెద్ది? ఏస్థానమును ఆశ్రయించిన సంశయము ఎప్పటికి జనింపకుండును? పండితశ్రేష్ఠా! విశ్వామిత్రా! విషయవాసనలతో ( సంకల్పములతో ) గూడియు సంసారాగ్నియందు బడియు మనుష్యుడు ఎట్టిశక్తిచేత పాదరసమువలె దహింపబడకుండునో అనగా పరితపింప కుండునో అట్టి ఉపాయమును ఉపదేశింపుడు. మఱియు నో మహాత్మా! విశ్వామిత్రా! దేని ప్రభావమువలన బాహ్యవ్యవహారము తప్ప సంసారముతో తక్కిన సంబంధము లేనియునుండక నశించిపోవునో అట్టిపదమును నాకు ఉపదేశింపుము. ఓ భగవంతుడా! విశ్వామిత్రా! మీకు తెలిసినంత వరకును నా యజ్ఞానము పోవుటకు దగిన ఉపదేశమును ఆచరింపుము. సత్పురుషులందరు నిశ్చయముగ ఏయుపదేశముచేత కృతార్థులైరో అట్టివానిని నాకు ఉపదేశింపుము? ఓమహాత్మా! విశ్వామిత్రా! నానిశ్చయమును వినుడు. నేను కోరినవిధముగ సర్వ దుఃఖములను నివారింపగల యుక్తిలేకపోయినను అది యున్నను నీ పురుషుడుగాని దాని నాకు ఉపదేశింపకున్నను ఒల్లు ఉపదేశించినను నాకు లోకోత్తరమగు చిత్తశాంతిదొరకకున్నను అప్పుడునేను సంశయములవదలి అహంకార వర్జితు

డవై యుందును. భుజింపను. జలపానము చేయను. వస్త్రములను ధరింపను. స్నానముచేయుట దానము ఆచరించుట భుజించుట మొదలగు కార్యములను ఆచరింపను. రాజకార్యములు మొదలగువానిని కంటితోనైన జూడను. సంపదలయందు సంతోషింపను. ఆపదలు వచ్చినప్పుడు దుఃఖింపను. మఱియు మరణము నొకటిదానిని తప్ప ఇతరమగు ఏపదార్థమును గోరను. సంశయములను అన్నిటిని వదలి మాత్సర్యమును " ఇది నాది " అను మమకారమును లేక చిత్రప్రతిమవలె మౌనమును ఒకటిదానినే ఆశ్రయించి యుండెదను. చంద్రునివలె మనోహరుడగు ఆ శ్రీరాముడు అత్యధికమగు వివేకముచేత వికసించిన చిత్తముగలవాడై పైన వర్ణించిన విధముగా సర్వమును వివరించిచెప్పి మేఘములయెదుట అతి మనోహరముగ షడ్జస్వరములతో గానముచేసి చేసి శ్రమచేత నూరకున్న నెమలివలెనే యూరకుండెను.

ఇట్లు శ్రీవాల్మీకి మహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠరామాయణ
మునందు వైరాగ్య ప్రకరణమున జగద్దోష ప్రకాశ
మను - రెండవసర్గ ముగిసెను.

ఇట్లు శ్రీరాముడు వివరించిన వాక్యములను వాల్మికి మహర్షి భారద్వాజునితో చెప్పి ఇట్లనియె.

ఓ భరద్వాజా! వినుము. రాజపుత్రుడును కమలములవంటి నేత్రములుగలవాడునగు ఆ శ్రీరామచంద్రుడు సంసారమోహమునంతయు ధ్వంసముచేయగల వాక్యములను ఈ విధముగ చెప్పగానే ఆ సభయందు ఉండు వారలందరును మిక్కిలి ఆశ్చర్యమును జెందిరి. ఆరామవాక్యములను వినుటకు ఉత్సాహము కలవియో యనునట్లు వారి శరీరములందలి రోమములన్నియును గగుర్పొడిచి ఉత్తరీయమును భేదించుకొని వెలుపలికి గానవచ్చుచుండెను. పిమ్మట ఆ రామచంద్రుడు తన అభిప్రాయమును అంతయు ఎఱిగించి ఊరకుండగానే సభలోనివారు " మేలు, మేలు " అని ప్రశంసించిరి. మఱియు మనోహరమగు మేల్కట్టువలె ఆకాశమునుండి సిద్ధులచేత పుష్పవృష్టికురిపింప బడెను. అరగడియ కాలమున ఆపుష్ప వృష్టి నిలచెను. అప్పుడు సభ్యులందరును ఈ క్రింద వర్ణింపబోవు సిద్ధ వాక్యములను వినిరి. మనము ఒక బ్రహ్మ కల్పమునుండి ఈ సిద్ధ సమూహముల యందు తిరుగుచున్నాము. ఎప్పుడును ఇట్టి వాక్యములను వినలేదు. నేడు మన భాగ్యము వలన చెవులకు అమృత ప్రాయములై ఇమ్మహా వాక్యములు

వినవచ్చినవి. ఈ రాను వాక్యములు చిత్త శాంతియనెడు అమృతముచే మనోహరములై యున్నవి. సర్వోత్తమమగు బ్రహ్మమును బాగుగా తెలియజేయుచున్నవి. ఇట్టివాక్యములను మిక్కిలి ఆదరపూర్వకముగా ఆమహాత్ముడు చెప్పియున్నాడు. ఈ వాక్యములచేత నిశ్చయముగ మనకు జ్ఞానోదయముకలిగినది. అని ఇట్లు సిద్ధులు చెప్పుకొనిరి. అని వాల్మీకి మహర్షి చెప్పిన భరద్వాజుడు ఇట్లనియె. ఓ మహాత్మా! వాల్మీకిమహాముని! దయచేసి ఈ విషయమును అంతయును ముగింపుము. శ్రీ రామవాక్యములకు అచ్చోటయుండిన మహాత్ములు ఏవిధముగ శ్రీరామునకు ఉపదేశించిరో దానిని సవిస్తరముగ తెలుపుము. రఘువంశమునకు మహోన్నతిని కలిగించెడి ఆ శ్రీరామచంద్రుని అభిప్రాయము ఎవరు ఎట్లు నిర్ణయించిరో వినుటకు వేడుకగా ఉన్నది. అనిన వాల్మీకి మహాముని ఇట్లనిచెప్పుటకు ప్రారంభించెను.

—* ఋషులు అనేకులు సభకు వచ్చుట. *—

ఓ భరద్వాజా! పైన వర్ణించిన విధముగా ఒకరితో నొకరు మాటలాడుకొని ఆ ఆకాశమున నిలచియున్న సిద్ధమునులంగరు మిక్కిలి వేడుకతో నారాజసభను ప్రవేశించిరి. ఈ విధముగా సిద్ధ సమూహ మంతయు ఆకాశమునుండి క్రిందికి వచ్చుచుండగ వారినిచూచి గౌరవమున దశరథ సభయంతయు లేచి నమస్కరించి గౌరవించెను. పిమ్మట వచ్చిన సిద్ధులనందరిని విశ్వామిత్ర వశిష్ఠులు పూజించిరి. వారును పూజా నమస్కార పూర్వకముగా నవ్విశ్వామిత్ర వశిష్ఠులను గౌరవించిరి. మఱియు ప్రభువగు ఆదశరథమహారాజును సిద్ధులకందఱకును పూజచేసెను. వారును కుశలప్రశ్న పూర్వకముగా ప్రభువును గౌరవించిరి. రామచంద్రుడును ఆ మునులకు నమస్కరించి శిరమువంచి అతివినయముతో నుండెను. అట్టిశ్రీరాముని బహువిధములగు ప్రశంసా వాక్యములతోను పూవులను చల్లుటతోను "ఓరామా! నీవాక్యములు మిక్కిలి క్షేమకరములైనవి" అనుమొదలగు మెప్పుల మాటలచేతను వారు గౌరవించిరి. ఓ భరద్వాజా! ఆమునుల వాక్యములను వినుము. ఆహా ఎంత ఆశ్చర్యము. ఈ రాముడు మిక్కిలి బాలుడు. ఐనను మిగుల వైరాగ్యముతో గూడిన సకలలోక హితకరమగు వాక్యములను పలికెను. ఓ మునిశ్రేష్ఠులారా! మిక్కిలి దోషయుక్తమైయుండు పూర్వ కర్మచేత కల్పింపబడిన ఈ సంసారమునందు సారభూతమగు పదార్థము ఒకటియైనను గానరాదనుట నిశ్చయమేకదా, అని యొకసిద్ధుడు తక్కిన వారితో చెప్పెను, సకలలోకమునకును ఆశ్చర్యమును గలిగించునట్టి ఈ శ్రీరామచిత్త

మునకు అభీష్టసిద్ధి కలుగకుండెనేని మనమందరము ఉండి ఏమిప్రయోజనము. మనకు తపశ్శక్తియు విచారణశక్తియు గలిగి ఏమిలాభము? నిశ్చయముగ మనబుద్ధులన్నియు వ్యర్థములే యగును. ఇది నిశ్చయము. అని మఱియొక సిద్ధుడు చెప్పెను. ఈ విధముగ గొప్ప ధ్వనితో సభయంతయు ఏకవాక్యముగ శ్రీరాముని ప్రశంసించుచుండెను. అంత నవ్విశ్వామిత్రమహాముని తన ఎదుటనున్న శ్రీరామచంద్రునిచూచి ఇట్లని ఉపదేశించుటకు ఆరంభించెను.

—* విశ్వామిత్రుడు శ్రీరామునకు ఉపదేశించుట. *—

ఓ శ్రీరామా! చెప్పవలసినవాటి నన్నిటిని నీవే చెప్పితివి. అతి సూక్ష్మబుద్ధితో తెలిసికొనవలసిన వాటినెల్ల నీవే తెలిసికొంటివి. ఇంతకంటెను అధికముగా తెలిసికొనవలసినది ఏమియును లేదు. జ్ఞాన వైరాగ్యములుగల వ్యాసమహర్షికి శుకుడను ఒకపుత్రుడుకలడు. అమ్మహాత్మునియొక్క బుద్ధియును ఇట్లే సర్వమును స్వయముగనే గ్రహించినది. శాంతినిమాత్రమే గోరుచుండెను. అట్లే నీ మనస్సుకూడా శాంతిని ఒక్కదానినే కోరుచున్నది కాని, తెలియదగిన అంశములో కొరత ఏమియు లేదు.

—* శ్రీశుకుని చరిత్రము. *—

అనిన రామచంద్రుడిట్లనియె. ఓ మునీంద్రా! విశ్వామిత్రా! ఆ శుకమహాముని సర్వమును ఎఱిగియు మొట్టమొదటను ఏల చిత్తవిశ్రాంతిని చెందలేదు. పిమ్మట దానిని ఎట్లు చెందెను. ఓ భగవంతుడా! విశ్వామిత్రా! ఈ సర్వమును వివరింపుడు. అనిన విశ్వామిత్రుడు ఇట్లని ఉత్తరము చెప్పనారంభించెను. ఓ శ్రీరామచంద్రా! నేను చెప్పబోవు శుకుని వృత్తాంతము కూడా నీవృత్తాంతమువంటిదే. జన్మమృత్యువులు అనగా సంసారమును నశింపజేయునది. దానిని వివరించెదను వినుము. ఆ శుకమహాముని గూడా నీవలెనే సర్వమును విచారించుకొనెను. అట్లు విచారింపగా విచారింపగా నీకువలెనే చక్కనిబుద్ధిగల అమ్మహాత్మునికిగూడా ఇట్టి వివేకమే జనించెను. అట్టి వివేకముచేత ఆ మహాత్ముడు బహుకాలము విచారించి పరుల యుపదేశముతో పనిలేక స్వయముగనే పొందవలసిన బ్రహ్మవస్తువును పొందెను. ఇవ్విధముగా ఆత్మ స్వభావముగా సర్వసంసార విహీనుడు అని తెలిసికొనియును అందు " ఇది సత్యపదార్థము " అను విశ్వాసము లేకపోవుటచేత చిత్తవిశ్రాంతిని జెందలేదు. ఇప్పుడు నీవును ఇట్లేకదా. అయినను. " అధికముగనశించు స్వభావము గలవి. " అను కారణముచేత సకల భోగముల యందును వైరాగ్యముగలిగి ఆశుకమహాముని చిత్తము వర్షధారలకు జెదరు

చాతకపక్షివలె ( చాతకపక్షి వర్షజలమునే పానముచేయును. అట్లయినను వేగముగ వచ్చుధారలు దానిముక్కునకు బాధను కలిగించును. కావున దానిని చూచిన భయము నొందును. సన్న బిందువులయ్యేనేని తిన్నతిన్నగా పట్టుకొని మ్రింగును. అని తెలిసికొనవలయును. ) వానికి. ( ఆ భోగములకు ) బెదరుచూ నేమియు జేయనొల్లక నూరకుండుచూ మాత్రమే యుండెను. నీమనస్సుకూడా ఇప్పుడు ఇట్లే యున్నదికదా. ఈ విధముగా నుండి ఒక్కనాడు ఆశుకుడు మేరుపర్వతమునందు ఏకాంతమున తపము చేయుచున్న తనతండ్రియగు వ్యాసమహామునివద్దకు పోయి అమ్మహాత్మునితో నిట్లని ప్రశ్నచేసెను. ఓ తండ్రీ! వ్యాసమహామునీ! ఈ సంసారాడంబరము ఎట్లు కలిగెను. ఎవ్వనికి కలిగెను. ఎప్పుడు కలిగెను. ఎట్లునశించును. దీనిని బాగుగా వివరింపుడు. ఈ విధముగా తనకుమారుడు ప్రశ్నింపగానే ఆ వ్యాస మహామునియు సర్వము నెఱిగినవాడు కావున నాశుకునకు చెప్పవలయు దానినంతయు జెప్పెను. ఓ రామా! ఈ చిత్రమును వినుము. ఇట్లు తనతండ్రి తనకు సర్వమును ఉపదేశింపగానే ఆ శుకుడు ఆ వాక్యములపై గౌరవము పెట్టలేదు. " ఇది యంతయు నాకు ఇంతకుముందే తెలియును. నాకు తెలియవలసిన కొరత ఇప్పటికిని తెలియనే లేదు కదా " అని అభిప్రాయపడెను. భగవంతుడగు నావ్యాసుడును పుత్రుని అభిప్రాయము మనస్సున నెఱిగి ఇట్లనియెను. ఓ పుత్రుడా! నాకు తెలిసినంతవరకు చెప్పితిని. యథార్థస్థితి నాకు చక్కగా తెలియదు. భూలోకమునందు జనకుడను మహారాజు ఒకడు ఉన్నాడు. అమ్మహాత్మునకు తెలియదగిన విషయము బాగుగా తెలియును. ఆయనవలన సర్వము నెఱుగగలవు. ఆయనవద్దకు పొమ్ము. ఓ రఘురామా! రామచంద్రా! ఇట్లు తండ్రి ఆజ్ఞాపింపగానే ఆశుకుడును తత్క్షణమే అచ్చటనుండికదలి భూలోకమునకు వచ్చి జనకమహారాజుచేత పరిపాలింపబడుచున్న మిథిలాపట్టణమును జేరెను. అమ్మహాత్ముడగు శుకుడురాజునగరివద్దకు జేరగానే అచ్చటనుండు ద్వారపాలకులు లోనికి పోయి. " ఓ మహారాజా! వ్యాసుని పుత్రుడగు శుకమహాముని ద్వారమున నిలచియున్నాడు ". అని జనకమహారాజునకు తెలియజేసిరి. అప్పుడు అమ్మహాత్ముడును శుకుని పరీక్షించుతలంపుతో నా ద్వారపాలకులను జూచి. " ఆశుకుని అచ్చటనే యుండనిండు." అని అవమానపూర్వకముగా పలికి ఏడు దినములవరకు నా ( శుకుని ) వృత్తాంతమును నైనను విచారింపకయే యుండెను. తరువాత ఎనిమిదవదినమునందు ఆశుక మహామునిని లోపలికి రప్పించెను కాని, అప్ప

టికికూడ ఆతనికి ఏమియు దెలుపకయే యూరకుండెను. ఆశుకుడును ఎప్పుడు తత్త్వమును తెలిసికొందునో. " అని మిక్కిలి త్వరతో మఱి ఏడుదినములుకూడా ఊరకనే ఉండవలసిన వాడయ్యెను. మఱియును ఆ జనకుడు పదునైదవ దినమునందు ఆ శుకుని అంతఃపురమునకు పంపెను. " ఇకను ఏడు దినములవరకు రాజు గానరాదు. " అని అచ్చటివారలచే నాశుకునికి చెప్పించెను. ఆశుకుడు మిక్కిలి సౌందర్యవంతుడు. యౌవనవంతుడు. కావున ఆతని చిత్తమును పరీక్షించుటకై ఆయంతఃపురమున యౌవనవతులగు స్త్రీలే ఆశుకునికి బహు విధోపచారములు చేయునట్లును రాజార్హమగు భోజనము పెట్టునట్లును మహామనోహరములగు శయనములు చందనము పుష్పమాలికలు మొదలగువానిచేత దగిన సమయములయందు ఉపచారములుజరుగునట్లు ఆజనకమహారాజు ఏర్పాటు చేసెను. ఈ విధముగా ఏమి చేసినను ఆ దుఃఖములుగాని సుఖానుభవములుగాని "గాలిపర్వతమును కదలింపనట్లు" ఆశుకుని చిత్తమును కదలింప లేకపోయినవి. పవిత్రుడగు నమ్మహాత్ముడు సర్వకాలములయందును సంపూర్ణచంద్రునివలె అతిపరిశుద్ధుడై శాంతుడై సంతోషయుక్తమగు చిత్తము గలవాడై మాత్రమే యుండెను. ఈ విధముగా నిరువదియొక్క దినములవరకు నాశుకుని స్వభావమును బాగుగా పరీక్షించి పిమ్మట సభకురప్పించి ఆ జనకమహారాజు ప్రత్యుత్థానముచేసి నమస్కరించెను. " ఓ స్వామీ! మీరాక శుభకరమగును గాక. " అని అభినందించి మఱియు నిట్లనియె.

ఓ మహాత్మా! మీరు వైరాగ్యసంపన్నులు. మీకు ఈ ప్రపంచమునందలి కార్యములతో నేమియు బనిలేదు. మీకు కోరికలన్నియు సిద్ధించినవి. ఏమియు కొరతలేదు. ఇట్టి మీరలు ఏమి కోరి ఇచ్చోటికి వచ్చితిరి. దానిని దయచే సెలవివ్వుడు. అని మిక్కిలి వినయముగా నడిగెను. దానికి శుకుడు ఇట్లనియె. ఓరాజా! నిన్ను గురువుగా గోరి వచ్చితిని. ఓ గురుడా! జనకమహారాజా! ఈ సంసారాడంబరము ఎటునుండివచ్చినది. ఇది ఎట్లు నశించును. అను విషయములను నాకు వివరించి చెప్పవలయును. అని ఇట్లు ప్రశ్నచేయగా నాజనకుడును మహాత్ముడగు వ్యాసుడు మొట్టమొదట ఎట్లు చెప్పెనో అట్లే సర్వమును జెప్పెను. దానిని విని శుకుడు ఇట్లనియె. ఓ గురువా! జనకమహారాజా! నేను జ్ఞానప్రభావముచేత బాగుగా విచారించి దీనినంతయు స్వయముగనే దెలిసికొంటిని. పిమ్మట మాతండ్రియగు వ్యాసమహామునిని అడుగగా ఆయనయును సర్వమూ ఇట్లేచెప్పెను. మాటలాడ

నేర్చినవారిలో శ్రేష్ఠుడా! మహారాజా! నేడు నీవుకూడా అన్నియు నిట్లే చెప్పితివి. సర్వశాస్త్రములయందును ఎచ్చ టెచ్చట ఏవిషయములను గూర్చి చెప్పబడియున్నను ఈ విషయమే తాత్పర్యార్థమై ఏర్పడుచున్నది. ఇంత ఏల? ఈ సంసారము మనస్సంకల్పము వలన అనగా " ఇది ఆత్మకంటే వేఱుగా ఉన్నది. ఇది సంసారము " అనుతలంపుచేత జనించినది. కావున సంకల్ప నాశముచేత నాశము నొందును. ఇదియే వేదాది ప్రమాణముల యొక్కయు మహాత్ములయొక్కయు నిశ్చయ మనుటలో సంశయ మింతయైన నను లేదు. అయినను చిత్తశాంతి కలుగకపోవుటచేత దీనికంటే యథార్థ మగు విషయము మఱియొకటి కలదనితోచుచున్నది. కావున నోమహాత్మా! వీరాగ్రేసరా! ఉన్న యథార్థమును దాపక చెప్పుము. మీ అనుగ్రహము వలన చంచలమగు మనస్సును దానితోగూడా సర్వప్రపంచములును నిశ్చల ము లగుగాక. ఇట్లు ఊరకుండుట యుక్తముకాదు. అని శుకు డడిగిన జన కుడు మరల ఇట్లనియె. ఓ శుకమహాముని! నేను దాచినది ఇందేమియును లేదు. సర్వము నిదియే. దీనిని నీవే స్వబుద్ధితో తెలుసుకొంటివి. గురుముఖ ముగాగూడా వింటివి. ఇంతకంటే ఇతరమైనది. ఏదియును లేదు. ఆత్మ జ్ఞానరూపుడు. అతనికి భేదము లేవియును లేవు. ఆతనికంటే ఇతరమగుపదా ర్థము ఒకటియును గానరాదు. ఆతడు తన సంకల్పముచేతనే బంధింప బడును. జ్ఞానముచేత భ్రాంతిమయము లైన ప్రపంచ సంకల్పములను విడిచె నేని ముక్తినొందును. ఇదియే యథార్థము. నీకు వివేకమువలన ఇట్టి యథా ర్థజ్ఞానము స్వయముగనే కలిగినది. ఇంతమాత్రమేగాక సకల సుఖ భోగ ముల యందును ఇంత ఏల? సర్వప్రపంచమునందును సంపూర్ణ వైరాగ్యము గలిగినది. ఓ బ్రాహ్మణోత్తమా! శుకపరబ్రహ్మమా! నీవు ఇప్పుడే పొంద వలసినదానిని పొందియున్నావు. తెలిసికొనవలసినదానిని తెలిసికొని యు న్నావు. నీమనస్సు సంపూర్ణమైనది. ( సామాన్య ) ముముక్షువులవలె నీవు బ్రహ్మమును వెదకువాడవు కావు. బ్రహ్మమును జెందిన ముక్తుడవు. కావున నిరర్థకముగా భ్రాంతిని జెందకుము. ఈ విధముగా జనకమహారాజుచేత ఉప దేశింపబడి ఆ శుకుడు చిత్తవిశ్రాంతిని జెందెను. శాంతమగు బ్రహ్మవస్తు వునందు స్థిరుడై నిలచెను. ఇట్లు చిత్త విశ్రాంతిని పొంది దుఃఖము భయ ము శ్రమ అనునవిలేక దేనిని గోరక ఎట్టిసంశయమును లేక స్వస్థుడై సమా ధి సుఖములను అనుభవించుటకునై శ్రేష్ఠమగు మేరుశిఖరమును జేరెను.

ఓ రామచంద్రా! ఈ విధముగా నా మహానుభావుడగు శుకుడు

సంకల్ప వికల్పములను కళంకములు లేనివాడై నిర్మలుడై చిన్ననీటి చినుకు సముద్రమునందువలె సర్వవాసనా రహితుడై అతి నిర్మలమైనట్టియు లోకోత్తరమైనట్టియు నాపరబ్రహ్మమునందు ఏకీభవించెను. కావున నో శ్రీరామా! వ్యాసపుత్రుడగు నాశుకునకు గురూపదేశ మెట్లు క్రొత్త ఏమియు గలిగింపక కేవలము భ్రాంతిని మాత్రమే నివర్తింప జేయుటకు అనగా. "నీవు తెలిసికొనిన దానికంటే అధికము ఏదియును లేదు. కావున వృధా సంశయమును విడువుము." అని చెప్పుటకు మాత్రమే ఏవిధముగా నుపయోగించినదో అట్లే నీవిషయమునందును గురూపదేశము భ్రాంతిని నివర్తింప జేయుటకు మాత్రమే ఉపయోగించును గాని, క్రొత్తగా తెలియని విషయమును దేనినికాని, బోధించుటకు ఉపయోగపడదు. ఏలయనిన: సర్వమును అనగా చెప్పవలసినదాని నంతయును నీవే చెప్పితివిక దా. తెలిసికొనవలసిన పదార్థమును తెలిసికొనినట్టి అనగా తత్వమును ఎఱిగినట్టి మనస్సు ఒకగురుతుమే గ్రహింపవచ్చును. దానికి అత్యుత్తమ మగు బ్రహ్మానందము దొరకెను. కావున అల్పానంద కరములగు సాంసారిక విషయములు రుచింపవు. ఇదియే ( వైరాగ్యమే ) దానిని గుఱితించుటకు పెద్దగురుతు.

ఓ మహాత్మా! రామా! అసత్యములగు వస్తువులను ఆశ్రయించి వచ్చిన సంసారబంధము. "ఈ వస్తువులు సుఖకరములు వీనిని అనుభవింప వలయును." అనుతలంపుచేత అభివృద్ధి జెందును. ఆతలంపు నశించి వైరాగ్యము గలుగుటచేత ఆ బంధము క్రమక్రమముగా సన్నగిలి నశించును, ఓ రామచంద్రా! ఈ ప్రపంచవాసనలు సన్నగిలిపోవుటయే మోక్షము. అవి అభివృద్ధియగుటయే బంధము. జీవన్ముక్తునకుగూడ శరీరము ఉండునుగావున దానికై కొన్నివాసనలు అనగా శుద్ధవాసనలు ఉండును, కావున "సర్వవాసనలును నశించుటయే మోక్షము." అని చెప్పుటకు వీలు లేదు. విదేహముక్తి సమయమున మనస్సు దానికారణము లగు భూతాంశములలో జేరును. కావున అప్పుడు వాసన లుండుటకే వీలులేదు- కావున. "వాసనాక్షయమే మోక్షము." అనులక్షణము విదేహ ముక్తికి సంబంధింపదు. కావున ఏపురుషునకు కపటము నేమియును లేకుండ అనగా."మనముసర్వవస్తువులను పరిత్యజించినచో జనులు మనలను కొనియాడుదురు అప్పుడు వైరాగ్యవంతుడనుకీర్తి మనకు ప్రబలును." అనుమొదలగు సుద్దేశ్యములు లేకుండ యథార్థముగ సర్వవస్తువులయందును వైరాగ్యము గలుగునో, ఆపురుషుడే జీవన్ముక్తుడు.

ఓ శిష్యా! భరద్వాజా! ఈ విధముగా విశ్వామిత్రుడు శ్రీరామునకు ఉపదేశించి పిమ్మట మునులను జూచి ఇట్లనియె. ఓ మునీంద్రులారా! ఈ రాముడు సర్వము నెఱిగియే యున్నాడు. దీనినే సద్గురువుల వలన మఱల వినినచో చిత్తవిశ్రాంతిని అవశ్యముగ జెందును. కావున ఈ రామునకు చిత్తవిశ్రాంతి కలుగుటకై మహానుభావుడగు వశిష్ఠుడు తగినఉపదేశము నొసంగుగాక. ఈ వశిష్ఠమహాముని రఘువంశమువారి కందరకును గురువు. ప్రభువు. సర్వమును ఎఱిగినవాడు. కేవలము పరబ్రహ్మమే. త్రికాలములను అనగా త్రికాలములయందలి సర్వవస్తువులను దెలిసికొను సామర్థ్యము గలవాడు. అని విశ్వామిత్రుడు చెప్పి వశిష్ఠునిజూచి ఇట్లనియె. ఓభగవంతుడా! వశిష్ఠమహామునీ! వెనుక మనము విరోధముతో నున్నప్పుడు మనవైరము శాంతియగుటకును మోక్షము దొరకుటకునై మనయందు అనుగ్రహించి గొప్పబుద్ధిగల యాచతుర్ముఖుడు మనకు బ్రహ్మజ్ఞానమును పలుమారు ఉపదేశించెనుగదా. అది జ్ఞప్తియందుండియే యుండును. దానిని శిష్యుడగు ఈ శ్రీరామునకు ఉపదేశింపుడు. ఓ సత్పురుషశ్రేష్ఠా! వసిష్ఠమహామునీ! మంచివైరాగ్యముతోగూడి తగిన అధికారియై యున్న శిష్యునకు ఏది యుపదేశింపబడునో అట్టిజ్ఞానమే జ్ఞానము. అట్టి శాస్త్రార్థమే శాస్త్రార్థము. అట్టి వానినేర్పే ( ఆగురువుయొక్క నేర్పే ) నేర్పు. శిష్యుడునుగాక అధికారియుగాక వైరాగ్యమునైనను జెందకనుండువానికి ఏదియైన నుపదేశింపబడినచో నది కుక్కకు పోసిన ఆవుపాలవలె అపవిత్రమగును కదా? ఓ భరద్వాజా! ఈ విధముగ విశ్వామిత్రమహాముని పలుకగానే వ్యాసుడు నారదుడు మొదలగు నచటి మునులందరును మేలు మేలని ప్రశంసించిరి. తరువాత బ్రహ్మదేవునియొక్క పుత్రుడును మహాతేజస్వియు భగవంతుడును దశరథమహారాజునకు ప్రక్కన కూర్చుండియున్న వాడునగు వశిష్ఠమహాముని ఈ విధముగ జెప్పుటకు ఆరంభించెను, ఓ విశ్వామిత్రమహామునీ! నీ ఆజ్ఞాప్రకారము నేను అవశ్యముగ జేయుచున్నాను. ఎట్టి సమర్థుడైనను సత్పురుషుల ఆజ్ఞను అతిక్రమింపనేరడు గదా? పూర్వమునందు సంసారతాపము నశించుటకై మనపైగల అనుగ్రహము వలన ప్రత్యక్షమై నిషధ పర్వతమునందు బ్రహ్మదేవుడు మనకెద్దరికి ఏ బ్రహ్మజ్ఞానమును ఉపదేశించెనో దానిని బాగుగ జ్ఞప్తియందు ఉంచుకొనియే యున్నాను. ఓ శిష్యా! భరద్వాజా! మహాత్ముడగు నావశిష్ఠుడు ఈ విధముగ విశ్వామిత్రునితో బలికి ఉపన్యాసమునకు దగిన వేషమును ధరించి దానిచేత తొల్లిటికాంతి అతిశయించుచుం

డగ ఆ శ్రీరామునిజూచి అజ్ఞానమును పోగొట్టుటకై పరబ్రహ్మమును ఇట్లు బోధించుటకు ఆరంభించెను.

ఇట్లు బ్రహ్మశ్రీ వెన్నెలకంటి సుందరరామ శర్మచే వచనకావ్యముగ రచియింపబడిన శ్రీవాల్మీకి మహర్షి ప్రణీత జ్ఞానవాశిష్ఠ రామాయణమునందు వైరాగ్య ప్రకరణమున - మూడవసర్గ ముగిసెను. వైరాగ్యప్రకరణము సమాప్తము.

## శ్రీజ్ఞానవాశిష్ఠము - వచనకావ్యము.

## ముముక్షు ప్రకరణము.

### —* వశిష్ఠమహాముని శ్రీరామునకు ఉపదేశించుట. *—

ఓ శిష్యా! భరద్వాజా! అంత వశిష్ఠమహాముని శ్రీరామచంద్రునకు ఇట్లని ఉపదేశింప నారంభించెను.

ఓ శ్రీరామచంద్రా! నీసంశయమును తొలగించెదను వినుము. ఈ లోకమున సంసారమునందు అనుభవింపబడు ప్రతివిషయముకూడ పురుష ప్రయత్నమును ఆధారము చేసికొని ఉన్నది. పురుషప్రయత్నమును బాగుగ నాచరించిన విషయములు కూడ బాగుగ దొరుకును. అట్లు లేకున్న దొరకదు. ఏకాలములయందైనను పురుషులు ఎట్టివారైనను ఈనియమమునకు మారులేదు. ఈపౌరుషము ఉచ్ఛాస్త్రమనియు (శాస్త్రమును అతిక్రమించినదనియు) శాస్త్రితమనియు (శాస్త్రానుకూలమైనదనియు) రెండువిధములు. అందు ఉచ్ఛాస్త్రపౌరుషము యథార్థములు కానివిషయములయందు సత్యబుద్ధిని కల్పించి పురుషునకు అనర్థమును గల్పించును. శాస్త్రితపౌరుషము అట్లుగాక సత్యమగు ఫలమును ఇచ్చును. ఆ కారణమువలన పురుషప్రయత్నమే అవశ్యముగ ఆశ్రయింప తగినది. దానిచేత హితములగు పదార్థములన్నియును సంపాదించుటకు వీలగును. హితార్జనమునకై ప్రయత్నించుచు చిన్నతనమునుండియు శాస్త్రాభ్యాసములును సత్పురుష సమాగమములును మఱియును అనేకకార్యములు జేయబడుచున్నవిగదా? పౌరుషములేకున్న అనియన్నియు వ్యర్థమే. అని వశిష్ఠుడు పలుకగా సందేహముతో శ్రీరాముడు ఇట్లనియె. ఓ వశిష్ఠ మహామునీ! నాకు పౌరుషము వలన ప్రయోజనమేమియును ఉన్నట్లు గానరాలేదు. పూర్వ జన్మమునుండియు లేక అనాదికాలమునుండియు వచ్చుచున్న కర్మసంస్కారములు ఏ విధముగ

బుద్ధిని ప్రేరేపించునో ఆవిధముగనే పురుషుడు సర్వమును ఆచరించుచున్నా డు. దీనుడనై రక్షకులు లేనివాడనై నేనుకూడ లోకముల లెనే పూర్వజన్మ కర్మానుగుణముగ సర్వమును ఆచరించుచున్నాను. దానిని అతిక్రమింప వల యుననిన వేఱొక దిక్కులేదు. ఏమిచేయవలయును? అనిన వశిష్ఠుడు ఇట్లని సమాధానము చెప్పెను. ఓ రఘునందనా! నిశ్చయముగ పూర్వ కర్మాను గుణముగ సంచరించుటచేతనే నీకు ఈ పరమపదము దొఱికినది. అయినను ఈ అభివృద్ధి పురుష ప్రయత్నముచేతనే సంపాదింప బడినది గాని వేఱుకా దు. కర్మలు పురుషుని ప్రేరేపించు చున్నవనిన మాత్రముచేతనే పౌరుషము లేకపోవ నక్కఱలేదు. నిష్ఫలముకూడ కానక్కఱలేదు. అది ఎట్లనిన? విను ము. ఈకర్మలు సంస్కార రూపములై పురుషుల ప్రేరేపించునుగదా? ఆ వాసనలు శుభ వాసనలనియును అశుభ వాసనలనియును రెండువిధములు. ఒకానొకపురుషునకు ఈ రెండును చిత్త ప్రేరకములై యుండును. మఱి యొకనికి ఈ రెంటిలో నేదియైనను ఒకటియే యుండును. కావున నీకీ రెండు తెగలలో నెందైన జేరియుండువుగదా? అందు శుభములగు సంస్కారము లే నీచిత్తమును ప్రేరేపించుచుండెనేని అప్పుడు నీవు శుభమార్గమును ఆశ్ర యించి క్రమక్రమముగా పరమపదమును ఆశ్రయించి సుఖింతువు. ఇట్లుగాక పూర్వమునుండి వచ్చిన సంస్కార మశుభమై అది నీచిత్తమును తప్పుత్రో వల ద్రొక్కించు చుండెనేని అప్పుడు పురుష ప్రయత్నముతో దానిని జయింపవలసినదియే కదా? కావున సంస్కారమను నది కొన్ని సమయముల యందు మంచి త్రోవయందు ప్రవహించును. మఱి కొన్ని సమయముల యందు తప్పుత్రోవయందును ప్రవహించును. కావున దానిని తప్పుత్రోవల నుండి త్రిప్పుటకును పురుషప్రయత్నము కావలసినదియే? మంచిత్రోవయం దు నడచునప్పుడు దాని నటనుండి తొలగకుండునట్లు చేయుటకును పురుష ప్రయత్నము కావలసినదియే.

కావున. ఓ పురుషశ్రేష్ఠా! రామా! అశుభసంస్కారముల ప్రేర ణచేత అశుభమార్గమును ద్రొక్కి చెడిపోవుచున్న మనస్సును బలమగు పు రుషప్రయత్నముచేత శుభమార్గ మునకు ద్రిప్పవలయును. మఱియును " బా లునివలె " పురుషుని చిత్తమునకును ఒకచోటనుండి వెడలగొట్టిన మఱియొక చోటికి బోవునట్టి స్వభావముకలదు. కావున పురుషప్రయత్న బలముచేత ఆచిత్తమును అశుభ మార్గమునుండి త్రిప్పిన వేఱొకగతి లేకపోవుటచేత శుభమార్గమునే ఆశ్రయించును. అశుభ శుభమార్గములు రెండేతప్ప ఇతర

మార్గము ఏదియును లేదుకదా? కావున ఆమనస్సును చక్కజేయు విషయ మునందు. పురుషప్రయత్నము అత్యావశ్యకము. ఆపురుష ప్రయత్నము చేత ఆమనస్సును అశుభవాసనలనుండి త్రిప్పవలయును. ఇదియునుగాక "నీవు త్వరపడకుము. శాంతిని జెందుము. సుఖదుఃఖములయందు సమభావ ముతో నుండుట అలవాటు సేయుము." అని మెల్ల మెల్లగా చిత్తమును నూ రడించుచూ అనగా మంచిమాటలు చెప్పచూ ఆచిత్తమును బాలుని పురుష ప్రయత్న బలముచేత లాలింపవలయును. ఆచిత్తము చెడు త్రోవల బోవు చుండును. కావునఇట్టిలాలనను ఆలస్యముచేయరాదు. శత్రువుల సంహరించు నట్టి యో శ్రీరామా! రఘునందనా! నీకు మొట్టమొదటనుండియు శుభవాస నలే కలిగియుండెనేని అది పూర్వజన్మములయందు ఆచరింపబడిన అభ్యా స బలమువలన వచ్చినది. అని నిశ్చయింపుము. శుభసంస్కారములు సంపా దించుటకయ్యే పురుషయత్నమూలమున అభ్యాసమును ఆచరింపవలయును. కావున అప్పుడు. ( శుభసంస్కారము గలిగినప్పుడు ) ఆయభ్యాసము ఫలిం చెనని తలంపుము, మఱియు " శుభాశుభ సంస్కారములలో ఏది అభివృ ద్ధియైయున్నదో" అనికాని " శుభసంస్కారము తగినంతవరకు అభివృద్ధి అయినదో, కాలేదో " అను సంశయముగాని, గలిగినప్పుడు సహితము పు రుషప్రయత్నమునే దృఢముచేసి శుభసంస్కారమునే అధికముగా సంపా దింప ప్రయత్నింపుము. నాయనా! శ్రీరామా! శుభసంస్కారము ఎంతఅధిక మైనను దానివలన దోషమేమియును లేదు. ఇట్లు చిత్తమును శుభమార్గ మున దిరుగునట్లుజేసి ఎంతకాలమువరకు సంపూర్ణ వివేకము కలుగదో బ్రహ్మజ్ఞానము దొఱకదో అంతకాలమువరకు పెద్దలును శాస్త్రములును ప్రమాణములును వేనిని ఆచరణీయ్యములనుగా నిర్ణయించియున్నవో వాని నే ఆచరించుచుండవలయును. ఇట్లు ఆచరింపగా నాచరింపగా కొంతకాల మునకు చిత్తమునందుండు రాగాది దోషములు సంపూర్ణముగానశించును. పరబ్రహ్మస్వరూపము స్పష్టముగా తెలియును. ఇదియే కృతార్థతకదా? ఇట్టి కృతార్థత గలిగినపిమ్మట ఆశుభ సంస్కార ములతోగూడా పనిలేదు. వానినిగూడా వదలివేయవలెను. నిశ్చయముగా నవియు ప్రతిబంధములు గలి గించునవియేకదా? కావున నోరామా! మొట్టమొదట సత్పురుషునిచే ఆశ్ర యింపబడిన శుభమార్గమును అవలంబించి మంగళకర మగు శుభసంస్కార మును ఆశ్రయించి వివేకశక్తిచేత మనస్సును క్రమక్రమముగా సర్వోత్తమ మగు పరబ్రహ్మమును బొందింపుము. అదియే దుఃఖరహితమగు స్థానము.

మోక్షము. పిమ్మట. అనగా అట్లు మోక్షమును జెందినపిదప ఆ శుభవాస
ననుగూడా వదలి ఊరకనుండును. ఇదియునుగాక ఓ శ్రీరామా! పూర్వ
మున ఉత్తమమగు సత్యలోకమునందున్న బ్రహ్మదేవుడు సమస్తదుఃఖ
ములను నాశము చేయునట్టియు బుద్ధిని బాగుగా నూరార్చునట్టియు ఒక
విషయమును నాకు ఉపదేశించెను. దానిని నీకు దెలిపెదను. బుద్ధిని శాంతిని
జెందించుటలో నంతకంటె ఉత్తమమైనది మఱియొకటిలేదు. కావున మన
స్సున నుండు సంసార భావనను అనగా భేదభావనను మఱి యెప్పటికిని
దోపకుండునట్లుగా పరిత్యజించవలయును. మఱియు గంభీరమగుబుద్ధితో సం
పూర్ణములగు శాంతి సంతోషములను ఆదరించవలయును. మఱియు వేదాం
తవాక్య విమర్శయందు ప్రీతిగలమనస్సును సమభావన కలదానినిగా జేయ
వలయు. అట్లు జేసి అట్టిమనస్సును పరబ్రహ్మమునందు నిలిపి అతి స్వచ్ఛు
డవై దానిని ఆలకింపుము. అనిన శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓ బ్రాహ్మ
ణోత్తమా! వశిష్ఠమహామునీ! ఆ బ్రహ్మదేవుడు చిత్తశాంతికరమగు ఉప
దేశమును ఏకారణమువలన జేసెను. అది మీకెట్లు తటస్థమయ్యెను. ఓ సర్వ
సమర్థుడా? మహాత్మా! దానిని వివరింపుము.

—* బ్రహ్మదేవుడు వశిష్ఠునకు జ్ఞానోపదేశము చేసిన వృత్తాంతము. *—

ఓ రఘునందనా! శ్రీరామా! సమస్తవస్తువులను ప్రకాశింప జేయు
వాడును అపరిమితములగు మాసములకు ఆశ్రయభూతుడును సమస్త పదా
ర్థములయందును వ్యాపించి యున్నవాడును సర్వపదార్థములకును ఆశ్రయ
భూతుడగువాడును ఎన్నటికిని నశింపనివాడునగు జ్ఞానస్వరూపుడగు పరబ్ర
హ్మము కలదు. ఆపరబ్రహ్మము నిశ్చలుడుకాడు. చంచలుడునుకాడు. ఇట్టి
పరబ్రహ్మమునుండి సత్వగుణ ప్రతిబింబభూతుడగు విష్ణువు జనించెను.
ఆవిష్ణువు యొక్క నాభికమలమునుండి చతుర్ముఖుడు జనించెను. ఆ బ్రహ్మ
దేవుడే " మనస్సు బహువిధములగు సంకల్పములను గల్పించునట్లు " ఈ
ప్రపంచమును గల్పించెను. పిమ్మట మనుష్యలోకమున ప్రధానమగు నీభరత
వర్షమునందు. సర్వజనులును నానావిధములగు వ్యసనములకు జిక్కి దుః
ఖించుచుండుటను జూచి ( ఇచ్చట భరతవర్షమని చెప్పుటచేత భూలోకము
నంతయును జెప్పినట్లే యని తెలిసికొనవలయును. ప్రధానమగు పదార్థమును
జెప్పిన దానికి సంబంధించిన అప్రధాన పదార్థములను అన్నిటిని జెప్పినట్లే
వ్యవహరించుట లోకమున గలదు. " పుత్రో కొకగుణము, " అను మొద
లగు వ్యవహారములయందు సర్వశరీరమునకును ప్రధానమగు శిరస్సును

జెప్పుటచేత మనుష్యుని అంతయును జెప్పినట్లే తలంపబడుచున్నది. ఆ వ్యవహారమునకు " ప్రతిమనుష్యునకును ప్రత్యేకమగు అభిప్రాయము కలదు." అనియేకదా యర్థము. ) తండ్రి పుత్రుల దుఃఖమునుజూచి శోకించునట్లు శోకించెను. " ఓ హాహా! ఈజనులందరును చెడిపోయిన మనస్సుగలవారగుటచే మిగుల దుఃఖములను అనుభవించుచున్నారు. వీరిదుఃఖములు నశించునెట్లో? దీనికేమి ఉపాయము చేయవలయునో. " అని ఏకాగ్ర చిత్తముతో కొంతసేపు విచారించి ఏమియు దోపక పోవుటచేత తపస్సును చేసెను. ఇట్లు తపస్సుచేసి '' వీరిదుఃఖము నివర్తియగుటకు తపస్సుగాని దానముగాని జపములుగాని పుణ్యతీర్థములుగాని చాలవు. కావున సర్వదుఃఖక్షయకరమగు బ్రహ్మజ్ఞానమునే ఉపదేశింప వలయును " అని మనస్సున నిశ్చయించెను. అట్లు నిశ్చయించి లోకమునందు బ్రహ్మజ్ఞానమును విస్తరింపజేయుపనికై సంకల్పశక్తిచేత నన్ను బుట్టించెను. నేనును ఈ విధముగా దండకమండలు సహితుడనయ్యే జనించి ఎదుట పద్మాసనముపై దండకమండలు సహితుడై అక్షమాలను చేతబూని పద్మాసనముపై కూర్చుండియున్న తండ్రియగు చతుర్ముఖునకు నమస్కరించితిని.

ఓవీరుడా! రామచంద్రా! అంతట నాచతుర్ముఖుడు నన్నాశీర్వదించి " పుత్రుడా! ఇటురమ్ము" అనుచు తనకు ఆసనమైయున్న కమలము నందలి ఉత్తరదళమునందు గూర్చుండనియోగించి ఇట్లని చెప్పుటకుఆరంభించెను. ఓ పుత్రుడా! నీమనస్సు ఆవిరితగిలిన అద్దమువలె ఒక ముహూర్త కాలము తనకు స్వభావమగు చాంచల్యమువలన కోతివలె అటు ఇటు తిరిగి అజ్ఞానమున ప్రవేశించునుగాక. అనెను. ఇట్లు ఆ బ్రహ్మచేత నేను శపింపబడితిని. ఆశాపము నాపై కోపమువలన నీయబడినది కాదు. మఱి ఏమనిన? నేను జ్ఞానమును ప్రపంచమునందు ప్రకాశింపజేయుటకై పుట్టింపబడితిని. కావున నాకు సంసార దుఃఖముకూడా అనుభవసిద్ధము కావలసినదియే. అనుభవము లేకపోయెనేని దానినిగూర్చి వివరించుటయును అందలిసారాసారముల విభాగించుటయును అనునది మిక్కిలి దుష్కరముగదా. కావున నాకును అట్టి అనుభవము కలుగచేయుటకై మొట్టమొదట స్వభావసిద్ధ మగు పరిశుద్ధత్వమును తొలగించువాడై అమహాత్ముడు అట్లు చేసెను. ఓ రామా! ఈ శాపబలమువలన నేనును విచారశూన్యుడనై నిర్మలమైన స్వరూపమును అంతయును తత్క్షణమే మఱచిపోయితిని. తరువాత జ్ఞానశూన్యమైన బుద్ధితో మిక్కిలి దీనుడనై అతిదుఃఖమును అనుభవించుచూ మిగుల అధముడగు

సామాన్యమనుష్యునివలె నేర్పడితిని. శాపకాలమగు ఆ రెండు గడియలును గడువగానే ఆ బ్రహ్మదేవుడు మరల నావద్దకువచ్చి ఇట్లనియె. ఓ పుత్రుడా! నీవు దుఃఖమును జెందనేల? ఈ దుఃఖము తొలగుటకు ఉపాయమును నన్ను అడుగరాదా? అట్టి ఉపాయమును తెలిసికొనిన నీకు ఇక మీదట సర్వకాలములయందును సుఖమే యుండును. అని. ఇట్లు ఆ మహాత్ముడగు బ్రహ్మదేవుడు ఆజ్ఞాపింపగానే నేను సంతోషించి యాభగవంతుని సంసార రోగౌషధమును గూర్చి ఇట్లని ప్రశ్న చేసితిని. ఓ ప్రభువా! తండ్రీ! ఈ సంసారము ఎటునుండివచ్చెను? ఎట్లునశించును? అని ఇట్లు నేను ప్రశ్న చేయగానే అమ్మహాత్ముడును నాకు బ్రహ్మజ్ఞానమంతయును ఉపదేశించెను. ఆ ఉపదేశ ప్రభావము వలననే నేను ఎట్టి సంసారదుఃఖమునకైననుచలింపక సర్వకాలములయందును సుఖినై యున్నాను. ఈ స్థితి ఇక నెన్నటికిని మారదు. అదీ యట్లుండనిమ్ము. ఓ రామా! ప్రకృతమును వినుము. ఆ హిరణ్యగర్భుడగు బ్రహ్మదేవుడు ఆ విధముగా సర్వమును ఉపదేశించెను. పిమ్మట నేను పరిపూర్ణజ్ఞానవంతుడనై శాపకాలమునకంటే పూర్వమునందు ఉన్న స్థితికి రాగానే నాతో మరల నిట్లనియె. ఈ క్రిందివిధముగా తాను చేసిన కార్యములకు అన్నిటికిని కారణము నెఱింగించి బ్రహ్మదేవుడు ఇట్లనియె. ఓ పుత్రుడా! భూలోకమునందు జనులందరును నీవు ఇంతకుముందు జెందుచున్నట్లు బహువిధ దుఃఖములను జెందుచున్నారు. వారిని ఉద్ధరించుటకు ఇప్పుడు నీకు నేను జేసిన ఉపదేశమువంటి ఉపదేశమునకంటె ఇతరమగు ఉపాయము లేదని నిశ్చయించు కొంటిని.

ఓ పుత్రుడా! అట్టి ఉపదేశమును భూలోకమునందు జనులకు ఉపదేశించుటకయ్యే నిన్ను బుట్టించితిని. నీవును అతి నిర్మలచిత్తుడవై స్వభావముగనే బ్రహ్మవేత్తవై సంసార దుఃఖమును విషయమునే ఎఱుగకుంటివి. ఇట్లుండిన అజ్ఞానులకందు ఆయాసములనుగాని వారికిగలుగు సంశయములును గాని తెలిసికొనుటకు నీకు సాధ్యముకాదను తలంపుచేత నిన్ను శాపవేగము వలన అజ్ఞానునిగా జేసితిని. ఇట్లు చేయుటవలన అజ్ఞానులు అడుగు ప్రశ్నలను అన్నిటిని నీవే నన్ను అడిగితివి. ఆ ప్రశ్నలకు అన్నిటికిని సమాధానము జెప్పితినిగదా? ఇకను ఇప్పుడునీకు శాపవేగము తొలగినది. సహజమైనపరిశుద్ధస్థితి కలిగినది. ఇక లోకానుగ్రహము జేయుటకై భూలోకమునకు పొమ్ము. సర్వద్వీపములలోను ఉత్తమమగు జంబూద్వీపమున అందును భారతవర్షమునందు నివసింపుము. ఆ భరతవర్షమునందు కొందరు యజ్ఞదానాది

కర్మాసక్తులై ఉన్నారు. మఱికొందరు గొప్పబుద్ధిగలవారై వైరాగ్యవంతులై సర్వమునందును ఆశ లేక యున్నారు. ఇందు కర్మాసక్తులకు కర్మనే ఉపదేశింపవలయును. వైరాగ్యవంతులగు వారికిమాత్రము బ్రహ్మానంద కరమగు బ్రహ్మజ్ఞానమును ఉపదేశింపవలయును. కర్మ నాచరించువారు క్రమక్రమముగా చిత్తశుద్ధిగలిగి వైరాగ్యమును సంపాదించుకొనిన పిమ్మట గాని, జ్ఞానమునకు అధికారులు కారుగదా? అనెను.

ఓ సత్పురుషుడా! రామచంద్రా! కమలమునుండి జనించిన ఆబ్రహ్మదేవుడగు నాతండ్రి ఈవిధముగా నాకు ఆజ్ఞాపింపగానే నేనును ఆ ఆజ్ఞానుసారముగ భూలోకమునకు వచ్చి చిరంజీవినై సర్వభూతములు నుండునంత వరకును ఉండుచున్నాను. వారివారి అధికారమును అనుసరించి వారి వారికి కర్మజ్ఞానములను ఉపదేశించుచున్నాను. మనో నిగ్రహము గలిగి భూమి యందు ఉండవలయును." అనుతలంపుతో మాత్రమే ఇచ్చట ఉన్నాను గాని, నాకిచట కార్యము ఏదియును లేదు. లోకులకు ఉపదేశించుట అనునదిగూడ నాకు ఆవశ్యకమైనదికాదు. వాస్తవస్థితిలో ఆత్మ పర భేదమే లేదుగదా? "అయినను సర్వకార్యములను ఆచరించుచునే యున్నావు కదా?" అందువేమో అందలి యథార్థమును వినుము. ఓ రామా! నాబుద్ధివృత్తి ఐక్యాలి శాంతమై యుండుటచేత ఎందును బ్రసరింపక ఎప్పుడు చూచినను బ్రహ్మావలోకనము చేయుచూ నిదురించుచున్నట్లే యుండును. ఆత్మాభిమానము కొంచెమైనను లేదు. ఇట్లగుటచేత నేను ఏమికార్యములను చేసినను చేయనివాడనే, అగుదును. "దీనిని నేను చేయుచున్నాను, దీని ఫలము నాకు కావలయును. అను నభిమానముతో నాచరించిననేకదా? కర్మబంధకారి యగును. వాస్తవస్థితిలో బంధముమాత్రము ఎవ్వనికి గలుగును? ఆత్మ నిత్యశుద్ధుడుగదా? ఏపురుషుడు జాగ్రదవస్థయందు తనకంటె భిన్నమగు పదార్థమును జూచుచున్నను స్వాభావికమగు భేదమును దృఢముగ నెఱిగి సుషుప్త్యవస్థయందువలె రెండవదానిని చూడడో సర్వకార్యముల జేయుచుండియు దేనియందును కర్తృత్వాభిమానము లేకపోవుటచేత ఏ కార్యములను ఆచరించినవాడు కాడో అట్టివాడే ఆత్మవేత్తఅనుట నిశ్చయము.

—✻ వశిష్ఠుడు రాముని ప్రశంసించుచూ ఉత్తరమునిచ్చుట. ✻—

ఓ శ్రీరామచంద్రా! మొట్టమొదట "ఈ తడు మన ప్రశ్నమునకు ఉత్తరము నియ్యగలడా? లేడా? మనమడుగబోవు విషయము ఈతనికి దెలియునా? తెలియదా? అనువిషయమును మొట్టమొదట నిర్ణయించుకొనియే ఎవ

నినిగాని ప్రశ్న చేయవలయును. అట్లుచేయువాడేబుద్ధిమంతుడు. నీవును నీమ
నస్సులోనుండు విషయమునంతయు మహామునులు చేరునంతవరకు నెవ్వని
తోను జెప్పక మంచిసమయమున వెలిబుచ్చితివి. మఱియు "ప్రశ్న జేసిన
పురుషుడు ముందు వెనుక విషయములచక్కగా మనస్సునందుంచుకొని అప్పు
డప్పుడు తన ప్రశ్నలకు జెప్పిన సమాధానముల విమర్శించుకొనగలడా?
ఈతనికి చక్కనిబుద్ధి కలదా?" అని విమర్శించియే చెప్పువాడు ఉత్తర
మును జెప్పవలయునుగాని పశువుతోసమానుడై ముందు వెనుక సందర్భ
ములను ఎరుగలేక యుండు నధమునకు ఉత్తరము చెప్పరాదు.

ఓరామా! నీవు మహాత్ముడవు. మేము చెప్పవలసిన దానినంతయు
నీవే చెప్పితివి. కావున నీ ప్రశ్నములకు ఉత్తరము చెప్పెదను వినుము. శాంతి,
విచారము, సంతోషము, సత్పురుష సమాగమము, అను నాలుగును మోక్ష
మను రాజభవనమునకు ద్వారపాలకులు. ఈనలుగురిలో నందరును అవ
శ్యముగా సేవింపదగినవారే. అనగా శాంత్యాదులను నాలుగింటిని సంపా
దింపవలసినదే? అందరిని సేవించుట అశక్యమైనయెడల వారిలో ముగ్గురి
నైనను ఇద్దరినైనను సేవించియే తీరవలయును. వారు మోక్షద్వార
మును తెరతురు. అట్లిద్దరినుకూడా సేవించుటకు శక్తిలేనియెడల ఎంతశ్ర
మమైననుజెంది ఒకనినైనను ఆశ్రయించి తీరవలయును. ఒకనినైనను
బాగుగా సేవించి వశునిజేసికొనినచో క్రమక్రమముగా సుఖముగనే తక్కిన
నలువురుగూడా వశగతులగుదురు. ఇట్లు వీరిని ఆశ్రయించుటకంటె ముందు
గా మోక్షమునుగోరువారు జ్ఞానమునే అభివృద్ధి చేసికొనవలయును. సత్పు
రుషులతో స్నేహము, శాస్త్రవిచారము, తపస్సు, ఇంద్రియనిగ్రహము,
మొదలగునవి అజ్ఞానాభివృద్ధికి సాధనములు. ఓరామచంద్రా! సంసారమను
విషవేగమువలనబుట్టిన విషూచికావ్యాధి మిక్కిలి కష్టసాధ్యమైనది. ఓర్వ
రానిది. అది మనోనిగ్రహమను నిర్మలజ్ఞానమైన గరుడమంత్రముచేత తత్
క్షణమే శాంతినొందును. శబ్దాది విషయసంగముచేత గలుగు నీసంసారమను
విషూచికా జాడ్యమునకు అంతము ఎప్పటికిని లేదు. అనగా జ్ఞానము కలు
గునంతవరకు ఎన్ని జన్మములవరకైన ఈసంసారము ఇట్లే అనువర్తించి
వచ్చుచుండును. దానికి తగిన చికిత్స జరుగకుండిన అదీ నరకపట్టణమునం
దుండు దుఃఖములకును ఈపురుషునకును నిత్యసంబంధమును గలిగించుచుం
డును. ఆనరకపట్టణమునందు ఎన్ని బాధలుండినను అవియెంత సహించగూ
డనివైనను వానిని ఎన్ని మాఱులు అనుభవించినను పురుషుని మంచిత్రోవకు

ఆసంసారమను విషూచికాజాడ్యము తిరుగనియ్యదు. ఆబాధలయందే మఱల మఱల పడద్రోయుచుండును. ఆనరకమున గలుగు కత్తిఁవేటులను కలువ పూవుల దెబ్బలవలె అలక్ష్యముగా భావించును. అప్పటి అగ్నివర్షమును మంచువానగా తోచునట్లుజేయును. అవయవముల గర్తరించుటను చందనలేపనమువలె చేయును. ఎడములేని బాణవర్షమును గ్రీష్మకాల తాపమును శమింపజేయుటకై ఏర్పరుపబడిన ధారావర్షమువంటిదిగా నొనర్చును. శిరస్సును ఛేదించుట సుఖనిద్రవలె భావింపజేయును. నోరుకుట్టుట అను శిక్షను మహాగౌరవమువలె దోచునట్లుచేయును. కుడిచెవిలోనుంచి ఎడమచెవికి బాడుచుశిక్ష మహాభివృద్ధిగా దలంపజేయును గాని, ఈశిక్షవలన మనస్సును కొంచెమైనను భయము నొందనీయదు. ఇట్లుండిన నామనస్సు చకటాని త్రోవకుబోవుననుట సంభవింపదుగదా? కావున ఈసంసారమను విషూచికాజాడ్యమునకు శీఘ్రముగా చికిత్సను ఆచరించి తీరవలయును. కావున నోరఘువరా! శ్రీరామా! శాస్త్రములను అనుసరించి బాగుగ విచారించియే వ్యవహారములను ( సంసారవ్యవహారములను ) ఆచరింపవలయును కాని, చిత్తమునకు లోబడి యథేచ్ఛముగా ప్రవర్తింపరాదు. " శాస్త్రములను ఏవిధముగ విమర్శించిన నిరపాయమగు జ్ఞానము గలుగును, ఏజ్ఞానమువలన మనము కృతార్థుల మయ్యెదము " అను నభిప్రాయముతో సర్వకాలములయందును విచారణలను గావింపవలయును. క్రమక్రమముగా చిత్తమును పురుషప్రయత్న బలముచేత పరిపక్వముచేసి మోక్షప్రదమగు విజ్ఞానమును సంపాదింపవలయును. ఏమహానుభావుడు స్వానుభవము, శాస్త్రము, గురూపదేశము, అనువానిని మూటిని పరస్పరము విరుద్ధములు కాకుండా సమన్వయించి సర్వకాలమును చిత్తమును నిగ్రహించి అభ్యాసము నొనర్చునో వాడే పరబ్రహ్మమును గనుగొనును. కొంచెము సంసారమునుజెంది పరిపక్వమైన బుద్ధిగలవారలకు గల భ్రాంతిని తొలగించుటకు ఈవేదాంతశాస్త్రముతో లేక బ్రహ్మోపదేశముతో సమానమగుశాస్త్రము మఱియొకటి లేదు.

ఓ శ్రీరామా! ఒకచిప్పను చేతదీసికొని చండాలవీథులయందైనను బిచ్చమెత్తియైన జీవింపవచ్చునుగాని మూర్ఖుడై జీవింపరాదు. ఎట్లైనను మనస్సును నిగ్రహించి పరబ్రహ్మమును తెలిసికొనవలయునే కాని ఇకనేమి చేసినను శాశ్వత సుఖము కలుగదు. సంసార విషూచికాబాధ తొలగదు. ఈవిషయమునందు మనోనిగ్రహరూపమగు యోగమొకటియే సహాయ

కారి. ధనములుకాని బంధుమిత్రులుగాని హస్తపాదాదులచేత జేయబడు బహువిధములైన కర్మలుగాని దేశములుదిరుగుటగాని ఇంచుకయైన సహాయమును జేయనేరవు. ఎంతదేహశ్రమనొందినను ఎన్నితీర్థముల దిరిగినను ఆమోక్షము దొరకనేరదు. కావున మోక్షము సంపాదింప వలయుననిన మనోనిగ్రహమునే చేయవలయును. అట్లుచేసి పిమ్మట పైనవర్ణింపబడిన మోక్షద్వారపాలకులలో నొకనినైన వశపరుచుకొనవలయును. వాడు నిశ్చయముగా మోక్షద్వారమును తెరుచును. వారిస్వభావమును క్రమముగ దెలిపెదను వినుము.

## —* శాంతిస్వరూప వర్ణనము. *—

ఓరఘురామా! అందు శాంతియనునది మొదటి ద్వారపాలకురాలు. దానిని సేవించి వశము జేసికొనినయెడల చీకట్లు సూర్యునిచేంత జేరనట్లు సమస్తదుఃఖములును, విశేషపరితాపమును గలిగించునట్టి ఆశయును, మఱియు అనేకవిధములగు ఓర్వరాని మనోవ్యధలను, సమీపమునకైనను రావు. శాంతిగల పురుషుని జూచిన శాంతమృగములగు లేళ్లుమొదలగు నవియు కౄరములగు సింహశార్దూలములు మొదలగునవియు తమతమతల్లులను జూచినసమయమునందువలె మిక్కిలి విశ్వాసము గలవి యగును. మఱియు చిత్తము శాంతిచేత అలంకరింపబడినప్పుడు గలుగు మహాసుఖము ఎట్టి రసాయనము తుదకు అమృతమును పానము చేసినప్పుడు సహితము కలుగదు. సర్వధనమును గృహమునకు వచ్చిచేరినను గలుగదు. ఓ శ్రీరామా! శుభాశుభపదార్థములలో దేనినివినినను దేనిని స్పృశించినను దేనిజూచినను, ఆస్వాదించినను, ఆఘ్రాణించినను, ఏపురుషుని చిత్తమున హర్షశోకములను రాగద్వేషములనుపొందడో, అట్టివాడు శాంతుడని చెప్పబడును. ఎవనిమనస్సు చంద్రబింబమువలె అతి నిర్మలమై తృప్తిమైనను ఉత్సవమైనను యుద్ధమైనను కలతనొందదో అట్టిపురుషుడు శాంతుడని చెప్పబడును. అరణ్యమునందుండి సర్వమును పరిత్యజించి తపమును జేయు మునులయందైనను యజనయాజనాది షట్కర్మముల నాచరించుచూ విహరించునట్టి గృహస్థులయందైనను సర్వశాస్త్రములను విమర్శింపగల పండితులయందైనను భూభారమునువహించు రాజులయందైనను బలవంతులగు వీరులయందైనను ఎట్టి గుణవంతులయందైనను శాంతిగలవాడొక్కడే సర్వోత్తముడై ప్రకాశించును. కావున నోరఘునందనా! రామా! గొప్పబుద్ధిగల మహాత్ములు అమృతముతో సమానమైనట్టియు పరులచేత నపహరింపబడుటకు శక్యముగానట్టి

యు శ్రేష్ఠులగు నందఱచేతను ఆదరింపబడినట్టియు నీశాంతినే ఆశ్రయించి కృతార్థులైరి. నీవును మోక్షసిద్ధికై ఆమార్గమునే అవలంబింపుము.

## —* ఆత్మవిచారము. *—

ఓశ్రీరామా! ఇక మోక్షద్వారమునకు రెండవ ద్వారపాలకుడగు ఆత్మవిచారముయొక్క ప్రభావమును వినుము. "ఈప్రపంచము అజ్ఞానముచేత గలిగినది" అని కారణము నెఱిగిన పురుషుడు శాస్త్రార్థజ్ఞానముచేత మిక్కిలి నిర్మలమైనదియు వైరాగ్యాది గుణములచేత పరిశుద్ధమైనదియునగు బుద్ధిచేత సర్వకాలములయందును ఆత్మవిచారమును ఆచరింపవలయును. ఇట్టి విచారముచేత పదును పెట్టబడినదీ అయ్యేనేని ఆబుద్ధి పరమపదమును గాంచును. అనాదియును అనంతము నగుసంసార రోగము నివర్తించుటకు ఆత్మవిచారమే పరమ ఔషధముగదా? బుద్ధిమంతుడగువాడు ఈవిచారబలముచేత తనకెంతయాపద సంప్రాప్తమైనప్పుడును "నేనెవ్వడను? సంసారమేమి? నాకును సంసారమునకును సంబంధమేమి?" అనియే విచారించుచుండవలయును. కష్టముచేత మనస్సు బహువిధముల బోవుచుండినను దానినటు పోనీయక నిగ్రహించి పైవిచారమునందే నిలుపవలయును. ఇంతయే కాని "ఈయాపద నాకేకలిగినది దీనిని నేనే ఎట్లైనను తొలిగించుకొనవలయును" అని అహంకార పూర్వకమగు విచారము చేయరాదు. అది బంధహేతువు గదా? ఈ నేత్రము చీకటియందుగాని అధికమగు తేజస్సునందుగాని చెడిపోవును. వస్తువుల జూడనేరదు. విచారమను నేత్రము అట్టిదిగాదు. చీకటియందు నశింపదు. కాంతియధికమైనప్పుడు మిఱుమిట్లు గొనదు. నేత్రములకు అగోచరమగు దానినిగూడా జూచును. ఇది మిగుల మనోహరమైనది. "నేనెవ్వడను. సంసారమనుపేరుగల దోషము నాకెట్లువచ్చినది" అని న్యాయానుసారముగ విమర్శించుట ఏదికలదో దానికి విచారమని పేరు.

## —* సంతోషప్రశంస. *—

ఓరామా! ఇక మూడవ ద్వారపాలకుడు సంతోషము. ఓశత్రుసంహారకా! రామచంద్రా! సంతోషమే గొప్పశ్రేయస్సు. సంతోషమే శ్రేష్ఠమగుసుఖము. ఏపురుషునికి సంతోషము ఉండునో వానికేచిత్తవిశ్రాంతియొక్క సుఖము దొరికెను. సంతోషమను అమృతమును పానముచేసి చిత్తవిశ్రాంతికలిగి ఏమహాత్ములు తృప్తిజెంది యుందురో అట్టివారికి సామ్రాజ్యభోగము సహితము విషప్రాయమగును. పరిత్యాజ్యమే యగును.

తానుకోరినవస్తువు దొరకకున్నను ఆవిషయమున దుఃఖమును జెందక వచ్చినదానితో తృప్తిజెంది హర్షశోకములు ఎప్పుడును లేక సమచిత్తుడై యుండు పురుషుడే సంతుష్టుడని చెప్పబడును. అట్లుగాక ఆశాపిశాచమునకు లోబడునేని ఆతని చిత్తము దానికిలోబడి ( ఆశకులోబడి ) తనకుతానే అస్వాధీనమగును. అట్టిమనస్సునందు "మాసినయద్దమునందు ముఖమువలె" ఆత్మజ్ఞానము ప్రతిబింబింపనేరదు. మఱియును ఏపురుషుడు రానిదానిని కోరడో, వచ్చినదానిని శుభమైనను అశుభమైనను సంతోషముగ అనుభవించునో సర్వకాలములయందును అతిశాంతస్వభావుడై యుండునో, అట్టివాడే సంతుష్టుడనబడును. ఓరఘురామా! నిర్మలుడగు ఏపురుషుడు గుణవంతుల కందరకును సమ్మతమగు సమభావముచేత ప్రకాశించుచుండునో అట్టివానికి సకల మనుష్యులును నమస్కారములు చేయుదురు. మహర్షులు సహితము అతిభక్తితో వందనములు నాచరింతురు.

## —* సత్సాంగత్య ప్రశంస. *—

ఓపరాక్రమవంతుడా! శ్రీరామా! మోక్షద్వారపాలకులు నలువురిలో సాధుసంగమము అన్నిటికంటే ప్రధానమైనది. ఇది తక్కినవారికి మువ్వురకును ఉపకారముచేయును. సత్పురుషులతో స్నేహముచేయక శాంతి మొదలగునవి దృఢములుకానేరవుగదా? విద్వాంసులతో సమాగమము గలిగిన సమయములయందు శూన్యస్థితి అనగా ఏమియు తోపకుండుస్థితి చెడకపోవును. అనగా మంచిస్థితియే యగును. మృత్యువైనను సంతోషకారియే యగును. ఎట్టియాపదయైనను సంపదవలెనే ప్రకాశించును. ఏమహాత్ముడు మిక్కిలి చల్లనైనట్టియు అతి నిర్మలమైనట్టియు సత్పురుష సమాగమమను గంగాజలముచేత స్నానమును చేయునో అట్టివానికి దానములతోనేమిప్రయోజనము? తీర్థయాత్రలేల? తపస్సులేమిటికి? యజ్ఞములెందుకు? పరమార్థతత్వమును బాగుగ తెలిసికొని ఎట్టిసంశయమునులేక సర్వజనులచేత నాదరింపబడుచున్న సత్పురుషులను, మహాత్ములను, అవశ్యముగ సేవింపవలయును. సంసారసముద్రమును తరించుటకు వారే ఉపాయభూతులు. కావున నోరామచంద్రా! ఇట్లు వర్ణింపబడిన శాంతిమొదలగు నలువురును మోక్షప్రాప్తికి ఉపాయభూతులు. అతిపరిశుద్ధులు. మనస్సును నిగ్రహించి దృఢమగు పురుష ప్రయత్నమును గావించి ఆశాంతిమొదలగువారిని ఎవ్వరు సేవింతురో, అట్టి మహానుభావులు అజ్ఞానమను జలముతో నిండిన సంసార సముద్రమును అవశ్యముగా తరింతురు. తరించినారనియే తలంప

వలయును. ... ... ... *

—* మోక్షోపాయాభ్యాసఫలము. *—

కావున నో శ్రీరామా! నీవును ఈశాంత్యాదుల నలువురను ఉపాసించి అపరిమితమ సద్గుణలక్ష్మితోగూడి ప్రకాశింపుము. అజ్ఞానమునుపోగొట్టుకొనుటకై ఇకనీకు తత్త్వోపదేశమును చేసెదను. దానినిగమనించి వినుము. ఓశత్రుసంహారకా! రామచంద్రా! పైనవివరించిన మోక్షోపాయవృత్తాంతమును ఎవ్వడు భక్తితోవినునో వానికి స్వయముగ ఇచ్ఛలేకపోయినను అత్యుత్తమమగు బ్రహ్మజ్ఞానము తనంతట తానే వచ్చును. శరీరమునుధరించుచుండుటచేత ఒకప్పుడు వచ్చుచున్నను కామక్రోధాది దోషములు మిక్కిలి స్వల్పములై నామమాత్రావశిష్టములై యుండును. మనస్సున్ను శరత్కాలమునందలి సరస్సువలె మిక్కిలి నిర్మలత్వమును బొందును. మఱియు దీనత్వము, లేమి, అనుమొదలగు దోషములతో గూడిన తలంపులన్నియు అనగా "నాకిప్పుడు దీనత్వము కలిగినది. నేను దరిద్రుడను" అను మొదలగు తలంపులు స్వస్వరూపమునకంటే వేరై అనగా అట్టిజ్ఞానము కలుగుటచేత భిన్నములై "తగిన సన్నాహముతో నున్నవానిని బాణములేమియు చేయలేనట్లు" ఏమియును చేయనేరవు. పూర్వమువలె మర్మముల భేదించి ఆయాస పరుపనేరవు. ఇదియునుగాక సంసారభయములు మనస్సును గలంపనేరవు. మొట్టమొదట మందరపర్వతముచేత జిలుకబడి పిమ్మట ఆపర్వతము నెత్తివేసిన తోడనే క్రమక్రమముగా శాంతినొందిన క్షీర సముద్రమువలె సంసారభయమువలన ఎంతవరకును సంక్షోభింప జేయబడుచున్న మనస్సునందు సమభావము ఉదయించును. దానివలన పరమశాంతి కలుగును. బాగుగా ఆత్మవిచారణ చేసినవానికి సముద్రునకువలెగాంభీర్యమును, మేరుపర్వతమునకువలె ధైర్యమును, చంద్రునకువలె చల్లదనమున్ను గలుగును. అంతఃపురమునందుమాత్రమే విహరించుచు వెలుపలికి ఎప్పుడును రానొల్లని పతివ్రతవలె అట్టివానియొక్కబుద్ధి శాస్త్రములకును సదాచారములకును అనుకూలములగు మార్గములయందు మాత్రమే ప్రవర్తించుచు దానితోనే ఆనందించుచు నుండును. భూత భవిష్య త్కాలములనుగూర్చి విచారింపక వర్తమాన కాలమును అనుసరించిమాత్రమే ప్రవర్తించుచుండును. ఇదియే జీవన్ముక్తస్థితి. ఆమహానుభావునకు ఇట్టిజీవన్ముక్తస్థితి క్రమక్రమముగా నభివృద్ధియై బాగుగ పరిణమించి వాక్కుతో చెప్పుటకుకూడా అలవికానిదగును. అమ్మహాత్ముడును క్రమక్రమముగా సర్వభేదములను పరిత్యజించువాడ

గుటచేత ఆతనిస్థితి అంతకంతకును అత్యుత్కర్షము నొందును. ఆజీవన్ముక్త డును లోకముతో సమానుడుగానే గానవచ్చునుకాని, క్రియలలో విశేష మేమియునుండదు. ఏయేకాలమునకు ఏదేదివచ్చునో దానిని అనుసరించుచు నే యుండును. అయినను, సామాన్యజనులకు ఆకార్యములవలన గలిగినసుఖ దుఃఖములు హర్షశోకములను గలిగించును. మనస్సును తమ అధీనముగా జేసికొని ఆకర్తల బాధించును. జీవన్ముక్తునకన్ననో, అట్టిబాధ లేదు. కర్తృ త్వాభిమానము లేకపోవుటచేత హర్షశోక వశగతమగు చిత్తము అమ్మహా త్ముని ధైర్యమునకు హాని గలిగింపనేరదు. ఆతనిని జయింపనేరదు. మఱి యు నమ్మహాత్ముడును సుఖమువచ్చిన సంతోషింపడు. దుఃఖమువచ్చిన ద్వే షింపడు. ఇదియునుగాక ఏపురుషుడు చిత్తశాంతిగలిగి కూర్చుండి సంప్రా ప్తములైన విషయభోగములను కాలానుసారముగా నభిమానరహితుడై అనుభవించుచుండునో, సదాచారములకు విరుద్ధముగా నాచరింపకుండునో, దేశ కాలానుసారముగా ఆత్మ విషయమునుగూర్చి బాగుగ ఏపురుషుడు విచారించునో, అనుకూలము ననుసరించి సత్పురుష సమాగమము నాచరిం చుచు తత్కాలీన మోక్షోపాయములనుగూర్చి ఏమహాత్ముడు చక్కగా ప్రయ త్నించునో, అట్టిపురుషునకు బ్రహ్మజ్ఞానము అవశ్యముగా దొరుకును. దాని చేత సంసారదుఃఖము నశించును. ఇట్లు జ్ఞానమును సంపాదించెనేని రెండవ మారు జన్మము గలుగదు. సుఖముగా గూర్చుండి వేదాంతశాస్త్ర విచార ము నొనర్చుటయును నింతమాత్రపు పనికిగూడా పాలుమాలి విషయభోగ ములందే ఆసక్తులై యుండి ఏపురుషులు సంసార వశగతులై సంచరింతు రో, అట్టివారు తమతను తల్లులమలమునందలి పురుగులు. అట్టి అధములపేరు లను వచింపరాదు.

ఓ శ్రీరామా! కావున బుద్ధిమంతుడగువాడు శాస్త్రములు, చిత్తవి శ్రాంతి, సత్స్వభావము, చక్కనిబుద్ధి, సత్పురుష సమాగమము, అను సాధనచతుష్టయముల ఎప్పటికిని నశింపనట్టియు, మోక్షమని పిలువబడున ట్టియు, సర్వసంక్షోభములను నశించుటయే స్వరూపముగా గలిగినట్టియు, చిత్తవిశ్రాంతి, స్వస్వరూపమునందు నిలకడ, దొరకునంతవరకును బ్రహ్మ విచారమును ఆచరించుచునే యుండవలయును. ఇట్లు విచారణచేయువాడు సర్వకార్యములను వదలివేయవలయుననియును ఎవ్వరితోను మాటలాడ కూడదనియు నియమమేమియును లేదు. ధర్మమునకు విరుద్ధము కాకుండా సర్వవ్యవహారములను ఆచరించుచు నుండవచ్చును. సమయానుకూలముగా

ధర్మార్థములను సంపాదించుచుండవచ్చును. ఇట్టి ప్రయత్నముతో మోక్ష
మును సంపాదించిన పిమ్మట సంసార సముద్రమును తరించిన పిదప నమ్మ
హాత్ముడు జీవించియున్నను, మృతుడైనను, సర్వవ్యవహారములను జరుపుకొ
ను గృహస్థుడైనను సర్వసంగ పరిత్యాగియగు సన్న్యాసియైనను, ఏకార్య
ములనైనను ఆచరించినను, లేకున్నను, వానికొకటియే. శ్రుతిస్మృతుల
ఆజ్ఞలతో వానికి ప్రయోజనము లేదు. విధినిషేధములు వానికి లేవు. అమ
హానుభావుడు " మందరపర్వతముతో చిలుకుటను మానిన పిమ్మట క్రమ
క్రమముగా శాంతమై ఏకరూపముతో నిలచియున్న సముద్రమువలె " అతి
శాంతుడై ఏకరూపముతో నుండును.

### వశిష్ఠుడు శ్రీరామునకు బుద్ధియొక్క తారతమ్యమును దెలుపుట.

ఓరామచంద్రా! ఇప్పుడు బుద్ధులలోని తారతమ్యములను గూర్చి
విస్తరించుచు జ్ఞానస్వభావమును వివరించెదను. సావధానుడవై వినుము.
బాలుడు చెప్పినను యుక్తిసహితమయ్యేనేని వానివాక్యమును అవశ్యము
అంగీకరింపవలసినదే. అట్లుకాదేని బ్రహ్మదేవుడు చెప్పినను ఆవాక్యమును
తృణమువలె పరిత్యజింపవలసినదే. ఓకకుత్స్థవంశభూషణమా! శ్రీరామా!
నీకు బ్రహ్మస్వరూపమును ఎఱిగించుటకై ఏఏదృష్టాంతములను బోధింతు
నో, అవియన్నియును ప్రాపంచిక పదార్థములే యగుటచేత మాయాకల్పి
తములు. కావున వానికి కారణములున్నవి. ఆదృష్టాంతములచేత ఊహించి
తెలిసికొనవలసిన బ్రహ్మమునకు మాత్రము మఱియొక కారణము లేదు. అది
యే సర్వకారణము కదా? కావున బ్రహ్మమునుగూర్చి ఏదృష్టాంతమును
చెప్పినను దృష్టాంత దార్ష్టాంతికములకు సంపూర్ణమగు పోలిక కుదరదు.
కావున ఈపరబ్రహ్మోపదేశమున నేను చెప్పబోవు అన్నిదృష్టాంతముల
యందును ఏదో ఒకభాగమునందుమాత్రమే అనగా మనకు కావలసిన భా
గమునందుమాత్రమే ( ఏవిషయమున దృష్టాంతము నొసంగుదుమో- ఆవిష
యమునందుమాత్రమే ) దృష్టాంత దార్ష్టాంతిక సంబంధము ఉండునని
గ్రహింపుము. ఇట్లుండుటవలన బుద్ధికి కొంత దార్ఢ్యము కలుగుటకై గురు
తులుగా చూపుటయేకాని నిరాకార బ్రహ్మమునకు సాకార పదార్థములు
దృష్టాంతము లెట్లగును? యథార్థస్థితిలో కాకపోయినను కొంత గురుతుల
కుమాత్రము ఉపయోగపడును. ఈవిషయమును తెలిసికొనలేక మూర్ఖులు
భ్రాంతులై తాము తత్త్వమును ఎట్లునుగుర్తింపలేక పోవుటయేగాక దానిని

సాధించు యుక్తులయందుగూడ విపరీత భావనను జెందుచు బహువిధము లగు ఖండనయుక్తులను కల్పించుచున్నారు. కుతర్కములను జేయుచు బ్రహ్మ స్వరూపానుభవము మొదలు ప్రపంచ లయమువరకు (అనగా "బ్రహ్మము ఇట్టివాడు" అని తెలిసికొనుట మొదలు "ఈప్రపంచమంతయును మనఃక ల్పితమే యగుటచేత బ్రహ్మాభిన్నము కాదు" అని తెలిసికొనునంతవరకు) గల జ్ఞానమునంతయును నాశనము చేయుదురు. అనగా తాము దెలిసికొ నలేక పోవుటయేగాక పరిపాకోన్ముఖములై యున్న పరుల హృదయముల గూడ చెరుతురు. వారియుక్తులన్నియు బాగుగ విచారించిన మిక్కిలి అప విత్రములై చెరచుటకుమాత్రము ఉపయోగించునవియై యుండును. కావున ఇట్టి బుద్ధితారతమ్యము నెఱిగి వారి ఉపదేశముల చెంత జేరరాదు. శాం త్యాది గుణములచేత దివ్యజ్ఞానమును అజ్ఞానముచే శాంత్యాది గుణములును పరస్పర మభివృద్ధిజెంది కమలములచే సరస్సును సరస్సుచే కమలములును మిక్కిలి ప్రకాశించునట్లు మిగులపోషింపబడునట్లుప్రకాశించును. పోషణము నుగూడ జెందును. మఱియు బ్రహ్మజ్ఞానము శాంత్యాదిగుణములను ఆగుణము లచేగూడిన సన్మార్గమును అనునీరెంటినిబాగుగనభ్యసించు నంతవరకునిందే దియునుసంపూర్ణముగాపరిపక్వముగాదు. ఏదియును మోక్షసిద్ధినిగలిగింపదు. కావున నో! శ్రీరామా! దుర్జనుల పొంతబోవక సత్పురుషసమాగమము నాచ రించుచు శాంతి మొదలగు సద్గుణములను బ్రహ్మజ్ఞానమును సంపాదింపవల యును. ఇట్లు సంపాదించిన నది అపరిమితమగుకీర్తియు మరణభయము అనగా సంసారభయము లేకుండుటయు గలిగించును. మోక్షరూపమగు పురుషార్థము నొసంగును. దీనిని బాగుగ గమనించి విని అనుసరించితివేని అప్రయత్నముగనే మోక్షము దొరుకును. ఇవ్విధముగ ఏపురుషుడు విచార శీలుడై తెలిసికొనదగిన పదార్థమును దెలిసికొనునో అట్టివానిమనస్సు అప్ర యత్నముగనే విశ్రాంతి నొందును. ఆపదార్థమును తెలిసికొనుటయు కష్ట ముగాదు. అది సర్వవ్యాపకమైనది. ఆవరణములు లేనిది. "ఈచోటనున్నది. ఈచోటలేదు. ఈసమయమునందు ఉన్నది. ఈసమయమునందు లేదు. ఈవ స్తువునందున్నది. ఈవస్తువునందులేదు" అను భేదము లేనిది. ఇది యింతయు నుగాక సర్వమును తెలిసికొనునట్టి జ్ఞానమే స్వరూపముగాగలది. ఇట్టిపదా ర్థము "తెలియబడదు." అనుటకే వీలులేదుగదా? "ఇతరపదార్థములను తెలిసికొనుచున్నాను" అను విషయము అనుభవసిద్ధములోనుండ జ్ఞాతను (ఆపదార్థముల దెలిసికొను వానిని) దెలిసికొన లేమనుట అతివిరుద్ధ

ముగదా?

* ... ...

ఇట్లు బ్రహ్మశ్రీ వెన్నెలకంటి సుందరరామ శర్మచే వచనకావ్యముగ రచియింపబడిన శ్రీవాల్మీకి మహర్షి ప్రణీత జ్ఞానవాశిష్ఠ రామాయణమునందు ముముక్షు ప్రకరణమున వైరాగ్యోపాయము తెలియజేయు నాలుగవసర్గ ముగిసెను.

ముముక్షు ప్రకరణము సమాప్తము.

# శ్రీజ్ఞానవాశిష్ఠము - వచనకావ్యము.

## ఉత్పత్తి ప్రకరణము.

### వశిష్ఠుడు శ్రీరామునకు ప్రపంచోత్పత్తిని తెలియజేయుట.

ఓరఘుకులతిలకా! రామచంద్రా! ఇదివరకు నీకు మోక్షేచ్ఛగలవాడు ప్రవర్తింపవలసిన సందర్భమునుగూర్చి వివరించితిని. ఇక ప్రపంచోత్పత్తిని దెలిపెదను. వినుము. ఈలోకమున మనము ఏపదార్థమును అనుభవమనియు, జ్ఞానమనియు, తెలివియనియు, జెప్పుచున్నామో, ఆపదార్థమునకే "ప్రత్యక్షము. అనిపేరుపెట్టితిమి." ఆపదార్థమే మనకు వ్యవహారములో నున్నజీవుడు. ఆసర్వసాక్షియగు జీవుడే బుద్ధ్యుపాధియందుండి జ్ఞానమనియు అహంకారోపాధియందుండి జ్ఞాతయగు పురుషుడనియు (సర్వమును ప్రత్యక్షాది ప్రమాణములచేత నెఱుగువాడనియు) బుద్ధిగోచరములగు శబ్దాదివిషయోపాధులయందుండి పదార్థమనియు జెప్పబడుచున్నాడు. ఇవ్విధముగా ఆ పురుషుడొక్కడే సంకల్ప వికల్పరూపములగు బహువిధ భ్రాంతులచేత ఆయాయుపాధి వశమువలన బహువిధములుగా నేర్పరుపబడి జలమొక్కటియైనను బహుసంఖ్యగల తరంగములుగా భావింపబడుచున్నట్లు ప్రపంచరూపముతో భావింప బడుచున్నాడు. "నిర్వికారమగు బ్రహ్మమునకు ఉపాధిసంబంధము ఎట్లుకలిగెను. మఱియు సృష్టికిపూర్వము ఉపాధులే లేవుకదా. ఇదియునుంగాక ఉపాధిసంబంధమువలన బ్రహ్మమును ప్రపంచరూపముగా భావించువాడెవ్వడు? బ్రహ్మము అద్వితీయుడుగదా" అని సంశయింతువేమో, వినుము. ప్రత్యక్ష శబ్దవాచ్యమగు నీబ్రహ్మము సృష్టి

కిబూర్వమున కార్యములేమియును లేకపోవుటచే దేనికిని కారణములేకనే యుండెను. ఏయుపాధులతోను సంబంధపడకనే యుండెను. అయినను ఆబ్రహ్మమునందు అనాదినుండియును అభేదరూపముతో ఇచ్ఛాశక్తికలదు. ప్రపంచమనాది కావున పూర్వకల్పాంతమున నశించి తనయందే లీనులై యున్న జీవుల కర్మము ఫలోన్ముఖములైనప్పుడు ఆశక్తి విజృంభింపనారం భించును. అనగా బ్రహ్మమును ప్రపంచరూపముగా దోచునట్లు చేయుటకు ఆరంభించును. అనగా ఆ ఇచ్ఛాశక్తికి అజ్ఞానమే స్వరూపమగుటచేతను, అది యాబ్రహ్మమునందే అభేదస్వరూపముతో నుండుటచేతను, ఆబ్రహ్మ ము తనకుదానే ప్రపంచరూపముగా స్ఫురింప నారంభించును. అప్పుడు వాస్తవస్థితిలో తనకంటె వేఱుకాకపోయినను వేఱుగానున్నట్లు దోచుప దార్థములు అనేకము లుండుటచేత వానికి దాను కారణమగును. కావున నీప్రపంచము అంతయును బ్రహ్మాభిన్నము కానేరదు. బాగుగ విచారించి చూచిన సూర్యప్రకాశ సహాయమువలన కంటితోజూడబడునట్టియు తక్కిన ఇంద్రియములచేత గ్రహింపబడునట్టియు మనస్సుచేత ఊహింపబడునట్టి యు బహువిధ పదార్థములచే నిండిన ఈప్రపంచమంతయును త్రికాలముల యందును గాలిలోనుండు చలనశక్తివలె పరబ్రహ్మమునందే అభేదస్వరూ పముతో నున్నది. గాలికంటె భిన్నముగాగాని అభిన్నముగాగాని భిన్నా భిన్నముగాగాని ఆచలనశక్తిని నిరూపించుటకు ఎట్లు వీలులేదో అట్లే ఈప్ర పంచమునుకూడ బ్రహ్మమునకంటె భిన్నముగాగాని అభిన్నముగాగాని భిన్నాభిన్నముగాగాని నిరూపించుటకు వీలులేదు. ఈవిధముగా స్వభావ ముగ శుద్ధమయ్యును ఇచ్ఛాశక్తియును ఉపాధి సంబంధమువలన సర్వమ యమైయున్న జ్ఞానరూప పరబ్రహ్మము ఏసమయమున (సృష్టిసమయ మున) జీవాదృష్టాది కారణములవలన లేక ఉపాధిప్రభావమువలన తన కుతానే ప్రపంచరూపముతో స్ఫురించునో అప్పుడు ఓకుఱుఖు కాలములు రూపములు లోపల వెలుపల అను మొదలగు ఆకార్యములతో గానవచ్చు ను. మఱియును ఏయేకాలములయందు ఏయేవిధములుగా ప్రకాశించునో అనగా మనోవైచిత్ర్యమువలన నేర్పడునో ఆయాకాలములయందు ఆయా రూపములతోనే యున్నట్లు ప్రకాశించును. సర్వాత్మకునకు ఏరూపమును విరుద్ధముకాదుగదా. ఈవిధముగా పరబ్రహ్మమునకు వాస్తవమగు కర్తృ త్వము లేకపోవుటచేతను మనోరూపిణియగు ఇచ్ఛాశక్తియే సర్వమునకు గారణమగుటచేతను దానిస్వరూపమునుగూర్చి విచారించిన నది అసత్యమే

యగుటచేతను ఈప్రపంచము సరియగు కారణమువలన బుట్టినదికాదు. కావున ప్రత్యక్షముగ సర్వప్రమాణ సిద్ధుఁడై గానవచ్చు జ్ఞాతయే (సర్వసాక్షియగు బ్రహ్మమే) సృష్టికర్త యనవలసియున్నది. ఇంతకంటే జగత్కారణమునుగూర్చి యేమియును జెప్పుటకువీలులేదు కదా. "ఇట్లుకాదు. బ్రహ్మమునకు కారణత్వము ఉండుటకువీలులేదు. కావున అనుమాన ప్రమాణమునుబట్టి జగత్కారణమును మఱియొకదానిని నిర్ణయించిన బాగుండును" అనియెదవేమో వినుము. అట్లుజేయుటకు ఎప్పటికిని వీలులేదు. ఏ అనుమానమైనను ఉపమానమైనను అర్థాపత్తి మొదలగు ఇతర ప్రమాణములైనను ప్రత్యక్షమును ఆశ్రయించినవేకదా. కావున నవి ప్రత్యక్షసిద్ధమగు విషయమునకు బాధ కలిగింపనేరవు. బాగుగవిచారించిన నీప్రపంచమునకు జ్ఞానభిన్నమగు స్వరూపము ఏదియును గానవచ్చుట లేదు. ఆబ్రహ్మమును జ్ఞానస్వరూపుఁడై యున్నాఁడు. కావున ఆబ్రహ్మమే ప్రపంచ కారణమనుటలో సంశయము లేదు. ఇదియునుగాక బ్రహ్మమునకు స్వరూపమే జ్ఞానము కావునను అనుమానాది ప్రమాణములుకూడ జ్ఞానరూపములే యగుటచేతను ఆరెంటికిని భేదము ఉండుటకుగూడా వీలులేదుగదా. మఱియు జీవునకు గలదని చెప్పబడు బంధము దృశ్యమగు నీప్రపంచము ఉండుటచేత గలిగినది. ఈదృశ్యము లేకపోయినను ఉన్నట్లు తోచుచున్నను వాస్తవస్థితిలో సత్యముకాకపోయినను ఈబంధము కలుగదు. కావున నీదృశ్య స్వరూపమును దెలిపెదను వినుము. స్థావర జంగమరూపమై తోచు నీప్రపంచమంతయును నిద్రాకాలమునందు స్వప్నము నశించినట్లు ప్రళయ కాలమునందు నశించును. ఆసమయమున నతిస్థిరమైనదియు గంభీరమైనదియు సర్వవ్యాపకమైనదియు చీకటియు వెలుతురునుగానిదియు నామరూపములు లేనిదియు నగు నొకానొక పదార్థము మిగిలియుండును. అట్లుమిగిలియున్న యామహాత్మునకు వ్యవహారార్థమై విద్వాంసులు ఋతమనియును, ఆత్మయనియును, పరబ్రహ్మయనియును, సత్యమనియును, మఱియు అనేక విధములుగ సంజ్ఞలను గల్పించియున్నారు. ఈవిధముగ ఆయాత్మ సర్వశేషి (ప్రపంచమంతయు నశింపగా మిగులువాఁడు) అయ్యును దేనితోను సంబంధింపక అద్వితీయుఁడై యుండియు స్వయముగనే భ్రాంతివలన అన్యుఁడుగ నేర్పడును. ఆకాశము సర్వవ్యాపకమై యున్నను జలములయందు ప్రతిబింబించినప్పుడు తానే తనకన్యముగ దోచునట్లు ఈ బ్రహ్మమును అనాదియగు మాయయందు ప్రతిబింబించి తనకుతానే అన్యుఁడుగా దోచును. ఇట్లుతోచి జీవత్వ

మును జెందినట్లుండును. భ్రాంతికల్పితములగు నవి తోచుటమాత్రమేకాని పరమార్థసత్యములు కావుకదా. మఱియు "బ్రహ్మమునకు నామము లేదంటిరికదా, ఇట్టివానికి జీవనామము ఎట్లుకలిగెను" అని సంశయింపవలదు. ఆనామము పిమ్మట అనగా మనస్సు మొదలగునవి సృష్టియైన పిమ్మట గలుగబోవు నామమునుబట్టి చెప్పబడినది. ఇట్లు జీవశబ్దవాచ్యుడైయున్న ఆపరబ్రహ్మమే భ్రాంతి సంకల్ప విశేషమువలన మొట్టమొదట అహంకారముగాను పిమ్మట బుద్ధిగాను తరువాత మనస్సుగాను పరిణమించును. అనగా మనస్సునకుగల సంకల్పాదులయొక్క భ్రాంతిచేత దనవిగా భావించును. లేక మనోరూపుడేయగును. ఇట్లు చాంచల్యము కించిత్తైనను లేని పరబ్రహ్మమునుండి స్థిరమగు "సముద్రమునుండి తరంగము జనించినట్లు" మనస్సుజనించెను.

ఓరామా! ఈవిధముగ మనోరూపమును జెందియున్న యాపరబ్రహ్మము పూర్వప్రపంచ సంస్కారము అనుసరించి సర్వమును అనగా సర్వప్రపంచమును సంకల్పించును. ఆసంకల్పముచేత ఆయాకారరూపుడునగును. ఇట్లగుటచేత నీజగత్తను ఇంద్రజాలము ప్రవర్తిల్లుచున్నది. కావున నీప్రపంచమంతయును మనోమయమే. సంకల్పరూపమే. కావున లోకమున "కడియము" అనుశబ్దమునకు అర్థమగు పదార్థము "సువర్ణము" అనుశబ్దమునకు అర్థమగు పదార్థమునకంటే భిన్నముగనుండుటకు వీలులేదో ఆసువర్ణపదార్థమును కడియమను పదార్థమునకంటే ఎట్లుభిన్నముకాదో, కాదగదో, అట్లే ఈప్రపంచ పదార్థముకూడ బ్రహ్మపదార్థమునకంటే భిన్నముకాదు. కాతగదు. బ్రహ్మపదార్థమును అట్లే ప్రపంచపదార్థమునకంటే భిన్నముకాదు. కాతగదు. "ఇట్లు చెప్పిన నెట్లు? మొట్టమొదట మనస్సునకే స్వరూపములేకుండగా, దానివలన బ్రపంచమెట్లుజనించును" అని సంశయింపనక్కరలేదు. ఎండమావులు స్వయముగ నసత్యములేయైనను వానియందు అనగా వానియందు గానవచ్చు నీటిలో అలలుతోచుచున్నవి. ఇట్లే మనస్సునకు స్వరూపము లేకున్నను దానియందు బ్రపంచము తోచుచున్నది. యథార్థసత్యము కాకపోయినను తోచుటకుమాత్రము ఆక్షేపమేమియు లేదుకదా. భ్రాంతివలన లేనిది ఉన్నట్లు కానవచ్చుట అనుభవసిద్ధమే. ఆభ్రాంతికి మహాత్ములైనవారు దానిస్వభావములను అనుసరించి అవిద్యయనియు, సంసారమనియు, మోహమనియు, బంధమనియు, మాయ యనియు, మలమనియు, తమస్సు అనియు సంజ్ఞల గల్పించి యున్నారు. విద్యయన

గా జ్ఞానము. దానిచేత నశింపజేయబడినది కావున దీనికి అవిద్యయను సంజ్ఞ జేయబడెను. ఊర్ధ్వలోకములయందును అధోలోకములయందును మధ్య లోకములయందును బహువిధ జన్మములను గలిగించునది కావున దీనికి సంసారము (త్రిప్పునది) అని పేరు. స్వస్వరూపమును ఎఱుగనీక, అసత్యపదార్థములను ఆత్మగ భావింపజేయునది కావున దీనికి మోహమను నామము కలిగెను. "ఉన్నది" అనికాని "లేదు" అనికాని నిరూపించుటకు వీలు లేనిదగుటచే దీనికి మాయయను నామధేయమువచ్చెను. దేనితోను సంబంధములేక దేనికిని బద్ధుడుగాకనుండు ఆత్మునకు రాగద్వేషాది బంధములు కల్పించునది యగుటచే దీనికే బంధమనియు పేరు. మఱియు సర్వకర్మలకు గారణమగుటచేత మలమనియు అంధకారమువలె తత్త్వమును ఆవరించుటచేత తమస్సనియు దీనికే పేరు. ఇక నోరఘుకులతిలకా! శ్రీరామచంద్రా! ఈబంధముయొక్క స్వరూపమును వివరించెదను వినుము. దానిని బాగుగా నెఱిగిన మోక్షస్వరూపమును స్వయముగనే తెలిసికొనగలవు. ఆమోక్షమే స్వరూపమగుటవలన ఈయథార్థ స్వరూపమునుగూడ అప్పుడే తెలిసికొనగలవు.

ఓ శ్రీరామా! తనకంటే అన్యముగ నొకపదార్థము కానవచ్చుచుండుటయే బంధము. "ద్వితీయాద్వై భయం" రెండవపదార్థము ఉండిననేకదా భయము. అను మొదలగు శ్రుతులు ఈవిషయమునే స్పష్టముచేయుచున్నవి. ఇచ్చట రెండవపదార్థము భ్రాంతిగనే లేనిదయ్యును అజ్ఞానమువలన ఉన్నట్లు తోచుచున్నవి. కావున భేదదర్శన కారణమైన అజ్ఞానమే బంధము. ఆయజ్ఞానము తొలగి రెండవపదార్థము కానరాక పోయినచో నదియే మోక్షము. "ఇది ప్రపంచము. నీవు. నేను." అని అనేకవిధములుగ తనకంటే భిన్నములగు పదార్థముల సంకల్పబలముచేత నిర్మించుటయే స్వరూపముగాగల సర్వపదార్థములును దృశ్యము అనబడును. ఇట్టిదృశ్యములు అనగా నిట్టికల్పన ఎంతకాలము ఉండునో అంతకాలము మోక్షము లేదు. సుషుప్తిమొదలగు అవస్థలయందు ఈభేదప్రపంచకల్పన లేదు కాని, అప్పుడు అజ్ఞానముమాత్రము అట్లే యుండును. ఇది అనుభవసిద్ధము. ఇట్లగుటచేత తామరతీగెయొక్క నీలరూపము తామరవిత్తనమునందును ఆవిత్తనముయొక్క నల్లనిరూపము తామరమిద్దెలోని సూక్ష్మావయవములందును సంస్కారరూపముతోనున్నట్లు ఈభేదవాసనయు చూచుపురుషునియందు సంస్కారరూపముతో నుండును. ఇట్లుండుటచేత బీజమునందు అతిసూక్ష్మ

రసాపముతో నున్న మొలక సకాలమున విజృంభించునట్లు ఈభేదవాసనయు సుషుప్తికాలమున నట్లేయుండి జాగ్రదవస్థరాగానే విజృంభించును. తామ రవిత్తనము మొదలగు పదార్థములయందు ఆయావృక్షములను జనింపజేయు సామర్థ్యము, లేక, సూక్ష్మస్వరూపము వినాశరహితమై సర్వకాలముల యందును ఏకరూపముతో నుండునో అట్లే ఈజ్ఞానరూపుడగు బ్రహ్మము నందుకూడ నీభేదవాసన, లేక, ప్రపంచముయొక్క సూక్ష్మరూపము సర్వ కాలములయందును నిలచియే యుండును. ఇట్లుండుటచేతనే మఱల మఱల జగదుత్పత్తి ఏకరూపముతో గలుగుచున్నది. ఓరామా ! ఏది ఎట్లున్నను సర్వాధారమగు మనస్సునకు స్వరూపమేలేదు. కావున ఈప్రపంచము ఆత్మభిన్నము కానేరదు. ఇట్లు సృష్టిని నిరూపించి దానినే మఱల బోధించు వాడై వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓశ్రీరామచంద్రా ! ఆకాశజోపాఖ్యానము చెప్పెదను వినుము. దానివలన నీకు ఈసృష్టిప్రకరణము తేటపడును.

### — * ఆకాశజోపాఖ్యానము. * —

ఓ శ్రీరామా! ఒకానొకసమయమున ఈలోకమునందు ఆకాశజుడను పేరుగల యొకబ్రాహ్మణుడుండెను. ఆతడు మిక్కిలి ధర్మాత్ముడు. ధ్యానశీలుడు. పరులమేలును తనపనిగా జూచుకొనువాడు. ఆతనికి అపరిమితమగు ఆయుష్యము అభివృద్ధియైయుండెను. ఎంతకాలమునకును ఆతడు మృతినొందలేదు. ఇట్టి అతనిని జూచి మృత్యుదేవత ఈక్రిందివిధముగ తలపోసెను. నేను ( మృత్యుదేవత ) స్వయముగ నాశమునొందక జంగమస్థావరరూపములైన సర్వభూతములను భక్షింపుచున్నాను కదా. ఆవిధముగ బ్రాహ్మణోత్తముడగు ఈయాకాశజుని ఏల భక్షింపనేరనైతిని. "కత్తిపదును రాతియందు వృథాయగునట్లు" నాశక్తి ఈతనియందు ఏల వృథయయ్యెను. అని ఇట్లు తలపోసి ఎట్లైన నీతని వధియింతునుగాకయనుచు నామృత్యువు స్వయముగ వాని నివాసమగు పట్టణమునకు వచ్చెను. ధీరులగువారు లేక పట్టుదలగలకొందరు తానుబూనిన పనిని పరిత్యజింపరు. ఫలము గలుగునంతవరకు ప్రయత్నించుదురు. ఇట్లు పురమును ప్రవేశించి యామృత్యుదేవత ఆకాశజుని ఇంటిలో నడుగుపెట్టగానే ప్రళయకాలవహ్నితో సమానుడైన అగ్ని అమృత్యువును దహింప నారంభించెను. ఇట్లు కాల్ప నారంభించినను ఆయగ్నిజ్వాలాసమూహమును ఎట్లెట్లోతొలగించి యామృత్యువు గృహములోనికి ప్రవేశించెను. అచ్చటనున్న ఆకాశజునిచూచి వానిని గొనిపోవుటకు చేతులుజాచెను. ఇట్లు ఆయాకాశజుని ప్రత్యక్షముగ జూచియు

స్వయముగ నెంతబలవంతుడయ్యును ఆమృత్యుదేవత మహాప్రయత్నము చేసియు మనోమయ పురుషునివలె నాతనిని పట్టలేకపోయెను. ఇట్లు విఫల ప్రయత్నమై మఱలి యామృత్యుదేవత యమునివద్దకు బోయి ఇట్లనియె. ఓప్రభువా! యమధర్మరాజా! నేనాకాశజుని భక్షింపలేకపోతిని. దీనికి కారణమేమి? అనిన యముడు ఇట్లనియె.

ఓమృత్యుదేవతా! నీవు ఎంతబలవంతుడవయ్యును స్వయముగ జంతువులను సంహరింపనేరవు. ఏపురుషుడు మృతిజెందవలయునో, వానికర్మములే వానిసంహరించును. ఇంతకంటె నితరమేదియును లేదు. కావున ఈ ఆకాశజుడు చేసినకర్మలను జూచితివేని ఆకర్మలసహాయముచేత నీవు ఈతని జంపగలవు. నీవు ఎప్పటికిని కర్మల సహాయముచేతనే కార్యములను ఆచరింపవలసి యున్నావు. ఇట్లు యముడుపలుకగానే సరియే యని యామృత్యుదేవత ఆకాశజునియొక్క కర్మల నెదకుచు సర్వరాష్ట్రములయందును దిరిగెను. సర్వదిక్కులను పరిభ్రమించెను. సర్వతటాకములను నదులను వెదకెను. ఇట్లు భూమండలమంతయు మహాప్రయత్నముతో సంచరించియు, ఆమృత్యువు ఆకాశజునియొక్క కర్మను ఒక్కదానినైనను కనుగొనలేకపోయెను. ఇట్లు విఫలప్రయత్నుడై మఱలివచ్చి యమునితో ఇట్లనియె. ఓమహాత్మా! యమధర్మరాజా! నేనకులకుగల సంశయములను తీర్చుటకు ప్రభువులేకదాగతి. కావున ఆకాశజుని కర్మము లెందున్నవి? ఆనతిండు. అని ప్రశ్నచేయగానే ఆయమధర్మరాజును విశేషకాలము ఆలోచించి ఇట్లనియె. ఓమృత్యుదేవతా! ఆయాకాశజుడు ఏకర్మలను చేయలేదు. ఈకారణమువలన ఆతనికర్మలు త్రిభువనములలో నెచ్చటను లేవు. మఱియును ఈయాకాశజుడు ఆకాశమునుండిమాత్రమే జన్మించెను కదా. ఇట్లగుటచేత అతడు ఆకాశమువంటివాడే. దేనితోను సంబంధము లేక అతి నిర్మలమైయుండు ఆకాశమువలె నీతడుకూడ దేనితోను సంబంధపడడు. నిర్మలుడై యుండును. మఱియు నీతనిజన్మమునకు ఆకాశమొక్కటియే తప్ప సహాయములుగానైన ఇతరకారణములు లేవు. ఒకఘటము కావలయుననిన దానికి మృత్తికయే ప్రధానకారణమైనను చక్రము దండము కుమ్మరవాడు మొదలగు పదార్థములు సహాయకారణములుగ నుండును. ఇట్టిస్థితియందుకూడ ప్రధాన కారణ కార్యములకు భేద ముండదు. కాని, “ కార్యకారణములకు భేదము లేదు ” అనిన “ కుమ్మరవానికిని ఘటమునకునుకూడ భేదములేదా? ” అని సంశయించుటకైనను గలుండును. ప్రకృతము ఆకాశజుని విషయములో

సహాయకారణములుకూడ లేకపోవుటచేత అట్టిసంశయమునకైన నవకాశ ములేదు. " ఆయాకాశమే ఈతడు " అనిచెప్పవలయును. ఘటాది విషయ ములలో సహాయకారణములు కలవుగావున పైనిరూపించిన సంశయము నకు అవకాశము ఉండునుగాని, త్రాటినిజూచి సర్పమని భ్రమించిన నా సర్పమునకు త్రాటికంటె భిన్నములగు కారణము లేవియును లేక పోవుట చేత ఆసంశయము గలుగనేరదుకదా. కావున సహాయకారణములులేక ఏపదార్థము దేనినుండిజనించునో అది దానికారణముకంటె భిన్నము కా నేరదనుట పామరులకుగూడ తెలిసినవిషయమే. కావున నీయాకాశజుడు ప్ర త్యక్షాకాశమే. ఆకాశమును నీవేమిచేయగలవు. కావున వీనిని సంహరించు విషయమున ప్రయత్నమును మానుము. అని ఇట్లుపలుకగానే ఆమృత్యుదే వతయు నాశ్చర్యమునొందుచు స్వగృహమునుజేరెను. ఇట్లు వశిష్ఠమహాముని ఆకాశజోపాఖ్యానమును ముగింపగానే శ్రీరామచంద్రు డిట్లనియె. ఓము నీంద్రా! వశిష్ఠమహామునీ! మీరిపుడుచెప్పినవాడు సామాన్య బ్రాహ్మణుడు కాడు. తండ్రులకుతండ్రియు తాతలకుతాతయు ఇతరకారణము లేవియు లేక స్వయముగ నుత్పన్నమైనవాడును అనగా అనాదినుండియు నేకరూప ముతో నుండువాడును ఏకార్యములను ఆచరింపనివాడును అగుటచేత జనన మరణములు లేనివాడును అద్వితీయుడును బుద్ధియే, లేక, జ్ఞానమే స్వరూప ముగా గలవాడునగు జీవుడే, లేక, హిరణ్యగర్భుడే కావలయునని నాకు తోచుచున్నది. ప్రతిశరీరమునందును ప్రత్యేకముగ "వీడువేఱు, వీడువేఱు" అని వ్యవహరింపబడు నొక్కొక్కజీవుడు వ్యష్టిజీవుడనియు సర్వజీవులును ఏకముగ అనేకవృక్షములతోగూడినవనమువలె వ్యవహరింపబడినచో నా తడు సమష్టిజీవుడనియు చెప్పబడుచున్నాడు. ఈసమష్టిజీవునకే హిరణ్యగ ర్భుడనిపేరు. అనితెలిసికొనవలయును. ప్రకృతము శ్రీరామచంద్రుడు తత్వ మును ఊహించి తనయభిప్రాయమును చెప్పగానే వశిష్ఠుడు దానికి అను మోదించుచు ఇట్లనియె.

ఓవీరుడా! శ్రీరామా! నీయూహ యథార్థము. నీకు చెప్పబడిన బ్రాహ్మణుడు-జీవరూపుడగు బ్రహ్మయే. పూర్వకాలమున పైన వర్ణించిన విధముగ మృత్యుదేవతయు యముండును ఈతనిగూర్చియే వివాదపడియుం డిరి. మన్వంతర సమయమున సర్వమును భక్షించు నామృత్యువు సమస్త జనులను భక్షించి అధికబలముగలదియై సమష్టిజీవుడగు హిరణ్యగర్భుని ఆక్ర మింప ప్రయత్నింపగానే దానికి యముడు ఇట్లని ఆజ్ఞచేసెను.

ఓమృత్యువా! నీవు ఈహిరణ్యగర్భుని ఎట్లాక్రమింపగలవు. ఆతడు ఆకాశమువంటివాడు. సంకల్పముచేత నేర్పడిన పురుషునకు సర్వావయవములును ఉన్నట్లుతోచినను పాంచభౌతికములగు ఏయవయవములును ఎట్లు లేవో, అట్లే ఈహిరణ్యగర్భునకును సర్వావయవములు, జనన మరణములును, ఉన్నట్లు తోచినను ఏవియు లేవు. మఱియు సంకల్పపురుషుడు (స్తంభము మొదలగువానియందు భ్రాంతిచేత నారోపింపబడిన పురుషుడు) శూన్యరూపమగు ఆకాశమునందు దానికంటే (ఆకాశమునకంటే) వేఱుకాకుండియు వేఱుగనున్నట్లు ఏవిధముగా దోచుచున్నాడో, అట్లే ఈహిరణ్యగర్భుడును (జీవులందఱును) బ్రహ్మమునందు బ్రహ్మమునకంటే భిన్నుడుకాకుండియు భిన్నుడుగ దోచుచున్నాడు. ఈవిధముగ పరాకాశరూపుడై నిర్వికారుడై బ్రహ్మమై యున్న హిరణ్యగర్భుడు (జీవులు) నీకు (మృత్యువునకు) సాధ్యుడెట్లగును. మనోవికారమువలన చిదాకాశరూపుడును జన్మాదివికారశూన్యుడునగు పరబ్రహ్మమే ఆకారవంతుడుగాను పురుషుడుగాను గానవచ్చుచున్నాడు. వాస్తవస్థితిలో "గొడ్రాలిబిడ్డనువలె" నీహిరణ్యగర్భునకును రూపముబొత్తిగ లేదు. ఇట్టివానిని నీవు (మృత్యువు) ఏమిచేయగలవు. ఓరామచంద్రా! ఈహిరణ్యగర్భుని స్వరూపమును వినుము. ఈహిరణ్యగర్భునకు సూక్ష్మశరీర మొకటియే కలదు. సూక్ష్మశరీరమనగా మనోమయశరీరము. పంచభూతమయమగు స్థూలశరీరములేదు. అనిన శ్రీరఘురాము డిట్లని ప్రశ్నచేసెను.

ఓ వశిష్ఠమహామునీ! ప్రపంచమునగల సర్వభూతములకును మనోమయమగు శరీర మొకటియు భూతమయమగు శరీరమొకటియు గలదు. ఇట్లుండగా బ్రహ్మకుమాత్రము ఒకటేశరీర మే ఏలయుండవలయును? అనిన వశిష్ఠు డిట్లనియె. లోకమునందు సర్వజంతువులకును పంచభూతములు ఉపాదానకారణముగ (కార్యరూపముగ బరిణమించు కారణము ఉపాదానకారణమనబడును) నున్నవి. కావున వానికి మనోమయమగు సూక్ష్మశరీర మొకటియు పంచభూతమయమగు స్థూలశరీర మొకటియు నని శరీరములు రెండుకలవు. బ్రహ్మమునకు లేక హిరణ్యగర్భునకు పంచభూతములు కారణములుకావు. కావున పాంచభౌతిక శరీరములేదు. ఇతరములగు సర్వపదార్థములకును బ్రహ్మప్రతిబింబముచే లేక మనోరూపుడగు హిరణ్యగర్భునిచే జనించిన ప్రపంచము (ఆకాశాదిభూతములు) కారణములు. సర్వమును మనోరూపుడగు హిరణ్యగర్భునియొక్క సంకల్పమువలననే జనిం

చేనని ఇదివరకే చెప్పబడియున్నదికదా. ఆహిరణ్యగర్భుని కన్ననో ఆయన
జనించునప్పటికి భూతసృష్టిలేదు కావునను, ఆయన పరబ్రహ్మమాత్రుడే
యగుటచేతను, అనాదియగు అజ్ఞానముచే గల్పింపబడిన మనోమయ శరీర
మొక్కటియే ఆయనకుగలదు. ఆయనకును అనిర్వికార పరబ్రహ్మమేకదా
కారణము. పంచభూతములు కారణములుగాగలవానికే ఆభూతములకు శరీ
రరూపముగ బరిణమించుశక్తి, లేక, స్వభావముకలదు. కావున పంచభూత
మయ శరీర మొక్కటికలదు. పరబ్రహ్మకారణముగాగల ఈ హిరణ్యగర్భు
నకన్ననో ఆపరబ్రహ్మకు దేహరూపముతో బరిణమించు స్వభావము లేదు
కావున బ్రహ్మమయశరీరములేదు. మాయాకల్పితమగు మనోమయ శరీర
మొక్కటియే కలదని తెలిసికొనవలయును. ఈవిధముగ సంకల్ప రూపుడై
మనోమాత్రుడై పృథివ్యాది పంచభూతమయమగు శరీరములేనివాడై ఏహి
రణ్యగర్భుడున్నాడో ఆతడే ఈప్రపంచముండుటకు హేతువు. ఏది ఎట్లు
నశించుచున్నను ఆహిరణ్యగర్భుడు ఉండుటచేతనే ఈసర్వప్రపంచము స్థిర
మైయున్నది. ఇంతయేల? కారణాంతరములులేక స్వయముగ నుత్పన్నుడై
మనోమాత్రస్వరూపుడైయున్న యాహిరణ్యగర్భునిచే ఈ ప్రపంచము సృ
జింపబడుచున్నది. పూర్వకల్పమునందలి ప్రపంచముయొక్క సంస్కారము
ననుసరించి సంకల్పించుచు నాహిరణ్యగర్భుడు ఈసర్వమును స్వస్వరూప
భిన్నముగ జూచుచున్నాడు. బాగుగ విమర్శించినచో ఆహిరణ్యగర్భుడు
మనోరూపుడే కావున “ అజ్ఞానబలముచే భ్రాంతినొందిన మనస్సు పూర్వక
ల్పానుసారముగ ప్రస్తుతప్రపంచమును సంకల్పించుచున్నది. తిమిరరోగము
గలకన్ను ఒకసూర్యబింబమును రెంటినిగా జూచినట్లు బ్రహ్మప్రపంచములను
భిన్నముగ జూచుచున్నది ” అనియే చెప్పవలయునుకదా. కావున నిప్పుడు
ఏదేది కనబడుచున్నదో ఆపదార్థమంతయు మనోమయమే అని తెలిసికొన
వలయును. అనిన శ్రీరాముడిట్లని ప్రశ్నచేసెను.

ఓవశిష్ఠమహామునీ! ఈమనస్సునకు స్వరూపమేది? సర్వదోషముల
కును ఇదియే మూలకారణ మగుటచేత ఈమనస్సుయొక్క స్వరూపమును
బాగుగ నెఱింగిననేకాని ఏమియుజేయుటకు వీలులేదు. కావున దీనిని స్పష్ట
ముగ వివరింపుడు. అనిన వశిష్ఠు డిట్లనియె. ఓ రఘుకుల సార్వభౌమా!
రామా! ఈమనస్సునకు ఒకవాస్తవస్వరూప ముండెనచో దానిచేత గల్పిం
పబడిన ప్రాపంచిక పదార్థములన్నియు సత్యములే కావలయునుకదా.
ఇది అనుభవ విరుద్ధము. కావున బాగుగ విచారించినచో శూన్యరూపమై

జ్ఞానప్రకాశరహితమై యున్న ఆకాశమునకు వ్యవహారార్థమై ఏర్పరుపబడిన పేరొకటితప్ప రూపమేదియును ఎట్లులేదో అట్లే ఈమనస్సునకును నామమొకటియేకాని రూపమేదియును కానవచ్చుటలేదు. ఇంతయేల? బొత్తిగనే లేదు. ఈమనస్సునకు హృదయము స్థానమనియు ఆకారణమువలన దానికేదైన రూపముండుననియు గొందరు భ్రాంతులగుచున్నారు. ఓదాశరథీ! శ్రీరామా! వాస్తవస్థితిలో నీమనస్సునకు లోపల వెలుపల అను విభాగమే లేదు. అనుభవానుసారముగ విమర్శించితిమేని ఆకాశమువలె సర్వవ్యాపకమై యున్నది యనుట తెలియవచ్చును.

ఓ సత్పురుషశ్రేష్ఠా! రామా ! ఇట్లైనను సామాన్యముగ నొక గురుతును చూపెదను. ఎదుటనున్న పదార్థమును గూర్చిగాని దూరముననున్న పదార్థమును గూర్చిగాని జనించునట్టి "ఇది ఘటము. ఇది స్వర్గము." అనుమొదలగు ప్రతిభజ్ఞానము, లేక, సంకల్పము ఏది జగత్ప్రసిద్ధమై యున్నదో అదియే మనస్సని తెలిసికొనుము. ఇంతకంటే దానినిగూర్చి ఏమిచెప్పుటకును సాధ్యముకాదు. నిర్వికారుడై నిరాకారుడై పరబ్రహ్మము ఏకస్వరూపముతోనుండగ ఆయనయందు "ఇది ఘటము. ఇదిగోడ" అని నామరూపాత్మకములగు పదార్థములు, రజ్జు, సర్పము, శుక్తి, రూప్యము, మొదలగు వానివలె తోచుటయే మనస్సని చెప్పబడును. ఇంతకంటెను ఇతరమై మనశ్శబ్దముచేత జెప్పదగిన వస్తువు ఏదియును లేదు. ఇట్టిమనస్సునకు రూపము ఉండుట ఎట్లు? స్థానవిభాగ మెక్కడిది? "ఇదిఎట్లు? పదార్థముండిన దానికి స్థానమొకటి యుండక తప్పదుకదా, అనియెదవేమో వినుము. ఈమనస్సునకు సంకల్పమే అనగా నిరాకారబ్రహ్మమునందు "ఇది ప్రపంచము" అని కల్పించుటయే స్వరూపమని తెలిసికొనుము. ఆసంకల్పమునకంటె నది ఎప్పటికిని వేరుకానేరదు. ఇట్లగుటచేత సంకల్పమెచట నెచట యుండునో అచ్చోటనెల్ల మనస్సుకలదని తెలిసికొనుము. ఇప్పుడు విచారించిన సంకల్పము సర్వవ్యాపకమైయుండగా మనస్సుమాత్రము ఒకచోట నుండునది ఎట్లగును. కానేరదు. ఎన్నటికిని సంకల్ప మనస్సులకు భేదముకలుగదు. కార్యకారణములని భావించినను పరస్పరభేదము ఉండదుకదా. మఱియు నోరాఘవా ! శ్రీరామా ! అవిద్య, సంసారము, మోహము, బంధము, మాయ, తమస్సు, అనునివి అన్నియు నీసంకల్ప సమూహము యొక్క పేరులే. ఇట్టి ఈసంకల్ప సమూహము విచారదృష్టిచేత నశించెనేని అప్పుడు నిరాకారమగు స్వస్వరూపము శేషించును. బాగుగ విమర్శిం

చిన సర్వసంకల్పములు నున్నప్పుడు కూడ స్వస్వరూపమునకు హాని ఏమియు లేదుకదా. ఈకారణమువలన " ఈప్రపంచమంతయు సంకల్పమాత్రము. దీనికి బ్రహ్మాభిన్నమగు రూపములేదు. " అను యథార్థజ్ఞానము కలుగుటవలన నీదృశ్యమంతయు శూన్యరూపమై పోవగా ఆపరమాత్మయొక్క శుద్ధస్వరూపము అట్లే ప్రకాశించును. ఈదృశ్యము జనింపక పూర్వము అజ్ఞానస్వరూపునకు నెట్టి నిర్మలరూపముండెనో అట్టి నిర్మలరూపమే దృశ్యము ఉన్న సమయమునందుగూడ ప్రకాశించును. భ్రాంతికల్పితమగు భేదము నశించుటకు జ్ఞానమొక్కటియే చాలునుకదా. పర్వతములు మొదలగునవి ప్రతిబింబింపనప్పుడు అద్దమునందు స్వస్వరూపమాత్రమగు దర్పణత్వము ఎట్లుండునో అట్లే " నేను, నీవు, ప్రపంచము, " అనుదృశ్యభ్రాంతి తొలగి అంతకుపూర్వము దృశ్యము జూచుచున్న ద్రష్ట యట్టిభేదదృష్టి లేనివాడై యుండిన అప్పుడు జ్ఞానరూపుడగు ఆత్మ స్వస్వరూపముతోనే నిలుచును. ప్రతిబింబమున్నను లేకున్నను దర్పణరూపమునకు ఎట్లు హానిలేదో, అట్లే ఈదృశ్యమున్నను లేకున్నను బ్రహ్మస్వరూపమునకు హానిలేదు. ఇది ప్రతిబింబము అద్దమునకంటె భిన్నముకాదు " అని తెలిసికొనిన ఆప్రతిబింబము కానవచ్చుచున్నను ఎట్లుదర్పణస్వరూపమునకంటె అన్యముగానరాదో అట్టి " ఇది ప్రపంచము. బ్రహ్మమునందు కల్పింపబడిన దగుటచేత ఆబ్రహ్మమునకంటె భిన్నముకాదు. " అని ఎఱింగినచో సర్వకాలములయందును బ్రహ్మరూపమే ప్రకాశించును. " ఇది దృశ్యము వీడుద్రష్ట " అను భేదసంకల్పరూప దోషమును ఆమనస్సే కలిగించుచున్నది. అది స్వయముగ నసత్యరూపమయ్యును దోషమునుమాత్రము శాశ్వతమైన దానినిగ జేయుచున్నది. ఒక కలయందు మఱియొకకలవచ్చునట్లు అసత్యమగు మనస్సునుండి అసత్యమగు నీభేదము జనించుచున్నది. మఱియును ఈమనస్సు మిక్కిలి చపలస్వభావము గలదియై ఒక్కొకసమయమున సంకల్పరూపముతో ప్రకాశించును. నానావిధ విషయములపై దుముకులాడును. దానము నిచ్చును. యాచించును. సంచరించును. మునుఁగును. సర్వమును ఉపసంహరించును. నిర్వికారమై బ్రహ్మరూపముతో నిలుచును. ఒక్కొకసమయమున సర్వవృత్తులను వదలి నిశ్చలమై పరబ్రహ్మరూపముతో నిలచును. మఱియొక సమయమున భేదదృష్టిని పురస్కరించుకొని చలించును. మఱియు మహాప్రళయసమయమున సర్వప్రపంచమును లయమునొందిన పిమ్మట రెండవసృష్టియొక్క ఆరంభమున నీమనస్సు నిశ్చలరూపమయ్యే యుండును. ఇకను ఆపర

మేశ్వరుడన్ననో సర్వకాలములయందును అనగా దృశ్యభ్రాంతి యున్నపు
డును తొలగినప్పుడును మహాప్రళయ సమయమునందును సృష్టి ప్రవర్తించు
చున్నపుడును ఏవికారములును జెందక స్వప్రకాశరూపుడై ఉదయాస్తమ
యములులేక జనన మరణాది వికారములనొందక సర్వసృష్టికి ఆధారభూ
తుడై సర్వమయుడై ప్రకాశించుచున్నాడు. మఱియును ఏపురుషుని వేద
ములు సహితము చెప్పనేరవో ఎవనిని జీవన్ముక్తులగు మహానుభావులుతప్ప
అన్యులెఱుగలేరో ఎవనికి ఆత్మమొదలగు నామములు స్వభావసిద్ధములుకాక
కేవలము కల్పితమాత్రములే యైయున్నవో, ఎవడు సాంఖ్యమతస్థులకు
పురుషుడును వేదాంతవేత్తలకు బ్రహ్మయు విజ్ఞానవాదులకు ( బౌద్ధులకు )
అతిపరిశుద్ధమగు విజ్ఞానమును, శూన్యవాదులకు శూన్యమునై యున్నాడో,
సూర్యాది తేజస్సులను ఎవడు ప్రకాశింప చేయుచున్నాడో, ఎవడు మాట
లాడువాడును సంకల్పించు వాడును కర్మఫలమును అనుభవించువాడును
చూచువాడును స్మరించువాడునై యున్నాడో, ప్రపంచమునందుండియు
సంబంధములేకుండుటచేత ఎవ్వడు లేనివాడై యున్నాడో, దేహమున కలిగి
యు నెవ్వడు దూరస్థుడైయున్నాడో సూర్యునినుండి వెలుగువచ్చినట్లు ఎవని
నుండి ఈజ్ఞానప్రకాశము కలుగుచున్నదో, చిత్తమనువేరుతోను ఇంద్రియ
మను ఆకులతోను బ్రహ్మండములను ఫలములతోను ప్రకాశించు మాయ
యనుతీగ నిర్వికారమగు చైతన్యమను ఆకాశమునందు జనించి వాయువు
చేతనువలె మహాత్ముని సామర్థ్యముచేత బహువిధముల నృత్యము చేయు
చున్నదో, అనగా విజృంభించుచున్నదో, ఏజ్ఞానరూపమగు రత్నము సర్వ
దేహ సంపుటములయందును ప్రకాశించుచున్నదో పంచభూతములు మనో
బుద్ధ్యహంకారములు అను నీయెనిమిదింటిని మిక్కిలి ప్రయత్నముతో నెవ్వ
డిటు నటు త్రిప్పుచున్నాడో, శుద్ధజ్ఞానరూపుడగుటచేత ఎవడు ఆకాశమును
సంకల్పించిన ఆకాశమగునో ఘటపటాది పదార్థముల సంకల్పించిన ఘట
పటాదులే యగునో మఱుభూమియందు ఎండమావులు తోచినట్లు ఉత్పత్తి
వినాశప్రాయములైన త్రిలోకములను తరంగములు ఎవనియందు తోచుచు
న్నవో, ఎవడు తుదిలేని ఈప్రపంచ సమూహమునెల్ల సృజించుచుండి
యును ఎప్పుడు నేదియుం జేయనివాడై యుత్పత్తి వినాశములులేని స్వస్వ
రూపమునందే నిలచి అద్వితీయుడై యున్నాడో అట్టి పరాత్పరుని విచార
దృష్టిచే నెఱింగినచో హృదయగ్రంథి భిన్నమగును. సంశయములన్నియు
నాకుఁమాత్రే తీరపోవును. పునర్జన్మము కలిగించు కర్మలునశించును. అనిన

శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓమునీంద్రా! ఇది మిక్కిలి సంశయాస్పదముగ నున్నది. ఈదృశ్యసమూహము మిక్కిలి అధికమైయున్నది. ఈప్రపంచము స్థిరముగ నుండునదిగ తోచుచున్నది. ఇట్లుండ "ఇదియంతయు శూన్యరూపము. నిర్వికార బ్రహ్మమునందు ఉన్నది" అనుట ఎట్లు సంభవించును? మేరుపర్వతము ఆవగింజలోనున్నది. అనిన నమ్ముటకు వీలగునా? అనిన వశిష్ఠుడు ఇట్లనియె.

ఓ శ్రీరామచంద్రా! పైచెప్పిన విషయమున లోప మేమియులేదు. సజ్జనసమాగమము, శాస్త్రవిచారము, అనువానియందు పూనిక గలిగి ప్రవర్తించితివేని మాసములుకూడ నక్కరలేదు. కొద్దిదినములలోనే సర్వోత్తమమగు పైనిశ్చయమును పొందగలవు. పైన చేయబడియున్న నిర్ణయమే భారతాది సర్వఇతిహాసములకును లేక• నీక్రిందవర్ణింపబడబోవు సర్వ ఇతిహాసములకును సారాంశము. దీనిని వినినచో విమర్శించినచో నాశరహితమగు జీవన్ముక్తస్థితి దొరుకును. అప్రయత్నముగనే తటస్థమగును. కావున ప్రయత్నపూర్వకముగ మనస్సునందు ఈనిర్ణయమునుగూర్చియే విమర్శింపుచుండుము. బాగుగ విమర్శించితివేని కానవచ్చుచున్న జగత్తు ఉన్నది ఉన్నట్లే అసత్యరూపమగును. ఇట్లు బ్రహ్మవిచారమును ఆచరించుచు తదేకనిష్ఠులై యుండు మనుష్యులకు విదేహముక్తి యనబడునది ఏదియో అదియే జీవన్ముక్తియై ఆవిర్భవించును. జీవన్ముక్తి విదేహముక్తులకు భేద మేమియు లేదు. ప్రపంచముండినను లేకుండినను అనగా గానవచ్చినను కానరాకున్నను ఒకటిగనే యగుటచే జ్ఞానము కలిగినపిదప నెట్లైనను విశేషమేమియు లేకపోవుటచేత జీవన్ముక్తి విదేహముక్తు లొకటియే. ప్రపంచము కానవచ్చుట కానరాకుండుట అనునదియేకదా ఈరెంటికిని గలభేదము. అనిన శ్రీరామచంద్రుడు ఇట్లని ప్రశ్నచేసెను. ఓబ్రాహ్మణోత్తమా! వశిష్ఠ మహామునీ! జీవన్ముక్తుడు ఎట్టివాడు? విదేహముక్తుడు ఎట్టివాడు? వీరిస్వరూపమును ఎఱిగింపుము. దానిని తెలిసికొని నేనును శాస్త్రదృష్టిని అనుసరించి ఆముక్తుల జెందుటకు ప్రయత్నించెదను. అని చెప్పిన వశిష్ఠమహాముని ఇట్లనియె.

ఓ రామచంద్రా! వినుము. ఏమహాత్మునకు సర్వ వ్యవహారములను ఆచరించుచున్నను ఈప్రపంచము ఛాయామాత్రమై యుండునో ప్రపంచాభిన్నమగు బ్రహ్మము స్వస్వరూపముతో ప్రకాశించుచుండునో అట్టివాడు జీవన్ముక్తుడు అనబడును. ఏమహాత్మునకు సుఖము కలిగినప్పుడు ముఖకాంతి

అభివృద్ధికాదో దుఃఖము వచ్చినప్పుడు క్షీణింపదో ఏపురుషుడు ఏదిఎట్లు వచ్చినను దానిని అట్లే అనుభవించునో లేక వచ్చినదానితో తృప్తినొందునో వాడే జీవన్ముక్తుడు. ఎవడు సుషుప్త్యవస్థయందు జాగరూకుడై యుండునో (అనగా సుషుప్త్యవస్థయందు బ్రహ్మము స్వస్వరూపముతో ప్రకాశించును కావున నీజీవన్ముక్తుడును బ్రహ్మమయుడగుటచేత అప్పుడే ప్రకాశించుననుట) ఎవనికి జాగ్రదవస్థయే లేదో (జాగ్రదవస్థ యనగా ప్రాపంచిక విషయములను ఇంద్రియములచేత గ్రహించుటయే కావున నీప్రపంచమునందు శూన్యభావముగల జీవన్ముక్తునకు ఆయవస్థలేదనుట) ఎవని జ్ఞానమున ప్రాచీనసంస్కారములు (ప్రపంచసంస్కారములు) లేవో అట్టివాడు జీవన్ముక్తుడనబడును. బాహ్యమునకు రాగ ద్వేష భయాదులను అనుసరించి చరించుచున్నను చిత్తమునందు ఆకాశమువలె నిర్మలుడై యుండునో అట్టివాడు జీవన్ముక్తుడనబడును. ఎవనిమనస్సునందు అహంకారము లేదో కార్యములను ఆచరించినను ఆచరింపకున్నను ఎవనిబుద్ధి ప్రాపంచిక పదార్థములయందు తగులువడదో అతడు జీవన్ముక్తుడనబడును. ఎవనివలన లోకములు భయమునొందవో, ఎవడు లోకముల వలన భయము నొందడో, ఎవని చిత్తమునకు ఎప్పుడును సంతోషము, క్రోధము, భయము, బెదురు, అనునవి కలుగవో, అట్టివాడు జీవన్ముక్తుడు. ఎవనికి సంసారసంక్షోభము లేదో నీవు నేను అను విభాగమున్నను ఎవనియందు లేనిదేయగునో సంకల్పములు కలిగియుండియు నెవడు నిస్సంకల్పుడగునో అనగా వ్యవహారస్థితిలో సర్వమునున్నను పరమార్థ విజ్ఞాన సామర్థ్యమువలన నెవనికి వానితో సంబంధములేదో అట్టివాడే జీవన్ముక్తుడు. ఎవడు సమస్త వ్యవహారములను ఆచరించుచున్నను పరమశాంతుడై యున్నాడో పదార్థముల దనకంటె భిన్నములనుగా భావించుచున్నను ఎవడు సర్వపరిపూర్ణుడై యున్నాడో అట్టివాడు జీవన్ముక్తుడు. ఇట్టి జీవన్ముక్తస్థితిని జెందినపురుషుడు ప్రారబ్ధకర్మాధీనమగు తనశరీరము కాలానుసారముగ నశింపగానే తాటిచెట్టుయొక్క ఆకులు (లేక విసనకఱ్ఱ) మెదగువానిచేత జనింపబడుచున్న గాలి ఆతాటిచెట్టుయొక్క ఆకులు (లేక విసనకఱ్ఱ) నశింపగానే నిశ్చలత్వము నొందినట్లు నిశ్చలత్వమునొందును. ఇదేవిదేహముక్తి. ఈ విదేహముక్తుడు కేవలము బ్రహ్మమే. ఆయనకు ఒకప్పుడు ఉదయము మఱియొకప్పుడు నాశము అనునవి లేవు. ఒకప్పుడు సంక్షోభము నొందుట మఱియొకప్పుడు శాంతినొందుట అనునవియు లేవు. అతడు ఈ వాడనియు లేడనియుగూడ చెప్పుటకు వీలు

లేదు. "ఉన్నది లేదు అనువ్యవహారములు ఇంద్రియగోచరములగు పదార్థములనుగూర్చియే ప్రవర్తిల్లునుగాని సర్వేంద్రియ సాక్షినిగూర్చి ప్రవర్తింపవు కదా. మఱియునాతడు అస్వచ్ఛద్రవ్యార్థముకాడు. అస్వచ్ఛద్రవ్యార్థమునకంటె ఇతరుడునుకాడు, అప్పుడు అనగా ఆజీవన్ముక్త స్థితియందు నిశ్చలమైనదియు గంభీరమైనదియు వెలుగును చీకటియును గానిదియు సర్వవ్యాపకమైనదియు నామరూపములు లేనిదియునగు ఒకపదార్థము మాత్రమే మిగిలియుండును. అసమయమున నుండునది శూన్యమునుకాదు. రూపమునుకాదు. ప్రకాశింపజేయబడు పదార్థమునుకాదు. ప్రకాశమునుకాదు. భూతములును వానివలనబుట్టిన పదార్థములును గావు. నాశరహితమై "ఉన్నది" అనిమాత్రమే చెప్పదగిన పదార్థ మొకటియే ఎప్పుడు కలదు. ఇట్లును జెప్పుటకు వీలు లేదు. ఆపదార్థముయొక్క స్వరూపము ఇట్టిదని వర్ణించుటకే శక్యము కాదు. అదిసర్వపరిపూర్ణమైనది. ఉన్నదనికాని లేదనికాని ఉండియు లేదని గాని భావమనిగాని అభావమనిగాని దానినిగూర్చి ఎట్లుచెప్పుటకును వీలు లేదు. ఏధర్మములును దానికిలేవు. మఱియు విదేహముక్తియొక్క అవస్థయందుగల పదార్థము కేవలము జ్ఞానరూపకమైనది. సర్వపదార్థములును తన్మయములేయగుటచేత సామాన్యజ్ఞానధర్మము దానికిలేదు. సామాన్యజ్ఞానమునకు జ్ఞేయమగు నొకపదార్థముఅవశ్యము ఉండవలయును. ఆజ్ఞానజ్ఞేయములకు భేదముకూడ నుండవలయును. ప్రకృతవిషయము అట్టిదికాదు. సృష్టినిరూపణయొక్క అవసరమున బ్రకటించిన విధముగ సర్వపదార్థములును దన్మయములే కావున నీజ్ఞానమునకు జ్ఞేయము లేదు. మఱియు దీనికి ఆదిమధ్యాంతములు అవధియు వృద్ధిక్షయములును మఱివివిధములగు వికారములును లేవు. ఇది పరమానంద రూపమైనది.

ఓ సత్పురుషశ్రేష్ఠా! రామచంద్రా! ప్రత్యక్షమును అనుసరించి చూచువాడు చూపు చూడబడునది అని మూడుపదార్థములు గోచరములగుచున్నవి కదా. ఇందు చూపునుగూర్చి అనగా దానిస్వరూప స్వభావములను గూర్చి శాస్త్రగురూపదేశ స్వానుభవ పూర్వకముగ విమర్శించితివేని పైన వర్ణించిన పదార్థమును తెలియగలవు. అనిన శ్రీరామచంద్రుండిట్లనియె. ఓవసిష్ఠమహామునీ! నాజ్ఞానము చక్కగ అభివృద్ధియగుటకై బ్రహ్మస్వరూపమును మఱియొకమాఱువిమర్శముగ వివరింపుము. అనిచెప్పిన వశిష్ఠమహాముని ఇట్లని సమాధానమును చెప్పుచున్నాడు. ఓరామా! మహాప్రళయకాలమునందుఆపరబ్రహ్మము ఒకడే మిగిలియుండును. ఆయనయొక్కస్వరూపము

బాగుగ వర్ణించెదను వినుము. సర్వసంకల్పములును నశింపగా మనస్సు నాశమగును. సంకల్పమే మనోరూపమని ఇదివరకే చెప్పియున్నానుకదా. అట్టిసమయమునందు "ఇట్టిది" అని వర్ణించుటకు నలవిగాక ఏస్వరూపము మిగిలియుండునో అదియే ఆబ్రహ్మమునకు స్వరూపము. జీవుడని చెప్పబడుచున్న జ్ఞానము సర్వకాలములయందును తనకంటె భిన్నముగ దోచునట్టి పదార్థములపై ప్రసరించుచున్నదికదా. ఇట్లు ప్రసరింపక అంతర్ముఖమయ్యేనేని దానికి ఏస్వరూపముండునో అదియే పరమాత్మకు స్వరూపము. శరీరమునకు గాలిమొదలగునవి సోకినను నేత్రములకు రూపము ఎదుటనున్నను సుగంధ దుర్గంధాదులు ముక్కునకు సోకినను తీపుమొదలగు రసములు నాలుకకు తాకినను ఇష్టానిష్టశబ్దములు ధారారూపముగ జెవినిప్రవేశించినను, వానినెల్ల నెఱుగకుండు చిత్తస్థితి అనగా పురుషుడు బ్రతికియే యున్నను ఇంద్రియములద్వారా ఆయావిషయములను ఎరుగకుండుచిత్తస్వరూపము ఏదికలదో (సుషుప్తియందలి చిత్తస్వరూపము ఏదికలదో) అదియే బ్రహ్మస్వరూపము. ఓ సూక్ష్మబుద్ధిగలవాడా! రామచంద్రా! కలలులేక ఎప్పటికిని ముగింపునొందక జడస్థితిలేక నుండు దీర్ఘనిద్రకు ఏదిస్వరూపమో అదియే బ్రహ్మమునకు స్వరూపము. ప్రకాశరూపమగు అనుభవములోనున్న జ్ఞానమునకును (ఇచ్చట జ్ఞానమని చెప్పబడినది బ్రహ్మప్రతిబింబసహితయగు చిత్తవృత్తియె) తమోరూపమగు దృశ్యమునకునుగూడ ప్రకాశకమై అనాద్యంతమైయున్న పదార్థముఏదియో అదియే బ్రహ్మము. అట్టిస్వరూపమే బ్రహ్మస్వరూపము. సర్వవ్యవహారములను ఆచరించుచున్నను పాషాణమువలె నుండుట ఏదికలదో ఆకాశముకాకపోయినను ఆకాశమువలె నుండుట ఏదికలదో, అనగా దేనితోను సంబంధింపకుండుట ఏదికలదో, అదియె బ్రహ్మకు స్వరూపము. మఱియు తెలిసికొనువాడు తెలివి తెలియబడునది అను మూడుపదార్థములను ఎచ్చట నుదయించునో ఎచ్చట అస్తమించునో అదియే పరబ్రహ్మమునకు స్వరూపము. ఇంతవల? ప్రస్తుతము స్థావరములై యున్న పర్వత వృక్షాదులు జ్ఞానమయములై మనోబుద్ధ్యాదులులేనివై యుండెనేని అప్పుడు వానిరూపమునకు బ్రహ్మరూపమునకును బోల్పవచ్చును. బ్రహ్మ విష్ణువు ఇంద్రుడు సదాశివుడు రుద్రుడు మొదలగువారందరును నశించినపిమ్మట అనగా ప్రపంచము లయమైనపిమ్మట ప్రపంచసంబంధము ఇంచుకైనను లేనిదై జ్ఞానమాత్రస్వరూపమై సర్వోపాధులు నశించుటవలన వికల్పశూన్యమై పరమానందరూపమై ఈ బ్రహ్మముమాత్రమే మిగిలియుండును.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షిప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉత్పత్తిప్రకరణమున ఉత్పత్తిప్రకరణార్థదర్శనమను
అయిదవసర్గము ముగిసెను.

## —* లీలోపాఖ్యానము. *—

వశిష్ఠమహాముని చెప్పుచున్నాడు. ఓ శ్రీరామచంద్రా! సర్వప్రపంచ సృష్టికిని మనస్సే మూలకారణమని ఇదివరకే చెప్పియుంటినికదా. ఈవిషయము నిస్సంశయముగ దృఢమగుటకై అనగా మనస్సునకు నిట్టిసామర్థ్యము కలదనువిషయము స్పష్టమగుటకై మండపాఖ్యానమును జెప్పెదను. ఇదియే లీలోపాఖ్యానము. దీనిని వినుము. దీనిచే నీసందేహములెల్ల దీరును. ఓరఘుకులసార్వభౌమా! రామా! ఈభూలోకమునందు క్షత్రియకులమునకునెల్లను అలంకారభూతుడై కమలమువలెనున్న పద్ముడను పేరుగల ఒకరాజుకలడు. అతడు బహుసంతానవంతుడు. వివేకవంతుడు. మర్యాదలను అనగా ఆయావర్ణాశ్రమ నిబంధనలను రక్షించుటయందు సముద్రమును బోలువాడు. శత్రువులను చీకట్లకు సూర్యునివంటివాడు. సద్గుణములను హంసలకు మానస సరస్సుతో తుల్యుడు. దోషములను తృణసమూహములకు అగ్నిహోత్రుడు. అట్టి ప్రభువునకు మిక్కిలి సౌందర్యవంతురాలును విలాసవతియు భూమియందు అవతరించిన మహాలక్ష్మియుంబోలె ప్రకాశించుచుండునదియునగు లీలయను నొకభార్యకలదు. ఆయమ మహాపతివ్రత. భర్త భయమునొందినచో తానును భయమునొందియే యుండును. ఆయన సంతసించిన తానును సంతసించును. సమచిత్తుడై యుండిన సమచిత్తురాలై యుండును. వ్యాకులపడిన వ్యాకులపడును. ఇట్లు సర్వకాలములయందును ప్రతిబింబముతో సమానమై యుండును. ఒకసమయమున ఆయనకు దనపై కోపమువచ్చెనేని ఎప్పుడు భయమునొందిమాత్రమే యుండునుగాని మాఱాడదు. ఇట్టి ఈలీలాదేవి ఒకసమయమున ఇట్లని సంకల్పించెను. ఈప్రభువు నాకు ప్రాణములకంటె ప్రియుడు. ఈతడు యౌవనముతోనే జరామరణములులేక సర్వకాలములయందును ఉండుటకు ఉపాయమేది? ఈతనితో నిదేవిధముగ అనేకయుగములు నేనెట్లు రమించుచుండును. ఈవిషయమునుగూర్చి జ్ఞానవృద్ధులును తపోవృద్ధులును విద్యావృద్ధులును అనగా జ్ఞాన తపోవిద్యలయందు అధికులగు బ్రాహ్మణులను రావించి ప్రశ్న

చేసెదను. మనుష్యులకు జరామరణములు లేకుండు నుపాయమును వారు ఉపదేశింతురు. ఇట్లు నిశ్చయించి బ్రాహ్మణోత్తములను రావించి పూజించి నమస్కరించి ఇట్లనియె. "ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! మనుష్యులకు జరామరణములు ఏయుపాయముచేత నశించును." అనిపలుమారు సాదరముగ ప్రశ్నచేసెను. అంతట బ్రాహ్మణులు ఇట్లనిరి. ఓ దేవీ! లీలా! తపస్సు వ్రతములు నియమములు అనువానిచేత ఏవి కావలసియున్నను సంపాదించుకొనవచ్చును కాని, జరామరణ వినాశము మాత్రము ఎట్లునుగలుగనే కలుగును. ఈవిధముగ బ్రాహ్మణులు చెప్పగానే తనభర్త ఎప్పటికైనను మృతిచెందవలసినవాడే. తనకును భర్తృవియోగము ఎప్పటికైనను గలుగవలసినదియే. అనుచింతచేత భయమునొంది బుద్ధిబలముచే నిక్రింద చెప్పబోవు విషయమును ఊహించి నిర్ణయించెను. దైవయోగమువలన నాకు భర్తకంటె ముందుగ మరణముదొరకునేని ఎట్టిదుఃఖములును లేక సుఖముగ నుండగలను. అట్లుగాక వేయుసంవత్సరములు బ్రతికినను నాభర్త నాకంటె ముందుగ మృతినొందెనేని అప్పుడు ఆతనిజీవుడు ఇంటినుండి వెడలకుండు నుపాయమును ఆచరింపవలయును. అట్టియుపాయమును జేసితినేని ఆజీవుడు అంతఃపురమున సంచరించుచూ నన్ను జూచుచుండును. ఇట్లు ఆజీవునిచే జూడబడుచు నేనును ఆతనిని జూడలేకపోయినను, "ఆతడు నన్ను చూచుచున్నాడుకదా" అనుధైర్యముతో సుఖముగ నుందును. కావున నీదినము నుండియే జ్ఞానరూపిణియగు సరస్వతీదేవిని నాయభీష్టసిద్ధికై జప ఉపవాస నియమములచేత నారాధించెదను. అనినిశ్చయించి యాలీలాదేవి భర్తతోచెప్పకయే శాస్త్రానుసారముగ సరస్వతిదేవిని ఉద్దేశించి ఘోరమైన తపస్సును ఆచరించెను. మూడుదినములకు ఒక్కొకమారు భోజనమును జేయుచు ప్రతిదినమును దేవతలకును బ్రాహ్మణులకును విద్వాంసులకును యథాశక్తిగ సత్కారములను జేయుచు తపస్సుచేయుచుండెను. ప్రతిదినమునందును స్నానములు దానములు జపములు తపస్సు అనువానియందు పట్టుదలగల శరీరముగలదియై అనగా తనశరీరమెంత సుకుమారమైనదైనను దానిని గణింపక కష్టముల సహించునదియు దైవభక్తి కలదియు సర్వవిధములగు సదాచారములను ప్రధానముగ నాచరించునదియునై తపస్సును జేసెను.

## —* లీలాదేవికి సరస్వతీదేవి ప్రత్యక్షమగుట. *—

ఈ విధముగ మున్నూరుదినములు మహానియమము గలదియై యా

లీలాదేవి మిక్కిలిశ్రమను ఓర్చి సర్వకాలములయందును సరస్వతీదేవిని గూర్చి ధ్యానము జేయుచు తపస్సుచేసెను. ఈవిధముగ మునుష్ఠించిన ములు పూజింపబడి మిక్కిలి సత్కరింపబడి యాశ్వేతవర్ణముగల సరస్వతీదేవి ప్రసన్నురాలై లీలాదేవితో నిట్లనియె. ఓ చిన్నదానా! ఇంత దీర్ఘకాలము మహానియమముతో నాచరించిన నీతపస్సునకును అత్యధికమగు నీపతిభక్తికిని మెచ్చితిని. వరములను ఇయ్యవచ్చితిని. వలసినదానిని కోరుమనెను. అప్పుడు ఆరాజుపత్ని యాదేవిని ఇట్లనివినుతించెను.

శ్లో॥ జయజన్మజరాజ్వాలాదాహదోషశశిప్రభే।
జయహార్దాంధకారౌఘనివారణరవిప్రభే॥

ఓసరస్వతీదేవీ! జననము ముసలితనము మొదలగువానిచే దహింపబడుటయనుదోషమునకు చంద్రకాంతియగునట్టియు అనగా నాజననాది తాపముల జల్లార్చునట్టియు హృదయాంధకారమును దొలగించు సూర్యదీప్తియైనట్టియు నోభగవతీ! నీకునమస్కారము. ఓతల్లీ! లోకైకజననీ! దీనురాలగు నన్ను రక్షింపుము. నేను కోరబోవు వరముల రెంటిని ఒసంగుము. ఏమనగా నాభర్త మృతినొందినను అమ్మహాత్ముని యొక్క జీవుడు అంతఃపురమునుండి వెలికిపోకుండ నాసమీపముననే యుండునట్లు అనుగ్రహింపుము. ఇది మొదటివరము. ఓ మహాదేవీ! నేను ఏయేసమయములయందు నీదర్శనమును ప్రార్థించెదనో ఆయాసమయములయందెల్ల నీవు నాకు ప్రత్యక్షమగుచుండ వలెను. ఇది రెండవ వరము. ఈ ప్రార్థనమువిని యాలోకమాత "అట్లేయగును గాక" అనివరముల నిచ్చి అత్యున్నతముగ బుట్టి యందేయడంగిన సముద్ర తరంగమువలె స్వస్వరూపమునందు అంతర్ధానము నొందెను. ఈవిధముగ సరస్వతీదేవి అంతర్ధానము కాగానే ఆలీలయు బహువిధముల నామెను వినుతించుచు నమృతవర్షముచే వర్షింపబడినదానివలె ఆనందము గలదిఆయెను.

### లీలాదేవియొక్క భర్తయగు పద్ముడు లేక కులపద్ముడు మృతినొందుట.

పిమ్మట పక్ష మాసఋతువులు నేమి (బండిచక్రమునకు చుట్టువేయు ఇనుపకట్టు) గాను, దినములు ఆకులుగాను, సంవత్సరము ఇరుసుగాను, క్షణములు కుండగాను, కదలుచుండుటయే స్వరూపముగాను, గల కాలచక్రము తిరుగుచుండగా అనగా కాలముగడువగా ఒకానొకప్పుడు ఆలీలాదేవి భర్తయొక్క చైతన్యము అంతర్ధానము ఆయెను. అనగామృతినొందెను. ఈవిధముగ భర్త మృతినొందగానే మిక్కిలి దుఃఖమునొంది పరి

తాపముచేత వ్యాకులయై యాలీలాదేవి "నీటినుండి తొలగింపబడిన తామరతీగవలె" మిక్కిలి శోషించెను. ఇట్లు భర్తృవియోగ దుఃఖితయగు నా లీలాదేవి కొంతకాలము అత్యధికముగ రోదనముచేయుచు మఱికొంతకాలము ఏమియుందోచక మౌనమునుబూనుచు మరణోద్యోగము నాచరించుచు జక్రవాకపక్షివలె నానావిధములుగ బరితపించెను. ఇట్లుభర్తృశోక విహ్వాలయై బహువిధముల దుఃఖించుచున్న యాలీలాదేవికి ఎండిపోయిన సరస్సునందుండి పరితపించు మత్స్యమునకు వర్షధ్వనివలె ఒకధ్వని ఇట్లని ఆకాశమునుండి వినవచ్చెను. ఓ చిన్నదానా! మృతిజెందిన నీభర్తను పుష్పసరములచేత గప్పియుంచుము. మఱల నీపతిని నీవు పొందగలవు. నీవువైచిన పుష్పములు వాడవు. శరీరమును చెడదు. అత్యల్పకాలములోనే మఱల జీవమునొంది పూర్వమువలెనే ఈతడు నీకు భర్తయగును. ఆకాశమువలె నతిశుభ్రుడైన ఇతనిజీవుడును అట్లుచేసితివేని నీయంతఃపురమునుండి వెడలిపోడు. ఇట్లు ఆకాశమునుండి వచ్చినవాక్యములనువిని తనభర్తృశరీరమును అట్లే పుష్పములయందు ఉనిచియు దుఃఖమును సహింపలేక తదుపశాంతికై తన ఇష్టదేవతయు జ్ఞానరూపిణియునగు సరస్వతీదేవిని దర్శన మియ్యవలయునని ప్రార్థించెను.

—* లీలకు సరస్వతీదేవి తత్త్వోపదేశముచేయుట. *—

ఓ రామచంద్రా! ఇట్లు ధ్యానింపగానే జ్ఞానరూపిణియగు నాసరస్వతీదేవి ప్రత్యక్షమై ఎదుటనిలచి "ఓ లీలాదేవి! నీవు నన్నేలతలంచితివి. ఇట్లుదుఃఖమునొంద నేమివచ్చెను." అని ప్రీతిపూర్వకముగ బ్రశ్న జేసెను. అవుడు లీలాదేవి ఇట్లనియె. ఓ జగన్మాతా! నాభర్త ఇవుడెచ్చటనున్నాడు? ఏమి చేయుచున్నాడు? ఎట్టివాడుగా నున్నాడు? అతనియొద్దకు గొనిపొమ్ము? నేను ఒంటరిగ నిచట జీవింపనేరను. అనిచెప్పిన జ్ఞానరూపిణియగు నాసరస్వతీదేవి ఇట్లనియె. ఓ లీలాదేవీ! సుందరీ! నీకు సర్వమును ఎఱిగించెదను వినుము. ఈ లోకమునందు ఎవ్వరికిని గానరాక అతిసూక్ష్మమై యుండుటచేత మనస్సును ఆకాశశబ్దముచే వ్యవహరింతురు. సర్వానుభవ సిద్ధమును సర్వసాక్షియును అగు, జ్ఞానరూపుడును ఆకాశమువంటివాడే. కావున ఆకాశశబ్దముచేత వ్యవహరింప బడుచున్నాడు. సర్వానుభవ సిద్ధమగు పంచభూతములలోని ఆకాశము ఒకటికలదుకదా. ఈమూడాకాశములలో నన్నియు శూన్యరూపములే అయినను సర్వసంస్కారములకును ఆశ్రయమగుటచేత చిత్తాకాశమునకును, శబ్దగుణము గలదియగుటచేత భూతాకాశమునకు

కును, ఏదియో యొకస్వరూపమును నెట్లోయొకట్లు నిర్ణయింపవచ్చును. ఆ చిదాకాశమునకు మాత్రము ఎట్టిరూపమును నిర్ణయించుటకు వీలులేదు. జ్ఞాన రూపమగు సంకల్పము ఒకచోట నిలుచుట లేదుకదా. అది యొకవిషయ మును విడచి మఱియొకవిషయము మీదికి పోవుచుండును. ఇట్లు పోవుట అతి శీఘ్రముగ జరుగుచున్నను నడుమ నడుమ కొంతయవకాశము ఉండి తీరవల యునుకదా. ఆయవకాశమే చిదాకాశమని ఎరుగుము. ఓలీలాదేవీ! వరవర్ణి నీ! సర్వసంకల్పములను పరిత్యజించి సంకల్పమధ్యమున వెలుగునట్టి ఆచిదా కాశమునందు స్థిరమగు నిలుకడ నొందితివేని అప్పుడు నిస్సంశయముగ సర్వాత్మకమగు స్థానమును బొందెదవు. బ్రహ్మము నొందెదవు. ఈపరబ్రహ్మ ప్రాప్తి ప్రపంచము నశించినంగాని అనగా విచారదృష్టిచేత "ప్రపంచము శూన్యరూపము" అని తెలిసికొనబడినగాని గలుగదు. ఇది సిద్ధించుటకు చిర కాలము బట్టుట నిశ్చయమే యైనను నా అనుగ్రహ ప్రధానమువలన నీకు శీఘ్రముగ దొరుకును. ఈప్రకారముగా బ్రహ్మపదమును సంపాదించితివేని నీభర్త నీకు గానవచ్చును.

—* లీలాదేవి అంతరిక్షమునసున్న తనభర్తను చూచుట. *—

ఇట్లు సరస్వతీదేవి చేసిన ఉపదేశమును తెలియజేసి వశిష్ఠుడు శ్రీ రామచంద్రునితో నిట్లనియె. ఓరామచంద్రా! శ్రీరామా! ఆసరస్వతీదేవి ఈవిధ ముగనుపదేశము చేసి స్వస్థానమునకు బోయెను. అంత ఆలీలాదేవియు సర స్వతీదేవియొక్క అనుగ్రహమువలనదృఢమైన విజ్ఞానమునుబొంది విలాసమా త్రముగ నిర్వికల్పసమాధియందు నిలిచియుండెను. అంత నత్యల్పకాలము లోనే గూటినివిడిచి ఆకాశమునకు ఎగసిన పక్షివలె అంతఃకరణ సహిత ముగ దనశరీరమును విడచెను. అనగా "ఇదినాది" అనుమొదలగు అభిమాన ములను దేహమునందు పెట్టక చిదాకాశ స్వరూపముతో నిలచెను. అంత దివ్యజ్ఞానముచేత పరికించి (జ్ఞానము స్వస్వరూపమే యగుటచేత) తత్ప్రభా వమువలన ఆగృహమునందే ఆకాశమధ్యమున నిలచియున్నట్టియు అనేక సామంతరాజులచేత గూడియున్న యాస్థానమంటపమున నున్నట్టియు ప్రభు వగు తనయొక్క భర్తను జూచెను. అప్పుడు ఆప్రభువు సింహాసనమున గూ ర్చుండియుండెను. వందిమాగధులు "సర్వాధికుడవై వర్ధిల్లుము. దీర్ఘాయు ష్మంతుడవుకమ్ము" అనిఅనేక విధముల వినుతించుచుండిరి. పూర్వద్వార మున దర్శనార్థులై మునులును బ్రాహ్మణులును అనేకులు వేచియుండిరి. ఉత్త రద్వారమునందు చతురంగసైన్యములు నిలచియుండినవి. దక్షిణద్వారమున

స్త్రీజనులు నిలిచియుండిరి. ఇట్టి ప్రభువునుజూచి యాలీలాదేవి (నిర్వికల్ప జ్ఞాన ప్రభావముచేత సర్వమును జూచుచున్న యాలీలాదేవి) మహాప్రయత్నముతో నారాజసభయందు ప్రవేశించెను. ఇట్లుప్రవేశించి అచ్చట స్వదేశస్థుల నుస్వదేశాచారముగలవారిని తాను ఇదివరకు జూచియున్న బాలురను లేక తనపుత్రులను జూచెను. మఱియు తాను ఇదివరకును ఎప్పుడును జూడని పండితులను మిత్రులనుగూడ జూచెను. ఆతనిరాజ్యమున తానిదివరకు జూచినట్టియు జూడనట్టియును అనేకవిధములగు నదీనద పర్వతారణ్యములతో గూడియుండెను. ఆప్రభువును మునుపటివలె వృద్ధుడుగాక పదునాఱేండ్లవాడై యుండెను. ఇట్లు సర్వమును జూచి మిక్కిలి ఆశ్చర్యమునొంది యాలీలాదేవి తనయంతఃపురమునకు మఱలివచ్చెను. అనగా తన జ్ఞానదృష్టిచేత అచ్చటికిపోయి మఱలి వచ్చినట్లుండెను. ఇట్లువచ్చి తనకు ఈవిషయమును గూర్చి బోధించుటకై జ్ఞానరూపిణియగు నాసరస్వతీదేవిని మఱల స్మరించెను. ఆ సరస్వతీదేవియు ప్రత్యక్షమై సింహాసనముపైనుండ తాను భూమిపైనిలచి సవినయముగ నిట్లని ప్రశ్నచేసెను.

## —✻ కులపద్మునిపూర్వ జన్మవృత్తాంతము. ✻—

ఓ జగన్మాతా! సరస్వతీదేవీ! నాభర్తయొక్క జీవుడు ఇచటనుండగానే వాస్తవమగు ఆకారములేకయు భ్రమరూపమైన రెండవసృష్టి కలిగెను. అది ఎట్లుకలిగెనో వివరించినాభ్రాంతిని నివృత్తిసేయుము. అనిప్రార్థించిన సరస్వతీదేవి ఇట్లనియె. ఓలీలా! తత్త్వజ్ఞానము కలుగక పూర్వము భ్రాంతిమాత్ర స్వరూపమైయున్న ప్రస్తుతపుసృష్టి అనగా కులపద్మస్వరూపము ఎట్లుకలిగెనో అట్లే నీభర్తకు రెండవసృష్టికూడ కలిగెను. ఈవిషయమును విమర్శించి చెప్పెదను వినుము. చిదాకాశమునందు ఒకానొకచోట సంసారమను మంటపము (బహుజనులు నివసింపదగిన ప్రదేశము) కలదు. అది ఆకాశమువలె మిక్కిలి శుభ్రమైనది (స్వరూపము లేనిదనుట) గాజురేకులతో కప్పబడినది. (కొంచము విచారము చేసిచూచిన నతిసులభముగ భగ్నమగునది యనుట) దానికి మేరుపర్వతమే మహాస్తంభము (ఈసంసారము సప్తలోకముల నావరించియున్నదనుట) దిక్పాలకులభార్యలే ఆ స్తంభమునందలి విచిత్రప్రతిమలు. (సామాన్యముగ సంసారము స్త్రీమూలమే కావున నిట్లు చెప్పబడెను) దానియందు మూలలో బహువిధములగు జంతుజాలములను చెదలు పుట్టలచేత వ్యాపింపబడిన పర్వతములను షట్త్రింశల్లులుగలవు. (ఆసంసారమునందు ప్రాణులు చెదలు పురుగులవలె పుట్టుచు నశించుచును ఉన్నా

రనుట. స్థిరములను తలంపబడు పర్వతములుగూడ మట్టితిన్నలవలె నతిశీఘ్ర వినాశములై యున్నవనుట) మఱియు నామంటపమునందు ఆకాశమునందుండు సిద్ధులు మొదలగువారే దోమలు. ఆదోమలు సర్వకాలమునందును ఘుముఘుమధ్వని సేయుచుండును. (సంసార వశగతులై అణిమాద్యష్ట సిద్ధులు గలవారు సహితము చేయి తాకిన వ్రాలిపోవు దోమలవలె నశింతురనుట) దేవతలు రాక్షసులు మొదలగువారే యామంటపమున నివసించు అజ్ఞానులగు బాలురు. వారు బహువిధములుగ క్రీడించుచు నందు సందడి చేయుచుందురు. (తమోగుణ ప్రధానములగు రాక్షసులేగాక సత్వగుణ ప్రధానులగు దేవతలు సహితము సంసారము యథార్థమని తలంచుచు బహువిధములగు వ్యవహారములను ఆచరించుచున్నారనుట) ఆసంసార మంటపమున లోకాలోక మూలలోనుండు లోకాలోక పర్వతమను మట్టితిన్నె క్రింద గిరిగ్రామమను నొకపల్లపుభూమి కలదు. (అనగా నొకపర్వతము క్రిందగిరిగ్రామమను నొకయూరు కలదనుట.) నదీ పర్వత వనములచే నావరింపబడిన ఆగ్రామమునందు ధర్మాత్ముడగు సర్వాతిథియను నొక బ్రాహ్మణోత్తముడు భార్యాపుత్ర సహితుడై నివసించుచుండెను. ఆయన నిత్యాగ్నిహోత్రి. రోగభయమునుగాని రాజభయమునుగాని ఆయన ఎన్నడు నెఱుగడు. మఱియు ధనమునందు ఆకారమునందు వయసునందు కర్మలయందు విద్యలయందు తపస్సులయందు ఉనికియందు ఆబ్రాహ్మణుడు వశిష్ఠమహామునితో సమానుడు. జ్ఞానమునందుమాత్రము అట్టివాడుకాడు. ఈకారణమువలన అందరును ఆయనను వశిష్ఠుడనుచుండిరి. చంద్రునివలె నిక్కలి సుందరాంగియగు అరుంధతియను స్త్రీరత్నము ఆయనకు భార్యగా నుండెను. ఆకాశమునందుండు అరుంధతివలె నీమెయు భూమికి భూషణమై యుండెను. తపోధనము ఆకారము వయస్సు కార్యములు ధనసంపద ఉనికి యను నన్నిటియందును ఆమెయు నరుంధతికి సాటియై యుండెనుగాని పరమార్థ విజ్ఞానముమాత్రము అట్టిదికాదు. ఇట్లుయోచించుచు నాబ్రాహ్మణుడు ఒకనాడు మంచి పచ్చికగల యాకొండ చఱియయందు కూర్చుండియుండెను. ఆసమయమున నాదేశప్రభువు సకల సైన్య సమేతుడై వేటకొఱకు అచ్చటికి వచ్చెను. ఆతనిం జూచి ఈబ్రాహ్మణుడు ఇట్లుతలంచె. ఆహా, రాజత్వము ఎంతమనోహరమైనది రాజగు పురుషునకు సమస్త సంపదలు యుండును. దశదిక్కులను పాలించునట్టి మహారాజునుగా నేనెప్పుడు కాగలనో. ఎప్పుడు కాల్బలము రథికులు గజములు అశ్వములు పతాకములు ఛత్రచామరములును నన్ను సే

వించునో. అంతఃపురమున స్త్రీరత్నములతో క్రీడించి యలసి చమర్చిన శరీ
రముతో నున్ననాకు ప్రమదావనమునందలి మల్లెమొగ్గలపైనుండి వచ్చు
సుగంధవంతమగు చల్లనిగాలి ఎప్పుడు చెమట నార్పగలదో. అని ఈవిధ
ముగ నాసనయమునుండి సర్వకాలములయందును పూర్వమువలె స్వధర్మ
ములను చేయుచున్నను బ్రతికియున్నంతకాలము రాజభోగ విషయములగు
సంకల్పములతోనే ఆబ్రాహ్మణుడు ప్రొద్దుబుచ్చుచుండెను. ఈవిధముగ
నాబ్రాహ్మణుడు తలపోయుచునే యుండగా, మంచు కమలమును జెరచు
నట్లు ఆబ్రాహ్మణుని శరీర సౌష్ఠవమునెల్ల జెరచుచు వార్ధిక్యము సంప్రాప్తిం
చెను. ఈవిధముగ నాబ్రాహ్మణునకు వార్ధిక్యము అధికమై మరణము ఆస
న్నమగుచుండుటను జూచి అమ్మహాత్ముని భార్యయగు అరుంధతి మిక్కిలి
శోకించుచు నీవుచేసినట్లే అతిభక్తితో నన్నారాధించెను. (సరస్వతిని ఆరా
ధించెను) నేనును ప్రత్యక్షమైతిని. అప్పుడు ఈక్రిందచెప్పబోవు వరములను
నన్నడిగెను. నీకువలెనే ఆమెకును "మనుష్యులకు మరణము లేకుండుట ఎన్న
టికిని సంభవింపదు" అనుట బాగుగ దెలిసియుండు "ఓసరస్వతీదేవి! నాభర్త
మృతుడైనను అమ్మహాత్మునియొక్క జీవుడు స్వగృహమునుండి వెడలిపోకూ
డదు. ఈవరమును అనుగ్రహింపుము" అని వేడుకొనెను. నేనును దానిని
అంగీకరించితిని. తరువాత కాలక్రమమున నాబ్రాహ్మణుడు మృతినొందెను.
స్వగృహమునందున్న ఆకాశమునందు చిదాకాశరూపముతో ఇప్పటికిని ఉ
న్నాడు. ఇట్లుండియు తాను ఆకాశరూపుడయ్యు సంకల్పబలమువలన అన
గా మొట్టమొదట రాజుగావలెనని తాను చేసిన సంకల్పముచేత మహాప్ర
భావ సంపన్నుడగు ప్రభువాయెను. మఱియును ఆసర్వాతిథి మృతిజెంద
గానే ఆతనిభార్యయగు నరుంధతి అత్యంత శోకమువలన గుండెలవిశి మృతి
నొందెను. స్థూలశరీరమును విడచి సూక్ష్మశరీరముతో భర్తనుకలిసికొ
నెను. ఆగ్రామమునందు ఆబ్రాహ్మణునియొక్క పుత్రులును గృహములును
భూమిమొదలగు స్థిరాస్తియు పాత్రలునగలు మొదలగు చరాస్తియున్న
వి. ఇప్పటికిఆబ్రాహ్మణుడు మృతినొంది ఎనిమిదినములే. ఇప్పటికిని ఆయన
యొక్క జీవుడు ఇంటనే యున్నాడు. ఓ స్త్రీరత్నమా! లీలా! ఆబ్రాహ్మ
ణుడే రాజై కులపద్ముడనుపేరుతో నీకుభర్తయాయెను. ఆబ్రాహ్మణుడి
భార్యయగు నరుంధతియే నీవు. ఈవిధముగ బ్రాహ్మణదంపతులగు మీరిరువు
రును క్షత్రియులై చక్రవాకమిథునమువలె అన్యోన్యానురాగము గలిగిభూమి
యందు అవతరించిన పార్వతీపరమేశ్వరులో యన మహావిభవముతో రా

జ్యము చేయుచుండిరి. ఈవిధముగా పూర్వజన్మ సంబంధమైన సంసార భ్రమమునంతయు వివరించితిని. రెండవజన్మము వచ్చిన విధమునుగూడ స్పష్టపరచితిని. ఇట్లే ప్రస్తుతపు జన్మముకూడ (పదియారేండ్లవాడై యుండుట కూడ) కలిగెనని యూహింపుము. ఈసర్వమును భ్రాంతియే. పూర్వ భ్రాంతివలన ఉత్తరభ్రాంతి గలుగుచుండును కాని, మఱేమియు లేదు. నీవు సమాధియందు జూచిన విషయము ఎట్లుభ్రాంతియో అట్లే మీరు రాజ్యము చేసిన విషయముకూడ భ్రాంతియే. బ్రాహ్మణుడుగా నుండుటయును భ్రాంతియే. కావున నిందొకసృష్టి భ్రాంతియనియు మఱియొకసృష్టి కాదనియు జెప్పుటకు వీలులేదు. జీవుడు ఆకాశరూపుడగుటచేత ఎప్పటికిని నిర్మలుడే. మనఃప్రభావముచేత భ్రాంతిమయమగు సృష్టి ప్రవర్తించుచున్నది. అనిన ఆశ్చర్యముతో లీలాదేవి ఇట్లనియె. ఓసరస్వతీదేవీ! నీవాక్యము సత్యమైనట్లు నాకుతోపదు. నీవుచెప్పినది ఎట్లు సంభవించును. బ్రాహ్మణజీవుడు అచటనేయుండగా నీయూరిలో ఎట్లుజన్మించును. అతడెక్కడ మేమెక్కడ. మఱియొక విశేషము. ఆజీవుడు అచ్చటనేయుండి కులపద్మరూపముతో రాజ్యము చేయుచున్నాడనియేకదా చెప్పవలయును. ఇట్లుచెప్పిన ఆతనియూరెక్కడ? మాయూరెక్కడ? మేము సంచరించుచున్న సర్వదేశములును పర్వతములును నదులును దశదిక్కులును ఆబ్రాహ్మణుని ఇంటియందు ఎట్లుపట్టును. ఈవిధముగ నీవాక్యము అతివిరుద్ధమై యున్నది. "మదించిన ఐరావతమును పట్టితెచ్చి ఆవగింజలోపల కట్టివేసిరి." అనిచెప్పినట్లును "ఒక పరమాణువులోపల దోమ, సింహములతో, యుద్ధముచేసెను" అన్నట్లును "ఒక తామర విత్తనమునందు మేరుపర్వతముండగా దానిని ఒక తుమ్మెదపిల్ల మింగెను" అనిచెప్పినట్లును నీవాక్యము యుక్తిహీనమై యున్నది. అని చెప్పెను. అంత సరస్వతీదేవి ఇట్లనియె. ఓలీలాదేవీ! నేను అసత్యమెప్పటికిని పలుకను. మాబోటివారలు ఎప్పటికిని నియమములను భంగము గావింపరు. మనోవాక్కాయములచేత ఎప్పటికిని నియమానుసారముగనే అనగా ఏది ఎట్లున్నదో అట్లే సర్వవ్యవహారములను ఆచరింతురు. కావున నావాక్యమునందలి యథార్థస్థితి ఏమియనిన:—జీవుడు ఆకాశరూపుడు. భ్రాంతి కల్పితమగుటచేత నీసర్వసంసారమును ఆకాశరూపమే. కావున నాబ్రాహ్మణజీవుడు వానిస్వగృహమునందే యుండియు నీసర్వసామ్రాజ్యమును చిత్తప్రభావము వలన జూచుచున్నాడు. సర్వమును ఆకాశరూపమే కావున "ఆబ్రాహ్మణుని యొక్క ఇంటియందు ఇవియెల్ల ఎట్లుపట్టును" అనుసంశయము అక్కర

లేదు కదా. మీకు పూర్వజన్మస్మృతి అనగా "ఇదినాయిల్లు, వీడు నాపుత్రుడు, నాపేరు సర్వాతిథి, నేనుబ్రాహ్మణుడను" అనుస్మృతిపోయి "నేను క్షత్రియుడను నాపేరు కులపద్ముడు, నేను క్షత్రియస్త్రీని, నాపేరు లీలాదేవి" అనుస్మృతికలిగెను. ఇంతయే మరేమియు లేదు. ఈవిధముగ జాగ్రతిస్మృతిపోయి స్వప్నస్మృతి వచ్చినట్లు పూర్వజన్మస్మృతిపోయి ఉత్తరజన్మస్మృతి వచ్చుటయే మరణము. ఇదియే జన్మాంతరప్రాప్తి. ఈభూమి అనగా నీసర్వప్రపంచము అద్దమున గానవచ్చు ప్రపంచమువలె మనోరాజ్యమునందు (అనగా సంకల్ప పరంపరయందు) గానవచ్చుప్రపంచమువలెను చిదాకాశరూపుడగు జీవునియందు చిత్తప్రభావముచేత గానవచ్చుచున్నది. అద్దములో గానవచ్చు దానికిగాని సంకల్పమున గానవచ్చు దానికిగాని వాస్తవస్వరూపము ఏమియు లేనట్లు ఈప్రపంచమునకుగూడ స్వరూపము ఏమియు లేదు. కావున ఉన్నట్లు తోచుటమాత్రమే స్వరూపముగాగల ఈప్రపంచము ఎన్నియైనను ఒక పరమాణువులో నుండవచ్చును. కావున పరమాణుస్వరూపుడగు ప్రతిజీవుని యందును అనేక ప్రపంచములు కలవని తెలిసికొనుము. పిమ్మట లీలాదేవి ఇట్లని ప్రశ్నచేసెను. ఓపరమేశ్వరీ! లోకజననీ! సరస్వతీదేవీ! అచ్చట నాబ్రాహ్మణుడు నేటికి ఎనిమిదవ దినమునందే మృతినొందెనుగదా. ఇంతలో మాకిచ్చట ననేకసంవత్సరములు ఎట్లుగడచెను. అనిన సరస్వతి ఇట్లనియె. ఓ స్త్రీరత్నమా! ఇందాశ్చర్యము ఏమియులేదు. ఈసంసారము ఎల్లను ఊరక తోచుటయేకాని, వాస్తవము కాదు. చిత్తప్రభావముచేత చిదాకాశమే ఇట్లు వికసించును. ఇట్లగుటచేత నాబ్రాహ్మణుని యూరునకును నీపట్టణమునకును దూరము ఎంతయున్నను ఎట్లు లెక్కకు రాలేదో అట్లే కాలముకూడ లెక్కకురాదు. ఒకక్షణమాత్రమున స్వప్నమునందు అనేకసంవత్సరముల కాలము చేయవలసినపని చేసినట్లు ఇచ్చటను ఎనిమిది దినములలో ఇంతకార్యము జరిగెను. పతివ్రతయగు నో చిన్నదానా! ఈవిషయమును వినుము. అనగా జీవునకు సంసారము తోచు విషయమును మరల వివరించెదను వినుము. అపుడు మరణమను సత్యమూర్ఛను (ఈమూర్ఛయు తోచుటమాత్రమేకాని వాస్తవరూపము ఇంచేమియు లేదనుట) క్షణకాలము అనుభవించి అంతట దనపూర్వస్థితిని మరచి మఱియొకస్థితిని స్మరించును. పిమ్మట ఓసుందరాంగీ! "ఇది నాకు ఆధారము నేను దీనిని ఆశ్రయించియున్నాను. నేను వీడు చేతులు కాళ్లు మొదలగు నవయవములతో గూడిన శరీరమునాది. నేను ఈతండ్రికి పుత్రుడను, నాకు ఇప్పుడు

ఇన్నివండ్లు కలవు. వీరు నాబంధువులు. నాయందు మిక్కిలి ప్రేమగలవారు. మనోహరమగు నీఇల్లు నాది" అని అనేకవిధముల దలంచుచుందును. ఇది యంతయు మరణమూర్ఛకు పిమ్మట గలుగు భ్రాంతియేకాని మఱేమియు కాదు. అనినవిని లీలాదేవి మఱియొక ప్రశ్న చేసెను. ఓసరస్వతీ! మహాదేవీ! నాకు సర్వోత్తమమగు చూపును చూపితివి. ఆహా ఇదియెంత ఆశ్చర్యకరమైనది. ఇట్టిచూపును చూచుటయందు పరిపూర్ణ పాండిత్యము మాత్రము కలుగ వలసియున్నది. ఓమహేశ్వరీ! అట్టిపాండిత్యము అభ్యాసములేక కలుగదు. కావున నింతలో నాకుతూహలమును ఒకదానిని దీర్పుము. నీవు చెప్పిన బ్రాహ్మణదంపతుల సృష్టియున్న స్థలమునకు నన్ను గొనిపొమ్ము. అనిన సరస్వతీదేవి ఇట్లనియె. ఓలీలాదేవీ! నీయిష్టమును అట్లే నేరవేర్తును. దానికి నీవు చేయవలసినకార్యము ఒకటికలదు. భ్రాంతిమయమగు నీదృష్టిని అనగా "నేను లీలాదేవిని. గిరిగ్రామమునకు బోవుచున్నాను" అను దృష్టిని విడిచి ప్రపంచరహితమగు చిన్మయదృష్టిని అవలంబింపుము. వాస్తవస్థితిలో నీప్రపంచమంతయు చిత్తవిలాసమాత్రమే అసత్యమే కావున నీచిద్రూపునికి నెదుట ప్రపంచమే లేదుకదా. ఈవిధముగ నతిపరిశుద్ధమైనట్టియు సర్వోత్తమమైనట్టియు శుభకరమైనట్టియు దృష్టిని అవలంబించి ఈయాకారమును విడచి పరమార్థమగు చిదాకాశరూపము బొందుము. నిర్మలత్వమును జెందుము. ఇట్లుజెందితివేని ఆబ్రాహ్మణదంపతుల సృష్టిని మనము జూడవచ్చును. వారినిచూచుట కనువాకిలికి నీస్థూలశరీరము అనగా "స్థూలశరీరము నాది అనుభ్రాంతి గొప్పగడియయై యున్నది. వాస్తవస్థితిలో నీప్రపంచమునకు రూపమే లేదు. అజ్ఞానమువలన దీనినంతయును మీరు రూపము గలదానినిగా జూచుచున్నారు. వాస్తవస్థితిలో భూషణ రూపములు సువర్ణమునకు లేక పోయినను భ్రాంతిచేత నాసువర్ణమును "ఇది ఉంగరము. ఇదికడియము" అని తలంచుట లోకమున అనుభవసిద్ధమయ్యే యున్నదికదా. ఇట్లే నీప్రపంచమునకుకూడ చిదాకాశముకంటె వేఱు రూపము లేకున్నను. "ఇదిమృగము. వీడుమనుష్యుడు" అనుమొదలగు భేదములచేత నానారూపములు గలదానినిగా భావించుచున్నారు. ఓబాలికా! లీలాదేవీ! నీకు బ్రహ్మరూపమును చూచుట అభ్యాసము కాకపోవుటచేత నీస్వరూపము పరబ్రహ్మత్వమును చెందలేదు. "ఇదిప్రపంచము. సంసారము. ఇదినాది. వానిది" అని సంకల్పించుటయే స్వరూపముగా గలిగియున్నది. ఇట్టిభావన బహుకాలమునుండి చిత్తమునందు దృఢమైయుండుటయే దీనికి హేతువు. ఇట్లగుటచేత నీవుతత్వమును

ఎఱింగినను అభ్యాసములేక యథార్థస్వరూపమును (సర్వమును చిదాకాశ
మే యనుటను) తెలిసికొనలేకయున్నావు. మాబోటివారమన్నను సర్వకాల
ములయందును బ్రహ్మజ్ఞానమును అభ్యసించుటచేత దానియందు దార్ఢ్యము
ను పొందియున్నాము. ఈప్రపంచమంతయును చిదాకాశమునకంటె భిన్న
ముగ లేదు అను నిశ్చయము మాకు స్థిరమైయున్నది. ఇట్లగుటచేత మీరు
బ్రహ్మరూపముగ నున్న దానిని బ్రహ్మభిన్నమైన దానినిగా జూచునట్లు
మేము బ్రహ్మ భిన్నము కానిదానినిగా జూచుచున్నాము. "ఇట్లైన
చూచుటకును, తాకుటకును వీలైన ఈస్థూల పదార్థములు స్వరూప
శూన్యము అనుటఎట్లు" అనియెదవేమో వినుము. వాస్తవస్థితిలో నివియన్ని
యు మనోమయరూపములు గలవియేకాని యథార్థరూపములు గలవి కావు.
ఈవిధముగ మనోమయ సూక్ష్మశరీరముతో గూడియున్న వీనిని అజ్ఞానవశ
మువలన పంచభూతమయ శరీరములేక ఆకారములు గలవానినిగా భావించు
చున్నారు. ఇదియంతయు అజ్ఞానము చిరకాలమునుండియు మనస్సున నిలచి
యుండి దృఢమగుటవలన వచ్చినది. కావున ఈప్రపంచవాసన యంత
యును ఎప్పుడుక్షీణించునో అప్పుడు యథార్థమగు సూక్ష్మభావము బయలు
పడును. మనస్సు రజస్తమోగుణముల విడచి శుద్ధసత్వమును ఎప్పుడు అవ
లంబించునో అప్పుడు దానియందలి వాసనలన్నియు క్షీణించెనని ఎఱుగ
వలయును. కాచుట వలన ఘనీభవించిన మంచు నీరగునట్లు వాసనా
క్షయముగల మనస్సు సూక్ష్మత్వమును పొందును. కావుననో పవిత్రు
రాలా! వాసనలను నశింపజేయుటకునై ప్రయత్నముజేయుము. ఆవాసనా
క్షయము దృఢమయ్యెనేని జీవన్ముక్తురాలగుదువు. ఈజ్ఞానచంద్రుడు ఎంతకా
లమువరకు పరిపూర్ణుడుకాడో అంతలోపల నీ స్థూలశరీరమును విడిచి నీవడి
గిన దంపతుల సృష్టిని చూడుము అనిచెప్పెను. (గిరి గ్రామము మొదలగువా
టిని జూడవలయుననే ఇచ్ఛగల చిత్తమునకు వాసనాక్షయము గలుగదని సర
స్వతీదేవి యట్లుజెప్పెను. సంపూర్ణసిద్ధిని జెందవలయునని లీలాదేవి బ్రహ్మ
భ్యాస ప్రశ్న జేసెను.

### —* బ్రహ్మాభ్యాసము *—

అంతలీలాదేవి ఇట్లని ప్రశ్నచేసెను. ఓసరస్వతీదేవీ! ఈవిషయమున
(బ్రహ్మామునువిడుగు విషయమున లేక వాసనలను క్షీణింపజేయు విషయ
మున) ఏయభ్యాసము సహాయకారియగును.? ఆయభ్యాసమును జేయువిధ
మెద్ది? అది దృఢమగుటఎట్లు? అట్లుదృఢమైనచో ప్రయోజనమేమి? వీనినంత

యు వివరింపుము. అనిన సరస్వతీదేవి సర్వమును ఇట్లని వివరింప నారంభించెను. ఓలీలాదేవీ! సర్వకాలములయందును ఆపరబ్రహ్మమునే ధ్యానించుచుండుట, ఆపరబ్రహ్మము యొక్క స్వరూపమునుగూర్చియే మాటలాడుచుండుట, మిత్రులతో జేరినప్పుడు ఒకరికొకరు ఆపరబ్రహ్మమునే బోధించుకొనుచుండుట, సర్వకాలములయందును మనస్సును ఆపరబ్రహ్మమునందే జేర్చియుండుట, అనునదియే బ్రహ్మాభ్యాసమని పెద్దలు చెప్పుదురు. మిక్కిలి గొప్పతనము రమ్యత్వము గలిగి దుఃఖస్పర్శ ఇంచుకయైనను లేకను ఏమహాత్ముల యొక్క మనస్సు సర్వకాలములయందును ఆనందమును వర్షించుచుండునో అట్టివారికి అభ్యాససిద్ధి కలిగెనని ఊహింప వలయును. "నేను జ్ఞాతను (తెలిసికొనువాడను) ఈప్రపంచము జ్ఞేయము (తెలిసికొనబడునది) ఈ రెండు వస్తువులును కలవు" అను నభిప్రాయమును వదలి ఏమహాత్ములు జ్ఞేయపదార్థము నశించుటకై యుక్తులతోను శాస్త్రములతోను బ్రయత్నించుచుందురో వారే బ్రహ్మాభ్యాసమును చేయువారు. "ఇది ప్రపంచము. ఇది నేను. అను భేదరూపమగు దృశ్యము సృష్టియే కాలేదు. కావున నిది ఎప్పటికిని లేదు. కేవలము భ్రాంతిచేత నున్నటుమాత్రమే తోచుచున్నది. అను దృఢజ్ఞానమును అలవాటుసేయుటయే బ్రహ్మాభ్యాసము. లేక జ్ఞానాభ్యాసము. మఱియు దృశ్యము ఉండుటకే వీలులేదని తెలుసుకొనుటచేత ఈ దృశ్య పదార్థసంబంధములగు రాగద్వేషములు కేవలము భ్రాంతిసిద్ధములే గదాయని ఏర్పడునుకదా. ఈకారణమువలన "ఈరాగద్వేషాదులును నశింపచేయువలయును." అనునిచ్ఛబలవంతముగ గలుగును. ఇదియే (ఇట్టి దృఢవైరాగ్యమే) బ్రహ్మాభ్యాసము. ఈవిధముగ జ్ఞానమనినను జ్ఞేయమనినను "దృశ్యపదార్థము బొత్తిగలేదు" అని తెలిసికొనుటయే. బ్రహ్మస్వరూపము ఈ తెలివిచేతనే స్పష్టమగును గావున దీనికే జ్ఞానమని పేరు. జ్ఞానస్వరూపుడు బ్రహ్మమే కావున జ్ఞేయమనియు (తెలిసికొన దగిన పదార్థము = బ్రహ్మవస్తువు) అనియు దీనికే పేరు. ఇట్టి తెలివివలన చిత్తశాంతిరూపమగు మోక్షము దొరుకును. ఇట్లగుటచేత ఈబ్రహ్మాభ్యాసమే (దృశ్యము లేదనుటయే బ్రహ్మాభ్యాసమని చెప్పియున్నాను) మహాసమృద్ధి. ఇతకంటె శ్రేష్ఠమగునది లోకమున నెద్దియు లేదు. వశిష్ఠమహాముని చెప్పుచున్నాడు. ఓరామచంద్రా! ఈవిధముగ బ్రహ్మాభ్యాస స్వరూపమునుగూర్చియు దానియభివృద్ధినిగూర్చియు (శాస్త్రయుక్తులచేత విచారించుటవలననాయభ్యాసమునకు నభివృద్ధి గలుగునని ఇదివరకే సూచింపబడియున్నది) దానిఫలమునుగూర్చియు నా

లీలాదేవీ సరస్వతులు పైన వర్ణించినవిధముగ మాటలాడుకొని పిమ్మట నా బ్రాహ్మణదంపతుల కుటుంబమును జూచు వేడుకతో నాదినమురాత్రి సమాధియందు నిశ్చలులై నిలచిరి. ఆనిర్వికల్ప సమాధివలన వారిరువురును పూర్వస్మృతిని వదలిరి. అందు జ్ఞానరూపిణియగు నాసరస్వతీదేవి జ్ఞానమగు శరీరముతోనే సంచరించెను. మనుష్య స్త్రీయగు నాలీలాదేవియు తనస్థూలశరీరమును విడచి జ్ఞానమయమై లేక మనోమయమై ప్రాదేశమాత్ర పరిమాణము గలదియై (లొడితెడయిన ప్రమాణము గలదియై) యున్నసూక్ష్మదేహమును ఆశ్రయించి సంచరించెను. ఇట్లువారిరువురును కేవలమగు చిదాకాశరూపముతోనిలచిరి. మహాకాశ మాశ్రయించిరి.

పిమ్మట వినోదపరులును మనోహరమగు నేత్రములు గలవారును దృశ్యపదార్థమును ప్రకాశింపజేయు జ్ఞానమే స్వస్వరూపముగా గలవారు (పరమార్థజ్ఞానమువలన నట్టిబ్రహ్మమే స్వస్వరూపమని యెఱిగినవారు)ను నగు నాస్త్రీలిరువురు భూతాకాశమును ఆశ్రయించి బహుదూరము పోయిరి. ఇట్లుబహుదూరము పోయి పోయి అచ్చట మహాసముద్రమువలె నెచ్చటను ఎడములేనట్టియు అతిగంభీరమైనట్టియు నిర్మలమైనట్టియు గొప్ప ఆకాశమునుజూచిరి. అది మిక్కిలి మనోహరమై యుండెను. అచ్చట మిక్కిలి రమ్యమగు గాలి వీచుచును అధికసుఖమును గలిగించుచుండెను. మనోవేగమను మహాసిద్ధి అయ్యాకాశమున వాయువేగమును జయించుచుండెను. ఆయాకాశమునకు చుట్టును రాక్షసులును పిశాచములును కూశ్మాండమను గ్రహములును నిలచియుండినవి. ఒక్కొకచోట నించుకయైనను ఎడములేక పాలపై మీగడ గ్రమ్మునట్లు ఆయాకాశమును ఆక్రమించి ఢాకినీగ్రహములు నృత్యము సేయుచుండినవి. కుక్క, కాకి, ఒంటె, గాడిదె, అనువాని ముఖములవంటి ముఖములు గలిగినట్టియు నివ్వరియోజనముగ నూరామడదూరముపోయి మరలి వచ్చుచున్నట్టియు యోగినులు అచ్చట సంచరించుచుండిరి. మఱియు వాయుసమూహముచే అడ్డగింపబడి అనగా క్రిందికి పడకుండునట్లు చేయబడి అయ్యాకాశమునందు ఒకచోట గంగానది (ఆకాశగంగ) ప్రవహించుచుండెను. మఱియొకచోట గోడలులేనిఇండ్లు చిత్తమునకు ఆశ్చర్యమును గలిగించుచుండెను. మఱియొకచోట నారద తుంబురులు తమతమ ప్రావీణ్యమును జూపుచు గానమును సేయుచుండిరి. మఱియొకచోట కల్పాంతమునందు వర్షించి ప్రపంచమును నాశముచేయునట్టి మేఘసమూహము ధ్వనియే లేక చిత్తరువున వ్రాసిన ప్రతిమలయట్లు నిలచియుండెను.

కొన్నికొన్ని ప్రదేశములయందు జూచిన ఎన్నిలక్షల యోజనములు నడచినను ఒకరాజంతువుసైన ఆయాకాశమున గానరాదు. ఒకొక్కస్థలమునందు రాతిలోపలి భాగమువలె నభేద్యమగు చీకటి ఆవరించియుండెను. మఱియొక భాగమునందు అగ్నియోయనునట్లు భావింపజేయుదు నతి తీవ్రమగు ప్రకాశము ఆయాకాశమును ఆవరించియుండెను. మఱియు అత్తిపండునందు చలించుదోమలవలె నాయాకాశమున త్రిలోకవాసులగు సర్వభూతములును సంచరించుచుండినవి. స్త్రీరత్నములగు నాలీలా సరస్వతులిరువురును అయ్యాకాశమును గడచి భూమిపైకి మఱలి రాబ్రయత్నించిరి. అనిచెప్పి వశిష్ఠమహాముని మఱియు నిట్లనియె.

ఓ రఘురామా! రామచంద్రా! స్త్రీరత్నము లిరువురును ఈ విధముగ నొక బ్రహ్మాండమును అతిక్రమించి ఆ బ్రాహ్మణ దంపతులున్న స్థలమునకు వచ్చిరి. సర్వమును సంకల్పమయమే యగుటచేతను లీలాదేవికి బ్రహ్మాభ్యాసము ఎంత దృఢమైనను కుతూహలమువలన ఛాయామాత్రములుగ ప్రపంచమయ సంకల్పము నుండుటచేతను భ్రాంతిమయములైన బ్రహ్మాండములు కనబడవచ్చునని తెలిసికొనుము. పిమ్మట సంకల్పసిద్ధిగల యాఇరువురుస్త్రీలును మనోమయమగు నారెండవసృష్టియందు బ్రాహ్మణుడు నివసించియున్న రాజ్యమును గృహమును జూచిరి. వారు మాత్రము ఇతరులకు గానరాలేదు. అప్పుట నాబ్రాహ్మణుడు గతించి అప్పటికి ఎనిమిది దినములే యగుటచేత దాసీజనులందరును దుఃఖముచే నేమియుందోపక కలత నొందుచుండిరి. బంధువులగు స్త్రీలందరును విశేషముగ రోదనము సేయుచుండిరి. ఇంతయేల? పిడుగుబడి కాలిన వృక్షమువలె ఆ బ్రాహ్మణునిగృహము బొత్తిగ సరియైన విధము దప్పియుండెను. పిమ్మటలీలాదేవి బ్రహ్మాభ్యాస బలమువలన ప్రత్యక్ష పరబ్రహ్మమువలె సత్యకామయు సత్యసంకల్పయు (ఏదికోరిన దేనిని సంకల్పించిన నదియెల్లను సత్యమగునట్టి ప్రభావముగలది) నైన యది ఈక్రింది విధముగ దలపోసెను. వీరందఱును నాబంధువులు. శోకించుచున్నారు. వీరు నన్నును ఈసరస్వతీదేవిని చూచిన మేలుగనుండును. నేనును సామాన్య స్త్రీరూపమును దాల్చెదను. ఈసరస్వతియు నట్లేదాల్చునుగాక. ఇట్లామె సంకల్పింపగానే సర్వమును అట్లె యయ్యెను. లక్ష్మీపార్వతులవలె గృహమునెల్లను ప్రకాశింపజేయుచున్న యాస్త్రీలను ఇరువురను ఆయింటియందు ఉన్నవారలు గాంచిరి. అట్లుచూచి "ఓ దేవతలారా! మీకు నమస్కారము." అనుచు నాబ్రాహ్మణుని పెద్దకొ

మారుడగు జ్యేష్ఠశర్మయనువాడు బంధుజనులతో గూడి వారలకు అర్ఘ్యమి చ్చెను. ఇట్లర్ఘ్యమిచ్చి యాజ్యేష్ఠశర్మ ఇట్లనియె.

ఓ దేవతలారా! ఇచ్చట సర్వలోకములకును శ్రేష్ఠులైనట్టియు వంశ మును అభివృద్ధిజేసినట్టియు సర్వాతిథి యరుంధతి అనుపేరులుగల బ్రాహ్మణ దంపతులు నివసించుచుండిరి. వారు మాకు తల్లిదండ్రులు. స్తంభమువలె కులమునకెల్లను ఆధారభూతులైయుండి పుత్ర పశు బంధువులతో గూడిన ఈగృహమును విడిచి అత్యల్పకాలములోనే స్వర్గమునకుబోయిరి. ఈకార ణమువలన మాకు మూడులోకములును శూన్యప్రాయములై యున్నది. కావున నోదేవతలారా! మాయందు అనుగ్రహముంచి మాదుఃఖమునకు ఉపశాంతినిజేయుడు. మహాత్ముల దర్శనము ఎప్పటికిని వృథకాదుగదా? ఈ విధముగ పుత్రుడు పలికినవాక్యమును విని ఆలీలాదేవి తనచేతితో నాతని శిరమును స్పృశించెను. వర్షధారలచేత గ్రీష్మకాల సంతాపమును విడచు పర్వతమువలె నాతడును ఆమెయొక్క హస్తస్పర్శచేత శోకమును విడి చెను. ఇతరబంధువులును వారలప్రభావముచేత నట్లే శోకవిముక్తులైరి. ఈ విధముగ బ్రాహ్మణదంపతులయొక్క సృష్టినంతయును బ్రత్యక్షముగ జూచి ఆలీలాసరస్వతు లిరువురును ఆగ్రామమునందు ఆగృహముననే అంతర్ధా నము నొందిరి. చిదాకాశము సర్వవ్యాపకమగుటచేత దానియందు ఐక్యము నొందుటకు నొకచోటనుండి మఱియొకచోటికి బోవ నక్కరలేదుగదా. అంత సరస్వతీదేవి లీలతో నిట్లనియె.

ఓ లీలా! నీవు కోరినదానినంతయు జూచితివికదా. దృష్టాంతము కూడ బాగుగ నిరూపింపబడినది. బ్రహ్మస్వరూపమును, ప్రపంచముయొక్క యునికియును ఇట్టిస్వభావముకలది. నీకు నింతకుముందు ఆబ్రహ్మస్వరూప ముకు గూర్చి చాలినంత వివరించియే యున్నాను. ఇకనన్నేమి అడిగెదవో చెప్పుము. అనిన లీలాదేవి ఇట్లనియే. ఓదేవీ! మఱియొక కోరికయున్నది. ఇంతకుమునుపు నాభర్త పదియారేండ్లవాడై రాజ్యము చేయుచుండుటను నేనుచూచితిని. అప్పుడు నన్ను భర్తయు నచ్చటివారును జూడలేకపోయిరి. ''వీరు నన్ను జూడవలయును'' అనినేను సంకల్పించినను వ్యర్థమాయెను. ఇప్పుడన్ననో, నాసంకల్పము ఫలించినది. నాపుత్రుడు నన్నుజూచెను. ఇట్ల గుటకు కారణమేమి? అనియడిగిన సరస్వతీదేవి ఇట్లని సమాధానము చె ప్పెను. ఓలీలాదేవీ! ఆసమయమున అనగా మొట్టమొదట నీవు నీభర్తను జూచినప్పుడు నీకు ఇప్పటివలె బ్రహ్మాభ్యాసము అధికముగలేదు, భేదభ్రాం

తియు సంపూర్ణముగ నశింపలేదు. "నేను లీలాదేవిని" అనుభావమును బ్రహ్మాభ్యాసము లేకపోవుటచేత నశింపలేదు. ఈ కారణమువలన అప్పుడు నీకు సత్యసంకల్పత్వము (ఏది ఎట్లు సంకల్పించిన నది యట్లేయగుట) కలుగ లేదు.

ఓసుందరాంగీ! లీలాదేవీ! ఇప్పుడన్ననో నీకు బ్రహ్మాభ్యాసము సిద్ధించినది. భేదభ్రాంతి తొలగినది. ఆత్మాభిమానము నశించినది. ఇట్లగుటచేత నీవు సత్యసంకల్పవైతివి. కావుననే "నాపుత్రుడు నన్ను చూచునుగాక" అని సంకల్పింపగానే అదిఫలించెను. పూర్వమునందు అట్టిస్థితి నీకులేదు. కావున "నాభర్త నన్ను చూచునుగాక" అని సంకల్పించినను అది ఫలింపలేదు. ఇప్పుడు నీవు మరల నాభర్తయొద్దకు బోతివేని, పుత్రుడు నిన్నుజూచినట్లే ఆతడును నిన్ను జూడగలడు. ఇట్లుసర్వమును దెలిసికొని లీలాదేవి మఱియు నిట్లనియె. ఓ లోకజననీ! సరస్వతీదేవీ! ఎంతయాశ్చర్యము, ఎంతయాశ్చర్యము. నాకు ఇప్పుడు వెనుకటి జన్మల వృత్తాంతమంతయును జ్ఞప్తికివచ్చుచున్నది. నేను ప్రస్తుతము అనుభవించుచున్న జన్మ రజోగుణ సంబంధమైనది. సత్వగుణ సంబంధమైనదిగాని తమోగుణ సంబంధమైనదిగాని కాదు. నేను పరబ్రహ్మమునుండి సంకల్ప ప్రభావమున జీవుడనైనదిమొదలు ఇప్పటికి ఎనిమిదినూర్ల జన్మములు గడచినవి. అవిఅన్నియును ఏకరూపములైనవి గావు. అనేకసారులు అనేకయోనులయందు జన్మించితిని ఇట్టి ఈజన్మములన్నియు నాకునిప్పుడు ఎదుట నున్నట్లున్నవి. ఓసరస్వతీదేవీ! నేను పూర్వమునందు ఒకసంసారమున విద్యాధరస్త్రీనై జన్మించితిని. తామరయందలి మకరందమును అనుభవించు తుమ్మెదలవలె స్వర్గలోక సుఖములను అనుభవించుచుంటిని. ఆజన్మమునందు నన్ను దుర్వాసుడు శపించెను. ఆశాపమువలన మనుష్యస్త్రీనైతిని. మఱియొకమారు నాగలోకమునందు సర్పాంగననై జన్మించితిని. అప్పుడు పూర్వపు సంసారమునకంటె భిన్నస్వభావము గల మఱియొకసంసారమును అనుభవించితిని. పిమ్మట కానుగుచెట్లతోను అనేకవిధములగు పొదరిండ్లతోను నిమ్మచెట్లతోను కడిమిచెట్లతోను గూడిన అరణ్యమునందు నివసించుచు ఆకులతో నేర్పరచిన వస్త్రమును ధరించుచు బోయదానినై యుంటిని. తరువాత నొక యాడుపక్షినై అరణ్యమున నివసించుచుంటిని. అప్పుడొక ఒకబోయవాడువలవైచి నన్ను పట్టెను. నేనును ఆవలలో చిక్కుకొని తప్పించుకొన బ్రయత్నించుచు నెట్లో ఒకయట్లు మహాశ్రమతో జ్ఞానియగువాడు భేదవాసనలను ధ్వంసముచేయునట్లు ఆవలను

త్రెంపివైచితిని. పిమ్మట నొక యువతుమ్మెదనై పద్మకేసరముల భుజియించుచు తామరమొగ్గలను నంతఃపురములయందు తామరమిద్దెయను శయ్యపై నాభర్తయగు మొగతుమ్మెదతోఁగూడి సుఖించుచుంటిని. ఇంతలో నాకు పురుషత్వమును సంభవించునట్టి సుకృత కర్మలు ఫలించెను. దానిచేత నేను సురాష్ట్రదేశములకు (ఇదియే సౌరాష్ట్రదేశము) ప్రభువునై నూరుసంవత్సరములు రాజ్యము చేసితిని. తరువాత మూరుగ ఆవును ఆధారము చేసికొని దోమలు అనేకములు ఉయ్యాలలూగుచు సుఖించుచుండగా నట్టిసుఖమును బొందనేరక యొకమొగదోమ దుఃఖించుచుండెను. నేనప్పుడు దానికి భార్యనై దానితోఁ పాటు దుఃఖించుచుంటిని.

ఓ దేవీ! జగజ్జననీ! మహావాయువుచే యథేచ్ఛముగ ద్రిప్పబడుచున్న యోడవలె నేను అతి చంచలమగు సంసారనదీ తరంగమున జిక్కి అనేకవిధములగు సుఖదుఃఖములుగల బహుజన్మలయందు పరిభ్రమించితిని. అని మఱియు వశిష్ఠుడిట్లనియె. ఓ శ్రీరామచంద్రా! ఆలీలాసరస్వతులు ఇరువురును ఈవిధముగ మాటలాడుకొనుచు యోగశక్తిచేత ఆకాశమున కెగసిపోయిరి. ఈవిధముగ మనోహరాకారముగల వారిరువురును ఆసృష్టిని (బ్రాహ్మణదంపతులున్న స్థలమును) విడచి రెండవసృష్టికి (కులపద్ముని స్వగృహమునకు) ప్రవేశించి అచ్చట నంతఃపురమున పుష్పములచేత కప్పబడిన రాజశవమును జూచిరి. ఇంతకార్యము జరిగినను యాలీలాగృహమునందున్న దాసీదాసాదులకు ఆమె అప్పుడె వెలుపలికి జని మఱల వచ్చినట్లుండెను. అంతకు మున్ను లీలాదేవి భర్తయొక్క సమీపమును విడచి సరస్వతీదేవితో భాషించుటకై ఏకాంతగృహమునకు పోయి యుండెనుగదా. అచ్చటనుండి ఉచితసమయమునకే మరలి వచ్చినట్లుండెను. వాస్తవస్థితిలో వారుచూచిన దంతయు స్వప్నము వంటిదేకదా. ఇట్లు ఆరాజశవమునుజూచి యచ్చటనుండి మఱలి యాలీలాదేవి సరస్వతీదేవితోఁగూడి యోగమార్గమును అనుసరించి తనభర్త పదియారేండ్లవాడై రాజ్యముచేయుచున్న చోటికి బోయెను. ఇట్లు ఈలీలాదేవి రెండవమారు పోవునప్పటికి మహాసమృద్ధిగల యారాజ్యమునందు ఒకానొకసామంతరాజు గర్వితుడై ప్రభువును తిరస్కరించి అల్లరిచేసి యుండెను. దానిని మాన్పుటకై యాప్రభువు యుద్ధసన్నద్ధుడై యాసామంతరాజును ఎదిరింపబోయెను. ఈలీలాసరస్వతులు ఇరువురును బోవునప్పటికి రెండవ యాకాశమో యన మిక్కిలి భయంకరమగు నొక మహారణ్యమునందు వారిసైన్యములు రెండును ఒకదానినొకటి ఎదిరించి

యుండెను. యుద్ధసన్నాహములు రెండు సైన్యములయందును సమగ్రముగ నుండుచుగాని అప్పటికి యుద్ధము ఆరంభము కాకపోవుటచేత నవి (ఆసైన్యములు) కలత ఏమియులేక నిస్తరంగ సముద్రములవలె నిశ్చలములై యుండినవి. ఆసైన్యములకు నధిపతులగు ప్రభువు లిరువురును తమతమ సైన్యముల యొక్క మధ్యభాగములను అలంకరించుచుండిరి. మఱియు సముద్రముల వలె లెక్కకు మిక్కిలియగు ఆసైన్యములును ప్రభువులును ఒకరినొకరు నిర్మూలము సేయునట్టి ప్రయత్నములతో క్రోధములతో బాగుగా ప్రజ్వరిల్లుచున్న అగ్నులవలె మహాశ్చర్యమును గలిగించునట్లుండిరి. ఇట్లున్న యా ప్రభువులను లీలాసరస్వతులు ఆకాశమునందే యుండిచూచిరి. ఇట్లు వారు చూచుచుండగానే ప్రళయకాల సముద్రముతో సమానమగు నధికవేగము గలిగి అగ్నికణముల గ్రక్కుచు నతిభయంకరమై యాసేనలయందు బాణవర్షము ఆరంభమాయెను. ఆమహాయుద్ధమునందు మదించిన ఏనుగులు కూలుటచేత భూమియుదరి అందున్న జలము చలించెను. బహువిధ యంత్రములును చక్రములును శిలలును విసరివేయబడుచుండుటచేత (అప్పటికాలమున అరణ్యవాసులతో యుద్ధము సేయుటకై ప్రతిప్రభువు వద్దను ఆరణ్యక సైన్యము కొంత యుండెడిది. ఆయారణ్యకులు రాళ్ళతో యుద్ధము చేయుదురని తెలిసికొనవలయును) అవి తమకు బాధ కలిగించునేమో యని యాకాశమున సంచరించువారందరు తొలగి పోవుచుండిరి. విరువబడిన ఖడ్గములు తళతళలాడుచు వేగాతిశయమువలన ఆకాశమున కెగయుచుండుటచేత పగటికాలమునందు నక్షత్రములు ఉదయించెనేమో యని చూపరులకు దోచుచుండెను. పిడుగుతో సమానములగు గ్రుద్దులచేత వీరుల కవచములు పొడిపొడియగుచుండెను. వీరులు మేఘములుగాను శరపరంపర వర్షములుగాను రక్తప్రవాహములు మహాజల ప్రవాహములుగాను ఆకస్మికముగ తలలు తరుగబడుటచేత ఎగురుచున్న మొండెములు మేఘములజూచి నృత్యములు జేయు నెమళ్ళుగాను ఆరక్తప్రవాహ వేగములకు కదలుచున్న ఏనుగులే మహాపర్వతములుగాను గలిగి ఆయుద్ధము ప్రళయకాలమువలె నుండెను. చూచువారలకు మిక్కిలి భయము గలుగుచుండెను. ఈవిధముగ యుద్ధము అతిసంకులమై యుండ బాణముల ప్రేటులచేత మిక్కిలి డస్సియున్న వీరునివలె నాసూర్యుడును ఎనిమిదవపాలుమాత్రమే శేషించియుండగా మిక్కిలి క్షీణుడయ్యెను.

పిమ్మట నాప్రభువు లిరువురును మంత్రులతో నాలోచించి "ప్రొద్దు

గ్రుంకుచున్నది. యుద్ధము నిక చాలింపుడు." అని యొకరికొకరు దూతల నంపుకొనిరి. వెంటనే "యుద్ధము నిలుపబడినది" అని సూచించు వాద్యధ్వని మ్రోగెను. దానిని వినగానే రెండుసైన్యములును యుద్ధభూమినుండి మఱలినవి. ఇట్లు మరలి యాప్రభువులు అయ్యరణ్యమును గడచి వారివారి విశ్రామస్థలములకు సేనాసహితులై చేరిరి. పిమ్మట బాణముల దెబ్బలచేత ఒడలెల్ల నెఱ్ఱనైయున్న వీరునివలె సూర్యుడును యెఱ్ఱనై కాలక్రమమున నస్తమించెను. అంత క్రమక్రమముగా గాఢాంధకార సైన్యముతో గూడి అర్ధరాత్రమను ప్రభువు భూమిని ఆక్రమింపగానే రెండవ జన్మమునందున్న లీలాదేవిభర్త గంభీరమగు బుద్ధికలవాడు గావున జననాశమునకు మనస్సున వగచి కొంత ఖేదమును జెందినట్లుండి మంత్రులతో ప్రాతఃకాల కృత్యములను ఆలోచించెను. ఇట్లాలోచించి చేయవలసినకార్యమును నిర్ణయించి చంద్రునివలె నతిస్వచ్ఛమగు తనగృహమును జేరి శయనించెను. ఇట్లాప్రభువు నిదురించగానే ఈలీలా సరస్వతు లిద్దరును ఆతని గృహమునందు ప్రవేశించిరి. ఆరాజుయొక్క అంతఃపురమున మందారపుష్పములనుండి సుగంధము గైకొని ప్రమదా వనముగుండా చల్లని గాలి మెల్లన వీచుచుండెను. దానిచేత నారాజును ఇతర స్త్రీ పురుషులును నిదురించుచుండిరి. అంత చంద్రునివలె మిక్కిలిచల్లనై నిశ్చలములై యున్న యాలీలా సరస్వతులయొక్క దేహకాంతులు ప్రసరింపగానే అమృతముచేత తడుపబడినట్లు పరమాహ్లాదమును బొంది యాప్రభువు మేల్కొనెను. ఇట్లు మేల్కొని రెండుసింహాసనములపై గూర్చుండియున్న యాలీలాసరస్వతులను జూచెను. అప్పుడు ప్రభువు "ఈ స్త్రీలెవ్వరు? ఇటకేలవచ్చిరి? ఎట్లువచ్చిరి?" అని మఱియు ననేకవిధములుగ గొంతసేపు ఆలోచించి తత్త్వమును తెలిసికొనగోరి శేషశయ్యమీద పవళించియుండి లేచు మహావిష్ణువువలె దన శయ్యపైనుండి దిగ్గున లేచెను. పిమ్మట పుష్పములు దెచ్చువానివలె వికసించిన పుష్పముల దోసిలినిండా గ్రహించి యాప్రభువు భూమిపై పద్మాసనము వైచుకొని కూర్చుండెను. జనులదుస్థితినంతయును బోగొట్టి పరితాపములనెల్ల జల్లార్చు చంద్రులారా! లోపల వెలుపలనున్న అంధకారమును దొలగించు సూర్యులారా! ఓ దేవతలారా! మీకు నమస్కారము. అని చెప్పుచు వారిపాదములపై నాపుష్పములుజల్లెను.

పిమ్మట నాసరస్వతీదేవి యారాజవృత్తాంతమును లీలాదేవికి చెప్పుటకై ప్రక్కన నిద్రించుచున్న యొకమంత్రిని తనసంకల్పశక్తిచేత మేల్కొలిపెను. ఆమంత్రియు దక్షణమే మేలుకొని యాయోగినుల జూచి నమస్క

రించి వారిపాదములపై పుష్పముల జల్లి నమ్రుడగుచు ఎదుట నిలువబడి యెను. అప్పుడు ఆసరస్వతీదేవి ప్రభువును జూచి ఇట్లనియె.

ఓ మహారాజా! నీవెవరిపుత్రుడవు? ఎప్పుడుజన్మించితివి. ఇదియంతయు నెట్లు సంభవించెను? అనిఅడిగినపిని ప్రభువునకు మారుగా మంత్రి ఇట్లనెను. ఓ దేవతులారా! మీఎదుటగూడ నిస్సంశయముగ మాటలాడ గలుగుటయెల్ల మీయనుగ్రహమే. మీయాజ్ఞానుసారముగ మాప్రభువుయొక్క జన్మవృత్తాంతమును వివరించెదను వినుడు. కమలములవంటి నేత్రములుగల అతిసుందరుడగు కుందరథుడను నొకరాజు ఇక్ష్వాకువంశమున గలడు ఆతడు భూచక్రమువంతయును తనభుజముక్రిందికి దెచ్చికొనియెను. అతనికి చంద్రబింబముతో సమానుడగు భద్రరథుడను కొమారుడుకలిగెను. ఆతనికి విశ్వరథుడను పుత్రుడు పుట్టెను. వానికి మనోరథుడను తనయుడు జన్మించెను. అమ్మహాత్మునకు విష్ణురథుడను నాత్మజుడు పుట్టెను. ఆయనకు బృహద్రథుడను కొడుకు గలిగెను. వానికి సింధురథుడును, అమ్మహాత్మునకు శైలరథుడును, ఆశైలరథునకు కామరథుడును, ఆతనికి మహారథుడును, పుట్టిరి. ఓ దేవతలారా! మనోహరాకారుడగు ఈమాప్రభువు ఆమహారథునియొక్క పుత్రుడు. విదూరథుడను పేరుగలవాడు. ఈయన అమ్మహారథునివలన సుమిత్రాదేవియందును, "శివునివలన గౌరియందు కుమారస్వామి జన్మించినట్లు" జన్మించెను. ఇట్టివాడు పుత్రుడగుటవలన వారిసుకృతములు ఫలించెను. మాకు ప్రభువగుటవలన మాసుకృతములు ఫలించెను. ఈయన పది సంవత్సరముల వయస్సుగలవాడు కాగానే తండ్రియగు మహారథుడు పట్టాభిషేకము జేసి వనమునకు బోయెను. ఈమహాత్ముడు ఆ దినమునుండియు ధర్మముదప్పక రాజ్యమును పరిపాలించు చున్నాడు. ఈవిధముగ సర్వవృత్తాంతమును జెప్పి మంత్రియు బద్ధాంజలియై శిరమునువాంచి భూమిపై పద్మాసనస్థుడై కూర్చుండెను. ప్రభువుకూడ నట్టివాడేనైయుండెను. అంత ఓ "మహారాజా! నీవు పూర్వజన్మమును స్మరింపుము" అని చెప్పుచు సరస్వతీదేవి తన హస్తముచేత నమ్మహారాజుయొక్క శిరమును స్పృశించెను. తత్క్షణమే మాయారూపమగు హృదయాంధకారమంతయు ధ్వంసముగాగా నాప్రభువునకు పూర్వజన్మ వృత్తాంతమంతయును ఎదుట బెట్టినట్లయ్యెను. అంత నమ్మహారాజు తాను పూర్వము రాజైయుండుటయు లీలాదేవియను స్త్రీ తనకు భార్యయై యుండుటయు నను మొదలగు విషయముల నన్నిటిని ప్రత్యక్షముగ నున్నవానివలె మనస్సునందు చూచెను. ఇట్లు కను

గొని యావిదూరథుడు వారల కిట్లనియె. ఆహా స్వచ్ఛుడగు జీవునియందు సంసారరూపమగు నీమాయ విస్తరింపబడియున్నది. ఈవిషయము మీయను గ్రహముచేత కనుగొంటిని.

ఓ దేవతలారా! ఇదియేమి యాశ్చర్యము. నేను పూర్వ శరీరమును విడిచి ఒక్కదినముమాత్రమే యైనది. ఇచ్చట నాకు డెబ్బది సంవత్సరములు గడచినవి. అనేకమిత్రులు బంధువులు పరివారము మొదలగువారితో గలసి అనేకకర్మముల నాచరించితిని. ఇదియెట్లు సంభవించెను. అనిన సరస్వతీదేవి ఇట్లనియె. ఓ మహారాజా! మరణమనునది అజ్ఞానమువలన గలుగు మూర్ఛయే. దానిప్రభావమువలన తెలివిదప్పును "నేను రాజును, లీలాదేవి నాకు భార్య" అనుమొదలగు సంకల్పములు నశించును. ఇట్లు అవి యన్నియు నశించినపిమ్మట భ్రాంతిరూపమగు రెండవసృష్టి కలుగును. "నేను విదూరథుడను ఇదినారాజ్యము" అనుమొదలగుభ్రాంతి యుద్భవించును. ఈరెండవసృష్టి కలుగుటకై పూర్వశరీరమును విడిచినపిమ్మట నీవెచ్చోటికిని బోవ నక్కర లేదు. పూర్వము నీవు నివసించుచున్న గృహముననే నీకన్నియు గలుగును. సర్వమును సంకల్పమాత్రమే. కావున నిర్మలమగు నాకాశమువలె నతిపరిశుద్ధమైయున్న నీమనస్సునందు ఆసమయముననే "నేను బంధుమిత్రులతో వ్యవహరించుచున్నాను." అనుభ్రాంతితోగూడిన ఈప్రతిభాస అనగా నేను ప్రభువును రాజ్యము చేయుచున్నాను నాకు ఇప్పుడు డెబ్బది సంవత్సరములైనవి" అనుప్రతిభాస కలిగెను. స్వప్నమునందు అత్యల్పకాలములోనే నూరుసంవత్సరములు గడచినట్లు భ్రాంతి కలుగుచుండుట అనుభవసిద్ధమయ్యే యున్నదిగదా. అట్లే ఇదియు మాయాప్రభావమువలన జాగ్రదవస్థయందు కలుగుభ్రాంతియేకాని వేఱుకాదు. వాస్తవస్థితిలో నీవు జన్మించువాడవుకావు. ఎప్పటికిని మృతిజెందువాడవును కావు. నీస్వరూపము నిర్మలమగు విజ్ఞానమే. నీవు సర్వకాలములయందును సంక్షోభ మేమియులేక స్వస్వరూపముననే నిలిచియుందువు. ఈసంసారము నంతయు జూచుచున్నట్లుందువేకాని వాస్తవస్థితిలో ఏపదార్థమును జూడవు. సర్వమును నీవేయగుటచేత నీ కంటె నన్యమై దృశ్యమగు ఏపదార్థము నుండుటలేదు. నీవు సర్వకాలములయందును స్వయముగ స్వస్వరూపముతోనే ప్రకాశింతువు. ఏ మూఢుడు అపరిశుద్ధచిత్తముగలవాడై సర్వాత్మకమగు బ్రహ్మపదమునందు దృఢనిశ్చయము నొందకున్నాడో అట్టివానికి ప్రపంచము వజ్రమువలె దుర్భేద్యమగును. బొత్తిగ లేనిదయ్యును వాస్తవమగును. "నాయనా,

బూచివచ్చును" అనిచెప్పిరి మేని వాస్తవస్థితిలో అది అసత్యమే యైనను అజ్ఞా
నులగు పిల్లవాండ్రకు మృతినొందునంతటి మహాదుఃఖమును గలిగించునుకదా.
ఇట్లే మూఢుడగువానికి ఈప్రపంచముగూడ బొత్తిగనే లేనిదైనను ఉన్న
దానివలెగానవచ్చుచు బహువిధదుఃఖములు గలిగించుచుండును. మృగముల
కు నీరులేని ప్రదేశములయందున్న సూర్యకిరణములే ఏవిధముగ జలములగునో
అట్లే ఈప్రపంచముగూడ బొత్తిగ లేనిదేయైనను మూఢునకు సత్యమగును.
మఱియు సువర్ణముచేత జేయబడిన కడియము వాస్తవస్థితిలో సువర్ణమేయై
నను అజ్ఞానియగువానికి "ఇదికడియము" అనుతలంపే యుండునుగాని "ఇది
సువర్ణము" అనుతలంపు కొంచెమైననుండదు. ఇట్లే మూఢుడగువానికిగూడ
"ఇది పట్టణము. ఇదియిల్లు. ఇదికొండ. ఇదిఏనుగు. వీడుప్రభువు" అనుమొద
లయిన దృశ్యబుద్ధియే (చూడబడువానినిగూర్చిన బుద్ధియే) యుండునుగాని
"ఇదియంతయును పరబ్రహ్మమే" అను పరమాత్మ బుద్ధి ఇంచుకయైన నుండ
దు. కావున నీప్రపంచము పెద్దకల. ఇచ్చట జాగ్రదవస్థయందు గానవచ్చు
పురుషులందరును స్వప్నావస్థయందు గానవచ్చువారివంటివారే. ఇకవా
స్తవమేమనిన, అతిపరిశుద్ధమును సర్వవ్యాపకమును సంక్షోభములేనిదియు
నగు పరమాకాశము ఒక్కటియే కలదు. అదియే యథార్థమైనది. దాని
స్వరూపముమాత్రము జ్ఞానమేకాని దానికి జ్ఞేయమగు పదార్థమేమియు
లేదు. సమస్తపదార్థములు నదియే. అది సర్వవ్యాపకమైనది. సమస్తసామ
ర్థ్యములును గలది. సర్వపదార్థములును స్వస్వరూపముగాగలది. సర్వమ
యమైనది. తనంతటతానే సంకల్ప ప్రభావములచేత బహురూపములతో
నుదయించును. ఎచ్చటెచ్చట ఏఏరూపములతో ఉదయించునో అచ్చటచ్చ
ట నాయారూపములతోనే యుండును.

ఓ మహారాజా! నీయథార్థస్వరూపము ఇట్టిది. విలాసార్థమై నీస్వ
రూపమును అభివర్ణించితిని. నీకు శుభమగునుగాక. ఇక మేము పోయివచ్చె
దము. ఇట్లుపలికి లీలాసరస్వతులు ప్రయాణోన్ముఖులు కాగానే విదూరథు
డు ఇట్లనియె. ఓ దేవీ! యాచకుల విషయములో సామాన్యుడనగు నాదర్శన
ముకూడ నిరర్థకముకాదు. ఇట్లుండ ఎట్టిఫలమునైన నిచ్చుటకు సామర్థ్యము
గల మీబోటివారల దర్శనము నిరర్థకము గావచ్చునా! ఓ వరములనివ్వగల
దానా? నాయభీష్టమును దెలిపెదను వినుము. నేను ఈదేహమును వదలి
పద్ముడనుపేరుగల లేక కుంపద్ముడను పేరుగల యాపూర్వదేహమును ఎ
ప్పుడు పొందగలను. ఈవిషయమును నాకు వివరింపుము. అనిన సరస్వతీదేవి

ఇట్లనియె. ఓ మహారాజా! వినుము. ప్రస్తుతము జరుగుచున్న యుద్ధము నందు నీవు మృతినొందెదవు. పిమ్మట నీపూర్వశరీరమును మఱలజెందెదవు. ఇది యంతయు నీకు ప్రత్యక్షముగనే జరుగగలదు. అనిసరస్వతీదేవి చెప్పెనని వశిష్ఠుడుచెప్పి శ్రీరామునిజూచి మఱల వశిష్ఠు డిట్లనియె. ఓ శ్రీరామచంద్రా! ఇవ్విధముగ సరస్వతియు విదూరథుడును మనోహరముగ సంభాషించుచుండగ నొక్కభటుడు నేలపై కాలునిలుపనియట్లు అతిత్వరతో వచ్చి ఇట్లని విన్నవించెను.

ఓ ప్రభువా! శూలములు చక్రములు గదలు ఖడ్గములు పట్టిసములు మొదలగు నాయుధములను విరివిగ వర్షించుచు ప్రళయకాల సముద్రమో యనగ నత్యధికసంఖ్యగల శత్రుసైన్యము ఇచ్చటకు వచ్చెను. మనరాజధాని యంతయు దహింపబడుచున్నది. ఎండినచెట్టుకు తగిలిన అగ్ని వలె నీ యగ్నియు చటచ్ఛట యను ఘోరశబ్దములతో నుత్తమములగు గృహములను పడద్రోయుచున్నవి. ప్రళయ సమయమునందలి మేఘములవలె దట్టములై పర్వతోప మానములైయున్న పొగలగుంపులు గరుత్మంతుడువలె అతివేగముగ నాకాశమంతయు గప్పుచున్నవి. ఈవిధముగ మిక్కిలిత్వరతో నాభటుడు సర్వవృత్తాంతమును దెలుపుచుండగనే యాగృహమునకు వెలుపలి భాగమున మనుష్యులరోదనధ్వని అతికోలాహలముగ వినవచ్చెను. మఱియు ఆకర్ణాంతముగ నాకర్షింపబడి వర్షధారలవలె బాణములు వర్షించుచున్న ధనువులయొక్కయు, ఘీంకారము చేయుచున్న గజములయొక్కయు, మహాబలవంతులగు వీరులయొక్కయు, ధ్వనులును, పట్టణమునందు ప్రతిగృహమునందు ప్రజ్వరిల్లుచున్న అగ్నిహోత్రములయొక్క చటచ్ఛటా ధ్వనులును భార్యాపుత్రులు కాలిపోవుటచేత శోకించు పౌరులయొక్క యాక్రందనధ్వనులును గలసిన మహాకోలాహలము వినవచ్చెను. అయ్యర్ధరాత్రమునందు ఆసరస్వతీ లీలాదేవులును మంత్రియు విదూరథుడును గవాక్షములగుండ యట్టి మహాసంక్షోభముతో గూడిన ఆరాజధానిని జూచిరి. అప్పుడు ప్రళయకాలమునందలి మేఘములు వర్షించుటచే నుప్పొంగి ప్రళయకాల మారుతముచే నేకముఖముగ జేయబడి అతివేగముతో వచ్చుచున్న సప్తసముద్రములవలె సర్వమును ఆక్రమించియున్న శత్రుసైన్యముతో నప్పురము పరిపూర్ణమై యుండెను. ప్రళయకాలవహ్నిచే దహింపబడి పటపట విఱిసి నేలగూలు మేరు మందరాది పర్వతములవలె నప్పురమునందలి మహాగృహములు ఆకాశమునంటు మహాజ్వాలలుగల అగ్నులచే దహింపబడి నేలగూలుచుండెను.

పిడికిటితో బట్టుటకు వీలగునట్లుగా మిగులదట్టములై వ్యాపించియున్న మే
ఘములయొక్క యురుములవలె అతిగంభీరములును కఠినములునగు వీరుల
బెదరింపుమాటలచేత మిక్కిలి నష్ఠురము ఘోరమైయుండెను. మఱియు
కొరవులు అతివేగముతో నాకాశముపైకి ఎగయుచు క్రొత్తనక్షత్రములు
ఉదయించెనో యను భ్రాంతిని గలిగించుచుండెను. స్త్రీపురుషులు ఎచ్చ
టికి పోవుటకును మార్గములేక నయ్యగ్నియందే రోదనధ్వనులు సేయుచు
గూలుచుండిరి. ఇట్టిసమయమున బరిపూర్ణయౌవ్వనయగు నారాజపత్నియు
మిక్కిలి భయముగలదియై చెలులు తనతోడ వచ్చుచుండ నచ్చోటు (రాజు
మొదలగువారు ఉన్నచోటు) జేరెను. అంత నాచెలికత్తెలలో నొక్కతె ఇట్ల
నియె.

ఓ ప్రభువా! భయమువలన నీదేవి యంతఃపురమునుండి ఇచ్చటికి
పరుగిడివచ్చినది. మిగిలిన నీభార్యలందరును శత్రువులచే జెరపెట్టబడిరి. అం
తఃపుర పాలకులందరును శత్రువులచేత సంహరింపబడిరి. శత్రువులు ఆ
యుధములతో వచ్చిరి. నిద్రాసమయ మగుటచేత మనవారియొద్ద ఆయుధ
ములు లేవు. ఇంతయేల? వారు మనపురమును తీసికొనిరి. రాత్రియగుటచేత
వారు బెదరులేక మనపురమునందు ప్రవేశింపగలిగిరి. అనినవిని యావిదూ
రథుడు లీలాసరస్వతులతో నిట్లనియె. ఓ దేవతలారా! నాకిది యుద్ధసమ
యము. నేను అచ్చటనుండి మఱలివచ్చునంతవరకు నీస్త్రీని రక్షించుచుండు
డు. ఇదీ నాభార్య. మీపాదపద్మములను గొలుచుచుండును. అని ఇట్లుపలికి
మహాకోపముతో నెఱ్ఱనగు నేత్రములుగలవాడై "తాను నివసించు వనము
ను మదించిన యేనుగు ధ్వంసము చేసిననెడల దానిపై నలిగి గుహలోనుండి
దుముకు సింహమువలె" ధనుర్ధరుడై వెడలెను. తరువాత ఇచ్చట అద్దము
నందు ప్రతిబింబించిన ప్రతిబింబమో యనునట్లు సర్వవిధముల దనతో
సమానురాలై రెండవ లీలాదేవి యనదగిన యారాజపత్నిని లీలాదేవిజూ
చెను. ఆరాజపత్నికి లీలయనియే పేరు. ఇట్లుచూచి జ్ఞానవతియగు లీలా
దేవి సరస్వతీదేవితో నిట్లని ప్రశ్నించెను. ఓ సరస్వతీదేవీ! ఇదేమిచిత్రము?
ఈరాజపత్నికిని నాకును భేదమించుకయైనను లేదు. పూర్వమున నేనెట్లుం
టినో ఇదియు నట్లేయున్నది. ఇది ఎట్లు సంభవించినది. అనిన సరస్వతీదేవి.
ఇట్లని సమాధానము జెప్పెను. ఓ లీలాదేవీ! మృతుడైన నీభర్త నీయందే
దృఢానురాగము గలిగియుండెను. ఆసంకల్పముచేత ఈజన్మమునందును నీ
రూపమువంటి రూపమునే జూచుచున్నాడు. భార్యగా నభిమానించుచు

న్నాడు. ఇది యొకటియే కాదు. ఒకజన్మమునందే ఏరూపముగల ఏపదార్థములు బింబములై (మనము అద్దము జూచిన నందుగానవచ్చు బింబము ప్రతిబింబము మనముఖము బింబము) తోచునో అవి యట్లే మనస్సను నద్దమున బ్రతిబింబించును. సంకల్పబలముచే నుత్తర జన్మమునందుగూడ దోచును. ముగింపును వినుము. జాగ్రదవస్థ స్వప్నావస్థయందు అసత్యము అప్పుడు జాగ్రదయనునది కలదనికాని లేక జాగ్రదవస్థయందు నేనిట్టివాడనై యుంటిని అనికాని తోపదుకదా. ఆస్వప్నావస్థయు జాగ్రదవస్థయందు అసత్యము. ఇట్లే మరణమూర్ఛయందు అనగా దానికవతల గలుగు రెండవ జన్మయందు పూర్వజన్మ యసత్యము. పూర్వజన్మయందు మరణమూర్ఛ అనగా దాని కవతల గలుగు ద్వితీయజన్మ యసత్యము. కావున నీప్రపంచము ఉన్నదియుకాదు లేనిదియుకాదు. కేవలము భ్రమ యొకటియే ఇట్లు విజృంభించుచున్నది. మనకు గలుగు ననుభవము లన్నునో, కొన్ని పూర్వజన్మములయందలి యనుభవముల ననుసరించియే వచ్చును. మఱికొన్ని సంకల్పభేదములవలన క్రొత్తవిగూడ జనించుట కలదు. ఈవిధముగ పెక్కువిధములై అనుభవములు గలుగుచుండును. కావున నీమె నీప్రతిబింబము. స్వభావమునందును ఆచారములయందును గుణములయందును దేహమునందును పేరునందునుగూడ నీతో సమానురాలు. కాబట్టి ఇదియును ఆభాసమాత్రమే. ఇకను నీభర్తయగు విదూరథుడన్ననో, అత్యల్పకాలములోనే ఈదేహమునువదలి ఆయంతఃపురముప బుష్పములతో గప్పబడియున్న పూర్వదేహమును బొందును.

ఓ స్త్రీరత్నమా! లీలాదేవీ! పూర్వపు కులపద్మనే యగును. ఇట్లు చెప్పుచున్న ఆసరస్వతీదేవి మాటలను విని విదూరథునిభార్యయగు యా రెండవలీల సరస్వతీదేవికి నమస్కరించి చేతులుజోడించుకొని ఎదుటనిలచి ఇట్లనియె. ఓ దేవీ! నేను సర్వకాలముల యందును సరస్వతీదేవి ఆరాధింతును ఆదేవి నాకు ప్రత్యక్షమయ్యెను. ఓ జగజ్జననీ! ఆమహాదేవి ఎట్టి యాకారముగలదియో స్వరము మొదలగు విషయములయం దెట్టిదో నీవును అట్టిదానవుగానే యున్నావు. కావుననో దేవీ! దీనురాలనగు నాకు వాత్సల్యమువలన ఒక వరము నియ్యవలయును. నాభర్త యుద్ధమునందు శరీరమును విడచి ఎచ్చటికి జేరునో నేనును అచ్చటికేజేరి ఈశరీరముతోనే యాతనికి భార్యగా నుండవలయును. అని ప్రార్థించెను. అప్పుడు ఆసరస్వతీదేవి "అట్లే యగును గాక" అని అనుగ్రహించెను. అప్పుడు మొదటిలీల ఇట్లనియె. ఓ దేవీ!

మఱియొకవిషయము నిన్నడుగవలసి యున్నది. ఈలీలకు ఈదేహముతోనే తనభర్తయొక్క పూర్వజన్మ రూపముతో సంబంధము కలుగునని యనుగ్రహించితిరికదా. నన్ను మాత్రము గిరిగ్రామమునకుగాని ఇచ్చటికిగాని పూర్వశరీరముతో ఏల కొనిరాలేదు? సమాధిని అవలంబించి పూర్వశరీరమును విడువుమని ఏల చెప్పితిరి? ఈవిషయమును దయతో తెలియజేయవలయును. అనిన సరస్వతీదేవి ఇట్లనియె. ఓ లీలాదేవీ! వినుము. నేను ఎవరికిని ఏమియును చేయను. నిన్ను కేవల సూక్ష్మశరీరముతో గొనిపోవుటయు నీవిదూరథుని భార్యయగు రెండవ లీలను ఈశరీరముతోనే భర్తయొక్క పూర్వజన్మ రూపముతో సంబంధమును గలిగించుటయు నేనుచేసిన పనికాదు. వారివారి సంకల్పమే వారివారికి సర్వఫలములను సంపాదించును. నీవు నన్నారాధించునప్పుడు "నేను ముక్తి నొందవలయును" అని సంకల్పించి యుంటివి. ఈ కారణమువలన నీకు తదనుగుణముగ జ్ఞానోపదేశము జేసితిని. ఈ రెండవలీల యన్ననో మొట్టమొదట నుండియు "నాభర్త ఎన్ని జన్మము లెత్తినను నేను ఈశరీరముతోనే వానికి భార్య యగుచుండ వలయును" అనిసంకల్పించెను. ఇప్పుడు నన్ను ఆవరమునే యడిగెను. నేనును దాని నొసంగితిని. కావున నోలీలా! మనుష్యుల దృఢసంకల్పమే ఈవిధముగా సర్వాభీష్టములను ఇచ్చుచుండును. ఇదియే దేవతానుగ్రహమునకు స్వరూపము. అని సరస్వతీదేవి చెప్పెనని చెప్పి మఱియు వశిష్ఠుడిట్లనియె. ఓ దాశరథీ! శ్రీరామా! అచ్చట నావిదూరథుడు అట్లు గృహమునుండి వెలువడి తనసైన్యముచేత పరివృతుడై సర్వాలంకారముల ధరించెను. ఇంతలో కోటబురుజువలె అత్యున్నతమైన ముత్యములు మాణిక్యములు మొదలగు రత్నములచేత అలంకరింపబడిన రథము ఆయత్తమయ్యెను. దానినిజూచి వీరుల కందరకును ఉత్సాహమును గలిగించుచు రాజురథారూఢుడాయెను. ఇట్లు ప్రభువు రథారోహణముచేయగానే మత్తగజములను మేఘములయొక్క మహాధ్వనులు తన సహజధ్వనికి నాధిక్యము గలిగించుచుండ పర్వత గుహలయందు ప్రతిధ్వని కలుగుచుండగ అతిభయంకరమగు దుందుభిధ్వని సేనాప్రయాణమును సూచించుచు మ్రోగెను. అంతగుఱ్ఱములకును రథములకును గట్టిన చిఱుగంటల ధ్వనులును, బాణములు, లేక గదా ఖడ్గాద్యాయుధములు ఒకదానికొకటి తగులుటచేత గలుగు ధ్వనులును ధనుస్సులయొక్క టంకారధ్వనులును అతివేగముగ బోవుచున్న బాణములయొక్క సీత్కారశబ్దములును భటులు పరస్పరము బలుకుకొనుచున్నట్టి గంభీర భాషణములును చెర

పెట్టబడిన స్త్రీలు మహాసంక్షోభముతో చేయు రోదనములును గలిసి బ్రహ్మాండము నంతయు రాతివలె దట్టముగ నావరించెను. అమ్మహాధ్వనిని చేతులతో బట్టుకొనవచ్చునేమోననిదలంప వీలగుచుండెను. పదిదిక్కులయందును ధ్వనికంటె అన్యమగు పదార్థమొక్కటియైన లేదేమో యని భావింప ననువగుచుండెను. ఎట్టిధైర్యశాలులకైనను మిక్కిలి భయముగలిగించుచుండెను. ఇట్టి మహావ్యాకులమగు యుద్ధమున రేగిన పెంధూళి భూమ్యాకాశములను గప్పెను. స్వాభావికమగు మూఢత్వము యౌవన సంయోగముచేత ఇనుమడించునట్లు అప్పటిచీకటి యాధూళిచే మిక్కిలి దట్టమయ్యెను. పిమ్మట క్షీరసముద్రమునందు మందరపర్వతము ప్రవేశించునట్లు" శత్రుసైన్యమునెల్ల చీకాకు పరచుచూ విదూరథుడు విజృంభించెను. అత్యుత్సాహముతో ఆశత్రుసైన్యమధ్యమునందు జేరెను. అంత బాణములు అతివేగమున నొండొంటిని దాకుటచేత రేగిన అగ్నులు కొరవులువలె ప్రజ్వలింపసాగెను. వీరభటులను మేఘములు శరధారల వర్షించుచు నతిగంభీరముగ గర్జిల్ల నారంభించినవి. ఖడ్గములు మొదలగు బహువిధములగు నాయుధములు అతిక్రూరమగు కంకపక్షులవలె ( ఇవి పీనుగులను దినునట్టి పక్షులు, వీనికి బోరువలు అనిపేరు ) వీరభటుల అవయవములయందు బ్రవేశించినవి. అతి సమ్మర్దముచేత ఆయాయుధముల తునుకలును పటపటయను శబ్దములతో నాకాశమునకు ఎగయుచుండినవి. తలలు లేని మొండెములు వరుసనై యమలోకయాత్రకు బ్రయాణమైనట్లు కదులుటకు నారంభించెను (ఆకస్మికముగ తల తెగగొట్ట బడెనేని తక్కిన శరీరము కొంతసేపు కదలుచుండును. దీనిని ఈవిధముగ కవివర్ణించెను.) రక్తవర్షముచేత రేగిన దుమ్మంతయు నడంగెను. ఆయుధముల యొక్కయొరిపిడిచేత బుట్టిన అగ్ని చీకటిని పోగొట్టెను. భటులకందరకు యుద్ధమునందే ధ్యానము గలిగియుండుటచేత శబ్దములన్నియు నణగెను. "ఇక మరణముతప్పదు." అని నిశ్చయించుకొని యుండుటచేత భీతితొలగెను. "నాకు మరణము కలుగునేమో దానిని ఎట్లుసహింతును" అనువానికి భయము ఉండునుగాని "ఎట్లైనను మరణము నొందవలసినదియే. మనశక్తి కొలది పోరాడుదము." అనువానికి భయముఉండదు కదా. కావున నిశ్శబ్దముగ పొరబాటులేకుండ యుద్ధము జరిగెను.

అందు సమసమమను ధ్వనితో బాణములు వెడలుచుండెను. కిటకిటయను శబ్దము చేయుచు భుసుండము లను ఆయుధములు అతివేగముగ బడుచుండెను. గదమొదలైన అస్త్రములు కిణకిణయను శబ్దములతో నొం

డొంటిని తాకుచుండెను. ఇట్లు అతిఘోరమై సముద్రమువలె నాయుద్ధము గడువరాకుండెను. ఇచట ఈవిధముగ యుద్ధము జరుగుచుండగా నచ్చట లీల లిరువురును సరస్వతీదేవితో నిట్లనిరి. ఓ సరస్వతీదేవీ! నీవు మాభర్త యెడల అనుగ్రహించితివి కదా? ఏనుగులు సహితము భయముచేత పరువు లిడుచున్న ఈమహాయుద్ధమునందు మాభర్త ఏలజీవింపడు? దీనిని తెలియ జేయుము. అనిన సరస్వతీదేవి ఇట్లనియె. ఓ బిడ్డలారా! వినుడు. ప్రకృతము ఈవిదూరథునికి శత్రువుగానున్న సామంతునిచేత నేను బహుకాలముగా జయము కలిగించుటకై ఆరాధింప బడితిని. విదూరథునిచేత అట్లు పూజింప బడలేదు. ఓ బాలికలారా! ఈకారణమువలన నాసామంతుడే జయించు ను. విదూరథుడు పరాజితుడగును. ఈవిదూరథుడు నన్ను ఆరాధించు సమ యములయందు "నేను ముక్తినొందవలయును" అనిమాత్రమే సంకల్పించి యున్నాడు. కావున ఇతనికి మోక్షము దొరుకును. ఆసామంతుడుజయించి రాజ్యముచేయును. అని యుద్ధవృత్తాంతమును శ్రీరామునకు వశిష్ఠుడు తెలిపి మరల శ్రీరామునితో వశిష్ఠుడిట్లనియె. ఓరామచంద్రా ఈప్రకారముగ అచ్చ ట నట్లతిఘోరయుద్ధముజరుగుచుండగనే ఆయాశ్చర్యమునుజూచుటకో యన రెండుసైన్యములకును వికాసము గలుగ సూర్యుడు ఉదయపర్వతము పైకి వచ్చెను. కాటుకసముద్రమునుండి వెలికివచ్చినట్లు లోకమంతయు బ్రకాశిం చెను. బంగారు శలాకలవలె అతిరమణీయములై సూర్యకిరణములు భూమి పై నతిసుందరముగ బ్రసరింప నారంభించెను. ఇట్లు సూర్యోదయ మగునప్ప టికి ఉభయసైన్యములును చాలవరకు నశించెను. యుద్ధరంగమంతయు శూ న్యప్రాయమై యుండెను. ప్రభువులిరువురు హతావశిష్టమగు అల్పపరివార ముతో నావరింపబడియుండిరి.

—* విదూరథుడు సింధురాజుచే హతుడవుట. *—

అంత నావిదూరథుడు గర్వితుడగు సింధురాజైన శత్రువును ఎదు ర్కొని దశదిశలు మారుమ్రోగునట్లు ధనుష్టంకారమును జేసెను. ప్రళయ కాలమునందు వీచు మహావాయువు మేరుపర్వతపు అంచులను విరచి అతి వేగముగ విసరునట్లును, ప్రళయకాల సూర్యుడు తనకిరణముల బ్రసరింప జేయునట్లును మిక్కిలి వాడియై తాకుటకు సహితము అశక్యములై యుండు తీవ్రబాణములను ఆవిదూరథుడు శత్రువుపై ఎడములేకుండ ప్రయోగించెను. ఆసింధురాజుగూడ నట్లేచేసెను. ఈవిధముగ బరాక్రమశాలియగు నాసింధు రాజు బహుకాలము క్రీడామాత్రముగ యుద్ధమును జేసినపిమ్మట శరవర్ష

ములచేత నవ్విదూరథుని అధికముగ బాధించెను. ఒక్క నిమిషములో కేతనమును క్రిందబడవైచి రథమును తుత్తునియలుగ జేసి అశ్వముల బరిమార్చి సారథిసిరూపుమాపి ధనస్సును నరికెను. పిమ్మట విరథుడైయున్న యవ్విదూరథుని బాణవర్షములచేత జీకాకుపరచి పిడుగువంటి శరములచేత హృదయనందును శిరమునందును నొప్పించి నేలబడవైచెను. అంత "శత్రురాజుచేత యుద్ధమునందు మనరాజు సంహరింపబడెను. శత్రురాజుచేత యుద్ధమున మనరాజు సంహరింపబడెను." అనుధ్వని మిక్కుటముగ పుట్టెను. రాజ్యమంతయు కలత నొందెను. పాత్రలు మొదలగు సకలపదార్థములను మోసికొని యొకవంకనుండి బండ్లు సాగనారంభించెను. భయముచేత ఏమియుదోపకుండు భార్యాపుత్రాదులను రక్షించి సురక్షితమగు ప్రదేశమున జేర్చుటకై పురజనులు పరువులిడుచుండిరి. ఇట్టిసమయమున కొనఊపిరితో మాత్రమున్న తనభర్తనుజూచి రెండవలీల సరస్వతీదేవితో నిట్లనెను. ఓ మహేశ్వరి! లోకజననీ! నాభర్త శరీరమును విడువబోవుచున్నాడు. కావున నేను ఇతనిననుసరించి పోయెదను. అనుగ్రహింపుము. అనుజ్ఞనొసంగుము. ఇట్లుపలికి ఆజ్ఞనుగైకొని యద్దేవిని ధ్యానించుటవలన రెండవలీల సామర్థ్యముగలదియై తత్క్షణమే సూక్ష్మరూపముతో పక్షివలె నాకాశమున కెగసెను. పిమ్మట క్రమముగ మేఘములయొక్కయు వాయువులయొక్కయు సూర్యునియొక్కయు నక్షత్రములయొక్కయు మార్గములను అతిక్రమించెను.

## రెండవలీల తనసామర్థ్యముచేత భర్తకంటె ముందుగ స్వగృహమును జేరుట.

పిమ్మట సత్యలోకమును గడచి దానిపైనుండు బ్రహ్మాండకర్పరముల భేదించి యాబ్రహ్మాండమునకు ఆవరణములుగనున్న జలాగ్నివాయువాకాశములను అతిక్రమించెను. ఇట్లు సర్వమును అతిక్రమించి సర్వాధారమగు చిదాకాశమును ఆశ్రయించెను. నూరుకోట్ల కల్పములకాలమైనను అతివేగముగ గరుత్మంతుడు పరువులిడుచునేయున్నను ఆయాకాశమునకు అంతములేదు. ఆచిదాకాశమునందు లెక్కకుమిక్కిలియగు బ్రహ్మాండములు కలవు. మహారణ్యమున నుండుఫలములు ఒకదాని నొకటి జూడలేనట్లు ఆబ్రహ్మాండములును ఒకదానినొకటి జూడలేవు. ఇట్టి బ్రహ్మాండములలో తనకెదుటనున్న యొకదానిని ఆవరణసహితముగ భేదించి యాలీల లోపల ప్రవేశించి, పూర్వము కుశపద్ముడు రాజ్యముచేయుచుండిన పట్టణమునకు బోయెను. ఇట్లు పురప్రవేశముచేసి మహాసామర్థ్యముగల యాలీల యంతఃపుర

మును ప్రవేశించి అచ్చట పూర్వము పుష్పములతో గప్పబడియుండి యు న్న కులపద్మ శవము వర్థిల చెను. ఇట్లు భర్తను జూచి అంతకంతకు సంతోషా తిశయముచే నుప్పొంగుచున్న చిత్తముతో నిట్లని తలపోసెను. అహా, ఈతడు ఇంకను నాకు మరల భర్తకాగలడు. ఈ దేహమునందు జీవుడు ప్రవేశించుటకు ముందుగనే సరస్వతీదేవియొక్క అనుగ్రహమువలన నేను ఇచ్చటికి వచ్చిచేరి తిని. పరాక్రమవంతులలో శ్రేష్ఠుడగు నీమహారాజు నాకు మరల భర్తయగు ననుటలో నిక సంశయము లేదు. అనుచు మనోహరమగు యౌవనముగల యా లీల యొక చామరమును తీసికొని యారాజశవమునకు వీవ నారంభించెను.

—* విదూరథునిజీవుడు కులపద్మునిపట్టణమునకు వచ్చుట. *—

ఇట్లుండగ నచ్చట విదూరథుని జీవుడు దేహములోనుండి వెలువెడలి యాకాశమున నిలచెను. దానిని అచ్చటనున్న సరస్వతీదేవియు మొదటిలీల యు దివ్యదృష్టితో జూచిరి. పిమ్మట వారుముగ్గురును ఆకాశమునకు ఎగసిరి. అందు ఆవిదూరథుని జీవుడు మాత్రము యోగప్రభావముగల నాలీలా సరస్వతులను జూడలేదు. ఈవిధముగ వారిరువురును ఆజీవుని ననుసరించు చు నొక బ్రహ్మాండమును గడచి మఱియొక బ్రహ్మాండము ప్రవేశించి కుల పద్ముడు రాజ్యముచేయుచున్న పట్టణముచేరిరి. స్వేచ్ఛగా లీలాదేవియొక్క అంతఃపురమును ప్రవేశించిరి. ఆజీవుడుమాత్రము వారికంటె ముందుగ నం తఃపురములోనికి బోయెను. ఇట్లంతఃపురప్రవేశమును జేసి అచ్చట శవమునకు ప్రక్కగనిలువబడియున్న రెండవలీలనుజూచిరి. ఆరెండవలీలాదేవి విదూరథు నికంటె ముందుగ బయలుదేఱి ఇచ్చట జేరియుండెను కదా. జీవునకు మా త్రము ఏమియు దెలియదు. అట్టిసమయమున నాజీవుడు కులపద్ముని శరీరము నందు ప్రవేశించుటకు త్వరపడుచుండగా నాసరస్వతీదేవియొక్క సంకల్ప బలముచేత మనస్సునువలె వానిని అడ్డగించెను. అపుడు మొదటిలీలాదేవి సర స్వతీదేవితో నిట్లనియె. ఓ దేవీ! సరస్వతీ నామొదటిదేహము ఇచ్చటలేదేమి? అనిన ఆవృత్తాంతమును వినుమని సరస్వతీదేవి ఇట్లనియె. ఓ లీలా! అట్లునీవు సమాధియందు లయమునొంది శరీరమును విడువగానే అది ఎండిపోయిన చిగురాకువలె జీవరహితమై నేలపై బడియెను. మంచువలె చల్లనై కాష్ఠము గోడ అనువానితో సమానమగు శవమయ్యెను. పిమ్మట మంత్రులు ఆశరీర మును జూచి "ఈమె మరణమునొందెను" అను నిశ్చయముతో దానిని చితి యందు ఉనిచి నేతితోను చందనపుకట్టెలతోను దగ్ధము చేసిరి. కావున నిప్పు డు నీవు సంకల్పమయమగు శరీరముతో అందఱకును గానవచ్చితివేని అప్పుడు

"ఈలీల పరలోకమునుండి మఱల వచ్చినది" అను నభిప్రాయముతో మిక్కిలి ఆశ్చర్యముకలుగును. అయితే ఇప్పుడు నీవుస్థూలశరీరముతో గానరావు. యోగము అధికమగుటచే దానిబలమువలన మనోమయ శరీరముతో నుండియే సర్వజనులకును గానవత్తువు. ఏలయనిన, నీకు ఇప్పుడు వాసనలు క్షీణించినవి. ఈకారణమువలన స్థూలశరీరము ఇకరాదు. దానిని నీవు మరచితివి. సూక్ష్మదృష్టి అనగా ప్రపంచమంతయుమనోమయమే యనుదృష్టి దృఢమయ్యేనేని "ప్రపంచము పంచభూతమయము అను దృష్టి నశించి పోవును." కావున నికరమ్మ. మనము సంకల్పశక్తిచేత లీలకు (అనగా, రెండవలీలకు) మనస్వరూపమును జూపెదము. సర్వవ్యవహారములును పూర్వమువలెనే జరుగుచుండునుగాక. అని యాసరస్వతీదేవి "ఈలీలమమ్ములను జూచునుగాక" అని సంకల్పము జేసెను. తత్క్షణమే యాలీలయు గృహమునంతయును గలయజూచి తనయెదుటనున్న సరస్వతీదేవిని, మొదటిలీలనుగూడ, చూచి అతిత్వరతో ఆసనముపైనుండి లేచి వారలకు నమస్కరించెను. అంత వారందరును ఉచితాసనములపై గూర్చుండిరి. అంత సరస్వతీదేవిఇట్లనియె. సుందరాంగులగు ఓహంసగామినులారా! లీలలారా! ఈరాజును శవత్వమునుండి ఇకను లేవతీయుదము. అనిచెప్పి యాసరస్వతీదేవి తాను అంతకుముందు నిరోధించియున్న రాజుయొక్క జీవుని విడిచిపెట్టెను. అంత తామరపుష్పము వికసించి తనలోనడగియున్న సుగంధమును వెలిపరచగానే అది వాయువశగతమై స్వేచ్ఛగా బ్రసరించునట్లు ఆజీవుడును తత్క్షణమే స్వేచ్ఛగ కులపద్మునిశరీరమునొద్దకు పోయెను. వాయువువలె నతిసూక్ష్మరూపము గలవాడగుటచేత తత్క్షణమే ముక్కురంధ్రముల గుండలోనికి ప్రవేశించెను. గాలి వెదురుబొంగుల రంధ్రములలోనికి బోయిన విధమున నట్లాజీవుడు శరీరమునందు ప్రవేశింపగానే యాముఖమునకు కాంతిగలిగెను. క్రమక్రమముగ సర్వావయవములును సౌందర్యపూరితములై బ్రకాశించెను. అంతనాప్రభువు పూర్వమువలె మృదువులైన తన అవయవములను గదలించి కన్నులుదెరచి రెండవ వింధ్యపర్వతమో యనునట్లు అతిగంభీరమగు స్వాభావికస్థితితో లేచి కూర్చుండెను.

—* కులపద్ముడు సరస్వతీప్రసాదమున జీవన్ముక్తుడై విహరించుట. *—

ఇట్లు ఆకులపద్ముడు శవశయ్యనుండి లేచి "ఎవడక్కడ" అని మేఘధ్వనినిబోలు గంభీరమైన భాషణములతో బలికెను. తత్క్షణమే లీలలిరువురు నుయెదటికివచ్చి "ఇప్పుడు చేయవలసినపనిని చెప్పుడు" అని సవినయముగ

నమ్రులై యుండిరి. అప్పుడు ఆప్రభువు నాలుగుతట్లు కలయజూచి అచ్చట నున్న ముప్వురినిగాంచి ఇట్లనియె. నీవెవ్వరు? నీప్రక్కన నిలువబడియున్న స్త్రీఎవ్వరు? అచ్చట సింహాసముపై కూర్చుండియున్న ఆమె ఎవ్వరు? అని అడగగానే ఓ రాజేంద్రా! సర్వమును వివరముగ వివరించెదను వినుమనుచు మొదటిలీల ఇట్లని చెప్ప దొడంగె. ఓ రాజోత్తమా! నేను మొట్టమొదట నుండియు మీకు భార్యగా నున్నదానను. లీల అనుదానను. ఈపార్శ్వము మునందు నిలచియున్న నన్నుబోలిన స్త్రీ రెండవలీల. నాకుప్రతిబింబభూతు రాలు. నేను నీ కొరకయ్యే ఈమెను నిర్మించితిని. ఇకను నీశయ్యాకు శిరో భాగమునందున్న బంగారుపీఠముపై కూర్చుండిన యాజగధీశ్వరి త్రిలోకజన నియగు సరస్వతీదేవి. అనిచెప్పిన తక్షణమే లేచి యాప్రభువు. "ఓజగజ్జననీ! సరస్వతీదేవీ! నీకు నమస్కారము." అనుచు జ్ఞానరూపిణియగు నద్దేవిపాద ములపై వ్రాలెను, ఆమెయును. అతనిని తనహస్తములతో స్పృశించి ఇట్ల నియె. మీకు అశుభములు పాపములు లేకుండునుగాక. శాశ్వతములగు సుఖములు నాశరహితములై వర్ధిల్లుచుండునుగాక. నీరాజ్యమునందలి ప్రజలు గుణములయందును జ్ఞానములయందును సంపదయందును అధికులై నిత్యసం తుష్టులై వర్ధిలుదురుగాక.

ఓ శ్రీరామచంద్రా! ఈవిధముగ వారిని ఆశీర్వదించి సరస్వతీదేవి అంతర్ధానము నొందెను. పిమ్మట జయజయధ్వనులతోడను మంగళవాద్య ములతోడను బ్రాహ్మణులయొక్క ఆశీర్వాద ధ్వనులతోడను పుణ్యాహవా చనములతోడను ఆరాజుగృహము మారుమ్రోయుచుండెను. మృతినొందిన రాజు మఱలబ్రతికనని సంతోషముచేత ప్రజలెల్లరు నచ్చటికి దర్శనార్థమై వచ్చిరి. ఇట్లు సంభ్రమాతిశయమునందు దేశమంతయును క్రొత్తదియో యన్నట్లుండెను. అంత బ్రాహ్మణులును మంత్రులును గలసి యారాజునకు మఱల నభిషేకముగావించిరి. పిమ్మట నాలీల లిరువురును, ఆప్రభువును, జీవ న్ముక్తులై దివ్యజ్ఞాన సంపన్నులై రతిక్రీడలు మొదలగు వానిచేతనువలె పూ ర్వవృత్తాంతములను చెప్పికొనుచును ఆనందించుచుండిరి. ఈవిధముగ సర స్వతీ ప్రసాదముచేత దివ్యజ్ఞాన సంపన్నుడై యాకులపద్ముడు లీలలిరువురు తోగూడి ఎనుబదివేల సంవత్సరములు రాజ్యముచేసెను. ఈవిధముగవారు పరిపూర్ణ విజ్ఞానవంతులై జీవన్ముక్తులయ్యే బహుకాలము రాజ్యమును పా లించి విదేహముక్తిని జెందిరి. పరబ్రహ్మముతో నైక్యమునొందిరి.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షిప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉత్పత్తిప్రకరణమున - లీలోపాఖ్యానమను
ఆరవసర్గ ముగిసెను.

ఓ భరద్వాజా! వశిష్ఠమహాముని లీలోపాఖ్యానమును ఈప్రకారముగ జెప్పి శ్రీరామచంద్రునితో నిట్లనియె. ఓరామభద్రా! నీకు నీయుపాఖ్యానమును విస్పష్టముగ నెఱిగించితినికదా. దీనివలన "మనకు ఏఏపదార్థములు గానవచ్చుచున్నవో అవియంతయు స్వప్నప్రాయములే." అని స్పష్టమయినది కదా. కావున "ఈప్రపంచము స్థిరము" అనుభ్రాంతిని విడువుము. ఇదియంతయు మనోవికారమాత్రమే. మఱేమియు కాదు. ఏపదార్థము సంకల్పముచేత బ్రపంచరూపముగ దోచుచున్నను నిత్యపరిశుద్ధమై సర్వవ్యాపకమై, జ్ఞేయరహిత జ్ఞానరూపమై, సర్వమును నియమించునదియై, యున్నదో అదియే పరబ్రహ్మము. ఆపరబ్రహ్మమే త్రికాలములయందును సత్యము. "ఇట్లైన దానిని ప్రత్యక్షముగ నిర్ణయింపక కొన్నికొన్ని తటస్థ లక్షణములనుమాత్రమే చెప్పనేల?" అని యడిగెదవేమో వినుము. ఆబ్రహ్మము ప్రపంచము ఉన్నసమయములయందును లేని సమయములయందునుగూడ సర్వవ్యాపకమై యున్నది. కావున ప్రపంచభ్రాంతి కలవారికి ప్రపంచభిన్నమగు పదార్థమొకటి కలదను వివేకమే లేకుండుటచేతను, వాస్తవస్థితిలో బ్రహ్మము దీనికంటె భిన్నముకాకుండుటచేతను, ప్రపంచము ఉన్నసమయములయందు ఆయనను (బ్రహ్మమును) నిర్ణయించుటకు వీలులేదు. ఇక ప్రపంచములేని సుషుప్త్యాద్యవస్థలయందు మనస్సు అజ్ఞానవశగతమై ఏవిషయమునుగూడ గ్రహింపనే లేదుగదా. మఱియును. ఆ బ్రహ్మము శుద్ధవిజ్ఞాన స్వరూపమగుటచేతగూడ నిర్ణయింపబడుటకు శక్యము కాదు. ఒకజ్ఞానమును గూర్చి "ఇది ఇట్టిది" అని నిర్ణయించుటకు సాక్షియొకడు ఉండవలయునుగదా. వాడును జ్ఞానరూపుడే కావలయును. కావున "ఒకజ్ఞానమునకు మఱియొక జ్ఞానము సాక్షిగానున్నది" అనవలసివచ్చును. అప్పుడు "ఆజ్ఞానమునకుమఱియొకజ్ఞానము సాక్షి. దానికి వేఱొక జ్ఞానము సాక్షి" అని ఇట్లు అనేక జ్ఞానములను అంగీకరింపవలసి వచ్చును. ఇదిఅనవస్థాదోషము. (ఎప్పటికిని ముగింపులేకుండుట అనుదోషము). ఇట్లు దోష దుష్టమగుటచేత "జ్ఞానరూపుని నిర్ణయింతుము అనుట సరికానేరదు" అయిననేమి? ఏదియైనను ఒకగురుతును ఆశ్రయించి "ఈతడు ఇట్టివాడు, అని సామాన్యముగ జూపరాదా"

అనియెదవేమో అదియును సాధ్యమగు పనికాదు. ఆబ్రహ్మమునకు గుణములేవియు లేవు. సర్వసాక్షియగుటచేత ఆయన గుణముల కన్నింటికిని గూడ సాక్షియగును. కావున ఆయనకు వానితో సంబంధముండదు. సాక్షికి సాక్ష్యములతో సంబంధము లేదనుట అపూర్వ విషయము కాదు కదా. ఈవిధముగ ఎట్టిసంక్షోభమును లేక నిత్యశుద్ధమై యున్న ఆబ్రహ్మ పదము ఎవ్వరికిని నిర్ణయింప శక్యముకాదు. ఇంతయేల? తత్వవేత్తలగు మహానుభావులు సహితము తాము అనుభవింతురేకాని ఒరులకు నిర్ణయించి చూపనేరరు. కావున ఆబ్రహ్మము అనుభవమునకుమాత్రమే గోచరము కావలయును.

—✻ జీవాహంకారాది స్వరూపము. ✻—

ఓరాఘువా! శ్రీరామా! ఆ బ్రహ్మము అలలులేని సముద్రమువలెను, గాలిలేని చోటనున్న దీపమువలెను, నిశ్చలుడైయున్నాడు. అట్టి ఆబ్రహ్మముయొక్క రూపము మనస్సుతో కలసి, లేక, మనోరూపమై ప్రాణాదులతో సంబంధించి యున్నది. అనగా అట్లు తోచుచున్నది. దానినే మనము జీవశబ్దముతో వ్యవహరించుచున్నాము. కావున అట్టి సంబంధము ఏమియు లేకున్న జీవునిరూపము ఎట్టిదైయుండునో, అదియే బ్రహ్మరూపమని తెలిసికొనుము. మఱియును ఆజీవరూపమే క్రమక్రమముగ ఘనమై అనగా నధికచలనము అభిమానము, లేక, సంబంధముగలదియై కట్టెలు అధికముగ వేయుటచేత మిక్కిలి ప్రజ్వరిల్లు అగ్నిలేశమువలె అహంకారరూపమును దాల్చును. ఇది లోపునకంటె స్పష్టముగ సర్వజన విదితమై యున్నదిగదా. దీనికి (అహంకారమునకు) అభిమానాది ధర్మములు లేకుండిన ఎట్టిస్వరూపము ఉండునో అదియే పరబ్రహ్మస్వరూపము అని తెలిసికొనుము. ఇదియునుగాక ఆయహంకారమే మఱింతస్థూలమై సంకల్పించుటకు ఆరంభించేనేని అదియే చిత్తమగును. దీనికే మనస్సనియు చేతస్సనియు మాయయనియు ప్రకృతియనియు పేరులు. (జీవరూపమును వివరించినప్పుడు బ్రహ్మముతో సంబంధించెనని చెప్పబడిన మనస్సు సృష్టిసంకల్పమని తెలిసికొనునది. ( ఈసృష్టిసంకల్పమునకే అవ్యక్తమని శాస్త్ర ప్రసిద్ధ వ్యవహారము ) ఈమనస్సు మఱింత స్పష్టముగ దెలియుచున్నది. కావున సంకల్పములులేని సమయమునందు దీనిస్వరూపము ఏదియో అదియే పరబ్రహ్మ స్వరూపమని తెలిసికొనుము. ఓశ్రీరామచంద్రా! పైవర్ణించిన క్రమమును అనుసరించి సర్వకారణమగు పరబ్రహ్మమునుండి మనస్సుపుట్టెను. దానికి సంకల్ప

మే స్వరూపము. ఆసంకల్ప ప్రభావముచేత ఆమనస్సే ఈసర్వ ప్రపంచ
మును సృష్టించుచున్నది. అనగా బ్రహ్మాభిన్నముగ దోచునట్లు చేయుచున్న
ది. కావున దరి (గట్టు) అనునదిలేక సర్వవ్యాపకమై అనేకవిధములుగ
ప్రవహించుచున్న జ్ఞానమను జలముతో గూడిన మహాసముద్రమేకాని
ఈప్రపంచము మఱియొకట్టికాదు. ఇదియే బ్రహ్మము. ఎట్లుచూచినను
బ్రహ్మమునకును ఈప్రపంచమునకును భేదములేదు. బాగుగ జూడలేక
పోవుటచేత స్తంభమునందు " ఇది పురుషుడు అను దృఢనిశ్చయము కలిగి
నట్లు" ఈసంసారమును, లేక, ప్రపంచమును మనోవశమువలన బ్రహ్మస్వరూ
పా జ్ఞానముచేత దీర్ఘస్వప్నమువలె దోచుచున్నది. బ్రహ్మస్వరూపమును
ఎఱుగుట యను మెలకువ రాగానే ఈస్వప్నము నశించును.

—* బ్రహ్మకును జీవాదులకును అభేదము. *—

ఓరామచంద్రా ! కావున పైవివరమును అనుసరించి పరబ్రహ్మమున
కును జీవునకును భేదమేమియు లేనట్లే జీవునకును మనస్సునకునుగూడ భేద
మేమియు లేదు. జీవమనస్సులకు భేద మెట్లు లేదో మనస్సృష్టులకు అనగా
మనస్సునకును ప్రపంచమునకునుగూడ భేదము అట్లేలేదు. కావున బ్రహ్మమే
ప్రపంచము. ప్రపంచమే బ్రహ్మము.

—* కర్కటీఉపాఖ్యానము. *—

ఓశ్రీరామచంద్రా! ఈవిషయము స్పష్టమగుటకై పెద్దలు ఒక ఇతి
హాసమును చెప్పుచున్నారు. అది సర్వవేదాంత సారభూతము. దానియం
దు ఒకరాక్షసి చేసిన మహాప్రశ్నములును దానికి ఉత్తరములును గలవు.
ఆకథను చెప్పెదను వినుము. " కాటుకకొండతో మలచిన ప్రతిమయో "
అనునట్లు మిక్కిలి నల్లనివర్ణముగలదియై అతిభయంకరమై యున్న కర్కటి
యను ఒక రాక్షసి హిమవత్పర్వతమునకు ఉత్తరభాగమునందు నివసించు
చుండెను. దానినేత్రములు చెంచలములుగాని మెరుపులవలె పచ్చనైయుం
డెను. ఖర్జూరవృక్షములవలె దానిమోకాళ్ళు అనగా మోకాళ్ళవరకు
నుండు కాలిలోనిభాగము అత్యున్నతమై యుండెను. వైడూర్య రత్నముల
తో ( ఈరత్నములు రాత్రికాలమునందు ఒకమూలగూర్చుండి చూచుచు
న్న పిల్లికన్నులవలె నుండును ) జేయబడిన చేటలవలె దానిగోళ్ళు భయంక
రములై యుండెను. మఱియు దానిశరీరమంతయును బయలుపడియున్న
ఎముకలతోను నరములతోను నిండి మాంసశూన్యమై యుండెను. ఎచ్చట
చూచినను కణుతులతో దానిశరీరము మిక్కిలి వికారమై యుండెను. ఇది

యునుగాక దానిశరీరము మిక్కిలి విశాలమైనది యగుటచేతను మనుష్యులను భక్షించునది యగుటచేతను అట్టి యాహారమును సంపాదించుకొనుట మిక్కిలి కష్టమగుటచేతను దానిజఠరాగ్ని బడబాగ్నివలె ఎప్పటికిని తృప్తి నొందకుండెను. ఇట్లు మహోదరియగు నారాక్షసి బడబానల జ్వాలవలె ఎప్పటికిని దృప్తినొందజాలక ఒకనాడు ఇట్లని విచారించెను. సముద్రుడు సర్వనదీజలములను సర్వకాలములయందును తనలో హరించునట్లు నేనును ఊపిరియైనం ద్రిప్పుకొనకుండ నీజంబూద్వీపముననున్న ప్రజల నందరను భక్షించెదను. అప్పటికి నాకు తృప్తికలుగునేమో. మేఘముచేత ఎండమావులు శాంతియగునట్లు నిశ్చయముగ నాయాకలి దీనిచేత శాంతినొందును. కావున ఇట్టిసామర్థ్యము గలుగుటకై నిశ్చలచిత్తముతో తీవ్రమగు తపస్సు చేసెదను. ఈవిధముగ నాలోచించి సర్వభూతములను హింసింపవలయునని నిశ్చయించి తపస్సు చేయుటకై ఏభూతమునకును ప్రవేశింప నలవిగాని ఒకపర్వతముమీదికి బోవనెంచెను. అంత తాను ఉద్దేశించిన పర్వతముమీదికి బోయి స్నానమును చేసి తపస్సు చేయుటకు నారంభించెను. సూర్యచంద్రులవలె ప్రకాశించుచున్న దననేత్రములు నిశ్చలములై యుండ ఒకకాలుపాదమునే ఆధారముచేసికొని నిలువబడెను. పర్వతముచేత నేర్పరుపబడిన ప్రతిమయోయనునట్లు ఎంతప్రచండమైన ఎండకైనను ప్రబలమగు చలికైనను వర్షములకైనను ఆరాక్షసి తలదాచుకొనలేదు. నిలువబడినచోట బయలు ప్రదేశమున నట్లేయుండెను. ఇట్లు ఘోరతపస్సు చేయుచుండ దినములును పక్షములును మాసములును క్రమక్రమముగ గడచిపోయినవి. ఇట్లు వేయుసంవత్సరములు గడువగానే ఆరాక్షసికి వరములను ఇచ్చుటకై బ్రహ్మదేవుడు అచటికి వచ్చెను. నీచులైనను ఘోరముగ తపము నాచరించిరేని అది సిద్ధింపక మానదు. అంత నాకర్కటియు బ్రహ్మదేవునకు మనస్సుతోనే నమస్కరించి "నేను ఏవరమునుగోరిన నాయాకలి దీరును" అని లోలోపల నాలోచింపసాగెను. కొంతసేపటికి ఇట్లని నిర్ణయించెను. ఆహా, ఇప్పుడు జ్ఞప్తికివచ్చినది.

"ఓప్రభువా ! బ్రహ్మదేవా ! నేను బ్రతికియున్న ఒకసూదిని కావలయును. ఇనుముతో చేయబడినది గాకున్నను, నాస్వరూపము ఇనుమువలె అభేద్యమై యుండవలయును" అను నీవరమును కోరెదను. ఈవరముచేత నేను సర్వజంతువుల హృదయములలోపల బ్రవేశించి వానిని సంహరించి యాకలి దీర్చికొందును. ఆకలి దీరుటకంటె పరమసుఖము వేరో

కటికలదా. అని ఇట్లు ఆరాక్షసి తలంచుచుండగనే బ్రహ్మదేవుడు ఇట్లనియె. ఓపుత్రీ ! బాలికా ! కులపర్వతములపై నుండు మేఘపంక్తులను బోలుదానా! కర్కటీ! రాక్షసీ! నీతపస్సునకు మెచ్చితిని. వరమును వేడుము. అనిన కర్కటి ఇట్లనియె.

ఓభగవంతుడా! సమస్తప్రపంచమును సృజించువాడా! భూత భవిష్య ద్వర్తమాన కాలములయందుండు సర్వమునకు నధిపతీ ! బ్రహ్మదేవా! మీకు నాయెడల అనుగ్రహము గలదేని ఈవరమును ఇవ్వుడు. నేను బ్రతికియున్న యొకసూదిని కావలయును. ఇనుముతో జేయబడుచున్నను నారూపము ఇనుమువలె నతిదుశ్ఛేద్యమై యుండవలయును. అనిన నట్లేయని అనుగ్రహించి యాబ్రహ్మదేవుడు మఱియు నిట్లనియె. ఓకర్కటీ! నీవు కేవలము సూచికవుకావు. నీవుచేయుబాధ యాసూచిక (సూది) చేయు బాధకంటె అధికమగుటచేత నీవు ''వి=విశేషమయిన'' అను నుపసర్గతో గూడి విషూచికవు ( క్రొత్తదియగు లేక విశేషమైన బాధకలిగించు సూదివి ) అగుదువు. ( ఇదియేకలరా ) శాస్త్రవిరుద్ధములగు ఆహారములను భుజించువారిని ధర్మవిరుద్ధములగు కార్యములను జేయువారిని ఎవ్వరేమిచెప్పినను తెలిసికొనక మూఢులై తాము ఆశ్రయించియున్న దుష్టమార్గమునువిడువక యుండువారిని నివాసయోగ్యములుకాని స్థలములయందు నివసించువారిని పరిశుద్ధములేక తమమనోవాక్కాయములను గృహాదులను జెరచుకొనుచున్న దురాత్ములగువారిని హింసింతువు. నాసికారంధ్రములగుండా బీల్చబడి లోనికిబోవు ప్రాణవాయువు మూలమున నీవును ప్రాణుల హృదయమున బ్రవేశింతువు. అచ్చట హృదయకమలమును దానికిసమీపమున పిత్తమునకు ఆధారమైయున్న ప్లీహను మఱియు నితరమర్మములను జెరచుచు వాతవ్యాధిరూపము గలదానవై యుందువు. అయితే నీవుమాత్రము సత్పురుషులను దుష్టులనుగూడ భేదమునెఱుగలేక కొన్నికొన్ని సమయములందు ఆక్రమింతువు. అట్టిసమయములందు సత్పురుషులు నీఉపద్రవమునుండి తప్పించుకొనుటకై నేనొకమంత్రమును చెప్పెదను.

మంత్రము ॥ '' ఓం హ్రాం హ్రీం శ్రీం రాం విష్ణుశక్తయే నమో
భగవతి విష్ణుశక్తి ఏహి ఏనాం హరహర దహ
దహ హనహన పచపచ మథమథ ఉత్సాదయఉత్సా
దయ దూరే కురుకురుస్వాహా ॥

విషూచికే త్వంహిమవంతం గచ్ఛగచ్ఛ జీవసార చంద్ర
మండలం గతోఽసి స్వాహా ||” ... ... *

అనునదియే మహామంత్రము. మాంత్రికుడగువాడు ఈ మహామంత్రమును తనకుడిచేతితో తన యెడమచేతియందు వ్రాయవలయును. పిమ్మట నాయెడమచేతితో రోగపీడితునియొక్క శరీరము నంతయును తుడువవలయును. మఱియు నతిక్రూరయు, కోపము గలదానవు, నగు నీవు మంత్రప్రభావముచేత హిమవత్పర్వతమునుగూర్చి పరుగిడి పోయినట్లు మాంత్రికుడు మనస్సున ధ్యానించవలయును. మఱియు నారోగి చంద్రమండల మధ్యమునందు అమృత రసాయనములో మునిగియున్నట్లును జరామరణబాధలేనివానిగను మనోవ్యథలచేతను శరీరజన్యరోగములచేతను గలుగుదుఃఖము ఆరోగిని విడిచిపోయినట్లును ఆమాంత్రికుడు ధ్యానించును. ఈవిధముగ నెవ్వడైన నొకమాంత్రికుడు పరిశుద్ధుడై బాగుగ నాచమనముచేసి శాంతచిత్తముతో సర్వకార్యములను జేయునేని అప్పుడు నీవారోగిని బాధింపక విడచిపొమ్ము. ఈవిధముగ నాజ్ఞాపించి బ్రహ్మదేవుడు అంతర్ధానము నొందెను.

### కర్కటి విషూచికారూపముతో ప్రాణులను హింసించుట.

ఓరామచంద్రా! పిమ్మట తత్క్షణమే యాకర్కటి లోడితడై వ్రేలంతయై మినుపగింజంత పరిమాణము గలదియై జమ్మియాకంతై నేత్రములకు సహితము గానరానియంతై సూక్ష్మరూపముగలదై సన్నని సూదియయ్యెను. అది కేవలము వాతరూపము గలదియై లేక వాయువుతోగలసి ఇతర రోగములతో కృశించి స్వాభావికముగా స్థూలశరీరముగలిగిగాని కృశించి నశరీరముగలిగిగాని యున్నవాని శరీరమునందు ప్రవేశించి విషూచికా వ్యాధియై వానిని హింసించుచుండెను. ఒకానొకడు రోగములేక స్వస్థుడయ్యే యున్నను, వివేకవంతుడయ్యే యున్నను, వానిశరీరము కృశమైనైనను వానియందు ప్రవేశించి బుద్ధినిభ్రమింపజేయుచు మరణహేతువగు విషూచికా వ్యాధి యగుచుండెను. ఈవిధముగ నాకర్కటి వాతరూపమును, దుర్బుద్ధిరూపమును, ధరించి విషూచికావ్యాధియై ప్రాణులనెల్ల హింసించుచు స్వర్గమర్త్య పాతాళములయందు విహరించుచుండెను.

### —* కర్కటికి వైరాగ్యముగలుగుట. *—

ఓరామచంద్రా! ఈవిధముగ బహుకాలము విహరించుచుండి యారాక్షసి తానుచేయుకార్యమునందు విసుకుజెంది ఇట్లనితలపోసెను. ఛీ నేను

చేయుకార్యము ఎంతచెడ్డది. ఎఱిగి ఎఱిగి ఇట్లేల చేసితిని. నాకు పూర్వము
వలె ఇప్పుడు పెద్దశరీరముగూడ లేదు. సూదినై యున్నానుగదా. ఇప్పుడు
నేను ఎంతపరిమాణముగల రక్తమాంసములను పానముజేయగలను. సూది
నిండవలయుననిన అత్యల్పములగు రక్తమాంసములే చాలునుగదా. ఇట్లై
నను కాలమేఘమువలె అతివిశాలములగునట్టి శరీరములు (జనులశరీరములు)
నాకై ధ్వంసములైనవి. వాస్తవస్థితిలో ఆశయనునది నన్ను బాధించుచు
న్నదే కాని ఆశరీరములెక్కడ? సూదినైయున్న నేనెక్కడ? అవియన్నియు
దుర్బుద్ధిగల ఈసూదికి (నాకు) సరిపోలేదుగదా. నేను ఆయాశను జయిం
పలేకున్నాను. అహా, ఆశరీరములెక్కడ? వానివైశాల్యమెక్కడ? వానియం
దుండు మధురమగు మాంసము, కొవ్వు, రక్తము, అనునవి ఎంత అధికము
గానున్నను ఈసూదికి కొంచెమైనను సరిపోలేదు. ఇనియంతయును ఆశ
యొక్కప్రభావమేకదా. ఛీ ఇట్లుండుట సరికాదు. అనిఇట్లు తలపోసి తన
మనస్సుననున్న సంహారేచ్ఛను వదలి తపస్సుచేయుటకై హిమవత్పర్వత
శిఖరముమీదికి పోయెను.

—* కర్కటి మరల తపస్సుచేసి జీవన్ముక్తి నొందుట. *—

ఓరామచంద్రా! ఈవిధముగ పర్వతశిఖరమును ఆశ్రయించి తనకు
వరబలమువలన వచ్చిన సూదియంత దేహముతోనే ఘోరమైన తపస్సును
ఆచరించెను. సర్వవిషయములనుండియు బలాత్కారముగ దనచిత్తమును
మరలించెను. ఆరాక్షసికి తానుచేసిన ఘోరకార్యమువలన గలిగిన భయ
మువలన ఇట్టిపూనిక గలిగెను. మఱియు నాతపస్సుచేయు కాలమున ఆరా
క్షసి ఏసంకల్పమును రానీయలేదు. అలలులేని సముద్రమునువలె చిత్తము
ను నిశ్చలము గావించెను. ఆమనస్సు ఎట్లెట్లు పరుగిడ నారంభించినను
దానిని అట్లట్లే మరల్చుచుండెను. ఏ ఆహారమునుగాని భుజింపక ఉపవాస
వ్రతమును సలుపుచుండెను. ఇట్లు వేయుసంవత్సరములు గడువగా దానిమ
నస్సు నిర్మలమై అత్యుత్తమస్థితికి వచ్చెను. అప్పుడు ఆసూది (కర్కటి) తపో
బలముచేత కల్మషరహితమై అతిపరిశుద్ధురాలయ్యెను. మఱియు చిత్తనైర్మ
ల్యముచేత తనజ్ఞానమే పరమార్థము తనంతనే స్పష్టమయ్యెను. ఇట్లు తత్త్వ
మునెఱిగి మఱింత నిశ్చలమై సంకల్పశూన్యమై యున్న మనస్సుతో మఱి
యొక వేయు సంవత్సరములు నిర్వికల్ప సమాధియందు ఆరాక్షసి నిలచి
యుండెను. సంసారమును తుచ్ఛముగ దలపోసి యుండెను. ఈవిధముగ
ఆరాక్షసి దివ్యవిజ్ఞాన సంపన్నురాలై బ్రహ్మరూపమును జెందియుండుట

నెఱిగి భగవంతుడగు నా బ్రహ్మదేవుడు అచటికివచ్చి ఇట్లనియె. ఓపుత్రీ! కర్కటీ! రాక్షసీ! నీవు తపఃప్రభావముచేత తత్వము నెఱిగి జీవన్ముక్తురాల వైతివి. ఇకను ఈసూచిరూపమును విడచి పూర్వరూపమును బొందుము. స్వేచ్ఛగా సర్వలోకములయందును విహరింపుము. నీమనస్సునందలి అజ్ఞానాంధకారము బోయినది. ఇక శాశ్వతమగు బ్రహ్మానందమును అనుభవింపుము. ఏపురుషులు పూర్వసంస్కార బలముచేత స్వయముగ యుక్తాయుక్తముల విమర్శింపలేని చిత్తము గలిగి యుందురో, ఎవరు అట్లువిమర్శింపగలిగియు స్వార్థపరులై దుష్కార్యములను ఆచరించుచుందురో ఏమానవులు పరులు ఎన్నివిధముల బోధించినను వినక తనకొఱకై యనియు పరులకొఱకై యనియుగాక, తాముబూనిన దుస్సంకల్పమును విడువరో, ఇట్లు విడువక ఎవ్వరు సంపూర్ణముగ భ్రష్టులై యుందురో, ఏమనుష్యులు నివాస యోగ్యములుకాని అపరిశుద్ధ దేశములయందు నివసింతురో, అట్టివారిని ఆహారార్థమై ఉపయోగించుకొనుము. ఈవిధముగ జెప్పి యా బ్రహ్మదేవుడు అంతర్ధానమునొందగానే యాకర్కటియు బూర్వశరీరమును దాల్చెను. సంశయములెల్లను దీరుటచేత ఆరాక్షసి తనలోపల అనగా చిత్తమునందు సచ్చిదానంద స్వరూపము గలదియయ్యెను. విషయములను చూచుట వలన గలుగు పరితాప మేమియు జెందకుండెను. ఇట్టి ప్రభావముగలదియై ఆదినము మొదలు బహుకాలమువరకు నిర్వికల్ప సమాధియందే నిలచి యుండెను. పిమ్మట ఒకానొకప్పుడు దానిచిత్తము చెలించి బాహ్యావృత్తికి అభిముఖమయ్యెను. అప్పుడు ఆకలి మఱల జ్ఞప్తికి వచ్చెను. ఎంత జ్ఞానవంతులైనను శరీరము ఉండునంతకాలము దానిస్వభావములు తొలగిపోవుకదా. అంత ఆరాక్షసి ఇట్లని విచారించెను. బ్రహ్మదేవుడు నాజాతిని అనుసరించి నాకు మూఢులు మొదలగువారిని ఆహారముగ గల్పించి యున్నాడుగదా. ఇకను నేను అట్టివారిని వెదుకవలయును. ఇట్లు నిశ్చయించి నిర్జనమగు హిమవత్పర్వత శృంగమును విడచి ఆపర్వతము క్రిందనున్న కిరాతులయొక్క రాజ్యమునకు వచ్చెను. ఆరాజ్యమునకు ఆశ్రయమగు మహారణ్యమునందు ఒక నివాసమును ఏర్పరచుకొని అందు నివసించుచుండెను. అట్లుండిన గాని, మనుష్యులతో సంబంధము కలుగదు కదా

## మంత్రిసహితుడైన నొకమహారాజకర్కటీ సంవాదము.

ఓరామచంద్రా! ఇట్లుండగ ఒకానొకసమయమునందు యొక కృష్ణ

పక్షరాత్రివచ్చెను. అందు అంధకారము మిక్కిలి దట్టమై చేతితో బట్టుకొన వచ్చునేమో యనునట్లుండెను. అట్టిభయంకరమగు ఆరాత్రియందు ఆకిరాతదేశమున విక్రముడను పేరుగల యొక మహారాజు మంత్రిసహితుడై రాత్రికాలములయందు చేయదగిన తస్కరవధ మొదలగు రాజకార్యముల జేయుటకై కర్కటియున్న మహారణ్యమునందు ప్రవేశించెను. ఇట్లు శస్త్రధరులై మహాధైర్యముతో అరణ్యమున సంచరించుచు అందున్న భేతాళుని (గ్రామదేవతను) జూడబోవుచున్న యీరాజమంత్రులనుజూచి యాకర్కటి ఇట్లని తలపోసెను. నాకిప్పటికి తగిన ఆహారము దొరకినది వీరు మూఢులు ఆత్మజ్ఞానము లేనివారునై యుందురు. వీరికి దేహము బరువుమాత్రమే. దానితో వారు అసత్యములగు భోగములను అనుభవించుటయేకాని, చేయవలసిన కార్యమును ( ఆత్మనెఱుంగుటను ) చేయుటలేదుగదా. మూఢుల జీవనమునకు దుఃఖమేఫలము. ఇహలోక పరలోకములయందు గలుగు నాశమే ప్రయోజనము. సర్వపాపములను దీనివలననే గలుగును. లోకములన్నియు దీనిచేతనే చెడుచున్నవి. కావున మూఢులను బ్రతుకనీయరాదు. ఇదియునుగాక ఆచతుర్ముఖుడు సృష్ట్యారంభమునందు "ఆత్మజ్ఞానములేని లేక, ఇంద్రియనిగ్రహములేని వివేకశూన్యుడు" రాక్షసులు, శార్దూలములు మొదలగు ఘాతుకమృగములకు ఆహారమగుగాక అని నియమించియున్నాడు. కావున వీరు నాకు ఆహారమై వచ్చిరి. వీరిని భక్షింపవలయును. నిర్దోషమై అనుభవయోగ్యమై చేతికి వచ్చినదానిని విడచువాడు మూర్ఖుడేకదా.

### —* గుణవంతుల ప్రశంస. *—

అయితే ఈమానవులు గుణవంతులుగా మాత్రము ఉండకూడదు. గుణవంతులగువారిని జంపుట నాకు సహజముగానే ఇష్టములేదు. కావున వీరికి సద్గుణమేదియైన కలదేమో పరీక్షించెదను. ఈపరీక్షయందు కడతేరిరేని వారిని భక్షింపను. గుణవంతులను ఎప్పటికిని హింసింపను. పరమానందమును కీర్తిని ఆయుష్యమును గోరువారు సర్వాభీష్టములను తనశక్తికొలదిని ఇచ్చి గుణశాలురను పూజింపవలయును. కావున నేను ఈయాకటితో చావనైన జత్తునుగాని గుణవంతులను బాధింపను. మనస్వులకు ప్రాణములకంటె లేక, బ్రతుకునకంటే అధికముగ సత్పురుషులు ఆనందమును గలిగింతురు. కావున బ్రతుకునకంటే అధికముగ వారిని ప్రేమింపవలయును గదా. ఇంతయేల? తనప్రాణమునైనను ఇచ్చి గుణవంతునిరక్షింపవలయును.

సత్పురుష సమాగమమనెడు మహౌషధీ ప్రయోగమువలన మృత్యుదే
వత సహితము మిత్రుడగును. అనగా సత్పురుష సమాగమము గలవానికి
మృత్యుభయముకూడ తొలగిపోవును. నేను రాక్షసినైయైనను ఎవనినైన
వానిని భక్షించుదాననైనను సత్పురుషులయందు పక్షపాతము గలిగి వారిని
బరిపాలించుచు నుండునేని లోకమునందు ఇకనెవ్వడు అట్లు గావింపడు.
శుభ్రమగు ముత్యాలహారమునువలె ఈనీతిని హృదయమునందు ఎవ్వడు
దాల్పడు. నాయుదాహరణముచేత సర్వజనులును ఈమార్గమును అవలం
బించి అవశ్యముగ కృతార్థులయ్యెదరు. మఱియు నాకీస్వభావము ఇప్పుడే
గాక జన్మారంభమునుండియును ఉన్నదియే. ఇట్లు రాక్షసినగు నాకేయుం
డగా ఇతరులగు మనుష్యాదులనుగూర్చి వేరుగ జెప్పవలసినది ఏమున్నది.
వారికి నాకంటె ఎన్నిరెట్లో అధికముగ సజ్జన పక్షపాతము ఉండితీరును.
ఏమహాత్ములు సద్గుణవంతులై ఉదారచిత్తముతో సంచలించుచుందురో
వారు భూలోకపూర్ణచంద్రులు. సంబంధ మాత్రమువలన ఎట్టిపరితాపము
నైనను జల్లార్చి చల్లపరుతురు. కావున గుణవంతులను తిరస్కరించుటయే
మరణము. వారిని ఆశ్రయించుటయే బ్రతుకు. అట్టిబ్రతుకుగలవాడే పురు
షుడు. వానికే స్వర్గము మోక్షము అనుఫలములు కలుగును. కావున కమ
లముల్వంటి విశాలనేత్రములుగల ఈసుందరపురుషు లెంతమాత్రము జ్ఞాన
ముకలవారో మొట్టమొదట పరీక్షించి చూచెదను. చమత్కారముగ కొన్ని
ప్రశ్నలను అడిగెదను.

—* కర్కటి ప్రశ్నములు. *—

ఓరామచంద్రా! ఆరాక్షసి ఈవిధముగ నిశ్చయించి రాక్షసకుల
మను మహారణ్యమునకు పుష్పగుచ్ఛమువంటి యాకర్కటి ఆగాఢాంధకార
మునందే యుండే మేఘము గర్జించినట్లు భయంకరముగ సింహనాదముజే
సెను. పిమ్మట హుంకారసహితముగ అతికఠినమైన నొకవాక్యమును ఈవి
ధముగ బలికెను. ఆధ్వని ( అదిమాటలాడుధ్వని ) మేఘగర్జనమునకు పిమ్మ
ట గలుగు వడిగండ్లధ్వనివలెను పిడుగుపడుధ్వనివలెను మిక్కిలి భయంకర
మై యుండెను. ఓఓపాంథులారా! అడవియను ఆకాశమునకు చంద్రసూ
ర్యులైనట్టియు అజ్ఞానమనియెడు విశాలమగు రాతియొక్క తొఱ్ఱయందు నివ
సించు పురుగులైనట్టియు మీరిరువురు లెవ్వరు? మహాజ్ఞానసంపన్నులో, లేక,
అజ్ఞానవంతులో గాని, నేడిచటికి వచ్చితిరి. నాకు ఆహారమగుటకు సిద్ధమై
యున్నారు. ఒకక్షణములో మృతినొందగలరు. కావున మీయథార్థస్వరూ

పములను తెలుపుడు. అనిన నావిక్రమరాజేంద్రుడు ఇట్లనియె.

ఓభూతమా ! నీవనగా నెంత? నీవెచ్చట నున్నావు? నీరూపమును ఇటు జూపుము. నీకు బెదరువారిచట నెవ్వరును లేరు. ఆకుతుమ్మెద అరపులకు భయపడు వారెవ్వరు గలరు. ఇట్లు రాజుపలుకగానే " నాకు తగిన అవకాశము దొరికినది " అని మనస్సున నూహించి యాకర్కటి తనశరీరమును వారలకు గానవచ్చుటకును వారలను బెదరించుటకునై గంభీరముగ సింహనాదము జేసి పకపక నవ్వెను. ఆనవ్వుచేత అతిస్వచ్ఛమగు దాని దంతములయొక్క కాంతి గాఢాంధకారమును పోగొట్టి దాని స్వరూపమును ప్రకటించెను. అప్పుడు ఆరాజమంత్రులు దిక్కులయందు ప్రతిధ్వని పుట్టునట్లు అరచుచున్న యాకర్కటినిజూచిరి. ఆరాక్షసి ప్రళయకాలమునందు పిడుగుపడుటచేత మిక్కిలి ధ్వనించుచు, లేక, ఆపిడుగునకు ప్రతిధ్వనిఇచ్చుచు దానియొక్క ( ఆపిడుగుయొక్క ) కాంతిచేత ప్రకాశించుచున్న కొండగుహవలె అతివిశాలాకారము గలదియై భయంకరమైనదై యుండెను. ఇట్టి దానిని జూచి వారును మహాధైర్యవంతులగుటచేత భయము నొందక ఎప్పటివలెనే యుండిరి. మఱియు నిట్లని మాటలాడుటకుగూడ నారంభించిరి. ఓమహారాక్షసీ! నీవు నిష్ప్రయోజనముగ నింత యాడంబరము సేయనేటికి. నీవు చేయదలచిన పనియు నతిస్వల్పమైనదియే. నీవు ఆహారమునుమాత్రమే కదా కోరితివి. ఇంతమాత్రమునకు ఇట్టియాడంబరమేల? కావున ఈవృధా యాడంబరమును విడువుము. ఇట్లుచేయుట మేలుకాదు. బుద్ధిమంతులు తమ కార్యమును సాధించుటయందే పూనిక గలిగి తనకు ఏవిషయము కావలయునో దానియందుమాత్రమే పని సేయుదురు కాని, ఆడంబరమును చేయరు. మేము నీయాడంబరమునకు బెదరి లోబడుదుమని తలంచితివేమో వినుము. ఓబలహీనురాలవగుదానా ! మీవంటివారలు అనేకసహస్రములు దోమలగుంపులవలెను, ఎండిన గడ్డియట్లును, వాడిన యాకులమాడ్కియును, మాప్రతాపమను సుడిగాలిలోపడి కొట్టుకొనిపోయిరి. బుద్ధిమంతులగువారు ఎప్పటికిని కార్యసాధన విషయమున నాడంబరమును జేయరు. ఆయాడంబరము జ్వరమువలె మిక్కిలి పరితాపకరము. కావున దీనిని సంపూర్ణముగ వదిలిపెట్టి నిర్మలమై ఇష్టానిష్ట ఫలములయందు సమానమై కాలోచితముగ వ్యవహరించునదియై యున్న చిత్తముతో తమకోరికలను సాధించెదరు. కావున నీవును కార్యసాధనపరురాలవై తివేని నీయిష్టమును వేడుము. నీకు ఏమికావలసి ఇట్టి యాడంబరమును జేసితివి. మమ్ముజేరిన యాచకులెవ్వ

రును స్వప్నమునందైనను తమకోరికలను పొందక మరలిపోలేదు. అని ఇట్లు ఆరాజు చెప్పగానే కర్కటి తనలో నిట్లనివిచారించెను. ఆహా, వీరు పురుషులయందు సింహములవంటివారు. వీరిధైర్యము వీరిసదాచారము ఎంతో వర్ణనీయముగ నున్నది. వీరు సామాన్యులుగా నున్నట్లు నాకు తోచలేదు. వీరి వాక్యచమత్కృతి మిక్కిలి ఆశ్చర్యకరముగ నున్నది. "ఈపురుషుని చిత్తమిట్టిది" అని తెలిసికొనుటకు మాటయు ముఖవికాసము, చూపు, అను నీమూడే కదా ఆధారము. నదీప్రవాహములు రెండు నొకదానితో నొకటి సంబంధపడినపుడు అలలయొక్క చలనముల మూలమున గలసిపోవునట్లు బుద్ధిమంతులు ఇరువురుగలసినపుడు వారల చిత్తములుగూడ మాట, చూపు, ముఖవికాసము, మొదలగు వానివలన ఏకీభవించును. కాబట్టియే వీరు నేను గానవచ్చినంతమాత్రముననే నాయొక్క అభిప్రాయమును వారలు గురుతెఱిగిరి. వారియొక్క అభిప్రాయమును అట్లే నేనును తెలిసికొంటిని. వీరిని నేనిక సంహరింపను. ఈమహానుభావులును నశింపదగినవారు కారు. కావున నాకుగల ఒకసందేహమును వీరలవలన దీర్చుకొనియెదను. బుద్ధిమంతులగువారు దొరికినప్పుడు తమసంశయమును దీర్చికొనని మనుష్యులు అధములుకదా. అని ఈవిధముగ తలంచి ప్రళయకాల మేఘధ్వనితో సమానమగు నరవును నవ్వును నిలిపి తగిన సమయమునుజూచి ఇట్లని ప్రశ్నించెను. - ఓపురుషశ్రేష్ఠులారా ! మీరులెవ్వరో దయచేసి తెలుపుడు. అనిన నారాజుయొక్క మంత్రి ఇట్లనియె.

ఓరాక్షసీ! ఇమ్మహాత్ముడు కిరాత దేశములకు రాజు. నేను ఇతనికి మంత్రిని. మేమిరువురమును ఇప్పుడు రాత్రిసంచారమునకై వచ్చితిమి. మీబోటి దుష్టులను సంహరింప వలయుననిన ఇదియే సమయము కదా. ప్రభువులకు ఇదిరాత్రి, ఇదిపగలు, అనువిభాగములేక ఎప్పుడును దుష్టనిగ్రహమును ఆచరించుటయే ధర్మము. అనినవిని ప్రభువునకు అభిముఖియై యాకర్కటి ఇట్లనియె. ఓరాజా! నీమంత్రి దుష్టుడు. రాజునకు దుష్టమంత్రి యుండకూడదు. మంత్రి మంచివాడై రాజుదుష్టుడుగానుండినగాని, రాజుమంచివాడై మంత్రిదుష్టుడుగానుండినగాని, ఇందేదియైనను అనర్థకరమే. అందును మంత్రియగువాడే మొట్టమొదట రాజునకు వివేకమును నేర్పవలయును. అట్లు నేర్పెనేని మొట్టమొదట ప్రభువు సద్గుణవంతుడగును. పిమ్మట ప్రజలును రాజువలె సద్గుణశాలు రగుదురు. దుష్టశిక్షయందును, శిష్టానుగ్రహమునందును, శత్రుజయము మొదలగువానియందును, సంక్షోభము లేకుండ

కార్యములు నిర్వహించుటయందును రాజుసమర్థుడగును. మఱియు కార్యములు సమర్థించుటకు దగినసామర్థ్యము, సుఖదుఃఖముల వలన కలతనొందక సమచిత్తముతో నుండుట, పక్షపాతములేకుండుట, అను మొదలగు సద్గుణరత్నములు తత్త్వజ్ఞానము చేతగాని, కలుగవు. ఎవనివిషయము ఎట్లున్నను ముఖ్యముగ సంపదభివృద్ధిచేత విక్షోభమునొందు చిత్తముగల ప్రభువులకు సర్వసంక్షోభ నాశకమగు బ్రహ్మజ్ఞానము లేకున్న అట్టిసుగుణములు కలుగనేకలుగవు. కావున అట్టిబ్రహ్మజ్ఞానము నెఱుగనివాడు మంత్రియగానేరడు. ప్రభువునుకానేరడు. అట్టిజ్ఞానశూన్యుడు రాజపదవికి బాత్రిగనే తగడు. కావున నేను ఊహించినట్లుగాక ఒకవేళ మీరలిరువురును బ్రహ్మవేత్తలేయగుదురేని మహదభివృద్ధిని జెందెదరు. మీప్రజలును సుఖ పరిపూర్ణులయ్యెదరు. అట్లుకాదేని మీప్రజలకు అనర్థము కలుగును. ఈకారణమువలన మీరు జ్ఞానశూన్యులైతిరేని మిమ్ములను నేను విడువను. నిశ్చయముగ భక్షింతును. మీరలనగానాపద్ద శిశువులవంటివారే. నాకు మీవలన భయమించుకయైనను లేదు. అదియట్లుండనిండు. ఓపాంథులారా! బుద్ధిబలముచేత నేను అడుగబోవు ప్రశ్నములనియెడు వజ్రపంజరమును భేదింప గలుగుదురేని నాపార్శ్వమునుండి తప్పించుకొని పోగలుగుదురు. అని ఈప్రకారముగా యాకర్కటిచెప్పెనని వశిష్ఠుడు శ్రీరామునితో జెప్పి శ్రీరామునిజూచి వశిష్ఠుడు మఱల ఇట్లనియె.

ఓశ్రీరామచంద్రా! ఇట్లు ఆకర్కటి పలుకగానే ఆవిక్రమరాజును "ఓరాక్షసీ నీవు ప్రశ్నలను యథేచ్ఛముగ నడుగవచ్చును" అని యంగీకరించి చెప్పెను. తత్క్షణమే యాకర్కటియు దనప్రశ్నలను ఈవిధముగ చెప్పనారంభించెను. ఓపాంథులారా! ఏపరమాణువు వాస్తవస్థితిలో నొకటియయ్యును అనేకములుగ లెక్కింపబడుచున్నది? ఏపరమాణువునందు సముద్రమునందు బుట్టు అలలవలె అనేకలక్షల బ్రహ్మాండములు పుట్టుచు నడంగుచునున్నవి? ఏది ఆకాశమయ్యును ఆకాశధర్మములు లేకయున్నది? ఏది ఒకానొకటియయ్యును, ఏదియుగాకున్నది? ఎవ్వడు పోవుచుండియు పోవనివాడైయున్నాడు? ఎవడు నిలువకుండియు నిలచియున్నాడు? ( లేకుండియును ఉన్నాడు ) ఎవడు చేతనమయ్యును రాతితోసమానుడై యున్నాడు? ఎవడు ఆకాశమునందు చిత్తరువువ్రాసెను? సన్నగివిత్తనమునందు మహావృక్షము ఇమిడియున్నట్లు ఏ అణువునందు సర్వప్రపంచములు నున్నవి? అలలు మొదలగునవి సముద్రజలములకంటె భిన్నముకానట్లు ఈసర్వప్రపంచమును

ఎవనికంటె భిన్నముకాదు? జలమునకంటె ద్రవత్వము వేరయ్యు వేరుకా నట్లు భిన్నముగానున్నను (జగద్బ్రహ్మము) ఎవనికంటె వేఱుకాదు? ఓరాజ మంత్రులారా! మీరలు బుద్ధిచేత విచారించి ఈప్రశ్నములకు ఉత్తరమును చెప్పలేకపోతిరేని అప్పుడు ఈరాక్షసియొక్క ( కర్కటియొక్క ) జఠరాగ్నికి కట్టెలయ్యెదరు. దీనికి ఏమాత్రమును ఆలస్యము ఉండదు. నాకు ఇచ్చట నడ్డమువచ్చువారలు ఎవరును లేరు.

—* కర్కటి ప్రశ్నములకు మంత్రి ఉత్తరమిచ్చుట. *—

ఈవిధముగ నమ్మహారణ్యమునందు అర్ధరాత్రమున రాక్షసకన్య లోకోత్తరములగు ప్రశ్నలనడుగగానే దానికి మంత్రి ఇట్లని యుత్తరము చెప్పెను. ఓరాక్షసకన్యా! నీవు పరిపూర్ణ బ్రహ్మజ్ఞానికి బోధచేయదగిన వాక్యరచనచేత పరబ్రహ్మమునే వర్ణించితివి. ఈపరబ్రహ్మమే ఆకాశమునకంటె మిక్కిలి సూక్ష్ముడగుటచేత పరమాణువని చెప్పబడుచున్నాడు. ఆయనకు నామములేదు. లోకమునందు రూపము, గుణము, పని, మొదలగునవి యుండిననేగాని ఏవస్తువునకును పేరుపెట్టుటకు వీలులేదుగదా. అట్టి గుణాదులు ఈపరబ్రహ్మమునకు ఎట్లుచూచినను లేవు. మఱియు రూపాదులు లేనివాడగుటచేత ఆయన, ఏ ఇంద్రియములకును గోచరుడుకాడు. ఇట్లున్నను శ్రోత్రము మొదలగు జ్ఞానేంద్రియములయందును మనస్సునందును ఉండుటచేత అనగా నవిచేయు జ్ఞానరూప వ్యాపారములకు అన్నిటికిని ఆధారభూతుడగుటచేత ఆయనకు శుద్ధవిజ్ఞానమే స్వరూపము. భ్రాంతివలన ఆయననే అనేకజీవులనుగా చూచుచున్నారు. ఇట్టిజ్ఞానరూపమగు పరమాణువునందే ( ఆత్మయందే ) సంకల్ప బలమువలన "వాయుబలమువలన సముద్రమునందు నీరుబుగ్గలవలె" అనేక బ్రహ్మాండములు ఉత్పన్నములై స్థితిసంకల్పము (నిలువవలయును అనుసంకల్పశక్తి) నశింపగానే అణగిపోవుచున్నవి. అంతవరకును అందేయున్నట్లును దోచుచున్నవి. మఱియు తనకంటే వెలుపల ఏపదార్థమును లేకుండుటవలనను, తనలో సర్వపదార్థములను ఇముడ్చుకొని యుండుటవలనను, ఆబ్రహ్మమే ఆకాశమగును. అనగా ఆకాశమువంటిదగును. ఈభూతాకాశముగూడ పైనవర్ణించినట్లే లోకదృష్టికి తనకంటే ఇతర బాహ్యపదార్థము ఏదియును లేనిదియును సర్వపదార్థములను దనయందే నిలుపుకొనినదియునై యున్నది కదా. జ్ఞానమే స్వరూపమగుటచేత ఆపరబ్రహ్మమునకు ఆకాశధర్మము లేవియును లేవు. కావున బ్రహ్మము ఆకాశముకాదు. ఇదియునుగాక ఆబ్రహ్మమును నిర్దేశించుటకు వీలుకాదు.

కావున ఆయన ఏమియుంగాడు. సర్వపదార్థములయందును సత్తారూపముతో ( ఉండుటయను స్వరూపముతో ) నుండువాడు గావున ఒకానొక పదార్థముగగూడ నున్నాడు. సర్వపదార్థములతోను అనగా సమీపమునందున్నవానితోను దూరమునం దున్నవానితోనుగూడ సంబంధపడి యుండుటచేత ఆపరబ్రహ్మయే సర్వప్రదేశములకును బోవుచున్నవాడగును. స్వాభావికముగ చాంచల్యము లేనివాడగుటచేత ఎచ్చటికిని బోవువాడు కానేరడు. ప్రకాశమే అనగా జ్ఞానప్రకాశమే స్వరూపముగా గలవాడగుటచేత ఈయనయే చైతన్యరూపుడు. తనకంటె అన్యమగు పదార్థము లేకుండుటచేత (తనకు దెలిసికొనదగినది ఏమియు లేదుకావున) ఆయనయే పాషాణసమానుడు. ఆపరబ్రహ్మయే పరిశుద్ధమై ఆకాశరూపమై యున్న తనయందు ప్రపంచమను చిత్తరువును వ్రాయుచున్నాడు. చిన్మాత్రమగు ఆబ్రహ్మమునందే ప్రపంచము పుట్టుచు నశించుచునున్నది. అనుటచేత " సృష్టికిపూర్వము ఇదియంతయును ఆబ్రహ్మమునందే వాసనామాత్రరూపమున నిలచియున్నది " అని ఇదివరకే చెప్పినట్లయ్యెను. మఱియును ఈ ప్రపంచమంతయును సత్తామాత్రమే. జ్ఞానమాత్రమే. కావున సముద్రమునకంటె అలలు భిన్నములు కానట్లు ఆపరబ్రహ్మమునకంటె భిన్నముకాదు. భేదమనునదీ గూడ జ్ఞానమాత్రమే యగుటచేత నీటికంటె తడి వేరుకానట్లు ఆపరమాత్మకంటె భిన్నముకానేరదు. ఈవిధముగ మంత్రిచెప్పినవాక్యములను విని యాకర్కటి ఇట్లనియె. ఓరాజా! నీమంత్రి పరమార్థమును బాగుగ వివరించి చెప్పెను. ఓకమలనేత్రా! మహారాజా! ఇక నీవు మాటలాడుము.

—* కర్కటిప్రశ్నలకు రాజు ఉత్తరమిచ్చుట. *—

ఓకర్కటీ! జాగ్రత్, స్వప్నము, సుషుప్తి, అను మూడవస్థలయందును కార్యకారణరూపమగు ప్రపంచముతోచును. జాగ్రత్స్వప్న ప్రపంచములయందు అజ్ఞానకార్యములగు పశుపక్ష్యాదులు గానవచ్చును. సుషుప్తియందు సర్వకారణమగు అజ్ఞానముమాత్రమే తోచుచుండును. ఇట్టి అవస్థాత్రయమునందును భ్రాంతివలన దోచు కార్యకారణ ప్రపంచము సంపూర్ణముగ గోచరముకానప్పుడు అనగా తద్విషయభ్రాంతి సంపూర్ణముగ నశించినప్పుడు మాత్రమే ఆతత్వరూపము నెఱుగవచ్చునని పెద్దలు చెప్పుదురు. సర్వసంకల్పములను పరిత్యజించి మిక్కిలి నిర్మలమైయున్న మనస్సు మాత్రమే ఆపరమాత్ముని దెలిసికొనును. ఆసర్వవ్యాపకుని సంకోచ వికాసములచేతనే క్రమముగ ప్రళయసృష్టులు జరుగుచున్నవి. ఎప్పుడు జీవ మనో

హంకారాది రూపములతో ఆబ్రహ్మము విస్తరించునో అప్పుడు సృష్టి. ఎప్పుడు అట్టివికాసము లేదో అదియే ప్రళయము. చిత్తరువులు వ్రాయబడి యున్న వస్త్రము మడవబడినచో అందున్న ప్రతిమలు కానరావు. తెరువబడినచో ఆప్రతిమలు కానవచ్చును. ఇట్లే బ్రహ్మముగూడ మనోవిజృంభణ ఉన్నప్పుడు ప్రపంచరూపముతో గానవచ్చును. లేనప్పుడు కానరాదు. మఱియును ఆబ్రహ్మము సర్వ వేదాంత వాక్యములకును లక్ష్యభూతుడు. పరమతాత్పర్యమగువాడు. గుణము మొదలగునవి ఏవియు లేకుండుటచేత వాక్కులకు అగోచరుడు. అనగా “ ఇట్టివాడు ” అని చెప్పుటకు వీలులేని వాడు. కోటిబ్రహ్మాండములు ఈవలను కోటిబ్రహ్మాండములు ఆవలను గలిగి ఈప్రపంచము ( బ్రహ్మాండము ) ఆబ్రహ్మయొక్క మధ్యమునందు ఉన్నది. అంతయు సంకల్పమయమే. కావున ఇది స్వయముగగూడ రెండుకోట్ల బ్రహ్మాండములు స్వరూపముగాగలిగి యున్నది. సర్వమును భ్రాంతిమయమే. కావున ప్రతిజీవునియందును అనేక బ్రహ్మాండములు ఉన్నవికదా. ఈవిధముగ అతివిచిత్రమైన ఈప్రపంచసృష్టి ఆపరబ్రహ్మముయొక్క సంకల్పమాత్రమే. క్రీడామాత్రమే. మఱియు నానాభేదములతోగానవచ్చుచున్న ఈప్రపంచమంతయును స్వస్వరూపమును గలిగియున్నను ఇదియంతయు భ్రాంతిమాత్రమే. కావున ఆపరబ్రహ్మముయొక్క స్వాభావికమైన అపరిచ్ఛిన్నరూపమునకు (అనగా స్వభావసిద్ధమై దేశ కాల వస్తువులచేత విభాగము నొందని అనగా ఒకదేశమున నుండి మఱియొకచోట లేకుండుట ఒకప్పుడు ఉండి వేఱొకప్పుడు లేకుండుట, ఒకపదార్థమునందు ఉండి మఱియొక పదార్థమునందు లేకుండుట, అనునదిలేని) హానిలేదు. ఓశుభకరురాలా! కర్కటీ! ఇట్టి పరబ్రహ్మమే నీసర్వప్రశ్నములకును ఉత్తరము. నీవును బహువిధములుగ సత్తామాత్రుడగు ఆపరబ్రహ్మమును గూర్చియే ప్రశ్న చేసితివి. అనిచెప్పెనని వశిష్ఠమహాముని శ్రీరామునితోచెప్పి మఱియునిట్లనియె.

ఓరఘుకులసార్వభౌమా ! ఈవిధముగ రాజుపలికిన వాక్యములను విని అడవికోతివంటి యాకర్కటి బ్రహ్మస్వరూపానుభవముచే నిశ్చలమై నిలచెను. ఒకవిషయమునందు అభిరుచిగలవారికి ఆవిషయమును గూర్చిన ప్రస్తావము వచ్చెనేని మనస్సు పరవశమగుట సహజముకదా. ఇట్లు శాంతమై మాత్సర్యమునుగూడ వదలెను. వర్షాకాలమునందలి నెమలివలెను. వెన్నెలుగల రాత్రులయందలి కలువతీగవలెను, లోపల ( మనస్సునందు ) చల్లదనమును పొందెను. విశ్రాంతిని చెందెను. అప్పుడు దానికి ఆకలివలన

కలిగిన తాపముకూడ తెలియలేదు. ఇట్లు పరమాహ్లాదమునొంది యారా
క్షసి వారికి ఇట్లనియె.

ఓరాజమంత్రులారా! ఆహా, మీబుద్ధి యెంతపవిత్రమైనది. బ్రహ్మజ్ఞాన
మను సూర్యుడు సంపూర్ణబలముగలిగి తనదివ్యకాంతిచే దానిని ప్రకాశింప
జేయుచున్నాడు. జ్ఞానవంతులగువారు సర్వజనులచేతను పూజింపబడ దగిన
వారు. నాబోటి రాక్షసులకుకూడ మీవంటి మహాత్ములు సేవనీయులేయని
దృఢముగ చెప్పగలను. మహాత్ముల సంబంధమాత్రముచేత సర్వదుఃఖము
లును తొలగును. రెండవమారు మఱల నాశింపవు. ఇట్టివారలు ఎవనిచేత
తిరస్కరింపబడుదురు. దీపముచేతనుంచుకొనినవాడు చీకటిచేత తిరస్క
రింపబడడుగదా. కావున మీరు నాకు అతిథులై ఈయరణ్యమునకు వచ్చి
తిరి. భూలోక భాస్కరులరగు మిమ్ములను నేను అవశ్యముగ పూజింతును.
ఓశుభులారా! మీయిష్టమును శీఘ్రముగ దెలుపుడు అనిన రాజు ఇట్లనియె.
ఓరాక్షసకులమను నరణ్యమునకు పూగుత్తివంటిదానా! (వృక్షమునందు గల
సర్వావయవములకంటె పుష్పము ఎట్లు శ్రేష్ఠమైనదో అట్లు రాక్షసకులము
నందు శ్రేష్ఠురాలా ) నీవు కోరికలను తెలుపమంటివి. కావున నొకటి ప్రా
ర్థించెదను. ఈదినము నుండియు నీవు ఏభూతములనుకూడ హింసింపగూడదు.
అని రాజు పలికిన సంతోషించి అడవికోతివంటి యాకర్కటి ఇట్లనియె.

ఓమహారాజా! నీయిష్టముచొప్పున నడచుకొనియెదను. ఈదినము మొ
దలుకొని ఏప్రాణినిగూడ హింసింపను. ఓప్రభువా! ఇది యథార్థము. అనిన
రాజు ఇట్లనియె. మఱియొకవిషయము. ఓకమలలోచనా! నీవు పరుల దేహ
ములనుమాత్రమే భుజించు స్వభావము కలదానవుగదా? ఇట్లుండి ఇప్పుడు
నాఇష్టము చొప్పున ప్రాణిహింసను మానితివేని ఇక శరీరపోషణమును
ఎట్లుగాపించెదవు. ఏయాహారము భుజించెదవు. అనిన కర్కటి రాజుతో
ఇట్లనియె.

ఓభూపాలా! నేను ఇంతకుపూర్వము చిరకాలము నిర్వికల్ప సమా
ధియందే నిలచియుంటిని. అప్పుడు నాకీభోజనవాంఛ లేదు. పిమ్మట సమా
ధినుండి మేల్కొనగానే నాకిట్టియాకలి పుట్టినది. కావున నేను దీనినొక
లెక్కసేయను. ఇదివరకు తపస్సును ఆచరించియున్న హిమవత్పర్వతశిఖర
మునందే జేరి పూర్వమువలెనే నిర్వికల్ప ధ్యానమును బూని జీవముతోగూ
డిన ప్రతిమయట్లు నిలచియుందును. అది (ఆసమాధి) పరమానందకరము
కదా, కావున ఆసమయమున వేరేవిమియును దోచదు. ఒకమారు మేలకువ

వచ్చిన మతియొకమారు దానినే అవలంబించుచు యథేష్టముగ నిలిచియుం డును. ముఖ్యముగ "పరమాత్మ సర్వవ్యాపకుడు. ఆయనకంటే భిన్నమగు నది ఏదియులేదు" అని తెలిసికొనినదానను కావున తృప్తినొందు నంతవ రకు పరులహింసింపను. అట్లు హింసించుటయు అయుక్తమే. అనగా నాస్థి తికి తగనిదియేకదా. సమాధియందే యుందును. కావున నాకు అట్లు హిం సింపవలసిన అవసరముకూడ నుండదు. ఆకలి అనునదియే అప్పుడు తెలియ రాదుకదా. ఓశ్రీరామచంద్రా! ఇవ్విధముగ మచ్చికతో నారాక్షసి రాజ మంత్రులతో మాటలాడి హిమవత్పర్వత శిఖరమునకుబోవ ప్రయాణము కాగానే ఆవిక్రమభూపాలుడు ఆరాక్షసితో నిట్లనియె.

ఓకర్కటీ! నీకును మాకును స్నేహము కుదిరినది. దీనిని వ్యర్థము చేయకుము. చూచినంతమాత్రముచేతనే సత్పురుషులకు అనురాగము అభి వృద్ధి యగుచుండును గదా. ఇప్పుడు మేముకోరినది ఏమనిన? నీవు మమ్ము విడచి హిమవత్పర్వత శిఖరమునకు బోవుట మాకిష్టములేదు. కావున ఓశు భకరురాలా! సామాన్యమైనట్టియు, శుభలక్షణములతో గూడినట్టియు, సుందరమైనట్టియు, రూపమును ధరించి మాయింటికి రమ్ము. అచ్చట సుఖ ముగ నుండవచ్చును.

—* కర్కటి రాజగృహము చేరుట. *—

ఓరామచంద్రా! ఈప్రకారముగా రాజుచెప్పగానే ఆరాక్షసి ఇట్ల నియె. ఓరాజా! నీఇష్టమునకు నేను అడ్డముచెప్పను. నాకుసరియైన ఆహా రము నియ్యగలవా? రూపము సామాన్యస్త్రీరూపసమమైనను రాక్షసిజాతి లో చేరినదానగుగు నన్ను దేనితో తృప్తిపరుపగలవు. నాకు రాక్షసులు తినునట్టి మనుష్యమాంసాది ఆహారమే తృప్తికరమైయుండునుగాని, సామా న్యులు భుజించు ఆహారము తృప్తికరమైయుండదు. జన్మాదినుండియు లేక జాతిననుసరించి వచ్చిన స్వభావము దేహపాతమువరకు విడువదుగదా. అనిన రాజిట్లనియె. నీవనినది నిశ్చయము. అయినను సువర్ణ భూషణముల తోను పుష్పమాలికలతోను, అలంకరింపబడి సుందర స్త్రీరూపముతో నీకోరినంతవరకు కొన్నిదినములు సామాన్యమైన ఆహారమునే భుజించుచు నాయింటనుండుము. పిదప చోరులు మొదలగు దుష్టులను, లోకనాశకులను, నారాజ్యమునుండియు ఇతరరాజ్యములనుండియుగూడ రప్పించి నీకు ఆహార ముగా ఇచ్చెదను. అట్టిదుష్టులు సంహరింప దగినవారే కదా. నీవును స్త్రీ రూపమును వదలి అప్పుడు రాక్షసి రూపముతో వారల నందరిని హిమవ

త్పర్వత శిఖరమునకు గొనిపోయి అచ్చట భుజింపుము. అధికమగు ఆహారమును భుజించువారికి ఏకాంతస్థలమునందు భుజించుటయే గదా సౌఖ్యము. ఇట్లు కొంత ఆహారమునుగొని నిదురించి పిదప సమాధిని జెందుదువుగాక. మఱల ఎప్పుడైనను సమాధియందు లీనమైన చిత్తము ప్రపంచమునకు అభిముఖమగునేని అప్పుడు మఱల నాగృహమునకు రమ్ము. చంపదగినవారలను మఱికొందఱిని గొనిపొమ్ము. దుష్టులను హింసించుట ప్రపంచమును ఉద్ధరించుటయే యగుటచేత ధర్మమేయగును గాని, హింసకానేరదు. మఱియు నీకు అనగా నీజాతికి మనుష్యభోజనము స్వభావ నియతమైనది. కావున నీవు చేయు హింసయు హింసకానేరదు. అందులోను ఎవనినవని వానిని భుజించు స్వభావముగల నీవు దుష్టులను మాత్రమే హింసించు చుండిన నది దయయే అగును. కావున నోరాక్షసీ! ఈసమయమునందు మాత్రమే కాక, సమాధినుండి మెలకువవచ్చినప్పుడంతయును అవశ్యముగ నాయొద్దకు వచ్చుచుందువుగదా. దుష్టులైనను ప్రేమగలిగిన పిదప ఒకరినొకరు విడువరు. ఇట్లుండగ ఈవిషయములో సంశయింపవలసిన పనియేమి. అని ఇట్లు పలుకగానే ఆరాక్షసి ఇట్లనియె.

ఓరాజా! నీమాట మిగుల యుక్తముగనున్నది. నేను నీయిష్టముచొప్పున నడుచుకొనియెదను. పరిపూర్ణమగు ప్రేమతో ప్రవర్తించుచున్నవానియొక్క వాక్యములను ఎవ్వడు నిరాకరించును. అని మఱియు వశిష్ఠుడిట్లనియె. ఓశ్రీరామచంద్రా! ఇట్లు రాజుయొక్క అభిప్రాయమును అంగీకరించి కామరూపిణియగుటచేత మనోహరమైన స్త్రీరూపమును దాల్చి "ఓరాజా రమ్ము పోవుదము" అనిపలుకుచు నారాక్షసి ప్రయాణమాయెను. అంత ఆరాజును మంత్రియును,కర్కటియును,ఆరాత్రియందే ఆఅరణ్యమును విడచిరి. ఇట్లుచని చని వారు మువ్వురును రాజగృహము ప్రవేశించిరి. అచ్చట నొకమనోహరమగు ప్రదేశమునుజేరి మాటలతోనే ఆరాత్రిని గడపిరి.

— { కర్కటిరాజాజ్ఞచేత పగలుస్త్రీరూపముతోనుండి రాత్రి దుష్టులహింసించుచు విహరించుచుండుట. } —

ఓరామచంద్రా! అంత సూర్యోదయము కాగానే ఆరాక్షసి యొకముత్తైదువవలె అంతఃపురముననుండెను. రాజు మంత్రియును తమతమకార్యములను జేయుటకుబోయిరి. ఈవిధముగ ఆరుదినములు గడచెను. ఇంతలో ఆప్రభువు తనరాజ్యమునుండియు సామంతరాజ్యములనుండియు మిత్రమండలములనుండియుగూడ వధింపదగిన దుష్టులను మూడువేలమందిని సమ

కూర్చి వారిని ఈరాక్షసికి ఆహారముగ నిచ్చెను. పిదప రాత్రికాలమున
ఆకర్కటి స్త్రీరూపమును వదలి అతిఘోరమగు రాక్షసీరూపమును దాల్చి
వారలనందఱను ఒక్కమాఱే భుజముమీద నిముడ్చుకొని రాజును వీడ్కొని
హిమవత్పర్వత శిఖరమునకు బోయెను. అచ్చోట వారినెల్ల భుజించి కొం
తసేపు నిదురించి సమాధిని ఆశ్రయించెను. ఓరఘురామా! అప్పటినుండి
యు సమాధినుండి మేలుకువ వచ్చినప్పుడెల్లా ఆరాక్షసి కిరాతదేశమునకు
వచ్చుచును అచ్చట ప్రభువుచేత తనకై ఏర్పరుపబడిన చంపదగినవారలను
ఆహారార్థమై గొనిపోవుచుండును. తృప్తినిజెందినపిదప నిదురించి మఱల
మఱల సమాధిని అవలంబించుచుండును. వచ్చినప్పుడెల్ల కొన్ని దినములు
స్త్రీరూపముతో రాజుయొక్క అంతఃపురమున నివసించుచు ఒకానొక
రాత్రి పూర్వరూపమును దాల్చి తనయాహారమును గొనిపోవుచుండును.
ఈవిధముగ నాకిరాతరాజ్యమునందు నేటికిని జరుగుచునే ఉన్నది.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షిప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉత్పత్తిప్రకరణమున - సూచ్యుపాఖ్యానమను
ఏడవసర్గ ముగిసెను.

ఓభరద్వాజా! ఈవిధముగ కర్కటీ ఉపాఖ్యానమును వివరించి
చెప్పి వశిష్ఠమహాముని శ్రీరామునిజూచి ఇట్లనియె. ఓరామచంద్రా! సూది
యొక్క వృత్తాంతమునంతయును వివరించిచెప్పితినికదా. దీనిచేత “ఎప్పటి
కిని ఆత్మ ఒక్కడే ఉన్నాడు. సంసారము ఎప్పటికిని లేదు. ఇదియంతయు
వట్టిభ్రాంతియే.” అను విషయము స్పష్టము చేయబడినదికదా.

—* ఐందవోపాఖ్యానము. *—

ఓరామచంద్రా! సృష్టికాలములయందు బహువిధ రూపములతో
అనగా ప్రస్తుతము మనకు గానవచ్చుచున్న సర్వరూపములతోను దోచు
నది మనస్సే. మఱేమియుకాదు. ఈవిషయము తేటపడుటకై ఐందవోపా
ఖ్యానమును వినుము. అది మిక్కిలి రమ్యమైన ఇతిహాసము. దానిని బాగుగ
వివరించి చెప్పెదను. దానిని వినినచో “ఈప్రపంచము మనస్సునకంటె
భిన్నము కాదు” అనువిషయము దృఢమగును. చిత్తమను బాలుడు తెలివి
లేనప్పుడు, లేక, తెలుపబడని సమయమున అనగా “ఈప్రపంచము సత్య
ము కాదు. ఉన్నట్లు తోచుటయే కాని, దీనియందు ఈస్వరూపమునకంటె

భిన్నమగు పదార్థము కించిత్తైనను లేదు. ” అని తెలియజేయ బడనప్పుడు ప్రపంచమను నీభూతమును చూచును. తనకంటే భిన్నమునుగా దలంచును. అట్లుగాక ఎప్పుడు జ్ఞానము ఉదయించునో అప్పుడు సర్వమును స్వస్వరూప మాత్రమునుగా జూచును. స్వస్వరూపము పరబ్రహ్మమే. కావున సర్వమును పరబ్రహ్మమయమునుగ నవలోకించును. బాలుడు అజ్ఞానదశయందు తననీడను చూచి భూతమని తలంచునట్లు ఈచిత్తము ఇప్పుడు తనరూపమునే ప్రపంచమునుగా దలంచుచున్నదికాని, మఱేమియు లేదు. కావున జ్ఞానము కలుగుట ఒక్కటియే ఆవశ్యకము. తత్క్షణమే పెద్దలచేత బోధింపబడిన బాలుడు భ్రాంతినివదలి “ ఇది నానీడ నాస్వరూపమే. భూతము కాదు ” అని తెలిసికొనునట్లు ఈమనస్సుకూడ “ ఇది నారూపమే ప్రపంచముకాదు ” అని తెలిసికొనును. ఇంతేల? అనురాగము, ద్వేషము, కామము, క్రోధము, మొదలగు దుర్గుణములతో ఎప్పుడు గూడియుండునో అప్పుడు ఆమనస్సే సంసారమని చెప్పబడును. ఆగుణములు లేనప్పుడు అదియే మోక్షమనియు జెప్పబడును. రాగాది దోషములు భేదబుద్ధి అనగా “ తానువేఱు ప్రపంచమువేఱు అనుబుద్ధి ఉన్నప్పుడే కాని, కలుగవు. అభేదబుద్ధి అనగా “ ఇది తన స్వరూపమునకంటే భిన్నముకాదు ” అను బుద్ధి కలిగిననేకాని, నివర్తింపవు కదా. ఒకానొకప్పుడు సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు పగలంతయు సృష్టించి రాత్రికాగానే ఆవ్యాపారమును చాలించి నిదురించెను. అంత క్రమముగా ఆరాత్రియు గడచిపోయెను. పిదప ఆబ్రహ్మయు మేలుకొని సంధ్యావందనాది కృత్యములను యథావిధిగా చేసి ప్రజలను సృజించు ఉద్దేశముతో విశాలమైన ఆకాశముతట్టు దృష్టించిచూచెను. ఇట్లు నిర్మలమైన చిత్తముతో జూడగానే అచ్చట అనేక ప్రపంచములు గానవచ్చెను. అవి బాగుగావిభాగింపబడి తనయొక్కవ్యాపారములను జక్కగా నాచరించుచు నుండెను. తాను సృష్టించునంతవరకు లయావస్థయందే యుండవలసినవై యుండగా చక్కని స్థిత్యవస్థలోనుండెను. ఇట్లు తన నిర్మలచిత్తముచేత నాబ్రహ్మాండములనుజూచి ‘‘ ఇదియేమి? నేను నిదురించు కాలమునందు ప్రపంచము లయమునొంది యుండునుకదా. అట్టి ప్రపంచము నేను సృష్టిని ఆరంభింపకమునుపే ఎక్కడనుండి వచ్చినవి ” అని మిక్కిలి ఆశ్చర్యపడెను. ఇట్లు పరమాశ్చర్యముతో బహుకాలము విచారించి విచారించి పిమ్మట తన మనశ్శక్తిచేతనే యాప్రపంచసమూహమునుండి ఒక సూర్యునిరావించి ఇట్లని ప్రశ్నచేసెను.

ఓ భగవంతుడా! మహాప్రకాశము గల సూర్యదేవా ! నీవెవ్వడవు? ఇదియంతయును ఎట్లుకలిగినది. ఓ దోషరహితుడా ! నీవు ఎరుగుదువేని సవిస్తరముగ నాకు వివరించి చెప్పుము. ఇట్లు బ్రహ్మదేవుడు తన్ను అడుగగానే యాసూర్యుడును భక్తిచే వినయముగలవాడై యమ్మహాత్మునకు నమస్కరించి సవినయముగ నిట్లనియె. ఓ ప్రభువా ! బ్రహ్మదేవా ! ఈకనబడు సర్వప్రపంచమునకును నీవే కారణభూతుడవు. ఇట్టి నీకు దీని ఉత్పత్తికి కారణము తెలియకుండునా? నన్ను ప్రశ్నింపనేటికి? ఓ సర్వవ్యాపకుడా ! దీనివృత్తాంతమును నావలననే వినవలయునని మీకు వేడుకగలదేని విన్నవించెదను. ఇంతకంటే నాకు అనుగ్రహ మేదికావలయును. వాస్తవస్థితిలో నా ఉత్పత్తియు ఈప్రపంచములయొక్క ఉత్పత్తియు తలవనితలంపుగనే కలిగినది.

—✻ నవీనసృష్టివృత్తాంతము. ✻—

ఓ బ్రహ్మదేవా! జంబూద్వీపమునందు ఒకమూల కైలాసపర్వతము క్రింద సువర్ణజట అను ఒకరాజ్యము కలదు. అది మిగుల సుఖకరమైనది. దానిని మీపుత్రులగు మరీచ్యాదులే కల్పించిరి. వారును దానినే తమకు నివాసముగగూడ నేర్పఱచుకొని యుండిరి. ఆదేశమునందు మిక్కిలి ధర్మాత్ముడగు ఇందువను నొక బ్రాహ్మణుడు కలడు. ఆయన మిక్కిలి శాంతమూర్తి. కశ్యపునియొక్క వంశమునందు పుట్టినవాడు. ఆబ్రాహ్మణునకు ప్రాణసమానురాలగు ఒకభార్యయుండెను. అట్లుండినను "చవిటినేలయందు చెట్టు పుట్టనట్లు" వారలకు సంతానము లేకుండెను. ఇట్లుండుటచేత మిగుల ఖిన్నులై తపస్సుచేత సర్వమును సాధింపవచ్చునని తపోనిష్ఠులకై కైలాసపర్వతమునందు ఒక ఏకాంతస్థలమున జేరిరి. అచ్చట వృక్షములవలె జలమును మాత్రమే ఆహారముగా త్రాగుచు పరమేశ్వరుని ఉద్దేశించి ఘోరమైన తపస్సును ఆచరించిరి. ఈవిధముగా వారు తపస్సు చేయుచుండగ దానికిచంద్రశేఖరుడగు ఈశ్వరుడు సంతసించి ప్రత్యక్షమాయెను. ఇట్లు ప్రత్యక్షుమై "ఓ బ్రాహ్మణుడా! నీఅభీష్టమును వేడుము. నీతపస్సునకు మెచ్చితిని " అని యానతిచ్చెను. ఇట్లు ప్రసన్నుడు కాగానే ఆబ్రాహ్మణుడు ఇట్లని ప్రార్థించెను. ఓమహాదేవా! మాదుఃఖమును తీర్చుటకు ఇష్టము కలదేని నాకు పదిమంది పుత్రులను అనుగ్రహింపవలయును. అనిన నాశంకరుండును సరియే అట్లనే కలుగుదురుగాక. అని చెప్పి అంతర్ధానము నొందెను. ఆదంపతులును తాముకోరిన వరలాభమువలన సంతుష్టులైగృహమునుచేరిరి. పిమ్మట

కాలక్రమమున నాబ్రాహ్మణునిభార్య పదుగురు కొడుకులను క్రమక్రమ
ముగ ప్రసవించెను. ఆబాలురును కాలక్రమమున సర్వశాస్త్ర పారీణులై
అభివృద్ధినొందిరి. తర్వాత కొంతకాలమునకు నాదంపతు లిద్దరును దేహ
మును పరిత్యజించి సద్గతికిపోయిరి. సత్కర్మములనే యాచరించుచు శ్రేష్ఠ
మగుగతికి దగినప్రయత్నములను జేసిరి. కావున వారికి శ్రేష్ఠమగు స్థానమే
దొరికెను. ఇట్లు తల్లితండ్రులు మృతినొందగానే ఆబాలురు పదుగురును
అతిదుఃఖముతో తమ గృహమునందుండజాలక కైలాసపర్వత శిఖరమును
జేరిరి. ముఖ్యబంధువులు లేకుండుటచేత ఏమియుదోపక భయమునొంది
ఇట్లనివిచారింపసాగిరి. ఆహా, ఈలోకమునందు ఏది శ్రేయస్కరమైయుండు
ను. దేనివలన సర్వదుఃఖములును తొలగును. "సంపదయుండిన సర్వమును
సుఖకరమగునుగదా" అనితలంచినను మనసంపద ఎంత. రాజ్యాధికార
ప్రభువునకు మనకంటె అధికసంపద కలదుగదా. రాజ్యాధికారముగలవా
డే యైనను పరిపూర్ణసుఖము కలుగదు. ఆరాజునొక్క సంపదమాత్ర
మెంత. వానికంటె సర్వవిధముల అధికుడు మండలాధిపతి కలడుకదా. అట్టి
మండలాధిపత్యము వచ్చినను కొరతతీరునట్లుండలేదు. వారందఱికంటె అధి
కుడు చక్రవర్తియున్నాడు. ఆతడే సర్వాధికుడనిన ఆతనికంటె మహదైశ్వ
ర్యముగల దేవేంద్రుడు ఉన్నాడు. ఆతనిసంపదయే గొప్పది అనిన అది
బ్రహ్మదేవునియొక్క ఒకముహూర్తకాలమున నశించిపోవునది. ఈవిధముగ
ఎప్పటికిని పరిపూర్ణత్వమనునది లేకుండుట అటుండ కల్పమధ్యముననే వినా
శమునుగూడ నొందునట్టి సంపద శుభకరమైన దెట్లగును. ఇట్లందరును ఆలో
చించుచుండ వారలలో పెద్దయగు బ్రాహ్మణకొమారుడు ఇట్లనియె.

ఓతమ్ములారా! నాకు బ్రహ్మత్వము మంచిదని తోచుచున్నదీ. బ్రహ్మ
గానుండిన యెడల ఆఐశ్వర్యము ప్రళయకాలమువరకు అనగా వేయిమ
హాయుగములు ఒకపగలు. రాత్రియునంతయే. ఇట్టి దినప్రమాణముతో
నూరుసంవత్సరములు గడచునంతకాలము వరకు నశించునదికాదు. అంత
కంటె అధికమగునది మఱిఏదియును లేదు. కావున అన్నియైశ్వర్యముల
లోను ఆబ్రహ్మైశ్వర్యమే నాకు మేలని తోచుచున్నది ఇతర ఐశ్వర్యములపై
నాకు కొంచెమైనను కోరికలేదు. అనిన తక్కినవారలు ఇట్లనిరి. అన్నా!
నీవు చెప్పినమాట మిక్కిలి మంచిది. మాకందఱకుగూడ అదియే ఇష్టము.
దానికి ఉపాయమును దెలుపుము. మనమందఱమును ఒక్కమాటే బ్రహ్మ
లమయ్యెదము. అనిన అన్నయైనవాడు తమ్ములకు ఇట్లనియె.

ఓతమ్ములారా ! ఈపని కష్టసాధ్యముకాదు. సర్వమునకును మనస్సే మూలము. కావున మీరందరును ఏకాంత స్థలములయందు గూర్చుండి “ నేను కమలముపై కూర్చున్నాను. దివ్యతేజోవంతుడగు చతుర్ముఖుడను నేనే. ఆదివ్యతేజస్సుచేత నేనే ప్రపంచమును సృష్టించుచున్నాను. సంహరించుచున్నాను. ” అని ఏకాగ్రచిత్తముతో ధ్యానముచేయుడు. ఇతర సంకల్పములను విడువుడు. దేహాభిమానమును పరిత్యజింపుడు. నేనును అట్లే సర్వమును గావించెదను. అని ఈవిధముగ పెద్దవాడుపలుకగానే వారందఱును ఏకాంతస్థలమును జేరిరి. చిత్తరువున వ్రాయబడిన ప్రతిమలవలె మిక్కిలి నిశ్చలులై మనస్సును బహిర్ముఖము కానీయకుండ నిరోధించిరి. “ నేను సర్వప్రపంచ సృష్టికర్తయగు బ్రహ్మదేవుడను. సర్వకర్మలను ఆచరించువాడను. సర్వసుఖములను అనుభవించువాడను. మహదైశ్వర్య సంపన్నుడను. ఈ ఇంద్రాదులతోను వారికి ఆశ్రయములగు అమరావతి మొదలగు పట్టణములతోను గూడిన ఈపదునాలుగు లోకములును నాచేతనే సృష్టింపబడినవి. నేనును ఆప్రపంచములోనే ఉన్నాను ” అను సంకల్పమొకటితప్ప వారిమనస్సున రెండవతలంపు రాలేదు. ఈవిధముగ వారికి “ నేనే చతుర్ముఖుడను” అను తలంపు ఒకటియే దృఢమైయుండుటవలన పూర్వదేహములపై జ్ఞప్తి తప్పిపోయెను. “ నేను బ్రాహ్మణుడను ” అను తలంపు ఉన్నంతకాలము ఆదేహములపై జ్ఞప్తియుండెను కాని, ఆభావన తొలగినప్పుడు ఆజ్ఞప్తి పోయెను. ఇది అనుభవసిద్ధమే. జాగ్రదవస్థయందు గలస్మృతి స్వప్నావస్థయందు నశింపగానే పురుషునకు “ నాశరీరము పరుండియున్నది ” అనుజ్ఞప్తి పోయి “ నేనుతిరుగుచున్నాను అనగా నా దేహము తిరుగుచున్నది ” అని రెండవజ్ఞప్తి వచ్చుచున్నదికదా. ఈవిధముగా వారు పూర్వశరీరములను మరువగానే ఆశరీరములు గాలికని ఎండకును శోషించి పండిన ఆకులవలె రాలిపోయినవి. ఈవిధముగా ఆపదుగురును ధ్యానించుచుండిన కారణమువలన వారిసంకల్ప ప్రభావముచేత ఈబ్రహ్మాండములు పదియును అగుపడుచున్నవి.

ఓబ్రహ్మదేవా! బ్రహ్మభావన పరిపక్వమగుటచేత వారు పదుగురును బ్రహ్మలైరి. వారి సంకల్ప సంసారములు పదియు చిత్తాకాశమున నిలచియున్నవి. ఈపదిబ్రహ్మాండములును అవియే. నేనును ఆపదింటిలో ఒకదానియందున్న సూర్యుడను. దివారాత్రములను గల్పించువాడను. ఓశ్రీరామా! ఈవిధముగా ఆసూర్యుడు సర్వవృత్తాంతమును చతుర్ముఖునకు చెప్పి తన

నివాసమునకు పోయెను. ఆబ్రహ్మయు దనకార్యములను ఆచరించుటకు ఆరంభించెను.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షిప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉత్పత్తిప్రకరణమున - ఐందవోపాఖ్యానమను
ఎనిమిదవసర్గ ముగిసెను.

---

ఓభరద్వాజా! ఇట్లు ఐందవోపాఖ్యానమును వివరించి వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓదశరథాత్మజా! శ్రీరామా! వినుము. సర్వజగత్తులకును సృష్టికర్త ఈమనస్సే. బాగుగవిచారించిన పరబ్రహ్మముకూడ ఈమనస్సే. లోకమునందు మనస్సుచేసినపనియే పని కాని, దేహముచేసిన పని పనియే కానేరదు. సామాన్యబ్రాహ్మణులై యుండియును ఇందుని పుత్రులగు ఆపదుగురును ధ్యాన సామర్థ్యముచేత బ్రహ్మలైరి. మనస్సుయొక్క సామర్థ్యము ఎంత అధికమైనదియో విచారింపుము. మనస్సుచేత భావింపబడుచుండు కారణమువలననే అనగా "ఇది నేను. నేను నడచుచున్నాను. చూచుచున్నాను." అని భావింపబడుచుండుటచేతనే ఈదేహము దేహత్వమును జెందుచున్నది. అనగా ప్రస్తుతము సామాన్యులు భావించుచున్నట్లు చేతన మగుచున్నది. కావున ఎవనికి ఈదేహభావన అనగా "ఇదియే (దేహమే) నేను" అనుభావన లేదో, వానిని దేహమునకు సంబంధించిన ధర్మములు వృద్ధి నాశము మొదలగునవియును శీతోష్ణాదులును బాధింపవు. యోగియగువాడు సర్వకాలములయందును అంతర్ముఖుడై యుండుటచేత దేహమునకు గలుగుసుఖదుఃఖములను ఎఱుగనేరడు. లోకమునందు దేహాభిమానముగల జాగ్రత్స్వప్నావస్థలయందుమాత్రమే దేహధర్మములు తనవిగా దోచుటయు అనగా "నేను వృద్ధియగుచున్నాను. నాకుచలి" అనితోచుటయు, ఆదేహవాసనలేని సుషుప్త్యవస్థయందు ఏమియు దోపకుండుటయు గూడ ప్రత్యక్షసిద్ధమే కదా. ఈకారణమువలన యోగియు చిత్తమును దేహవాసన లేకుండునట్లు నిగ్రహింప గలుగునేని అప్పుడు దేహమునకు సంబంధించిన సుఖదుఃఖములు ఏవియును అతనిని కొంచెమైన బాధింపవు.

—* కృత్రిమేంద్రోపాఖ్యానము. *—

ఈవిషయమునందు ఇంద్రుడును అహల్యయు అనువారి వృత్తాంతము నిదర్శనమగును. అనినరామచంద్రుడు ఇట్లనియె. ఓభగవంతుడా! వశిష్ఠ

మహాముసీ ! ఇప్పుడు మీరు ఉద్దేశించిన అహల్య ఎవరు? ఇంద్రుడు ఎవ్వడు? ఏమహాత్ముల వృత్తాంతమును వినిన నాకు నిర్మలజ్ఞానము కలుగునో దానిని చెప్పుము. అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె.

ఓరామభద్రుడా! వినుము. మగధదేశమునందు రెండవ ఇంద్రద్యుమ్నుడో అనదగిన ఇంద్రద్యుమ్నుడను ఒకప్రభువు కలడు. ఆప్రభువునకు చంద్రబింబమువలె అతిసౌందర్యవతియగు అహల్యయను ఒకభార్య యుండెను. చంద్రరోహిణులవలె వారిరువురును మహా అనురాగముతో మెలగుచుండిరి. మఱియును అప్పురమునసే ఇంద్రుడను ఒకవిటుడు నివసించియుండెను. వాడు అప్పురమునందలి వ్యభిచారిణులకు మిక్కిలి ప్రియుడు. సర్వవిటులలోను అగ్రేసరుడు. ఇట్లుండగా ఆరాజుభార్యయగు అహల్య ఇంద్ర అహల్యల వృత్తాంతమును కథలవలన నెఱిగి తనపురముననున్న ఇంద్రుడను జారునిపై ఎట్లో మోహముగలది యాయెను. క్రమక్రమముగ వారలకు ఇరువురకును అనురాగము దృఢమయ్యెను. వారిచేష్టలును క్రమక్రమముగ బయలుపడెను. ఇవ్విధముగా నయ్యానురాగము మితిమీరినందున ఆవృత్తాంతము రాజునకు తెలిసెను. అప్పుడు మితిమీరిన అనురాగమును గలిగియుండుట జూచి ఎటులైనను ఆఅనురాగమును నశింపజేయవలయునని ఆఇంద్రద్యుమ్నుడు బహువిధములగు భేదోపాయములతో ఆజ్ఞపెట్టెను. వారి ఇరువురిని ఒకమారు సంపూర్ణమగు తటాకమునందు ఆప్రభువు పడవేయించెను. వారును దానికి మిక్కిలి సంతోషించి నవ్విరి కాని, ఖేదమును ఇంచుకయైనను జెందరైరి. మఱియు ఏనుగకాలికి గట్టివేసి త్రిప్పినను వారికిశ్రమ కలుగలేదు. కొరడాలతో గొట్టినను నొప్పి జనింపలేదు. నిప్పులతో గాల్చినను కందలేదు. మంచురాళ్ళపైనున్నట్లే ఉండిరి. ఇట్లు ఏమిచేసినను కళగందక యథాప్రకారముగనే ఉన్నవారినిజూచి ఆప్రభువు ఇట్లనియె.

ఓదురాత్ములారా! మీరుఏమిచేసినను శ్రమనొందక ఉన్నారేల? అని అడిగిన వారిట్లనిరి. ఓప్రభువా ! మేము ఇరువురమును ఒకళ్ళసౌందర్యము చేత నొకళ్ళము మోహితులమై ఉన్నాము. అతి శ్లాఘ్యమగు నొకళ్ళముఖకాంతిచేత నొకళ్ళము పరవశులమై తన్మయత్వమును జెందియున్నాము. ఈవిధముగ మామనస్సులు అన్యోన్యరూపములతో అనగా నామనస్సు అహల్యారూపముతోను ఆఅహల్యమనస్సు నారూపముతోను పరిణమించి తన్మయత్వమును పొందియున్నది. ఈకారణములవలన మాకు మాయొక్క శరీరములపై ప్రజ్ఞలేదు. ఇట్లగుటచేత మాఅవయవములను ఖండించినను

మాకుబాధకలుగదు. ఓరాజా ! చాలాకాలమువరకు ఒకకోరికయందు నిలచి స్థిరమైయున్న మామనస్సంకల్పమును శరీరమునందు కలుగు బాధలు కొంచెమైనను కదలింపనేరవు. శరీరమెట్లైనను ఆమనస్సు తాను అవలంబించియున్న విషయమును విడచి శరీరమువైపునకు దిరుగదు. సర్వమునకు మనస్సే ప్రధానముగదా. కావున నీవు శరీరమునకు కలిగించిన బాధలన్నియు మాకు తెలియనేలేదు. మేము సర్వకాల సర్వావస్థలయందును అన్యోన్య రూపములతో పరిణమించియున్న చిత్తములు గలిగియున్నాము.

ఓమహారాజా! అతివేగము గలిగి మనస్సు ఏపదార్థమును భావించునో, పురుషుడు ఆపదార్థమునుమాత్రమే చూచునుగాని అన్యములగు దేహాదికార్యములను జూడనేరడు. మఱియు మనస్సుచేత భావింపబడిన ఆపదార్థమే సర్వప్రపంచమయమై ఉన్నట్లు వానికిదోచును. కావున నాకు ప్రపంచ మంతయును అహల్యామయముగానే తోచుచున్నది. అహల్యకంటె ఇతరమగు పదార్థము ఏదియు గానవచ్చుటలేదు. ఇట్లే ఈస్త్రీకిని నాకంటె అన్యము ఏమియు గానవచ్చుట లేదు. మఱియు ఓప్రభువా! సామాన్యములగు శిక్షలనుగూర్చి చెప్పనేటికి? మిక్కిలి అధికమగు మనోబలముగల ఋషులయొక్క శాపములు మొదలగునవియును, అతివేగముతో ఏదియైన ఒక యభీష్టవిషయమును భావించుచు అందు చిత్తము స్థిరమై యుండెనేని అట్టిచిత్తమును, చలింపజేయనేరవు. దీనినిగూర్చి ఇంతజెప్పనేటికి? ఓభూపాలా! ఈవిషయము మీకుగూడ అనుభవములో నున్నదియే. మీరు ఎప్పుడైనా ఒకకార్యమును చేయవలయునని దృఢసంకల్పము చేసితిరేని ఆకార్యమునకు ఎన్నివిఘ్నములు కలిగినను ముగింపక విడచుట లేదుగదా. మీదృఢసంకల్పమును ఆవిఘ్నములు చలింపజేయగలిగినవా? సర్వవిషయములును ఇట్లేయని యూహింపుడు. ఓమహారాజా! మహాత్మా ! ఈశరీరములు అన్నియు కారణములేకయే పుట్టినవి. వీనికిసంకల్పము ఒక్కటియే తప్ప ఇతర కారణములేదు. "నేనుబ్రాహ్మణుడను" అని సంకల్పించిన వానికి బ్రాహ్మణశరీరము తోచును. ఇట్లే "నేను కుంటివాడను" అని సంకల్పించిన కుంటియగు శరీరము తోచును. కావున అరణ్యమునందుండు బహువిధ వృక్షములయందును తీగెలయందును గోచరములగుచున్న తీపు పులుసు మొదలగు నానావిధరసములకును జలము ఒక్కటియే కారణమైనట్లు మనకు తోచు బహువిధ శరీరముల కన్నింటికిని మనస్సు ఒక్కటియే కారణము. కావున ఈస్థూలము దేహమే కాదు. మనోమయదేహమే దేహము. అని

తెలిసికొనుము. ఈదేహమునశించినను మనస్సు తనప్రభావముచేత బహు విధ దేహములను కల్పించి ఇచ్చును. జాగ్రదవస్థయందు ఉన్న దేహాభిమానము అణగగానే స్వప్నావస్థయందు చిత్తము అనేకనూతన శరీరములను గల్పించుచునే ఉన్నదికదా. స్వప్నావస్థయందువలెనే సర్వావస్థలయందు చిత్తము లెక్కలేని దేహములను గల్పింపగలదు. మఱియు చిత్తము నశించెనేని అనగా అన్యాయత్తమై యుండెనేని, లేక, స్వస్వరూప జ్ఞానముచేత బ్రహ్మరూపమును పొందెనేని అప్పుడు ఆదేహము దేహాంతరమును గల్పింపనేరదు. దీనికి నిద్రావస్థయే దృష్టాంతము. మఱియు చిత్తము నశించెనేని శరీరము శరీరములను కల్పింపనేరదు. కావున చిత్తము చింతామణివంటిది. ఈకారణమువలన ఓమహారాజా! చిత్తమును రక్షించుకొనుము. ఈదేహము చిత్తమునుండి వచ్చినదియే గాని, ఏవిధముగను స్వతంత్రమైనదికాదు. దేహము చిత్తము లేక, ఏమియు చేయనేరదు. కావున దానియందలి అభిమానమును విడువుము. ఓరఘురామా! ఈవిధముగ ఇంద్రుడనువాడును అహల్యయును పలికిన వాక్యములను విని కమలమువంటి నేత్రములు గల ఆప్రభువు తనపార్శ్వమునసున్న భరతుడను మునిని జూచి ఇట్లనియె.

ఓభరతమహామునీ! సర్వధర్మములను ఎఱిగిన సౌభాగవంతుడా! వీరు కామాతురులేయైనను, వీరివాక్యములుమాత్రము పరమార్థమును తెలియజేయుచున్న వగుటచేత మనస్సునకు సంతోషమునే గలిగించుచున్నవి. వీరిరువురకును శాస్త్రోక్తములగు శిక్షలన్నియు జరిగినవి. ఇక వీరిని వెడలగొట్టెదము. అనిచెప్పి అట్లుగావించెను.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీతమగు శ్రీజ్ఞానవాశిష్ఠరామాయణమునందు
ఉత్పత్తిప్రకరణమున కృత్రిమేంద్రోపాఖ్యానమను
తొమ్మిదవసర్గ ముగిసెను.

—❋—

ఈప్రకారముగ వశిష్ఠమహాముని చెప్పి మఱియు ఇట్లనియె. ఓరామభద్రా! కథారూపముచేత నీకు మనస్సుయొక్క ప్రభావము నంతయును వివరించితిని. లోకమునందు ప్రతిజీవానికి గల శరీరములు రెండు. అందొకటి మనోమయశరీరము. అది అతిశీఘ్రముగ సర్వకార్యములను నిర్వహింపజాలినది. అతిచంచలమైనది. రెండవది మాంసమయశరీరము. అది ఏమియు జేయగలది కాదు. ఎందుకును పనికివచ్చునది కాదు. అనిచెప్పిన శ్రీరామచంద్రు

డిట్లనియె. ఓమహానుభావా! వశిష్ఠమహామునీ! వాస్తవస్థితిలో మనస్సుజడ మే. ఐనను చేతనమువలె నున్నది. ఇట్టి ఈమనస్సునకు వాస్తవమగు స్వరూపము ఏదియో సవిస్తరముగ దెలియజేయుము. బాగుగ "దీనిరూపము ఇది" అని సంకల్పము దృఢమగునట్లు చేయుము.

— * మనస్స్వరూపము. * —

అని శ్రీరాముడు చెప్పగానే వశిష్ఠమహాముని ఇట్లని మనోరూపమును వివరింప నారంభించెను. ఓశ్రీరామా! పరబ్రహ్మమునకు ఆద్యంతములులేవు. దానికిగల శక్తులకును లెక్కలేదుకదా. ఇట్టి యాపరబ్రహ్మమునకు సంకల్పశక్తిచేత ఏర్పడిన రూపము ఏదికలదో అదియే మనస్సు. "ఇది కలదా లేదా" అను రెండుపక్షములకును నడుమనిలచి సంకల్పాభిముఖముగ అనగా కలదనికాని, లేదనికాని, సంకల్పించుటకు అభిముఖముగ ప్రవర్తించుచు చంచలమైయుండు భావము ఏదికలదో అదియే (సంశయ నిశ్చయములు) మనస్సునకు రూపము. ఇదియునుగాక ఓరామచంద్రా! ఈవిచారముతో మనకు పనియేమి? మనస్సనునది ఒకటి. సర్వానుభవ సిద్ధమైయున్నది. అది ఎట్లో ఒకట్లు ఏదియో ఒకకారణమునుండి పుట్టియుండవలయును. దానినిగూర్చి విచారించినందువలన ప్రయోజనమేమి? అదిచేయు సంకల్పములచేత మనముబద్ధులమై యున్నామనుట అనుభవ సిద్ధమగు అంశము. కావున మనబాధను తొలిగించుకొనుటకు మనము ప్రయత్నింపవలయును. ముక్తికలుగుటకై యాచిత్తమును పరమాత్మయందు స్థిరము చేయవలయును. మోక్షోపాయములగు జ్ఞాన వైరాగ్యాదులయందు దృఢము గావింపవలయును. "వీడు నన్ను హింసించుచున్నాడు" అని తెలిసిన పిమ్మట ఆబాధను తప్పించుకొనుటకు ప్రయత్నించుటయే ఆవశ్యక మగునుగాని వానియొక్క ఉత్పత్తి స్వరూపాదులను విచారించుటతో పనియుండదు. లోకులు అట్లు ప్రవర్తింపరు కదా.

— * చిత్తోపాఖ్యానము. * —

ఓపాపరహితుడా! శ్రీరామచంద్రా! ఈయర్థము తేటపడుటకై నీకు చిత్తోపాఖ్యానమును జెప్పెదను. సావధానుడవై వినుము. దీనిని బ్రహ్మదేవుడు పూర్వమునందు నాకు జెప్పెను. ఒకానొకచోట అతివిస్తారమైనదియు జీవజంతు శూన్యమైనదియు నిశ్శబ్దమైనదియు మిక్కిలి భయంకరమైనదియు నగు మహారణ్యమొకటి కలదు. దాని పరిమాణమును విచారించిన నూరు ఆమడదూరము కూడ ఒక్కమూలకు సరిపోవును. ఆయరణ్యమునందు అతి

భయంకరుడును వేయికన్నులును వేయిచేతులును గలవాడును వికారరూ
పుడు నగు ఒకపురుషుడుమాత్రము నివసించుచుండెను. వాడు వ్యాకుల
మగు చిత్తముతో అన్నివైపులను సంచరించుచుండెను. మఱియు తనవేయి
చేతులయందును ఇనప గదాయుధములను ధరించి తన వీపుమీదనే మోదు
కొనుచు తానేపరుగెత్తుచుండును. ఇట్లు అతిదృఢముగ తనశరీరమును తన
కుతానే బాధించుకొనుచు భయమునొందుచు అనేకయోజనములు పరు
గెత్తుచుండును. తనకుతానే కొట్టుకొనుచున్నాడుగదా, యనిన ఆదెబ్బలు
సామాన్యములైనవి కావు. మిక్కిలి భయంకరములైనవియే. ఈవిధముగ
వాడు ఇటునటు పరుగెత్తుచు రోదనముచేయుచు ఒక్కొక్కచోట కాలుచేతు
లు దెబ్బలవలన తెగిపోవగా శరీరము తెలియక పడిపోవును. ఇట్లు సంచరిం
చుచు ఒకానొక భయంకరమైన కృష్ణపక్ష రాత్రియందు కన్నులుగానక
ఆకాశమువలె మిక్కిలి అగాధమైన ఒకానొక పాడుబావియందు ఒళ్లుతెలి
యక పడిపోయెను. పిమ్మట బహుకాలమునకు ఎట్లెట్లో ఆబావిలోనుండి
లేచి మఱల నాఇనుప గదలతో తన శరీరమును తానే మోదుకొనుచు పరు
గెత్తుచుండును. ఇట్లే మఱికొంతదూరము పోయి అచ్చట భయంకరములగు
ముండ్లతో నిండియున్న కానుగచెట్ల అరణ్యమునందు "అగ్నిహోత్రమున
తానుగానే ప్రవేశించు మిడుతవలె" ప్రవేశించెను. పిమ్మట అచ్చటనుండి
ఒకక్షణమున వెలుపలికివచ్చి మఱల పూర్వమువలెనే మోదుకొనుచు పరు
గెత్తి పరుగెత్తి చంద్రకిరణములవలె మిక్కిలి చల్లనై రమ్యమైయున్న అర
టితోటలో ప్రవేశించెను. నవ్వుచున్నవానివలె మిక్కిలి సంతోషించెను.
అక్కడ ఉన్నంతకాలము వానికి ఏబాధయు లేనట్లే యుండును. అంత
అచ్చటనైనను బహుకాలము ఉండక ఒకక్షణముననే వెలుపలికి వచ్చి
మఱల పూర్వమువలెనే మోదుకొనుటకును పరుగెత్తుటకును ఆరంభించును.
ఇట్లు కొంతదూరము పరుగెత్తి అవయవము లంతయును శిథిలము లగునట్లు
మఱల పూర్వపు పాడుబావియందే పడును. ఈరీతిగా బావినుండి లేచుచు
అరటితోటలోనికి బోవుచు అచ్చటనుండి కానుగతోటను ప్రవేశించుచు
మఱల బావియందు పడుచు లేచుచు అరటితోటకును అచ్చటనుండి కాను
గతోటకును బోవుచు నడుమ నడుమ గదాయుధములతో తనకుతానే
మోదుకొనుచు పరుగెత్తుచుండును. ఈవిధముగ అతివిచిత్ర చరిత్రము
గల అప్పురుషుని కొంతకాలము బలాత్కారముగ ఆగి పట్టుకొని నేను
హితబోధనుచేసితిని.

ఓపురుషుడా! "కొంచెము నిలువుము, కొంచెము నిలువుము." అని హెచ్చరించితిని. "నీవెవ్వడవు? ఇక్కట్లేల చేయుచున్నావు? నీకోరిక యేమి? నిరర్థకముగ పరుగెత్తనేటికి" అని అడిగితిని. దానికి వాడు ఇట్లని సమాధానము జెప్పెను. ఓమహామునీ! నేనెవ్వడనుగాను. ఏమియును జేయుటలేదు. నీవు నన్ను పట్టుకొంటివి. నావిహారమునకు భంగము చేసితివి. ఆహా, నేడు నీవు ఒక్కడవు నాకు శత్రుడవైతివి. నీవు నన్ను జూచితివి. నేను సుఖమునకుగాక దుఃఖమునకుగాక చెడిపోతిని. అనిచెప్పుచు ఇనపగదాయుధముల వ్రేటులచేత డస్సి వివశములైయున్న తనయొక్క అవయవములను జూచి "ప్రచండముగ వర్షించుచు గర్జించుచున్న మేఘమువలె" అతివిస్తారమగు ధ్వనితో కన్నీరు వరదలై పారగ అతిదీనుడై రోదనముచేయుటకు ఆరంభించెను. మఱికొంతసేపునకు ఆరోదనమును చాలించి తన అవయవములనే జూచి నవ్వెను. మిగుల అట్టహాసము చేసెను. ఇట్లు అట్టహాసముచేసి నేను చూచుచుండగనే ఆపురుషుడు తన అవయవములను అన్నిటిని క్రమక్రమముగ విడుచుటకు ఆరంభించెను. అతిత్వరతో ఆఅవయవములను ఇటునటు పారవైచెను. మొట్టమొదట అతిభయంకరమగు వానిశిరము ఒకవైపునబడెను. పిమ్మట ఆయుధములతోగూడిన వానివేయు చేతులు వక్షస్థలమును, ఉదరమును, పిమ్మట పాదములును పడిపోయెను. ఈవిధముగ ఆపురుషుడు సర్వావయవములను పారవేసియు విధిబలముచేత ఎటకో బోవ ప్రయాణమాయెను. ఇట్లువాడు వెళ్ళిపోయిన పిమ్మటగూడ మఱియొక్కమారు ఏకాంతస్థలమునందు అట్టివానినే రెండవపురుషుని ఇంకొకని జూచితిని. వాడును మొదటివానివలెనే తన వేయుచేతులయందును ఇనుపగదాయుధముల ధరించి తనదేహమునే మోదుకొనుచు అరటితోటనుండి కానుగతోటకును అచ్చోటనుండి పాడుబావిగొద్దకును తిరుగుచుండెను. వానినిగూడ నేను అట్లే బలవంతముగ నిలిపి ప్రశ్నించితిని. వాడును మొదటివానివలెనే ఉత్తరమిచ్చి తన అవయవములను జూచి కొంతసేపు రోదనముచేసి పిమ్మటనవ్వి శిరస్సుమొదలగు సమస్త అవయవములను పారవేసి కానరాకుండ దైవబలముచేత ఎటకో బోయెను. ఇటులనే మఱియొకప్పుడు వేఱొక పురుషునిగూడ అట్టివానినే చూచితిని. వాడును మొదటివారివలెనే అరటితోటకుగాని కానుగతోటకుగాని పోక గదాయుధములతో మోదుకొనుచు పరుగెత్తి పరుగెత్తి కన్నుగానక పాడుబావిలో పడిపోయెను. వాడు మఱల ఎప్పటికైనను వెలుపలికి వచ్చునేమో యని నేను బహు

కాలము అచ్చటనే కాచియుంటిని కాని, ఆమూఢుడు ఎప్పటికిని వెలుపలికి రానేలేదు. మఱియొక సమయమునందు అట్టివాడే వేఱొకడుకూడ అగుపడెను. వానినిగూడ బలాత్కారముగ నిలిపి అట్లేప్రశ్నించితిని. ఆదుష్టుడు నాకు బాగుగ సమాధానము చెప్పలేదు.

" ఓమూఢుడా ! దుష్టచిత్తుడా ! నీకేమియు తెలియదు. నన్ను నిలుపకుము. తొలగిపొమ్ము " అని గర్జించి పలుకుచు వానిపనినే ఆరంభించెను. గదలతో మోదుకొనుచు బరుగెత్తసాగెను. ఈవిధముగా నమ్మహారణ్యమున అనేకులు తిరుగుచున్నారు. ఆఅడవియు ఇప్పటికిని ఉన్నది. అది మిక్కిలి భయంకరమైనది. తీక్ష్ణములగు కంటకములచేత నిండి మిక్కిలి ఇఱుకైయున్నది. భయంకరమగు చీకటిచేత ప్రవేశించుటకు అలవిగాకున్నది. ఇట్లున్నను శరీరమును ఎఱుగలేనిమూఢులు (స్వస్వరూప జ్ఞానములేనివారు) ఆఅరణ్యమునే సుఖకరముగ దలంచుచున్నారు. " పుష్పవృక్షములతో గూడిన రమ్యోద్యానమునువలె " దానినే సేవించుచున్నారు. అని చెప్పిన శ్రీరామచంద్రుడు ఇట్లనిెను. ఓమునీంద్రా ! ఆయరణ్యమెయ్యది? ఎచ్చటనున్నది? అందున్న ఆపురుషులెవ్వరు? వారేమిచేయుటకు ప్రయత్నించిరి. ఓదోషరహితుడా! వశిష్ఠమహాముని! దీనినంతయును వివరించి చెప్పుము. అనిన వశిష్ఠమహాముని ఇట్లనియె.

ఓరఘుకులతిలకా! వీరాగ్రేసరా! పుణ్యశీలా ! నీకు సర్వమును వివరించి చెప్పెదను వినుము. నేను చెప్పిన అరణ్యము వృక్షకంటకాదులతో గూడిన అడవికాదు. అది ఒకప్రదేశమున ఉండునదియునుగాదు. అందు కలరని చెప్పబడినవారు మనుష్యులునుకారు. అతిగంభీరమై శూన్యప్రాయములగు బహువికారములతో గూడినదియైయున్న ఈసంసారము ఏదికలదో అదియే నేను చెప్పిన మహారణ్యము. ఆయరణ్యమున పురుషులనేకులు సంచరించుచున్నారని చెప్పియుంటినిగదా. వారు మనస్సులే. అని తెలిసికొనుము. అవి నిరర్థకముగ సంసారదుఃఖమున బడి పొరలుచున్నవి కదా. ఓబుద్ధిమంతుడా! శ్రీరామా! " నేను ఆపురుషులను జూచితిని " అని చెప్పియుంటినిగదా. ఆ నేను వివేకమే అని తెలిసికొనుము. వివేకము సర్వకాలములయందును మనస్సునకు హితబోధను చేయుచుండుననుట-అనుభవ సిద్ధమేకదా. కొన్నిచిత్తములు నాఅనుగ్రహమువలన ( వివేకమువలన ) జ్ఞానమును జెంది సంపూర్ణముగు ఉపశాంతిని పొందినవి. ఇదియే అవయవములను పరిత్యజించుట. మఱికొన్ని మనస్సులు నాబోధను (వివేకమును) అంగీ

కరించుటలేదు. అట్టి మనస్సులు నరకకూపమున బడి తేప్పరించుకొనసేరవు కదా. మూఢపపురుషుడు బావియందు పడి మఱల వెలుపలికి రాలేదనుటకు ఇదియే అభిప్రాయము అని తెలిసికోనుము.

ఓరఘునందనా! శ్రీరామా! చీకటి నూతి అని చెప్పబడినది నరకము బు. అరటితోట స్వర్గము. కానుగులయడవి మనుష్యలోకము. ఆచీకటి నూతులయందు బడి వెలుపలికిరాని పురుషు లెవ్వరుకలరో వారు మహాపాపవంతములగు మనస్సులే. వారికి నరకముగుండి ఎప్పటికిని విడుదలయే లేదు కదా. బహువిధములగు కోరికలతో గూడినట్టియు భార్యా పుత్రాదులయందలి అనురాగమను చీకటితో ఆవరింపబడినట్టియు మనుష్యలోకము కానుగతోట దుఃఖమను ముండ్లతో నిండియున్నది. "నీవు నన్నుచూచితివి. నీవు నాకు శత్రుడవు. నేను ఇప్పుడు అన్నివిధముల చెడిపోతిని" అని పురుషుడు నాతో బలికెనంటిని గదా. దానికి అభిప్రాయము ఏమియనిన, అంతవరకును అహంకార మమకారములతో గూడియున్నదగుటచేత వివేకము గలిగినను ఆయభిమానమును విడువనేరక "వీరు నావారు. వీరిని ఎట్లువిడుతును" అని మమకార వాసనా బలముచేత దుఃఖించును. ఇదియే పైన ఉదహరించిన పురుషుల వాక్యముల అర్థము. సుఖకరములుగ దోచుచున్న అభిమానాదులను విడువవలసి వచ్చుటవలన వివేకముకూడ మొట్టమొదట శత్రువుగ దోచుట సహజమేకదా. మఱియు "ఆపురుషుడు తనశరీరమును జూచి అధికముగ రోదనము చేసెను" అనగా ఇంతకు పూర్వము అనుభవింపబడుచున్న శబ్దాది భోగములను విడువవలసి వచ్చుటచేత ఆమనస్సు దుఃఖించుననుటయే. సంపూర్ణముగ వివేకము నొందక బ్రహ్మపదము జెందకను ఉండుసమయమున చిత్తమునకు ఏస్థితియు స్థిరముగాదు. వివేకము కలిగిన కారణమువలన విషయభోగములు అనిత్యములని తెలియవచ్చును. కావున వానియందలి అనురాగము సన్నగిలును. బ్రహ్మానందము దొరుకక పోవుటచేత ఆవిషయభోగాదులను విడిచిపెట్టుటకును సమ్మతి కలుగదు. ఇట్లగుటచేత మొట్టమొదటి అవస్థయందు వివేక మున్న చిత్తమునకు సహితము పరితాపము ఉదయించునుకదా. "రోదనము చేసిన పిమ్మట నవ్వెను." అనగా మొట్టమొదట అవస్థయందు పైన వర్ణించిన విధముగ పరితాపపడి రోదనముచేసినను వివేకము దృఢము కాగానే "నాకు సర్వానందములకంటె అధికమగు బ్రహ్మానందము దొరకెనుగదా" అని మనస్సు సంతోషించెను. అనియే అర్థము. చక్కని వివేకము కుదిరిన పిమ్మట సర్వ

సంసారమును విడిచిపెట్టిన పిమ్మట మనస్సు స్వయముగానే పరబ్రహ్మము నందు కలసిపోవును. దానియొక్క స్వరూపము నశించిపోవును. అప్పుడు దానికి అంతకంతకును ఆనందము అభివృద్ధియే కలుగుచుండును గదా. మఱియు "నేను బలాత్కారముగ ఆపురుషుని ఆగి నిలిపితిని" అనుటచేత "వివేకము బలాత్కారముగ మనస్సును నిగ్రహించును" అని తెలియజేయబడెను. "ఆపురుషుడు తనచేతనున్న ఇనుపగదలతో తానే మోదుకొనుచున్నాడు" అనగా "మనస్సు తానుచేయు కల్పనలచేత దానేమోసపోవుచున్నది. కల్పనలను దెబ్బలచేత లేక ఆయుధములచేత తననే మోదుకొనుచున్నది." అనియేయర్థము. ఇదియునుగాక "తననే మోదుకొనుచునాపురుషుడు పరుగిడుచున్నాడు" అనుటకు "పూర్వ సంస్కారములను ప్రేటులచేత మనస్సు ఆయాపదార్థములపై బ్రసరించుచున్నది" అనుటయే తాత్పర్యము. మఱియు పట్టుపురుగు తన జొల్లునీరుచేత ఏర్పడిన దారముతో నొక్కయావరణమును నిర్మించి దానియందు బంధింపబడి వెలికివచ్చునుపాయము గానక చిక్కుపడునట్లు ఈమనస్సుగూడ తననుండి పుట్టు సంకల్పవాసనలచేతనే బంధింపబడును. కావున నోశ్రీరామచంద్రా! ఈచిత్తోపాఖ్యానమును అంతయును వివరించితిని. ఇది మిక్కిలి శ్రేష్ఠమైనది. నీవును వివేకయుక్తమగు చిత్తముతో సర్వమును విచారించి పైసంకల్ప వాసనలను పరిత్యజించి సుఖింపుము. చిత్త పరిత్యాగమే సర్వసుఖములకు మూలము. చిత్తము ఉన్నంతకాలము సంక్షోభ మణగదు కదా. పరిత్యాగమనుటకు గూడ "వివేకముచేత సంకల్పములను అణచికొనుట, సర్వప్రపంచమును చిత్తమాత్రముగ దెలిసికొని సంక్షోభమును జెందకుండుట" అనియే యర్థము.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షిప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉత్పత్తిప్రకరణమున - చిత్తోపాఖ్యానమను
పదియవసర్గ ముగిసెను.

—* పరమాత్మయే, మనస్సు అనుట. *—

అనిచెప్పి వశిష్ఠమహాముని మఱియును ఇట్లనియె. ఓశ్రీరామచంద్రా వినుము. పట్టుపురుగు దృష్టాంతముచేత మనస్సుగాని, దానిచేత కల్పితమైన ప్రపంచముగాని, సత్యమనిదలంచుచున్నావేమో అది ఎప్పటికిని లేదని తెలి

సికొనుము. సర్వ సామర్థ్యములును గలిగి సర్వపరిపూర్ణమై నాశరహితమై యున్న పరబ్రహ్మము ఏదికలదో అదియే మనస్సు. దానికంటె భిన్నమై మనస్సను నొకపదార్థము లేదు. ఆపరబ్రహ్మమునందు లేని శక్తులు ఎచ్చటను లేవు. వాస్తవస్థితిలో సర్వమును ఆబ్రహ్మమే కదా. ఇట్టి ఆబ్రహ్మమే శక్తితో అనగా లోకవ్యవహారసిద్ధమగు ఏవస్తువుయొక్క శక్తితో ప్రకాశించునో ఆవస్తువేయగును. అది ఎట్లనిన వినుము.

శ్రీరామచంద్రా! పరబ్రహ్మమునందున్న జ్ఞానశక్తి దేహమునందు మనకు గానవచ్చుచున్నది. అనగా నాబ్రహ్మము జ్ఞానశక్తిచేత ప్రకాశించునప్పుడు శరీరమని పిలువబడుచున్నాడు. లోకమున “ శరీరమునకు జ్ఞానము కలదు ” అను వ్యవహారమున్నది. ఈజ్ఞానశక్తియు పరబ్రహ్మమునకు గలదియే కావున నీశక్తితో ప్రకాశించునప్పుడు ఆయనను దేహమనుచున్నాము. ఇట్లే వాయువునకు స్వభావమని చెప్పబడు చలనశక్తియు బ్రహ్మమునకు సంబంధించినదియే. కావున నాశక్తితో ( చలనశక్తితో ) ప్రకాశించునప్పుడు ఆబ్రహ్మమునే వాయువనుచున్నాము. “ గట్టిగనుండుట ” అను శక్తితో ప్రకాశించునప్పుడు ఆబ్రహ్మమునే రాయి యనుచున్నాము. తడిగానుండుట లేక పలుచదనముగానుండుట. అనుబ్రహ్మశక్తి మనకు నీటియందు గానవచ్చుచున్నది. అనగా నాశక్తితో ప్రకాశించునప్పుడు ఆబ్రహ్మమునే జలమనుచున్నాము. ఇట్లే అగ్నిహోత్రమునందు ఆబ్రహ్మము యొక్క దాహశక్తి ( కాల్చుసామర్థ్యము ప్రకాశించుచున్నది. ఆకాశమునందు ఆబ్రహ్మముయొక్క శూన్యశక్తియే (ఏమియులేకుండుట, అను శక్తియే) స్పష్టమగుచున్నది. మఱియు నశించు పదార్థములయందెల్ల “ నశించుట ” అను బ్రహ్మశక్తియే రాజిల్లుచున్నది. బాగుగవిచారించిన అనేక చిత్రవర్ణములతో సర్వావయవములతో గూడిన నెమలి దానిగ్రుడ్డులోని నీటిలోనున్నట్లు ఈసర్వశక్తులును, లేక, సర్వప్రపంచములును పరబ్రహ్మమునందే యున్నవి. ఆకులు పూవులు కాయలు కొమ్మలు వేళ్ళు మాను మొదలగు సర్వావయవములతో గూడిన మహావృక్షము దానివిత్తనములో అభేదముగ అణగియున్నట్లు ఈప్రపంచమంతయు బ్రహ్మమునందే అణగియున్నది. దేశకాలానుగుణముగ నొక్కొకప్పుడు ఒక్కొకస్థలమునందు ఒక్కొక విధములగు ధాన్యములు జనించునట్లు పరబ్రహ్మమునుండికూడ నొక్కొకసమయమున నొక్కొకస్థలమునందు ఒక్కొకశక్తి యంకురించుచుండును. దానికి అనుగుణముగ బ్రహ్మమునకు ఆయాపేరులు పెట్టబడు

చుండును. ఉదయించిన శక్తి లోకవ్యవహారానుసారముగ ఏపదార్థము
నకు స్వాభావికమని చెప్పబడునో, బ్రహ్మము ఆపదార్థ నామరూపముల
తోనే వ్యవహరింపబడుచుండును. భ్రాంతి కలిగినప్పుడు ఈతత్త్వమును
తెలిసికొనలేక జనులు ఆయా పదార్థములకంటె బ్రహ్మము భిన్నమునుగ
భావింతురు. బ్రహ్మమునకంటెను ప్రాపంచిక పదార్థములను వేఱుగజూ
తురు. వివేకవంతులు అట్లుగాక సర్వమును బ్రహ్మమయముగానే తెలిసి
కొనియెదరు. ఇంతయేకాని, వాస్తవస్థితిలో బ్రహ్మభిన్నమగు పదార్థాంత
రమే లేదు. పైన వర్ణించిన విధముగ విమర్శించిన శ్రీరామచంద్రా! పున
నశక్తితో ప్రకాశించు బ్రహ్మమే మనస్సగును. ఆయన సర్వవ్యాపకుడు.
సర్వకాలములయందును ప్రకాశించు స్వభావము కలవాడు. మనస్సుకూడ
నట్టిదియే. కావున మనోబ్రహ్మములకు భేదమేమియు లేదు. ఈవిధముగ
మనస్సుసృష్ట్యాదు లన్నిటికంటె మొట్టమొదట పుట్టును. పిమ్మట వాసనారూ
పమగు బంధమును దానికి వ్యతిరిక్తమగు మోక్షమును కలుగును. అనగా
వానినిగూర్చిన సంకల్పము ఉదయించును. సర్వమును సంకల్పమయమే
కదా. పిమ్మట ప్రపంచరూపములగు సంకల్పములు జనించును. ఆసంకల్ప
ములనే మనము ప్రపంచమనుచున్నాము. సంకల్పములకంటె భిన్నమగు
పదార్థము ఏదియును లేదు కదా. మఱియు బంధము కలిగినప్పుడే కాని,
భోగములయందు ఇచ్ఛజనింపదు. భోగేచ్ఛ యుండినగాని దానికి సాధన
ములగు పదార్థములనుగూర్చిన సంకల్పము గలుగదు. ఈకారణమువలన
బంధమోక్షములు ప్రపంచ సంకల్పములకంటె (ప్రపంచసృష్టికంటె)
పూర్వముననే యుండితీరవలయునని తెలిసికొనుము. ఈవిధముగ నివియన్ని
యు పుట్టి యథార్థములై యున్నట్లు తోచుచుండినను దాది బాలకునకు
జెప్పుకథలలోని వస్తువులవలె అసత్యములే యగును కాని, యథార్థములు
అనగా బ్రహ్మభిన్నములుగ నుండునవి కానేరవు.

## —* బాలకోపాఖ్యానము. *—

అని వశిష్ఠుచెప్పిన విని శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓమహాత్మా!
వశిష్ఠమునీంద్రా! దాది బాలకునకు చెప్పువిధము ఎట్టిది? దానిని దయచేత
క్రమముగ వివరించి చెప్పుము. దానిని వినుటచేత నాకు మనస్స్వరూపము
బాగుగ దెలియవచ్చునుగదా. అనిన వశిష్ఠమహాముని ఇట్లని వివరింప నా
రంభించెను. ఓశ్రీరామచంద్రా! ఒకానొకసమయమున ఏమియు నెఱుగ
లేని ఒకబాలుడు దాదినిజూచి "ఓదాదీ! ఏదైనా ఒక వినోదమైన వార్తను

నాకు శీఘ్రముగ జెప్పుము ” అని ప్రశ్న చేయును. ఓగొప్పబుద్ధిగలవాడా! శ్రీరామా! ఆదాదియు తత్క్షణమే ఆబాలునకు వినోదమును గలిగించుటకై మనోహరమగు వాక్యరచనతో ఏదేని ఒక వృత్తాంతమును అనగా కథను జెప్పును. ఎట్లనిన?— ఓబాలకా! బొత్తిగ స్వరూపమే లేని ఒక మహాపట్టణము కలదు. అందు ధర్మాత్ములును పరాక్రమవంతులును బుద్ధిమంతులునగు ముప్వురు రాజకుమారులు నివసించుచుండిరి. అందు ఇరువురు పుట్టనే లేదు. మూడవవాడు గర్భమునందే ప్రవేశింపనేలేదు. ఒకానొక సమయమున ఆవీరులు ముప్వురును గొప్ప లాభమును సంపాదింప వలయుననే ఇచ్ఛచేత ప్రయాణమై తమ శూన్య పట్టణమునుండి బైలుదేరి ఆకాశమార్గమునందు నడువ నారంభించిరి. ఆయాకాశమున వారలకు పుష్ప ఫల భరితములగు మహావృక్షములు కానవచ్చెను. ఆరాజకుమారులు ముప్వురును ఆవృక్షములక్రింద విశ్రమించి మధురములగు ఆపండ్లను భుజింపుచు విలాసముగా ప్రయాణము చేయుచుండిరి. ఇట్లు పోయిపోయి ఒకస్థలము చేరిరి. అచ్చట మూడు సరస్సులు ఉండెను. అందు ఒకటి ఎండినది. తక్కిన రెంటిలో జలము ఒక్కబిందువైనను లేదు. అట్లుండినను ఆసరస్సులయందు అలలు మిక్కుటముగా నుండెను. అందు సంపూర్ణముగ ఎండియున్న మొదటి సరస్సునందు ఆముప్వురును స్నానము చేసి బహుకాలము జలక్రీడసలిపి పాలవలె నిర్మలమగు నందలి నీటిని పానముచేసిరి. తరువాత సాయంకాలమునకు ఒకపట్టణము చేరిరి. అందలి సందడి బహుదూరమునకు వినవచ్చుచుండెను. పురజనులందరును బహువిధముల క్రీడించుచుండిరి. అయితే ఆపట్టణముమాత్రము అప్పటికి పుట్టక తర్వాత కొంతకాలమునకు పుట్టబోవునదియై యుండెను. మఱియు వారు ఆపట్టణమునందు అతిరమ్యములగు మూడుగృహములను జూచిరి. అందు ఒకగృహమునందు గోడలుగాని స్తంభములుగాని లేవు. తక్కిన రెండును కట్టబడనేలేదు. అంత వారు ముప్వురును గోడలును స్తంభములును లేని మనోహరగృహమునందు ప్రవేశించిరి. అందు సువర్ణమయములగు మూడు పాత్రలు గానవచ్చెను. అందు రెండు పెంకులై యుండెను. మూడవది చూర్ణమైయుండెను. అందు మహాబుద్ధిమంతులగు వారుముప్వురును చూర్ణమైయున్న పాత్రనుగ్రహించిరి. ఆపాత్రమునందు మూడుకుంచెములు తక్కువగ మూడుకుంచెములు బియ్యమును పాకముచేసిరి. పిమ్మట నాఅన్నమును నోరులేనివారును విశేషముగ భుజింపగలవారునగు బ్రాహ్మణులు భుజియించిరి. వారు తృప్తినొందిన పిమ్మట

మిగిలియున్న యన్నమును ఆరాజకుమారులును తృప్తిగ భక్షించిరి. ఇట్లు వర్తించుచు అప్పుడప్పుడు వేటలాడుచు ఆరాజకుమారులు ముగ్గురును ఆపట్టణమునందే ( అనగా, భవిష్యత్పట్టణమునందే ) సుఖముగ నివసించుచుండిరి.

ఓశ్రీరామా! రామచంద్రా! ఈవిధముగ దాది బాలకునకు కథజెప్పెను. ఆబాలకుడును అజ్ఞానియగుటచేత కొంచెమైనను విచారింపనేరక సర్వమును సత్యమనియే తలంచెను. ఓశ్రీరామచంద్రా! బాలకోపాఖ్యానమును నీకు వివరించితిని గదా. దీనివలన నీవు తెలిసికొనవలసినది ఏమియనిన?—ఈసంసారమందలి పదార్థములన్నియు పైన చెప్పిన కథయందలి పదార్థములవలె అసత్యములైనవే. బాలుడు పైకథయందలి పదార్థములను సత్యములుగ భావించునట్లు అజ్ఞానులును ఈప్రాపంచిక పదార్థములను సత్యములునుగా భావించుచున్నారు. ఇట్లు విమర్శించినచో నీప్రపంచస్థితియు పైకథయందలి రాజపుత్రులయొక్క స్థితివంటిదే. కావున ప్రపంచముగాని, దానికి కారణమగు మనస్సుగాని బంధమోక్షములుగాని, బ్రహ్మమునకంటె భిన్నములుగా నున్నవి అని తలంచుట కేవలము భ్రాంతి. ఈసమస్తప్రపంచమును సంకల్ప సమూహముయొక్క రచనయే. దీనికి కారణమగు మనస్సు విజృంభించుటయెల్ల సంకల్ప సమూహముల రచనవలననే. కావున ఓశ్రీరామా ! నీవుచేయదగిన కార్యము సంకల్ప పరిత్యాగమొక్కటియే. ఆసంకల్పమునుమాత్రము సంపూర్ణముగ నిశ్శేషముగ విడువుము. సంకల్పశూన్యమగు స్వస్వరూపమును ( శుద్ధబ్రహ్మమును ) ఆశ్రయింపుము. సంకల్ప పరిత్యాగముచేత ఇది స్వాభావికముగనే కలుగును. దీనికై క్రొత్తగ నాచరింపవలసిన ప్రయత్నమేమియును లేదు. ఈవిధముగ శుద్ధపరబ్రహ్మమాత్రుడవై నిలిచి పరమశాంతిని జెందుము. వాస్తవస్థితిలో నీస్వరూపము అదియేకదా.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షిప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉత్పత్తిప్రకరణమున - బాలకోపాఖ్యానమను
పదునకొండవసర్గ ముగిసెను.

---

అని ఇట్లు శ్రీరామచంద్రునితో వశిష్ఠమహాముని చెప్పి మఱియు నిట్లనియె. ఓశ్రీరామా! రఘుకులసార్వభౌమా! ఆనిర్వికల్పస్థితియు గష్టసాధ్య

మైనది కాదు. తానే సంకల్పించి యాసంకల్పములచేత స్వయముగనే భ్రాంతినొందువాఁడు మూఢుఁడగునుగాని పండితుఁడగునా? పండితునిబుద్ధికి ఎప్పటికిని తత్త్వవిచారమే స్వభావము. దానికి భ్రాంతివలన కలుగు సంక్షోభము ఎప్పటికిని ఉండదుకదా. తననీడనుజూచి తానే బెదరెనవినట్లు తన సంకల్పములవలన తానే భ్రాంతిజెందెను అనుట ఎంతవింత? కావున నీవు పొరబాటుపడక సావధాన చిత్తముతో "సత్యమేది? అసత్యమేది?" అను విషయమును విచారింపుము. సత్యమును గ్రైకొనుము. అసత్యమును విడువుము. ఇదియే నిర్వికల్పస్థితికి, లేక, సంకల్పజయమునకు మార్గము. వాస్తవస్థితిలో ఆత్మకు బంధము ఎప్పటికిని లేదు. ఇట్లుండగ "నాకు బంధము కలిగెను. మోక్షము ఇకనెట్లు కలుగును?" అని నిరర్థకముగ దుఃఖింపనేటికి? ఆత్మస్వరూపమునకు ఆద్యంతములు లేవుకదా. ఇట్టి పరబ్రహ్మమును ఏదిబంధించును? ఎట్లుబంధించును? బంధింపబడుటకు దగిన రూపము ఈబ్రహ్మమునకు కలదా. లోకమున బంధింపబడు పదార్థములు సామాన్యముగ సావయవములై యుండవలయును. ఆద్యంతములుగలవియై యుండవలయును. వానికంటె ఇతరముగ బంధించు పదార్థముకూడా నొకటి యుండవలయును. ఇవియంతయు లేని నిరవయువ, సర్వవ్యాపక, అద్వితీయ, పరబ్రహ్మమునకు బంధమెక్కడినుండి వచ్చును. ఇతర విషయములు ఎట్లున్నను "ఈపదార్థము బంధింపబడినది" అనిన ఉద్దిష్ట పదార్థమునకంటె భిన్నమగు రెండవపదార్థము ఉండి తీరవలయును గదా. ఆ రెండవపదార్థము లేదనిన "ఈపదార్థము దేనిచేత బంధింపబడినది?" అను ప్రశ్నమునకు ఉత్తరము ఏమిచెప్పెదరు. కావున బంధమనిన రెండవపదార్థము ఉండియే తీరవలయును. ఈపరబ్రహ్మము అట్టివాఁడు కాఁడు. ఈయనకు ఏవిధముగాగూడ అనగా సజాతీయముగానైనను, విజాతీయముగానైనను, స్వగతముగానైనను, రెండవపదార్థము లేదు. లోకమునందు సర్వపదార్థములకును ఈమూఁడువిధములగు భేదములు నుండును. ఒకవృక్షమును గైకొని చూడుము. ఆకారమునందును, గంధరసాదులయందును, మఱియు సర్వ విషయములయందును, దానితో సమానములై సమానజాతి గలవియైయున్న వృక్షములు అనేకములు ఉండును. విరుద్ధజాతిగలవియైయున్న శిలాది పదార్థములును అనేకములు ఉండును. ఇదియంతయునుగాక తనయందే (వృక్షమునందే) పరస్పరభేదములుగల పుష్పము పత్రము మొదలగు పదార్థములును అనేకములు ఉండును. ఈపుష్పాదులన్నియును గలసి వృక్షశబ్దముతోనే వ్యవహరింప

బడుచున్నను లోలోన భేదముగలవి అన్యోన్యయున్నవి. ప్రాపంచిక పదార్థ
ములలో దేనిని విమర్శించినను ఈస్వజాతీయ విజాతీయ స్వగతభేదములు
(సమానజాతి గలవానితో నుండుభేదము సజాతీయభేదము. విరుద్ధ జాతి
గలవానితో నుండునది విజాతీయభేదము. తనలోని అవయవములకు గల
భేదము స్వగతభేదము.) ఉన్నవి. పరబ్రహ్మ విషయమన్ననో అట్టిదికాదు.
ఆయన జ్ఞానానంద స్వరూపుడు. జ్ఞానానందములకు అవయవములు ఉండు
టకు వీలులేదు. కావున నాబ్రహ్మమునకు స్వగతభేదము లేదు. మఱియు
రెండవజ్ఞానముగాని రెండవ యానందముగాని ఉండుటకువీలులేదు. కావున
సజాతీయమగు రెండవపదార్థము లేదు. ఆద్యంతములు లేనివాడగుటచేత
విజాతీయమగు రెండవ పదార్థమును లేదు. ఇట్లగుటచేత ఆపరబ్రహ్మ
మును ఏపదార్థము బంధింపగలదు? బంధమే ఇట్లు శూన్యప్రాయమైన,
ముక్తి జెందువాడెవ్వడు? ఇదియునుగాక ఆపరబ్రహ్మమునకు సంకల్ప విక
ల్పములే లేవు. కావున "నేను బద్ధుడను, ముక్తుడను" అని తలంచుచున్నా
డనుటకుకూడా యథార్థస్థితిలో అవకాశము లేదు. కావున ఓశ్రీరామచం
ద్రా! సంకల్పరూపమగు మనోవికాసముమాత్రమే అజ్ఞానమువలన బంధ
ముగ దోచుచున్నదికాని ఇందు వాస్తవమేమియు లేదు. పరబ్రహ్మము నిర్వి
కారుడగుటచేత ఆయనకు మనమిప్పుడు ముక్తియను వ్యవహరించుస్థితి
ఎయ్యదియో అదియేస్వభావము. కావున మనస్సు అనగా సంకల్పములు
నశించెనేని స్వతస్సిద్ధమగు ముక్తియే నిర్వికల్పస్థితియే మిగులును. కావున
సర్వమునకును మనోజయమే మూలము. దానికి బ్రహ్మవిచారమే ముఖ్యో
పాయము. ఇంతకంటె నిర్వికల్పస్థితికి వేఱొక సాధనము ఏమియు నక్కఱ
లేదు. "మనస్సు స్వయముగ శూన్యరూప మయ్యుండ దానికి ఇట్టి సామ
ర్థ్యము కలదా? దానియొక్క విజృంభణమువలన నిర్వికారుడుకూడా బద్ధు
డైనట్లు తోచునా" అనియెదవేమో, మనస్సుయొక్క సామర్థ్యమును
ఇంతయని వర్ణింప నలవికాదు. అదియు మనన శక్తియుక్తుడైన పరబ్రహ్మ
మే కదా? సర్వశక్తుడగు బ్రహ్మమునకు అట్టిశక్తి యుండుననుటలో సంశ
యమేమి. అదివిజృంభించి ఆరంభించిన నూఱు యోజనములైనను ఒక్క
గోష్పాదమగును. ఒక గోష్పాదముకూడ అనేక సహస్ర యోజనములై
పరిణమించును. ఒక బ్రహ్మకల్పము క్షణమగును. క్షణము అనేక బ్రహ్మక
ల్పము లగును.

## లవణోపాఖ్యానము.

ఓరఘుకులసార్వభౌమా! శ్రీరామా! ఈవిషయము తేటపడుటకై సర్వోత్తమమైన ఒక ఇతిహాసమును నీకు జెప్పెదను. దానిని వినిన ఈప్రపంచ ఇంద్రజాలము చిత్తమునందు ఎట్లు నిలచియున్నదో దానిని బాగుగ దెలిసికొనగలవు. ఈభూమండలమునందు అతివిచిత్రములగు ఉద్యానవనములతో నిండి అతిరమ్యమై ఉత్తరపాండవ మను పేరుగల ఒకగొప్పదేశము గలదు. ఆదేశమును లవణుడను నొకమహారాజు పాలించుచుండెను. ఆతడు " భూమియందు జనియించిన రెండవ సూర్యుడో " యన ప్రతాపమునందును జనులపరిపాలించుటయందును సమస్తరాజులను అతిక్రమించి వర్తించుచుండెను. ఆరాజు హరిశ్చంద్రునివంశమున బుట్టినవాడు. మిక్కిలి ధర్మాత్ముడు. ఆప్రభువుయొక్క కీర్తియనెడు పుష్పములు సర్వపర్వతశిఖరములమీదను వ్యాపించి వానినంతయును మిక్కిలి స్వచ్ఛములుగ జేసినవి. దానిచేత లోకమునందు గల పర్వతములన్నియును ముత్యాల చూర్ణముల రాసులో యన ప్రకాశించుచుండును. ఆరాజును ఎఱుగనివాడు ఎవ్వడును ప్రపంచమునందు లేడు. ఆప్రభువునకు తాపత్యమనగా నేదియూ తెలియదు. అతని దేశమునందుగూడ అత్యాశయనునది లేదు. శబ్దము అర్థమును ధరించినట్లు ఆతడు ఔదార్యమును దాల్చియుండెను. అట్టియాప్రభువు ఒకనాడు మంత్రి సామంతాది సర్వజన పరివేష్టితుడై సభామధ్యమునందు సింహాసనముపై కూర్చుండి నిండుకొలువుండెను. అప్పుడు ఒకానొక ఇంద్రజాలికుడు అతిశీఘ్రముగ సభామధ్యమున ప్రవేశించి రాజునకు నమస్కరించి నిలచెను. ఇట్లు నమస్కరించిన ఇంద్రజాలికుని జూచి పర్వతశిఖరమువలె ఉన్నతమగు కంఠముగల యాప్రభువు ప్రసన్నుడై శిరమును పైకెత్తి అభిముఖుడయ్యెను. తత్క్షణమే కమలమునుజూచి ఝుంకారముసేయు తుమ్మెదవలె రాజుయొక్క ముఖమునుజూచి ఇంద్రజాలకుడు ఇట్లని విన్నవించెను.

ఓప్రభువా! మహారాజా! నేనొక ఇంద్రజాలమును గావించెదను. అది భూమియందు జనించిన రెండవ చంద్రమండలమో యనునట్లు పరమాహ్లాదమును గలిగించును. దానిని దయచేసి చిత్తగింపుడు. సింహాసనమునందే కూర్చుండి ఈయాశ్చర్యమును జూడుడు. అనిపలికి రాజువలన అనుజ్ఞనుతీసికొని యాఇంద్రజాలవేత్త " సర్వప్రపంచ కల్పనకు మూలాధారమగు పరబ్రహ్మముయొక్క మాయవలె " మిక్కిలి భ్రాంతిని గలిగింపజేయునట్టి తనచేతి నెమలికుంచెను ద్రిప్పెను. ఇట్లు వాడు నెమలికుంచను

త్రిపుటను ఆప్రభువు ప్రత్యక్షముగా జూచుచునేయుండగ సింధుదేశప్రభు
వుయొక్క సామంతరాజు ఆసభకువచ్చెను. ఆసామంతరాజుతోగూడ అతి
సుందరమైనదియును శాంతస్వభావము గలదియు నగు గుఱ్ఱమొకటి సభకు
వచ్చెను. అంత ఆసింధుదేశపు సామంతరాజు ఆలవణమహారాజునకు ఆగు
ఱ్ఱమునుజూపి ఇట్లనియె.

ఓలవణమహారాజా! ఈగుఱ్ఱము ఉచ్చైశ్శ్రవముతో ( ఇంద్రునిగుఱ్ఱ
ముతో) సమానమైనది. దీనిని నాఅధిపతియగు సింధుదేశపురాజు చక్రవర్తి
యగు మీకుఅంపెను. శ్రేష్ఠమగు పదార్థము ఉండినయెడల అది తనయొద్ద
నుంచుకొనుటకంటె తనకంటే అధికులై లోకోత్తరులైయున్న మహాను
భావులకు సమర్పించినచో మిగుల యుక్తమైయుండును. ఆపదార్థములును
మహదాశ్రయముచేత శుభకరములై మిక్కిలి ప్రకాశించును. అని ఇట్లు
ఆసింధుదేశపు సామంతుడు పలుకగానే ఆ ఇంద్రజాలకుడు ఇట్లనిచెప్పెను.
ఓమహాప్రభువా! లవణమహారాజా! ఈగుఱ్ఱము మిక్కిలిశ్రేష్ఠమైనది. దీనిని
ఎక్కి యొకమాఱు ప్రపంచమున విహరింపుడు. అనిఇట్లు పలికిన యాయైం
ద్రజాలికుని వాక్యములు విని యాప్రభువు తనయెదుటనున్న ఆగుఱ్ఱమును
రెప్పవేయక జూచెను. అట్లుచూచుచునే నిశ్చేష్టుడై "చిత్తరువునందు వ్రా
సిన ప్రతిమవలెను, రాతితో చేక్కిన బొమ్మవలెను" ఏమియుచేయక మాట
లాడక స్తంభితుడై యుండెను. ధ్యానముచేయుచున్న యోగివలె నాలుగు
ఘడియలకాలము ఏవిషయమును మనస్సునకు తేకుండెను. అప్పుడు సభ
యందుండువారలును మంత్రులును "ఇదియేమి? రాజునకు ఇట్టి అపూర్వ
స్థితి కలిగినది" అని సంశయాశ్చర్యములు పెనగొన విచారింపసాగిరి. ఆవి
చారముచేత సభయందలి సందడియెల్ల నడంగెను. నిశ్శబ్దముగ నుండెను.
అప్పుడు ప్రభువు రెప్పలను కదలింపక ఆగుఱ్ఱము వైపుననే జూచుచు నిశ్చే
ష్టుడైయుండగ ఆసభయందుండిన జనమంతయును ఆశ్చర్యాతిశయముచేత
వికాసముతప్పి ముడుచుకొనినట్లుండెను. "రాజు ఇకనేమగునో" అను
సంశయము, భయము, అధికమగుటచేత మిక్కిలి దుఃఖించుచుండెను.
ఇట్లుండుటచేత "చీకటివచ్చుటవలన ముడుచుకొని, మంచు, చంద్రకిరణ
ములు, మొదలగువాని స్పర్శచేత చలికిలబడియున్న తామరతోటవలె"
ఆసభ కాంతిహీనమై యుండెను. తర్వాత నాలుగు గడియలు కాగానే
యాలవణమహారాజు మేల్కాంచెనుగాని సింహాసనముపైనే కూర్చుండి వడ
వడ వణకసాగెను. పార్శ్వమునందున్నవారు పట్టుకొని అలసట తీర్చిరి.

తర్వాత నాప్రభువునకు బాగుగ మెలకువ రాగానే సభ్యులును మంత్రులును ఇట్లని ప్రశ్నచేసిరి.

ఓమహాత్మా! నీమనస్సు మిక్కిలి శుభ్రమైనది. అది ఇప్పుడు భ్రాంతినొందుటకు కారణమేమి? సామాన్యముగ మహాత్ములయొక్క మనస్సు ఎప్పటికిని భ్రాంతి నొందదుగదా. అనిచెప్పిరి. అంత కలకవెల్లదీరి బాగుగా కన్నులను దెరచి యాప్రభువు పరమాశ్చర్యముతో వారలకు ఇట్లనియె. ఓసభ్యులారా! నేను చెప్పఁబోవు వృత్తాంతము అతివిచిత్రము. దీనిని సావధానులరై వినుడు. ఈయైంద్రజాలకుడు త్రిప్పిన నెమలి పింఛమును జూడగానే నాచిత్తము భ్రమించినది. అప్పుడు స్వప్నమునందువలె ఈగుఱ్ఱముపై నెక్కితిని. విషయభోగములను మరుగుటచేత స్వాధీనముగాకున్న చిత్తము జ్ఞానశూన్యుడగువానిని బహుదూరమునకు ( అసాధ్యవిషయములమీదికి) గొనిపోవునట్లు ఈగుఱ్ఱము మహావేగముతో నన్ను బహుదూరము గొనిపోయెను. నేను ఒకడనే దీనినెక్కి ఎట్లో వేటకు బోతిని. అట్లు వేటాడుచు నత్యంతదూరము పోయిపోయి అలసి యొక్కమహారణ్యమునందు ప్రవేశించితిని. అది ప్రళయకాలమునందలి మహాగ్నిచేత ప్రపంచమంతయును కాలి ఆరిపోయిన స్థలమో యనునట్లు మిక్కిలి భయంకరమై యుండెను. దానికి ఏవైపున జూచినను అంతము గానరాలేదు.

ఓసభాసదులారా ! ఎందెక్కడజూచినను మంచు దట్టముగ నిండి యుండెను. ఒకపక్షియైనను, వృక్షమైనను, తుదకు నీరైనను, అందులేదు. ఇట్టి మహారణ్యమున జిక్కుకొనుటచేత నేను మిక్కిలి దుఃఖించితిని. ఇట్లు దుఃఖించుచుండగానే సూర్యాస్తమయమాయెను. అంతవరకును నేను గుఱ్ఱముపై సవారి చేయుచునే యుంటిని. నేనెంత అలసియున్నను, గుఱ్ఱము ఎంతఅలసియున్నను ఆశూన్యప్రదేశమును దాటునంతవరకు సవారిచేయక తప్పినదికాదు. ఆఅరణ్యమందే నిలచియున్నయెడల త్రాగుటకు నీరైనను లేక మృతి జెందవలసినదియే కదా. అంత నేను ఎట్లెట్లో "జ్ఞానవంతులు సంసారారణ్యమును గడచినట్లు" ఆశూన్యప్రదేశమును గడచి కొంచెము నీరును, వృక్షములును, గల ఒక అరణ్యమును ప్రవేశించితిని. అచ్చట నేరేడుచెట్లును కడిమిచెట్లును అధికముగనుండెను. వానిపై గూర్చుండి మధురమగు గానముసేయుచు బహువిధములగు పక్షులు "బాటసారులను బంధువులవలె" నూరార్చుచు నుండెను. ఓసభాసదులారా! ఏదైన నొక క్రొత్తదేశమునకు బోయినవానికి అచ్చట నొకముఖ్యబంధువు తటస్థమైనచో ఎంత

సంతోషముగ నుండునో నాకు అంతసంతోషము గలిగెను. అంత మార్గ మధ్యమున నొకనిమ్మచెట్టుక్రిందికి వచ్చితిని. అప్పుడు దానిపైనుండి వ్రేలాడుచున్న ఒకతీగె నాభుజమునకు తగిలెను. గుఱ్ఱముమీదినుండియే నేను ఆతీగెను పట్టుకొని వ్రేలాడితిని. తత్క్షణమే "గంగాప్రవాహమునందు స్నానముచేయుచున్న పురుషునియొక్క పాపములు వానిని విడచి పోవునట్లు" ఈగుఱ్ఱము నన్ను విడచి పారిపోయెను. ఇట్లుపోయినను నేను దానిని లక్ష్యము చేయలేదు. వెదుకుటకు ప్రయత్నిపలేదు. బహుకాలము ప్రయాణము చేయుటచేత మిక్కిలి డస్సినవాడను కావున నాచెట్టుక్రిందనే విశ్రమించితిని. అప్పుడు ఏమియు దోచక నామనస్సు మిక్కిలి భ్రాంతి నొందియుండెను. ఇట్లు దుఃఖించుచు నారాత్రి అచ్చటనే గడపితిని. అందలి ఒక్కొక్క క్షణము ఒక్కొక్క మహాయుగమువలె అతిదుస్తరమై యుండెను. ఆరాత్రియందు నేను స్నానమును చేయలేదు. దేవార్చనమును చేయలేదు. భుజింపలేదు. క్రూరమృగములయొక్క ధ్వనులను వినుచు "ఇకమీద మనపట్టణమునకు జేరుటెట్లు" అని వ్యసనపడుచు నారాత్రి యూరక గడపితిని. మఱియును ఆరాత్రి చలి అధికమగుటచేత కప్పుకొనుటకైనను సరియైన వస్త్రము లేకపోవుటచేత పండ్లుబిగబట్టుకొని సూర్యోదయమువరకు వడవడ వణుకుచు గూర్చుండవలసివచ్చెను. ఇట్లుండగ కొంతసేపటికి క్రమక్రమముగ చీకటులు విరియ నారంభించెను. లోకబాంధవుడగు పద్మబాంధవుడైన సూర్యుడు ఉదయించెను. చీకటులతోగూడ చలియును నశించెను. ఇట్లు సూర్యోదయముకాగానే అతి విశాలమగు నాయరణ్యమును గలయ జూచి ఎచ్చటనైన మనుష్యులు కలరేమో యని వెదకుటకై కాలినడక ఆరంభించితిని. ఆయరణ్యము మిక్కిలి పురాతనమైనది. ఎంత తిరిగినను అందు ఒక మనుష్యుడైనను కానరాలేదు. పక్షులుమాత్రము అవ్యక్తమధురముగ చీచీకుచికుచీ, యనుచు సంచరించుచుండెను. ఇట్లు నాలుగు గడియల ప్రొద్దెక్కునంతవరకు దిరుగగా నొకచోట అన్నమును ఎక్కడికో గొనిపోవుచున్న ఒకకన్యక కానవచ్చెను. చంచలించుచున్న నేత్రములుగలిగినటియు, యౌవన మధ్యస్థురాలైనదియు, నల్లనైనదియు, (ఇదిశ్యామాపదమువిచ్ఛిన్నశ్లేష) తెల్లనివస్త్రములు ధరింపనిదియు, నగు నాస్త్రీయొద్దకు "చీకటి యొద్దకు బోవు చంద్రునివలె" నేను పోతిని. అట్లుపోయి ఈక్రిందివిధముగ యాచించితిని.

ఓచిన్నదానా! నేను మిక్కిలి డస్సియున్నాను. నిన్నటి దినమంత

యేను భోజనము లేదు. నీవు గొనిపోవుచున్న అన్నమును నాకు పెట్టుము. మిగుల ఆపదయందు ఉన్నాను. దీనులయొక్క శ్రమను బోగొట్టినచో సంపదలు అభివృద్ధినొందును. ఓకన్యకా! నాకు ఆకలి మిక్కుటముగా నున్నది. అని ఇట్లు ఎంత వేడినను, " లక్ష్మి సేవింపబడినను పాపాత్మునకు ధనము నొసంగనట్లు " ఆకన్యక నాకు ఒక మెతుకైనను బెట్టలేదు. అంతట ఆకలి అధికమగుటచేత నేను ఆకన్యను విడువక వెంబడించితిని. ఒక యరణ్యఖండముచు గడచి మఱియొక యరణ్యఖండమునకు దానితోగూడ బోతిని. ఇంత వేలకే నీడవలె నెప్పుడుచూచినను " నాకు అన్నముపెట్టుము " అనుచు ఎదుటనే నిలుచుచుంటిని. ఇట్టినన్ను జూచి ఎట్టకేలకు నాకన్యక ఇట్లనియె. హారములను భుజకీర్తులను ధరించియున్న ఓపురుషుడా! నీవు క్షత్రియ కులమునందు జనించినవాడవుగా నున్నావు. నేను చండాలస్త్రీని. అడిగినంత మాత్రముననే నాయొద్దనుండి మీకు భోజనము దొరకదు. ఇట్లుపలికి ఆకన్యక వెళ్ళుటకు ఆరంభించెను. నేనును వెంబడించితిని. ఆకన్యక సరిగా నడవక అచ్చటచ్చట దొట్రుపడుచు కానవచ్చిన పొదరిండ్లయందెల్ల విశ్రమించుచు సిగ్గుపడుచు శిరమును వంచ నారంభించెను. కొంతసేపునకు నన్నుజూచి మఱల ఇట్లనియె.

ఓయీ ! నీవు నన్నువివాహము చేసికొనుటకు అంగీకరింతువేని ఈఅన్నమును నీకుపెట్టెదను. అల్లదుగో కనబడు విరిగిచెట్టువద్ద మాతండ్రి ఎద్దుల నలవార్చుచున్నాడు. ఈయన్నమును ఆయనకై కొనిపోవుచున్నాను. అయినను దీనిని నీకుబెట్టెదను. అందరకంటెను అధికముగ ప్రాణములనైన నిచ్చి భర్తలను రక్షించుకొనుట ధర్మముకదా అనెను. ఆవాక్యమును విని నేను ఇట్లంటిని. ఓశ్రేష్ఠురాలా! నీఇష్టమును అనుసరించి నేను అట్లే వివాహమును చేసికొనియెదను. ఆపద సమయములయందు జాతి-వంశ భేదములను ఎవ్వడుగణించును అనిచెప్పితిని. అంత నాకన్యకయు తత్క్షణమే అది కొనిపోవుచున్న అన్నములో సగమును విభాగించి నాకుపెట్టెను. నేరేడు పండ్ల రసమును త్రాగుటకు ఇచ్చెను. ఇట్లు మాలదానిచేతి అన్నమును భుజించితిని. ఆఫలరసమువలన నాకు మత్తత కలిగెను. ఇట్లు ఒడలెఱుంగక పడిన నన్ను ఆకన్యక లేవనెత్తి పరమానురాగముతో బట్టుకొని తండ్రియొద్దకు గొనిపోయెను. నేను దానికై బైటనున్న ప్రాణమో యన అతిప్రేమాస్పదుడనై యుంటిని. దానితండ్రియును అతివికార రూపముగలిగి దురాకారములు గలిగి చూచువారలకు భయమును గలిగించుచుండెను. మిక్కిలి

బలిసియుండెను. " అవీచి ( అలలు లేనిది ) అను నరకము మనుష్యరూపము దాల్చి భూమిపై అవతరించెనో " అనునట్లుండెను. ఇట్టియాతని జేరి ఆకన్యక నన్నుజూపుచు ఇట్లనియె.

ఓతండ్రిగారూ! ఈపురుషుడు నాకు భర్తగా నుండవలయును. నీవు దీనికి అంగీకరింపుము అనిచెప్పెను. ఆపలుకులకు ఆతడును సరియే యనెను. పిమ్మట సాయంకాలము అగునంతవరకు అచ్చటనే యుండి " యముడు కింకరులను విడుచునట్లు " ఆచండాలుడు వృషభముల కట్లువిడచెను. మంచుచేతను మేఘములచేతను గ్రమ్మబడి దిక్కులన్నియు ధూళిచేత ఆవరింపబడినట్లుండగ అట్టిసాయంకాలమునందు మేము మువ్వురమును భూత ప్రేత పిశాచ నివాసమగు ఆస్థలమునుండి ప్రయాణమైతిమి. ఒక్క నిమిషములో వారి యునికిపట్టగు మాలపల్లెకు జేరితిమి. అచ్చట పందులు, గుఱ్ఱములు, కోతులు, కోళ్ళు, కాకులు, మొదలగునవి ఖండింపబడిన శిరస్సులతో బడియుండెను. ఎండుటకై పరువబడియున్న పచ్చి ప్రేగుల మీద వ్రాలి పక్షులు చిక్కుబడి పోవుచుండెను. అచ్చటి బాలురు చేతులయందు మాంసపు ముద్దల బట్టుకొని తినుచు తిరుగుచుండిరి. ఆమాంసముపై ముసరుచు నీగలు ధ్వనిచేయుచుండెను. అట్లు ముసరు నీగలను దప్పించుటకై యచ్చటివారు మాంసఖండములపై అతిత్వరతో అరటియాకులను గప్పుచుండిరి. అట్టి యామాలపల్లెయందు నేను క్రొత్తమామగారి ఇంట నివసించితిని. అచ్చట రక్తముతో సాటియగు ఎఱ్ఱనినేత్రములుగల మామామ మెల్లకన్నుగల మాయత్తతో " ఈపురుషుడు మనఅల్లుడు " అనిచెప్పెను. ఆమెయు దానికి అంగీకరించెను. ఇంతజెప్పనేటికి? కొన్నిదినములు ఆవిధముగనే నివసించితిని. పిమ్మట కొన్నిదినములకు మామామగారు " పాపము నరకమొసంగునట్లు " తనకూతురిని ఇచ్చి వివాహము చేసెను. ఆపురుషుడును మిక్కిలి భయంకరుడు. నల్లనివాడు. ఆతని కూతురును అట్టిదియే. కావున వారిరువురు పాప నరకములతో బోల్పబడుటకు సంపూర్ణముగ తగియుండిరి. ఇట్లు నావివాహము జరుగు సమయమున అచ్చటి మాలమాదిగలు అందరును మద్యపానముచేసి ఒడలెఱుంగక బిగ్గరగ నరచిరి. తప్పెటలను మహాధ్వనితో గొట్టిరి. అప్పుడు నాపురాకృత పాపములన్నియును మనుష్యరూపము దాల్చి ఎదుట నిలువబడినట్లు ఉండెను. ఈవిధముగ ఏడుదినములవరకు ఆపల్లెలోని వారంగరకును తృప్తిగ భోజనములును మద్యపానమును మొదలగునవి జరుగుచుండెను. పటహాది వాద్యములును పటపట

మోగుచు ఉత్సవము జరుగుచుండెను. పిమ్మట ఎనిమిది మాసములుగడచి పోయినవి. అప్పటికి ఆకన్యక రజస్వలయాయెను. క్రమముగ గర్భమును దాల్చి "ఒకయాపద మఱియొక యాపదను, లేక, దుఃఖకరములగు కార్యములగు కార్యములను బుట్టించునట్లు ఒకపుత్రికను గనెను. దానివలన నాకు దుఃఖమే అభివృద్ధియాయెను. అంత క్రమక్రమముగా నాపుత్రిక అభివృద్ధియాయెను. దానికి మూడుసంవత్సరములు వచ్చునప్పటికి నాకు దుఃఖకరుడై మఱియొక పుత్రుడు పుట్టెను. "మూర్ఖునకు దుఃఖము స్వయముగ అభివృద్ధియగునటు" ఆకన్యక అంతకంతకు బలియుచునుండెను. "దోషయుక్తమగు బుద్ధి ఆశాపాశము గలిగించు అనర్థజాలమును ఒకదానివెనుక నొకదానిని గలిగించునట్లు" నాభార్యయు క్రమక్రమముగా ప్రసవింప నారంభించి మఱియొక మూడుసంవత్సరములకు మఱియొక కొడుకును గనెను. ఈవిధముగా నాస్థితిలో ఆచండాల స్త్రీతోగూడి అనేక సంవత్సరములు గడపితిని. తగిన సంపద లేకపోవుటచేత చలి గాలి, ఎండ, మొదలగు వానివలన సంపూర్ణముగ బాధనొందుచుండ వలసియే వచ్చెను. భార్యాపుత్రుల పోషించుటకును మిక్కిలి శ్రమనొందవలసి వచ్చెను. సర్వకాల సర్వావస్థలయందును "ఈకుటుంబమును ఎట్లు పోషింతును" అను చింతయే మిక్కిటమయ్యెను. కావున నాబుద్ధి ఎప్పుడును వ్యాకులత్వము నొందియే యుండెను. ఈకారణమువలన ఏవైపుచూచినను శూన్యప్రాయమై తగులబడుచున్నట్లు గానవచ్చుచుండెను. బుద్ధి స్వస్థముగ నున్నప్పుడేకదా సర్వమును సుఖకరముగ నుండును. ఈవిధముగా అతివ్యాకులమై కాల్పబడుచున్నట్లు చిత్తముతో నేను పరితపించుచుండగా క్రమక్రమముగ కాలము గడచిపోయెను. నేను ముసలితనముచేత జీర్ణించిపోతిని. నామీసములును మంచుచేత గప్పబడిన గరికెపోగులవలె తెల్లనాయెను. ఇట్టి సమయమునందు అపరిమితమగు కరువు వచ్చెను. తృణముసహితము భూమిపై లేకపోయెను. ఒకానొకచోట నన్నును గొండిపోయెను. అప్పుడు ఆపల్లెయందుండు చండాలులు అన్నము గడ్డి ఆకులు మొదలగునవి, లేక, మృతిజెంద వలసినవారై అచ్చటనుండి లేచి వింధ్యపర్వత ప్రాంతమును జేరిరి. ఎచ్చట చూచినను గూడ నొక్క చినుకైనను పడలేదు. "ఆకాశమంతయు నిప్పులతో గప్పబడినట్లు" సూర్యకిరణములయొక్క వేడిచేత మిక్కిలి నుష్ణమై యుండెను. ఈకారణమువలన గాలియైనను చల్లగ నుండక అత్యుష్ణమై నిప్పులను చెరుగుచుండెను. ఇట్లుండుటచేత కారణములేకయే ఆవింధ్యా

రణ్యమునందు అతిభయంకరమగు దావాగ్ని పుట్టి ఒక గరికెపోచయైన మిగులకుండ అరణ్యమునెల్ల భస్మము గావించెను. మనుష్యులును ఎచ్చట నున్నవారు అచ్చటచ్చటనే నశించిపోయిరి. ఈవిధముగ దైవగతి అతివిప రీతమై మిక్కిలి శ్రమను గలిగించుటచేత మాపల్లెలోనివారు కొందరు మిత్రులతోగూడి ఆవింధ్యారణ్యమును విడచి పారిపోయిరి. కొందరు అచ్చటనే నశించిరి. మఱికొందరు బాధను ఓర్వజాలక బుద్ధిపూర్వకముగ నాదావాగ్నియందే దుమికి మృతులైరి. కొందరు పాడునూతులలోబడి మృతి నొందిరి. అట్టిసమయమునందు నేను నాభార్యాపుత్రులను పిలుచుకొని "రౌరవ నరకమునుండి తప్పించుకొనినట్లు" ఆవింధ్యారణ్యమును ఎట్లెట్లోగడచి దేశసమీపమునకు వచ్చిచేరితిని. "అచ్చట స్వరూపమునుదాల్చిన అనర్థములో అన్నట్లున్న" నాబిడ్డలను ముగ్గురిని భుజముమీదినుండి దించి అచ్చట విశ్రమించితిని. నాభార్యయు చల్లని నీడయందు విశ్రమించి ఒక బాలకుని, మఱియొక బాలికను, సమీపమున నుంచుకొని నిదురించెను. అంత పృచ్ఛకుడను నామూడవబిడ్డ నా ఎదుటనేయుండి మిక్కిలి దైన్యముతో గన్నీరు బొటబొట గార్చుచు వచ్చియు రానిమాటలతో ఇట్లనియె. వాని యందు నాకు ప్రేమ అధికము. వాడు "నాయనా! నాకు ఆకలిగా నున్నది. ఓతండ్రీ! నాకు తినుటకు మాంసమును ఇమ్ము. త్రాగుటకు రక్తము నొసంగుము." అని పలుమారు అడుగుచు రోదనముచేయుచు క్రమక్రమముగ మరణమును జెందునంతటి స్థితికి వచ్చెను. ఈవిధముగ నామూడవపుత్రుడు జెందుచున్న బాధను జూచి నాకును దుఃఖము అధికమయ్యెను. మనస్సును విరిగిపోయెను. వానిదుఃఖమునుజూచి కొంచెమైనను ఓర్వలేకపోతిని. అప్పుడు ఆయాపదను గడచుటకు మరణమునకంటె వేరు ఉపాయము ఏదియును లేదని నాకుతోచెను. అప్పుడు అందరకును దుఃఖకరమగు మరణమే నాకు పరమమిత్రుడాయెను. అంత నాభార్యగూడ నిదురించుచునే యుండెను. కావున నానిశ్చయమునకు ఎవరి యాటంకమును గలుగలేదు. అంత నాప్రాంతమునుండు కట్టెలను ప్రోవుచేసి చితిని పేర్చి అగ్నినితగిలించితిని. ఆఅగ్నియు మండుటకు నారంభించెను. అంత చటచటా శబ్దములచేత ఆఅగ్ని ( చితి ) నన్నుబిలచెను. అంత నేనును ఆచితియందు ప్రవేశింప బోవుచుండు స్థితిలో నిచ్చట సింహాసనమునుండి క్రిందపడబోగా పిమ్మట మీరందరును నన్ను బట్టుకొంటిరి. పిమ్మట మంగళవాద్య ధ్వనులను జయజయ శబ్దములచేతను క్రమముగ మేలుకాంచితిని. ఇప్పటికి

నాశరీరము నాకు తెలిసినది. “ అజ్ఞానము బహువిధములగు అవస్థాభేదములను గలిగించుచు జీవుని భ్రమింప జేయునట్లు ” నన్ను ఈమైంద్రజాలికుడు ఈవిధముగా చిత్రవిచిత్ర దశలతో భ్రమింపజేసెను. అనిచెప్పెను. ఓశ్రీరామచంద్రా! ఈవిధముగ మహాతేజస్వియగు యాలవణమహారాజు చెప్పుచుండగనే ఆమైంద్రజాలికుడు అంతర్థానము నొందెను. దానిని జూచి సభికు లిట్లనిరి.

ఓమహారాజా ! ఈతడు సామాన్యుడగు ఇంద్రజాలికుడు గాడు. ఇంద్రజాలికుడైనచో ఇంత విచిత్రమును జూపునా, చూపినవాడు బహుమానమును గైకొనక నూరక వెడలిపోవునా, కావున నిది ఒకానొక దేవమాయయే. “ సంసారమనగా, మనస్సుయొక్క రూపాంతరమే. త్రాటిని జూచి పామని తలంచునట్లు మనస్సునే జూచి సంసారమని తలంచుచున్నారు ” అని స్పష్టముగ మనకు బోధించుటకై ఇట్లు వచ్చినది. సర్వశక్తులనుగల ఆపరబ్రహ్మముయొక్క మనన శక్తితోగూడిన రూపమైన మనస్సే కదా ఈప్రపంచము. అనిసభ్యులుచెప్పి ఆశ్చర్యమగ్నులైరి.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీతమగు శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉత్పత్తిప్రకరణమున లవణోపాఖ్యానమను
పండ్రెండవసర్గ ముగిసెను.

—※—

అనిఇట్లు వశిష్ఠమహాముని చెప్పి తానుఉపదేశింపదలంచిన విషయమును ఇట్లని వివరింప నారంభించెను. ఓరామచంద్రా! మనస్సుయొక్క ప్రభావము ఇట్టిదియగుటచేత మనస్సు దేనిని చేయునో అదియే పని. మనస్సు దేనిని విడుచునో అదియే విడవబడినది. ఇంతయేకాని శరీరముతో అగునట్టికార్యమేదియును లేదు. శరీరముచేసెనేని పనియే కానేరదు. అదివిడిచెనేని విడిచినదియే కానేరదు. కావున నోదోషరహితుడా! రామా! ఎవ్వని మనస్సు సంకల్పములను విడచి నిశ్చలమగునో వానికే పరబ్రహ్మధ్యానమును ఆధ్యానమువలన ఉత్తమపదప్రాప్తియు దొరుకును. మనస్సు నియమింపబడునేని ఈసంసార భ్రాంతి యంతయు శాంతినొందును. సర్వమును మనోమయమే కదా. “ మందరపర్వతము గిరగిర తిరుగక నిలువగానే సంక్షోభము ఉడిగి క్షీరసముద్రము శాంతించినట్లు ” సంసారమూలములగు కామక్రోధాదులన్నియు శాంతించును. వాస్తవస్థితిలో కామాదిరూపములై

విషయానుభవమును సర్వకాలములయందును సంకల్పించు మనోవృత్తులు ఏవికలవో అవియేకదా సంసార విషవృక్షములకు మొలకలు.

—* చిత్తవ్యాధిచికిత్స. *—

కావున ఓ శ్రీరామచంద్రా! ఈచిత్తమను మహావ్యాధికి అవశ్యముగ చికిత్సను ఆచరింప వలయును. దానికి పరమౌషధము ఒకటొకటి గలదు. అది మనయొక్క స్వాధీనమునందే యున్నది. దానిని సాధించుటయు మిక్కిలి సులభమే. భక్షించుటకును మిక్కిలి రుచిగానే యుండును. నిశ్చయముగ ఆఔషధముచేత చిత్తవ్యాధి కుదురునని పెద్దలు చెప్పుదురు. దానిని వివరించెదను వినుము. మనోజయమును గోరు పురుషుడు మొట్టమొదట బాహ్యవిషయములను పరిత్యజింప వలయును. ఎట్లనిన, తనకు ఏఏపదార్థమునందు ఇష్టముండునో దానినే బలాత్కారముగ విడిచిపెట్టవలయును. ఇట్లు చేసిన మనస్సు స్వాధీనమగును. ఈఅభీష్టవస్తువుయొక్క పరిత్యాగము తనచేతిలోనిది. ఆప్రకారముగ చేసినయెడల అత్యుత్తమ లాభమును చేకూర్చునది. దీనిని ఎవ్వడు కష్టమని తలంచునో ఛీ, వాడు "నేలను పారాడు పురుగగునేగాని, పురుషుడగునా? కావున ఓవిచారశీలుడా! రామా! లోకమునందు ఇనుపపనిచేయువాడు వాడియగు ఆయుధముచేత కాలిన ఇనుమును నరుకునట్లు నీవును వేదాంతశాస్త్రాభ్యాసముచేతను సత్సాంగత్యబలముచేతను, వాడియైన పరితాపములు లేకుండుటచేత చల్లనైయున్న మనస్సుతో సంసారతాపముచేత కాలియున్న మనస్సును ఛేదింపుము. ఇష్టమగు పదార్థములను విడుచుట అనునదియే స్వరూపముగాగల మనోజయమునకంటె ఇతరమగు సద్గతి ఏదియును లేదు. ఆయభీష్టవస్తువును విడిచిపెట్టడమునుగూడ తన పురుషప్రయత్న బలముచేత మాత్రమే సాధింపవచ్చును. ఇట్టి సుఖసాధ్యమగు దానినిగూడ చేయలేకున్న ఇకనేమి సేయగలము. శ్రమయని తలంపక పురుషప్రయత్నముచేత కోరికలను విడిచిపెట్టిన సంకల్పములు అడంగును. ఈసంకల్ప నాశమే మనస్సును ఛేదించుటకు ప్రబలమగు ఆయుధము. ఈఆయుధముచేత నరుకబడి యాచిత్తము నశించునేని అప్పుడు పురుషుడు సర్వరూపమైనదియు, సర్వవ్యాపకమైనదియు, ఏవిధమగు సంక్షోభమును లేనిదియునగు బ్రహ్మమేయై నిలుచును. "ఇది ఇట్టిది" అని నిర్ణయించుటకు నశక్యమైన యాయుత్తమ స్థానమును జెంది, లేక, ధ్యానముచే అవలంబించి మనస్సును చిదాత్మయందు లయింపజేసి అనగా ఆమనస్సు బ్రహ్మముయొక్క వివర్తమే (భ్రాంతిచేత బ్రహ్మము

సందు బ్రహ్మాభిన్నముగ జూడబడుచున్నదియే. ) కావున దానిని బ్రహ్మ
మాత్రమునుగ అవలోకించి యాచిత్తమునకంటె అధికుడవు (చిత్తసాక్షివి)
అగుము. " ఆలోచించుట మొదలగు వికారములు నాకు లేవు. నేను ఎప్ప
టికిని నిర్మలుడను " అని నిశ్చయించుకొనుము. అది ఎట్లనిన, మొట్టమొదట
కోరికలను జయించి మనోనిగ్రహమును చేయుము. ఇట్లు శాంతమైన మన
స్సుతో సర్వాత్మకమగు బ్రహ్మరూపమును ధ్యానింపుము. పిమ్మట ఆమ
నస్సు స్వయముగా పరబ్రహ్మమే కావున ఆపరబ్రహ్మమందే యడంగును.
పిమ్మట సర్వసాక్షియగు ఆయాత్మను అట్లేధరింపుము. అనగా సర్వసాక్షి
వై నిలువుము. మనస్సు అణగిన పిమ్మట పరబ్రహ్మరూపము స్వయముగనే
శేషించునుగదా. కావున దృఢమగు పురుషప్రయత్నమును బూని పైన
వర్ణించిన విధముగ మనస్సును మనస్సు గాకుండునట్లు జేసి అనగా సంక
ల్పమే మనస్సుయొక్క స్వరూపము కావున ఆసంకల్పమును నశింపజేసి జగ
త్ప్రసిద్ధమైన యాబ్రహ్మపదమును జెందుము. అచ్చట జేరిన ఎన్నటికిని నా
శము లేదు. కావున అన్నిటికిని ఉత్సాహము ముఖ్యము. ఎట్టి అభివృద్ధి కావ
లయునన్నను ఏమాత్రముకూడ జంకకూడదు. సంశయము ఏమియును
లేకుండ విడువక ప్రయత్నించినచో మనోజయము సుఖముగనే సిద్ధించును.
మనోజయము గలిగెనేని త్రిలోకములను జయించుట అనగా తృణప్రాయ
మే. వాస్తవస్థితిలో ఆకాశరూపమగు చిత్తముకూడ వేఱుగ నున్నట్లు గా
నవచ్చుటయేకాని, బ్రహ్మాభిన్నము కాదుగదా. ఇట్లైనను భేదభావన యు
న్నంతకాలము. " ఇది చిత్తము. దానికి సాక్షియగు ఇది బ్రహ్మము " అని
తోచుచుండును. కావున ధ్యానముచేయుట అనునది సంభవించును. ఈకా
రణమువలన మొట్టమొదట మనస్సుచేత పరబ్రహ్మమును ధ్యానించి " నేను
మనస్సాక్షిని, మనోరూపుడనుకాను " అని నిశ్చయించి ఇంచుకయైనను జం
కులేక బ్రహ్మజ్ఞాన మనెడు చక్రధారచేత మనస్సును సంహరింపుము.
అప్పుడు మనోవ్యథలు ఏవియు నిన్ను బాధింపవు. ప్రకృతము మనోహర
ముగ దోచుచున్న సర్వవిషయములును వాస్తవస్థితిలో మనోహరములు కా
వని విచారదృష్టిచేత ఎరుగుదువేని అప్పుడే మనస్సుయొక్క అవయవములు
ఖండింపబడిన వగునని నాయభిప్రాయము. వాస్తవస్థితిలో దుఃఖకరములే
అయ్యున్నను విషయములను సుఖకరములనుగా దోచునట్లు చేయుట మన
స్సునకు మొదటిపని. పిమ్మటగాని కామక్రోధాదులు శాఖోపశాఖలుగా
విజృంభించి సంసారముయొక్క అభివృద్ధిని కలుగజేయ నేరవుకదా. కావున

తనకు రమ్యములని తోచిన వానిని బలాత్కారముగా విడిచి పెట్టుటయే మనోజయమునకు ముఖ్యమైన ఉపాయము. "నేను మనుష్యుడను, బ్రాహ్మణుడను, నాపేరు రాముడు, ఈవస్తువు నాది, ఆవస్తువు నాది, అది వానిది" అను సంకల్పములే (అహంకార మమకారములే) మనస్సునకు స్వరూపము. కావున ఇట్టి సంకల్పములను విడిచినంతమాత్రముననే ఆమనస్సు కొడవలితో నరుకబడిన తీగవలె నశించును. "శరత్కాలమునందలి మేఘములు వర్షముకురిసి ముగియుటచేత తేలికయై గాలిచే ఆకాశమునందు ఎట్లు చెదరగొట్టబడునో" అట్లే సంకల్ప రాహిత్యముచేత లోపల (అనగా చిదాకాశమునందు) మనస్సుకూడ చెదరగొట్టబడును. మనస్సు బ్రహ్మవివర్తమే యగుటచేత "ఇది పరబ్రహ్మమునకంటె భిన్నము కాదు" అని యథార్థమును దెలిసికొనినతోడనే ఆమనస్సు బ్రహ్మమేయగును. దానిచేత గల్పింపబడిన ప్రపంచముగూడ బ్రహ్మమే యగును. త్రాటియందు దోచిన పాము "ఇది త్రాడు" అను యథార్థజ్ఞానము కలుగగానే త్రాడే యగునుకదా. ఇంతయేగాని మనస్సునకు నాశమను నొకటి వాస్తవస్థితిలో లేదు. భేదభావన ఉన్నంతకాలము ఆమనస్సు తనను బంధించినట్లు ఉండును. అది నశించినప్పుడు ఆమనస్సు యథాపూర్వముగనే యున్నను తన్నేమియు చేయనేరదు. శరత్కాలమునందును మేఘములు పూర్వమువలెనే ఆకాశమును ఆవరించియే యున్నను ఆకాశస్వరూపమును గానరాకుండ చేయుచునే యున్నను, గాలి వీచినచో నటునిటు తొలగి ఆకాశస్వరూపమును ప్రకాశింప జేయునట్లు ఈమనస్సుకూడ యథాపూర్వముగనే యున్నను సంకల్ప రాహిత్యము (ప్రపంచరూపములగు సంకల్పములు లేకుండుట అనగా ఆసంకల్పము లున్నను "ప్రపంచబ్రహ్మలకు అభేదము" అను విషయము స్పష్టమై యుండుటచేత బ్రహ్మమయములుగానే యుండుట) అను శక్తిచేత చెదరిపోయి బ్రహ్మమును ఆవరింపదు. అనగా బ్రహ్మస్వరూపము ప్రకాశించుటకు ఏవిఘ్నమును గలిగింపదు. ఇదియే దీని నాశమను రూపము. వస్తుహాని ఎప్పటికిని లేదు. బాగుగ విచారించిన మనస్సను పదార్థమే త్రికాలములయందును బ్రహ్మవ్యతిరిక్తముగ లేదుగదా. వస్తువే లేకున్న వస్తుహాని ఎట్లుండును. "ఈపదార్థము నశించెను" అనిన "ఇది కొంతకాలముండి పిమ్మట పోయెను" అనియే యర్థమగునుగాని "ఇది పుట్టనేలేదు" అని యర్థము కానేరదు కదా. (హాని యనగా ప్రధ్వంసాభావమేకాని అత్యంతాభావము కాదుకదా.) ఇవ్విధముగ మనస్సును నశింప

జేసిన పురుషునకు ప్రళయకాల వాయువులు వీచినను సప్తసముద్రములు ఏకమైనను ద్వాదశాదిత్యులు ఒక్కమారే తమ ప్రచండ కిరణములచేత సర్వలోకములను భస్మముగావింప నారంభించినను హాని యించుకయైనను కలుగనేరదు. మనోజయము గలవాడు వాయువచే శోషింపనట్టియు జలముచేత తడుపనట్టియు అగ్నిచేత కాలనట్టియు నిర్గుణపరబ్రహ్మమే అగును గదా. కావున ఓ శ్రీరామచంద్రా! సంకల్ప రాహిత్యమను అత్యల్ప సాధనముచేత సాధింప నలవియగునదియు సర్వసిద్ధులను ఇచ్చునట్టిదియు నగు నిర్వికల్ప సమాధియను సామ్రాజ్యమునందు నిలువుము. బ్రహ్మమను ఉత్తమస్థానమును దృఢముగా నవలంబింపుము. నీకు ప్రబలశత్రువైయున్న మనస్సునకు సంకల్పములకంటె ఇతర సంపద యేమియును లేదు. ఆయుధములైనను సంకల్పములే. సైనికులును సంకల్పములే. రాజ్యముగూడ సంకల్పమే. తుదకు స్వరూపముగూడ సంకల్పమే. ఇట్లుండియును అనేకవిధములగు వస్తువులను జూపుచు నిన్ను మోహమునందు ముంచి జయించుచున్నాడు. కావున ఈరహస్యమును ఎఱిగి నీవును తగినట్లు ప్రవర్తించి దానిని జయింపుము. నీశక్తి ఆమనశ్శత్రుని శక్తికంటె ఎన్నిరెట్లో అధికము. నీదృష్టి సర్వపరిపూర్ణమైనది. నాశరహితమైనది. సర్వశక్తియుక్తమైనది. కావున నీమనస్సును జయించుటకు నీకుగల శక్తులలోని సంతోషశక్తి ఒక్కటియే చాలును. ఇట్లుండియు నీవు అశక్తునివలె మనస్సునకు లోబడనేటికి. సంతోష శక్తియుక్తమగు దృష్టిచేత ("నేను పరమానందరూపుడను. లోకమునందు రమ్యములుగా దోచు పదార్థములన్నియు నాసంబంధమువలననే అట్లు దోచుచున్నవి గాని వాస్తవస్థితిలో దేనికిని ఆనందరూపత్వము స్వభావము కాదు" అని తెలిసికొనుటచేత) ఇంచుక వీక్షించితివేని యామనస్సు మరల తలజూపదు.

ఇట్లు మనస్సును జయించి మోక్షసామ్రాజ్యమునందు శాశ్వత సుఖము నొందుము. మిక్కిలి పవిత్రమై సకల పరితాపములను నశింపజేయునది అగుటచేత మంచువలె చల్లనై సమచిత్తత్వము (సర్వమును సమానముగా జూచుట అనుగుణము) ప్రకాశించుచున్నది. అది తత్వవేత్తలై సిద్ధులగు మహానుభావులకు సహితము మిక్కిలి ఇష్టమైనది. అట్టి సమచిత్తము అపరిమితమై భేదభ్రాంతి యున్నప్పుడు బహువిధశ్రమలను గలిగించుచుండిన అహంకారమును (భేదభ్రాంతి నశించిన సర్వమును బ్రహ్మమే అగును. కావున వేపబడిన విత్తనమువలె నీయహంకారము స్వరూపముతో

నున్నను ఏవిధమగు బాధను కలిగింపజాలదు. అని తెలిసికొనవలయును ) సంపూర్ణముగ నశింపజేయును. ( ఈయహంకార నాశముగూడ చిత్తనాశమువలెనే తత్వజ్ఞానమాత్రమే అనగా " ఇది పరబ్రహ్మమునకంటె భిన్నము కాదు " అని యథార్థమును ఎఱుగుటమాత్రమే అని తెలిసికొనవలయును. ) ఇట్లు అహంకారము నశింపగా ఏపదార్థము మిగిలి యుండునో అదియే పరతత్వము. అట్టి ఆపరమాత్మ నీకు శీఘ్రకాలమున అనుభవగోచరుడగునుగాక. అని ఇట్లు ఆశీర్వాద పూర్వకముగ మనోజయ మార్గమును తత్ఫలమును ఉపదేశించి ఆవిషయమునే మఱియొక విధముగ స్పష్టము చేయువాడై ఆవశిష్ఠమహాముని మఱియును ఇట్లనియె.

ఓశ్రీరామచంద్రా! మఱియొక విశేషమును వివరించెదను వినుము. లోకమునందు చాంచల్యములేని మనస్సు ఎచ్చటను గానవచ్చుట లేదుగదా. ఈకారణమువలన అగ్నికి వేడిమి స్వాభావికమైనట్లు ఈమనస్సునకు గూడ చాంచల్యము స్వాభావికము. ఇట్లు చెప్పుటవలన మనస్సు బ్రహ్మభిన్నమై ఉన్నదనియు దానికి ఈచాంచల్యము స్వభావమైనదనియు దలంపకుము. బ్రహ్మమునందు అతిచంచల స్వభావము గలదియైన ఏచలనశక్తిగలదో అదియే మనోరూపముగ నున్నదని ఇదివరకే వివరించి యున్నానుగదా. కావున మనస్సునకు స్వభావముగా నున్నదని చెప్పబడిన శక్తి ఆచలనశక్తియే. అదియే సర్వ ప్రపంచరూపముతో నున్నది. సర్వప్రపంచము దానినుండియే పుట్టినది. కావున నదియే ఈప్రపంచము. ఈప్రపంచమే అది. కావున ఏమనస్సు అట్టి చలన స్వభావమును విడిచి నిశ్చలమై యుండునో అదియే మృతిజెందినది ( నశించినది ) అనబడును. తపస్సును, శాస్త్రమును, సిద్ధాంతమును, తుదకు మోక్షమును, ఆనిశ్చల చిత్తమే అని పెద్దలు చెప్పుదురు. మఱియును ఓశ్రీరామచంద్రా! అవిద్యయనియు, అజ్ఞానమనియు, సంసారమనియు, వ్యవహరింప బడునదిగూడ ఆమనశ్చాంచల్యమే కాని, వేఱొకటికాదు. కావున బ్రహ్మవిచార బలముచేత ఆచాంచల్యమును అణంచుము. అభీష్టవస్తు పరిత్యాగమే దీనికి ఉపాయమని ఇదివరకే వివరించి యున్నాను. ఆయుపాయమును అభ్యసించుటచేత క్రమక్రమముగ సంసారమను పేరుగల అవిద్య హృదయాకాశమునందు నిలువక నశించెనేని అప్పుడు మోక్షరూపమగు శ్రేయస్సు పొందనగును. వాస్తవస్థితిలో మనస్సనగా వాసనయేకదా.

—* మనస్సుయొక్క స్వరూపము. *—

ఉన్నది. లేదు. అనబడు రెండు పదార్థములకును చేతన అచేతన వస్తువులకును నడుమనుండి ఏపదార్థము "ఉయ్యాలవలె" ఊగుచుండునో, అదియే మనస్సు. (దీనిస్వరూపమును ఎట్లును నిర్ణయించుటకు వీలులేదనియు రెండు పక్షములయందును ఇది ప్రవేశించుచునే యుండుననియు భావము.) మనస్సుయొక్క స్వరూపము ఇది యగుటచేత ఎవ్వడైన నొకపురుషుడు జడములగు ప్రాపంచిక పదార్థములనే ధ్యానించుచుండెనేని ఆయభ్యాసము దృఢమగుకొలది వానిమనస్సు ప్రపంచ రూపముతోనే పరిణమించును. దానికి జడచేతన స్వరూపములు రెండును గలవు కదా. ఈకారణమువలన జడమును ధ్యానించునప్పుడు జడమే యగును. మఱియు దానికి చేతనస్వరూపము కలదు. కావున ఎవ్వడైన నొకపురుషుడు ప్రపంచధ్యానమును వదలి బ్రహ్మస్వరూపమును ధ్యానించునేని ఆయభ్యాసము దృఢమగుకొలది వానిమనస్సు బ్రహ్మరూపముతో పరిణమించి జడస్వభావమును వదలును. ఇవ్విధముగ దానికి రెండురూపములును ఉండుటచేత వారువారు చేయు ప్రయత్నములను అనుసరించి ధ్యానములను అనుసరించి ఆయారూపములతో పరిణమించుచుండును. కావున మహాత్ములు ప్రాపంచిక పదార్థములను ధ్యానించుటను మాని సుఖముగ సర్వకాల సర్వావస్థలయందును దృఢమగు పురుష ప్రయత్నమును బూని అభీష్టవస్తు పరిత్యాగ పూర్వకముగ ఈమనస్సును పరబ్రహ్మమునందే నిలువుదురు. ఆపరబ్రహ్మమునే ధ్యానించుదురు. అట్లుచేసిన చేతన స్వభావముకూడ గలది యగుటచేత మనస్సు బ్రహ్మమాత్రమై నిలుచును. అప్పుడు పరబ్రహ్మప్రాప్తి సిద్ధించుటచేత మోక్షము దొరుకును గదా. కావున ఓరామా! నీవును అట్లే పురుష ప్రయత్నమును బూని ఆత్మధ్యానాసక్తమగు చిత్తముచేతనే చిత్తమును నిరోధించి దుఃఖశూన్యమగు బ్రహ్మపదమును అవలంబించి ఏవిధమగు సంకోచమును లేక, నిశ్చలుడవు కమ్ము.

ఓరాఘవా! రఘుకులసార్వభౌమా! మనస్సును జయింపవలయునని మనస్సే జయింపవలయునుగాని మఱియొకటి జయింపనేరదు. రాజును నిగ్రహింపవలయుననిన రాజునకే సాధ్యమగునుగాని, మఱియొకనికి సాధ్యమగునా? కావున బాగుగ విచారించినచో ఆశయను మొసలినోట జిక్కి సంసార సముద్రమునబడ అందలి సుడులచేత గిరగిర ద్రిప్పబడుచున్న వారలకు స్వకీయమగు మనస్సే ఓడ. అంతకంటె సంసారతరణమునకు ఇతర

ఉపాయము లేదు. ఓ శ్రీరామచంద్రా ! ఈకారణమువలన నీవును భ్రాంతిని విడచి ఇప్పుడు నిన్ను బిగియగట్టియున్న దృఢమైన రజ్జువగు మనస్సును మనస్సుచేతనే ఖండింపుము సంసార సముద్రమునుండి ఆత్మను ఉద్ధరింపుము. సంసార తరణమునకు మనోవ్యతిరిక్తమగు ఉపాయము ఏదియును లేదు కదా. "మనోజయమునకు ఏమి చేయవలయును" అనియెదవేమో వినుము. దీనికి అభ్యాసమనియు వైరాగ్యమనియు రెండు ఉపాయములు గలవు. ఈమనస్సునకు వాసనయే స్వరూపము. అది బహుకాలమునుండి అనేకరూపములుగానే చిదాకాశమునందు నిలచియున్నది. కావున సాధకుడు నిగ్రహమునకై ప్రయత్నించుచున్నను, అది (వాసన) అంకురింపక మానదు. కావున అప్పుడు ఏఏసంస్కారమును అవలంబించి యామనస్సు చలించునో అనగా ఆమనస్సు ఏఏసంకల్పములను జేయునో ఆయాసంకల్పములనుండి త్రిప్పి సాధకుడగువాడు మరల మరల ఆత్మస్వరూపమునందే నిలుపుచుండవలయును. ఈవిషయమునందు దృఢమైన వైరాగ్యము వానికి సంపూర్ణసహాయమును చేయును. ఎట్లనిన, మనస్సు దానికి ఇష్టమగు ఏదియో ఒక పదార్థమును సంకల్పించును కదా. సాధకుడన్ననో, అభీష్టవస్తు పరిత్యాగదీక్షకలవాడు, కావున దాని సంకల్పమును బలాత్కారముగ మఱలించుచుండును. ఈవిధముగ అభ్యాసముచేతను వైరాగ్యముచేతను మనస్సు ఏఏసంకల్పరూపములతో చలించునో ఆసంకల్పములనెల్లను అడగించుచు వచ్చిన ఆబుద్ధిమంతునకు అవిద్య (అజ్ఞానము) నశించిపోవును. కావున నీవు మొట్టమొదట భోగములయందు ఇచ్ఛయను సంస్కారమును విడువుము. సామాన్యముగ భోగములు సర్వజనులచేతను ప్రేమింపబడునవి యగుటచేత వానిని విడచుటయే వైరాగ్యము. పిమ్మట "నేను, వాడు, బ్రహ్మము, ప్రపంచము" అను మొదలగు భేదసంస్కారమును విడువుము. వైరాగ్యముచేత ఇష్టానిష్ట వస్తువులయందు రాగద్వేషములు లేక, సమభావము దృఢమైన పిమ్మట శాస్త్రవిచారము ఒకించుక యున్నయెడల అభేదజ్ఞానము గలుగుట మిక్కిలి సులభము. భేదసంస్కారమును దృఢము గావించునవి రాగద్వేషములే కదా. ఈవిధముగ భేదవాసనను వదలి పిమ్మట "ఈప్రపంచము కలదు. ఇది బ్రహ్మమునకంటె వేరుకాదు. ఈప్రపంచము లేదు. బ్రహ్మమే ఉన్నది" అను అభిప్రాయములను సహితము వదలి సంకల్ప వికల్ప శూన్యుడవై సుఖింపుము. మనస్సునందు ఏది తలంపునకు వచ్చునో, దానిదానిని అభ్యాస వైరాగ్యబలములచేత విడిచిపెట్టుటయే మనో

నాశము. ఇదియే అవిద్యానాశము. దీనివలననే మోక్షసిద్ధి కలుగును. ఆశ లేకుండుటయే మోక్షము. ఆశ కలిగియుండుటయే బంధము. పైనిరూపణమువలన ఈవిషయము స్పష్టమైనదికదా. "అభీష్ట వస్తువులను విడుచుటచేత మనోజయము కలుగును. దానిచేత మోక్ష మబ్బును" అనుటకంటె ఈవిషయమున ఇంకెట్లు జెప్పవలయును. కావున ఆశాజయమునుగూర్చి ప్రయత్నించినచో ఒకనిమిషమున పరబ్రహ్మప్రాప్తి కలుగును.

మఱియు అవిద్యయనునది ఎప్పటికిని లేనిదియే. అది బుద్ధిహీనులయందు ఉండును. విచారము చేయలేక ఉండుటయేకదా అవిద్యాస్వరూపము. ఆత్మ, బ్రహ్మమే కావునను, ఆబ్రహ్మమునకు నిత్యవిజ్ఞానమే స్వరూపమగుటచేతను "విచారింప నేరనివాడు ఒకడున్నాడు" అనుటయే సంభవింపదు కదా. కావున పురుషప్రయత్నము చేయలేని సోమరులచిత్తము అనాది వాసనా బలమునందు ప్రపంచాభిముఖమై యథార్థమును ప్రకటింపకుండుటచేత దానికి అవిద్య (అజ్ఞానము అనగా తత్వమును దెలిసికొనలేక ఉండుట) అని పేరు బెట్టియున్నాము. నామానుసారముగ ఒకరూపమునుగూడ అంగీకరించియున్నాము. ఇంతయేగాని స్వప్రకాశ స్వరూపుడగు బ్రహ్మమునకు ఆవరణమై ఒకపదార్థము ఉండుననుటయే సంభవింపదు కదా. కావున నది జ్ఞానికి ఉన్నదనుట ఎట్లు. అది వాస్తవస్థితిలో ఎవ్వనికిని లేదుకదా. కావున లేనిదానిని పోగొట్టుటకు ఎంత ప్రయత్నము కావలయును. ఈకారణమువలన, ఓ శ్రీరామచంద్రా! కొంచము విమర్శించి చూచితివేని సర్వమును సుఖసాధ్యమే. ఇట్లు వశిష్ఠు చెప్పిన విని శ్రీరామచంద్రుడు మఱియు ఇట్లనియె.

ఓభగవంతుడా! వశిష్ఠమహామునీ! పురుషునకు అవిద్యా బలమువలన జనించి మిక్కిలి బాధకరమై ఆత్మస్వరూపమును తెలిసికొనుటకు గొప్ప ఆటంకమైయున్న ఈగ్రుడ్డితనము ఎట్లు నశించునో, మఱియొకమారు వివరముగా ఆనతిండు. అనిన వశిష్ఠమహాముని ఇట్లు సమాధానము చెప్ప నారంభించెను. ఓశ్రీరామభద్రా! చెప్పెదను. వినుము. దుఃఖమను ముండ్లచెట్లతో నిండిన సంసారమను శిఖరములపై ఆ అవిద్య మనస్సుతోగూడ ఈజీవుని నిటునటు గొట్టుచున్నది. అయినను "ఆత్మను తెలిసికొనవలయును" అను ఇచ్ఛ దానికి వినాశహేతువు. సకల భ్రాంతికిని శత్రువు. ఇట్టి ఈ ఇచ్ఛ జనింపగానే ఆ అవిద్య ఇక గానరాదు. పరబ్రహ్మమును చూచుటకు ఆరంభింపగానే దీనికి స్వరూపమే నశించి పోవును. వాస్తవ-

స్థితిలో భేదవాసన యుండి "పరబ్రహ్మము వేరు. అవిద్య వేరు" అను తలంపు ఉన్నప్పుడుమాత్రమే కదా ఆ అవిద్య బ్రహ్మభిన్నముగ గానవచ్చును. "సర్వమును పరబ్రహ్మమే" అని తెలుసుకొనినప్పుడు అదియు పరబ్రహ్మమునందే లయము నొందును. సర్వప్రపంచమును బ్రహ్మమయముగ జూచువానికి బ్రహ్మభిన్నమగు పదార్థమే కానరాదుగదా. కావున ఓ రాఘవా! శ్రీరామా! ఈయవిద్య అనునది కేవలము ఇచ్ఛామాత్రమే. అనగా సంకల్పమాత్రమే. లేక, ఆశామాత్రమే. కావున అది నశించుటయే అనగా ఆశ నశించుటయే మోక్షము. సంకల్పరాహిత్యమను శస్త్రమును చేతబూనినచో, ఆ మోక్షముగూడ సిద్ధించును. మనస్సను ఆకాశమునందు వాసనలను చీకటి కొంచెమైనను నశించెనేని పిమ్మట జ్ఞానరూపుడనే పరమాత్మయను సూర్యుడు ఉదయించును. ఆతని ఉదయముచేత అంధకారమువలన గలిగిన మాలిన్యము అంతయును నశించును. వాస్తవస్థితిలో చిత్తము ప్రపంచవాసనలు విడిచి ఆత్మాభిముఖ మగుటకు ఆరంభించు నంతవరకే ప్రయత్నము కావలయును గాని, పిమ్మట స్వయముగానే సర్వమును సిద్ధించును. బ్రహ్మ ప్రకాశము ఇంచుక సోకినచో, బ్రహ్మానంద సముద్రమునందు ఇంచుక నోలలాడ గలిగినచో, మనస్సు అన్ని విషయములను, సంకల్పింప నుత్సహింపదు కదా. కావున బలాత్కారముగ దృఢమగు ప్రయత్నముతో అభీష్టవస్తు పరిత్యాగ పూర్వకముగ బహిర్ముఖముగ నుండు మనస్సును త్రిప్పి అంతర్ముఖము చేయుము.

ఓ శ్రీరామా! నీప్రయత్నము అంతవరకే. పిమ్మట అన్నియు అప్రయత్నముగనే చేకూరును. అనిన సర్వమును తెలిసికొని శ్రీరామచంద్రుడు ఇట్లని ప్రశ్నించె. ఓ బ్రాహ్మణోత్తమా! వశిష్ఠమహాముని! ఈకనుబడు సర్వపదార్థములును అవిద్యయే. అదియును ఆత్మభావనచేత నశించును కదా. ఆయాత్మ ఎట్టివాడు వాని నెఱిగినగదా ధ్యానింపవలయును. అనిన ఆత్మస్వరూపమును వివరించువాడై వశిష్ఠమహాముని ఇట్లనియె.

—* ఆత్మస్వరూప నిరూపణము. *—

ఓ శ్రీరామచంద్రా! దృశ్యసంబంధము, లేక, సర్వపదార్థములయందును ఒకతీరుననే వ్యాపించియున్న మనోయథార్థతత్త్వము ఏదికలదో అదియే ఆత్మ. ఆతడే పరమేశ్వరుడు. ఇంతకంటె అధికముగా ఆ ఆత్మనియొక్క స్వరూపమును వర్ణించి చెప్పుటకు వీలులేదు. ఆయనను చెప్పుటకు యథార్థస్థితిలో పదములే లేవు. లోకమునందు ఏదియైన ఒక గుణమును

గాని, స్వభావమునుగాని, జాతినిగాని, కలిగియున్న పదార్థమునకుమాత్రమే నామముకలదు. కాని, అన్యమునకు లేదు కదా. ఈ ఆత్మకన్ననో, గుణము మొదలగునవి ఏవియును లేవు. కావున నామము ఉండుటకు వీలు లేదు. ఈసమస్తము వాస్తవస్థితిలో జ్ఞానరూపము, నిత్యము, నాశరహితము, నగు పరబ్రహ్మమే. ఆబ్రహ్మమునకంటె అతిరిక్తముగ మనస్సను పేరుగలదొకకల్పన అనగా పదార్థము బొత్తిగానే లేదు. "ఆబ్రహ్మము చలనశక్తితో ప్రకాశించునప్పుడు మనస్సని పిలువ బడుచున్నారు" అని ఇదివరకే నిరూపించియున్నాము కదా. ఇంతయేల, ఈమూడులోకములయందును ఏపదార్థమును బుట్టుటయులేదు. నశించుటయు లేదు. మఱియు దేనికిని ప్రత్యేకమగు సత్త (ఉనికి) లేదు. "ఆకాశము కలదు. వాయువు కలదు" అని సర్వపదార్థములతోగూడ సత్తను వ్యవహరించుచున్నను, ప్రతిపదార్థమునకును ప్రత్యేక సత్తయుండుటకు వీలులేదు. సత్తయనగా, ఉనికి. ఇది ఏపదార్థమును ఆశ్రయించినను ఒకటియే. ఒకకార్యమును ఆచరించునదియే. కావున "సత్తలు రెండుకలవు" అనుటకు ఎట్లును వీలులేదు. ఆ సత్త బ్రహ్మమే అగుటచేత నైయుక్తి ననుసరించి ఏపదార్థమును బ్రహ్మభిన్నము కానేరదు. ఈకారణమువలన ఏకరూపమైనదియు, స్వప్రకాశమైనదియు, ఎచ్చుతక్కువలు, లేక, అంతటను సామాన్యముగ వ్యాపించియున్నదియు, నాశరహితమైనదియు, దృశ్యసంబంధము లేనిదియు, జ్ఞానమాత్ర స్వరూపమైనదియు, నగు పరబ్రహ్మము ఒకటియే కలదు. దానికంటె ఇతరమైనదియు, ఎచ్చుటను లేదు. ఇకను ఏమనిన, బ్రహ్మరూపమగు అనిత్యవిజ్ఞానమే నాశరహితమైనట్టియు, సర్వవ్యాపకమైనట్టియు, పరిశుద్ధమైనట్టియు, ఇతరవస్తు సంబంధములేక, శుద్ధజ్ఞానమాత్రమే యైనట్టియు, ఏవిధములగు ఉపద్రవములును లేనట్టియు, సంక్షోభములు, లేక, శాంతమైనట్టియు, ఇది అది అని లేక, సర్వదేశ సర్వకాలములయందును ఏకరూపముగ విస్తరించియున్నదియు, ఏవికారములును లేనిదియు, నగు - స్వస్వరూపమునందే ఈప్రపంచమును గల్పించెను. తనస్వభావము ఎట్టిదియైనను సర్వశక్తులు తనకు గలవు. కావున తన మనన శక్తిచేత జాడ్యశక్తిని (జడముగనుండుట అనుశక్తిని) ప్రకాశింపజేసెను. జాడ్యశక్తితోగూడిన బ్రహ్మమే ప్రపంచశబ్దముతో వ్యవహరింప బడుచున్నాడని ఇదివరకే జెప్పియున్నానుగదా. ఇట్లు కల్పించి ఆపదార్థములపై అది (జ్ఞానము) స్వయముగనే మనన శక్తియుక్తమై ప్రసరించుచున్నది.

ఈవిధముగా మనన శక్తితోఁగూడిన ఈజ్ఞానముననే మనస్సని వ్యవహారము. ఏది ఎట్లున్నను, అజ్ఞానమునకుమాత్రము వివిధములగు కొరతయును స్వరూపభేదమును లేదు. వాస్తవస్థితిలో ఉపాధులకే భేదములు గలవు కాని, బ్రహ్మము అన్నిటనొక్కటియే. ఆ ఉపాధులును కల్పనామాత్రములే యగుటచేత బ్రహ్మభిన్నములు కానేరవు కదా. వాస్తవస్థితిలో సర్వప్రపంచ కారణమై అద్వితీయబ్రహ్మమునందు భేదమును గల్పింపగలదియై యున్న ఈమనోరూపశక్తి సర్వవ్యాపకమగు ఆబ్రహ్మమునుండియే "జలమునుండి తరంగముజనించినట్లు" అభేదముగ జనించెను. పిమ్మట ఆమనస్సునుండియే సర్వప్రపంచము కలిగినది. కావున ఈసర్వమును సంకల్పసిద్ధమై సంకల్పమువలననే అణగును. "లోకమునందు వాయువునుండి జనించిన అగ్ని ఆవాయువుచేతనే చల్లారునట్లు" ప్రతిపదార్థమును ఏకారణమువలన పుట్టినదో, దానిచేతనే నశించుననుట అనుభవసిద్ధమై యున్నదికదా. కావున "నేను బ్రహ్మమునకంటె వేరు" అను సంకల్పము దృఢమై యుండెనేని అప్పుడు ఆమనస్సునకు (మనోరూపుడగు జీవునకు) బంధము కలుగును. "బ్రహ్మమునకంటె భిన్నమగు పదార్థములేదు" అను సంకల్పము దృఢమయ్యెనేని దానికి ముక్తి కలుగును. అది ఎట్లనిన, మొట్టమొదట తనను బ్రహ్మభిన్నునిగా దలంచిన దేహచిత్తాదులకు గల ధర్మములను పురుషుడు తనయందు ఆరోపించుకొనును. "నేను కృశించియున్నాను. దుఃఖించుచున్నాను. నాకు బంధము ఉన్నది. చేతులు కాళ్ళు మొదలగు అవయవములు ఉన్నవి" అని సంకల్పించుచుండును. ఈ సంకల్పబలముచేత బద్ధుడగును. ఇట్లుగాక మనస్సును అంతర్ముఖముచేసి తత్త్వమును ఎఱిగిన బ్రహ్మమునకంటె తాను భిన్నుడు కాదను విషయము తెలిసికొని దేహము చిత్తము మొదలగువాని ధర్మములను తనయందు ఆరోపించుకొనడు. అప్పుడు పూర్వమువలెగాక "నాకు సుఖదుఃఖములు లేవు. నాకంటె భిన్నమగు పదార్థమేలేదు. ఇక నాకు బంధము ఎక్కడినుండి వచ్చును. నాకు శరీరమే లేదు" అనియే సంకల్పించును. ఈసంకల్పప్రభావమువలన ముక్తుడై స్వస్వరూపస్థితిని జెందును. "దేహమే ఆత్మ అను అభిమానము సర్వజనులకును ఏకరూపముగ నున్నది కదా. అది ఎట్లుతొలగును." అనియెదవేమో వినుము. బొత్తిగా విమర్శ చేయలేనివారికి అట్లే తోచగలదు. నిశ్చయమే యైనను కొంచెము విమర్శించిన ఆయభిమానము స్వయముగనే విడిపోవును. వాస్తవస్థితిలో జీవుడు దేహముగలవాడే లేడు. జీవుడు స్వేచ్ఛచేత

నుడు, దేహము అచేతనము. అది యట్లుండ, దేహమునకు అవయవములు గలవు. జ్ఞానరూపుడగుటచేత జీవునకు లేవు. ఈవిధముగ సర్వమును ఎఱిగియే బుద్ధిమంతుడు "నేను మాంసమునుగాను. ఎముకలను గాను. కావున నేను దేహమును కానేరను. ఈదేహమునకంటే నేను అన్యుడనే" అని చిత్తమునందు ఎవడు నిశ్చయించుకొనునో అట్టివానికి సంకల్ప బలమువలన ముక్తి కలుగును.

కావున ఓశ్రీరామచంద్రా ! పైన వర్ణించిన విధముగా ఆత్మ భిన్నములగు దేహాదులను ఆత్మగా భావించుటయే స్వరూపముగాగల ఈఅవిద్య అజ్ఞానిచేత సంకల్పశక్తివలన గల్పింపబడినదియే. జ్ఞానికి అట్టి సంకల్పము ( అనాత్మయందు ఆత్మభావన ) లేదు. కావున అవిద్యయు లేదు. లోకమునందు సర్వ విషయములయందును జ్ఞానవంతులగువారు దేనిని అంగీకరింతురో అదియే ప్రామాణిక మగును. కావున ఇచ్చటగూడ "అవిద్య బొత్తిగ లేదు" అనుటయే ప్రామాణికమగు అంశము. ఎటుజూచినను మనస్సుకంటే అధికమగు పదార్థము లేదు. సర్వమును మనస్సునకు అధీనమైనదియే. ఆమనస్సు దేనినిసంకల్పించునో రాజాజ్ఞను మంత్రులు నెరవేర్చునట్లు ఇంద్రియములు దానిని తత్క్షణమున నెరవేర్చును. కావున మనస్సంకల్పముచేత పుట్టిన అవిద్య మనస్సంకల్పముచేతనే అడంగును. కావున పురుషప్రయత్న బలముచేత భోగేచ్ఛను సమూలముగ నిర్మూలింప వలయును. దానిచేత మనస్సు నశించును. అవిద్యయు తనంతనే ధ్వంసమగును. బంధమునకు సంకల్పమునకంటే ఇతరకారణము ఏదియులేదు. "వీరునాపుత్రులు. ఇదినాధనము. నాపేరుఇది. ఇదినాది. ఇదినాదికాదు." అనుమొదలగు ఇంద్రజాలమంతయు సంకల్ప మాత్రముచేతనే ప్రవర్తించు చున్నది. వాసనా పరిత్యాగముచేత సర్వమును శూన్యరూపమగును. కావున, ఓరఘుకులతిలకా! రామా! నీవు ఆత్మకాని, దేహమునందు ఆత్మాభిమానమునుంచి అజ్ఞానివలె ఏల ఏడ్చెదవు. సర్వము సంకల్పమయమే. కావున జ్ఞానవంతుడవై సంసార మయమగు సంకల్పమును విడువుము. నిరర్థకమగు అజ్ఞానమును పరిత్యజింపుము.

ఓరాఘవా ! రామచంద్రా ! నీవు చేతన స్వరూపుడవు. చూచుట, వినుట, మాటలాడుట, మొదలగు కార్యములను ఆచరింప గలవాడవు. ఈదేహము జ్ఞానశూన్యము. ఇట్లగుటచేత చూచుట, మాటలాడుట మొదలగు కార్యములను జేయనేరదు. మరణము నొందిన పిమ్మట ఈదేహము

ఇట్లేయుండుటయు, ఏకార్యమును జేయలేకుండుటయు, సర్వానుభవ సిద్ధమగు విషయమే కదా. కావున అన్నివిధముల నీకు విరుద్ధముగా నున్న ఈదేహముతో ఏమిసంబంధము కలదు. ఇట్లు సంబంధము ఏమిలేని ఈదేహమునకై నీవేల కష్టపడవలయును. దుఃఖము నొందవలయును. సంసారమునందు జెందుచున్న బాధలన్నియు ఈదేహము కొరకయ్యేకదా. ఆహా, ఇదిఏమిచిత్రము. యథార్థమైయున్న పరబ్రహ్మము అందరకును మఱపునకు వచ్చెను. అసత్యమై మనోమాత్ర కల్పితమై యున్న అవిద్య మాత్రము అందరియెడను విజృంభించుచున్నది. కావున ఓ శ్రీరామా! నీవు సంకల్ప జయము కలిగి జీవన్ముక్తుడవగుము. అచ్చటచ్చట బహువిధములైన వర్ణములగు వర్ణములచేత వ్రాయబడియున్న ప్రతిమలు స్ఫటికమునందు ప్రతిబింబించినను ఆస్ఫటికమునకు వానివర్ణములు అంటనట్లు, నీకును సర్వవ్యవహారములను పూర్వమువలెనే ఆచరించుచున్నను తత్సంబంధమగు రాగద్వేషాది వికారములు అంటకుండునుగాక. రాగరూపమగు సంకల్పమే ప్రతివానిచేతను సర్వకార్యములను అభిమాన పూర్వకముగ జయించుచున్నది. ద్వేషరూపమగు సంకల్పమే అనిష్ట కార్యములనుండి అభిమానరాహిత్యముతో నివర్తింపజేయుచున్నది. ఇట్లు సర్వము సంకల్ప మూలమే యగుటచేతనే మనస్సుచేత ఆచరింపబడనిపని పనియే కాకపోవుటచేతను, నీవు సంకల్పరహితముగ అనగా రాగద్వేషాది శూన్యముగ దేహమాత్రముతో లోకానుసారముగ దేనిని ఆచరించినను నీకు హానికలుగదు. ఇదియే జీవన్ముక్తుని లక్షణము. ఓభరద్వాజా! ఈవిధముగ వసిష్ఠమహాముని ఉపదేశింపగానే చిత్తము వికసింప సంతోషించి శ్రీరామచంద్రు డిట్లనియె.

ఓమహాత్మా! భగవంతుడా! వశిష్ఠమహాముని! ఇదిఏమి యాశ్చర్యము. తామర కాడలలోనుండి వచ్చు దారములతో పర్వతములు దృఢముగ బంధింపబడి యున్నవి. ఈఅవిద్య బొత్తిగ లేనిదయ్యును సర్వప్రపంచమును ధ్వంసము చేయుచున్నది. సంపూర్ణముగ శూన్యరూపమగు పదార్థముచేత గూడ ఈప్రపంచము సంకెళ్ళ చేతనువలె దృఢముగ బంధింపబడినె ననిన ఆహా, గెడ్డిపరకకూడా వజ్రాయుధమయ్యెను.

—✻ లవణమహారాజు చండాలుడైన కారణము. ✻—

ఓవశిష్ఠమహామునీంద్రా! మీ అనుగ్రహమువలన ఆత్మవిషయమైన సంశయము దీరినది గాని, మఱియొక సందేహము కలదు. ఆలవణమహారాజు మహా ఉత్తముడని అనతిచ్చితిరిగదా. అట్టివానికి అఘోరమైన ఆపద

పలకలిగెను. అనిన వశిష్ఠమహాముని యిట్లనియె. ఓరఘురామా ! వినుము. మనోభ్రాంతివలన నాలవణ మహారాజునకు చండాలత్వము గలిగిన విధము మిక్కిలి అద్భుతము. దానిని వివరించెదను. వినుము. ఈవృత్తాంతము విని నచో “ సమస్తకార్యములను చేయునదియు దానిఫలమును అనుభవించున దియు మనస్సేకాని, శరీరముకాదు. అనువిషయము తేటపడును. ఓదోష రహితుడా ! రఘుకులతిలకా ! శ్రీరామా ! హరిశ్చంద్రుని వంశమువాడైన ఆలవణమహారాజు ఒకనాడు ఏకాంతమునగూర్చుండి యిట్లని విచారిం చెను. నాపితామహుడు సర్వలోకమును జయించి రాజసూయయాగమును చేసెను. నేనును దానినిమనస్సుతో నాచరించెదను గాక. అని ఇట్లు విచా రించి మనస్సుతోనే యజ్ఞసంభారములను గల్పించి యాగదీక్షయందు నిల చెను ఇట్లు సంకల్ప మాత్రముచేతనే దీక్షితుడై మనస్సుతోనే ఋత్విజుల పిలిచెను. దేవతులను అభిముఖుల గావించుకొనియెను. సభకుగూడ బిలచె ను. అగ్నిహోత్రమును ప్రజ్వలింపజేసెను. ఈవిధముగ సంకల్పమాత్రము చేతనే ఆప్రభువు యజ్ఞమును ఆచరింపుచు దేవతలను, బ్రాహ్మణులను, ఋషులను, పూజించుచుండగ ఒక సంవత్సరకాలము గడచెను. కొంచెము అధికముగూడ నయ్యెను. ఆయజ్ఞమువలె ఇదికూడ అనగా కొంచె మధిక ముగ సంవత్సరము గడచుటగూడ సంకల్పమాత్రమే అయ్యుండెనని తెలి సికొనుము. ఇదియునుగాక ఆయజ్ఞమును ఉద్యానవనమునందు జేయుచుం డెను. ఈసంకల్పములను తన ఉద్యానవనమునందే గూర్చుండి చేయుటకు నారంభించి అస్తమానమునకు పైవర్ణించిన విధముగ యజ్ఞమును ముగించి సంకల్పముచేతనే తనధనమును బ్రాహ్మణాది సర్వజనులకు దక్షిణగా ఇచ్చి మేల్కొనెను.

ఓశ్రీరామచంద్రా! ఈవిధముగ ఆలవణమహారాజు తదేకాయత్త మగు మనస్సుచేత రాజసూయ యాగమును చేసెను. అట్లే సంకల్పమా త్రముచేతనే మొట్టమొదట వర్ణింపబడిన విధముగ ( అనగా చండాలుడ గుట మొదలగువాటిని ) అనుభవించెను. కావున ఓరఘుకుల నందనా ! శ్రీరామా ! సుఖదుఃఖములను అనుభవించునది మనస్సేకాని, నీవుకావు. నీవు పురుషప్రయత్నమును ఆచరించి దాని నెట్లుత్రిప్పిన నట్లువచ్చునని ఇది వరకే నిరూపించియున్నాను. కావున జన్మముకడతేరి పవిత్రమగుటకు మా ర్గమైయున్న పరబ్రహ్మమునందు ఆమనస్సును ప్రవేశింపజేయుము. అప్పుడు ఆమనస్సు బ్రహ్మమాత్రమై మోక్షదాయకమై యిట్లననేల, మోక్షరూపమై

నిలచును. ఇకను ఆ ఇంద్రజాలకుని వృత్తాంతమును వినుము. ఓ శ్రీరామా! నేను ఆ ఇంద్రజాలకుడు లవణమహారాజుయొక్క సభయందు ప్రవేశించిన ప్పుడు అచటనేయుంటిని. సర్వమును ప్రత్యక్షముగ జూచితిని. ఆ నైంద్ర జాలికుడు అట్లంతర్ధానము నొందగానే సభ్యులును, ఆ లవణమహారాజును, వానియొక్క వృత్తాంతమునుగూర్చి నన్ను అడిగిరి. నేనును కొంతవిచా రించి దివ్యదృష్టితోజూచి వానినిగూర్చియు, వానికార్యమును గూర్చియు, ఇట్లనిచెప్పితిని. దానిని వివరించి చెప్పెదను వినుము. ఓ శ్రీరామా! ఏపురు షుడు రాజసూయయాగమును ఆచరించునో అట్టివాడు మొట్టమొదట అనేక రీతులతోగూడిన మహాదుఃఖమును పండ్రెండు సంవత్సరములు అనుభవించి గాని, పుణ్యలోకమును జెందడు. ఇదినియమము. ఓ శ్రీరామచంద్రా! ఈకా రణమువలన లవణమహారాజు మనస్సుతో నాచరించిన రాజసూయ యా గమునకు ఫలమును ఇచ్చుటకై మొట్టమొదట దుఃఖమును అనుభవింప జేయ వలయును. కావున నాఇంద్రుడు దేవదూతను అట్లు ఇంద్రజాలిక రూపము తో ఆకాశమునుండి పంపియుండెను. వాడును పైన వర్ణింపబడిన విధముగ నాలవణమహారాజునకు దుఃఖమునుగూడ మనోమయముగానే అనుభవింప జేసి ఉత్తమ పదప్రాప్తికి మార్గమునుజూపి మఱల సురసిద్ధ నిషేవితమగు ఆకాశముననకే బోయెను.

—* జ్ఞానాజ్ఞాన భూమికల వివరము. *—

ఓరఘురామా! రామచంద్రా! ఇకను మఱియొక విషయమును వివ రించెదను. వినుము. జ్ఞానభూమికిని అజ్ఞానభూమి ని ప్రత్యేకముగ ఏడేసి మెట్లుగలవు. ఈ ఏడింటిలో సంకరముచేత లెక్కలేకు మిక్కిలియగు మెట్లు ఏర్పడును. మఱియు ఈజ్ఞానాజ్ఞానములు ప్రతిమెట్టునందును అతిదృఢముగ నున్నవి. సాధకుని సామాన్యముగ పైమెట్టునకు అధిరోహింపనియ్యవు. ప్రతిమెట్టునందును తమఫలములను ఇచ్చుచునే యుండును.

—* జ్ఞానాజ్ఞాన విశేషలక్షణము. *—

ఓ శ్రీరామా! సచ్చిదానంద లక్షణమగు స్వస్వరూపముతో నిలు చుట మోక్షము. శరీరేంద్రియాదులునేనే అను అహంకారము బంధము. ఈ రెండే జ్ఞానాజ్ఞానములకు క్రమముగ లక్షణములు. సర్వమును సంక్షేపించి చెప్పబడినది. ఇందు ఏమహానుభావులు శుద్ధవిజ్ఞానరూపమైన బ్రహ్మము నందు నిలిచి చలింపకుందురో వారికి రాగద్వేషాది సర్వ పదార్థములును గూడ బ్రహ్మమే యగును. కావున వారు వ్యవహారములను పూర్వమువ

లెనే ఆచరించుచున్నను అజ్ఞానులు గానేరరు. స్వస్వరూపము దృశ్యపదార్థములతో సంబంధింపని శుద్ధవిజ్ఞానమే అని తెలిసికొననేరక భ్రాంతులై భ్రాంతిచేత దృశ్యములనుగూర్చి పరుగెత్తుచున్నది యని తలంప బడుచున్న మనోరూపమగు చైతన్యమునందే " ఇదియే నాస్వరూపము " అని మునిగి యుండుట ఏది కలదో అదియే అజ్ఞానము. జరిగిపోయిన కాలమునందుగాని, జరుగబోవు కాలమునందుగాని, ఇంతకంటె అధికమగు భ్రాంతి ఏదియును లేదు. మనస్సు ఒక విషయమునుండి మఱియొక విషయమును ఆక్రమించుటకు నడుమ అనగా ఒక సంకల్పము గలిగి రెండవ సంకల్పము గలుగుటకు ముందు సంకల్పశూన్యమై చాంచల్యరహితమై యుండుస్థితి ఏది కలదో అదియే స్వరూప స్థితియని తెలిసికొనుము. ఏసంకల్పములును లేక, అజ్ఞానము, నిద్ర, అనునవియును లేక, రాతివలె నుండుస్థితి ఏది కలదో అదియే స్వస్వరూపస్థితి యని తెలిసికొనుము. అహంకారము నశింపగా భేదము ధ్వంసముగాగా జడత్వము లేక, నిశ్చలమైయున్న మనస్సుయొక్క స్థితి ఏది కలదో అదియే స్వస్వరూపస్థితి.

—* అ జ్ఞా న భూ మి క లు. *—

ఓశ్రీరామా ! బీజజాగ్రత, జాగ్రత, మహాజాగ్రత, జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్నజాగ్రత, సుషుప్తి, అని భ్రాంతి ఏడు విధములుగ ఉన్నది. ఇవియే అజ్ఞాన భూమికలు. వీని సాంకర్యముచేత అనేకవిధములగు భూమికలు ఏర్పడును. ప్రధానములగు ఈ ఏడు భూమికలకును లక్షణములను చెప్పెదను వినుము. శుద్ధమై నామరూపములు లేనిదై యున్న పరబ్రహ్మమునకు ప్రపంచోత్పత్తికి అనుకూలమగు అనగా ఇకమీద కలుగబోవు " చిత్, జీవుడు, మనస్సు " అనుమొదలగు పేర్లకు అర్థమై యుండుటకు ( అనగా ఆపేర్లచేత జెప్పబడుటకు ) తగిన మార్పొకటి సృష్ట్యారంభమునందు గలుగును. అదియే సర్వమునకును మూలమగుటచేత బీజమనియును, జ్ఞానరూపమగుటచేత జాగ్రతయనియును జెప్పబడును. ఇదియే బీజజాగ్రత. సుషుప్త్యవస్థనుండి జాగ్రదవస్థకు వచ్చుటకు ముందు కలుగు జ్ఞానము యొక్క ప్రథమావస్థ ఇదియే. ఇదియే బీజజాగ్రత. జాగ్రతయనగా జనించినదియని అర్థము. " నాపేరిది. ఇవినావి " అనుజ్ఞానము అంతకుముందు సుషుప్త్యవస్థయందు లేనివయ్యును ఆబీజజాగ్రతకు పిమ్మట దానినుండియే ( జాగ్రతకు మూలమగు బీజజాగ్రతనుండియే ) జనించుచున్నవి. కావున ఈజ్ఞానములకే జాగ్రతయని పేరు. పైన చూపబడిన

అహంకార మమకారములే జన్మాంతర సంస్కారములవలన దృఢములై సర్వవ్యవహారములను చేయుటకు సాధనములై ప్రవర్తించుటయే మహాజాగ్రత యనబడును. ఇదియే మనకు అనుభవమునందున్న సర్వప్రసిద్ధ జాగ్రదవస్థ. మఱియును అట్టి జాగ్రదవస్థయందే మనస్సున జూచిన పదార్థములనుగాని, జూడనిపదార్థములనుగాని, దేనినో యొకదానిని మనస్సున భావించి తన్మయుడై యుండుట జాగ్రత్స్వప్నము. ఇట్లు దేనినైనను తదేకాగ్రచిత్తముతో ధ్యానించువాడు జాగ్రదవస్థలోనే యున్నను నిదురించువానివలె ఏమియు నెఱుగలేడనుట, ప్రత్యక్షసిద్ధముగనే యున్నదిగదా. ఒకచంద్రుని రెండుగాఁజూచుట, ముత్యపుచిప్పను వెండియని తలంచుట, ఎండమావులను నీటినిగా నెంచుట, మొదలగు భ్రాంతులును ఈజాగ్రత్స్వప్నమందే చేరును. అయినను అభ్యాస బలమువలన ఇవి జాగ్రదవస్థయనియే వ్యవహరింపబడుచున్నవి. ఇట్టి భ్రాంతులుగల పురుషుడు "ఇది నిశ్చయముగ వెండియే" అను మొదలగు రీతులతో వాదించుటయు ఒక విషయమునందుమాత్రము అనగా ముత్యపుచిప్పను వెండియను తలంచుటయందు మాత్రము భ్రాంతుడైనను తన్మయుడై యుండక ఇతర పదార్థములను గూడ ఎఱుగుచుండుటయు ఈవిషయమున (అభ్యాస దార్ఢ్యమువలన భ్రాంతి జాగ్రదవస్థలోనే చేరెను అనువిషయమున) నిదర్శనములు. "ఈపదార్థమును నేను కొంతసేపే చూచితిని. ఇదియథార్థముకాదు." అని మేల్కాంచిన పిమ్మట పురుషుడు ఏఅవస్థనుగూర్చి పరామర్శచేయునో, ఏది చిరకాలము ఉండకపోవుటచేత బాగుగ ప్రకాశింపదో, అదియే స్వప్నము. (కల) ఆస్వప్నమే బహుకాలము వరకునుండి జాగ్రదవస్థయందుకూడ అసంబంధములగు వికారములు. (మాటలాడుట, అరచుట, మొదలైనవి కలువరింతలు) స్ఫురించుచుండెనేని అది స్వప్నజాగ్రత. స్వప్నమే, అయ్యును జాగ్రతవలె నుండును. కావున దీనికి ఈపేరు కలిగినది. ఈ ఆరవస్థలును గడచిపోయిన పిమ్మట కేవలము జడరూపమై రాబోవు జాగ్రద్దుఃఖమును తెలిసికొను జ్ఞానబీజము మాత్రము శేషించియుండగలుగు నవస్థ ఏది కలదో, అదియే సుషుప్తి. ఈ అవస్థయందు సర్వప్రపంచములును అజ్ఞానమునందు లీనములగును. ఓరాఘవా! శ్రీరామా! ఈవిధముగ నీకు అజ్ఞానభూమికలను ఏడింటిని వివరించితిని. ఇందు బహువిధములగు రూపభేదముల చేత నొక్కొకటి అనేకవిధములుగ నున్నదియని తెలిసికొనుము.

—✻ జ్ఞా న భూ మి క లు. ✻—

ఓదోషరహితుడా ! శ్రీరామా ! పైన అజ్ఞానియగువాడు తన అజ్ఞాన భూమికలయందు గలిగియుండునట్టి అవస్థలు ఏడింటినిగూర్చియు వివరించితినిగదా. ఈజ్ఞాన భూమికలును ఒకటొకటి నానావిధ భేదములు గలిగియుండును. జ్ఞానియగువాడుగూడ అట్లే తన జ్ఞానభూమికలయందు సప్తపదములను గలిగియుండవలయును. వీనికిని అధిరోహింపవలసిన మెట్లు ఏడు కలవు. వానిని క్రమముగా దెలిపెదను. వీనిని వినిన ఇక ఎన్నటికిని అజ్ఞానము కలుగదు. ఈజ్ఞానభూమికలను అనేకులు అనేకవిధములుగ జెప్పుదురు. అందు నాఅభిప్రాయమును అనుసరించి సుఖములని తోచినవానిని చెప్పెదను. వినుము. నామతమును అనుసరించి ఈజ్ఞానమునకు భూమికలు ఏడే. “ ఇది బ్రహ్మము. బ్రహ్మమునకును నాకును భేదములేదు ” అని తెలిసికొనుటయే జ్ఞాన మనబడును. ఈజ్ఞానమునకు గల ఏడు మెట్లును అధిరోహించిన పిమ్మట ( జ్ఞానముదృఢమైనపిమ్మట ) కలుగు ముక్తియే జ్ఞేయము. ( ఆజ్ఞానముచేత సంపాదింపదగినది ) అని చెప్పబడును. శుభేచ్ఛ, విచారణ, తనుమానస, సత్త్వాపత్తి, అసంసక్తి, పదార్థాభావని, తుర్యగ, అను ఈ ఏడును జ్ఞానభూమికలు. ఈభూమికలను గడచిన మోక్షము దొరకును. అప్పుడు మరల దుఃఖము గలుగదు. క్రమముగా నీభూమికలకు లక్షణములుచెప్పెదను. వినుము. (౧) వైరాగ్యమును జెంది “నేనుమూఢునివలె ఏలయుండవలయును. శాస్త్రములచేతను సజ్జన సహవాసముచేతను నాస్వరూపము ఎట్టిదియో తెలిసికొన ప్రయత్నించెదనుగాక” అని సంకల్పించుట ఏదికలదో, అదియే శుభేచ్ఛ. శుభమనగా మోక్షము. దానియందలిఇచ్ఛ శుభేచ్ఛ. (౨) పైన వర్ణించినట్లు దృఢముగ నిశ్చయించి వైరాగ్యవంతుడై సత్పురుషులను జేరి శాస్త్రములను విమర్శించుచూ సదాచార యుక్తుడగుచూ ముక్తిని సంపాదించుప్రయత్నమునందు ఉండుట ఏదికలదో, అది విచారణ. వైరాగ్యము, సజ్జనసాంగత్యము, సదాచారము, మొదలగునవి ఎన్నియున్నను అజ్ఞానకృతమగు బంధము జ్ఞానమాత్రముచేతనే నశింపవలయును. కావున శాస్త్రార్థజ్ఞానమే అన్నింటియందును ప్రధానము. కావుననే సర్వ సాధనములతోను గూడియున్న ఈ రెండవభూమికకు విచారణయనుపేరుగలిగినది. (౩) పైన వర్ణించిన విచారణా, శుభేచ్ఛా,భూమికలను అధిరోహించిన పిమ్మట వాటి ప్రభావమువలన శబ్దాది విషయములయందు వైరాగ్యము గలుగును. దానివలన వాసనలు సన్నగిలును. వాసనలే మన

స్సగుటచేత దీనికితనుమానస (సన్నగిలిన మనస్సుకలది) అనిపేరు. (౪) ఈ మూడు భూమికలను అభ్యసించుటవలన మనస్సు పదార్థములను సంకల్పించుటయే మానును. పరబ్రహ్మమునందే నిలచియుండును. ఇదియే నిర్వికల్ప సమాధి యనికూడ చెప్పబడుచున్నది. ఈభూమికకే సత్త్వాపత్తి ( సత్వ మనగా, ఉనికియే స్వరూపముగాగల పరబ్రహ్మము. వానిని సమాధినిష్ఠచే బొందుట సత్త్వాపత్తి ) అనిపేరు. ( ఈస్థితియందున్నవాడే బ్రహ్మవిదుడు.) (౫) పైనాలుగు భూమికలను అభ్యసించుటవలనను, విషయ సంబంధమును వదలుట వలన గలిగిన సమాధిరూప ఫలముచేతను, అనగా దృఢమగు సమాధి నిష్ఠచేతను బ్రహ్మ సాక్షాత్కారము, లేక, బ్రహ్మరూపస్థితి మఱింత దృఢమగును. పరులు ప్రేరేపించిననేగాని, నిర్వికల్ప సమాధినుండి కదలకుండునంత స్థితి వచ్చును. అజ్ఞానముతోగాని, దానికార్యములగు సర్వపదార్థములతోగాని సంబంధము లేనిదగుటచేత ఈస్థితికి అసంసక్తి ( దేనితోను సంబంధింపని స్థితి ) అని పేరు. ఈ అసంసక్తి భూమికయందుండువాడు బ్రహ్మవిద్వరు డనబడును. (౬) మఱియును ఈయైదింటిని అభ్యసింపగా నభ్యసింపగా సాధకుడు బ్రహ్మమే తానగును. అట్టివానికి రెండవపదార్థమే తోచదు. వానిచిత్తము పరులు ఎంతయో ప్రయత్నించినను ఎప్పటికో సమాధినుండిమరలును. ఇట్టిస్థితికి పదార్థాభావన ( బ్రహ్మవ్యతిరిక్త పదార్థములను భావింపకుండుట ) అనిపేరు. ఈపదార్థాభావన యందుండువాడు బ్రహ్మవిద్వర్యు డనబడును. (౭) పైన వివరించిన యారింటిని చిరకాలము అభ్యసించుటవలన భేదమనునది బొత్తిగ నశించును. అప్పుడు స్వస్వరూపస్థితి దొరుకును. ఇదియే తుర్యగ ( తుర్యమనగా, నాలుగవదియని అర్థము. ఈయవస్థ నొందిన పురుషుడు సిద్ధులలో [ అనగా బ్రహ్మవిదుడు మొదలగు బ్రహ్మవేత్తలలో ] నాలుగవవాడు. కావున వీనికి గల అవస్థ తుర్యగ అగును. జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలును మోహాత్మకములే కావున, వానినిఅతిక్రమించిన అవస్థ తుర్యగ యగును. మఱియు విశ్వ తైజస ప్రాజ్ఞులను ముగ్గురు జీవులకంటెను విరాట్పురుష హిరణ్యగర్భ అంతర్యాములకంటెను వేఱైన నాలుగవదియగు బ్రహ్మమునకు సంబంధించినది. కావున, తుర్యగ యగును ) ఈ తుర్యగ ఏడవభూమిక అగును. దీనిని ఆశ్రయించినవాడు పరులు ఎంతప్రయత్నము చేసినను మేలుకొనడు. వానికి భేదమనునదియే ఎప్పటికిని తోపదు. వీడే బ్రహ్మవిద్వరిష్ఠు డనబడును. ఈభూమిక సామాన్యముగ భూమికలలోనే

జేర్పబడియున్నను ముక్తి దీనికంటె ఇతరముగ లేదు. ("జ్ఞేయము— సప్తభూమికల నభ్యసించి జ్ఞానము దృఢమగుటచేత సంపాదింప బడవలసినది.") అని చెప్పబడినది ఇదియే. దీని ఆరంభము భూమికగాను, పరిపాకము ఫలమగు ముక్తిగాను, దలంపవలయును. ఈయవస్థ తుర్యగ అను పేర జీవన్ముక్తులయందు గానవచ్చుచున్నది. ఇంతకంటె అధికముగ బోవుటకు జీవన్ముక్తులకు, లేక, దేహధారులకు వీలులేదు. ఇంతకంటె అధికమై తుర్యాతీతమను ఒక అవస్థ కలదుగాని, అది విదేహముక్తులకు గలుగవలసినదియే. కావున ఓశ్రీరామచంద్రా! ఏమహాత్ములు ఏడవదియగు నాతుర్యగ భూమికను జెందియున్నారో, వారే ముక్తినిజెందినవారు. (జీవన్ముక్తులు) ఈవిధముగ జీవన్ముక్తిని జెందినవారు సుఖదుఃఖములయందు సంబంధపడరు. అనగా సుఖము వచ్చినప్పుడు సంతోషింపరు. దుఃఖము వచ్చినప్పుడు శోకింపరు. స్వభావముచేత కార్యములను ఇంచుక యాచరించినను ఆచరింతురు. కొన్నిసమయములయందు బొత్తిగనే యాచరింపరు. వారికి కార్యములను చేయరాదను నియమములేదు. పార్శ్వమునందున్నవారు ప్రేరేపించిరేని పూర్వాచారానుసారముగ సర్వకార్యములను జరుపవచ్చును. నిదురనుండి మేల్కొనినవాడు వెనుకటి కార్యములను వాడుకను అనుసరించి ఆచరించునట్లు ఆపురుషుడును ఇతరుల ప్రేరణచేత బహిర్ముఖమైన మనస్సుతో సర్వకార్యములను ఆచరింపవచ్చును. దీనివలన వానియొక్క స్వస్వరూప జ్ఞానమునకు, లేక, అనుభవమునకు ఎట్టి హానియు లేదు. కార్యములను చేయునది మనస్సేకాని, తత్సాక్షియగు ఆత్మ కాదుకదా. మఱియొకవిధముగ జూచినను "ఇది మనస్సుకాదు. ఆత్మ. సర్వప్రపంచమును మిథ్య" అని తెలిసికొనిన పిమ్మట ఈకార్యములు వానిని ఏమి బంధింపగలవు. "ఇది పాముకాదు. త్రాడు." అని తెలిసికొనిన పిమ్మట పూర్వము ఉన్నభయములు మరల కలుగునా? "ఆపాముకూడ అచట లేదుగదా" అనినొదవేమో వినుము. ఆపాము భ్రాంతిచేత త్రాటియందు కల్పింపబడినదియే యగుటచే "ఉన్నది" అని చెప్పునెడల త్రికాలములయందును ఏకరూపము గనే యుండవలయును. "లేదు" అనిన ఎప్పటికిని లేనిదే కావలయునుగాని "ఒకప్పుడు ఉన్నది. మఱియొకప్పుడు లేదు" అని చెప్పుటకు మాత్రము ఎట్లును వీలులేదు కదా. ఈకారణమువలన పాముయొక్క యథార్థస్థితి తెలిసినపిమ్మట అదియున్నను లేకున్నను భయముమాత్రము కలుగదు. ప్రపంచముకూడ ఇట్టిదియే, కావున అనగా బ్రహ్మమునందు అజ్ఞానముచేత

కల్పింపబడినదియే కావున అది కానవచ్చినను కానరాకున్నను అనగా కార్యములు జరుగుచున్నను, జరుగకున్నను జ్ఞానికేమియు లోపములేదు. కావున జీవన్ముక్తులు యథేచ్ఛముగ వ్యవహారమును ఆచరింపవచ్చును. అట్లే ఆచరించుచుగూడ నున్నారు. పైన వర్ణించిన ఏడు భూమికలును బుద్ధిమంతులగువారికి మాత్రమే సాధ్యములు. ఇప్పటి జన్మమునందు పశువైనను, మ్లేచ్ఛులైనను, పూర్వజన్మసిద్ధి కలిగినచో అప్రయత్నముగనే ఈభూమికలను పొందుదురు. వారు తత్క్షణమే ముక్తులగుదురు.

ఓరామా ! అహంకారమే మోక్షము కలుగకుండుటకు కారణమగు పెద్దముడి. జ్ఞానమనగా ఆముడిని ఛేదించుటయే. నిర్వికారుడగు పరబ్రహ్మమునందు "ఎండమావులయందు కలుగు జలబుద్ధివలె" "నేను" అనుబుద్ధిజనించు చున్నది. కావున నీఅహంకార విచ్ఛేదము, ఎండమావుల యొక్క యథార్థస్వరూప జ్ఞానమువంటిదే. ఇట్టి జ్ఞానము కలిగిననేగాని, మోక్షము దొరుకదు. అజ్ఞాన కల్పితములగునవి జ్ఞానముచేతమాత్రమేకదా, నశింపవలయును. కావున ఏమహాత్ములు దట్టమగు నాభ్రాంతిని విడిచిపెట్టుదురో, వారే మోక్షము నొందినవారు. పైన వివరించిన భూమికలను జెందినవారు సర్వమునందును విమర్శాపూర్వకముగ భ్రాంతిని దొలంగి చిత్తమును అంతర్ముఖము సేయుటయే ప్రధానము. ఈవిధముగ చిత్తమును బాహ్యవృత్తినుండి మఱలించి ఏమహాత్ములు బ్రహ్మజ్ఞానము గలిగి జ్ఞానభూమికలయందు నిలిచియుందురో, అట్టివారే సర్వలోక పూజనీయులు. వారే ఇంద్రియ జయముగలవారు. సమ్రాట్, స్వరాట్, అను మహదైశ్వర్య సంపన్నులగు దేవతల ఇరువురియొక్కయును, అనగా వారినైశ్వర్యమంతయును తృణప్రాయమై ఏ ఐశ్వర్యమునకు సాటిరాదో, అట్టి సర్వోత్తమమగు ఐశ్వర్యమును సర్వసారమగు స్థానమును ( బ్రహ్మమును ) వారేజెందుదురు. కావున సర్వమునకును మనశ్శాంతియే ప్రధానము. ఆమనశ్శాంతిని సాధించుటకు దగిన ఉపాయమునే యోగమని చెప్పుదురు. ఆయోగమునకు ఏడు మెట్లు కలవు. అవియే పైనవివరించిన జ్ఞానభూమికలు. వానిస్వరూపమును వివరించియే యున్నాను గదా.

## —* బ్రహ్మస్వరూపము. *—

ఓశ్రీరామచంద్రా! ఇకను ఈభూమికలను సాధించుటచేత బొందదగిన బ్రహ్మమునుగూర్చి వివరించెదను వినుము. ఆబ్రహ్మమునే మనము, నీవు, నేను, అనుశబ్దములచేత వ్యవహరించుచున్నాము. ఒకానొకడు మఱి

యొకనిని జూచి " నీవు ఎక్కడినుండి వచ్చితివి " అనినచో వాడు మొదటి వానికి " నేను ఘూర్జర దేశమునుండి వచ్చితిని " అని సమాధానము చెప్పె ను. ఇచ్చట మొదటివాడు " నీవు " అను పదముచేత దేనిని పేర్కొనెనో, రెండవవాడు ''నేను" అను శబ్దముచేతగూడ దానినే పేర్కొనును గదా. ఇట్టి అనుభవ దృష్టాంతమువలన బ్రహ్మమొక్కటియే నీవు నేను, అను శబ్దములగు రెంటికి బ్రహ్మమే అర్థము. మఱియును ఆబ్రహ్మమునకంటె ఇతర మైనది ఎందును లేదు. సర్వవ్యాపకమగుటచేత ఎందును భేదము గానరా దు. ఉనికి, లేమి, అనునవియును ఆబ్రహ్మమునందు లేవు. మనకు బహువిధ భేదములతో గానవచ్చునన్నియు నదియే. భ్రాంతివలన మనకు ఒక్కటియే అనేక విధములుగా నున్నట్లు తోచుచున్నది గాని, మఱేమియు లేదు. ఇది యునుగాక ఆబ్రహ్మస్వరూపము సంక్షోభములు లేనిది. ఇతర పదార్థ మును ఆశ్రయింపక స్వతంత్రముగ సర్వకాలములయందును ఏకరూపము తో నిలచియుండునది. దానిస్థితికి రెండవదాని సహాయము అక్కఱలేదు. చిదాకాశమునందు, లేక, హృదయాకాశమునందు సాక్షిస్వరూపముతో నిలచియుండునది. నిత్యమైనది. ఆనందరూపమైనది. ఏవిధమగు లోపములును అనగా వృద్ధిక్షయాది వికారములును లేనిది. మఱియొకసాక్షితో ఆవశ్యక ము లేక, స్వయముగ బ్రకాశించునది. రెండవ వస్తువు లేకపోవుటచేత తానే తానై యుండునది. అనగా దేనిరూపమును లెనిది. ( చిదాత్మకమ నియు, చిదచిదాత్మకమనియు అనేకులు అనేకవిధములుగా బ్రహ్మరూపము నుగూర్చి చెప్పుచున్నారు. వాస్తవస్థితిలో బ్రహ్మము అట్టివాడుకాడనుట. ) ఈబ్రహ్మముయొక్క ఉత్పత్తికి ఏకారణములును లేదు. ఈయన సర్వకాల ములయందును ఒకేవిధముగ నున్నవాడే. ఉన్నాడని గాని, లేడనిగాని, ఈబ్రహ్మమునుగూర్చి ఎట్లుచెప్పుటకును వీలు లేదు. లోకమునందు సాధారణ ముగ ఇంద్రియ గోచరములగు పదార్థములనుగూర్చియే యాసదసద్వ్యవ హారములు జరుగుచున్నవి. ఏదియైనను నొక పదార్థము ఇంద్రియములకు గోచరమయ్యేనేని అప్పుడు దానిని కలదనుచున్నాము. ఇంద్రియములకు గోచ రము కాకుండెనేని లేదనుచున్నాము. కావున ఇంద్రియములకు గోచరుడు గాని యాపరబ్రహ్మమును గూర్చి ఇందు ఏవ్యవహారమును సంభవింపదు కదా. ఈపరబ్రహ్మమునకు ఆదిమధ్యాంతములు లేవు. సర్వప్రపంచమున కంటెను అతిరిక్తుడయ్యు సర్వాత్మకుడై యున్నడు. ఇట్టివాడగుటచేతనే ఆపరబ్రహ్మముయొక్క యథార్థస్వరూపము ఉన్నది ఉన్నట్లు నోటితో

చెప్పుటకుగాని, మనస్సుతో ఊహించుటకుగాని, అశక్యము. ఆపరబ్రహ్మ ము శూన్యరూపమగు ఆకాశమునకంటే శూన్యుడు. అనగా శబ్దగుణము కలదియగుటచేత ఆకాశమును ఎట్టిదైనను నిర్ణయింపవచ్చును గాని, నిర్గుణు డగుటచేత ఈబ్రహ్మమును ఎట్లునూ ఊహించుటకు వీలులేదు. మఱియును అమ్మహాత్ముడు మన అనుభవములోనున్న సుఖమునకంటె అధికమగు సుఖ మే స్వరూపముగా గలవాడు. మఱియును ఆబ్రహ్మమును తెలిసికొనువాడు ఎవ్వడును లేడు. ఆయన తనంత తానే తెలిసికొనవలయును. మనస్సు సంక ల్పమును పరిత్యజింపగానే స్వరూపము స్వరూపముగానే నిలచును. వాస్త వస్థితిలో పరబ్రహ్మ విషయమునందు జ్ఞానమనునదియే సంభవింపదు. సర్వ సాక్షియగువానిని తెలిసికొనువా డెవ్వడు? ఆబ్రహ్మము సర్వవ్యాపకుడు కావున రెండవ వస్తువు ఏదియు నుండుటకు వీలులేదు.

మఱియు "ఈవస్తువు తెలియబడుచున్నది" అనిచెప్పిన అప్పుడు ఆవస్తువునందు కొంతసంక్షోభము ఉండి తీరవలయును. పేరు, రూపము, పని, మొదలగునవి యుండినగాని, ఏదియు తెలియబడదు. అనగా జ్ఞానము నకు గోచరము కాదుగదా. ఈబ్రహ్మస్వరూపమునందున్ననో, అట్టివి ఏవి యును లేవు. కావున ఈబ్రహ్మము జ్ఞానగమ్యు డనుటకును వీలులేదు. ఇక చేయవలసినది ఏమియనిన, దృఢమగు పురుషప్రయత్నముతో మనస్సును అంతర్ముఖముచేసి అభీష్టవస్తు పరిత్యాగ పూర్వకముగ సంకల్పముల నణం చుటయే. సర్వమును దీనివలననే సిద్ధించును.

—* అవిద్యా ప్రభావము. *—

ఓ శ్రీరామచంద్రా ! ఈవిధముగ బ్రహ్మస్వరూపమును బ్రహ్మమా త్రుడై నిలచుటకు సాధనమగు జ్ఞానమునకును, అజ్ఞానమును అభ్యసించువిధ మును, దానికి మార్గమగు భూమికల తెరగును, సర్వమును స్పష్టముగ వివ రించితినిగదా. ఇకను అజ్ఞాన ప్రభావమును మఱియొకమారు వివరించెదను వినుము. ఓ శ్రీరామా ! ఆప్రకారముగ ఆలవణమహారాజు ఇంద్రజాలకుని ప్రభావముచేత తాను చండాలుడగుట మొదలగు అనేకవిధములుగ భ్రాంతి నొందినవాడు మఱునాడు ఉదయమునలేచి తనదురవస్థకు గారణమగు అమ్మ హారణ్యమును జూచు నుద్దేశముతో ప్రయాణమాయెను. తనచిత్తమునందు ఇట్లని విచారించెను. నాకు అట్టి దురవస్థను గలిగించిన అరణ్యమేది? ఆఅర ణ్యమును జ్ఞప్తికి దెచ్చుకొనియెదను. మనస్సనెడు అద్దమునందు ప్రతిబింబిం చియున్న ప్రతిబింబమునుజూడగా అది వింధ్యపర్వత ప్రాంతమున ఉన్నట్లు

తోఁచుచున్నది. అప్పటి అనుభవముకూడా అట్టిదియే. ఈవిధముగ నిశ్చయించి మంత్రి సామంత చతురంగ బలములతోఁగూడి దిగ్విజయమునకు బోవుచున్నాఁడో, అనునట్లు దక్షిణదిశకు ప్రయాణమాయెను. ఉచితకాలమునందే వింధ్యపర్వతమును జేరెను. అట్లుజేరి " భూమియందు అన్నివైపులను సంచరించు సూర్యునివలె " ఆమహారాజు తన దురవస్థకు గారణమగు అరణ్యమును జూడఁగోరి ఆవింధ్యపర్వతమునకు పూర్వ దక్షిణ పశ్చిమ భాగములయందున్న అడవులనుగలయ దిరిగెను. ఇట్లు తిరుగుచుండఁగా రూపమును దాల్చి ఎదుట నిలచియున్న దుఃఖమో యన, నరకమో యన, అప్పటి అతిభయంకరమగు అరణ్యపంక్తి ఒకానొకచోట గానవచ్చెను. ఆయరణ్యమునందు నడువ నారంభింపగా క్రమక్రమముగా దానుచూచిన ఎడారియు, సాయంకాలమువరకు అందు నడచినమార్గమును, అప్పుడు అచట చూచిన విశేషములును, సాయంకాలమునకు దాజేరిన అరణ్య ప్రదేశమును, అంధకారమున బోవుచుండగా తనభుజమునకు దాకి వ్రేలుచుండఁగ దానుబట్టుకొని వ్రేలాడిన తీగెయును, ఆతీగెకు ఆధారమగు నిమ్మచెట్టును, మరునాడు ఉదయమున తాను మాలపిల్లతోఁ గలసినచోటును, వివాహమునకై ప్రతిజ్ఞచేసి అన్నమును భుజించిన పొదరిల్లును, దానితండ్రియగు చండాలుడు ఎద్దుల నలవార్చుచున్న చోటును, మాలపల్లెయును, అచ్చట తాను నివసించిన గృహమును, మొదలగునవి అన్నియును గానవచ్చెను. "నాయట్టి పురుషుడు ఎవ్వడైనను ఒక చండాల కన్యను వివాహమై ఈపల్లెయందు నివసించియుండెనా" అని అచ్చటివారిని అడుగగా వారునుదుఃఖించుచు సర్వవృత్తాంతమును దెలిపిరి. వారలలోఁ కొందరు స్వయముగ దెలిసినవారుగ ఉండిరి. అచ్చట చిరకాలము కాపురముచేసినవానివలె ఆమహారాజును సర్వస్థలములను గురితించెను.

ఓ శ్రీరామా! ఈప్రకారముగానుండుటవలన " మనస్సునకు ఎంత ప్రభావము కలదు " అని ఆరాజునకు అప్పుడు జనించిన ఆశ్చర్యమునకు మితియే లేదు. ఇట్లు ఓరామా! ఆలవణమహారాజు తనకు గానవచ్చిన వారినెల్ల తాను అనుభవించిన విషయములను అడిగి తెలిసికొనుచు అంతకంతకు ఆశ్చర్యమతిశయింప మఱికొంతదూరముపోయి ఆచండాలవాటికను ప్రవేశించెను. అది పూర్వమువలెనే పొగచేత ధూమ్రవర్ణము గలదియై అరణ్యముయొక్క మధ్యప్రదేశమునందు ఉండెను. అచ్చట అప్పటి పురుషులును, స్త్రీలును, ఇప్పటికిని నివసించియే యుండిరి. అందొకముసలిది ఏదిరో

యొక గొప్ప ఆపదవలన అరణ్యమునందు తనబంధువులు నశించుటచేత ఇతరవృద్ధస్త్రీలు అనేకులు తమతమ పురుషులతోగూడ తన్నుచుట్టుకొని యుండగా ఇట్లు రోదనము చేయుచుండెను.

ఓపుత్రులారా ! మిక్కిలిదీనులై మీరు నాకండ్లకు అగుపడకుండ ఎక్కడికి పోతిరి. హా, గురిగింజల హారములచేత ప్రకాశించుచున్న మనోహరాకారముగల యోపుత్రీ ! నిన్నుగూడ నాదుష్టదైవము నావద్దనుండి తొలగించుకొని పోయెనే. హా, చంద్రసమానుడవై మనోహరమగు ఆకారముగల యోరాజకుమారా! నీవు అంతఃపురస్త్రీలను అందరిని విడిచినా కూతురిని ప్రేమించితివి. వివాహమైతివి. ఆహా, నీదురదృష్టమువలన అదియును దక్కకపోయెనుగదా? ఆహా, ఇది ఎంత ఆశ్చర్యము. క్షత్రియకులమునందు జనించి మహోన్నతపదవి నొందియున్న రాజకుమారుడు చండాలకన్యతో గలసెను. మిక్కిలి అధికములై ఎడతెగక బహువిధములుగ విజృంభించుచున్న ఈసంసార నదీతరంగములు ఉచ్చనీచభావములు లేక, ఎట్టి నింద్యమగు కార్యమునైనను చేయించును గదా. అని ఈవిధముగ విలపించుచున్న ఆముసలిదానినిజూచి ఆలవణమహారాజు తన వద్దనున్న దాసీజనుల బంపి ఊరడింపజేసెను. పిమ్మట ఆస్త్రీని తన సమీపమునకు రావించి " ఓముసలమ్మా! నీవెవ్వతెవు? ఇక్కడ ఏలయున్నావు? నీపుత్రిక ఎవరు? పుత్రులెవరు? " అని ప్రశ్నచేసెను. ఆస్త్రీయును కన్నులనిండ నీరుపెట్టుచు నిట్లని ఉత్తరమిచ్చెను. ఓమహారాజా! ఈ ఊరిపేరు పుక్కసఘోషము. దీనికి ప్రభువగువాడు నాకుభర్త. ఆచండాలాధిపతికి చంద్రబింబముతో సమానమైన ఒకపుత్రిక యుండెను. ఒకనాడు ఏకారణమువలననో, ఒకప్రభువు ఈఅరణ్యమునందు చిక్కుపడెను. నాపుత్రికను వివాహమగుటకు అంగీకరించెను. ఈవిధముగా నాపుత్రిక దైవయోగమువలన ఒకమహాప్రభువును, మనోహరాకారుని, పెనిమిటిగాబడసి చిరకాలము అతనితోగూడ సుఖము అనుభవించెను. ఇట్లుండగా, ఓమహారాజా ! ఒకసమయమున ఇచ్చట మహాక్షామము వచ్చెను. అప్పుడు అనేకులు నశించిరి. ఆసమయమునందు మిక్కిలి భీతులై ఈగ్రామమున నుండువారందరును దూరదేశమునకు పోయిరి. ఆహారము లేకపోవుటచేత మరణమునుగూడ జెందిరి. మావారు కొందరు అప్పుడే మృతినొందిరి. ఆకారణమువలన మేము ఇచట దుఃఖించుచున్నాము. మాదురదృష్టమువలన భగవంతుడు మాకు ఇట్టిగతిని కల్పించెను. జీవితాంతమువరకు నిరాధారులమై శాశ్వత దుఃఖమును, అనుభవిం

పవలసిన వారలమై యున్నాము. తోడులేని ఏకాంగులమైతివి. ఈవిధము గా నాచండాలస్త్రీ చెప్పిన వృత్తాంతమును విని "సర్వమును ప్రత్యక్షముగ నాలకించితిరిగదా" అను అభిప్రాయముతో మంత్రుల ముఖము జూచుచును ఆశ్చర్యాతిశయముచేత చిత్తరువునందు వ్రాసిన ప్రతిమవలె నిశ్చేష్టితుడై కొంతసేపు నిలువబడియెను. పిమ్మట వారలకు తగినంతవరకు ధనమును ఇచ్చి గౌరవించి దుఃఖోపశాంతి నొనరించెను. పిమ్మట ఆవిషయములనే తలంచుచు ఆశ్చర్యసముద్రమున నోలలాడుచు సర్వసైన్య సమేతుడై తనరాజధానిని ప్రవేశించెను. ఈవిధముగ అవిద్యాప్రభావమును అనుభవ పూర్వకముగా దెలిసికొని ఆశ్చర్యరస మగ్నుడైయున్న ఆప్రభువునకు పిమ్మట నేను తత్వోపదేశమును గావించితిని. అతడును నాటనుండి జీవన్ముక్తుడై రాజ్యమును పరిపాలించుచుండెను. ఓశ్రీరామచంద్రా! ఈవిధముగా అవిద్య మహాభ్రాంతిని కలిగించును. ఉన్నదానిని లేనిదానిని గావించును. లేనిదానిని ఉన్నదానినిగా జేయును. అనిన ఆశ్చర్య భరితాంతరంగుడై శ్రీరామచంద్రుడు ఇట్లని ప్రశ్నించెను.

ఓమహాత్ముడా! భగవంతుడా! వశిష్ఠమహాముసీ! కల నిజమయ్యెననుటఎట్లు? ఎన్ని చెప్పినను నాకు ఈసంశయము దీరకున్నది. అనిన నమ్మహాముని ఇట్లనియె. ఓరాఘవా! అవిద్యాప్రభావమునుగూర్చి మాటలాడునప్పుడు ఇది యొకవింతకాదు. స్వప్నమునందు యథార్థరూపములై గానవచ్చు పదార్థములన్నియు సంపూర్ణముగా అసత్యములైనవియే కదా. మఱియును ఈవిషయము క్రిందచెప్పబోవు గాధియొక్క వృత్తాంతమువలన స్పష్టము కాగలదు. ఇదియునుగాక ఒక్కగురుతును వినుము. కాకి ఎక్కుటకును తాటిపండు పడుటకును కాలము ఒక్కటియై దైవఘటనము చేకూరినచో "కాకి తాటిపండును పడవైచినది" అని జనులు వ్యవహరించుచున్నారు. ఈవిధముగనే ప్రతివాని మనస్సునకును సంకల్పము స్వభావమే. కావున ఒకనిసంకల్పమునకు అనుగుణముగా నదే సమయమున దైవఘటనముచేరి వానికిగూడా సంకల్పము గలిగినచో "వీడుసంకల్పించినది యథార్థమయ్యెను" అని కూడా వ్యవహరింపవచ్చును. ఇట్లగుటచేతనే మనోరూపములగు వ్యవహారములు ఆకస్మికముగ నొకదానితో నొకటి సంబంధపడును. ఆలవణమహారాజు విషయమున ఆయైంద్రజాలికుని ప్రభావముచేత సభాసీనుడైయున్న సమయమునందు ఆరాజునకు ఏఅవిద్య కలిగెనో, మరునాడుగూడా ఆఅవిద్యయే కలిగెను. దానిచేతనే ఆమాలపల్లెయందు

జాగ్రదవస్థలో కూడా ఆప్రభువు పూర్వానుభూత విషయముల జూచెను. మఱియును ఇంద్రజాలసమయమునందు ఆప్రభువు ఎట్టిభ్రాంతిని జెందెనో వింధ్యపర్వతమునందుండు ఆచండాలుడును దైవయోగమున అట్టిభ్రాంతినే చెందెను. ప్రపంచమంతయును భ్రాంతిమయమే. కావున ఇచ్చట ప్రభువు " నేను చండాలకన్యను వివాహమైతిని. నాకు పుత్రులు పుట్టిరి " అని సంకల్పించిన సమయమునందే అచ్చట ఆచండాలునకును " నాపుత్రికకు రాజకుమారుడు భర్తయయ్యెను, నాకు మనుమలు జన్మించిరి " అనుసంకల్పము జనించెను. ఈవిధముగా లవణమహారాజుయొక్క సంకల్పము చండాలుని మనస్సునందును చండాలుని సంకల్పము లవణమహారాజుయొక్క మనస్సునందును దృఢమయ్యెను. ఈవిధముగా ఈరెండు వ్యవహారములును పరస్పరము దైవయోగమువలన సంబంధపడెను. ఇందొకటి స్వప్న వ్యవహారమైనను, రెండవది జాగ్రత్ వ్యవహారమైనను, సంయోగ బలముచేతను స్వరూపము ఒకటియే యగుటచేతను " రెండును ఒకటియే కలలో దోచినది సత్యమయ్యెను " అని తలంచుటకు వీలుకలుగుచున్నది. వాస్తవస్థితిలో జాగ్రత మొదలగు భేదములులేక సర్వ వ్యవహారములకును గల సత్తా ( ఉనికి ) సంకల్పరూప జ్ఞానమే కదా. సర్వమును సంకల్పాధీనమే. లేక, సంకల్పమాత్రమే, అని మొదటినుండియు నిరూపించియే యున్నాము కదా.

## —※ త త్త్వో ప దే శ ము. ※—

ఓ శ్రీరామచంద్రా ! కావున సంకల్పమయమగు ఈ ప్రపంచమునందు సత్యత్వబుద్ధిని పెట్టకుము. చూచెడి ఆత్మకును. చూడబడు ప్రపంచమునకును, సంబంధము గలుగునప్పుడు అనుభవమునకు వచ్చునట్టి (ద్రష్ట) రూపము అనగా జూచువానియొక్క రూపము ఏదికలదో, అదియే నీస్వస్వరూపము. దానికి మఱియొక సాక్షి లేదు. " ప్రపంచమును జూచుట " అను ధర్మమును లేదు. దానిచే జూడబడదగిన పదార్థాంతరమును లేదు. సర్వమును సంకల్పమయమే యగుటచేతను, సంకల్పాత్మకమగు మనస్సు పరబ్రహ్మ వివర్తమే యగుటచేతను, ఆపరబ్రహ్మమే ఆత్మ యగుటచేతను, ఆత్మభిన్నమగు పదార్థము ఉండుటయే సంభవింపదు కదా. ఒకస్థలము నుండి మఱియొకస్థలమునకు మనస్సు పోవునప్పుడు నడుమ అనగా ఒకసంకల్పముచేసి రెండవసంకల్పము చేయుటకు మునుపు దానికి ఏస్వరూపము కలదో అదియే బ్రహ్మరూపము. ( ఆత్మరూపము. ) బాగుగా విచారించిన ఆరహా

పము జడమనుటకు వీలులేదు. దానినుండి ఉత్తరసంకల్పము జనింపబోవు చున్న దనుటయే కాక, సర్వ వ్యవహారములును దెలియుచుకూడా నున్నవి కదా. మఱియు దానికి అప్పుడు విషయగ్రహణము ఏమియు లేకపోవుట చేత “ జ్ఞానముకలదు ” అని చెప్పుటకును వీలులేదు. చాంచల్యమే లేకపో వుటచేత మననశక్తి ( సంకల్పము ) కలదనుటకుగూడా వీలులేదు. ఇదియే యథార్థస్వరూపము. నీవు దీనిని ఎఱిగి తన్మయుడ వగుము. మఱియు జాగ్ర త్స్వప్న సుషుప్తులు లేనప్పుడు అనగా బుద్ధిచేత అయవస్థలనుండి ద్రష్టను ( ఆత్మను ) విభాగించినప్పుడు జాడ్యచైతన్యములు లేక, అనిర్వచనీయమై వరూపము నీకు ( ఆత్మకు ) ఉన్నదియో తన్మాత్రుడవై నీవు సర్వకాలము లయందును ఉండుము.

ఓవీరుడా! శ్రీరామా! జడత్వము లేకుండిన పాషాణములోని మధ్య భాగము ఎట్టిదియై యుండునో, అదియే మనోరాహిత్యమనకు అనగా మనోరూపమగు వివర్తమును జెందని పరబ్రహ్మమునకు ఆకారము. నీవు సర్వకాలములయందును తన్మయుడవై యుండుము. ఇంతచెప్ప నేల? నీస్వరూ పమును నిర్ణయించుటకు ఎట్లును వీలులేదు. కావున చేయవలసిన పని ఏమి అనిన మనస్సును సంపూర్ణముగా వదలి వేయుము. సంకల్పములను పరిత్య జింపుము. చిత్తనిగ్రహ రూపమగు పరమ యోగమును ఆశ్రయించి నిశ్చ లుడవుకమ్ము. ఓశ్రీరామా! వాసన అనునది సంసారమను వృతమునకు గట్టి త్రాడు. దానిని దృఢప్రయత్నముతో ఛేదింపుము. ఇంతమాత్రము పురుష ప్రయత్న బలముచేత ఆచరింతువేని పిమ్మట స్వస్వరూపస్థితి తనంత తానే కలుగును. దానికై ప్రత్యేక ప్రయత్నములు అక్కఱలేదు. సంకల్ప శూన్య మగు చిత్తస్వరూపమే బ్రహ్మస్వరూపమని నిరూపించి యున్నాము కదా.

—* ప్రకరణార్థ సంక్షేపము. *—

ఓరామచంద్రా! రఘుకులతిలకా! సర్వార్థమును సంక్షేపించి చెప్పె దను, వినుము. మొట్టమొదట నిర్వికల్పతత్త్వమగు పరబ్రహ్మమునుండి మన నశక్తి యుక్తమై స్వరూపమునకంటె భిన్నముగాకుండ సంకల్పాత్మకమగు మనస్సు పుట్టెను. అది మననశక్తితోగూడిన బ్రహ్మరూపమే, కావున పర బ్రహ్మమునొక్క వివర్తము రజ్జువివర్తమగు సర్పము రజ్జువునకంటే భిన్న ము కానట్లు అదియు పరబ్రహ్మమునకంటె భిన్నముకాదు. దానికి పర బ్రహ్మ వ్యతిరిక్తమగు రూపము లేదు. ఇట్లుండియు శూన్యమగు ఆకాశము చేత అతిమనోహరములగు నలుపు మొదలగు వర్ణములు ప్రకాశింప జేయబ

మనట్లు శూన్యమగు ఈమనస్సుచేతగూడ సంకల్ప ప్రభావముచే ఈసర్వ ప్రపంచము కల్పింపబడుచున్నది. శూన్యముచేత కల్పింపబడునది ఉన్నట్లు తోచినను, శూన్యరూపమైనదియే అనుటలో ఆక్షేపమేమియును ఉండదు కదా. కావున ఆకాశమునందు దోచు నలుపు మొదలగువానివలె ఈప్రపంచముకూడా సంపూర్ణముగా అసత్యమైనదియే. కావున సర్వప్రపంచమునకును సంకల్పములే మూలమగుటచేత ఆసంకల్పములు నశించెనేని ప్రపంచములేదు. ఎప్పటివలె కానవచ్చుచున్నను అది ( ప్రపంచము ) సంకల్పశూన్యమై బంధింపనేరదు. సర్వకల్పనలకును ఆధారమగు చిత్తముకూడా సంకల్పరూపమే. కావున సంకల్పము నశింపగానే నశించును. అనగా “ఇది చిత్తముకాదు, బ్రహ్మమే ” అను విషయము తేటపడును. స్వస్వరూప జ్ఞానము కలిగినపిమ్మట భ్రాంతి బాధింపదుకదా. సర్వము విచారించినను, విచారింపకున్నను, బ్రహ్మమాత్రమే, కావున భ్రాంతినాశము ఒకటియే కదా ముక్తికి సాధనము. ఈవిధముగా మనోరూపము సంకల్పనాశ బలముచే నశించెనేని అప్పుడు “శరత్కాలమునందలి ఆకాశమువలె” జ్ఞానమాత్ర స్వరూపముగలదియును, అద్వితీయమైనదియును, ఉత్పత్తి వినాశములు లేనిదియు, నగు బ్రహ్మము స్వయముగనే ప్రకాశించును. ఇతర ప్రయత్నములతో ఆవశ్యకము లేక, శరత్కాలము వచ్చినంతమాత్రముననే మేఘావరణము నశించుటచేత ఆకాశము ఎట్లు స్వాభావికమగు స్వచ్ఛస్వరూపముతో నిలుచునో, అట్లే ఇతరప్రయత్నములతో పనిలేకయే సంకల్పములు నశింపగానే చిత్తరూపావరణము తొలగి సంసారమగు పొగమంచును బాసి, పరబ్రహ్మము స్వాభావిక నిర్వికార స్వరూపముతో నిలుచును. రెండవ పదార్థము లేకపోవుటచేత “ బ్రహ్మమును తెలిసికొనుచున్నాము ” అను వ్యవహారమునకే అవకాశములేదు. “ తెలిసికొనుట ” అనిన “తెలిసికొనువాడు, తెలివి, తెలిసికొనబడినది” అను మూడు పదార్థములు ఉండవలసివచ్చును. ఇందు ఏదికలదనిచెప్పినను అనర్థమే. “ బ్రహ్మమునకంటె భిన్నుడై ఆబ్రహ్మమును తెలిసికొనువాడు ఒకడున్నాడు ” అనినచో బ్రహ్మమును దానికిసాక్షియును జ్ఞానరూపులే. కావున ఒకనినొకడు ప్రకాశింప జేయుననుట సంభవింపదు. ఈవిషయమునందు కొంత విమర్శించి చూడుము. ఆసాక్షి బ్రహ్మమునకంటె హీనుడయ్యే, ఆయనను ప్రకాశింప జేయునా? సమానుడై ప్రకాశింపజేయునా? లేక, అధికుడై ప్రకాశింపజేయునా? దీపము సూర్యుని ప్రకాశింప జేయులేనట్లు హీనమైనది అధికమును ప్రకాశింప జేయ

నేరదనుట నిర్వివాదాంశము. ఒకరత్నము సహితానమగు మఱియొక రత్నమును వెలిగింప లేనట్లు సమానములగు వస్తువులు ఒకదానినొకటి ప్రకాశింప జేయ నేరవు. ఇక “ బ్రహ్మమునకంటె అధికుడయ్యే ఆసాక్షి బ్రహ్మమును ప్రకాశింపజేయును. [ ప్రకాశమనగా= జ్ఞానము కావున తెలిసికొనుము ] ” అనిచెప్పినచో, మఱి రెండుప్రశ్నములకు అవకాశము వచ్చును. రెండుపదార్థములును చేతనములే అయియుండ “ ఒకదానికి సాక్షికలదు ” అనిన రెండవదానికి ఏలయుండరాదు? “ దానికిగూడ సాక్షియున్నాడు ” అనిన మూడవదానికిగూడా మఱియొకసాక్షి ఏల యుండరాదు? ఇట్లు ప్రశ్నింప నారంభించితిమేని దానికి సమాధానముగా లెక్కలేని మిక్కిలి యగు సాక్షులను అంగీకరింపవలసి వచ్చును. అట్లుచేసిన అనవస్థాదోషము (ఎప్పటికిని ముగియకుండుట యను దోషము) వచ్చును. ఇట్లుగాక కొందరు సాక్షులును మాత్రము అంగీకరించి “ వీనికి సాక్షిలేదు ” అనిచెప్పిన ఆసిద్ధాంతము వాదమునందు నిలువదు కదా. “ చేతనములే యైయున్న అనేకములకు సాక్షులుండగా నొకదానికిమాత్రము సాక్షి ఏలలేకుండును? ” అను ప్రశ్నమునకు సయుక్తికమగు ఉత్తరము ఏదియు లేదుకదా. ఇదియంతయు గాక “ రెండు చేతన పదార్థములు కలవు ” అనిచెప్పుటకే మొట్టమొదట అవకాశము లేదు. సమాన స్వభావములగు నారెంటికిని భేదమును నిర్ణయించుట అవశ్యకముకదా? ఇట్లు విమర్శించిన బ్రహ్మమునకంటె భిన్నుడైన సాక్షి తెలిసికొనువాడు ఒకడుండుటకే వీలులేదు. ఇట్లే తెలివియు బ్రహ్మమునకు అన్యము కానేరదు. ఒకపక్షమునందు చేతనమునకు జ్ఞానము స్వరూపమే యగును. మఱియొక పక్షమునందు అవయవములతో గూడిన పదార్థము నశించును. కావున ఉత్పత్తి, స్థితి, ప్రళయ, సాక్షియగు చేతనమును నిరవయవమని చెప్పవలసియుండుటచేత జ్ఞానమనునది దానికి సాధనములేక కార్యము గానేరదు. అవయవ శూన్యమగు పదార్థము ఒక సాధనమును గైకొని ఒక కార్యమును చేయుచున్నదనుట అసంభవముకదా. కావున మనోవృత్తులయందు ప్రతిబింబించియుండు ఆత్మనే లోకమునందు భ్రాంతిచేత ఆత్మ భిన్ననిగా దలంచి జ్ఞానశబ్దముచేత వ్యవహరించుట మాత్రమేకాని, ఆత్మభిన్నమై జ్ఞానమనునది ఒకటి ఎప్పటికిని లేదు. ఇదియును గాక ఈజ్ఞానముకూడా చేతనమే యగుటచేత ఎట్లును బ్రహ్మభిన్నము కానేరదు.

ఓశ్రీరామచంద్రా! ఈవిధముగా సాక్షియు జ్ఞానమును బ్రహ్మభిన్న

ముగా నుండుటకు వీలు లేకపోవుటచేత బ్రహ్మము జ్ఞేయము. ( తెలిసికొనబడువాడు ) కానేరడు. లోకమునందు తెలిసికొనువాడు తెలివి అను నీరెండును తెలియబడు పదార్థమునకంటె భిన్నములుగానే ఉండవలయుననుట నియమము కదా. ఈకారణమువలన " బ్రహ్మమును తెలిసికొనుట " అనుట ఎప్పటికిని సంభవింపదు. ఆయన స్వయముగనే ప్రకాశింపవలసినవాడే. సర్వ ప్రపంచోత్పత్తికి కారణములగు సంకల్పములే భేదభ్రాంతిని కలిగించి బ్రహ్మమును తనకంటె అన్యునిగాను, ప్రకాశ శూన్యునిగాను జేసినవి. కావున ఓరఘురామా! పురుషప్రయత్న బలముచేత మనస్సును అంతర్ముఖము చేయుము. సర్వమును తనంత తానే సంభవించును. జీవన్ముక్తి కలుగును.

ఇట్లు బ్రహ్మశ్రీ వేన్నెలకంటి సుందరరామ శర్మచే వచనకావ్యముగ
రచియింపబడిన శ్రీవాల్మీకి మహర్షి ప్రణీత జ్ఞానవాశిష్ఠ రామా
యణమునందు ఉత్పత్తిప్రకరణ సమాప్తమను
పదుమూడవసర్గ ముగిసెను.
ఉత్పత్తి ప్రకరణము ముగిసెను.

# శ్రీ జ్ఞానవాశిష్ఠము - వచనకావ్యము -

## స్థితి ప్రకరణము.

ఓ భరద్వాజా ! పైన వర్ణించిన విధముగ ప్రపంచోత్పత్తిని వివరించి ఇక దానిస్థితిని తెలియజేయువాడై ఆవశిష్ఠమహాముని రామచంద్రునితో ఇట్లనియె. ఓరఘునందనా ! శ్రీరామా! పైనవర్ణించిన విషయమును విమర్శించి చూచిన ఈప్రపంచము వర్ణములును, చిత్రకారులును లేక, ఆకాశమునందు ఊరకజనించిన చిత్తరువువలె నున్నది. చూచువాడు లేని చూపువలెను, నిదురలేని కలవలెన, మిథ్యాభూతమైయున్నది. ఈ ప్రపంచము మనః ప్రభావముచేత సర్వసాక్షియు, సర్వవ్యాపకుడును, నిర్మలుడును, సంకల్ప, వికల్ప, శూన్యుడును, జ్ఞానమాత్ర స్వరూపుడునగు, పరబ్రహ్మమునందు అద్దమునందువలె ప్రతిబింబించుచున్నది. కావున ప్రతిబింబమునకు అద్దము ఆధారమైనట్లు ఈప్రపంచమునకును బ్రహ్మము ఆధారము.

ప్రతిబింబము ఎట్లున్నను, దానితో అద్దమునకు ఇంచుకయైన సంబంధము లేనట్లు ఈప్రపంచము ఎట్లున్నను, బ్రహ్మమునకుగూడ దీనితో సంబంధము లేదు. దీనియొక్క సత్తయు ప్రతిబింబసత్తవలె శూన్యప్రాయమైనదియే. "ఒకపదార్థము మొదట సత్యమైయుండిన నది మఱియొక వస్తువునందు ప్రతిబింబింప వచ్చును. ఆప్రతిబింబమును అధిష్ఠానమాత్ర మగుటచేత అసత్యమునుగా వచ్చును కాని, ఇచ్చట మొట్టమొదట ప్రపంచమే సత్యము కాదుకదా? ఇకను అది బ్రహ్మమునందు ప్రతిబింబించుట ఎట్లు" అనెదవేమో, వినుము. ఈయుపమానమునకు "ప్రపంచము సత్యమై ఒకచోట నుండి తనకంటె అన్యమగు పరబ్రహ్మమునందు ప్రతిబింబించుచున్నది" అని యర్థము కాదు. ఇక నేమి యనిన "ప్రతిబింబము ఎట్లు అసత్యమో, అద్దము మొదలగు ఆధారములతో సంబంధింపకయే వానియందే ఎట్లు నిలచియున్నదియో, సంపూర్ణముగ శూన్యమయ్యును, అధిష్ఠానమాత్రమయ్యును, ఎట్లు అధిష్ఠాన భిన్నముగ సత్యముగ దోచుచున్నదో, అట్లే ఈప్రపంచము కూడా అసత్యమయ్యు ఆబ్రహ్మముతో ఎట్టిసంబంధము లేనిదయ్యు బ్రహ్మమునందే నిలచియున్నది. "బ్రహ్మమాత్రమే యయ్యును బ్రహ్మభిన్నముగ దోచుచున్నది" అనుటయే పై యుపమానమునకు అభిప్రాయము. ఉపమాన ఉపమేయములకు అన్నివిషయములందును పోలికయుండదు. కావున ఓశ్రీరామా! ఈప్రపంచము కేవలము సంకల్పరూపమైనదియే. కార్యకారణభావములేక అనగా "బ్రహ్మము కారణము, ప్రపంచము కార్యము" అను సంబంధములేక కేవలము బ్రహ్మమునందు నిలచిమాత్రమే యున్నది. "ఇదికారణము, దీనినుండి ఈకార్యము పుట్టెను" అనువ్యవహారము సత్యమగు పదార్థమునుగూర్చి ప్రవర్తించునుగాని, అసత్యమగు దానినిగూర్చి ప్రవర్తింపదుకదా. శూన్యవస్తువునకు కారణము ఒకటి యుండునా? వంధ్యాపుత్రునకు తండ్రి ఎవ్వడు? రజ్జుసర్పమునకు కారణమెద్ది? కావున ఓశ్రీరామచంద్రా! మనస్సు బ్రహ్మవివర్త మగుటచేత "బ్రహ్మమునందే యున్నది" అనవలయును. ఈప్రపంచముకూడా మనోరూపమే యగుటచేత మనోధిష్ఠానమగు పరబ్రహ్మమునందే యున్నది అనవలయును. ఇంతమాత్రమువలన "ఈప్రపంచము బ్రహ్మమునందు ఉన్నది" అనిచెప్పుటయేగాని, వాస్తవస్థితిలో ఈప్రపంచబ్రహ్మలకు కార్య కారణ భావ సంబంధమువలెనే, ఆధారాధేయ భావసంబంధముగూడ (బ్రహ్మమాధారము, ప్రపంచమాధేయము, అను సంబంధముకూడ) లేదు. రజ్జుసర్పమునకు బాగుగా

విచారించిన రజ్జువుతో నాధా రాధేయ భావసంబంధము లేకున్నను "రజ్జువు సర్పమునకు అధిష్ఠానము ( ఆధారము ) అనిచెప్పినట్లు బ్రహ్మమునుగూడ ప్రపంచాధార మనుచున్నాము. సర్వ వ్యవహారములును సర్వసంబంధము లును సత్పదార్థములకే సంభవించును గాని, అసత్పదార్థములకు గలుగనేర వనుట సర్వానుభవ సిద్ధమగు నిర్వివాదాంశము. ఎండమావులయందు జూ డబడిన నీటితో నాస్థలమునకు ఎట్టిసంబంధమును కలుగదనుట స్పష్టమే కదా. ఇక ఇందలి యథార్థమేమియనిన:—రజ్జు సర్ప భ్రాంతినొంది త్రా టిని సర్పమునుగా జూచినవాడు త్రాడు బొత్తిగా లేకుండినచో భ్రాంతి నొందనేరడు. కావున వారిభ్రాంతికిని ఆత్రాడు ఆధారము. ఇచ్చటను భ్రాంతికిని త్రాటికిని ఎట్టి సంబంధమును జెప్పుటకు వీలులేదు. అయినను ప్రపంచానుభవమును బట్టి ఏదియో యొక అనిర్వచనీయ సంబంధమును వ్యవహారార్థమై అంగీకరింతము. " ఇట్లు చెప్పనేల? ఆపురుషుని భ్రాంతికి త్రాడు కారణము కాకూడదా?" అనియెదవేమో అదిసరికాదు. అట్లయిన పురుషులందరును త్రాటిని చూచినప్పుడెల్లను భ్రాంతిని పొందుచుండవల సినవారగుదురు. ఇది అనుభవ విరుద్ధము కదా. కావున పురుషుని భ్రాంతి కిని త్రాటికిని గల సంబంధము అనిర్వచనీయమనియే చెప్పవలయును. ఇట్లు ఆత్రాడు భ్రాంతికి ఆధార మగుటచేత భ్రాంతిమయ సర్పమునకుగూడ ఆధారమని చెప్పబడుచున్నది. ఇట్లే బ్రహ్మముకూడ మనస్సునకు ఆధార భూతు డగుటచేత మనోమయమగు ప్రపంచమునకుగూడ ఆధార భూతుడని చెప్పబడు చున్నాడు. మనస్సుకూడ అతిచంచలమై స్వస్వరూపము ఎఱుగ లేక ఆప్రపంచమును బ్రహ్మాభిన్నముగాను ఆత్మాభిన్నముగాను (తానే ప్రపం చమై యున్నను ఆప్రపంచము తనకంటె వేరుగాను) భావించు చున్నది. ఇది అసత్యమని తెలిసికొనలేకున్నది. కావున నీవు ఆమనస్సును అంతర్ముఖ ముచేసి పురుషప్రయత్న బలముచేత "పరబ్రహ్మము ఒకడే. ఆయనకంటే ఇతరమగు పదార్థము ఏదియులేదు. ఆయన సర్వవ్యాపకుడు. సర్వరూ పుడు. విభాగములు లేనివాడు. చిదాకాశరూపుడు." అని సర్వకాలముల యందును ధ్యానము గావింపుము. ఇట్లు చేసితివేని మనస్సు చాపల్యమును విడచి తత్వమును ఎఱుగగలదు. బహువిధములగు రేఖలతోను ఉపరేఖల తోనుగూడి ఏనుగులు, గుఱ్ఱములు, దేవాలయములు, మొదలగు అనేక చిత్ర ములతో గూడియున్నరాయి, బహువిధ భేదములు గలదిగా దోచుచున్నను " ఇది ఏనుగు. ఇది గుఱ్ఱము " అని భిన్నముగ వ్యవహరింపబడుచున్నను,

ఎట్లు రాతికంటె భిన్నము కానేరదో, అట్లే ఈబ్రహ్మముకూడ మనుష్య పశ్వాది భేదములతో దోచుచున్నను, అట్లే వ్యవహారింప బడుచున్నను, బ్రహ్మమునకంటే ( స్వస్వరూపమునకంటె ) భిన్నుడు కానేరడు. రజ్జువు సర్పమునకంటె భిన్నమయ్యును ( సర్పము కాకుండియు ) భ్రాంతివలన సర్పముగా వివర్తము నొందునట్లు, ఈబ్రహ్మముకూడ ప్రపంచము కాకున్నను, సంకల్ప బలముచేత ప్రపంచరూపముగా వివర్తము నొందుచున్నాడు. ఎవ్వడెట్లుచూచినను త్రికాలములయందును రజ్జువు రజ్జువే యైనట్లు మనస్సంకల్ప మెట్లున్నను, త్రికాలములయందును బ్రహ్మము బ్రహ్మమేయని నిశ్చయించుకొనుము. మఱియొక విశేషము. ఆబ్రహ్మము ప్రపంచమునకు గారణమగుటకు వీలులేదు. ఆయన నిర్గుణుడు గదా. సగుణుడే అనినచో, నశింపవలసి వచ్చును. కావున అప్పుడు ప్రపంచమునకు సాక్షి లేక, పోవలసి వచ్చును. మఱియొకసాక్షి అంగీకరింతమనిన అప్పుడు " ఆసాక్షికైన గుణములు కలవా, లేవా " అను ప్రశ్నము వచ్చును. " ఆయనకు గుణములుకలవు " అనినచో పైనజెప్పినట్లే మఱియొకసాక్షి కావలసి వచ్చును. ఇట్లు సగుణ సాక్షుల ఎందరను అంగీకరించినను వారలు నశించువారే. కావున ఎప్పటికిని ముగింపుకలుగదు. " ఇక నా రెండవసాక్షి నిర్గుణుడు " అనిన అప్పుడు ఈవాదము శబ్దములయందే గాని, అర్థములయందు రెండుపక్షములు నొక్కటియే యగును. రెండవసాక్షిని అంగీకరించి వానిని నిర్గుణుడని చెప్పువారు మొట్టమొదటివానినే ఏల నిర్గుణు డనరాదు. ఈకారణము వలన నిర్గుణబ్రహ్మము ప్రపంచమునకు గారణము కానేరడు. ఆయనకంటె భిన్నమగు పదార్థము లేకుండుటచేత ఈప్రపంచమునకు వేఱొక కారణముకూడ నుండుటకు వీలులేదు. కారణములేక కార్యము కలుగుటయే అసంభవము. కావున ఈప్రపంచము పుట్టెను అనుటకే వీలులేదు. ఇట్లుండియును ఇదిసత్యమైయున్నట్లు తోచుచున్నది. కావుననే ఇది కేవలము భ్రాంతికల్పితము. సర్వ వ్యాపకుడగు పరబ్రహ్మమునందే ఎండమావుల యందు నీటివలె, త్రాటియందు సర్పమువలె, స్తంభమునందు పురుషుని వలె, ముత్యపుచిప్పయందు వెండివలె, సంకల్పమాత్ర రూపముతో నున్నది. ఎండమావులయందలి నీరు మొదలగు వానికిగూడ సంకల్పాతిరిక్తమగు రూపము లేదు గదా. ఇట్లున్నను తత్వమును ఎఱుగలేని మృగములకు ఆఎండమావులనీరు ఎట్లు భోగేచ్ఛను ( ఆనీటిని త్రాగవలయును అనుఇచ్ఛను) కలిగించు చున్నదో అట్లే ఈప్రపంచమును అజ్ఞానులకు భోగేచ్ఛను కలిగించు

చున్నది. ఇంతియే కాని, ఈ ప్రపంచమునకు ఎప్పుడును ఉనికియే లేదు.

—* శుక్రోపాఖ్యానము. *—

ఓరఘురామా! రామచంద్రా! ఈవిషయము స్పష్టమగుటకై నీకు భార్గవ ఉపాఖ్యానమును వివరించెదను. దానిచేత నీవు "ప్రపంచము ఎప్పటికిని పుట్టనే లేదు. అను విషయమును నిశ్చయించుకొనగలవు. ఓరామా! పూర్వకాలమునందు భృగుమహాముని బహువిధ పుష్పసమృద్ధమై అతిరమ్యమైన ఒకానొక మందరపర్వతముయొక్క శిఖరమునందు ఘోరముగ తపస్సును చేయుచుండెను. అప్పుడు బాలుడును, సంపూర్ణచంద్రునివలె శ్వేతవర్ణము గలవాడును, మధ్యాహ్నకాల సూర్యునివలె అత్యద్భుతమగు తేజస్సుతో ప్రకాశించువాడును, ప్రియపుత్రుడును, నగు శుక్రుడు అమ్మహాత్ముడగు భృగుమహామునికి పరిచర్య చేయుచుండెను. అకాలమునందు ఆశుక్రుడు "భూమ్యాకాశములయొక్క మధ్య వ్రేలుచున్న త్రిశంకునివలె" భేదాభేద దృష్టులకు మధ్య వ్రేలుచుండెను. మోక్షపదమును చెందకుండెను. యథార్థతత్వమును సంపూర్ణముగా తెలిసికొనకుండెను. ఇట్లుండగా ఒకానొకనాడు తండ్రియగు భృగుమహాముని నిర్వికల్ప సమాధియందు నిలచియుండగ నాశుక్రుడును ఆతని సాన్నిధ్యమును విడిచిపెట్టిపోయి ఒక ఏకాంతస్థలమునందు గూర్చుండి సర్వశత్రువుల జయించిన ప్రభువువలె నిర్విచార చిత్తముతో యుండెను. అప్పుడు ఒకానొక అప్సరస్త్రీ మందార పుష్పమాలికలను ధరించి చల్లనిసూక్ష్మమైన గాలిచే ముంగురులు అల్లలనాడుచుండగా ఆకాశమార్గమున బోవుచుండెను. ఆస్త్రీరత్నమును చూడగానే ఈశుక్రునిమనస్సు కామాతురమై చంచలించెను. పిమ్మట ఆశుక్రుడు ఆస్త్రీరత్నమునే మనస్సున ధ్యానింపుచు కన్నులు మూసికొని ఈక్రిందివిధముగా మనోరాజ్యమును (సంకల్పపరంపరను) ప్రారంభించెను. ఈస్త్రీరత్నము స్వర్గమునకు పోవుచున్నది. నేనును దీనిని అనుసరించుచున్నాను. ఇదిగో స్వర్గమును చేరితిని కదా. ఇచ్చట దేవతలందరును ఇటునటు తిరుగుచున్నారు. ఈలోకము మిక్కిలి రమ్యముగ నున్నది. ఇచ్చట అమృతపాన మదముచేతను, మన్మథప్రభావముచేతను, మత్తులై బహువిధ శృంగార చేష్టలను చేయుచున్న ఈదేవతాస్త్రీలు "తీగెలు వనమును సేవించునట్లు" ఇంద్రుని సేవించుచున్నారు. ఈవిధముగా మహావైభవ సంపన్నుడై రెండవ బ్రహ్మయోయనన సింహాసనాసీనుడై నిండు కొలువున్న ఈ ఇంద్రునకు నమస్కరించెదను. ఈవిధముగా తలంచి యాశుక్రుడు తన యెదుటనున్న

శూన్యమగు ఆకాశమునందే ఇంద్రునకు నమస్కరించెను. "పరిచర్యాసమయమున భక్తియుక్తుడై తనతండ్రికి నమస్కరించునట్లు" మనఃకల్పితుడగు ఆఇంద్రునకు సాష్టాంగ నమస్కారమును చేసెను. పిమ్మట ఇంద్రుడు సగౌరవముగ సింహాసనమునుండి లేచి యాశుక్రుని గౌరవించెను. పిమ్మట నాశుక్రుడు స్వర్గలోక నివాసులచేత సత్కరింపబడుచు అచ్చట (స్వర్గమునందు) యథేచ్ఛముగ సంచరించెను.

ఓశ్రీరామా! తర్వాత అచ్చట తాను మోహించియున్న స్త్రీ ఇతర దేవతాస్త్రీలమధ్య నుండగా ఆశుక్రుడుచూచెను. ఆస్త్రీరత్నమును శుక్రుని గాంచి పరవశురాలాయెను. ఈవిధముగా శృంగార రసావేశము చేత వికాసముగల చిత్తములచేత పరస్పరానురాగము అతిశయిల్లగా ఉప్పొంగుచు నాశుక్రుడును, ఆదేవతాస్త్రీరత్నమును ప్రాతఃకాలమునందలి సూర్యపద్మినుల కాంతిని తిరస్కరించిరి. "సూర్యదర్శనముచేత వికసించు తామరవలె" అధిక చిత్తవికాసమును బొందిన యాదేవతాస్త్రీని చూచి, రుద్రుడు ప్రళయకాలమునందు సంహారమును సంకల్పించునట్లు చీకటిని గల్పించెను. ("ఇప్పుడు చీకటియున్నయెడల మేలుగా నుండును. లేక, ఇప్పుడు చీకటిపడినది" అనిసంకల్పించెను.) పైన జెప్పిన సర్వవిషయములవలెనే ఈచీకటిగూడా సంకల్పప్రభావమువలననే కలిగెను. అంతనయ్యంధకారమునందు సర్వభూతములును తమతమ యునికిపట్టులకు జేరగానే ఆదేవతాస్త్రీయును "నెమలి మేఘమును జేరునట్లు" (ఇచ్చట మేఘమును జేరుటయనగా ఆకాశమునకు బోవుటకాదు. ఆదర పూర్వకముగా మేఘమును జూచుటయే యని తెలిసికొనవలయును.) శుక్రుని జేరబోయెను. పిమ్మట ఆశుక్రదేవతాస్త్రీ లిరువురును ఒకానొక కల్పవృక్షతీగెలచే నేర్పడిన పొదరింటియందు క్రీడించిరి. బహుకాలమునుండియు అధిక ప్రీతితో గోరబడుచుండి ఇప్పటికి తటస్థించిన పగుటచేత ఆస్నేహములు, ఆవిలాసములు, వానితోగూడిన ఆసమాగమము, ఆశుక్రునకు అధిక తృప్తిని కలిగించెను. ఈవిధముగా మిక్కిలి తృప్తినొందుచు ఆశుక్రుడు సుందరియగు నాదేవతాస్త్రీ రత్నముతోగూడ ఆ ఇంద్రనగరమునందు చతుర్యుగములు ఎనిమిదిమారులు తిరుగునంతవరకు సుఖముగా నివసించుచుండెను. ఇట్లుండగా ఆశుక్రునకు "నాపుణ్యము ఇంతటితో ముగిసినది" అను సంకల్పము ఉదయించెను. తత్క్షణమే ఆస్వర్గమునుండి భూమిమీదబడెను. అప్పుడు ఆశుక్రుని శరీరము వెయ్యిముక్కలయ్యెను. అప్పుడు ఆశుక్రుని జీవుడు ఆశరీ

రమునుండి వెడలి చంద్రలోకమునకు బోయెను. పిమ్మట మంచుయొక్క రూపముతో భూమిమీదికి వచ్చి వరిపైరునందు చేరెను. ఆపైరు పక్వముకాగానే ఆధాన్యమును దశార్ణదేశమునందలి బ్రాహ్మణుడు ఒకడు భుజించెను. పిమ్మట ఆశుక్రుని జీవుడు ఆబ్రాహ్మణునియందు రేతోరూపమును దాల్చి ఆయన భార్యయందు ప్రవేశించి యాబ్రాహ్మణునకు పుత్రుడై పుట్టెను. ( చనిపోయిన ప్రతిజీవుడును మరల జనించుటకు ఇదియే మార్గము. మొట్ట మొదట జీవుడు ఇచ్చటనుండి నిర్గమింపగానే అంతరిక్షమును జేరును. అచ్చటనుండి చంద్రలోకమునకు బోవును. పిమ్మట వర్షరూపముతోగాని, మంచు రూపముతోగాని, భూమిని జేరును. భూమిమూలమున ఓషధులను ఆశ్రయించును. తర్వాత పురుషుని జేరి శుక్రమగును. పిమ్మట స్త్రీయందు జేరి జననమగును. ) ఈవిధముగ శుక్రుడు దశార్ణదేశమునందు బుట్టి పెరిగి మిక్కిలి పరిశుద్ధుడును. ఆచారముగలవాడునై మునులతో జేరి ఘోరమైన తపస్సును జేయుచు మేరు పర్వతారణ్యమునందు ఒక్క మన్వంతరకాలము అనగా డెబ్బదియొక్క మహాయుగములు ( నాలుగు యుగములు నొక్కమారు తిరిసిన నది మహాయుగ మనబడును ) నివసించెను. ఆజన్మమునందు అతనికి ఒక లేడియందు మనుష్యాకారుడగు పుత్రుడు జనించెను. ఆపుత్రుని యందు అధికప్రేమచేత అతడు మహామునియయ్యు భ్రాంతి నొందెను. ఈపుత్రునకును నాకును భోగార్థమై అధికధనములును, ఎప్పటికిని నశింపని ఆయుష్యమును గలుగునుగాక. నాపుత్రుడు మిక్కిలి గుణవంతు డగును గాక. అని సర్వకాల సర్వావస్థలయందును దలపోయుచు యోగనిష్ఠను మానెను. ఈవిధముగ ధర్మచింతను బొత్తిగ విడచి సర్వకాలములయందును పుత్రునికొఱకై సుఖభోగములు కావలయుననియే చింతించు చుండుటచేత ఆతనియాయువు క్రమక్రమముగ క్షీణించెను. నయాధినిష్ఠుడై బ్రహ్మరూపముతో ఉండువానికి ఆశ ఎప్పటికిని లేదుకదా. ఆయువు అవ్విధముగా క్షీణించుటచేత సర్పము గాలిని మ్రింగివేయునట్లు మృత్యుదేవత వాని ప్రాణములను అపహరించెను.

ఈవిధముగ నాశుక్రుడు రెండవజన్మమును విడచి అంతమున భోగేచ్ఛతో జీవుడు నిర్గమించెను. కావున మద్రదేశ ప్రభువునకు పుత్రుడై పుట్టెను. క్రమక్రమముగ అభివృద్ధినొంది ఉచితకాలమునందు ఆదేశమునకు ప్రభువయ్యెను. ఈవిధముగనే ఆయాకాలములయందలి సంకల్పములకు అనుగుణముగా విచిత్రములును బహుసంఖ్యగలవియు, నగు జన్మములను ఎత్తి ఎత్తి

తుదకు సమంగా నదీతీరమునందు ఒకానొక మునికి పుత్రుడై జన్మించెను. ఆశుక్రునియొక్క జీవుడు అట్లు బహువిధములుగా జన్మ పరంపరలయందు సంకల్పానుసారముగా దిరుగుచుండగ మందర పర్వతమునందు ఉన్న శరీరము కాలక్రమమున గాలికిని ఎండకును శోషించి శిథిలమై నేలపైబడియెను. ఆభృగుమహాముని మహాతపస్వి యగుటవలనను, ఆయాశ్రమమునందలి మృగపక్షులు రాగద్వేషములు లేనివగుటచేతను, ఆశుక్రునియొక్క శరీరమును ఏజంతువును భక్షింపలేదు. ఇట్లుండగా దేవమానముతో వేయుసంవత్సరములు గడువగానే సర్వశక్తుడగు నాభృగుమహాముని అపరోక్షానుభవరూపమగు నిర్వికల్ప సమాధినుండి మేల్కాంచెను. అప్పటికి వాడుకచొప్పున పుత్రుడగు శుక్రుడు వినయముతో గూడినవాడై ఎదుట నిలువబడియుండలేదు. "గుణరాశియు, మూర్తీభవించిన సుకృతమో" యన విలసిల్లువాడు నగు ఆపుత్రుడు కన్నులకు ఎదుట నిలువబడి యుండలేదు. "దేహమును దాల్చిన దురదృష్టమోయన, ఆకారముగల దారిద్ర్యమోయన" ఒక గొప్పశవము మాత్రమే ఎదుటగానబడెను. ఎండచేత శోషించిన ఆదేహముయొక్క రంధ్రములయందు తిత్తిరిపక్షులు నివసించుచుండెను. శుష్కమగుటచేత లోపలికి ఈడ్చుకొనిపోయిన గర్భగోళముయొక్క నీడయందు కప్పలు విశ్రమించియుండెను. ఈవిధముగా "దుఃఖమను మహాగజమునకు కట్టుస్తంభమై యున్న" ఆ ఎండిన శవమును జూచి శోకించి వెనుకముందు విచారింపక ఆభృగువు సంభ్రాంతుడై లేచెను. చూచినవెంటనే తనపుత్రుడు మృతుడయ్యెనని తెలిసికొనినవాడు కావున సర్వసంహారకుడగు కాలునిగూర్చి (కాలమునుగూర్చి) అతితీవ్రముగ కోపముచేసెను. ఓకాలమా! ఇవ్విధముగ నాపుత్రుని అకాలమున సంహరించితివేల? అనుచు అతిక్రుద్ధుడై ఆకాలమునకు శాపము ఇచ్చుటకు ఉపక్రమించెను. అంత సర్వసంహారకమగు నకాలము పంచభూతసంబంధమగు శరీరమును (స్థూలశరీరమును) ధరించి ఆభృగుమహాఋషివద్దకు వచ్చెను. ఖడ్గ పాశాయుధములను ధరించియుండెను. కవచ కుండలములు మొదలగు సర్వభూషణములచేత అలంకృతుడై యుండెను. ఆరుభుజములును ఆరుముఖములును గలిగి మిక్కిలి తేజోవంతుడై యుండెను. లెక్కకు మిక్కిలియగు కింకరుల సేన అమ్మహాత్ముని గొలిచి వచ్చుచుండెను.

ఓవీరుడా! శ్రీరామచంద్రా! ఈవిధముగ ఆకాలుడు క్రోధాంధుడైయున్న అమ్మహామునివద్దకువచ్చి ప్రళయకాల సముద్ర ఘోషమువలె

అతిగంభీరముగ ఇట్లని మధురములగు సంభాషణల నాచరించి ఇట్లని చెప్పెను. ఓసత్పురుషుడా! నీవు మహాతపస్వివి. మేము దైవనియతిని రక్షించువారము. ఈకారణమువలన నిన్ను మేము గౌరవించుచున్నాము కాని, మఱేమియు కాదు. మీతపస్సువలన మాకు భయ మేమియు లేదు. కావున సర్వమును తెలిసియు మూర్ఖునివలె తపస్సును నిరర్థకముగ వ్యయముచేయకుము. నేను ప్రళయకాలమునందలి మహాగ్ని జ్వాలలకుగూడ కాలనివాడను. ఇట్టి నన్ను నీవు శాపాగ్నిచేత దహింపబోవు చున్నావా? ఓభృగుమహామునీ! నేను అనేకకోట్ల బ్రహ్మాండములను మ్రింగితిని. అనేకకోట్ల రుద్రులను జీర్ణము చేసికొంటిని. లెక్కకు మిక్కిలిగా విష్ణువులను భక్షించితిని. ఇక మాశక్తికి అడ్డమేమ్యాది. ఓబ్రాహ్మణోత్తమా! మేము భుజించువారము. మీరు మాకు భోజనము. ఇదివిధి. ఇందులో ఎవరి ఇష్టము ఏమియులేదు. ఎవ్వడు దేనిని దప్పించుకొన నేరడు. వాస్తవస్థితిలో ఆత్మ నిర్వికారుడు. కావున చేయు వాడును లేడు. అనుభవించువాడును లేడు. జ్ఞానదృష్టిచేత చూచిన ఇది ఇంతయే. ఈప్రపంచ సంహారమును నేను చేయుటయులేదు. ఈప్రపంచము అనుభవించుటయు లేదు అయితే జ్ఞాననేత్రమును తెరువనేరక భ్రాంతులై చూచినచో అందరును కర్తలే. అందరును భోక్తలే. కావున " కాలుడు సంహరించు చున్నాడు. ప్రజలు సంహరింప బడుచున్నారు " అని తలంచుట కేవలము భ్రాంతి. ఈశ్వర సంకల్ప రూపమగు ఈకాలమే సర్వమునకు గారణము. వృక్షమునందు పుష్పములు పుట్టుచు రాలుచు నున్నట్లు కర్మవశగతములై సమస్త భూతములును కాలానుసారముగ ఈప్రపంచమునందు పుట్టుచు నశించుచు నుండును.

ఓమహాత్ముడా ! జ్ఞానమయమగు నీదృష్టి ఎందుబోయెను. ధైర్యము ఎచ్చటకు దొలగిపోయెను. కాలము దుర్నివారమను విషయము సర్వప్రసిద్ధమైనను గ్రుడ్డివాడు సర్వప్రసిద్ధమగు మార్గమును ఎఱుగలేక భ్రాంతుడగు నట్లు ఏల భ్రాంతి నొందెదవు. సర్వమును ఎఱిగిన యోమహామునీ ! నీవు కర్మ పరిపాకమువలన ఇట్టి దుఃఖము కలిగెనని ఎఱుగలేక మూర్ఖునివలె నిరపరాధినగు నన్నేల వృథాశపింప నెంచెదవు.

—✻ చిత్తముయొక్క మహిమ. ✻—

ఓమహాత్మా ! మనస్సే పురుషుడు. కావున మనస్సుచేసిన పనియే పని. అనిచెప్పబడును జీవుడు, బుద్ధి, అహంకారము, మొదలగునవి అన్నియును ఆమనస్సే. స్థూలశరీరమును బ్రతికించుచుండుటవలన ( మనస్సు

ఉన్నంతకాలముమాత్రమే అనగా తనకు స్వాధీనమై ఉన్నప్పుడుమాత్రమే శరీరము బ్రతికియుండును. మనస్సు అన్యశరీరమును అభిమానించుటయే మరణము. దానికే జీవుడను సంజ్ఞకలిగెను. విషయములను నిర్ణయించునది అగుటచేత అదియే బుద్ధియని చెప్పబడుచున్నది. అభిమానమును చేయునది కావున దానికే అహంకారమని పేరు. ఇట్లే ఆయాకార్యములవలన ఆఅంతఃకరణము ఒకటియే సర్వశబ్దములచేతను వ్యవహరింపబడుచున్నది.

—✱ కాలుడు భృగువునకు శుక్రవృత్తాంతమును జెప్పుట. ✱—

ఓమహాత్మా! ఆకారణమువలన మనస్సు సర్వశక్తికలది. ఇకను నీపుత్రునివృత్తాంతమును వినుము. నీవు నిర్వికల్ప సమాధి నిష్ఠుడవై యుండగా నీపుత్రునియొక్క మనస్సు సంకల్ప బలముచేత ఈ శుక్రదేహమును విడిచి స్వర్గమును చేరెను. అచ్చట బహుకాలము విశ్వాచి యను దేవకన్యతో క్రీడించెను. పిమ్మట సంకల్పవశముచేత దశార్ణదేశమునందు ఒకబ్రాహ్మణుడాయెను. పిమ్మట కోసలదేశమునందు (మొట్టమొదట బ్రాహ్మణజన్మమునకు పిమ్మట ఆశుక్రునకు జన్మాంతరము మద్రదేశమునందు కలిగెనని చెప్పబడియున్నది. కావున మద్ర కోసల దేశములకు ఎట్టిసంబంధమైన ఉండవలయును.) ప్రభువాయెను. తర్వాత ఒక అరణ్యమునందు చెంబడివాడాయెను. అనంతరమునందు గంగాతీరమున హంసయాయెను. ఆమీదట సూర్యవంశమునందు పౌండుడనుపేర జన్మించెను. పిమ్మట సాల్వదేశమున సౌరమతస్థులకు గురువాయెను. పిమ్మట విద్యాధరుడై ఒక బ్రహ్మకల్పము నివసించెను. తర్వాత ఒక మహామునికి కుమారుడాయెను. పిమ్మట సౌవీరదేశమునందు సామంతరాజాయెను. పిమ్మట త్రివర్తదేశమునందు శైవమతస్థులకు ఆచార్యుడాయెను. పిమ్మట కిరాతదేశమున వెదురుపొద యాయెను. ఆపిమ్మట జాంగలదేశమునందు (ఒక చిన్న అరణ్యమునందు) జింకగాను, ఒక సాలవృక్షముక్రింద సర్పముగాను, కానుగుల వనమునందు అడవికోడిగాను, జన్మించెను. ఇదియునుగాక లెక్కకు మిక్కిలియై అతివిచిత్రములైన బహువిధ దుఃఖప్రదములై యున్న నానాయోనులయందు జన్మించుచుండెను. వానినెల్ల వర్ణించి చెప్పుటకు శక్యము కాదు. ఇట్టి జన్మములు కలుగుటకు అతని సంకల్పమే మూలము. ఓమహాత్మా! భృగుమహామునీ! ఇప్పుడు నీపుత్రుడు వాసుదేవుడను పేరుతో ఒకమహామునికి కుమారుడై సమంగా నదీతీరమున తపస్సుచేయుచున్నాడు. జడలుదాల్చి జపమాలను చేతబూని సర్వేంద్రియములను నిగ్రహించి ఏకాగ్రచిత్తుడై యున్నాడు. అతడు తపస్సు

నారంభించి ఇప్పటికి ఎనిమిదిసహస్ర సంవత్సరములు గడచినవి. ఇదియంతయు కేవలము మనోభ్రాంతియే. స్వప్నతుల్యమే. దానిని నీవు ప్రత్యక్షముగ జూడదలంతువేని జ్ఞాననేత్రమును తెరచి చూడుము. నేను వివరించిన విషయమంతయును తేటపడును.

ఓ శ్రీరామచంద్రా ! ఈవిధముగా సర్వ జగన్నియామకుడగు కాలుడు పలుకగానే యాభృగుమహాముని యు రోషమును విడచి శాంతుడాయెను. జ్ఞానదృష్టిచేత తనపుత్రునియొక్క చరిత్రము నంతయు జూచెను. " పుత్రుడు ఏమిచేసెను " అనితలంపగానే ప్రతిభావశమువలన ( జ్ఞాన ప్రభావమువలన, లేక, మనస్సంతయు నొకటియే కావున ) ఆశుక్రుని వృత్తాంతమంతయు బుద్ధియను అద్దమునందు ప్రతిబింబించి స్పష్టముగ గానవచ్చెను. ఈవిధముగ ఆభృగుమహాముని సంకల్ప బలముచేత ప్రపంచమంతయు దిరిగి శుక్రునియొక్క వృత్తాంతము నంతయును ప్రత్యక్షముగ జూచి మందరపర్వతముయొక్క శిఖరముపైన కాలుని ఎదుటనున్న తనదేహమునందు ప్రవేశించెను. ( శుక్రుడు ధ్యానించినంత మాత్రముచేతనే స్వదేహమును విడచి స్వర్గమునకు బోయినట్లు) ఈభృగుమహామునియును ధ్యానబలమువలన పుత్రుడుండిన స్థలములకెల్ల బోయెను. ఆశుక్రునకు దేహముపై జ్ఞప్తిబొత్తిగనే లేకుండుటచేత అదియే మరణమాయెను. భృగుమహామునికి అట్లుగాక దేహముపైన జ్ఞప్తి యుండుటచేత మరల జీవించెను. అనగా జీవుడు స్వదేహమునందు ప్రవేశించెను. అనితాత్పర్యము. అంత పరమైశ్చర్య భరితుడై రాగద్వేషాది రహితుడైన ఆభృగుమహాముని నిష్పక్షపాతబుద్ధిగల కాలుని జూచి ఇట్లనియె. భూత భవిష్యత్కాలములకు నియామకుడవైయున్న ఓభగవంతుడా ! కాలుడా ! మేమెంత తపస్సును ఆచరించినను అసమర్థులమే. మూఢులమే. ఓదేవా! త్రికాలజ్ఞానమనిన మీవంటివారికి గల జ్ఞానమే గదా. అనిఇట్లు భృగుమహాముని పలుకగానే సర్వప్రపంచమును నడపునట్టి భగవంతుడైన నకాలుడు నవ్వుచు " సూర్యుడు చంద్రుని పరిగ్రహించునట్లు" (రాత్రికాలమునందు సూర్యతేజస్సు చంద్రబింబమునందు చేరునని ప్రసిద్ధి ) తనహస్తముతో ఆభృగుమహామునియొక్క హస్తమును బట్టికొనియెను. అట్లు బట్టుకొనిన వెంటనే వారిరువురును అచ్ఛోటనుండి కదిలి ప్రత్యక్షముగ అనగా నేలపై నడచుచు సమంగా నదీ తీరమునకు బోవ నారంభించిరి. అతిస్వల్పకాలములోనే అచ్ఛోటునకు బోయిచేరిరి. అచ్చట ఒకానొక పొదరింటియందు సర్వేంద్రియములను

జయించి మనస్సును నిశ్చలముచేసి నిర్వికల్ప సమాధినిష్ఠుడైయున్న తన
పుత్రుని భృగుమహాముని జూచెను. అంత నాతని జూచి కాలుండును
"ఈతడు ఇప్పుడు సమాధినుండి మేల్కాంచును గాక" అని సంకల్పిం
చెను. తత్క్షణమే శుక్రుడును సంకల్పబలమువలన సమాధిని విడచి బహిర్ము
ఖుడాయెను. పిమ్మట కన్నులువిచ్చి ఎదుటనున్న కాల భృగువులను చూచి
తాను పీఠముగ ఉపయోగించుకొనియున్న కడిమికొమ్మపైనుండి లేచి వా
రికి నమస్కరించెను. పిమ్మట వారు మువ్వురును పరస్పరము మర్యాదలను
ఆచరించుకొని ఒకరాతిపై కూర్చుండిరి. పిమ్మట సమంగా తీరమునందు
తపస్సు చేయుచుండిన యాబ్రాహ్మణుడు కాలభృగువులతో ఇట్లనియె.

ఓమహాత్ములారా ! మీదర్శనమువలన నాకు పరమానందము కలిగి
నది. శాస్త్రాభ్యాసమువలన గాని, తపస్సువలన గాని, జ్ఞానమువలన గాని,
బ్రహ్మజ్ఞానము వలనగాని, (ఇది అర్థవాదము కాల భృగువులయొక్క ప్రభా
వమును అభివర్ణించుటకై చెప్పబడినది.) నశింపని చిత్తభ్రాంతి తమ దర్శ
నప్రభావమువలన ధ్వంసమైనది. ఈవిధముగ మిముబోటి మహాత్ములను
జూచుభాగ్యము సంభవించిన చిత్తమునకు ఎంత పరమానందము గలుగు
నో, అట్టి ఆనందము అమృతవర్షముకూడ కలిగింపనేరదు కదా. ఓమహాత్ము
లారా! చంద్ర సూర్యులు ఆకాశమును నిర్మలముగా చేయునట్లు ఈసమం
గా నదీతీరమును పాదవిన్యాసముచేత పవిత్రము కావించుచున్న మీరలిరు
వురు ఎవ్వరు? మహాతేజోవంతులై యున్నవారు. ఓరఘురామా ! ఈవిధ
ముగా ఆశుక్రుడు పలుకగానే భృగుమహాముని ఇట్లనియె. ఓయీ ! నీవు
జ్ఞానవంతుడవు. మూఢుడవుగావు. కావున మమ్ములను ఈవిషయమును
గూర్చి ప్రశ్నింప నక్కరలేదు. నీపూర్వజన్మ వృత్తాంతమును స్మరించుకొ
నుము. జన్మాంతరమునందు తనకుపుత్రుడైయున్న యాశుక్రుని ఇట్లు ప్రబో
ధింపగానే ఆశుక్రుడును (అనగా ఆసమంగానదీతీరమునందలి బ్రాహ్మణు
డును) ఏకాగ్రచిత్తముతో కన్నులు మూసి యొకక్షణమున తన పూర్వ
వృత్తాంతమునంతయును స్మరించెను. సర్వమును ఎఱిగి పరమాశ్చర్య భరి
తుడై మిక్కిలి సంతుష్టుడై విచారముచేత అతిగంభీరములగు వాక్కులతో
ఇట్లనియె: ఆహా, ఇట్టిది అని వర్ణించుటకు అలవిగానిదై కేవల భ్రాంతిరూ
పమైయున్న ఒకానొక దృష్టి మనస్సునందు కలదు. దాని ప్రభావమువల
ననే అతివిస్తారమగు ఈప్రపంచ సమూహమంతయును ప్రవర్తించుచు
న్నది. నేటికి మీ అనుగ్రహమువలన తెలిసికొనవలసినదానిని తెలిసికొంటిని.

చూడవలసిన దానిని జూచితిని. నాశరహితమగు దానిని గ్రహించితిని. బహుకాలమునుండియు శ్రమల నొందుచుండిన నాకు ఇప్పటికి విశ్రాంతి దొరికినది. జ్ఞానరూపుడగు పరబ్రహ్మమునకంటే అన్యము ఒకటియు లేదు. ఓతండ్రీ! ఇకరమ్ము. పూర్వశరీరమును జూడవలయునని వేడుక కలదు. దైవ నియామకముయొక్క ప్రభావమును జూతము. మందరపర్వతమునకు బోవుదము. నాకు ఒకదానియందు ఇచ్ఛయు, మఱియొకదానియందు ద్వేషమును లేదు. నాచిత్తము ఇప్పుడు పరమశాంతిని పొందినది. సంకల్ప శూన్యమై నిలచినది. సాక్షినగుటచేత దానికిగల సంకల్పములు నన్ను బాధించుటయు లేదు.

ఓరామభద్రా ! శ్రీరామా ! వారు మువ్వురును మనోమయమగు ప్రపంచరూపమును గూర్చి మాటలాడుకొనుచు సమంగా నదీతీరమునుండి ఒకక్షణములో మందరపర్వత గుహను జేరిరి. అచ్చట నాభృగుపుత్రుడు శోషించిపడియున్న తన పూర్వదేహమును జూచెను. అట్లుచూచి ఇట్లని చెప్పుటకు ప్రారంభించెను. ఓతండ్రీ! మీరు పుత్రప్రేమచేత బహువిధ సుఖములను సమకూర్చి లాలించిన యీశుక్రనామక దేహము నేడు శుష్కమై ఈవనమునందు పడియున్నది. సమస్త సందేహములను పరిత్యజించి కౌతుకములను అనగా విస్మయము మొదలగు చిత్తసంక్షోభ కారణములను విడచి సంకల్పములను వర్జించి ఎంతసుఖముగ నీదేహము వనమధ్యమునందు పడియుం డియున్నదియో చూడుము. సమస్త విధములగు కామములవలన జనించు, సంతాపము, మోహము, అను మంచుకు శరత్కాల ప్రాయమైయుండు విషయమున " అనగా శరత్కాలమునందు మంచు శూన్యమగునట్లు " ఆసంతాపము మొదలగువాటిని శూన్యములుగ జేయు విషయమున అమనస్కస్థితి కంటె శ్రేష్ఠమగునది మఱియొకటి లేదు. జంతువులను ఉద్ధరించుటకు ఆ అమనస్క స్థితికంటె ఉత్తమమగు గతి వేఱొకటి లేదు. కావున ఎవరు అమనస్కస్థితిని జెందెదరో, వారే శాశ్వత సుఖమును జెందినవారు. వారే బుద్ధిమంతులు. వారే విజ్ఞానవంతులు. నాఅదృష్ట వశమువలన సర్వదుఃఖరహితమై శాంతమై పరితాపములు లేనిదై సంకల్ప శూన్యమైయున్న ఈదేహమును కన్నులారజూచితిని. ఈవిధముగా దివ్యజ్ఞాన సంపన్నుడగుటచేత అచేతనమగు ఆశరీరమునుండికూడ అమనస్కస్థితియను మహాసిద్ధిని గ్రహించుచు దానిని అభివర్ణించుచుండగా అతని మాటలను అడ్డమై అతనిని జూచి కాలుడు ఇట్లనియె.

ఓ సత్పురుషుడా ! నీవు ఈశరీరమునందు ప్రవేశింపుము. ప్రభువు రాజధానిని ప్రవేశించునట్లు నీస్వంత శరీరమునందు చేరుము. నీవు ఇకను అనేకదినములు ఈదేహమునందుండి రాక్షసులకు గురువుగా నుండవలయును. నీకు శుభము అగునుగాక. ఇకను నేను పోయివచ్చెదను. ఇట్లు పలికి ఆభృగుమహామునియును, అతనికుమారుడును వియోగమును ఓర్వజాలక దుఃఖించుచుండగనే ఆకాలుడు అంతర్ధానము నొందెను. పిమ్మట ఆభృగు పుత్రుడు కాలవశగతుడై పూర్వదేహమునందు ప్రవేశించెను. బ్రాహ్మణభావమును పరిత్యజించెను. ఒకశరీరమునుండి మఱియొక శరీరమునందు ప్రవేశించుటయును సంకల్పమాత్రమేకాని, అన్యముకాదు గదా. ఈవిధముగ శుక్రునిదేహమునందు మఱల జీవుడు ప్రవేశింపగానే సంతుష్టుడై ఆభృగు మహాముని మంత్రములతోను, అభిమంత్రితములగు కమండల జలములతోను, ఆదేహమునకు శాంతిని సుఖమును గలిగించెను. తత్క్షణమే ఎండియున్న నరములన్నియు మఱల ఆర్ద్రములై రక్తపూర్ణములై తేజోవంతములై ప్రకాశించెను. పిమ్మట యథాప్రకారముగ మనోహరాకారముతో భూమిపైనుండి లేచెను. ఎదుటనున్న తండ్రికి భక్తియుక్తుడై నమస్కరించెను. పిమ్మట నాభృగు శుక్రు లిరువురును పరిశుద్ధములగు నమ్మందర పర్వతారణ్యమునందు సంకల్పశూన్యులై నిర్వికల్ప సమాధినిష్ఠులై " అలలు లేని మహాహ్రదములవలె " ( అనగా లోతుగల మడుగులవలె ) చిరకాలము సుఖముగా నుండిరి.

ఓరఘుకులతిలకా! శ్రీరామా! శుక్రునిచరిత్రమును ఈవిధముగ వివరించి చెప్పితిని. దీనివలన ప్రపంచమునకు ఉత్పత్తియే లేదనువిషయము నీకు స్పష్టమాయెనుకదా. ఈవిషయమును బాగుగ విమర్శించి ఇక ఇష్టమైనకార్యమును చేయుము. సర్వసంసారమును పరిత్యజింపవలయునని అనగా ఏకాంతముగ నుండుటయే పురుషార్థమని తోచెనేని అట్లుచేయుము. సంసారమనునది శూన్యమే, కావున దీనియందు యథాప్రకారముగ నుండినను స్వస్వరూపస్థితికి హాని లేదని తోచెనేని అట్లు గావింపుము. జీవన్ముక్తస్థితిని జెందుము. చిత్తస్థితిప్రకారమున శాంతిని బొందుము.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షిప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
స్థితిప్రకరణమున శుక్రోపాఖ్యానమను
పదునాలుగవసర్గ ముగిసెను.

---*---

అని ఈప్రకారముగ శుక్రోపాఖ్యానముచేత “ సంసారము మనోమయము. సంకల్పమునకంటే సంసారమునకు భిన్నమగు పుట్టుకలేదు ” అని వివరించి “ ఆసంసారము మనోజయముచేత అణగును. మనోజయములేకున్న అభివృద్ధియగును ” అని వివరించుటకై దామాద్యుపాఖ్యానమును వివరింపబోవుచు దానికి ఉపోద్ఘాతముగ వశిష్ఠమహాముని ఇట్లనియె.

—* చిత్తప్రసాదసామగ్రి. *—

ఓ శ్రీరామచంద్రా ! ఇట్లు మనోమాత్రమయ్యు సర్వానర్థములకు గారణమైయున్న ఈసంసారము నశించుటకు స్వభావమును తెలిపెదను. అనగా ఆమనస్సు ప్రసన్నమగుటయే ఆవశ్యకము. అది ఎట్లు కలుగుననిన వినుము. పురుషుడు కొంత అంతర్ముఖుడై తత్వమును విచారించుటకు ఆరంభించెనేని అప్పుడు బాహ్యవృత్తులు అణగును. పిమ్మట బాహ్యవస్తువిషయకమైన సంకల్పములు తొలగును. తర్వాత బాహ్యవస్తువులు ఏవియును బొత్తిగనే గానరావు. మనస్సు దానికి అభిముఖముగ నుండకపోవుటచేత ఏది ఎట్లు కానవచ్చినను వానికి బాధయుండదు. పిమ్మట మిక్కిలి ఆదరణీయమగు స్వస్వరూపము మాత్రమే వానికి సర్వకాలములయందును అనగా వ్యవహరింపకున్నప్పుడును వ్యవహరించు చున్నప్పుడునుకూడ దోచుచుండును. సర్వసాక్షియే సర్వకాలములయందును గానవచ్చుచుండును. ఈజ్ఞానము దృఢమగు కొలది సాక్షిభిన్నమైన రెండవపదార్థము ఏదియు దోపదు. బ్రతికియున్నను సర్వకార్యములను వాడుకప్రకారము చేయుచున్నను ఆతడు జ్ఞేయమగు పరతత్వమునందే జాగ్రత గలిగియుండును. ( అనగా సర్వకాలములయందును పరతత్వమునే చూచుచుండును ) భ్రాంతిమయమైన ఈసంసారమునందు నిదురించుచుండును. ( అనగా నిదురించువాడు ఏపదార్థమును చూడలేనట్లు ఈతడును సంసారమును చూడనేరడు ) ఈవిధముగ వైరాగ్య పరిపాక బలముచేత ఆనందకరములగు పదార్థములుగాని, దుఃఖకరములగు పదార్థములుగాని, అతనికి గానరావు. ఇట్టిస్థితియందు “ ఎలుక పక్షులవలను కొరికివేయునట్లు ” ఈసంసారమను వలను వైరాగ్యము కొరికివేయును. మఱియు అతివేగముతో హృదయగ్రంథిని తెంచివేయును. అప్పుడు చిల్లగింజచేత నీరు నిర్మలమై ప్రసన్నమైనట్లు జ్ఞానముచేత చిత్తము నిర్మలమై ప్రసన్నమగును. అప్పుడు ఆమనస్సు రాగద్వేషములు లేనిదై దేనితోను సంబంధింపనిదై శీతోష్ణాదులు, లేక, సుఖదుఃఖాదులు లేనిదై ఏపదార్థమును ఆశ్రయింపనిదై “ పంజరమునుండి పక్షి తప్పించుకొని అతివేగముతో పరు

గెత్తునట్లు " ఈ అజ్ఞానమను బంధమునుండి తప్పించుకొని పరువులిడును. అప్పుడు ఆమనస్సు సంశయములును ఇతర దోషములును లేనిదై ఆశ్చర్య మను భ్రాంతిని వదలి ( అనగా " ఇది నూతనము, దీనిని చూడవలయును " అను త్వరతోఁగూడిన సంక్షోభమును వదలి ) సర్వపరిపూర్ణమై ( పరిపూర్ణమగు స్వస్వరూపమును ఎఱిఁగి ) నిర్మలమై పూర్ణచంద్రునివలె ప్రకాశించును. చతుర్ముఖుఁడు విష్ణువు ఇంద్రుఁడు ఈశ్వరుఁడు మొదలగు వారందరును స్వస్వరూప జ్ఞానముంగల మహానుభావుని దయను ప్రార్థించు చుందురు.

## —❋ ఆత్మజ్ఞాని లక్షణము. ❋—

ఓ శ్రీరామచంద్రా ! ఇంతచెప్పనేల? సర్వసారముగ ఒక చిన్న అంశమును జెప్పెదను. " నేనెవ్వఁడ? ఈప్రపంచము ఎట్లు పుట్టినది. " అని విచారించునందాక అంధకార ప్రాయమగు ఈసంసారము పురుషుని ఆవరించి యుండును. అట్టి విచారము కలిగిన ఉత్తరక్షణముననే ఈ సంసారము గానరాదు. కావున తనను గాని, ఇతరుని గాని, భేదశూన్యమగు జ్ఞానరూపమైన శాశ్వతదృష్టిచేత " ఈసర్వమును పరబ్రహ్మమే " అని ఎవ్వఁడు చూచునో, వానిచూపే సార్థకమైనచూపు. అజ్ఞానరూపుఁడగు బ్రహ్మము సర్వశక్తులు కలవాఁడు. ఆద్యంతములు లేనివాఁడు. అందరి మనస్సులయందును, లేక, అన్నిజంతువులయందును నుండువాఁడు. తనకంటే భిన్నమగు పదార్థము లేనివాఁడు. అని తనచిత్తమునందు ఎవ్వఁడు సర్వాత్మకుని జూచునో, వానిచూపే సార్థకమైన చూపు. " నేనుగాని, నాకంటె భిన్నమగు అన్యపదార్థముగాని, లేదు. ఎట్టి ఉపద్రవమును లేని బ్రహ్మ మొకటియే కలదు. ( ఇచ్చట నేను అనగా అహంకారయుక్తమగు పదార్థము ) అని ఈవిధముగ "కలదు, లేదు" అనబడు పదార్థములకు మధ్యమున ( అనగా కలదనిగాని, లేదని గాని, చెప్పుటకు వీలుగాకుండ = లోకమునందు ఇంద్రియ గోచరములగు పదార్థములనుగూర్చియే కలిమి లేములు వ్యవహరింపబడుచున్నవి. ఈబ్రహ్మము అట్టివాఁడు కాఁడు. కావున ఇచట నావ్యవహారములు కలుగవని భావము ) ఉన్న బ్రహ్మరూపమును ఎవ్వఁడు చూచునో, వానిచూపే సార్థకమైన చూపు. ఇట్టి పరమార్థ జ్ఞానముకల పురుషునకు వ్యవహారమునందు బాధ ఏమియు నుండదు. జ్ఞానమును, ఉండవచ్చును. వ్యవహారములును, జరుగవచ్చును. ఒకస్థలమునుండి ఒక పురుషుఁడు మఱియొకస్థలమునకు బోవునప్పుడు మార్గమునందు ఎన్నిపదార్థములో కానవచ్చుచుండును. వానివిషయమునందు ఆపురుషుఁడు ఏమియు ప్రయత్నము

జేయుచున్నను వానినిగూర్చి రాగద్వేషాదులు ఆపురుషునకు లేకున్నను, నేత్రముమాత్రము వానిపై బ్రసరించు చుండును గదా. అది దానికి (నేత్రములకు) అనాది సిద్ధమగు స్వభావము. ఇట్లే తత్త్వజ్ఞాని ఆత్మావలోకనమును చేయుచున్నను, వానిబుద్ధి అనాది వాసనా బలమువలన ఆయాకార్యములయందు ప్రవర్తించుచుండును. ఇంతమాత్రమువలన వాని స్వాభావిక స్థితికి భంగము కాదు. ఏకార్యమును ఎట్లాచరించినను తత్త్వజ్ఞాని సర్వమును బ్రహ్మమాత్రమునుగానే చూచును కదా. కావున నేత్రము ఎట్లెట్లు ప్రసరించినను గమ్యస్థానమునందలి అనగా గమ్యస్థానమును చేరవలయునను దృఢసంకల్పమునకు హాని ఏమియు లేనట్లు జ్ఞానికిగల " అహంబ్రహ్మాస్మి, సర్వంబ్రహ్మ " అను సంకల్పమునకుగూడ వ్యవహారమువలన ఎట్టిహానియు లేదు. " వ్యవహారములను ఆచరించునప్పుడు సుఖదుఃఖ భోగములు కలుగునుగదా. వానివలన తత్త్వజ్ఞానికిగూడ హర్ష శోకములును బంధమును కలుగవలయునుకదా " అనియెదవేమో, వినుము. సుఖదుఃఖములు ఎన్నివచ్చినను జ్ఞానప్రభావమువలన తత్త్వవేత్తయగు నామహానుభావుని బాధింపజాలవు. ఈసుఖదుఃఖములు తత్త్వమును ఎఱుగలేనప్పుడు బాధించునవియే. అయినను జ్ఞానము కలిగిన పిమ్మట ఏమియు జేయనేరవు. పరులను హింసించుటయే స్వభావముగాగల దొంగయైనను మర్మమెఱిగినవానితో స్నేహమును జేయునే గాని, విరోధమును బూనదుగదా. ఇట్లే ఈసుఖదుఃఖాదులును " ఇవి కేవలము మనోమయము లైనవియే " అని తమ మర్మమును ఎఱిగినవానిని ఏమియు జేయవు. మార్గస్థులు ఆకస్మికముగ తటస్థించిన మహోత్సవములను జూచునట్లు ఈతత్త్వజ్ఞానియు "నాకు ఈసుఖము కావలయును" అని సంకల్పింపక దానికై ప్రయత్నింపక ఆకస్మికముగ అది (సుఖముకాని, దుఃఖముకాని) ప్రారబ్ధ వశగతమై వచ్చునేని, దానిని నిర్వికార చిత్తముతో అనగా " దీనివలన నాకు సంతోషము కలుగుచున్నది. ఇది నశించిన ఇక నెట్లుబ్రతుకగలను " అను మొదలగు కామరాగాది వృత్తులు లేని నిర్మలచిత్తముతో చూచుచుండును.

### —* మనోజయోపాయము. *—

కావున ఓ శ్రీరామచంద్రా ! సర్వమునకును మనోజయమే ప్రధానము. మనస్సును నిగ్రహించినచో అప్పుడు కలుగు భోగము మిక్కిలి స్వల్పమైనను తృప్తికరమగును. అప్పటి మనస్థితి అనగా, జయింపబడిన మనస్సుయొక్క స్థితి ఎంతమాత్రపు భోగమునైనను అనుభవించుటకు దగినదై

యుండలేదు గదా. ఈకారణమువలన అప్పుడు అజ్ఞాన దశయందువలె ఒక భోగమువెనుక అంతకంటె అధికమగు మఱియొక భోగమును గోరుట సంభవింపనేరదు. ఒక ప్రభువు పరాజితుడై కారాగృహమునందు ఉంచబడిన సమయమున శత్రురాజు తనకు ఒక్క కబళమును ఇచ్చినను పరమానంద భరితుడగును. అది అంతమాత్రమైనను దొరుకుటకు వీలులేని సమయము గదా. మఱియు ఆతడే పరులచేత ఆక్రమింపబడక బంధమును పొందక స్వతంత్రుడై యుండునేని అప్పుడు మహాసామ్రాజ్య మున్నను లెక్కపెట్టడు. అంతకంటె అధిక సంపదను గోరుచునే యుండును. ఇట్లే మనస్సు కూడా జయింపబడెనేని ఎంతకైనను సంతసించును. స్వతంత్రముగా నున్నప్పుడు ఎప్పటికిని తనివిజెందదు. కావున ఈసంసార సముద్రమును తరింప దలంచువారికి మనోజయమునకంటె ఇతరమగు గతి లేనే లేదు. ముల్లోకములందును లేదు. కావున,

శ్లో ॥ హస్తంహస్తేన సంపీడ్య దంతైర్దంతాన్విచూర్ణ్యచ ।
అంగాన్యంగైస్సమాక్రమ్య జయేదాదౌస్వకంమనః ॥

ఓ శ్రీరామచంద్రా! చేతులను చేతులతో బిసికికొనియైనను, పండ్లను పండ్లతో కొరికికొనియైనను, ఇతర అవయవములను నిరోధించియైనను, చేతనైనన్ని ఉపాయములతో మొట్టమొదట మనస్సును జయింప వలయును. ఇంద్రియములు మనస్సునకంటె అధికముగ స్వాధీనములో నున్నవి. వాయువుకూడ అట్లేయున్నవి. కావున వానిని ఆశ్రయించి హఠయోగము మొదలగువానిని గావించి మనస్సును నిగ్రహింప వలయును. ఏమహాత్ములు తమచిత్తములకు ఓడిపోక వానిని దృఢశక్తితో నిగ్రహింతురో, అట్టివారే ఈసమస్త భూమండలములందును సౌభాగ్యవంతులు. అట్టివారే సజ్జనులు. పురుషలనిన వారే పురుషులు.

శ్లో ॥ హృదయబిలే కృతకుండల ఉల్బణకలనావిషో మనోభుజగః ।
యస్యోపశాంతిమాగతమల ముదితం తంనునిర్మలంవందే ॥

ఓ శ్రీరామచంద్రా ! హృదయమను బిలమునందు చుట్టచుట్టుకొని సంకల్పములను విషమును అధికముగ గ్రక్కుచు మనస్సను మహాసర్పము ఉన్నది. ఏమహాత్ముడు ఆసర్పమును అణచి శాంతమును గలిగియున్నాడో, అమ్మహాపురుషునకు నమస్కారము. మఱియు ఇంద్రియములను శత్రువులు, నరకమను రాజ్యముచేత గర్వించియున్నారు. పాపములు వారలకు అనగా వారి సైన్యములయందలి మదపుటేనుగులు. ఆశలు తీక్ష్ణములగు బాణములు.

ఇట్టి సాధన సంపత్తితో గూడిన వారగుటచేత వారిని జయించుట మిక్కిలి కష్టము. అయినను దృఢప్రయత్నముతో ఇంద్రియ శత్రువులను జయించి మనస్సుయొక్క దర్పమును అణచిన మహాత్మునకు హేమంతఋతువునందు తామరతీగెలవలె భోగేచ్ఛయును నశించును. "బ్రహ్మమొక్కటియే కలదు. ఇతరము ఏదియును లేదు" అను నిశ్చయముతో "సర్వంబ్రహ్మ" అను ఏకస్వరూపమును దృఢముగ నభ్యసించి ఆయభ్యాస బలముచేత మనస్సును జయింపకుండునంతవరకు సమస్త విధములగు సంస్కారములును (ఇచ్ఛలును) శూన్యరూపములయ్యు, ఉన్నట్లు తోచుచు అంధకారమునందు నిరర్థకముగ భయమును గలిగించు భేతాళగ్రహములవలె హృదయమున సంచరించుచుండును. చిత్తము మన వశమయ్యెనేని అది ఇష్టమగు కార్యములను చేయుటచేత భృత్యుడగును. తగినకార్యములను ఉపదేశించుటచేత మంత్రియగును. ఇంద్రియములను సేవకులను బాగుగ ఆజ్ఞాపించి తన భారమును తగ్గించుటచేత సామంత ప్రభువగును. దివ్యజ్ఞానము నొసంగుటచేత గురువగును. బాగుగ ఉపలాలనము చేయుటచేత భార్యయగును. అహితమైన కార్యములనుండి తొలగించి రక్షించుటచేత తండ్రియగును. మిక్కిలి విశ్వాసము గలిగి యుండుటచేత మిత్రుడగును. ఈవిధముగ నది (ఆవశ్యమైన చిత్తము) విద్వాంసులను బహుభంగుల సేవించును. మఱియు శాస్త్రదృష్టిచేత బాగుగ అవలోకింపబడిన మనస్సు స్వబుద్ధిచేత చక్కగ భావింపబడెనేని (అన్య విషయములపై బోనీక నిగ్రహింపబడెనేని) స్వానుభవమును గలిగించుటచే తన స్వదేహమునుగూడ విడచి మహాసిద్ధిని (మోక్షమును) గలుగజేయును. స్వాభావికముగ మనస్సనెడి దివ్యరత్నము మిక్కిలి మనోహరమైనది. హృదయమునందు ఎప్పుడును ప్రకాశించుచున్నది. దానిని శాస్త్రదృష్టిచేత బాగుగ జూడగలిగిన సందేహము విపరీతభావన మొదలగునవి లేనిదై ఆమనస్సు మిక్కిలి దృఢమగును. అట్టిదార్ఢ్యముచేత సకల కల్మషములును తొలగి నిర్మలమగును. పిమ్మట ఆనైర్మల్యముచేత బాహ్యావృత్తులును విడుచును. కావున మిక్కిలి మనోహరమైనదగును. (వైరాగ్యబలముచేత పురుషుని బాధింపక అంతర్ముఖమగును.) ఇట్టి స్థితివలన సంపూర్ణ జ్ఞానము కలది యగును. అజ్ఞాన ప్రభావముచేత సమస్త కల్యాణ గుణములతో పరమశాంతితో గూడినది యగును. ఆచిత్త శాంతియే కదా మోక్షము. ఈవర్ణించినది అంతయును ఆచిత్తమునకు స్వాభావిక స్థితియే కాని, క్రొత్తగా కలిగినదికాదు. రత్నమునకు కఠినత్వము,

నిర్మలత్వము, మనోహరత్వము, అత్యధికమగు కాంతి, సుఖమును ఇచ్చు నట్టి లక్షణములు అనునవిస్వభావసిద్ధములే. అయినను చక్కగా పరీక్షింపని సమయమునందు మఱుగుపడి యున్నట్లు ఈమనస్సుయొక్క స్వభావము కూడ శూన్యరూపములగు సంకల్పములయొక్క చాటున మఱుగుపడి యున్నది. కావున ఓశ్రీరామచంద్రా ! ఈమనోరత్నమునకు మిథ్యాసంకల్పములను బురద అంటుకొనియున్నది. వివేకమను జలముతో ఆబురదను కడిగివేయుము. అప్పుడు స్వాభావికమగు ఆమనోరత్నముయొక్క దివ్యతేజస్సు మోక్షమార్గప్రకాశకమై తేజరిల్లును. కావున వివేకమును ఆశ్రయించి బుద్ధిచేత పరతత్వమును నిర్ణయించి ఇంద్రియశత్రువులను సంపూర్ణముగ నడగించి సంసారసముద్రమును తరింపుము.

ఓబుద్ధిమంతుడా ! శ్రీరామా ! " ఇది, నేను, " అను భేద నిశ్చయము నిరర్థకమైనదియే. వాస్తవస్థితిలో భేద మనునది బొత్తిగనే లేదు కదా. కావున ఆభేద నిశ్చయమును సంపూర్ణముగ విడువుము. నిర్మలమగు బుద్ధితో భేదమునకు అవతలదియగు బ్రహ్మమును అవలంబింపుము. అనగా స్వస్వరూప జ్ఞానమును బొందుము. ఇట్టి జ్ఞానము గలిగిన నీకు మనస్సే లేనిదగును. అప్పుడు నీకు ఏకార్యము లెట్లాచరించినను హాని ఏమియు లేదు. యథాప్రకారముగనే సంచరింపుము. సర్వవిషయములను అనుభవింపుము. నీకు ఏవిధమగు బంధమును గలుగదు. ఓరఘురామా ! నీవు దామ వ్యాళకటులవలె అవివేకివి కావలదు. భీమ భాస దృఢులవలె శోకరహితుడవు కమ్ము. అనిన రామచంద్రు డిట్లనియె. సర్వపాపములను నశింపజేయు సామర్థ్యముగల ఓ మహానుభావా ! దామవ్యాళకటులు ఎవ్వరు? వారివిధము ఎట్టిది. భీమ భాస దృఢులు ఎవ్వరు. వారిస్థితి ఎట్టిది.

—※ దామాదుల ఉపాఖ్యానము. ※—

అని శ్రీరాముడు అడిగిన వశిష్ఠమహాముని దామాదుల చరిత్రమును ఇట్లని చెప్ప నారంభించెను. ఓ శ్రీరామచంద్రా ! ఈదామాదుల విధము అంతయును నీకు వర్ణించి చెప్పెదను. దానిని విని పిమ్మట యుక్తమని తోచినట్లు ప్రవర్తింపుము. ఓ శ్రీరామా! నానావిధములగు సంపదలకు ఆస్పదమైయున్న పాతాళలోకమునందు శంబరుడను ఒక రాక్షసరాజు గలడు. వాడు మాయలను రత్నములకు సముద్రమువంటివాడు. అతి భయంకరాకారుడు. అతనికి ప్రబలమైన అధిక సంఖ్యగలదియై యొక రాక్షస సేన కలదు. ఆసేనతో వెడలి అతడు దేవతలను బాధింపనుండెను. దానినెఱిగి

మాయాబలముగల ఆరాక్షసుడు నిదురించుచున్న సమయమునందుగాని, ఇతర దేశమునకు బోయి యున్నప్పుడుగాని, సమయముంజూచి దేవతలు వాని సైన్యమును సంహరించు చుండిరి. దీనినెఱిగి ఆసేనలను రక్షించుటకై యారాక్షసుడు ముండికాంకుడు, ద్రుముడు, మొదలగు తనమంత్రులను సామంతులను సేనారక్షణకై నియోగించెను. అంతట ఒకానొకప్పుడు సమయముజూచి దేవతలు అతిభయంకరులగు ముండికాంకుడు మొదలగువారిని గూడ సంహరించిరి. దానివలన మిక్కిలి కోపించి యాశంబరుడు దేవలోకమునకు దండెత్తిపోయెను. అంతట దేవతులందరును వాని మాయాబలమునకు బెదరి దేవలోకమున నిలవక మేరుపర్వతప్రాంత అరణ్యములయందును, గుహాలయందును, దాగుకొనిరి. ఇట్లు ముఖ్యులందరును వెడలి పోగానే క్షుద్రదేవతలు రోదనముసేయుచు ఇటు నటు దిరుగుచుండిరి. కొందరు సామాన్యస్త్రీలు కన్నీరు కార్చుచుండిరి. ఈవిధముగ నారాక్షసుడు సైన్యసమేతుడై చేరునప్పటికే ఆస్వర్గము " ప్రళయకాలమునందలి " ప్రపంచమువలె శూన్యమైయుండెను. ఇట్లు తనకు అపకారముచేసిన ఇంద్రుడు సైన్యముతోగూడ పురమునుండి వెడలిపోవుటవలన " ఆహా, నేను వచ్చునప్పటికి నాకు జిక్కక తప్పించుకొని పోయెనుగదా " కానిమ్ము. అని మిక్కిలి కోపించి ఆస్వర్గమునంతయు గలయదిరిగి ఏమియు జేయనేరక విసికి తుట్టతుదకు ఆయమరావతిని గాల్చి తనస్థానమునకు మఱలిపోయెను.

ఓ దశరథనందనా! శ్రీరామా ! ఈవిధముగ దేవదానవులకు విరోధము క్రమక్రమముగ అధికమగుచుండెను. అప్పుడు ఆదేవతులు స్వర్గమును విడిచి ఆయాదిక్కులలో దాచుకొని యుండిరి. పిమ్మట శంబరాసురుడు బాగుగ పరీక్షించి మిక్కిలి బలాఢ్యులను సేనానాయకులుగ నొనరించినను, ఆదేవతలు పూర్వమునందువలెనే సమయమును ఎఱిగి అతిప్రయత్నముతో వారలనందఱను వధింపుచుండిరి. ఈవిధముగ విసుకులేక దేవతలు చేయుచున్న కార్యములకు మిక్కిలి భీతుడై వారిని సాధించుటకు ఉపాయమును గానక అతిరోషముతో తనసామర్థ్యమును అంతయును ఉపయోగింపదలంచి మాయాబలముచేత అతిబలవంతులగు ముగ్గురు రాక్షసుల సృష్టించెను. వారు అతి భయంకరాకారులు. దాముడు, వ్యాళుడు, కటుడు, అను పేర్లుగలవారు. వీరు రెక్కలుగల పర్వతములబోని యున్న అనేక యుద్ధములకు బోవుచుండిరి. సైన్యసమేతులై స్వర్గమునకు బోయిరి. ఆరాక్షసులు సర్వసముడగు పరమాత్మనుండి శంబరుని సంకల్పమువలన ( యుద్ధము చేయవ

యను అను సంకల్పమువలన.) మాత్రమే జన్మించిరి. కావున అదియే వా
రికి మొదటి జన్మము. కాబట్టి వారిమనస్సునందు పూర్వవాసనలు లేవు.
ఇట్లగుటచేత వారికి దేహాభిమానములేదు. కావున " మనము శత్రువులపై
బోవుచున్నాము. శత్రువులు మనలను సంహరింప వచ్చుచున్నారు. మనము
ప్రాణరక్షణ చేసికొనుటకై ఇప్పుడు పరుగిడవలెను. మనకు చావులకంటె
బ్రతుకు సుఖకరమైనది. బ్రతుకనకంటె చావు కష్టము. మనము జయించి
తిమేని కీర్తి. ఓడిపోయిన నపకీర్తి. మనకు జయము కావలయును. అపజ
యము అక్కరలేదు " అను మొదలైన సంకల్పము లేవియు వారికి లేవు.
ఇకను ఏమనిన, సంహారసంకల్పముచేత జన్మించినవారు. కావున ఎదుట కను
బడిన సైనికులను సంహరించుచు మాత్రమే యుండిరి. ఆరాక్షసులు ఇట్టి
స్వభావమును గలవారని తెలిసి యాశంబరుడు మిక్కిలి సంతోషించెను.
" వీరికి ఇష్టానిష్టవాసనలు అనగా కొన్ని పదార్థములయందు అభిలాష మఱి
కొన్నిటియందు ద్వేషము అనునవి లేవు. దేవతలు తమను ఎంతబాధించినను
వీరు యుద్ధమునుండి వెనుకకు దిగరు. వీరికి బ్రతుకునందైన ఇచ్ఛయు,
మరణమునందైన ద్వేషమును లేదు. " అని నిశ్చయించెను ఇట్లు శంబరా
సురుడు నిశ్చయముచేసి వారలను సేనాధిపతులుగజేసి ఒక మహాసైన్యమును
దేవతలపై బంపెను. అంతట సముద్రప్రాంత అరణ్యములలోని పొదలనుండి
యు, పర్వత గుహలనుండియు, సైనికులందరును లెక్కలుగల పర్వతములో
యన అతిభీకరాకారులై ఆయుధ ధారులై బయలు వెడలిరి. వీరి యుద్దేశ్య
ము నెఱిగి అంతట దాగుకొనియుండిన దేవతలును మహాసంఘములై దివ్యా
యుధములు దాల్చి జంగమములగు పర్వతములో యన భయంకరాకార
ముతో పొదరిండ్లనుండియు పర్వతగుహలనుండియు వెలికి వచ్చిరి. ఇట్లు
దేవాసుర సైన్యములు పరస్పరమును ఎదిరింపగానే అకాలప్రళయ సంక్షో
భమో అన వర్ణించుటకు అలవిగాని ఘోర సంగ్రామము ప్రవర్తించెను.
ఈవిధముగ యుద్ధము జరుగుచుండగా కొంతకాలమునకు చేతులు, కాళ్లు,
మొదలగు అవయవములును, గదాచక్రాద్యాయుధములును, నేలగూలుట
చేతనొచ్చి " కట్టతెగి " నీటివలె దేవతలసైన్యములు నలుదిక్కులకు బరుగు
లిడ నారంభించెను. అప్పుడు ఆదామ, వ్యాళ, కటులు, మువ్వురును త్రే
తాగ్నులు కట్టెలను అనుసరించి పోవునట్లు ( కట్టెకు నిప్పును అంటించిన
నది యాకట్టెకాలిపోవు నంతవరకు దానిని అనుసరించియే ప్రజ్వరిల్లుచుం
డును. అనగా ఆకట్టియు వంకరగనున్న వంకరగాను సరిగానున్న సరిగాను

ఆయగ్నిజ్వాలయు నడచుచుండెననుట ) ఆదేవసైన్యములను అనుసరించి బహుకాలమువరకు పోవుచుండిరి. ఆదేతల సైన్యమన్ననో, ఆరాక్షసుల దృష్టి పారినంతవరకు పరుగులిడి పిమ్మట దాగుకొని యుండెను. ఇట్లగుట చేత ఎంత వెదకినను ఆదామ, వ్యాళ, కటులకు, దేవతలు దొరుకలేదు. కావున వారు మిక్కిలి సంతోషించి పాతాళలోకమునందు ఉన్న తమప్రభు వైన శంబరాసురుని వద్దకు బోయిరి. ఇట్లు దామాదులచే నిర్జితులై మిక్కిలి శోకించి దేవతలు కొంతసేపటికి యూరడిల్లి తమ విజయమునకు ఉపాయమును తెలిసికొనుటకై బ్రహ్మదేవుని వద్దకు బోయిరి. రక్తవర్ణము గలవాడును ప్రేమాస్పదమైన ముఖవికాసము గలవాడు నగు నాబ్రహ్మదేవుడు వారికి బ్రత్యక్షమాయెను. పిమ్మట తమయొక్క యవస్థ నంతయును వారు అమ్మహాత్మునకు నెఱిగించిరి. అప్పుడు ఆబ్రహ్మదేవుడు దానినిగూర్చి కొంతసేపు విచారించి తుదకు వారిని ఊరడించుచు ఇట్లనియె.

ఓదేవతలారా! మీరు ఇక వేయు సంవత్సరములకు గాని, శంబరాసురిని సైన్యమును గెలువనేరరు. అంతకాలమువరకు కాలమును నిరీక్షింపుచుండుడు. ఈమధ్యకాలమునందు మీరు చేయవలసిన కార్యము ఒకటికలదు. దామ వ్యాళ కటులను యుద్ధమునకు బిలచి వారలతో బోరాడుచుండియే వెనుకదీయుడు. కొంతదూరము పరుగులిడి మరల గొంతసేపు యుద్ధము సేయుడు. మరల పరుగిడుచుండుడు. ఇట్లు చేయుదురేని “ మనధాటికి నిలువక దేవతలు పాఱిపోవుచున్నారు ” అను అహంకారము “ అద్దములయందు వలె ” ఆదామాదులయొక్క హృదయములందు ప్రతిబింబించును. ఇప్పుడు వారికి అట్టివాసన ( సంస్కారము ) లేకుండుటచేత మిమ్ములను జయింప గలిగిరి. పై యుపాయమువలన వారిమనస్సునందు అహంకారము ప్రతిబింబింప నారంభించిన వేయుసంవత్సరములలో నా అహంకారము అతి దృఢము కాగలదు. అప్పుడు “ వలలో తగులుకొనిన పక్షులవలె ” వారు మీకు సుఖసాధ్యు లగుదురు. ఓ దేవతలారా ! లోకమునందు ఆశయొక్కటియే సర్వదుఃఖములకును ఆశ్రయము. నిరాశయే సర్వసుఖములకును ఆధారముకదా. కావున వారికి అహంకారమువలన జయేచ్ఛయు, జీవనేచ్ఛయు, గలిగిన అప్పుడు వారు మీకు సుఖసాధ్యులగుదురు. ఈసర్వ ప్రపంచమును భోగవాసన యనెడు తంతువులచేత బంధింపబడియే ప్రవర్తించుచున్నది. ఇచ్ఛలేక ఎవ్వడును ఏకార్యమును చేయడుకదా. కావున నాఇచ్ఛయే అభివృద్ధి నొందినచో దుఃఖమును కలిగించును. ఆఇచ్ఛ నశించి

నచో సుఖమును సంపాదించును. మిక్కిలి ధైర్యవంతుడైనను, బహువిషయములను ఎఱిగిన పండితుడైనను, ముసలివాడైనను, లేక, సమృద్ధిగలవాడైనను, లేక, లోకానుభవము గలవాడైనను, మహాత్ముడైనను, "సింహము సంకెలలచేత బంధింపబడు విధమున" మనుష్యుడు ఆశాపాశముచేత బంధింప బడుచున్నాడు. ఈవిధముగ జెప్పి ఆమహాత్ముడగు బ్రహ్మదేవుడు అంతర్ధానము నొందెను. దేవతలును యథేచ్ఛముగ వెళ్ళిపోయిరి. పిమ్మట దేవతలు బ్రహ్మదేవుని యాజ్ఞను నెరవేర్పదలచి ఒక్కచోట గుమిగూడి రాక్షసులను యుద్ధమునకు బిలుచుచు ప్రళయకాల మేఘధ్వనులవంటి మహాధ్వనితో రణభేరి మ్రోయించిరి. దానిని విని యాదామ వ్యాళ కటులు సైన్యసమేతులై యుద్ధమునకు వచ్చిరి. ఇట్లు వచ్చిన ఆరాక్షసులతో దేవతలును కాలయాపనకై కొంతసేపు యుద్ధముచేసి పరుగిడిరి. మఱియొక సమయమునందుగూడ అట్లే వారిని యుద్ధమునకు బిలచి కొంతసేపు పోరాడి తొలగిపోయిరి. బ్రహ్మదేవుని ఆజ్ఞను అనుసరించి ఆరాక్షసులయొక్క మనస్సునందు అహంకారము ఆవిర్భవించుటకై దేవతలు ఈవిధముగ పలుమారును చేయుచుండిరి. ఈవిధముగ బహువిధములగు ఉపాయములతో యుద్ధములను జేయుచు బెదరినవారివలె తొలగిపోవుచు కాలయాపనము సేయుచుండిరి. ఇట్లు కాలము గడచు కొలది యాదామాది రాక్షసుల హృదయమునందు అహంకారము అంకురించి అభ్యాసబలమువలన అభివృద్ధి జెంద నారంభించెను. పిమ్మట వాసనా బంధము లేక, స్వచ్ఛమగు వారియొక్క మనస్సు బద్ధమయ్యెను. అంతట ఆరాక్షసులు సంసార వాసనచేత ఆక్రమింపబడి అజ్ఞానముచేత ఆశాపాశబద్ధులై దీనులైరి. "నాదేహము చిరకాలము నిలువవలయును. నాకు ధనము కావలయును, ధనములేక సుఖములేదు. దానిని సంపాదించుటకై ప్రయత్నింప వలయును." అని అభివృద్ధియందలి ఇచ్ఛ వారికి అధికమాయెను. దానిచేత వారిధైర్యము క్షీణించెను. ఈకారణమువలన వారలకు అప్పుడు యుద్ధమునందు తోడు కావలసివచ్చెను. మరణమువలనిభయము వారికిఅధికమాయెను. ఇట్లగుటచేత వారి బలసాహసములు క్రమక్రమముగ క్షీణించెను. తుదకు "కట్టెలులేని నిప్పు హవిస్సును దహింపలేనట్లు" వారి ఎదుటపడిన భటునికూడ సంహరింప లేకపోయిరి. విశేషముగ జెప్పనేల, తర్వాత స్వల్పకాలములోనే ఆదామాది రాక్షసులు మరణమునకు బెదరినవారై యుద్ధభూమియందు నిలువక పరుగిడ నారంభించి దేవతలచే అతిసులభముగ వధింపబడిరి.

ఓ మహాబుద్ధిమంతుడా ! శ్రీరామచంద్రా ! ఈవిషయమును ( అనగా, వాసనలు సర్వానర్థములను గలిగించునను విషయమును ) తెలుపుటకై "దామ వ్యాళ కటులవలె వ్యవహరింపకుము" అని విలాసముగ జెప్పితిని. అవివేకమును జెందినచో ( తనస్వరూపమును భ్రాంతిమయమగు ప్రపంచమునుండి విభాగించి ఎఱుగలేక పోయినచో ) ఇట్టి యాపదలు కలుగును. అపరిమితమైన సంసారదుఃఖము అభివృద్ధియగును. ఇదియంతయు మనస్సుయొక్క కార్యమే. ఆమనస్సునకు అవివేకము ఉన్నంతవరకు దుఃఖమే. వివేకము ఉన్నంతవరకు సుఖమే.

—※ దామాదుల ఉత్పత్తి. ※—

అనిన విని శ్రీరామచంద్రుడు వశిష్ఠమహామునితో ఇట్లనియె. ఓమహాత్మా! నాకొక సంశయము గలదు. ఈదామాదులు పరబ్రహ్మమునుండి జన్మించిన విధము ఎట్టిది. దానిని నాకు వివరింపుము. అనిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓరఘుకులతిలకా! శ్రీరామా! వినుము. ఆదామాదులకు సంకల్పమునకంటె భిన్నమగు రూపము ఏదియు లేదనుట పైకథవలన స్పష్టమగుచునే యున్నది. అయినను "వారికి రూపమే లేదు" అనియే చెప్పవలసియుండుటచేత నీకు సంశయము కలిగినది. ఇట్టి సంశయముతో బనిలేదు. ఆదామవ్యాళకటులకు మాత్రమే కాదు, మనకుగూడ సంకల్పమునకంటె అతిరిక్తమగు స్వరూపము లేదు. మనముకూడ మనోమాత్రులమే. మనస్సునకంటె భిన్నులమై వెలుపల లేము. నీఉనికియు నసత్యమే. నా ఉనికియు నసత్యమే. దామాదుల ఉనికియు నసత్యమే. లోకమునందు గానవచ్చు పదార్థములన్నియు మనస్సునకంటె భిన్నముగ నున్నట్లు దోచుచుండుటయే గాని, వాస్తవముగ అట్లులేవు. బొత్తిగ లేకున్నను ఉన్నట్లు తోచగల సామర్థ్యమొకటి పరబ్రహ్మమునందు కలదు. దీనికే ప్రతిభాస అని పేరు. పరబ్రహ్మముయొక్క ప్రతిభాసశక్తియే జీవుడు. శంబరుడు దేవతలను సాధించుటకై సేనానాయకుల సృష్టింపవలయునని తలంపగానే ఆసంకల్ప ప్రభావము వలన నీప్రతిభాస శక్తి మూడురూపములతో వికసించెను. కావున నాదామాదులును మనమును సత్యస్వరూపులము కాము. పరబ్రహ్మముయొక్క ప్రతిభాస శక్తియే ఇట్లు గానవచ్చుచున్నది. నిర్మలమై దేనితోను సంబంధములేక అద్వితీయమై యున్న చిదాకాశము ఒకటియే సత్యమైనది. సర్వవ్యాపకమై ఉదయాస్తమయములు లేనిదై శాశ్వతమై యున్న ఆచిదాకాశము ఒకటియే ఎప్పటికిని ఉన్నది. దానియొక్క ప్రతిభాసశక్తి విజృం

భించుటయే ఈప్రపంచముగా తోచుచున్నది. ఇదియే పరమార్థము. అనుభవానుసారముగ వ్యావహారిక దృష్టిచేత ( దీనికే అధ్యారోపమని పేరు ) చూచిన మనకు ఏఏస్థలములయందు ఏఏపదార్థములు ఉన్నట్లు తోచుచున్నవో ఆయా స్థలములయందు ఆయా పదార్థములు ఉన్నవి. అనుభవింపబడుచున్నవి. ఇట్లుగాక పరమార్థదృష్టిచేత జూచిన ఎచ్చటను ఏపదార్థమును లేదు. ఎవ్వడు దేనిని అనుభవించుట లేదు. సర్వమును బ్రహ్మమే. ( పరమార్థదృష్టికే అపవాదమని పేరు. ) ఈకారణమువలన ఓశ్రీరామా! జ్ఞానవంతులకు వ్యవహారహాని ఉండనక్కరలేదు. సర్వమును బ్రహ్మమాత్రముగ చూచుట ఒకటియే జ్ఞానాజ్ఞానులకుగల భేదము. దీనిని ఎఱిగి సంశయవర్జితుడవై భేదసంకల్పములను మాని సుఖముగా ఉండుము.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షిప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు<br>స్థితిప్రకరణమున దామాదుల ఉపాఖ్యానమను<br>పదునైదవసర్గ ముగిసెను.

---

అని ఇట్లు వశిష్ఠమహాముని అవివేకమువలన సంసారము వృద్ధియగునని బోధించి శ్రీరామునితో మఱియు ఇట్లనియె. ఓ శ్రీరామచంద్రా! ఆత్మ సర్వవ్యాపకుడై యుండగ పరిచ్ఛిన్నుడుగ భావించుచు ప్రతిపురుషుడును " నాకిది లేదు. అది లేదు. ఇది కావలయును. అదికావలయును " అని తలంచుచున్నాడు. ఈదౌర్భాగ్యపు భావనచేత తనయథార్థ స్వరూపము కానరాకున్నది. కావున ఏమహాత్ముడు సర్వమును ఆత్మ ప్రతిభాస శక్తియొక్క సముల్లాస మాత్రముగా నెఱిగి అకాముడై ముల్లోకములను తృణప్రాయముగ జూచునో అట్టివానిని, " మృగములు పండుగడ్డిని విడచినట్లు " సకల దుఃఖములును విడచిపోవును. ఏమహాత్ముని మనస్సునందు సత్యస్వరూపుడగు పరబ్రహ్మముయొక్క చమత్కారము అనగా శక్తివైచిత్ర్యము సర్వకాలములయందును స్ఫురించుచుండునో అట్టివానిని లోకపాలకులందఱును బ్రహ్మాండమును రక్షించునట్లు రక్షింతురు. బ్రహ్మాండము అచేతనమగుటచేత స్వయముగ ఏకార్యములను జేయదు. అట్లున్నను, ఇంద్రాదులు దానిని పరులవలన బాధ గలుగకుండ బ్రోచుచున్నారు. ఇట్లే ఈ బ్రహ్మజ్ఞానికూడ బ్రహ్మానుభవ రసికుడై నిర్వికల్ప సమాధియందె నిలచి ఏమియు జేయకుండినను, వానికి ఆవశ్యకములగు విషయములను సమకూర్చి సర్వ దేవతలును

రక్షించుచుందురు. మఱియును ఎట్టియాపదవచ్చినను అక్రమమైన మార్గమును తనయొక్క నిమిత్తమై అవలంబింపరాదు. రాహువు అక్రమమును ఆచరించుటచేత అమృతమును పానముచేసికూడ మృతుడాయెను. ప్రతివాడును ప్రయత్న పూర్వకముగ ధర్మయుక్తమైన కార్యమును దృఢమగు ఉత్సాహముతోఁబూని పౌరుషముతోఁడంగూడి శాస్త్రానుసారముగ ప్రయత్నింపవలయును. ఇట్లుచేసెనేని అవశ్యముగ ఇష్టఫలసిద్ధి కలుగును. మఱియును శాస్త్రానుసారముగ సంచరించువాడు "మనకు ఇంకను ఫలము కలుగలేదే" అని త్వరపడకూడదు. కాలము గడుచుకొలఁది పరిపక్వమై కార్యసిద్ధియొక్క మహాఫలము అంతమగును. కావున దుఃఖము, భయము, శ్రమ, అనువానిని వదలి ఆశను పరిత్యజించి కామాదులచే ప్రేరేపింపబడక తనంతదాన సంభవించిన కార్యములను శాస్త్రోక్త విధానముగ ఆచరింపుము. నిరర్థకముగ భిన్నాభిప్రాయములతో చెడకుము. "ధనసంపత్తి అనర్థకరము. సుఖభోగములు సంసారరోగమును అభివృద్ధిచేయునవి. సంపదలన్నియును ఆపదలే" అని ఎఱిగి సర్వమును తృణీకరించుటయే మనోజయము. ఇదియే మహాసిద్ధి. పురుష ప్రయత్నమువలన ఇది అవశ్యము సిద్ధించును. సంస్కారబలము అధికమగుటచేత ఈసిద్ధి గలుగుటకు ఆలస్యమగునని చింతింపవలదు. ఆలస్యమగు కొలఁది సిద్ధి మహాఫలవంత మగునని ఇదివరకే చెప్పియున్నాము. కావున సదాచారముచేత మనోహరమగు చరిత్రగలిగియుండువాడును, ఏకాంత ప్రదేశమునందు ధ్యానపరుడై ఆత్మానాత్మ వివేకయుక్తుడై యుండువాడును, దుఃఖరూపములగు సంసార సుఖములయందు కోరికలు లేనట్టివాడును, నగు మహాత్మునకు అప్రయత్నముగనే, ఆయుస్సు, కీర్తి, సద్గుణములు, సంపద, ఇవి అన్నియును, శాశ్వతమైన శ్రేష్ఠమగుఫలమును, ఇచ్చుటకుగాను "వసంత ఋతువునందలి తీగలవలె" సంపూర్ణముగ వికసించును. (ఆయుస్సు మొదలగువాని పక్షమున జీవన్ముక్తియనియు, తీగెలపక్షమున శ్రేష్ఠమగు ఫలములనియు తెలిసికొనవలయును.)

ఓ శ్రీరామచంద్రా! సంసార సముద్రమును తరించు విషయమున తపస్సులుగాని, తీర్థయాత్రలుగాని, శాస్త్రాభ్యాసములుగాని, జపముగాని, ఉపయోగింపవు. కేవలమగు సజ్జనసేవయే ఇందు సాధనము. ఏమహాత్మునకు, లోభము (అత్యాశ) మోహము (అజ్ఞానము, లేక, అనురాగము) క్రోధము, అనునవి ప్రతిదినము క్షీణించు చుండునో, ఎవడు శాస్త్రానుసారముగ ఆత్మానాత్మ వివేకయుక్తుడై తనయొక్క కర్మలను

చేయుచుండునో, అట్టివాడే సజ్జనుడు. అట్టివారి సేవయే మోక్షసాధనము. సంసారమనగా అన్యమేమియు లేదు. నేను అను పదమునకు సరియైన అర్థమును ఎఱుగక లేక ఉండినప్పుడు అదియే నిత్యశుద్ధమగు చిదాకాశమునందు మాలిన్యమై యుండును. ఆమాలిన్యమే సంసారము. ఇట్లుగాక, ఆ అహం శబ్దార్థమును జక్కఁగ నెఱిగినచో ( అహంశబ్దవాచ్యుడు జీవుడని తలపక జీవాభిన్న పరబ్రహ్మమే అని ఎఱిగినచో ) నా అహం శబ్దార్థము నిత్యశుద్ధ చిదాకాశమే అగును. అప్పుడు సంసారమే లేదు. జ్ఞానమను వెన్నెల అహంకారమను మేఘముచేత ఆవరింపబడి ఎంతకాలమువరకు ప్రకాశింప కుండునో, అంతవరకు పరమార్థతత్వమను కలువ వికసింపదు. ( అహంకారము నశింపక, కైవల్యము కలుగదు. ) ఎన్నటికిని నశింపని గుణముగల జన్మవృక్షములకు, లేక, సంసారవృక్షమునకు ( జన్మమే సంసారమునకు మూలము కావున ఇట్లు చెప్పబడెను. ) మరణము ఉండినను, వాసనాబలమువలన జన్మములు ఒకదానివెనుక ఒకటి వచ్చుచునే ఉండును. అహంకారమే మొలక. " ఇదినాది " అనునట్టి అహంకార మమకారమే శాఖలు. శూన్యరూపములయ్యును మోహమును గలిగించునట్టి భోగములే ఫలములు.

## —※ అహంకార నిరూపణము. ※—

అనిన విని శ్రీరామచంద్రుడు ఇట్లు ప్రశ్నచేసెను. ఓమహాత్మా! వశిష్ఠమహామునీ ! ఈ అహంకారమునకు రూపమెద్ది? దీనిని విడచు ఉపాయమేట్లు? ఆ ఉపాయము శరీరముతో గూడియున్నప్పుడు సాధ్యమగునా? లేక, శరీరము నశించునంతవరకు సాధ్యముకాదా? మఱియును ఆ యహంకారమును విడిచిపెట్టిన ఫలమేమి? ఈవిషయములను సవిస్తరముగ బోధింపుము. అనిన వశిష్ఠమహాముని ఇట్లని చెప్పనారంభించెను.

ఓరాఘవా! శ్రీరామా! లోకమునందు మూడువిధములగు అహంకారములు గలవు. అందు రెండు శ్రేష్ఠములైనవి. ఆదరింప తగినవి. వానివలన జీవన్ముక్తికి భంగము లేదు. మూడవదానిని మాత్రము సంపూర్ణముగ విడువవలయును. వీనిస్వరూపములను క్రమముగ వివరించెదను వినుము. " ఈప్రపంచమంతయును నేనే. నేనే పరబ్రహ్మము. నాకంటె అన్యము ఏదియును లేదు. " అనునది పారమార్థిక అహంకారము. ఇది మోక్షమునే కలిగించును గాని, బంధింపదు. " నేను ఈప్రపంచమునకంటె భిన్నుడను. వెంట్రుక కొనలోని నూరవ భాగమంత సూక్ష్మస్వరూపుడను. సర్వ

సాక్షిని. నాకు ఈప్రపంచ వికారములతో సంబంధ మేమియును లేదు.” అను జ్ఞానమే రెండవ అహంకారము. ఇదియు ముక్తిని ఇచ్చును గాని, బంధమును గలిగింపదు. ఈవర్ణించిన అహంకారములు రెండును శుభకర ములే అగుటచేత జీవన్ముక్తులు వీనిని అవలంబింప వచ్చును. మఱియు “కర చరణాది అవయవములుగల ఈదేహమేనేను” అనుతలంపు మూడవ అహం కారము. ఇది విచార శూన్యతచేత ఏర్పడిన లౌకిక అహంకారము. కావున ఇది మిక్కిలి నీచము. ఆశ్రయణీయము కాదు. ఈ అహంకారము మిక్కిలి దుష్టమైనది. సర్వ సంసార దుఃఖములకును మూలకందము. (కుదురు) దీని చేత ఆవరింపబడి జంతువులు ( అనగా, మనుష్యులుకూడ జంతు శబ్దము చేత జెప్పబడుదురు. జంతువనగా జన్మించుపదార్థము ) అధోగతికి బోవు చున్నవి. ఎప్పటికిని ఊర్ధ్వాభిముఖము లగుటయే లేదు. కావున దీనిని సం పూర్ణముగ పరిత్యజింప వలయును. దుష్టమగు నీ అహంకారము ( దేహా త్మాభిమానము ) సంస్కారసహితముగ ( నిశ్శేషముగ ) మనస్సునుండి తొలగింప బడెనేని అప్పుడు మొదట వివరించిన శుభాహంకారముల రెండు ను, లేక, ఆరెంటిలో నేదిమైనను పరిపాకానుసారముగ బుద్ధిని ఆక్రమిం చును. దానిచేత పురుషుడు శీఘ్రముగ జీవన్ముక్తుని జెంది కృతార్థుడగును. కావున మోక్షేచ్ఛగల పురుషుడు లోకమునకు అతీతములగు మొట్టమొదటి రెండు అహంకారములను అంగీకరించి సర్వానర్థకరమగు మూడవ లౌకిక అహంకారమును ( విచారశూన్యమై ఏర్పడిన అహంకారమును ) సంపూ ర్ణముగ విడువ వలయును. మోక్షేచ్ఛ గలవాడు చేయవలసిన కార్యమే ఈమూడవ అహంకార పరిత్యాగము ఒక్కటియే. ఇట్లు విడిచిపెట్టిన పిమ్మట వాడెట్లు విహరించినను పరబ్రహ్మమును జెందినవాడే. దేనిచూచి నను, పరబ్రహ్మమును చూచినవాడే. ఏకార్యమును చేసినను నిర్వికల్ప సమాధియందు నిలిచినవాడే.

ఓదోషరహితుడా ! శ్రీరామా ! మఱియు నొక్క విశేషము. మొట్టమొదట వర్ణింపబడిన అహంకారములను రెంటిని సర్వకాల సర్వావ స్థలయందును భావించుచుండిన క్రమక్రమముగా నీలౌకికాహంకారము నశిం చును. ముక్తియును దొరుకును. ఇట్లు జీవన్ముక్తిపదము సమీపించునంతవ ఱకూ నా రెండు అహంకారములను అవలంబించి యుండవలయును. పిమ్మట అభ్యాసము అధికమగు కొలది ఆ అహంకారములతో గూడ పని లేదు. అప్పుడు ఆ అహంకారములను విడిచినయెడల పురుషుడు మహోన్నతపదవి

చెందినవాడే. మఱియును దుష్టమగు అహంకారమును విడిచినచో ఇప్పుడు దుఃఖకరముగానున్న ఈశరీరస్థితి అతిపవిత్రమై సుఖకరమగును. కావున నీ అహంకార పరిత్యాగమే మహాసౌఖ్యము. ఇదియే పరమసౌభాగ్యము. ఇంత ఏల? ఇదియే మోక్షము.

—✱ భీముడు, మొదలగు రాక్షసుల ఉపాఖ్యానము. ✱—

ఓ శ్రీరామచంద్రా! ఇక భీముడు మొదలగు రాక్షసుల వృత్తాంతమును దెలిపెదను వినుము. ఆవిధముగ ఆదామ వ్యాళ కటులు దేవతలచేత మాయోపాయమువలన వధింపబడగానే ఆశంబరాసురుడు మిక్కిలి గర్వితుడై ఎల్లైనను దేవతల వధింపవలయునని నిశ్చయము గలవాడయ్యెను. దానికి అనుకూలమగు ఉపాయమును మఱల ఇట్లని విచారించెను. ఆహా, నేను మాయచేత మొట్టమొదట అతిబలాఢ్యులగు దామాది రాక్షసుల సృష్టించితిని. వారును సర్వదోష వినిర్ముక్తులై నిర్మల చిత్తులై యుండిరి. ఇట్టివారగుటచేత "వీరిమూలమున దేవతల మర్దింప గలుగుదును గదా" అని సంతోషించుచుంటిని. మొట్టమొదట అట్లే జరిగినది. పిమ్మట దేవతల యొక్క మాయవలన వారు (దామాదులు) అసత్యరూపమగు అహంకారమును బూనిరి. ఆదోషమువలన వారు హతులైరి. హతులైతే అగుదురుగాక. ఇప్పటికి మాత్రము దేవతలు నాచారినుండి తప్పించుకొని పోవుదురా? ఇప్పుడు మాయాబలముచేత ఆదామ వ్యాళ కటులకంటె ఉత్తములగు మఱికొందరు రాక్షసులను సృష్టించెదను. వారు దేవమాయలకు లోబడకుండునట్లు వారికి తత్త్వోపదేశము చేసెదను. ఆత్మానాత్మ వివేకమునందు స్థిరులను గావించెదను. ఇట్లుచేసిన యెడల వారు అసత్యరూపమగు అహంకారమును అనగా దేహాత్మాభిమానమును జెందరు. ఇట్లు చెందకుండినచో దేవతలు వారిని ఏమియు చేయనేరరు. వారు క్షణమాత్రమున ఆదేవతల నిస్సంశయముగ జయింపగలరు. ఇవ్విధముగ విచారించి యాశంబరుడు సముద్రము వాత సహాయముచేత బుద్బుదములను బుట్టించునట్లు మాయాసహాయముచే అట్టిరాక్షసులను గల్పించెను. ఆరాక్షసులును ముగ్గురే. భీముడు, భాసుడు, దృఢుడు, అనివారికి పేర్లు. వారు సర్వజ్ఞులు. వేదార్థమును దెలిసినవారు. రాగ ద్వేషములు లేనివారు. సంసార భోగములను గోరనివారు. కడచిన దానినిగూర్చి కాని, జరుగబోవు దానిని గూర్చి గాని విచారింపక ఎప్పటికి ఏది సంప్రాప్తమగునో దానిని అభిమాన రాహిత్యముతో నాచరించువారు. సర్వ ప్రపంచమును తృణమాత్రముగ జూచు

వారు. పరిశుద్ధులు. ఆత్మానాత్మ వివేకము గలవారు. సర్వోత్తములు. ఇట్టి ఆభీముడు మొదలగు రాక్షసులు శంబరునిచేత ఆజ్ఞాపింపబడి మహాసైన్యముతో ఆకాశమును ఆవరించిరి. అనేక సంవత్సరములు దేవతలతో యుద్ధము చేసిరి. వారలకుకూడ " ఈజయము నాది " అను మొదలగు సంకల్పములు దేవమాయచేత కలుగుచుండెనుగాని, అది తత్క్షణమే అణగి పోవుచుండెను. వారు జ్ఞానవంతులగుటచేత " ఇదినాది " అను సంకల్పముతో గూడనే " నేనెవ్వడను, పరబ్రహ్మమునే కదా. నాకంటే అన్యమగు పదార్థము ఒకటికలదా. నాకు ఒకదానితో సంబంధము కలదా. ఏమియు లేదు. నేను నిరర్థకముగ నాకంటె భిన్నమగు పదార్థము ఒకటి కలదనియు దానితో నాకు సంబంధము కలదనియు దలంచి నిరర్థకమగు సంసార దుఃఖము నొందనేటికి " అను సంకల్పము ఉదయించుచుండెను. ఇక నామమకారము వారల నెట్లు బాధించును? బాధింప నేరదు కదా. ఈవిధముగా అహంకార మమకారములు లేక, జరామరణములవలన భయమునొందక ఎప్పటికి ఏది సంప్రాప్తమగునో దానిని ఆచరించుచు గడచినదానిని గూర్చి చింతింపక రాబోవుదానిని విచారింపక ఎప్పటికి వీది ఆవశ్యకమో వానినిమాత్రమే అనుసరించుచు రాగద్వేషములను జెందక సుఖదుఃఖాది ద్వంద్వములయందు సమభావము కలిగియున్న ఆభీముడు, భాసుడు, దృఢుడు, మొదలైన రాక్షసులచేత నాదేవతులసేన సంహరింప బడెను. భుజింపబడెను. నుగ్గుసేయబడెను. దహింపబడెను. లోకమునందు పురుషులు తమ ఆహార పదార్థములను ఎట్లు రోకండ్లతో దంచి అగ్నిపై బెల్చి పొడిచేసి భుజింతురో అట్లే యారాక్షసులును ఆదేవసైన్యమును బహువిధముల ధ్వంసముచేసిరి. ఈవిధముగ భీమ, భాస, దృఢులచేత మర్దింపబడిన ఆదేవసేన " హిమవంతమునుండి దిగిన గంగానదివలె " అతివేగముతో బరువు లిడెను. పిమ్మట వాయువేగముచేత చీకాకగుచున్న మేఘపంక్తిః పర్వతములను ఆశ్రయించినట్లు సకలలోక రక్షకుడగు క్షీరసాగర శయనుని మహావిష్ణువును శరణుజొచ్చెను. అప్పుడు ఆశ్రీమన్నారాయణుడు ఆదేవతలకు అభయమిచ్చి ఘోరసంగ్రామమునందు చక్రాగ్నిచేత భీముడు, మొదలగు రాక్షసులను దహించెను. మహాజ్ఞాన సంపన్నులగుటచేత వారలకు సాయుజ్యము నొసంగెను. ఈకారణమువలన ఓశ్రీరామచంద్రా! మనస్సు వాసనలతో గూడియుండుటయే బంధము. అట్లు లేకుండుటయే మోక్షము. కావున జ్ఞానవంతుడవై పురుషప్రయత్నమును బూని వాసనలు లేకుండు స్థితిని

శీఘ్రముగ సంపాదించుకొనుము. ఇది కష్టసాధ్యము కాదు. పరబ్రహ్మ రూపమును విజ్ఞానదృష్టిచేత బాగుగ నెఱుగ గలుగునేని అప్పుడు చిత్తమునందలి సంస్కారములు సమూలముగ నశించును. వెంటనే “ చమురులేని దీపము వలె ” మనస్సు అభావమగును.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాసిష్ఠ రామాయణమునందు
స్థితిప్రకరణమున - భీముడు మొదలగు రాక్షసుల
ఉపాఖ్యానమనుపదునారవసర్గ ముగిసెను.

---

అని ఇట్లు వసిష్ఠమహాముని శ్రీరామునకు ఉపదేశించి మఱియు నిట్లనియె. ఓ శ్రీరామచంద్రా ! నానావిధములగు దుఃఖములను గలిగించునట్టి ఈసంసారము నశించుటకు మనోనిగ్రహమునకంటె వేఱొక ఉపాయము లేదు. ఆమనోనిగ్రహమునకును వైరాగ్యమునకంటె ఇతరమగు ఉపాయము లేదు. ఇంతయేల? జ్ఞాన విషయమును అంతయును సంక్షేపముగ జెప్పెదను. వినుము. విచారించి మనస్సున నిశ్చయించు కొనుము. భోగేచ్ఛయే బంధము. దానిని విడిచిపెట్టుటయే మోక్షము. శాస్త్రార్థములను అంతయు విచారింపనేటికి? చేయవలసినపని భోగేచ్ఛాపరిత్యాగము ఒక్కటియే. ఏదేది కన్నులకు దోచునో దానినంతయును రమ్యమని అభిమానించుటను మాని “ ఇది నాకు కావలయును ” అని కోరుటను విడిచి విషమువలెను, అగ్నివలెను, జూడవలయును. వాస్తవస్థితిలో లోకానుభవమును అనుసరించి చూచిన సర్వవిషయములును దుఃఖకరములే. సర్వభోగములును ఆపదలే. అయినను విజ్ఞాన దృష్టిచేత సర్వమును విచారించి మనస్సుచేత వానియందలి అభిమానమును విడిచినచో, అన్నియు పరమానందకరములే అగును. మనస్సు అభివృద్ధి జెందుటయే పురుషునకు వినాశము. మనస్సు నశించుటయే ( అనగా వాసనలను విడచుటయే ) పురుషునకు అభివృద్ధి. పురుషుడు జ్ఞానవంతుడయ్యెనేని మనస్సు వినాశము నొందును. అజ్ఞానియయ్యెనేని అంతకంతకు అభివృద్ధియై సంకెళ్ళు అగుచు బంధించును. జ్ఞానవంతుని మనస్సుయొక్క ఆకారము ఇట్టిదియని చెప్పుటకు వీలులేదు. అది ఆనందరూపముగాని, ఆనందమయముగాని, కాదు. ఆనందరూపము లేనిదిగాని, ఆనందమయము గానిదికాని, కాదు. ఆనంద రూపమయ్యు గానిదికాని, ఆనందమయమయ్యు గానిదికాని, కాదు. చంచలమైనదికాదు. చంచలముగాక స్థిర

మైనదియు కాదు. చాంచల్యము లేకున్న వ్యవహారము సంభవింపదు కదా. మఱియు చరస్థిర స్వభావములు రెండును గలదియు కాదు. ఇట్టిపదార్థము ఎందును లేదుకదా. ఇదియునుగాక, అది యున్నదియుకాదు. లేనిదియు కాదు. ఉండినచో జీవన్ముక్తి తటస్థింపదు. లేకున్నచో వ్యవహారము సంభవింపదు కదా. ఇకను ఉండియు లేనిదగుననిన అట్టిదియు కాదు. అట్టిపదార్థము ఉండుట విరుద్ధముకదా. అనినవిని శ్రీరామచంద్రుడు ఇట్లని ప్రశ్న చేసెను.

—* బ్రహ్మమునందు ప్రపంచమున్న విధమును వర్ణించుట. *—

ఓమహాత్మా! వికారమయమగు ఈప్రపంచము నిత్యశుద్ధుడగు ప్రపంచాతీతునియందు ఎట్లు నిలచియున్నది. జ్ఞానాభివృద్ధికై నాకు దాని మఱియొకతూరి వివరించి చెప్పుడు. అనగ నవ్వశిష్ఠమహాముని ఇట్లనెను. ఓ శ్రీరామచంద్రా! వినుము. ఆకాశము సర్వవ్యాపకమయ్యు, అతిసూక్ష్మమగుటచేత రూపము లేనందువలన ఎట్లు అగుబడలేదో, అట్లు ఈపరబ్రహ్మముకూడ సర్వవ్యాపకుడై యున్నను, ప్రత్యక్షముగ అగుబడకున్నాడు. భ్రాంతివలన నీవిభాగములు గానవచ్చుచున్నవి కాని, వాస్తవ స్థితిలో సర్వాత్మకుడగు పరబ్రహ్మమునందు ఏవిభాగములును లేవు. ఆయనయందు ఏసంకల్పములును లేవు. ( ప్రపంచము సంకల్పమయమే కావున ఇచ్చట సంకల్పశబ్దముచేత ప్రపంచమే చెప్పబడునని ఎఱుగునది ) ఆయనకు నామధేయము లేవియును లేవు. ఇట్టి నిత్య శుద్ధుడును నాశరహితుడు నగు ఆపరబ్రహ్మమే ఆత్మయని పిలువ బడుచున్నాడు. మఱియును ఆబ్రహ్మము ఆకాశమునకంటె నూఱింతలు అధికముగ నిర్మలుడై సూక్ష్మరూపుడై యున్నాడు. కావుననే సర్వసాధారణముగ ప్రత్యక్షమగుట లేదు. అయినను ఆత్మరూపుడే అగుటచేత జ్ఞానులకు స్వాభావికమగు నిర్మలరూపముతో ప్రకాశించును. తత్త్వమును ఎఱుగలేనివారును భ్రాంతిగలవారు నగుటచేత అజ్ఞానులకు వికారవంతమగు ప్రపంచరూపముతో దోచును. ఇదియే " ప్రపంచము పరబ్రహ్మమునందు ఉండుట " అని తెలిసికొనవలయును. విచారించినచో బ్రహ్మ ప్రపంచములకు భేదమే లేదు. బ్రహ్మమే ప్రపంచము, ప్రపంచమే బ్రహ్మము. జలమయ మగునట్టియు, వ్యాపకమైనట్టియు, సముద్రమునందు అలలు, బుద్బుదములు, నురుగు, మొదలగు రూపములతో భేదము ఏవిధముగ గానవచ్చుచున్నదో, విచారించిన ఆభేదము అనగా భిన్నములని తలపబడు అలలు మొదలగునవి ఆసముద్రమునకంటె ఎట్లు వేఱుకావో,

అట్లే జ్ఞానమయమును సర్వవ్యాపకమునగు ఈపరబ్రహ్మమునందును "నీవు, నేను" అను మొదలగు భావనలే స్వరూపముగా గల భేదము గానవచ్చుచున్నది. బాగుగ విచారించిన నాభేదము అనగా భిన్నములని తలపబడు నీవు, నేను అని చెప్పబడు వ్యక్తులు ( నీవు, నేను, అను శబ్దములకు అర్థములగు పదార్థములు ) ఆబ్రహ్మమునకంటె భిన్నములుకావు. కావున ఓశ్రీరామ చంద్రా! వివేకము లేనివారలకు ఈబ్రహ్మమే శూన్యరూపములును, అతి భయంకరములును అనంతములగు సంసార పరంపరలుగ, దోచును. వివేకవంతులకు సర్వవ్యాపకమును కేవల జ్ఞానమాత్రరూపమునై గానవచ్చును. ఈవిధముగ అభిప్రాయములకే లేక, దృష్టులకే భేదముగాని పరబ్రహ్మమునకు లేదు. మఱియు సర్వరూపుడగుటచేత ఆబ్రహ్మమే అనుభవానుసారముగ సంసారులను ఆయాకర్మలయందు ప్రవర్తింప జేయువాడుగాను, సుఖదుఃఖములను అనుభవింప జేయువాడుగాను, సంకల్పింప జేయువాడుగాను, ఉన్నాడు. స్వాభావిక స్థితినిబట్టి జూచిన ఈబ్రహ్మము ఎవనికి ఎన్నివిధముల గానవచ్చినను నిత్యుడగుటచేత పుట్టువాడుకాడు. నశించువాడును కాడు. వికారములేవియును లేకుండుటచేత సిలచువాడు కాడు. కూర్చుండువాడును గాడు. ఏకార్యములను ఆచరించువాడు గాకుండుటచేతను, సర్వమయుడగుటచేతను, ఒకస్థలమునుండి మఱియొకస్థలమునకు వచ్చువాడుగాడు. పోవువాడును గాడు. ఏవస్తువును ఆశ్రయింపడు. కావున " ఇచ్చట ఉన్నాడు " అనిచెప్పుటకుగాని, సర్వవ్యాపకుడు కావున '' ఇచ్చటలేదు " అనిచెప్పుటకుగానీ, వీలులేదు.

ఓ శ్రీరామచంద్రా ! ఇట్టి ఈపరబ్రహ్మము ఎప్పటికిని స్వాభావిక స్థితితోనేయున్నను అజ్ఞాన దృష్టి వశము వలన జగత్తు అను పేరుతో ఈవిధముగ గానవచ్చుచున్నది. ఆబ్రహ్మమే మొట్టమొదట జ్ఞానరూపముతోను, అవయవములులేని సర్వవ్యాపకమగు ఏకస్వరూపముతోను, ఉదయాస్తమయములు లేక, సర్వకాలములయందు సమానముగ వెలుగు స్వభావముతోను ప్రకాశించుచుండెను. పిమ్మట సంకల్పవశమున అజ్ఞాన స్వరూపముగాను, అవయవ సహితముగాను, ( ఇచ్చట సంకల్పమని చెప్పబడినది. అనుభవమునందు ఉన్న అజ్ఞానమే. ఈ అజ్ఞానముకూడ అన్నిటివలె అసత్యమైనదిమేయైనను, అనుభవమును అనుసరించి " ఇదికలదు " అని చెప్పవలసీ వచ్చినది అని తెలిసికొనవలయును ) తనకుదానే తోచినది. పిమ్మట ఆసంకల్పములు అధికములగు కొలది " నాకు ఈఆకారము కలదు, నేను

బ్రాహ్మణుడను ” అను అభిమానము జనించినది. దానివలన నిత్య జ్ఞాన స్వరూపమగు బ్రహ్మము అజ్ఞానదశకు వచ్చెను. ఇదియే అజ్ఞానులయొక్క స్వరూపము. వాస్తవస్థితిలో వారును బ్రహ్మమునకంటె భిన్నులు కానే రరు కదా. ఈవిధముగా మెల్లమెల్లగ అజ్ఞానవాసన పెరిగి స్వాభావికమగు సర్వవ్యాపకత్వము నశించి పరిచ్ఛిన్నత్వమును ( నేను ఇచ్చట మాత్రమే యున్నాను అచ్చట లేను అనుటను ) జ్ఞానశూన్యత్వమును సంభవింపగానే భేదము అభివృద్ధియగును. “ నా ఆకారమిది ” అను సంకల్పము జనించిన వెంటనే “ వాని ఆకారము అది ” అను సంకల్పము జనించుట సహజమే కదా. ఇట్టి సంకల్పములవలన క్రమముగ భేదము అభివృద్ధి జెందగానే సంసారము ( అహంకారము ) మొదలుగా గల సర్వమును గలుగును. ఉనికి, లేమి, అనగా కొన్నివస్తువులు కలవనియు, గొన్ని లేవనియు గ్రహించుట, సర్వమును ఆత్మమాత్రమై యున్నదని ఎఱుగలేకపోవుట మొదలగు గుణములు కలుగును. ఇట్లు ఈసంకల్పములు దృఢములుకాగానే ఆబ్రహ్మమునందు బహువిధ చాంచల్యములు కలుగును. వానివలన ఆకాశాది పంచ భూతములును మనోబుద్ధులును దేహాత్మాభిమాన రూపమగు అహంకారమును జనించును. కావున ఈసర్వమునకును కర్తయు ద్రష్టయు స్వరూపమును ఆధారమునుగూడ పరబ్రహ్మమే. వాస్తవస్థితిలో ఇదియంతయు సత్యముగ నుండుటకు వీలులేదు. కావున బ్రహ్మాభిన్నమగు పదార్థమేదియును ఎప్పటికిని ఎందును లేదు. ఈవిధముగ ఓరామభద్రా ! సంసారములు గుంపులు గుంపులుగ పరబ్రహ్మమునుండి స్వభావముగనే పుట్టుచున్నవి. నశించుచున్నవి. అజ్ఞానముచేత శాశ్వతములైనట్లు గానవచ్చుచున్నవి. సర్వమును అసత్యమే. గనుక చూచువాని దృష్టిలోపమువలన జనించినదియే. కావున యథార్థస్థితికి ఎట్టిహానియును ఎప్పటికిని లేదు. గ్రీష్మఋతువునందు నీరు లేని స్థలమునందు దోచు నదులవలె చిన్మాత్రరూపమగు ఆబ్రహ్మమను ఆకాశమునందు ఈసంసారములు తోచుచున్నవి. మద్యపానము, భ్రమ, ఉన్మాదము, మొదలగు వానిచేత తానే అన్యుడుగ దోచునట్లు యథార్థ స్వరూపమును తెలిసికొనలేక పోవుటచేత బ్రహ్మమే బ్రహ్మముకంటె అన్యుడుగ ( ప్రపంచరూపుడుగ ) దోచును.

ఓ రామభద్రా ! బ్రహ్మమనగా నెవ్వడో యనియు, ఎచ్చటనున్నాడో యనియు, సంశయింపవలదు. నీయొక్క ఆత్మయే బ్రహ్మము. దేని సహాయమువలన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను ఎఱుగుచున్నా

హో, అదియే ( జ్ఞానమే ) ఆత్మ స్వరూపము. " లోకమునందు జ్ఞానముతో గూడ అజ్ఞానము ఉన్నదీ. జ్ఞానము బ్రహ్మమైన అజ్ఞానము బ్రహ్మాభిన్నమగు అన్యపదార్థము కావలయును. ఇది సమ్మతము కాదు గదా " అనిమెదవేమో; వినుము. లోకవ్యవహారమును అనుసరించి వర్ణింప బడుచున్న జ్ఞానముగాని, అజ్ఞానముగాని, పరబ్రహ్మముకాదు. అజ్ఞానాజ్ఞానములను రెంటిని తెలిసికొను జ్ఞానమెద్దియో, అదియే బ్రహ్మము. అదియే ఆత్మ. లోకమునందు ఒక పదార్థము ఎదుట నున్నప్పుడు " ఇచ్చట గృహము కలదు " అను మనోవృత్తి కలుగును. అదియేకదా జ్ఞానమని పిలువ బడుచున్నది. ఆసమయమునందు కొంచెము విమర్శింపగలవారికి మఱియొక అనుభవము కూడ స్పష్టమగును. " వీడు గృహమును తెలిసికొను చున్నాడు. " అని మానము చెప్పు జ్ఞానమునకంటె అంతరమగు మఱియొక జ్ఞానమునకు తెలియువచ్చుచుండుట విశదమగును. ఆరెండవ జ్ఞానమే బ్రహ్మము. మఱియు నిదురనుండి మేలుకొనినవాడు " నేను ఇంతవరకు సుఖముగ నిదురించితిని" అని చెప్పుట అనుభవమునందు ఉన్నదిగదా. ఆనిద్రావస్థయందలి సుఖమును దెలిసికొను జ్ఞానము ఎద్ది? సర్వాభావ రూపమగు ఆ నిద్రావస్థయందు ఉన్న సుఖమును ఏదియైన దెలిసికొనకుండిన మేల్కొనిన పిమ్మట " నిద్ర మిక్కిలి సుఖముగ నున్నది " అని చెప్పుటకు వీలులేదనుట స్పష్టమేకదా. " ఆసుఖమునుగూడ ఘటాదులను గ్రహించు సామాన్య జ్ఞానమే గ్రహించును " అని చెప్పుటకు వీలులేదు. సామాన్య జ్ఞానము ఉత్పత్తి వినాశములు గలది. ఎదుట పదార్థమున్నప్పుడు " ఇది ఇచ్చట కలదు " అను జ్ఞానము కలుగును. లేనప్పుడు కలుగదు: ఇదియును అనుభవ సిద్ధమే. ఇక నిద్రయందు పదార్థములు ఏవియు లేవు. కావున అందు ఈ జ్ఞానము జనింపదు. " సుఖము కలదుకదా " అందువేమో, అది బాహ్య పదార్థము కాదు. ఇదియునుగాక, నాసామాన్య జ్ఞానము జనించినప్పుడెల్ల " నేను దీనిని తెలిసికొనుచున్నాను. " అని అహంకార పూర్వక వృత్తియుండుట ప్రత్యక్షము. నిద్రయందు అహంకార వృత్తి లేదనుటయు ప్రత్యక్షమే. కావున అప్పుడు సుఖమున్నను దానిని గ్రహించునది సామాన్య జ్ఞానము కానేరదు. ఆసుఖముకూడ స్వస్వరూపమాత్రమేకాని, అన్యము గాదనియు నిరూపింప వచ్చును. సిద్ధాంతముకూడ నదియే. అది ఎట్లనిన:— అప్పటి సుఖము పదార్థాంతరమువలన జనించినదగు నేని అప్పుడు ఆపదార్థముగూడ గానరావలయును. నిద్రయందు ఏపదార్థమును గానవచ్చుట లేదను విష

యము స్పష్టమేకదా. " సుఖము పదార్థమువలన జనింపకున్నను పదార్థాభావమువలన జనింపవచ్చునుకదా. ఆపదార్థాభావము నిద్రావస్థయందు కలదు " అనిన నది సరికాదు. అభావమునుండి భావపదార్థము ఎప్పటికైనను జనించునా. గొడ్రాలి పుత్రునకు కుమారుడు పుట్టెననుట ఎంతైనను గలదా. కావున సామాన్య జ్ఞానము ఎట్లు చూచినను నిద్రావస్థ యందలి సుఖమును గ్రహింపనేరదు. ఈ విమర్శవలన నిద్రావస్థయందు సామాన్య జ్ఞానమునకంటె భిన్నమగు మఱియొక జ్ఞానము కలదని సిద్ధాంత మగుచున్నది. దీనిని బట్టియే జాగ్రత్స్వప్నావస్థల యందుగూడ ఆజ్ఞానమే సర్వసాక్షియై యున్నదని చెప్పవలసి యున్నది. జ్ఞానమునకు నాశము లేదు. కావునను, కలుగుటకుకూడ వీలు లేదు. కావునను, ఎల్లపుడు నది (జ్ఞానము) ఏకరూపముతో నుండి తీరవలసినదియే. సాక్షియగునది ( సర్వమును తెలిసికొనునది ) ఉత్పత్తి వినాశములనుగూడ తెలిసికొనవలయును. కావున దానికి ( సాక్షికి ) నాశము కలుగుటకు వీలులేదు. కావున నా జ్ఞానము ఒకటియే సర్వావస్థలను సర్వసంసారమును జూచుచు సాక్షియైయున్నది. ఇట్టిదగుటచే సర్వవ్యాపకముగగూడ నున్నది. అదియే బ్రహ్మము. "సామాన్యమని చెప్పబడిన జ్ఞానమే అట్టిది కారాదా? జ్ఞానమునకు సాక్షియుండుట సంభవింపదు. కావున రెండవ జ్ఞానమును అంగీకరింపనేల? " అనియెదవేమో వినుము. సామాన్య జ్ఞానమునందు ఉత్పత్తి వినాశములు కలవనుట అనుభవ సిద్ధమైయున్నది. కావున అది నిత్యమగుటకు వీలు లేదు. మఱియు రెండుజ్ఞానములకు పరస్పరభేదము ఉండుటకు వీలు లేదు. వాస్తవ స్థితిలో జ్ఞానమునకు ఉత్పత్తి వినాశములుకూడా నుండుటసంభవింపదు. ఈసిద్ధాంతములను బట్టి చూచిన జ్ఞానమొకటియే కలదనియు, దానినే ఉపాధివశము వలన దానినే ఉత్పత్తి వినాశములు కలదానినిగ జూచుచున్నామనియు, దేలును. ఆ ఉపాధియే చిత్తవృత్తి. పదార్థము ఇంద్రియమునకు ఎదుట నిలువగానే చిత్తమునందు వృత్తిజనించి ఇంద్రియమూలమున వెలికి వచ్చును. అప్పుడు సర్వవ్యాపకమగుటచేత బ్రహ్మమని చెప్పబడిన జ్ఞానమే ఆవృత్తియందు ప్రతిఫలించి విషయములను ప్రకాశింపజేయును. ఈ విషయము మును ఎఱుగలేక మనము చిత్తవృత్తికిగల ఉత్పత్తి వినాశములు జ్ఞానమునకే ఉన్నట్లు దలంచుచున్నాము. ఇంతయేకాని, జ్ఞానమునకు ఉత్పత్తి వినాశములు ఎప్పటికిని లేవు. ఇట్లియుండగాక ఆచిత్తవృత్తి లేని సమయమునందు జ్ఞానమందు ప్రతిఫలింపదు. కావున ఆస్థితిని అజ్ఞానమనుచున్నాము.

ఈ విధముగ మన వ్యవహారములోనుండు చిత్తవృత్తి ప్రతిబింబ తదభావరూపములగు జ్ఞానాజ్ఞానములు రెండును పరబ్రహ్మము కావు. బింబప్రతిబింబములకు భేదము లేకపోవుటచేత వ్యావహారికజ్ఞానమునకును బ్రహ్మరూపజ్ఞానమునకును వాస్తవస్థితిలో భేదము లేకున్నను కల్పిత భేదము కలదు. ఇట్లు సర్వమును విమర్శించిన పరమార్థస్థితిలో మనకు అనుభవమునందుండి ఇంద్రియముల మూలమున సర్వవిషయములను ప్రకాశింపజేయు అజ్ఞానము ఏదికలదో, అదియే బ్రహ్మమనియు, అభావరూపమగుటచేత అజ్ఞానమువలన ఆ బ్రహ్మమునకు ద్వైత మేర్పడదనియు, సిద్ధాంతమగును. ఇట్లగుటచేత ఓ శ్రీరామచంద్రా! సర్వేంద్రియములయొక్క ప్రవృత్తికి సాధనమగు జ్ఞానమే ఆత్మరూపము. అది సర్వావస్థలకును సాక్షియగుటచేతను, ప్రపంచము అవస్థామాత్రమే కావునను, ఆ ఆత్మరూపము సర్వవ్యాపకమైయున్నది. మఱియును ఆ జ్ఞానము చిత్తవృత్తిమూలమున బాహ్యమునకు ప్రసరించినప్పుడె పదార్థములు కలవు. నిద్రావస్థలయందు ఆ మనస్సు లయమునొందక జ్ఞానమునకు బాహ్యప్రసారము లేకపోయిన అప్పుడు ఏదియు లేదు. ఇది సర్వానుభవ సిద్ధముగదా. ఇట్లగుటచేత సర్వమును జ్ఞానమయమే. చిత్తవృత్తి తనయందు ప్రతిబింబించియున్న జ్ఞానమునందే వాసనాబలమున ఆయాపదార్థములను (అనగా, ఆయాపదార్థముల నామరూపములను లోకమునందు నామరూపములను విడిచిచూచిన ఏదియుగానరాదు. ఏ వస్తువును తోపదు. స్తంభనామ, స్తంభరూపములను విడిచిచూచిన ఇకను అచట స్తంభమొకటి గానవచ్చునా? స్తంభముగానున్న ఆ నామరూపములకు ఆశ్రయమగు పదార్థము కాష్ఠమందురేమో, అచటగూడ నామ రూపములను విడిచి చూచిన ఏదియునుండదు. ఇట్లే విమర్శించుచూబోయిన సర్వకారణమగు బ్రహ్మమే సర్వనామ రూపాశ్రయమై యున్నదని ఏర్పడును. ఆ బ్రహ్మమును నిర్వికారుడు కావున నామాశ్రయుడగుటకు వీలు లేకపోవుటచేత నీనామరూపములు కల్పితములని సిద్ధాంతమగును. అని తెలిసికొనవలయును) ఆరోపించుచున్నది. కావున ఆత్మరూపమునకంటె భిన్నమగు పదార్థము ఒకటియు లేదు. సముద్రమునందు అలలుమొదలగునవి భిన్నరూపములుగ గానవచ్చుచున్నవిగదా. అవియు సముద్రజలమే అగునుగాని, ఆ జలమునకంటె ఇసుకమొదలగునవి కానేరవు. అట్లే ఈ ప్రాపంచిక పదార్థములన్నియు వాసనాబలముచేత బ్రహ్మమునందే భిన్నరూపములతో దోచినను ఆ బ్రహ్మసంబంధములే యగు

ముగాని, భిన్నములు కానేరవు. "సర్వప్రపంచ కారణమని చెప్పబడిన సంకల్పము బ్రహ్మాభిన్నముకదా" అనియెదవేమో, అట్లును సంశయింప నక్కఱ లేదు. అగ్నియందలి ఉష్ణశక్తి ఆయగ్నికంటె భిన్నముగాక ఆ అగ్నిసంబంధమే యగునట్లు ఈ కల్పనాశక్తియు బ్రహ్మమాత్రమేమై యున్నది. మనస్సను పదార్థము ఒకటొటి బ్రహ్మాభిన్నముగ నుండినగదా, కల్పనాశక్తియు బ్రహ్మాభిన్నము కావలయును. రెండవ సత్తె యుండుటకు ఎట్లును వీలులేకపోవుటచేత మొట్టమొదట బ్రహ్మమునకంటె భిన్నముగ మనస్సే లేదు. కావున నీ సర్వమును బ్రహ్మమే. ప్రపంచము వాస్తవస్థితిలో నసత్యమయ్యు సత్యమువలె దోచుచు బ్రహ్మమునందు భిన్నముగనే యున్నది. మనము బ్రహ్మమునే జూచుచున్నాము. వినుచున్నాము. ఆఘ్రాణించుచున్నాము. రుచి చూచుచున్నాము. స్పృశించుచున్నాము. బ్రహ్మాభిన్నములగు పదార్థముల జూచుచు వినుచు ఆఘ్రాణించుచు స్పృశించుచు రుచిచూచుచు ఉన్నామని తలంచుచున్నాము. ఇంతయేకాని మఱేమియు లేదు.

—* ఉపదేశప్రకారము. *—

"ఇట్లైన మనము చేయవలసిన కార్యము ఏదియును లేదుకదా" అనియెదవేమో, వినుము. నీతలంపు సత్యమే. విచారించినను విచారింపకున్నను బ్రహ్మము ఇట్టివాడే, ప్రపంచముకూడ ఇట్టిదియే, అయినను మందాధికారులగు శిష్యులకు మొట్టమొదట ఇంద్రియనిగ్రహము మనోనిగ్రహము అనువానిని ప్రధానముచేసి "మనోనిగ్రహమువలనగాని, ప్రపంచ భ్రాంతి తొలగదు" అని బ్రహ్మమును ప్రపంచమును భ్రాంతిని గూడ అంగీకరించి బోధింపవలయును. అట్టి బోధవలన అభివృద్ధియై చిత్తశుద్ధిని జెందినవాడు ఉత్తమాధికారమునకు వచ్చిన పిమ్మట "సర్వమును బ్రహ్మమే, నీవు ఎప్పటికిని పరిశుద్ధుడవే. భ్రాంతిగాని, ప్రపంచముగాని, బ్రహ్మాభిన్నముగ ఎప్పటికి లేదు" అను యథార్థ తత్వమును బోధింప వలయును. ఇట్లుగాక ఎవడు తెలిసియు దెలియనట్టి అజ్ఞానికి "అంతయును బ్రహ్మమే" అని ఉపదేశించునో, అట్టి గురువు వానిని (శిష్యుడగు అజ్ఞానిని) నరక కూపముల యందు బడద్రోసినవాడే. ఆయజ్ఞాని అట్టి ఉపదేశమువలన తత్వనిర్ణయము చేయలేడనుట అటుండ, స్వానుభవమును సంపాదింప నేరడనుటయు నటుండ, "అంతయు బ్రహ్మమేమైన చిత్తమును ఏల నిగ్రహింపవలయును" అను తలంపుతో వర్తించును. స్వానుభము నొందని దగుటచేత నాచిత్తము ఎప్పటివలె బాహ్యవృత్తులపై బ్రసరించుచు కామ క్రోధాది వశుని గా

వించి వానిని ఆకర్షించుచుండును. వాడుమాత్రము ఆయుపదేశ బలము వలన తనకు ఎట్టిసంకల్పము ఉదయించినను "నాకు దేనితోను సంబంధము లేదు" అని వాఙ్మాత్రమున జెప్పుచు లోలోన హర్ష శోక వేగములచేత బీడింపబడుచుండును. ఇట్టి స్థితి తనకు ఒకనికేగాక లోకమునకుగూడ బహువిధ అనర్థములను సంపాదించును.

"శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః ।
సయత్ప్రమాణంకురుతే లోక స్తదనువర్తతే ॥

(శ్రేష్ఠుడగువాడు దేనిని ఆచరించునో, దానినే విమర్శ తెలియని వారలై లోకులు గూడ అనుసరింతురు. వాడు ఏ శాస్త్రమును ఏయుక్తిని ప్రమాణముగ జేసికొనునో, లోకులును దానినే ప్రమాణముగ నంగీకరింతురు. ఇతరునియందు సత్యమున్నను గ్రహింపరు)" అను న్యాయమును అనుసరించి ఆత్మజ్ఞానియని ప్రసిద్ధి జెందినవాడు ఉపదేశ దోషమువలన ఇట్లు మిథ్యాచారుడైనచో వానివలన కొంతలోకముగూడ పాడగునుగదా. కావున ఆ ఉపదేశము శిష్యునకు ఒకనికేగాక ఆశిష్యుని ఆశ్రితులకుకూడ అనర్థమును గలిగించుటచేత ఆ గురువు మొదట శిష్యుని, వానిని ఆశ్రయించిన వారలను, నరకమునగూల్చి తానును గూలును. ఇంతేల? చెప్పుటమాత్రమే గాని, చెరచుటమాత్రమేగాని, ఆతత్వమును ("సర్వమును బ్రహ్మమే, అజ్ఞానము ఎప్పటికిని లేదు" అను విషయము) వాడెఱుగగలడా? చిత్తశుద్ధి లేకపోయిన "సత్యముగదోచు నీ ప్రపంచము అసత్యమెట్లగును. సుఖదుఃఖముల జెందుచు హర్షశోకముచేత గుందుచునున్న నేను నిర్వికార బ్రహ్మమును ఎట్లగుదును" అను సంశయముదీరునా? వైరాగ్యము లేకపోయిన చిత్తశుద్ధి సంభవించునా? కావున తెలిసియు తెలియనివానికి జేయబడు పరమార్థ తత్వోపదేశము ఎట్లుచూచినను సమంజసము కాదు. సంపూర్ణ వైరాగ్యము గలిగి అభివృద్ధిని గోరక నిర్మలమగు చిత్తముతో ప్రకాశించు నినుబోటి వారలకు తప్ప అన్యులకు పరమార్థము గోచరము కానేరదు. కావున బోధకుడు అధికారిని ఎఱింగి బోధింపవలయును.

ఓ శ్రీరామచంద్రా! సమస్త అర్థముల సారమును వినుము. దీపము ఉన్నట్టి సమయమునందు మాత్రమే దానికాంతి దానికంటె భిన్నముగ ప్రకాశించునట్లు సూర్యుడు ఉన్నప్పుడుమాత్రమే పగలు ఆసూర్యునికంటె భిన్నముగాకయున్నట్లు దోచువిధమున, పుష్పము ఉన్నకాలమున మాత్రమే

సుగంధము దానికంటె అన్యముగాకుండియు అన్యముగ గన్పట్టురీతిని ఈ ప్రపంచముగూడ బ్రహ్మము ఉన్నప్పుడు మాత్రమే ( ఇట్లు చెప్పుటవలన బ్రహ్మము లేనిసమయముకూడ ఒకటి కలదేమో యని శంకింప నక్కఱ లేదు. దీపమునకు దానికాంతితో నిత్యసంబంధమున్నట్లు బ్రహ్మమునకు ప్రపంచముతో నిత్యసంబంధము [ ఐక్యము ] కలదని చెప్పుటకై మాత్రమే ఇట్లు చెప్పబడెను. ఉపమాన ఉపమేయమునకు అన్నివిషయములయందును పోలిక సంభవింపదనుట లోక ప్రసిద్ధమే. ముఖము చంద్రునివలె నున్నద నిన, కన్ను ముక్కు మొదలగు అవయవములు లేక, చదరముగ నున్నదని అర్థము చెప్పుటకు వీలులేదుకదా. ) బ్రహ్మాభిన్నము గాకుండియు భిన్న ముగ దోచుచుండును. ఇంతయేకాని ఈ ప్రపంచమనునది యొకటి పర మార్థస్థితిలో బొత్తిగనేలేదు. అనిన విని శ్రీరామచంద్రుడు ఇట్లనియె.

ఓ మునీంద్రా ! మీవాక్కులు క్షీరసముద్రగర్భమువలె మిక్కిలి స్వచ్ఛములై శీతములై యున్నవి. ఆవాక్కుల వలన నిజముగ నాకు ప్రబో ధము ( తెలివి ) కలిగినది. అయినను అది స్థిరము కాలేదు. వర్షాకాలము నందలి పగలు మేఘముచేత ఆవరింపబడి క్షణకాలము చీకటికలుగుచు క్షణ కాలము ఎండచేత ఆవరింపబడుచు నుండువిధమున నాహృదయముకూడ క్షణకాలము ఏమియుదెలియక అజ్ఞాన దశ నొందుచు క్షణకాలము జ్ఞానము నొంది వికసించుచు నున్నది. పరబ్రహ్మము అంతము లేనిది, ఏప్రమాణము లకును గోచరముకానిది, సర్వాత్మకమైనది, భేదములేనిది, స్వయంప్రకాశ మైనది, ఉదయాస్తమయములు, లేనిది, కదా. ఇట్టి బ్రహ్మమునందు మొట్ట మొదట సంకల్పము ఎట్లు కలిగెను ? అనిన వసిష్ఠమహామునని ఇట్లనియె. ఓరామచంద్రా! నావాక్యములయందు విరోధముఏమియులేదు. నేను జెప్పి నదంతయు యథార్థమేకాని విరుద్ధార్థము కాదు, మఱియు నావాక్యము లయందు సామర్థ్యము ( చక్కనివిషయము బోధించుశక్తి ) లేకపోలేదు. కావున నాయుపదేశమునుగూర్చి ఏమియు సంశయింపవలదు. ఇకను ఏమి యనిన నీకు వివేకము కలిగినను అది అనుభవపూర్వకముగ దృఢము గాక పోవుటచేత అనాదిగా చిత్తమునందు నిలచియున్న సంసారవాసన ఇట్టి సంశయములను కలిగించుచున్నది. కావున జ్ఞానదృష్టి అభ్యాసబలమువలన శాంతమగుకొలది ఆత్మబ్రహ్మైక్యము దృఢమగుకొలది నావాక్యములయొక్క బలాబలము నీకు తేటపడకలదు.

ఓరామచంద్రా ! " అజ్ఞానులై యున్న వారలకు ఉపదేశార్థము

తేటపడక పూర్వము జ్ఞానము ఎట్లు దృఢమగును " అనియెదవేమో. వినుము. లోకమునందు శస్త్రము ఆశస్త్రముకంటె వేగముగల, లేక, శ్రేష్ఠమైన శస్త్రముచేతనే నశింప జేయబడును. కొంచెము ఉత్తమమగు బూడిదె మొదలగు మలిన ద్రవ్యములతోనే అద్దము మొదలగువాని యందున్న మాలిన్యము నశింప జేయబడుచున్నది. ఉత్తమమగు విషమే ఇతర విషములను హరించుచున్నది. ఉత్తముడై కొంచెము అధికబలముగల శత్రువుచేతనే శత్రువు సంహరింప బడుచున్నాడు. ఈదృష్టాంతముల వలన సమానజాతిగల పదార్థములలో ఉత్తమమగునది అధమమగుదానిని హరింపవలయునేగాని అన్యమగునది హరింపనేరదను విషయము లోకానుభవసిద్ధమై ఏర్పడుచున్నది. ఈన్యాయమును అనుసరించి చూచిన అవిద్యను అవిద్యయే నాశము చేయవలయుననుట సిద్ధము. కావున అజ్ఞానవంతునకుగూడ చిత్తశుద్ధి మూలమున అవిద్యను అవిద్యయే నాశము చేసికొనును. కర్మాదులను ఆచరించుటచేత ఆ అవిద్యయే నిర్మలమై విద్యయనుపేరుతో తనను తానే నాశము చేసికొనును. బ్రహ్మాభిన్నముగ ఏపదార్థమునకును స్థితి లేకపోవుటచేత కొంచెము విచారించిన అన్నియు దమంత తామే నశించును. కావున ఇట్లు ఉపదేశించిన అర్థము సంపూర్ణముగ దెలియక పూర్వముగూడ జ్ఞానము దృఢము కావచ్చును. ఉపదేశించిన అర్థము కూడ క్రమక్రమముగ దృఢమై తర్వాత అపరోక్షానుభవము కలుగవచ్చును.

ఓ రామభద్రా ! శ్రీరామా ! మాయ ఇట్లు తనచేత తననే నశింపజేసికొని పిమ్మట మోక్షమును ఇచ్చును. విచార దృష్టిచేత " మాయ ఎట్టిది. అని కొంచెము ఆలోచించి-చూతుమేని కానరాదు. కావున ఇట్టి మాయకు ఏస్వరూపము గలదని వర్ణింతును. అజ్ఞాన దశలో నున్నప్పుడు మాత్రము ఈమాయ సర్వమయమై యుండును. కొంచెము కన్నులు దెరచి చూచిన ఎచ్చటను గానరాదు. ఇదియేకదా జగత్కారణము సంకల్పము. ఇక చెప్పుము?

ఓరామా! " పరబ్రహ్మమునందు సంకల్పము ఎట్లుజనించెను " అని ప్రశ్నించితివికదా? దానికి సమాధానము ఏమి చెప్పవలయును. ఎట్లుచెప్పుటకును వీలులేదు కదా. ప్రపంచవాసన అధికమై యుండుటచేతను బ్రహ్మభావన దృఢము గాకపోవుటచేతను నీమనస్సు ఏపక్షమునందును నిలువనేరక డోలాయమానము అగుచున్నది. " పరబ్రహ్మము శుద్ధమైయుండగా దానియందు సంకల్పము పుట్టుటకు వీలులేదు. కావున ప్రపంచము బ్రహ్మ

భిన్నము గానే యుండవలయును ” అని కొంత సేపును “ ప్రపంచము అసత్యమగుట మనకు స్పష్టముగ తెలియుచున్నది. కావున ఇది మూడుకాలములయందును లేనిదియే యనుట యుక్తియుక్తమే. ” అని కొంతసేపును తలంచుచు దేనిని దృఢము చేసికొననేరకున్నది. కావున శ్రుతియొక్కయు, యుక్తియొక్కయు అనుభవానుసారముగ గురువు ఉపదేశించిన అర్థమును విమర్శించి “ సర్వంబ్రహ్మ ” అని నిశ్చయించి అందు దృఢమైన అభ్యాసవశమున మనస్సును నిలుపవలయును. ఇదియే నాశమునకు ఉపాయము. నీకు స్వయముగ జ్ఞానముగలిగి వికసించునంతవరకు నావాక్యములయందలి విశ్వాసము వలన “ అవిద్యయనునది భ్రాంతిగ లేదు. ప్రపంచము జనింపనేలేదు ” అని నిశ్చయించుకొని యుండుము. రెండవపక్షమును అవలంబింపవద్దు. కొంచెమైనను చలింపవలదు. ఇట్టి నిశ్చయముతో “ సర్వం పరబ్రహ్మయే ” అని ఎవడు భావించునో వాడు అవశ్యముగ మోక్షమును జెందును. బ్రహ్మకంటె భిన్నమగు పదార్థము ఒకటి కలదు అని తలంచుటయే అవిద్య. దానినే సర్వవిధముల విడువ వలయును. ఆత్మ బ్రహ్మలకుగల స్వాభావిక ఐక్యమును స్వానుభవ పూర్వకముగ గ్రహింపవలయును. ఇట్లు సేయకున్న అవిద్యయను మహానదియొక్క ఆవలి గట్టు దొరకదు. అదియే ( అవిద్యానదియొక్క ఆవలిదరియే ) కదా మోక్షమని చెప్పబడుచున్నది. కావున ఓ శ్రీరామచంద్రా ! “ ఈప్రపంచము ఎట్లుపుట్టెను ” అను విచారణతో పనిలేదు. “ దీనిని ఎట్లు నశింప జేయుదును, ఈ అజ్ఞానము ఎట్లుపోవును ” అనిమాత్రమే సర్వకాలములయందును విచారించుచుండుము. బ్రహ్మభావనతోడగూడిన ఈ విచారమువలన అవిద్యక్రమముగ క్షీణించి నశించెనేని అప్పుడు ఈప్రపంచముయొక్క పుట్టుకకు కారణమును నశించుటకు కారణమును, నీకు స్పష్టములు కాగలవు. కావున ఓ శ్రీరామచంద్రా ! అన్యము తలంపక సంసారరోగమునకు మూలాధారమైన ఈ అవిద్యయొక్క దోషమునకు చికిత్సగావింప దృఢమైన ప్రయత్నమును చేయుము. ఈదోషము ఇట్లే యుండినయెడల పునర్జన్మదుఃఖములు అమితముగ గలిగించుచుండును. కావున దీనినే మహాప్రయత్నముతో ఖండింపుము.

—* సృష్టిక్రమము. *—

ఓ రామచంద్రా ! చేయవలసినపని ఇదియేమైనను మనస్సునకు దృఢము కలుగుటకై సృష్టిని వివరించెదను వినుము. ఆకాశమునందు అంతటను వాయువు వ్యాపించియే యున్నది. చెలించుచుగూడ నున్నది. సర్వ

వ్యాపకమగు పదార్థమునందు చలనము ఎట్లుపుట్టెను ? వాయువును చలింప జేయునట్టి పదార్థము మఱియొకటి కలదా ? లేదు. కావున ఆ వాయువు తనశక్తిచేత తనయందు తానే చలించుచున్నది అనవలయును. ఇట్లే ఆత్మ యును చిచ్ఛక్తిచేత తనయందు తానే చంచలత్వము నొందును. ఈ విష యమును ఎఱిగి జ్ఞానరూపమగు సముద్రము (బ్రహ్మము) తనయందు తానే క్షోభించుచున్నది. అని నిశ్చయించుకొనుము. ఈ చాంచల్యమే సృష్టికి కారణము. ఈ విధముగ చిచ్ఛక్తి కొంచెము విక్షోభమును జెందినదై అజ్ఞాన సముద్రమునందు "సముద్రమునందు తరంగమువలె" స్వయముగ అభిన్నయయ్యు భిన్నముగ నేర్పడును. ఎట్లైనను దాని స్వచ్ఛత్వమునకు హానికలుగదు. ఈవిధముగ నాచిచ్ఛక్తి బ్రహ్మభిన్నయయ్యు బ్రహ్మాభిన్నమై ఏర్పడిన పిమ్మటగొంతసేపు చలించుచుండి సర్వశక్తిగలదగుటచేత దేశకాల క్రియాశక్తులను ఆకర్షించుకొనును. సృష్టికి గారణమగు ఆచిచ్ఛక్తికి ఈదేశ కాలాదిశక్తులు పరమ మిత్రులు (అనగా, అత్యంతావశ్యకములైనవి) కదా. (దేశ కాల విభాగములు లేకున్న సృష్టియే సంభవింపదుగదా యనుట.) ఇట్లు తనంత తానే దేశ కాలాది విభాగముల బొంది అంత యున్నతస్థితి యందు ఉన్నను, సర్వవ్యాపక స్వభావము గలిగి ఏకరూపముతో నున్నను, ఎప్పటికిని స్వస్వరూప జ్ఞానమునకు హానిలేకయే యున్నను, మిథ్యాభ్రాం తిచేత తనరూపమును పరిచ్ఛిన్నమునుగా దలపోయుచుండును. ఇట్లు పరమ శాంతయగు ఆచిచ్ఛక్తి తన సర్వవ్యాపక స్వరూపమును మఱచి పరిచ్ఛి న్నత్వమును భావించిన క్షణముననే పేరులసంఖ్య అనగా "నాపేరురా ముడు, నేనొకడను" అను మొదలగు సంకల్పములు వెంబడించును. "సర్వమును నేనే" అను జ్ఞానము లేక, "నేను ఇచ్చట ఉన్నాను, అచ్చ టలేను" అని పరిచ్ఛేదమును భావించిననేకదా పేరులు మొదలగు వానికి అవకాశము దొరకును. పేరులు మొదలగునవి ఒక పదార్థమునుండి మఱి యొకపదార్థమును విభాగించుటకై ఏర్పడిన వనుట సర్వజన విదితమగు విషయమే.

## —✱ క్షేత్రజ్ఞాదుల స్వరూపము. ✱—

ఓ పరాక్రమవంతుడా ! శ్రీరామచంద్రా ! ఈవిధముగ మొట్టమొ దట తన సంకల్పముచేతనే సంక్షోభమునొంది దేశ కాల క్రియలచేత ఆవ రింపబడి పరిచ్ఛిన్నమైయున్న చిచ్ఛక్తియొక్క రూపమే క్షేత్రజ్ఞుడు అన బడును (జీవుడని చెప్పబడును) ఆజీవుడే పూర్వవాసనలను అవలంబించి

అహంకార రూపుడగును. ఆ అహంకారమే క్రమక్రమముగ చాంచల్యము నొంది కళంకముగలదియై నిశ్చయ రూపముగల బుద్ధియగును. ఆ బుద్ధియే సంకల్పించెనేని మనస్సగును. ఆమనస్సు స్థూలసంకల్పములు ( నేను, నాది, అను సంకల్పములు ) గలదై ఇంద్రియములగును. ఇంద్రియములనగా హస్త పాదాదులతో గూడిన ఈస్థూలశరీరమే అని పెద్దలు చెప్పుదురు. ( వాస్తవస్థితిలో ఈహస్తపాదాదులు స్వయముగ ఇంద్రియములు కావు. సూక్ష్మములగు ఇంద్రియములకు ఆశ్రయములు. ఇట్లైనను మనస్సు క్రమక్రమముగ స్థూలశరీర భావమును జెందెననుటకై ఇట్లు చెప్పబడెను. ఆమనస్సు మొట్టమొదట సూక్ష్మేంద్రియములై పిమ్మట పాణిపాదాదులన్యోననిభావము ) ఓ రామభద్రా! ఇదియే సృష్టిప్రకారము. ఈ విధముగ ఆజీవుడు సంకల్ప పరంపరలచేత బద్ధుడై క్రమక్రమముగ స్థూలరూపుడై బహువిధ దుఃఖపరంపరలలో జిక్కి నీచు డగుచున్నాడు. ఈవిధముగ సర్వశక్తియుక్తమగు ఆచిద్వస్తువే సాలెపురుగువలె స్వేచ్ఛగానే అనగా, నిష్కారణముగానే బంధము జెందుచున్నది. మఱియు తనచేతనే కల్పింపబడి సంకల్పమాత్రరూపమై యున్న వలలో జిక్కి సంకెళ్ళచే జిక్కిన సింహమువలె పరవశమగుచున్నది. ఈ విధముగ సర్వసంసార కారణమై సర్వసంసార రూపమై సర్వసంసార భోక్తయై యున్న ఆచిద్వస్తువే ఒకచోట మనస్సనియు, ఒకచోట బుద్ధియనియు, ఒకచోట జ్ఞానమనియు. ఒకస్థలమునందు క్రియయనియు, ఒకప్రదేశమునందు అహంకారమే యనియు, నొకచోట పుర్యష్టకమనియు, జెప్పబడుచున్నది. మఱియొకచోట మూల ప్రకృతియని వర్ణింప బడుచున్నది. మఱియొకయెడ మాయయని కల్పింప బడుచున్నది. మఱియొకస్థలమున మలమని వివరింప బడుచున్నది. మఱియొక ప్రదేశమునందు కర్మయని చెప్పబడుచున్నది. వేరొక స్థలమునందు బంధమనియు, వేరొకప్రదేశమునందు చిత్తమనియు, వేరొకచోట అవిద్యయనియు, వేరొకయెడ ఇచ్ఛయనియు, జెప్పబడుచున్నది. కావున ఓ శ్రీరామచంద్రా! ఆశాపాశమును అభివృద్ధిజేయుచు నిష్ఫలముగా దుఃఖమును గలిగించునట్టి ఈసంసారమును అంతయును "మఱ్ఱిచెట్టును మఱ్ఱివిత్తనము లోపల ఇముడ్చుకొని యున్నట్లు" తనలో ఇముడ్చుకొని యున్నదియు, దుఃఖమనియెడు అగ్నిశిఖలచేత కాల్పబడు చున్నదియు, కోపమనియెడు కొండచిలువచేత కొరుక బడుచున్నదియు, కామమనియెడు సముద్రము యొక్క అలలచేత సంక్షోభింప జేయబడుచున్నదియు, తన ఉత్పత్తి స్థాన

మైన బ్రహ్మమును మఱచినదియు, నగు మనస్సును " అగాధమైన అడుసునందు మునిగిన ఏనుగునువలె " ఎంతప్రయత్నమునైనను జేసి ఉద్ధరింపుము. అగ్నిజ్వాలలవలె మిక్కిలి భయంకరములగు జరామరణ దుఃఖములచేత మూర్ఛల నొందుచు శుభాశుభ వేగములవలన మర్దింపబడుచు బాధనొందుచున్న చిత్తమునందు ఎవ్వనికి దయగలుగదో, ఎవ్వడు దానిని ఉద్ధరింపప్రయత్నింపడో, ఓ శ్రీరామచంద్రా! అతడు మనుష్యుడు కాడు. మనుష్యరూపముతో భూమియందు పుట్టిన రాక్షసుడే. అని ఇట్లుచెప్పి అమ్మహాత్ముడగు వశిష్ఠమహాముని మఱియు ఇట్లనియె. " నదీప్రవాహమునందు, లేక, సెలయేటియందు ఊటలవలె " పరబ్రహ్మమునుండి పైనవర్ణించిన విధముగ చిన్మాత్రులగు జీవులు సంకల్పమాత్రమువలన లక్షలు, కోట్లు, సంఖ్యలు గలిగి లెక్కపెట్టుటకుకూడ శక్యముకాకుండ జనించిరి. భూతకాలమున జనించిరి. వర్తమానకాలమునందును అట్లే జనించుచున్నారు. భవిష్యత్కాలమందును అట్లే జనింపబోవుదురు. అందు కొందరు అప్పుడే జన్మించినవారు. కొందరు నూరుజన్మములు ఎత్తినవారు. మఱికొందరు లెక్కకు మిక్కిలియగు జన్మములను ఎత్తినవారు. కొందరు రెండుమూడు జన్మములలోనుండువారు. కొందరు కిన్నెరులుగాను, గంధర్వులుగాను, విద్యాధరులుగాను, నాగకుమారులుగాను, ఉన్నారు. కొందరు సూర్య చంద్ర వరుణాదులుగాను, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు గాను, ఉన్నారు. కొందరు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులుగాను, ఉన్నారు. కొందరు మహౌషధులుగాను, ఆకులు పువ్వులు వేళ్ళు అనునవిగాను, పక్షులుగాను, ఉన్నారు. మఱికొందరు కడిమి, నిమ్మ, ఏపె, తాటి, కానుగు, మొదలగు వృక్షములుగను ఉన్నారు. మఱికొందరు మహేంద్రము, మలయము, సహ్యము, మందరము, మేరువు,అనుమొదలగు పర్వతములుగను ఉన్నారు. వేఱొకకొందరు లవణ, ఇక్షురస, మద్య, ఘృత, దధి, క్షీర,జలమయములగు సప్తసముద్రములుగను, ఉన్నారు. మఱియుగొందరు అతివిశాలములగు దిక్కులుగాను, అతివేగముగల నదులుగాను, ఉన్నారు. మఱియు వీరిలోగొందరు అత్యున్నత స్థానములయందు సంచరింతురు. మఱికొందరు అధోగతిపాలు అగుదురు. కొందరు అచ్చోటనుండి మఱల ఊర్ధ్వముఖముగ నెగయుదురు. ఇట్లు మృత్యువుచే "బంతులవలె" మాటిమాటికి గొట్టబడుచు అనేకవేల జన్మములను అనుభవించియును అజ్ఞానమును ఏడువనేరక మఱలమఱల సంసారదుఃఖమును అనుభవించుచుందురు. కావున ఈమూడులోకముల, కల్పన, "సముద్రమునందలి

తరంగమువలె " బ్రహ్మమునకంటె భిన్నముకాకుండియు భిన్నముగ దోచుచు మాయామయమై భ్రాంతిని విస్తరింపజేయుచు నిరర్థకముగనే జనించుచున్నది. అభివృద్ధి యగుచున్నది. నశించుచున్నది. దీనికి బ్రహ్మ భిన్నమగు స్వరూపము ఒకటియును లేదు. ఇది సర్వకాలములయందును ఇట్లే విస్తరింప బడియున్నది. బాగుగ విమర్శించిన దీనికి ఉత్పత్త్యాదులే సంభవింపవు. కావున ఇది ఎట్లున్నను బ్రహ్మస్వభావమునకు హానిలేదు.

—* పాంచభౌతిక దేహోత్పత్తి ప్రళయ వివరణము. *—

అని వశిష్ఠమహామునిచెప్పినవిని శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓవశిష్ఠమహామునీ! ఈజీవుడు క్రమక్రమముగా సంకల్పబద్ధుడై మనోరూపమును జెందునని చెప్పితిరిగదా, వాడు మరల బ్రహ్మరూపమును ఎట్లు జెందగలడు. కైవల్యమును ఎట్లు పొందగలడు. దానిని వివరింపుము. అనిన వశిష్ఠుడు ఇట్లని సమాధానము జెప్పుటకు ఆరంభించెను. ఓ పరాక్రమవంతుడా! శ్రీరామా! మొట్టమొదట పరబ్రహ్మమునకు స్థూలదేహము వచ్చినవిధము వినుము. దాని దృష్టాంతమువలననే ప్రపంచస్థితిని తెలిసికొనగలవు. ప్రపంచమంతయును సంకల్పమాత్రమే. కావున జీవులకుగల మనోరూపముగూడ సంకల్పమాత్రమే. ఆసంకల్పమును విడుచుటయే అనగా " నేను మనస్సునుకాను. బ్రహ్మమును " అను సంకల్పమును అవలంబించుటయే బ్రహ్మరూప ప్రాప్తి సాధనమని తెలిసికొనగలవు. అది ఎట్లనిన:— దేశ కాలాదులచేత విభాగము జెందని ఆపరబ్రహ్మము పైన వివరించిన విధముగా తనంతతానే విక్షోభమును జెంది ఎప్పుడు దేశకాలాదులచేత పరిచ్ఛిన్నత్వమును జెందునో అప్పుడే బహువిధములగు సంకల్ప వికల్పములతోగూడి మనస్సగును. ఆమనస్సునకే జీవుడనియు పేరు. ఇట్టి ఆమనస్సు సంకల్ప పరంపరలను ఆరంభించి ఒకక్షణమున శబ్దతన్మాత్రమును సంకల్పించును. పిమ్మట స్థూలసంకల్పముచేత స్థూలాకాశ రూపమును భావించును. పిమ్మట అంతకంటె స్థూలమగు సంకల్పమును ఆచరించుటవలన ఆమనస్సునకు అధికమగు చాంచల్యము కలుగును. దానివలన అది " నేను కదలుచున్నాను, మఱియొక పదార్థమును స్పృశించుచున్నాను " అని సంకల్పించును. ఈసంకల్ప బలముచేత మొట్టమొదట స్పర్శతన్మాత్రరూపమును దాల్చి పిమ్మట స్థూలవాయు రూపమును జెందును. ఈవిధముగ జనించి శబ్ద స్పర్శాత్మకములు నగు వాయ్వాకాశములు అనగా వాయ్వాకాశ సంకల్పములు స్థిరమగు అభ్యాసమువలన బలసికొనగా వానికంటే స్థూలమై రూపతన్మాత్రమును, ప్రత్యక్షు

డగు అగ్నియు జనించును. ఇట్లు అగ్నిరూపమును జెందిన మనస్సు రసతన్మాత్రమును సంకల్పించును. ఆసంకల్ప ప్రభావముచేత తత్క్షణమే మధుర రసము గలదియై శీతస్పర్శ గలదియగును. అప్పుడు "ఇది జలము" అని వ్యవహార మేర్పడును. ఇట్లు జలరూపము నొందిన మనస్సు గంధ తన్మాత్రను సంకల్పించును. దానివలన భూమియగును. ఇట్లు ఆమనస్సే పంచభూతరూపమై పిమ్మట అహంకారరూపమును దాని అంశములగు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ రూపమును జెంది బుద్ధియై పుర్యష్టకములను పేర పురుషులయొక్క హృదయములయందు నిలచి యున్నది. ఈవిధముగ సూక్ష్మ రూపముతో హృదయమునందుండి అతివేగముతో "నేను మనుష్యుడను" అని స్థూలశరీరమును సంకల్పించును. ఆసంకల్పబలముచేత స్థూలశరీరమే అగును. ఎట్లనిన:— చిదాకాశమునందు తేజోమాత్ర రూపమై ప్రకాశించుచున్న ఆమనస్సు సంకల్పబలముచేత "మూసయందు కరగిపోసిన బంగారము మూసవంటి ఆకారమునే ధరించినట్లు" స్థూల శరీరాకారమునే ధరించును. పై భాగమునందు తల అధోభాగమునందు పాదములు పార్శ్వములయందు హస్తములు మధ్యభాగమునందు కడుపును, గల ఆకారమును ధరించును. ఇట్టి శరీర రూప సంకల్పము కాలక్రమమున దృఢమై బుద్ధి, సాహసము, బలము, ఉత్సాహము, జ్ఞానము, సంపద, మొదలగు వానితోగూడిన దివ్యశరీరమగును. అట్లు బ్రహ్మమునకు ఏర్పడిన మొట్టమొదటి శరీరమే సర్వలోక సృష్టికర్తయైన చతుర్ముఖుడగు బ్రహ్మదేవుడు. ఇట్లు ఏర్పడిన తన శరీరమునుజూచి ఆబ్రహ్మదేవుడు ఇట్లని విచారించెను. నా ఎదుట ఏమియును లేదు. జ్ఞానరూపమగు చిదాకాశము మాత్రమే ఉన్నది. దీనియందు అవయవములతోగూడిన నాశరీరము ఎట్లు జనించెను. దీనికి కారణము ఏది. మఱియొక వస్తువు ఈశరీరమునకు గారణమని చెప్పుటకు వీలులేకున్నది. ఈచిదాకాశమునకు ఎట్లు జూచినను ఆద్యంతములు గానవచ్చుట లేదుగదా. అని ఇట్లువిచారించి వెనుకటి వృత్తాంతము నంతయును స్మరించి గడచిన సంకల్పములయందలి భూతములను వారి ఆచారములను సంకల్ప బలమున జ్ఞప్తికి దెచ్చికొని వానిని అనుసరించియే ఇంద్రజాల నగరమువలె, గంధర్వనగరము భాతి, సంకల్పశక్తితో సర్వ ప్రపంచమును గల్పించెను. అందలి ప్రజలకు ఉచితములగు ఆచారములను విధించెను. వారికి స్వర్గమోక్షములు గలుగుటకును ధర్మకామార్థములు చేకూరుటకును బహువిధములై అనంతములై, లెక్కకు మిక్కిలియై, యున్న శాస్త్రములను గల్పిం

చెను. ఇదియు సంకల్పమాత్రమే.     ...     ...     *

ఓ శ్రీరామచంద్రా! ఈవిధముగ బ్రహ్మ స్వరూపమును దాల్చిన మనస్సునుండి సంకల్పశక్తిచేత ఇప్పుడు గానవచ్చుసర్వప్రపంచమును పుట్టి స్థిరమై యున్నది. కావున దేవాసుర మనుష్యాదు లందరును తమ సంకల్పములచేత తామే జనించిరి. సృష్టికర్తయని చెప్పబడిన చతుర్ముఖుడగు బ్రహ్మకుగూడ సంకల్పాతిరిక్తమగు రూపము ఏదియు లేదుగదా. మఱియును ఈకారణమువలన సంకల్పము నశించేనేని "చమురు లేని దీపములవలె" ఈదేవతలు మొదలగువారి స్వరూపములన్నియును నశించును. ఓ మహాబుద్ధిమంతుడా! శ్రీరామా! బాగుగా విచారించి చూడుము. ఈప్రపంచము కేవల సంకల్పరూప మైనదియే. కావున ఆకాశమువలె శూన్యమైనది. పెద్దకలవంటిది. బుద్ధిమంతుడా! రామా! వాస్తవస్థితిలో ఏదియు పుట్టలేదు. ఏదియు నశింపలేదు. సర్వమును అసత్యమే. ఉన్నట్లు తోచుటయే కాని, వాస్తవ స్థితిలో ఏదియు లేదు. కావున ఓరఘురామా! ఆశలు అనెడు సర్పములకు ఆధార స్థానమైయున్న ఈసంసారమును సంపూర్ణముగ వదులుము. ఇది సంకల్పమాత్రమే. కావున శూన్యమని తెలిసికొనుము. దీనియందు మనస్సునుంచకుము. ఇంద్రజాల నగరమును, లేక, గంధర్వ నగరమును ( గంధర్వ నగర మనగా దయ్యములకు, లేక, కొరవిదయ్యములకు నివాసమై పట్టణమువలె గానవచ్చు ప్రదేశము ) దూషించినను భూషించినను హర్ష శోకములు లేక, సుఖదుఃఖములు ఎవనికైనను గలుగునా? కలుగనేరదుగదా. దీనికి కారణమేమి? ఆగంధర్వ నగరము తనకంటె వేఱగుటయును అసత్యమగుటయును అనునవియేగదా. ఇట్లే భార్యాపుత్రాదులు గూడ తనకంటె అన్యులు. సంకల్పమాత్ర రూపులే అగుటచేత అసత్యులు. ఇట్లగుటచేత విచారించి చూచిన వీరికి ఎట్టి సుఖదుఃఖములు కలిగినను పురుషునకు హర్ష శోకములు గలుగుట అయుక్తమే కదా. బాగుగ విచారించిన ధనమునకు గాని, భార్యాపుత్రాదులకుగాని, అభివృద్ధి కలిగినప్పుడు పురుషునకు దుఃఖమే కలుగవలయునుగాని; సుఖము కలుగుటకు వీలులేదు. ఏలయనిన:— ఈధనము మొదలగునవి భ్రాంతిని వృద్ధి జెందించునవి గాని, వివేకమును వృద్ధి జెందించునవి కావు. ఇట్టి అనర్థ హేతువులకు అభివృద్ధియైననవి, ఎవనికి సంతోషకరముగా ఉండును. ఇట్లగుటచేతే భోగాభివృద్ధివలన సంతోషించువాడు విచార శూన్యుడగుటచేత మూర్ఖుడే కాని, పండితుడుగాడు. కావున ఏవి అభివృద్ధియైన మూర్ఖునకు సంతోషము అధికమగునో అవియే

విజ్ఞానవంతునకు దుఃఖదాయకము లగును. వానిని జూచియే పండితులకు వైరాగ్యము గలుగును. కావున ఓ శ్రీరామచంద్రా! నీవును విజ్ఞానివై తత్వమును ఎఱిగి సమస్త వ్యవహారములను యథాప్రకారముగనే ఆచరించుచు గతించిన విషయములనుగూర్చి చింతింపక ఉపేక్ష చేయుము. వచ్చిన దానిని సుఖమైనను దుఃఖమైనను రాగద్వేషములు లేక, స్వీకరింపుము. భోగములు రానప్పుడు వానిని త్రికరణశుద్ధిగ గోరకుండ, వచ్చిన వానిని ద్వేషింపక (వీనివలన మనచిత్తమునకు చాంచల్యము కలుగును. కావున వీనిని మనము ఆదరింపరాదు. అను ద్వేషములేక) అసక్తుడై అనుభవించుట అనునదియే జ్ఞానులయొక్క లక్షణము. ఏమహాత్మునకు "ఇదినాకుకావలయును, ఇదినాది" అను అభిమానములు సర్వపదార్థములయందు తొలగునో అట్టి సర్వజ్ఞుని శూన్యరూపముగు అవిద్య ఏమియు జేయదు. ఎట్లును బంధింపనేరదు. కావున ఓరఘురామా! నిర్మలమైనట్టియు భావాభావముల మధ్యమున నున్నట్టియు (ఉన్నదనిగాని, లేదనిగాని, చెప్పుటకు వీలులేనట్టి ఆబ్రహ్మపదమును బుద్ధిచేత అవలంబించి లోపల వెలుపలనున్న ఈసర్వ ప్రపంచమును అంగీకరింపను వలదు. విడువను వలదు. ఏ మహాత్ముడు సర్వ కర్మలను ఆచరించుచునే యున్నను వానియందు ఇచ్ఛగాని, ఇచ్ఛ లేకుండుటగాని, లేదో, అట్టివానియొక్క చిత్తము "నీటిలోనున్నను, నీటిననంటని తామరాకువలె" కర్మల నాచరించుచునే యున్నను, వానితో సంబంధపడదు. ఓ దశరథనందనా! రామా! ఇంతయేల? అనాదినుండియు ప్రియములుగ దోచుచున్న శబ్దాదివిషయములు ఏనాడు నీయొక్క హృదయమునకు రుచింపవో, ఆనాడే విజ్ఞానము గలిగెనని తెలిసికొనుము. సంసార సముద్రమును తరించితిమని నిశ్చయింపుము. కావున ఓ రామభద్రా! అత్యాధికమగు బుద్ధితో "పుష్పమునకంటె దానిని ఆశ్రయించిన సుగంధమును భిన్నమునుగా గ్రహించునట్లు సంకల్పములకంటె చిత్తమును భిన్నమునుగ గ్రహింపుము. వాస్తవస్థితిలో చిత్తము బ్రహ్మరూపమే. కావున నది సంకల్పించుటకుకూడ వీలులేదు కదా. కావున ఇట్లు విభాగించితివేని చిత్తస్వరూపము ప్రకాశించుటచేత అదియే బ్రహ్మస్వరూపము. కావున మోక్షము హస్తగతమగును. సంకల్పమను జలముతో నిండిన ఈసంసార సముద్రమునందుబడి పొరలు వారిలో ఎవనికి జ్ఞానమను ఓడ దొరుకునో, వాడు సుఖించును. తక్కినవారలు దుఃఖితులగుదురు. పరమార్థమును ఎఱిగిన మహాత్ములు కాలానుసారముగ సంభవించిన లోకవ్యవహారమును విడు

వరు. రాకుండిన కోరరు. ఏది ఎట్లువచ్చిన దాని నట్లే అనుసరింతురు. మఱియును ఆఘనులు సూర్యునివలె నిర్జనప్రదేశమునందు నిలచి ఖేదము నొందరు. నందనోద్యానమునంగును ప్రీతియుక్తులై నిలువరు. నియమములను మనకు దేనితోను పనిలేదు గదా అను తలంపుతో విడువరు. అని ఇట్లు వశిష్ఠ మహాముని శ్రీరామునితో జెప్పెనని వాల్మీకిమహర్షి భరద్వాజునితో చెప్పి మఱియు ఇట్లనియె.

ఓభరద్వాజా! ఈవిధముగ వశిష్ఠమహాముని సర్వమును ఉపదేశింపగానే నిర్మల జ్ఞాన సంపన్నుడగు నమ్మహాత్ముని పరిశుద్ధ వచనములచేత తుడిచివేయబడినట్లు ఆ శ్రీరామచంద్రునియొక్క హృదయము నిర్మలమాయెను. అతిమధురమగు జ్ఞానామృతముచేత పరిపూర్ణమై పూర్ణచంద్రుని వలె మిక్కిలి చల్లనాయెను. ఇట్టిమనస్సుతో ఆరఘురాముడు అమ్మహాముని ని జూచి ఇట్లనియె. ఓమహాత్మా! వశిష్ఠమహామునీ! ఈప్రపంచసృష్టి ఒక్క విధముగానే ఉన్నదా? లేక, అనేకవిధములుగా ఉన్నదా? ఈవిషయమును స్పష్టముచేసినయెడల మాయాస్వరూపము ఇప్పటికంటెను విస్పష్టముగ దెలియును. అనిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓ శ్రీరామచంద్రా! వినుము. సృష్టులు అనేకవిధములు. అవి కొన్నిసమయములందు రుద్రునిచేతను, మఱికొన్ని సమయములయందు బ్రహ్మచేతను, మఱికొన్ని సమయములందు విష్ణువుచేతను, మఱికొన్ని సమయములయందు మునులచేతను, నిర్మింపబడుచున్నవి. చతుర్ముఖుడగు బ్రహ్మదేవుడు ఒకానొక సృష్టియందు కమలమునందు పుట్టును. మఱియొకసృష్టియందు నీటిలోజనించును. వేఱొకసృష్టియందు గ్రుడ్డునందు ఉద్భవించును. ఇంకొకసమయమునందు ఆకాశమునుండియే సంభవించును. ఇట్లే మనకు గానవచ్చుచున్న ఈభూమియు ఒకసృష్టియందు దట్టములగు వృక్షములతోమాత్రమే నిండియుండును. మఱియొకసృష్టియందు మనుష్యులచేత ఆవరింపబడి యుండును. వేఱొకసృష్టియందు కొండలచేత నిండియుండును. ఇంకొక సృష్టియందు ఈభూమి మృత్తికారూపముతోను మఱియొకప్పుడు శిలారూపముతోను వేఱొకప్పుడు సువర్ణ రూపముతోను, ఒక సృష్టియందు మాంసరూపముతోను ఉండెను. మఱియు నొకసృష్టియందు ఆకాశభూతము మొట్టమొదట జనించెను. మఱియొకప్పుడు భూమియు మఱియొకప్పుడు జలమును వేఱొకప్పుడు అగ్నియు ఇంకొకప్పుడు వాయువును మొట్టమొదట ఉద్భవించును. నీకు ఇంతకుముందు చెప్పిన బ్రహ్మోత్పత్తిప్రకారము నిదర్శనార్థమై చెప్పబడి

నదే కాని, "బ్రహ్మయొకఁడె ప్రతిసృష్టియందును అట్లే జనింపవలయును" అని నియమము లేదు. మఱియును కృత త్రేతా ద్వాపర కలియుగములు కూడ మఱల మఱల వచ్చుచు బోవుచు నుండును. ఈప్రపంచమునందు రెండవమారు తిరుగని పదార్థమే లేదు. మాయామయమగు ఈప్రపంచమును వర్ణించుటకై దాశూరోపాఖ్యానమను ఒక చరిత్రమును చెప్పెదను. దానిని వినిన సర్వమును తేటపడును.

## —✻ దాశూరోపాఖ్యానము. ✻—

ఓదశరథరాజనందనా! రామా! ఈభూలోకమునందు నానావిధములగు ఆశ్చర్యములతో నిండి రమ్యమైయున్న మగధమను పేరుగల ఒకదేశముకలదు. అది నానావిధములగు పుష్పవృక్షములతోను కడిమిచెట్లతోను నిండిన విశాల వనప్రదేశములతోను మధురగానముల సేయుచు సంతతము ఆనందమును అభివృద్ధి చేయునట్టి పక్షి సమూహములతోను నిండి మిక్కిలి ఆహ్లాదకరమై యుండెను. ఆదేశమునందు ఒకానొక పర్వతము కలదు. అది కొండగోగులతోను, అరటిచెట్లతోను, కడిమిచెట్ల పొదలచేతను, వ్యాపింపబడి యుండెను. ఆపర్వతమునందు దాశూరుడను ఒకధర్మాత్ముడగు మహామునీశ్వరుడు తపస్సుచేయుచుండెను. ఆతపస్సు అతిఘోరముగనుండెను. మఱియును అమ్మహామునికి తండ్రియగు శరలోముడను పేరుగల మహామునియును ఆపర్వతమునందే నివసించి యుండెను. ఆయన బ్రహ్మయంతటివాడు. "బృహస్పతికి కచునివలె" ఆశరలోమునకు నీదాశూరుడు ఒకఁడే సంతతియై యుండెను. కావున అమ్ముని సర్వదా ఆపుత్రుని జూచుకొనుచు ఆయరణ్యమునందే కాలము గడుపుచుండెను. ఇట్లు కొన్నియుగములు జీవించి "గూటినుండి ఎగసిపోయిన పక్షివలె" ఆశరలోమ మహాముని దేహమును విడిచి స్వర్గలోకమునకు బోయెను. అంతనా దాశూరుడు పితృవియోగమువలన మిక్కిలి దుఃఖమును జెంది ఆ అరణ్యమునందు ఏకాకియై "కురరమను పక్షివలె" అతిదీనముగ రోదనము చేసెను. ఇట్లు తండ్రి మృతిజెందినతోడనే తల్లియును సహగమనమును చేసెను. ఇట్లు ఇరువురును ఒకఁమారే మృతిజెందుటవలన శోకము అధికమై ఆదాశూరముని "హేమంత ఋతువునందలి కమలమువలె" క్రమక్రమముగ క్షీణింపసాగెను.

ఓశ్రీరామచంద్రా! బాలుడగుటచేత ఇట్లుమిక్కిలి దైన్యమును చెంది శోకించుచుండగా ఊరార్చుటకు రెండవవారు ఎవ్వరును లేకపోవుటయు

చూచి ఒకవనదేవత అదృశ్యాకారముతో ఆతనికి వినునట్లు ఇట్లని యూరడించె. ఓ ఋషిపుత్రుడా! బుద్ధిమంతుడా! నీవేల ఇట్లు మూఢునివలె రోదనము చేయుచున్నావు. సంసారము అతిచంచలమని నీల ఎఱుగలేక ఉన్నావు. ఓ సత్పురుషుడా! సంసారస్థితి ఎప్పటికిని ఇట్టిదియే. అది ఆకస్మికముగా జనించును. కొంతకాలము నిలుచును. పిమ్మట అవశ్యముగ నశించును. కావున ఓ మహాత్మా! నీవు మృతిజెందిన తండ్రి విషయమునందు నిరర్థకముగ శోకింపకుము. మరణమనునది ఎట్టివారికిగూడ తప్పునదికాదు. సూర్యునకు ఉదయముతో కూడ అస్తమయమును నియతమైనట్లు ప్రతివానికిని పుట్టుకతోగూడ చావు నియతము. ఈవిధముగ శరీరము అగుపడకుండగనే విన వచ్చిన అశరీరవాక్యములను విని ఆదాశూరుడు అంతకుముందు కన్నులు ఎఱ్ఱనగునట్లు ఏడ్చుచున్నవాడైనను యథార్థమును తెలిసికొని ధైర్యమును అవలంబించెను. అంతట అక్కడినుండి లేచి పరమాదరముతో తండ్రికి ఆచరింపవలసిన ఉత్తరక్రియలను ముగించి తపస్సుచేయ వలయునని సంకల్పించెను. పిమ్మట సదాచారసంపన్నుడై ఆదాశూరుడు తపము చేయుటకు ఆరంభించుచుండగ అప్పుడు " ఇంతకంటె పరిశుద్ధమగు స్థానము కావలయును. పరిశుద్ధములగు సాధనములు కావలయును. అట్లైనగాని తపస్సు సిద్ధించదు " అను మొదలగు సంకల్పములచేత ఛాందసత్వము కలిగెను. తత్త్వజ్ఞానము లేకపోవుటచేతను శాస్త్రజ్ఞానము అధికమగుటచేతను ఛాందసత్వము అంతకంతకు మిక్కుటమగుచుండుటచేతను ఆతని చిత్తము ఎంత పరిశుద్ధమగు స్థలము దొరికినను తృప్తి నొందలేదు. శాంతిని జెందలేదు.

ఓ శ్రీరామా! బాగుగ విచారించిన ఈభూమియంతయు పరిశుద్ధమైనదియే. దీనిలో గొంత పరిశుద్ధమైనదనియు, కొంత కాదనియు-చూచువానికి ఎక్కడికి పోయినను, ఏదియో యొకదోషము కానవచ్చుచునే యుండును. అప్పుడు వానికి తృప్తి కలుగనే కలుగదుగదా. ఇట్లు ఆదాశూరుడు సంశయము వెనుక, సంశయముబొంది, సంకల్పము వెనుక, సంకల్పము ఆచరించి ఎప్పటికిని విశ్రాంతిజెందక తుదకు ఇట్లు నిశ్చయించెను. చెట్టుయొక్క కొన మిక్కిలి పరిశుద్ధమైనది. నాబోటివానికి అట్టి స్థలమునందు నిలుచుటయే ఉచితము. కావున నేను ఒక చక్కని వృక్షమునుజూచి తపస్సునకై దానికొనయందు కొమ్మలలోను ఆకులలోను పక్షివలె నిలిచియుందును. అని ఇట్లు నిశ్చయించి అగ్నిని సంస్థాపించి ప్రజ్వలింపజేసి తనకంఠమునుండి మాంసమును ఛేదించి హోమమును జేసెను. అప్పుడు అగ్నిహోత్రుడు

ఇట్లని విచారించె. నేను సర్వదేవతలకును ముఖము. నాయందు హోమమైన పదార్థమును దేవతలు భుజింతురు. ప్రస్తుతమునందు హోమద్రవ్యము బ్రాహ్మణమాంసము. ఇది భుజింప నర్హముకాదు. దీనిని భుజించుటవలన దేవతలయొక్క కంఠములు కాలిపోవును. ఇట్టి అనర్థము గలుగకుండునట్లు చేసెదను. ఇట్లు నిశ్చయించి ఆయగ్నిదేవుడు తత్క్షణమే " బృహస్పతికి సూర్యుడు ప్రత్యక్షమైనట్లు " ప్రకాశమానమగు దివ్యరూపముతో ఆదాశూరునకు ప్రత్యక్షమాయెను.

ఓ సత్పురుషుడా ! బ్రాహ్మణపుత్రుడా ! కోశమందు దాచియుంచిన రత్నమువలె నీ హృదయమునందు ఏకోరిక మరుగుపరుపబడి యున్నదో దానిని బైలుపరుపుము. అని చెప్పెను. ఇట్లు పలికిన ఆఅగ్నిహోత్రుని జూచి ఆదాశూరుడు భక్తియుక్తుడై పుష్పగంధాక్షతాదులచేత పూజించి అనేకవిధముల స్తోత్రము జేసి ఇట్లనియెను. ఓ మహాత్మా ! అగ్నిదేవుడా ! ఈ భూమియందు అంతటను సన్నని జీవజంతువులు నిండియున్నవి. కావున ఇందెచ్చటను పవిత్రప్రదేశము నాకు గానరాలేదు. కావున సర్వకాలముల యందును వృక్షాగ్రములయందు ఉండునట్టి సామర్థ్యమును నాకు ఇవ్వుము. అని చెప్పెను. ఇట్లు ఆమునిచెప్పగానే సర్వదేవతలకును ముఖమగు నయ్యగ్నిహోత్రుడు " అట్టి సామర్థ్యము నీకు కలుగును గాక " అని పలికి అంతర్ధానుడాయెను. ఇట్లు సంధ్యాకాల మేఘమువలె ఆయగ్నిదేవుడు అంతర్ధానము నొందగానే ఆబ్రాహ్మణుడు అరణ్యమంతయును గలయదిరిగెను. తాను తపస్సు చేయుటకు తగిన వృక్షమును వెదకెను. అంతనయ్యరణ్య మధ్యమునందు ఒకచో భూమ్యాకాశముల నడుమ వేయబడిన స్తంభమోయన మేఘములను ఒరయుచున్న అగ్రములతో ప్రకాశించు నొక కడిమిచెట్టును చూచెను. దానిపై నెక్కి ఆకాశమును అంటుచున్న కొనకొమ్మపై నిస్సంశయముగ గూర్చుండి ఏకాగ్రమైన మనస్సుతో తపస్సును జేయ సాగెను. ఆకొనకొమ్మపైన అతిమృదువగు చిగురాకును పీఠముగ జేసికొని కూర్చుండెను. అట్లుకూర్చుండి మొట్టమొదట కుతూహలముచేత నాలుగు దిక్కులను వీక్షించెను. అప్పుడు ఆదిక్కులు నదులనెడి ఏకావళీహారములతో ( ముత్యములు ఒక్కసరముగా కూర్చినహారమునకు ఏకావళీహారమని పేరు. ) అలంకరింపబడినదిగను, పర్వతములను స్తనములతో ప్రకాశించుచుండునదిగను, నిర్మలాకాశమను కొప్పును గలిగి వాయువుచే నిటునటు కదులుచున్న మేఘములను ముంగురులతో శోభిల్లుచుండు నగ్హ

గను, మనోహరము లైనదిగను, ప్రకాశించుచుండెను. ఇట్లు తీగలచేత ఆవరింపబడిన ఆచిగురాకునందు కూర్చుండి కొంతసేపు దిక్కులుచూచి సంతోషించి పిదప మనస్సును మఱలించెను. అయినను ఆతనికి పరమార్థతత్త్వము తెలియకపోవుటచేత అతనిమనస్సు కర్మయందె చిక్కియుండెను. కర్మఫలములనే కోరుచు ఆకర్మఫలములు లేకుండెనేని దిగులు జెందుచు నుండెను. ఇట్లగుటచేత నాబాహ్మణుడు నిర్వికల్పసమాధియందు నిలువక మనస్సుతో బహువిధములగు యజ్ఞములను జేయ నారంభించెను. అట్లు కడిమిచెట్టుపై గూర్చుండి పదిసంవత్సరములవరకు ఏకాగ్రచిత్తముతో గోమేధము, అశ్వమేధము, నరమేధము, మొదలగు అనేకవిధములగు మహాయజ్ఞములను అపరిమిత దక్షిణల ఇచ్చుచు ఒనరించి దేవతలను ఆరాధించెను. ఇట్లు కాలము గడచుకొలది కర్మాచరణ ప్రభావమువలన అతనిమనస్సు క్రమక్రమముగ పరిశుద్ధమును కాజొచ్చెను. వికసింప జొచ్చెను. ఇట్లు వికసించుటచేత మనస్సు ప్రసన్నమగు కొలది బలాత్కారముగ తత్త్వజ్ఞానము అవతరించెను. " ఓహో ఓహో ఈకర్మలుగాని, దీనిఫలములుగాని, నిత్యములుగావు. ప్రపంచమంతయుగూడ ఇట్టిదిగానే యున్నది. సత్యమగు పదార్థమేదియో " అను సంకల్పము ఉదయించెను. ఆసంకల్పము దృఢమగుకొలది స్వస్వరూపమగు బ్రహ్మము స్వయముగనే ప్రకాశించెను. దానివలన సకలావరణములును ( ఆవరణమనగా, బ్రహ్మమును తెలిసికొననకుండ మరుగుపరచియున్న అవిద్యమొదలగునవి. ) క్షీణింపగా, సకల సంకల్పములును నశింపగ అతి నిర్మలుడయ్యెను. ఇట్లుండగా, ఒకనాడు గాలిచే కదలుచున్న పుష్పమయమగు వస్త్రమును ధరించినదియును, తామర రేకులవంటి విశాలములైన నేత్రములుగలదియును, మనోహరమగు ఆకారముగలదియునునై ప్రకాశించుచు తలవంచుకొని, తానుకూర్చున్న కొమ్మయందే తనకెదుర నిలువబడియున్న వనదేవతను జూచి ఇట్లనియె.

ఓ విశాలమైన నేత్రములు గలదానా ! సౌందర్యముచే మన్మథుని బెదరించుదానా ! నీవెవ్వతెవు? అని ఇట్లుపలుకగానే గౌరవర్ణముగలదియు, పీవర స్తనములుగలదియు, లేడి కన్నులవలె మనోహరములగు నేత్రములు గలదియు, నగు నావనదేవత మధురాక్షర యుక్తముగ నిట్లని పలికెను. ఓ మహాత్మా ! లోకమునందు ఏ ఏ పదార్థములు సాధించుటకు శక్యము కావో, ఏ వేవిదొరకవో, అట్టివానిని సాధించుటకు సత్పురుషులను యాచింపయే ముఖ్యసాధనము. ఓ బ్రాహ్మణోత్తమా ! మీరు కూర్చుండియుం

డిన కడిమిచెట్లుచేత అలంకరింపబడియున్న ఈ వనమునందు నేను వనదేవ
తను. ఈచైత్రశుద్ధ త్రయోదశినాడు స్వర్గలోకమున నందనవనమునందు వన
దేవతలయొక్క సభ యొకటి జరిగెను. అచటికి మన్మథపూజకొఱకై అంద
ఱును వచ్చిరి. అచ్చటికి నేనును పోతిని. చెలులను అందఱిని జూచితిని.
వారలతో వారిపుత్రులును, పుత్రికలును, వచ్చియుండిరి. నాకు సంతానము
లేదు. కావున వారిమధ్యమునయుండుటకు నాకెంతయో లజ్జగానుండెను.
ఓ మహాప్రభువా ! అప్పటినుండియు నాయొక్క దుఃఖమునకు మితి లేదు.
ఓ మహాత్మా ! యాచకులకు సర్వాభీష్టములను ఒసంగుచు కల్పవృక్షము
వలె మీరు ఉండగా దిక్కులేనిదానివలె నేనేల శోకింపవలయును. నాదుఃఖ
మును తీర్పుడు. పుత్రుని ఒకని దయచేయుడు. అట్లుకాదేని పుత్రులులేని
దుఃఖమువలన గలిగిన తాపము నశించుటకై ఈదేహమును అగ్నియందు
బడవైతును. అని ఇట్లు ఆవనదేవత ప్రార్థింపగానే ఆదాశూరుడు చిరున
వ్వునవ్వి తనచేతనున్న ఒక పుష్పమును ఆమెకు ఇచ్చి ఇట్లనియె. ఓ సుకు
మార శరీరము గలదానా ! తుమ్మెదలవలె నల్లనగు నేత్రములుగలదానా!
ఇక నీ నివాసమునకు పొమ్ము. ఈపుష్పమును శిరమునందు ధరించుకొనుము.
ఒక్క మాసమునకు మనోహరుడును లోకపూజ్యుడును నగు ఒక కొమా
రుడు "పుష్పలతకు సుగంధవంతమగు పుష్పమునువలె" నీకు పుట్టగలవాడు.
ఐనను ఒక్కవిశేషము చెప్పవలసియున్నది. నీవు మరణోద్దేశమూలక ఉపా
యముచేత పుత్రుని యాచించితివి. ఈ కారణమువలన నీ పుత్రునకు బ్రహ్మ
జ్ఞానము దొరకుట మిక్కిలి దుర్ఘటమగును. ఇట్లు పలికి ఆదాశూరమహాముని
వనదేవతను పంపివేసెను. "అంతవనదేవత పుణ్యాత్మా ! నేను మీకు పరి
చర్య సేయుచు ఇచ్చటనే యుందును. నన్ను దాసిగా ననుగ్రహింపుడు"
అని ప్రార్థించుచున్నను "నీవు అట్లు చేయనక్కఱలేదు. స్వగృహమునకు
పొమ్ము" అనిచెప్పి యామెను పంపివేసెను. అంతనా వనదేవత తన నివా
సమునకు బోయెను. దాశూరమహామునియు నిర్వికల్ప సమాధియందు నిలి
చియుండెను. కాలమును మాస, ఋతు, సంవత్సర, రూపములతో క్రమ
క్రమముగ గడచిపోవుచుండెను. అంత కొంతకాలమునకు పిమ్మట ఆవనదేవ
తయే పండ్రెండు సంవత్సరముల పుత్రుని వెంటదీసికొని యమ్మహాముని
వద్దకు వచ్చెను. ఇట్లువచ్చి యావనదేవత నమస్కరించి పుత్రసహితయై
ఎదురుగ గూర్చుండి, "పుష్పరసమునకు జొక్కిన తుమ్మెద తియ్యమామిడి
యొద్ద మనోహరముగ శబ్దము సేయునట్లు మృదువాక్యములచేత అమ్మ

త్మునితో నిట్లనియె.

ఓ మహాత్మా ! ఈతడే మన కుమారుడు. నేను ఈతనిని సర్వవిద్యల యందును ప్రవీణుని గావించితిని. ఈతనికి ఎన్నివిధముల దెల్పినను పరమార్థతత్త్వము తెలియలేదు. కావున పరవశుడై సంసారయంత్రమునందు జిక్కి బహువిధములచేత పీడింప బడుచున్నాడు. ఈతని జ్ఞానోపదేశముచేత ఉద్ధరించు భారము మీదియే. ఓ ప్రభువా ! ఈతనియందు కరుణ జూపవలయును. అని ప్రార్థించెను. అంత నమ్ముని ఇట్లనియె. ఓ స్త్రీరత్నమా ! నీ అభిప్రాయమును నెరవేర్చెదను. ఈబాలుని శిష్యునిగా పరిగ్రహించెదను. ఈతని ఇచ్చటనే విడిచి నీవు నీ నివాసమునకు బొమ్ము. అని పలికిన ఆమెయును అతని ఆజ్ఞానుసారముగ పుత్రుని అచ్చటనే విడిచి తన గృహము చేరెను. పిమ్మట ఆబాలుడును "సూర్యుని ఎదుటనుండు అనూరునివలె" ( ఈతడు సూర్యసారథి. గరుత్మంతుని అన్న. ఈతడు సూర్యునికంటె ముందుగ ఉదయించును. ఈయుదయమునే అరుణోదయమనుచున్నాము. ) మిక్కిలి నియతుడై తండ్రియొద్దనే ( ఆముని ఇచ్చిన పుష్పమే ఈతనికి జనన కారణ మగుటచేత ఆమునియే ఈబాలునితండ్రి ) శిష్యుడైయుండెను. సూక్ష్మబుద్ధి కలవాడు కావున తండ్రియొక్క ఆచారములను గ్రహించుచుండెను. సూక్ష్మబుద్ధియున్నను మాతృదోషమువలన ( మరణమునే ఉపాయముగాగోని పుత్రుని కోరినదోషమువలన ) ఆ బాలునకు బ్రహ్మజ్ఞానము గలుగుట మిక్కిలి కష్టసాధ్యమై యుండెను. ఇట్లున్నను ఆదాశూరముని మిక్కిలి శ్రమపడి అనేక విధములగు విచిత్ర వాక్యములచేత బహుకాలమునకు వానిని వివేకము గల వానిగా జేసెను. అనేకులైన మహాపురుషుల వృత్తాంతములను దెలుపుచు సామర్థ్యమువలనను అనుభవానుసారముగను కల్పించి అనేక దృష్టాంతములను జూపుచు పూర్వకథలను అనేకములను వివరింపుచు వేదవేదాంత తాత్పర్యములను ప్రబలయుక్తులచే నిర్ణయింపుచు, సంక్షోభము ఏమియు లేనివాడగుటచేత అతి శాంతచిత్తముతో సర్వవిషయములను సవిస్తరముగా తెలియపరచి యాముని బాలునకు జ్ఞానమును కలిగించెను. అని వశిష్ఠమహాముని శ్రీరామచంద్రునితో జెప్పి మఱియు నిట్లనియె. ఓ బుద్ధిమంతుడా ! శ్రీరామా ! పూర్వమునందు నేనొకనాడు సప్తర్షి మండలమునుండి వెలుపలికివచ్చి కైలాసమునందున్న నదిలో స్నానము జేయుటకై అదృశ్యాకారముతో ఆకాశమార్గమునందు ప్రయాణముచేయుచుంటిని. రాత్రికాలమునందు అత్యున్నతమగు దాశూ

రుడు ఉన్న వృక్షమువద్దకు జేరితిని. అప్పటికి ఆదాశూరుడు కమలములో నుండి మధురముగా రొదసేయు తుమ్మెదవలె కొమ్మలమధ్యనుండి తనపుత్రునకు ఒక కథనుజెప్పుచుండెను. దానిని నేను అచ్చటనే నిలచియుండి సంపూర్ణముగ విని వచ్చితిని. దానిని నీకు తెలిపెదను వినుము.

—* దాశూరుఁడు పుత్రునికి జెప్పిన స్వోత్థుని ఉపాఖ్యానము. *—

ఓరామచంద్రా! దాశూరుడు పుత్రునితో ఇట్లనియె. ఓ బుద్ధిమంతుడా! పుత్రుడా! వినుము. పరబ్రహ్మ వృత్తాంతమునకు సమానమైన ఒక కథ గలదు. దానిని నీకు వివరించి చెప్పెదను. అది మిక్కిలి ఆశ్చర్యకరమైనది. మహాపరాక్రమవంతుడును మూడులోకములయందును ప్రసిద్ధిగాంచినవాడునగు స్వోత్థుడను పేరుగల ఒకరాజుగలడు. అతనికి సర్వప్రపంచమును ఆక్రమింపవలయునని అభిలాష యుండెను. సామాన్యరాజులే అననేల? ఇంద్రాది లోకపాలకులను సహితము ఆరాజశ్రేష్ఠుని ఆజ్ఞను చూడామణినివలె శిరస్సున దాల్చుచుందురు. ఆమహాత్ముడు సాహసమునందు మిక్కిలి ఉత్సాహవంతుడు. పరమాశ్చర్యకరముగ విచిత్ర గతులచేత సంచరించువాడు. ముల్లోకములయందు ఒక్కడైనను ఆయనకు ఎదురుకాకుండెను. ఆయన ఎవ్వనికిని లోబడినవాడు కాడు. ఆమహాత్ముని సంకల్పములకును విచిత్రములగు కార్యములకును మితిలేదు. లోకులకు సుఖదుఃఖములను గలిగించుచు సముద్రముయొక్క అలలవలె సర్వకాలములందును ఒకదానివెనుక ఒకకార్యము చేయుచునే యుండును. ఎన్నిబాణములైనను తుదకు అగ్నులైనను ఆమహావీరుని పరాక్రమ విజృంభణమునకు ఆటంకములు గలుగజేయనేరవు. ఆకాశమును పిడికిటి పోటులచేత నొప్పింప నేరనట్లు ఎంత బలాఢ్యులైనను ఆరాజును బాధింపనేరరు. లోబరుచుకొననేరరు. బ్రహ్మవిష్ణురుద్రేంద్రాది దేవతులైనను నూతన కల్పనలతోగూడిన ఆమహాత్ముడగు రాజుయొక్క కార్యములను ఇంచుకమైనను అనుసరింపనేరరు. అట్టియాప్రభువునకు సర్వదిక్కులను భరించు సామర్థ్యముగల శరీరములు మూడు గలవు. ఆశరీరములు క్రమముగా ఉత్తమ మధ్యమాధమ భేదములు గలిగి సర్వలోకములలోను వ్యాపించి యుండును. ( ఇదియే సత్వరజస్తమో గుణములు ) ఇట్లు మూడు శరీరములతో నొప్పుచున్న ఆప్రభువు ఆకాశమునందే ( చిదాకాశమునందే ) పుట్టుచున్నాడు. అందే నిలచుచున్నాడు. అందేనాశము నొందుచున్నాడు. పక్షివలె త్రికాలములయందును ఆకాశమునందే నిలచియున్నాడు. ఇట్టి ఆరాజు ఆయాకాశమునందే తన సామ

ర్థ్యముచలన ఒకపట్టణమును గల్పించెను. ( ఇచ్చట పట్టణమనగా బ్రహ్మాండము ) ఆపురమునందు పదునాలుగు అతి విశాలములగు వీధులు ( పదునాలుగులోకములు ) కలవు. మఱియును అది మూడు పెద్ద విభాగములుగా ( ఊర్ధ్వ అధో మధ్య విభాగములుగ ఊర్ధ్వలోకమునకు స్వర్గాదులు ఊర్ధ్వవిభాగము, పాతాళాదులు అధోవిభాగము, భూలోకము మధ్యవిభాగము ) విభాగింపబడి రమ్యమైయున్నది. అనేకములగు అరణ్యములును తోటలును ( ఇవి సామాన్య విశేష భేదముగల మనుష్యాది జీవకోట్లు ) దానికి సొంపు గూర్చుచుండును. దానియందు క్రీడాపర్వతములు ( ఇవి మేరు మందరాది మహాపర్వతములే యని తెలిసికొనవలయును ) అనేకములు గలవు. ముత్యాలసరములచేత ఆపురము ఎల్లెడల అలంకరింపబడియుండును. ( ఇచ్చట మహానదులను ముత్యాల సరములుగా జెప్పియున్నాడు. ) అందు జలపూర్ణములై దిగుడుబావులు ఏడుగలవు. ( ఇవియే సప్తసముద్రములు ) చల్లనిదియు వేడిదియు నగు రెండుదీపములు అచ్చట సర్వవ్యవహార సాధనములై వెలుగుచున్నది. ( వీరే సూర్య చంద్రులు ) ఇట్లు అతి విశాలమగు ఆపురమును నిర్మించి అందు సంచరించుచు అతి సుందరములగు గృహములను కొన్నిటిని నిర్మించి దానికి అలంకారము గలిగించెను. ( ఇవియే దేహములు ) అందు కొన్ని ఆకాశమునందే నిలుపబడినవి. ( ఇవి ఊర్ధ్వలోకమునందలి దేవశరీరములు ) కొన్ని క్రిందను మరికొన్ని నడుమను నిలుపబడినవి. ( ఇవి క్రమముగా పాతాళాదులయందలి సర్పాది శరీరములును భూలోకమునందలి మనుష్యాదిశరీరములును అని తెలిసికొనునది ) ఆగృహములకు నల్లని ముసుకులును, లేక, కప్పులును ( ఇది తలవెంట్రుక లనవచ్చును. వర్ణ సామాన్యమును జెప్పుటకై శరీరముపై ఉండు చర్మమును నల్లని దానినిగా- వర్ణించి యున్నాడని యైనను చెప్పవచ్చును ) తొమ్మిది ద్వారములును ( ఇవియే నవరంధ్రములు ) గలవు. మఱియు లెక్కకు మిక్కిలి యగు గవాక్షములనుండి ( రోమకూపములు ) ( లేక, నాసికారంధ్రాదులు ) గాలి (బాహ్యవాయువు, లేక, ప్రాణము ) సర్వకాలములయందును యథేచ్ఛముగా సంచరించు చుండును. మిక్కిలి ప్రకాశించునట్టి ఐదుదీపములు ( జ్ఞానేంద్రియములు ) ఆ గృహములకు మహాప్రకాశమును ఇచ్చుచుండును. మూడుగొప్ప స్తంభములును (వాతపిత్తకఫములు. ఇవియే దేహమును ఆరోగ్యస్థితియందు నిలుపును. కావున ఇట్లు చెప్పబడెను ) ఆ స్తంభములయొక్క ఆధారమున నిలుపబడి యున్న తెల్లని

కలపయును ( ఎముకలు ) ఆగృహములకు ఆధారమై యున్నవి. మఱియు చక్కని పూతచేతను ( రక్తప్రసారముచేత మృదువైన చర్మముచేత ) ఆగృహములు మృదువులై యున్నవి. అందును చిన్న చిన్న వీధులు అనేకములు ( చేతులు కాళ్ళు మొదలగు శాఖలు ) కలవు. ఇట్లు అతి విశాలములగు ఆగృహములను ఆప్రభువు మాయచేత కల్పించెను. మఱియును అమ్మహాత్ముడు పరులకు అసాధ్యములగు మహాభూతములను ( అహంకారము మనస్సు మొదలగు వానిని ) కావలియుంచెను. ఆభూతములును పరులకు ఎంత అసాధ్యములైనను తమ ప్రభువునకు మిక్కిలి విధేయములై యుండును. ఇట్లు అతి విచిత్రములగు ఆగృహములను నిర్మించి వానికి సంచరించు సామర్థ్యము ఇచ్చుచు గూళ్ళను అనేకములను నిర్మించుకొని అందు స్వేచ్ఛగా విహరించు పక్షివలె ఆరాజోత్తముడు వానిని ఆశ్రయించి బహువిధములుగ క్రీడించుచుండును. ( ఇతడే జీవుడు ) ఓపుత్రా ! ఈవిధముగ ఆప్రభువు తన మూడు శరీరములతోనుగూడి ఆశరీరములను ప్రవేశించి అందు తాను కావలియుంచియున్న భూతములతోగూడ బహువిధ క్రీడలను ఆచరించుచు కొంతకాలము అచటనేయుండి ఇష్టము వచ్చినప్పుడు అచ్చటినుండి వెడలి పోవును. ఎట్లనిన, ఆతనిబుద్ధి చపలమైనది. కావున ఒకొక్కప్పుడు ఉన్నట్లేయుండి " మనయొక్క మాయచేత ఇకమీదట ఒక క్రొత్త ఇల్లు కల్పింప బడుచున్నదిగదా. అది ఎట్లుండునో, దానిలోనికి పోయి చూతును గాక " అను సంకల్పము జనించును. అడ్డము ఎవ్వరును లేకపోవుటచేత " భూతముపట్టినవానివలె " తలచిన తలంపుగానే అచ్చోటనుండిలేచి పరుగిడి " గంధర్వ నగరముతో సాటియగు ఆమాయాగృహము జేరును. ఇది యునుగాక ఓబాలకా ! చిత్తచాంచల్యము గలవాడగుటచేతనే ఆప్రభువునకు ఒకొక్కప్పుడు "నేను చావవలయును " అను కోరిక పుట్టును. అప్పుడు సంకల్పసిద్ధి గలవాడగుటచేత తనయొక్క మూడు శరీరములతోగల సంబంధమును విడిచిపెట్టును. ( ఇదియే ముక్తి ) ఇట్లు నశించినను మహాశక్తిమంతుడగుటచేత ఆకస్మికముగా సంకల్ప బలమువలన " సముద్రమునుండి తనంతనే పుట్టుచు అణగుచు మరల పుట్టుచున్న అలలవలె " తననుండి తానే పుట్టును. మరల పూర్వమువలెనే బహువిధ ప్రయత్నమంతుడై వ్యవహారమును చేయును. ఒకొక్క సమయమున తన వ్యవహారములచేత తానే బాధింపబడి పరవశుడగుచు సంతోషమునకైనను దుఃఖమునకైనను వశగతుడై పరితపించును. ఒకొక్కప్పుడు ( " నేనేమిచేయగలను, అజ్ఞాని

నైతిని, నాకు దుఃఖము కలుగుచున్నది. దీనిని తప్పించుకొను ఉపాయ మేది? ” అని దుఃఖించును. మఱియొకప్పుడు ఇష్టసిద్ధులు చేకూరుటచేత మిక్కిలి సంతోషముచేత ఉప్పొంగును.

ఓ పుత్రుడా ! మహాప్రభావముగల ఆ ప్రభువు ఆగృహమును ఆశ్ర యించి జలముమొదలగువాటిని పానము చేయును. నడుచును. దుముకును. ఆవలించును. చలించును. ప్రకాశమానమగు స్వరూపమును దాల్చినవాడగుటచేత స్పష్టముగ ప్రకాశించును. ( అహంశబ్దార్థ మగుటచేత సర్వజనులకును స్పష్టముగ దెలియవచ్చుచున్నాడనుట ) వాయువేగమునకు వశమైన మహాసముద్రమువలె తన సంకల్పమునకు వశుడై బహువిధ కార్యములను ఆచరించును. ఏది ఎట్లైనను సముద్రము స్వస్వరూపమునకంటె వేరుకానట్లు ఈపురుషుడును ఎన్ని కార్యములను ఆచరించినను ఎన్నివిధముల ( నేను అజ్ఞానిని అనుమొదలగు ఎన్నివిధముల ) భావించుకొనినను స్వస్వరూపమునకంటె భిన్నుడు కానేరడు. ( ఇచ్చట ముక్తియు, మరల జన్మమును వర్ణింపబడియున్నది. దీనివలన ముక్తునకు పునరావృత్తి కలదేమో, అని శంకింపవలదు. జీవులందరు ఒకటియే. కావున ఒకనియొక్క ముక్తియు మఱియొకనియొక్క జన్మమును వర్ణించు ఉద్దేశముతో ఇట్లు చెప్పబడియున్నది. అని తెలిసికొనవలయును. జీవులందరు ఒకటియే యైనను ఒకనిముక్తితో అందరకును ముక్తి కలుగవలయునుగదా, అను సంశయముపనిలేదు. ప్రపంచబ్రహ్మలకువలెనే జీవులకుగూడ పరస్పరము కల్పిత భేదముకలదు. వాస్తవస్థితినిబట్టి విచారింతమన్న, అప్పుడు బద్ధుడే లేడు కదా. ) ఓ శ్రీరామచంద్రా! ఇట్లు తండ్రి పలుకగానే జంబూద్వీపముననున్న కడిమిచెట్టుయొక్క ఆకుపై గూర్చుండియున్న అతనినిజూచి నిర్మలహృదయుడగు అతని కుమారుడు ఈవిధముగ ప్రశ్న చేసెను.

ఓతండ్రీ ! సోత్థుండని చెప్పబడిన ఆరాజు ఎవ్వడు? నాకు నీవు జెప్పిన విషయమునకు అర్థమేమి? దానిని వివరించి చెప్పుము. అనిన దాసూరమహాముని ఇట్లనియె. ఓపుత్రుడా! నీప్రశ్నమునకు ఉత్తరమును వివరించి చెప్పెదను వినుము. దానిని వింటివేని ఈసంసార చక్రముయొక్క యథార్థస్థితిని నీవు గ్రహింపగలవు. ఆ ఈసంసారము శూన్యము నుండియే జనించి ( శూన్యమై ) బహువిధములగు కార్యములను చేయుచున్నది. విచారించితివేని ఇందు సత్యమగు వస్తువు ఏదియును లేదు. ఇట్లుండియును ఇది ఆద్యంతములు లేనిదై కనుబడుచున్నది. ఇట్టి ఈసంసారస్థితిని నేను ఈవిధముగా

వర్ణించితిని. చిదాకాశమునుండి పుట్టిన సంకల్పమే స్వోత్థుడని చెప్పబడెను. స్వోత్థుడనగా తనంతతానే పుట్టినవాడు. కావున ఈసంకల్పముకూడ అట్టిదియే యగుటచేత స్వోత్థశబ్దముచేత జెప్పబడెను. ఈసంకల్పము పుట్టుటకుగాని, నశించుటకుగాని, కారణాంతరము ఏదియు లేదుకదా. అతివిస్తారమై సర్వమును వ్యాపించియున్న ఈప్రపంచము తన్మాత్రమే. అనగా, సంకల్పమాత్రమే. దీనికి సంకల్పమునకంటె అతిరిక్తమగు రూపము ఏదియును లేదు. ఆసంకల్పము పుట్టినచో ప్రపంచము పుట్టును. సంకల్పము నశించినచో ప్రపంచము నశించును. సంకల్పముగల జాగ్రత్స్వప్నావస్థలయందు మాత్రమే ప్రపంచము గానవచ్చుటయు సంకల్పములేని సుషుప్త్యవస్థయందు ప్రపంచముగానరాక పోవుటయు సర్వానుభవ సిద్ధములగు విషయమును లేకదా. బ్రహ్మవిష్ణు రుద్రేంద్రాదులందరును ఆసంకల్పము యొక్క అవయవములేగాని వేరుకాదు. ఇట్లగుటచేత ఈ ప్రపంచమునకు ఆధారము ఏదియును లేదు. కావున ఈవిషయమునే "ఒక మహాపట్టణము ఆకాశమునందు నిర్మింపబడినది" అనిచెప్పితిని. ఆసంకల్పమే ప్రతిభాస మాత్రమువలన ("నేను బ్రహ్మను" అని తలంచినంత మాత్రమున) బ్రహ్మయై సర్వమును సృజించెనుకదా. మఱియును పదునాలుగు లోకములును, వీథులని చెప్పితిని. ఆయాలోకాధిపతులను అవతార తారతమ్యములుగల జాతివిశేషములుగను నందనము మొదలగు మహోద్యానములను వనోపవన పరంపరలనుగా వర్ణించితిని. సహ్యము మందరము మేరువు మొదలగు పర్వతములను క్రీడాపర్వతములని పలికితిని. ఎంతగాలికొట్టినను నశింపక సర్వలోకములను వెలిగించు సూర్యచంద్రులనే ఉష్ణ శీత దీపములంటిని. సూర్య ప్రతిబింబములతోగూడి అతిచంచలములైయున్న అలలే ముత్యములుగా మహావేగముతో ప్రవహించుచున్న మహానదులనే ముత్యాల సరములని వచించితిని. చెఱకురసము, పాలు, మొదలగునవియే జలములుగాగల సప్తమహాసముద్రములను దిగుడుబావులంటిని. ఆసముద్రములయందలి రత్నములను తామర తూడులుగాను బడబాగ్ని జ్వాలలను కమలములుగాను జెప్పుటకు ఉద్దేశించితిని. ఇట్లు ఉద్దేశించియే సముద్రమునకును బావులకును పోలిక జెప్పితిని. ఈవిధముగా వర్ణింపబడిన లోకత్రయమను పట్టణమునందు ఆసంకల్పమను ప్రభువుచేత విహారార్థమై మాయాశక్తివలన నిర్మింపబడినవని చెప్పబడిన గృహములు శరీరములే. అందు "కొన్నిగృహములు ఊర్ధ్వభాగమునందు నిలుపబడినవి" అని దేవశరీర

ములను ఉద్దేశించి చెప్పితిని. మధ్య భాగముల యందును అధోభాగమునందును నిలుపబడి యున్నవని మనుష్య శరీరములను గూర్చియు అధోలోకము లందున్న సర్ప రాక్షసాది శరీరములను గూర్చియు బలికితిని. ఆ గృహములు చలించుచున్న వనుటచేత ప్రాణసంచారము వలన గలుగు చాంచల్యమే ఉద్దేశించి చెప్పితినని తెలిసికొనుము. మఱియును ఆశరీర గృహములయందు మాంసమే మృత్తికగాను ఉద్దేశింపబడెననియును ఎముకలు తెల్లనిదారువులనియు చర్మమే పూతయనియు జెప్పబడినది. వెంట్రుకలు నల్లని యొకవిధమగు గడ్డియని తలంపబడెను. దానిచేత ఆ గృహములకు నల్లని కప్పుకలదు. అని వర్ణించితిని. నాసికారంధ్రములు, కర్ణరంధ్రములు, మొదలుగాగల తొమ్మిది రంధ్రములును తొమ్మిది ద్వారములని చెప్పితిని. మఱియు కర్ణరంధ్రములు నోరు రోమకూపములు మొదలగు వానినే గవాక్షములనికూడ వచించితిని.

ఓ బుద్ధిమంతుడా ! పుత్రుడా ! భుజములు మొదలగు శాఖలనే వీధులనియు జ్ఞానేంద్రియములను ద్వీపములనియు వచించితిని. దానిని రక్షించుచునని చెప్పబడిన మాయయే సంకల్పము. మఱియు పరమాత్ముని జూచిన భయపడుచు నశించుచునుండు అహంకారమే శరీరగృహమును రక్షించుచున్నదని చెప్పబడిన మహాభూతము. ఆశరీరగృహమునందే ఆ యహంకారాదులతోకూడి ఈ సంకల్పపురుషుడు స్వేచ్ఛగా బహువిధముల క్రీడించును. ( ఆయహంకారాదులుకూడ వాస్తవస్థితిలో అసత్యములే. ) ఇట్లు క్రీడించుచు క్షణకాలము వృద్ధిజెందును. క్షణకాలము క్షీణించును. వాయువుచేత గొట్టబడుచు కదలుచున్న దీపము ఒకప్పుడు స్వయముగానే ప్రజ్వరిల్లుచు మఱియొక్కపుడు అణగుచు ఉన్న దీపమువలె ఆ సంకల్పపురుషుడే హర్ష శోక వేగములకు సంతసించుచు గుందుచునుండును. సముద్రమునందు తరంగములు తనంతటతానే పుట్టి తనంతటతానే అణగునట్లు ఆసంకల్పమహారాజు ఈశరీరగృహములయందు క్షణకాలము విజృంభించి కానవచ్చినచో క్షణకాలము స్వయముగనే అణగిపోవుచు నున్నాడు. ఇక " క్రొత్తగా సృష్టింపబడుచున్న గృహమునుజేరును " " అనుటకు సంకల్పించినతోడనే తాను సంకల్పించిన వస్తువులను ప్రత్యక్షముగ జూచును. " అనుటయే అభిప్రాయమని తెలిసికొనుము. సంకల్పము లేకపోవుటయే అనగా వస్తువులను భావింపకుండుటయే నాశమని ఎఱుగుము. ఇట్లు ఈసంకల్పమహారాజు దుఃఖరూపమగు నీప్రపంచమును స్వయముగనే కల్పించుచున్నాడు. అప్ప

టికిని ఇది అతనికి అపరిమితమగు దుఃఖమునే కలిగించునుగాని కొంచమైనను సంతోషమును కలిగింపజాలదు. “స్వస్వరూపము పరమానందమయము, సత్యమునై, యున్నదికదా. అట్టిదానిని సంకల్పమాత్రకల్పితమై అసత్యమై యున్న ఈ సంసారము ఎట్లు బాధింపగలదు. దుఃఖము ఎట్లు సంభవింపగలదు.” అనియెదవేమో, వినుము. లోకమునందు అభావరూపమయ్యు చీకటి భావమగు నేత్రతేజస్సును ఎట్లాటంకపరుచుచు నశింపజేయునో అట్లే ఈ సంసారముకూడ స్వస్వరూపభూతమగు పరమానందమును గప్పుచున్నది. నశింపజేయుచున్నది. ఇదియు స్వకార్యమేమైనను బాధించుచున్నది. ఈసంకల్పపురుషుడు ఇట్లగుటచేతనే సంసారసముద్రమునందుబడి తెప్పరిల్లనేరక ఏడ్చుచున్నాడు. “ఇట్లైన సర్వమును దుఃఖమేకదా. మనకు ఒకొ్కక సమయమునందు సుఖముకూడ కానవచ్చుచున్నది. ఇది ఎచ్చటనుండివచ్చెను” అనియెదవేమో, వినుము. మనము అనుభవించు సుఖము స్వస్వరూపానందము కాదు. అన్యసుఖమైనను శాశ్వతముగాదు. సంతోషముకూడ దుఃఖమువలె సంకల్పమాత్రమే. ఉత్తరకాలమునందు కలుగబోవు దుఃఖమునుగూర్చి ఇంచుకమైనను విచారింపక పరులకు దుఃఖకరములుగా గానవచ్చుచున్నను దానిని విమర్శింపక తనకు ప్రియమని తోచిన ఏపదార్థమునైనను జూచి ఉప్పొంగుటయే మన అనుభవములోనున్న ఆనందమునకు స్వరూపము. ఒకనికి ప్రియకరముగా దోచిన పదార్థమే మఱియొకనికి దుఃఖకరముగ దోచుటయు, అనుభవించిన తరువాత తనకు కూడా అప్రియమగుటయేగాక దుఃఖమునుగూడ గలిగించునదిగా నుండుటయు, సర్వలోకప్రసిద్ధమే. శబ్దాది విషయములవలన గలిగి ఆపాతమాత్ర సుఖకరములైయున్న ఈ విషయానందములు అంతమునకు మహాదుఃఖకరములనుటను తెలియనివారు ఎవ్వరును లేదు. కావున విచారించినచో మన అనుభవములోనున్న ఆనందము సంకల్పమాత్రమువలననే అనగా “ఇదిమిక్కిలిమంచిది. ఆనందకరమైనది.” అని సంకల్పించుటవలన మాత్రమే కలిగినది కాని స్వాభావికమైనది కాదని స్పష్టమగుచున్నది. ఈ కారణమువలన ఆసంకల్పమహారాజునకు అప్పుడప్పుడు ఇట్టి యానందములు కలుగుచుండును. దానికి ఆసంకల్పమహారాజును పెడసువాల్చక విర్రవీగును. ఇదియే “ఆస్వోత్థమహారాజు కొంతసేపు మిక్కిలి సంతోషమును జెందియుండెను” అనుటకు అర్థము. మఱియు సత్వ రజస్తమోగుణములే ఆసంకల్పమహారాజునకుగల మూడుదేహములు. ఇందుసత్వము ఉత్తమము. రజోగుణము మధ్య

మము. తమోగుణము అధమము. కావున ఆశరీరములకును ఉత్తమ మధ్యమ అధమ భేదములు కలవని చెప్పబడెను. ప్రపంచమంతయు త్రిగుణమయమే కావున "ఈదేహములే సర్వప్రపంచమును వ్యాపించి భరించుచున్నవి." అని వర్ణింపబడెను. సంకల్పమునకు గల ఉత్తమ మధ్యమాధమ భేదములను వానికారణములును వివరించెదను వినుము. తమోమయమగు సంకల్పము ముందువెనుకల నెఱుగలేక జ్ఞానశూన్యమై తాత్కాలిక సుఖమును అపేక్షించి పిమ్మట కలుగబోవు దుఃఖమునైనను దలంపక పాపమనక హింసయనక సంచరించునుగదా. ఇట్టి సంచారముచేత పాపము అభివృద్ధియగుటవలన మిక్కిలి హీనమై పురుగులు మొదలగు రూపములను చెందును. ఈకారణమువలన తమోమయ సంకల్పము అధమము. సత్వగుణముతోగూడిన సంకల్పము ధర్మమునొందును. జ్ఞానమునొందును. నిలుకడజెంది శాస్త్రానుసారముగ సంచరింపుచు నుండునుగదా. ఈకారణమువలన అట్టి సంకల్పస్థితికిని ఆత్మ బ్రహ్మైక రూపమగు మోక్షమునకును దూరములేదు. ఇట్టిదగుటచేక సామ్రాజ్యమునందు ఉన్నట్లు ఆసంకల్పము ( జీవుడు స్వయమును సంకల్పమే. కావున ఇచ్చట జీవుని చెప్పుటకు మాఱుగ సంకల్పమునే చెప్పియున్నాడు ) పరమానందముతో ఉత్తమ స్థితితో నుండును. కావున ఇది ఉత్తమము. ఇక రజోగుణ మయమగు సంకల్పము అంత హీనముగా సంచరింపక అధిక స్థితితోను నిలువక మధ్యమమై సంసార వ్యవహారములను జేయుచు పుత్ర భార్య గృహాదులయందలి అభిమానముతో వర్తించుచుండుట ప్రత్యక్షమయ్యే యున్నది. కావున ఇది సంకల్పమునకు మధ్యమ స్వరూపము.

ఓ మహాబుద్ధిమంతుడా ! పైవర్ణించిన మూడువిధములగు రూపములును ఎప్పుడు విడుచునో, అప్పుడు ఆసంకల్పమునకు స్వరూప నాశనము గలుగును. అప్పుడు ఆసంకల్పమునకు పరబ్రహ్మముతో ఐక్యము సంభవించును. ఇదియే ముక్తి. కావున ఓ కుమారుడా ! నీవు ఈ ఇతిహాసమువలన సర్వమును ఎఱిగి వివేకవంతుడవై సమస్తవిధములగు భావనలను విడచి స్వయముగనే ఆత్మను ( మనస్సును ) బంధించి సంకల్పమును నాశముగావింపుము. అప్పుడేకాని, ముక్తి దొరకదు.

శ్లో॥ యది వర్ష సహస్రాణి తపశ్చరసి దారుణమ్ ।
పాతాళస్థస్య భూస్థస్య స్వర్గస్థస్యాపి తేఽనఘ ॥
నాఽన్యః కశ్చిదుపాయోఽస్తి సంకల్పోపశమాదృతే ॥

ఓ పుత్రుడా ! పాతాళమునందుండిగాని, భూమి యందు నిలచిగానీ, స్వర్గలోకమును ఆశ్రయించిగాని, ఎన్ని వేల సంవత్సరములు తపస్సు చేసినను, మోక్షము సాధించుటకు సంకల్పనిర్మూలమే ఉపాయము. రెండవ యుపాయము ఏదియు లేదు. సంకల్ప నాశమే నిర్బాధమగుస్థానము. సంకల్ప నాశమే నిర్వికారమగు అనగా, ఎప్పటికిని మారని స్థలము. సంకల్ప నాశమే పరమానందము. సంకల్ప నాశమే పరమ పవిత్రము. కావున ఇట్టి సంకల్ప నాశమునకై దృఢమగు పౌరుషమును బూని చక్కని యత్నమును ఆచరింపుము. విశేషముగ బాధించుచు పురుషుని చిక్కుపరచునట్టి పదార్థములు అన్నియు ముత్యములవలె సంకల్పమను దారమునందు కూర్చబడి యున్నవి. ఓ దోషరహితుడా ! ఇట్లగుటచేత ఆసంకల్పమను త్రాటిని దృఢమైన ప్రయత్నముతో త్రెంచిన ఆపదార్థములు ఎందుబోవునో నీవే యూహింపుము. ఈకారణమువలన ఓ పుత్రుడా ! దృఢప్రయత్నముతో సంకల్ప పరిత్యాగమును ఆచరింపుము. " సంకల్పములు విడిచిపెట్టి స్తంభమువలె గూర్చుండవలసినదియే కదా " అనియెదవేమో, అట్లుగాదు. గడచిన దానిని విచారింపక రాబోవుదానిని సంకల్పింపక వర్తమానమునందు అభిమానమునుంచక ఎప్పటికి ఏది తటస్థమగునో, అప్పటికి దానిని ఉచిత ప్రకారముగ ఆచరింపవచ్చును. ఇట్లగుటవలన బ్రహ్మజ్ఞానికి హాని కలుగదు. సంకల్పము నశించుటవలన జ్ఞానము ( బ్రహ్మముల ) విషయాభిముఖము ( విషయములను అభిమానించునది ) కాదనుటయే కాని, ఈ ఇంద్రియములు విషయములను అనుసరింపవనుటకాదు. అభిమానము లేకున్నంత మాత్రముననే, కార్యములు జరుగకూడదను నియమమును లేదు. మార్గమునందు నడచువానికి ఉద్దేశము ఏమియు లేకున్నను వానిదృష్టి తనకు నెదురనున్న సర్వపదార్థములయందు పడుచునే యుండును. ప్రాణముయొక్క సమీపమునకు వచ్చిన ప్రతిగంధమును ఆఘ్రాణించుచునే యుండును. ఇట్లు ఇంద్రియ వ్యాపారములు గలుగుచున్నవని వానికి ( మార్గమున నడచుపురుషునికి ) సర్వపదార్థములయందును అభిమానము కలదనుటకు వీలుకలదా. అయస్కాంతము ఇనుమును ఆకర్షించును. దానికి అభిమానము కలదా. అట్టిస్థితి-సంకల్ప రహితులకు మాత్రము ఏల కలుగగూడదు. కావున ఓ పుత్రా ! సంకల్పములను నాశము గావింపను వచ్చును. అభిమాన రహితముగా కార్యములను ఆచరింపనువచ్చును. కావున ఓ కుమారుడా ! నీవు యథార్థతత్త్వమును ఎఱిగి బలాత్కారముగ సంకల్ప వికల్పములను విడచి

సుషుప్త్యవస్థయందువలె అతిశాంతమగు చిత్తవృత్తిని కలిగి ఏకస్వరూపమగు ఆబ్రహ్మపదమును బొందుము. అదియే పరమానందము. ఓరామా! ఇట్లు తండ్రి చెప్పిన వాక్యములను విని యాపుత్రుడు మరల ఇట్లనియె. ఓతండ్రీ! ఈసంకల్పమునకు స్వరూపము ఏది? ఇది ఎట్లు పుట్టును. ఇది ఎట్లు నిలచును. ఎట్లు నశించును. దీనిని సవిస్తరముగ వివరింపుము. అనిన పుత్రునకు దాశూరుడు ఇట్లనియె.

—* సంకల్ప వర్ణనము. *—

ఓపుత్రుడా! సర్వకాలములయందును పరబ్రహ్మము ఒకట్టియే కలదు. ఆపరబ్రహ్మమునకు ఆద్యంతములు లేవు. జ్ఞానమును, సర్వపదార్థములయందును " వాయువు ఉన్నది. ఆకాశము ఉన్నది. " అని వ్యవహరింపబడుచున్న ఉనికియు ఆబ్రహ్మమునకు స్వరూపములు. ఇట్టి ఆబ్రహ్మము రెండవపదార్థము పైపునకు దిరుగుట ఏదికలదో, అనగా " నేను జ్ఞానరూపుడను " అని తలంచుట ఏదికలదో ( " నేను జ్ఞానరూపుడను అని తలంచిన, నాకు జ్ఞేయమగు రెండవ వస్తువు కలదు. " అని సంకల్పించినట్లు అగును. కావున బ్రహ్మము రెండవ పదార్థము పైపునకు దిరిగినట్లగును. ) అదియే సంకల్పమునకు అంకురము. ఆబ్రహ్మము నిర్వికారుడైనను సర్వశక్తుడు. కావున ఆబ్రహ్మమునకు గల సంకల్పశక్తియే ఇట్లు విజృంభించును. సర్వశక్తునకు ఇది విరుద్ధము కానేరదు. ఈవిధముగా పుట్టిన ఆసంకల్పాంకురము భ్రాంతిమయమే. కావున " ఇది ఇట్లు " అనిచెప్పుటకు వీలుకాకుండనే, స్థితిని ( ఉనికిని ) చెందును. బ్రహ్మమునకంటెను ఏదియు భిన్నముగా నుండుటకు వీలులేదు. కావున దీనికి ( సంకల్పాంకురమునకు ) గూడ ఆబ్రహ్మమునకంటె భిన్నమగు ఉనికి సంభవింపదు. అయినను "ఇది (నేను) బ్రహ్మమునకంటె వేరు " అను స్వసంకల్పమువలననే ఆసంకల్పాంకురము బ్రహ్మభిన్నమాయెను. ఇట్లేదియో ఒక విధముగా నది బ్రహ్మభిన్నమై క్రమక్రమముగ ఘనీభవించును. "మేఘము మొట్టమొదట ఒక పార్శ్వమున ధూమ సమూహ మాత్రమై కనుపట్టి పిమ్మట క్రమక్రమముగ ఘనీభవించునట్లు " ఈసంకల్పాంకురమును మొదట అల్పమయ్యు, క్రమముగ స్వభావముగనే ఘనీభవించును. ఇట్లు ఘనీభావమే మనస్సునకు స్వరూపము. ప్రపంచమునకు ఆకారము. ఈవిధముగ ఆశుద్ధబ్రహ్మము ప్రపంచమును తనకంటె భిన్నమైనదానిని వలెను, తనను దానికి సాక్షిగ నున్నవానివలెను, భావించుచు చిత్తనము మొలకమైనట్లు సంకల్పరూపమును ( మనస్సుయొక్క

రూపమును ) జెందును. నిర్వికారునకు ఇట్టి రూపాపభేదము వాస్తవముగ సంభవింపదు. కావున " బ్రహ్మము సంకల్పరూపమును జెందినట్లగును " అనియే చెప్పవలయును. " సంకల్పమే, ప్రపంచమనిన ఎట్లు " అని అందువేమో, వినుము. సంకల్ప పదమునకు కల్పించుట అనియే, అర్థము. కావున ప్రపంచ కల్పనయే సంకల్పము. ప్రపంచము స్వకల్పనమునకంటె భిన్నము కానేరదు. కావున సంకల్ప ప్రపంచములకు భేదము లేదని తెలిసికొనవలయును. కార్యకారణములకు భేదము ఉండదు కదా. ఒక ఇంద్రజాలికుడు మాయాబలముచే ఒకపదార్థమును నిర్మించిన ఆపదార్థమునకు వానిమాయయే స్వరూపమగునుగాని, అన్యము కానేరదు కదా. మఱియొక విశేషము. సంకల్పమనగా గల్పించుటయే. ( లేనిదానిని ఉన్నట్లు చూపుటయే ) కావున ఆసంకల్పమునకు కారణము ఉండుటకే వీలులేదు. లేనిదానికి గారణము ఎట్లుండును. కావున బాగుగ విచారించినచో ఈసంకల్పము ఉత్పత్తియగుటకు కారణమే లేదు. ఉండుటకును వీలులేదు. ఇది నిలుచుటకు ఆధారమును లేదు. లీనమగుటకును స్థానమును లేదు. ఉత్పత్తియే లేనిదానికి స్థితిలయములుగాని, దానికి అధిష్ఠానములుగాని, ఎట్లుండును. కావున విచారించిన ఈసంకల్పమునకు ఉత్పత్తియే లేదు. " ప్రపంచమే సంకల్పమంటిరి కదా. దీనికి రూపము ఉండిన దానికి ఏలలేకపోవును " అనియెదవేమో, వినుము. ఈప్రత్యక్షానుభవమునుబట్టి " సంకల్పమునకు ఉత్పత్తినుండియే తీరవలయును. " అనునెడల అప్పుడు పైయుక్తులను అనుసరించి " ఈసంకల్పము స్వయముగనే పుట్టును. తనయందు తానే నిలచును. తనయందు తానే నశించును " అనియే చెప్పి తీరవలయును. కావున ఓపుత్రుడా! సంకల్పమునకు ఉత్పత్తి వినాశములు ఎట్లుచూచినను స్వయముగ కలుగునవియే కాని, కారణాంతరము వలన కలుగునవికావు. కావున నీవు ఏసంకల్పమును జేయకుము. ఏపదార్థమును కలదని తలంపకుము. ఈకార్యమునుమాత్రము ఆచరింతువేని నీకు పరమాభివృద్ధి కలుగును. ఎట్లు కావలయునో, అట్లగుదువు. ఎవ్వనిరూపమును జెందవలయునో, వానిరూపమును జెందుదువు. ఈసంకల్ప నాశనమునకై ఎంతప్రయత్నము చేయవలయునో, అని భయము నొందకుము. తలంపులు లేకుండినంతమాత్రముననే అది ( సంకల్పము ) సమూలముగ ధ్వంసమగును. సాధకుడగువాడు ఏమియును జేయక దేనిని గుఱించియు విచారింపక ఊరకయుండినఁ జాలును. ఆసంకల్పము తనంతట తానే నశించును. తలంపులు లేకుండుటయనగా, ఊరక గూర్చుం

డుటయే కదా.

శ్లో ॥ సుమనః కుసుమామర్దే కించిద్వ్యక్తి కరోభవేత్ ।
సుసాధ్యాభావమాత్రేణ నతు సంకల్పనాశనే ॥

ఓపుత్రుడా ! జాజిపువ్వును నలుపవలయునన్నను కొంత ప్రయత్నమును గావలయునుగాని, సంకల్పమును నశింపజేయవలయునసిన ఏప్రయత్నమును అక్కఱలేదు. ఏమియు జేయక ఊఱక కూర్చుండుమనిన దానికి గూడ ప్రయత్నము గావలయునా? ఇట్టి అతిసులభమగు ఉపాయముచేత సంకల్పనాశము గలుగుచుండగా దానిని శ్రమయని భావింపనేల? ఓవిచారశీలుడా! పుత్రుడా ! ఇట్లగుటచేత నీవు ప్రపంచము లేదను సంకల్పముచేత కలదను సంకల్పమును జయించి సత్పురుష సాంగత్యము మొదలగువానిచే పరిశుద్ధమైన మనస్సుచేత అపరిశుద్ధమగు మనస్సును ఖండించి స్వస్వరూపమునందు నిలుపుము. ఊరకుండుటకూడ నీకు కష్టమా? ఈఆకాశము ఎట్లు శూన్యరూపమో, ప్రపంచముకూడ అట్లే శూన్యరూపము. బాగుగావిచారింపుము. ఈ ఆకాశమునకు ఏసంకల్పము కారణమో ప్రపంచమునకుకూడ ఆసంకల్పమే కారణము. ఇట్లుండగా, ఒకటి అసత్యమనియు, మఱియొకటి మాత్రము సత్యమనియు, జెప్పుటకు అవకాశము ఎట్లుండును. ఒక కారణమువలన పుట్టిన పదార్థములన్నియు ఒక్కవిధముగానే యుండుననుట నియమముకదా? మఱియును ఈ సర్వప్రపంచమునకు గారణమగు ఆసంకల్పము పుట్టుటయే కల్లయని సయుక్తికముగా ఇదివరకే నిరూపించి యున్నాను. అట్లగుటచేత ఈప్రపంచమునకు ఉనికి బొత్తిగనే సంభవింపదు కదా? ఇట్లైనను ఈసంకల్పము నశించుటకు వీలులేదు. ఇది ఎట్టిదైనను బాధించుచున్నది, స్వభావసిద్ధమై ఉన్నదనియే చెప్పవలసియున్నది. ఇట్టి సంకల్పము పురుషప్రయత్నముచేత నాశమునొందుట ఎట్లు? అనిగొదవేమో వినుము. బియ్యముపైనుండు పొట్టు భగవంతునిచేత స్వాభావికముగా నిర్మింపబడినను పురుష ప్రయత్నముచేత ( దంచుట మొదలగు కార్యములచేత ) పోవునట్లును, రాగియందు స్వభావ సిద్ధమైయున్న చిలుము పురుషప్రయత్నముచేత ( చింతపండుపులుసు మొదలగువానిని పూసి తోముటచేత ) పోవునట్లును, పురుషునకు స్వభావ సిద్ధమై యున్నదైనను ఈభ్రాంతి సజ్జన సాంగత్యము మొదలగు పురుష ప్రయత్నములచేత నశించును.

ఓపుత్రుడా! ఇందు సందేహములేదు. జీవునకు గల భ్రాంతిరూప మాలిన్యము స్వాభావికమేయైనను బియ్యమునకుగల తవుడు మొదలగు మా

లిన్యము కడుగుట మొదలగు పురుషప్రయత్నములచేత నశించునట్లు సత్సాంగత్యము మొదలగు పురుష ప్రయత్నములచేత నశించును. కావున సంశయింపక సంకల్ప నాశమునకై ప్రయత్నింపుము. “ నాకు ఐశ్వర్యము కలదు. బహువిధములగు వినోదములు కలవు. వానిని నేను అనుభవించుచున్నాను ” అను నిరర్థకమైన భ్రాంతిని వదలివేయుము. నీవును నీకుగల ఐశ్వర్యాదులునుగూడ బ్రహ్మమాత్రమునులే. ఇట్లుండగా వానిని బ్రహ్మాభిన్నములుగా భావింపనేటికి. అని దాశూరుడు చెప్పెనని వశిష్ఠమహాముని చెప్పి మఱియును ఇట్లనియె. రఘువంశమను ఆకాశమునకు చంద్రుడవగు ఓశ్రీరామచంద్రా ! ఈవిధముగ ఆదాశూరుడును అతని పుత్రుడును ఆరాత్రి చేయుచుండిన సంభాషణమును సంపూర్ణముగ విని చిగురుటాకులతోను, పుష్పఫలములతోను కూడిన ఆకడిమిచెట్టుమీదికి ఆకాశమునుండి దిగితిని. అంత ఆదాశూరుడును నన్నుజూచి అర్ఘ్యపాద్యాదులచేత పూజించి ఒక కడిమిఆకును ఆసనముగా నిచ్చెను. నేనును అచ్చట విశ్రమించితిని. పిమ్మట మేము ఇరువురమును బహువిధములగు విచిత్ర సంభాషణములను జేయుచుండగనే ఒకక్షణమువలె ఆరాత్రి గడచిపోయెను. అంతనేను ఆదాశూరునిచేత అనుజ్ఞతీసికొని స్నానార్థమై కైలాసపర్వతమునందు ప్రవహించుచున్న గంగాతీరమును ( కైలాస పర్వతమునందు ఉన్న గంగానదియొక్క రేవును ) ( పర్వత ప్రభావముచేత ఆరేవునకు ప్రభావము అధికమని తెలిసికొనునది. ) జేరితిని. ఓ రామచంద్రా ! ఈవిధముగ నీకు దాశూరుని వృత్తాంతమును వివరించితిని. ఇదియే వేదాంత సర్వస్వమని తలంపుము. ప్రపంచమంతయును ఇంతియే అని భావింపుము.

ఇట్లు శ్రీవాల్మీకి మహర్షిప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
స్థితిప్రకరణమున దాశూరోపాఖ్యానమను
పదునేడవసర్గ ముగిసెను.

—*—

## —* ఉపదేశోపాఖ్యానము. *—

శ్రీవాల్మీకిమహర్షి భరద్వాజుని జూచి ఇట్లనియె. ఓభరద్వాజా! పైన వర్ణించిన విధముగా వశిష్ఠమహాముని శ్రీరామచంద్రునితో ప్రపంచస్థితిని గూర్చి వివరించి ఇప్పుడు సర్వార్థమును సంక్షేపముగా జెప్పువాడై ఇట్లనియె. ఓ రామభద్రా ! శ్రీరామా ! వినుము. పురుషులకు గల ఆయుస్సు

నూఱుసంవత్సరములు. కాలమా, అపరిమితము. అట్టి అపరిమితమగు కాలము నందు నూఱు సంవత్సరములనగా నెంత ? ఇంతేమాత్రము ఆయుస్సు గల వాడు ఏపదార్థములను గోరవలయును ? బహుకాలము బ్రతికి అనుభవించునెడల ఒకపక్షమునందు భోగములను గోరినను యుక్తమే యగును గాని, ఇంత అల్పకాలపుబ్రతుకునకై నిరర్థకముగా భోగేచ్ఛకొఱకు కష్టపడి దుఃఖింపనేటికి ? ఓదోషరహితుడా ! శ్రీరామా ! ఈకారణమువలన భోగేచ్ఛను సంపూర్ణముగ విడిచిపెట్టుము. ఈకార్యము దుర్ఘటము కాదు. సర్వమును సంకల్పమాత్రమే. కావున కొంచెము నిదానించి ఊరకుండినచో ఇది తనంతట తానే నశించును. పిమ్మట నీవు అప్రయత్నముగనే సత్తామాత్ర స్వరూపమునుబొంది స్వాభావికముగ ఎట్టిరూపముగలవాడవో(పరబ్రహ్మరూపము గలవాడవో) అట్టిస్వరూపముగలవాడవేఅగుదువు. పిమ్మట నిన్ను ఏదియుబాధింపదు. ఈప్రపంచమునందు స్వేచ్ఛగావిహరింపుము. "ఇచ్ఛ లేక పోయెనేని వ్యవహారము ఎట్లుజరుగును" అనియెదవేమో, వినుము. లోకమునందు ఒక రత్నము ప్రకాశించుచున్న, దానికాంతిని ఆశ్రయించి అందరును తమతమ కార్యములను ఆచరించుచున్నారు. ఆరత్నమునకు మాత్రము జనులను ఆయాకార్యములయందు ప్రేరేపింపవలయునను ఇచ్ఛ లేదు కదా. ఈవిధముగానే, పరబ్రహ్మమునకు కూడ ఇచ్ఛ ( సంకల్పముచేత ఆరోపింపబడిన ఇచ్ఛ అనగా, కామసంకల్పము ) లేకున్నను ఆపరబ్రహ్మముయొక్క సాన్నిధ్యమాత్రముచేత సర్వేంద్రియములును యథాప్రకారముగ తమతమ కార్యములయందు ప్రవర్తింపనచ్చును. ఈ కారణమువలన ఆత్మ కర్తయై యున్నాడు. కాకుండాకూడ ఉన్నాడు. ఇచ్ఛ లేకపోవుటచేత ఆయన కర్త కాదు. ఆయన యుండిననేకాని, వ్యవహారములు జరుగవు. కావున అకర్తయును గాదు. కావున ఓరఘురామా ! రామచంద్రా ! ఆత్మయందు స్వాభావికముగనున్న ఈ రెంటిలో నీకు దేనియందు అభిలాషయుండునో, దానినే దృఢముగ గ్రహింపుము "నేను ఈసర్వమును గల్పించుచున్నాను" అని భావించుటయందు ఇచ్ఛ గలిగినచో అట్లే స్థిరముగ భావింపుము. "నేను ఏమియు జేయువాడనుకాను." అనిభావింపదలచిన అట్లే భావింపుము. ఏపక్షమును బూనినను మోక్షము కరతలామలకమే. "నేనుకర్తను గాను, అని భావించినచో, అప్పుడు జీవన్ముక్తికి అనునది లేకపోవలసి వచ్చును, అప్పుడు ఏ కర్మమునుగాని, ఆచరించుటకు వీలులేదు కదా" అని తలంతువేమో, అట్లు కాదు. పరమాత్మకు గల కర్తృత్వము సాన్నిధ్య

మాత్ర సాధ్యమే. ( సమీపమునం దున్నంతమాత్రమున జరుగబడునదియే)
కావునను, ఇంద్రియములు ఎట్లుప్రవర్తించినను దానిచేత సాక్షికి హానియేమి
యు లేదు, కావునను " నేను ఏకార్యమును జేయువాడనుకాను " అని దృఢ
ముగ భావించినచో, ఆకస్మికముగ వచ్చిన కర్మమును ఎట్లాచరించినను
దోషము ఉండదు. అట్టి వాడు ఆకర్మలను అంటడు. ఆచరించునవి ఇంద్రి
యములే కాని, ఆత్మ కాదు గదా. మనస్సు సంకల్పములను విడిచెనేని
జంతువు క్రమ క్రమముగా దేనియందును అనురాగము లేనిది అగును. అను
రాగము ఉండిననేకాని, ఎవ్వడును ఒక పదార్థమునుగూర్చి సంకల్పింపడు
కదా. మఱియును అనురాగము క్షీణించుకొలది ద్వేషముకూడ క్షీణిం
చును. అనురాగ బలమువలన " ఇవి నాకు ఇష్టములగు పదార్థములు " అని
కొన్నిటిని భావించినచో అప్పుడు " ఇవి నాకు ఇష్టములు కాని, పదార్థ
ములు " అని మఱికొన్ని ఏర్పడును. ఇట్లు గాకపోయినచో ద్వేషమునకు
విషయములగు పదార్థములు భిన్నములై ఏర్పడవుకదా. ఈకారణమువలన
అనురాగము క్షీణింపను ఆరంభించిన తోడనే ద్వేషముకూడ క్షీణింప
నారంభించును. రాగ ద్వేషములు రెండును క్షీణించుటయే సంసార నాశ
ముకదా. ఈ విధముగా సంకల్పములు లేకపోయిన సంసారనాశము కలు
గును. ఆ సంకల్పములు " నేను కర్తగాను " అను దృఢభావనచేత నశిం
చును. కర్తగాని వానికి సంకల్పములతో అవసరములేదు కదా. కావున
" నేను ఏమియు జేయను, ఆత్మ కర్తగాను" అను పక్షమును బూని భావించి
నచో కట్టకడకు సర్వసమత్వమే సిద్ధించును. దానికే మోక్షమని పేరు. అట్టి
వాడు ఒకదానిని నిరాకరింపడు. మఱియొకదానిని స్వీకరింపడు.

ఓ రామభద్రా ! ఇట్లుగాక " నేను సర్వమును ఆచరించువాడను "
అను పక్షమును బూని యుండదలంతువేని అట్లుగూడ నిలువ వచ్చును.
అదియు సర్వోత్తమ మైనదియే. ముక్తిని గలిగించునదియే. " ఇట్లు భావిం
భావించినచో సర్వమును ఇప్పటివలెనే యుండవలసి వచ్చును కదా. ఇక
మోక్షము ఎట్లు కనుగును " అనియెదవేమో, వినుము. " నేనే సర్వమును
ఆచరించువాడను " అనిన " ఈ కానవచ్చు ప్రపంచ భ్రాంతినికూడ నేనే
ఆచరించితిని " అనికూడ భావింప వలయును కదా. ఇట్లైనచో నిర్మించు
వానికి తన చేత నిర్మింపబడిన పదార్థములనుగూర్చిన తత్త్వజ్ఞానము అవశ్య
ముగ ఉండి తీరవలయును. కావున ఆసాధకునకును ప్రపంచ విషయక
యథార్థజ్ఞానము కలిగి తీరవలయును. ఇట్లు తత్త్వమును ఎఱిగిన వానికి

" ఇది సంసారము, ఇదినాది " అను మొదలగు భావన ఎట్లుండును? ఇంద్ర జాల విద్యాప్రభావముచేత ఒక పురమును స్వయముగనే కల్పించిన ఆ ఇంద్రజాలికుడు దానిని చూచుచునే యున్నను " ఇది యంతయు మాయ. ఇందు సత్యమైనది ఏదియు లేదు. " అని తలంచి సాక్షియై ఊరకుండునే కాని " ఇది నా ఊరు " అని భావించి దానికి కలుగు మార్పుల వలన హర్ష యోగముల నొందునా? ఇట్లే ఆత్మయు కర్తయనియే తలంప బడు చున్నను ప్రపంచ భ్రాంతియుండ నక్కఱలేదు. మఱియు మాయా కల్పిత ములగు పదార్థములు నిత్యములు గాక పోవుటచేతను, ఉన్నట్లు తోచునవి మాత్రమే అగుటచేతను, భిన్నపదార్థములు ( తనకంటె ఇతరములై నిలిచి యుండు ప్రత్యేక పదార్థములు ) కానేరవు కదా. " జలము రెండు విధ ములు. ఎండమావులలోని జలమొకటి, శుద్ధజలమొకటి " అని. కల్పితమగు ఎండమావులలోని జలముతో శుద్ధ జలమునకు ద్విత్వము చెప్పుట సంభవిం పదు కదా. కావున " ఆత్మ సర్వకర్త " అని భావించినను ముక్తికలుగు టకు ఆక్షేపము లేదు. ఇట్టివానికి గూడా సర్వమును స్వకార్యమే అగుట చేత ఒకదానియందు రాగమును, మఱియొకదానియందు ద్వేషమును కలు గుట తటస్థింపదు. ఒక పురుషుడు శరీరమును దహించినను, మఱియొకడు చందనాదులచేత అలంకరించి లాలించినను, వారియందు రాగద్వేషము లుండుటకు వీలులేదు. ఆ బాధవలన దుఃఖము కలుగుటకును వీలు లేదు. సుఖమువలన సంతోషము కలుగుటకును అవకాశములేదు. రాగద్వేషములే హర్షశోకములకు ఆధారములు. కావున నవి యుండుటకు వీలు లేకపోవుట చేత ( రాగద్వేషములు ఉండుటకు వీలు లేకపోవుటచేత ) నివియు ( హర్ష శోకములును ) ఉండుటకు వీలులేదు. తాను సర్వమునకును కర్త యగుట చేత కాల్చిన పురుషుడును, అగ్నియును, చందన లేపమును జేసినవాడును, చందనాదులునుగూడ తనకార్యములే. మాయా మయములే కదా. ఇట్లగుట చేత ఆతడు ఒకదానిని ఎట్లభిమానించును. మఱియొకదానిని ఎట్లు నిరాకరిం చును. అభిమానింపవలసియున్నను, నిరాకరింపవలసియున్నను, ఆ పదా ర్థము తనకంటె అన్యముగా నుండితీరవలయును అనుట లోకములో నియమ మైయున్నది. " ఈ ప్రపంచమంతయును అసత్యమగుటచేత నాకంటె అన్య మగు రెండవ పదార్థము కాదు " అని ఎఱిగినవాడు కాల్చు వానిని గాని మఱి ఎవనినిగాని తనకంటె అన్యునిగా ఎట్లు భావింప గలడు. కావున ఎట్లు జూచినను " నేను సర్వకర్తను " అనువానికి ప్రపంచభ్రాంతి ఉండదు.

మఱియు “ నాకు సుఖము గలిగించు ( మోక్షరూపమగు పరమానంద మును గలిగించు ) ప్రపంచ నాశమును జేయువాడును నేనే. నాకు దుఃఖ మును గలిగించు ప్రపంచాభివృద్ధిని జేయువాడనుగూడ నేనే. ” అని కూడ అజ్ఞాని భావించుచుండును. సర్వమునకును తానే కర్తయైయుండ సుఖము గాని, దుఃఖముగాని, అంతయు దనకార్యమేయై తీరవలయును గదా. ఇట్టి వానికి హర్షశోకములు ఎట్లు కలుగును. ఈవిధముగా దుఃఖకారణములును, సంతోషకారణములును, అగు సర్వపదార్థములును తనచేతనే నిర్మింపబడి నవి అను దృఢనిశ్చయము కలిగనేని రాగద్వేషములు నశించుటచేత సంక ల్పము తనయందు తానే లయమగును. ఇట్టి సంకల్పనాశనముచేత అంగీక రింపవలసిన పదార్థములుగాని, నిరాకరింప వలసిన పదార్థములుగాని, ఉం డవు. కావున “ నేను కర్తనుగాను ” అను భావన యందువలెనే “ నేను సర్వకర్తను ” అను భావన యందుకూడా అంతమునకు సర్వసమత్వమే శేషించును. దుఃఖకరములైనట్టియు, సుఖకరములైనట్టియు, సకలపదార్థ ములయందును భేదభావన లేక, రాగద్వేషములు నొందక హేయోపా దేయ భావమును ( “ ఇవి విడువదగినవి. ఇవి అంగీకరింప దగినవి ” అను తలంపును ) జెందక సమత్వముతో జూచుట ఏది కలదో, అదియే బ్రహ్మ రూపస్థితి. బాగుగ విచారించిన సర్వమును ఆత్మయే. కావున హేయో పాదేయములు బొత్తిగనే లేవుకదా. ఇట్టి స్థితియందు నిలిచియున్న చిత్త ము పునర్జన్మము నొందదు.

ఓరామభద్రా ! శ్రీరామా ! ఇదియే నియమము కాదు. “ నేను కర్తనని కాని, కాదని కాని, భావించి తీరవలయును. “ అని నియమము ఏమియు లేదు. ఒకపక్షమునందు ఇవి రెండునుకూడ సంకల్పములే. కావున వీనిని పరిత్యజించుటయే మంచిపని. కావున నీవు ఈభావనలనుకూడ వదలి మనస్సును మ్రింగివేయుము. అప్పుడు ఎవడవు కావలయునో, వాడవు అవు దువు. ఇట్లు స్వస్వరూపము నొంది స్థిరుడవు కమ్ము. ఇవ్విధముగా నేను సర్వకర్తనని కాని, కాదని కాని, భావించుటయైనను, లేక, సర్వభావ వర్జి తుడవై శాంతి నొందుట యైనను సరియేకాని “ నేను రాముడను. నేను కృష్ణుడను కాను. నేను ధనమును ఆర్జించుచున్నాను. నేను ఆర్జింపలేదు. ” అను సంకల్పములు మాత్రము యుక్తములు కావు. కర్తవ్యములుకావు. ఈసంసారమునకు ఈ సంకల్పములేకదా కారణములు. కావున వీనిని అవ లంబించుటవలన సుఖము లేదు. దేహమునందు “ ఇదినేను ” అను అభి

మానము ఏదికలదో, అదియే కాలసూత్రము ( ఇదియొక నరకము ) అది యే మహావీచియను అల (ఇదియు తరంగరూపమగు మఱియొక నరకము) అదియే అతిభయంకరమగు విచ్చుకత్తుల వనము ( ఇదియు విచ్చుకత్తులను పాతి దానిపై పాపాత్ముని బడవైచునట్టి యొకనరకము ) కావున నా దే హాత్మాభిమానము ఎంతపోయినను తుదకు తనకుగల సర్వము నశించినను అతిప్రయత్నముతో అభిమానముకు నాశను చేయవలయును. ఉత్తము డగువాడు " కుక్కమాంసమును చేత నుంచుకొనియున్న చండాలస్త్రీని వలె " నాయభిమానమును స్పృశింపరాదు.

ఓ శ్రీరామచంద్రా! ఆ దేహాభిమానమే పటలమను వ్యాధివలె ( ఇది కంటిపొరయనువ్యాధి ) కంటిని గప్పియున్నది. దానిని పైన వర్ణించిన విధ ముగా ధ్వంసముచేసి దూరమునందు వదలివేసి అప్పుడు లోకోత్తరమగు దృష్టి ఆవిర్భవించి వికసించును. అదియే జ్ఞానదృష్టి. దానిచేత మేఘముచే గప్పబడని వెన్నెలవలె ప్రకాశించుచు సంసారమునుండి తరింపగలవు. కా వున ఓరామభద్రా! లోకమునందు ఉత్తములని ప్రశంసింప బడుచున్న సజ్జ నులు " నేనుకర్తను. రామకృష్ణాది నామములచేత వ్యవహరింప బడుచు పరిచ్ఛిన్నులైయున్న జీవులలో ఎవ్వడనుగాను " అనిమైనను మనస్సునందు స్పష్టముగా తెలిసికొనియుందురు. ఇట్లుగాక " నేను సర్వకర్తను. సర్వ రూపుడను. ఈసర్వమును సద్రూపమే " అనియైనను హృదయమునందు నిశ్చయించుకొని యుందురు. ఇట్లునుంగాక " నేనెవ్వడనో, నారూపము అవాఙ్మానసగోచరము. ఈప్రపంచమునందు గానవచ్చువారలలో ఎవ్వడు నుగాను. " అనియైనను తలంచి యుందురు. ఇట్టిమార్గములలో దేనిని అవ లంబించినను వారికి లోకోత్తరమగు మోక్షసామ్రాజ్యము దొరుకును. నీవు ను అట్లే పైనవర్ణింపబడిన మార్గములలో దేనినైనను అవలబించి ముక్తి నొందుము. అని ఇట్లు వశిష్ఠమహర్షి చెప్పి మఱియు ఒకవిశేషార్థమును ఉప దేశింప దలంచి వశిష్ఠమహాముని ఇట్లనియె. సంకల్పములయొక్క అభివృద్ధి యే బంధము. వానియొక్కనాశమే మోక్షము. ఈవిషయము ఎన్నిమారు లో స్పష్టము చేయబడినదే యున్నదికదా. ఈకారణమువలన నీవు మొట్ట మొదట మోక్షమును గోరుచు దానికి ఆటంకములగు సంసారవిషయక సర్వ సంకల్పములను పరిత్యజింపుము. పిమ్మట సిద్ధుడవై ఆమోక్షేచ్ఛారూప సంకల్పమునుకూడా వదలివేయుము. బాగుగ విచారించిన ఇచ్ఛయంత యును సంకల్పరూపమే. కావున శుభసంకల్పము అగుటచేత మోక్షేచ్ఛను

శ్రేష్ఠ సంకల్పమనియు, అశుభదాయకము లగుటచేత తక్కినవానిని నీచ సంకల్పములనియు, జెప్పవచ్చునంతేకాని, " మోక్షేచ్ఛ సంకల్ప రూపము కాదు. " అని చెప్పుటకు ఏమాత్రమును వీలులేదుకదా. కావున అన్ని సంకల్పములవలె ఈమోక్షేచ్ఛారూప సంకల్పముకూడా విడువవలసినదియే. వాస్తవస్థితిలో బ్రహ్మమునకు ఏసంకల్పమును లేదుకదా. " ఇట్లు సర్వ వాసనలను పరిత్యజించిన మనస్సు ప్రవర్తించుటయే దుర్ఘటముకదా " అని యెదవేమో, వినుము. సంకల్పములు సంపూర్ణముగ నశింపకున్న మోక్షము దొరకదు. కావున మనోగతములై అనాదినుండియు నిలచియుండి పునర్జన్మమును గలిగించునట్టి అపరిశుద్ధ వాసనలను సంపూర్ణముగా వదలివేయవలసినదియే. అయినను వ్యవహారార్థమై మైత్రి (సుఖముజెందువారినిజూచి అసూయజెందక వారితో స్నేహము చేయుట) దయ ( దుఃఖము నొందుచున్నవారలజూచి వీరిదుఃఖమును ఎట్లులైనను నివారింప జేయవలయును. అను తలంపు ) ముదిత ( పుణ్యకర్మలు చేయువారిని జూచి సంతసించుట ) ఉపేక్ష ( దుష్టులను జూచిన తొలగియుండుట ) అను మొదలగు సుగుణవాసనలను అంగీకరింపవచ్చును. అవియును సంకల్పములే. కావున వానినికూడా ఎప్పటికిని ఆశ్రయించి యుండరాదు. వ్యవహారములను అన్నిటిని వానిని ఆశ్రయించియే సలుపుచున్నను వెలుపలికిమాత్రము అట్లే యుండి లోపల " బ్రహ్మమేనేను, నాకు ఈమైత్రిమొదలగువాటితోకూడ సంబంధము లేదు " అని ఎఱిగి ఆమైత్రి మొదలగువాటినికూడ వేరుచేసి జ్ఞానమాత్ర వాసనతో నిలువుము. ఇప్పుడు అనుభవములోనున్న వాసనలు శబ్దాది విషయములచేత ఆక్రమింపబడి యున్నవగుటచేత అపరిశుద్ధములనియు మైత్రి మొదలగునవి అట్లుకావు. కావున పరిశుద్ధ వాసనలనియు జెప్పబడుటయే కాని, వాసనలగుటచేత అన్నియు విడువవలసినవియే కదా. కావున చిత్తశుద్ధికరములగు మైత్ర్యాదులనుకూడ క్రమముగా విడచి " చీకటియును, తైలమును లేక, స్వతంత్రముగ ఏకరూపముతో వెలుగుదీపమువలె" ప్రకాశింపుము. అజ్ఞానాంధకారము వాస్తవస్థితిలో శూన్యరూపమే యగుటచేత దానిని నీస్వస్వరూప ప్రకాశము నివర్తింపజేయ నక్కరలేదు. ( ఈ అభిప్రాయమువచ్చుటకయ్యే ఉపమానమునందు చీకటిలేకయే వెలుగుదీపమని అన్నాడు. దీపము ఎట్లు చీకటిని పోగొట్టునో, అట్లే బ్రహ్మరూపము అజ్ఞానమును పోగొట్టును. కావున అజ్ఞానములేని స్థితిని వర్ణించుచున్నాడు. కాఁబట్టి అప్పటి శుద్ధబ్రహ్మము చీకటిలేనిదీపముతో సమానమై యుండునని

తెలిసికొనవలయును. సర్వమయమగుటచేత ఈస్వస్వరూప ప్రకాశము నకు ఆధారముకూడ నక్కరలేదు. దీపమునకు తైలము ఆధారమైనట్లు సంకల్పరూపమగు బ్రహ్మమునకు వాసన ఆధారమను సందేహమును నిరాకరించుటకై ఉపమానమున చమురులేనిదీపము అని చెప్పబడెను. సర్వవ్యాపకమును ప్రకాశమానమునగు బ్రహ్మమునకు ఏ ఆధారముగూడ ఉండుటకు వీలు లేకపోవుటచేతను ప్రకాశము మాత్రము అధికముగ నుండుటచేతను ఈయుపమానము చెప్పబడెను కదా. కావున " ఏదియో యొకవాసన యుండినంగాని వ్యవహారము జరుగదు. " అను నియమము లేదు. కావున సర్వవాసనలను పరిత్యజించి జ్ఞానవాసనతో నిలచి క్రమక్రమముగ దానినిగూడ విడువ వలయును. "నేను బ్రహ్మమును" అనునదియు సంకల్పమే. కావున బంధహేతువే యగును. లోకమునందు రాముడని పేరుగలవాడు సర్వకాలములయందును " నేను రాముడను " అని జపముచేయు చున్నాడా? " తనపేరు రాముడు " అను విషయమును గ్రహించి ఊరక నుండుచున్నాడు. వానికి తాను రాముడను విషయము దెలియుటకు సంకల్పము ఒకటి కావలయునా? అక్కరలేదు. ఈవిధముగనే " నేను బ్రహ్మమును " అని తెలిసికొనినవాడు ఎప్పటికిని అట్లు భావించుచుండ నక్కరలేదు. సంకల్పమును విడచి స్వస్వరూపముతో అట్లే నిలచి యుండవచ్చును)

ఓరామభద్రా! శ్రీరామా! కావున నీవును ఈవిధముగ సర్వవాసనలను పరిత్యజించి శేషించిన బ్రహ్మరూపమునందు స్థిరుడవగుము. పిమ్మట ఈవాసనా పరిత్యాగమును ఏప్రయత్నముచేత ఆచరించితివో, ఏకారణముచేత గావించితివో, ఆప్రయత్నమును వదులుము. ఆకారణమును పరిత్యజింపుము. ఓబుద్ధిమంతుడా! ఇది జ్ఞానము. ఇది మనస్సు ఇది సంకల్పము, లేక, మాయ. ఇది రూపము. ఇదికాంతి. ఇది చీకటి. అను భేదములుగల సర్వపదార్థములును, ఆపదార్థములకు సంబంధించిన వాసనలను, (సంసారములను) ఆవాసనలకు ఆధారభూతమును, కారణమును,అగు పదార్థమును, ప్రాణసంచారమును; అను నీయన్నిటిని సమూలముగనిర్మూలింపుము. అప్పుడు " ఆకాశమువలె " నీవు దేనితోను సంబంధింపనిదివ్యరూపమును బొందెదవు. యథార్థస్థితిలో ఆరూపమే నీవు.

శ్లో ॥ హృదయాత్సంపరిత్యజ్య సర్వమేవ మహామతే ।
యస్తిష్ఠతిగతవ్యగ్రః సముక్తః పరమేశ్వరః ॥

శ్లో ॥ సమాధిమథకర్మాణి మాకరోతు కరోతువా ।

హృదయేనాఽస్తసర్వాస్థో ముక్తఏవోత్తమాశయః ॥

శ్లో ॥ నైష్కర్మ్యేణనతస్యార్థో నతస్యార్థోఽస్తికర్మభిః ।
నసమాధిజపాభ్యాంవా యస్యనిర్వాసనంమనః ॥

ఓశ్రీరామచంద్రా! రఘునందనా! ఏపురుషుడు హృదయమునందు కల సమస్తమైన వాసనలను విడిచి ఏకాగ్రచిత్తము గలిగి యుండునో, వాడే ముక్తిని జెందినవాడు. వాడే పరమేశ్వరుడు. అట్టివాడు నిర్వికల్ప సమాధిని అవలంబించినను లేకున్నను, కర్మలను ఆచరించినను, ఆచరింపకున్నను, ఎట్లున్నను, ముక్తుడే. పైకి ఎట్లుప్రవర్తించినను మనస్సులోన సర్వాభిమానములును సర్వవిధములగు ఆశలును నశించినను జాలును. "పాలనుండి క్రమక్రమముగా ఉద్ధరింపబడిన వెన్న మరల క్షీరమునందు గాని, పెరుగునందు గాని, మజ్జిగయందు గాని, వేయబడినను, వానియందు కలియనియట్లు" ఆపురుషుడుకూడ శుద్ధుడైన పిమ్మట ఎట్లున్నను మరల సంసారములందు జిక్కుకొనడు. చీకటియందు నడచుచున్న ఒకానొక పురుషుడు తన నీడనుచూచి భూతమని బెదరిన అప్పుడు పార్శ్వమునందు ఉన్న ఇతరులు "వత్సా! ఇది భూతము గాదు. నీనీడయే" అనిచెప్పిన ధైర్యము నొందును. పిమ్మట ఆనీడ ఎన్నిమారులు కానవచ్చినను భయమును జెందడు కదా. ఇట్లే పురుషుడును సంసారభ్రాంతి తొలగినపిమ్మట దానిని మరలజెందడు. సర్వమునకును ప్రధానమగునది మనస్సేకదా. ఈవిధముగా మనశ్శుద్ధి కలుగునేని అతనికి కర్మపరిత్యాగముతో పనిలేదు. కర్మలను ఆచరించుటతోను కార్యము లేదు. నిర్వికల్పసమాధిని అవలంబించుట వలనను ప్రయోజనములేదు. జపములు ఆచరించుట వలనను ఉపయోగము లేదు. ఇంత ఏల? సర్వశాస్త్రసిద్ధాంత రహస్యము తెలిపెదను, వినుము.

శ్లో ॥ విచారితమలంశాస్త్రం చిరముద్గ్రాహితంమిథః ।
సంత్యక్తవాసనాన్మౌనా దృతేనాస్త్యుత్తమంపదమ్ ॥

ఓదశరథరాజనందనా! శ్రీరామా! అద్వైతశాస్త్రము సమగ్రముగా విచారించితిని. గురుశిష్య సంవాద పూర్వకముగా బహుకాలము ఉపన్యాసము చేసితిని. కట్టకడకు సమస్తమైన వాసనలను వదలి మౌనము గలిగి యుండుటకంటె శ్రేష్ఠమైన పరమపదము మఱియొకటి లేదని నిశ్చయించితిని. శాస్త్రములను విచారింపనక్కఱలేదు. వాని అర్థములను గ్రహింపప్రయాసపడనక్కఱలేదు. వాని అర్థములను గ్రహించునట్లు సేయుటకుగురువులును శ్రమజెందనక్కఱలేదు. వానినిగ్రహింపను పనిలేదు. వేని

యందు ఎట్లుచెప్పినను మాట ఒక్కటియే కదా. పైన చెప్పినటుల సర్వసంకల్ప పరిత్యాగరూపమైన మౌనమునకంటెను ఉత్తమమగు స్థానము వేఱొక్కటిలేనే లేదు. దశదిశలును పరికించి చూచితిని. ప్రతివాని స్వభావమును విమర్శించితిని. ఎందుచూచినను తత్వజ్ఞాని వెయ్యింటి కొకడు ఉండుటయు అరుదుగనున్నది. ఎవ్వడు ఏ కార్యమును ఆచరించినను దేనిని సంకల్పించినను సర్వమును శరీరముకొఱకు మాత్రమే. ఆత్మకొఱకై ఎవ్వడును ఇసుమంత కార్యమునైనను చేయుటలేదు. తుదకు చేయవలయునని సంకల్పించుటకూడ లేదు. పాతాళమునందు చూచినను భూలోకమునందు విమర్శించినను స్వర్గలోకమున పరికించినను అన్నియును పంచభూతములే. ఆఱవభూతము ఎందును లేదు. ఇట్లుండగా తత్వజ్ఞానియగు వానికి ఆశ దేనియందుకలుగును. వస్తువు ఒక్కటియేయైయుండ వేషములను మార్చినంత మాత్రమున వివేకవంతునకు భ్రాంతి కలుగనేరదుకదా. అజ్ఞానము లేకపోయినచో “ఇది అపూర్వమైనది. ఇది అపూర్వమైనది.” అనుచు కొన్ని వస్తువులయందు అనురాగమును జెందవచ్చును. ఇట్లగుటచేత ఏపురుషుడు వివేకయుక్తిని అవలంబించి సంచరించునో వానికి సంసారము గోష్పాదమువలె తరించుటకు మిక్కిలి సులభమగును. ఆవివేకయుక్తిని విడచినచో, అదియే అనేక సుడులతో గూడిన మహాసముద్ర మగును. “పట్టణమునందు నివసించుచు నాగరీకులగు స్త్రీలతో సుఖించువానికి విలాసములను ఎఱుగని కుగ్రామస్త్రీలు ఆనందమును గలిగింప లేనట్లు” తత్వజ్ఞానికి ఈప్రాపంచిక వస్తువులు సంతోషమును గలిగింప లేవు. సకలకులపర్వతములు బ్రహ్మమను మహాసముద్రమునందు ఉండు నురుగులు. బహుభేదములతో గానవచ్చు ప్రపంచము పరబ్రహ్మముయొక్క తేజస్సువలన దోచునట్టి ఎండమావులు. కావున ఈసర్వమును బ్రహ్మమాత్రమే.

—* కచుని చరిత్రము. *—

ఓ రామచంద్రా ! ఈ విషయమునందు బృహస్పతి పుత్రుడైన కచుడు పూర్వకాలమున కొన్నిగాధలను ( వాక్యములను ) చెప్పియున్నాడు. అవి మిక్కిలి పావనములైనవి. ఆ వాక్యములను దెలిపెదను. వినుము. ఒకనాడు కచుడు సమాధినుండి మేలుకొని ఒక్కడుగనే ఏకాంతస్థలమున నుండి సంతోషాతిశయముచేత గద్గద స్వరముగల కంఠముతో ఈక్రిందివిధముగ బలికెను. నేను ఏ కార్యమును ఆచరింపవలయును ? నేను ఎచ్చటికి పోవలయును ? దేనిని అంగీకరింప వలయును ? దేనిని పరిత్యజింపవలయును ?

ప్రళయకాలమునందలి సముద్రజలమువలె ఆత్మ ఒక్కడే సర్వప్రపంచమును ఆక్రమించి యున్నాడు. ఇట్లుండుటచేత నాకంటె అన్యమగునది ఏదియును లేదుగదా. లోపలను వెలుపలను ఆత్మయే. సర్వదేహములయందును సర్వ దిశలయందును ఆత్మయే. ఇచ్చటను ఆత్మయే. అచ్చటను ఆత్మయే. ఎక్కడ చూచినను ఆత్మ భిన్నమగు పదార్థము లేదు కదా. మఱియు నేనులేని పదార్థము ఎందును లేదు. నాయందు లేని పదార్థముకూడా ఎందును లేదు. ఇట్లు సర్వము ఆత్మరూపమే అయ్యుండగా నేను ఇక దేనిని కోరుదును. ఓ రామచంద్రా! ఈ విధముగ ఆ కచుడు మహాసంతోషముతో పలికెను. ఇట్లే ఏ మహాత్ములు సత్వగుణమును ఆశ్రయించి, లేక, జ్ఞానదృష్టిచేత ఆత్మరూపమును ఆశ్రయించి లోకోత్తరులై యుందురో వారు ఆకాశము నందలి చంద్రులవలె సర్వకాలములయందును స్వచ్ఛులై ఆహ్లాదకరులై ప్రకాశింతురు. ఇట్టివారిని సద్గుణము లన్నియు దమంతదామే ఆశ్రయించును. అట్టి మహాత్ములు " బంగారు కమలము రాత్రులయందు వాడని యట్లు " ఎంత ఆపదవచ్చినను దుఃఖము నొందరు. ప్రస్తుతము జరుగు చున్న విషయమును తప్ప తక్కిన దానిని భావింపరు. గడచిన దానికై చింతింపరు. రాబోవు దానిని విచారింపరు. ఎప్పటికిని సాధువుల మార్గ మును విడువరు. చంద్రునివలె మిక్కిలి మనోహరమైనదియు, కలత ఇంచుక యైనను లేనిదియు నగు, సర్వ పరిపూర్ణత్వమును " చంద్రుడు తనస్వభావ మగు చల్లదనమును పరిత్యజింపనట్లు " వారును ఎంత యాపద వచ్చినను పరిత్యజింపరు. మఱియును అమ్మహాత్ములు సర్వసములై సర్వప్రపంచము నందును " ఇది అంతయు బ్రహ్మమే " అని ఏకరూప భావన గలవారై అతి శాంతరూపులై ఎప్పుడును సన్మార్గమునందు సంచరించుచు ప్రకాశించు చుందురు. సువర్ణభూషణాదులతో కాదు గాని, మైత్ర్యాదిసుగుణ ములతో వారి ఆకారము ఉజ్జ్వలమై ప్రకాశించును. అట్టి అమ్మహాత్ములు తత్వజ్ఞానమువలన స్వతంత్ర సంచారములకు అవకాశము గలిగినను, "సము ద్రము ప్రపంచము నంతయును ముంచు సామర్థ్యము గలదయ్యును చెలి యలికట్టను అతిక్రమింపక నిలిచి యుండునట్లు" ( వారును ) లోకమర్యా దల నతిక్రమింపరు. అట్లుగాకుండిన లోకము చెడిపోవును. లోకమునందు యుక్తాయుక్త విచారమునైన జేయక ప్రసిద్ధులైన వారు ఆచరించిన దానిని ఇతరులు అవలబించుట నైజము కదా. కావున ఓ పరాక్రమవంతుడా! శ్రీరామా! మహాస్వాతంత్ర్యమునకు ఆధారము అగుటచేత వారిస్థానము

నిరపాయమైనది. సర్వకాలములయందును వివేకవంతుడగు పురుషుడు అట్టి వారి స్థితిని అనుసరింపవలయును. నిరర్థకముగ సంసార రూపమగు ఆపద అను సముద్రమున బడి మునిగి పోరాదు. “ నేను, నాది. ” అనునదియే సంసారమునకు స్వరూపము. కావున ఏ కార్యములను ఆచరించినను సంసారము అసత్యమను విషయమును దృఢముగ నిశ్చయించి “ నేను ఎవ్వడను. ఇది ఏది ” అని విచారించుచు సత్పురుషులతో సహవాసముచేసి వారిమార్గమును అనుసరించి ప్రవర్తింపవలయును. “ బ్రహ్మజ్ఞాని కర్మలను చేయరాదు ” అను ఉద్దేశ్యమును పెట్టుకొన నక్కరలేదు. సర్వమును యథాపూర్వముగ జేయుచు వానియందలి అభిమానమును విడువవలయును అనిన విడువ వచ్చునుగాని, సంపూర్ణముగ కర్మలను అన్నిటిని పరిత్యజింపవలయుననుట సాధ్యమగు పని కాదు గదా. సమాధికై ఒక ఏకాంత స్థానమును జేరుటయును, అచ్చోట గూర్చుండుటయును, తుదకు సమాధిని ఆచరించుటయును, గూడ కర్మయే కదా. కావున ఇట్టి విషయమును శాస్త్రము బోధింపదు. మఱి ఏమనిన, కర్మలయందలి అభిమాన పరిత్యాగమే కర్మపరిత్యాగమని శాస్త్రాభిప్రాయము. సన్యాసాశ్రమ విధియును అపరిపక్వ చిత్తులకొఱకు చెప్పబడినదేకాని, ఇతరులకు కాదు. “ సన్యస్య శ్రవణం కుర్యాత్ సన్యాసాశ్రమమును అంగీకరించి వేదాంత వాక్యములను విచారింపవలయును ” అను మొదలగు శ్రుతి ఈ విషయమును స్పష్టముచేయుచునే యున్నదిగదా. ” సర్వ సంసారమును నిర్వహించుచుండుటచేత అపరిపక్వ చిత్తులకు వ్యాకులత్వము కలుగును. అప్పుడు వాడు పరమార్థ తాత్పర్యమును గ్రహించునంత స్వస్థుడు కాసేరడు. కావున కర్మల విడుచుటయే వానికి మంచిది. వాస్తవ స్థితిలో కర్మలు చేయువాడు, ఎవడును లేకపోవుటచేత వానిని అవసరము కలిగినప్పుడు విడువ వచ్చును ” అని ఆశ్రుతికి అభిప్రాయము. అన్ని ఆశ్రమములవలె ఆసన్యాసాశ్రమమును కూడా కొన్ని నియమములతో శ్రుతి విధించి యున్నది. కావున ఇతరజనులు అనగా, బ్రహ్మవిచారము చేయవలయునని తలంచు వారు గాని, సన్యాసాశ్రమము కావలయునని కోరువారుగాని, తప్ప తక్కినవారు “ వారు కర్మలను విడిచి పెట్టగా, మేమేల విడువకూడదు.” అను ఉద్దేశముతో కర్మపరిత్యాగమును చేయరు. “ విద్వాంసులుకూడ సన్యసించుట కలదు గదా ” అందువేమో, వారు సర్వకాలములయందును ఏకాంత ప్రదేశమునందు నిర్వికల్ప సమాధియందు ఉండవలయునను ఉద్దేశముతో అట్లు సేయుదురుగాని, వేఱుకాదు.

"వారు స్వతంత్రులుగదా, ఆశ్రమస్వీకారము లేకయే కర్మలను విడువవచ్చును" అనియెదవేమో, అట్లు చేసినయెడల విధి అతిక్రమింపబడుటచేత లోకులయొక్క మనస్సు కదలిపోవునుగదా. కావున ఎన్నివిధముల పరికించినను శాస్త్రమునకు కర్మాభిమాన పరిత్యాగమే అనగా "నేను దీనిని చేయుచున్నాను. ఇది నాచేత చేయబడుచున్నది. దీని ఫలమును నేను అనుభవింతును. దానివలన కలుగు సుఖదుఃఖములు నావి" అను మొదలగు అభిమానములను పరిత్యజించుటయే అభిప్రాయము. కావున "కర్మలను విడువవలయును." అను అభిప్రాయమును పెట్టుకొనగూడదు. దుర్మార్గులతో అనగా, గుణములయందును, తత్వజ్ఞాన విషయమునందును, వెనుకబడియున్నవారితో (హీనులతో) సహవాసము చేయకూడదు. సమస్తప్రపంచమును సంహరించునట్టి మృత్యుదేవతను అవమానదృష్టితో చూడకూడదు. మృత్యువు చేయుపని దుఃఖకరమను తలంపుతో జనులు దానియందు దోషదృష్టిని ఉంచుచున్నారు. బాగుగ విచారించిన నది చేయుపని ఆత్మజ్ఞానికి సంతోషకరమే. మృత్యువు లేకపోయిన జ్ఞానముకలవాడుకూడ రక్తము మాంసము ఎముకలు మొదలగువానితోగూడి అమంగళకరమైయున్న ఈదేహమునందు ఎల్లకాలము నుండవలసినవాడే కదా. కావున మృత్యువును అవమానింపకూడదు. శరీరము ఉండునంతవరకుగూడ మనస్సుచేత దానిని పరిత్యజించి భూతములను ముత్యాల సరమునకు దారమైయున్న పరబ్రహ్మమును అవలోకించుటయే కదా, బ్రహ్మవేత్తకు కర్తవ్యము. బ్రహ్మమొదలు తృణము వరకు గల సర్వభూతములయందును బ్రహ్మము వ్యాపించియున్నాడు. అతి విస్తృతమగు ఆకాశమునకు అంతకును అలంకారమైయున్న సూర్యునియందు ఏ బ్రహ్మము కలడో, ఆబ్రహ్మమే భూమియందలి తొఱటలోనున్న సన్నని పురుగుయందును ఉన్నాడు. ఈవిధముగ సర్వవ్యాపకుడైయున్న పరబ్రహ్మమును సర్వకాలములయందును జూచుచుండవలయును. మైత్రి మొదలగు సద్గుణములను ఆశ్రయించి సత్వగుణవంతులైయున్నవారలకు ఇట్టి స్థితి సుఖముగ దొరకును. రజస్తమోగుణములు కలవారలుగూడ దృఢమగు ప్రయత్నమును ఆచరించినచో సత్వగుణమును సంపాదించి ఈ స్థితిని సుఖముగనే జెందవచ్చును. సర్వమునకును పురుషప్రయత్నమే మూలము.

శ్రీవాల్మీకి మహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠరామాయణమునందలి
స్థితిప్రకరణమున పదునేనిమిదవసర్గ ముగిసెను.

శ్రీ ర స్తు.

# శ్రీజ్ఞానవాశిష్ఠము - వచనకావ్యము.

## ఉ ప శ మ ప్ర క ర ణ ము.

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునిజూచి యిట్లనియె. ఓభర ద్వాజా! ఈవిధముగ ప్రపంచము సంకల్పము వలననే పుట్టువనియు సంక ల్పమునందే నిలచి యుండుననియు, సృష్టిస్థితులను ఎఱిగించి వశిష్ఠమహా ముని ప్రస్తుతము సంకల్పనాశమే ప్రపంచనాశమని వివరించువాడై శ్రీరామ చంద్రునిజూచి యిట్లనియె. ఓరఘురామా! శ్రీరామచంద్రా! వినుము. పైన వర్ణించిన విధముగ మాయామాత్రమగు ఈసంసారమును "స్తంభములు మంటపములను నిలుపునట్లు" రజస్తమోగుణములుగల పామర జనులు నిలుపుచున్నారు. వహించుచున్నారు. ఇంతయే కాని, సత్వగుణవంతులై ధైర్యవంతులై యున్న నీవలెనుండువారు చిత్తపరిపాకము గలవారగుట చేత "పాము పరిపక్వమగు తన కుబుసమును అతిసులభముగ విడచునట్లు" ఈసంసార మాయను విడుతురు.

ఓదోషరహితుడా! శ్రీరామా! ఇదియంతయు పరబ్రహ్మమే యని ఇదివరకే నిరూపించియున్నాను గదా. బ్రహ్మమే ఆత్మ, (తాను) కావున సర్వమును నీస్వరూపమే. ఇట్లుండగ "నేను వేఱు, ఈప్రపంచము వేఱు" అను భ్రాంతిని విడువుము. ఓశ్రీరామచంద్రా! బాగుగ విచారించిన సర్వ వ్యాపకమై నిర్వికారమై యున్న పరబ్రహ్మమునందు సంకల్పములు (సంక ల్పమయమగు ప్రపంచము) సత్యరూపములై జనింపనేరవు. సముద్రము నందు అలలు పుట్టుచున్నను ఆఅలలు సముద్ర భిన్నములై సత్యరూపములై యుండనేరవుకదా. ఇట్లే సంకల్పము మొదలగునవి ఉన్నవని తలంపబడినను బ్రహ్మమాత్రములే అగునుగాని, బ్రహ్మకంటె వేరు కానేరవు. ఈవిధముగ బ్రహ్మమాత్రములే అగు పదార్థములకు ప్రత్యేకములగు ఉత్పత్తిస్థితి ప్రళ యములు కలవనుటకు వీలు లేదు కదా. ఈకారణమువలన ప్రపంచము పుట్టుటయే కల్ల యని చెప్పవలయును. ఓ శ్రీరామచంద్రా! ఇట్లగుటచేత శోకమనునదియే లేదు. మోహమును లేదు. పుట్టుకయు లేదు. పుట్టువా

డును లేదు. ఎప్పటికిని ఏ ఏకరూపమగు బ్రహ్మము కలదో, అదియే కలదు. రెండవది లేదు. కావున నిరర్థకముగ సంతాపము జెందకుము. రెండవపదార్థము లేకపోవుటచేత నీకంటె అన్యముగ సుఖదుఃఖములుగాని, లాభాలాభములుగాని, మఱి ఏజంటలుగాని, లేవు. ఆసుఖదుఃఖములు నిన్ను బాధించుటయు లేదు. కావున ఆజంటలను విడువుము. సత్వగుణమును ఆశ్రయింపుము. రజ స్తమోగుణముల చెంతకు బోవకుము. యోగక్షేమములను అభిలషింపకుము. కోరుటకుగాని, ద్వేషించుటకుగాని, నీకంటె అన్యమగు పదార్థము ఏదియు లేదు. స్వస్వరూపమును జెందుము. ఇదియు స్వాభావికమే అగుటచేత నీకు కష్టసాధ్యము కాదు. "నాకంటె రెండవదిలేదు." అను జ్ఞానమును దృఢముచేసికొనుము. అజ్ఞానమువలన సర్వదుఃఖములను పరిత్యజింపుము. నిరర్థకముగ పరితపింపకుము. సర్వ సమ చిత్తము గలిగి శాంతుడవై నిశ్చలమగు బుద్ధి గలిగి సర్వ సంకల్ప రాహిత్యమను మౌనమును బూని చిత్తమును బాహ్యావృత్తులపై బోనీక నశింపజేసి విచారశీలుడవై పరులతో సర్వ సంబంధములను వదలి "శ్రేష్ఠమగు రత్నమువలె" పరిశుద్ధుడవై నిలువుము. నిరర్థకముగ పరితాపమును జెందకుము. సుఖమునైనను దుఃఖమునైనను వచ్చినదానిని వచ్చినట్లు రాగ ద్వేష శూన్యమగు చిత్తముతో అనుభవించుచు ఏపదార్థమును గోరక సర్వమును స్వస్వరూపమాత్రమే అగుటచేత దేనిని విడువక దేనిని స్వీకరింపక పరిశుద్ధాత్ముడవగుము. ఇట్లుండిన నీకు ముక్తి దొరుకును. నిరర్థకముగ పరితాపము నొందకుము.

శ్లో ॥ యస్యేదంజన్మపాశ్చాత్యం తస్యైచైవ మహామతే ।
విశంతివిద్యావిమలా ముక్తా వేణుమివోత్తమమ్ ॥

ఓబుద్ధిమంతుడా! శ్రీరామా! నీకుగలిగినట్లు వివేకయుక్త సంకల్పములు అందరకును స్వాభావికముగ కలుగవు. "వెదురు చెట్టునకు అంతమున (పండుకాలమున) ముత్యములు బుట్టునట్లు" ఎవనికి ఉత్తరజన్మము కలుగదో అట్టివానికేగాని, ఈవివేకము ఉదయింపదు. మఱియు సదాచారసంపత్తి, పరుల చిత్తమును రంజింప జేయగల సామర్థ్యము, తనకంటె అధికులను జూచిన అసూయలేకుండుట, శత్రువులయెడలనైనను క్రోధములేకుండునట్టి శాంతస్వభావము, అన్నికార్యములను ఆచరించుచున్నను మనస్సుచేత వానినెల్లను విడచియుండుట, (ఇదియే జీవన్ముక్తి) యథార్థ స్వరూప విజ్ఞానము, అను గుణము లన్నియును "అంతఃపురమును స్త్రీ ఆశ్ర

యుంచినట్లు " ఉత్తర జన్మము లేనట్టి అమృహానుభావునే ఆశ్రయించును. " చెవులకు ఇంపగు ధ్వని కలుగుటచేత అన్యము ఏమియును తెలియకున్నను అరణ్యమృగములు పిల్లనగ్రోవిని అభిమాన పూర్వకముగ కోరునట్లు " ఏమియును తెలియలేకున్నను సామాన్య జనులు అతి మృదువగు ఆచారములచేత మనోహరుడై ఉన్నాడను కారణమువలన బ్రహ్మజ్ఞానియగు మహాత్ముని మిక్కిలి ప్రేమించు చుందురు. ఓకమలనేత్రా! శ్రీరామా ! ఇది సామాన్యమగు ప్రకారము. ఇట్టి జ్ఞానము కలిగిన ఎట్టివారును ముక్తులగుదురు. ఐనను ఇందొక విశేషము కలదు. దానిని వివరించెదను వినుము.

ఓ శ్రీరామచంద్రా! సంసార సముద్రమునందు బడి పొరలువారు కడతేరుటకు శ్రేష్ఠములగు రెండు మార్గములు కలవు. ఆమార్గములలో ఏది పట్టుపడినను విజ్ఞానముకలిగి మోక్షము దొరుకును. అందు గురువు ఉపదేశించిన విధులను అనుష్ఠించుచుండుటవలన క్రమక్రమముగ ఒకజన్మమునకుగాని, పెక్కుజన్మములకుగాని, ముక్తిసిద్ధిని జెందుట మొట్టమొదటి మార్గము. కొందఱు దీనిని ఆశ్రయించి క్రమక్రమముగ బహుకాలమునకు జ్ఞానవంతులై ముక్తిని జెందుదురు. ఇట్లుగాక ఆకాశమునుండియే ఆకస్మికముగ బడిన ఫలమువలె కొంచెము జ్ఞానముగల మనస్సునందు విచారవశము వలన బ్రహ్మజ్ఞానము ఆకస్మికముగ ఉదయించుట గలదు. ఇదియే రెండవమార్గము. ఇందు మొదటిది స్పష్టమే. కావున దానినిగూర్చి విశేషముగ చెప్పనక్కరలేదు. ఇక ఆకాశమునుండి పండుపడినట్లు ఆకస్మికముగ జ్ఞానము పుట్టునట్టి ప్రకారమును అభివర్ణించుటకై పురాతన వృత్తాంతమును ఒకదానిని వివరించెదను వినుము.

—— * జనకోపాఖ్యానము. * ——

ఓ శ్రీరామా! విదేహదేశమునకు ప్రభువై మహాబలవంతుడైయున్న జనకుడను ఒక మహారాజుగలడు. ఆయన మిక్కిలి గంభీరమగు చిత్తము గలవాడు. బుద్ధిమంతుడు. కావుననే తన బుద్ధిబలమువలన ఆపదలనెల్ల తొలగించి సంపదలను అభివృద్ధిగావించి రాజ్యమును పరిపాలింపుచుండెను. యాచక జనులకు కల్పవృక్షమై, మిత్రులను కమలములకు సూర్యుడై, ప్రకాశించుచుండెను. ఆయన ఒకనాడు మదించిన కోవెలలు మధురగానమును చేయుచు జనులను రంజింప జేయునట్టి వసంతఋతువునందు అరణ్యోత్సవమును అనుభవింప వేడుకతో - " ఇంద్రుడు నందన వనమును జేరునట్లు " మనోహరమగు తన ఉద్యానవనమును జేరెను. ఇట్లు జేరి పరివారమును

వెలుపట నిలిపి ఆజనకమహారాజు ఒంటరియై ఉద్యానవనమునందు ప్రవేశించెను. అచ్చట పొగడ పూలయొక్క మనోహరములగు వాసనలచేత ఇంపు గలిగించుచుండు పొదరిండ్ల చెంతల విహరించెను. ఓకమలలోచనా! శ్రీరామా! అట్లు విహరించుచుండగా, పర్వతములయందును గుహలయందును అరణ్యములయందును తపస్సు చేసికొనుచు నుండునట్టియు జనసమూహముతో సంబంధపడుటకు ఇష్టములేక సర్వకాలములయందును ఏకాంత ప్రదేశములనే కోరునట్టియు స్వభావముగల కొందరు సిద్ధులు అదృశ్యాకారులై ఆ ఉద్యానవనమునందు ఒక కానుగపొదయందు సంభాషించుకొనుచుండిరి. ఈజనకమహారాజు ఆపొద సమీపమునకు బోవునప్పటికి ఆత్మవిషయికములగు ఈక్రింది శ్లోకములను ప్రస్తావానుగుణముగ ఉదహరించుచుండిరి.

శ్లో॥ ద్రష్టృదృశ్య సమాయోగా త్ప్రత్యయానందనిశ్చయః।
యస్తం స్వమాత్మ తత్త్వోత్థం నిస్పందం స ముపాస్మహే ॥

పురుషుడు ఇష్టమగు పదార్థములను జూచినప్పుడు ఏ ఆనందమును జెందుచున్నాడో, అదియే బ్రహ్మానందము. దానికి చాంచల్యము లేదు. ఇదియే స్వస్వరూపము. తనకంటె జూచువిషయము భిన్నమని భావించు అజ్ఞానముచేతను, నాకు దుఃఖముకలదు అను మిథ్యాభావనచేతను, ఆ ఆనందమును విషయములవలననే కలిగినదానినిగా, భావించుచున్నారు కాని, అదిమాత్రము తనవలనగలిగినదియె. ఇట్లు ఆత్మస్వరూపమగు ఆనందమును ధ్యానించుచున్నాము. అని మొదటిసిద్ధుడు పలికెను.

శ్లో॥ ద్రష్టృదర్శన దృశ్యాని త్యక్త్వా వాసనయా సహ ।
దర్శనప్రథమాభాస మాత్మానం స ముపాస్మహే ॥

ప్రస్తుతము మనకు అనుభవములోనున్న చూచువాడు, చూపు, చూడబడునది, అనుమూటిని సంస్కారముతో కూడా వదలి, చూపుయొక్క ప్రథమరూపమగు ఆత్మను (మనకు అనుభవములోనున్న జ్ఞానమునకు పరిచ్ఛిన్నత్వము కలదని భావింపబడుచున్నది. వాస్తవస్థితిలో దానికి పరిచ్ఛిన్నత్వము లేదు. అజ్ఞానమునకు వాస్తవరూపము బ్రహ్మరూపమే ) ధ్యానించుచున్నాము. అని రెండవ సిద్ధుడు చెప్పెను.

శ్లో॥ ద్వయోర్మధ్యగతం నిత్య మస్తినాస్తీతిపక్షయోః ।
ప్రకాశనం ప్రకాశానా మాత్మానం స ముపాస్మహే ॥

ఉనికి, లేమి, రెండు పక్షములకు నడుమనున్నదియు (ఉన్నదనికాని,

లేదనికాని, చెప్పుటకు వీలు లేనిదియు, ఇంద్రియ గోచరములగు పదార్థములను గూర్చియే, ఉన్నది, లేదు, అను వ్యవహారములు జరుగుచుండును. ఈ బ్రహ్మము అట్టిది కాదు. కావున వ్యవహారములు సంభవింప వనుట. మఱియు ప్రపంచము అసత్పదార్థమునుండి పుట్టుటకు వీలు లేదు. కావున ఆబ్రహ్మము ఇంద్రియగోచరుడు కాకున్నను, శుద్ధ సత్తా స్వరూపుడు కావలయునని తాత్పర్యము.) శాశ్వతమైనదియు, సూర్య చంద్రాదుల సహితము ప్రకాశింపజేయునదియు, నగు ఆత్మరూపమును ధ్యానించుచున్నాము. అని మూడవ సిద్ధుడు చెప్పెను. (ఇచ్చట ఈసిద్ధుల వాక్యముల వలన గ్రహింపవలసిన విషయ మొకటి కలదు. మనకు అనుభవములో ఉన్న అనగా, ప్రియమగు పదార్థములను చూచినప్పుడు కలుగుచున్న ఆనందమును, వస్తువులను గ్రహించునప్పుడు సాధనముగానున్న జ్ఞానమును, " ఆకాశము ఉన్నది, వాయువు ఉన్నది " అని ప్రతిపదార్థముతోగూడ వ్యవహరింపబడుచున్న ఉనికిని, ఈ మూటిని మనము పరిచ్ఛిన్నములనుగ అనగా, సర్వ పదార్థములయందును ప్రత్యేకించి యుండువానినిగ దలంచుచున్నాము. దీపములు రెండుగనున్నను, అగ్ని యొకటియే కావున వానికి ఉపాధిభేదము మాత్రమే తప్ప పారమార్థిక భేదము లేనట్లు ఈ ఆనంద జ్ఞాన సత్తలుకూడ వేరు వేరుగ గానవచ్చినను, స్వరూప మొకటియే కావున బాగుగ విచారించినచో, వానికి పరస్పర భేదము లేదు. కావున భేదమును భావించుట అజ్ఞానమే. ఇట్లు అజ్ఞానమువలన ప్రత్యేకముగ భిన్నభిన్నములని భావింపబడు ఆనంద, జ్ఞాన, సత్తలే జీవుడు. జ్ఞానదృష్టిచేత విచారించి " అంతటను దోచు ఆనందమును, సర్వ జ్ఞానములును, సర్వపదార్థములయందును, గల సత్తలును, ఒకటియే. ఇందు దేనికిని భేదములు లేవు. ప్రపంచమంతయు ఆనంద జ్ఞాన సత్తామయమే " అని గ్రహించిన నదియే అనగా, అట్లు సర్వవ్యాపకములుగ గ్రహింప బడిన ఆనంద, జ్ఞాన, సత్తలే, పరబ్రహ్మము. " జీవరూపముగాని, బ్రహ్మరూపముగాని, ఈ ఆనంద, జ్ఞాన, సత్తలలో, నొకటిమాత్రమే " అని-కాని " ఇందు దేనికది వేఱువేఱుగ జీవబ్రహ్మల రూపములగును " అని కాని, చెప్పగూడదు. ఆనందరూప జీవబ్రహ్మలు, అని ప్రత్యేక భేదము ఉండుట ఎట్లును సంభవింపదు. సమాన స్వభావము గలవారలు సమానకార్యములు ఆచరించువారలు ముగ్గురు ఉన్నారనిన వారి పరస్పర భేదమును నిరూపించుట అశక్యముకదా. మఱియును ఈ ఆనందాదులు బ్రహ్మజీవులకు స్వరూపములే అగుటచేత ప్రత్యేకములై యుండు

టకు వీలు లేదు. దీర్ఘత్వమును కఠినత్వమును స్తంభమునకు రూపములనిన నవి ప్రత్యేకించి [ దీర్ఘత్వము వేరుగాను, కఠినత్వము వేరుగాను ] ప్రత్యేకించి యుండక సముదాయ రూపములయ్యే స్తంభమునకు ఆకారము లగుచున్నవి కదా. " ఆ స్తంభము ద్రవ్యము కావున దానిని దీర్ఘత్వ కఠినత్వములు ఆశ్రయించినవి. ఇచ్చట బ్రహ్మము ద్రవ్యము కాదుగదా " అనియెదవేయో, సిద్ధాంతమును అనుసరించి అన్నిటికిని నామ రూపాతిరిక్తమగు రూపము లేకపోవుటచేత దీర్ఘత్వాది రూపమే స్తంభము. అనగా, దీర్ఘత్వాదులవలన బ్రహ్మమునే స్తంభమునుగ భావించుచున్నారు. కావున ప్రత్యేక ద్రవ్యమే లేదు. ఆనందాదులును గుణములు కావు. తగిన దృష్టాంతము లోకమునందు లేకపోవుటచేత కొంతవఱకు సదర్శనమును జూపుటకై ఇట్లు చెప్పబడెనే కాని, వేరుకాదు. బ్రహ్మము ద్రవ్యమైనచో, ఆనందాదులు దానికి గుణములైనచో, గొంతకాలమునకు అది ఆవశ్యకముగ నశింపవలసి వచ్చును. ఇది సమ్మతము కాదుగదా. కావున ఆ ఆనంద జ్ఞాన సత్తల సముదాయమే బ్రహ్మము. ) పిమ్మట నాలుగవ సిద్ధుడు ఇట్లనియె.

శ్లో॥ సశరసరఁం హకారాది మశేషా కారసంస్థితమ్ ।
అజస్ర ముచ్చరంతంస్వ మాత్మానంస ముపాస్మహే ॥

సర్వరూపుడై శరీరములయందు నిలచి ( సోహం ) అను మహామంత్రమును సర్వకాలములయందును ఉచ్చరించుచు " ఆ బ్రహ్మమే నేను " అని ప్రకటించుచున్న జీవాత్మను ( స్వస్వరూపమును ) ధ్యానించుచున్నాము. అని ఇట్లు ఆ నలువురును సంభాషించుకొను వాక్యములను ఆ జనకమహారాజు ఆలకించెను. మఱియును ఆ సిద్ధులు ఒకరితోనొకరు ఇట్లని ప్రసంగించుకొన నారంభించిరి.

శ్లో॥ సంత్యజ్య హృద్గుహేశానం దేవమన్యం ప్రయాంతియే ।
తేరత్న మభివాంఛంతి త్యక్త్వాహస్తస్థ కౌస్తుభమ్ ॥

ఏ పురుషుడు మూఢుడై తన హృదయమునందు ఉన్న ప్రభువును గానలేక అన్యదేవతను ఆశ్రయించునో, వాడు చేతనున్న కౌస్తుభరత్నమును విడచి గాజురాయికొఱకై వెదుకులాడు వాడె.

శ్లో॥ సర్వాశాః కిలసంత్యజ్య ఫలమేత దవాప్యతే ।
యేనాశా విషవల్లీనాం మూలమాలా విలూయతే ॥

ఈ పరబ్రహ్మప్రాప్తి ఆశలను అన్నిటిని విడచినంగాని కలుగదు. మనస్సు అంతర్ముఖమై బ్రహ్మవైపునకు దిరిగెనేని అప్పుడె ఆశలను విషల

తలు సమూలముగ తెగిపోవును.

శ్లో॥ బుద్ధ్వాప్యాద్యంత వైరస్యం యఃపదార్థేషు దుర్మతిః ।
బధ్నాతి భావనాంభూయో నరోనాసౌ సగర్దభః ॥

ఏ దుర్మతియగు మనుష్యుడు "పదార్థములు సంపాదింపక పూర్వమునను అనుభవించిన పిమ్మటను దుఃఖము కలిగించునవియే. అనుభవించిన క్షణకాలము మాత్రము సుఖకరములుగా ఉన్నట్లు తోచును." అని అనుభవము చేత ఎఱిగియును ఆ పదార్థములనే కోరుచున్నాడో అట్టి వాడు మనుష్యుడే కాడు గాడిదె.

శ్లో॥ ఉత్థితానుత్థి తానేతా నింద్రియారీ౯ పునఃపునః ।
హన్యాద్వివేక దండేన వజ్రేణేవ హరిర్గిరీ౯ ॥

కావున వివేకవంతుడగువాడు అణచినను మఱల మఱల పైకి వచ్చుచున్న ఇంద్రియ శత్రువులను, "ఇంద్రుడు వజ్రాయుధముచేత పర్వతములను గొట్టినట్లు" వివేకమను దండము చేత కొట్టవలయును.

శ్లో॥ హస్తంహస్తేన సంపీడ్య దంతైర్దంతా౯ విచూర్ణ్యచ ।
అంగాన్యంగైస్సమాక్రమ్య జయేదాదౌ స్వకంమనః ॥

చేతులను చేతులతో పిసికికొనియైనను దంతములను దంతములచేత కొరికికొనియైనను అవయవములను అవయవములచేత బంధించి మొట్టమొదట మనస్సును జయింపవలయును.

శ్లో॥ ఉపశమసుఖ మాహరేత్పవిత్రం
శమవశతశ్శ మమేతిసాధుచేతః ।
ప్రశమితమనసః స్వకేస్వరూపే
భవతిసుఖేస్థితి రుత్తమాచిరాయ ॥

మనస్సు ప్రభువు. ఇంద్రియములు దాని భృత్యులు. కావున పురుషుడు మొట్టమొదటనే మనోనిగ్రహము చేయలేకున్న హస్తపాదాది రూపములగు ఇంద్రియములను నిగ్రహించినం జాలును. మనస్సు సంకల్పింపగలుగునేగాని, మనుష్యుని లేవనెత్తి నడిపింపనేరదు గదా. కావున మనస్సు ఎట్లు సంకల్పించినను పురుషుడు కొంత ప్రయత్నించినచో, కదలక కూర్చుండ వచ్చును. కన్నులను మూసికొన వచ్చును. హస్తములను కగలింపక ఊరకుండ వచ్చును. కర్ణములనుకూడ మూసికొనవచ్చును. ఇట్లు చేయుట చేత మనస్సునకు క్రమక్రమముగ కొంతప్రచారము క్షీణించును. ఇట్లు క్షీణించుచు వచ్చిన ఆమనస్సు స్వాధీనము అగును అనుటకును, శాంతి

నొందును అనుటకును సంశయము లేదు. ఇట్లు ప్రయత్నపూర్వకముగ
శాంతిని సంపాదింప వలయును. ఇట్లు ఇంద్రియములను బాగుగ నిగ్రహిం
చుటయు, ఏవిషయముల గోరకుండుటయు, స్థిరమయ్యేనేని మనస్సు సంక
ల్పములను జేయుటనుమాని సంపూర్ణముగ వినాశమునొందును. ఇట్లు మన
స్సు నశించెనేని అట్టివానికి పరబ్రహ్మమునందలి స్థితి నిశ్చయమగును.
బ్రహ్మానందము శాశ్వతమగును. ఓ శ్రీరామచంద్రా! ఈవిధముగా, జరిగిన
సిద్ధులయొక్క పరస్పర సంభాషణములను విని ఆ జనకమహారాజు "భయశీ
లుడు రణభేరిని విని బెదరునట్లు" సంసార దోషములను విని బెదరెను. ఇట్లు
బెదరి తనగృహమునకువచ్చి సకల పరివారజనముల పంపివేసి ఏకాకియై "సిం
హము పర్వతగుహను ప్రవేశించినట్లు" గృహమునందలి ఏకాంత స్థానమును
ప్రవేశించెను. అచ్చట ఏకాంతమున నివసించి "ఎగయుచున్న పక్షిరెక్క
లవలె" అతి చంచలములైయున్న లోకస్వభావములను తలంచితలంచి ఇట్లని
వ్యసనపడసాగెను. ఆహా, లోక స్వభావములు మిక్కిలి చంచలములైనవి.
నేనుమిక్కిలి దుఃఖకరములగు వీనియందుబడి "రాళ్ళనడుమ చిక్కి గిరగిర
తిరుగుచు తునిగిపోవుచున్న చిన్నరాతివలె" ఖండింపబడు చున్నాను. ఇది
ఏమి? ఛీ, నాబ్రతుకేల? కాలము అపరిమితమైయుండగా, అందు నా ఆయు
ష్కాలము ఎన్నవభాగము? కోటిభాగమైన నుండునో, లేదో, ఇంతమాత్ర
మునకు నాకు ఇంతఆశ ఏల? ఈపదార్థము నాది, ఇది నాకు కావలయు
ను, ఇది నాకు అక్కరలేదు, అనుతలంపులేల? ఈరాజ్యము మరణకాలము
వరకును ఉండునని తలంచినను ఇది ఎంత? మృతిజెందిన పిమ్మట ఇది నాద
గునా? ఇంత అల్ప సుఖమునందు మనస్సును చిక్కించి దీనికై బహుప్రయ
త్నములను చేయుచు కడతేరుమార్గముల వెతకికొనక ఇట్లు దుర్బుద్ధినై
యుంటినేల? బాగుగ విచారించినచో, ఈప్రపంచమున సత్యమైనదియు,
మనోహరమైనదియు, శ్రేష్ఠమైనదియు, కల్పితము కానిదియు, నగు పదా
ర్థము ఒక్కటియు లేదు. ఇట్లున్నను నేను ధైర్యవంతుడనై యున్నాను.
ఈధైర్యము దేనిని అవలంబించి వచ్చినది? ముందుచూచినను, వెనుకచూచి
నను, అసత్యమగు ఈప్రపంచ మధ్యమునందు గతి ఏదియు లేదుకదా? వివే
కమునందును ధనమునందును సర్వాధికులై యున్నవారు సహితము కాల
క్రమమున పడిపోవు చున్నారు. ఓచిత్తమా! నీవు గొప్పతనమునందు అన
గా "నేను గొప్పవాడనుగా ఉన్నానుగదా, నాకు కొఱతఏమి" అనినమ్మ
కము ఎక్కడినుండి కలిగినది. పూర్వకాలమునందు అతిప్రసిద్ధములగు ఐశ్వ

ర్యములను, వానివలన గలుగు సుఖములును, వివేకవంతులును, మిత్రులును, బంధువులును, వీరలందరును ఎందరికోయుండిరి. ఎందరికో నశించిపోయిరి. ఇట్లు సర్వమును నశించునదియై యుండగా ప్రస్తుతము ఉన్నవానిని మాత్రము ఎట్లు విశ్వసింతుము. పూర్వమునందు రాజ్యము చేసిన రాజులయొక్క ధనములు ఎందున్నవి? బ్రహ్మచేత ప్రతికల్పమునందును సృష్టింపబడిన ప్రపంచములన్నియు ఎందున్నవి? అవియన్నియు ప్రకృతిసంబంధము కలవియగుటచేత కాలానుసారముగ నశించినవే కదా? ఇట్లన్నియు బోవుచుండగా నేనుమాత్రము స్థిరముగ నుందునని ఏమినమ్మకము. అనేక కోట్ల సంఖ్యలుగల బ్రహ్మదేవులును, లెక్కకు మిక్కిలిగ స్వర్గములును నశించినవి. రాజులు దుమ్ముపలె ఎందరో ధ్వంసమైరి. ఇట్లుండగా, నేనుమాత్రము ఎల్లకాలమును ఉందునని ఏమిస్థైర్యము. సంసారమనియెడు రాత్రియందు శూన్యరూపమైన ఈదేహము భ్రాంతిచేత స్వప్నమువలె కానబడును. ఇది సర్వమునకు అనర్థకారి. కావున ఈస్వప్నము ( దేహమును ఆత్మగా అభిమానించుట యను స్వప్నతుల్యవిషయము ) దుస్వప్నము. ఇట్టిదానియందు నాచిత్తము ఇదివరకు దృఢ విశ్వాసము కలిగియుండినది. ఎప్పటికిని ఇట్లేయుండిన ఛీ, నాబ్రతుకు ఏమిబ్రతుకు? మొట్టమొదట భ్రాంతినొందినను కొంతకాలమునకైనను తత్వము తెలిసికొననక్కఱలేదా? ఇదివరకు ఎన్నిదినములో గడచిపోయినవి. ఇప్పటికిని ఎన్నియో గడచిపోవుచునేయున్నవి. ఎప్పటికిని శాశ్వతమగు పదార్థము గల దినము ఒకటియు గానరాలేదు. ఏదినమునందు దేనిని జూచినను నశించునదియే కాని, స్థిరమైనది ఒకటియు లేదు. లోకమునందు కొన్ని పదార్థములు అనుభవమధ్యమున మనోహరములై యుండును. కొన్ని మొట్టమొదట దుఃఖరూపములుగ గానవచ్చుచున్నను తుదకు పరమానందకరము లగుచుండును. మఱికొన్ని మొట్టమొదట మాత్రము సుఖకరములుగనుండి తుదకు కష్టమును కలిగించును. ఈమూడువిధములగు పదార్థములును సామాన్యముగ అపవిత్రములే. నశించునవియే. ఇట్లగుటచేత అనుభవమునకు తగినవియే. కావున జనులు అజ్ఞానమువలన ముందువెనుకను విచారింపక తానున్నస్థితియందే ( సంసారమునందే ) ఉండునేని ఎప్పుడు దినదినమునకు పాపభూయిష్ఠములైనట్టియు, మిక్కిలి కౄరములైనట్టియు, బహువిధ దుఃఖములు కలిగించునట్టియు, అవస్థలనే పొందుచుండును కాని, ఎప్పటికిని కడతేర నేరదు. కడతేరుటకు అవకాశము ఎక్కడకలదు?

శ్లో ॥ అజ్ఞానైకహతో బాల్యే యౌవనే వనితాహతః ।
శేషే కళత్ర చింతార్తః కింకరోతు కదాజడః ॥

బాల్యావస్థయందు అజ్ఞానవశముచేత ఏమియునెఱుగడు. యౌవ్వన
మువచ్చెనేని కొంతజ్ఞానము కలిగినను దానిని పరమార్థ విషయమునందు
పోనీక కామ పిశాచము బాధింపనారంభించుటచేత స్త్రీచింతగలవాడ
గును. వార్ధక దశయందన్ననో, కామాదులు లేకున్నను స్త్రీచింత కలుగకు
న్నను కుటుంబ విషయకములగు కలతలు మనస్సును బాధించును. ఇట్లుం
డుటచేత జడుడైన మానవుడికి పరమార్థవిచారమునకు అవకాశము ఎక్క
డనుండి వచ్చును. కావలయునని ప్రయత్నపూర్వకముగ సంసార చింతల
నెల్ల పరిత్యజించి పరమార్థ విచారమును జేయవలయునేకాని, " నేనుబా
లుడను, ఇప్పుడే అవసరమేమి, పరమార్థ విచారమును వెనుక చేయవ
చ్చును " అని ఉపేక్షింప నారభించిన ఆవిచారమునకు అవకాశము ఎప్ప
టికిని కలుగదు. ఈలోకమునందు " కలదు " అనబడు పదార్థములయొక్క
శిరమున అభావము కలదు. " రమ్యము " అనుదానియందు రమ్యము కా
కుండుటయును ఉన్నది. సుఖములయందు దుఃఖముకలదు. (అనగా " కలదు
అని భావింపబడుచున్నదియే అల్పకాలమున లేనిదగుచున్నది. మనోహర
మగు పదార్థమే కొంతకాలమునకు అనిష్టమై మారుచున్నది. సుఖమే కొం
తసేపునకు దుఃఖమగుచున్నది " అనుట ) ఇట్లుండగా, నేనుఏపదార్థమును
ఆశ్రయించి సుఖింతును. ఏమహాత్ములయొక్క రెప్పపాటులే ప్రపంచము
నకు ఉత్పత్తి ప్రళయములను కలిగించునో, అట్టి పురుష శ్రేష్ఠులుకూడ
ఉన్నారు. అట్లుండగా, ఇక మన ఆధిక్యమనగా, నెంత? మఱియును లోక
మునందు " ఇవి సంపదలు, ఇవి ఆపదలు " అను విభాగమే నాకు గాన
వచ్చుట లేదు. పరులకు మహాసంపదలుగా తోచుచున్న పదార్థములు సం
పూర్ణముగ నుండినను, మనస్సునకు ఏదియో ఒక కారణమున ( అధికమగు
దుఃఖము మొదలగు కారణముల వలన ) వానియందు సమ్మతి లేకుండిన
( అనగా, మనస్సు వానిని అభిమానింపకుండిన ) అవి దుస్తరములగు మహా
దుఃఖము లగుచున్నవి. ప్రతిపురుషుడును చిత్తస్వాస్థ్యము లేని సమయము
నందు " ఇవినాకేల " అనుచు తనకు గల సమృద్ధిని నిందించుట ప్రత్యక్ష
సిద్ధము కదా. మఱియును ఇట్లే మనస్సు సంతోషముతో కూడియున్న
ఎట్టియాపదలు తటస్థించినను వానిని సంపదలుగనే భావించుటయు కలదు.
" నాకుటుంబమంతయు సిరపాయముగ నున్నచో బిచ్చమెత్తియైనను జీవన

ము చేయవచ్చును " అను మొదలగు తలంపులు లోకమునందు ప్రత్యక్షములే కదా? కావున " సుఖము " అనునదియే లేదనవలయును. " మనస్సు దేనిని సుఖముగ భావించునో, అదియే సుఖము. దేనిని దుఃఖముగా భావించునో, అదియేదుఃఖము" అనిమాత్రమే సిద్ధాంతము చేయవలసి యున్నది. నిశ్చయమే. ఈదేహమునందు వాస్తవమైన సుఖము ఎక్కడినుండి వచ్చును? సంసారమనునది దుఃఖమునకు పొలిమేర. దాని మధ్యమునయున్న ఈశరీరము మాత్రము ఎట్లు సుఖసాధన మగును? కావున బాగుగ విచారించినచో, రాగద్వేషాది రూపములగు వేనవేలు మొలకలతోను, పుత్ర మిత్రాదిరూపములగు శాఖలతోను, శరీరమను స్వరూపముతోను, సుఖదుఃఖ రూపములగు ఫలములతోను, విషయములనెడు చిగుళ్ళతోను ( శబ్ద స్పర్శ రూప రస గంధములైదును విషయములు. లోకమునందు వీనిలో దేనినో ఒకదానిని పొందియున్న పదార్థమే అనుభవయోగ్యము అగుచున్నది. ఈవిషయములతో సర్వపదార్థములును సంబంధించియే యుండును. అని తెలిసికొనవలయును. ) కూడియున్న ఈసంసార వృక్షమునకు మనస్సే మూలమని నిశ్చయింపవలసి యున్నది. సర్వమును మనోధీనమే. మనస్సునకు సంకల్పమే రూపము. కావున ఈ సంసారమునకుగూడ స్వంకల్పమే రూపమని తలంచెదను. నిశ్చయముకూడ ఇదియేయని లోకానుభవము వేనోళ్ళ స్పష్టము చేయుచున్నది. కావున నేను ప్రయత్న పూర్వకముగా సంకల్పములను శాంతినొందించెదను. అంతటితో ఈ సంసారవృక్షము సమూలముగ ఎండిపోవును.

శ్లో ॥ ప్రబుద్ధోస్మి ప్రబుద్ధోస్మి దృష్టశ్చోరో మయాత్మనః ।
మనోనామనిహన్మ్యేనం మనసాస్మి చిరంహతః ॥

ఆహా! ఇప్పటికి మేలకువ వచ్చినది. ఇప్పటికి మెలకువవచ్చినది. ఇప్పటికి స్వస్వరూపమును దొంగలించిన దొంగ దొరకినాడు. వాడుమనస్సే. నన్ను మోసగించి వాడు బహుకాలమునుండియు బాధించు చున్నాడు. ఇక వీనిని విడువను. సంహరించెదను. భగవంతుడు నాకు మనస్సనియెడు ముత్యమును ఇచ్చియున్నాడు. ఇంతకాలమువరకు ప్రమాదమువలన నేను దానిని వేధింపకుంటిని. ( " బాధింపకుంటిని, లేక, జయింపకుంటిని " అని మనఃపరమగు అర్థము. " రంధ్రము వేయకుంటిని " అని మౌక్తికపరమగు అర్థము. ) ఇప్పుడు ప్రమాదము నశించినది. ఇక దానిని బాగుగ వేధించెదను. అప్పుడు దానికి గుణసంబంధము కలుగును. ( " జయింప

బడిన మనస్సు సద్గుణము జెందును " అని మనఃపరమగు అర్థము. " రంధ్రము వేసిన పిమ్మట ముత్యమును దారమునందు కూర్పవచ్చును. " అనునవి ముక్తికపరమగు అర్థము. ) నేడు విద్వాంసులును సత్పురుషులు నగు ఆసిద్ధులు నాకు చక్కని జ్ఞానమును కలిగించిరి. సంసారము దుఃఖమయమనియు ఆత్మయే పరమానంద రూపుడనియు బాగుగ గ్రహించితిని. ఇకను ఆయాత్మనే అనుసరించెదను.

శ్లో॥ అయమహామిద మాతతం మమేతి
స్ఫురితమపాస్య బలా దసత్యమంతః ।
రిపుమతి బలినం మనోసిహన్మి
ప్రశమముపైమి నమోస్తుతే వివేక ॥

ఓవివేకమా ! నీకు నమస్కారము. నీఅనుగ్రహమువలన " నేను ఇట్టివాడను. ఇది ఎల్లను నాది " అని భావింపబడుచున్న ఈ అసత్య పదార్థములనెల్ల సంపూర్ణముగా విడచి ( అన్నిటియందును వైరాగ్యముకలిగి ) మహాబలవంతుడగు మనశ్శత్రువును నిగ్రహింప గలుగుచున్నాను. శాంతిని జెంద కలుగుచున్నాను. ఓ శ్రీరామచంద్రా ! ఈ విధముగా ఆలోచించి ఆజనకమహారాజు " చిత్తరువునందు వ్రాయబడిన ప్రతిమవలె " నిశ్చేష్టుడై మాత్రమే నిలచెను. మనస్సు స్వస్వరూప జ్ఞానముచేత భేదసంకల్పములను విడిచి శాంతమయ్యెనేని ఇక కార్యమేమియు లేదుకదా. ఇట్టి స్థితియే సమాధి యని ఇదివరకే పలుమారు చెప్పియున్నాను. ఈవిధముగా బహుకాలము అట్లే నిలచియుండగా ఒకానొక సమయమునందు మరల మెలకువ వచ్చెను. ఆతని చిత్తము సంక్షోభములేక, శాంతినొంది యుండెను. ఇట్లు మేలుకొని యా జనకమహారాజు సర్వప్రజలకును తానే ఆధారభూతుడు అగుటచేత మరల ఇట్లని విచారించెను. ఇప్పుడు ప్రయత్నపూర్వకముగా నేను దేనిని సాధించుచున్నాను ? ఏ పదార్థము నేను సంపాదింప వలయును ? నిత్య పరిశుద్ధుడనై సర్వపరిపూర్ణుడనై ఉన్న నాకు భేదము ఎక్కడిది ? భేదము లేకున్నప్పుడు నేను సంపాదింపవలసిన పదార్థము ఒకటి కలదనుట ఎట్లు సంభవించును ? మఱియును ఇక మీదట నేను రానిదానిని కోరను. వచ్చిన దానిని విడువను. నిత్యశుద్ధుడగు ఆత్మయందే నిలచి యుందును. ఇక నాకు వదివచ్చిన దానిని రానిమ్ము. ఓ శ్రీరామచంద్రా ! ఈవిధముగా, నిశ్చయించి ఆ జనకమహారాజు " ఏకార్యము ఎప్పుడు చేయువలసి వచ్చిన ల కార్యమును అప్పుడు రాగద్వేష శూన్యమగు వృత్తితో

చేయుదును గాక ” అనుచు నచ్చటినుండి లేచెను. సూర్యుడు ఏ యుద్దేశ మును లేక, నియమానుసారముగ సంచరించుచు రేయింబగళ్ళను గలుగ జేయుచున్నట్లు సర్వమును సమయానుకూలముగ జేయ నుద్దేశించుకొనెను. పిమ్మట రాజ్యభారమునెల్ల నిర్వహించుచునే ఉండెను. ఆసమయముల యందు ఆ జనకమహారాజు గడచిపోయిన దానిని గూర్చి చింతించువాడు కాడు. రాబోవుదానికై విచారించువాడును కాడు. జరుగుచున్నది మాత్ర ము ఇష్టమైనను అనిష్టమైనను నవ్వుచున్నవానివలె రాగద్వేష శూన్యుడై దానిని అనువర్తింపు చుండును. ఈవిధముగ ఓ కమలలోచనా ! శ్రీరామా ! ఆజనకమహారాజు సంపూర్ణముగ విచారించిన వాడగుటచేత ఆప్రభావము వలననే ఆత్మరూపమును చెందెను. ఇంతయేకాని, ఆత్మ సంపాదనమునకై క్రొత్తకార్యమును దేనిని ఆశ్రయించినవాడు కాడు. ఓ రామభద్రా ! శ్రీరామా ! వాస్తవస్థితిలో అతిమనోహరమై పూర్వాపరవిచార యు క్తమై ప్రకాశించు బుద్ధియను స్నేహితుడు మాత్రమే పురుషుని ఉత్తమ స్థానమును జెందింప గలుగును గాని, ఇతర కర్మలు ఏవియు నట్లు చేయనే రవు కదా ? ఆత్మ కేవలము భ్రాంతివలన మాత్రమే తెలియబడునట్లు తోచుచున్నాడు. ఈ భ్రాంతియు బుద్ధికే అధీనము. కావున నిది తొలగుటకు బుద్ధిసాధ్యమగు విచారమే, తగును కాని, అన్యము ఏదియు తగదు అనుట నిర్వివాదాంశము. ఒకడు త్రాటిని చూచి సర్పమని భ్రమించిన వానికి “ ఇది. త్రాడా, పామా ” అను విచారము కలిగినప్పుడు మాత్రమే ఆభ్రాంతి తొలగునుగాని, ఇతరక్రియలచే తొలగదు కదా ? కావున నీవును విచారవంతుడవు అగుటచేత పొందదగిన విషయమును పొందితివి. దీనికై క్రొత్తగా జేయవలసిన కార్యము ఏదియు లేదు. లోకమునందు మోక్షేచ్ఛ గలవారు అందరును ధనాది బాహ్యవిషయములను సంపాదించుటకై ఎంత పూనికతో ప్రయత్నింతురో, అంతకంటెను అధికమగు పట్టుదలతో జ్ఞానాభివృద్ధికై (చిత్తశుద్ధికై ) మొట్టమొదట ప్రయత్నింపవలయును. అపరి శుద్ధ చిత్తమే ( విచారశూన్యతయే ) సర్వదుఃఖములకును పొలిమేర. సర్వ విధములగు ఆపత్తులకును భాండాగారము. సంసారమగు వృక్షమునకుబీజము. ఇట్టి అపరిశుద్ధ చిత్తమును (చిత్తమునందు గల అవివేకమను మాలిన్యమును) నశింప జేయవలయును. పురుషుడు వివేకి అయ్యెనేని వానిహృదయ కోశము నందుగల ఈప్రజ్ఞ చింతామణిని బోలును. కల్పవృక్షమువలె కోరిన కోరిక లను ఇచ్చును. ఇట్లు చిత్తపారిశుద్ధ్యము కలిగి ఆత్మానాత్మల విభాగింప

నేర్చి అనాదినుండియు వచ్చుచున్న ప్రపంచవాసనలకు లోబడక సర్వజ్ఞుడై యున్న మహాత్ముని, "కవచాదులు ధరియించి దృఢముగ దేహరక్షణ గావించుకొనియున్న వీరుని బాణములు ఏమియును చేయలేనట్లు" ఆశల వలన కలుగు దోషములు ఇంచుకయైనను బాధింప నేరవు. జడరూపము గలిగి నల్లనై (అపరిశుద్ధమై) అతివిస్తారమై మిక్కిలి మదించియున్న అహంకారమను మేఘము ఆత్మయను సూర్యునకు కప్పుకొని యున్నది. అది ప్రజ్ఞయను గాలిచేత మాత్రమే తొలగిపోవును. కావున ఎట్లు చూచినను మోక్షార్థి యగువాడు మొట్టమొదట బుద్ధినిమాత్రమే లాలింప వలయును. (శోధింపవలయును.) లోకమునందు ఉత్తమమగు పంటను కోరు పంట కాపువాడు మొట్టమొదట భూమిని మాత్రమే కదా, సంస్కరించును.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉపశమ ప్రకరణమున జనకోపాఖ్యానమను
పందొమ్మిదవ సర్గము ముగిసెను.

---

ఓ భరద్వాజా! ఇటు శ్రీవశిష్ఠమహాముని జనకోపాఖ్యానమును చెప్పి శ్రీరామచంద్రునిజూచి మఱల ఇట్లనియె. ఓరామభద్రా! శ్రీరామా! వినుము. ఆ జనకమహారాజునకు సిద్ధవాక్య శ్రవణము వలన ఆకస్మికముగ జ్ఞానోదయము కలిగి చిత్తశాంతి సంభవించినది. ఇట్లేగాక, స్వయముగను అనేక సాధనాంతరములతోను కూడ ఈ జ్ఞానమును సంపాదించిన వారు కలరు. ఏ విధముగనైనను పరాత్పరుడగు పరబ్రహ్మమును తెలిసికొనిన యెడల తత్క్షణమే విపరీత భావనలన్నియు సమూలముగ నశించును. ఆవిప రీత భావనలే మోహమను విషవృక్ష బీజములకు ఆధార స్థానములు. సకల విధములగు ఆపత్తులకును ప్రకాశకములు. కావున నివి నశించుటయేకదా? పరమ పురుషార్థము. మఱియును ముముక్షువగువాడు ప్రతిదినమును, లేక, సర్వకాలములయందును లోలోన సర్వరహస్యార్థములను విచారించు చుండ వలయును. అప్పుడు క్రమక్రమముగా "ఈప్రపంచము అనిత్యమైనది. బ్రహ్మో భిన్నమైనది. కావున వాస్తవముగ శూన్యరూపమైనది. అను జ్ఞానము అలవ డును. ఇట్లైనచో, జనకమహారాజునకు వలెనే క్రమక్రమముగ ఆత్మప్రసా దము (ఆత్మజ్ఞానము) స్వయముగనే కలుగును.

శ్లో॥ నదైవం నచ కర్మాణి నధనాని నబాంధవాః ।
శరణం భవభీతానాం స్వప్రయత్నాదృతేనృణామ్ ॥

ఓ శ్రీరామా ! సంసారభయము నొందిన మనుష్యులకు ఎప్పటికిని స్వప్రయత్నమునకంటె అధికమగు రక్షకము లేదు. రామకృష్ణాది దైవములుకాని, యజ్ఞాది కర్మలు కాని, ధనము కాని, బంధువులు కాని, వానికి ఏ విధమగు ఉపకారమును చేయుటకు, సమర్థులు కానేరరు. ఆత్మ స్వయముగా సర్వవ్యాపకుడు. ఈ విషయము తెలియబడకుండుటచేత అజ్ఞానము వలన "ఈకరచరణాదులతోగూడిన ఈ అల్పశరీరమే నేను" అని ప్రతి పురుషుడును తలంచుచున్నాడు. ఆ అజ్ఞానము విచారదృష్టిచేత తొలగిన స్వాభావికమగు సర్వవ్యాపకత్వము తెలియవచ్చు ననుటలో సంశయమేమి? (సంశయములేదు) "ఈ అల్పశరీరమే నేను" అను భావన అంధకారమువలె సర్వజనచిత్తములను ఆవరించి యున్నది. విచార ప్రభావముచేత ఆ అంధకారము నశించిన అపరిమితముగా స్వస్వరూప ప్రకాశము వెలుగు ననుటలో సంశయమేమి ? (సంశయములేదు) ఇదియేకదా ఉత్తమస్థితి. ఓ శ్రీరామచంద్రా ! బంధమనగా, ఏది యో యని తలంపకుము. ఆత్మరూపము ఏకమై సర్వాత్మకమై యుండ జనులు (అజ్ఞానమువలన) కొన్నిటిని అంగీకరింప దగినవానినిగాను మఱికొన్నిటిని విడువ దగినవానినిగాను తలంచుచున్నారు. ఇదియే బంధమునకు స్వరూపము. కావున ఓ రామభద్రా ! నీవు విడువదగినవనుచు గొన్ని పదార్థములయందు ద్వేషబుద్ధి నుంచకుము. అంగీకరింప దగినవనుచు గొన్ని పదార్థములను అభిలషింపకుము. ఇట్లు ఈ రెంటిని విడిచి మిగిలిన దానియందు (సర్వాత్మకమగు బ్రహ్మమునందు) స్థిరుడవు కమ్ము.

—* సమదృష్టి కలవాని లక్షణము. *—

ఓ రాజీవలోచనా ! రామా ! పైన వర్ణించిన విధముగా ఏ మహాత్ముడు "ఇవి విడువదగినవి, ఇవి అంగీకరింప దగినవి" అను భేదములు లేక, సర్వపదార్థములయందును సమభావముతోనుండునో, అట్టి వానిని సుగుణములన్నియును అప్రయత్నముగనే ఆశ్రయించును. ఆగుణములవలన వానిమనస్సునకు సంసార మేమియు కలుగదు. (అనగా లోకమునందు పాపకర్మలను ఆచరించువాని మనస్సు ఎప్పటికిని అట్టిసంకల్పమునే చేయుచున్నట్లును, పుణ్యకర్మలను ఆచరించువాని మనస్సుకూడ అట్టి సంకల్పమునే ఆచరించునట్లును ఈ సమదృష్టి కలవాని మనస్సు తదాశ్రిత గుణానుసారములగు సంకల్పములను ఆచరింపవనుట.) ఆశ లేకపోవుట, భయము లేకుండుట, ఎల్లప్పుడును ఏకచిత్తముతో నుండుట, శత్రుమిత్రులయందును భేదబుద్ధి లేకుం

డుట, సర్వవిషయములను ఎఱిగి యుండుట, ఇష్టములగు పదార్థములను సంపాదించుకొను ప్రయత్నము లేకుండుట, అనిష్టము సంప్రాప్తమైనను దానిని తొలగించుకొను ప్రయత్నింపకుండుట, సర్వభూతములయందును కరుణగలిగి శాంతుడై యుండుట, సంకల్పములు లేక, భేదదృష్టిలేకుండుట, మనస్సును నిగ్రహించుటకు అనుకూలమగు ధైర్యము, సుఖవంతులజూచిన ఈర్ష్యలేక వారియందు మైత్రిని కలిగియుండుట, తనకెంతయున్నను దానితో తృప్తుడగుట, మార్దవము, పరులకు నొవ్వు కలుగకుండ సవినయముగ సంభాషించుట, అను గుణములు సమదృష్టిగల మహాత్ముని ఆశ్రయించి యుండును. ఇంతమాత్రమేయననేల? " అంతకుపూర్వము ఎట్టి స్థితిలోనున్నను ప్రభుత్వము కలుగగానే ఎట్టిపురుషునినైనను జనులు ఆకస్మికముగనే సేవింతురనట్లు " సమదృష్టిగల ఈమహాత్మునికూడ పూర్వస్థితి ఎట్టిదైనను జ్ఞానోదయము కలుగగానే సర్వసద్గుణములును సేవించును.

ఓరఘునందనా! శ్రీరామా! సంసారమను జలమునందు చింతలనియెడు దారములచేత గూర్పబడిన సంస్కారములను వల (సంస్కారములు మనోరూపములే. కావున ఇచ్చట వలగా జెప్పబడినది మనస్సేయని తెలిసికొనవలయును) పరుపబడియున్నది. ఆశయను చేప ఆవలయందు చిక్కుమిట్టి పడుచున్నది. ( చిత్తమును అనుసరించి ఆశ విజృంభించు చుండు ననుట.) ఇట్టి ఈ వలను విచార వశముచేత వాడియైన బుద్ధియను శలాకచే త్రెంచివేయుము. అప్పుడు ఆశయను చేప పారిపోవును. ( మనోజయమగునేని ఆశ నశించుననుట ) ఈవిధముగ " మనోవాయువు మేఘమును చెదరగొట్టినట్లు " పరిశుద్ధచిత్తము సంకల్పములను అణచునేని అప్పుడు పరమానందమునకు కొదువ కలుగదు. ఈవిధముగ " గండ్రగొడ్డలిచేత చెట్టును నఱుకునట్లు " మనస్సుతోనే మనస్సును భేదించి తత్క్షణమే ఉత్తమమగు మోక్షపదమును జెంది స్థిరుడవుకమ్ము. నడచుచున్నను, నిలచుచున్నను, నిదురించుచున్నను, మేలుకొనుచున్నను, నిట్టూర్పువిడుచు చున్నను, ఎగురుచున్నను, పడుచున్నను " ఇదియంతయు శూన్యరూపమే " అని నిశ్చయించి అందభిమానమును వదలుము. " మాంసమునందలి ఆశచేత పిల్లి తారతమ్యమును ఎఱుగక సింహము వెంటబడినట్లు " ఈమనస్సు స్వయముగ జడమేయైనను, నిత్యజ్ఞాన స్వరూపుడగు ఆత్మను అనుసరించును. ( ఆత్మతో సమానముగ ఉన్నదానివలె నటించును ) మఱియును " సింహము వెంటబోవుపిల్లి ఆసింహముయొక్క బలముచేత దొరకిన మాంసమును

భుజింపగలుగునట్లు " ఈ మనస్సుకూడ జ్ఞానరూపుడగు ఆత్మను అనుసరించును. కావున ఆత్మ ప్రభావముచేత దొరికిన ఈ దృశ్య పదార్థములను ( ఆత్మ వివర్తరూపమగు ప్రపంచమును ) అనుభవించును " చూచును. వినును. ఇంద్రియగోచరము చేసికొనును " ఇంతయేకాని మనస్సునకు ఇందు స్వాతంత్ర్యము ఏమియు లేదు. బ్రహ్మమే స్వవివర్తభూతములగు ప్రపంచమును స్వయముగనే మనస్సాధనముచేత జూచుచున్నది. కావున దృశ్య పదార్థములను ఆశ్రయింతువేని ( " అనగా, ఇది దృశ్యము, నేను దీనికి సాక్షిని " అని తలంతువేని ) నీవు మనస్సుతో గూడినవాడవు అగుదువు. అప్పుడు నీకు బంధము కలుగును. ఇట్లుకాక ఈ దృశ్యమును విడతువేని ( " ఈదృశ్యము నాకంటె భిన్నముకాదు. సర్వమును నేనే " అని తెలిసికొందువేని ) అప్పుడు నీకు చిత్తమును లేదు. బంధమును లేదు. మనస్సును గ్రహించుటకుగాని, విడచుటకుగాని, బ్రహ్మ స్వతంత్రుడే కదా ? కావున ఓ శ్రీరామచంద్రా ! " నేను ఒకదానిచేత తెలిసికొనబడు వాడను కాను. శూన్యరూపమే భ్రాంతికల్పితమై కేవలము ఉన్నట్లుమాత్రమే కానవచ్చు ఈ ప్రపంచమును చూచువాడను " అని సర్వకాలములయందును తలంచుచు ఆకాశమువలె రాగద్వేషాదులను అంటని చిత్తముతో నుండుము. పరమేశ్వరునియందు స్థిరముగ నిలచియుండుము. పైవర్ణించిన ధ్యానమే పరమేశ్వరునియందలి ఉనికి. సర్వమును చూచు తనకును తనచేత చూడబడు ప్రపంచమునకును నడుమ " చూపు " అనుపదార్థము ఒకటికలదు. బాగుగ విచారించిన నదియే సర్వాత్మకము ( ద్రష్టగాను దృశ్యముగాను, కూడ నుండునది. ) దానిని ఆత్మరూపమునుగా భావింపుము. ఆభావనయందే స్థిరముగా నిలువుము. ఇట్లే రుచిచూడబడు పదార్థమునకంటెను రుచి చూచువానికంటెను వేఱై, రుచి చూడబడుదానికిని రుచి చూచువానికిని నడుమ నున్నదై కానవచ్చు రుచిని ( ఆనందమును ) ఆత్మగా ధ్యానించుచు సర్వకాలములందు నిలచి యుండుము. ఆత్మమయుడవు కమ్ము. ఈవిధముగానే ఇచ్ఛాపూర్వకముగ ఆదరయుక్తముగ అనుభవింపబడు పదార్థమునకును అనుభవించువానికిని నడుమనున్న నిరాధారమగు అనుభవమే ఆత్మ. అచ్చట మనోవృత్తిని నేలకొల్పుము. ( ఆ అనుభవమునకే అనుభవించువాడు అనుభవింపబడునది అనునవి రెండును ఉపాధులు ఇంతయేకాని, సర్వమును అనుభవమాత్ర రూపమేయని తెలిసికొనవలయును. ) ఈవిధముగ ఆత్మను ఎఱుగలేక లోకులు "నేను కర్తను, అనుభవింపబడు పదార్థములు నాకంటె

భిన్నములు" అని అజ్ఞానముచేత భావింపుచున్నారు. ఈ అహంకార మమకారములే సర్వదోష కారణములు. సంసారబీజములు. ఇట్టి వీనిని అహంకార పరిత్యాగము ( సర్వసమత్వమును ) అను శస్త్రముచేత సమూలముగ ఖండించి పైన వర్ణించిన నిరాలంబమగు పదార్థమునందు సర్వసంసారమును అతిక్రమించి ఆత్మభావన నుంచుము. సర్వభూత సమృద్ధులను మించిన మహాసమృద్ధిని జెందుము. మోక్షము జెందుము. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె.

ఓ మహాత్మా ! వశిష్ఠమహామునీ ! మీవాక్యములు అతిగంభీరములు. వానివలన మీ యభిప్రాయము ఏదియో స్పష్టము కాలేదు. అహంకారమును, ఆశను, విడువ వలయు నంటిరి కదా ? అట్లు చేయుదునేని దేహరూప సంబంధము నెల్ల ఇంచుకయేనను మిగులకుండ పరిత్యజించినవాడనే కావలయును. ఇంతయేల ? ఈశరీరమునకు అహంకారమే కదా ఆధారము? దానిని పరిత్యజించిన " వేరును రంపముతో కోసివేసిన అప్పుడు మహావృక్షము వలె " ఈదేహముకూడ అవశ్యముగ నశించు ననుటలో సంశయ మేమియు లేదు కదా. ఓ ప్రభువా ! వశిష్ఠమహామునీ ! ఇట్టిస్థితి ఎట్లు సంపాదింప శక్యమగును. అనిన వశిష్ఠమహాముని ఈవిధముగ ఉత్తరము ఇచ్చెను. ఓకమలలోచనా ! రామభద్రా ! ఈ విషయమునందు ఏమియు విచారింపవలసిన పనిలేదు. మహాత్ములగువారు వాసనా పరిత్యాగమును (అహంకారము మొదలగు సంస్కారముల విడచుటను) రెండువిధములుగ వర్ణింపుచున్నారు. ధ్యేయము ( ధ్యానింపదగినది ) అనియు, జ్ఞేయము ( తెలిసికొనదగినది ) అనియు, వానిపేర్లు. " ఈ సర్వపదార్థములును నావి. నేను ఆపదార్థములకు సంబంధించిన వాడను. ఆ పదార్థములే నాకు ప్రాణములు. నేనే ఆపదార్థములకు జీవము. అవిలేకున్న నాకు నిలుకడయే లేదు. నేను లేకున్న వానికిని నిలుకడయే లేదు. " అను అజ్ఞానకృత నిశ్చయమును వదలి " నాకును ఈపదార్థములకును ఎట్టి సంబంధము లేదు. నేను ద్రష్టను లేక, సర్వమయుడను. " అని సర్వకాలములయందును భావింపుచు లోన చల్లనై మనస్సు సంక్షోభములు లేక నిలిచియుండ విలాసముగ సర్వకార్యములను అసక్తుడై విజ్ఞాని ఆచరింప వలయును. ఏ పదార్థము తోచినను " దీనికిని నాకును సంబంధము లేదు" అని భావించుచుండును. కావున సర్వసంస్కారములను విడిచినవాడగును ఇదియే ధ్యేయము వాసనాత్యాగము. ఇంక " నాకును పదార్థములకును సంబంధము లేదు " అనువిషయము సర్వకాల

ములయందును ధ్యానింపబడును కదా. ఇట్లు కాక సమదృష్టికలిగి విజ్ఞానవంతమైన బుద్ధితో సర్వవాసనలను సంపూర్ణముగ పరిత్యజించి "నేను, నాది" అను మొదలగు భావనలను బొత్తిగనే రానీకుండ కొందఱు మహాత్ములు స్థూల సూక్ష్మ కారణముల మూటిని సంపూర్ణముగనే విడచి పోవుదురు. ( దేహనాశమే కలుగు ననుట ) ఇట్టి వాసనాక్షయము జ్ఞేయమనబడును ( ధ్యేయ వాసనా త్యాగమునందు వాసనలు అంకురించుచున్నను భావనా బలముచేత, లేక, ధ్యానబలముచేత "ఇవి నాకు లేవు" అని త్రోసివేయుటయు, జ్ఞేయ వాసనా త్యాగమునందు సంపూర్ణమగు వాసనా నాశమును అనగా, వాసనలకు పునరుత్థానమే లేకపోవుటయు గలదని తెలిసికొనవలయును ) ఇందు ఏమహాత్ముఁడు విలాసమాత్రముగ అహంకారమును స్నేహితుని విడచి ధ్యేయరూపమగు వాసనాక్షయమును చేసి సర్వకార్యములయందును అసక్తుఁడైయుండునో, అట్టివాఁడే జీవన్ముక్తుఁడు. మఱియు తగినంత ఆధారము లేకున్నను కేవలశూన్యమే యైనను, అతిదృఢముగా నున్నట్లు కనబరచుచు ఈసర్వప్రపంచమును కల్పించు సంస్కారమును పునరుత్థానము లేకుండునట్లు ధ్వంసముచేసి ఏమహాత్ముఁడు పైనవర్ణించిన జ్ఞేయ త్యాగమును ఆచరించునో, అట్టివాఁడు విదేహముక్తుఁడు. ఆతనికి దేహములు ఉండవని చెప్పియుంటిని కదా ?

—* జీవన్ముక్తలక్షణము. *—

ఓ రఘుకులతిలకా ! శ్రీరామా ! పైన వర్ణింపబడిన ధ్యేయ, జ్ఞేయ, త్యాగములు రెండును సమానములే. మోక్షమును ఇచ్చునవియే. ఆత్యాగములను చేసిన జీవన్ముక్తి విదేహముక్తులు ఇరువురును బ్రహ్మరూపము నొందినవారే. సంసారరూప తాపములు లేనివారే. వారలలో కాని, వారుచేసిన త్యాగములలో కాని, తారతమ్యములు లేవు. లోకమునందు పురుషునకు కాలానుసారముగ ప్రారబ్ధబలమును అనుసరించి సుఖదుఃఖములు వచ్చుచుండును. అహంకారాది సంస్కారములు కలవాఁడు వానిని తనవిగా భావించి హర్షశోకముల నొందును. జీవన్ముక్తుఁడు అట్లు కాక ధ్యేయ రూప త్యాగములచేత అహంకారాదులను విడచినవాఁడు. కావున వానియందు రాగద్వేషములనుంచడు. సుఖమువచ్చిన సంతసింపడు. దుఃఖమువచ్చిన శోకింపడు. వస్తువుయొక్క యథార్థస్వరూపము తెలిసినవాఁడగుటచేత అతనికి "ఇది కోరతగనది, లేక, ఇష్టమైనది. ఇది యిష్టముకానిది, లేక, కోరతగనిది" అను భేదములు చిత్తమునందు లేవు. బాహ్య వ్యవహా

రము మాత్రము అట్టి భేదము లేక ప్రవర్తింపదు. కావున వెలుపలికి మాత్రము దానిని అభినయించును. సుషుప్త్యవస్థను జెందియున్నవానివలె సంచరించుచుండును. బాహ్యమునకు వ్యవహారార్థమై ఎట్లు సంచరించినను చిత్తమునందు సంతోషము, రోషము, భయము, కామము, దైన్యము, మొదలగువృత్తు లేవియు నమ్మహాత్మునకు నుండవు. కావున

శ్లో॥ సుషుప్తవత్ప్రశమిత భావవృత్తినా
స్థితం సదాజాగ్రతి తేనచేతసా ।
కలాన్వితో విధురివ యస్సదాముదా
నిషేవ్యతే ముక్త ఇతీహ సస్మృతః ॥

ఏ మహాత్ముడు సుషుప్త్యవస్థయందువలె జాగ్రదవస్థయందును కామాది సర్వవికారశూన్యమై శాంతమైయున్న చిత్తముతోగూడి షోడశకళాపరిపూర్ణుడగు చంద్రునివలె సర్వకాలములయందును సంతోషపూర్ణుడై సంచరించు చుండునో, అట్టివాడే జీవన్ముక్తుడు.

## —✱ తృష్ణాస్వరూపము. ✱—

ఓ శ్రీరామచంద్రా! ఇకను నీవు తలంచినట్లు ఆశాపరిత్యాగము కూడ అసాధ్యము కానేరదు. వినుము. ఆ ఆశయు బద్ధముక్త భేదముల చేత రెండు తెఱగులై యున్నది. విషయములను తనకంటె భిన్నముగ భావించి అహంకార మమకార వాసనాపూర్వకముగ "ఇది నాకు కావలయును" అని చేయబడు సంకల్పము (ఆశ) బద్ధాశ అనబడును. అట్లుగాక సర్వపదార్థములను ఆత్మమాత్రములనుగ దలంచి బాహ్యమునకు కేవలము వ్యవహారార్థమై అభినయింపబడు ఆశ ముక్తాశ అనబడును. మహాబుద్ధిమంతుడవగు ఓ రాఘవా! వివేకశూన్యమును- అహంకారాది యుక్తమును అగు చిత్తమునందు "ఇది నాకు కావలయును" అను ఇట్టిరూపముతో పుట్టునట్టి ఆశ బంధహేతువు. సంకల్పము. ఆశయే అననేల? అట్టిచిత్తమునందు పుట్టునట్టి ప్రతిసంకల్పమును బంధహేతువే. అట్టి ఈ ఆశను, సంకల్పములను గూడ కలవియనియు, లేనివియనియు, వ్యవహరింపబడుచున్న, సర్వపదార్థములయందును విడచి (ధ్యేయత్యాగమును ఆచరించి) ఉండగలిగిన అమ్మహాత్ముడు పరమపదమును జెందుననుటలో సందేహము లేదు. కావున ఓ మహాత్మా! శ్రీరామా! వాస్తవస్థితిలో నీకు కోరదగినదిగాని, విడువదగినదిగాని, లేకుండుటచేతను నీవే సర్వమైయుండ వగుటచేతను, కేవలబంధరూపమగు సంసారమునందే కాక మోక్షమునందును అభిమానమును

విడువుము. ఇక సుఖదుఃఖ దశలను అభిమానించుట అనునది బొత్తిగనే సంభవింపదు కదా ? మఱియు " ఇది కలది, ఇది లేనిది " అను అభిమానమును కూడా వదులుము. ఇట్టి భావాభావ వ్యవహారమే అసత్యముకదా. అలలులేని సముద్రమువలె నిశ్చలుడవై నిలువుము. అభిమానమే ఆశ. ఆశయే సర్వసంబంధములకు గారణమని ఇదివరకే నిరూపించి యున్నాను కదా ?

—* చతుర్విధ అహంకార స్వరూపము. *—

ఓ సత్పురుషశ్రేష్ఠుడా ! రామభద్రా ! మఱియొకవిషయము. పురుషుడు విచారము చేయుటకు ఉపక్రమించేనేని వానికి క్రమ క్రమముగ నాలుగు విధములగు నిశ్చయములు అతి దృఢములై పరస్పర బాధకములై జనించును. మొట్టమొదట భ్రాంతిదృష్టి నశింపకుండుటచేత, " శుక్ర శోణిత పరిణామ రూపమై కరచరణాది అవయవ యుక్తమై యున్న ఈ దేహమే నేను " అను నిశ్చయముతోచును. ఇది బాధకారణము. పిమ్మట కొంచెము సూక్ష్మముగ విచారించిన "ఈసర్వపదార్థములకంటెను అతిరిక్తుడైనట్టియు, వెంట్రుక కొనకంటె సన్నమైనట్టియు, జీవుడను నేనేను" అను రెండవ నిశ్చయము కలుగును. ఇది సంసార సంబంధ వివర్జితమగు నిశ్చయమగుటచేత మోక్షకారణము. ఓ రఘుకులతిలకా ! శ్రీరామచంద్రా ! మఱి కొంత విమర్శించిన విచారశీలులగు మహాత్ములకు " ఈ ప్రపంచమునందలి సర్వపదార్థములును నాస్వరూపములే. నేను సర్వమయుడను " అనుమూడవ నిశ్చయము కలుగును. దీనివలన పరిచ్ఛిన్నత్వ ధర్మము ( సూక్ష్మరూపుడై ఒకఱపదార్థమున మాత్రమే యుండుట, లేక, ప్రతి పదార్థమునందును ప్రత్యేకముగ నుండుట అనుధర్మము ) తొలగింపబడుటచేత, ఆత్మస్వరూప విజ్ఞానము అధికమగును. కావున ఇదియు ముక్తికారణమే అని ప్రత్యేకముగ చెప్ప నక్కఱలేదు కదా ? మఱియును అంతమునకు " ఈ ప్రపంచము ఆకాశమువలె బొత్తిగనే లేదు. ఉన్నవాడను నేనొక్కఱడనే " అను నాలుగవ నిశ్చయము కలుగును. దీనివలన " తాను ప్రపంచము అందు తాను వ్యాపించియుండుట " అను ఇట్టిభేదము తొలగింపబడె అద్వితీయమగు ఆత్మరూపము ప్రకటింపబడెను. కావున ఇది సర్వోత్తమము. మోక్షదాయకమని ప్రత్యేకముగ జెప్ప నక్కఱలేదు కదా. ఇందు ఏ నిశ్చయమున్నను వ్యవహారమునకు హానిలేదు. మొట్ట మొదటి నిశ్చయము అందఱకును కలదు కదా. తక్కిన మూడును జీవన్ముక్తునకు ఉండును. జీవన్ముక్త విదేహముక్తులు ఇరువురు సమానులే యని ఇదివరకే నిరూపించి యున్నాము. వార

లకు దేహ మొక్కటియే కదా భేదము ? జీవన్ముక్తునకు దేహము ఉండును. విదేహముక్తునకు అదిలేదు. ఇట్లగుటచేత ఈ నాలుగు నిశ్చయములు గల వారును వ్యవహరించువారే. ఆశలేక వ్యవహారము జరుగదు. కావున వీరి కందఱకును ఆశయున్నదియే. అందు దేహమునందు ఆత్మనిశ్చయము గల వానికి ఉండు ఆశ బద్ధాశ. ఇతరులకుగల ఆశ ముక్తాశ. ముక్తాశ విలాస మాత్రముగ వ్యవహారార్థమై అభినయింప బడునదియే కాని, అహంకార మమకారాది వాసనలను అభివృద్ధి చేయునది కాదని ఇదివరకే చెప్పియు న్నాము కదా. ఓ బుద్ధిమంతుడా ! రామా ! ఈకారణమువలన " ఈసర్వ ప్రపంచమును పరబ్రహ్మమే, ఆ బ్రహ్మమే నేను " అను మూడవనిశ్చయము ఏదికలదో దానిని దృఢముగ పరిగ్రహింపుము. అప్పుడు నిబుద్ధి మఱల దుఃఖ మును చెందదు ( " ఈసంసారము నన్ను బాధింపుచున్నది. దీనిని ఎట్లు విడ తును " అనునది దుఃఖస్వరూపము. )

—* ఆత్మస్వరూప నిరూపణము. *—

ఓ శ్రీరామా ! వాస్తవస్థితిలో ఆత్మ యొక్కడే శూన్యమనియు, మూలప్రకృతియనియు, మాయ యనియు, బ్రహ్మమనియు, విజ్ఞానమనియు, ఆనందరూపుడనియు, లేక, విష్ణు బ్రహ్మ రుద్రులనియు, జీవుడనియు, ఈశ్వ రుడనియు జెప్పబడుచున్నాడు. పరమాత్మరూపిణియగు శక్తి స్వయముగ ఏకరూపము కలదియే యైనను సృష్టివిలాసముచేత భేదాభేద రూపములతో ( కార్యకారణములకు వ్యావహారికభేదము పారమార్థికాభేదము కలదు. కావున నా రెండురూపములతో ) విజృంభించుచున్నది. కావున ఈయథార్థ తత్త్వమును ఎఱిగి తనదికాని పరునిదికాని ఏ కార్యమైనను, ఎట్లుపోయినను, అనగా నశించినను, కూడివచ్చినుగూడ సుఖదుఃఖములను ( హర్షశోకము లను ) నొందకుము. వానితో నీకు ఎట్టి సంబంధమును లేదు. అవియు నీకంటె భిన్నములు కావు కదా ? ఏ మహాత్ముడు సర్వాతీతమగు ఆత్మరూ పమును అవలంబించి చంద్రునివలె మిక్కిలి చల్లన యగు హృదయము గల వాడై హర్షశోకములు లేక, సమచిత్తముతో నుండునో, అట్టివాడు సంసా రమునందు ఉన్నను సర్వకార్యములను చేయుచున్నను మోక్షపదము నుండి భ్రంశము నొందడు. ఏ మహాత్ముడు శత్రుమిత్రులయందు సమచిత్తముకలిగి యుండునో, దయా దాక్షిణ్యములచేత అలంకృతుడై యుండునో, ఎప్పటికి ఏది ఆసన్నమైన ఆ కార్యమును రాగద్వేషవర్జితుడై చేయుచుండునో, అట్టివాడు సంసారమునందు ఉన్నను సర్వకార్యములను చేయుచున్నను,

మోక్షపదమునుండి భ్రంశము నొందడు. ఏ మహాత్ముడు సంతోషము ద్వేషము, శోకము, కామము, అను నవి లేనివాడై యుండునో, ఇష్టము వచ్చినను, అనిష్టము వచ్చినను, సముడై " ఇది కావలయును, ఇది అక్కఱలేదు" అను భేదము లేనివాడై ఏదివచ్చినను సమచిత్తముతో అనుభవించునో, అట్టివాడు సంసారమునందు ఉన్నను సర్వవ్యవహారములను చేయుచున్నను, మోక్షపదమునుండి భ్రంశము నొందడు. ఏ మహాత్ముడు సర్వజనులకును అనుకూలముగ మాటలాడుచు పరులచేత ప్రేరేపింపబడి మాత్రమే తత్తదనుకూలముగ సయుక్తికముగ మృదుభాషలచే భాషించుచు, తనకొఱకై కాక, ఇతరులకొఱకై వారి అభిప్రాయమును ఎఱిగి ప్రవర్తింపుచుండునో, అట్టివాడు సంసారమునందు ఉన్నను సర్వకార్యములను చేయుచున్నను, మోక్షపదవినుండి భ్రంశము నొందడు. ఈవిధముగా నీవును ధ్యేయ త్యాగముతో గూడిన పరిపూర్ణదృష్టిని పొంది జీవన్ముక్తుడవై శాంతుడవై యథేచ్ఛముగ సర్వవ్యవహారములను చేయుచు విహరింపుము.

ఓ శ్రీరామచంద్రా! మనస్సునందు ఆశలను, రాగద్వేషములను, సంపూర్ణముగ పరిత్యజించి అహంకార మమకార రూపములగు సర్వసంసారములను పరిత్యజించి వెలికిమాత్రము సర్వమును అభినయించుచు ఆవశ్యక కార్యములను ఆచరింపుచు సంసారమునందు యథేచ్ఛగా సంచరింపుము. వెలుపలికి సర్వసంభ్రమముల ( కామ క్రోధాది వేగముల ) అభినయింపుచు, లోన శాంతుడవై వెలుపల సర్వకార్యములను చేయుచు,లోన అకర్తవై లోకమునందు విహరింపుము. అభిమాన పరిత్యాగమే సర్వపరిత్యాగము కదా ? నశించిన అహంకారముతోను, నిదురించు చిత్తముతోను గూడి ఆకాశమువలె దేనితోను సంబంధింపక ఏ మాలిన్యమును ఇంచుకయైనను లేక, శుద్ధుడవై సంసారమునందు విహరింపుము. అతిగంభీరమును శ్రేష్ఠమును మృదువునగు ఆచారముకలిగి లోకాచారముల నెల్ల అనువర్తింపుచు నుండియు లోపల ( మనస్సునందు ) సర్వమును పరిత్యజించి సంసారమునందు విహరింపుము. లోపల నిరాశనుబూనియు, వెలుపల ఆశను అభినయించుచు లోపల చల్లనయ్యు వెలుపల తాపయుక్తుడవై ( తాపమనగా, కామక్రోధాదులు ) సంసారమునందు విహరింపుము. ఓ శ్రీరామచంద్రా! ఇప్పుడు వివేకదృష్టికల నీకు " వీడు బంధువు, వీడు అన్యుడు, నేను, నీవు " అను మొదలగు మిథ్యాదృష్టి ( విపరీతదృష్టి ) అంతయు తొలగిపోవును గాక. వాస్తవస్థితిలో " సర్వమును తానే " అను జ్ఞానమువలన మాత్రమే

కాదు, సామాన్యముగ గూడ నీచవృత్తిగలవారు మాత్రమే "వీడు బంధువు, వీడు కాదు" అని గణింతురు కాని, మహాత్ములగువారలు అట్లు చేయరు. వారికి ప్రపంచమంతయును ఆత్మకుటుంబమేకదా? సామాన్యుల స్థితియే ఇట్లుండగా ఇక బ్రహ్మజ్ఞానులను గూర్చి క్రొత్తగా చెప్పనేటికి.

శ్లో॥ వివిధజన్మ శతాహిత సంభ్రమే
జగతిబంధు రబంధు రితీక్షణమ్ ।
భ్రమదశ్చైవ విభాతి నవస్తుత
స్త్రిభువనం చిరబంధు రబంధ్వపి ॥

ఓ రామా! ప్రతిజీవుడును ఈలోకమునందు లెక్కకు మిక్కిలియగు జన్మములను ఎత్తుచున్నాడుగదా? ఇట్టివానికి "వీడు బంధువు, వీడుకాడు" అనుతలంపునకు అవకాశము ఎక్కడినుండి వచ్చును? సర్వజంతు యోనులయందును జనించువాడే అగుటచేత వీనికి జంగమస్థావర రూప ప్రపంచము అంతయును బంధువే. అంతయును బంధువు కానిదే. కావున ఈ భేద దృష్టి (వీడు బంధువు, వీడు బంధువుకాడు, అను తలంపు) కేవలము భ్రాంతియే అనిచెప్పి తీరవలయును.

—* పుణ్యపావనోపాఖ్యానము. *—

ఓ పురుషోత్తమా! శ్రీరామా! ఈవిషయమును నిర్ణయించుటకై గంగాతీరమునందు సోదరులగు ఇరువురు మునిపుత్రులకు జరిగిన సంవాదమును ఉదాహరణరూపముగా మహాత్ములు చెప్పుదురు. ఆవృత్తాంతమును వివరించెదను వినుము. ఓ రామా! ఈ జంబూద్వీపమునందు ఒకమూల మహేంద్రమను నొక పర్వతము గలదు. అది అనేక మహారణ్యములచేత జుట్టబడి వానికి శిరోభూషణమై ఉండును. ఆమహేంద్ర పర్వతము యొక్క రత్నమయమగు ఒకానొక మనోహరమైన చరియయందు కూర్చుండి దివ్యజ్ఞానసంపన్నుడగు దీర్ఘతపుడను ఒక్క మహాముని బహుకాలము నుండియు తపస్సు చేయుచుండెను. అమ్మహాత్మునకు "బృహస్పతికి కచులునువలె" (బృహస్పతికి కుమారు డొక్కడేయనియు వానిపేరు కచుడనియు ఇతర స్థలములయందు తెలియవచ్చుచున్నది. ఇచ్చట మాత్రము బృహస్పతికి ఇరువురు కొమారులనియు ఆ ఇరువురకును నామధేయము యొక్కటియే యనియును ఉన్నది. ఈవిషయము విమర్శార్హము) పుణ్యుడనియు, పావనుడనియు, పేరుగల ఇరువురు పుత్రులు గలరు. వారు పూర్ణచంద్రునివలె అతిసుందరాకారులై యుండిరి. ఇట్టి పుత్రులతో గూడి ఆ మహామునియు

నాపర్వతమునందే నివసించి యుండెను. తపస్సులకు నిధానమో యనజూచువారలకు ఆశ్చర్యము గలిగించు చుండెను. తపస్సుయొక్క సామర్థ్యమంతయు మనుష్యరూపమును దాల్చి ఇట్లునిలచెనో, యనవెల్లరకును ఆశ్చర్యమును కలిగించు చుండెను.

ఓశ్రీరామచంద్రా! ఇట్లు కాలము గడచుచుండగా నా ఇరువురు కుమారులలో పెద్దవాడును, గుణములయందుకూడ శ్రేష్ఠుడును నగు పుణ్యుడనువాడు విజ్ఞానవంతుడయ్యెను. పావనుడను రెండవవాడు "ప్రాతస్సంధ్యాకాలమునందలి కమలమువలె" అర్ధభాగము ప్రబుద్ధుడయ్యెను. (జ్ఞానముచే వికసించెను) ఇట్లగుటచేత కేవల మూఢుడును గాక, సంపూర్ణముగ బ్రహ్మపదమును బొందక "ఉయ్యేలపైని ఉన్నవానివలె" ఏవైపునందును స్థిరత నొందకుండెను. అంత ఆద్యంతములు లేనిదియు జనన మరణాదులకు కారణము నగు కాలము క్రమక్రమముగా గడువ నారంభించెను. అప్పుడు ఒకనాడు ఆదీర్ఘతపుడు (పుణ్యపావనులయొక్క తండ్రి) ముసలితనముచేత ఆయుష్కాలము జీర్ణింప సంసారమునందలి అనురాగమును, జ్ఞేయరూపత్యాగమును ఆచరించి "సంకల్పమనుపక్షికి గూడగు" గూడైన శరీరమును ఆపర్వతగుహయందు ఒక్కచోట, విడిచెను. ఇట్లు "కావడి మోయువాడు భారమును గమ్యస్థానమునందు దించునట్లు" శరీరభారమును డిగ్గవిడచి సర్వకల్పనా శూన్యమైనట్టిదియు, దృశ్యములేని విజ్ఞానమే రూపముగా గలదియు, ఏవిధమగు మాలిన్యములును లేనిదియు, నగు పరబ్రహ్మమును చెందెను. "పుష్పమునుండి వాయువశమున వెలికివచ్చిన గంధము ఆకాశమునందు ఐక్యమగునట్లు" ఆబ్రహ్మమున నైక్యము నొందెను. ఈవిధముగ తండ్రి మృతినొందగానే అమ్మహాత్మునకు జేయవలసిన పరలోక కృత్యములయందు పెద్దకుమారుడగు పుణ్యుడు మాత్రమే జాగరూకుడై ప్రవర్తించు చుండెను. పావనుడను రెండవవాడు మిక్కిలి దుఃఖముగలవాడాయెను. ఇట్లు శోకాతురుడై ఆపావనుడు చిత్తస్వాస్థ్యము లేక వనములయందు సంచరించుచు తన అన్నయొక్క ఆచారమునైనను, ఆతని ప్రవర్తనమునైనను, అతని కార్యభారమునైనను, తలంపక వ్యాకులుడై రోదనము చేయసాగెను. అంతట పుణ్యుడు జనకునకు చేయవలసిన పరలోక క్రియలను ముగించి పిమ్మట అరణ్యమున రోదనముచేయుచున్న తనతమ్మునివద్దకు వచ్చెను. ఆతని నూరార్చుటకై ఇట్లనియె.

ఓపుత్రుడా! తమ్ముడా! (పితృసమో జ్యేష్ఠః, అను న్యాయమును

అనుసరించి ఇట్లు సంబోధించెనని తెలిసికొనునది ) దుఃఖమును అణచుకొ నక ఇక్కేల అంతకంతకు దృఢము చేయుచున్నావు. ఇది అధికమగుకొలది అజ్ఞానరూపమగు గ్రుడ్డితనమును అభివృద్ధి చేయునేగాని, ఇక నేమియు మేలు చేయబోదు. మనతండ్రి మహాజ్ఞానవంతుడు. కాలానుసారముగా దేహమును విడచిపోయినాడు. ఎంతశోకించినను మరలిరాడుకదా? మఱి యును అమ్మహాత్ముడు మోక్షమనబడు ఆత్మరూపమును జెందెను కాని, క్రొత్తగా ఇచ్చటినుండి మఱియొకచోటికి పోయినవాడుకాడు. నశించిన పదార్థము అసత్యమగు దేహమే. అదియు దానికంటె భిన్నమే యగుట చేత నశింపనే లేదనికూడ చెప్పవచ్చును. ఇకను యథార్థమేమనిన, మన ము అజ్ఞానదృష్టిచేత జీవదేహముల విభాగింపలేక సర్వవ్యాపియగు ఆత్మ నుచూడలేక "మనకంటె భిన్నుడై దేహయుక్తుడై మనతండ్రి యున్నాడు" అని తలచుచుంటిమి. ఈకారణమువలన దేహము కాలానుసారముగా తన కు కారణములగు పంచభూతములయందు లీనము కాగానే " మనతండ్రి నశించెను " అని తలచుచున్నాము. ఇంతయేకాని, ఇచ్చట నశించినది ఏదియులేదు. మనతండ్రి స్వస్వరూపమును బొందెను. ఇట్టివానినిగూర్చి ఏలశోకించెదవు? వాస్తవస్థితిలో విచారించి చూచిన స్వాభావికమగు దేహా త్మభావన శోచనీయమగును గాని, స్వస్వరూపస్థితి అట్టిదికాదుకదా? ఇది యునుగాక, ఓపుత్రుడా! తమ్ముడా! నీవిదివరకునెన్ని యో జన్మములను ఎత్తి తివి. తల్లితండ్రులు వేలవేలుగా నశించిపోయిరి. ఈతడును వారలలో నొ కడు. ఇట్లుండగా ఇంతశోకమేల? తల్లితండ్రులేకారు, పుత్రమిత్రాదులు ఎందరో గడచిపోయియున్నారు. వారలనుగూర్చి మనము ఇప్పుడు దుఃఖిం చుచున్నామా? వారుమాత్రము ఇప్పటి తల్లితండ్రులవంటివారు కారా? కావున గడచిపోయినవారినిగూర్చి శోకించుట ఉచితముగాదు. అట్లు శోకిం చుటయే కర్తవ్యమగునేని, ఎంతశోకించినను తీరునా? తుదకు కాలమైన నున్నదా? బాగుగ విచారించిన ఈప్రపంచమునందు దుఃఖింపదగిన పదార్థ ముగాని, సంతసింపతగిన పదార్థముగాని, ప్రేమింపదగిన పదార్థముగాని, ద్వేషింపదగిన పదార్థముగాని, లేదు. ఇదియంతయు ఎండమావులనీరు. అనాది సంసారములను ఎండచేత అజ్ఞానమను విశాలమైన మరుభూమి యందు ( నీరులేని స్థలమునందు ) కానవచ్చుచున్నది. ఈప్రపంచమంతయు నామమాత్రమేగాని, మఱేమియుకాదు. " వీరుబంధువులు, వీరు మిత్రులు, వీరుపుత్రులు " అను మొదలగు పేర్లవలననే వారియందు ప్రేమ కలుగుచు

న్నది. " వీరు శత్రువులు, వీరుపరులు " అను మొదలగు పేర్లవలననే వారి యందు ద్వేషము పుట్టుచున్నది. " ఇది ధనము " అను మొదలగు పేర్లవల ననే వానియందు ఇచ్ఛ జనించుచున్నది. ఇట్లే ఆయాపేర్లవలన ఇతరము లగు మనోవికారములన్నియు పుట్టుచున్నవి. ఇంతమాత్రమేకాని, వాస్తవ స్థితిలో బ్రహ్మమునకంటె భిన్నమగు పదార్థము ఏదియు లేదు. ఎవ్వడు బంధువని భావింపబడి " వీడు బంధువు " అను నామముతో వ్యవహరింప బడునో, వాడు బంధువే యగును. ఇట్లుగాక మొదటినుండియు, లేక, దృఢ ముగా శత్రువని భావింపబడి శత్రునామముచేత వ్యవహరింప బడునేని వాడు శత్రువే యగును. ఇంతియేకాని శత్రుత్వ మిత్రత్వాదులు ఒకరికి స్వాభావిక ధర్మములు కావు. సర్వమును భావాధీనమే. విషపురుగు విషము నందే పుట్టుచున్నది. దానినే భక్షించి జీవించు చున్నది. దృఢభావనవలన దానికి ఆవిషము ప్రాణధారకమై అమృతతుల్యమైనదియగును. తక్కినవార లకు అట్టిభావన లేకుండుటచేత అదియే ప్రాణహింసకమై విషమగుచున్నది. బాగుగ విచారించిన ఆత్మ ఏకరూపుడు. సర్వవ్యాపకుడు. ఇట్టివానియందు " వీడు బంధువు, వీడుకాడు " అను భేదము ఎక్కడినుండి వచ్చును. కా వున ఓపుత్రుడా! తమ్ముడా! కొంతవిచారింపుము. దేహమునే ఆత్మగా భా వించుట యుక్తముకాదు. ఈదేహము మాంసాదిరూపము. విచారించిన ఇందలి పదార్థములలో ఏదినైన ఆత్మరూపమగుననుటకు వీలులేదు. ఇవి అచేతనములు. ఆత్మచేతనుడు. కావున " ఈదేహము నేను కాను కదా? ఇక నేనెవ్వడను " అని కొంచెము విమర్శింపుము. పారమార్థిక దృష్టితో చూచిన నీవును నేనును అనువ్యక్తియే లేదు. " నేను పుణ్యుడను. నేను పాపనుడను " అనునది కేవల మిథ్యాజ్ఞానము ( అజ్ఞానము ) ఈ అజ్ఞానము ఒకటియే ఇట్లు ప్రకాశించు చున్నది కాని, సర్వము విచారించినచో ఏక మే. నీవు అనేకజన్మములను ఎత్తుచుండగా మార్గమున ఒకానొక జన్మము నందు అతిపవిత్రములగు తేళ్ళలో కొందరు బంధువులు ఉండిరి. వారినిగూర్చి ఇప్పుడేల దుఃఖింపవు. మఱియొక జన్మమునందు మేఘావృతములగు పర్వత శిఖరములపై అనేక సింహములు నీకు బంధువులుగా నుండినవి. వానిని గూర్చి ఇప్పుడేల శోకింపవు. మఱియు నీవు పూర్వమునందు దశార్ణదేశ మున ఒక అరణ్యమునందు కోతివై జన్మించితివి. తుషారదేశములయందు రాజపుత్రుడవై తివి. పుండ్ర దేశములయందు అడవి కాకివై తివి. హైహయ దేశములయందు సామంతరాజవై తివి. త్రిగర్త దేశములయందు గాడిదవై

పుట్టితివి. సాళ్వదేశమునందు కుక్కవైతివి. ఒకానొక సరళవృక్షముపై పక్షివైతివి. మఱియును ఈజంబూద్వీపమునందే ఇదివరకు అనేకవేల మాగులు అనేకవేల యోనులయందు అనేకవేల జన్మములు ఎత్తితివి. అప్పుడు నీకు ఎందరు బంధువులు ఉండిరి. ఆయా సమయములయందు ఎందఱు తల్లిదండ్రులు గతించిపోయిరి. వారినందఱను ఉద్దేశించి ఏలశోకింపవు. కావున ఓతమ్ముడా! సంసారియగు జీవునకు ఈలోకమునందు "పండుటాకుల యట్లు లెక్కకు ఎక్కువగ తలిదండ్రులు ఎందరో గతించి పోవుదురు. వారలను గూర్చి దుఃఖింపబోయిన ఎప్పటికైన అంతము గలుగునా? కావున నిరర్థకమగు ఈశోకమును వదులుము. భేదమంతయు కల్పితముగాని, వాస్తవము కాదు. కలిమిలేములు లేనిదియు జరామరణముల నొందనిదియు నగు ఆత్మరూపమును స్మరింపుము. ఏకాగ్రచిత్తముతో విమర్శింపుము. ఆత్మరూపమును మరచుటచేతనే ఇట్టిదురవస్థ వచ్చినది.

శ్లో॥ సర్వేషణా మయకళంక వివర్జితేన
స్వచ్ఛాత్మభావ కలితేన హృదబ్జమధ్యే ।
పుత్రాత్మనాత్మని మహామతి నామునైవ
సంత్యజ్య సంభ్రమమలం పరితోషమేహి ॥

కావున ఓ పుత్రుడా! తమ్ముడా! సమస్త విధములగు ఆశలు మొదలైన ఈషణములను వదలి అతి పరిశుద్ధమైన కళంక వర్జితమై బ్రహ్మభావనతో గూడియున్న మనస్సుతోనే ఈ భ్రాంతిని వదలుము. హృదయ కమలము వికసింప ఆనందింపుము. ఆ హృదయకమల మధ్యమునందున్న పరమాత్మను సేవింపుము. ఓ శ్రీరామచంద్రా! ఈవిధముగ పుణ్యుడు ఉపదేశించిన ఆపావనుడు "ప్రాతఃకాలమునందు భూమియంతయును సంతోషించునట్లు" పరిపూర్ణ ప్రకాశమును చెందెను. సంపూర్ణమగు ఆత్మజ్ఞానము నొందెను. ఈవిధముగ నా ఇరువురును జ్ఞానవిజ్ఞానములు కలిగి సిద్ధులై నిర్దోషులై ఆ వనమున సంచరించు చుండిరి. ఓ దోషరహితుడా! రఘురామా! ఇట్లు సంసారియగు జీవుడు అనేక జన్మములను ఎత్తుచుండుటచేత వానికి ఎందరో బంధువులు ఉందురు. ప్రస్తుత జన్మమునందు గల బంధువులు కూడ అట్టివారలే. ఇట్లుండగా, బంధువులపై ఆశ నుంచవలయునా? విడువవలయునా? చెప్పుము. మఱియు మనస్సు చింతింప నారంభించినచో ఎప్పటికిని చింత అభివృద్ధి యగుచునే యుండును. కట్టెలు వేయుచున్న కొలది అగ్ని అభివృద్ధి యగునుగాని తగ్గిపోదు. మఱియు కట్టెలు తీసివేసిన పిమ్మట

ఆ అగ్ని స్వయముగనే నశించునట్లు ఈ చింతయు సంకల్పములను మాని నచో స్వయముగనే నశించును. కావున ఓ రామా! నీవు ధ్యేయత్యాగ (సర్వకార్యములను చేయుచున్నను "నాకు దేనితోను సంబంధము లేదు" అని కర్తృత్వమును విడుచుట) మను రథమునెక్కి కరుణామయమగు దృష్టితో అజ్ఞాన వశమువలన దీనులై యున్న లోకములను చూచుచు విహరింపుము.

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః స్వస్థా నిష్కామా విగతామయా ।
ఏనాం ప్రాప్య మహాబాహో విమూఢోపి న ముహ్యతి ॥

ఓ పరాక్రమశాలీ! శ్రీరామా! బ్రహ్మరూప స్థితి సుఖరూపమైనది. కామక్రోధాదులు లేనిది. నిర్దోషమైనది. ఎవ్వడైనను దీనిని ఆశ్రయించునేని వాడు మూఢుడైనను భ్రాంతిని జెందడు. ఈ విధముగా ఎవ్వడు వివేకమను చెలికానిని, పరిశుద్ధబుద్ధియనెడు అతిసమర్థయగుచెలిని, గైకొని విహరించునో వాడు ఎట్టి సంకల్పములు గలిగినవాడైనను భ్రాంతి నొందడు. ఎట్లుచూచినను సమస్త విషయములను విడచుటకును, బంధువులను (బంధుస్నేహమును) ఎగుర గొట్టుటకును సాధనమగు ధైర్యమునకంటె ఇతరమగునది ఏదియును పురుషుని సంసార సముద్రమునుండి తరింపజేయ నేరదు. సంసారమను బాధనుండి ఉద్ధరింపనేరదు. కావున వైరాగ్యముచేతను, శాస్త్రసహాయముచేతను, శాంతి దాంత్యాది గుణములచేతను, సర్వప్రయత్నములచేతను, మనస్సును మాత్రమే నిర్మలము చేయవలయును. మనస్సు సర్వదోష వర్జితమైయుండునేని ఎట్టి సుఖము కలుగునో ఆసుఖము త్రిలోకరాజ్యమున్నను కలుగదు. రత్నపరిపూర్ణములైన భాండాగారములున్నను కలుగదు. తన మనస్సు ఆనంద పరిపూర్ణమయ్యోనేని ప్రపంచమంతయును ఆనంద పరిపూర్ణమే. తాను చెప్పులను తొడుగు కొనిన తనకు భూమియంతయు చర్మముచేత గప్పబడినదియే కదా? ఆమనస్సు వైరాగ్యమువలన మాత్రమే పరిపూర్ణమగును గాని, ఆశకులోబడినచో, ఎప్పటికిని పరిపూర్ణత్వమును బొందదు. ఆశగలవానికి ఎన్నటికిని తృప్తిలేదనుట ప్రత్యక్షసిద్ధమే కదా? కావున శరత్కాలమందు సరస్సులోని నీరు ఎండిపోవునట్లు ఆశకులోబడని చిత్తముకూడా క్రమక్రమముగా శూన్యమగును. ఆశపోతులగువారి హృదయము గాంభీర్యమును వదలి అగస్త్యునిచేత పానము చేయబడిన సముద్రమువలె వెలివడును. ఆశలేనివాని మనస్సు ఎట్లు ప్రకాశించునో ఆవిధముగ సంపూర్ణచంద్రుడునుకూడ ప్రకాశింప నేరదు. పరిపూర్ణమగు పాలసముద్రమునుగూడ వెలుంగనేరదు. అతిమనోహరమగు

లక్ష్మీదేవి ముఖముగూడ అంత ఆహ్లాదకరము కానేరదు. పూర్ణచంద్రుని మేఘమాలిక గప్పినట్లును, తెల్లటిపాలగారేసు మఖిగప్పినట్లును, స్వభావ ముగా శుద్ధమగు మనస్సును, లేక, శుద్ధుడగు ఆత్మను, ఆశాపిశాచి గప్పు కొని చెరచును. కావున ఓ శ్రీరామా! నీవు బుద్ధిమంతుడవై సకలాశలను పరిత్యజించి సంసారబంధమును విడిచి నిర్మల చిత్తుడవు కమ్ము. అదియే మోక్షము. ఆశయొకటిటియే మనస్సును సన్మార్గమునకు పోనీయకుండుటకు ఉరితాడు. అట్టి ఈ ఆశ తొలగిపోయినచో ఎవ్వడు ముక్తుడు కాడు? ఎట్టి వాడును ముక్తుడగును.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉపశమ ప్రకరణమున పుణ్యపావనుల ఉపాఖ్యానమను
ఇరువదియావ సర్గము ముగిసెను.

—*—

శ్రీవాల్మీకిమహర్షి భరద్వాజునిజూచి ఇట్లనియె. ఓ భరద్వాజా! ఇట్లు వశిష్ఠమహర్షి జన్మాంతర స్మరణవలన చిత్తశాంతి కలిగెనని చెప్పి ఇకను ఒకానొక సమయమునందు పుణ్యపరిపాకముచేత విషయసుఖము కూడా చిత్తశాంతి సాధనమగునని ఉపదేశింప దలంచి శ్రీరామచంద్రుని జూచి ఇట్లనియె.

—* బలిచక్రవర్తి ఉపాఖ్యానము. *—

రఘువంశమను ఆకాశమునకు చంద్రునివంటి ఓ రామచంద్రా! నీవు పైనవర్ణించినట్లు కాకున్నను, బలిచక్రవర్తివలె తత్క్షణమే వికాసము నొం దిన చిత్తముతో జ్ఞానమును సంపాదింపుము. అనిన శ్రీరామచంద్రుడు ఇట్ల నియె. ఓ మహాత్మా! వశిష్ఠమహాముని! ఆబలిచక్రవర్తికి జ్ఞానము ఎట్లుకలి గెనో, దానిని నాకు వివరించి చెప్పుము. నా జ్ఞానము ఈ చరిత్రము వలన మఱింత అభివృద్ధియగును గాక. నా విషయమున మీకు విసుకు కలుగదని బాగుగా నెఱుగుదును. నమ్రులై జిజ్ఞాసువులై (విషయమును తెలిసికొన దలంచువారై) యున్న శిష్యులు ఎన్నిమారులు ఏ విషయములు అడిగినను ఉపదేశకులగు మహాత్ములకు విసుకు కలుగదు. అని శ్రీరాముడు పలికిన వశి ష్ఠమహాముని ఇట్లనియె. ఓ సత్యపరాక్రమా! శ్రీరామా! ఈ ప్రపంచము నందు ఒకవైపున ఒకానొక దిక్కునందు పాతాళమను ఒకలోకము కలదు. అది భూమికంటె క్రింద నున్నది. ఆలోకమును రాక్షసులు అనేకులు తమ చేతులచేత మోయుచుందురు. ఇట్టి ఆలోకమున విరోచనుని పుత్రుడగు

బలిచక్రవర్తి అను రాక్షసరాజు రాక్షసులను పాలింపుచు నిలచి యుండెను. క్రీడామాత్రముగా నాబలిచక్రవర్తి సర్వలోకములను జయించెను. శత్రువులులేకుండా అతిశాంతముగా పదికోట్ల సంవత్సరములు రాక్షసరాజ్యమును పరిపాలించెను. పిమ్మట అనేక యుగములు పలుమాఱు వచ్చుచు బోవుచుండగను, దేవతలును, రాక్షసులును, మనుష్యులును, వారివారి కర్మానుగుణముగ నశింపుచు జనింపుచు క్రిందు మీదగుచుండగను, ఎల్ల కాలము త్రిలోకములయందు గల సుఖములన్నియు పాటిమాటికిని ఏకరూపముతో అనుభవించి విసుకు పుట్టుచుండగను, ఒకనాడు బలిచక్రవర్తికి మనస్సున భయము పుట్టెను. ఇట్లు భయముగలవాడై తన గృహమునందలి ఏకాంత స్థానముజేరి ఈ విధముగా విచారింప సాగెను. ఆహా, లోకమునకంతయును ఆశ్చర్యమును కలిగించుచు అతివిస్తారమైయున్న ఈ రాజ్యమును అనుభవించుటచేత నాకేమి వచ్చినది. ఇందు అధికములగు భోగములు కలవుగాని అవి కేవలము భారమాత్రములే. ఈ బ్రతుకు మొట్టమొదటమాత్రమే కొంత రుచిగానుండునట్లు ఉండునుగాని, పిమ్మట నీరసమగును. ఇందు అనుభవింపబడు భోగములు ఇవియే యనవేల? సర్వవిషయములును ఇట్టివేకదా? ఇవి అన్నియును అవశ్యముగ నశించియే తీరును. ఇట్టి ఈబ్రతుకుతోనేమి? అనుభవించిన వానినే మఱల మఱల అనుభవించుచు నుండుటయే గాని, ఇంతకంటె ఇందు మఱేమియు కానరాలేదు. దీనివలన సాధింపబడిన పురుషార్థము ఎయ్యది? ఇది ఏసుఖమును కలిగింపగలదు?

శ్లో॥ పునరాలింగ్యతే కాంతా పునరేవచ భుజ్యతే ।
సేయం శిశుజనక్రీడా లజ్జాయై మహతామిహ ॥

ఒకమాఱు ఆలింగనము చేయబడిన స్త్రీయే మఱల మఱల ఆలింగనము చేయబడుచున్నది. ఒకమారు అనుభవింపబడిన భోగములే మఱల మఱల అనుభవింపబడుచున్నది. ఇది ( సంసారము ) ఈ సంసారము చూడ చూడ పిల్లవాండ్ర ఆటలవలె నున్నది. గొప్పవారికి దీనివలన సిగ్గేల కలుగలేదో తెలియ లేదు.

శ్లో॥ తమేవభుక్త్వ విరసం వ్యాపారౌఘం పునఃపునః ।
దివసే దివసేకుర్వన్ ప్రాజ్ఞః కస్మాన్న లజ్జతే ॥

సర్వకార్యములును ఒకమాఱు చేయుబడినవే యగుటచేత నీరసములై యున్నవి. ఇట్టి వ్యాపారకార్యములనే దినము దినము తిరుగా తిరుగా చేయుచుండియు, బుద్ధిమంతులగు వారికి కూడా సిగ్గేల కలుగలేదో తెలియ

లేదు. ఇది చూడగా, చిత్రముగ నున్నది.

శ్లో॥ పునర్దివం పునారాత్రిః పునఃకార్య పరంపరా ।
పునఃపున రహంమన్యే ప్రాజ్ఞస్యేయం విడంబనా ॥

గడచినపోయిన పగళ్ళే మఱల మఱల వచ్చుచున్నవి. గడచిపోయిన రాత్రులే మఱల మఱల వచ్చుచున్నవి. ఒక దినమునందు చేసిన కార్యములనే మఱల మఱల చేయుచున్నారు. ఇది యంతయు చూడగా, బుద్ధిమంతులగువారికి పరిహాసముగా ఏలదోచలేదో తెలియలేదు.

శ్లో॥ కృతయాప్యన యానిత్యం క్రియయాకృత కార్యయా ।
కోర్థస్స్యాత్త్రాదృశేయేన పునఃకర్మ నవిద్యతే ॥

ఇదియును గాక ఒకమాఱు చేయబడి ఫలమును అనుభవింప బడిన కర్మలను ఎన్నిమాఱులు ఆచరించినను ముగింపులేదు "నేడు దీనిని చేసితిమి గదా, ఇక జేయనక్కఱలేదు" అనుమాట ఎప్పటికిని లేదు. "నేడు దీనిని అనుభవించితిమిగదా, రేపు మఱియొకదానిని అనుభవింప వచ్చును" అనునదియులేదు. ఇకను ఇట్టికర్మాచరణమువలన ప్రయోజనమేమి? ఇట్లు నాశశీలమై చర్విత చర్వణముగ అనుభవించిన దానినే అనుభవింపబడుచున్న ఈభోగములకంటె వేఱై, ఎప్పటికిని నశింపని పదార్థము ఏదికలదో? దేనిని ఆశ్రయించిన నిత్యసుఖము దొరుకునో? అని ఈవిధముగ ఆబలిచక్రవర్తి ఏకాంతమున మేడపైనుండి తనలో విచారింప నారంభించెను. అట్లు కొంతసేపు విచారించి మనస్సును ఏకాగ్రముచేసి ధ్యానించి ఒకక్షణము ఉండి అంతలోనే "ఆహా! అట్టివినాశ శూన్యమగు విషయము జ్ఞప్తికివచ్చినది" అని నోటితో చెప్పుచూ ఆవిషయమును బలాత్కారముగ కనుబొమలు ముడివైచుచు ( అనగా, విషయములనుండి మఱలలేని, బుద్ధిని బలాత్కారముగా మఱల్చుచు ) బుద్ధియందు స్థిరము చేసెను. నేను చిన్నవాడుగానుండినప్పుడు పరమార్థవేదియును, సర్వలోకములయొక్క కార్యకారణ స్వరూపములను ఎఱిగినవాడును, ఆత్మజ్ఞానియును, నగు నా జనకుడైన విరోచనుని ఈవిషయమునుగూర్చి ప్రశ్నించితిని. ఓతండ్రీ! మహాత్మా! సర్వ సుఖములయొక్కయు దుఃఖములయొక్కయు సుళ్ళు ఏస్థలమునందు శాంతములగునో దేనిని ఆశ్రయించిన వానిని బాధింపవో, అట్టి స్థలమును, లేక, పొలిమేరను, నాకుచెప్పుము. ఓతండ్రి ! మనస్సునందలి మోహము ఏస్థలమునందు ఉపశాంతి కెందును? ఆశలన్నియును ఎచ్చట ధ్వంసములగును? రాగ ద్వేషాది రూపములగు సంక్షోభములులేని విశ్రాంతి దేనిని ఆశ్రయించిన ఎల్ల

కాలము ఏకరూపముతో నుండును. ఏ స్థలమునందు దుఃఖలేశమైనను లేని పరమానందము అతివిస్తారమై యుండును ? అట్టి మనోహరమగు ఒకానొక ప్రదేశమును నాకు ఉపదేశింపుము. నేను దానియందు దృఢమగు విశ్రాంతిని చెందెదను. అని ప్రశ్నించిన తోడనే మాతండ్రి ఇట్లనియె. ఓవత్సా ! పుత్రుడా ! నీ వడిగిన అట్టి ప్రదేశము ఒకటొకటి గలదు. అది మహావిశాలమైనది. ఈ త్రిలోకములు గలసిన బ్రహ్మాండములు ఎన్నివేలైనను ఆ ప్రదేశమును నిండింప జాలవు. అట్టి ప్రదేశమునందు భూమిలేదు. ఆకాశమును లేదు. సముద్రములుగాని, పర్వతములుగాని, లేవు. అరణ్యములుగాని, తీర్థములుగాని, నదులుగాని, సరస్సులుగాని, లేవు. ఆప్రదేశము ఒకటొకటియే కలదు. అతి ప్రకాశవంతుమును, సర్వమును జేయువాడును, సర్వవ్యాపియును, సర్వాత్మకుడును, నగు ఒకడు మహాత్ముడు ఆప్రదేశమునకు ప్రభువు. ఆ మహాత్ముడు ఊరక ( ఏ కార్యములను జేయక ) నుండువాడె. ఆప్రభువు చేత ఒకానొక మంత్రి నియమింప బడెను. ఆమంత్రి ఆలోచనా పూర్వకముగ సర్వకార్యములను ఆచరించుచుండును. ఎన్నడును సంయోగను నొందుటకు సాధ్యపడని పదార్థములకు కూడ దృఢసంయోగము గలిగించును. వియోగము నొందుటకు సాధ్యపడని వానికి గూడ వియోగమును కలిగించును. అయినను, ఆ మంత్రి స్వయముగనే ఏ పదార్థమును అనుభవింప జాలడు. దేనిని తెలిసికొన లేడు. ఇట్లుండియు రాజుకొఱకై మాత్రమే సర్వమును ఎడతెగక చేయుచుండును. మఱియును ఆరాజు ఎప్పటికిని ఏమియును చేయక ఏకాంతప్రదేశమునందు స్వస్థుడై యుండును. పైన వర్ణింపబడిన మంత్రియే సర్వకాలములను సమర్థించుచుండును. అనిన నేను ఇట్లని మఱల ప్రశ్నించితిని కదా. ఓ మహాత్మా ! తండ్రీ ! మనోవ్యాధులును దేహబాధలును లేని ఆప్రదేశము ఎయ్యది ? దానిని పొందు ఉపాయము ఎద్ది ? ఇంతకుముందు దానిని ఎవ్వరు పొందిరి ? మనము విలాసమాత్రముగ ప్రపంచమును వశము చేసికొనుచుండియు, జయింపకున్నట్టి ఆమహాబల సంపన్నుడగు ప్రభువు ఎవ్వడు ? మనకును సాధ్యము కాని అట్లు ఆతని రాజ్యమును రక్షింపగలిగిన ఆమంత్రి ఎవ్వడు ? అని అడిగిన మాతండ్రి ఇట్లని సమాధానము చెప్పియుండెను.

ఓ పుత్రుడా ! ఆమంత్రి సామాన్యుడు కాడు. అసమాన బలవంతులని ప్రసిద్ధిగాంచిన దేవరాక్షసులు అందఱును కలసి ఇంతకంటె లక్షము దుంగులు అధికులైయున్నను ఆ మంత్రిని ఎదిరింపలేరు. ఒకడు క్షణమైనను

అతని ఎదుట నిలువ లేరు. ఏల అనిన అతని సాధించుటకు మన ఆయుధములు ఏవియు బనికిరావు. ముసలములు, ప్రాసములు, వజ్రాయుధము, చక్రములు, గదలు మొదలగు ఈ ఆయుధములు అన్నియును " రాతిపై తామరరేకుతో గొట్టబడిన ప్రేటువలె " అందు నిష్ప్రయోజనము లగును. మొకటిబోవును. ఆమంత్రికిని ప్రభువునకును యుద్ధమగుట తటస్థించునేని అప్పుడు ప్రభువు మాత్రము అతని సుఖముగ జయింప గలడు. ఇంతయే కాని, వారి మండల మునందు అంతఃకలహము లేకపోయిన ఎట్టివారును వానిని కదలింపజాలరు. మఱియొక విషయము. ఓ పుత్రుడా! ఆమంత్రిని చక్కని యుక్తితో బట్టి కొన గలిగితిమేని ఒక్క నిమిషమాత్రమున స్వాధీనుడగును. ఆయుక్తిని ఎఱు గలేక పోయినచో, మిక్కిలి దుడుకు గలవాడై సర్పమువలె అతడు కాల్చి వేయును. ఓ పుత్రుడా! నేను చెప్పిన కథయొక్క తాత్పర్యమును వినుము. ఇచ్చట దేశమని చెప్పబడినది సర్వదుఃఖహరమగు మోక్షమును గూర్చియే. అచ్చట ఉన్నాడని చెప్పబడిన ప్రభువు సర్వ లోకాతీతుడును, మహాత్ము డును, నగు పరమాత్మయే. ఆయనచేత సర్వకార్య నిర్వాహకుడుగా ఏర్ప రుపబడిన మంత్రియు మనస్సే అని తెలిసికొనుము. మఱియును ఓకుమారా! ఆ మనస్సును యుక్తితో జయింపవలయు నంటిని గదా? ఆయుక్తి వైరా గ్యమే. సర్వ విషయములను సర్వకాలములయందును అభిమానింప కుండుట వలన ఏ విషయమునందును ఆశయుంచకుండుట వలన, మనోవ్యాపారము అంతయును అణగును. విషయములను ధ్యానించిననే గదా, క్రమక్రమముగ వానియందు అభిమానము, కామము, క్రోధము, మొదలగు వికారములు ఒకదాని వెనుక ఒకటి పుట్టుచు సంసారమును అభివృద్ధిజేయుట? కావున ఓ పుత్రుడా! ఈ వైరాగ్యమే మనోజయమునకు చక్కని యుక్తి. దీనిచేత మదించియున్న మనస్సను ఏనుగను అతిశీఘ్రముగ నిగ్రహింప సాధ్యమగును.

—* చిత్తజయోపాయము. *—

ఓ కుమారుడా! మఱియొక విశేషము. చిత్తజయము ఈ క్రింది విధ ముగ సంపాదింప వచ్చును. మొట్టమొదట వివేకము లేనివాడు మోక్ష మును సాధింప దలచెనేని వ్యవహారము నంతయును నాలుగు భాగములుగ భాగించి భోగేచ్ఛ తొలగుట కష్టము గావున రెండుభాగములు మాత్రము భోగానుభవముచే గడపి తక్కిన రెండు భాగములలోను చిత్తమును బలా త్కారముగ నిరోధింప వలయును. క్రమముగ ఆభాగములలో ఒక దానిని వేదాంతశాస్త్ర విచారముతోను రెండవ దానిని గురుశుశ్రూషతోను

గడుప వలయును. ఇట్లుచేసిన చిత్తము కాలము గడుచుకొలది కొంత వివే
కము కలది యగును. ఈరీతిగ అల్పవివేకము రాగానే, అప్పుడు ఒకటి-భాగ
మును మాత్రమే భోగానుభవములకు విడిచి తక్కిన మూడుభాగములును
చిత్తనిగ్రహమునందు ఉపయోగింప వలయును. అందు ఒక దానిని శాస్త్ర
విచారముతోను తక్కిన రెంటిని గురుశుశ్రూషతోను గడుప వలయును.
ఇట్లు చేసిన మనస్సు పరిపక్వమై వివేకవంతమగును. ఇట్లు పరిపూర్ణమగు
వివేకము కలిగిన పిమ్మట భోగ పరిత్యాగము ఆవశ్యక మగుటచేత భోగాను
భవమును సంపూర్ణముగ వదలి వేయ వలయును. కాలభాగములను నాలు
గింటిని మనోనిగ్రహమునందే గడప వలయును. రెంటిని శాస్త్రవిచార
వైరాగ్యములచేతను, తక్కిన రెంటిని ఆత్మధ్యాన గురుశుశ్రూషల చేతను,
గడప వలయును. ఇట్లు చేసినయెడల విచార బలము వలన ఓ పుత్రుడా !
ఆ మనస్సు క్రమముగ ఆత్మయందలి నిష్ఠను, ఆశాపరిత్యాగమును, దృఢ
ముగ వశపరుచు కొనును. దీనిచేత పరిపూర్ణ మగు శాంతి నొందును. సర్వ
కాలములందును నిష్కళంకమై నిలచును. మఱియొక విశేషము. భోగముల
యందు అసూయకలిగిననేకాని, ఆత్మవిచారము కలుగదు. ఆత్మ విచారము
కలిగిననేకాని, భోగేచ్ఛ తొలగదు. ఈవిధముగ నీ రెండును ( వైరాగ్య
విచారములు రెండును ) " సముద్ర మేఘములవలె " ఒకదానివలన ఒకటి
పూర్ణము లగుచుండును. సముద్రమునందలి జలమును పానము చేయుట
చేత మేఘము పరిపూర్ణమగును. ఆ మేఘము వర్షించిన జలములు నానాము
ఖములుగ తనలో ప్రవేశించుటచేత సముద్రుడు పరిపూర్ణుడగును కదా ?

ఓ పుత్రుడా ! ఈ కారణమువలన నీవు మొట్టమొదట అల్పదోష
యుక్తమని పరిత్యజింపక నిజవృత్తిచేత ధనము ఆర్జింపుము. ఆధనముచేత
సజ్జనులను గౌరవ పూర్వకముగా సంపాదించి మన్నింపుము. వారితో
సహవాసము చేయుటచేత నీకు వైరాగ్యము ఉదయించును. దాని ప్రభా
వము వలన వేదాంత విచారము అబ్బును. దీనివలన సర్వోత్తమ మగు ఆత్మ
లాభము కలుగును. ఉచితానుచిత రీతులతో ధన సంపాదనము ఆవశ్యక
మని బోధించు అర్థశాస్త్రమునకు ఇదియే అభిప్రాయము. అని ఈ విధ
ముగా ఆత్మవిచార శీలుడగు మాతండ్రి మున్ను నాకు ఉపదేశించి యుం
డెను. అదృష్టవశమువలన అది నాకు ఇప్పుడు జ్ఞప్తికి వచ్చినది. జ్ఞానవంతు-
డనైతిని. నాకు ఇప్పటికి భోగములందు అరుచి కలిగినది. నిశ్చయముగ కలి
గినది. ఇక వేదాంత విచార బలముచేత అమృత సదృశ మగు శాంతిసుఖ

మును చెందెదను. వైరాగ్యమువలన గాని, వేదాంత విచారము కలుగదని
మాతండ్రి చెప్పియుండెను. అనుభవముకూడా అట్లే యున్నది. ఇప్పుడు
నాకు వైరాగ్యము కలిగెను. ఇక వేదాంత విచారము నిస్సంశయముగా
దొరుకును. ఆహా! మిక్కిలి చల్లనై ఈ శాంతి భూమి ఎంత రమ్యముగ
నున్నది. సుఖదుఃఖములు రెండునుగూడా దీనియందు (దీనిని ఆశ్రయించిన
వారికి) సమానము లగుచున్నవి. చిత్త సంక్షోభమును కలిగింప లేని వగు
చున్నవి. కావున ఎల్లెన్నను శాంతినే ఆర్జింపవలయును. ఆత్మనిష్ఠవలనగాని,
శాంతి కలుగదని మాతండ్రి చెప్పియుండెను. కావున ఇప్పుడు ఆత్మజ్ఞాని
యును, కులగురుండును, నగు శుక్రాచార్యుని వద్దకు పోయి ఆమ్మహాత్ముని
ఉపదేశమువలన నేనెవ్వడనో, ఆత్మ యనగా ఎద్దియో, తెలిసికొనియెదను
గాక. అజ్ఞానమును తొలగించు కొనియెదను. ఓ రఘుపుంగవా! శ్రీరామా!
బలవంతుడగు ఆ బలిచక్రవర్తి ఈవిధముగా ఆలోచించి కమలములవంటి
తన విశాల నేత్రములను మూసి ఆకాశ మధ్యమునందు నివసించియున్న
శుక్రాచార్యుని ధ్యానించెను.

### శుక్రుడు బలిచక్రవర్తికి పరమార్థమును ఉపదేశించుట.

ఇట్లు ధ్యానింపగానే సర్వమయుడును, అనంతుడును, సర్వవ్యాపి
యును, నగు పరమాత్మయే స్వరూపముగా గల శుక్రుడు తన శరీరమును
బలిచక్రవర్తికి సమీపమునన్నున్న రత్నమయ గవాక్షముగుండా లోనికి ప్రవే
శింపజేసెను. ఇట్లువచ్చిన శుక్రునిజూచి ఆబలిచక్రవర్తి సవినయముగా రత్న
ములతోను, మందారపుష్పములతోను, పూజజేసి సాష్టాంగ నమస్కారము
గావించెను. పిమ్మట సవినయముగ నిట్లనియె. ఓమహాత్మా! శుక్రాచార్యా!
సూర్యకాంతి సర్వజనులను వారివారి కార్యములందు ప్రేరేపించునట్లు మీఅను
గ్రహమువలనకలిగిన జ్ఞానము మీఎదుట నాచేత కొంతమాట లాడించుచున్న
ది. ఓమహాత్మా! ఆచార్యా! ఈలోకమునందు సత్యమగు పదార్థము ఎయ్యది?
సారభూతము ఎయ్యది? ఇది యంతయు దేనిచేత రచియింపబడి యున్నది?
నేనెవ్వడను! నీ వెవ్వడవు? ఈ లోకము లెయ్యవి? అను ఈ విషయము
లను గూర్చి నాకు విమర్శించి చెప్పవలయును. అని యడిగిన శుక్రాచా
ర్యుడు ఇట్లనియె. ఓరాక్షసరాజా! బలిచక్రవర్తీ! ఈప్రశ్నములకు ఉత్తర
ముగా నెంతయైనను ఉపన్యసింప వచ్చును. నాకిప్పుడు అంత అవకాశము
లేదు. నేను ఆకాశమునకు పోదలంచు చున్నాను. నాగృహమునందు నాకు
కార్యభారము కలదు. అడిగినప్పుడు ప్రత్యుత్తర మివ్వకుండ పోవుటయు

మేలు కాదు. కావున సర్వసార భూతమగు విషయమును సంక్షేపముగ చెప్పెద వినుము. సూక్ష్మబుద్ధి గలవానికి అంత అధికముగ ఉపన్యసింప వలసినపని లేదుగదా?

శ్లో॥ చిదిహాస్తిహి చిన్మాత్ర మిదం చిన్మయ మేవచ ।
చిత్త్వం చిదహ మేతేచ లోకా శ్చిదితి సంగ్రహః ॥

ఓ రాక్షసేంద్రా! ఈ లోకమునందు ఉన్న పదార్థము చిత్తు (జ్ఞాన రూపమగు బ్రహ్మము.) ఇందు సారభూతమైనదియు చిత్తే. ఈ ప్రపంచమునకు స్వరూపమును చిత్తే. నీవును చిత్తే. నేనును చిత్స్వరూపుడనే. ఈలోకములన్నియు చిత్స్వరూపములే. ఇదియే సర్వసారభూతమగు విషయము. నీవు వివేకవంతుడవు అగుదువేని తగిన అధికారివి అగుదువేని మోక్షప్రాప్తికి ఈ యుపదేశమే చాలును. అట్టివాడవు కాకుందువేని ఎంత విశేషముగా జెప్పినను బూడిదెలో చేసిన హోమమగును. ఆచిత్తు (జ్ఞానము) దృశ్య సంబంధము కలవి యగునేని (నేను వేరు, దృశ్యము వేరు, అనుభావన యుండునేని) అదియే బంధము. ఆసంబంధమును విడచునేని (ఈదృశ్యము నాకంటె భిన్నము కాదనికాని, దృశ్యపదార్థము బొత్తిగనే లేదనికాని, భావము కలిగెనేని) అదియే మోక్షము. దృశ్య సంబంధ రహితమగు చైతన్యమే స్వస్వరూపము. ఇదియే సర్వవేదాంత సిద్ధాంత రహస్యము. కావున ఈ నిశ్చయము హృదయమునందు స్థిరముచేసికొని దివ్యజ్ఞాన సంపన్నయగు బుద్ధితో విచారించుకొనుము. ఆత్మావలోకనము గావింపుము. ఇట్లు చేసితివేని మోక్షమును చెందెదవు. శాశ్వతమగు స్థానమును పొందెదవు. ఇక నేను ఆకాశమునకు బోయెదను. ఏదియో యొక దేవకార్యము సాధించుకొఱకై సప్తఋషులు అచ్చట చేరియున్నారు. నేను కూడా అచ్చట నుండవలయును కదా? ఇట్లు పలికి ఆ శుక్రాచార్యుడు ఆకాశమునకు బోయెను. బలిచక్రవర్తియును ఆశుక్రాచార్య ఉపదేశానుసారముగా "సర్వప్రపంచము చిన్మయమే" అని నిశ్చయించి ధ్యానింప నారంభించెను. అమ్మహాత్ముడగు శుక్రాచార్యులు సర్వమును యుక్తముగా ఉపదేశించెను. చైతన్యమునకంటె అతిరిక్తమైనది ఇచ్చట ఏదియు లేదు. నేనును చైతన్య రూపుడనే. ఈ లోకములన్నియు చైతన్యరూపములే. ఈదిక్కులును, లేక, కోర్కెలును, కర్తృకర్మ కరణాది భేదములతో గూడిన కర్మయు చైతన్యమాత్రములే. కావున నేటికి చూడబడునవియు, చూపును లేక, సర్వకాలములయందు ఎడతెగని ప్రకాశముగలిగి పరిశుద్ధరూపుడై ఏక

రూపుడై యున్న పరమాత్మయేనై నిలచితిని. కేవలసాక్షినై నిలచితిని. దృశ్యసంబంధము లేని చైతన్యమే స్వరూపముగా గలదియు, సర్వప్రపంచమును ఆవరించి యున్నదియు తనకు తెలిసికొనతగిన అన్యపదార్థము లేనిదియు నగు సంవిద్రూపమే ( నిర్వికార బ్రహ్మరూపమే ) నాది. నాస్వరూపమునకు విభాగములు లేవు. ఇట్లు తలంచుచునే పరమజ్ఞాన సంపన్నుడగు నాబలిచక్రవర్తి ఓంకారమునకంటె ఆవలనున్న అర్ధమాత్రయందలి అర్థమును ( సర్వప్రపంచ లయస్థానమగు బ్రహ్మమును ) ధ్యానింపుచు నిర్వికల్పసమాధియందు నిలచెను. అప్పుడు అమ్మహాత్ముని యొక్క మనస్సునందు సర్వ సంకల్పములును నశించెను. ప్రపంచ భావన యంతయు అణగెను. చూడబడునది, చూపు, చూచువాడు, అను మొదలగు భేదములు దూరముగా తొలగిపోయెను. ధ్యానించువాడు, ధ్యానింపబడునది, ధ్యానము, అనునవి ఆ బలిచక్రవర్తియొక్క మనస్సునందు లేకుండెను. ఇంత ఏల ? ఆస్థితియందు మనస్సే నశించెను. సర్వసంస్కారములును తొలగెను. ఇట్టివాడై మోక్షరూపమగు మహాస్థానమును ఆశ్రయించి యాబలిచక్రవర్తి గాలిలేనిచోటనున్న దీపమువలె నిశ్చలుడై నిర్మలుడై యుండెను. ఈ విధముగా ఆశలు లేనిదియు, పరిపూర్ణమైనదియు, ప్రపంచ భావనయను దోషము లేనిదియు నగు నిర్మలచిత్తముతో, లేక, నిర్మలమగు బ్రహ్మస్థితితో నాబలిచక్రవర్తి మేఘరహితమగు శరత్కాల ఆకాశమువలె నిర్మలుడై ప్రకాశించెను.

ఓ నీలోత్పలశ్యామా ! శ్రీరామా ! ఈవిధముగా ఆ బలిచక్రవర్తి సమాధిస్థితుడైయుండగా అతని అనుచరులగు రాక్షసులు అనేకులు దర్శనార్థులై స్ఫటికమయమగు ఆ బలిచక్రవర్తి యొక్క సౌధముపైకి ఎక్కిరి. పిమ్మట ఆ బలిచక్రవర్తియు చాలా సేపటినుండి నిర్వికల్ప సమాధియందు నిలచియున్నవాడు కావున వారు తన సమీపమునకు వచ్చునప్పటికి మేలుకొనియుండెను. ఈ విధముగా దివ్యజ్ఞాన సంపన్నుడై ఆబలిచక్రవర్తి ధ్యేయత్యాగమును ఆశ్రయించిన మనస్సుతో ( సర్వమును ఆచరించుచున్నను " నేనేమియు చేయువాడను కాను " అను నిశ్చయముతో గూడిన మనస్సుతో ) రాజకార్యములను అన్నిటెని యథాపూర్వముగా ఆచరించుచునే యుండెను. ఆపదవచ్చినను, సంపదవచ్చినను, వానిని రెంటిని అతడు సమముగనే చూచుచుండెను. ఆతని బుద్ధి ఆపత్కాలమునందు క్షీణించుటయు లేదు. సంపత్కాలమునందు అభివృద్ధి యగుటయు లేదు. ఆవ్యవహారకాలమున ఆతనికి కాలానుగుణముగా అనేకములగు ఊహలును ( ఇష్ట

ములగు పదార్థములను సాధించు సంకల్పములు ) అనేకములగు అపోహలును ( అనిష్టములగు వానిని తొలగించు కొనుటకును పరులకు ఆ అనిష్టములను కలిగించుటకును చేయు తలంపులు ) వేనవేలుగా కలుగుచుండినవి. కలిమిలేములును వివిధముల పోచుచుండినవి కాని, తత్వమును ఎఱిగినవాడగుటచేత అతనికి మాత్రము ఎందును విశ్వాసము లేకుండెను. కావున ఓ శ్రీరామచంద్రా ! ఇహ పరలోక సుఖములకై పరుగిడునదియు, లోకాచారములయందు పోరాడుచున్నదియు,నగు మనసును నీవును వైరాగ్యయుక్తిచేత నిగ్రహించి హృదయమను గుహాయందు సంస్థాపింపుము. మనోనిగ్రహాప్రకారము ఎట్లనియెడ వేమో వినుము. ఆ మనస్సు బాలునివలె మనకు గానవచ్చిన ప్రతిదానియందును ప్రవేశించును నుండును. దానిని అట్లుపోనీక మరలించుచు పరమాత్మయందే నెలకొలుపు చుండవలయును. ఈ విధముగా పూనికతోనే ఎవ్వడు అభ్యాసముచేయునో వాడు అల్పకాలములోనే మనస్సనియెడు మదపుటేనుగును బాగుగ బంధింప గలుగును. మోక్షమును పొంద గలుగును.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉపశమ ప్రకరణమున బలిచక్రవర్త్యుపాఖ్యానమను
ఇరువది యొకటవ సర్గము ముగిసెను.

—*—

వాల్మీకిమహర్షి భరద్వాజుని చూచి ఇట్లనియె. ఓ భారద్వాజా ! ఈ విధముగా బలిచక్రవర్తియొక్క ఉపాఖ్యానముచేత వసిష్ఠమహాముని శ్రీరామచంద్రునకు "పుణ్యాతిశయమువలన విషయ సుఖము కూడ చిత్తశాంతికి కారణమగును" అనిచెప్పి కొన్నికొన్ని సమయములందు ఈశ్వరానుగ్రహముకూడ చిత్తశాంతికి కారణమగునని ఉపదేశించువాడై ఇట్లనియె.

—* ప్రహ్లాదోపాఖ్యానము. *—

ఓ లోకాభిరామా ! శ్రీరామా ! మఱియొకవిధముగా గూడ జ్ఞాననిష్ఠ కలుగును. ప్రహ్లాదునకు పైనవర్ణించిన విధములచేతగాక, స్వయముగనే జ్ఞానసిద్ధి కలిగెను. అవ్విధమును వివరించెదను వినుము. దేవతల కందఱకును ప్రబల శత్రువైయున్న హిరణ్యాకశిపుడు నృసింహమూర్తిచేత హతుడుకాగానే ప్రహ్లాదుడు పితృశోక తప్తుడై ముందువెనుక గానలేక చింతించెను. ఆహా, మాతండ్రి మొదలగు రాక్షసోత్తములు అందఱును "ప్రళయకాల వాయువుచేత కులపర్వతములువలె" విష్ణుమూర్తిచేత సంహరింపబడిరి.

ఆవిష్ణుమూర్తి మాకు ( రాక్షసులకు ) సాధ్యుడుకాడు. మా తండ్రికంటె ఎన్నియోరెట్లు బలాఢ్యులగు మాతాతలతోకూడ ఒకరిపై నొకరు పర్వతములు వైచుకొను నంతటి ఘోరయుద్ధములు అనేకములు చేసి ఆ విష్ణువు జయముగాంచి యున్నవాడు. అతిఘోరములై వర్ణించుటకు అశక్యములై మహాబలవంతులగు రాక్షసులతో కలిగిన యుద్ధమునందుకూడ విష్ణువు ఇంచుకమైనను భయము నొందినవాడు కాడు. ఇట్లుండగా అట్టి రాక్షసులకంటె ఎన్నియోరెట్లు బలహీనుడగు మాతండ్రికి భయపడునా? ఇట్లగుటచేత మహాపరాక్రమ వంతుడగు నావిష్ణువును జయించుటకు ఉపాయము ఏదియును లేదు. కావున సర్వేశ్వరుడగు అమ్మహాత్ముడే శరణమని ఆశ్రయించెదను గాక. ఇట్లు చేయుటకంటె ఆత్మరక్షణోపాయము వేరే ఏదియు గాన రాలేదు. ఈ క్షణము మొదలుకొని జనన మరణములులేని ఆ నారాయణుని నిశ్చల చిత్తముతో సేవించెదను. సర్వప్రపంచమును నారాయణ మయమే.

శ్లో॥ నమోనారాయణాయేతిమంత్ర స్సర్వార్థసాధకః ।
నాపైతిమమ హృత్తోఽసా దాకాశాదివ మారుతః ॥

నేనును నారాయణ మయుడనే. ఇష్టార్థములను అన్నిటి నొసంగగల "నమోనారాయణ" అను మంత్రము గాలి ఆకాశమును విడిచి పోవనట్లు నామనస్సును విడిచి పోదు. తాను విష్ణువుగాక విష్ణువును పూజించిన ( అనగా "విష్ణువు వేరు, తాను వేరు" అను భేదభావనతో విష్ణువును పూజించిన ) పూజాఫలము ( సర్వశక్తిత్వము ) కలుగనేరదు. కావున మొట్టమొదట తాను విష్ణువై (అభేద జ్ఞానము కలిగి) విష్ణువును పూజింప వలయును. నేను ఇప్పుడు విష్ణువు నైతిని. ఓ శ్రీరామచంద్రా ! ఈ విధముగా విచారించి ఆ ప్రహ్లాదుడు నారాయణ మయమగు శరీరముగలవాడై విష్ణుపూజా విధిని గూర్చి మరల ఇట్లని విచారించెను. ఇప్పుడు నాశరీరము విష్ణుమయమైనది. మఱియు వాయురూపము గలిగి ప్రాణప్రవాహ రూపమున నీశరీరమునకంటె అన్యుడై ఒకవిష్ణువు ఉన్నాడు. ఆయనను మనోమయమగు సంభారముతో గూడిన ఉపచారముతో పరివార సహితముగా బూజించెదను. ఓ శ్రీరామచంద్రా ! ఈవిధముగా నిశ్చయించి ఆ ప్రహ్లాదుడు ఏకాంతమునందు కూర్చుండి రత్నమయమగు నర్ఘ్యములను, అతిపవిత్రములగు ధూపదీపములను, బహువిధములగు భూషణములను, ఛత్ర చామరాదులను, మనస్సుతోనే కల్పించి లక్ష్మీపతియగు అమ్మాధవుని పూజించెను. మఱి

యును ఆదేవగృహమునందు విష్ణుయొక్క ప్రతిమను నిలిపి ప్రత్యక్షములగు ధూప దీప భూషణాదులతో బాహ్యపూజ నొనరించెను. అది మొదలు కొని ఆ ప్రహ్లాదుడు అప్పరమేశ్వరునకు ప్రతిదినమును ఇట్లే బాహ్యాభ్యంతర రూపములగు ద్వివిధ పూజను చేయుచుండెను. అప్పటినుంచియు ఆ ప్రహ్లాదుని దేశమునందు గల రాక్షసులందరును పరమ వైష్ణవులైరి. రాజు ఏ ఆచారమును అవలంబించునో ప్రజలు కూడా ఆ ఆచారమునే అవలంబింతురు గదా. ఇట్లుండగ ఈ వృత్తాంతము సర్వలోకములందును ప్రసిద్ధమయ్యెను "రాక్షసులు ద్వేషబుద్ధిని మాని రక్షకునిగా విష్ణువును ఆశ్రయించిరి" అని దేవలోకమునకు గూడా తెలిసెను.

ఓ కమలలోచనా ! శ్రీరామా ! ఈ వార్తను విని "ఇదేమి ? ఈ చిత్రము ? విష్ణుద్వేషులగు రాక్షసులు విష్ణుభక్తి ఎట్లు పరిగ్రహించిరి" అనుచు ఇంద్రాది దేవతలందరు పరమాశ్చర్య భరితులైరి. ఇట్లు ఆశ్చర్యమగ్నులై వారు స్వర్గమును విడిచి క్షీరసముద్ర మధ్యమున శేషతల్పముపై శయనించియున్న విష్ణువు వద్దకు బోయిరి. ఆ విష్ణువు తమకు యుద్ధములయందు సహాయము చేసి రాక్షసులను సంహరించు వాడు కావున ఆరాక్షసులే తనకు ( విష్ణువునకు ) భక్తిచేసిన ఇకను రాక్షసులను సంహరించడేమో ? దానివలన తమకు భయము కలుగునేమో ? అనుభయము ఆ దేవతలకు అధికమయ్యెను. ఇట్లు పోయి అమ్మహాత్ముని ఇట్లని ప్రశ్నించిరి. ఓభగవంతుడా ! ఇదియేమి చిత్రము ? రాక్షసులు ఎప్పుడును మీయందు ద్వేషబుద్ధి కలవారేకదా ? అట్టివారు ఇప్పుడు తన్మయత్వముతో మహాభక్తియుక్తులై మిమ్మే ఆశ్రయించిరి. ఈ విషయమును వినినప్పటినుండియు మాకు పరమాశ్చర్యము కలుగుచున్నది. వాస్తవస్థితిలో పర్వతములను సహితము భేదించునంతటి మహాబలవంతులై పొగరు బోతు తనమున కన్ను గానక నానావిధములగు దుశ్చేష్టలను చేయువారు రాక్షసులు. తమయందలి భక్తి యన్ననో, చివరజన్మమునందు ( ముక్తి కలుగుటకు తగిన ఉత్తమ జన్మమునందు ) కలుగునదిగాని, ప్రతివారికిని కలుగునది కాదు. ఇట్లుండగా ఆరాక్షసులు ఎక్కడ ? విష్ణుభక్తి ఎక్కడ ? అట్టి వారికి ఇది లభించుట ఎక్కడ ? "ఏమియు ఎరుగలేని మూఢుడు మహాగుణవంతు డయ్యెను" అనునట్లు ఈ వృత్తాంతము ఓ భగవంతుడా ! రమారమణా ! సుఖమును భయమును కూడా కలిగించుచున్నది. అతి నీచస్థితియందున్న ఒక సంఘము ఉత్తమ స్థితికి వచ్చెనుగదా, అని సంతోషమును, ఈస్థితిని వారు నిల్పుకొనగలరో,

లేరో, అనియును, శత్రువులు ఇట్లు ప్రబలులై రేని మనకు ఎట్టిబాధ కలుగునో, అని భయమును, మామనస్సునందు పెనగొనుచున్నది. నీచమును, విచార శూన్యములగు కార్యములను చేయునదియు, కర్మలయందును, బుద్ధియందును, మిక్కిలి తక్కువనైనదియు, నింద్యమైనదియు, తుచ్ఛమగునదియు నైన రాక్షసజాతి ఎక్కడ? సర్వోత్తములకుగూడ పొందరాని విష్ణుభక్తి ఎక్కడ? అని ఇట్లు దేవతలు ప్రశ్నించిన ఆ విష్ణువు వారలతో ఇట్లనియె. ఓ విజ్ఞానవంతులారా! శత్రువులను గెలుచునట్టి మహాపరాక్రమము గల ఓ దేవతలారా! ప్రహ్లాదునకు నాయందు భక్తికలదని మీరు దుఃఖపడవలదు. వానికి ఇది కడపటిజన్మము. ఈజన్మముతో వాడు ముక్తినిచెందును. లోకమునందు గుణవంతుడుగా ఉండినవాడు గుణహీనుడైనచో, అది అనర్థహేతువగును కాని, గుణహీనుడగువాడు గుణవంతుడైనచో, అది మేలే అగునుగదా? దీనికి మీరు ఆశ్చర్యపడ నక్కరలేదు. ఇది సహజమే. అగును గాని, విపరీతము కానేరదు. మఱియు ప్రస్తుతము ప్రహ్లాదునకు గలిగిన గుణసమృద్ధి మీకు బాధకరము గానేరదు. కావున అతివిచిత్రములై బహు సంఖకరములైయున్న మీ మీలోకములకు పొండు. ఈవిధముగా స్వప్రకాశ రూపుడగు శ్రీమన్నారాయణుడు దేవతులను ఊరడించి "తీరమున నున్న కానుగపూగుత్తి సముద్రము పొంగివచ్చిన దానిమధ్యమున అణగిపోయినట్లు" క్షీరసముద్ర తరంగమధ్యమున అంతర్ధానము నొందెను. పిమ్మట దేవతలును యథేచ్ఛగా బోయిరి. అంతట ఒకానొకనాడు విష్ణుపూజా తత్పరులగు నారాక్షస సమూహ మంతయును ప్రహ్లాద సహితముగా దేవలోకమునకు బోయెను. ఆ దేవతలును వారితో వైరము పాటింపక మైత్రిచేసికొనిరి. నాటినుండియు ప్రహ్లాదునకు ఇంద్రునకును మైత్రి అధికమై యుండెను.

—※ ప్రహ్లాదునకు చిత్తశాంతి కలుగుట. ※—

ఓ కమలలోచనా! శ్రీరామచంద్రా! పైన వర్ణించిన విధముగా మహాభక్తియుక్తుడై యా ప్రహ్లాదుడు మనోవాక్కర్మలచేత ప్రతి దినమును విష్ణుపూజను ఆచరించుచున్నను అతని మనస్సు మాత్రము శాంతి నొందలేదు. విషయ భోగములందలి ఇచ్ఛమాత్రము సంపూర్ణముగా తొలగెను. త్రాసురతీగె నేలపై నిలువనట్లు ఆ ప్రహ్లాదుని చిత్తము ఎంతరమ్యమగు విషయమునందును నిలువలేదు. ఈ విధముగా విషయ పరిత్యాగమును గావించియు బ్రహ్మమునందు స్థిరము కాకపోవుటచేత అతని హృదయము ఉయ్యాలవలెనున్నట్లు బ్రహ్మ సంసార మధ్యముల ద్రేలజొచ్చెను. ఈవిధముగనున్న

ప్రహ్లాదుని స్థితిని ఆ మహావిష్ణువు క్షీర సముద్రమునుండియే సర్వవ్యాపక మైనట్టియు, సమస్తకల్యాణ గుణయుక్తమైనట్టియు, బుద్ధితో తెలిసికొనెను. తత్క్షణమే భక్తవత్సలుడగుటచేత అస్మహానుభావుడు అతిసంతోష యుక్తు లగు పరిజనులు తన్ననుసరింప పాతాళమునకు బోవుమార్గమును ఆశ్ర యించి ప్రహ్లాదుని యొక్క దేవపూజాగృహమునకు వచ్చిచేరెను. దానిని ఎఱిగి భయ సంభ్రమములు పెనగొన ఆ ప్రహ్లాదుడును పూర్వమునకంటె రెండింతలు అధికమగు సంభారములతో ఆ పరమేశ్వరుని ఆరాధించెను. ఇట్లు పూజించి ఆ విష్ణువు తన పూజాగృహమునందు ప్రత్యక్షముగ నిలచి యుండుటచేత సంతుష్టుడై అర్థగాంభీర్య యుక్తములగు పలుకులతో నాప్ర హ్లాదుడు ఇట్లని స్తోత్రము చేసెను.

శ్లో॥ త్రిభువన భవనాభి రామకోశం
సకలకళంకహరం పరం చకాస్తి ।
అశరణశరణం శరణ్యా మీశం
హరి మజ మచ్యుత మీశ్వరంప్రపద్యే ॥

త్రిలోకములనియెడు గృహమే మనోహరమగు ఆవరణముగ గలిగి నట్టియు ( సర్వవ్యాపనుడ వైనట్టియు ) సమస్త దోషములను హరించు నట్టియు సర్వోత్తముడవైనట్టియు, రక్షకులు లేనివారిని రక్షించునట్టియు, ఆశ్రయింప నర్హుడవైనట్టియు, సర్వేశ్వరుడవైనట్టియు, జన్మనాశములు లేనట్టియు, సర్వనియామకుడవైనట్టియు, ఓ మహావిష్ణువా ! సర్వభావ ముతో నిన్నాశ్రయించెదను.

శ్లో॥ కువలయదళశైల సన్నికాశం
శరదమలాంబర కోటరోపమానమ్ ।
భ్రమరతిమిర కజ్జలాంజనాభం
సరసిజచక్రగదాధరం ప్రపద్యే ॥

నల్లకలువ రేకుల పర్వతముతో సమానమైనట్టియు, శరత్కాలమున అతి నిర్మలమగు ఆకాశగర్భముతో సరిసైనట్టియు, ( ఆకాశము నల్లగా నుండునను సామాన్యభావనను ఆశ్రయించి శరత్కాలమునందు మేఘావర ణము లేకపోవుటచేత ఆ నలుపు మఱింత శుభ్రముగనుండు నను అభిప్రా యముచేత ఈ ఉపమానము చెప్పబడెను.) తుమ్మెదలు, (భ్రమరము) చీకటి ( తిమిరము ) కాటుక ( కజ్జలము ) వీనితో సమానమగు దేహకాంతి

గలిగినట్టియు, కమలము చక్రము గద మొదలగు వానిని ధరించినట్టియు, నిన్నాశ్రయించెదను.

శ్లో॥ విమల మళికలాపకోమలాంగం
సితదళపంకజ కుట్మలాభశంఖమ్ ।
శ్రుతిరణితవిరించి చంచరీకం
స్వహృదయ పద్మజలాశయం ప్రపద్యే ॥

అతినిర్మలుడవును, తుమ్మెదగుంపువలె అతి మనోహరమగు శరీరము కలవాడవును, తెల్లని కమలముయొక్క మొగ్గతో సమానమగు శంఖమును ధరించినవాడవును, వేదధ్వనిచేత రొదసేయుచున్న బ్రహ్మయను తుమ్మెదతో గూడిన నాభికమలము గలవాడవును, సాధువులను పద్మములకు సరస్సువంటి వాడవును, ( సాధువులందరు నిన్నే అనగా, విష్ణువునే ఆశ్రయింతురనుట ) అగు నిన్ను ఆశ్రయించెదను.

శ్లో॥ సితతరనఖతార కావికీర్ణం
స్మితధవళానన పీవరేందుబింబమ్ ।
హృదయమణిమరీచి జాలగంగం
హరిశరదంబరమాతతం ప్రపద్యే ॥

నఖ కాంతులనియెడి నక్షత్రపంక్తులతోను, చిరునగవుచేత మఱింత తెల్లనైన ముఖమను సంపూర్ణ చంద్రబింబముతోను, హృదయమున వెలుగొందు కౌస్తుభరత్నముయొక్క ప్రకాశమనియెడు గంగా ప్రవాహము తోను, మనోహరమైయున్న విష్ణువనెడు శరత్కాల గగనమును సర్వవ్యాపకమగు దానిని ఆశ్రయించెదను.

శ్లో॥ త్రిభువన నళినీ సితారవిందం
తిమిరసమాన విమోహదీప మగ్ర్యమ్ ।
స్ఫుటతర మజడం చిదాత్మతత్త్వం
జగదఖిలార్తిహరం హరిం ప్రపద్యే ॥

త్రిలోకములనియెడు సరస్సునకు తెల్లదామరయైనట్టియు, (ఈ ఉపమానము నృసింహావతారమున విష్ణువునకు గల తెల్లటి రూపమును ఆశ్రయించి చెప్పబడినది.) అజ్ఞానమనియెడు గాఢాంధకారమునకు దీపమైనట్టియు, శ్రేష్ఠమైనట్టియు, విస్పష్టమైనట్టియు, చేతనరూపమైనట్టియు, దృశ్య సంబంధములేని ఆత్మరూపమైనట్టియు, ప్రపంచముయొక్క సర్వాపదలను హరించునట్టియు, విష్ణువును, ఆశ్రయించెదను.

శ్లో॥ నవవికసిత పద్మరేణు గౌర
స్ఫుటకమలా వపుషోపభూషితాంగమ్ ।
దినశమ సమయారుణాంగ రాగం
కనకనిభాంబర సుందరం ప్రపద్యే ॥

నూతనముగా వికసించిన తామర కమలమునందలి పరాగమువలె శుభ్రవర్ణముగల లక్ష్మీదేవియొక్క దేహముచేత అలంకరింపబడిన దివ్యశరీరము గలవాడవును, సంధ్యాకాలమువలె ఎఱ్ఱనైన మైపూతగలవాడవును, సువర్ణమయమగు వస్త్రముచేత మనోహరుడైనవాడవును, అగు నిన్ను ఆశ్రయించెదను.

శ్లో॥ అవిరతకృతవిశ్వసర్గ లీలం
సతత మజాత మవర్ధనం విశాలమ్ ।
యుగశత జరతాభిజాత దేహం
తరుదళశాయిన మర్భకం ప్రపద్యే ॥

ఎప్పుడును ఎడతెగకుండ చేయబడుచున్న ప్రపంచ సృష్టియే ఆటలుగా గలిగినట్టియు, ఎప్పటికిని జన్మయు అభివృద్ధియు అనునవి లేనట్టియు, సర్వవ్యాపకుడవైనట్టియు, ( బాలునిపక్షమున, అన్నివైపుల దిరుగులాడినట్టియు ) అనేక నూర్లసంఖ్యగల యుగములనుండియు ఉండుటచేత వార్ధకము కలిగిన శరీరముగలవాడవును, మఱ్ఱిఆకునందు పరుండువాడవును, నగు బాలుడగు నిన్ను ఆశ్రయించెదను. ( ప్రళయకాల సమయమున విష్ణువు సముద్రమధ్యమునందు వటపత్రముపై బాలరూపమున పరుండియుండునని పురాణములయందు ప్రసిద్ధిగలదు. )

శ్లో॥ దితిసుతనళినీతుషారపాతం
సురనళినీ సతతోదితార్కబింబమ్ ।
కమలజనళినీ జలావపూరం
హృదినళినీనిలయం విభుం ప్రపద్యే ॥

రాక్షసులను పద్మతీగకు మంచువంటివాడవును ( మంచు కురిసిన కమలములు నశించిపోవును ) దేవతలను కమలములతీగెకు ఎప్పటికిని అస్తమింపని సూర్యబింబమైనవాడవును, బ్రహ్మదేవుడను తామరతీగెకు జలప్రవాహ రూప మైనవాడవును, లక్ష్మీనివాసుడవును, పరమేశ్వరుడవును, నగు నిన్ను ఆశ్రయించెదను. ఈవిధముగ లోకోత్తరమగు స్తోత్రములచేత పూజింపబడి మిక్కిలిసంతోషించి పల్లకలువవలె మనోహరమగు శరీరకాంతి

తోను, లక్ష్మీదేవిచే రమ్యమగు హృదయముతోను, ప్రకాశించుచున్న ఆశ్రీహరి "మేఘము నెమలిని జూచి సంతోషించునట్లు" ఆప్రహ్లాదునిజూచి మిక్కిలి సంతోషించినవాడై, తన దర్శనముచేత ఉప్పొంగుచున్న ఆప్రహ్లాదునితో ఇట్లనియె. రాక్షసకులమను సముద్రమునకు అమూల్యరత్నము వంటివాడా! సకలగుణరత్నాకరా! ప్రహ్లాదా! ఇప్పుడు మఱల జన్మ మరణ దుఃఖములు నశించుటకై (మోక్షప్రాప్తికై) తగిన వరమును గైకొనుము. అనిన భక్తిశ్రద్ధతో నమ్రుడై ప్రహ్లాదు డిట్లనియె.

ఓమహాత్మా! జనార్దనా! వరమును కోరుకొనుటకు నేనెంతవాడను. నేను అల్పబుద్ధినికదా? కావున ఓ మహాప్రభువా! నీవు భక్తులప్రార్థనతో పనిలేకయే కోరిన కోరికలను ఇచ్చువాడవు. సర్వలోక నివాసివి. కావున మీహృదయమునకు ఏది సర్వోత్తమమనితోచునో దానిని దయచేత నాకు ఇవ్వుడు. అనిన నకరుణామయుండగు విష్ణువు ఇట్లనియె. ఓదోషరహితుడా! ప్రహ్లాదా! బ్రహ్మజ్ఞాన పర్యంతమగు వేదాంత విచారమే లోకోత్తరమమైనది. కావున అట్టి విచారమే నీకు సంభవించునుగాక. దానివలన సర్వసంక్షోభములు అణగునుగాక. సర్వోత్తమమగు ముక్తి దొరుకునుగాక. ఓశ్రీరామచంద్రా! ఈవిధముగా నప్పరమేశ్వరుడు ప్రహ్లాదునకు వరము ఇచ్చి ఘుమఘుమధ్వనిని గావించి తత్క్షణమే "అణగిన అలవలె" అంతర్ధానము నొందెను. ఇట్లమ్మహాత్ముడు అంతర్ధానము కాగానే ఆప్రహ్లాదుడును గౌరవార్థమై ఆప్రదేశమునందు రత్నసహితమగు పుష్పాంజలిని విడిచి బహువిధముల స్తోత్రములను గావించి పిమ్మట పద్మాసనాసీనుడై భూమిపై గూర్చుండి ఈవిధముగ విచారింపసాగెను.

—* ప్రహ్లాదుడు ఆత్మవిచారముచేత జీవన్ముక్తుడగుట. *—

"ఓప్రహ్లాదా! నీవు ఆత్మవిచారమును గావింపుము" అనుచు సంసారవిచ్ఛేదకుడగు భగవంతుడు నాతోచెప్పెను. కావున ఆత్మవిచారము గావించెదను. ఈప్రపంచమునందు ఎన్నియో పదార్థములు గానవచ్చుచున్నవి. ఇందులో నేనెవ్వడను? మాటలాడుచున్నాను? నడచుచున్నాను? నిలుచుచున్నాను? సర్వకార్యములను బ్రయత్నించుచున్నాను? విహరించుచున్నాను? గరికతీగెలు, పర్వతములు, వృక్షములు, మొదలగువానితో గూడిన ఈప్రపంచమంతయును నేను కానట్లున్నది. అది నాకంటె వేఱుగనున్నది. నేను చేతనుడనై యున్నాను. అది అచేతనమై యున్నది. ఇట్లుండగ దానికిని నాకును భేదము ఎట్లులేకపోవును. మఱియు కొంచెము విచారిం

చిన నీదేహమునకు నాకునుగూడ భేదమున్నట్లు గానవచ్చుచున్నది. ఇది యొకప్పుడు లేకుండి ఆకస్మికముగ బుట్టినది. నేనుకూడ అట్టివాడనే అగుదునేని ప్రస్తుతము అప్రయత్నముగ అనుభవింపబడుచున్న సుఖదుఃఖ భోగములు ఆకస్మికములు కావలయును. పూర్వజన్మమనునది ఒకటిగలదని... ఒకటియుండి ఆపూర్వజన్మమునందు చేసిన కర్మలయొక్క ఫలములను అనుభవించుచు ఉన్నామని చెప్పిననే సరిపడునుగాని అట్లుచెప్పకున్న విరోధము వచ్చును. ఈదేహము అప్పటిది కాదనుటలో సంశయము లేదు కదా? కావున నేను పూర్వజన్మమునందును, అప్పటి సుఖదుఃఖ భోగములుకూడా ఆపూర్వజన్మమువలెనే కలుగవలయును. కావున అప్పుడును ఇట్లే విచారించిన లెక్కకు మిక్కిలియగు జన్మములను అంగీకరింప వలయును. కావున అప్పుడును ఏకరూపముతో నుండువాడను. సృష్ట్యాదినుండియు నానావిచిత్రములగు కర్మలను చేయుచు నానాఫలములను అనుభవించుచు నుండువాడను. నానాదేహములను కర్మానుగుణముగ ఆశ్రయించు చుండువాడను. మఱియును ఈదేహము మాటలాడనేరదు. మరణకాలమునందు సర్వావయవములును అట్లేయున్నను ఏకార్యములను ఆచరింపలేకుండుట సర్వజనులకు తెలిసిన విషయమేకదా? గాలియున్నప్పుడు మాత్రమే దాని ప్రభావమున ఇటునటు కదలునుగాని స్వతంత్రముగ చెలింపనైన సమర్థముకాదు. ఇది స్వల్పకాలములోనే నశించును. నేనన్ననో, అనాదిని. ఈదేహమును విడచిన మఱియొకదాని యందైనను ప్రవేశించి సర్వవ్యవహారములను ఆచరించువాడను. వ్యవహారములను ఆచరించుటయందు దేహము నాకు సాధనమేకాని, మఱేమియు కాదు. దేహమునకువలె నాకును సంచారమునందు వాయుసహాయము అక్కఱలేదు. ప్రాణముపోగానే దేహముమాత్రమే చేష్టలుడిగి పడిపోవును గాని, నేను అట్లుకానుగదా. మఱియును ఈదేహము అచేతనము. నేను చేతనుడను. ఇట్లుండగ ఈదేహమునకును నాకును అభేదము ఎక్కడినుండి వచ్చును. కావున నేను నిశ్చయముగ దేహమునకంటె భిన్నుడనే. మఱియు శబ్దస్పర్శరూప రస గంధములను ఐదుభూతములే ఈప్రపంచరూపముతో పరిణామమును జెందియున్నది. బాగుగ విచారించి చూచిన వీనిలో నేనొకటియు గానని తోచు చున్నది. సామాన్యముగ ఇవి అన్నియును అచేతనములే. నేను వీనిని తెలిసికొనువాడను. తెలిసికొనువానికిని తెలియబడునానికిని అభేదము ఎట్లును సంభవింపదు. మఱియును అందు శబ్దము శూన్యమగు ఆకాశమునుండి పుట్టుచున్నది. శూన్యరూపమే

అయియున్నది. విచారించిన పదార్థమునకు భిన్నముగ (శబ్దముచేత ఆశ్ర యింపబడిన పదార్థమునకు భిన్నముగ) దానికి స్వరూపమే కానరాదు కదా? కావున అది శ్రోత్రేంద్రియముచేత మాత్రమే కల్పింప బడుచున్న దనవలసీ వచ్చుచున్నది. బాగుగ విచారించిన ఆశ్రోత్రేంద్రియమునకుగూడ స్వరూపము గానరాదు. ఇక శబ్దమునకు స్వరూపము గలదనుట ఏటిమా ట? కావున ఆశబ్దమునకును నాకును అభేదము కలుగదు. నాస్వరూపము ఇట్టిదికాదుకదా? మఱియు స్పర్శము త్వగింద్రియమునకు మాత్రమే తెలియ వచ్చుచున్నది. అత్వగింద్రియమన్ననో అత్యల్పకాలముననే నశించునదికాని, స్థిరముగ నుండునది కాదు. ఇకను స్పర్శముమాత్రము ఎట్లు స్థిరము కాగ లదు? ఇదియునుగాక జ్ఞానప్రకాశము ఉన్నప్పుడు మాత్రమే ఆస్పర్శము కలదు, లేనప్పుడు లేదు. ఇట్టి స్పర్శమునకును నాకును అభేదము ఎట్లుకలు గును. ఇంతియేకాక రసము (రుచి) అనునదియు నాకంటే భిన్నమే కా వలయును. ఏలయనిన:—అది నాలుకకుమాత్రమే తెలియునది. దానిస్వ రూపము నాలుక యుండిననేగాని, ఉండదు. ఆనాలుకయన్ననో అతిచంచ లమైనది. క్షణమాత్రముననే నశించు స్వభావము కలదీ. ఇక దానిని ఆశ్ర యించిమాత్రమే నెలకొనవలసీ యున్న రసమునకు మాత్రము స్వరూప స్థితి ఎచ్చటనుండి వచ్చును? మఱియు ఆరసము పరిచ్ఛిన్నమైనది. (కొన్ని కొన్ని పదార్థములయందు మాత్రమే ఉండినది) జడమైనది. నేను ఇట్టివా డను కానుకదా. లోకమునందు చూడబడునది, చూపు, అను రెండుపదార్థ ములు కలవు. ఈరెండును కల్పనామాత్రములే అయి యున్నది. అవిరెం డును అల్పకాలముననే నశించునవిగానున్నవి. ఇకరూపమన్ననో ఇట్టి వీనినే (చూడబడునది చూపు అనువానినే) ఆశ్రయించి యున్నది. దానికి నిలు కడ ఎక్కడినుండి వచ్చును? మఱియును ఇది చూచువానిని ఆశ్రయింపనే రదు. తనచేత గ్రహింపబడుదానికిని తనకును సంబంధము ఉండదనుటస్పష్ట మగు అంశము. కావున ఇట్టిఅచేతనమగు రూపమునకును నాకును అభే దము ఎట్లుకలుగును? ఇదియునుగాక గంధమునకును నాకును కూడా అభే దములేదు. ఈగంధము నాసికచేత కల్పింపబడునదియే. నన్ను కల్పించునది ఏదియు లేదు. ఆ నాసికయుగ్రుడ్డిది. జ్ఞాన శూన్యమైనది. చలన సామ ర్థ్యము లేనిది. ఇట్టి దానిచేత కల్పింపబడునది. కావున ఆగంధముకూడ అట్టిదియే. నేను మాత్రము అట్టివాడను కానుగదా? ఆనాసిక నశించునది. కావున గంధముకూడ నట్టిదియే. నేనుమాత్రము అట్టివాడను కానుగదా?

ఇది అంతియు గాక ఆగంధమునకు నియమములు కలవు. దాని వ్యాప్తికిని స్థితికిని పరిమాణములు గలవు. అది మిక్కిలి తుచ్ఛమైనది. అచేతనమైనది యని ఇదివఱకే నిరూపించుకొని యున్నాను. కావున నేను ఆ గంధమును కానేరను. నేను అట్టివాడను కానుగదా. కావున బాగుగ విచారించి చూచిన నేను సర్వసాక్షినగు చేతనముగా మాత్రమే ఉన్నాను. పైన వర్ణించిన విధముగా ఈసర్వ ప్రపంచమునకును నాకును అత్యంత భేదము కానవచ్చుచున్నది. కావున దీనికిని నాకును ఎట్టి సంబంధమును లేదు. ఈ కారణము వలన " ఇదినాది " అను భావనతో నాకు పనిలేదు. ఆభావనయు అట్లు కానవచ్చుచున్నను అది నాకంటె భిన్నమగు మనస్సు చేయునదియే కాని, నేను చేయునది కాదు. మఱియును నాకు ప్రపంచవిషయకములగు సంకల్పములును, లేక, సర్వ విధములగు సంకల్పములును లేవు. సంకల్ప సాక్షినగు నాకు సంకల్పములతో సంబంధము ఉండుట ఎట్లు ? కావున నేను పరమ శాంతుడను. నాకు ఏవిధములగు సంక్షోభములును లేవు. శ్రోత్రము, నేత్రము, మొదలగు ఇంద్రియముల వలన కలుగు బహువిధ భ్రాంతులు నాకు సంఘింపనేరవు. ఆ ఇంద్రియములకును వానిచేత గ్రహింపబడు పదార్థములకును వానియందు వ్యాపించు మనోవృత్తికిని ఆ మనోవృత్తియందు ప్రతిబింబించు చేతన ప్రకాశమునకునుగూడ నేను సాక్షినికదా ? లోకమునందు " ఇప్పుడు కంటితో ప్రత్యక్షముగా ఘటమును చూచుచున్నానసుట నాకు తెలియుచునే యున్నది " అదీ మొదలగు వ్యవహారములు కలవుగదా ? ఈ వ్యవహారముల చేత పై నిశ్చయింపబడిన విషయము స్పష్టమైనది. ఆ వ్యవహారమును విమర్శించిన క్రమముగ " ఘటము ఉన్నదని నాకు తెలియును " అని పదార్థ విషయమైన జ్ఞానమును " కన్ను ఘటమును చూచు చున్నదనుట నాకు తెలియును " అని ఘటమును చూచు చున్న నేత్రేంద్రియమును గూర్చిన జ్ఞానమును, " నేను ( మనోవృత్తి=సాధారణముగా సర్వజనులును అస్మచ్ఛబ్దార్థమునుగా మనోవృత్తియందు ప్రతి బింబించిన ఆత్మ ప్రకాశమునే గ్రహించు చున్నారు. అట్లుగాకుండిన " నేను చూచుచున్నాను " అను మొదలగు వ్యవహారములు సంభవింపవు. ఆత్మ ఏ కార్యమును చేయువాడు కాడుగదా ) కంటితో ఘటమును చూచు చున్నాననుట నాకు తెలియును " అని నేత్రమూలమున వ్యాపించి బాహ్యపదార్థములను గ్రహించుచున్న మనోవృత్తిని గూర్చిన జ్ఞానమును, ఆత్మకు కలవనుట స్పష్టమగుచునే యున్నదిగదా ? కావున ఎట్లుచూచినను నాకు ఇంద్రియములతో సంబంధము

లేదు. ఆ ఇంద్రియముల భ్రాంతులును నావికావు. నాకు విభాగములు లేవు. నా రూపము జ్ఞానమేయగుటచేత దానికి విభాగములు సంభవింపవు. దేహములు అనేకము లగుటచేత దానికికూడా భేదము ఉన్నట్లు కానవచ్చినను అది భ్రాంతి. ఏక కార్యము జేయుచు ఏకరూపము కలిగియు, పదార్థము మను మాత్రము అనేకములై యున్నవనుట యుక్తి యుక్తము కానేరదు. విభాగము ఉన్నదనిన భేదమును నిరూపింపవలయును. అట్లు నిరూపింప లేకపోయిన విభాగమే లేదని ఒప్పుకొనవలయును "ప్రపంచమునందు" ఏకవిధమగు కార్యము జేయుచు, ఏకరూపమునే కలిగియున్నవైనను దేహములు పరస్పర భిన్నము లగుచున్నవి కదా? ఇట్లే జ్ఞానమునకుగూడ (జ్ఞానరూపుడగు ఆత్మకుగూడ) భేదము ఉండవచ్చును" అని తలంచెదమనిన అదియు సరిగా నుండ లేదు. వాస్తవస్థితిలో దేహములయందు జూడబడు భేదముకూడా భ్రాంతియే అనవలసియున్నది. మొట్టమొదట భేదమునకే స్వరూపము లేదు. ఎట్లును భేదమునకు లక్షణము జెప్పుటకే వీలులేదు. భేదమనిన ఎప్పటికిని రెండుపదార్థములను ఆశ్రయించి యుండును. అద్విత్వము (రెండైయుండుట) కూడా భేదములేనిది యుండనేరదు. ఇట్లైన భేదస్వరూప జ్ఞానమునకంటె ముందు ద్విత్వస్వరూప జ్ఞానమును, దానికంటె ముందు భేదస్వరూప జ్ఞానమును, కావలసివచ్చును. ఇది ఎప్పటికిని తీరునది కాదుకదా? కావున ఎట్లుచూచినను "ఇది దీనికంటె భిన్నము" అని తలంచుటయే వట్టిభ్రాంతి. ఇట్లుండగ శుద్ధ విజ్ఞాన స్వరూపుడనగు నాయందు భేదము ఎక్కడనుండి వచ్చును? ది అంతయును గాక, నాయందు ప్రపంచరూప సంసారము గాని, దాని విషయమగు కార్యము గాని లేదు. సాక్షినై యుండ ఇతరములు నాకు దృశ్యములై నాకు ఎట్లు వికారమును కలిగింప కలవు. కావున ఎప్పటికిని నిర్వికారుడనే. ఈ సర్వ ప్రపంచమును ప్రకాశింప జేయువాడను నేనే. బాగుగ విచారించి చూచిన నాకంటె భిన్నముగ నీ ప్రపంచములును లేవు. కావున నేను కేవల జ్ఞానస్వరూపుడనుగ మాత్రమే యున్నాను. లోపల వెలుపల ఏకరూపముతో వ్యాపించి యున్నాను. ఈసర్వ పదార్థములయందును గానవచ్చు ఉనికి నేనే. నన్ను విడచి ఈ ప్రపంచమునందు పదార్థము ఏదియు స్వరూపస్థితిని జెందనేరదు. దృశ్యస్థితియంతయు కేవల సాక్ష్యధీనమే కదా? నేను పరిశుద్ధుడను, అఖండ స్వరూపుడను. ఆహా! నేటికి నాకు సర్వమును జ్ఞప్తికి వచ్చినది. ఇప్పటికి యథార్థమును తెలిసికొంటిని. తెలిసీనను తెలిసికొనకున్నను, సర్వకాలముల

యందును నేను సంకల్ప వికల్ప శూన్యుడును, ప్రపంచ కల్పనా రహితుడును, అభిన్నుడును, జ్ఞానమాత్ర స్వరూపుడును, సర్వవ్యాపకుడును, అగు పరమాత్మనేనై యుంటిని. చకఁని ప్రకాశము గల ఒకఁ దీపముచేతనే సర్వ పదార్థములు ప్రకాశించునట్లు చేతన స్వరూపుడనగు నాచేతమాత్రమే ప్రకాశహీనమగు ఘటము మొదలు మహాప్రకాశము గల సూర్యునివరకు ఉన్న సర్వపదార్థములును ప్రకాశించు చున్నవి. అతి విచిత్రములై యున్న ఈ ఇంద్రియ వృత్తులన్నియును అగ్నిచేత అగ్నికణములు ప్రకాశించునట్లు నా సహాయముచేతనే ప్రకాశించుచున్నవి. (ఇచ్చట అగ్నికణములు అనగా మిడుగురులు, లేక, అగ్నితోగూడిన ఇంగలములు.) నా స్వరూపము సత్య లోకమునకంటె పైకిని సర్వదిక్కులకంటె అవలకును సృష్ట్యాదికంటె పూర్వ కాలమునకును కల్పాంతమునకంటె ఆవలకును పోవుచునేయున్నది. ఇప్పటికిని మరలలేదు. ( అనగా ఆత్మస్వరూపమునకు దేశ కాల కృత పరిచ్ఛేదములు లేవనుట ) అయినను నేను అల్ప స్వరూపుడనుగ గాన వచ్చుచున్నాను. అట్లే వ్యవహరింప బడుచున్నాను. దీనికి ఒక కారణము కలదు. సర్వ సాధారణమై లోకమున " నేను, నేను, అను వ్యవహారము ఉన్నది. అది ఆత్మవాచకమనియు ప్రసిద్ధమై యున్నది. ఆత్మ ఒకఁడేయై యుండ సర్వపరిపూర్ణుడై యుండ ఈ వ్యవహారమునకు గోచరు డగువాడు ఎవ్వడు? ఆవ్యవహారముగూడ నిరాధారమైనది యనుటయు సాహసమే యగును. కావున " ఈ అహంకారమే సర్వ పరిపూర్ణాత్మయందు పరిచ్ఛిన్నత్వమును ( స్వల్పాకారము గలవాడుగ నుండుటను ) కల్పించి ఆ యననే ( పరిచ్ఛిన్నాత్మనే) విషయముగ గైకొని ప్రవర్తించుచున్నది " అని తీరవలయును. ఇంత మాత్రమువలన నా స్వరూపమునకు హానిరాదు. కావున ఇప్పటికి లోకోత్తమమగు ఈ జ్ఞానదృష్టి నాకు కలిగినది. పరమానంద దాయకమై శాంతిప్రదమై యున్నది యగుటచేత ఈ పరమాత్మమయ దృష్టియే సర్వమునకంటె అధికమై శోభిల్లు చున్నది. సర్వ పదార్థములయందును లోపల ప్రకాశించు చున్నట్టియు దృశ్యములేని నిర్వికార జ్ఞానమే స్వరూపముగా గలిగినట్టియు జీవునకు అభిన్నుడైనట్టియు నాకు నేనే నమస్కారము చేసికొనియెదను. ఇట్టి నిర్వికారమగు నాచైతన్యమే శాంతమయ్యు స్వభావసిద్ధమయ్యు ఔపాధికములగు ( కల్పితములైన ) భేదములతోను సంకల్పములతోను కూడి ( ప్రత్యక్షముగ గానవచ్చు చున్నను ఈ ప్రపంచము యుక్తుల చేత నిరూపింపబోయిన శూన్యరూపమే అగును. మందాధికారులకు ఈ

సూక్ష్మము తెలియదు. కావున సృష్టికి ఏదియో ఒక కారణమును కల్పింప వలయునని ఇట్లు చెప్పుటయే కాని, వాస్తవస్థితిలో బ్రహ్మాభిన్నమగు పదార్థము ఎద్దియు లేదని తెలిసికొనవలయును ) బహు విధములగు శక్తులను ( బ్రహ్మ విష్ణ్వాదులను ) కల్పించు చున్నది. కావున ఇట్టి కల్పిత పదార్థములను వదలి భూత భవిష్య ద్వర్తమాన కాలములను పరిత్యజించి ఊరకవై చుట్టుకొనిన దృశ్యరూప బంధములను త్రోసివైచి తనయందును స్వాభావికమని చెప్పబడుచున్న చిద్రూప ధర్మమును కూడ ఉపేక్షించి యుండునేని ఆ చైతన్యము సర్వ సమమై మాత్రమే నిలచియుండును. వాస్తవస్థితిలో నాచైతన్యము వాక్కుచే వర్ణింప అగోచర మైనది. " దీని స్వరూపము ఇట్టిది " అని ఎవ్వడును చెప్పనేరడు. ఇట్లగుటచేత బొత్తిగ లేనిదానివలెను నాస్తిక సిద్ధాంతమునకు విషయమైన దానివలెను ఉండును. ఇవ్విధముగ నాచైతన్యము ఆత్మరూపమును నిర్వికారమునై యున్నను ఇష్టానిష్ట సంకల్పరూపములగు మనోదోషముల చేత ఆవరింపబడి ( మనోదోషములను ఆత్మయందే ఆరోపించుకొనుచుండుట చేత ననుట ) త్రాటిచేత కట్టబడిన పక్షివలె ఒక్కొక్కస్థలమునందు ( మూఢునియందు ) ముక్తిని చెందలేకున్నది. సాధారణముగ సర్వజనులును తమ స్వరూపము ఇట్టిదని తెలిసికొనలేక రాగద్వేషముల వలన గలిగిన సుఖదుఃఖాభిమానముచేత నేలయందు చిన్న చిన్న బొక్కలలోనుండు పురుగులతో సమానమగు స్థితికి వచ్చియున్నారు. అని ఇట్లు ప్రహ్లాదుడు చెప్పుచు తనకుగలిగిన ఆత్మజ్ఞానమునకు పరమానందభరితుడై మిక్కిలి ప్రీతితో తన ఆత్మను స్తోత్రము చేయుచున్నాడు. అఖండజ్ఞానస్వరూపుడ నగునట్టియు, ఆత్మరూపుడనైనట్టియు, నాకు నమస్కారము. ఓ ప్రకాశస్వరూపా ! దేవా ! పరమాత్మా ! బహుకాలమునకు నీ యథార్థ స్వరూపమును తెలిసికొన గలిగితిని. ఆహా కృతార్థుడనైతిని. నీవే సర్వలోకములకు రత్నమువంటి వాడవు. నీ స్వరూపమును బాగుగ విచారించితిని. తుదకు తెలిసికొంటిని. శీఘ్రముగనే నాయందలి అనుగ్రహముచేత నీవును ప్రత్యక్షమైతివి. సర్వభేదములనుండియు నిన్ను విభాగించితిని.

ఓఆత్మా! నీవు స్వాభావికముగా, ఎవ్వడుగానుంటివో, అట్టివాడవేయైతివి. అట్టి నీకు నమస్కారము. నాకంటె అభిన్నుడవై ఆద్యంతములు లేనివాడవై యున్న నీకును నీకంటె అభిన్నమై ఆనందరూపమైయున్న నా ఆత్మకును ( నాకును ) నమస్కారము. సర్వదేవతలకు అధీశ్వరుడును, లోకోత్తరుడును, అగు పరమాత్మకు నమస్కారము. మేఘావరణములేని

పూర్ణచంద్రునివలె కల్పితములగు ప్రపంచ సంకల్పములను వదలి తనశరీరమునందు తనంతదానే తనయథార్థస్వరూపముతోనే ఉదయించి తనయందేయుండి తనకుమాత్రమే స్వాధీనమైయున్న స్వస్వరూపమును స్వయముగనే నమస్కరించెదను. ఈ ఆత్మ నిలచియున్నను నిలచియున్న వాడు కాడు. నడచుచునూ నడువడు. శాంతుడయ్యును వ్యవహారములను ఆచరించును. చేయుచుండియును ఏకార్యములతోను సంబంధపడడు. ఈయాత్మయే "గాలి చిగురాకులను కదల్చినట్లు" మనస్సులను కదల్చును. సారథి గుఱ్ఱములను నడుపునట్లు సర్వేంద్రియములను నడుపును. ఎప్పుడును ఈయననే వెదకవలయును. ఈయననే స్తోత్రము చేయవలయును. ఈయననే ధ్యానింపవలయును. ఈయనను ఎఱిగిననేకాని సంసార సముద్రము దాటనేరము. మోక్షమును పొందనేరము. మఱియు ఈయనను తెలిసికొనుటయందును కష్టములేదు. ప్రియబంధువునువలె ఆయనను అభిముఖుని చేసికొనుటయందును ప్రయాసము లేదు. ప్రతివానియొక్క హృదయకమలములందును ఆయన తుమ్మెదవలె జిక్కియున్నాడు. కావున ఇప్పుడు నేను ఆయాత్మను సాధించితిని. ఇప్పుడు నాకు సుఖభోగములు కావలయుననుకోరికయు లేదు. విడువవలయునని తలంపును లేదు. రాదలచినది రానిమ్ము. పోదలచినది పోనిమ్ము. ఇంతకాలమువరకు అజ్ఞానమను శత్రువు వివేకమను ధనమునంతయు దొంగలించి నన్ను సంపూర్ణముగ నడచియుండెను. ఇప్పుడన్ననో మనస్సుచేత మనస్సు ఖండింపబడి అహంకారమును విడిచివేసినది. సంకల్పముచేతనే సంకల్పము నశించినది. కావున ఇకను ఏకరూపుడనై శాంతుడనై యుందును. సంకల్పములులేనిదై అహంకారమును విడిచి మనస్సును వర్జించి ఇచ్ఛలులేనిదై నాదేహము ఏకరూపమును, నిశ్చలమును, నిర్మలమును నగు ఆత్మయందే నిలచి యుండును. అహంకారమనియెడు పక్షి ఆశయనియెడు త్రాటిని త్రెంచి దేహమనియెడు పంజరమునుండి తప్పించుకొని ఏవైపునకు ఎగసిపోయెనో తెలిసికొనలేక ఉన్నాను. ఓ ఆత్మా! పురుషుడు కన్నులు లేనివాడైనచో భార్యకు రూప లావణ్యాదులు ఉన్నను లేనివే అగునట్లు నీవు లేకుండినచో ఏపదార్థము ఎట్లున్నను ప్రయోజనము లేదు. అని ఇట్లు పరమానందముకలవాడై చెప్పుచూ ఆత్మను స్తోత్రము చేయుటకు ఆరంభించెను.

శ్లో॥ జయప్రోడ్డామరాకార జయశాంతిపరాయణ ।
జయసర్వాగమాతీత జయసర్వాగమాస్పద ॥

శ్లో॥ జయజాతజయాజాత జయక్షతజయాక్షత ।
జయభావజయాభావ జయజాయజయాజయ ॥

సర్వప్రపంచమును వ్యాపించిన ఆకారముగల ఓ ఆత్మా ! జయింపుము. ( నీకునమస్కారమనుట ) ఓ శాంతికి ఆధారభూతుడవగువాడా! జయింపుము. వేదవేదాంతాతీతుడా! జయింపుము. ఓసర్వవేదములకు ఆధారభూతుడా! జయింపుము. ఓ సర్వశరీరములందును ఉన్నవాడవగుటచేత అజ్ఞానులకు జననము కలవాడవుగా తోచువాడా! జయింపుము. ఓ స్వభావముగా జననమరణములు లేనివాడా ! జయింపుము. ఓ అజ్ఞానులయొక్క దృష్టికి హర్షశోకములు కలవానివలె తోచువాడా! జయింపుము. ఓ స్వభావముగా ఎట్టి సంక్షోభమును లేనివాడా! జయింపుము. ఓ స్వభావముగా అజ్ఞానులకు అభావరూపముగా దోచువాడా! జయింపుము. ఓ విచారశీలురకు సుఖముగ తెలియవచ్చువాడా! జయింపుము. ఓ అజ్ఞానులకు అసాధ్యుడా! జయింపుము. ఓ రఘుకులసార్వభౌమా ! శ్రీరామా ! ఈవిధముగ పరమాత్మను స్తోత్రముచేసి మహాపరాక్రమశాలియగు ఆప్రహ్లాదుడు ఆనందమయమగు నిర్వికల్పసమాధిని జెందెను. ఈవిధముగ మహాబలవంతుడగు ప్రహ్లాదుడు మనస్సును చెలింపనీకుండ నిర్వికల్ప సమాధినిష్ఠుడై ఏకముఖముగ ఐదువేల సంవత్సరములు ఉండెను. ఇట్లు ప్రభువగు ప్రహ్లాదుడు రాజ్యపరిపాలన చేయక ధ్యాననిష్ఠుడై ఉండుసమయమునందు క్రమక్రమముగ రాజదండన లేకపోవుటచేత ఆపాతాళ లోకము అంతయు కట్టుదిట్టము లేక విచ్చలవిడియాయెను. మాత్స్యన్యాయముచేత (చేపలలో చిన్నదానిని పెద్దవి తినును. ఇట్లే దుర్బలు లగువారిని బలవంతులు హింసింప జూచినచో దానిని మాత్స్యన్యాయమందురు ) దుష్టమయ్యెను. ఇట్లుండగ ఈరసాతలస్థితిని తనదివ్యచిత్తమునందు ఎఱిగి త్రిలోకములను పరిపాలించు దీక్షగలవాడును, త్రిభువనములను కమలములకు సూర్యునివంటివాడును, క్షీరసముద్రమున శేషశయ్యపై శయనించువాడును నగు శ్రీమహావిష్ణువు ఇట్లని తలపోసెను. ఆహా, ఎంతకష్టము వచ్చినది. ఈసృష్టియందు రాక్షసులను మాటయే లేకపోవునట్లు తటస్థించినది. ఆప్రహ్లాదుడు పరమాత్మునియందు మనస్సునుజేర్చి పునరుత్థానము లేని నిర్వికల్ప సమాధిని జెందియున్నాడు. పాతాళలోకమంతయు రాజాజ్ఞ లేకపోవుటచేత యథేచ్ఛా సంచారమై తనంతతానే ధ్వంస మగుచున్నది.

ఈవిధముగ రాక్షసులందఱును స్వయముగానే నశించిపోయిరేని

దేవతలును ముక్తులై పోవుదురు. ఏలయనిన,— వారలకు మోక్షమునందు సంపూర్ణాధికారము కలదు. అయినను రాక్షసులు ప్రబల శత్రువులై యుండుటచేత సర్వకాలములయందును "మనము రాక్షసులను ఎట్లైనను జయింపవలయును. మనరాజ్యమును నిలుపుకొనవలయును." అను తలంపులు వారిని విడువక బాధించుచు పరమాత్మయందలి స్థితిని కలుగకుండునట్లు చేయుచున్నవి. రాక్షసులు లేకపోయినచో ఇట్టితలంపులు ఇక వారికి ఉండవు. దానివలన వారందఱును బ్రహ్మనిష్ఠులై శాంతి నొందుదురు. ఇట్లు దేవతలు శాంతి నొందినచో భూలోకమునందు ఆచరింపబడు యజ్ఞము, దానము, మొదలగు కర్మలకు ఫలము లేకపోవుచు. వానికి ఫలములు ఇచ్చువారలు దేవతులేకదా. ఇట్లు చేసిన కర్మలకు ఫలము కలుగకుండెనేని దానిని ఆచరించువారలు ఎవ్వరు నుండరు. ఈవిషయము నిస్సంశయము. ఈవిధముగ కర్మాచరణము నశించెనేని భూలోకమంతయు నశించును. కర్మ లేకపోయిన ఎవ్వరికిని సుఖ దుఃఖ భోగములే యుండవు కదా. ఇట్లుభూలోకము పోయెనేని ఇక ప్రపంచమే లేకపోవును. సంసారమనునదియే నశించిపోవును. ఇట్లు సర్వమును నశించి సూర్యచంద్ర నక్షత్రములుకూడ నశించిపోయి ప్రపంచమే లేకపోయిన ఇక నాకుమాత్రముపనియేమి? నేనును మనస్సుచు స్వస్వరూపమున శాంతి పరుచుకొని మోక్షము నొందవలసినవాడనే అగుదును. కావున ఇట్లు నిష్కారణముగ ప్రపంచ మంతయును నాశమగుట నాకేమియు యుక్తముగ నుండలేదు. కావున ఎట్లును రాక్షసులు అవశ్యముగ ఉండవలసిన వారలే. రాక్షసులు ఉండిన వారిచేష్టలచేత దేవతలకు క్రోధము పుట్టి వారిచిత్తశాంతిని చెరచి మోక్షమును పొరాడనీయదు. దేవతలు ఉండిరేని యజ్ఞదానాది సర్వకర్మలును ఫలవంతము లగును. అప్పుడు ఫలార్థులై భూలోకవాసు లందఱును ఆయాకర్మలను, ఆచరింతురు. దానిచేత సంసారము పెరుగును. ఇట్లు కాకున్న సర్వమునకును వినాశమే. రాక్షసులు లేకున్న పైవర్ణించిన విధముగ ప్రపంచమే నశించిపోవును. మఱియును ప్రహ్లాదుడును ఈ ప్రస్తుత శరీరముతోనే కల్పాంతమువరకును ఉండవలసినవాడు. పరమేశ్వరుని నిర్మాణము అట్లున్నది. ఈవిధముగ నిశ్చయించి సర్వమయుడగు నావిష్ణువు క్షీరసముద్రమునుండి కదలి ప్రహ్లాదుని పురమును జేరి రాజమందిరమునందు ప్రవేశించెను. అప్పుడు గరుడుడు వాహనమై సేవించుచుండెను. లక్ష్మీదేవియు చామరములను వీచుచుండెను. శంఖచక్రాదులును విష్వక్సేనాదులును పరివేష్టించి కొలుచు

చుండిరి. దేవతలును మునులును స్తోత్రముచేయుచు వెంబడించుచుండిరి. ఇట్లువచ్చి ప్రహ్లాదునిజూచి "ఓమహాత్మా! ప్రహ్లాదా! మేలుకొనుము" అనుచు భూనభోంతరములు నిండునట్లును దశదిశలు మాఱుమ్రోయునట్లును, పాంచజన్యధ్వానమును గావించెను. (పాంచజన్యము అనగా, విష్ణువుయొక్క శంఖము) ఈవిధముగ మహాబలవంతుడగు ఆవిష్ణువు తనబలమంతయును ఉపయోగించి శంఖధ్వానమును గావించుటచేత అమ్మహాధ్వనికి మనస్సుచెదరి ఆప్రహ్లాదుడు కొంతసేపటికి మెల్ల మెల్లన సమాధిని విడచి మేలుకొనెను. ఐదువేల సంవత్సరములనుండియు ఏకముఖముగా సమాధిస్థితుడై యుండుటచేత బ్రహ్మరంధ్రమార్గమున నిర్గమించియున్న ప్రాణశక్తి మనస్సు బహిర్ముఖము కాగానే క్రమ క్రమముగ నాడీద్వారముల గుండా శరీరమునందెల్లను వ్యాపింపసాగెను. ఈవిధముగా ప్రాణములు నవరంధ్రములయందును ప్రవర్తింపనారంభింపగానే ఆప్రహ్లాదుని చైతన్యము ఆప్రాణమునందు ప్రతిబింబించి దృశ్యాభిముఖమయ్యెను.

ఓశ్రీరామచంద్రా! ఈవిధముగ ఆప్రహ్లాదుని చైతన్యము బాహ్యపదార్థములకు అభిముఖము కాగానే బాహ్యపదార్థములు, మనస్సు అను రెండురూపముల నొందెను. మనము అద్దము చూచినచో మనముఖము ఒకటియయ్యును రెండుగా తోచుచుండునుగదా? ఈవిధముగ మనస్సు కొంచెము అంకురింపగానే "ప్రాతఃకాలమునందలి నల్లకలువవలె" ఆప్రహ్లాదుని నేత్రములు మెల్లమెల్లగ వికసింప (తెఱువబడ) ఉపక్రమించెను. పిమ్మట ప్రాణాపాన వాయువులు సర్వనాడులయందును వ్యాపించి సర్వనాడులను చెలింపజేసెను. అప్పుడు "గాలియందు పద్మముచెలించునట్లు" అతని శరీరము చెలింపసాగెను. ఒకనిమిషమాత్రమున నాతని మనస్సు స్థూలమాయెను. అప్పుడు ప్రాణములును మనస్సును అభివృద్ధి యగుటచేత కన్నులుదెరచి శరీరమును గదలించి ఆతడుస్వస్థుడై కూర్చుండెను. ఈవిధముగ కన్నులు దెరచి యథాపూర్వముగ స్థూలమగు మనస్సుతో వెనుకటి విషయములనెల్ల బాగుగ స్మరింపగల స్థితిలోనున్న ఆప్రహ్లాదుని జూచి పరమేశ్వరుడు "నెమలినిజూచి సంతసించు మేఘములవలె" అతిగంభీరమగు ధ్వనితో ఇట్లనియె. ఓసత్పురుషుడా! ప్రహ్లాదా! మన్మథునితో సమానమగు నీఆకారమును స్మరించుకొనుము. నిష్కారణముగ ఇట్టి దేహమును పరిత్యజింప ఏల ప్రయత్నించెదవు. "ఈదేహము ఉండిన స్వస్వరూప స్థితికి భంగము వచ్చును" అని తలంచెదవేమో అట్లుకాదు. మనస్సునందు సమ

దృష్టి కుదిరి " ఇది విడువ దగినది. ఇది అంగీకరింప దగినది " అను భేద సంకల్పములు మనస్సునందు లేకపోయి. ఆత్మస్వరూప జ్ఞానము కలిగిన ఇక దేహసంబంధములగు కలిమిలేములు, నీకేమి అనర్థమును కలిగింపకల దు? ఈదేహము ఉండిన నీకేమి? లేకుండిన నీకేమి? కావున దేహ పరిత్యా గమునకై ప్రయత్నింప నక్కఱలేదు. కావున యథాపూర్వముగనే సర్వ కార్యములను ఆచరింపుము. లెమ్ము. నీవు జీవన్ముక్తుడవై రాజ్యపరిపాలన ము చేయుచు నిర్భయుడవై ఈకల్పము ముగియునంతవరకు ఈశరీరము తోనే ఉండవలెను.

ఓ సత్పురుషుడా! ఇకను, ద్వాదశాదిత్యులు ఉదయింపలేదు. పర్వత ములు అణగిపోలేదు. ప్రపంచము ఇంకను ప్రజ్వలింపలేదు. ఇప్పుడే శరీర మును ఏల నాశము చేసికొనియెదవు. " నేనుకృశుడను నాకు దుఃఖము కలదు. నేను మూఢుడను '' అను మొదలగు భావనలు ఎవ్వని మనస్సును చేరచుచుండునో అట్టివానికి జీవనమునకంటె మరణమే శ్రేయస్కరమగు ను. అట్టి అజ్ఞానికి కొంతకాలమైనను మనోవ్యథ కలుగకుండ చేయగలుగు నది మరణమేకదా? వారును (అవివేకశూన్యులును) భూమికిభారభూతులే యై యున్నారు. మఱియు ఎవ్వనిమనస్సు చంచలమైయుండునో ఎవ్వడుఆశయను త్రాటిచేత గట్టబడి ఇటునటు ఈడ్వబడుచుండునో అట్టి అజ్ఞానికి జీవనము నకంటె మరణమే శ్రేయస్కరము. ఇట్లుగాక ఏమహాత్ముడిమనస్సు అహం కార శూన్యమై అభిమాన వర్జితమై యుండునో ఎవ్వడు సర్వభూతముల యందును సమబుద్ధి గలిగి హేయోపాధేయములు ( విడువ దగినవియు అంగీకరింప దగినవియు ) లేక వెలుగునో అట్టివాని జీవనమే లోకోపకా రక మగుటచేత మరణమునకంటె శ్రేయస్కరము. వాస్తవస్థితిలో అట్టిమ హాత్ములకు మరణజీవనములు రెండును సమానములే యైనను జనోపకారక ముగుటచేత జీవితమే శ్రేయస్కరమనక తప్పదు. ఏమహాత్ముడు రాగద్వేష ములులేక లోన చల్లనై యుండు బుద్ధితో సర్వ వ్యవహారములను యథా పూర్వముగ జేయుచునే యుండియు అభిమాన శూన్యుడై సాక్షివలె సర్వ మును జూచుచుండునో, అట్టివానికి మరణమునకంటె జీవితమే శ్రేయస్క రము. ఏమహాత్ముడు హేయోపాధేయములను విడిచి తత్వస్వరూపమును ఎఱిగి మనస్సును మనస్సులోపల నిలుప సమర్థుడగునో, అట్టివానికి మరణ మునకంటె జీవనమే శ్రేయస్కరము. " ఇది అంగీకరింపదగినది, లేక, దృశ్యము, ఈతడు ద్రష్ట అను భేదము జ్ఞానదృష్టిచే నశించెనేని అప్పుడు

చిత్తశాంతి ఉదయించును. ఆశాంతియే నిరపాయముగ స్థిరమగునేని అది యే మోక్షమని చెప్పబడును. కావున ఓ రాక్షసరాజా! ప్రహ్లాదా! నీకు శాంతికలిగినది. సుస్థిరమైనది. కావున ఏవ్యవహారము ఎట్లాచరించినను కొఱ తగలుగదు. కావున లెమ్ము. సింహాసనమును ఎక్కుము. నేను స్వయముగ అభిషేకమును చేసెదను. నేను చేసిన శంఖధ్వని విని నన్ను దర్శనము చేసి కొనుటకై సిద్ధులును సాధ్యులును విద్యాధరాదులును దేవతలును వచ్చి నీయెదుట నిలిచియున్నారు. చూడుము. వీరందరును అభిషేకకాలమునందు నీకు మంగళమును ఆచరింతురుగాక. ఓ శ్రీరామచంద్రా! అంత ఇట్లు మేలుకొలుపబడిన ఆప్రహ్లాదుని సింహాసనముపైనునిచి క్షీరసముద్రము మొదలుగ సర్వసముద్రములను గంగాది సర్వనదులను సర్వతీర్థములను తన సంకల్పశక్తిచేత అక్కడికే రావించి ఆశ్రీమన్నారాయణుడు ఆజలములచేత స్వయముగ అభిషేకమును చేసెను. అప్పుడు అత్యద్భుతమగు భక్తవాత్సల్యమునకై ఆవిష్ణుదేవుని భక్తిసమృద్ధికై ప్రహ్లాదునిగూడ దేవాసురులు ఏకవాక్యముగ వినుతించిరి. అంత నావిష్ణుదేవుడు ప్రహ్లాదునిజూచి ఇట్లనియె. ఓదోషరహితుడా! ప్రహ్లాదా! ఎంతకాలమువరకు మేరుపర్వతము నిలచియుండునో, ఎంతకాలమువరకు ఈభూమి సముద్రజలములందు గలసిపోకుండునో, ఎంతకాలమువరకు సూర్య చంద్ర మండలములు ఉండునో, అంతవరకు పరిపూర్ణములగు సద్గుణములచేత గీర్తింపబడుచు రసాతలమునకు రాజవగుము.

ఓ శ్రీరామచంద్రా! ఈవిధముగ నక్కమలాక్షుడగు విష్ణువు ప్రహ్లాదుని ఆశీర్వదించి దేవ మనుష్య కిన్నరాదులతోగూడ నచ్చటనే అంతర్ధానముఁబొందెను. అది ( విష్ణువుతోగూడ నున్నది. ) మహాసంఘ మగుటచేత దాని అంతర్ధానము రెండవ ప్రళయమో అన దోచుచుండెను. అనిన విని శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓవసిష్ఠమహామునీ! ఈప్రహ్లాదుని విషయమున నాకొక సంశయము గలదు. ఆతని మనస్సు పరబ్రహ్మమునందు లీనమై పోయెనుగదా? అది విష్ణువు శంఖధ్వని చేసినంతమాత్రముచేత ఎట్లు మేలుకొనెను? ఆధ్వని అతి ఘోరమైనదియే అగునుగాక, ఆతనిమనస్సు స్వరూపమే లేకుండ అణగిపోయినదిగదా? అని అడిగిన వసిష్ఠమహాముని ఇట్లని సమాధానము చెప్పెను. ఓ శ్రీరామచంద్రా! వినుము. వాసనలు శుద్ధవాసనలనియు, మలినవాసనలనియు, రెండువిధములు. అందు మలినవాసనలు అవివేకులయందు ఉండును. జన్మపరంపరలను కలిగించుచుండును. ఇక

శుద్ధవాసన అనునదిజీవన్ముక్తులయొక్క హృదయములయందుగూడ ఉండును. అదివేయించబడిన గింజవలె పునర్జన్మాంకురమును కలిగింపనేరదు. వ్యవహారమాత్ర సాధనమై మాత్రమే ఉండును. ఆశుద్ధవాసన అతి పరిశుద్ధమైనది. శ్రేష్ఠమైనది. శుద్ధసత్వగుణమును అనువర్తించునది. ఆత్మధ్యానమే స్వరూపముగా గలది. నిదురించువాని జ్ఞానమువలె "ఇది ఇట్టిది" అనినిర్ణయింపరానిదియునై ఉండును. ఇట్లగుటచేత సమాధినిష్ఠులగువారు వేయిసంవత్సరములు ఏకరూపముతో నుండినను ఏదియో ఒక కారణమువలన ఆవాసన వెలువడ ఆరంభించెనేని క్రమక్రమముగ మేలుకొనుచురు.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉపశమ ప్రకరణమున ప్రహ్లాదోపాఖ్యానమను
ఇరువది రెండవ సర్గము ముగిసెను.

—*—

## —* గాధిఉపాఖ్యానము. *—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునితో ఇట్లనియె. ఓ భరద్వాజా! ఈ ప్రకారముగ వశిష్ఠమహాముని శ్రీరామచంద్రునిజూచి చెప్పి మరల ఇట్లనియె. ఓ లోకాభిరామా! శ్రీరామా! ఈ మాయకు అంతము ఎప్పటికిని లేదు. మనస్సును జయించిననేకాని ఇది స్వాధీనము కాదు. ఓదోషరహితుడా! రామా! ప్రపంచరూపమగు మాయయొక్క విచిత్రత్వమును దెలుపుటకై ఒక ఇతిహాసమును తెలిపెదను. సావధానుడవై వినుము. ఈ భూమండలమునందు కోసలమను దేశము గలదు. ఆ కోసల దేశమందు మహాగుణవంతుడగు గాధియను పేరుగల ఒక బ్రాహ్మణుడు గలడు. ఆయన ఏదియో ఒక యుద్దేశమును మనస్సులో నుంచుకొని బంధువులను విడచి తపస్సు చేయుటకై అరణ్యమునకు బోయెను. ఇట్లు పోయి వికసించిన కమలములచేత అతిమనోహరమగు ఒక తటాకమునుజూచి అతటాకమునందు కంఠమువరకు మునిగి కూర్చుండి తపస్సుచేయ సాగెను. ఇట్లు తపస్సు చేయుచుండగా ఎనిమిది మాసములు గడిచెను. అంత అతని తపస్సునకు మెచ్చి విష్ణుదేవుడు ప్రత్యక్షమయ్యెను. ఇట్లు ప్రత్యక్షమై ఇట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! తపస్సనియెడు వృక్షము మీకు అభీష్టఫలములను ఫలించినది. కావున సరోవర మధ్యమునుండి లేలెమ్ము. వరమును గ్రహింపుము, అని చెప్పెను.

—* గాధిమహాముని మాయను జూడగోరుట. *—

అని ఇట్లు శ్రీవిష్ణువు పలికిన నాగాధిమహాముని ఇట్లనియె. లెక్కకు మిక్కిలినైన త్రిలోకములయందును గల భూతములయొక్క హృదయములను కమలములకు తుమ్మెదవంటివాడా! త్రిలోకములను కమలములకు సరస్సువంటివాడా! ఓ శ్రీమన్నారాయణా! నీకు నమస్కారము. ఓ భగవంతుడా! మీచేత నిర్మింపబడినదియు సంసారరూపము గలదియు పరమాశ్చర్యమును గలిగించునదియు నగు పరమేశ్వర సంబంధినియగు మాయను నేను జూడ వలయునని కోరుచున్నాను. ఓ శ్రీరామచంద్రా! ఈ ప్రకారముగ ఆగాధిముని పలుకగానే ఆ నారాయణుడును “నీ ఇష్టము చొప్పున మాయను చూడగలవు. పిమ్మట దానిని విడువ దలంతువేని విడువుము. నీకు అట్టి సామర్థ్యము గలుగుగాక” అని అనుగ్రహించి ఆవిష్ణువు గంధర్వపట్టణము వలె క్షణములో అదృశ్యుడయ్యెను. ఇట్లు విష్ణుదేవుడు అంతర్ధానము కాగానే ఆ బ్రాహ్మణోత్తముడును జలమునుండి వెలపలికి వచ్చెను. ఆ జగదీశ్వరుని చూచు భాగ్యము కలిగినందున మిక్కిలి సంతోషించెను. పిమ్మట గాధిమహాముని విష్ణుదర్శనమున తనకు కలిగిన ఆనందమును అనుభవించుచు బ్రాహ్మణులకు విహితమైన కర్మలను ఆచరించుచు ఆవనమునందే ఏకాంతముగ కొంతకాలము గడపెను. అంత ఒక్కనాడు “మాయ ఇప్పటికిని కానరాలేదు కదా? దానిని ఎప్పుడు చూడగలుగుదునో, విష్ణుదేవుని వాక్యము అసత్యము కానేరదు గదా” అని తలంచుచు వికసించిన కమలములతోగూడిన అతి మనోహరమగు ఆసరస్సునందు స్నానముచేయుటకు ఆరంభించెను. నీటిగట్టున జరగవలసిన కార్యములన్నియును ముగిసిన పిమ్మట జలమధ్యమునందు ప్రవేశించెను. అచ్చట శిరస్సును ముంపగానే తాను జపించుచున్న మంత్రమును చేయుచున్న దేవతాధ్యానమును. గూడ ఆ బ్రాహ్మణునికి మఱపునకు వచ్చెను. తత్క్షణమే తాను తన ఇంటియందు వ్యాధిగ్రస్తుడై యున్నట్లును పిమ్మట మృతిచెందినట్లును ఆగాధికి తోచెను. బంధువులందరు దుఃఖించుచు చుట్టును కూర్చుండినట్లును భార్య రోదనము చేయుచు పాదములపై బడియుండినట్లును తనకు అప్పుడే వచ్చుచున్న నూనూగు వెంట్రుకలచేత మనోహరమై యున్న గడ్డమును పట్టుకొని తల్లి దుఃఖించుచున్నట్లును ఆతనికి తోచెను. మాయా ప్రభావము వలన అతనికి ఇట్లు సర్వమును తోచుటకు ఆరంభించెను. ఓ సత్యపరాక్రమా! శ్రీరామా! ఆసంగతి నంతయు సవిస్తరముగ వివరించెదను. వినుము. అంత అతని బంధు

వులు అందరును మిక్కిలి దుఃఖించుచు రోదనధ్వనితో ఆశవమును కొన్వ్వ చేత అలకబడినట్లున్న శ్మశానమునకు గొనిపోయి అచ్చట ప్రజ్వరిల్లుచున్న అగ్నియందు దహించిరి. ఇట్లు తోచగానే అతని చిత్తమునందు మనోవ్యధ అంతకంతకు అధికముగా వొచ్చెను. ఇట్లగుటచేత మరల తాను హూణ దేశ సమీపముననున్న ఒకానొక మాదిగపల్లెయందు ఒకస్త్రీయొక్క గర్భమును ప్రవేశించి అందు బహువిధములచేత శ్రమబడినట్లును పిమ్మట కాల క్రమమున నల్లని శరీరకాంతితో శిశువై పుట్టి ఆపల్లెయందలి వారల కంద రకును సంతోషమును గలిగించుచు నున్నట్లును క్రమక్రమముగా అభివృద్ధి నొంది పండ్రెండు సంవత్సరములవాడై పిమ్మట పదియారు సంవత్సరముల వాడైనట్లును ఆయనకు తోచెను. మఱియు దృఢమగు శరీరము గలిగి బలిసిన భుజ శిరస్సులతో అతి విశాలములగు అవయవములతోగూడి పరిపూర్ణ యౌవనవంతుడై ఉన్నట్లును కానుగ కొమ్మవలె మిక్కిలి నల్లనై యున్న ఒకానొక చండాలకన్యను వివాహమై దానితో సుఖించుచున్నట్లును ఆతనికి తోచెను. పుష్పగుచ్ఛములంబోలు స్తనములతోను, చిగురాకులతో సాటి యగు హస్తములతోను, రాజిల్లుచు అతి మనోహరాకారమైన భార్యతో గూడి పొదరిండ్లయందు విశ్రమించుచు పర్వత గుహాలయందు నిదురించుచు ఆకుల గుంపులలో దాగుచు విరివిగనుండు చెట్లుగల స్థలములయందు గృహమును ఏర్పరచుకొని నివసింపుచునుండ గొంతకాలమునకు ఒకానొక పర్వతమునందు దనకు కొందరు పుత్రులు పుట్టినట్లుకూడ ఆగాధికి తోచెను. ఇట్లు భార్యా పుత్రులతో గూడియుండగా కాలము క్రమక్రమముగా గడిచిపోయి నట్లును, తన దేహము ముసలితనముచేత దుర్బలమైపోగానే సకుటుంబముగ గ్రామమునకు అతిదూరమునందు ఒక్క పర్ణశాలను నిర్మించుకొని మునివలె నివసించు చుండినట్లును, అప్పుడు కొంతకాలమునకు అతని భార్యాపుత్రులందఱును మృతిజెందినట్లును, తాను ఆ దుఃఖమును భరింపలేక స్వదేశమును విడిచి దేశదేశములు తిరుగుటకు ఆరంభించినట్లును, ఆగాధికి తోచెను. ఇట్లు తిరుగుచు ఒకానొక సమయమునందు కీరదేశమును జేరిన ట్లును, అందు మిక్కిలి మనోహరమై సామంత ప్రభువులతోను, స్త్రీజనములతోను, గూడియున్న రాజధానిని మార్గవశముచేత జేరినట్లును, ఆగాధికి తోచెను. ఇట్లు ఆ పురమునుజేరి ఆచండాలుడు స్వేచ్ఛగా రాజమార్గమునందు ప్రవేశించెను. స్వర్గమార్గముతో సమానమై మణిమయములగు సువర్ణద్వారములతో నొప్పుచున్న ఆరాజమార్గమునందు పట్టపుటేనుగు ఒకటొటి

రెండవ సంసారమోహయైన అతి చంచలముతో జనమధ్యమునందు తిరుగుచుండెను. అప్పటికే ఆదేశపురాజు మృతినొందుటచేత రెండవరాజును ఏర్పరుచుటకై పర్వతముతో సమానమగు ఆ ఏనుగు అట్లు తిరుగుచుండెను. ఇట్లు తిరుగుచున్న ఆ ఏనుగు తన్నుజూచుచున్న ఈ చెండాలుని దగ్గరజేరి మనోహరమగు తొండముతో బట్టియెత్తి మేరుశిఖరమునుబోలు తన శిరస్సుపైన గూర్చుండ బెట్టుకొనెను. ఇట్లు గజారూఢుడై ఆచండాలుడును మేరుపర్వతమునన్న సూర్యునివలె ప్రకాశించెను. అంత నలువంకల జయభేరీధ్వనులు గలిగెను. ప్రాతఃకాలమునందలి పక్షుల ధ్వనులవలె నాలుగు దిక్కులయందును "మాకోరికలనెల్ల సంపూర్తి గావించుచు ఇతడు భూమికి ప్రభువై జయించును గాక, సర్వాధికుడై వృద్ధిజెందును గాక" అనుచు పౌరులధ్వనులు మిక్కుటములైనవి. ఇట్లు ప్రభువైన ఆ చండాలుని ఉత్తమ స్త్రీలు కొందరు వరియించిరి. వాడు వృద్ధుడేయైనను అలంకారార్థమై ఇట్లు జరిగెను. ప్రజలందరును ఆతనిని పరివేష్టించి ఉచితరీతి సేవింపుచుండిరి.

ఓ రామభద్రా! ఈ విధముగ ఆచండాలుడు కీరదేశపు స్త్రీలచేత చుట్టుకొబడినవాడగుచు వారి హస్తపద్మములచేత పరామర్శింప బడుచున్న (మర్దింపబడుచున్న) పాదపద్మములు గలవాడై ఈవిధముగ ప్రభుత్వమును నిర్వహించుచుండెను. వానికి అప్పటిపేరు గవలుడు. అతివిస్తారమగు క్షత్రియ తేజస్సు వానిని ఆశ్రయించుట మిక్కిలి ఆశ్చర్యకరముగానుండెను. వాని ఆజ్ఞకు స్వదేశ ప్రభువు గాక పరదేశ ప్రభువులు కూడా బద్ధులగు చుండిరి. కొన్నిదినములుమాత్రము కొంతప్రయత్నము జరిగెనుగాని, పిమ్మట పూర్వముకంటె ఉత్తమముగ దేశస్థితి సమకూరెను. అతని ఏర్పాటులవలన సర్వరాజ్యభారమును అధికారానుసారముగ ప్రజలే భరింపుచుండిరి. ఈవిధముగ ఆచండాలుడు స్త్రీసమూహముచేత సేవింపబడుచు, మంత్రులచేత సత్కరింపబడుచు, సామంతప్రభువులచేత స్తోత్రము చేయబడుచు ఛత్రచామరాది రాజచిహ్నములచేత అలంకరింపబడుచు, ఆకీరదేశమునందు ఎనిమిది సంవత్సరములు రాజ్యము చేసెను. ఇట్లు రాజ్యపరిపాలనమును చేయుచు ఒక్కనాడు స్వేచ్ఛగా సర్వాలంకారములను విడచి సంచరించుచుండి అట్లే వెలుపలికి పోయెను. ఆసమయమున దృఢశరీరులగు చండాలురు కొందరు ఉంటితీగగల వీణెను మీటుచు రాజగృహద్వారమునకు ఎదుట నిలువబడియుండిరి. ఆగుంపులోనుండి ఎఱ్ఱని నేత్రములుగల వృద్ధుడు ఒకడు ముందుకు తోసికొనివచ్చి "ఓకటంజకా" అనుచు కీరదేశపు రాజును సమీపించి

ఇట్లనియె. ఓబంధువృద్ధా! కటంజకుడా! ఇంతకాలము ఎచ్చటనుంటివి. ఏఅర ణ్యమునందు నివసించియుంటివి. నీకును మాకును చాలాకాలమునుండి బం ధుత్వముకదా? ఈనడుమ మీవృత్తాంతము బొత్తిగనే తెలియకుండెను. నేటికి అదృష్టవశమువలన నిన్ను మరల జూడగలిగెను. అని ఈవిధముగ ఆచండా లుడు పలుకుచుండ కీరదేశపురాజు తనశక్తికొద్ది కాలోచితములగు చేష్ట లతో ఆచండాలుని తిరస్కరింప ఉద్దేశింపుచుండగానే, రాజగృహములో గవాక్షమునందు కూర్చుండి చూచుచున్న స్త్రీలును, పురజనులును " మన ప్రభువు చండాలుడయ్యెను కదా " అని తెలిసికొని దుఃఖితులైరి. అంత నాగవలుడు ( కీరదేశపు రాజగు చండాలుడు ) శీఘ్రముగ అంతఃపురము ప్రవేశించెను. అప్పటికి అచ్చటి వారలందరును మిక్కిలి దుఃఖితులై యుం డిరి. మఱియును ఆదినమునుండియు మంత్రులుగాని, స్త్రీలుగాని, పురజనులు గాని, అతనితో పలుకనైన పలికినవారు కారు. గృహములోనే ఉన్నను శవమునువలె వానిని పరిత్యజించి యుండిరి. ప్రభువని ఇంటిలోనుండి వెడల గొట్టను మాత్రము లేదుగాని తక్కిన సర్వవిషయములయందును వారిచూ పుయొక్క అనాదరమునకు మితియే లేకుండెను. ఈ విధముగా ఆ గవలుడు ( కీరదేశపు రాజగు చండాలుడు ) అందఱిచేతను అనాదరమును బొంది " గుంపునుండి విడిబడి పరదేశమునందు ఒంటిగ జిక్కికొనిన వర్తకునివలె " వెతలపాలు కావలసిన వాడయ్యెను. ప్రభువయ్యును ఎంతపరివారముండి యును నిరుపయోగమయ్యెను. ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట అచ్చటి పురజనులును, మంత్రులును మొదలుగా గలవారందరును "మనకు బహుకా లము చండాల సంబంధము కలిగినది. ప్రాయశ్చిత్తములచేత మనకు శుద్ధిక లుగదు. కావున అగ్నిహోత్రమున బడుట ఒకటియే, మనకు పారిశుద్ధ్య కారణము"అనినిశ్చయించి అగ్నిని ప్రజ్వలింపజేసి బంధుసహితముగా అందు ప్రవేశించిరి. అంత ప్రభువగు నాగవలుడును జాతిచేత చండాలుడయ్యును సత్పురుష సమాగమ ప్రభావము వలన పరిశుద్ధమగు బుద్ధి కలవాడు కావు ననే ఏకాంతమున ఇట్లని విచారింపసాగెను. ఇదిఏమి? నాకై ఈదేశము నందు ఇంతపుట్టెను. ఇది మిక్కిలి ఆయాసకరముగా నున్నది. ఇక నేను జీవించి ఏమిచేయవలయును? జీవించినంతకాలము దుఃఖమునే అనుభవింప వలయును గదా? కావున నేనును వీరలతోపాటు ఈఅగ్నిప్రవేశము గా వించెదను. అదియే నాకు మహోత్సవమగును. ఇట్లు నిశ్చయించి ఆగవ లుడు తన ఎదుట ప్రజ్వరిల్లుచున్న అగ్నిలోబడెను.

ఓరఘుపుంగవా! రామా! ఈఆశ్చర్యమును వినుము. ఇట్లు బహుకాలచరితమగు విషయమును అత్యల్పకాలములోగాంచి ఇచ్చట ఆగాధి భ్రాంతినుండి మేలుకొనెను. ఆగాధికి ఈభ్రాంతి నాలుగు గడియలు మాత్రమేయుండెను. ఓరామభద్రా! ఈవిధముగ మేలుకొని "నేనెవ్వడను? ఇప్పుడు ఏమిచేసితిని? దేనిని చూచితిని?" అని తాను జూచిన ఆశ్చర్యమునుగూర్చి మఱల మఱల విచారింపుచు అయుదకమునుండి లేచెను. పిమ్మట ఇట్లని తలంచెను. ప్రతిదినమునందును మనస్సు ఇప్పటివలెనే లెక్కలేకు మిక్కిలియగు భ్రాంతులందు సంచరించు చుండును. మదించిన బెబ్బులి బహువిధములగు అరణ్యములందు సంచరించునట్లు ఈమనస్సుకూడా విచ్చలవిడిగా సంచరించు చుండును. నాకు భ్రాంతిదశయందు ఆచండాలత్వము సత్యమని తోచినట్లే ప్రస్తుత బ్రాహ్మణత్వముకూడా సత్యమని తోచుచున్నది కాని, విచారించి చూచినచో, ఆచండాలత్వము ఎంతయో, ఈబ్రాహ్మణత్వముకూడా అంతయే.విశేషము ఏమియులేదు. అని ఇట్లు విచారించి తనమనస్సునందే భ్రాంతి పోగొట్టుకొని ఆవనమునందే మఱికొంతకాలము నివసించెను. ఇట్లుండగ ఒకానొక సమయమునందు మిక్కిలి గౌరవనీయుడగు ఒక్క అతిథి గాధిమునివద్దకు వచ్చెను. ఆగాధియు ఆయతిథిని అర్ఘ్యపాద్యాదులచేతను, ఫలమూలాది ఆహారములచేతను, బాగుగ తృప్తుని గావించెను. అంత సాయంకాలము కాగానే, ఆ ఇరువురును (గాధియు అతిథియు) సంధ్యావందనములు గావించి జపములను ముగించి భుజించి శయనములపై క్రమముగా జేరి పవిత్రములగు వృత్తాంతములను ముచ్చటింప సాగిరి. మాటల సందర్భమున గాధి అతిథిని చూచి ఇట్లనియె.

ఓ బ్రాహ్మణోత్తమా! నీవు ఏల కృశించి యున్నావు. నీ మనస్సునందు ఏదియో ఒక శ్రమయున్నట్లు దోచుచున్నది. ఆశ్రమ ఎయ్యది? అని అడిగిన ఆ అతిథి ఇట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా! గాధిమహామునీ! సర్వమును దెలిపెదను వినుము. ఈ భూమిపై ఉత్తరదిశయందు కీరమను ఒక దేశము కలదు. అది మిక్కిలి ధనవంతమైనది. విశాలమైనది. నేను అచ్చట జనులచేత గౌరవింపబడుచు చిరకాలము నివసించి యుంటిని. ఇట్లుండగా ఒకపురుషుడు ఒకనాడు మాటల సందర్భమున ఇట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా! ఈ కీరదేశమునకు ఇంతకుముందు ఒకమారు దైవయోగము వలన ఒక్కచండాలుడు ప్రభువై ఎనిమిది సంవత్సరములు రాజ్యము చేసెను. పిమ్మట వాడు స్వయముగనే ఒకకారణము వలన బయలుపడెను. తర్వాత

వాడు అవమానము సహింపలేక జనక్షోభమును చూడలేక అగ్నిలో బడెను. వానితో జరిగిన సంసర్గమునకు శాంతి లేకపోవుటచేత అనేక వేల సంఖ్యగల బ్రాహ్మణులు అగ్నిప్రవేశము చేసిరి.

ఓ బ్రాహ్మణోత్తమా ! గాధిమహామునీ ! ఇట్లు ఆపురుషుడు చెప్ప గావిని అంతట నేను ఆ మండలమును విడిచి తత్క్షణమునందే కదలి ప్రయాగకుపోయి అచ్చట ప్రాయశ్చిత్తార్థముగ స్నాన జప హోమాదులను చేసి క్రమముగ మూడు చాంద్రాయణ వ్రతములను ఆచరించితిని. నిన్నటితో మూడవ చాంద్రాయణ వ్రతము ముగిసినది. నేడు ఆవ్రతమునకు పారణను జేసితిని. ఈ పారణమునకు మీవద్దకు జేరితిని. ఇట్లు వ్రతములను ఆచరించుటవలన కృశించితిని. శ్రమనుకూడ జెందితిని. ఓ రామచంద్రా ! ఈ విధముగ ఆ అతిథి పలకగానే ఆగాధీ మిక్కిలి ఆశ్చర్యము నొందెను " నేను భ్రాంతిలో నున్నప్పుడు చూచిన విషయము ఇట్లు యదార్థమయ్యేనే. ఆహా, " ఇదేమి చిత్రము " అని తన మనస్సులో విచారించెను. మరియును ఆవృత్తాంతములనెల్ల ప్రత్యక్షముగా జూడదలంచి వెంటనే ప్రయాణమయ్యెను. హూణదేశమును జేరగనే అచ్చట తాను భ్రాంతిలో నున్నపుడు చూచిన ఆచారములే యుండెను. అప్పుడు చూచిన మాదిగపల్లెయు గానవచ్చెను. తాను నివసించిన గృహమును ఇరుగు పొరుగున నున్న ఇండ్లును అప్పుడు తాను ఎట్టి ఆకారము గలవిగా చూచెనో, అట్టి ఆ కారముతోనే గానవచ్చెను. చండాలుడుగా నున్నపుడు బహువిధములగు క్రీడలతోను వివిధ కర్మములతోను కాలము గడపిన చోట్లన్నియును అట్లట్లే కానవచ్చెను. ఇట్లు స్వప్నతుల్యముగ తాను జూచినవానినన్నిటిని ప్రత్యక్షముగగూడ జూచుటచేత ఆగాధికి కలిగిన ఆశ్చర్యమునకు మితిమే లేదు. ఈ కారణము వలన ఆగాధీ తలయూచుచు పరమేశ్వరుని కృత్యములను ప్రశంసించెను. మఱియు అతడు హూణదేశమును విడచి కీరదేశమునకు పోయెను. అచ్చట కూడా తాను చండాలత్వమున ఉన్నప్పుడు జరిగిన చర్యల నన్నిటిని జూచెను. తాను బహువిధములుగా ఉపయోగించిన ప్రదేశములను అన్నిటిని గాంచెను. అచ్చటనున్న జనులను అడుగగా వారును తాను అనుభవించిన వృత్తాంతమునంతయు పూసగుచ్చినట్లు చెప్పిరి.

ఓ శ్రీరామచంద్రా ! ఇట్లు సర్వమును గాంచి యాగాధి " విష్ణుమూర్తి నేనడిగినట్లు తన మాయయొక్క శక్తినంతయును నాకు జూపెను. సంశయములేదు " అని నిశ్చయించుకొని ఆ దేశమునుండి వెడలి సింహాము

వతే ఒక పర్వత గుహయందు నిలచియుండెను. ఇట్లు నిలచి చేరెడు జలమును మాత్రమే పానముచేయుచు విష్ణువునకు సంతోషము కలిగింప పదునెనిమిది నెలలు అతిఘోరముగ తపస్సును చేసెను. అంత సంతుష్టుడును, మేఘమువంటి దేహచ్ఛాయ గలవాడును, చక్ర గదా ద్యాయుధములను ధరించినవాడును, అగు శ్రీ విష్ణువు బ్రాహ్మణుడు నివసించియున్న ఆపర్వత గుహకు వచ్చెను. అట్లువచ్చి ఆగాధితో ఇట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా! నీవు నా మాయను చూడ దలంచితివి. చూచితివి. దాని ప్రభావమంతయు నీకు గాన్పించినది. మరల ఇప్పుడు పర్వతగుహయందు తపస్సును ఆచరించుచున్నావే. ఇప్పుడు ఏ వరమును కోరెదవు అనెను. ఇట్లుపలుకుచున్న నారాయణునింగాంచి ఆ బ్రాహ్మణోత్తముడు అమ్మహాత్మునకు అర్ఘ్యమును ఇచ్చి పాదములపై పువ్వులజల్లి నమస్కరించి ప్రదక్షిణ మాచరించి "చాతక పక్షి మేఘమును యాచించు విధమున ఇట్లని యాచించెను. ఓ పరమేశ్వరా! శ్రీమన్నారాయణా! మీరు మీ మాయాశక్తిని సంపూర్ణముగ జూపితిరి. అయినను దాని మర్మమును ఎఱుగలేక ఉన్నాను. భ్రమదశయందు నేను చూచినవి అన్నియును సత్యములయ్యెను. ఇది ఎట్లు సంభవించినది? - అనిన శ్రీమన్నారాయణుడు ఇట్లనియె. ఓ గాధీ! వినుము. భూమి మొదలగు ఈ ప్రపంచమంతయు మనస్సునందే ఉన్నదిగాని ఎప్పటికిని వెలుపల లేదు. ఈ విషయము అందఱకును అనుభవములో నున్నదియే. ప్రతివాడును కలయందు కేవల మనస్సుతోనే సర్వ ప్రపంచమును కనుగొనుచున్నాడు. భ్రాంతి గలిగినప్పుడును అట్లే సర్వప్రపంచమును గాన వచ్చుననుట నీకును విశదమయ్యే యున్నదికదా? ఈ విధముగ సర్వ ప్రపంచమునకు మనస్సే ఆధారస్థానమైయుండగా అది మాదిగవాడుగా నుండుటను ప్రకటించెననిన ఇందాశ్చర్యమేమి కలదు. బాగుగ విచారించిన నీవు అసత్యమని తలంచుచున్న చండాలత్వమునకును సత్యమని తలంచుచున్న అతిథి యొక్క రాకకును భేదమేలేదు. సంకల్ప ప్రభావమువలన చండాలత్వము ఎట్లు కానవచ్చినదో, ఈ అతిథికూడ అట్లే కానవచ్చినాడు. ఆత్మ ఏకరూపుడు. కావున ఆతనికంటె భిన్నముగ గానవచ్చునది అంతయు అసత్యమే. భ్రమయే. కావున ఓ గాధీ! భ్రాంతియందు చండాలత్వమును చూచినట్లే హూణదేశమునకు వచ్చుటయునని ఎరుగుము. ఆ చండాలత్వమువలెనే "హూణదేశమునందు సర్వమును గానవచ్చెను" అని తలంచుటయు, "నేను భ్రాంతియందు రాజ్యమును జేసిన కీరదేశము సత్యముగ గానవచ్చుచున్నది" అని దలంచు

టయు, నేను ప్రత్యక్షమగుటయు, అన్నివిషయములను గూర్చి ప్రశ్నించు టయు, అనునివి అన్నియు భ్రాంతియే. అప్పుడు చండాలత్వము సత్యముగా గానవచ్చినట్లే ఇప్పుడు ఇవి అన్నియు సత్యములుగ గానవచ్చు చున్నవి. కాకి చెట్టుపై నెక్కుటయు, తాటిపండు పడుటయు, నొక్కమారే సంభవించునట్లు ఆకస్మికముగ ఈ మనస్సునందు చండాలరూప సంకల్పము తోచి నప్పుడే ఆహూణ, కీర, దేశవాసుల మనస్సునందు గూడ దైవయోగము వలన ఆ సంకల్పము తోచినది. ఒకానొక సమయమునందు కాకతాళీయ న్యాయముతో ఒక్క సంకల్పమే ఒక్కవిధముగనే అనేకుల హృదయము లందు కలుగుటయు, సంభవించును. ఇందు విరోధము ఏమియు లేదు. మన స్సుయొక్క సంచారములు అతివిచిత్రములు కదా? ఇక ఇందలి వృత్తాం తము ఏమి అనిన—నీవు భ్రాంతియందు ఎట్లుచూచితివో అది ఏవిధముగ కటంజకుండను ఒక చండాలుడు హూణదేశమునందు జనించెను. దైవయో గమువలన అట్లే భార్యాపుత్ర వియోగమును పొంది దేశాంతర గతుడ య్యెను. కీరదేశ సింహాసనమునకు అధీశ్వరుడు కూడ ఆయెను. అగ్నిప్రవే శమునుకూడ చేసెను. ఆకటంజుని చర్యను అనుసరించిన సంకల్పము మాత్రమే నీ మనస్సునందు పుట్టినది. ఆ సంకల్పమే తనసామర్థ్యముచేత దానిని నీయందు ఆరోపించినది. సత్యములని తలపబడుచున్న బ్రాహ్మణత్వాదులు కూడ ఇట్లు ఆరోపింప బడినవే. తత్త్వజ్ఞానము లేనివాడు అట్టి ఆరోపణలకు లోబడి "నేను బ్రాహ్మణుడను, వీడు కాడు" అని తలంచును. జ్ఞానియగు వాడు అట్లుగాక ఇవి ఆరోపణ లనియును, అసత్యములే కావున "నేను సర్వమయుడను నాకంటె అన్యము ఏదియును లేదు" అని నిశ్చయించు కొనును.

ఓ బ్రాహ్మణుడా! ఈ మాయకు ఎప్పటికి ముగింపులేదు. ఆత్మ విచారము ఒక్కటియే తప్ప తక్కినది ఎద్దియు దీనిని నశింపచేయ నేరదు. ఆత్మవిచార శీలుడగువాడు సర్వమును ఆత్మమాత్రముగా భావించునే కాని, ఆత్మకు భిన్నముగ భావింపడు. ఈ కారణమువలన భ్రాంతులు ఏవియు వాని చలింప చేయనేరవు. "నేను బ్రాహ్మణుడను, చండాలుడు నాకంటె వేరు" అని నీవు తలంచుటచేతనే కదా, ఆ భ్రాంతికి లోబడవలసివచ్చినది. ఏకభావన యుండునేని అట్లేలయగును? నీకు జ్ఞానము దృఢము కాకపోవుట చేత మనోభ్రాంతిని నివారింప చేయలేక ఉన్నావు. ఈ కారణమువలననే నిన్ను ఆభ్రాంతి ఒక్కక్షణములో జయించుచున్నది. మాయ యను చక్ర

మునకు మనస్సే కుండ. కావున ఆ మనస్సును దృఢముగ నిలుపగలిగిన ఆ మాయ ఏమియు చేయనేరదు. కావున ఓ బ్రాహ్మణుడా! నీవు ఇచ్చట నుండి లెమ్ము. ఈ పర్వతమున ఒక పాదయందు గూర్చుండి నిశ్చల చిత్తములో పది సంవత్సరములు తపస్సు చేయుము. అంతట దృఢమైన విజ్ఞానమును పొందగలవు. ఓ రామచంద్రా! ఇట్లు ఆనతిచ్చి ఆ నారాయణుడు అచ్చటనే అంతర్హితుడయ్యెను. ఆగాధియు వివేకమువలన పరమవైరాగ్య సంపన్నుడాయెను. అంతట అచ్చోటనుండి లేచి ఆగాధిముని పర్వతమును జేరి దాని శిఖరముపై కూర్చుండి అతిఘోరమగు తపస్సును ఆచరించెను. పది సంవత్సరములు ముగియగానే ఆతపః ప్రభావమువలన స్వయముగనే తత్వజ్ఞానము కలవాడాయెను. ఓ రామభద్రా! ఈ విధముగ ఆగాధిముని పరిపూర్ణ విజ్ఞానవంతుడై కొరతలు లేని చిత్తముతో సంపూర్ణ చంద్రునివలె పరమ శాంతినిధియై ప్రకాశించెను. భోగములయందు ఇచ్ఛలేనివాడగుట చేత అతనికి సంక్షోభమే లేకుండెను. సంసారసంబంధము ఏమియును అతనికి లేకుండెను. జీవన్ముక్తుడగుటచేత ఏ కార్యములను ఎట్లాచరించినను ఆగాధిమునిని బంధింప కుండెను.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉపశమ ప్రకరణమున గాధి ఉపాఖ్యానమను
ఇరువది మూడవ సర్గము ముగిసెను.

—*—

ఈ ప్రకారముగా వశిష్ఠమహాముని శ్రీరాముని జూచి చెప్పెనని వాల్మీకి మహర్షి భరద్వాజునితో చెప్పి ఇట్లనియె. ఓ భరద్వాజా! ఈవిధముగ మాయా ప్రభావమును వర్ణించి ఇకను చిత్తజయోపాయమును చెప్పదలచినవాడై వశిష్ఠమహాముని శ్రీరాముని జూచి మరల ఇట్లనియె. ఓ పురుషోత్తమా! శ్రీరామా! పైన వర్ణించిన విధముగ పరమాత్మ సంబంధమైన మాయ మిక్కిలి విస్తారమైనది. తెలిసికొన అశక్యమైనది. అపరిమితమగు భ్రాంతిని కలిగించునది. విషమమైనది. ఇట్లగుటచేత విషమమగు ఈమాయ స్థిరముగాని చిత్తమును కష్టములలో గూర్చుచుండును. కావున ఈ సంసారమను మహారోగము చిత్తజయమను పరమౌషధము ఉపయోగింపక ఇక ఎన్ని ప్రయత్నములు చేసినను శాంతించునది కాదు. "చిత్తము నశించిన వ్యవహారమెట్లు" అనియెదవేమో వినుము. ప్రస్తుతమై వచ్చిన వ్యవహారము మాత్రము ఒక క్షణకాలము తనకంటె బాహ్యమునుగా

భావించి ఆచరించుచు,జరిగినవి, జరుగబోవునవి అగు విషయములను ఇంచు
కయైనను తనకంటె భిన్నములుగ దలంపక నుండు చిత్తమే గెలువ బడిన
చిత్తమని చెప్పబడును. కావున ఇట్టి మనోజయముచేత వ్యవహారలోపము
లేదు. కావున నీవు సంకల్పములను, ఆశలను, క్షణక్షణమున చిత్తమునందు
స్ఫురింపనీయక పరిత్యజింప గలుగుదువేని అప్పుడు పవిత్రమగు మనోజయ
మును పొందినవాడవే అగుదువు.

—* ప్రత్యగాత్మ స్వరూపము. *—

ఓ సత్యపరాక్రమా! రామా! మనస్సు లేక అనగా, సంకల్పరూపవ్యా
పారములు లేక కేవలమైయుండు చేతనము ఏదికలదో, అదియే ప్రత్యగాత్మ
అనబడును. ఇప్పుడు అజ్ఞానవశమున మనోమాలిన్యమంతయు నిరర్థకముగ
ఆప్రత్యగాత్మయందు ఆరోపింప బడుచున్నదేగాని, వాస్తవస్థితిలో వానికి
( ప్రత్యగాత్మకు ) ఎట్టి మాలిన్యమును లేదు. మనస్సు క్షీణమగుటయే
సత్యత్వము. అదియే పరమానందము. అదియే పరమాత్మరూప స్థితి. అది
యే సర్వజ్ఞత్వము. అదియే తృప్తి. అదియే శాంతి.

—* ఆత్మానుసంధానుక్రమము. *—

ఓ శ్రీరామా! కావున విషయాభిముఖమై అజ్ఞానవశగతమై పరు
గులిడు చిత్తమును దృఢప్రయత్నము గావించి దృఢమగు పూనికతో బల
వంతముగ వేదాంతశాస్త్ర విచారమునందును సత్పురుషులతో మైత్రిచే
యుటయందును జొనుప వలయును. మాటలాడుచున్నను, విడుచుచున్న
ను, గైకొనుచున్నను, కన్నులు తెరచుచున్నను, మూయుచున్నను, మఱి
యు ఏకార్యములు ఆచరించుచున్నను, " నేను వీనికి కర్తనుగాను. నాకు
ఎందును భేదము లేదు. సంకల్పములు లేవు. నేను అనంతుడను " అను భా
వనగలిగి ప్రత్యగాత్మునియందే స్థిరుడవై యుండుము. " ఇదినాది. అదినీది.
వీడు, నేను, వీడికి నాకు భేదము కలదు " అను ఇట్టి సంస్కారమును వదలి
" ఆత్మ ఏకరూపుడు. " అను నిశ్చయముతో కేవలప్రత్యగాత్మయందే స్థిరు
డవు కమ్ము. " నేను ఈపదార్థములను తెలిసికొనుచున్నాను " అను అభి
ప్రాయమే మాలిన్యము. దానిని వదలి మనస్సును నిర్మలమును గావింపుము.
ఇట్టి భేదాభిప్రాయము తొలగిన అన్యపదార్థమే లేకుండుటచేత ఆశయను
నది స్వరూప శూన్యమగును. వ్యవహారార్థమై ఒకవేళ సర్వమును బాహ్య
మునను ఉండినను లోపల ఏదియును ఉండదు. ఈవిధముగ సర్వజయమును
గావించి ఆత్మమాత్ర నిష్ఠుడవు కమ్ము. శుభాశుభ భేదములు నామమాత్ర

ములే కాని, అందు వస్తువు ఏదియును లేదు. సర్వప్రపంచము నామమాత్రమే అని ఇదివరకే వివరించియున్నాను కదా? కావున వానియందు (శుభాశుభములయందు) రాగద్వేషములను ఉంచకుము. ఆశయను విషూచికావ్యాధికి మంచి చికిత్స కావింపుము. "ఇది ఇష్టమైనది. ఇది కానిది. అని తలంపబోకుము. ఇట్టివాడవై కేవల ప్రత్యగాత్మునియందే స్థిరుడవు కమ్ము. "నేను, పరుడు" అను తలంపును మాని, ప్రపంచమునందు సత్యప్రభావన గాని, అసత్యత్వ భావనగాని, లేక, ఆత్మస్వరూప ధ్యానమును గావింపుచు యజ్ఞ స్తంభమువలె (యూప స్తంభమువలె) సుస్థిరుడవు కమ్ము. ఓ రామభద్రా! దృశ్యరూప మాలిన్యము లేనట్టియు, ఆశాబంధము లేనట్టియు, శుద్ధమైన ప్రత్యగాత్మ చైతన్యమునందు పురుషునకు ఎప్పుడు నిలుకడ దొరకునో, అప్పుడుమాత్రమే సంసారభ్రాంతి కారణమగు అజ్ఞానము తొలగునుగాని, అంతవరకు ఇంచుకయైనను కదలనే కదలదు. స్వస్వరూపమును అవలోకింపుచు ఆత్మానందమును అనుభవింపుచు స్థిరుడై ఉన్నవానికి ఈభోగములు ఏవియు రుచింపవు. సంసారదశయందు విశేషముగ ప్రార్థింపబడుచు అతిమనోహారమని ప్రశంసింప బడుచు మధురమని వర్ణింపబడుచున్న రసాయనముకూడ దానికి విషతుల్యమగును.

—* చిత్తాభివృద్ధికారణములు. *—

శ్లో॥ దూరాదాత్మజ్ఞతాయాతి చిత్తేపీవరతాంగతే ।
ఆలోకలక్ష్మీరభితో మహామేఘ ఇవోత్థితే ॥

ఓ రాజీవలోచనా! శ్రీరామా! మేఘము దట్టముగ క్రమ్మినప్పుడు సర్వవ్యాపినియగు కాంతి నశించిపోవునట్లు, మనస్సు అభివృద్ధియగునేని శాస్త్రజ్ఞానము ఎంతయున్నను తుదకు ఆత్మవివేకము కలిగిననుకూడ అది నశించును.

శ్లో॥ అనాత్మన్యాత్మభావేన దేహమాత్రాస్థయాధియా ।
పుత్రదారకుటుంబైశ్చ చేతోగచ్ఛతిపీనతామ్ ॥

స్వస్వరూపమునకంటె భిన్నములగు దేహాదులయందు (దేహము, ఇంద్రియములు, ప్రాణములు, మొదలగు వానియందు) "ఇదియే నేను" అని తలంచుచుండుటచేతను, బుద్ధితో దేహమును మిక్కిలి అభిమానించుచుండుటచేతను, పుత్రులు భార్య మొదలగువానితో చేరిన కుటుంబమును తనదానినిగా భావించి మిక్కిలి ఆశ చేయుచుండుటచేతను, మనస్సు అంతకంతకు అభివృద్ధియగును.

శ్లో॥ అహంకారవికారేణ మమతామలలీలయా ।
ఇదంమమేతిభావేన చేతోఽగచ్ఛతిపీనతామ్ ॥

అహంకారము తెలాను " ఇదినాది, ఇదికాదు " అని రాగద్వేషము అను బుట్టించుటకు కారణమైన మమకారమను మాలిన్యముచేతను, మనస్సు క్రమక్రమముగ అభివృద్ధియగును.

శ్లో॥ ఆధివ్యాధివిలాసేన సమాశ్వాసేనసంసృతౌ ।
హేయాదేయవిభాగేన చేతోఽగచ్ఛతిపీనతామ్ ॥

మనోవ్యథలచేతను, దేహసంబంధమగు వ్యాధులచేతను, సంసారమునందలి నమ్మకముచేతను " ఇవి విడువదగినవి ఇవి అంగీకరింపదగినవి " అను విభాగముచేతను, మనస్సు అభివృద్ధి యగును.

శ్లో॥ స్నేహనధనలోభేన లాభేనమణియోషితామ్ ।
ఆపాతరమణీయేన చేతోఽగచ్ఛతిపీనతామ్ ॥

మొట్టమొదట మాత్రము కొంచెము మనోహరముగ గానవచ్చుచునున్న ధనలాభముచేతను, స్త్రీలాభముచేతను, ఆధన స్త్రీలయందలి అనురాగముచేతను, మనస్సు అభివృద్ధియగును.

శ్లో॥ దురాశాక్షీరపానేన భోగానిలబలేనచ ।
ఆస్థాదానేనచారేణ చిత్తాహిర్యాతిపీనతామ్ ॥

దురాశ అనియెడు పాలను పానముచేయుట చేతను, భోగములనియెడు వాయువును భక్షించుటచేతను, అభిమానమనియెడు స్వేచ్ఛాసంచారముచేతను, మనస్సను పాము అభివృద్ధియగును.

—* ఉద్దాలకోపాఖ్యానము. *—

ఓలోకవంద్యా! శ్రీరామా ! ఇట్లగుటచేత ఉద్దాలకునివలె నీవును ప్రయత్నపూర్వకముగ ఈ పంచభూతములను ( లేక, మనోమయమగు ప్రపంచమును ) పలుమారు ఛేదించి ధైర్యవంతమగు బుద్ధితో ఆత్మవిచారమును చేయుము. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓభగవంతుడా! వశిష్ఠమహామునీ! ఆ ఉద్దాలకముని ఏవిధముగ పంచభూతములను నశింపజేసెనో? ఎట్లు ఆత్మవిచారమును గావించెనో? అనిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓసత్యపరాక్రమా! రామా! వినుము. పంచభూతములను విచారించుటవలన (అనగా, అందలిసారాంశమును విమర్శించుటవలన) ఉద్దాలకునకు ఆత్మజ్ఞానము కలిగెను. ఆవిధమును వివరించెదను. వినుము. ఈలోకమునందు గంధమాధనమను పర్వతముగలదు. ఆపర్వతముపై అతిరమణీయమగు ఒక ప్రదే

శము కలదు. ఆ ప్రదేశమునందు సర్వకాలములయందును బహువిధములగు పుష్పములు వృక్షాగ్రములనుండి రాలి పరుపబడినట్లు ఉండును. అందు కర్పూరపు అరటిచెట్లు అధికముగ నుండుటచేత వాయువశమున అందలి కర్పూరముయొక్క వాసనలు గుప్పు గుప్పని నలుగడల వ్యాపించుచు ఆప్ర దేశమునకు ధూసరవర్ణమును కలిగించు చుండును. అట్టి ప్రదేశమునందు బహువిధములగు ఫలవృక్షములతోగూడిన నొకశిఖరముపై ఉద్దాలకుడను ఒకమహాముని నివసించుచుండెను. ఆతనికి ఆస్థానము మిక్కిలి ఉచితమై యుండెను.

ఓ శ్రీరామచంద్రా! అతడు మొట్టమొదట అంతజ్ఞానవంతుడు కాడు. క్రమక్రమముగ తపస్సుచేయుటచేతను, శాస్త్రవిచారము కావించుటచే తను, యమనియమములను అభ్యసించుటచేతను, ఆతనికి వివేకము కలిగెను. పిమ్మట ఆ ఉద్దాలకుడు ఇట్లని విచారించెను. మనము దేనిని సంపాదింపవ లయును. ఎందునిలచిన మరల దుఃఖము కలుగకుండును. సంకల్ప వికల్పము లులేని స్థానము ఎద్దియో, అదియే పరమ పవిత్రమనియు, దుఃఖసంబంధ ము లేనిదనియు, తెలియవచ్చుచున్నది. మేరుపర్వతశిఖరమునందు మేఘము విశ్రమించునట్లు నేను ఆయున్నతస్థానమున ఎన్నడు విశ్రమింపగలను. "ఇది చేసితిని. దీనిని ఇంకను చేయవలయును" అని మిక్కిలి చెంచలములై నన్ను బాధింపు చున్న భోగేచ్ఛలు ఎన్నడు నాశనము నొందును. ఆభోగేచ్ఛల యొక్క నాశమువలనగాని పరమపదము దొరకదు. అని శాస్త్రములు చెప్పుచున్నవిగదా? మఱియు అనేక అలలతోగూడి దాటుటకు అశక్యమై అంతములేనిదై ప్రవహించుచున్న ఆశ అను నదిని ధైర్యవంతమగు బుద్ధి యను ఓడచేత ఎన్నడు తరింపగలుగుదునో? ఇష్టానిష్టములులేక, విడువ దగినవి అనియు, అంగీకరింపదగినవి అనియు, అభిమానింపక ఎన్నడు స్వ ప్రకాశరూపమునందు స్థిరుడనై సౌఖ్యము నొందగలను? ఎన్నడు సర్వసం కల్పములను పరిత్యజించి నిర్వికల్పసమాధి నిష్ఠుడనై ఈపర్వతగుహాయందు రాతితో సమానముగ నిలువగలను? నిర్వికల్పసమాధియందు నిలచి నిశ్చే ష్టుడనై ఏమియు సంభాషించక యున్న నాశిరస్సుపై అడవిలోని పక్షులు గడ్డితో ఎన్నడు గూటిని గట్టగలవు?

—* ఉద్దాలకుని ధ్యానప్రకారము. *—

ఓనీలోత్పలశ్యామా! రామా! ఆయుద్దాలకుడు ఈవిధముగ తల పోసి విశ్రాంతి కావలయునను దృఢనిశ్చయముతో అయ్యరణ్యమునందే

అనేక ప్రదేశములయందు గూర్చుండుచు యోగాభ్యాసమును ఆచరించి చిత్తమును నిలుప ప్రయత్నింప సాగెను. ఎన్నిమార్లు ధ్యానము సేయ నారంభించినను ఆతని మనస్సు విషయ పరంపరలచేత ఎగరగొట్టబడుచు అటునిటు కోతివలె చెలింపసాగెను. దానివలన అతనికి ఆనందకరమగు శాంతి ఎప్పటికిని కలుగనేరదు. ఒకానొకప్పుడు ఆతని మనోవానరము బాహ్యపదార్థముల సంబంధమును విడచి ఆంతరపదార్థ సంబంధమును పొందుచుండెను. మఱియొకమారు ఆంతర విషయములను విడచి బాహ్య విషయములను గ్రహించుచుండెను. ఒకానొక సమయమునందు పంజరము నుండి తప్పించుకొనిన పక్షివలె ఎచ్చటికో ఎగసి పోవుచుండెను. ఒకానొకప్పుడు సర్వవ్యాపకమై సూర్యకాంతితో సమానమగు ఒక కాంతిని చూచుచుండెను. మఱియొకప్పుడు కేవలమగు ఆకాశమును మాత్రమే కనుగొనుచుండెను. వేఱొక సమయమునందు గాంఢాంధకారమును వీక్షింపుచుండెను. ఓ రామచంద్రా! ఈ విధముగ ఎన్నిమార్లు ప్రయత్నించినను ఆ ఉద్దాలకమునికి మనోనిగ్రహము సాధ్యము కాలేదు. ఇంతమాత్రమే కాక, నిగ్రహమునకు ప్రయత్నించుకొలది వ్యాకులత అధికమయ్యెను. అప్పుడు విశ్రాంతి లేనివాడై అతడు ఉచిత ప్రదేశమును వెదుకదలచి పర్వతమునెల్ల గలయ దిరిగెను.

—* ఉద్దాలకుడు నిర్వికల్ప సమాధియందు నిలుచుట. *—

ఓ రఘునందనా! శ్రీరామా! ఇట్లు సంచరించుచుండగ "ప్రత్యక్షమోక్షద్వారమో" యన అమ్మునికి నొకానొకగుహ కానవచ్చెను. అచ్చటికి ఎట్టివాడైనను పోజాలడు. మృగములైనను ఆ ప్రాంతమునందు సంచరింపవు. ఇట్టి ఆగుహను ప్రవేశించి అచ్చట పుష్పములతోగూడిన పచ్చి ఆకులతో ఒక ఆసనమును గల్పించెను, దానిపై కృష్ణాజినమును పరచి, "నేడు మనస్సును ఎట్లైనను నిర్బంధించి నిగ్రహించెదను గాక, ఈ ఏకాంత స్థలమునందు ఉండిన నిక నామనస్సు ఏమిచేయగలదో, చూతము" అనుచు మనస్సుపై మహాక్రోధముతో విజృంభించుచు ఆ ఆసనముపై గూర్చుండెను. పిమ్మట దివ్యజ్ఞాన సంపన్నులగు కపిలాదులవలె దృఢముగ సిద్ధాసనము వేసికొని పాదముల రెంటిని తొడలమొదటికి జేర్చి మడమలతో వృషణముల నడచి కూర్చుండి బ్రహ్మాది గురుపరంపరలకు నమస్కారమును గావించెను. అటు ఇటు పరువిడుచున్న మనస్సు అనియెడు లేడిని సంస్కారములనుండి బలవంతముగ వెలికి ఈడ్చి నిర్వికల్పసమాధియందు నిలుపుటకై ఈక్రింద చెప్ప

బోవు విధముగ విచారము సేయ నారంభించెను.

శ్లో॥ అయిమూర్ఖమనఃకోర్థ స్తవ సంసారవృత్తిభిః ।
ధీమంతో౽ నని షేవంతే పర్యంతే దుఃఖదాంక్రియామ్॥

ఓ మూర్ఖుడా! మనస్సా! సంసారమునందు సంచరించుటచేత నీకు ఏమి ప్రయోజనము వచ్చినది. ఈ సంసారము అంతమునకు మహాదుఃఖమును కలిగించునది. ఇట్టిది మొట్టమొదట ఒకవేళ ఆనందమును కలిగించినట్లు కానవచ్చినను, సేవింప అర్హము కాదు. బుద్ధిమంతులగువారు దుఃఖకరమగు కార్యమునుచేయరు. ఓ మూర్ఖుడా! మనస్సా! ఎవ్వడు శాంతియని చెప్పబడు శ్రేష్ఠమైన రసాయనమను ఔషధమును వదలి అల్పసుఖకరములును, అంతమునకు దుఃఖకరములునగు సంసార భోగములను ఆశ్రయించునో, అట్టివాడు కల్పవృక్షముల వనమును విడచి విషవృక్షములను గుంపును జేరినవాడగును. ఓ మూర్ఖుడా! మనస్సా! భూమియందు దూరినను, పాతాళలోకమునకుబోయినను, ఆ కాశమునకు ఎగసినను శాంతిని పొందనేరవు. ఓ మూర్ఖుడా! మనస్సా! సంకల్పములను విడచుట యొకటియే నీకు శాంతికారణము. ప్రస్తుతము నీవు చేయుచున్న సంకల్పములు అతివిచిత్రములుగను, కలిమిలేములే స్వరూపములుగా కలవియునై యున్నవిగాని, ఇవి ఘోరమగు దుఃఖమును మాత్రమే నీకు కలిగించుచున్నవి. సుఖము ఒకించుకంతయైనను కూర్చుటలేదు. ఓ మూర్ఖుడా! మనస్సా! నిరర్థకముగ ఈ శబ్దాది రూపములగు తుచ్ఛవృత్తులలో తిరిగెదవేల? ఏ పదార్థమును ఆశ్రయించుటవలన సత్యమగు దాని జెందగలవో, దేనియందు స్థిరముగ నిలుకడ నొందగలవో, అట్టి శాంతినిగూర్చి కొంచెమైనను ప్రయత్నింపవేల? నీ మూర్ఖతనుగూర్చి ఏమిచెప్పగలను.

ఓ మూర్ఖుడా! మనస్సా! నిరర్థకముగా శూన్యరూపమగు శ్రోత్రత్వమును జెంది (మనస్సే శ్రోత్రగోళమునందు శ్రోత్రేంద్రియ రూపముతోనుండి శబ్దమును గ్రహించుచున్నది, అనియు, మనోభిన్నముగ శ్రోత్రేంద్రియము లేదనియు, ఒకటేమనస్సునే ఉపాధిభేదమువలన ఇంద్రియ రూపములతోను, అంతఃకరణ రూపములతోను, వ్యవహరించుచున్నారనియు, తెలిసికొనవలయును) శబ్దమును ఆశ్రయించి "వేటకానిపాటకు లోబడి నశించు లేడివలె" చెడిపోకుము. ఓ మూర్ఖుడా! మనస్సా! ఇట్లే శూన్యరూపమగు త్వగింద్రియమై స్పర్శమును అనుసరింపుచు, ఆడ ఏనుగుపై ఆశచేత గట్టువడు మొగఏనుగవలె నిరర్థకముగ గట్టువడి దుఃఖింపకుము (అడవి ఏనుగు

లను పట్టువారు వానిని ఉపాయముచేత పెద్దపల్లమునందు పడవైచి కొన్ని దినములు ఆహారము వేయక పాదము నణచి పిమ్మట ఆపల్లము లోనికి బోవు టకు ఏటివంపుగ మార్గమును గావించి లోపల ఉన్న ఏనుగు మొగదైన యెడల ఆడ ఏనుగును, ఆడదైన యెడల మొగ ఏనుగును, దెచ్చిదానికొరకై లోపలనున్న ఏనుగువెలికి నడుగు పెట్టగానే తాను దెచ్చిన ఏనుగుచేతదానిని బంధింప జేయుదురు. దీనికొఱకై వారు కొన్ని మొగఏనుగులను, ఆడఏనుగుల ను, పెంచుచుండి వానికి తమవద్దికివచ్చిన ఏపదార్థమునైనను తమకాలికి కట్టి యున్న గొలుసుతో గట్టివేయునట్లు నేర్పియుందురు. ఈవిషయము ఇచ్చట ఉపమానమున ఉద్దేశింపబడెనని తెలిసికొన వలయును.) ఓ గ్రుడ్డివాడా! మూర్ఖుడా! మనస్సా! ఈవిధముగనే జిహ్వేంద్రియ రూపములను దాల్చి క్రొత్తక్రొత్త రుచులను కోరుచు, "గాలమునకు తగిలించియున్న ఎరపై (ఆహారముపై) ఆశ చేసి చెడు చేపవలె" చెడిపోవకుము. ఓ మూర్ఖుడా! మనస్సా! నేత్రరూపమును జెంది రమ్యములగు ఆకారములను గోరుచు "దీపమునందు ఫలమను తలంపు బెట్టుకొని పైకి ఉఱుకు మిడుతవలె" కాలి పోవకుము. ఓ మూర్ఖుడా! మనస్సా! మఱియు ఘ్రాణమార్గమును ఆశ్ర యించి సువాసనలను గోరుచు శరీరమును "కమలమధ్యమున తుమ్మెదవలె" బంధమును జెందనీకుము (తుమ్మెద సువాసనలకై కమలమధ్యమున ప్రవే శించియుండి ప్రొద్దు నెఱుగలేక అస్తమయ సమయమునందు కమలము ము కుళింపగానే అందు జిక్కి ఊపిరి తిరుగక సూర్యోదయమగు నప్పటికి మృతి నొందును. ఈ విషయమే ఇచ్చట ఉపమానమున ఉద్దేశింప బడినదని తెలిసి కొనవలయును.)

శ్లో॥ కురంగాళిపతంగేభ మీనాస్త్వేకైకశోహతాః ।
సర్వైరేతైరనర్థైస్తైర్వ్యాప్తస్యాజ్ఞ కుతస్సుఖమ్ ॥

ఓ మూఢుడా! మనస్సా! లేడి, ఏనుగు, మిడుత, చేప, తుమ్మెద, అనునీ యైదును క్రమముగ శబ్ద స్పర్శ రూప రస గంధములలో ఒకొక్క దానిని మాత్రమే ఆశ్రయించి చెడిపోయినవి. నీ వన్ననో, ఈ యైదింటిని అనర్థములని తెలిసికొనలేక సుఖకరములని భావించి అభిమానించుచున్నావు. ఇట్టి నీకు శుభము ఎట్లు కలుగును.

శ్లో॥ హే చిత్త వాసనాజాలం బంధాయభవతోత్థితః ।
యదిశామ్యసి తత్త్యక్త్వా తదనంతో జయస్తవ ॥

ఓ మూర్ఖుడా! మనస్సా! ఈ సంసార సంస్కారములన్నియు నీకు

వలనై చుట్టుకొని ఉన్నవి. దానిని దాటి ఈవలకు వచ్చితివేని నీకు ఎప్పటి కిని అపజయము కలుగనే కలుగదు. ఛీ ఛీ నేనెంత తెలివితక్కువ వాడను! ఓ మూర్ఖుడా ! మనస్సా ! నీకేల బుద్ధిచెప్పవలయును. ఆత్మవిచారము తీరి గినచో నీ వచ్చట ఉండనే ఉండవుకదా ? వాస్తవస్థితిలో నీ సుఖదుఃఖము లతో నాకేమి పని ? బాగుగ విచారించిన సర్వవ్యాపియగు పరమాత్మ మనస్సునందు ఉండబోడు. ఏనుగు బిల్వఫలమునందు ఉండగలదా ? ఈకార ణమువలన ఆత్మ విచారము చేయువానికి మనస్సుతో పనియే లేదు. ఆమ నస్సు ఆత్మకు నివాసస్థానమగునేని అప్పుడు దానితో కొంత పనియుండవ చ్చునుగాని, అట్లు లేదుకదా ? పాదాంగుష్ఠము మొదలుకొని శిరస్సువరకు గల సర్వావయవములను ప్రత్యేకముగ విచారించినను అహంశబ్దమునకు ( నేను అను పదమునకు ) అర్థమగు పదార్థము ఒకటియును కానరాలేదు. ప్రతివాడును "నేను, నేను" అని దేహమును చూపుచున్నాడుగాని, ఇందు ఆపదమునకు అర్థమగునది ఏదియు గానరాలేదు. ఇకను ఆశబ్దము నకు అర్థమెద్దియో ? విచారింపగ విచారింపగ ప్రపంచమంతయు వ్యాపించి యున్నట్టియు, ఏకరూపమైనట్టిదియు, నగు-ఒక్క-పదార్థము నాకు గాన వచ్చుచున్నది. అదియేజ్ఞానము. సర్వపదార్థములయందును జ్ఞానము ఏకరూ పముతో నున్నది యనుట ప్రత్యక్ష సిద్ధమగు విషయము. అది సర్వమును తెలిసికొనునది అగుటచేత దానికి ఈ ప్రపంచ వికారములు ఏవియు లేవు. ఈ అహంశబ్దమునకు అదియే అర్థముకానోవు. అజ్ఞానరూప పదార్థమునకు "ఇది ఇంతవరకు ఉన్నది" అని పరిమాణము చెప్పుటకును "దీనికి ఇది పేరు" అని చెప్పుటకును వీలులేకున్నది. దానియందు ఏకత్వము ఉన్నదని కాని, అనేకత్వము ఉన్నదనికాని, చెప్పుటకు వీలుకలుగలేదు. అది స్థూలము గాని, సూక్ష్మముగాని, కాకున్నది. ఇట్టి అజ్ఞానస్వరూపమగు పదార్థమే "నేను అనుపదమునకు అర్థమగుటచేత ఆపదార్థమునకును నాకును భేదము లేదు. నేనే జ్ఞానరూపుడను, స్వయంప్రకాశుడను. నా రూపమును నేనే తెలిసికొనవలయును గాని, మఱియొకటి తెలిసికొన నేరదు. ఒక జ్ఞానము నకు సాక్షియై మఱియొక జ్ఞానము ఉండుననుట విరోధము కదా. కావున నేను స్వయముగనే ఆత్మరూపమును గ్రహింపవలయును గాని, అట్లుచేయు టకు మఱియొక సాధనము లేదు.

ఓమూఢుడా ! మనస్సా ! నేను ఇట్టివాడనై యుండ నాయందు నీవు జనించి లేని దుఃఖములను నాపై ఆరోపించుచున్నావు. ఈవృత్తాంత

మును ఇప్పుడు తెలిసికొంటిని. స్వస్వరూపజ్ఞానముచేత ఇదో నిన్ను సంహ రించుచున్నాను చూడుము. మఱియును ఈ దేహమునందు ఇదిగో మాంస ము, రక్తము, ఎముకలు, ప్రాణాపానాది వాయువులు, ఉఛ్వాస నిశ్వాస ములు, మాత్రమే కానవచ్చు చున్నవి. ఇందు నేనెవ్వడను ? ఓమనస్సా ! ఈమాంసము, రక్తము, ఎముకలు, చలనము, మొదలగునవి అన్నియు నాకంటె అన్యములని స్పష్టముగనే కానవచ్చు చున్నవి. సంకల్పముగూడ నాకంటె అన్యమనియే తెలియవచ్చు చున్నవి. నాప్రాణములు నారక్తము అను మొదలగు భేద వ్యవహారములు లోకమునందు ప్రత్యక్షముగనే ఉన్నవి కదా? ఇక వీనిలో నేను ఎవ్వడను అగుదును? ఇది నాలుక, ఇది ఘ్రాణము, ఇవి కర్ణములు, ఇవి నేత్రములు, ఇది రెప్పపాటు, ఇది త్వగిం ద్రియము, ఇట్లు ఇవియన్నియు నాకంటె భిన్నములై యుండగ నేను వీని లో నొకడను ఎట్లగుదును ? కావున " సర్వమును నేనే " అనియైనను " ఏదియు నేను కాను " అనియైనను తలంపవలయును. ఈ రెండు జ్ఞానము లలో ఏదియైనను ఒకటిమాత్రమే యుక్తమగును కాని, ఇతరములు ఏవి యు సరిపడవు. ఈచూపులలో రెండును యథార్థ విషయములగు చూ పులే. ఆహా ! చిరకాలమునుండియు అడివియందున్న గోత్రపిల్లను మదిం చిన తోడేలు హింసించునట్లు అజ్ఞానమను దుష్టుడు అహంకారయుక్తుడై నన్ను బాధించు చుండెను. నేటికి ఈదొంగ నాకు దొరికెను. ఇంతకాల మువరకు మోసముచేత నన్ను తనకు వశునిచేసికొని ఈతడు ( అజ్ఞానమను దొంగ ) స్వస్వరూపమను ధనము అపహరించి నన్ను బాధించు చుండె ను. ఇప్పటికి వాని మోసమును తెలిసికొంటిని. ఇక వానిని ఆశ్రయింప బోను. ఓజ్ఞానేంద్రియములారా! మీరు నిష్కారణముగ మూర్ఖులై సంస్కా రములకు చిక్కకుడు. మీరు మీకార్యములను జేయుటకు సంస్కారము అక్కఱలేదు. " ఇది ఇట్లు చేయవలయును. ఇది ఇట్లు చేయరాదు " అను సంకల్పములు లేకున్నను మీరు మీకార్యములను చేయగలరు. కావున నిరర్థ కముగ రాగద్వేషములను ఆశ్రయించి చెడిపోవలదు. వానిని పరిత్యజించి మీమీకార్యములను ఆచరింపుడు. దానివలన మీకు దుఃఖము కలుగబోవు. ఓ ఇంద్రియ బాలకులారా ! మీరు నిరర్థకముగ ఆశను ఆశ్రయించి పట్టు పురుగులు, లేక, సాలెపురుగులు తన దేహములోనుండి వచ్చు దారముచేత తానే కట్టుపడునట్లు కట్టుపడితిరి. ఈవిధముగ వ్యవహారమునకు సంస్కా రములతో పనిలేదు. కావున ఓమనస్సా ! నీవును ఏకమై పరిశుద్ధమై జ్ఞాన

రూపమై ఉన్న బ్రహ్మమునందు శాంతిని పొందుము. ఓమనస్సా! వాసనలు లేకున్న నీస్వరూపముకూడా బ్రహ్మభిన్నమైనది కాదు. నీవు శూన్యరూపుడవే. ఈవిషయమును బాగుగ ఎఱుగుము. ఓమనస్సా! సర్వేంద్రియములకును నీవే ఆధార భూతుడవు. నీవు శాంతిని పొందిన ఇంద్రియములుకూడ శాంతినొందును. ఎందుకును అక్కఱకురాని సంసారములను ఆశ్రయించి నిరర్థకముగ దుఃఖింప నేటికి.

శ్లో॥ విషయవిష విషూచికామనంతాం
నిఘృణమహం స్థితివాసనామపాస్య ।
అభిమతపరిహార మంత్రయుక్త్యా
భవవిభవో భగవాన్భవి యామభూమిః ॥

ఓమనస్సా! నీవు ఇష్టవస్తు పరిత్యాగమను మంత్రప్రయోగముచేత విషయములనియెడు విషూచికా జాడ్యమును అహంకార సంసారమును, విడువుము. దానిచేత నిన్ను సంసారము బాధింపనేరదు. నీవే ప్రత్యక్ష పరమేశ్వరుడవు అగుదువు. బుద్ధికి అగోచరుడవు అగుదువు. ఇకమీద సంకల్పమను వృక్షములతోను, ఆశలనెడి తీగెలతోను, కూడిన మనస్సనెడు అరణ్యమును ఛేదించి విశాలమగు భూమిని (బ్రహ్మమును) ఆశ్రయించి యథేచ్ఛముగ విహరింతును. ఆస్థానము నాకు దొరికినది. నాకంటె భిన్నమగునది ఎచ్చటయు లేదు. నా అభివృద్ధికి కొఱత లేదు. నేను శాంతుడనైతిని. నాకు విభాగములు లేవు. నేను ఏకార్యమును చేయువాడను కాను. దేనిని కోరువాడను కాను. మఱియు నిర్మలత్వము, ప్రసిద్ధి, ఉనికి, మనోహరత్వము, త్రికాలములయందును హానిలేకుండుట, సర్వజ్ఞత్వము, ఆనందము గలిగియుండుట, శాంతిగలిగియుండుట, సర్వపూజ్యత, నిత్యసంతోషము, నిత్యాభ్యుదయము, సర్వపరిపూర్ణత్వము, గంభీరత్వము, శాశ్వతమగు స్వప్రకాశము, ఏకత్వము, జ్ఞానరూపత్వము, భేదములుగా గానవచ్చుచున్నను సర్వపదార్థములయందు సమదృష్టి, భయములేకుండుట, ( "ద్వితీయాద్వై భయం" "రెండవ పదార్థము ఉండిననేగాని భయముకలుగదు" అను శ్రుతిని అనుసరించి భేదభావన గలవానికే కాని, భయము ఉండదు. కావున ఇచ్చట భేదభావన లేకుండుటచేత భయము లేదనుట. ) "రెండు" అను భేద సంకల్పము బొత్తిగనే లేకుండుట,అనఱుస్త్రీలందరును (ఈపదములు మూలమునందు స్త్రీలింగములో ప్రయోగింప బడియున్నవి. కావున "స్త్రీలు" అని చెప్పబడినవని తెలిసికొన వలయును. ) మనోహరరూ

పములతో దినదినమునకు అభివృద్ధిగాంచుచు సంతోషయుక్తలై ఆత్మనిష్ఠ యందు ఉన్న నన్ను భార్యలై ఎల్లప్పుడును సేవించు చుందురుగాక. ఓరఘుపుంగవా! రామచంద్రా! ఈవిధముగ విషయ నిర్ణయమును గావించి మనస్సును అణచి ఆయుద్దాలక మహాముని సిద్ధాసనమునందే కూర్చుండి కన్నులు సగము మూసికొని పరిశుద్ధమగు బుద్ధివృత్తితో నిర్వికల్ప సమాధి యందు అట్లే నిలచెను. బాగుగ వాయింపబడిన గంటవలె గొప్పధ్వనితో, ఓమ్, అని ఓంకారమును ఉచ్చరించెను. ఇట్లు ఓంకారమును ఉచ్చరించుచుండగ ఆత్మస్వరూపము దానికి అభిముఖమై ఓంకారధ్వని ఉన్నంతవరకు ఊర్ధ్వభాగమునందే ( మనస్సునందే ) నిలచియుండెను. (ఓంకారరూపముతో బ్రహ్మమును ధ్యానించెననుట.) ఆ ఓంకారమునకు అకారము, ఉకారము, మకారము, అను మూడుమాత్రలును ( మాత్రయనగా, లఘువగు ఒక అక్షరమును ఉచ్చరింపగల యంతకాలము ) ధ్వనిరూపమైన అర్ధమాత్రయు గలసి మూడున్నర విభాగములు కలవు. అందు ప్రథమమగు అకారము మొట్టమొదట అభివృద్ధియై విజృంభించి ప్రాణవాయువును ప్రేరేపించెను. [ ప్రణవమును ఆధారముచేసికొని ఆత్మోపాసనము చేయువారలకు దేహము, ఓంకారము, అను రెండును అరణులుగాను (అరణి, అనగా, యజ్ఞమునందు అగ్నిని మథించుదారువు ) పరమాత్మయందు జనించు అగ్నిగాను, వర్ణింపబడును. ] అంత ఆప్రాణమునకు దేహము అరణి అయ్యెను. వానిని పరస్పరము మథించుటచేత ( దేహమునుండి వివేకమువలన ప్రాణమును వేరుచేసి విచారించుటచేత ) రేచకమనునది ఉత్పన్నమై ( రేచకమనగా, వాయువును ముక్కునుంచి వెలుపలికి విడుచుట ) " అగస్త్యమహర్షి సముద్రమును పానము చేసినట్లు " దేహములోని ప్రాణవాయువులను అంతయు పానముచేసెను. ( ప్రాణసంచారము అణగెననుట ) శరీరము అంతయును శూన్యమును గావించెను. ( ప్రాణమునందు ఆత్మభావనతొలగెననుట ) అంత నాప్రాణవాయువు దేహమునుండి నిర్గమించి చైతన్యరూపమగు ఆకాశమునందు నిలచెను. ( ప్రాణము బ్రహ్మమునందు ఐక్యమయ్యెననుట ) మఱియు దీనివలన హృదయమునందలి అగ్ని ( జ్ఞానరూపమగు తేజస్సు ) ప్రజ్వరిల్లి అపరిశుద్ధమగు దేహమును ( అజ్ఞానము మొదలగు ఆత్మ మాలిన్యమును ) కాల్చివేసెను. ఇట్లు అకారాది వృద్ధివలన గలిగిన రేచకరూప ప్రాణాయామమునందు పైవర్ణించిన స్థితులు ఇచ్ఛామాత్రము వలననే సంభవించెను గాని, హఠయోగమువలన సంభవించినవి

కావు. (శ్రమపడి ప్రాణాయామ యోగము అభ్యసించువారికిగూడ కాల
క్రమమున ఇట్టి స్థితులు అనగా, ప్రాణవాయు సంచారము లేకుండుట,
హృదయము నందలి అగ్ని ప్రజ్వలించుట, అనునవి సంభవించును. ఇచ్చట
మాత్రము ఇవి అన్నియు సంకల్ప మాత్రములే అని తెలిసికొనవలయును.)
హఠయోగము కేవలము ఆయాసకరమేగాని అల్పకాలమునందే ఇట్టి సం
పూర్ణ ఫలమును ఇచ్చునది కాదుగదా? పిమ్మట రెండవభాగమగు ఉకార
ము విజృంభించెను. అప్పుడు ప్రాణమునకు కుంభకమను క్రమము కలిగెను.
(కుంభక మనగా, ప్రాణములను చాంచల్యము లేకుండ లోపలగాని, వెలు
పలగాని, నిలుపుట) ప్రాణములన్నియు నిశ్చలము లయ్యెను. అప్పుడు
తోలుతిత్తియందు బంధింప బడినవానివలె ఆప్రాణములు శరీరమునకు
వెలుపలగాని, లోపలగాని, మీదగాని, క్రిందగాని, దిశలయందుగాని, ఇంచు
కయినను సంక్షోభము నొందలేదు. అంత నావాయు ప్రభావమువలన
మలినదేహమును గాల్చిన ఆవహ్ని (అజ్ఞానస్థితిని శరీరముగా వర్ణించి
దానియొక్క నాశమును జ్ఞానశరీర ప్రాప్తియునియు, ఇచ్చట విచిత్రముగ
వర్ణింపబడుచున్నవి) శాంతిని పొందెను. కాలిన శరీరముయొక్క (అజ్ఞాన
స్థితి అను శరీరముయొక్క) బూడిదె మంచువలె తెల్లనై గానవచ్చెను.
ఆదేహమునకు సంబంధించిన ఎముకలు కర్పూర శయనమునందు పరుండి
యున్నట్లు ఆబూడిదెపై తమశ్వేతవర్ణముతో ప్రకాశించుచు బడియుండి
నవి. పిమ్మట గొప్పవాయువు వీచుటచేత ఎముకలతోగూడ ఆబూడిదె
ఎగసి "శరత్కాలమునందలి తెల్లని మేఘములవలె" ఆకాశమునెల్ల ఆవ
రించి క్రమముగ నంతర్థానమాయెను. ఈ వర్ణింపబడిన స్థితియు పూర్వస్థితి
వలెనే ఇచ్ఛాధీనముగ కలిగినదియే గాని, హఠయోగమువలన సంభవించి
నది కాదు. హఠయోగము అతి శ్రమసాధ్యము గాని, ఇంత అల్పకాలము
నందు సిద్ధించునది కాదుగదా? తర్వాత ఆప్రణవముయొక్క మూడవ
అవయవమగు మకారము శాంతిప్రదమై విజృంభింప నారంభించెను. అప్పు
డు ఆప్రాణవాయువులకు పూరకమను మూడవస్థితి సంభవించెను. ఆవా
యువులు ప్రపంచము నంతయు నిలుపుటచేత ఆస్థితికి ఆపేరు (పూరకమను
పేరు) కలిగినది. ఆసమయమునందు ఈ ప్రాణములన్నియు చైతన్యమను
అమృతముచేత తడుపబడి చిదాకాశమునందు [illegible] మంచువలె మిక్కిలి
చల్లదనమును చెందినది. తర్వాత పొగ ఆకాశమునందు చేరి మేఘమైనట్లు"
ఆప్రాణములుకూడా క్రమక్రమముగా చంద్రమండల స్వరూపమును చెంది

నది. అంతటితోనిలవక ఆచంద్రమండలమునందు ఆప్రాణములే అమృతధారారూపములాయెను. అట్టి ఆఅమృతధార "శివుని జటాజూటమునుండి నేలపైబడు గంగాధారవలె" ఆబూడిదెపై (వెనుకవర్ణింపబడిన బూడిదెపై) బడెను. గాలికి ఎగిరిపోవగా నాబూడిదె అప్పుడు కొంత మిగిలియుండెను. అంత ఆబూడిదె సజీవమై అందుండి నాలుగు బాహువులచే నొప్పుచు చంద్రబింబముతో సమానమైయున్న ఒక క్రొత్తదేహము పుట్టెను. (ఇప్పుడు వర్ణింపబడినది జ్ఞానదేహము) ఓరామచంద్రా! ఈవిధముగ ఓంకార జప ప్రభావముచేత ఉద్దాలకుని శరీరము విష్ణుశరీర మాయెను. పైనవర్ణించిన విధముగ అమృతమయములైన ప్రాణములు ఆశరీరమును నిండించి కుండలీశక్తిని (మూలాధార సహస్రారములను) గూడ సంపూర్ణమును గావించినవి. ఈవిధముగ జ్ఞానమయ శరీరమునుజెంది స్థిరుడై ఆ ఉద్దాలకుడు సిద్ధాసనమునందు నిలచి హృదయమున తుమ్మెదవలె నిటునటు చలించుచున్న మనస్సును బలాత్కారముగ బంధించెను. అప్పుడు బలమైన కట్టచేత నిరోధింపబడిన జలమువలె ఆమనస్సుకూడ నిశ్చలమాయెను. దట్టమగు రెప్పవెంట్రుకలు గలిగి మనోహరములైనట్టియు నిశ్చలములగు నల్లగ్రుడ్డులచేత రమ్యములైనట్టియు, నేత్రములను సగము మూసెను. అప్పుడు అవి సంధ్యాకాలములందలి కమలములవలె అతి సుందరములైయుండెను. మఱియు ప్రాణాపానవేగములను ఉపసంహరించెను. ఇంద్రియములను హానికార్యములనుండి బలవంతముగ మఱలించెను. అంత వెలుపల గానవచ్చు శబ్దస్పర్శాదులను అన్నిటిని బొత్తిగ వర్జించి లోపలనున్న వికారములగూడ అట్లే అణచెను. అంత మడమలతో గుద రంధ్రమును దృఢముగ మూసి ఇతర రంధ్రములనుండిగూడ వాయువును చలింపకుండునట్లు చేసెను. లోకమునందు ఒక కుండకు రంధ్రములు అనేకములున్నను దానినొకటిని బలముగ మూసినచో లోనున్న జలము ఏరంధ్రమునుండి కూడ స్రవింపదు కదా? ఇంతయే కాక, స్వస్థరూపమను రత్నముతో (తనయందలి రత్నములతో అని రెండవయర్థము) ప్రకాశించుచున్నదియు, పుష్పమాలలతో నొప్పునదియు, నగు తన కంఠమును (జీవస్థానమని చెప్పబడు విశుద్ధచక్రము కంఠమునందే కలదు. కావున ఇట్లుచెప్పబడెను) మేరుశిఖరమువలె చక్కగ పైకెత్తెను. (యోగాభ్యాస సమయమునందు ఇట్లుండవలయును) మఱియు ప్రత్యాహారము (ఇంద్రియములను విషయములనుండి మఱలించుట) మొదలగు ఉపాయములచేత లోబడి శాంతినొందిన

చిత్తమును, "మదించిన ఏనుగును ఉపాయములచే స్వాధీనము చేసికొని
వింధ్యగుహాయందు కట్టివేయునట్లు" తనహృదయాకాశమునందు గట్టివేసె
ను. ఇట్లు సర్వమును సాధించి శరత్కాలమునందలి ఆకాశమువలె అతిస్వ
చ్ఛమై విస్తారమైయున్న శాంతిని పొంది ఆ ఉద్దాలకుడు అప్పటప్పటికిని సం
స్కార బలమువలన గ్రమ్మునట్టి సంకల్ప వికల్పములను ఒక్కపెట్టున నిరా
కరించెను. ఇట్లు ఎంత ప్రయత్నించినను సంకల్పములు మఱల మఱల వచ్చు
చునే యుండినవి. ఆతడును, "యుద్ధభటుడు తనఖడ్గముతో శత్రువులను
నఱుకునట్లు" జ్ఞానఖడ్గముతో వానినెల్ల నణచుచుండెను. ఇట్లు సర్వ సంక
ల్పములును ధ్వంసము కాగానే అజ్ఞాన మను అంధకారముచేత ఆవరింప
బడి కాటుకవలె నల్లగానున్నట్లు గానవచ్చుచున్న జ్ఞానసూర్యుడు ఆ యు
ద్దాలకునకు హృదయ మధ్యమునందు తోచెను. అప్పుడు విజృంభించి
ఆముని వివేకమను సూర్యప్రకాశముచేత ఆయజ్ఞానాంధకారమును అణచి
వేసెను. పిమ్మట అంధకారము లేకుండుటచేత అత్యద్భుతమగు కాంతిస
మూహము విజృంభింపగా దానినిగూడ అతడు ధ్వంసముచేసెను. (వివే
కము ప్రవర్తింప వలయునసిన ఆత్మ ఒక్కడు, అనాత్మ ఒక్కటి, వారిభేద
ము ఒక్కటి, ఆభేదమును కలిగించు ధర్మములు కొన్నియు, ఉండవలయు
ను. ఏకరూపుడగు ఆత్మయందు ఇట్టి భేదములు సంభవింపవు. కావున నా
వివేకముగూడ పరిత్యాజ్యమే అని తెలిసికొన వలయును) ఇట్లు తేజస్సు
కూడ లయమునొందగా రాత్రికాలమునందలి కమలమువలె అతని మనస్సు
నిశ్చేష్టమై నిదురను పొందెను. ఆతడును శీఘ్రముగా ఆనిదురనుకూడ ఖం
డించెను. ఇట్లు నిదుర పోవగానే ఆకాశరూపము ఆవిర్భవించెను. అది
యును నశింపగానే అతనిమనస్సు మూర్ఛిల్లెను. అంత స్వప్రకాశ ప్రభావ
ముచేత ఆమూర్ఛనుగూడ అణచివేసెను. తర్వాత ఆతనిమనస్సు తేజస్సున
కంటెను, చీకటికంటెను, నిద్రకంటెను, మోహమునకంటెను, వివేకమున
కంటెను, భిన్నమగు ఒకానొకస్థితిని (నిర్వికల్ప సమాధిని) పొంది ఒక
క్షణకాలము విశ్రమించెను. ఓకమలలోచనా! శ్రీరామా! ఈవిధముగ
ఆయుద్దాలకుని చిత్తము నిర్వికల్ప సమాధిని పొంది అక్కడినుండి శుద్ధచైత
న్యమునందు ప్రవేశించెను. "కట్ట బాగుగ కట్టిన జలము కొంతసేపువ
రకు దానిని త్రోయ ప్రయత్నించినను, తర్వాత వెనుకకుతిరిగి స్వస్థాన
మగు పల్లమునకే చేరునట్లు ఆమనస్సుకూడ దృఢముగ నిరోధింపబడినదై
కొంతసేపువరకు అటునిటు పోవ యత్నించియు, తుదకు ఏమియు జేయ

లేక స్వస్వరూపమగు బ్రహ్మమునందే నిలువవలసిన దయ్యెను. ఈవిధముగా బహుకాలమునుండియు నిరోధింపబడిన దగుటచేతను, పరమానంద రూపమగు బ్రహ్మమును అనుభవించిన దగుటచేతను, "ఆమనస్సు సువర్ణము భూషణమైనట్లు" తత్క్షణమే పరబ్రహ్మమయ్యెను. ఈవిధముగా, ఆయుద్దాలకుని మనస్సు మనోరూపమును విడచి వర్ణించిన విధముగా పరబ్రహ్మరూపమును జెంది కుండగామారిన బురదవలె క్రొత్తదియే అయ్యెను. ఇట్లు మనస్సు చైతన్యమునందు గలయగానే దానితోగూడా దృశ్యములన్నియు నశించుటచేత అచైతన్యముకూడ దృశ్యసంబంధమును విడిచి "అలలుమొదలగు భేదములను విడచిన సముద్రము కేవల జలరూపముతోనే నిలచునట్లు" కేవల చైతన్యరూపముతోనే నిలచెను. ఈవిధముగా ఆయుద్దాలకుడు చిత్తశాంతిని పొంది పంచభూతమయ సంకల్పములను విడిచి సర్వప్రపంచములకు ఆధారమును నిర్మలమును నగు చిదాకాశ రూపుడై జ్ఞానవంతుడై నిలచెను. ఇట్లు కృతార్థుడే ఆమహాత్ముడు ఆత్మనిష్ఠచేత అమృతమయమగు సముద్రమువలె అతిమనోహరమైనదియు, ఆద్యంతములు లేనిదియు, చ ... వు, అను భేదములు లేక ఏకరూపమైనదియు, నగు పరమానందమును బొందెను. శరీరమును అతిక్రమించి అవాఙ్మానస గోచరమగు ప్రదేశమును ఆశ్రయించి సర్వభూతములయందును గానవచ్చుచున్న ఉనికియే స్వరూపముగా గలవాడై ఆనంద సముద్రుడాయెను. అప్పుడు ఆయుద్దాలకుని చేతనమను హంస ఆనంద తటాకమునందు నిలిచి క్రీడించుచు శరత్కాలమున శుభ్రమగు ఆకాశమునందు ప్రకాశించు సంపూర్ణ చంద్రునివలె వెలిగెను. ఇట్లు ఆమహాత్ముడు గాలిలేని ప్రదేశమున ఉన్న దీపమువలెను, చిత్తరువునందు వ్రాయబడిన ప్రతిమవలెను, అలలులేని సముద్రమువలెను, సంపూర్ణముగ వర్షించుటచేత ధ్వనిచేయని మేఘమువలెను, ప్రకాశవంతుడై నిశ్చలుడై సంక్షోభరహితుడై ఇంద్రియ వ్యాపార శూన్యుడై నిలచి యుండెను.

## —✱ ఉద్దాలకుని ఆత్మనిష్ఠ స్థిరమగుట. ✱—

అంత నాయుద్దాలకుడు చిదాకాశమున నుండగా, అచ్చట ఆతనికి ఆకాశచారులగు సిద్ధులును, దేవతలును, నేలవేలుగ గానవచ్చిరి. అణిమా (సన్నమగుట) అను మొదలగు యోగసిద్ధులు అనేకములు ఆతనివద్దకు వచ్చెను. ఆబ్రాహ్మణుడు మాత్రము ఆశలేనివాడు కావున వానిని ఆదరింపనుగూడ లేదు. ఇట్లు స్వయముగనే చేరవచ్చిన మహాసిద్ధులనుగూడ ధిక్క

రించి ఆ ఉద్దాలకముని ఆత్మానందమను గృహమునందు ఏకరూపముతో ఆరుమాసములు ఉండెను. ఉత్తరదిశయందు క్రౌంచపర్వత శిఖరము పుట్టెనో యన నిర్వికల్ప సమాధియందు నిలచి నిశ్చలుడై ఉండెను. ఓరామచంద్రా! సిద్ధ సాధ్య విద్యాధరాదులును, దేవతలును, బ్రహ్మవిష్ణాదులును, పొందియున్న జీవన్ముక్తినే పొందెను. కొఱత ఏమియు లేదు. ఆతని చిత్తము ఆనందరూపముగ పరిణమించు స్వభావమును విడిచెను. లోకమునందు ఏఏపదార్థములు గ్రహింప బడుచున్నవో ఆయా పదార్థరూపములతో మనస్సు పరిణమించు చుండుననుట స్పష్టమైనవిషయము. ప్రస్తుతము వర్ణింపబడుచున్న విషయమునందు మనస్సు సంపూర్ణముగ వినాశమునే జెందుటచేత దానికి అట్టి సామర్థ్యము తొలగినది. ఇట్లగుటచేత ఆమహాత్ముని ఆత్మను " ఆనందమయమగు స్థానమును చెందినది " అని వర్ణించుటకు వీలు లేదు. మనస్సు పదార్థ రూపముతో పరిణమించునప్పుడు మాత్రమేకదా? ఆత్మ ఈపదార్థమును తెలిసికొనుచున్నది. ఇచ్చటికిపోయినది. అనిచెప్పుచున్నాడు. ఈకారణమువలన ఆయుద్దాలకుని ఆత్మ ఆనందమునందుగాని, ఆనందరహితమగు మఱియొక స్థలమునందుగాని, నిలువలేదనియే చెప్పవలెను.

ఓరామచంద్రా! బాగుగ విచారించిన జీవన్ముక్తులయొక్క ఆత్మకు, జీవన్ముక్తుల ఆత్మకు మాత్రమే అననేల? అందఱి ఆత్మలకును స్వస్వరూపస్థితికంటే అన్యమగు ఉనికి ఎప్పటికిని లేదుకదా? పైవర్ణింపబడిన స్వస్వరూపస్థితియే సంసార భయమునుండి బోవు ఉనికిపట్టు. అదియే అందఱకును గమ్యస్థానము. అదియే శాశ్వతమై పరమానందరూపమై ఉన్న పరబ్రహ్మము. ఓశ్రీరామచంద్రా! సాధకులగు మహాత్ములు ఈస్థానమును చెందుదురేని అందు ఒకక్షణము నిలచిన ఒకటియే, నూరు సంవత్సరములు ఉన్నను ఒకటియే. ఇకను ఎన్నటికిని సంసార కారణమగు భేదదృష్టిని చెందరు. పునర్జన్మము నొందరు. ఓరఘురామా! ఈవిధముగ ఆయుద్దాలక మహాముని తమంతన తన్ను ఆశ్రయింప వచ్చిన అణిమాది సిద్ధులను తిరస్కరించి దేనియందును ఆశలేక ఆత్మనిష్ఠుడై ఆఱుమాసములు అట్లేయుండి పిమ్మట మేలుకొనెను. అప్పటికి చంద్రసమాన రూపులగు సిద్ధులును, విద్యాధర స్త్రీలతో గూడిన విద్యాధర ప్రభువులును, ఆమునికి ఎదుట నిలువబడియుండిరి. వారిని ఆముని ప్రీతిపూర్వకమగు దృష్టితో చూచెను. వారును నమస్కరించి అమ్మహామునితో ఇట్లనిరి. ఓమహాత్మా! ఉద్దాలకమహా

మునీ! మమ్ము కరుణాయుక్తునుగు దృష్టితో చూచుము. మా ఎదుటనున్న విమానమునెక్కి స్వర్గలోకమునకు రమ్ము. సర్వలోకములయందున్న సుఖ భోగములకు అంతకును స్వర్గమేకదా పొలిమేర. కావున ఓ ప్రభువా! ఉద్దాలకమహామునీ! నీవు అచ్చటజేరి బ్రహ్మకల్పాంతమువరకు ఇష్టములగు సుఖములను ఉచితరీతిని అనుభవింపుము. అని ఇట్లు పలుకుచున్న ఆసిద్ధవి ద్యాధరులను చూచి ఆ ఉద్దాలకమహాముని తగిన ఆతిథ్యము చేసెను. కా ర్యార్థమై వచ్చినను ఊరక వచ్చినను ఇంటికి వచ్చినవారు అతిథులే. వారి మాటలను అంగీకరించినను, అంగీకరింపకున్నను, ఆతిథ్యము మాత్రము అవశ్యముగ ఇవ్వవలసినది కర్తవ్యమే కదా? ఇట్లు వారలను యథోచిత ముగ గౌరవించి పిమ్మట ఇట్లనియె. ఓసిద్ధులారా! విద్యాధరులారా! మీరు ఇట్లు ( స్వర్గమునకు రమ్మని ) చెప్పవలదు. ఆస్వర్గము కల్పాంతముననైన ను నశించునదియేకదా? కావున అచ్చటి సౌఖ్యములతో నాకు పనిలేదు. మీరు మీ మీ నివాసములకు బొండు.

ఓశ్రీరామచంద్రా! ఈవిధముగ మహాధైర్యవంతుడగు ఆ ఉద్దాల కుడు చేతికివచ్చిన స్వర్గభోగములనుకూడ పరిత్యజించి స్వేచ్ఛావృత్తితో నుండెను. ఇట్లు భోగములయందు ఇచ్ఛలేక కేవలము నిత్య నైమిత్తిక కర్మ లను ( నిత్యము లనగా, ప్రతిదినమును ఆచరింపవలసిన సంధ్యావందనాది కర్మములు. నైమిత్తికము లనగా, గ్రహణము, అమావాస్య, మొదలగు కారణములవలన ఆచరింపవలసిన గ్రహణ స్నానాదులు ) -మాత్రమే అభి మానరాహిత్యముతో ఆచరించుచు బ్రహ్మమయుడై ఉన్న అమ్మహాత్ముని సేవించుచు కొంతకాలము ఉండి తర్వాత ఆసిద్ధాదులు తమతమ నివాస ములకు పోయిరి. పిమ్మట అయ్యుద్దాలకుడును అరణ్యముల యందును, ఋష్యాశ్రమముల యందును, యథేచ్ఛముగా సంచరింపుచుండెను. ఒకొ క సమయమునందు సమాధినిష్ఠుడై ఒకదినము అట్లే యుండెను. మఱియొ క సమయమునందు పదునేను దినములును, వేఱొక సమయమునందు ఒక మాసమును, ఇంకొకసమయమునందు ఒక సంవత్సరమును ఒకానొక సమ యమునందు అనేక సంవత్సరములును అట్లేయుండెను. జీవన్ముక్తుడగుట చేత అమ్మహాత్ముని సంచారమునకు ఏదియును ఆటంకము కానేరదుకదా. ఓరఘురామా! రామచంద్రా! ఇట్లమ్మహాముని చిద్రూప బ్రహ్మధ్యానమును దృఢముగ అభ్యసించుటవలన కేవల చిద్రూపుడేయై నిలచెను. బహుభేద ములతో గానవచ్చు ఈప్రాపంచిక పదార్థములయందుగల చైతన్యమంత

యును ఏకరూపమే అనియును, ఆచైతన్యమునకును నాకును భేదము లేద నియును, నిశ్చయించి బహుకాలము ఏకరూపముతో ధ్యానించుటవలన అల్పకాలమునందే అతఁడు సత్తాసామాన్యమును (సత్తయనగా, ఉనికి, ఇది సర్వ పదార్థములయందును ఉన్నది. దీనికి భేదము సంభవింపదు. ఉనికి కంటె భిన్నమగు పదార్థములేమియేకాని అన్యము కాదుగదా. కావున సర్వపదార్థములయందును కలదు కలదు. అని వ్యవహరింప బడుచున్న ఏక రూపమైన ఉనికికి సత్తాసామాన్యమని పేరు. భ్రాంతివలన ఉనికియందు భేదములను ఆరోపించి అందు ఒకట్టి దానినిమాత్రమే (ఒకట్టి పదార్థము నందు మాత్రమే ఉన్నదానిని) గైకొని వ్యవహరించిన నది (అట్లు వ్యవ హరింప బడియున్న ఉనికి) (సత్తావిశేషము అనబడునని తెలిసికొనవలయు ను) జెందెను. (అట్టిభావమును పొందెననికాని, మృతినొందెననికాని, భా వము) ఈవిధముగ అమ్మహాత్ముఁడు పరమ శాంతియనియెడు ఉత్తమస్థాన మును జెంది సంకల్పప్రచారము లేనివాఁడై పునర్జన్మమను బంధమును తొల గించుకొని సంశయమనియెడు ఉయ్యాలనుడిగి శరత్కాలమునందు మిక్కిలి శాంతమై విశాలమై స్వచ్ఛమైవెలుఁగొందు ఆకాశమువలె అతి పరిశుద్ధమై సర్వలోకప్రసిద్ధమై ఏపదార్థముతోను సంబంధము లేనిదై సర్వకల్పనా రహితమై ప్రకాశించు ఆబ్రహ్మస్వరూపమునుపొంది నిలచెను.

—* సత్తాసామాన్యలక్షణము. *—

అని ఈవిధముగ వశిష్ఠమహాముని సర్వమును వివరించెను. అంత శ్రీరామచంద్రుండిట్లనియె. ఆత్మజ్ఞానమనియెడు పగటికి సూర్యునివంటివా డా! నాకు గలిగిన సంశయము లనెడు గడ్డికి అగ్నిహోత్రమువంటివాడా! అజ్ఞానమనియెడి తాపమునకు చంద్రునివంటివాడా! ఓ వశిష్ఠమహాముని! సత్తాసామాన్యమనగా,ఏది? అని అడిగినవశిష్ఠమహాముని ఇట్లనియె. ఓరఘు రామా! రామచంద్రా! వినుము. "ఈప్రపంచము ఎప్పటికిని లేదు" అని సర్వకాలములయందును ఏకరూపముగ ధ్యానించుచుండుటవలన మనస్సు నశించిపోవును. దృశ్యాభిముఖమగు వృత్తియే మనస్సు, కావున దృశ్యనా శము కాగానే అదియుండదు. (మనస్సు ఉండదు) అప్పుడు దృశ్యసంబం ధశూన్యమగు చైతన్యము ఒకటిమాత్రమే మిగిలి యుండును. ఈవిధముగ దృశ్యసంబంధ రహితమగు చైతన్యమునకు ఒకట్టిదానికిమాత్రమే అప్పుడు సత్త (ఉనికి) కలదు. కావున అదియే సత్తాసామాన్య మనబడును. భ్రాం తివలన భేదము ఉన్నప్పుడుమాత్రమేకదా. అనేక సత్తలు (" ఆకాశము

న్న దీ, వాయువు ఉన్నది " అను మొదలగు ఉనుకులు ) కానవచ్చుట. అట్లు కానవచ్చినప్పుడే కదా " ఈసత్తకంటె ఆసత్త భిన్నమైనది, ఆకాశసత్త కంటె వాయుసత్త వేఱు " అను మొదలగు వ్యవహారములు ప్రవర్తించుట. కావున శుద్ధచైతన్యముయొక్క స్వస్వరూపస్థితియే సత్తాసామాన్యము. మఱియు నిశ్చయముగ దృఢముగ దృశ్య సంబంధమునెల్ల వదలి మనస్సు స్వస్వరూపభూతుడగు పరమాత్మునియందు లీనమై నిర్మలమై శూన్యరూపము గలదానివలె, " ఇది ఇట్టిది అని చెప్పుటకు అలవికానిదై ఎప్పుడు నిలచి యుండునో, అప్పుడు సత్తాసామాన్యము కలుగును. మఱియును ఎప్పుడు మనస్సు లోపల వెలుపల ఉన్న ఈసర్వ ప్రపంచమును అణచి నిర్వికారమై నిలచునో అప్పుడే సత్తాసామాన్యము కలుగును. తాబేలు తనఅవయవములను తానే ముడుచుకొనునట్లు ఈచిత్తముకూడా తన రూపభేదములేమైనను ఈసర్వప్రపంచమును తనంతన ఉపసంహరించుకొని మఱల గల్పింపక ఎప్పుడు స్వస్వరూపముతో నిలచునో, అప్పుడే సత్తాసామాన్యము కలుగును.

ఓ శ్రీరామా! ఇదియే సర్వోత్తమమగు దృష్టి. దీనికే తుర్యాతీతమని పేరు. (జాగ్రత, స్వప్నము, సుషుప్తి, తురీయము, తుర్యాతీతము, అను అయిదవస్థలు లోకమునందు ప్రసిద్ధములై యున్నవి. ఇందు జాగ్రత్స్వప్నావస్థలయందు ప్రపంచము తోచును. సుషుప్త్యవస్థయందు అదికారణమున లయమగును. తురీయమునందు ఆకారణముగూడ గానరాదు. ఇదియే నిర్వికల్ప సమాధి. దీనికి ఆవలి అవస్థ తుర్యాతీతము. అదియే సత్తాసామాన్యమని ఈశ్లోకమునందు వివరింపబడినది. ఈతుర్య తుర్యాతీత అవస్థలు కూడ సుషుప్త్యవస్థతోపాటు ప్రతివానికిని ప్రతిదినమును కలుగుచునే ఉండును. అయినను జ్ఞానము లేదు. కావున అవి నిష్ఫలము లగుచున్నవి.) ఈదృష్టి జీవన్ముక్తులకును విదేహముక్తులకునుగూడ సంభవింపవచ్చును. అవశ్యముగ సంభవించును. ఇట్టి స్థితికి రాకుండిన సంపూర్ణ సిద్ధి లేదనుట స్పష్టమేకదా? ఇట్టి ఈస్థితి మహాప్రయత్నవంతుడై సమాధిస్థితుడై ఉన్న వానికే మాత్రమే కలుగును. తెలియవచ్చును. అజ్ఞానవంతులకు ఇది కలుగదు. తెలియరాదు ( సుషుప్త్యనంతరమునందు కలిగినను చిత్తక్షయము కాకపోవుటచేత కలిగినట్లు కానేరదనుట. ) " ఈదృశ్యము నాకంటె భిన్నము కాదు " అను జ్ఞానము ఉండినసేగాని ఈస్థితికి ప్రయోజనము లేదు కదా? " ఇది నిధి " అను జ్ఞానము లేనివారు ఆనిధిపై గూర్చుండినను, శయ

నించినను, నడచినను, తుదకు గ్రక్కొనినను కూడ ప్రయోజనము లేదు కదా? ఓ శ్రీరామచంద్రా! నారదాది మహామునులును, మా బోటివారును, అభేద దృష్టికలవారమై ఇప్పుడు వర్ణించిన దృష్టినే అవలంబించి ఉన్నారము. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, మొదలగు అందఱును సర్వ భయాపహారిణి అగు ఈదృష్టినే అవలంబించి ఉన్నారు.

—* ఉద్దాలకుడు విదేహముక్తి నొందుట. *—

ఓ సత్యపరాక్రమా ! శ్రీరామా ! ఆ ఉద్దాలకుని వృత్తాంతమును వినుము. ఆతడు పైన వర్ణించిన విధముగ సంపూర్ణ విజ్ఞానవంతుడై తన ఇచ్ఛ యున్నంతకాలము ప్రపంచ గృహమునందు నివసించి ఒకనాడు "ఇక మనకు దేహముతో ఏమిపని ? దీనిని వదలి విదేహముక్తిని పొందుదును గాక" అని నిశ్చయ సంకల్పమును చేసెను. వెంటనే ఒక పర్వత గుహను ప్రవేశించి చిగురాకులచేత ఆసనమును ఏర్పఱచుకొని దానిపై సిద్ధాసనాసీనుడై కన్నులు సగము మూసి కూర్చుండెను. మడమలచేత గుద రంధ్రమును నిరోధించుటచేత ఇతర రంధ్రములనెల్ల నిరోధించెను. ఒకకుండకు ఎన్నిరంధ్రములు ఉన్నను దానినోటిని బాగుగ మూసినచో ఇతర రంధ్రములనుండి గాలిగాని, ఇతర పదార్థములుగాని, వెలుపలికి బోవు కదా? మఱియు సర్వేంద్రియములను మనోబలముచేత వానిని వానికార్యములనుండి మఱల్చెను. పరిశుద్ధుడగు ఆత్మను నిశ్చలముగ ధ్యానించెను. ప్రాణవాయువులను నిరోధించెను. మెడను చక్కగ నిక్కించెను. ఖేచరీ ముద్రావిధానమునందు నాలుకను అంగిటిలో జేర్చెను. తనమనస్సును వెలుపలగాని, లోపలగాని, క్రిందగాని, మీదగాని, శూన్యరూపమునందుగాని, స్థిరముచేయక అనిర్వాచ్యమగు ( "ఇది ఇట్టిది" అని నిర్ణయించుటకు వీలులేని ) ఒకానొక పదార్థమునందు ( స్వస్వరూపమునందు ) స్థిరముచేసెను. దృష్టినికూడ అచ్చటనే నిలిపెను. పండ్లతో పండ్లను తాకకుండెను. అప్పుడు ప్రాణనిరోధముచేత వానిదేహము చక్కనైయుండెను. ముఖకాంతి స్వచ్ఛమై యుండెను. "దృశ్యసంబంధము లేని శుద్ధచైతన్యమే నేను" అను పూర్ణానుభవము కలుగుటవలన అత్యానందాతిశయముచేత అతనిదేహము గగుర్పొడిచెను. ఇట్లు సమాధినిష్ఠుడై నిలచి ఆ ఉద్దాలకుడు అభ్యాస బలముచేత కేవల చైతన్య మాత్రత్వమును స్వీకరించెను. ఇట్లు స్వీకరించుటవలన అతనికి పరమానందముకలిగెను. దానిని అనుభవించుటచేత మనస్సు నశించి నిర్వికార చైతన్యము శేషించెను. సర్వ

ప్రపంచమునకు ఆధారమును, సర్వవ్యాపకమును, సర్వకాలమును ఏకరూపముగ నుండునదియు, నగు ఆశుద్ధచైతన్యమే సత్తాసామాన్యము. కావున దానితో (ఆచిత్సామాన్యముతో) దానిని (సత్తాసామాన్యమును) కూడ అమ్ముని ప్రాప్తించెను. "శుద్ధచైతన్యమే ఆత్మ అను నిశ్చయముతో అభ్యసించుటచేత చైతన్యరూపము మొట్టమొదటనే కలిగియుండెనుగదా? ఇట్టివాడగుటచేత అమ్మహాత్మునకు కలిగిన శాంతికి మితియే లేదు. సర్వసమత్వమునకు అంతమే లేదు. మఱియు దుఃఖరూపమగు వస్తువు నశించుటచేత కలిగిన పరమానందమువలన సహజ సుందరమగు ఆ ఉద్దాలకముని ముఖకాంతి వేయు మడుంగులు అధికముగ ప్రకాశించెను. మనస్సు నశించుటచేత మనోవికారములును నశించెను. కావునను, అప్పటి ఆనందము స్వస్వరూపమాత్రమే అగుటచేతను, శరీరమునందలి గగురుపాట్లు అణగెను. మొట్టమొదట "నేను దుఃఖరూపమగు దృశ్యపదార్థమును విడచుచున్నాను. ఆనందమయమగు ఆత్మను భావించుచున్నాను. లేక, పొందుచున్నాను" అనుతలంపులు ఉన్నంతవరకును అల్పముగ మనోవికారములు కలవు. కావున శరీరమునందు ఆగగుర్పాటు పుట్టెను కాని, ఇప్పుడు అట్టిది ఏమియు లేకుండుటచేత ఆగగుర్పాటు అణగెను. ఇట్లు నిత్యపరిశుద్ధమగు మోక్ష రూప స్థానమును జెంది నిశ్చలచిత్తుడై సర్వసంకల్ప రహితుడై అమ్మహానుభావుడు చిత్తరువునందు వ్రాయబడిన ప్రతిమవలె నిలచెను.

ఓరామచంద్రా! ఇట్లు నిశ్చల సమాధినిష్ఠుడై శరత్కాలము ముగిసినపిమ్మట సూర్యకిరణములవలన పైరునందలి ద్రవము క్రమక్రమముగనే నశించిపోవునట్లు, (పైరులు శరత్కాలమునందు ఫలించును. పిమ్మట కొనలు ఎండిపోవును. ఈవిధముగనే అనుట) అమ్మహాత్ముడును క్రమక్రమముగ జన్మ మరణ ప్రవాహరూపమగు సంసారమును అతిక్రమించి అతి పరిశుద్ధమగు స్వస్వరూపమునందు కొన్నిదినములకు మెల్లమెల్లన శాంతినొందెను. (దేహమును విడిచెననుట.) ఇట్లు ఆమహానుభావుడు సర్వసంకల్ప శూన్యుడై, ఏవికారములును లేకుండుటచేత మిక్కిలి మనోహరుడై, సర్వవిధములగు మాలిన్యములయొక్క విజృంభణములును, ఉపాధులును, (మాలిన్యములే ఉపాధులనుట) లేని పరిశుద్ధ రూపము గలవాడై, ఆనందము లేనట్టియు ("అనుభవించువాడు అనుభవము అనుభవింపబడు ఆనందము" అను భేదములు పరబ్రహ్మమునందు లేవనియు, దానికి ఆనందము స్వరూపమే అనియు తెలిసికొనవలయును) అనాదిసిద్ధమైనట్టియు,

సర్వోత్తమమగు ఆత్మానందమును జెందెను. సర్వమును పరిత్యజించెను. విచారించిన అయ్యానందమునందు ఇంద్రునిసంపదయు, సముద్రమున గరిక పోగువంటిదే కదా ?

శ్లో॥ అపరిమితనభోంతర్వ్యాపి దిగ్వ్యాపిపూర్ణం
భువనభరణశీలం భూరిభవ్యోపసేవ్యమ్ ।
కథనగుణమతీతం సత్యమానందమాద్యం
సుఖమమృతమనంతం బ్రహ్మణోసౌబభూవ ॥

ఆవిప్రుడు, ఆబ్రహ్మజ్ఞాని, చిదాకాశమున దిక్కులయందును వ్యాపించినదియు, తనకంటె భిన్నమగు పదార్థములేక సర్వమును దానేయైనదియు (ఇచ్చట "దిక్కులయందు బ్రహ్మము వ్యాపించియున్నది" అనిన "దిక్కులువేరు బ్రహ్మమువేరు వానియందు ఇది వ్యాపించియున్నది" అని భేదమును ఉద్దేశింపబడినట్లగును. ఈదోషమును తొలగించుటకై పూర్ణపదము మూలమునందు ప్రయోగింపబడి ఉన్నది.) లోపలను వెలుపలను నిండియున్నదియు, మహాత్ములకు సేవింపదగినదియు, ఆవాఙ్మానస గోచరమైనదియు, నిర్గుణమైనదియు, ఆనందరూపమైనదియు, అనాదియైనదియు, దుఃఖస్పర్శ లేనిదియు, మోక్షరూపమైనదియు, సర్వకాల సర్వదేశములందు ఏకరూపముతో నుండునదియు, నగు బ్రహ్మమే ఆయెను.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉపశమ ప్రకరణమున ఉద్దాలకమహాముని ఉపాఖ్యానమను
ఇరువది నాలుగవ సర్గము ముగిసెను.

—*—

శ్రీవాల్మీకిమహర్షి భరద్వాజునిజూచి ఇట్లనియె. ఓభరద్వాజా ! ఈప్రకారముగ యోగాభ్యాసమువలన చిత్తశుద్ధి కలుగునని చెప్పి ఈక్రింద మఱియొకవిధముగ చిత్తశాంతి ప్రకారమునే వర్ణించువాడై అదియే పరమావధి అని నిరూపించువాడై వశిష్ఠమహాముని శ్రీరామచంద్రునిజూచి ఇట్లనియె. ఓకమలలోచనా ! శ్రీరామా ! నీవును స్వయముగనే ఆత్మవిచారము గావించుకొని పైనవర్ణించిన విధముగ అభిమాన శూన్యుడవై సంచరింపుచు సర్వోత్తమమగు ఆత్మరూపమునందు విశ్రాంతి నొందుము. దృశ్యములంతయు లేదను విషయము బాగుగ అభ్యసింప బడుటవలన మోక్షరూపస్థానము దొరుకును. అట్లు దొరుకునంతవరకు వేదాంతశాస్త్ర

సహాయమును అనుసరించియు, గురువులను ఆశ్రయించియు, యోగాభ్యాసము కర్మ మొదలగువానిచేత చిత్తమును శోధించియు, పలుమారు ఆత్మ విచారము చేయుచునే యుండవలయును. వైరాగ్యము, యోగాభ్యాసము, వేదాంతశాస్త్ర విచారము, సూక్ష్మబుద్ధి, గురుశుశ్రూష, యమ నియమములు, వీనిచేత అవశ్యముగ ముక్తిదొరుకును. ఇవి అన్నియు గాకున్నను, కేవలము సూక్ష్మమగు బుద్ధి ఒకటియే ఆయుత్తమస్థితిని కలిగింపజాలును. జ్ఞానవంతమై చురుకుగలదియై పరిశుద్ధమై ఉన్న బుద్ధి వైరాగ్యాదులగు ఇతర సామగ్రులు లేకపోయినను ముక్తి జెందగలదు.

—* సమాధి స్వరూప వివేచనము. *—

అని చెప్పిన శ్రీరామచంద్రుండిట్లనియె. ఓభగవంతుడా ! భూత భవిష్య ద్వర్తమానములను ఎఱిగిన ఓవశిష్ఠమహాముని ! ఈసంశయమును నివారింపుము. బ్రహ్మజ్ఞానవంతుడై ఒక పురుషుడు సమాధి నిష్ఠనుండి మేలుకాంచి చిత్తసంక్షోభము ఏమియు జెందకయే సర్వవ్యవహారములను ఆచరించుచుండును. మఱియొక బ్రహ్మజ్ఞాని అట్లుగాక సర్వకాలములయందును నిర్వికల్ప సమాధి నిష్ఠుడయ్యే యుండును. ఈ ఇరువురిలో శ్రేష్ఠుడెవ్వడు? అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లని ఉత్తరముచెప్ప నారంభించెను. ఓరఘురామా! వినుము. సత్త్వాది గుణమయమై పంచభూత వికారరూపమైయున్న ఈ సర్వ ప్రపంచమును ఆత్మాభిన్నముగ చూచువానికి లోపల ( మనస్సునందు ) సంక్షోభములన్నియు ( కామ క్రోధాది రూపములగు కలతలన్నియు ) నశించి చల్లదనము ( శాంతి ) కలుగును. ఈశాంతికే సమాధియనిపేరు. ఇంతయేకాని సమాధియందు ఉండవలయుననిన ఎచ్చటనో కూర్చుండ నక్కఱలేదు. ఇట్లగుటచేత వ్యవహారమును ఆచరించినను ధ్యానమునుమాత్రమే ఆచరించుచుండినను బ్రహ్మజ్ఞాని " దృశ్యములతో నాకు సంబంధము లేదు " అనియే నిశ్చయించుకొని ఉండును. సర్వసంక్షోభములను వదలి శాంతుడయ్యే ఉండునుకదా ? ఇట్టి స్థితి ఉండినచో పైన చెప్పిన రెండు తెఱగుల వారును సమానులే. ఆనందమయులే. ఓరామచంద్రా! ఆస్థితియేకదా సర్వతపస్సులకును ప్రధానఫలము. కావున సర్వకాలములయందును ఒకానొకడు సమాధియంచే నిలచియుండినను వానిమనస్సు సంపూర్ణముగ శాంతినొందక సంకల్ప పరంపరచేత చలించుచుండునేని మఱి మఱల బలాత్కారముగ నిగ్రహింప బడుచునుండునేని అప్పుడు కేవలసమాధిస్థితి మాత్రమువలన వానికి గలుగు ఆధిక్యము ఏమియును లేదు.

వానిసమాధి పిచ్చివాని గంతులవంటిది. ఇట్లుకాక సర్వకాలములయందును ఒకానొకడు సర్వ వ్యవహారములను చేయుచు ఇచ్ఛవచ్చినట్లు గంతులు వైచుచున్నను వాని మనస్సుమాత్రము సంక్షోభశూన్యమై శాంతినొంది యుండునేని వానికి కేవలము గంతులవలన మాత్రమే వచ్చిన న్యూనత్వ మునులేదు. వాని గంతులు మహాజ్ఞానవంతుని సమాధితో సమానములు. ఇట్లగుటచేత నిస్సంశయమగు జ్ఞానమును చెందినవాడు సంసారముననుండె సర్వ వ్యవహారములను ఆచరించుచున్నను అట్లుగాక సర్వమును వదలి వన మునందున్నను ఒకటేయే “బ్రహ్మజ్ఞానియైనను వ్యవహారములను చేయు చునే యున్నాఁడు కదా ? అప్పుడు మనస్సునకు చాంచల్యము ఎట్లు లేకుం డును? చాంచల్యముగల మనస్సు శాంతము ఎట్లగును ” అని తలంచెదవే మో, వినుము. మన మనస్సు ఏదైన ఒకవిషయమును తదేకవృత్తితో ధ్యానించుచుండునేని ప్రక్కన నున్నవారలు చెప్పుమాటలు చెవులకు విన వచ్చుచునే యున్నను అందలి అభిప్రాయము మాత్రము గోచరము కాద నుట అనుభవ సిద్ధము. ఆస్థితియందు మనస్సు వినుచుండియు విననిదియే అయ్యెను గదా? దీనికి గారణమేమి ? ప్రక్కవారి సంభాషణలను గూర్చిన సంకల్పము లేకుండుటయే కదా ? ఇట్లే సర్వప్రపంచవాసనలును క్షీణించు నేని అప్పుడు మనస్సు ఏవ్యవహారములను చేసినను చేయనిదియే యగును. మఱియును అట్టి సంకల్పములు ఉండునేని వ్యవహారములను చేయకున్నను చేసినదియే అగును. ఈస్థూలశరీరము శయనముమీదనే కదలక పడియుండి నను, స్వప్నమునందు సంచరించును గదా ? ఇట్లగుటచే పురుషుడు వ్యవ హారించినను, వ్యవహరింపకున్నను, వాని మనస్సుమాత్రము కర్తగా కుండ నుండవలయును. అదియే ప్రధానము. అదియే ఏకరూపస్థితి. అదియే పరమ విశ్రాంతి. ఓ శ్రీరామచంద్రా ! ఈవిషయమును బాగుగా ఎఱుంగు ము. మఱియును ఎట్లుచూచినను “ వీడు ధ్యానించు చున్నాడు. వీడు ధ్యా నించుట లేదు ” అను తలంపులకు మనస్సేకదా ముఖ్యకారణము ? బ్రహ్మ జ్ఞాని అది యుండరాదని ఇదివరకే నిరూపించి యున్నాను. కావున నీకు దానినిగూర్చిన సంశయము ఏల ? దానిని సంపూర్ణముగ విడిచి పెట్టుము. సర్వసంకల్ప శూన్యమగు మనస్సే స్థిరచిత్తమని చెప్పబడును. ఆస్థిరచిత్తమే ఏకస్వరూపస్థితి. అదియే పరము విశ్రాంతి. ఇందు సమాధి వ్యవహారము లను భేదమే మొట్టమొదట లేదు. సంసారములు క్రమక్రమముగ క్షీణింప నారంభించెనేని అప్పుడు ఆమనస్సు మోక్షమునకు ప్రయత్నించుచున్నదని

చెప్పబడును. సంపూర్ణముగ ఆవాసనలు నశించెనేని అప్పుడు మనస్సే పరమపదము నొందెనని చెప్పబడును. అట్టిమనస్సు సర్వకార్యములను చేయుచున్నను చేయనిదియే అగును. కావున వాసనాక్షయము ఒకటియే ప్రధానము కాని, సమాధి వ్యవహారములవలన కలుగువిశేషము లేదు. ఇట్లు గాక, ఈమనస్సు సంసార పూర్ణమై యుండునేని అప్పుడు ఏమియును ఆచరింపకున్నను, సర్వమును ఆచరించునదియే అగును. దానివలన సర్వానర్థములు కలుగును. అట్టి మనస్సు కలవాడు సమాధియందున్నను, ప్రయోజనము లేదు. కావున ముముక్షువు వాసనాక్షయమునకై ప్రయత్నింపవలయును. ఓరామచంద్రా! నీవును మనస్సుతో సర్వమును పరిత్యజించి " నేను, నాది, " అను మొదలగు తలంపులను సంపూర్ణముగ వదలి నిష్కల్మషుడవై పిమ్మట నీకు ఇష్టమైనట్లు ఉండుము. పర్వతగుహాయందు ఏకాంతమునందు ఉండిన నొకటియే, ఇంటియందు సింహాసనాసీనుడవై రాజ్యభారము వహించుచు ఉండిన నొకటియే. చక్కని చిత్తసమాధానము గలిగి అహంకారదోషము నివర్తించియున్న గృహస్థునకు, గృహములే నిర్జనారణ్య ప్రదేశములు (చిత్తశాంతి కలిగిన, గృహముకూడ వానికి బ్రహ్మనిష్ఠా విఘాతకము కానేరదనుట. )

శ్లో॥ యథావిపణిగాలోకా విహరంతోఽప్యసత్సమాః ।
అసంబంధాత్తథా జ్ఞస్య గ్రామోఽపి విపినోపమః ॥

ఓ శ్రీరామా ! అంగడివీధులయందు ఎందరు సంచరించుచున్నను, ఎవరిపనివారు చూచుకొనుచు బోవుచుండుటచేత ఇతరులకు లేనివారే అగుదురో, అట్లే జ్ఞానులకుగూడ ఇతరులతో సంబంధము లేకపోవుటచేత గ్రామముకూడ వారికి (జ్ఞానులకు) నిర్జనారణ్య ప్రదేశమే. మనస్సు అంతర్ముఖమైయుండునేని ఆపురుషుడు నిదురించుచున్నను, మేలుకొనియున్నను, నడచుచున్నను, తిరుగుచున్నను, ఏకార్యములను ఆచరింపనివాడే. పట్టణముగాని, గ్రామముగాని వానికి నిర్జనారణ్యముగనే గానవచ్చుచుండును. వానిమనస్సుకు సర్వమును ఆకాశరూపమే ( అనగా, నిరాలంబ బ్రహ్మరూపమే ) అగును. సర్వకాలములయందు ( అనగా, సమాధియందున్నను, వ్యవహరించుచున్నను ) అట్లే యగును.

శ్లో॥ అంతశ్శీతలతాయాంతు లబ్ధాయాం శీతలం జగత్ ।
అంతస్తృష్ణోపతప్తానాం దావదాహమయం జగత్ ॥

ఓశ్రీరామా ! చిత్తమునందు శాంతిరూపమగు చల్లదనము కలిగె

నేని ఈ ప్రపంచమంతయును చల్లనిదే అగును. ఆశయనెడి దవానలము ప్రజ్వరిల్లునేని ప్రపంచమంతయును దావాగ్నిమయమే అగును. ఇంతమాత్రమే కాదు? ఏజంతువునకుగాని లోపల ఎంతయో వెలుపలనంతయే. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, దిక్కులు, నదులు, పర్వతములు, మొదలగునవి అన్నియు మనస్సుయొక్క భాగములే. వీని సంబంధములగు సంస్కారములు మనస్సునందుండుటచేత అవియే వెలుపల ఇట్లు గానవచ్చుచున్నవి. ఏమహాత్ముడు లోపల ఆత్మమాత్ర నిష్ఠుడై వెలుపలికి రాగద్వేషశూన్యములగు ఇంద్రియములతో కర్మలను ఆచరించుచు నుండియు, హర్షశోకములకు చిక్కడో అట్టివాడు, సమాధానము గలవాడని (సమాధినిష్ఠుడని) చెప్పబడును. లోకదృష్టికి అతడు వ్యవహార నిష్ఠుడే కదా ? కావున చిత్తశాంతి కలిగినపిమ్మట సమాధి వ్యవహారములకు భేదమే లేదు. ఏమహాత్ముడు సర్వభూతములను తనతో సమానులుగాను, పరుల సొత్తులను మంటి పెళ్ళలుగాను, స్వభావముగనే చూచునో ( అనగా, ఇట్లు చూచుట ఎవ్వనికి స్వాభావికమై ఉండునో ) అట్టివాని దృష్టియే సంపూర్ణదృష్టి. భయము మొదలగు ఇతరకారణములచేత ఇట్టిదృష్టి కలిగినను ప్రయోజనము లేదు. " సర్వ ప్రపంచమునందును ఉన్న ఆత్మ ఒక్కడే " అను జ్ఞానము దృఢమై దానిమూలమున, " సర్వభూతములకును నాకును భేదము లేదు " అను జ్ఞానము కుదుర వలయును. " పరుడును నావంటివాడే కావున, లేక, నేనే కావున, వాని ధనమును అపహరించుటయు, నాధనము పోయినట్లే అగును. కావున నది ( పరధనాపహారము ) యుక్తమైన కార్యము కాదు " అను జ్ఞానము కలుగవలయును. ఇట్లు కలిగిన జ్ఞానములు స్థిరములై ప్రయోజనకరములై యుండును గాని, ఇతరములు అట్లు కానేరవు. ఇట్టి దృఢవిజ్ఞానము గలవాడు " బురదయందున్న బంగారమువలె " సంసారమునందున్నను సర్వకార్యములను ఆచరించినను ఇంచుకయైనను మాలిన్యము నొందడు. మరణము ఈక్షణముననే వచ్చినను ప్రళయకాలమువరకు రాకుండినను శోక హర్షముల నొందడు.

శ్లో॥ సర్వంప్రశాంత మజమేక మనాదిమధ్య
మాభాస్వరం స్వదసమాత్రమచేత్యచిహ్నమ్ ।
సర్వంప్రశాంతమితిశబ్దమయీతుదృష్టి
ర్బోధార్థమేవహిముధైవతదోమితీదమ్ ॥

ఓరఘునందనా! శ్రీరామా! వాస్తవస్థితిలో భేదరూపముగ నున్నట్లు

తోచుదు " వ్యవహారముటలన చిత్తచాంచల్యము కలుగునుగదా ? దాని చేత ఆత్మనిష్ఠకు లోపము వచ్చునుగదా ? " అను సంశయమును కలిగించుచునున్న ఈప్రపంచమంతయు శాంతిస్వరూపమే. ఉత్పత్తి శూన్యమే. ఏక స్వరూపమే. ఆద్యంతములు లేనిదే. స్వప్రకాశ స్వరూపమే. అనుభవరూపమే. ఆనందరూపమే. దృశ్యసంబంధరహితమే. ( బ్రహ్మమే అనుట ) మఱియు కొంత సూక్ష్మముగ పోయిన " ఈప్రపంచమంతయును బ్రహ్మమయమే " అని చెప్పువా డెవ్వడు ? ఏకరూపమగు బ్రహ్మమునందు చెప్పువాడు, చెప్పబడునది, చెప్పుట, అనుభేదములే యుండుటకు వీలులేదుకదా? కావున ఇట్లు చెప్పుట బోధించుటకై మాత్రమే ఉపయోగించును కాని, మఱియేమియు కాదు. పరమార్థస్థితినిజూచిన మౌనమే మహోపదేశము.

—* సురఘూపాఖ్యానము. *—

ఓ సత్యపరాక్రమా! శ్రీరామా ! ఈవిషయమునందు కిరాతదేశపు రాజగు సురఘునియొక్క వృత్తాంతమును మహాత్ములు ఉదాహరణముగ జెప్పుదురు. అది మిక్కిలి ఆశ్చర్యకరమైనది. దానిని వివరించెదను వినుము. హిమవత్పర్వతమునందు కైలాసమను నొక్క శిఖరముగలదు. దానిక్రింద హేమజటములను పేరుగల కిరాతదేశములు కలవు. ఆదేశములను మహాపరాక్రమశాలియగు సురఘుడను రాజు పరిపాలించుచుండును. అతడు రాక్షసులనుగూడ ఎదిరించి ఇంద్రునకు సహాయము చేయుచుండెడివాడు. ఆతడు దుష్టులను నిగ్రహించుచు శిష్టులను అనుగ్రహించుచు రాజ్యకార్యములను నిర్వహించుచుండెను. ఆతని మనస్సుమాత్రము ఆవ్యవహారములచేత హర్షశోకముల నొందుచు పీడింపబడుచుండెను. కావున ఒకదినమునందు అతడు ఇట్లని తనలో విచారించుకొనియె. " నువ్వులను గానుగ పీడించునట్లు " నేను ఈజనులను ఏల బాధింపవలయును. వీరికి గలుగు బాధయంతయు నాకే గలిగినట్లున్నది. ఇట్లు తలంచుట పొరబాటు. నేను శిక్షింపవలసినవారిని శిక్షించుచున్నాను. ఇందు నాతప్పేమి కలదు. వారిదోషమును వారనుభవించిరి. వారిదుఃఖము నాకేల రావలయును. ఇట్లు శిక్షింపకుండిన " నీరులేని నదులవలె " రాజ్యమునకు నిలుకడయే ఉండదు కదా ? జనులందరు స్వేచ్ఛాచారులై చెడిపోవుదురుకదా? ఓరామచంద్రా ! ఈవిధముగ తలంచుచుండగ ఆతని చిత్తమునకు శాంతి ఎన్నటికిని కలుగలేదు. ఇట్లుండగ ఒకానొకనాడు మాండవ్యమహాముని అతని గృహమునకు వచ్చెను. ఆసురఘుడును అమ్మహాత్ముని పూజించి ఇట్లు ప్రశ్నించెను. ఓమహా

త్మా! మీ రాకవలన నాకు శుభము కలిగినది. శాంతి దొరికినది. నేటినుండియు నేను పుణ్యవంతులలో అగ్రేసరుడను అయ్యెదను.

ఓ భగవంతుడా! మహాత్మా! మీకు తెలియని ధర్మములు లేవు. ఆత్మవిశ్రాంతి సుఖముకూడ మీకు కరతలామలకముగదా. కావున నాకు గల ఈసందేహమును తీర్పుడు. "సూర్యుడు చీకటిని తొలగించునట్లు" తొలగింపుడు. మహాత్ముల సమాగమమువలన కడతేరనివాడు ఎవ్వడుండును? ఎవనియొక్క బాధలు సత్పురుషుల సమాగమముచేత నశింపవు? "నీకుకల బాధయేది" అని అందురేమో, చెప్పెదను వినుడు. మీబోంట్ల వారందరును సందేహమే మహాబాధ అని చెప్పుదురుకదా. ఇప్పుడు నాకుగల సంశయము ఏది అనిన:—నేను కొందఱిని నిగ్రహించు చున్నాను. మఱికొందఱిని అనుగ్రహించు చున్నాను. దానివలన నాప్రజలకు సుఖదుఃఖములు కలుగుచున్నవి. అవి "సింహము ఏనుగును బాధించినట్లు" నన్ను బాధించుచున్నవి. కావున నీబాధ తొలగి సూర్య కిరణమునకు వలె నాకు సర్వసమత్వము ఎట్లు కలుగును. ఓమహాత్మా! మీకంటె నాకు పూజ్యుడు లేడు. ఈసంశయమును దీర్చి నాయందు కరుణింపుడు. అనిన మాండవ్యమహాముని ఇట్లనియె. ఓమహారాజా! నీవనిన దీనత్వమగుమాట కేవలము మనోదౌర్బల్యము వలన వచ్చినదే. ఆదౌర్బల్యమును పోగొట్టుకొనుటకు ఇతరసహాయము ఏమియు నక్కఱలేదు. దానికి సాధనము నీలోనే ఉన్నది. కావున పూనికతో కొంత ప్రయత్నించిన చాలును. ఇష్టసిద్ధి కలుగును. ఈమనోదౌర్బల్యమంతయు "పొగమంచువలె" తనంతదానే అణగి పోవును. ఆసాధనము క్రొత్తదికాదు. అది ఆత్మవిచారమే. "నేనెవ్వడను. ఈప్రపంచమేది. ఉత్పత్తి వినాశములు ఎట్లు కలుగును." అని ఈవిధముగ నీమనస్సునందు నీవే విచారించుకొనుము. అప్పుడు సంపూర్ణమగు మాహాత్మ్యము కలుగును. ఆవిచారముచేత నీకు స్వస్వరూపము తెలియవచ్చెనేని అప్పుడు నీమనస్సు తనస్వరూపమును వదలి తత్క్షణమే పరమశాంతిని పొందును. బ్రహ్మమును చెందును. ఆమనస్సునకు బ్రహ్మమే స్వస్వరూపము. ఓ అకల్మషుడా! అప్పుడు వ్యవహారములకు లోపము వచ్చునని తలంపకుము. స్వస్వరూపస్థితిని జెందిన మనస్సు సర్వకార్యములను చేసినను, చేయనిదియే యగుటచేత ఉండియు, లేనిదే, అగుచున్నది. ఓరాజోత్తమా! మనస్సు మిక్కిలి దీనమైనది. స్వస్వరూపస్థితి లేకున్న అది "ఆవు త్రొక్కుటచేత కలిగినగుంటయందు నిలచిననీటిలో గూడ మునిగిపోవు దోమవలె" అత్యల్ప

సందర్భములయందుకూడ చిక్కుపడుచుండును. కావున ఈసర్వప్రపంచమును విడువవలయును. పరమాత్మను విచారించి ఎఱుగవలయును. అప్పుడుకాని, మనస్థైర్యము కలుగదు. ఓవీరుడా! మహారాజా! ఈప్రపంచమును విడుచుట ఎట్లు సంభవించును ? ” అని సంశయింతువేమో, నీకు ఆవిషయమునందు ప్రయత్నము అక్కఱలేదు. నీవు చేయవలసినది ఆత్మవిచారమే. ఆత్మరూపము ఏకముగుటచేత అది ప్రకాశించుకొలది ఈప్రపంచము తనంతనే అణగిపోవును. “ ఆత్మ ఏకరూపుడు ” అని నిశ్చయించినవానికి దానికంటె భిన్నమగు ఈప్రపంచము ఎట్లు కానవచ్చును ? ఈప్రపంచమంతయును విడువబడిననే కాని, ఆత్మరూపము ప్రకాశింపదు. భేదము ఉన్నంతవరకు ఏకరూపము స్పష్టముగుట సంభవింపదనుట విస్పష్టమేకదా? మఱియు సర్వపదార్థములను నిషేధింపగా అంతమునందు మిగులువాడే ఆత్మ అని సర్వవేదాంత సిద్ధాంతము. ఓసత్పురుషుడా! లోకమునందు సామాన్యమగు ఒక పదార్థమును సంపాదింపవలయునన్నను తక్కినవానినెల్ల విడిచియే తీరవలయును కదా ? ఇట్లుండగ సర్వోత్తమమగు మోక్షప్రాప్తికై అన్యపదార్థములను విడువవలయుననుటలో ఆశ్చర్యమేమి ? ఈకారణమువలన ఆత్మస్వరూపము స్పష్టమగుటకునై సర్వమును అవశ్యముగ పరిత్యజింప వలయును. పరమాత్మరూపము మిగులునంతవరకు ఆత్మభావనచేత భావింపబడిన సర్వపదార్థములును సంకల్ప పూర్వకముగ నిస్సంశయముగు జ్ఞానదృష్టితో విడుచుచు రావలయును. ఇట్లు ప్రపంచవిలాస రూపములగు కార్యకారణ పరంపరలను వదలి మనస్సును పరిత్యజించి శరీరమును విసర్జించి అన్నిటికిని ఆవల శేషించునట్టి శుభపదమును ( మోక్షమును ) జెందుము. నీవు శాస్త్రాది సహాయములచేత ఆత్మను ఎఱుగుటకు దృఢ ప్రయత్నము గావింతువేని నిస్సంశయముగ ప్రపంచమంతయు నశించిపోవుననుటకు సంశయములేదు. ఆత్మ ప్రత్యక్షమగు సమయమునందు భేదము ఉండదని నిరూపించితిని గదా? కావున ఓరాజోత్తమా! నీవు నేటినుండియు దృఢప్రయత్నముతో ఆత్మవిచారము కావింపుము.

—* సురఘునకు జ్ఞానము ఉదయించుట. *—

ఓ సత్యవ్రతా! శ్రీరామా ! ఈవిధముగ నమ్మాండవ్యమహామునిసురఘునకు ఉపదేశించి అతి మనోహరమగు తన ఆశ్రమమునకు బోయెను. ఇట్లు ఆముని వెడలిపోగానే ఆరాజోత్తముడును ఏకాంత స్థలమునకు పోయి “నేనెవ్వడను ” అను విషయమును గూర్చి ఈక్రిందివిధముగ తన

తనలో దాను విచారింపసాగెను. హస్తములు, పాదములు, మొదలగు అవయవములతో గూడిన ఈదేహమే నాస్వరూపమై ఉండునని తలంచెదను. ఐనను దీనిలోపలి పదార్థములను కొంత విమర్శించి చూడవలసి యున్నది. ఈపదార్థములలో నాస్వరూపము ఏదియగునో, నిశ్చయించుకొనవచ్చును. ఈదేహమునందు మాంసము, రక్తము, ఎముకలు, మొదలగు పదార్థములు కలవు. ఇవి అన్నియు అచేతనములే. నేను చేతనుడను. ఇవి నాకు స్వరూపములు ఎట్లగును? ఇవి నాస్వరూపములు కాకపోయిన వీనిసముదాయమే ఆకారముగాగల దేహము మాత్రము నాకు స్వరూపము ఎట్లగును! ఈదేహము నేను కాననుటయే నిశ్చయమగు సిద్ధాంతము. మొట్టమొదటి తలంపు పొరబాటు. ఇక హస్తపాదాది రూపములగు కర్మేంద్రియములే నేననిన అదియు సరిగా ఉండలేదు. జ్ఞానేంద్రియముల సహాయములేక ఇవి ఒక కార్యమునైనను చేయనేరవు. కావున జ్ఞానేంద్రియములే నాకు స్వరూపభూతములుగ ఉన్నవి అనవలయును. నేను సర్వస్వతంత్రుడను. ఇట్టి నాకు పరాధీనములగు కర్మేంద్రియములు స్వరూపభూతములు అగుననుట ఎట్లు సంభవించును? మఱియు జ్ఞానేంద్రియములుకూడ బాగుగ విచారించిన నాకు స్వరూపభూతములు కానట్లే ఉన్నది. ఎట్లనిన:—జ్ఞానేంద్రియములు అన్నియు వాని వాని కార్యములను ఆచరించుచు ఉండుట, లోపలనున్న మఱియొక పదార్థమునకు తెలియుచున్నదనుట, సర్వజనానుభవసిద్ధము. ఒకవేళ లోపలనున్న పదార్థము లేనిదగునేని,లేక, నశించునేని అప్పుడు ఇవియు ( జ్ఞానేంద్రియములును ) లేనివే అగును కదా ? మఱియు వీనికి పరసహాయము కావలసి ఉండుటచేత ఇవియు (జ్ఞానేంద్రియములును) కర్మేంద్రియములవలె స్వతంత్రములే. స్వయముగ జ్ఞానము ( ప్రకాశము ) లేనివగుటచేత అచేతనములే. వీని స్వరూపముకూడ శూన్యరూపముగనే తోచుచున్నది. జ్ఞానము ఉండిన ఇవి ఉండును, సుషుప్త్యవస్థయందు అజ్ఞానము లేకుండిన ఇవియు లేకుండును. ఇట్లగుటచేతనే ఈజ్ఞానేంద్రియములు నేను కాను. నేను చేతనుడను. శూన్యరూపుడను కానుకదా ? మొట్టమొదట నారూపము శూన్యమగుటకే వీలులేదు. పూర్వజన్మమునందు కొన్ని కర్మలను ఆచరించి దాని ఫలములను ఇప్పుడు అనుభవించు చున్నాను. అంతకు ముందుజన్మమున కొన్నికర్మలను చేసి తత్ఫలములను పూర్వజన్మమునందు అనుభవించి యుంటిని. ఇట్లు నేను అనాదికాలమునుండియు బహువిధకర్మలను ఆచరించుచు దానిఫలములను అనుభవించుచు ఉన్నవా

డను. కావున అనాదికాలమునుండియు నేను ఏదియో ఒకరూపముతో నుం డువాడనే అగుదునుకాని, శూన్యరూపుడను కానేరను. కావున ఎట్లుచూచి నను జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు నేనుకాను. వానికిని నాకును ఏవిధ మగు సంబంధముకూడ ఉండుటకు వీలులేదు. వానిచర్యలు నాకు తెలియువ చ్చుచు ఉండుటచేత " అవి నాచేత జూడబడుచు ఉన్నవి. నేను వానిని చూచుచు ఉన్నాను. అని మాత్రమే చెప్పవలసి యున్నది. ఇట్లైన నా కును వానికిని ( అజ్ఞానేంద్రియ కర్మేంద్రియములకును ) సంబంధము ఎట్లు కలుగును? స్తంభమును చూచునట్టి నేత్రమును నేత్రముచేత చూడబడు స్తంభమును ఒకటికానేరవు కదా ? కావున వీనిని అన్నిటిని పరిత్యజించి నాస్వరూపము ఎదియో కొంత లోతుగవిచారింప వలయును. ఈసర్వ మును నాకు తెలియుచుండుటచేతను, నేను వీనికి అభిముఖుడను కానప్పుడు సర్వమును లేనిదే అగుచుండుటచేతను, తెలివియే నాకు స్వరూపమని నిశ్చ యింప వలసి యున్నది. సర్వ ప్రపంచము జ్ఞానాధీనమే అయి యున్నది. కావున నేను ( జ్ఞానము ) స్వతంత్రుడను. ఆహా, ఇప్పుడు నాకు స్వస్వ రూపము తెలిసినది. ఎంత విచారించినను ఇంతకంటె లోపల ఏపదార్థ మును కానరాలేదు. వాయుదేవుని యందును, యమునియందును, ఇంద్రు నియందును, సర్వదేవతలయందును, మఱియు సర్వ భూతములయందును, ముత్యములయందలి దారమువలె ఈజ్ఞానమే వ్యాపించి ఉన్నది. ఇదియే ఆత్మ ( తాను ) ముత్యములు ఎన్నియైనను అందలి దారముమాత్రము ఒకటియే అయినట్లు ఈభూతములు ఎన్నియైనను జ్ఞానరూపుడగు ఆత్మ మాత్రము ఒకడే. ఈఆత్మ మిక్కిలి పరిశుద్ధుడు. బాగుగ ఆలోచించిన సర్వ వికారములును ఈప్రపంచమునందే ఉన్నవి కాని, ఆ ఆత్మునియందు లేవు. సర్వమును చూచువాడు సర్వోత్పత్తిని సర్వలయమునుకూడ చూడవ లయును. కావున అట్టివానికి ( సాక్షికి ) ఉత్పత్తిలయములు ఉండుట సం భవింపదు. కావున ఈయన అతి పరిశుద్ధుడు. చూడబడువానికి సంబంధిం చిన మార్పులు ఏమియు చూచువానికి ఉండుటకు వీలులేదు. చూచువానికి స్వయముగానైనను మార్పులు కలవనిన వానిని జూచుటకు మఱియొకసాక్షి కావలసి వచ్చును. అట్లే మఱియొకసాక్షిని అంగీకరించినచో " మొదటి సాక్షికి మార్పులు ఉండగ రెండవసాక్షికిమాత్రము ఏల ఉండకూడదు ? " అనుప్రశ్నము ఒకటి దుర్నివారమై అంకురించును. దానికి సమాధాన ముగా మూడవసాక్షిని అంగీకరించిన " వానికి మఱియొకసాక్షి కావల

యును. వానికి మఱియొకసాక్షి కావలయును" అని ఆక్షేపములు ఒకదాని వెనుక నొకటి వచ్చుచుండగ లెక్కకు మిక్కిలియగు సాక్షులను అంగీకరింపవలసి వచ్చును. ఎప్పటికిని ముగింపు కలుగుటకు వీలు లేకపోవుటచేత ఈవాదమునకు క్షయము. కావున ఎట్లుచూచినను "సాక్షియొక్కఁడే. వానికి ఎట్టివికారములును లేవు" అను విషయమే సిద్ధాంతము. ఈఆత్మకు ఇట్లు దృశ్యసంబంధము ఇంచుకయైనను లేకున్నను సర్వము భ్రాంతిచేత మాత్రమే కల్పింపబడుచున్నది. ఇదియే మహావ్యాధియై నన్ను ఇంతవరకు బాధించుచు ఉండెను. ఇప్పుడు ఈవ్యాధి తొలగి పోయినది. ఈ ఆత్మ సర్వప్రపంచమును ఏకరూపముగ వ్యాపించి ఉన్నాఁడు. ఈయనవలని భయముచేతనే సర్వప్రపంచములును స్వకార్యములను ఆచరింపుచున్నవి. ఈయన సర్వపదార్థములయందును వ్యాపించి ఉన్నాఁడు. మిక్కిలి సూక్ష్మరూపుఁడై గోచరుఁడై ఉన్నాఁడు. కలిమిలేములు లేనివాఁడై ఉన్నాఁడు. ఏపదార్థమైనను ఇంద్రియములకు విషయమైనచో అప్పుడు మాత్రమే కలదనికాని, లేదనికాని, చెప్పబడును. ఇంద్రియములకు గానవచ్చినప్పుడు కలదనియు, లేనప్పుడు లేదనియు చెప్పబడును. కలిమి లేములయొక్క వ్యవహారము ఇట్లు ఇంద్రియ విషయములగువానిని గూర్చిమాత్రమే ప్రవర్తించును. ఈ ఆత్మ అట్టివాఁడుకాఁడు. కావున ఈయనను గూర్చి అవ్యవహారములలో ఒక్కటియు సంభవింపదు. మఱియును ఈఆత్మయే బ్రహ్మమొదలు గరికెపోగువరకు గల సర్వపదార్థములయందును ఏకరూపముతో వ్యాపించి యున్నాఁడు. సర్వవిధములగు సామర్థ్యములను కలిగి ఉన్నాఁడు. ఇంతయేగాక ఈప్రపంచమునందు ఏపదార్థము కానవచ్చుచున్నదో అదియంతయు ఈ ఆత్మయొక్క చలనమాత్రమే. ఆయనయొక్క భాగమే. భ్రాంతివలన ఆయననే రూపాంతరముతో భావించుటయే కాని అచ్చట వాస్తవమగు పదార్థము ఇంచుకయైనను లేదు. ఆత్మ సత్యరూపుఁడు కావలయుననుట మొట్టమొదటనే దృఢమైనది. కావున ఆత్మకంటె భిన్నమగు పదార్థము ఒక్కటి యుండినచో అదియు సత్యముగానే ఉండి తీరవలయును. ఈప్రపంచము అట్లు లేదు. అసత్యరూపమగు పదార్థము సత్యరూపమగు పదార్థమునకు రెండవది యగుట సంభవింపదు. "జలము రెండు విధములు. శుద్ధజలము, ఎండమావులలోని జలము" అనుట ఎన్నటికైనను యుక్తియుక్తమగునా? ఎండమావులలోని జలమనునది బొత్తిగనే లేనిది. దానితో శుద్ధజలమునకు ద్వైతము (భేదము) ఎట్లు సంభవించును? కావున సత్య పదార్థముల

కును అసత్య పదార్థములతో, భేదము ఉండుటయే అసంభవము. బ్రహ్మ ప్రపంచములకు కూడ ఇట్లే ద్వైతము సంభవింపదు. బ్రహ్మము సత్యరూపము. ప్రపంచము అసత్యరూపము. కావున ఎప్పటికిని ఎందును ఆత్మ భిన్నమగు పదార్థమే లేదు. ఉన్నట్లు తోచుటయెల్ల భ్రాంతియే. కావున ఇక నాకు సంశయము లెల్లను తీరినవి. ఎట్టిభోగములును ఇక నన్ను మోసపుచ్చ నేరవు. ఇక నాకు దేనియందును ఆశయుండదు. సంసారమనగా భ్రాంతియే. కావున ఆభ్రాంతి లేని నన్ను ఇది ( సంసారము ) ఏమియు చేయనేరదు. నాకు ఇక ఏకార్యములతోను పనిలేదు. కావున ఇక నేను శాశ్వతమగు సుషుప్త్యవస్థను జెందిన వానివలె ఆత్మరూపమునందు స్థిరుడనై ఉందును. శాంతిని జెందుదును.

ఓ శ్రీరామచంద్రా! ఇట్లుదలంచి హేమజట దేశములకు ప్రభువగు ఆసురఘుమహారాజు ఉత్తమస్థితిని ఈవిధముగ జెందెను. వివేకాతిశయము చేత క్షత్రియుడగు విశ్వామిత్రుడు బ్రాహ్మణుడైనట్లు ఆరాజును విచారముచేత ముక్తుడాయెను. సర్వకాలములయందును అతని చిత్తవృత్తి సుషుప్త్యవస్థను జెందినట్లు ఉండెను. అతనికి కాఠిన్యముగాని, దయగాని, విరోధముగాని, విరోధము లేకుండుటగాని, శీతోష్ణాదులుగాని, అవి లేకుండుటగాని, మంచిబుద్ధిగాని, దుర్బుద్ధిగాని, మేలుగాని, కీడుగాని, లేకుండెను.

——* సురఘుమహారాజ పర్ణాద రాజర్షుల సంవాదము. *——

ఓరామచంద్రా! ఈసురఘుమహారాజ చరిత్రమునందు మఱియొక ప్రధానాంశము గలదు. ఒకనాడు అతనికిని పర్ణాదుడను రాజర్షికిని సంవాదము జరిగెను. ఆసంవాదము మిక్కిలి ఆశ్చర్యకరమైనది. దానిని వివరించి చెప్పెదను వినుము. పారసీకదేశమునందు పరిఘుడను ప్రభువుకలడు. అతడు తనచేతనున్న పరిఘాయుధముతో శత్రువులను మహాపరాక్రమము గలిగి ధ్వంసముచేయుచుండువాడు. అతడు ఇట్లు మహాపరాక్రమవంతుడై బహువిధములచేత ప్రజలను పాలింపుచుండెను. ఇట్లుండగా ఆదేశమునందు క్షామము వచ్చెను. అందుచేత జనులు వేలవేలుగ ఆకలిబాధకు నశింపజొచ్చిరి. దానిని జూచి మిక్కిలి దుఃఖముగలవాడై ఆపరిఘుడు వనమునకు బోయి శాంతచిత్తుడై తపస్సు చేయుటకు ఆరంభించెను. ఆసమయము నందు అతడు పండిన ఆకులను మాత్రమే ఆహారము చేయుచుండెను. అందువలన అతనికి పర్ణాదుడను పేరు అప్పటినుండి కలిగెను. ఆపర్ణాదుడు వేయి సంవత్సరములు అట్లే తపస్సుచేయగా పిమ్మట చిత్తము పరిశుద్ధమై బ్రహ్మ

జ్ఞానము కలిగెను. తత్ క్షణమే సర్వమును పరిత్యజించి శీతోష్ణాదులను సహించుచు సుఖదుఃఖములకు లోబడక ముల్లోకములయందును యథేచ్ఛముగా సంచరింప ఆరంభించెను. ఆతని మనస్సునందు అన్నియు సమములే యై యుండెను. ఏవిధమగు పరితాపములును లేకుండెను. ఇట్లు మోక్షపదమును జెందియున్న ఆపర్ణాదుడు ఒకనాడు మహాజ్ఞానవంతుడగు సురఘుని ఇంటికి వచ్చెను. వారిద్దరును చిన్ననాటిస్నేహితులు. పరస్పర దర్శనమువలన మఱింత సంతుష్టులై " నాకు నీదర్శనము వలన పరమానందము కలిగినది. సర్వశుభములును దొరికినది " అని పరస్పరము సంభాషించుకొనిరి. అంత ఆపర్ణాదుడు సురఘుని జూచి ఇట్లనియె. ఓ సురఘుడా! నీకు గలిగినట్లే నాకును ఆత్మజ్ఞానము కలిగినది. నీవు జ్ఞాన ప్రభావము వలన మిక్కిలి శాంతమై గంభీరమై ఉన్న చక్కని బుద్ధితో సర్వకార్యములను అసక్తుడవై ఆచరించు చున్నావుకదా? ఎట్టికార్యములను ఆచరించినను ఏవిధముగ ప్రవర్తించినను నీశరీరము వ్యాధులులేక మనోవ్యధలు నొందక సుఖముగ ఉన్నదికదా? ( మనస్సునందు సంతాపము కలిగినను శరీరమునకు వ్యాధి వచ్చుననుట వైద్యశాస్త్ర సిద్ధాంతము ) మొట్టమొదట మాత్రము కొంత మనోహరమై కానవచ్చు భోగములయందు ప్రవేశింపక సంకల్పములను ఆచరింపక నీమనస్సు స్వస్థమై యున్నదా? విశ్రాంతి సర్వోత్తమమై రాజిల్లుచున్నదా? పరమశాంతికి ఆకరమైనదియు, శుభకరమైనదియు, నగు సమాధిని ఆచరించు చున్నావా?

## —* సమాధి లక్షణము. *—

అనిచెప్పిన విని సురఘుం డిట్లనియె. ఓమహాత్మా! పరిఘ రాజర్షీ! జ్ఞానవంతుడగు పురుషుడు ఏకార్యములను ఆచరింపక ఊరకుండునుగాక, సర్వకార్యములను ఆచరించు చుండిన ఆచరించు చుండునుగాక, వానికి సమాధి లేని సమయము ఏదిరో కొంచెము చెప్పుము? అమ్మహాత్ముని మనస్సు దృఢమగు బ్రహ్మజ్ఞానము కలిగి శాంతమై సర్వప్రపంచమును ఆత్మమాత్రమునుగ భావింపుచు ఉండునుగదా? ఇట్టివారలకు ఏకార్యమును ఆచరించినను ఆచరించువాడు, ఆచరింపబడునది, ఆచరణము అను మొదలగు భేదములు ఎట్లు తోచును? వారు సర్వమును ఆత్మమాత్రమునుగా జూచువారేకదా? సమాధియును ఆత్మదర్శనమే. కావున జ్ఞానవంతులు ఎప్పటికిని ఎట్లున్నను సమాధినిష్ఠులే. ఇట్లుగాక ఒకానొకపురుషుడు పద్మాసనమును వేసికొని దృఢముగ కూర్చుండినను బ్రహ్మాది గురువులకు నమస్కా-

రమును ఆచరించినను ( అనగా, కదలక మెదలక ఏకాంత స్థలమునందు కూర్చుండి సమాధిని ఆచరింపవలయునని ఎంత దృఢముగ గూర్చుండినను ) వానిమనస్సు విశ్రాంతి నొందకపోయినచో అదిసమాధియగునా ? కావున ఓ మహాత్మా! పరిఘరాజర్షీ! సమాధియనగా ఊరక కూర్చుండుట కాదు. ఆశలనియెడు గడ్డికి అగ్నిహోత్ర ప్రాయమైన తత్త్వజ్ఞానమే ఆసమాధి శబ్దమునకు అర్థము. ఓసత్పురుషుడా ! శాంతి గలిగినట్టిదియు, ఎల్లప్పుడును తృప్తినొంది యున్నట్టిదియు, యథార్థమగు పరబ్రహ్మమును ప్రపంచరూపముగ చూచునట్టిదియు, నగు దివ్యజ్ఞానము ఏదికలదో అదియే సమాధి శబ్దముచేత చెప్పబడు చున్నది. మహాత్ముల అభిప్రాయము ఇదియే కాని, ఎట్లుచూచినను సమాధిశబ్దమునకు ఊరకుండుట అర్థమే కాదు.

శ్లో॥ అక్షుబ్ధానిరహంకారా ద్వంద్వేష్వననుపాతినీ ।
ప్రోక్తాసమాధీశబ్దేన మేరోఃస్థిరతరాస్థితిః ॥

ఓ మహాత్మా! సంక్షోభములు లేక, అహంకార శూన్యమై శీతోష్ణాదులకు చలింపక మేరుపర్వతమునకంటె స్థిరమైయుండు మనస్సుయొక్క స్థితి ఏది కలదో దానినే మహాత్ములు సమాధిశబ్దముచేత చెప్పుచున్నారు. సంకల్పములు లేక, ఏపదార్థములను అభిమానింపక "ఇవి విడువదగినవి, ఇవి అంగీకరింపదగినవి" అను భేదములను పాటింపక సర్వ పరిపూర్ణమై సర్వ సమమై ఉండు మనోవృత్తి ఏదికలదో, అదియే సమాధి శబ్దముచేత చెప్పబడుచున్నది. "కాలము ఎప్పటికిని తన సంచారమును మఱువనట్లు" తత్త్వజ్ఞానవంతునియొక్క బుద్ధికూడా పరమాత్మను ఎప్పటికిని మఱువదు. ఏవ్యవహారములను చేయుచున్నను, సర్వప్రపంచమును ఆత్మమాత్రముగ భావించునది యగుటచేత, దానికి ( జ్ఞానవంతుని బుద్ధికి ) ఎట్టి భేదమును కానరాదు. సమాధిభంగమును కలుగదు. సమాధి అనగా, సర్వమును ఆత్మమాత్రమునుగా భావించుటయే కదా? మఱియు వాయుదేవుడు తన గమనమును ఎప్పటికిని ఎట్లుమఱువడో, అట్లే జ్ఞానవంతుని బుద్ధియు దృఢనిశ్చయము కలిగినది కావున చైతన్యరూపమును మఱువదు. కావున ఓసర్వోత్తముడా! ఏమహాత్ములు సర్వకాలములయందును ఆత్మనిష్ఠగల బుద్ధితో సర్వసములై "ఈకార్యమును నేను చేయుచున్నాను. దీనిఫలమును నేనుఅనుభవింతును. దీనికి ఫలముగ సుఖమే రావచ్చును. దుఃఖమువచ్చిన ఓర్వలేను. కావున-దుఃఖమును తొలగించుటకు ప్రయత్నించెదను" అని కార్యఫల విభాగమును ( ఒక కార్యమును ఆచరించిన దానికి సుఖముగాని దుఃఖము

గాని ఫలముగా వచ్చువనియు, అందు సుఖము మాత్రమే కావలయునని యు, దుఃఖము అక్కఱలేదనియు, సంకల్పమును ) చేయక నిత్యశాంతులై యుందురో, వారివిషయమున "ఇది సమాధి, ఇదికాదు" అని చెప్పుటకు అవకాశము ఎక్కడనుండి వచ్చును? ప్రపంచమునంతయును ఆత్మరూపము నుగా జూచుటయే సమాధి. అది జ్ఞానులకు వ్యవహారకాలమునందుకూడా కలదు కదా? ఇట్లగుటచేత "ఇది సమాధి, ఇదికాదు" అని తలంచుట ఎల్ల కేవల భ్రాంతియే. జ్ఞానులకు వ్యవహారదశకూడా సమాధిస్థితియే. అజ్ఞానులకు మౌనస్థితికూడా సంసారమే. అనిన విని సంతసించి ఆపర్ణాద రాజర్షి ఇట్లనియె. ఓమహాత్మా! సురఘుడా! నీకు చక్కనిజ్ఞానము కుదిరి నది. మోక్షము దొరికినది. మనస్సు చల్లనైనది. అభిప్రాయము అతి గంభీ రమును స్పష్టమైనది ( సర్వసమమైనదనుట ) ఓరాజోత్తమా! నీవు నిర్మ లుడవైతివి. సర్వమయుడవైతివి. సర్వవ్యాపకత్వమును జెందితివి. నీకు అహంకారమను మూఢత్వము తొలగి పోయినది. శాశ్వత సుఖము వచ్చి నది. నీవు లోకోత్తరుడవై ప్రకాశించు చున్నావు.

శ్లో॥ అలమతివితతైర్వచః ప్రపంచై
రియముదితేహ సుఖాయదృష్టిరేకా ।
ఉపశమితరసంసమం మనోంత
ర్యదిముదితంతదనుత్తమాప్రతిష్ఠా ॥

ఓ సురఘుడా! విశేషముగా బలుకనేటికి. సర్వోత్తమమై, ఏక రూపుడగు ఆత్మను ప్రత్యక్షము చేసికొనునదియై, యున్న జ్ఞానదృష్టి నీకు స్థిరమైనది. మనస్సు సర్వ పదార్థములయందలి అనురాగమును విడిచి ద్వే షమును పరిత్యజించి లోలోన ఆత్మ దర్శనముచేత తృప్తి నొంది యుండు నేని, అదియే ఉత్తమ స్థితి స్థిరమగు ఆధారము కదా?

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉపశమ ప్రకరణమున సురఘూపాఖ్యానమను
ఇరువది ఐదవ సర్గము ముగిసెను.

---

శ్రీవాల్మీకిమహర్షి భరద్వాజుని జూచి ఇట్లనియె. ఓభరద్వాజా! ఈవిధముగా "చిత్తవిశ్రాంతియే పరమావధి" అని బోధించి మరల వశిష్ఠమహాముని శ్రీరామచంద్రుని జూచి ఇట్లనియె. ఓ రఘునందనా!

శ్రీరామా! ఈప్రకారముగా సురఘుడును, పర్ణాదుడును, ప్రపంచముయొక్క స్థితిని విచారించి పరస్పరము గౌరవించుకొని తమతమ కార్యములను సాధించువారై యథేచ్ఛగా బోయిరి.

—* చిత్తవిశ్రాంతిని సంపాదించుటయే ప్రధానమనుట. *—

ఓరాజీవలోచనా! రామా! ఏమహాత్ముడు సర్వకాలములయందును ఆత్మమయుడై సర్వప్రపంచమును ఆత్మగా భావింపుచు నుండునో, ఎవ్వని దృష్టి ఎట్టి సమయమునందైనను భేదమునుచూడక సర్వాంతరుడగు పరబ్రహ్మమునే చూచుచుండునో, ఇట్టి స్థితివలన ఎవ్వనికి బ్రహ్మానందానుభవము నిత్యమై యుండునో, ఎవ్వనికెప్పుడును బ్రహ్మానుసంధానము తరుగదో, అట్టివానిని సాంసారిక దుఃఖములు ఏమియు చేయనేరవు. ఓశ్రీరామా! జీవుడను వృషభము ఆశలను త్రాళ్ళచేత కట్టివేయబడి యున్నది. విషయభోగములనియెడు తృణమునందు అత్యాశవలన సంసారమను వనమునందు తిరుగుచున్నది. దుఃఖమనియెడు గొప్పభారమును మోయుచున్నది. అజ్ఞానమనియెడు చిన్నగుంటయందు పరుండి విశ్రమించుచున్నది. ఈవృషభమును రోగములనియెడు దోమలు సర్వకాలములయందును బాధించుచుండును. అత్యాశ అనియెడు త్రోలుమోకు దానిని ఈడ్చుచుండును. దుష్కర్మలనియెడు బురద దానిశరీరమును ఎప్పుడును ఆవరించియే యుండును. జన్మమరణములనియెడు రాకపోకలచేత మిక్కిలి దాహము గొని యున్నను దానికి సంసారారణ్యమునందు కొంతసేపైనను విశ్రమించుటకు చల్లనినీడ కొంచెమైనను దొరుకదు. ఎప్పటికిని ఎడతెగక పనిచేయుచు ఉండవలసినదియే. ఇట్లు మిక్కిలి శ్రమనొందుచు సంసారమను గుంటయందు మునిగిపోయి ఉన్న ఈవృషభమును అతిప్రయత్నముతో లేవదీయవలెను. పురుషుడైనవాడు తనసామర్థ్యమునంతయును, ఈవిషయముననే ఉపయోగింపవలయును. ఇట్లు సంసార సముద్రమును తరింప ప్రయత్నించువానికి సత్పురుష సమాగమమే చక్కని నావ. (పడవ) ముక్తిని జెందుటకు ఈసత్పురుష సమాగమమునకంటెను అన్యమగు యుక్తియే లేదు.

శ్లో॥ యస్మిన్ దేశే సురౌతజ్ఞో నాస్తి జ్ఞజనపాదపః ।
సఫలశ్శీతలచ్ఛాయో నతత్రనివసేద్బుధః ॥

ఏదేశమునందు, మోక్షమను మధురఫలములను విరివిగ ఫలింపజేయునట్టియు, (చిత్తశాంతియను) చల్లని నీడ గలిగినట్టియు, జ్ఞానియగు సత్పురుషుడను వృక్షము లేకుండునో, ఆభూమి సర్వవస్తు సమృద్ధమైన

ను, మరుభూమియో. ( చవిటినేలయో ) కాబట్టి ఆదేశము జ్ఞానవంతులకు నివాసయోగ్యము కాదు. సత్పురుషుడు ఎచ్చటనుండునో, అది ఇతర విషయములలో ఎట్టిదైనను స్వర్గమునకంటె అధికమైనది అగును. అట్టి ప్రదేశమును విచారించియే నివసింపవలయును.

శ్లో॥ నధనానినమిత్రాణి నశాస్త్రాణినబాంధవాః ।
నరాణాముపకుర్వంతి మగ్నస్యాత్మసముద్ధృతౌ ॥

లోకమునందు సంసార సముద్రమున మునిగియున్న ఆత్మను ఉద్ధరించు విషయములో, ధనములుకాని, స్నేహితులుకాని, శాస్త్రములు కాని, బంధువులుకాని, ఏ ఉపకారమును చేయనేరవు. ఆవిషయమునందు ఉపకారముచేయువాడు సత్పురుషు డొక్కడే. మఱియు సర్వకాలముల యందును తనతోగూడయున్న మనస్సను మిత్రుని తోడుచేసికొని "నేనెవ్వడను" అని కొంచెము విచారించిన అప్పుడు ఆత్మ సంసార సముద్రమును దాటును. మనస్సు అట్టి విచారమునకు ఉపక్రమింప వలయుననిన దానికి మార్గదర్శకులు సత్పురుషులే కదా. కావున ఎల్లైనను పరమాత్మని ఎఱుగుటయే ఆవశ్యము. అల్లెఱుగుటయు కష్టసాధ్యము కాదు. ఈ దేహము అచేతనమనుట సర్వలోక ప్రత్యక్షము. దీనిని కట్టెతోను, మట్టిపెళ్ళతోను, సమానముగా జూడవలయుననిన సులభముగనే చూడవచ్చును. ఇట్టిచూపు కలుగుటయే ఆత్మస్వరూపము తెలియుట. అచేతనమును విడుచుటకును చేతనమును సంపాదించుటకును వ్యవధానమే ఉండదు. అచేతనాచేతనములకు రెంటికిని విరోధమగుటచేత ఒకదానిని విడిచిన మఱియొకటి తనంతనే వచ్చును. చీకటిపోయిన వెలుతురు ప్రయత్నములేకనే వచ్చుచుండును కదా? ఆపరమాత్మ సింధుసముద్రముతో సమానుడు. ఆయన వాక్కులకు గోచరుడు కాడు. ( ఆయననుగూర్చి మాటలతో చెప్పుటకు వీలు లేదనుట ) ఆయన ఉపమానమును అంగీకరింపడు. ( ఆయనతో సమానమగునది వేఱొకటి లేదనుట ) ఆయన మఱియొకదానిని ఆశ్రయింపడు. ( లోకమునందు ఇతరపదార్థములు జడములు. కావున తాము ప్రకాశించుటకై మఱియొక పదార్థముయొక్క సహాయమును కోరును. ఈఆత్మ చేతనుడు. కావున అట్లు కోరడనుట ) అయినను మనస్సు, అహంకారము, అనునవి ( సర్వసంకల్పములు ) లయించెనేని అప్పుడు సర్వజంతువులయందును ఏకరూపముతోనున్న పరమేశ్వరరూపము ఆనందరూపమై స్వయముగనే ప్రత్యక్షమగును. కేవల జ్ఞానప్రకాశరూపమై సుస్థిరమైయున్న తుర్యా

వస్థ కలుగునేని అది ఆబ్రహ్మరూపముతో పోల్పదగును. తనకుదానే పోలి కయై ( రెండవవస్తువు ఉపమానముగా లేనిదై ) ఉన్న సుషుప్త్యవస్థకూడ కొంచెము ఇంచు మించుగ ఆ బ్రహ్మరూపస్థితితో పోల్ప అనువగును. ఆబ్రహ్మరూపస్థితి సర్వవ్యాపకమైనది. ఆకాశమువలె అతి విశాలమైనది. సర్వ పరిపూర్ణమైనది. మఱియును ఆస్థితి యోగమువలన తనంతదానే కలుగునది. యోగమునకు మనస్సును ఏకాగ్రము చేయుటయే పని. అట్టి ఏకాగ్రస్థితి కలుగగానే ఆబ్రహ్మరూపము స్వయముగనే ప్రకాశించును. దానికై క్రొత్తగా చేయవలసిన పని ఏమియు లేదు. వాస్తవస్థితిలో అది వాక్కునకేగాక మనస్సునకుకూడ గోచరమగునది కాదు. ఇకమనశ్శుద్ధి ఎందుకనిన:— బాహ్యములగు కలతలను అణచుటకే. ఆంతరములగు కలతలను తొలగించుటకే. ఇదియునుగాక మనస్సునకుగూడ ఆపరమేశ్వర రూపమే స్వస్వరూపముకదా ? కావున ఓ శ్రీరామచంద్రా ! ఆబ్రహ్మస్వరూపస్థితి ఇట్టిది అని వర్ణింప నలవికాదు. హృదయమునందు అనుభవింప వలసినదియే. అట్టి అనుభవముకూడ కష్టసాధ్యము కాదు. ఈసర్వమును పరమాత్మయే. చిత్త పరిణామ మాత్రముచేత ఇట్లు భిన్నభిన్న రూపములతో ఆయన ఒక్కడే కానవచ్చుచున్నాడు. ఈకారణమువలన ఆమనస్సు బాహ్యాంతర పదార్థవిషయములగు సంకల్పములను మాని నిలిచెనేని అప్పుడు ఆత్మ భిన్నమగు పదార్థము ఏదియును ఉండదు. మనోరూపమను సంకల్పము లకంటె భిన్నము కాదు. కావున సంకల్పములు ఉడిగిన మనస్సే లేకపోవుట చేత అప్పుడు ఆత్మభిన్నములగు పదార్థములే తోపవు. అప్పుడు ఆదేవదేవుడు స్వయముగ ఏకరూపుడై నిలుచును. అనుభవమునకును స్వయముగనే వచ్చును. లోకమునందలి అనుభవములు భేద సాధ్యము లగును. (అనుభవించువాడు, అనుభవింపబడునది, అనుభవము అను భేదములు ఉండినప్పుడే సంభవించునవి అగును.) ఆత్మానుభవము మాత్రము ఇట్టిది కాదు. ఆయనయందు భేదములు లేవుకదా? కావున అనుభవమన్నను, మఱి ఏమియన్నను, ఆత్మయొక్క స్వస్వరూప స్థితియే అగును. ఈవిధముగ ఆత్మ స్వయముగ అనుభవమునకు వచ్చిన పిమ్మటనే సమస్త సంకల్పములును భోగేచ్ఛలును తొలగును. అట్టి అనుభవము కలిగిన పిమ్మటనే శాశ్వతమై పరిపూర్ణమైయుండు ఆనందము ( బ్రహ్మానందము ) స్పష్టమగు రూపముతో ప్రకాశించును. అట్టి అనుభవము కలిగిన పిమ్మటనే సర్వాత్మత్వము కలుగును. ఎట్టివారలకైనను వర్ణింప అశక్యమగు స్వస్వరూపస్థితి ( స్వస్వరూపమునం

దైక్యమగుట ) సంభావించును.

శ్లో॥ మనసైవమనశ్ఛిత్వా యద్యాత్మానావలోక్యతే ।
తన్మనశ్యేజ్జగద్దుఃఖం మనశ్ఛేదే సుఖాత్మధీః ॥

ఓరఘురామా ! ఈవిధముగ మనస్సును ఛేదించి ఆత్మరూపమును ఎఱుగకపోయిన ఈసంసారదుఃఖము శాంతింపదు. మనస్సు ఏక్షణమున ఛేదింపబడునో, అప్పుడేకాని ఆనందరూపుడగు ఆత్మను గూర్చిన బుద్ధి జనింపదు.

## —* భాసవిలాసోపాఖ్యానము. *—

ఈవిషయమునందు భాసవిలాసుల సంవాదమును మహాత్ములు ఉదహరించుచున్నారు. ఆభాస విలాసులు ఇరువురును పరస్పర మిత్రులు. వారికి సహ్యపర్వత శిఖరముపైన సంవాదము జరిగెను. దానిని వివరముగ తెలియజేసెదను. వినుము. ఓపురుషోత్తమా ! శ్రీరామా ! ఈజంబూద్వీపమునందు సహ్యమను ఒక పర్వతము గలదు. ఆపర్వతము తనయెత్తుచేత ఆకాశమును, పైభాగముచేత భూమిని, లోతుచేత పాతాళమును జయించుచుండెను. ఆపర్వతమునందు ఉత్తరపువైపుననున్న ఒకానొక చరియయందు అనేక ఫలవృక్షములతో కూడినదై అతివిశాలమై తాపసులయొక్క ఆశ్రమనెల్ల దీర్చుచుండునట్టి ఆశ్రమము ఒకటి కలదు. అది అత్రిమహాముని ఆశ్రమమని ప్రసిద్ధి నొందియుండెను. అట్టి ఆశ్రమమునందు ఒకేచోట ఇరువురు మునులు నివసించుచుండిరి. వారు ఆకాశ మార్గమున ఉన్న శుక్రబృహస్పతులవలె తమతేజస్సుచేత ప్రకాశించుచుండిరి. వారు ఇరువురు పరమమైత్రితో ఒకేచోటనే నివసించుచుండిరి. ఇట్టి ఆమునులకు క్రమముగ విలాసుడనియు, భాసుడనియు, ఇరువురు పుత్రులు పుట్టి కాలక్రమమున అభివృద్ధి నొందిరి. ఆభాసవిలాసులుకూడ పరమానురాగము గల దంపతులవలె అమితస్నేహము గలిగి యుండిరి. ఒకే ( మనస్సే ) రెండుగా విభాగింప బడినట్లు వారిమనస్సు పరులకు గానవచ్చుచుండెను. అంత వారి తండ్రులగు మునులు ఇరువురును కాలధర్మము నొందిరి. అంత వారును ( భాస విలాసులును ) ఉత్తరక్రియలను చేసి తమతండ్రులకై అధికముగ శోకింపసాగిరి. కొంతకాలము అపరిమితముగ శోకించి రోదనము చేసి తుదకు విరక్తులై ఆయరణ్యముననే వేరు వేరుగ నివసించి తపస్సుచేయ సాగిరి. ఘోరమగు తపస్సు చేయుటచేత వారి శరీరములు కృశించిపోయినవి. వారలకు ఏపదార్థమునందును ఆశ లేక పోయెను. ఇట్లుండగ ఇట్టిస్థితిలోనే

దినములు, పక్షములు, మాసములు, సంవత్సరములును, గడచిపోయెను.

—* భాస విలాసుల సంవాదము. *—

అంత ఒకనాడు వారు ఇరువురు ఒకచోట కలిసి ఇట్లు సంభాషింప నారంభించిరి. అందు విలాసుడు ఇట్లనియె. ఓభాసుడా ! నీరాక మిక్కిలి శుభమగును గాక. నాయొక్క బ్రతుకనియెడు శ్రేష్ఠమగు వృక్షమునకు ఫలమువంటివాడా! ఈప్రపంచమునందు నీవే నాకు బంధువుడవు. నాహృదయమును ఊరడించుట ( అనగా నాహృదయమునందు కలిగిన తృప్తి ) అను అమృతమునకు మహాసముద్రమువంటివాడవు. నేటికి గానవచ్చితివి. మనకిద్దరకు స్నేహము అపరిమితముగ నుండెను. ఇట్టి నన్ను విడిచి నీవు ఏగితివి కదా? ఇంతకాలము ఎచ్చట నుంటివి? నీతపస్సులు ఫలించెనా? నీబుద్ధి శాంతినొందెనా? నీకు ఆత్మజ్ఞానము కలిగెనా ? నీవిద్యాభ్యాసమునకు తగిన ఫలము దొరికెనా ? క్షేమముగ నున్నావా ? అని అడిగిన విని భాసు డిట్లని ఉత్తర మిచ్చెను. ఓ సత్పురుషుడా ! విలాసుడా ! నీదర్శనము శుభమగును గాక. చాలాకాలమునకు నిన్నుచూచి గౌరవింప గలిగితిని. నాకు మిక్కిలి సంతోషము కలిగినది. సంసారమునందు ఉన్నవారికి ఎక్కడిసౌఖ్యము? నేను సంసారమునందు ఉన్నవాడనే కదా ? తెలియబడదగిన పదార్థము ( ఆత్మ ) తెలియబడక ఉండునంత వరకును, చిత్తము నశింపక ఉండునంత వరకును, సంసారమును తరింపక ఉండునంత వరకును, సుఖము ఎక్కడనుండి వచ్చును? “ తీగెలను కొడవలితో కోసివేయునట్లు ” మనస్సునందు పుట్టు ఆశలను అన్నిటిని సంపూర్ణముగ ఛేదింపక ఉండునంత వరకు సుఖము ఎక్కడనుండివచ్చును? జ్ఞానస్వరూపమగు పరబ్రహ్మము ఎఱుగబడనంత వరకును, సర్వ సమత్వము కలుగునంత వరకును, ఆత్మస్వరూపజ్ఞానము ఉదయింపనంత వరకును, లేక, బ్రహ్మము స్వస్వరూపముతో అనుభవమునకు రానంత వరకును, సౌఖ్యము ఎక్కడినుండి వచ్చును ? ఓసత్పురుషుడా! విలాసుడా! ఆత్మలాభము కలుగక జ్ఞానమను మహౌషధము సమీపమునందు లేకయుండెనేని ఈసంసారమను విషూచికావ్యాధి మఱల మఱల పుట్టుచునే యుండును. సుఖమని తలంపబడుచున్న భోగములవలన కొంతకాలము మాత్రము ఈసంసారము సుఖముగ దోచినను విచారించిన ఇది దుఃఖమయమే. కావున మఱల మఱల పీడించుచునే ఉండును. కావున,

శ్లో॥ బహువిధసుఖదుఃఖ మధ్యపాతీ
వితతజరామరణప్రపాతిభగ్నః ।

జగదుదరగిరౌలుఠన్జనోఽయం
గతరసపర్ణవదేతి జర్జరత్వమ్ ॥

ఓరామా! ఆత్మజ్ఞానశూన్యుడగు మనుష్యుడు అనేకవిధములగు సుఖదుఃఖముల మధ్యమునందు పడుచు ముసలితనము, చావు, అనునట్టి శిఖరములయందు దెబ్బలు తగులుటచేత విరుగుచు, ప్రపంచ మధ్యమను పర్వతమున ఇటునటు పొరలుచు, ఎండిపోయిన ఆకువలె శిథిలుడగును.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
ఉపశమ ప్రకరణమున భాసవిలాసోపాఖ్యానమను
ఇరువది ఆరవ సర్గము ముగిసెను.

—*—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడగు భరద్వాజుని జూచి ఇట్లనియె. ఓభారద్వాజా! వశిష్ఠమహాముని శ్రీరామచంద్రునితో ఇట్లనియె. ఓరామచంద్రా! ఈవిధముగ ఆభాస విలాసులు ఇరువురును కుశల ప్రశ్నములను చేసికొని సంతోషించుచు కాలక్రమమున బ్రహ్మజ్ఞానము కలిగి ముక్తులైరి. ఓవీరుడా! శ్రీరామా! ఈకారణమువలన " అభిమానయుక్తమగు మనస్సు సంసారము నుండి తరింపవలయుననిన జ్ఞానమునకంటె భిన్నమైన గతి ఏదియు లేదు " అని నీకు చెప్పియుంటిని. ఏమనస్సు పరమవైరాగ్య సంపన్నమై యుండునో అది సంసారమునందు ఉండినను మోక్షము చెందినదియే. ఇట్లుగాక ఏమనస్సు విషయేచ్ఛను వదలకుండునో అది అతిఘోరమగు తపస్సు చేయుచున్నను బంధముతో కూడినదియే. ఇట్లే చిత్తమునందు సర్వాభిమానశూన్యుడై శాంతుడైయున్న జీవుడు వెలుపలికి కర్మలను ఆచరించినను ఆచరింపకున్నను కర్తకానేరడు. భోక్తయు ( అనుభవించువాడు ) గానేరడు.

—* బంధమోక్ష నిరూపణము. *—

అని వశిష్ఠమహర్షి చెప్పినవిని శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓభగవంతుడా! వశిష్ఠమహర్షీ! సంగము ( అభిమానము ) ఎట్టిది? మనుష్యులకు బంధమోక్షములు కలుగుటకు కారణములేవి? ఈసంగమునకు చికిత్స ( దీనిని పోగొట్టుట) ఏది? అని శ్రీరాముడు పలికినవిని వశిష్ఠమహాముని ఇట్లని ఉత్తరమిచ్చెను. ఓసత్యవ్రతా! శ్రీరామా! వినుము. దేహమునకును ఆత్మకును గల భేదమును విడిచి దేహమునందు " ఇదియే నేను " అను నమ్మకము కలిగియుండుటయే అభిమానమునకు స్వరూపము. ఈ అభిమానమే బంధము

నకు గారణము. సర్వవ్యాపకుడగు ఆత్మను పరిచ్ఛిన్నుడుగా భావించి తన రూపము పరమానందరూపము తెలిసికొనలేక "నాకు సుఖము కావలయును" అని కోరుట ఏదికలదో, అదియే అభిమానమునకు స్వరూపము. అదియే బంధమునకు గారణము. ఇట్లే "ఈ సర్వప్రపంచము పరమాత్మయే. నేను దేనిని అంగీకరింతును. దేనిని విడుతును" అను నిశ్చయము తో కూడిన స్థితియే అభిమానరాహిత్యము. ఇదియే జీవన్ముక్తస్థితి. "నేను, పరుడు, అను విషయమే లేదు. సుఖములు వచ్చిన రానిమ్ము. రాకుండిన రాకుండనిమ్ము" అను నిశ్చయము కలిగి అన్నిటియందును అభిమానమును వదలి ఏమహాత్ముడు ఉండునో, వానినే జీవన్ముక్తు డనియెదరు. ఏమహాత్ముడు కర్మ చేయకుండుటను గాని, కర్మలనుగాని, అభిమానింపక సర్వసముడై ఎప్పుడు ఏదివచ్చిన దానిని చేయుచు సమబుద్ధితో నుండునో, అట్టివాడు ముక్తుడనియు, అభిమాన రహితుడనియు, చెప్పబడును. సర్వ విధములగు కర్తలకును గలుగు ఇష్టానిష్ట ఫలములను, వాకి హేతువులగు కర్మలను, మఱియు ఇతర సర్వపదార్థములను, వెలుపలికి ఆశ్రయించియే యుండియు, యుక్తిగ మనస్సుతో మాత్రము పరిత్యజించి ఉండుట ఏదికలదో, అదియే అభిమాన రాహిత్యము. అదికలవాడే అభిమాన రహితుడు, జీవన్ముక్తుడు. మఱియు ఓ శ్రీరామచంద్రా! జ్ఞానమునకు పూర్వము ఏ ఏ క్రియలు ఏఏ విధముగ ప్రవర్తించినను అభిమాన రాహిత్యము కలిగిన తక్షణమే నిర్దుష్టము లగును. సర్వ వికారములకును ఈఅభిమాన రాహిత్యమే మందు. ఈఔషధప్రభావమువలన ఆవికారములు కేవలము చక్కనగుట మాత్రమే గాక, పురుషునకుగూడ సుఖమును కలిగించును. ఈమనుష్యులు మృతిజెంది మఱల మఱల పక్షులుగాను, పురుగులుగాను, పుట్టుట ఏదికలదో, అది అంతయు పైన వివరింపబడి ఉన్న సంగముయొక్క విలాసమే. ఈసర్వభూతములును నదులయందలి అలలవలె పలుమాఱు పుట్టుచు నశించుచు ఉండుట ఏదికలదో, అది పైన వివరించిన సంగముయొక్క ప్రభావమే. మఱియు ఓ రఘుకులతిలకా! శ్రీరామా! సంగము నిరర్థకమైనదియు, పూజనీయమైనదియు, నని రెండుతెఱగులై ఉన్నది. అందు అజ్ఞానులకు గల సంగము దుఃఖకరమగుటచేత నిరర్థక సంగము. జ్ఞానులచేత కేవల వ్యవహారార్థమై మాత్రమే అభినయింపబడుచున్న సంగము ( అభిమానము ) మోక్షమునకు హాని కలిగింపనిది అగుటచేత పూజనీయము. లోపలశుద్ధులై ఎట్టి వికారమును జెందక వెలుపలికి మాత్రము సర్వసంసార కారణమగు దాని అభినయింప

వలయుననిన అది ఎంతప్రయాస ? అట్టి అభినయమును ఆచరించువారు ఎంతధైర్యవంతులు ? వారి ప్రభావము వలన వారు ఆశ్రయించిన అభిమానమునకుకూడ ( సంగమునకుకూడ ) గౌరవము వచ్చుననుటలో సంశయమేమి? కావున ఏ అభిమానము, ఆత్మ స్వరూప జ్ఞానము లేకపోవుటచేత దేహాదిపదార్థములను ఆశ్రయించి కలిగి మాటిమాటికి సంసారమును అభివృద్ధి చేయుచుండునో, అది దోషయుక్తమగు అభిమానము. ఇట్లుకాక ఆత్మజ్ఞానము కలుగుటచేత " నేనేబ్రహ్మము " అను స్వరూపము గలిగి కేవలము వ్యవహారార్థమై అభినయింపబడుచు సంసార సంబంధము లేక, జ్ఞానమువలన జనించిన అభిమానము పూజనీయమగును. ఈ పూజనీయాభిమానమును ఆశ్రయించియే శంఖ చక్ర గదాది యుక్తమగు దేహము ( విష్ణుదేహము ) త్రిలోకములను కాలోచిత విధులను ఆచరించుచు పరిపాలించుచున్నది. ఇట్లే దివ్యజ్ఞానవంతులగు సిద్ధులును, లోకపాలకులును, ఆపూజనీయాభిమానము ఆశ్రయించియే ప్రపంచమునందు తమతమ కార్యములను ఆచరింపుచున్నారు. " గద్ద మాంస ఖండములపై దుముకునట్లు " వంధ్యాభిమానము ( నిరర్థకమగు అభిమానము ) గల మనస్సు కూడ " ఇవి మిక్కిలి మనోహరములు " అని నిరర్థకముగ భావింపుచు భోగములపై దుముకుచుండును. ఆభోగములు మొట్టమొదట కొంత రమ్యముగ నుండునుగాని, పిమ్మట మహాదుఃఖమును కలిగించునని తెలిసికొన నేరదు. మఱియును ఈవంధ్యాభిమానము కలవారలకు రౌరవము, అవీచి, కాలసూత్రము, మొదలగు నరకములే మనోహరములగు ( అభిమాన పూర్వకముగ నివసింప దగినవియగు ) అంతఃపురములుగ పరమేశ్వరునిచేత నిర్మింపబడినవి. ( అట్టి అభిమానము గలవారు పుణ్యపాప కర్మలను ఆచరింపుచు వానికి తామే కర్తలని భావింపుచు సుఖదుఃఖ ఫలములను అనుభవింపుచుందురనుట. ఇచ్చట నరకములను గూర్చి మాత్రమే చెప్పబడియున్నను, స్వర్గమును గూర్చి కూడ చెప్పబడెనని తెలిసికొనవలెను. ) ఓరఘురామా! నిరర్థకమైన అభిమానము కలిగి దుఃఖముచేత వరటియున్న మనుష్యులు నరకములను అగ్నులకు ఎండుకట్టియలు. అట్టిపురుషులను ఆశ్రయించియే ఆనరకాగ్నులు ప్రజ్వరిల్లు చుండును. ఇట్లగుటచేత వంధ్యసంగమును ఆశ్రయింప దగదు. అప్పుడు ( ఆవంధ్యసంగమును విడచిన ) మనస్సు అజ్ఞానమయములగు సర్వవిషయములందును ( అనగా అదివరకు ఆత్మభిన్నములుగా అజ్ఞానవశమున భావింపబడుచున్న సర్వ పదార్థములయందును )

అభిమానమును వదలి క్షీణమగును. జ్ఞానదృష్టియందు అభివృద్ధి నొందును. (ఆత్మభిన్నమగు పదార్థము లేదను దృఢ విజ్ఞానమును గలిగి యుండు ననుట) ఇట్టిమనస్సుకలవాడే జీవన్ముక్తు డనబడును. జ్ఞానవంతుడగు పురుషుడు వ్యవహారములను నిలుప నక్కఱలేదు. యథాపూర్వముగనే సర్వమును ఆచరింప వచ్చును. ఆసనము, శయనము, మొదలగు సర్వపదార్థములను పూర్వమువలెనే ఆశ్రయించుచు ఉండ వచ్చును. కూర్చుండుట, పరుండుట, మొదలగు సర్వవ్యాపారములను ఆచరింప వచ్చును. జ్ఞానులతోను, మూఢులతోను, గూడ సహవాసమును చేయవచ్చును. సర్వ విధములగు కర్మలను ఆచరింప వచ్చును. (అనగా, ధనార్జనము, అధికార నిర్వహణము, మొదలగు విశేష కర్మలను జేయవచ్చు ననుట) ఆసమయములయందు మనస్సు దృశ్యపదార్థములతో సంబంధించి తీరవలయు ననుట నిస్సంశయమగు విషయమే. అయినను ఆపురుషుడు దానిని ఏపదార్థమునందును బంధ్యసంగముతో గూడినదానినిగా జేయరాదు. కర్మలయందుగాని, ఆలోచనలయందుగాని, ఆత్మభిన్నములని తలంపబడుచున్న పదార్థములయందుగాని, ఆకాశమునందుగాని, క్రిందగాని, మీదగాని, విశాలములగు దిక్కులయందుగాని, అతివిస్తారమగు బాహ్యప్రదేశమునగాని, లోపలగాని, ఇంద్రియవ్యాపారములయందుగాని, ప్రాణములయందు గాని, శిరస్సునందు గాని, దవడలయందుగాని, కనుబొమల నడిమి భాగమునందుగాని, నాసికాగ్రమునందుగాని, ముఖమునందుగాని, కణ్ఠగుద్దునందుగాని, చీకటియందుగాని, వెలుతురునందుగాని,హృదయాకాశమునందుగాని, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందుగాని, నలుపు మొదలగు వర్ణములందుగాని, చరాచరములయందుగాని, ఆదిమధ్యాంతములయందు గాని, దూరమునందు గాని, సమీపమునందుగాని, ఎదుటగాని, ఏదియైన నొక పదార్థమునందు గాని, స్వస్వరూపమునందుగాని, శబ్ద స్పర్శ రూపాదులయందుగాని, కామక్రోధాదులయందుగాని, రాగ శోకలయందుగాని, కాలమునందుగాని, సంకల్పములయందుగాని, ఆమనస్సునకు బంధ్యాభిమానము కలుగకుండునట్లుచేయవలయును. కేవలము ఆత్మయందు మాత్రమే (జ్ఞానరూపమగు బ్రహ్మమునందు) స్థిరమైనదానినిగ చేయవలయును. అట్లు పదార్థములయందును పూర్వమువలె "ఇవి అనందకరములు" అను అభిప్రాయము లేకపోవుట చేత వానిమనస్సు నీరసబుద్ధితోనే యుండునుకదా? వ్యవహారార్థమై ఊరక అభిమానమును అభినయించుటయే గాని, వాస్తవస్థితిలో నీరస బుద్ధి కలిగిన

పిమ్మట పూర్వమువలె అభిమానము ఉండుననుట సంభవింపదు కదా? ఇది యటుండగాక ఆత్మనిష్ఠ దొరికినపిమ్మట భేదభావన సంభవింపనే సంభవింపదు. ఇట్టి స్థితిని జెందిన జీవుడు జీవుడే ( పూర్వమువలె బద్ధుడే ) కాకపో వుటచేత వాడు కర్మలను ఆచరించిన నొకటియే, ఆచరింపకున్న నొకటియే. ఆతడు ఆత్మస్వరూప జ్ఞానము దృఢముగ కలవాడు, కావుననే కర్మలను ఆచరించినను, వానితో సంబంధపడడు. ఆచరింపకున్నను, దానివలన కలుగు దోషములచేత బద్ధుడు కాడు. మేఘములు వచ్చుచున్నను రాకున్నను ఆకాశమున వానితో ఇంచుకయైనను సంబంధము లేనట్లు వానికిని ఆకర్మలతో సంబంధము లేదు. పోనిమ్ము. "వ్యవహరించుచున్న ఎల్లెడలను సంక్షోభము కలుగక మానదు" అను తలంపు కలుగునేని ఆజీవునకు దృశ్య పరిత్యాగమును సంపూర్ణముగ గావించి, ప్రకాశించుచున్న మణివలె, స్వస్వరూపమునందే నిలుచుటకు గూడ శక్తి కలదు. మఱియు ఆత్మనిష్ఠులైయుండు మహానుభావులకు విజ్ఞానశీలురకు కలుగు అభివృద్ధికి కొఱతయే లేదు. వారు వెలుపలికి నెమలి ఈక కొనవలె అతిచంచలులై గానవచ్చినను మనస్సునందు మేరుపర్వతమునకంటె స్థిరులై ఉందురు. ఓరఘురామా! మనస్సు దృశ్యసంబంధమును విడిచెనేని అప్పుడు నశించినది అగును. అట్లు నశించిన చిత్తము గల మహాత్ములకు ఉన్న స్థితి ఏది కలదో, దానిని "జాగ్రత్కాలమందే కలుగు సుషుప్త్యవస్థ" అని చెప్పుదురు. ఈసుషుప్తస్థితియే అభ్యాసాతిశయమువలన దృఢమయ్యెనేని దానినే తుర్యమందురు.

## జీవన్ముక్త విదేహముక్తుల విశేషము.

ఓశ్రీరామా! ఈతుర్యావస్థయందు స్థిరమగు నిలుకడను పొంది బ్రహ్మానందమును సర్వ కాలములయందును అనుభవించుచునే యున్నను ఒకానొక యోగి కేవల బ్రహ్మరూపముతో నిలువక అభిమాన పూర్వకముగా గాకున్నను వ్యవహారములను చేయుచుండును. మఱియొకడు అవ్వవహారముకూడ లేక బ్రహ్మానందానుభవము అనునదికూడ లేక, తుర్యాతీతమను ఉత్తమ స్థితిని జెంది అనిర్వాచ్య స్వరూపముతో నుండును. ఇట్టి వీరిద్దరును ముక్తులే. ఇందు మొట్టమొదటివాడు వ్యవహారార్థమై మరణాంతమువరకు సర్వమును అభినయించుచునే యుండును. కావున జీవన్ముక్తుడు. రెండవవానికి అట్టి అభినయముగాని, తత్సాధనమగు దేహముగాని, లేదు.

కావున వాడు విదేహాముక్తుడు. ఇట్లు అభినయాత్మకమగు వ్యవహారము ఒకట్టియే వీరలకు గల భేదము.

శ్లో॥ పరిగళితసమస్త జన్మపాశః
సకలవిలీనతమోమయాభిమానః ।
పరమరసమయీం ప్రయాతి సత్తాం
జలగతసైంధవఖండవన్మహాత్మా ॥

ఓ శ్రీరామా ! ఆత్మజ్ఞాన సంపన్నుడగు మహాత్ముడు జన్మములను బంధములు లేనివాడై అజ్ఞానమయమైన అభిమానమును వదలి " నీటగలిసిన ఉప్పురాతివలె " పరమానందమయమగు సత్తాసామాన్యమును చెందును. అచేతనదృష్టికేని చేతనదృష్టికేని నడుమనున్న పారమార్థికస్థితి ఏది కలదో అదియే బృహదారణ్యకాదులగు ఉపనిషత్తులయందు విశేషముగ చెప్పబడియున్నది. చూపు, చూడబడునది, అనువానియొక్క సంబంధము వలన కలుగుచు సర్వజనులకును అనుభవసిద్ధమై అనుభవమే స్వరూపము గాగలదియై యున్న సుఖము ఏదికలదో, దానిసారమే పరబ్రహ్మమని చెప్పబడుచున్నది. మఱియును ఆసమయమునందు కలుగు సుఖజ్ఞానము ఏది కలదో, అది దృశ్యసంబంధమును ( ఈసుఖము ఈ పదార్థమువలన కలిగినది అని తనకు స్వరూపభూతమగు ఆనందమును అన్యజనితమునుగా భావించుటను ) చెందునేని అదియే బంధమనబడును. (ఆసుఖరూపజ్ఞానమే బ్రహ్మమే బంధమని చెప్పబడును) దానిని ( ఆదృశ్య సంబంధమును ) విడుచునేని ( ఆనందము స్వస్వరూపభూతమే అని తెలిసికొనునేని ) అదియే ( బ్రహ్మమే ) మోక్షమని చెప్పబడును. కావున ఓ శ్రీరామా ! నీవు ఏపదార్థమును చూచుచున్నను ఏమిఆచరించుచున్నను సుషుప్తి స్థితిని జెందినట్లు నిలువుము. చూపునకును చూడబడు పదార్థమునకును నడుమనున్న అనుభవమును మాత్రమే అవలంబించి స్థిరుడవు కమ్ము. ఈస్థితి స్థిరమయ్యేనేని అదియే స్వయముగానే క్రమక్రమముగా తుర్యరూపమును చెందును. ఆస్థితియందు ఆత్మ నిర్వికారుడగుటచేత స్థూలరూపుడుగాని, సూక్ష్మరూపుడుగాని, కానేరడు. తెలిసికొనువాడు, తెలివి, తెలియబడునది, అను భేదములు లేకపోవుటచేత ప్రత్యక్షుడు కాడు. స్వయముగా అనుభవరూపుడై లేక, ఆత్మరూపుడై యుండుటచేత పరోక్షుడును ( ప్రత్యక్షముకానివాడును ) కాడు. మఱియొకసాక్షి లేకపోవుటచేత జడుడు ( జ్ఞానశూన్యుడు ) కాడు. దృశ్యము లేకపోవుటచేత చేతనుడును ( జ్ఞానరూపుడును ) కాడు. ఇంద్రియములు

లేకపోవుటచేత కలవాడని కాని, లేనివాడని కాని, చెప్పబడడు. అహంకారము లేకపోవుటచేత “ నేను ” అని కాని రెండవవాడు లేకపోవుటచేత “ ఇతరుడు ” అని కాని, చెప్పబడడు. భేద మనునది బొత్తిగనే లేకపోవుటచేత “ ఒకరుడు ” అని కాని, “ అనేకులు ” అని కాని, చెప్పబడడు. మొట్టమొదట భేదమనునది ఉండిననేకదా, అది ( భేదము ) కానవచ్చునప్పుడు “ ఇవి అనేకములు ” అనియు, అది కానరానప్పుడు “ ఇది ఒకటియే ” అనియు, చెప్పుటకు వీలగును ? ఇచ్చట అట్లు లేదు కావున ఆత్మనుగూర్చి ఏమియు జెప్పుటకు వీలులేదు. ఈ ప్రపంచమునందు ఏ ఏ పదార్థము మనస్సుతోగూడి ఆఱగు ఇంద్రియములకు గోచరమగుచున్నదో, అదియంతయు సాక్షిచేత ప్రకాశింప చేయబడునదియే. కావున సాక్షి ( బ్రహ్మము ) కానేరదు. ఇది స్పష్టమగు విషయము. ఇక బ్రహ్మమును దేనితో పోల్ప వీలగును. ( ఎట్లు చెప్పుటకును వీలు లేదనుట ) మఱియు,

శ్లో॥ నమోక్షోనభసఃపృష్ఠే నపాతాళేనభూతలే ।
సర్వాశాసంక్షయేచేతః క్షయోమోక్షఇతీష్యతే ॥

ఓరామచంద్రా! మోక్షమనగా, ఆకాశముమీద కాని, పాతాళమునందు కాని, భూమియందు కాని, ఉండు ఒక క్రొత్త దేశము కాదు. ఆశలను అన్నింటిని జయించిన పిమ్మట కలుగునట్టి చిత్తక్షయమే. “ నాకు మోక్షము కలుగును గాక. దానిని ఎట్లు సంపాదింతును ” అను విచారము దృఢమయ్యెనేని అప్పుడు మనస్సు సంసారమునుండి లేచినదని తెలిసికొనవలెను. ఇట్లుగాక “ నాకీధనము కావలయును భోగములు కావలయును ” అను తలంపులు అధికములగునేని అప్పుడు సంసార బంధము మిక్కిలి దృఢమయ్యెనని తెలిసికొన వలయును. ఓరఘురామా “ ఆత్మ సర్వపదార్థములకంటె భిన్నుడు ” అనియు “ ఆత్మ సర్వపదార్థరూపుడై సర్వవ్యాపకుడై ఉన్నాడు ” అనియు రెండునిశ్చయములు కలవు. ఇందు ఏదియైనను పురుషార్థదాయకమే. ఇక విచారింపుము. తన యథార్థ స్వరూపమునకు బంధము కాని, మోక్షము కాని, కలుగుటకు వీలు ఇంచుకయైన కలదా ? సంకల్పముచేత “ నాకు బంధము కలదు. మోక్షము కలదు ” అని ఊరక తలంచుటయే కాని, బాగుగ విచారించిన బంధమోక్షములు ఎవ్వరికిని లేవు. ఇట్లగుటచేత చేయవలసినకార్యము సంకల్పక్షయము మాత్రమే. అట్లు సంకల్పమును సమూలముగా ధ్వంసముచేసిన మహానుభావుడు ఆత్మరూపమునందే తృప్తుడగును. సంక్షోభము లేకపోవుటచేత మిక్కిలి శాంతుడగును.

సర్వవ్యాపకమగు ఆత్మ రూపమును తెలిసినవాడగుటచేత సంపూర్ణుడగును. సంసార బంధమును విడిచినవాడగుటచేత నిర్మలుడగును. కామక్రోధాది రూపమగు బురదను తుడిచివేయుటచేత ఆతని మనస్సు మిక్కిలి పరిశుద్ధ మగును. బంధరూపమైన భ్రాంతి తెగిపోవును. శీతోష్ణములు సుఖదుఃఖ ములు మొదలగు జంటలవలన అతనికి భయము కలుగదు. సంసారమను మహాదుఃఖము వానిని ఏమియు చేయనేరదు. వానికి కలుగవలసిన బ్రహ్మ రూపము కలిగినది. కావున పరిపూర్ణ విశ్రాంతి దొరకును. ఆతనికి కార్య ముచేతగాని, మనస్సుచేతగాని, వాక్కుచేతగాని, పునరావృత్తి కలుగదు. (అనగా, పూర్వమువలె భేదభావనతో కర్మమును ఆచరింపడు. అట్టిభా వనను మనస్సులోనైన నుంచడు. నోటితోనైనను అట్లు వచింపడనుట) స్వేచ్ఛానుసారముగ సర్వకర్మలను ఆచరించును గాని, అదియంతయు కేవ లము అభినయమాత్రమే కాని, వానియందు అతనికి ఇచ్ఛయుండదు.

శ్లో॥ ఆపత్కరంజపరశుం పరాయానిర్వృతేఃపదమ్ ।
పుష్పగుచ్ఛంశమతరో రాలంబస్వనిరాశతామ్ ॥

శ్లో॥ గోష్పదంపృథివీమేరుః స్థాణురాశాస్సముద్గికాః ।
తృణంత్రిభువనంరామ నైరాశ్యాలంకృతాకృతేః ॥

ఓ ఇందీవరశ్యామా! రామా! ఆశలజయించుట అనునది ఆపదలను కానుగుచెట్లకు గండ్రగొడ్డలి. మోక్షమునకు ఆధారభూతమైనది. శాంతి యనియెడు వృక్షమునకు పువ్వులగుత్తి. ఇట్టి ఈ ఆశాజయమును ఆశ్రయిం పుము. ఆశాజయము కలవానికి ఈభూమియంతయు గోష్పాదమాత్రము అగును. మేరుపర్వతము చిన్న స్తంభమువంటిది అగును. దిక్కులు చిన్న చిన్న బరిణె లగును. త్రిలోకములును గడ్డిపోచ యగును. (వానియందు అనాదరము గలుగుననుట) ఏమహాత్ముడు జ్ఞానమయమగు తనరూపమును శరీరమునకంటె భిన్నమునుగా తెలిసికొనునో, అట్టివానికి సర్వావయవము లును ఛేదింపబడినను ఏమియు ఛేదింపబడినట్లు కానేరదు. ఈదేహము కాని, ఈ అవయవములుకాని, వానివి కావుకదా? ఒకానొక పురుషుడు బెల్లమును భక్షింపుచుండ వానికి అందలిమాధుర్యము అనుభవమునకువచ్చు చుండును. అప్పుడు శరీరమును ఏమిచేసినను వాని మాధుర్యానుభవమును మార్చుటకు వీలుకాదు కదా? బాధలను ప్రత్యేకముగ అనుభవించిన అను భవించును గాక. వాని మాధుర్యానుభవము మాత్రము మారనేరదు కదా? ఇట్లే దేహమునకు ఎట్టి బాధ కలిగినను బ్రహ్మానందానుభవము

నను, లేక, ఆత్మస్వరూపానుభవమునకు మాత్రము ఏమార్పును కలుగదు. పరపురుషునియందు అనురాగముగల స్త్రీ గృహమునందు సర్వకర్మలను అతిజాగరూకతతో ఆచరింపుచునే యున్నను, మనస్సునందు మాత్రము ఎప్పటికిని ఆపరపురుష సమాగమ సుఖమునే ఆస్వాదించు చుండును. దానికి గృహకృత్యములు ఇంచుకయైనను ప్రతిబంధమును కలిగింపవు కదా? ఇట్లే బ్రహ్మానందానుభవ రసికుడు గూడ ఎట్టికార్యములు ఆచరించినను అవి స్వస్వరూపానందమునకు భంగమును కలిగింపజాలవు. ఈవిధముగనే (పైన వర్ణించిన ఉపమానములయందు నిరూపింప బడినట్లుగనే) సత్యరూపమును, నిర్మలమును, సర్వోత్తమమును, అగు పరబ్రహ్మమునందు విశ్రాంతినొందిన ధైర్యశాలి వెలుపలికి ఎట్టికార్యములను ఆచరించువాడైనను లోన అప్పరమాత్మ తత్వమునే సర్వకాలములయందును భావింపు చుండును. కావున సర్వపదార్థ సంబంధమును విడిచి చిత్తము శాంతియగుట ఏదికలదో, అదియే ముక్తి. దానికి దేహముయొక్క కలిమి లేములతో సంబంధము లేదు. దేహము ఉన్నను సరియే, లేకున్నను సరియే. మనస్సు ఒక్కటి మాత్రమే శాంతము కావలయును. కావున చిత్తమును జయింపగలవారలకు ఆముక్తి కరతలామలకమే. ఏమహాత్ముడు ప్రపంచమునందు అభిమానమును వదలి అందుకు అనుగుణముగ జీవించునో, అట్టివాడు జీవన్ముక్తుడు. అభిమానము కలిగి జీవించువాడు బద్ధుడు. జీవన్ముక్తుడే మృతినొందినవాడు విదేహముక్తుడు. అట్టిముక్తుడు శరీరముతో గూడియున్నను రాబోవుదానినిగూర్చి విచారింపడు. జరుగుచున్నదానియందు ప్రేమ నుంచడు. కడచిన దానినిగూర్చి చింతింపడు. సర్వకార్యములను ఎప్పటికే ఏది ఎట్లువచ్చిన అప్పటికి దానిని అట్లాచరించును. తనతో సంబంధమును కలిగియున్నవారలయందును ఆసక్తిని ఉంచడు. దైవభక్తులలో దైవభక్తుడుగాను, మూర్ఖులలో మూర్ఖుడుగాను, బాలురలో బాలుడుగాను, పెద్దవారిలో పెద్దవాడుగాను, ధైర్యవంతులలో ధైర్యవంతుడుగాను, యౌవన వంతులలో యౌవన వంతుడుగాను, దుఃఖించువారలలో దుఃఖించువాడుగాను, విహరించు చుండును. స్వభావముగా ఆతనిచిత్తమునందు ఎప్పటికిని అధైర్యము కలుగదు. ఎప్పటికిని ఆతనియానందమునకు అభావము ఉండదు. మఱియును అతడు మిక్కిలి మృదువైయుండును. అతనిని ప్రశంసించువారలకు గూడ మహాపుణ్యము కలుగును. ఆతడు మహాబుద్ధిమంతుడును, నిత్యశాంతి యుక్తుడును, సర్వజన మనోహరుడును, దీనత అనునది లేనివాడునై ఉండును. మఱియు సూర్యుడు చల్లనై

నను, చంద్రుడు వేడియైనను, అగ్నిహోత్రుడు ఊర్ధ్వముఖముగ ప్రజ్వరి ల్లుట మాని అధోముఖముగ ప్రజ్వరిల్లినను, ఆజీవన్ముక్తునకు ఆశ్చర్యము కలుగదు. ఇవియేగాక ఇంకగూడ ఎట్టి ఆశ్చర్యములు గానవచ్చినను "ఇవిఅన్నియు పరమాత్మయొక్క శక్తులే, బహువిధములుగ గానవచ్చుచున్నవి" అనుతలంపు అమ్మహాత్మునకు చిత్తమునందు దృఢమై యుండును. కావున ఎట్టి ఆశ్చర్యమును ఆతనికి కలుగదు. నీళ్ళు తిరుగుటచేత సుడి ఏర్పడును. బాగుగ విచారించిన ఆసుడికిని నీళ్ళకును భేదములేదు. ఇట్లైనను మనము ఆరెంటిని వేఱువేఱుగ జూచుచున్నాము. ఇట్లే చిత్తమునకును ప్రపంచమునకును భేదము లేకపోయినను భేదమును చూచు చున్నాము. కన్నుచెదిరిన ఆకాశమునందు శూన్యములగు నెమలి ఈకలును ముత్యములును ఉన్నట్లు కానబడు విధమున, మనస్సు చెలించినంత మాత్రమున ఈప్రపంచము లేనిదయ్యును ఉన్నట్లు కానవచ్చును. మఱియును ఒక విశేషము. మంచు తెల్లగానుండును. నువ్వుగింజయందు నూనె యుండును. ఈరెండును పరస్పర భిన్నములుగ (అనగా, "మంచుకంటె తెలుపువేఱు, నువ్వుగింజకంటె నూనెవేఱు") అని వ్యవహరింప బడుచున్నవి కాని, వాస్తవ స్థితిలో భేదము లేదు కదా? ఇట్లే "మనస్సు వేఱు, సంకల్పము వేఱు" అని వ్యవహరించు చున్నాము గాని, వానికి వాస్తవస్థితిలో భేదము లేదు. కావున సంకల్పజయమే మనోజయము.

శ్లో॥ ద్వౌ క్రమౌ చిత్తనాశాయ యోగో జ్ఞానంచ రాఘవ ।
యోగ స్తద్వృత్తిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణమ్ ॥

ఓశ్రీరామా! ఆమనోజయమునకు ఉపాయములు రెండు కలవు. యోగము, జ్ఞానము. అందు యోగమనగా, ధ్యానముచేత దానివృత్తులను నిరోధించుట. జ్ఞానమనగా, విచారమును దృఢముగ గావించి ఆత్మరూపమును ఎఱుగుట. శాస్త్రార్థ వేత్తలగువారు "ప్రాణము చెలించుటయే మనస్సు" అని చెప్పుదురు. కావున ప్రాణ నిరోధము గావించిన ఆమనస్సు గూడ శాంతి నొందును. మనస్సు శాంతినొందగానే, "సూర్యాస్తమయము కాగానే వ్యవహారము శాంతియగునట్లు" ఈసంసారమంతయు శాంతియగును.

—* ప్రాణనిరోధవిచారము. *—

అని వశిష్ఠమహర్షి చెప్పిన విని శ్రీరామచంద్రుండిట్లనియె. ఓవశిష్ఠమహామునీ! ఈప్రాణములు వాయువులు. అవి దేహమునందు ఎప్పుడును సంచ

రింపుచుండును. అవి దేనికిని చిక్కనవి కావు. అట్టివాయువులను నిరోధిం చుట ఎట్లు సాధ్యమగును? అనిన వశిష్ఠమహాముని ఇట్లనియె.

శ్లో॥ శాస్త్రసజ్జనసంపర్క వైరాగ్యాభ్యాసయోగతః ।
అనాస్థాయాంకృతాస్థాయాం పూర్వంసంసారవృత్తిషు ॥

శ్లో॥ యథాభివాంఛితధ్యానా చ్చిరమేకతయోదితాత్ ।
ఏకతత్వఘనాభ్యాసా త్ప్రాణస్పందోనిరుధ్యతే ॥

ఓ శ్రీరామా ! మొట్టమొదట వేదాంతశాస్త్రము, సత్పురుష సమా గమము, వైరాగ్యము, అభ్యాసయోగము ( యమ నియమాదులను ఆచ రించుట ) ఆచరించుటయు, అను వానివలన సంసార వ్యవహారములయందు ఆశ లేకపోవుటను దృఢము చేసికొనవలయును. పిమ్మట అభీష్ట పదార్థమును దేనినైనను ఏకచిత్తముతో ధ్యానింపవలయును. అప్పుడు మనస్సునకు నిలు కడ కుదురును. దానిచేత ఏకరూపమగు బ్రహ్మమును ధ్యానింపవలయును. ఆధ్యానకాలమునందు ప్రాణవాయు సంచారము ఊరకనే నిలిచిపోవును. మఱియు రేచకము ( శ్వాసను వెలుపలికి వదలుట ) పూరకము ( వెలుపలి గాలిని లోనికి పీల్చుట ) కుంభకము ( విడిచిన పిమ్మటగాని, పీల్చిన అనన్త రముగాని, వెలుపలను, లోపలను వాయువును నిరోధించుట. అనగా, పీల్చ కుండనైనను, విడువకుండనైనను, కొంతసేపు ఉండుట ) అను ఈ ప్రాణా యామయోగములను కాలక్రమమున అభ్యాసమును చేసి ఒకటిమాత్రే త్వరప డక సాధించిన దానిచేతకూడ ప్రాణవాయు సంచారమును నిరోధింపవ చ్చును. ఏదియైనను ఒక పదార్థమును ఏకరూపముతో ధ్యానించుటవలన గూడ ప్రాణవాయువును నిరోధింపవచ్చును. ఆధ్యాన సమయమునందు మనస్సు నిశ్చలమగును. కావునను, మనస్సే ప్రాణసంచారము కావునను, ఆసమయమునందు (ధ్యానసమయమునందు) ప్రాణవాయువులు స్వయము గనే చాంచల్యమును విడుచును.

శ్లో॥ ఓంకారోచ్చారణప్రాంతే శబ్దతత్వానుభావనాత్ ।
సుషుప్తేసంవిదోజాతే ప్రాణస్పందోనిరుధ్యతే ॥

ఓ రామచంద్రా! ఓంకారమును ఉచ్చరింపుచు దానినాదము బ్రహ్మ స్వరూపము కావున దానిని సర్వకాలములయందును భావింపుచు దాని ప్రభావమువలన సుషుప్తిరూపమగు చిత్తస్థితి కలుగగా, అప్పుడు ప్రాణ సంచారము స్వయముగనే లీనమగును. చిరునాలుకను నాలుకచేత ఆక్ర మించి శిరమునందు వాయువును కదలక నిల్పిన అప్పుడును ప్రాణసంచా

రము నిరోధింప బడును. ఇదియంతయు గాక ప్రాణవాయువు నాసికా రంధ్రమునుండి వెలుపలికి వచ్చి పంద్రెండు అంగుళములవరకు పోయి అచ్చట స్వయముగనే లయమగును. అట్టి లయ సంకల్పము ఉదయించెనేని అప్పుడును ప్రాణచలనము నిరోధింప బడును. అభ్యాస బలమువలన సుషుమ్నానాడీమార్గముగ ప్రాణమును నడపించుచు పంద్రెండు రేకులుగలఅనాహత చక్రమునందు గాని, ( హృదయ స్థానమునందు గాని ) పదియారు రేకులుగల విశుద్ధచక్రమునందు ( కంఠస్థానముచ ) గాని, సహస్రారము నందు ( శిరస్సునందు ) గాని, నిరోధించి బాహ్యావృత్తిని వదలినచో అప్పుడు ప్రాణవాయు సంచారము అణగును. మఱియు భ్రూమధ్యమునందు చిరకాలము దృష్టిని నిరోధించిన నది క్రమముగ నశించిపోవును. అప్పుడు మనోవృత్తి రూపమగు జ్ఞానము నశించును. పరమేశ్వరుడు ప్రత్యక్షుడగుట చేత చిత్తము లయము నొందును. అప్పుడు వాయుసంచారము సంపూర్ణముగ నణగును. విచారము చేయుచుండగ ఆకస్మికముగ జనించు ఆత్మజ్ఞానము చిత్తమునందు దృఢమై సంకల్పములు నశింపగా ప్రాణవాయు సంచారము తనంతనే అణగును. చిరకాలము మనస్సునందు ఏకరూపమగు చిదాకాశమును ఎఱిగి సంకల్పరహితుడై మౌనమును బూని ధ్యానించుటవలన ప్రాణసంచారము స్వయముగనే అణగును. ఇంతమాత్రమేకాదు, ప్రాణనిరోధమునకు మఱియును అనేకమార్గములు కలవు. అన్నియు సంకల్పాధీనములే. కావున కాలోచితముగా అనేక ఉపాయములను కల్పింపవచ్చును. అనేకగురువులు తమ మాహాత్మ్యమువలన శిష్యానుగ్రహార్థమై బహువిధ ఉపాయములను ఉపదేశించుచుందురు. ఇట్లు దేనిని ఆశ్రయించినను ప్రాణవాయు సంచారమును నిరోధింప వచ్చును.

—✱ చకటిని జ్ఞాననిరూపణము. ✱—

ఓరఘురామా! పైన వివరింపబడిన యోగములు కొంత కష్టతరములుగా గానవచ్చుచున్నను, సంసారదుఃఖమును భేదించుటకు చకటిని ఉపాయము లగుటచేత అవశ్యము ఆచరింప వలసినవియె. స్థూలదృష్టికి ఇవి అన్నియు గొంత శ్రమకరములుగా నున్నను అలవాటుపడిన పిమ్మట మిక్కిలి అనాయాసకరములే అగును. వీటిని అభ్యసించుటవలన ప్రాణసంచారము అణగిన మనస్సుకూడ తక్షణమే అణగును. అప్పుడు ఈ ప్రపంచమంతయును మనశ్చాంచల్యరూపమే. కావున, ఈ ప్రపంచమును దానితో కూడ అణగును. కావున అప్పుడు స్వస్వరూపము ఒకటియే మిగులును.

అని వశిష్ఠమహర్షి చెప్పిన శ్రీరామచంద్రుండిట్లనియె. ఓమహాత్మా! యోగాభ్యాసమువలన చిత్తమునకు శాంతికలుగు విధమును తెలియజేసితిరి. ఇప్పుడు జ్ఞానమనగా ఎట్టిదో దానివలన చిత్తశాంతి కలుగుట ఎట్లో ఆవిధమును తెలియజేయుడు. అనిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓ రఘురామా! వినుము. "ఈ ప్రపంచమంతయును ఆత్మరూపమే" అని తలుచుట ఏదికలదో, అదియే పరమార్థజ్ఞానము. అదియే సర్వపరిపూర్ణత్వము. ఇట్టిజ్ఞానమును ఆశ్రయించుటవలన పరమవైరాగ్యముతో ఒప్పుచున్నదియు సర్వసంకల్పములు లేనిదియు, అలవాటువలన క్రమక్రమముగ దృఢమైనదియు నగు ప్రాణాయామము ఫలవంతమగు ప్రాణాయామము. యోగాభ్యాసమువలన మాత్రమే గలిగిన ప్రాణాయామము ఉపాయభూతమగు ప్రాణాయామము. యోగాభ్యాసానుసారముగ జేయబడు ప్రాణాయామము కష్టసాధ్యము. జ్ఞానానుసారముగ ఆచరింపబడు ప్రాణాయామము అతిసులభసాధ్యము. పరమాత్మ రూపమును ఎఱుగుటతోడనే ప్రపంచభ్రాంతి తొలగును. సంస్కారములు నశించును. ఇట్లు చిత్తజయమైన ప్రాణములు ఇక ఏమిచేయగలవు? ప్రత్యేకముగ దానిని బంధించు ప్రయత్నము చేయనక్కఱలేదుగదా? ఇట్లు ఆత్మరూప జ్ఞానముచేత మనోరూపములగు సంకల్పములు నశించినతోడనే సంకల్పరూపమగు ప్రపంచముగూడ నశించును. అప్పుడు సంపూర్ణములగు ప్రపంచ కల్పనలతో ( ఈ ప్రపంచము నామమాత్రమే. కావున ఆనామములతో ) కూడిన వాక్కులు ఏస్థలమునకు బోనేరవో, అట్టి పరమపదము ( వాక్కులకు అగోచరమగునట్టి పరబ్రహ్మము) మాత్రమే స్వ స్వరూపముతో మిగులును. కావున చక్కని జ్ఞాన స్వరూపమునే వివరించెదను వినుము. "కుండ, గుడ్డ, మొదలగు అనేక రూపములతోనున్న శక్తులు ( సంకల్పశక్తులు వస్తువులనుట ) పరమాత్మకంటె భిన్నములుకావు. పరమాత్మ ఒక్కడే ఆయా ఆకారములతో ప్రకాశించుచున్నాడు" అను నిశ్చయము ఏదికలదో, అదియే పరమార్థజ్ఞానము. "ఈ ప్రపంచమునందు పరమాత్మ ఒక్కడే కలడు. ఈ యనకు ఆద్యంతములు లేవు. ఈ యన స్వప్రకాశ స్వరూపుడు. ఈ యనకును నాకును భేదము లేదు. ఈయనకంటె భిన్నమగునది ఒక్కటియు లేదు." అను నిశ్చయము ఏదికలదోఅదియే యథార్థజ్ఞానమని పెద్దలు చెప్పుదురు.

ఓ రామచంద్రా! సర్వశాస్త్రములయందును "ఈసర్వము పరమాత్మయే" అని నిర్ణయింపబడి యున్నది. పెద్దలందరును అట్లే అంగీకరించి

యున్నారు. ఇట్లు ఆత్మభిన్నమగు పదార్థమే లేదనిన ఇక కలిమిలేములు ఎక్కడివి? బంధమోక్షములు ఎక్కడివి? ఇట్లు సర్వమును ఏకరూపమై యుండ నీవు దేనినిగూర్చి శోకింపుచున్నావు? నిరర్థకముగ ఏదియో ఒకటి నిన్ను బాధింపుచున్నట్లు తలంచి నగవ నేటికి? బాగుగ చూచినదృశ్యమును లేదు. దానికి కారణమగు మనస్సును లేదు. సర్వమును ఏకరూపమగు పరబ్రహ్మమే. అదిఒక్కటియే నానావిధములుగ ప్రకాశించుచున్నది. ఇట్లుండ మోక్షము ఎక్కడిది? బంధము ఎక్కడిది? ఏకరూపమై మిక్కిలి గొప్పదియై సర్వప్రసిద్ధమై ఉన్న ఆబ్రహ్మమే నీఆత్మ ( నీవు ) అట్టిఆత్మవేయై నిలువుము. స్వయముగనే అట్టిస్థితిని సంపాదించుకొనవలయును. జ్ఞానము ఒక్కటియే ఆటంకముకాని, అట్టి స్థితి నీకు ఎప్పటికిని స్వతస్సిద్ధమయ్యే ఉన్నది కదా? మఱియు బాగుగ విచారించిన, కట్టె, రాయి. వస్త్రము, మొదలగు పదార్థములకుగూడ భేదములేదని స్పష్టమగును. ఆభేదము చూచువానిని ఆశ్రయించియే వచ్చును " ఇది దీనికంటే వేఱు" అని తెలిసికొనవలసినది చూచువాడే కదా? ఇకవిచారించిన ఆ చూచువాడే ఆత్మ. ఆత్మకు ఉనికే స్వరూపముకావున ఆతనికంటె భిన్నమగు పదార్థము ఏదియును ఉండరాదు. ఉనికికి భిన్నముగ మఱియొక పదార్థము ఉన్నదనుటకు వీలు లేదు. దానికి వ్యతిరేకమైనది లేమియే కావున అది కలదన్నను లేదన్నను ఒక్కటియే. కలదనినచో లేమికిని విరోధము కావున అది ( కలదనుట ) సంభవింపదు. లేదనినచో అదిలేమియే కావున దానినిగూర్చి అట్టి వ్యవహారమే మొట్టమొదట యుక్తము కానేరదు. ఇట్లుగాక " లేమి అను ఒక్కపదార్థము కలదు" అని పట్టుపట్టినను ప్రయోజనము లేదు. అప్పుడు అదియు కలది కావున కలిమియే కావలసి వచ్చును కదా? కావున ఎట్లు చూచినను ఆత్మ భిన్నముగ మఱియొక పదార్థము ఉండుటకే వీలులేదు. కావున భేదము కాని, దానికి ఆధారములని చెప్పబడు పదార్థద్వయము కాని, బొత్తిగనే లేదనవలయును. ఇట్లుండగ నీవు దేనినిగూర్చి సంకల్పింతువు? దేనితో సంకల్పింతువు. కావున నోరఘుకులతిలకా! ఆదియందును అంతమునందును శాంతమై సర్వవస్తువులకును నీకును స్వరూపభూతమై ఏపదార్థముకలదో, ఆరూపము నొందుము. సముద్రము స్వయముగనే అలలచేత అనేక భేదములు కలదియగునట్లు అభేదముగగూడ ఉండునట్లు, పరమాత్మ ఒక్కడే భేదాభేదరూపములతో గూడి ఉత్పత్తియు, మునకలిటనము మరణము అనుమొదలగు బహువిధ భ్రాంతులతో గూడినట్టియు, చిత్తవశమున ( సంక

ల్పములే చిత్తమునకు స్వరూపములు కావున సంకల్పభేదములను ఆశ్రయించి చిత్తభేదములు చెప్పబడినవి ) బహురూపములతో తోచుచున్నాడు. సర్వకాలములందును అంతర్ముఖమగు బుద్ధితో నిర్మలుడగు ఆత్మను ఆలింగనము గావించుకొని సుఖించు మహాత్ముని విభోగము బంధమును కలిగింపగలదు? సంపూర్ణమగు విచారము గలిగి ప్రకాశించు మహాత్ముని మెల్లనిగాలి పర్వతమును కదలింపలేనట్లు" మనస్సు భోగములు కామక్రోధములు మొదలగు శత్రువులు కదల్పలేరు. "సరస్సులు ఎన్నివిధములుగా నున్నను, అందలి జలమంతయు నొకటియే అయినట్లు వస్తురూపములగు సంకల్పములు ఎన్నివిధములుగా పుట్టినను అందలి పదార్థము మాత్రము ఒకటియే. భేదమనునది లేనేలేదు" అను దృఢనిశ్చయము ఏమహాత్మునకు ఉండునో, వాడే పరమార్థమును ఎఱిగినవాడు. వానిని ముక్తునిగా మహాత్ములు చెప్పుదురు.

## —* వీతహవ్యో పాఖ్యానము. *—

ఓ రామచంద్రా! ఇది అంతయుగాక మఱియొక క్రొత్త విషయమును నీకు ఉపదేశించెదను. ఈ స్థితిని అవలంబించినను సుఖముగ ముక్తిని పొందవచ్చును. వీతహవ్యుడను మహాముని ఈ స్థితినే ( చెప్పబోవు దానినే) ఆశ్రయించి సర్వసంశయ రహితుడై సుఖించెను. దానిని వినుము. వింధ్యారణ్యమునందు ఒకానొక ప్రదేశమున అరటిపట్టలచేత పర్ణశాలను ఏర్పరచుకొని వీతహవ్యుడను ఒకమహాముని వసించుచుండెను. కర్మకాండను ఆశ్రయించి నానావిధ శ్రమలకు ఓర్చి బహువిధ కర్మలను ఆచరించుచుండెను. తానుచేయు కార్యములన్నియు మిక్కిలి భయంకరములగుటయు అంతకంతకు సంసారమును అభివృద్ధిచేయునవియే యగుటయు, భ్రాంతిని పెంచునవియే యగుటయు, మనోవ్యాధులను గలిగించునవియే యగుటయు, శరీరమునకు బహువిధములగు బాధలను బొందించునవి యగుటయు, తెలిసికొని విసుకుజెందెను. శాస్త్రాభ్యాసము కలవాడుకావున "చిత్తశాంతికి నిర్వికల్పసమాధికంటె అన్యమగు ఉపాయము ఎద్దియు లేదు" అనుచు తన పర్ణశాలలోనికి పోయెను. అట్లుపోయి సర్వకర్మలను పరిత్యజించి నిర్వికల్ప సమాధియందు నిలువ నిశ్చయించెను. ఇట్లు నిశ్చయించి ఆ పర్ణశాలయందు సమమగు స్థలమున ఒక ఆసనము అమర్చి దానిపై కృష్ణాజినమును పరిచి కూర్చుండెను. తర్వాత సిద్ధాసనమును అమర్చుకొని మడమలపై తన చేతివ్రేళ్ళనుంచెను. ఇట్లు కూర్చుండి స్థిరుడై లోపల వెలుపల

నున్న సర్వపదార్థములను క్రమక్రమముగ నిషేధింపుచు సర్వదిశలయందు ను అల్లుకొనియున్న మనస్సును క్రమక్రమముగ మరలించెను. పిమ్మట ఆమనస్సు స్థిరముగుటకై ఈ క్రింద చెప్పబోవు విషయమును విచారించుకొనెను. ఆతని మనస్సు సర్వ పాప రహితముగుటచేత చక్కని ఆలోచనను కావించుటకు అనువై యుండెను.

—* వీతహావ్యుని విచారము. *—

ఆహా, ఇదియేమి ఆశ్చర్యము. నామనస్సు సర్వపదార్థముల నుండియు మరలింప బడినదైనను, అలల నడుమనున్న ఆకువలె నిలుకడను జెందకున్నది. కోతి ఒకవృక్షము మీదినుండి మఱియొకవృక్షము మీదికి దుముకునట్లు ఈ మనస్సుగూడ ఒకపదార్థముమీదినుండి మఱియొక పదార్థముమీదికి దుముకుచున్నది. ఘటముమీదినుండి పటముమీదికిని మరల పటముమీదినుండి ఘటముమీదికిని గంతులు వేయుచున్నది. ఈమనస్సు చలించుటకు నేత్రము మొదలగు జ్ఞానేంద్రియములు అయిదును, ద్వారములు. ఓ ఇంద్రియములారా! మీకును నాకును ( ఆత్మకును ) సంబంధము లేదు. కేవలము భ్రాంతి వలన అట్లు తోచుటయే కాని, " పాతాళ దేవలోకములకు చేరిక గలుగునట్లు" మీకును నాకును చేరిక ఎన్నటికిని కలుగనేరదు " మీరు నాకంటె వేఱు" అను విషయము స్పష్టముగనే తెలియ వచ్చుచున్నది. ఓ మనస్సా! నీవు సర్వలోకములను తిరుగుచున్నావు. నాస్తిక మతమును అవలంబించి " ఈ ప్రపంచమంతయును ఎట్లు కనబడుచున్నదో అట్లే యున్నది. ఇంతకంటె భిన్నమగు పరమార్థము లేదు. " అను నిశ్చయముతో ఉన్నావు. దిక్కులయందెల్లను ఎంతకైనను తృప్తినొందక బిచ్చ మెత్తుచున్నావు. ( విషయములను గోరుచు మనస్సు పలువిధములకు బోవుచున్నదనుట. ) ఈ కార్యమంతయు నీకు చేయనేమిటికి? లోకమునందుకల పదార్థము ఒక్కటియే. నిరర్థకముగ భేదమును భావించి సంచరింపనేటికి? దుఃఖింపనేటికి? ఓమనస్సా! నీవు మూఢుడవు. " నేను చేతన స్వరూపమును " అనితలంచుచున్నావు. కొంచెమైనను విచారింపలేక పోతివేల?నీస్వరూపము సాక్షికి గోచరము అగుచున్నదనుట స్పష్టమేకదా? చేతనమగు పదార్థము మఱియొకపదార్థముచేత చూడబడదనుటయు, స్పష్టమేకదా! చూచుదానికిని జూడబడుదానికిని ఐక్యము సంభవింపదనుటయు నిర్వివాదమేకదా? ఇట్లుండగ నీవుచేతన రూపము కలదానవు ఎట్లగుదువు? కావున నీభావన వాస్తవమైనది కాదు. మఱియు నీవు " నేనుజీవుడను " అని ఒక అభిప్రాయము కలిగి

ఉన్నావు. అది అహంకారమువలన కలిగిన దుర్బుద్ధి. అసత్యమైనది. దానివలన నీకు దుఃఖమేకాని, సుఖమేమియు లేదు. ఆభావనవలన నిరర్థకముగా కర్తృత్వాది రూపమగు సంసారమునంతయును మీదికి త్రోసికొనుచున్నావు. కావున ఇకనైనను, ఈ వ్యర్థసంకల్పమును విడువుము. నీవు ఆత్మవిచారము కలిగిన ఉత్తరక్షణమునందే నశించిపోవుదువు. కావున నీకు నో మనస్సా! విచారశూన్యతయే స్వరూపము. ఓమనస్సా! నీవు భూతకాలమునందు పుట్టలేదు, భవిష్యత్ కాలమునందును పుట్టబోవు. వర్తమానకాలమునందును నీరూపము శూన్యరూపమే. ఇట్టినీకు శుభమగును గాక. ఇప్పటికి నా అదృష్టమువలన శాంతి దొరికినది. తాపములు నశించినవి. నిర్వాణమును జెందితిని. తుర్యమని చెప్పబడు స్థితిని ఆశ్రయించి ఆత్మయందే సుఖముగ నిలచి యుందును.

ఓ ఇంద్రియములారా! మీరు నిరర్థకముగ " మేము కార్యములను చేయుచున్నాము " అని అభిమానమును అవలంబించి ఏల వ్యాకులత్వమును చెందెదరు. మీరు ఏకార్యము చేయువారలుకారు. భగవంతుడును ఉత్పత్తిప్రళయములు లేనివాడును, జ్ఞానరూపుడును అగు పరమాత్మడే శ్రీమూలమున సర్వకార్యములను చేయుచున్నాడు. ఇట్లగుటచేత మీరు అజ్ఞానమును పొంది నిరర్థకముగ చెడిపోకుడు. ఇంతమాత్రమువలన ఓమనస్సా! ఈ ఇంద్రియములకును ఆత్మకును, సంబంధముకలదని కాని, ఇంద్రియములే ఆత్మ, అని కాని, భావింపబోకుము. ఆత్మ ఇంద్రియములకు సాక్షి. కావున ఆరెంటికిని ఇంద్రియములకును, ఆత్మకును, సంబంధము సంభవింపదు. చూడబడువానికిని, చూచువానికిని, ఏవిధమగు సంబంధమును ఉండుటకు వీలులేదుకదా. కావున త్రోవనడుచువాడు సర్పములను చూచిన భయముచేత వానికంటె అతిదూరమునందు నిలుచునట్లును, బ్రాహ్మణుడు చండాలురజూచిన బహుదూరమునందే ఉండునట్లును, ఈ జ్ఞాన రూపుడగు ఆత్మయు ఇంద్రియములకంటె బహుదూరమునందు ఉన్నాడు. ( ఇంద్రియములకును ఆత్మకును సంబంధము లేదనుట ) సంకల్పములను ఆచరించుటయే దుఃఖకరమైనది. మొట్టమొదట అట్టి ఆచరణముకూడ సంభవింపనే సంభవింపదు. ఏలయనగా:—పరమేశ్వరుడు, ప్రపంచము, అనునవి రెండే, భేదదృష్టి గలవారికిగూడ దోచు పదార్థములు. చేతనాచేతనములకంటె ఇతరములగు భేదములే లేవుకదా? అందు దేహముకాని, మనస్సుకాని, సంకల్పింప గలవేమో అనిన, ఇవి అచేతనములు. ఇక పరమేశ్వరుడు సంక

ల్పించుననిన అదియు సరి కానేరదు. ఆయనకు సాధనము లేవియు లేకపో వుటచేత ఏకార్యమును చేయుటకు వీలులేదు. ఇట్లుండగా, ఇక సంకల్పము ఎక్కడనుండి వచ్చును? కావున దృశ్యసంబంధము లేని చైతన్యమే సారభూత మైనది. దానికంటె భిన్నమగు పదార్థము వేఱే ఒకటి లేదు. ఓ శ్రీరామ చంద్రా! ఈ విధముగ నిర్ణయించుకొని ఆవీతహవ్యమహాముని బలాత్కారముగ మనస్సును శాంతిజేసి ఇంద్రియములను చలింపనీక నిర్వికల్ప సమాధి యందు నిలచెను. అతనికి సంపూర్ణముగ సంస్కారములు నశించెను. "అగ్నిహోత్రుడు జ్వాలలచే చలించుచుండియు తనయందు వేయబడియున్న కట్టెలు కాలిపోగానే తనంత తానే అణగిపోవునట్లు" ఆతని ప్రాణవాయువులు మనోనాశము కాగానే స్వయముగనే అణగెను. అమ్మహాత్ముని నేత్రములు నాశికా సమీప భాగములను చూచుచున్నవో, అనునట్లు సగము మూతబడి సగము ముకుళించిన కమలములయొక్క కాంతిని పొందినవి. ఇట్లు నిశ్చలుడై శరీరము, తల, మెడ, అనుదానిని చక్కగ నిలిపి పర్వతమునుండి క్రిందబడిన రాతివలెను, చిత్తరువునందు వ్రాయబడిన బొమ్మ వలెను, నిలచి యుండెను. ఇట్లు అమ్మహాముని సమాధినిష్ఠుడై ఆపర్ణశాల యందు కూర్చుండి యుండగ ఒక నిమిషకాలమువలె మున్నూఱు సంవత్సరములు గడచిపోయెను. ఇట్లు కాలము గడచుకొలది ప్రతివర్షా కాలమునందును అమ్మహాత్ముని శరీరముపై వర్ష వేగమువలన బురద ఎగిరి పడుచుండెను. ఎండకాలమునందు అది చక్కగ ఎండుచుండెను. ఇట్లు అనంతముగ పడిన బురద చేతను, వానకు వింధ్యపర్వతముమీదినుండి కొట్టుకొని వచ్చిన మట్టిచేతను, అమ్మహాత్ముని దేహము ఒకమట్టిదిబ్బవలె ఏర్పడెను. ఇట్లు మున్నూఱు సంవత్సరములు గడువగానే అమ్మహాత్మునికి ఒకనాడు మెలుకువ వచ్చెను. బురదయందు పూడియున్న దగుటచేత ఆతనిశరీరము మాత్రము కదలలేదు. అందు జ్ఞానము మాత్రమే ప్రవేశించెనేగాని, ప్రాణము మాత్రము ప్రవేశింపలేదు. చలింపలేదు. సర్వరంధ్రములు నిరోధింపబడి యుండుట దానికి (ప్రాణవాయు చలనమునకు) ఆటంకమై యుండెను. అంత సంకల్పరూపమగు మనస్సు హృదయమున పుట్టి అభివృద్ధియై లోలోననే సంచరింప సాగెను. అప్పుడు ఆమనస్సునందు కొన్ని సంకల్పములు పుట్టినవి. ఆసంకల్ప ప్రభావమువలన, అమ్మహాముని కైలాస పర్వత సమీపమునందు ఒక మహామునియై నూఱుసంవత్సరములు నివసించెను. అప్పుడును పూర్వజన్మమునందు సంపాదింపబడిన దివ్యజ్ఞానమువలన జీవన్ముక్తుడై

యయుండెను. ఒక కడిమిచెట్టు అప్పుడు నివాసస్థానమై యుండెను. మఱియు దుఃఖము కొంచెమైనను లేకుండ విద్యాధరుడై నూఱుసంవత్సరములు నివసించెను. దేవతలచేతను సిద్ధచారణాదులచేతను నమస్కరింపబడుచు అయిదు యుగముల కాలము ఇంద్రుడై ముల్లోకములను పరిపాలించెను. ఒక కల్పమువరకు ఈశ్వరునివద్ద ప్రమథగణములలో నొకడై సంచరించెను. పిమ్మట మరల పూర్వదేహమునే ( వీతహవ్యుడను పేరుగల దేహములోనే) ప్రవేశించి ఆతని మనస్సు " పూర్వజన్మములను అవలోకింతునుగాక" అని సంకల్పించెను. వెంటనే కరతలామలకమువలె వెనుకటి దేహములు అనేకములు ప్రత్యక్షముగా గానవచ్చినవి. అందు కొన్ని భస్మీభూతములయ్యు, కొన్ని భూమిలో చివికిపోయియు, మఱియు అనేక విధములుగా నశించిపోయియు, ఉండెను. కొన్ని వినాశోన్ముఖములై ఉండెను. కొన్ని ఇంకనూ నశింపలేదు. అందు వీతహవ్యుడను పేరుతో ఉన్న ప్రస్తుత దేహము మట్టితో పూడుపబడి ఉన్నను, చెడిపోలేదు. కైలాసారణ్యమునందు మునియగుట మొదలగునవి సంకల్ప ప్రభావమున అత్యల్పకాలమునందే జరిగియుండుటచేతనో. లేక, బహుకాలమైనను యోగాభ్యాస బలమువలన ప్రాణవాయువు నిరోధింపబడి ఉండుటచేతనో, ఆతనిదేహము నశింపలేదు. అట్టి దేహమును చూచి అమ్మహాముని ఇట్లని విచారించెను. నా దేహము బురదలో అణగిపోయి ఉన్నది. దీనిని లేవనెత్తుటకై ప్రయత్నింప వలయును. ఇది నాచేత నగు పనికాదు. నేను సూర్యునియందు ప్రవేశించెదను. అప్పుడు అమ్మహాత్ముని పార్శ్వమున నివసించుచున్న పింగళుడు ఈదేహమును లేవనెత్తును. అనినిశ్చయించి సూక్ష్మశరీరధారియై, " గాలి తోలుతిత్తిలో ప్రవేశించునట్లు ఆతడును సూర్యునియందు ప్రవేశింప యత్నించెను. ఆసూర్యుడును తనయందు ప్రవేశించుటకు వచ్చుచున్న అమ్మునిని జూచి అతని అభిప్రాయమును ఎఱింగినవాడు కావున అతని శరీరమును పైకెత్తుటకై పింగళునకు ఆజ్ఞ చేసెను. మఱియు వీతహవ్యుడను పేరుగల ఆమనస్సును సూర్యునివద్దనుండి సెలవు తీసికొని సూర్యుని ఆజ్ఞచే వింధ్య పర్వతప్రాంతమునకు బోవుచున్న పింగళుని వెంబడి వచ్చెను. అంతనా పింగళుండును, పొదలచేతను, పర్వతగుహలచేతను, మిక్కిలి మనోహరమై వర్షాకాలమునందు నేలకువాలియుండు మేఘమువలెనున్న వింధ్యారణ్యమును జేరెను. ఇట్లుచేరి మునియొక్క శరీరము ఉన్నచోటికి పోయి గోటితో పైనున్నమంటిని పెల్లగించి ఆతని శరీరమును పైకి లేవనెత్తెను. జలములందు

నివసించు సారసపక్షి తామరతూడును పైకెత్తునట్లు అతి సులభముగా పైకెత్తెను. అమ్మునియొక్క శరీరము మాత్రము ఏమియు జెడక మిక్కిలి మనోహరమై యుండెను. పిమ్మట ఆమునియొక్క సూక్ష్మ శరీరము ఆస్థూలదేహమునందు ప్రవేశించెను. అతర్వాత పింగళుడు సూర్యమండలము జేరెను. అమ్మునియును స్నానార్థమై సరోవరమును జేరెను. ఇట్లు సరోవరమును చేరి ఆవీతహవ్యుడు వికసించిన కమలములతో మనోహరమైన ఆ సరోవరమునందు స్నానము చేసి జపమును ముగించి సూర్యుని పూజించి యథాపూర్వముగ సర్వవ్యవహారములను ఆచరింపుచు విహరించెను.

ఓ రఘురామా! పిమ్మట అమ్ముని మైత్రితోను, సర్వసమత్వముతోను, సర్వమును నిర్వహింపగల సామర్థ్యముతోను, శ్రేష్ఠమగు జ్ఞానముతోను, సంతోషముతోను, దయతోను, కాంతితోను, కూడినవాడై సర్వవిషయములయందును అభిమానమును వదలి ఆవింధ్య పర్వతమునందు నర్మదానదీతీరమున నివసింపుచు కాలముగడపెను. ఇట్లు సంచరింపుచు వృష్టి యొక్క సమయమునందు అమ్ముని సమాధిని అవలంబింప సంకల్పించెను. ఆ కార్యమును ఎఱిగినవాడగుటచేత మనస్సును మనస్సుతోనే బంధించెను. మఱియు ఇట్లని విచారించెను. ఇంతకు పూర్వమే నేను సర్వేంద్రియములను నిగ్రహించితిని. ఇప్పుడు మరల దేనినిగూర్చియు చింతింప అవసరము లేదు. కావున ఇప్పుడు "కలదు. లేదు" అను సంకల్పములను సంపూర్ణముగ పరిత్యజించి మిగిలియున్న ఆత్మ తత్వమునందు నిలచి పర్వత శిఖరమువలె నిశ్చలుడనై మాత్రమే ఉందునుగాక. దివ్యజ్ఞాన సంపన్నుడ నగుటచేత అత్యంత అభ్యుదయమునొందియు మనోనాశమువలన అస్తమిత ప్రాయుడనై అస్తమించియును ఉదయించినవానివలె ప్రకాశమానుడనై సర్వ సముడనై ఏకరూపమగు ప్రకాశముతో అతి నిర్మలుడనై ఉందును. ప్రబోధమును (ఒక అర్థమునందు మెలకువ, రెండవఅర్థమునందు జ్ఞానము) జెంది యు సుషుప్తి (ఒక అర్థమునందు నిదుర, రెండవఅర్థమునందు బ్రహ్మనిష్ఠ ను) ఆశ్రయించినవాడనై సుషుప్తిని జెందియు ప్రబోధమును ఆశ్రయించి తుర్యావస్థనుజెంది స్తంభితునివలె శరీరమునందే నిలచియుందును. అని ఇట్లు నిశ్చయించి ఆత్మధ్యానమును అవలంబించి ఆఱుదినములు అట్లే యుండెను. పిమ్మట త్రోవనడుచువాడు తగినస్థలమున క్షణము సేపు నిదురించి మేలుకొనునట్లు మెలకువ జెందెను. ఓరామచంద్రా! ఈ విధముగ అమ్ముని సిద్ధుడై లోకోత్తరమగు జీవన్ముక్త స్థితితో యథేచ్ఛముగ విహరింపుచుండెను.

అప్పటిస్థితి అతి విచిత్రమైనది. అమ్మహాముని కి విడువదగినవి అనియు, అంగీకరింప దగినవి అనియు లేకుండెను. దీనివలన కొన్నిటిని గ్రహించుట, మఱి కొన్నిటిని విడుచుట, అనునవియే లేకపోయెను. ఇట్లగుటచేత అతని మనస్సునందు కోరికగాని, కోరికలేకుండుటగాని, లేక పోయెను. ఇట్లు విహరించుచుండి ఆమహాతపస్వి కొంతకాలమునకు జన్మపరంపరకును, కర్మపరంపరకును, పొలిమేరయై సంసారాభిమానమునకు తుదియై ఉన్న విదేహముక్తియందు సంపూర్ణమగు కోరికను పొందెను.

—* వీతహవ్యుడు విదేహముక్తిని జెందుట. *—

అంతట ఒకనాడు అమ్మహాముని పర్వత గుహను ప్రవేశించి అందు ఆసనముపై సిద్ధాసనము వేసికొని కూర్చుండి తనలో ఇట్లనుకొనియెను. ఓరాగమా! ( ఇష్టవస్తువులను అనుభవింపవలయుననుకోరిక ) నీవు నీస్వరూపమును విడువుము. ఓద్వేషమా! నీవు నీస్వరూపమును పరిత్యజింపుము. మీరు నాతో చాలాకాలమునుండి ఆడుకొంటిరి. ఇకను నన్ను విడచి పొండు. ఓ సుఖభోగములారా! మీకొక నమస్కారము. పిల్ల వాండ్రు పిల్లవానిని ఆడించినట్లు మీరు బహుజన్మములనుండియు, నన్ను ఆడించితిరి. ఓ సుఖమా! నీవు నామీద బహు చమత్కారమును చూపితివి. పరమ శాంతిరూపమగు ఈ మోక్షము ఎంత సుఖకరమైనను ఎంతస్వభావ సిద్ధమైనను దీనిని మరచునట్లు చేసితివి. దీనివైపు తిరుగనైన తిరుగకుండు నట్లు మోసగించితివి. నీకొక నమస్కారము. ఓ దుఃఖమా! నీవు నాకు మహోపకారివి. నీవు నాచిత్తమును కలచుటచేతనే నేను ఈ స్థితిని వెదకి కొంటిని. నీవు నావద్దకు రాకుండిన నాకు ఇట్టిస్థితియే దొరికియుండదు. కావున ఇదియంతయు నీ అనుగ్రహమే. కాబట్టి నీకొక నమస్కారము, బహుకాలమునుండియు, బంధువుడవై నన్ను విడువక నివసించియున్న ఓ కార్యమిత్రమా! ప్రియమిత్రమా! ఆత్మజ్ఞానము దొరుకుట చేత నిన్ను విడుచుచున్నాను. అవివేకము వలన నిన్ననీవే నాశముచేసికొంటివి. ఓ ఆశా! తల్లీ! నీవు సంసారకాలమునందు నన్ను సర్వకార్యములయందును శ్రద్ధాపూర్వకముగా ప్రవర్తించునట్లుచేసి రక్షించుచుంటివి. నీప్రసాదమువలన నేడు నాకుశాంతికలిగినది. ఈ శాంతివలన నేను ఒంటరిదానినిగా చేసి, విడిచితిని. నీకు ఇప్పుడు దీనత్వము కలిగినది. తాపము సంభవించినది. అయినను నీవు నాకై శోకింపకుము. నీకొక నమస్కారము. ఓ మన్మథుడా! భగవంతుడా! నీ విషయములో నేను కావించిన అపరాధములు ఏవియైన గలిగిన వానిని క్షమింపుము.

ఇప్పుడు పరమశాంతిని చెందబోవుచున్నాను. దయచేత నన్ను ఆశీర్వదింపుము. ఓ దేవా! పుణ్యమా! నీకు నమస్కారము. నీవు సంసార కాలమునందు మిక్కిలి కరుణ బూని నన్ను నరకములనుండి ఉద్ధరించి స్వర్గమునందు నిలుపుచుంటివి. పైన వర్ణింపబడిన ఓ రాగాదులారా! మీరు నాతో కూడ పుట్టి సర్వకాలములయందును నన్ను విడువక ఉన్న స్నేహితులరు. మిమ్మందఱిని ఇప్పుడు విడుచుచున్నాను. ఓ ప్రాణములారా! మీకుమంగళ మగును గాక. నేను పోయివచ్చెదను. ఓ సత్యపరాక్రమా! రామా! ఆ వీతహవ్యుడు తన మనస్సునందు పైన వర్ణించిన విధముగా చింతించి సంకల్పములను, ఇచ్ఛలను, వదలి మెల్ల మెల్లగా ఓంకారమును ఉచ్చరింపుచు ఒక్కొక్క మెట్టుగ ఎక్కిపోవ నారంభించెను. మొట్టమొదట వెలుపలనుండు పదార్థములను పరిత్యజించెను. పిమ్మట లోపలనుండు పదార్థములను గూడా విడిచెను. మొట్టమొదట స్థూలములగు వాని విడిచి పిమ్మట సూక్ష్మములగు వానిని గూడ పరిత్యజించెను. ఇట్లగుటచేత సర్వసంకల్పములను అణచెను. సర్వపదార్థములును సంకల్ప మయము లేకదా? ఇట్లు చిత్తమును నిరోధించి బ్రహ్మమునందు చేర్చి ఓంకారోచ్చారణమువలన గలుగు శబ్దమనియెడి దారముచేత (బ్రహ్మరూపస్థితిచేత ఓంకారనాదమునే యోగశాస్త్రజ్ఞులు బ్రహ్మమనుచున్నారు) సర్వేంద్రియములను సర్వభూతములనుకూడ లోనికి ఆకర్షించెను. వాయువు, గంధమును తనయందు లయమునొందించుకొనునట్లు స్వస్వరూపమునందు లయము నొందించెను. ఇట్లు సర్వమును ఉపసంహరించినను, వాసనాబలమువలన అజ్ఞానము మాత్రము "ఆకాశమునందు చీకటివలె" నొక్కింత తలయెత్తెను. కొంత విజృంభింప వలయునని ప్రయత్నించెను. అంత అమ్మహామునియు, "బుద్ధిమంతుడగువాడు అల్పక్రోధమును ఒక్క క్షణములో అణచునట్లు" దానిని ఒకక్షణములో ధ్వంసము చేసెను. ఇట్లు చీకటిపోగానే ఒక వెలుగు ఆవిర్భవించెను. దానిని చూడగానే కొంతసంశయము గలుగుటచేత అమ్మహాముని ఒక్కింత విచారించి "ఆత్మ తేజోరూపుడునుకాడు, అంధకార రూపుడును కాడు" అని నిశ్చయించెను. తత్క్షణమే జ్ఞానప్రభావమువలన ఆ తేజస్సు కూడ నశించుటచేత అట్టిరూపముతోనే (చీకటియు వెలుతురునుగాని రూపముతోనే) నిలచెను. ఇట్లు తమోగుణ రూపమగు చీకటిని, సత్వగుణ రూపమగు వెలుతురునుకూడ వదలి త్రిగుణాతీతమగు దశను జెంది స్థిరుడై ఉన్నను మనస్సనియెడి గడ్డిపోచ తన చాంచల్యమును సంపూర్ణముగా విడువ లేకుండెను. అయి

నను పరబ్రహ్మానందమును రుచిచూచినది కావునను, తన విజృంభణకు సహాయకారులగు సత్త్వాదిగుణములు నశించిపోయినవి కావునను, ఒక్క అర నిమిషమున అణగిపోయెను. అప్పటికిని తత్క్షణమేపుట్టిన శిశువుయొక్క జ్ఞానమువలె నేమియు తెలియనిదియు, తెలిసినదియుకాని, స్థితిని చెందియేయుండెను. ఓ రఘుపుంగవా! శ్రీరామా! మనస్సునకు ఇప్పటికిని కొంత వికారము కలిగియున్నదనుట యథార్థమే యైనను, అదిమిక్కిలి స్వచ్ఛమైనస్థితి, నిర్దోషమైనస్థితి, మహాసామర్థ్యముగల అమ్మహాముని ఆస్థితినిగూడ ఒకపాద నిముషమాత్రములో అణచెను. ఎంత నిర్దోషమైనను " రెండవ పదార్థముకలదు " అను భావన జనించుటకు బీజరూపక మగుటచేత ఆ స్థితికూడ పరిత్యాజ్యమేకదా? కావుననే వాయువు స్వేచ్ఛగ ఒకొక్కసమయమున తన చలనశక్తిని జయింప గలుగునట్లు ఈ మునియును, జ్ఞానప్రభావముచేత తన మనశ్చాంచల్యమును సంపూర్ణముగ నణచెను. ఈ స్థితికే పశ్యంతియని పేరు. దీనియందు స్థిరుడై అటనుండి పరబ్రహ్మరూప స్థితియగు సుషుప్త్యవస్థను జెందెను ( ఈ సుషుప్త లక్షణము సర్వ వ్యవహార నాశనమని మున్నే వివరించియున్నాము. దీనినే నిర్వికల్ప సమాధి అనవచ్చును ). ఇట్లు జెంది పర్వతమువలె నిశ్చలుడై నిలచెను. ఈ పదమునందు నిలుకడ దృఢము కాగానే అక్కడినుండి తుర్యావస్థను జెందెను. ( దీని స్వరూపము గూడా ముందే వివరింపబడి ఉన్నది. ) అచ్చట ఆత్మభిన్నమగు పదార్థము లేకపోవుటచేత హర్షశోకములు లేనివాడయ్యెను. ఆత్మానుభవముచేత బ్రహ్మానందమును అనుభవించువాడై ఉండెను. ఇంద్రియగోచరుడు కాక పోవుటచేత అసత్యరూపుడయ్యెను. సర్వాధారుడగుటచేత సద్రూపుడై ఉండెను. జ్ఞానాజ్ఞానములు లేకుండుటచేత " ఈతడు జ్ఞానరూపుడు " అనిచెప్పుటకు వీలు కానివాడయ్యెను. సర్వసాక్షి అగుటచేత జ్ఞానమాత్ర రూపుడై ఉండెను. " ఇదికాదు, ఇదికాదు " అని దృశ్యపదార్థములనెల్ల నిషేధింపగా, ఏది మిగులునో, అదియే తానేయై నిలచెను. " సర్వమును శూన్యమే, లేక, ప్రపంచకారణము శూన్యము " అనిచెప్పు నాస్తికులకు శూన్య రూపము ఎయ్యదియో, పరబ్రహ్మమని చెప్పువారికి ఆరూపమెద్దియో, " సర్వమును జ్ఞానమే " అనువారలకు అతి నిర్మలమగు ఆ విజ్ఞానమెద్దియో. సాంఖ్యులకు పురుషుడు ఎవ్వడో, యోగులకు ఈశ్వరుడెవ్వడో, శైవమతస్థులకు శివుడెవ్వడో, " కాలమే సర్వకారణము " అని వాదించువారలకు ( వైద్యులకు ) కాలము ఎయ్యదియో, " ఆత్మ సర్వశరీరములయందు ఉన్నాడు "

అను వారలకు ఆత్మ ఎవ్వడో, " ఏపదార్థమునందును ఆత్మలేదు " అని వా దించు వారలకు ( బౌద్ధులకు ) నైరాత్మ్యము ( ఆత్మభావము ఎద్దియో, మాధ్యమిక మతస్థులకు ( వీరు బౌద్ధులలో నొక తెగవారు ) ఉత్పత్తి లయ కాలముల మధ్యము ఎయ్యదియో, సమదృష్టిగలవారలకు సర్వప్రపంచము ఎయ్యదియో, అట్టిరూపమును జెందెను. అట్టిపదార్థమే తానై నిలచెను. మఱియు సర్వశాస్త్రములకును సిద్ధాంతమగునది ఎద్దియో, అందఱి హృద యములయందును అనేకరీతులతో ధ్యానింపబడుచున్న పదార్థము ఎయ్యది యో, అనేక భేదములతో గానవచ్చు ఈప్రపంచమంతయు ఏదియై యున్న దో, సర్వపదార్థములయందును ఏకరూపముతో ఏది వ్యాపించియున్నదో, సర్వపదార్థములకును ఏది నియామకమైయున్నదో, ఏపదార్థము ఇంద్రియ గోచరము కాకపోవుటచేత " కలదు లేదు " అని ఎట్లును చెప్పుటకు వీలు లేకున్నదో, ఆపదార్థమే ఆమునికి స్వరూపమాయెను. ఏపదార్థము ఏక రూపమయ్యు సంకల్ప భేదములవలన అనేకరూపములతో గానవచ్చుచు న్నదో, దేనితోను సంబంధము లేనిదయ్యు సర్వ ప్రపంచముతోను సంబం ధము కలదిగా ఏదితోచుచున్నదో, ఏది ఏపదార్థమును గానిదయ్యు సర్వప దార్థములునై యున్నదో, అట్టిబ్రహ్మమే ఆమునికి స్వరూపమై నిలిచెను.

శ్లో॥ అజమమరమనాద్యమాద్యమేకం
పదమమలంసకలంచ నిష్కలంచ ।
స్థితఇతిసతదానభఃస్వరూపా
దపివిమలస్థితిరీశ్వరో బభూవ ॥

ఓశ్రీరామా! ఉత్పత్తి వినాశములు లేనట్టియు, తనకంటె పూర్వ మగు ఇతరపదార్థము లేనట్టియు, సర్వప్రపంచమునకును ఆదికారణ మైన ట్టియు ఏకరూపమైనట్టియు, నిర్మలమైనట్టియు, విభాగములు లేకుండియు వానిని కలిగియుండినట్టియు, జ్ఞానరూపమైనట్టియు, స్థానమును అమ్మహా ముని ఆశ్రయించెను. ఆకాశమునకంటెను అతిస్వచ్ఛరూపుడగు ఈశ్వరు డాయెను. ఓరఘురామా ! ఈవిధముగా ఆవీతహవ్యమహాముని ముప్పది వేల సంవత్సరములు విషయానందములను, బ్రహ్మానందమును, యోగానం దమును గూడ అనుభవించి పైనవర్ణించిన విధముగ పునర్జన్మరహితమగు పదమునందు శాంతినొందెను.

ఇట్లు శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు ఉపశమనప్రకరణమున
వీతహవ్యముని ఉపాఖ్యానమను ఇరువది ఏడవసర్గ ముగిసెను.

—* జీవన్ముక్తులకు ఆకాశగమనాదులు లేవని నిరూపించుట. *—

అని వశిష్ఠమహాముని చెప్పిన విని శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓభగ వంతుడా ! వశిష్ఠమహామునీ ! జీవన్ముక్తు లగువారలకు ఆకాశగమనము మొదలగు సిద్ధులు కానవచ్చుట లేదు. వారికి సంపూర్ణ మనోనిగ్రహము కలదుగదా ? వారికి యోగులకు గలుగు సిద్ధులు ఏల గలగవు. అనిన వశిష్ఠ మహాముని ఇట్లని ఉత్తరము చెప్పెను. ఓరామభద్రా ! వినుము. ఆకాశ గమనాది సిద్ధులను సంపాదించుటకు ఆత్మజ్ఞానము అక్కఱలేదు. ముక్తి యును అవసరములేదు. ఆయా సామర్థ్యమును కలిగింప గల పదార్థము లును మంత్రములును కార్యములును చేకూరినంజాలును. వాని ప్రభావము వలన అట్టి సిద్ధులతత్పరుడై ప్రయత్నించువాడు చెందును. ఆత్మజ్ఞాని అగు వానికి పరమాత్మను అవలోకించుటయే తప్ప రెండవపనిలేదు. వాడు ఆత్మ దర్శనముచేతనే తృప్తినొందును. దానిచేతనే సంతోషించును. ఇంతియే కాని సిద్ధులను కోరి ప్రయత్నింపడుగదా. అవిద్యను ఆశ్రయింపడు కదా? సిద్ధులు మొదలగునవి అన్నియును ఆత్మవిషయములు గాని, అవిద్యానాశక రములుగాని, కావుగదా? కావున ఆ ఆత్మజ్ఞానికి యోగసిద్ధులు ఏల కలుగ వలయును. ఏమనుష్యుడు దేనికై ప్రయత్నించునో వానికి అది సిద్ధించును గాని, ఒకదానికై ప్రయత్నించిన మఱియొకటి సిద్ధింపదుకదా? ఆత్మవేత్త యగు మహానుభావుడు సర్వమును అతిక్రమించి ఉండును. సర్వమునందు ను ఇచ్ఛలేనివాడై యుండును. తనయందే అనగా, ఆత్మదర్శనముచేతనే తృప్తిజెంది ఉండును. వాడు ఏకార్యమును ఆచరింపడు. దేనిని అభిలషింప డుకదా ? లోకమునందు అంగీకరింప దగినవిగాగాని, విడువ దగినవిగా గాని, ఏపదార్థములు ఉన్నవో అవి అన్నియు అవిద్యామయములనుట ప్రత్యక్షసిద్ధము. ఇట్లుండగ అవిద్యను సంపూర్ణముగా పరిత్యజించిన ఆత్మ జ్ఞాని ఆప్రాపంచిక పదార్థములను ఎట్లు కోరగలడు. ఇట్లుకాక ఆత్మజ్ఞాని యయ్యు ఒకానొకడు “ సర్వమయుడనగు నాకు సిద్ధులను సంపాదించినం దువలన ప్రతిబంధమేమి? ఈసిద్ధులును కొందఱిని యోగ సాధనమునందు ప్రోత్సహింప అనుకూల పడును ” అనుచు ఆకాశ గమనాది సిద్ధులను సా ధింప ప్రయత్నించునేని, వాడును దానికి తగిన పదార్థములను మంత్రము లను సంపాదించి సాధించుకొనవలసినదియె. ఈసిద్ధులను కలిగించుకొనుట యందు అనేక మూలికలును పదార్థములును మంత్రములును కాలమును బహువిధ శిల్పములును అను మొదలగునవి సాధనములగును. మోక్షమును

సంపాదించుటయందు మాత్రము ఇందొకటియును ఉపకరింపనేరదు. బాగుగ విచారించిన సర్వపరిపూర్ణుడగు ఆత్మను ఎఱిగి తృప్తి నొందినవానికి ఆత్మభిన్నములగు పదార్థములయందు ఆశయే సంభవింపదు. ఒకవేళ ఏదియో ఒకకారణమువలన అట్టి ఆశ కలిగినచో దానికై ప్రత్యేకముగా ప్రయత్నింప వలసినదియే. ఆశలన్నియు నశించిననేగాని, ఆత్మలాభము (మోక్షము) కలుగదు. అట్టి ఆత్మలాభము "నాకు సిద్ధులు కావలయును" అని ఆశాపాశమునబొరలువానికి ఎట్లుకలుగును. ఈకారణము వలన ఎవనికి సిద్ధులయందు ఇచ్ఛయుండునో, వాడు బ్రహ్మజ్ఞాని కానేరడు. అని చెప్పిన విని శ్రీరామచంద్రుడు మఱియొక ప్రశ్నచేసెను.

—* యోగుల చిరంజీవిత్వమును నిరూపించుట. *—

ఓ వశిష్ఠమహామునీ ! యోగులగువారు విశేష కాలము జీవించుచున్నారు. వారికి ఆసామర్థ్యము ఎక్కడిది ? ఈసంశయమును నివారింపుము. తత్వవేత్తలలో మీకంటె అధికులు లేరు. అనిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓశ్రీరామచంద్రా ! ఆయుస్సు క్షీణమగుటకు కారణము ప్రాణసంచారమే. యోగులగువారు కొంతకాలము వ్యవహరించుచున్నను విశేషకాలము వాయువును నిరోధించి శిలలవలె నుందురు. ఇట్లగుటచేత వారికి ఇతరులవలె ప్రాణసంచారము లేకపోవుటచేత నాశమును లేదు. ఏమహాత్ముడు లోపలగాని వెలుపలగాని, వాయువును చలింపకుండజేయునో, వాయువుయొక్క చలనమే మనస్సునకు రూపము. కావున ఆమనస్సునుకూడ సంకల్ప శూన్యముగ ఆచరించునో, అట్టివానికి మృతి నొందుట ముదిమి నొందుట, మొదలగు వికారములుగాని, ఆయుఃక్షయముగాని లేదు. అది ఏల అనిన; మనస్సు ప్రాణములు అను ఈరెండును ఎన్నడు కదలకుండునో, నాడు సప్తధాతువులును శరీరమునందే కదలక నిలిచి యుండును. ఇది యోగుల ప్రకారము. ఇక ఏమహాత్ములు పరమార్థమును ఎఱిగి కామక్రోధాదులను అణచి వివేకవంతమగు బుద్ధికలిగి సర్వ సంశయములను నశింపజేసి వెలుగుచుందురో అట్టివారికి దేహమునందు నివసించుటకుగాని, దానిని విడిచిపోవుటకుగాని, స్వాతంత్ర్యమే.

—* రెండువిధములగు చిత్తనాశ లక్షణములు. *—

అని వశిష్ఠమహామునిచెప్పిన విని మఱల శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓమహాత్మా! జ్ఞానులకు వివేకము ఉదయింపగానే మనస్సు నశించునుగదా. అప్పుడు యోగికి మైత్రి మొదలగు గుణములు ఎచ్చటకలుగును. ఆతడు ఆమై

త్ర్యాదులను ఆశ్రయించియేకదా వ్యవహరింపవలయును. ఈసంశయమును నివారింపుము. అనిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓరామభద్రా! వినుము. సరూపమనియు, అరూపమనియు, మనోనాశము రెండువిధములు. అందు జీవన్ముక్తునకు గల మనోనాశము సరూపము (రూపముతో కూడినది.) విదేహముక్తులకు గల మనోనాశము అరూపము (రూపములేనిది) మనస్సుయొక్క ఉనికి సర్వదుఃఖములకును కారణము. వానినాశము సర్వసుఖములకును ఆధారము. కావున చిత్తముయొక్క ఉనికిని అణచి దానిని నాశము చేయవలయును. అందు మొట్టమొదట చిత్తసత్తయొక్క (చిత్తముయొక్క ఉనికియొక్క) స్వరూపమును వివరించెదను వినుము. చిత్తనాశము రెండువిధములై యుండ చిత్త సత్తయు రెండువిధములుగ నుండితీరవలయునుగదా. చిత్తము పరమార్థమును ఎఱుగక ప్రకృతి సంబంధములైన సర్వపదార్థములను గాంచి "ఇవినావి" అని బాధింపుచు వానివలన గలుగు సుఖదుఃఖములను అనుభవింపుచు వేతలనొందుచుండునో, ఆచిత్తమే జీవు డనబడును.

ఓరఘురామా! ఈవిధముగా సంక్షోభము నొందుచు "నేను-నేను" అని అభిమానించుచు ఆ అభిప్రాయమును విడువక ఏమనస్సు నిలచి యుండునో. ఆ మనస్సే సంసారవృక్షమునకు అభివర్ధకమైనది అని తెలిసికొనుము. ఇట్టి స్థితియే సర్వానర్థకరమగు చిత్త సత్త. దీని స్వరూపమును సంపూర్ణముగ ఎఱిగించితినికదా. ప్రశ్నచేయుటలో మిక్కిలినేర్పరివగు నో రామభద్రా! ఇక చిత్త నాశ స్వరూపమును వినుము. సుఖదుఃఖములు వేలవేలుగా వచ్చియు, నిట్టూర్పులు పర్వతమును కదలింప లేనట్లు" ఏమహాత్ముని సమభావమును చెరుపనేరవో, అట్టివాని చిత్తమునశించిన చిత్తమందురు. ఆపదయు, దీనభావమును, ఉత్సాహమును, మదమును, మందభావమును, సంతోషాతిశయమును, మఱియును ఇతర వికారములును. ఏ మహాత్ముని చలింపజేయవో అట్టివాని మనస్సు నాశము నొందెనని పండితులు చెప్పుదురు. ఈ స్థితియే చిత్తనాశము. సరూప చిత్తనాశము. ఈ దశయందు మనస్సునకు స్వరూపము నశింపలేదుకదా "ఇట్లైన ఇది చిత్తనాశమే కాదు" అనియెదవేమో, అట్లు సంశయింప వలదు. ఇందు అతిరహస్యమేమనిన, అనాది కాలమునుండియు మనస్సును భ్రాంతియొకటి ఆవరించి యున్నది. లోకులందరును సామాన్యముగ భ్రాంతి సహిత చిత్తమునే చిత్తపదముతో వ్యవహరింపుచున్నారు. కావున చిత్త సత్తయనగా,

కేవల మూఢస్థితి. అది నశించుట యనగా, సత్వగుణావిర్భావము. ఇచ్చటి
మర్మము ఇదియే, అని ఎఱుగుము. జీవన్ముక్తునకు ఇట్టి చిత్త నాశమేకాని,
సంభవింప దనుటయు, స్పష్టమే. కావున ఈ చిత్తనాశము సరూపమే య
గుటచే మైత్ర్యాదులు దీనిని ఆశ్రయింపవచ్చును. ఆ గుణముల మూలమున
జీవన్ముక్తునకు హానియేమియు లేదు. పునర్జన్మము కలుగదు. ఈ గుణములు
శుద్ధ వాసనారూపములు అని ఇదివరకే నిరూపించి యున్నాముకదా. ఈ
వర్ణింపబడిన చిత్త వినాశమే సరూప చిత్త వినాశము. ఇది జీవన్ముక్తునకు
సంభవించును. వసంతకాలమునందు పూగుత్తులవలె ఆ జీవన్ముక్తుని మన
స్సునందు మైత్రి మొదలగు గుణములు నివసించుచుండునుగదా. మనస్సునకు
నాశమును కలిగినది. అందు గుణములు కూడా ఉన్నవి. మనస్సు నశింపలే
దు, అనిన భ్రాంతి తొలగకుండ వలయును. గుణములు లేవనిన వ్యవహారము
లేకపోవలయును. ఈ విరోధము వలన "జీవన్ముక్తునకు సత్వగుణ యుక్త
మగు మనస్సు కలదు. భ్రాంతి మొదలగు దుర్గుణములు మాత్రమే నశించిన
వికాని, మనస్సు సంపూర్ణముగా నశింపలేదు. చిత్త రూపము కలదు కా
వున మైత్ర్యాదులు దానిని ఆశ్రయింప వచ్చును. దీనివలన సర్వ వ్యవహా
రములును ప్రవర్తింప వచ్చును. అనిమాత్రమే సిద్ధాంతము చేయ వలయు
ను. ఇక అరూప వినాశమనునది చిత్తము సంపూర్ణముగ అనగా శుద్ధవా
సనకూడా లేకుండ అణగి పోవుటయే. ఇది విదేహముక్తులకుగాని సంభ
వింపదు. దానికి విభాగములు ఏవియు లేవుకదా (సంకల్ప రూపములగు
అవయవములు అప్పుడు కలుగవుకదా) అట్టిస్థితి శరీరధారికి ఎట్లు కలుగు
ను? ఇక విదేహముక్తియుం దన్ననో, ఉత్తమగుణములకెల్లను ఆధారమగు
సత్వగుణముకూడా నశించి పోవును. ఆస్థానము అద్వితీయమైనది. నిర్మలము
ను, పవిత్రమును, సర్వోత్తమమును, అయినది. అందు అన్యపదార్థము ఉం
డుటకే వీలులేదు. కావున, విదేహముక్తియందు సంభవించునదియు, మన
స్సు తన స్వరూపమును విడిచి పరబ్రహ్మమునందు లీనమగును అనుటయే
ఆకారముగా గలదియు, నైన అరూప చిత్తనాశము సంభవించిన ఇకను
ఏదియు మిగిలి ఉండదు. అచ్చట (అరూపచిత్త నాశమునందు) సుగుణ
ములు గాని, దుర్గుణములు గాని. సంపదలు గాని. ఆపదలుగాని, లౌల్యము
కాని, ఉదయము గాని, అస్తమయము కాని, సంతసము గాని, క్రోధము
గాని, వెలుతురుగాని, చీకటిగాని, సంధ్యాకాలము మొదలగునవి గాని.
రాత్రులు గాని, కలిమి కాని. లేమి కాని, స్థితి గాని, లేవు. వాయువులకు

ఆకాశము ఆధారమైనట్లు. (భ్రాంతియొక్కయు, సంసారము యొక్కయు, అవలిదరికి చేరిన మహానుభావులకు అది ( అరూపచిత్త నాశాత్మకమైన విదేహముక్తి ) నివాసస్థానము.

శ్లో॥ సంశాంతదుఃఖమజడాత్మకమేకసుప్త
మానందమంథరమపేతరజస్తమోయత్ ।
ఆకాశకోశతనవోఽతనవోమహాంత
స్తస్మిన్పదేగళితచిత్తలవావసంతి ॥

ఓ రఘుకులతిలకా! శ్రీరామా! ఏస్థానము మిక్కిలి శాంతమై, జ్ఞాన మాత్రరూపమై, సుషుప్త్యవస్థలకు సాటియై, పరమానందరూపమై, రజస్తమోగుణ సంసర్గములేనిదై, ఉన్నదో, అట్టిపరమపదమునందు ( అరూపచిత్త నాశాత్మకమగు విదేహకైవల్యమునందు ) సర్వశరీర వర్జితులగు మహాత్ములు ఆకాశమువలె అతి సూక్ష్మ రూపులగుచు, మనోవిరహితులగుచు, నివసింపుచుందురు.

—* సంసార బీజపరంపర. *—

అనిచెప్పిన శ్రీరామచంద్రుడు మఱల ఇట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా! వశిష్ఠమహామునీ! ఈ సంసారమను ప్రాతతీగె ప్రపంచమునందెల్ల అల్లుకొని యున్నది. దీనికి బీజము ఎయ్యది? ఆబీజము దేనివలన ఏర్పడినది? దానికి కారణము ఎది? దానికిని హేతువు ఎది? దీనినంతయు సంక్షేపముగా జెప్పి నాసంశయమును తీర్పుము. అని శ్రీరామచంద్రుం డడిగిన వశిష్ఠమహాముని ఇట్లని సమాధానముచెప్పెను. ఓసత్యవ్రతా! శ్రీరామా! సర్వకర్మలు వానియొక్క ఫలములగు శుభాశుభములు అను మొలకలను తనయందు ఇముడ్చుకొని ఉన్న ఈ దేహమే సంసారమను తీగెకు బీజమని ఎరుగుము. కలిమి లేములను పోటుతో గూడినట్టియు, దుఃఖములను రత్నములకు బరిణెయైనట్టియు, ఆశకు స్వాధీనమైనట్టియు, నగు మనస్సె ఆదేహమునకు బీజము. సత్యములనియు, అసత్యములనియు, తలపబడుచున్న సర్వదేహములును ఈ చిత్తమునుండియే కలుగుచున్నవి. ఈ విషయము స్వప్నకాలములందు అందరికి ప్రత్యక్షమే. ఇచ్చటి దేహము ఇచ్చట నుండగానే మఱియొక స్థూలదేహముతో మఱియొకస్థలమునందు కొన్ని కొన్ని వ్యవహారములను గావించినట్లు స్వప్నములు సామాన్యముగ నందరును కనుచునే ఉన్నారు. కదా? అప్పటిదేహమే శుక్లశోణిత పరిణామమువలన వచ్చినది. కావున దేహము సంకల్ప మాత్ర జన్యమే. నానావిధ వృత్తు

లనియెడి తీగెలకు ( సంకల్పము లనియెడి తీగెలకు ) ఆధారమైయున్నమనో వృత్తులకు బీజములు రెండు కలవు. ప్రాణచలనము మొదటిబీజము. సంసాకరము రెండవబీజము. ప్రాణము సర్వనాడులను స్పృశించుచు ఎప్పుడు కదలునో, అప్పుడు సంకల్పరూపమగు చిత్తము ఉదయించును. ఈసంకల్పమునకు కూడా జ్ఞానమే స్వరూపమనుట స్పష్టమగు విషయము.

ఓ రఘువంశతిలకా! రామా! ఇక ఈ రహస్యమును వినుము. జ్ఞానమే పరమాత్మ. ఆయన సర్వవ్యాపకుడై నిశ్చలుడై ఉన్నాడు. ప్రాణము తాను చలించి ఆత్మ చలించునట్లు తోపించును. అట్లు చాంచల్యముతో గానవచ్చు ఆత్మయే, మనస్సు. ఆమనస్సువలననే సర్వము కలిగెనని ముందే వివరించి ఉన్నాను. కావున ఆత్మయొక్క చాంచల్యమును నిరోధించుటయే ( అనగా మనస్సును నిగ్రహించుటయే ) మోక్షము. ఇట్లుగాక ఆత్మకు చాంచల్యము కలుగనిచ్చితిమేని ( కలిగినట్లు తలంచితిమేని, మనస్సునందు అభిమానించితిమేని ) అతడు " నాకంటె అన్యముగ దృశ్యపదార్థము ఉన్నది " అని భావించును. ఇట్లు భావించిన ఇక కలుగుదుఃఖములకు అంతమేలేదు. ఈ సర్వమును ఇట్టి భేదభావన వలననేకదా వచ్చినది " ద్వితీయాద్వై భయం=రెండవ పదార్థము ఉండినగాని భయము కలుగదు " అను శ్రుతికిని ఇదియే కదా అభిప్రాయము కావుననే ఏమహాత్ముడు స్వస్వరూప భూతజ్ఞానమును నిశ్చలముచేసి ( అభేదభావనచేత మనోరూపముగ బరిణమింపనీక, మనోభిమానమును వదలి ) దానినే దృఢముగ అవలంబించి యుండునో, అట్టివాడు పొందవలసినదానిని పొందినవాడవును. అదియే ముక్తి ( మనస్సును నశింప చేయుటయే ముక్తిగనుట ) ఈ కారణము వలన నో శ్రీరామచంద్రా! ప్రాణచాంచల్యములచేత గాని, ప్రపంచరూప వాసనలచేత గాని, సర్వవ్యాపకమగు జ్ఞానమును ( బ్రహ్మమును ) బహిర్ముఖముగా ( మనోరూపముగా ) చేయకుందువేని నీవుజన్మ వినాశ రహితుడవే. ఇట్లగుటచేతనే యోగులు చిత్తము శాంతించుట కొఱకై ప్రాణాయామములచేతను, ధ్యానములచేతను, మఱియు దేశకాలోచితముగ బుద్ధిచేత కల్పింపబడిన యుక్తులచేతను, ప్రయత్నించుచుందురు. ప్రాణమును నిరోధించుచుందురు. ప్రాణనిరోధమే సర్వకార్య సాధనము. అది చిత్తశాంతిని కలిగించును. సమత్వమును జెందించును. ఆత్మకు సౌఖ్యము కలిగించును. ఓరఘుపుంగవా! ఇప్పుడు ప్రాణ చాంచల్యమువలన కలిగిన చిత్తోత్పత్తినిగూర్చి వివరించితిని. ఇక సంసాకరమువలన కలిగిన చిత్తోత్పత్తిని

గూర్చి చెప్పెదను వినుము. అది జ్ఞానవంతులచేత బాగుగ వర్ణింపబడి ఉన్నది. వారలకు స్వానుభవసిద్ధమై ఉన్నది. కేవలము అనాదియుండియు, ఏకరూపముతో భావించుచుండుటను మాత్రమే ఆధారము చేసికొని, ముందువెనుక విచారింపక ఏదిన్నైన ఒకపదార్థమును "ఇది సత్యము, ఇదిఅసత్యము "అని గ్రహించుట ఏదికలదో అదియే వాసనఅనబడును. ఓపరాక్రమవంతుడా! ఏపురుషుడైనను, ఇతర అభిప్రాయములను అన్నిటిని వదలి ఏదియైన ఒక వస్తువును దృఢముగ భావించునేని తానుఆవస్తువే అగును. పిమ్మట సంస్కారములకు లోబడి పూర్వాపరములను విమర్శింపక తాను చూచుచున్న పదార్థమునే లేక తనరూపమునే సత్యమునుగ భావించును. శుద్ధచైతన్యాత్మకమగు తనరూపమును మరచి మద్యపానము చేసినవాడుతన్నే అన్యునిగా జూచునట్లు సంస్కారమునకు లోబడినవాడు అగుటచేత దోషయుక్తమగు దృష్టికలవాడై భ్రాంతుడై ఒకవిధముగా నున్నవానిని మఱియొక విధముగా జూచుచుండును. ఈ విధముగా వస్తుయథార్థస్థితిని తెలిసికొనక ఉండుటకును, ఆత్మగాని పదార్థములను ఆత్మగా భావించుటకును, సత్యములుగానివానిని సత్యములని తలంచుటకును, ఏదికారణమో అదియే మనస్సు ( ఒకవిధముగానున్న పదార్థమునందు రెండవ విధముగా నున్నదను సంకల్పమే మనస్సనుట ) ఓ ఇందీవరశ్యామా! రామా ! ఈవిధముగ దృఢ సంస్కారములవలన " నాకంటె భిన్నములగు పదార్థములు కలవు " అని తలంచుటచేత మిక్కిలి చెంచల స్వభావముగలదియై జన్మ మరణములకు గారణమై చిత్తము సంభవించును. ఇట్లుకాక " విడువదగినవి, అంగీకరింపదగినవి " అని పదార్థములను భావింపక ఏక్షణమునందు పురుషుడు ఊరకుండునో అప్పుడు వానికి చిత్తము జనింపదు. ఇట్లు సంస్కార రహితమై మనస్సు సర్వకాలములయందును ఏకరూపముగ ఎప్పుడు నివసించునో, అప్పుడు మనోవినాశము ( సరూప మనో వినాశము ) పుట్టును. దానివలన చిత్తశాంతిరూపమగు మోక్షము సంభవించును. లోకమునందుగల సర్వపదార్థములయందును " ఇదిసత్యము " అని భావింపకుండిన ఇక హృదయాకాశమునందు మనస్సు ఎక్కడినుండి పుట్టును. ఓ రఘునందనా ! శ్రీరామా! లోపల ప్రాపించిక పదార్థములను సత్యములుగాను, ఆనందకరములుగాను, భావించుట ఏదికలదో, అదియే చిత్తమునకు స్వరూపమని భావింతును. ఏమహానుభావుడు సంకల్పకారణమగు దృశ్యమును చిత్తమునందుభావింపడో, అట్టివానికి చిత్తము ఎక్కడినుండి పుట్టును. భావనామా

త్రమే చిత్తరూపము. కావున భావనలేని వానికి ఇది పుట్టుటకే వీలులేదు కదా. " జీవించియున్న పురుషుడు సంకల్పములు లేకుండనుండుట తటస్థింపదు కదా " అని అందువేమో, వినుము. సంకల్పములు లేకుండ ఉండుట అనగా, పూర్వమువలె భ్రాంతి మయములగు సంకల్పములు లేకుండుట అనియే అర్థముకాని, సంపూర్ణముగ సంకల్పములు లేకుండుట అని అర్థము కాదు. " ప్రాపంచిక పదార్థములన్నియు సత్యములుకావు " అను విషయమును మనస్సునందు దృఢము చేసికొనుటయు, సర్వమును అసత్యములుగ దలంచుటయు, పదార్థ తత్వమును ఎఱుగుటయు, అనునవియే చిత్తనాశమునకు స్వరూపములు. ఇంతియేకాని సర్వసంకల్ప వినాశము మాత్రమే చిత్తవినాశముకాదు. ఇట్లగుటచేత సర్వపదార్థములను పరిత్యజించి లోన చల్లనై ఏమనస్సు వెలుగుచుండునో, అది సర్వ సంకల్పములను చేయుచునే ఉన్నను, సర్వవ్యవహారములను చేయుచునే ఉన్నను, శూన్యరూపమనియే చెప్పబడును. కావున ఏమహాత్మునకు పునర్జన్మమును కలిగింపగల మలినవాసన సంపూర్ణముగ అధికమై యుండదో, వాడే జీవన్ముక్తుడు. " ఒకమాఱు త్రిప్పబడిన చక్రము మఱల మఱల త్రిప్పబడుచుండక పోయినను వేగమువలన కొంతకాలము అట్లే తిరుగునట్లు " ఈ జీవన్ముక్తుడును సంసారము లేకుండినను, అనాదినుండియు వచ్చుచున్న బలమును అనుసరించి మాత్రమే వ్యవహరించుచుండును. ఇంతమాత్రమే కాని, దీనివలన బంధము లేదు. ఏమహాత్ములకు వ్యవహార సాధనమగు వాసన పునర్జన్మమును కలిగింపక " వేపిన గింజవలె " సారహీనమై కేవలము స్వరూపముతో మాత్రమే నిలచియుండునో, అట్టివారు జీవన్ముక్తు లనబడుదురు. కావునఎవరిచిత్తము కేవల సత్వగుణ రూపమును ఆశ్రయించునో, వారి చిత్తమునశించిపోయిన చిత్తమగును. ఇట్టివారలే జీవన్ముక్తులు. వీరికే శరీరవియోగము కలిగనేని విదేహముక్తి దొరుకును.

ఓ రఘురామా ! మనస్సునకు ప్రాణచాంచల్యము, సంసారము, ఇవి రెండును కారణములని తెలిపియుంటిని. వానినుండి మనస్సు పుట్టు విధమును గూర్చియు, ఆమనస్సుయొక్క నాశోపాయమునుగూర్చియు, వివరించి యుంటిని. ఇప్పుడు మఱియొక రహస్యమును తెలిపెదను. ఈ రెండు కారణములలో ( ప్రాణచాంచల్య సంసారములలో ) ఏది నశించినను చాలును. ఒకటినశించిన రెండవది కూడ అప్పుడే నశించును. యోగాభ్యాసము చేసి ప్రాణమును నిరోధించిన మనస్సు నశించును. సర్వసంసా-

రములును అణగును. విచారవశముచేత యథార్థజ్ఞానము కలిగిన అప్పుడును చిత్తము నశించును. ప్రాణచాంచల్యము అణగును. చిత్తమునకు ప్రాణచాంచల్యమే కదా స్వరూపము. సంస్కారమువలన ( అనాదినుండియు ఏకరూపముతో వచ్చుచుండుటవలన ) ప్రాణము చలించును. దానివలన మఱల చిత్తరూపమగు వాసనపుట్టును. ఈ విధముగనే అనాది కాలమునుండియు ప్రవర్తింపుచున్నది. బీజాంకుర న్యాయమున ( విత్తనము ముందా? చెట్టు ముందా ? అను ప్రశ్నమునకు ఉత్తరము చెప్పవలయుననిన అందు ఏదియో, ఒకపదార్థమునకుగాని, ఆక్రమమునకుగాని అనాదిత్వమును అంగీకరించి తీరవలయును ) ఈ సిద్ధాంతము, ఇదియే అననేల ? సర్వపదార్థములయొక్క ఉత్పత్తినిగూర్చిన సిద్ధాంతములనుగూడ చేయవలయును. ఇక మఱియొక విషయము. మనోబీజములగు వాసనలకును ప్రాణ చాంచల్యమునకుగూడ కారణమగు పదార్థము మఱియొకటి కలదు. అదియే దృశ్యము. ఈ సంస్కారము దృశ్యపదార్థము ఉండిననేకాని, పుట్టదనుటయు, ప్రాణములుకూడ వానికంటె భిన్నములగు నాడులు ఉండిననేకాని, చలింపవనుటయు, స్పష్టమేకదా. కావున " ఇది దృశ్యము, నేను దీనినిచూచువాడను " అను భావనను వదలిన, ఆవాసనయు ప్రాణచాంచల్యమును, సంపూర్ణముగ నణగును. వేరును త్రెంచివేసిన పిమ్మట వృక్షము తనంతనే క్షీణించునట్లు క్రమక్రమముగ క్షీణించును ఓ ధైర్యశాలీ ! శ్రీరామా! ఇకను ఆదృశ్యమునకు సర్వవ్యాపకమగు జ్ఞానమే బీజము. ఆజ్ఞానము సర్వమును ప్రకాశింపచేయగలది. కావున దానిని ఆశ్రయింపక దృశ్యము ప్రకాశింపనేరదు కదా ? ఇంత ఏల ? నూనెలేని నువ్వుగింజలేనట్లు జ్ఞానములేని జ్ఞేయము లేదు. వాస్తవస్థితిలో జ్ఞానరూపమగు బ్రహ్మమునకంటె జ్ఞేయము భిన్నముగ లోపలగాని, వెలుపలగాని, లేదు. ఆబ్రహ్మమే సంకల్పశక్తివలన తనకు దానే అన్యముగ ఏర్పడి తన్నుదానే చూచుకొనుచుండును. ఇందు విరోధము కలదని శంకింపవలదు. కలగాంచు పురుషుడు తాను శయనించియే యుండియు, జీవించియే యుండియు, మృతిజెందినట్లు చూచును. ఒక గ్రామమున నుండియు, మఱియొక గ్రామమున నుండినట్లు చూచును. ఇది ప్రత్యక్ష సిద్ధమగు విషయమే. దీనియందు ఎట్లు విరోధము లేదో, అట్లే, బ్రహ్మము తనకుదానే దృశ్యరూపముగ తోచె ననుటయందును విరోధము లేదు. ఆ బ్రహ్మము తనశక్తివలన అట్లు కావచ్చును. పురుషుడు తన మనశ్శక్తివలన స్వప్నమునందు తానే తనకంటె అన్యుడగుచున్నాడు. కా

వున ఒకొ్కమాఱు చూడబడినట్టి గాని, చూడబడనట్టిగాని, ఏపదార్థమైన ను ఈజ్ఞానరూప బ్రహ్మమునకు తోచునేని తత్క్షణమే దానిని బ్రహ్మాభిన్న ముగ నెఱిగి తొలగింపవలయును. ఇదియే జ్ఞానవంతునకు లక్షణము. అదృ శ్యపదార్థమును తొలగింపకుండుట మాత్రమే అతి ఘోర సంసారమై పరిణ మించినది. కావున దానిని తొలగించుటయే మోక్షమగును. "ఇది దృశ్య ము, దీనినీ నేను చూచుచున్నాను" అను సంకల్పమే అపరిమితములగు దుః ఖములను కలిగించి పునర్జన్మమునుకూడ నొందించును. దానిని విడచి కేవల చేతనమాత్రుడై ఉండిన ఆస్థితి శాశ్వత సుఖమును కలిగించి జన్మనాశము ను కావించును. కావున నో రఘుకులతిలకా ! రామా ! నీవు "నేను జడు డను (అజ్ఞానిని)" అనుతలంపును వదలుము. "ఈ పదార్థములు నాకు ఆనందకరములు" అను అభిప్రాయమును పరిత్యజింపుము. "నా ఎదుట దృశ్యపదార్థములు కలవు. వానిని నేను చూచుచున్నాను" అను తలంపు ను విసర్జింపుము. వాస్తవస్థితిలో నీకు ఇవి అన్నియు లేవు. ఏ ఆత్మదృశ్య సంబంధము లేనివాడో, దివ్యజ్ఞాన రూపుడో, అట్టి ఆత్మయే నీవు. కావున సర్వమును పరిత్యజించి స్వస్వరూపముతో నిలువుము.

—* దృశ్యమునుచూడక పోయినను, జ్ఞానము ఉండవచ్చుననుట. *—

అని వశిష్ఠమహాముని చెప్పినవిని శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓగురు వర్యా ! వశిష్ఠమహామునీ ! నాకు మఱియొక సంశయము కలుగుచున్నది. ఎదుటనున్న పదార్థములను చూడలేని వానిని లోకులు "ఇవిజడములు" అనుచున్నారు. వానిని చూడగల పదార్థములను "ఇవిచేతనములు" అను చున్నారు. ఇట్లుండగ "దృశ్యములను చూచుటనుమాని కేవలము చేతన మాత్ర రూపుడై ఉండవలయును" అనిన అది ఎట్లు సంభవించును ? ఈ విషయమును వివరించి చెప్పవలయును. అని అడగిన వశిష్ఠమహాముని ఇట్ల నియె. ఓ నీలోత్పలశ్యామా ! రామా ! వినుము. జీవుడు చేతనుడనుట స్పష్టమే కదా. ఆతడు ఏపదార్థమును పరిత్యజింపక, దేనిని అంగీకరింపక ఉండునేని అప్పుడు దృశ్యానుసంధానము లేనివాడగును. దృశ్యానుసంధా నమనిన, కొన్నిటిని విడుచుచు మఱికొన్నిటిని అంగీకరించుచు, అభిమానము కలిగి యుండుటయేగాని, ఎదుటనున్న పదార్థమును అభిమాన రహితముగ చూచుచుండుటకాదు. ఈ విధముగ దృశ్యానుసంధానము లేని వాడైనను, జీవుడు మాత్రము ఎప్పటికిని అచేతనుడు కానేరడు కదా ? ఇకను ఈ స్థితి యందు విరోధమేమి ? దృశ్యానుసంధానమనగా, దృశ్యవస్తువులను ఆత్మ

భిన్నములుగ ( దృశ్యపదార్థము ఆనందరూపమని భావించి ఆ ఆనందము దానిమూలమున తనకు గలిగినట్లు తలచుట ) భావించుటయే. కావున ఆ భావన పరిత్యజించినంత మాత్రమున పురుషుడు అచేతనుడు కానక్కరలేదు. ఆత్మభిన్నములుగ భావింపకుండిన ఆత్మరూపములుగ భావింపవచ్చును గదా ? కావున ఏమహాత్ముని హృదయము దృశ్యపదార్థములతో సంబంధింపక ఏకరూపమై ఉండునో, అట్టివాడు దృశ్యానుసంధాన శూన్యుడును, చేతనరూపుడును, కూడా కావచ్చును. ఇట్టివాడే జీవన్ముక్తు డనబడును. ఓ బుద్ధిమంతుడా ! శ్రీరామా! ఏసమయమునందు పురుషుడు సర్వవాసనలును నశించియుండుటచేత మనస్సున ఏదియు భావింపకుండునో, పిచ్చివానివలెను బాలునివలెను నిర్విషయమగు జ్ఞానము కలిగి ఉండునో, స్థిరుడై నిలచి యుండునో, ఆసమయమునందు జడత్వమునకంటె భిన్నమై కేవలజ్ఞానరూపము మాత్రము దృశ్యాను సంధాన రహితమై వ్యాపించును. అట్టి ఆస్థితి వలన పునర్జన్మము కలుగదు.

శ్లో॥ సమ స్తవాసనాంత్యక్త్వా నిర్వికల్పసమాధితః ।
నీలత్వమివఖేస్ఫారమానందిత్వం ప్రవర్తతే ॥

ఓ శ్రీరామా ! ఇట్లు సర్వ సంకల్పములను పరిత్యజించి నిర్వికల్పసమాధిని ఆశ్రయించిన ఆనందానుభవము కలుగును. ఆనందానుభవమనగా, అనుభవము, అనుభవింపబడు ఆనందము, అనుభవించువాడు, అనుభేదము ఉన్నప్పుడు మాత్రమే సంభవించును. కావునను, ఆభేదము పరమాత్మయందు కలుగదు. కావునను, " నిర్వికల్ప సమాధియందు ఆనందానుభవముకలదు " అను విషయము విరుద్ధమని తలంపకుము. " స్వాభావికముగ లేనిదైనను, ఆకాశమున ఉన్నట్లు కానవచ్చు నలుపువలె " ఆ ఆత్మయందే ఆభేదముకూడ స్వాభావికముగ లేనిదైనను ఉన్నట్లు కానవచ్చును. ఇట్లు మొట్టమొదట ఇంచుక భేదము తోచినను సమాధియొక్క అభ్యాసము దృఢమై దృశ్యాను సంధానము సంపూర్ణముగ తొలగి పోయెనేని అప్పుడు ఆయోగికి స్వ స్వరూపమునందే లయము కలుగును. అప్పుడు తనకును బ్రహ్మమునకును భేదము లేకపోవుటచేత అదికూడ ( ఆనందానుభవము కూడ ) ఆద్యంతములు లేని బ్రహ్మమునందే లీనమగును. ఇట్లగుటచేత ఆ జీవన్ముక్తుడు బాహ్యమునకు సర్వవ్యవహారములను ఆచరించుచున్నను, నిలచుచున్నను, కూర్చుండుచున్నను, నడచుచున్నను, మఱియేమి చేయుచున్నను, చేతనరూపుడనియు, ఆనందరహితుడనియు, ( భేదసాధ్యమగు ఆనందాను

భవము నొందక కేవలము ఆత్మరూపముతో నిలచువాడనియు ) దృశ్యాను సంధానము లేనివాడనియు, మోక్షసుఖము నొందినవాడనియు చెప్పబడు ను. కావున ఓ రఘురామా ! ప్రాణాయామము మొదలగు ఎన్ని ఉపా యములనైనను గావించి పైన వర్ణించిన దృశ్యానుసంధాన రహిత చైత న్యరూపమును సంపాదించి దృఢప్రయత్నముతో బహువిధ ప్రభావము లుకల సంసార సముద్రమును తరింపవలయును.

ఓ రామచంద్రా ! పైన వర్ణింపబడిన జ్ఞానమునకు సత్తారూపమగు బ్రహ్మమే బీజము. సూర్యునినుండి తేజస్సు బైలుపడునట్లు ఆబ్రహ్మమునుండి యే సర్వజ్ఞానములు ఉదయించును. ఆసత్తకును రెండాకారములు గలవు. ప్రతిపదార్థమునందును ప్రత్యేకముగ నుండు సత్తయొకటి. ఏకరూపముగ నుండు సత్త మఱియొకటి. దాని విభాగములను వివరించెదను వినుము. లోకమునందు " కుండకలదు, గుడ్డకలదు, ఆ పదార్థము కలదు, నేనుకల ను, నీవుకలవు. " అను మొదలగు విధములతో ప్రత్యేకముగ వ్యవహరింప బడు ఉనికి ప్రత్యేకసత్త అనబడును. ఇట్లుగాక, విభాగములనువదలి "ఇది, అది " అను భేదములను పరిత్యజించి సర్వపదార్థములయందును ఏకరూప ముతో ఉన్నదియు, సర్వపదార్థములతోను సంబంధము లేనిదియు, నగు సత్తయొక్క యథార్థస్వరూపమును గ్రహించి వ్యవహరించుటయే సత్తకు రెండవరూపము. సామాన్య స్వరూపము. కావున " కాలము కలదు, విభా గము గలదు, పదార్థములు కలవు " అను భేదములను గూడ పరిత్యజించి ఏకరూపమగు కలిమిని మాత్రమే ఆశ్రయింపుము. అదియే ముక్తి. మఱి యొక విశేషము. కాలము మొదలగువానియందును ఘటపటాది పదార్థము లయందును ప్రత్యేకముగ గానవచ్చు సత్తకూడ పరమార్థస్థితిలో ఆత్మ సత్తకంటె భిన్నము కాకపోయినను, ఆత్మసత్త కానేరదు. ( ప్రత్యేకముగ ఆత్మయొక్క ఉనికి కానేరదు. ) అనేక భేదములతో కానవచ్చుచున్నవి అగుటచేత ఆప్రత్యేకసత్త పరిత్యజింప తగినదియే కదా. కావున ప్రత్యేక సత్త భిన్నముగ గానవచ్చునది అగుటచేత (ఆత్మసత్తకంటె రెండవదిగ తో చునది అగుటచేత ) అసత్యమైనదియే అని తెలిసికొనుము. ఎట్లు చూచి నను సత్త అనునది ఒకటియేయై ఉండవలయును కాని, రెండుగా నుండు టకు వీలు లేదు. ఈవిషయమును గూర్చి ముందే వివరించి యున్నాము. మఱియొక కారణమును వినుము. ఆత్మ సత్తకు ఏ ఉపాధులతో కాని, స్తం బంధము లేదనుట స్పష్టము: ఈకారణమువలన సకలోపాధిరహితమైనది.

ఇకను ఈప్రత్యేక సత్తకన్నునో, ఉపాధీ సంబంధము కలదు. దానివలననే ఆసత్తయందు, అనేకత్వమును భావించుచున్నాము. ఈభావన వలననే "ఘటము, పటమునకంటె వేఱు" అని మనము వ్యవహరించు చున్నాము. ఇట్లుండ ఆసత్త పరిశుద్ధమైనది ఎట్లగును. కావున ఓ శ్రీరామచంద్రా! నీవు సత్తాసామాన్య రూపుడైనట్టియు, ఏకస్వరూపుడైనట్టియు, సర్వవ్యాపకు డైనట్టియు, నప్పరమాత్మను మాత్రమే అవలంబించి సంపూర్ణానందము నొంది సర్వపరిపూర్ణుడవై నిలువుము. ఓజ్ఞానవంతులలో నుత్తముడా! ఇట్లు వర్ణింపబడిన ద్వివిధ సత్తలకును సత్తాసామాన్యముయొక్క అగ్రమగు పరమాత్మయే బీజము. ఆపరమాత్మనుండియే ఇవి అన్నియు సంభవించెను. ఇట్లు సర్వకారణమని వర్ణింపబడిన ఈస్థానములకు బీజము వేఱొకటి లేదు. ఇదియే ఆద్యంతములులేనిది. సర్వమునకును ఆరంభమైనది. సర్వోత్తమమైనది. సత్తా సామాన్యమునకు చివరనున్నది. ఇదియే ఆత్మ. బ్రహ్మము. కావున ఈసత్త (కలిమి) ఏపదార్థమునందు లీనమగునో, ఏవికారములను చెందక నిలచియుండునో, సాంసారిక సుఖదుఃఖములు దేనిని ఆశ్రయించిన మరలిరావో అదియే ఉత్తమస్థానము. దానిని జెందినవాడే పొందదగినదానిని పొందినవాడు. (ముక్తుడనుట) ఆస్థానమే సర్వమునకు గారణము. దానికి గారణాంతరము లేదు. అదియే సర్వమునకును సారభూతము. దానికంటె శ్రేష్ఠమగునది ఒకటియు లేదు. ఆస్థానము అద్దమువంటిది. తీరములయందున్న వృక్షములు సరోజలములందు ప్రతిఫలించునట్లు ఈసర్వపదార్థజ్ఞానములును ఆస్థానమునందే ప్రతిఫలించు చున్నవి. ఆస్థానమే పరిశుద్ధమైనది. అదియే జరామరణ శూన్యమైనది. అదియే ఆత్మరూపమైనది. దానిని ఎఱుగుటచేతనే మనస్సునకు శాంతిగలుగును. కావున ఓరామచంద్రా! దానియొక్క సర్వవ్యాపకమగు ఏకరూపమును గురుతెలుగుము. తత్క్షణమే నిర్భయుడ వగుదువు. జీవన్ముక్తుడవు అగుదువు.

—* మోక్షోపాయ ప్రశ్నము. *—

అనివశిష్ఠమహాముని చెప్పిన విని శ్రీరామచంద్రుడు మరల ఇట్లనియె. ఓగురువర్యా! వశిష్ఠమహామునీ! సంసార బీజములనెల్ల వివరించితిరి. సర్వమునకును పరమాత్మ మూలమనియు, ఆపరమాత్మను జెందుట ముక్తియనియు జెప్పితిరి. దానికి ఉపాయము ఏదియో మఱియొకమారు వివరింపుడు. జ్ఞానము మఱింత అభివృద్ధి అగుగాక. అనిపలికిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓరఘువంశభూషణా! శ్రీరామా! సంసార కారణములగు

ఆయాదేహాదులను వర్ణించునప్పుడే వానివాని ఉపశాంతికి సాధనములగు వానినిగూడ వివరించితిని. వానిని ఉపయోగించుటచేత ఆబీజములెల్ల నశించిపోవును. బీజము నశించిన వృక్షము నిలువదు. కావున వానితో ఈసంసారము ధ్వంసమగును. ఆత్మలాభము కలుగును. పైన వర్ణించిన విధముగ పురుషప్రయత్న బలముచేత వాసనలను బలాత్కారముగ నిరోధించి సత్తాసామాన్యమునకు ఆవలనున్న ఉత్తమ స్థానమునందు క్షణమాత్రమైనను దృఢస్థితిని జెందితివేని తత్క్షణమే ముక్తినొందినవాడవు అగుదువు. ఆస్థానమునుగూర్చి పరిపూర్ణ విజ్ఞానము, కలుగవలయునేగాని, సమాధినిష్ఠచేత అందు ఒకక్షణము నిలచిన ఒకటిటియే. వేయుసంవత్సరములు నిలచినను ఒకటియే. ఇట్లు కాకున్నను సత్తాసామాన్యమునందైనను విచారబలము వలన నిలుకడ నొందితివేని పిమ్మట అల్పప్రయత్నముతోనే పైభాగమునకు పోవచ్చును. "ఆత్మసత్త ఒకటియే" అని ఎఱుగుట సత్తా సామాన్య అతీతమగు పదము ఎఱుగుటకంటె సులభముకదా? ఇట్లునుగాక అంతకంటె దిగువనున్నజ్ఞానరూప తత్వమునందు (తెలివి అనుదానియందు) ధ్యానబలమువలన నిలుకడ నొందితివేని ఎప్పటికైనను మఱికొంత ప్రయత్నించిన సత్తాసామాన్య స్థితిని జెంది అక్కడినుండి దాని అగ్రమునందు ఉన్నబ్రహ్మరూప స్థితిని చెందవచ్చును. ఇక ఇంతకు క్రిందనున్నవారు మహాప్రయత్నముచేతగాని, పైకి పోనేరరు.

ఓరఘుకులచూడామణీ! శ్రీరామా! "ఈజ్ఞానము దృశ్యరూప సంసారబీజమునకు బీజము" అని చెప్పి ఉంటిని. అదృశ్యపదార్థములు అనేకములు. వానియందును ఈజ్ఞానము ఏకరూపమై వ్యాపించి ఉన్నది. ఇట్లుండగ కేవలము దృశ్యపదార్థమును మాత్రమే ధ్యానింపవలయునన్న అది ఎట్లు సంభవించును? ధ్యానమునకు వీలుగలుగకున్న పురుషునకు అందు నిలుకడ ఎట్లు దొరుకును? నిలుకడ అనగా, ధ్యానముచేత తన్మయుడై ఉండుటయేకదా? కావున సర్వదృశ్యములందును వ్యాపించియున్న జ్ఞానమునందు నిలుకడ జెందినవాడే ముక్తికి సమీపించినవాడు. అంతకు క్రిందనున్నవారు సంసారమునందు ఉన్నవారే. కావున దృశ్యస్థితి అనినను (దృశ్యమునందు నిలుకడచెందుట) అనినను, అదృశ్యములయందు వ్యాపించియున్న జ్ఞానమునందు నిలుకడ జెందుటయే అని ఎఱుగుము. మఱియును ఈదృశ్యమువలన మనోబీజములగు వాసనయు, ప్రాణచాంచల్యమును, కలిగియున్నవిగదా? ఇందు దేనినైనను, నిరాకరింప ప్రయత్నించుచుంటివేని

ఎప్పటికిని మోక్షసిద్ధి దొరకును. ఆదివ్యాధులు నశించును. ఆరెంటిలో వాసనలను నశింపజేయుటకై ప్రయత్నించుట ఉత్తమకార్యము. దీనిని సాధించుట మేరుపర్వతమును పెకలించుటకంటె మిక్కిలి కష్టము.

శ్లో॥ యావద్విలీనంన మనోనతావద్వాసనాక్షయః ।
నక్షీణావాసనాయావత్తావచ్చిత్తంనశామ్యతి ॥

ఓ శ్రీరామా! ఇంతకుపూర్వము చెప్పినట్లు జ్ఞానాదులయందైనను, చులకనగా నిలుకడను జెందవచ్చును గాని, ఈవాసనాక్షయము మాత్రము అట్లు సాధ్యమగునదికాదు. దీనికి కారణము వినుము. మనస్సు క్షీణించిపోవునంతవరకు వాసనలు క్షీణింపవు. వాసనలు క్షీణించునవరకు మనస్సు క్షీణింపదు.

శ్లో॥ యావన్నతత్త్వవిజ్ఞానం నతావచ్చిత్తసంక్షయః ।
యావన్నచిత్తోపశమో నతావత్తత్త్వవేదనమ్ ॥

ఓశ్రీరామా! తత్త్వజ్ఞానము కలుగకుండు నంతవఱకు మనశ్శాంతి కలుగదు. మనశ్శాంతి కలుగునంతవరకు తత్త్వజ్ఞానము కలుగదు. మఱియు సంసారములు అణగకుండునంతవరకు తత్త్వజ్ఞానము కలుగదు. తత్త్వజ్ఞానము కలుగకుండునంతవరకు సంసారములు నశింపవు.

శ్లో॥ తత్త్వజ్ఞానంమనోనాశో వాసనాక్షయఏవచ ।
మిథఃకారణతాంగత్వా దుస్సాధ్యానిస్థితాన్యతః ॥

ఓరఘురామా! పైన వర్ణించిన విధముగా సంసారనాశము, మనోలయము, తత్త్వజ్ఞానము, అను నీమూడును పరస్పరము కారణములగుచుండును. ఇట్లగుటచేత వీనిని సాధించుట మిక్కిలి ఆయాసకరమగును. కావున ఓ రఘుకులతిలకా! దృఢమగు పురుషప్రయత్నముచేతను " ఈపదార్థములు అనిత్యములు " అను దృఢభావనచేతను ( వైరాగ్యముచేతను ) భోగాభిలాషను సంపూర్ణముగ వదలి వేయవలెను. అప్పుడు పైనవర్ణింపబడిన సంసారక్షయాదులు మూడును ఒక్కమారే చేతజిక్కును. ఇట్లుగాక ఆసంసారక్షయాదులలో ఒకదానిని సంపాదింప వలయుననిన అది అశక్యము కదా. కావున వాసనాక్షయముచేత మోక్షమును సంపాదింప దలంచువానికి వైరాగ్యమే ప్రధానసాధనము. దానిని ఆశ్రయించి పైన వర్ణింపబడిన సంసారనాశాదులను మూటిని ఒక్కమారే చిక్కించుకొని అభ్యాసముచేత దృఢము గావించుకొనకుండిన నూరు సంవత్సరముల కైనను బ్రహ్మప్రాప్తి కలుగదు. వాసనాక్షయమునకు వైరాగ్యమున

కంటె శ్రేష్ఠమగు ఉపాయము లేదు. ఓ గొప్పబుద్ధికలవాడా! శ్రీరామా! ఈకారణమువలన వైరాగ్యబలమును ఆశ్రయించి వాసనాక్షయము, తత్వ జ్ఞానము, మనోనాశము, అను ఈ మూటిని ఒకరామాతే అభ్యసింపవల యును. దానివలన మోక్షసిద్ధి తప్పక కలుగును. ఇట్లుగాక వీనిలో ఒకొ క దానినిమాత్రమే సాధింప ప్రయత్నించిన ఇందు ఏదియు మొట్టమొదట సిద్ధింపనే సిద్ధింపదు. ఒకవేళ సిద్ధించినట్లు కానవచ్చినను, శాపాది దోష దుష్టములైన మంత్రములు ( గాయత్ర్యాది మంత్రములకు అన్నిటికిని అనే క మునుల శాపములు కలవనియు వానివలన అవి కేవల జపమాత్రమున సిద్ధి నొసంగవనియు, మంత్రశాస్త్ర రహస్యము ) సిద్ధినొసంగ లేనట్లు ముక్తిసిద్ధి ని ఒసంగనేరవు. కావున వైరాగ్యబలమును ఆశ్రయించి ఆమూటిని ఒకరా మాతే అభ్యాసమునకు తెచ్చికొన వలయును. అట్లుచేసిన తామరతూడు ను తెగగొట్టిననే అందలి దారములు తెగిపోవునట్లు సంశయ రూపములగు గ్రంథులన్నియు నొకరామాయుగ తమంత తెగిపోవును.

శ్లో॥ జన్మాంతరశతాభ్యస్తా రామసంసారసంస్థితిః ।
సాచిరాభ్యాసయోగేనవినానక్షీయతేక్వచిత్ ॥

ఓ శ్రీరామా! ఇందుకు కారణము ఏది అనిన వినుము. ఈ సంసార ము అనాదికాలమునుండియు అనుభవములో నున్నది. దీనికి సంబంధించిన సంస్కారములు దృఢముగ నున్నవి. కావున ఈ సంస్కారములు మహా ప్రయత్నమువలన బహుకాలమునకుగాని, మనస్సులోనుండి తొలగి పోనేర వుగదా. ఇకవినుము. మనస్సునకు సంస్కారము ఒకటియేగాక ప్రాణ చాంచల్యముకూడ బీజమే అనిమొట్టమొదట చెప్పియుంటిని. అందు వాసనా పరిత్యాగస్వరూపమును తత్సాధనములనుకూడ వివరించితిని. ప్రాణచాంచ ల్య నిరోధముగూడ దీనికంటే ( వాసనాపరిత్యాగమునకంటే ) ఎందును తీసిపోవునది కాదు. దానిని సాధించువిధమునుకూడ తెలిపెదను వినుము.

శ్లో॥ వాసనాసంపరిత్యాగాచ్చిత్తంగచ్ఛత్యచిత్తతామ్ ।
ప్రాణస్పందనిరోధాచ్చ యథేచ్ఛసితథాకురు ॥

ఓ రామా ! వాసనలను జయించినను సరే. ప్రాణచాంచల్యమును అణచినను సరే. చిత్తనాశము కలుగును. ఇందు ఏది నీకు సులభమనితోచిన దానిని ఆచరింపవచ్చును.

శ్లో॥ ప్రాణాయామదృఢాభ్యాసై ర్యుక్త్యాచగురుదత్తయా ।
ఆసనాశనయోగేన ప్రాణస్పందోనిరుధ్యతే ॥

ఓ రామా ! రేచక పూరక కుంభకములతో ప్రాణాయామమును అభ్యసించుటచేతకాని, గురువుతనశక్తిని అనుసరించి ఉపదేశించిన యుక్తుల ను ఆశ్రయించి చేయుటచేత కాని, వాయు నిరోధమును చేయవచ్చును. ఇట్లు ప్రాణనిరోధము క్రియాసాధ్యము. మఱియు కర్తృత్వాభిమానరహితముగ ( " నేను ఈ పనిని చేయుచున్నాను, నాకు దీనిఫలము కావలయును " అను అభిమానము లేకుండా ) కర్మను చేయుచుండిన, అట్లే సర్వవ్యవహారములను జేయుచుండిన, సంసారరూప భావనను (" ఈ సంసారము నాకు సుఖకరమైనది " అనుభావనను ) విడిచిన, " ఈ శరీరము శాశ్వతముకాదు " అను విషయమును దృఢముగ నెఱింగిన, సంస్కారములు పురుషునకు గలుగనేరవు. ఇది విచార సాధ్యము. ఇట్లు వాసనలు నశించునేని అప్పుడు " గాలిలేకున్న దుమ్మెగురనట్లు " మనస్సు చలింపదు. ప్రాణస్పంద జయము, వాసనాక్షయము, అను రెంటిలో ఒకటి క్రియాసాధ్యము. రెండవది విచారసాధ్యము. అనుటకంటె ఇతరభేదములు ఏవియు లేవు. అందు విచారసాధ్యమగు వాసనాక్షయమునకంటే క్రియాసాధ్యమగు ప్రాణజయము కొంతసుఖకరమనుట నిస్సంశయమగు విషయము. కావున ప్రాణజయ-ప్రకారమును కొంత విశేషముగ వివరించెదను వినుము. ప్రాణజయమును కోరువాడు ఏకాంతస్థలమునందు కూర్చుండి పరధ్యానముల వదలి తదేకనిష్ఠుడై ప్రాణాయామాది ఉపాయములను విసుకుజెందక మాటిమాటికిని అభ్యసింపవలయును. దానియందు సిద్ధిగాంచిన అవశ్యముగ చిత్త జయము పొందవచ్చును. ఇక ఈవాసనవలనను, ప్రాణచాంచల్యమువలనను పుట్టిన చిత్తమును జయించు విధమును వినుము. ఆమనస్సు సర్వసంసార కారణము అగుటచేత అంకుశములేక మదపుటేనుగు వశము కానట్లు తగినయుక్తిలేక వశము కాదు. వేదాంతశాస్త్రజ్ఞానము, సత్పురుష సమాగమము, వైరాగ్యబలముచేత సంస్కారములను నశింపజేయుట, ప్రాణాయామాది అభ్యాసములచేత వాయువును నిరోధించుట, అనునివి చిత్తజయమునకు పరిపూర్ణములగు చక్కని యుక్తులు. వీనిని ఆశ్రయించిన నిశ్చయముగఫలము కలుగును. వర్షధారలచేత భూమియందుండు దుమ్ము అణగునట్లు ఈ యుక్తుల చేత మనస్సు అతిశీఘ్రముగ నశించిపోవును. అతసులభములగు ఇట్టియుక్తులు ఉండ వీనిని ఆశ్రయింపక ఎవరు బలాత్కారముగ మనోనిగ్రహమును కావింప ప్రయత్నింతురో, అట్టి వారు దీపము ఉండగ కాటుకలయొక్క ప్రకాశముచేత చీకటిని తొలగింప ప్రయత్నించు వారివంటి వారగుదురు.

మూఢులై ఎవరు ఈ యుక్తులను ఆశ్రయింపక బలాత్కారముగ మనస్సు
ను జయింప దలతురో, వారు మదపుటేనుగను తామరతూండ్లలోని దార
ములతో గట్టి వేయుదురు. కావున నో రామచంద్రా ! ఈ భేద భావనలను
వదలి ఎల్లెడలను సర్వదృశ్యములను వ్యాపించియున్న జ్ఞానమునే ఆశ్రయిం
పుము. అది ముక్తికి మిక్కిలి చేరువయనియు, ముక్తియే యనికూడా చెప్ప
వచ్చుననియు చెప్పియుంటిని గదా ? దానికి దిగువను ఉన్నవి అన్నియు
పరిత్యాజ్యములు. అదిమాత్రము అంగీకార్యము. దానికిగారణములగు సత్తా
సామాన్యాదులుకూడా అట్టివే. దిగువను ఉన్న ఈ వాసన మొదలగు వా
టిని ఆశ్రయింగనేల ? వానిని పరిత్యజింప ఆయాస మందనేల ? దృశ్యాను
భవమును, వానియందు జ్ఞానము వ్యాపించి యుండుటయును, అతి విస్పష్ట
ములయ్యే ఉన్నవికదా ? కావున దృశ్యసంబంధము లేనట్టిదియు, సర్వో
త్తమమైనదియు, సర్వకారణమైనదియు, ఏకస్వరూపమైనదియు, నగు జ్ఞాన
మును ఆశ్రయింపుము.

ఓ మహాత్మా ! శ్రీరామా ! దానియందు ఈ వాసన మొదలగు
నవి స్వాభావికముగ లేవు. అట్టిదానిని ఆశ్రయించిన వేరుతెగిన వృక్షము
వలె ఈ సంసారమంతయును ఇతరప్రయత్నములతో పనిలేకయే ధ్వంస
మగును. అప్పుడు నీవు సర్వభావనా వర్జితుడవై స్వస్వరూపమునందే నిల
చెదవు. శుద్ధవాసనను ఆశ్రయించి బాహ్యమునకు సర్వ వ్యవహారములను
ఆచరించుచున్నను, నీవు కర్తకానేరవు. ఒకమారు భ్రాంతి తొలగినపిమ్మ
ట మఱియొక మాఱు రానేరదనుట నిర్వివాదమగు విషయము. “ చీనా దే
శము లేదు ” అనితలంచువానికి, “ చీనాదేశముకలదు” అని ఒకడు చెప్పిన
ఆ అజ్ఞానము నశించును. కొంతకాలమునకు ఆవిషయమును వాడు మరచును
గాక. ఇక ఎప్పుడు వానికి చీనాదేశ విషయకమగు అజ్ఞానము సంభవించె
ననుటకు వీలులేదుకదా ? ఒకమాఱు తెలిసికొనిన విషయము మరువ వచ్చు
ను, అంతియేకాని, తెలిసిన విషయము తెలియనిది ఎప్పటికైన గానేర్చునా?
కావున పదార్థవిషయము ఎట్లున్నను, అజ్ఞానముమాత్రము ఒకమారు నశిం
చిన మరల జనింపదు. కావున “ నాకును బ్రహ్మమునకును భేదము ” అని
అనాదినుండి అజ్ఞానము సర్వసంసార కారణమై యుండెను. ఆ అజ్ఞానము
విచారదృష్టిచేత నశించిన దానితోడ సంసారమంతయు నశించును. ఇట్లుం
డ ఇక దేహాదులు యథాపూర్వకముగ సర్వకార్యములను ఆచరించునుగాక.
పోయిన అజ్ఞానము మరల ఎట్లువచ్చును ? మరల బంధము ఎట్లుగలుగును ?

కావున జ్ఞానము గలిగిన పిమ్మట ఎట్లువ్యవహరించినను, బద్ధుడవు కానేరవు. శాంతికిని, దానివలనకలిగిన మోక్షరూప మహా ఐశ్వర్యమునకును హాని యెన్నటికిని కలుగనేరదు.

శ్లో॥ విచారకణికామైషా హృదిస్ఫురతిపేలవా ।
ఏషైవాభ్యాసయోగేన ప్రయాతిశతశాఖతామ్ ॥

ఓ శ్రీరామా ! అత్యల్పముగానైనను, ఆత్మ విచారము గావించి అత్యల్పముగానైనను, ఏమహాత్ముడు మనోనిగ్రహమును గావించునో వాడు జన్మఫలము నొందినవాడేను. అత్మవిచారమనునది అత్యల్పమై - హృదయము నందు స్ఫురించినను, అది మోక్షసిద్ధిని కలిగింపక విడువదు: కాలక్రమమున జన్మ పరంపరయందైనను అభ్యాస బలమువలన క్రమ క్రమముగ విస్తరించి శతసహస్ర శాఖలతోగూడి అభివృద్ధి నొందును. విచారమనేడు పుష్ప వృక్షము దృఢము కాకుండు నంతవరకే, చింతలను జంఝామారుతములు దానిని ఇటునటు కదలింప గలవు. అంతియేకాని, అదిస్థిరమైన పిమ్మట ఏమియు జేయజాలవు. కావున నడచునప్పుడుగాని, నిలచునప్పుడుగాని, మేలుకొనీ ఉన్నప్పుడుగాని, నిదురించునప్పుడుగాని, మఱి ఏ వ్యవహారములను ఆచరించున్నప్పుడుగాని, ముముక్షువగు వాడు జరిగినంతవరకు అత్మవిచారమును కావించుచునే ఉండవలయును. దృశ్యపదార్థమును తనకంటే భిన్నముగా గాంచుచునే ఉండవలయును. ఆత్మరూపమే సర్వ పదార్థములయందును ఏకరూపముతో వ్యాపించియున్నదని భావింపుచునే యుండవలయును. ఇట్లు చేయనివాడు బ్రతికియుండినను మరణము నొందినవానితో సమానుడే. ప్రత్యక్షముగ అనుభవమునకు వచ్చుచున్న విషయమునే అను సంధానము చేయకున్న ఇక చేయగల కార్యము ఏది? కావున నో రఘురామా! "ఇది ఏమిగానుండును? ప్రపంచమనగా ఏమి? నేను ఎవ్వడను ? దీనికి నాకు గల సంబంధము ఎద్ది ? అను విషయమును మెల్ల మెల్లగ మనస్సునకు వచ్చునట్లు స్వయముగానైనను, సత్పురుష సహవాసముచేతనైనను, విచారింపుము. వేదాంతశాస్త్రమును అను సరించి చేయబడు ఈ విచారమునకే జ్ఞానమని పేరు. అజ్ఞానముచేత ఎఱుగదగిన విషయమున్ననో, పాలయందే తీపి ఉన్నట్లు ఆ విచారమునందే కలసియున్నది. కావున మద్యపానమును గావించిన వాడు తత్క్షణమే మదమయుడై ఏర్పడునట్లు చక్కగ విచారమును చేసినవాడు తత్క్షణమే జ్ఞేయమయుడు ( జ్ఞానముచేత తెలియదగిన బ్రహ్మమే స్వరూపముగా గలవాడు ) అగును. అతిపరిశుద్ధమై సర్వసమమై ఉన్న బ్రహ్మమే

జ్ఞేయమని (జ్ఞానముచేత తెలియదగినది యని) చెప్పబడును. అదియు జ్ఞానము సంపూర్ణముగా కలిగిన తనంతనే విశదమగును. అది స్వస్వరూపమే కదా ? తనకంటె భిన్నముగ ఇతర స్థలమునందు ఉన్నదగునేని అప్పుడు జ్ఞానానంతరము కొంత కార్యము కావలయును గాని, స్వస్వరూపమేయై యున్నదానినిగూర్చి అట్టి ప్రయత్నము ఏమియును అవసరము లేదు గదా ! మఱియును ఆబ్రహ్మప్రాప్తి కలవాడు సర్వసముడు అగును. అపరిశుద్ధమును, మలినమును, విషముతో గలసినదియు, నగు ఎట్టిపదార్థమును భుజించినను, అతనికి తుల్యమే అగును. మృష్టాన్నమువలె జీర్ణించును. తత్క్షణమే బుద్ధిని నశింపచేయునది అని ప్రసిద్ధి జెందిన దొండపండునుగాని, విషములనుగాని, కషాయములనుగాని, పాలనుగాని, చెరుకురసమునుగాని, మంచి నీటినిగాని, అన్నమునుగాని, భుజించునపుడు ఆతత్త్వజ్ఞానికి సమభావము తొలగదు. ఆతడు అన్నిటిని ఒకటేవిధముగానే చూచును. ఒక పురుషుడు తన ప్రాణములను హరింప ప్రయత్నించినను, మఱియొకడు ప్రాణదానమును చేయ బూనినను, ఆ తత్త్వజ్ఞాని వారిని ఇరువురను దయా మధురమగు దృష్టితో చూచును. వారియందు భేదభావమును ఉంచడు. ఎవడు తత్త్వజ్ఞానములేక శాంతినొందక ఆత్మను జెందక స్థిరుడుగాక ఉండునో, అట్టివానిని "లేళ్ళు చిగురాకును నమలునట్లు" ఇంద్రియములు వానిని నమలివేయును.

శ్లో॥ సంగఃకారణమర్థానాం సంగస్సంసారకారణమ్ ।
సంగఃకారణమాశానాం సంగఃకారణమాపదామ్ ॥

ఓ శ్రీరామా ! అభిమానమే పదార్థోత్పత్తికి ( తనకంటె దృశ్యములగు పదార్థములు భిన్నములుగ ఉన్నవి అనితలచుటకు ) గారణము. ఈ అభిమానమే సంసారమునకు గారణము. ఈ అభిమానమే ఆశలకు గారణము. ఈ అభిమానమే సర్వాపదలకును గారణము. అట్టి అభిమానమును విడచుటయే మోక్షమందురు. ఆ అభిమానమును విడచుటవలననే జన్మవినాశము కలుగునందురు. కావున నో శ్రీరామచంద్రా ! నీవు సర్వపదార్థములయందును అభిమానమును వదలుము. జీవన్ముక్తుడవయ్యెదవు.

—✻ సంగస్వరూపము. ✻—

అని వశిష్ఠమహర్షి చెప్పిన విని శ్రీరామచంద్రుం డిట్లనియె. సందేహములను, పోగమంచును శరత్కాల వాయువైనవాడా ! ఓవశిష్ఠమహాముని! సంగమనగా ఎది ? దాని స్వరూపమును దయచేత వివరింపుము. అనిపలికిన వశిష్ఠమహాముని ఇట్లని సమాధానముచెప్పెను. ఓరామచంద్రా ! నీవడిగిన

ప్రశ్నమునకు సంక్షేపముగ ఉత్తరము చెప్పెదను. వినుము. తనకంటె భిన్నములుగ ఉన్నట్లులోచు పదార్థములతో సంయోగ వియోగములు కలుగునప్పుడు హర్ష శోకములను గలిగించుచు మలినరూపమై ఉన్న సంసారము ఏదికలదో, అదియే సంగమని చెప్పబడును. ( అభిమానమని చెప్పబడును ) ఆవాసనయే బ్రహ్మజ్ఞానాభ్యాసమువలన సర్వ పదార్థములను ఆత్మభిన్నములనుగా గాని, ఆత్మమాత్రములనుగా గాని, భావింపుచు వానివలన గలుగు హర్ష శోకములను జెందక నిలచియుండెనేని అప్పుడు పరిశుద్ధయగును. అప్పుడు వ్యవహారమాత్ర సాధనమై ప్రవర్తించుచున్నను అది పునర్జన్మమును కలిగింపనేరదు. ఇది జీవన్ముక్త శరీరములయందు మాత్రమే సంభవించును. ఇట్లుగాక విచారశూన్యులై జీవన్ముక్తిని జెందక దీనులై మూఢులై యుండువారి చిత్తములయందు వసించుచున్నప్పుడు ఈవాసనకే సంగమని పేరు. అప్పుడు అదిమలినయై సర్వసంసార కారణమై పునర్జన్మప్రదయై ఉండును కదా ?

ఓ దశరథరాజనందనా ! శ్రీరామా ! కావున నీవును హర్ష శోకములను విడచి కామక్రోధ భయములులేనివాడవై నిలతువేని స్వయముగనే స్వస్వరూపమునకంటె అన్యత్వమును జెందకుందువేని బ్రహ్మము స్వస్వరూపమేమైయుండ అజ్ఞానులు దానిని తమకంటె అన్యముగ భావించుచున్నారు. ఇట్లు భావింపకుందువేని అప్పుడు సంగరహితుడవు అగుదువు. హర్ష విషాదములయొక్క కలిమియు, వానియొక్క లేమియు మాత్రమే కదా, సంసారి, జీవన్ముక్తులకు కలభేదము. ఓశ్రీరామా ! ఆశలను పరిత్యజించి, సుఖములకు సంతసింపక దుఃఖములకు తల్లడిల్లక సమభావముతో ఉందువేని అప్పుడు సంగరహితుడవు అగుదువు. ఓశ్రీరామా ! ఈ ఆత్మ సంపదలయందును, ఆపదలయందును, సమభావనతో, నుందువేని, ఎప్పటికి ఏదివచ్చిన దానిని రాగద్వేష శూన్యముగ ఆచరించుదువేని అప్పుడు సంగరహితుడవు అగుదువు.

శ్లో॥ సదాసమస్తేపిహివస్తుజాతే
సమాశయోహ్యంతరదీనసత్వః ।
యదేవకించిత్ప్రకృతంజేవ
కుర్వన్నసంగస్సుఖమాస్వరామ ॥

ఓ శ్రీరామచంద్రా! నీవు సర్వపదార్థములయందును సమభావమును నెలకొల్పుము. లోపల దైన్యమును విడువుము. మహాధైర్యమును అవలంబిం

వుము. గడచినదానినిగూర్చి విచారింపకుము. రాబోవుదానిని ఊహింపకుము. వర్తమానమును మాత్రము అనుసరింపుము. రాగద్వేష శూన్యుడవై ఇట్లు వర్తింతువేని నీవుసంగరహితుడవగుదువు. ఇట్టిస్థితినిజెంది సుఖింపుము.

ఇట్లు బ్రహ్మశ్రీ వెన్నెలకంటి సుందరరామశర్మచే వచనకావ్యముగ రచియింపబడిన శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు ఉపశమప్రకరణమున ఇరువది యొదిమిదవసర్గ ముగిసెను.

ఉపశమ ప్రకరణము - సమాప్తము.

———*———

# శ్రీజ్ఞానవాశిష్ఠము - వచనకావ్యము.

# నిర్వాణప్రకరణము.

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజుని జూచి ఇట్లనియె. ఓభారద్వాజా! ఈవిధముగ శ్రీరామచంద్రునకు చిత్తోత్పత్తియే ప్రపంచోత్పత్తియనియు, చిత్తవిస్తారమే ప్రపంచవిస్తారమనియు, చిత్తోపశాంతియే ప్రపంచోపశాంతియనియు, ఉత్పత్తి, స్థితి, ఉపశమ, ప్రకరణములచేత నిరూపించి వశిష్ఠమహాముని, " చిత్తలయమే మోక్షము " అని నిరూపించుటకై ఈనిర్వాణప్రకరణమును ఉపక్రమించి ఇట్లని ఉపదేశింప నారంభించెను. వశిష్ఠ మహాముని శ్రీరామునితో ఇట్లనియె. ఓరామచంద్రా! " దేశకాలములవలన గలిగిన భేదములు ( " ఈసమయమునందు ఉన్నాడు. ఈసమయమునందు లేడు. ఈస్థలమునందు ఉన్నాడు. ఈస్థలమునందు లేడు " అను భేదములు ) లేనివాడును, కలడు, లేడు, అని ఏపక్షము నందైనను ఆశ్రయించి వ్యవహరించుటకు వీలుపడనివాడును, జ్ఞానమాత్రస్వరూపుడును, నాశరహితుడును, దృశ్యసంబంధము లేనివాడగుటచేత పరమశాంతుడును, ఏకరూపుడును, అగు పరమాత్ముడ నేనేను. "ఇతరుడను కాను" అని హృదయమునందు నిశ్చయించి బాహ్యమగు శరీరమును విడిచియు విడువనివాడవై, సర్వోత్తముడవును ఏకరూపుడవును శాంతచిత్తుడవును మౌనశీలుడవును ఆత్మానందానుభవ రసికుడవును గమ్ము.

—* చిత్తాది కల్పనా నివృత్తి ఉపాయము. *—

ఓరామా! ఈ అజ్ఞానము ఎంతవఱకు విజృంభించుచుండునో, "నేను

బ్రహ్మమునకంటె భిన్నుఁడను" అనుతలంపు ఎంతవఱకు అభివృద్ధి యగుచుం
డునో, ఎంతవఱకు ప్రాపంచిక పదార్థములయందలి ఆశ విజృంభించుచుం
డునో, అంతవఱకు చిత్తాదులరూపములు వెలుఁగుచుండును. ఓ శ్రీరామా!
బాగుగ విచారించిన పరమార్థస్థితిలో చిత్తము గాని, ( చిత్తమనగా, సంశ
యాత్మకమగు అంతఃకరణవృత్తి, లేక, దృశ్యాభిముఖమగు జ్ఞానము. )
మాయగాని, మనస్సుగాని, ( మనస్సనగా సంకల్పాత్మకమగు అంతఃకరణ
వృత్తి, లేక, పరబ్రహ్మముయొక్క సంకల్పశక్తి ) జీవుఁడుగాని, మఱి ఏప
దార్థముగాని, బొత్తిగనే లేవు. ఇవి యన్నియు పరబ్రహ్మమునుండి అజ్ఞా
నముచేత కల్పింపబడినవే. ఆపరబ్రహ్మము ఏకరూపమయ్యు "సముద్రము
స్వయముగ భిన్నము కాకపోయినను తరంగాది భేదములతో గానవచ్చు
నట్లు చిత్తాదిభేదములతో గానవచ్చుచుండును. కావున ఈయథార్థస్థితిని
తెలిసికొనలేక అజ్ఞానవశగతులై పురుషులు తమశరీరమునే ఆత్మగా భావిం
చుచు దృశ్యపదార్థములను సత్యములుగా దలంచుచు "ఇదినాది" అని
అదృశ్య పదార్థములకును తనకును లేనిసంబంధమును కల్పించుకొనుచు
ఉన్నారు. ఈస్థితి యథార్థ జ్ఞానముచేతగాని తొలఁగదు. ఇది తొలఁగకుండు
నంతవఱకు చిత్తాదిరూప భ్రాంతి తొలఁగదు.

## — అంతర్ముఖత్వ లక్షణము. —

ఓ శ్రీరామా! "ఆత్మస్వరూపము ఏది" అని విచారించుటకు నా
రంభించి ఆత్మరూపమును ఎఱిఁగి, జ్ఞానమను ఆ అగ్నియందు త్రిలోకములను
తృణమును హోమముచేసిన మహామునికి ( ఈదృశ్య పదార్థము బ్రహ్మ
మునకంటె భిన్నము కాకపోవుటచేత ఆరెంటిని ఏకరూపముగచూచు మహా
మునికి ) చిత్తాదిరూపములగు భ్రాంతులు ఉండనేరవు. ఇట్లు సర్వభ్రాంతు
లు తొలఁగుటయే మోక్షము. కావున ఓ రఘురామా! నీవు జ్ఞానమాత్రరూ
పుఁడవు. విభాగములు లేనివాఁడవు. ఆద్యంత శూన్యుఁడవు. ఇట్టి నీస్వస్వరూ
పమును మరువ నేటికి? నిరర్థకముగా చిత్తాదిరూప మగు ఆవరణమును జెం
ద నేటికి? ఏమహానుభావుఁడు తన్ను తత్క్షణమే సంహరింప దలంచు ప్రబల
శత్రువును పరమమిత్రునివలె కనుగొనునో, అట్టివాఁడు యథార్థ స్వరూప
మును తెలిసికొనినవాఁడు. అంతర్ముఖత్వమును జెందినవాఁడు. నదియొకటి
గట్టు ప్రవాహసమయమునందు తనపైనున్న వృక్షమును వేరుతోకూడ
పెల్లగించునట్లు ఏమహానుభావుఁడు మాత్సర్య స్నేహములను వేరుతోకూడ
పెల్లగించునో, అట్టివాఁడు హర్షశోకములను జయించినవాఁడు. అంతర్ముఖత్వ

మును జెందినవాడు. శరత్కాలమునందు పొగమంచు నశించి పోవునట్లు వేదాంత శాస్త్రమను మహామంత్రమును జపించిన ఆశ అను విషూచికా వ్యాధి నిశ్శేషముగ నశించును. ఆశయే సర్వమునకు మూలము. కావున దానినాశముతోనే సర్వసంసారమును అణగును. ఇదియే సిద్ధాంతము. ఓరామచంద్రా ! ఇంతకును గురువాక్యములందును, శాస్త్రములందును, విశ్వాసము ఉండవలయును. అప్పుడు వారి ఉపదేశము బాగుగ మనస్సునందు స్థిరపడును. సర్వమును భావనాత్మకమే. కావున మనస్సు ఎవని వాక్యములయందు విశ్వాసము ఉంచును. వానివాక్యములు కాలిన నేలయందు జలము ప్రవేశించినట్లు ( ఇంకినట్లు ) హృదయమునందు ప్రవేశించును.

## —※ కృపణలక్షణము. ※—

ఓ శ్రీరామా ! ఎవరు వేదాంతశాస్త్రమును విచారింపరో, సర్వదృశ్యములకును సాక్షియై యున్న జ్ఞానముయొక్క స్వరూపమును విమర్శింపరో, చేతనరూపులగు తమ్ము అచేతనరూపులుగా భావింతురో, అట్టివారు మూఢులనబడుదురు. వారు జంఝామారుతమునందు ఇటునటు కొట్టుకొనుచున్న గడ్డిపోచవలె కదలు చుందురు. అయితే వీరుకూడ శుద్ధవిజ్ఞానస్వరూపులే, అనుటలో సందియము లేదు. అయినను వారు తమయథార్థస్వరూపమును ఎఱుగలేక పోవుటచేత నిరర్థకముగ దీనత్వమును జెందిరి. ఇట్టివారు చేయు బెదరింపులును, ఇట్టివారలు చేయు గర్జనములును, భేదాభిమాన యుక్తము లగుటచేత ( ఆత్మ ) వినాశకరములే. ధనువునుండి వచ్చు ధ్వనివలె కేవల హింసామాత్రప్రయోజనములే. ఆత్మజ్ఞానము లేకపోవుటచేత ఈ తర్జనాదులు వారిని బంధించునుగదా ? కావున అట్టి నీచునకు ఇవ్వబడినది దట్టమగు బురదలో వేయబడినదియే. వానితో సంభాషించుటకంటె శునకములతో సంభాషించుటయే శునకములను సైగలతో బిలచి నిరర్థకముగ దానితో చెల్లాట లాడుచు ప్రొద్దుబుచ్చుకొనుటయే, (అనగా ప్రయోజనకరము కానేరదనుట. ) ఓ రఘునందనా ! శ్రీరామా ! అజ్ఞానమే సమస్త ఆపదలకును మూలము. ఎఱుగనేరనివానికి ఆపత్తుకానిది ఏది కలదు ? ఒకొ్కక సమయమునందు అట్టివానికి తనకు గలుగుచున్న శుభముగూడ ఆపదగానే మారుచుండుటయు, ప్రత్యక్షముగ జూచు చున్నాము. హితోపదేశమును కీడుగా భావించు అవివేకులను ఎందఱిని చూచుట లేదు. ఈకారణమువలన ఈ సంసారమంతయును అజ్ఞానుల అనుగ్రహములను ఆశ్రయించియే ప్రవర్తించుచున్నది. కాబట్టి బుద్ధిమంతుల మనస్సులకు

వ ప్రపంచము అత్యల్పమై గోష్పదముతో సరిసమై యుండునో ( సుఖముగ అతిక్రమించుటకు వీలై యుండునో, ) ఆ ప్రపంచమే అజ్ఞానుల హృదయము లకు అపారమును అతిగంభీరమునగు మహాసముద్రము. బాగుగ విచారిం చిన ఇచట ప్రపంచము అనునదియే లేదు. దృశ్యములతో ఇంచుకమైనను సంబంధము లేనిదియు శాంతమైనదియు, సర్వరూపమైనదియు నగు సత్య జ్ఞానానందరూప బ్రహ్మము ఒకటియే కలదు.

—* ప్రకృతి స్వరూపము. *—

ఓ రామచంద్రా ! అట్టి ఆ పరబ్రహ్మమునుండి ప్రపంచ సంకల్ప రూపిణియగు ఒక కళ స్వయముగనే ఉదయించును. అది సూక్ష్మయనియు, మధ్యమయనియు, స్థూలమనియు, మూడువిధములుగ వర్ణింప బడియున్న ది. ఈ విభాగములకే క్రమముగా సత్వమనియు, రజస్సనియు, తమస్సని యు, పేరులు. ఇదియే ప్రకృతి. ఇదియే జీవుని సంసారము. దీనియందలి విరమే మోక్షము. సత్వాదులగు ఈ మూడుగుణములే ప్రకృతికి స్వరూప ము. ఈ మూడుగుణములును ప్రత్యేకముగా త్రివిధములై ఉన్నవి. కావున ఈ ప్రకృతికి విభాగములు తొమ్మిది అని అనవలయును. ఓ రఘురామా ! వేదమంత్రములను కనిపెట్టినవారును తపోవంతులును సిద్ధులును, నాగులును విద్యాధరులును, దేవతలును. వీరు పైజెప్పిన అవిద్యలో సత్వగుణమువలన సంభవించిన వారలు. గుణములు మూడును ప్రత్యేకముగ త్రివిధములని ఇదివరకే చెప్పియున్నారు. ఆ భేదములుకూడ సత్వాది రూపములే ( అన గా, సత్వమున సత్వము. సత్వమున రజస్సు. సత్వమున తమస్సు. రజస్సున సత్వము. అను మొదలగునవియె ) కావున సాత్వికభాగమని చెప్పబడిన సిద్ధాదులను విభజించెదను వినుము. ఇందు విష్ణురుద్రాదిదేవతలు సత్వాం శభూతులు. మంత్రద్రష్టలును, తపోవంతులును, సిద్ధులును, రజోంశభూ తులు. నాగులును, విద్యాధరులును, తమోంశభూతులు. అవిద్యలోని ఈ స త్వగుణము విద్య ( జ్ఞానము ) అయ్యెను. శుద్ధసత్వమే కదా జ్ఞానశబ్దముచేత లోకమునందు వ్యవహరింప బడుచున్నది. పైన వర్ణింపబడిన సిద్ధాదులు కూడ జ్ఞానవంతులని వ్యవహరింప బడుచున్నారు. పైన వర్ణించిన విధమున నే రాజస తామస సృష్టులు కూడ ప్రత్యేకముగా మూడు విధములై ఉ న్నవి. అందు మనుష్యులు అవిద్యయొక్క రజోంశము వలన సంభవించిన వారు. జ్ఞాన ప్రధానులగు బ్రాహ్మణులు అందలి సత్వాంశము వలనను, శౌర్య ప్రధానులగు క్షత్రియులు రజోంశము వలనను, ఇతరులు తమోం

శము వలనను, సంభవించిరి. తిర్యగ్జంతువులను, అజ్ఞాన పిండ రూపములగు వృక్షాదులును తమోమయ సృష్టియందు చేరుచున్నవి. అందు జ్ఞాన తారతమ్యములను అనుసరించి తిర్యగ్జంతువులయందు సత్వ రజోంశములను గుర్తింపవలయును, స్థావరములు తమోగుణమునందలి తమోంశమున పుట్టినవియె.

—* స్థావరములయందు చైతన్యముఉండు విధమును నిరూపించుట. *—

అని వశిష్ఠమహర్షి చెప్పిన విని శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓవశిష్ఠ మహాముని, అజ్ఞానము అధికమై తమోరూపమును జెందెనని అంటిరి కదా? అప్పుడు వానియందు చైతన్యము ఏవిధముగ నుండును ? అనిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓ రామచంద్రా ! స్థావరములయందును చైతన్యము కలదనుటలో సంశయము లేదు. చైతన్య హీనమగు పదార్థమే ప్రపంచమునందు లేదు. అప్పుడు ఆచైతన్యము సుషుప్త్యవస్థయందువలె సుఖదుఃఖములను ఎఱుగ లేకుండును. పూర్వాపరములను విమర్శింప లేకుండును. ఇట్లగుటచేత అది ( ఆచైతన్యము ) " మనస్సు " అనబడుటకు గాని " మనస్సుకాదు " అనబడుటకు గాని, వీలై యుండదు. సుషుప్త్యవస్థయందలి చిత్తమువలె బొత్తిగ గానరాకుండుటచేత " ఇదిమనస్సుకాదు " అనిచెప్ప బడుటకును, పూర్వాపర విమర్శ లేకున్నను అత్యల్పముగ విషయములను ఎఱుగుచుండుటచేత " ఇదీమనస్సు " అని కూడ చెప్పబడుటకును తగియుండును. ప్రస్తుతకాలమునందు ఈ విషయమును సాధనాంతరముల సహాయముచేత ప్రత్యక్షముగనే చూపుచున్నారు. ఒక అద్దమును( మూకటద్దమును )కంటికి వేసికొని చూచుచు గొడ్డలితో ఒక వృక్షమును నఱుకబోయినను, రాతిని ఒక ఉలితో చెక్కబోయినను ఇనుమును, ఒక సమ్మెటతో గొట్టబోయినను, వానియందు కలుగు భయకంపము ప్రత్యక్షముగనే గోచరమగును. ఇట్లగుటచేత మనవలె సర్వవ్యవహారములను చేయలేక పోవుటచేత వృక్షమునకు మనస్సు లేదు. ( వృక్షములందలి చైతన్యము మనోరూపముగ పరిణామమును చెందలేదు. ) అని చెప్పవలసి ఉన్నది. అవియు సామాన్యముగ భయాదులను గలిగి యుండుటచేత " వృక్షములకు మనస్సుకలదు ( అందలిచైతన్యము మనోరూపముగ పరిణమించెను ) అనికూడ చెప్పవలసియున్నది. కావున స్థావరములయందు నిలచియున్న చైతన్యమునకు గల రూపము మనస్సునకంటెను మనోభావమునకంటెను భిన్నమైన ఒక లక్షణరూపమని సిద్ధాంతము చేయవలసి యున్నది,

—* స్థావరములకు మోక్షము మిక్కిలిదూరమని నిరూపించుట. *—

అని వశిష్ఠమహర్షి చెప్పినవిని శ్రీరామచంద్రుండిట్లనియె. వేదవేత్తల లో శ్రేష్ఠుడవగు నోవశిష్ఠమహాముని ! ఇట్లయినచో వృక్షాది స్థావరముల కు ముక్తి మిక్కిలి చేరువ యని తలచెదను. మనుష్యాదులయందు ఆచైతన్య ము శుద్ధముగా నుండక మనోరూపముగ పరిణమించి బహువిధములుగ ప్రపంచకల్పనలను చేయుచు ఉండును. దానివలన వారు బహువిధములుగ భ్రాంతినొందుచు మోక్షమును సంపాదింపనేరక ఉందురు. వృక్షాదిస్థావర ములకు ఇట్టి ఇకట్టు లేదు. వానియందలి చైతన్యము మనోరూపముగ పరి ణమింపదు. ఇక వానికి మోక్ష సంపాదనమునందు విఘ్నకారి ఏదికలదు ? కావున మనుష్యాదీ జంగమ రూపములతో అందును ముఖ్యముగ మనుష్య రూపముతో పుట్టుటకంటె వృక్షాది స్థావర రూపములతో పుట్టుటయేఉత్త మమని తలచెదను. ఆజన్మమునందు ముక్తి సుఖసాధ్యమగునని నిరూపించితిని కదా? అని శ్రీరాముడుచెప్పిన వశిష్ఠమహాముని ఇట్లనియె. సర్వమును ఎఱిం గిన ఓ రామచంద్రా ! అట్లుకాదు. స్థావరములయందు చైతన్యము ఊరక నిదురించుచున్నట్లు ఉండును. ఈ కారణమువలన వానికి మోక్షము మిక్కి లి దూరమునందు ఉన్నదియే అని నిశ్చయింప వలయును. అనిన రామచం ద్రుం డిట్లనియె. వేదవేత్తలలో అగ్రేసరుడవగు నో వశిష్ఠమహామునీ! ఇట్లు చెప్పనేల ? స్థావరములయందు చైతన్యము నిర్వికారమై కేవల సత్తారూప ముతోనే ఉన్నదికదా ! ఇట్లుండగ వానికి ముక్తి దూరము ఏల కావలయు ను ? సత్తా సామాన్య రూపమే మోక్షముకదా ? అని శ్రీరాముడు చెప్పి న తత్వమును వివరించువాడై వశిష్ఠమహాముని ఇట్లని ఉత్తరమియ్య నారంభించెను.

—* మోక్షస్వరూపము. *—

ఓ శ్రీరామచంద్రా ! మొట్టమొదట మోక్షస్వరూపమును వివరిం చెదను వినుము. దానిచే నీసంశయము తీరును. మోక్షమనగా సత్తాసా మాన్యజ్ఞానము, లేక సత్తాసామాన్యస్థితి యనుట నిశ్చయము. అయినను ఆస్థితి బుద్ధిపూర్వకమగు విచారమువలన ప్రపంచముయొక్క అనిత్యత్వ ము బ్రహ్మాభిన్నత్వము అనునవి నిస్సంశయముగ అనుభవమునకు వచ్చి నప్పుడు మాత్రమే కలుగును. ఎవనికిని స్వాభావికమై ఉండదు ( జీవునకు జంగమరూపము ఉన్నను స్థావరరూపము ఉన్నను భ్రాంతి సంసారము ఉన్నంతవరకు ముక్తి కలుగదనుట ) ఎపుడైనను తనకు కలదానిని పరిత్య

జించినయెడల అప్పుడే త్యాగి అగును కాని ఆపదార్థము తనకు బొత్తిగనే లేకున్నను ఉపయోగించు సామర్థ్యము లేకున్నను త్యాగి కానేరడు. సర్వేంద్రియ పుష్టియు దృఢశక్తియు యౌవనమును గలిగి పరకాంతలను ఎంత సౌందర్యవతులనైనను జూడనివాడు జితేంద్రియుడగును కాని, ఇంద్రియహీనుడో, నపుంసకుడో, కాక, వృద్ధుడో, యై పరకాంతలను అవలోకనము చేయనివాడు అట్టివాడు ( జితేంద్రియుడు ) కానేరడు కదా ? కార్యవంతుడును నిగ్రహానుగ్రహ సమర్థుడును అగువాడు పరుడు చేసిన అపరాధమును క్షమించెనేని అట్టివానిని లోకులు శాంతస్వభావుడని ప్రశంసింతురుగాని, పిరికియై ఏమియు జేయుటకు సామర్థ్యము లేనివాడై ఉండువానిని అట్లు ప్రశంసింపరు కదా ? ఇట్లే “ ఇవి సంస్కారములు, వీనివలన ప్రపంచము పుట్టుచున్నది. ఇవియే సర్వానర్థములకు మూలకారణములు. ” అని తెలిసికొని పిమ్మట విచారదృష్టిచేత ఆవాసనలను పరిత్యజించినవాడే వాసనా పరిత్యాగి అనబడును గాని, వానిని ఎరుంగుటకైన శక్తిలేనివాడు అట్టివాడు కానేరడు. అట్టి వాసనా పరిత్యాగముచేత సంపాదింపబడిన మోక్షమే మోక్షమనబడును కాని, ఇతరము అట్లు చెప్పబడదు.

శ్లో॥ విచార్యార్యైస్సహాలోక్య శాస్త్రాణ్యధ్యాత్మభావనాత్ ।
సత్తాసామాన్యనిష్ఠత్వం యత్తద్బ్రహ్మపరంవిదుః ॥

ఓ శ్రీరామా ! శాస్త్రములను స్వయముగను సత్పురుషుల సహాయముచేతను విచారించి ఆత్మస్వరూపమును నిర్ణయించి సర్వవాసనలను పరిత్యజించి సత్తా సామాన్యస్థితితో నిలచుట ఏది కలదో, అదియే మోక్షము. ఓ రామచంద్రా ! ఇట్లుకాక వెలికి విజృంభింపకున్నను సంస్కారములు విత్తనమునందున్న మొలకవలె, మూఢములై ఎన్నడు లోలోన అణగియుండునో, ఆసమయము సుషుప్తి అనబడును. అప్పుడు లేకున్నను తగిన పదార్థములు సంయోగమును చెందినప్పుడు ఆవాసన విజృంభింప వచ్చును కదా ? కావున అట్టిస్థితి పునర్జన్మహేతువు అగును. ఇదియు వాసనా పరిత్యాగమే అయినట్లు తోచినను ముక్తి కానేరదు, వాసనలు విజృంభించుచున్నప్పుడు వానిని బలాత్కారముగ పరిత్యజించుట పరిత్యాగమగును కాని చాంచల్యమే లేక మూఢములై ఉన్నప్పుడు తానును ఊరకయుండుట అట్టిది ( పరిత్యాగము ) కానేరదు కదా ? కావున ఇది కేవల సుషుప్తావస్థయే. ఇది జడములకు స్వాభావికము. చేతనములకు ఆగంతుకము. ( వచ్చుచు పోవుచు నుండునది. ) దీనియందు తగిన సహాయము లేకుండుటచేత

మనోవ్యాపారము లోపల అణగియుండును కాని, నశింపదు. సంస్కారములును నిదురబోవుచుండును గాని, ధ్వంసమునొందవు. కావున ఈస్థితివేలు వేలుగా జన్మపరంపరల గలిగించునదియే గాని, కైవల్యమును కలిగించునది కాదు. ఇందు సర్వసంసార బీజమగు మానసమును దానికి గారణములగు సంస్కారములును అట్లే యున్నవి కదా ? విచారించినచో జడస్వభావము కల ఈ వృక్షాది స్థావరములన్నియు ఈ సుషుప్తావస్థను చెందినవియే. జన్మ పరంపరల నొందునవియే. వానికి ఆ సంస్కారములను గ్రహించుట యందు కాని వానిని పరిత్యజించుటయందు కాని, సామర్థ్యము లేదుకదా? ఓ సత్పురుషుడా ! విత్తనములయందు పుష్పములు ఎట్లు లీనములై యుండునో, మృత్తికయందు ఘటములు ఎట్లు లీనములై యుండునో, అట్లే వాసనలయందు జన్మపరంపరలు అణగి యుండును. ఏస్థితియందు సంస్కారమునైదు సర్వసంసార బీజము శేషించియుండునో, అది సుషుప్తావస్థ. దేనియందు అది నిశ్శేషమగునో, అది తుర్యావస్థ ఇందు మొదటిది జన్మకారణము. రెండవది మోక్షావస్థ.

శ్లో॥ వాసనాయా స్తథావహ్నే ర్ఋణవ్యాధిద్విషామపి ।
స్నేహవైరవిషాణాంచ శేషస్స్వల్పోపిబాధతే ॥

ఓ శ్రీరామా ! సంస్కారము, అగ్ని, అప్పు, వ్యాధి, శత్రువు, ప్రేమ, విరోధము, విషము, అనునివి ఎంతమాత్రము మిగిలియున్నను బాధకరములే. కావున వివేకవంతుడై సంస్కార రూపములను ఎఱింగి వానిని సంపూర్ణముగ ధ్వంసముచేసి సత్తాసామాన్య రూపములను పొంది ఏమహాత్ముడు వెలుగుచుండునో, వాడు జీవించినను మృతుడైనను మోక్షమును జెందినవాడే. కావున పృథుజన్మమునకంటె మనుష్యజన్మమునకే మోక్షము సమీపము. వాసనా స్వరూపమునైనను తెలిసికొనలేని స్థావర రూపమునకంటె వానిపై సంపూర్ణ స్వాతంత్ర్యము కల జంగమ జన్మమే అందును ముఖ్యముగ మనుష్యజన్మమే సర్వోత్తమము.

—* అవిద్యాలక్షణము. *—

ఓ సకలసద్గుణనిధీ ! శ్రీరామచంద్రా ! మఱి యొక విషయమును వినుము. సంస్కారములకును మూలమై శుద్ధ చైతన్యము, లేక, జ్ఞానశక్తి, సర్వదేహములయందును ఉన్నది. దీనిని చూడలేక పోవుట ఏది కలదో, అదియే అవిద్య. అని పెద్దలు చెప్పుదురు. "ఈప్రపంచము పరబ్రహ్మము కాదు" అను నిశ్చయము ఏది కలదో, అదియే అవిద్య. అట్టి నిశ్చయమును

శాస్త్రదృష్టిచేత పరిత్యజించి " ఇది అంతయు బ్రహ్మమే " అను నిశ్చయ ము ఏది కలదో, అదియే విద్య ( జ్ఞానము ) కావున ఓ రఘురామా! విష్ణు బ్రహ్మ రుద్రాది దేవతల యొక్కయు, నారదాది మహాఋషుల యొక్క యు, మనస్సులయందు ఏనిశ్చయముకలదో, అది నీమనస్సునందును కలుగునుగాక.

—* ముక్తిప్రద నిశ్చయము. *—

అని వశిష్ఠమహర్షి చెప్పిన విని శ్రీరామచంద్రుం డిట్లనియె. భగవంతుడా ! బ్రాహ్మణోత్తమా ! వశిష్ఠమహాముని ! ధైర్యవంతులై మహాబుద్ధిమంతులై యుండు ఈ రుద్రాది మహాత్ములు ఏనిశ్చయముచేత పరమపదమునొంది సర్వదుఃఖ వినిర్ముక్తులై ఉన్నారో, ఆ నిశ్చయమును నాకు వివరింపుము. జ్ఞానము అభివృద్ధి నొందును గాక. అని శ్రీరాముడు పలికిన వశిష్ఠమహాముని ఇట్లని వివరించెను. మన ఎదుట గానవచ్చు ప్రపంచమంతయు అతి విస్తారమై నానా భేదములు కలిగియున్నట్లు తోచుచున్నది కాని, ఇది అంతయును ఒకటియే. ఇదియంతయు పరబ్రహ్మమే. సర్వపదార్థములను ప్రకాశింపజేయు చైతన్యము బ్రహ్మమే. ప్రపంచమంతయు బ్రహ్మమే. నేనును బ్రహ్మమే. నాశత్రువులును బ్రహ్మమే. నామిత్రులును బంధువులును కూడ బ్రహ్మమే. అజ్ఞానియగువానికి బ్రహ్మరూపమై ఆనందమయమై ఉన్న ఈ ప్రపంచము దుఃఖమయమై గానవచ్చుచుండును. జ్ఞానవంతునకు పరమానందరూపముతో దెలియవచ్చును. తాను గుడ్డివాడైన ప్రపంచమంతయు ప్రకాశహీనమే. దృష్టికలవాడైన సర్వమును ప్రకాశవంతమే. కావున సర్వప్రపంచమును బ్రహ్మయని భావించువాడు బ్రహ్మమే అగును. అమృతపానము చేసిన పిమ్మట అమృతమయుడు కానివాడు ఎవ్వడు. మిక్కిలి నిర్మలమైనదియు, సర్వపదార్థములను ప్రకాశింప జేయునదియు, చేతనా చేతనములందు అన్నిట ఉండునదియు, సర్వలోక ప్రసిద్ధమైనదియు, నగు జ్ఞానము బ్రహ్మముయొక్క అంశమాత్రమే. బ్రహ్మమునకుగూడ ఇదియే స్వరూపము. కావున " జ్ఞానమే బ్రహ్మము " అని మహాత్ములచేత అనుభవింప బడుచున్నది. మనస్సు ఒకవిషయమును విడిచి దూరమునందు ఉన్న మఱియొక విషయమును ఆశ్రయించినపుడు ఈ రెండు సంకల్పములకు మధ్యకాలమునందు నిర్వికారమై ఒకదానిని అంగీకరింపక మఱియొకదాని విడువక తేజరిల్లు శుద్ధజ్ఞానము ఏదికలదో అదియే బ్రహ్మమని మహాత్ములచేత అనుభవింప బడుచున్నది. సర్వసంకల్పములకును ఆయావిష

యములు ప్రకాశించుటయే ఫలము. అట్టిఫలము దేనిప్రభావమువలన కలుగుచున్నదో, ఏది సర్వతేజస్సులను ( సూర్యాదు మొదలగువారిని ) ప్రకాశింప జేయుచున్నదో, గ్రహింపదగినవానిలో ఎల్ల ఏది ఉత్తమోత్తమమైనదో, అట్టిజ్ఞానమయాత్మ పండితులచేత అనుభవింప బడుచున్నది. మఱియు సర్వసంకల్పములును లేనిదియును, ఆశ్చర్యములను, సంక్షోభములను, గూడ విడచినదియు, నగు జ్ఞానరూప బ్రహ్మమే మహాత్ములకు అనుభవములోనున్నది. ఓరామచంద్రా ! పైన వర్ణించిన విధముగ " సర్వమును బ్రహ్మమే. " ) అను నిశ్చయము కలిగి ఆ రుద్రాది దేవతలును, నారదాది మహాఋషులును, తత్తుల్యంగల మహాత్ములును, సర్వపాపవినిర్ముక్తులై నాశ రహితులై శాశ్వతమును, పరమానందకరమును, సర్వసంక్షోభ శూన్యమును, అగు ముక్తిప్రదమునందు సుఖముగ ఉన్నవారు. ఇట్లు సర్వపరిపూర్ణ మగు బ్రహ్మమును గూర్చిన దృఢవిజ్ఞానము కలిగి సర్వమును ఆత్మయే. కావున కామక్రోధాదులచేతగాని, హర్ష శోకములచేతగాని, బాధింపబడక ధైర్యవంతులై ఉందురో, అట్టిమహానుభావులు బ్రతుకును ప్రశంసింపరు. మరణమును నిందింపరు.

అని వశిష్ఠమహర్షి చెప్పినవిని శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా ! వశిష్ఠమహామునీ ! యథార్థజ్ఞానమువలన నా సంసారములు అణగినవి. నిశ్చయముగ జీవన్ముక్తస్థితిని జెందితిని. ఇక కావలసినది ఏమియనిన, ఓ బ్రాహ్మణోత్తమా! ప్రాణవాయువులను నిరోధించుటవలన గూడ సంసారములు నశించు నంటిరికదా ? అప్పుడు జీవన్ముక్తస్థితిదొరకు విధము ఎట్లు ? వారికి జ్ఞానము ఉండదుకదా ? అని శ్రీరాము డడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓ రఘురామా ! సంసార సముద్రమును తరించుటకు నిర్ణయింపబడిన ఉపాయమును యోగమనియెదరు. అది జ్ఞానము, వాయునిరోధము, అని రెండువిధములు. ఈ రెంటికినిగూడ యోగశబ్దము వాచకమే మైనను జ్ఞానమునందు గౌణముగను, వాయు నిరోధమునందు రూఢముగను, ప్రవర్తించుచున్నది. ( యోగశబ్దమునకు వాయు నిరోధము ముఖ్యార్థము, జ్ఞానము అప్రధానార్థము అనుట.)

శ్లో॥ అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిత్ జ్ఞాననిశ్చయః ।
ప్రకారౌద్వౌతతో దేవో జగాదపరమశ్శివః ॥

ఓ శ్రీరామా ! ఒకానొకనికి యోగమును ( వాయు నిరోధమును) సాధించుట కష్టమగును. మఱియొకనికి జ్ఞానమును సాధించుట. కష్టమగును

ఇట్లగుటచేత సర్వ జనులకును సుఖముగ నుండుటకై ఆనందరూపుడగు పర మేశ్వరుడు ఈ రెండుమార్గములను కూడ దయచేసియున్నాడు.

—✻ భుసుండోపాఖ్యానము. ✻—

ఓసద్గుణనిధీ! శ్రీరామా! నీకు జ్ఞానమువలన ముక్తికలుగు విధమును ఎల్ల ఇంతకుముందే వివరించితిని. ఇక యోగ స్వరూపమును (వాయునిరోధస్వరూపమును) వినుము. ఈవిషయము తేటపడుటకై అత్యాశ్చర్య కరమగు ఒక మహాపురుషుని చరిత్రమును తెలిపెదను. వినుము. ఒకానొక సమయమునందు నేను స్వర్గలోకమున దేవేంద్రుని సభయందు ఉంటిని. అప్పుడు నారదాది మహామునులు అనేకులు అచ్చటికి వచ్చిరి. చిరకాలజీవులగు మహాత్ములయొక్క చరిత్రములు ప్రస్తావానుసారముగ జెప్పిరి. ఇట్లు కథా ప్రసంగము జరుగుచుండగ శాతాతపుడను ఒక మహాముని ఇట్లనియె.

ఓసభాసదులారా ! మేరుపర్వతమునకు ఈశాన్య భాగమునందు మనోహరమగు ఒక శిఖరముగలదు. అందు పుట్టునట్టి వృక్షములన్నియు పద్మరాగమయములు. అచ్చోట ఒక కల్పవృక్షము గలదు. ఆకల్పవృక్షమునకు దక్షిణపార్శ్వమునందు ఒకశాఖకలదు. ఆశాఖకు రజతమయములగు బహువిధ తీగెలు అల్లుకొని ఉండును. ఆకొమ్మపైన ఒకపక్షిగూడు ఉన్నది. ఆగూటియందు భుసుండుడను ఒక కాకి, “ కమలమధ్యముననున్న కమలాసనునివలె ” నివసించుచుండును. అతడు రాగద్వేషములు లేనివాడు. అతడు చాలాకాలమునుండియు జీవించుచున్నాడు.

ఓదేవతలారా ! అట్టి చిరంజీవి భూలోకమునందే అననేల ? స్వర్గమునందును ఇంతకుముందు లేనే లేదు. భవిష్యత్కాలమునందును అట్టివాడు ఉండగలడని నమ్మకముగూడ లేదు. ఆభుసుండుని ఆయువునకు మితియే లేదు. ఆతడు ఆరోగ్యవంతుడు. కాంతిమంతుడు. మిక్కిలి బుద్ధిమంతుడు. పరమశాంతి నొందినవాడు. ప్రపంచమునందే ఉన్నను ఏ కలతలను జెందక శాంతి నొందినవాడు. సర్వజనులకును మనోహరుడు. భూత భవిష్యద్వర్తమాన కాలములను ఎఱిగినవాడు అని చెప్పెను. ఓరామభద్రా ! అంత మే మందరమును ఆభుసుండునిగూర్చి మఱల మఱల ప్రశ్నింపగా అమ్మునియు అనేకవిధములుగ వానిని వర్ణించి చెప్పెను. అది దేవసభ కావున అందు చెప్పబడిన వాక్యములు అతిశయోక్తులు కానేరవు. సత్యములయ్యే ఉండును. అని నిశ్చయించుకొని నేను మునులును దేవతలును, తమతమ ప్రసంగములను చాలించి వెడలిపోవునంతవరకు అందేయుండి పిమ్మట ఆభుసుం

ముని చూడవలయునని ప్రయాణమైతిని. ఇట్లు పోయి ఆభుసుండుడు ఉన్న మేరుపర్వత శిఖరమును జేరితిని. శాఖలచేత చక్రాకారముగనున్న కల్ప వృక్షమును చూచితిని. ఆవృక్షముయొక్క ఆకులయందును కొమ్మలయందును పువ్వులయందును తొఱ్ఱలయందును చీలికలయందును గూళ్ళనుకట్టి అనేక పక్షులు నివసించుచుండినవి. అందు ఒక స్థలమున చంద్రఖండములతో సమానములగు తామరతూండ్లచేత పెరిగిన బ్రహ్మదేవుని వాహనములగు హంసలయొక్క సంతానము సామగానమును చేయుచుండెను. మఱియొకచోట చిలుకలు మంత్రములను ఉచ్చరించుచుండెను. వేఱొక స్థలమునందు కాకులు " స్వాహా, స్వాహా " అనునట్లు కూయుచుండెను. మఱియొక ప్రదేశమునందు కోకిలలు మధురముగ పంచమస్వరమును గానము చేయుచుండెను. మఱియును అనేక పక్షులు అనేకవిధములుగ కలకల ధ్వని చేయుచుండెను. మఱియు పార్వతీదేవియొక్క కేశపాశమువలె మిక్కిలి అందమైయుండు పింఛము గలిగి కుమారస్వామికి వాహనములై అమ్మహాత్ముని ఉపదేశమువలన శైవశాస్త్రరహస్యముల నెల్ల నెఱిగిన నెమళ్లు ఒకపక్క నృత్యము చేయుచుండెను. అట్టి ఆస్థలమును చూచుచు పోయిపోయి ఆవృక్షముయొక్క దక్షిణ శాఖయందు ఒకగూటిలో ఏకాంతముగ కాలువుదీరి కూర్చుండి ఉండిన అనేక వాయసములను వీక్షించితిని. ఆసభామధ్యమునందు ఉన్నతాకారుడును, సుందర స్వరూపుడును, సర్వసముడు నగు, భుసుండుడు పద్మాసనమునుబూని కూర్చుండి ఉండెను. అతడు ప్రాణ నిరోధముచేత మనస్సును బ్రహ్మము వైపునకు త్రిప్పినవాడు. సూక్ష్మబుద్ధికలవాడు. నిత్యానందమును అనుభవించువాడు. మృదుస్వభావుడు. సరసముగ సంభాషించు నేర్పుగలవాడు. ఆతనిమనస్సు మిక్కిలి నిర్మలమై గంభీరమై ఉండెను.

ఓనీలమేఘశ్యామా! రామా! ఇట్లు ఆతని గాంచి దేదీప్యమానమగు ఈదేహముతో ఆకాశమునుండి నేను అతనికి అభిముఖముగ దిగితిని. అప్పుడు నన్నుచూచి " నల్లకలువలగుంపు గాలికి చలించునట్లు " సభయందున్న కాకులన్నియు సంక్షోభమునొందెను. ఆభుసుండునకుమాత్రము భయము ఇంచుకయైనను లేదు. నన్ను చూచినతోడనే " ఈయన వశిష్ఠమహాముని నన్ను చూచుటకు వచ్చెను " అని ఆభుసుండుడు తత్క్షణమే తెలిసికొనెను. అంత తాను కూర్చుండియున్న ఆకుల గుంపునుండి వెలుపలకువచ్చి "పర్వతమునుండి పైకి ఎగసిన మహామేఘమువలె" ప్రకాశించుచు " ఓవశిష్ఠమ

హామునిగారా ! మీ రాక శుభమగుచుగాక ” అని నాతో వినయపూర్వక ముగ బలికెను. ఓ శ్రీరామా ! మఱియొక ఆశ్చర్యమును వినుము. సంక ల్పించినతోడనే ఆభుసుండునికి హస్తములు పుట్టెను. ఆహస్తములతో ఆభుసుండుడు పుష్పములను దెచ్చి “మేఘము మంచుబిందువులను విడుచునట్లు” ( వర్షము ముగిసిన పిమ్మట మంచును విడచునదియు మేఘమే ) దోయిటి తో వానిని ( ఆపుష్పములను ) నాపాదములపై విడచెను. మఱియును ఆప క్షిరాజము “ ఇదిగో ఆసనము దీనిని గైకొనుడు ” అనుచు కల్పవృక్షము యొక్క చిగురాకును ఒకదానిని స్వయముగ దెచ్చి ఇచ్చెను. మహాబుద్ధి మంతుడగు ఆతడు చేయు మర్యాదలకు సంతుష్టుడనై ఆతీగె జంపమున అతడు ఇచ్చిన ఆసనముపై గూర్చుంటిని. తక్కిన పక్షులన్నియును ఆశ్చర్య ముతో నావంకనే చూచుచుండినవి. మఱియును ఆభుసుండుడు అర్ఘ్యపా ద్యాదుల సంపాదించి అతిథి పూజ చేసిన పిమ్మట సవినయముగ నాతో ఇట్లనియె.

ఓమహాత్మా! మీరు చిరకాలమునకు నన్ను అనుగ్రహించితిరి. మిమ్ము జూచుట అనియెడు మేఘము అమృతవృష్టిని గురియించుచు నన్ను నాకు నివాసమగు ఈవృక్షమును గూడ ముంచివైచినది. మీరు ఇందులకు వచ్చు టకు గారణమేమి ? ఇంతశ్రమను ఏల గైకొంటిరి. మీవాక్యమును వినవల యునని మిక్కిలి కుతూహలముగ ఉన్నది. మమ్ము ఆజ్ఞాపింపుడు. అట్లగును గాక. నేనే విన్నవించుకొనియెదను. ఓమహాత్మా! వశిష్ఠమహామునిగారూ ! మీయొక్క పాద సందర్శనముచేత నాకు సర్వమును తనంతనే స్పష్టమై నది. చిరంజీవు లగువారినిగూర్చి జరుగుచున్న ప్రస్తావమునందు నేను మీచిత్తమునకు తగిలితిని. ఓమహామునీ ! ఇట్లు మీరాకకు గారణము ఎఱిగి యు మిమ్ము ప్రశ్నించితిని. ఇది ఒక అపరాధముగా భావింపవలదు. అట్ల డుగుట మీవాక్యామృతమును ఆస్వాదించుటకేగాని, మఱి ఎందుకునుగాదు. అట్టిఇచ్ఛ నామనస్సునందు తొందర చేయుచున్నది. ఓరఘురామా! దివ్య తేజోవంతుడును చిరంజీవులలో అగ్రేసరుడును త్రికాలవేదియు నగు ఆభు సుండుడు ఇట్లుపలికిన నేనును ఈక్రింది విధముగ బలుక నారంభించితిని. ఓపక్షిశ్రేష్ఠుడా! నీవన్నమాట నిశ్చయము. చిరకాలజీవులలో అగ్రేసరుడ వని విని నేను నిన్ను చూచుటకయ్యే వచ్చితిని.

ఓభగవంతుడా ! భుసుండమహాత్మా ! నీవు నాసంశయమును పో గొట్టుము. నీవు ఏకులమునందు పుట్టితివి ? ఇట్టి బ్రహ్మజ్ఞానము నీకు ఏతీరున

కలిగినది. నీఆయుష్కాలమెంత ? వెనుక గడచిపోయిన విషయములు జ్ఞప్తి యందు ఉన్నవా ? మఱియు భూత భవిష్య ద్వర్తమానములను ఎఱిగిన ఏమహాత్ముడు నీకు ఈనివాసస్థలమును ఏర్పఱచెను ? ఓరఘురామా ! ఈవిధముగ నేను అత్యాశ్చర్యముతో ప్రశ్నచేయుటను జూచియును ఆతడు ఉప్పొంగలేదు. మఱియును ఏవిధమగు వికారమును జెందలేదు. సామాన్య స్థితితోనే " ఓమహామునీ ! మీప్రశ్నములకు అన్నిటికిని ఉత్తరము ఇచ్చెదను " అనుచు ఇట్లుచెప్ప నారంభించెను. ఓ వశిష్ఠమహామునీ ! మీబోటి మహాత్ములయొక్క ఆజ్ఞలను ఎవ్వడు తిరస్కరింప గలుగును. నాయొక్క జన్మవృత్తాంతమును చెప్పుచున్నాను వినుడు. సర్వదేవతలచేతను నమస్కరింపబడును సర్వోత్తముడై శ్రీశంకరుడు ప్రకాశించు చున్నాడు గదా ? అమ్మహాత్మునియొక్క ప్రమథగణములు వివిధ ప్రభావ వంతులై ఆనందింప జేయుచురు. వారలలో కొందరకు పాదములకుగల సామర్థ్యము (నడచుట మొదలగునవి) శిరములయందుగూడ ఉండును. మఱికొందరకు హస్తములకు గల సామర్థ్యము పాదములయందుకూడ నుండును. వేఱొక కొందరకు దంతములకును, ముఖములకును, గర్భమునకును, కల సామర్థ్యమంతయును హస్తములయందుగూడ నుండును. వీరివలెనే మాతృకలును ఆరుద్రుని పరివారములో జేరినవారే. వారు సకల భూతములును తమ్ము సేవింప అప్పరమేశ్వరుని ఎదుట నృత్యములు సలుపుచుందురు. ఆమాతృకలు ఒకొక్కమారు పర్వత శిఖరములయందును, మఱియొకసారి ఆకాశమునందును, ఇంకొక సమయమున లోకాంతరములయందును, ఒకానొక కాలమున గుంటలయందును, వేఱొకసమయమున శ్మశానములయందును, మనుష్యుల శరీరములయందును, నివసింపుచుందురు. జయ, విజయ, జయంతి, అపరాజిత, సిద్ధ, రక్త, అలంబుస, ఉత్పల, అనునవి క్రమముగ వారి నామధేయములు. వీరు మాతృకలకందఱకును అధిదేవతలు. వీరిని అనుసరించి కొందరును, వారిని అనుసరించి మఱికొందరును, వర్తింపుచున్నారు. ఓపూజనీయా! వశిష్ఠమహామునీ! పైన వర్ణింపబడిన అష్టమాతృకలలో అలంబుస అనుమాత మిక్కిలి ప్రసిద్ధి గాంచినది. వజ్రమువలె మిక్కిలి కఠినమగు ముక్కు గలిగి ఇంద్రనీల పర్వతమువలె విశాలదేహముగలిగి చండుడను పేరుతో ఒప్పుచున్న ఒక వాయసశ్రేష్ఠుడు వైష్ణవీ శక్తికి గరుత్మంతుడును వలె " నాఅలంబుసకు వాహనమై ఉండెను. ( వైష్ణవి అనుశక్తియు అష్టమాతృకలలో ఒకతెయె ) ఈవిధముగ అతి భయంకరములగు చేష్టలను

ఆచరించు సప్తమాతృకలు ఒకానొక సమయమునందు ఏదో ఒకకారణము వలన అందరును ఒకటిమాఱుగ ఆకాశమునందు గుంపుగా గూడిరి. ఇట్లు జేరి ఆత్మానుభవానందమును వెల్లడించుచు మహోత్సవమును గావించిరి. నవ్విరి. నృత్యము గావించిరి. పానముజేసిరి. బిగ్గరగ గానము చేసిరి, ఇట్లు మహోత్సవము జరుగుచుండగా లోకోత్తరములగు వారి వాహనములు గూడ గుమిగూడి ఒకస్థలమునందు నవ్వుచుండినవి. మదముచేత నృత్యములను ఆచరించినవి. మద్యమును పానము చేసినవి. ఇట్లుండగ మద్యపానముచేత మదించి బ్రాహ్మీశక్తికి ( ఇదియును అష్టమాతృకలలో ఒకటితె, బ్రాహ్మీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, ఇంద్రాణీ, చాముండా, అనునవియు సప్తమాతృకలు ) వాహనములైన ఆడుహంసలును, అలంబుసకు వాహనమగు మగకాకియును, ఒకటిచో నృత్యము చేయుచుండెను. అంత మదాతిరేకమున కామాతురలై హంసస్త్రీలు చండుడనుపేరుగల ఆకాకితోగూడా మన్మథక్రీడల గావించినవి. వానికి గర్భము గలిగెను. పిమ్మట ఆమాతృకలునునృత్యములను చాలించి పానమదమునుండి విముక్తలయిరి. పిదప పరమేశ్వరుండును ఆమాతృకలును సంతోషయుక్తులై తమ పరివారముతోగూడి నివాస స్థానమునకు పోయిరి. ఓ మహాత్మా ! పైన వర్ణించిన విధముగ గర్భవతులై ఆహంసస్త్రీలు తమ యజమానురాలగు బ్రాహ్మీశక్తికి తమ విధమునెల్ల విన్నవించిరి. అప్పుడు ఆబ్రాహ్మీశక్తి ఇట్లనియె. ఓ బిడ్డలారా ! మీరు ఇక నన్ను వహింపలేరు. గర్భభారముచేత డస్సియున్నారు. కావున ఈ సమయమునందు మీరు యథేచ్ఛగ సంచరింపుడు. ఈ విధముగా గర్భవతులగు తనహంసాంగనలకు సెలవు ఇచ్చి ఆబ్రాహ్మీశక్తి తాను సంచరించుటకు అనువుకాక పోవుటచేత ఆత్మధ్యానపరురాలై నిర్వికల్ప సమాధియందు నిలచి పరమానందమును అనుభవించు చుండెను. ఆ హంసాంగనలును కాలక్రమమున గర్భము పక్వముకాగానే సత్యలోకమునందలి సరస్సులో క్రమముగ ఇరువదియొకటి పుత్రులను గనిరి. ఓమునిశ్రేష్ఠా ! ఆ హంసలకు బుట్టిన పుత్రులమే, మేము. ఇరువదియొకటిమంది అన్నదమ్ములము. అలంబుసా వాహనమగు కాకి మాకు తండ్రి కావున మేమున్ను కాకులము. అంత మేము మాతల్లులతోగూడి బహుకాలము ఆబ్రాహ్మీశక్తిని ఆరాధించితిమి. ఆమెయున్ను సమాధినుండి మేలుకొని దయామయురాలై మాకు ఆత్మజ్ఞానమును అనుగ్రహించెను. ఆప్రభావమువలన మాకు జీవన్ముక్తి దొరికినది. ఇట్లు ఆత్మ స్వరూపమును ఎఱింగి

తృప్తినొంది " ఎచ్చటనైనను ఒక ఏకాంత స్థలమునందు సమాధినిష్ఠులమై ఉందుముగాక" అని నిశ్చయించి అట్టి స్థలమును తెలిసికొనుటకై తండ్రి చెంతకు జేరితిమి. అట్లుజేరి ఆయనకును అలంబుసాదేవికిని నమస్కరించితిమి. అప్పుడాదేవి దయాదృష్టితో చూడగా మేము తండ్రితో, ఇట్లంటిమి. ఓతండ్రీ! బ్రాహ్మీశక్తియొక్క అనుగ్రహమువలన తెలిసికొనవలసిన విషయమును తెలిసికొంటిమి. ఇక మాకు ఉచితమగు ఏకాంతస్థలము దొరుకుటకై మీ అనుగ్రహమును ప్రార్థించుచున్నాము. అనిపలికితిమి. అప్పుడు మహాజ్ఞానియు, సర్వార్థములను ఎఱిగినవాడును నగు మాతండ్రి మాకు ఈ కల్పవృక్షమును నివాసస్థానముగా జూపెను. ఇచ్చట మేము నిరపాధులమై నాటినుండియు, నివసించుచున్నాము. ఓ మునిశ్రేష్ఠా ! నాటినుండియు సంపాదించిన పుణ్యములు నేటికి ఫలించినవి. తలవని తలంపుగ మీబోటి మహాత్ములను చూచుభాగ్యము కలిగినది.

శ్లో॥ రసాయనమయీశాంతా పరమానందదాయినీ ।
నానందయతికంనామ సాధుసంగతిచంద్రికా ॥

ఓ వశిష్ఠమహాముని ! సాధుసాంగత్యమనునది వెన్నెలవంటిది. అమృతమయమైనది. శాంతమైనది. పరమానందమును ఇచ్చునది. ఇట్టిదానిచేత ఎవనికి తృప్తికలుగదు.

శ్లో॥ నాతఃపరతరంకించి న్మన్యేకుశలమాత్మనః ।
సంతోయదనుగమ్యంతే సంత్యక్తసకలైషణాః ॥

ఓ వశిష్ఠమహాముని ! ఆశలనుజయించిన మహాత్ములయొక్క సమీపమునందు నివసించుటకంటె అధికమగు శ్రేయస్సు ప్రపంచమునందే లేదని నా అభిప్రాయము.

శ్లో॥ అధిగతపరమాత్మనోపిమన్యే
భవదవలోకనశాంతదుష్కృతస్య ।
మమసఫలమిహాద్యజన్మసాధో
సకలభయాపహారోహిసాధుసంగః ॥

ఓ సత్పురుషశ్రేష్ఠుడా ! నేను పరమాత్మరూపమును ఎరిగినవాడనైనను మీదర్శనముచేతనే కృతార్థత నొందితినని నిశ్చయముగ చెప్పగలను. సత్పురుష సమాగమము సర్వసంతాపముల హరించునది. సర్వశుభములను ఇచ్చునదికదా. ఓ రామచంద్రా ! ఈ విధముగ తన జన్మ వృత్తాంతమును ఎఱింగించి మఱల అర్ఘ్యపాద్యములను ఇచ్చి ఆ భుసుండుడు మౌనముగ

ఊరకుండుటను జూచి మఱియును నేను ఇట్లంటిని. ఓ పక్షిశ్రేష్ఠుడా ! నీకు మహాజ్ఞానవంతులగు ఇరువదిమంది సోదరులు కలరని చెప్పితివిగదా ? వారలు ఇప్పుడు కానరాలేదు. ఏల? నీవు ఒకరుడవే ఉండుటకు గారణమేమి ? అనిన భుసుండు డిట్లనియె, ఓ వశిష్ఠమహాముని ! విచారశీలుడా! నేను ఇప్పటివాడనుకాను. నాతమ్ములును ఇప్పటివారుకారు. మేము ఈ కల్పవృక్షమును ఆశ్రయించిన పిమ్మట ఎన్నియో యుగములు గడచిపోయినవి. ఎన్నియో బ్రహ్మకల్పములు ముగిసిపోయినవి. ఇంతకాలము గడచుటచేత నాతమ్ములందరును తృణప్రాయముగ తనుశరీరములను వదలి పరమశివునియందు ఐక్యము నొందిరి.

శ్లో॥ దీర్ఘాయుషోమహాంతోపి సంతోపిబలినోపివా ।
సర్వఏవనిగీర్యంతే కాలేనాకలితాత్మనా ॥

ఓ వశిష్ఠమహాముని ! ఎంత దీర్ఘాయువులైనను, గొప్పవారైనను, సత్పురుషులైనను, బలవంతులైనను, సర్వసంహారకమగు కాలముచేత ఎప్పటికైనను మ్రింగివేయబడియే తీరుదురు. అని భుసుండుడుచెప్పిన విని మరల నేను ఇట్లడిగితిని. ఓ భుసుండుడా ! బుద్ధిశాలీ ! నీవు నీ సహోదరులలో నెల్ల జ్యేష్ఠుడవా ? అయితే సరియే. ప్రళయకాలములయందు సర్వప్రపంచమును ధ్వంసము చేయుటకై బడబాగ్నియు సముద్రమును విజృంభించినప్పుడు వాయువులు తన సప్తరూపములను ( సప్తవాయువులు గలవనుట ప్రసిద్ధి ) గైకొని వీవ నారంభించినప్పుడు సూర్యుడు తన పండ్రెండుమూర్తులతో ( ద్వాదశాదిత్యులు సర్వలోక ప్రసిద్ధులు. ) ప్రజ్వరిల్లినప్పుడు నీవు నిరపాయుడవై ఉండుట ఎట్లు ? అనిన నావాయసశ్రేష్ఠుడు నాతో ఇట్లని ఉత్తరము ఇచ్చెను. ఓ మునిశ్రేష్ఠుడా ! వినుము. కల్పాంతమునందు అగ్ని మొదలగు భూతములు విజృంభించుటకు ముందుగనే ప్రాపంచిక వ్యవహారములు అన్నియును అణగిపోవును. అప్పుడు " కృతఘ్నుడు చిరకాలము నుండియు తనతోనున్న మిత్రుని విడచిపోవునట్లు " నేనును చిరకాలమునుండియు నివసించుచున్న ఈ గూటిని విడిచిపెట్టుదును. పిమ్మట "సర్వసంసారశూన్యమగు మనస్సువలె " సర్వసంకల్పములను పరిత్యజించి నిశ్చలములగు అవయవములతో నిర్మలాకాశమునందే నిలచియుందును. ఏసమయమునందు ద్వాదశాదిత్యులు ఆ కాశమున నిలిచి తమ వేడికిరణములచే ప్రపంచమును కాల్ప నారంభింతురో అప్పుడు నేను వరుణరూపమగు సంకల్పమును స్థిరముచేసికొని నిశ్చలుడనై ఉందును. ( సర్వము సంకల్పమయమే,

కావున " నేను వరుణుడను " అని దృఢసంకల్పముచేసిన సత్పురుషుడు వరుణుడే అగును. ఆవరుణుడు జలమధ్యమునందు ఉండుటచేత సూర్యుడు తపింపజేసినను, ఆతాపముఎఱుంగనట్లు అప్పురుషుడును సూర్యతాపము నెఱుంగడు. ) మఱియును ఏసమయమునందు పర్వతశిఖరములను సహితము పొడిచేయగల ప్రళయవాయువులు తమ శక్తినంతయును జూపుచు వీవ నారంభించునో, అప్పుడు నేనుపర్వతశ్రేష్ఠుడను అను భావనచేత నిశ్చలుడనై ఉందును ( పర్వతమునుగాలి ఏమియు జేయలేనట్లు అట్టిస్థిరభావన గలవానిని గూడ ఏమియు చేయజాలదనుట ) ఇదియునుగాక ఏసమయమునందు మేరుపర్వతము మొదలగునవి అన్నియు కరగిపోవునట్లు సర్వసముద్రములును ఏకీభవించి సర్వము జలమాత్రమై ఉండునో అప్పుడు వాయుభావనను దృఢముచేసికొని ఆ జలముపై ఈదులాడుచుందును ( వాయువు నీటిలో మునిగిపోవనట్లు నేనును నీటిలో మునిగిపోవననుట ) ఇట్లు ఈదుచు బ్రహ్మాండమునకు ఆవలి యొడ్డునుచేరి అచ్చట సుషుప్త్యావస్థ అనబడు నిర్వికల్ప సమాధిని ఆశ్రయించి నిశ్చలుడనై రెండవ ప్రపంచసృష్టి అగునంతవరకు అట్లే ఉందును. మఱల బ్రహ్మదేవుడు సృష్టిని చేయుటకు ఆరంభింపగానే నేనును బ్రహ్మాండమును ప్రవేశించి ఈ గూటియందు చేరుదును.

ఓ వశిష్ఠమహాముని ! నాసంకల్ప ప్రభావమువలన ప్రతికల్పమునందును ఈ చెట్టు ఇదియే విధముగ ఈపర్వత శిఖరమునందే పుట్టుచుండును. దేనికి ఎట్టిమార్పు కలిగినను దీనికిమాత్రము మార్పు కలుగదు. అనిన మఱల నేనిట్లంటిని. ఓ పక్షిశ్రేష్ఠుడా ! నీవు ప్రళయకాలములయందు ఆయాభూతములకు విరుద్ధములగు స్వరూపములను మనశ్శక్తిచే ధరియించుచు దేనిచేతను బాధింపబడక నిలచియుందుననుట మిక్కిలి ఆశ్చర్యకరముగ నున్నది. అనేకయోగులు కలరుగాని, వారికి ఇట్టి సామర్థ్యము లేదు. ఎంతశక్తిమంతులైనను ప్రళయాంతమునందు నిలువరు. ఇట్లగుటకు గారణమేమి ? ఈ అద్భుతశక్తి నీకుమాత్రము ఏల కలిగెను ? దీనిని వివరింపుము ? అనిన భుసుండుడు ఇట్లనియె.

శ్లో॥ బ్రహ్మన్నియతిరేషాహి దుర్లంఘ్యాపారమేశ్వరీ ।
మయేదృశేనవై భావ్యం భావ్యమన్యైశ్చతాదృశైః ॥
నశక్యతేచాలయితు మవశ్యంభవితవ్యతా ।
యద్యథాతత్తథైతద్ధి స్వభావస్యైషనిశ్చయః ॥

ఓ మహాత్మా ! మునీంద్రా ! దీనినిగూర్చి నేనేమియును జెప్పనేరను

ఇదీ పరమేశ్వరుని నిర్ణయము. నాకు ఇట్టిశక్తి కలుగవలయుననియు తక్కిన యోగీశ్వరులకు అట్లు కలుగకూడదనియును ఆజగధీశ్వరుడే నిర్ణయించి ఉన్నాడనవలయును. ఇంతమాత్రమువలన యోగసిద్ధి నొందిన మహాత్ములు లేకుండపోనక్కఱలేదు. ఏది ఎట్లుకావలయునో, అది అట్లే అగును కాని, దానిని ఎట్టివారును మార్పు నొందింపలేరు. కావలసినది ఎట్లయిన అయ్యే తీరును. కాకూడనిది ఎంత ప్రయత్నముచేసినను కానేకాదు. ఇదియే స్వభావమునకు నిర్ణయము. అనిన మఱల నేనిట్లంటిని. ఓజ్ఞాన విజ్ఞాన సంపన్నుడా! యోగసిద్ధి నొందుటచేత నిర్మలమగు మనస్సు కలవాడా! శుభాకారా! భుసుండుడా! ఈత్రిలోకములు ఎన్నిమాఱులో ప్రళయము నొందుటను మరల మరల పుట్టుటనుగూడ చూచిన మహానుభావుడవు. నీకు ఏ ఏ విచిత్రములు ఇప్పుడు జ్ఞాపకములో నున్నవి ? అనిన ఆభుసుండు డిట్లనియె.

ఓమహాత్మా ! వశిష్ఠమహాముని ! ఒక సమయమునందు ఈభూమి వృక్షములతోను పర్వతములతోను మాత్రమే నిండియుండెను. ఒకసమయమునందు ఈభూమిపై గడ్డిగాని, తీగెలుగాని, కొండలుగాని, చెట్లుగాని, లేకయే ఉండెను. అప్పుడు ( ఆసమయములయందు ) దీనిపై ప్రాణులు కూడ లేరు. ఆసమయములు నాకు జ్ఞప్తియందు ఉన్నవి. మఱియొకసమయమున పదనుకొండువేల సంవత్సరములవరకు ఈభూమిపై ఎచ్చట చూచినను బూడిద రాసులే ఉండెను. ఒకఱమాఱు నాలుగు యుగములు గడచినంతవరకు ఈభూమి ఆవగింజంతైనను ఎడములేకుండ చెట్లతో నిండియుండెను. వేఱొకసమయమునందు అట్లే పర్వతములతో నిండియుండెను. ఇంకొకసమయమునందు వింధ్య పర్వతము సూర్యమండలము దాటునంతవరకు పెరిగి సర్వభూమండలమునుగూడ వైశాల్యముచేత ఆక్రమించెను. అప్పుడు భూమియెల్ల వింధ్యపర్వతమే అయియుండెను. ఆవింధ్యపర్వతముయొక్క మదమును అణచుటకు అప్పుడు అగస్త్యమహాముని లేడు. ఈవిధముగ నాలుగు యుగములు గడచిపోవునంతవరకు నుండెను. ఒకానొక సృష్టియందు బ్రాహ్మణులకు మద్యపానము ఆచారమై ఉండెను. శూద్రులకు ఆమద్యపానము దోషమై ఉండెను. వేశ్యావృత్తిగలవారే పతివ్రతలగుచుండిరి. ఈవిషయము లన్నియును నాకు జ్ఞప్తియందు ఉన్నవి. నేను చంద్రుడు, సూర్యుడు, ఇంద్రుడు, వామనుడు, మొదలగువారి పుట్టుకలు ఎరుగుదును. హిరణ్యాక్షుడు భూమిని చంకలో ఇడుకొని పోవుటయు విష్ణువు వరాహరూపుడై వానిని సంహరించి ఆభూమిని ఉద్ధరించుటయు నాజ్ఞప్తియందు

ఉన్నవి. రాజనీతి మొదలగు శాస్త్రములను నిర్మించి రాజులను ఏర్పఱచుట యు ( కొంతకాలము భూమికి రాజే లేడు. అప్పుడు ప్రజలు స్వేచ్ఛాచారులై చెడిపోవుచుండ బ్రహ్మదేవుడు రాజనీతిని కల్పించి ప్రభువుల నేర్పఱచెను. ) సోమకుడు వేదములను దొంగలించుకొని పోగా విష్ణువు మత్స్యరూపముతో వానిని సంహరించి వేదములు దెచ్చుటయు, మందర పర్వతమును పెల్లగించి గొనిపోవుటయు, అమృతముకొఱకై పాలసముద్రమున ఆపర్వతమును వైచి మథించుటయు, నేను ఎఱుగుదును. గరుత్మంతునికి ఱెక్కలు రానప్పుడు నాకు తెలియును. సముద్రముల ఉత్పత్తిని నేను ఎఱుగుదును. ఇవి అన్నియు మొన్న మొన్నటి వృత్తాంతములు. ఓమునీంద్రా ! వశిష్ఠా! ఈచెప్పినవాటిని బాలురుగూడ తెలిసికొను చున్నారు. వీనినిగూర్చి విశేషముగా చెప్పనేటికి ? ఓషడ్గుణైశ్వర్యసంపన్నుడా ! వశిష్ఠమహామునీ! నీవు, భరద్వాజుడు, పులస్త్యుడు, అత్రి, నారదుడు, ఇంద్రుడు, మరీచి, కుమారస్వామి, సనత్కుమారుడు, భృగువు, ఈశ్వరుడు, విఘ్నేశ్వరుడు, పార్వతీ, సరస్వతీ, లక్ష్మీ, గాయత్రీ, అను మొదలగు వారలయొక్క జన్మములెల్ల నాకు తెలియును. ఇట్లుండగ ప్రస్తుతపు ప్రపంచ సృష్టులనుగూర్చి నేను ఏమని చెప్పగలవాడను ( పైన జెప్పబడిన దేవతలందరు సృష్టిని నిర్వహించువారు. వారి ఉత్పత్తులే తెలిసియుండగ ఇక ప్రపంచోత్పత్తులను గూర్చి అడుగనేటికి అనిభావము. ప్రస్తుత సృష్టియనుటచేత ఇప్పటిసృష్టియని అర్థము కాదు. ఆసర్వకాలవేదికి ఆదిసృష్టియు ప్రస్తుత సృష్టియే కదా? ) ఓవశిష్ఠమహామునీ ! బ్రహ్మపుత్రా ! నీకిది ఎనిమిదవ జన్మము. నీవు మొట్టమొదట గడచిన ఎనిమిదవ సృష్టియందు నాతోకలసి మాటలాడితివి. ఓమహాత్మా! నీవు ఒకసారి ఆకాశమునుండి పుట్టుదువు. ఒకసమయమున నీటినుండి జనించెదవు. మఱియొకప్పుడు పర్వతమునుండి సంభవింతువు. వేఱొకసమయమున అగ్నినుండి ఉద్భూతుడ వగుదువు.

ఓమునీంద్రా! మఱియొక ఆశ్చర్యకరమగువిచిత్రమును వినుము. ఐదు కల్పములయందు సముద్రమునమునిగిపోవుచున్న భూమినిఐదుసారులు విష్ణువుకూర్మావతారము ధరించియే పైకి లేవనెత్తెను. మొన్న జరిగినసముద్రమథనము పండ్రెండవది. హిరణ్యాక్షుడు ఇప్పటికి మూడుమారులు భూమిని చంకబెట్టుకొని పోయెను. వరాహావతారమును మూడుమారులు ప్రవర్తిల్లెను. విష్ణువు ఇప్పటికి ఆఱుమారులు పరశురామావతారము ఎత్తెను. నూఱు మారులు కలియుగమునందు బుద్ధావతారములను ఎత్తెను. రుద్రుడు ముప్ప

దిమారులు త్రిపురములను గాల్చెను. రెండుమారులు దక్షయజ్ఞమును ధ్వంస మొనరించెను. పదిమారులు ఇంద్రుని హస్తమును స్తంభించెను. బాణాసురునికై ఎనిమిదిమారులు కృష్ణునితో పోరెను. ఆయుగములయందు శైవ వైష్ణవ జ్వరములును, ప్రమథ విష్వక్సేనాదులును, అతిఘోరముగ పోరిరి. మఱియు ప్రతికల్పమునందును అప్పటివారి చిత్తానుసారముగ ఒకటియే అర్థముగల వేదము ఒక్కొక్కమారు వేరు కాని, క్రమక్రమముగా కాని, జనించుచుండెను. విషయము ఒకటియే అయినను కర్మాచరణవిధులు, అధ్యయనము, స్వరములు, అంగభూతములగు వ్యాకరణాదులు, మాత్రము పరస్పర భిన్నములు అగుచుండెను. ఒక్కొక్క యుగమునకై మాత్రమే ఏర్పడుచు సమానార్థము కలిగియు-బహువిధ పాఠభేదములతో నొప్పుచు సంపూర్ణములై పురాణములు ప్రవర్తించు చుండును. పరమాశ్చర్యకరమై జ్ఞానప్రదమై ఉన్న వాశిష్ఠరామాయణమును మఱియొకదానిని నేను ఎఱుగుదును. అది లక్షగ్రంథమై యుండెను. అది కాలము అతిక్రమించు కొలది మఱవునకు వచ్చుచుండగ వాల్మీకి అనుజీవుడు దానిని మరల మరల చేయుచుండెను. ప్రస్తుతము చేయబడబోవునది పండ్రెండవమారు. ఆజీవుడు ముక్తుడైన ఆస్థానమునకు మఱియొకడైన వచ్చి ఆపనిని ముగించు చుండును. మఱియును ఈరామాయణముతో సమానమై భారతమను పేరుగల ఒక ఇతిహాసము కలదు. అదీ మొట్టమొదట చేయబడినప్పుడు నాకు తెలియును. వ్యాసుడను పేరుగల ఒక జీవుడేయైనను, లేక, ఆస్థానమును ఆశ్రయించిన మఱియొకడైనను దానిని చేయుచుండును. అదియు నికమీదట ఏడవమారు చేయబడ బోవుచున్నది. మఱియు రావణాదుల సంహరించుటకై అవతరించుచున్న విష్ణువునకు ఇకమీదట కలుగబోవు రామావతారము పదునొకండవది. ఓమునిశ్రేష్ఠా ! వశిష్ఠమహాముని ! మఱియు భూభారమును తగ్గించుటకై వసుదేవుని ఇంట జనించు విష్ణువునకు రాబోవు ద్వాపరమునందు కలుగబోవు కృష్ణావతారము పదియారవది. జగద్రూపమగు ఈభ్రాంతి ఎప్పటికిని లేనిదే. ఒకానొకప్పుడు నీటి బుగ్గవలె కానవచ్చుచు బోవుచుండును. సముద్రమునందు భిన్నముగా ఉన్నట్లు ఉదయించుచు అణగుచునుండు అలలవలె ఈభ్రాంతి అంతరాత్మనుండి పుట్టుచు అణగుచు నుండును. బాగుగ విచారించిన దీనికి ఆత్మభిన్నమగు రూపమే లేదు. ఒక సమయమునందు ప్రస్తుతకాలమునందలి ఈ ఉత్తరదిక్కు ఉత్తరదిక్కుగా నుండలేదు. ఈమేరుపర్వతముకూడ ఇచ్చట లేదు. ఈ ఉత్తరదిక్కును ఈపర్వతమును

మఱియొకవైపున నుండినవి. అది ఎట్లు సంభవించుననిన, వినుము. సూర్యుడు మొదలగువారి సంచారమును బట్టియు, మేరువు మొదలగు పర్వతములను బట్టియు దిగ్విభాగము ఏర్పడును. కావున ఆసూర్యుడు మొదలగువారి స్థితియు పర్వతములును మాఱితేనేని దిక్కులుకూడ మార్పునొందును. సూర్యాదులును మేరువును ఆశ్రయించి ఉండువారే. కావున అది ఎచ్చటనుండునో వారు అచ్చటనే ఉందురు. మఱియును ఒకసృష్టియందు కలియుగమున కృతయుగ ఆచారములు ఉండినవి. కృతయుగమునందు కలియుగ ధర్మములు వర్తించినవి. ఇట్లే త్రేతా ద్వాపర యుగమునందును ధర్మ వ్యత్యాసములు కలుగుచుండినవి. ( అనగా అప్పటివారు ఆయాధర్మములనే ఆయా యుగములకు ఉచితములుగ భావించుచుండిరనుట ) ఓమునీంద్రా ! ఈవిషయములన్నియు నాకు జ్ఞప్తియందు ఉన్నవి. మఱికొన్ని తప్పిపోయిన తప్పిపోయి యుండవచ్చును. అని చెప్పెను. అని ఇట్లుచెప్పెనని వశిష్ఠమహాముని శ్రీరామచంద్రునితో చెప్పి ఇట్లనియె.

ఓ వీరుడా! శ్రీరామా ! ఇట్లుపలికిన ఆవాయసశ్రేష్ఠుని గాంచి విషయములను తెలిసికొనవలయుననే కోరికతో మఱల ఇట్లని ప్రశ్నించితిని: ఓపక్షిశ్రేష్ఠుడా ! ఒక్కవిషయమును వివరింపుము. సంసారమునందే ఉండి సర్వవ్యవహారములను ఆచరించుచునే ఉన్నను పురుషుడు ఏవిధముగా స్థిరజీవి అగును. అని అడిగిన భుసుండుడు ఇట్లనియె. ఓమహాత్మా ! సర్వజ్ఞా ! సర్వమును ఎఱిగియే యున్నను, నన్ను ఈవిషయమునుగూర్చి ప్రశ్నించుచున్నారు. నామూలమున వినగోరుచున్నారు. ఇది నాకు పరమానుగ్రహముకదా? ప్రభువులగువారు భృత్యునిచేత మాటలాడింప దలంచుట లోకమునందు సహజము. అయినను మీ ఆజ్ఞను అనుసరించి నేను ఎఱిగినకొలది విన్నవించుకొనియెదను. సత్పురుషులను సేవించుట అనగా, వారి ఆజ్ఞలను మారాడక నెరవేర్చుటయే అని పెద్దలు చెప్పుదురు.

## —✻ చిరజీవిత్వహేతువు. ✻—

ఓబ్రాహ్మణోత్తమా ! వశిష్ఠమహామునీ! దోషములనియెడు ముత్యములచేత గూర్పబడియున్న వాసనలనియెడు దారములు ఎవని హృదయమునందు ముడివేయబడి ఉండవో, అట్టివానిని మృత్యుదేవత హింసింపనేరదు. నమ్మకమనియెడు వృక్షమునకు అంపములైన దేహమనియెడు తీగెకు నుశిపురుగులైయుండు మనోవ్యాధులు ఎవనిని ఛేదింపవో, వానిని మృత్యుదేవత హింసింప నోల్లదు. శరీరమనియెడు వృక్షమును జుట్టుకొనుచు చింత

లనియెడు పడగలతో గూడియున్న ఆశలనెడు మహాసర్పములు లోలోన ఎవనిని తమవిషాగ్నిచేత గాల్పవో, అట్టివానిని మృత్యుదేవత హింసింపనొల్లదు. రాగద్వేషము లనియెడు మహావిషముతో గూడి తన మనస్సనెడు రంధ్రమునందు నివసించుచుండు లోభమనెడు కొండ చిలువ ఎవనిని మ్రింగి వేయదో, వానిని మృత్యుదేవత హింసింప నొల్లదు. వివేకమను జలమును సంపూర్ణముగ పానముచేసి శరీరమనెడు సముద్రమునకు బడబాగ్నియై ఉన్న కోపము ఎవనిని దహింపదో, వానిని మృత్యుదేవత హింసింప నొల్లదు. గానుగ అతికఠినమైనువ్వులరాశిని మర్దించునట్లుమన్మథుడు ఎవనినిమర్దింపడో, అట్టివానిని మృత్యుదేవత హింసింప నొల్లదు. ఏమహాత్ముని మనస్సు నిర్మలమై శాంతమైఏకరూపమై ఉండు ఉత్తమస్థానమునందు విశ్రమించియుండునో, అట్టివానిని మృత్యుదేవత హింసింప నొల్లదు. ఓ బ్రాహ్మణోత్తమా! పైనవర్ణింపబడిన దోషములన్నియు సంసారమను వ్యాధికి కారణములయ్యు నుపరమాత్మ జ్ఞానము గలిగి సమాధియుక్తమైఉన్న చిత్తమునించుకయైన బాధింప నేరవు. మనోవ్యథలవలనను వ్యాధులవలనను, జనించి సుడితిరిగి నట్లు గిరగిర దిరుగుచు వచ్చుచు బోవుచు నుండు ఈ దుఃఖములు ఎంతఘోరములైనను పరమాత్మ జ్ఞానము కలిగి దృఢమై సమాధిస్థితిని జెందియున్న చిత్తమును బాధింప నేరవు. హృదయాకాశమునందు చీకటి గ్రమ్మునట్లు చేయుచు ఎడతెగక కామక్రోధమువలన పుట్టుచున్న విచారములు పరమాత్మజ్ఞానము కలిగి సమాధియందు స్థిరమైయున్న చిత్తమును బాధింపనేరవు. ఇంతయే అననేల? లోకమునందు ఏవిషయములు రోషయుక్తములై ఉన్నవో, ఏ ఏ ప్రయత్నములు దోషసహితములై యున్నవో, ఏ ఏ గుణములు దృష్టములో ఏవేని నోటితో వచించుటకునైన వీలుకాకున్నవో, ఏఏ ఆచారములు దోషయుక్తములైనవో, అవియెల్ల పరమాత్మజ్ఞానము కలిగి సమాధియందు స్థిరమైయున్న చిత్తమును బాధింప నేరవు. కావున ఏది ఉత్తరకాలమునందు శుభఫలమును ఇచ్చునో, ఏది శాశ్వతమై ఎప్పటికిని నశింపకుండునో, ఉపాధిని ఆశ్రయించిన భ్రాంతితో దేనికి సంబంధములేదో, దుష్టములగు ఆశలు, చేష్టలు, దేనికిలేవో, అట్టిపదార్థమునందే చిత్తమును ఏకాగ్రము గావింప వలయును. ఏపదార్థము అపరిశుద్ధమైనదియు, లేనిభారమును శాశ్వతముగ కల్పించునట్టిదియు, లేనివియోగమును సమకూర్చి బాధించునట్టిదియు, నగుభేదపిశాచమునకు స్వాధీనముకాకున్నదో, అట్టిపదార్థమునందే చిత్తమును ఏకాగ్రము చేయవలయును. ఆత్మవిషయకమైన విచా

రము సర్వదుఃఖములను నశింపజేయునది. మనుష్యులగు మీబోటి వారలకు అది సులభము. తిర్యగ్జాతులమగు మాకు అది కష్టసాధ్యము. సర్వసంకల్ప వర్జితమై సర్వస్థానములకు అగ్రభాగమునందు ప్రకాశించు ఈ ఉత్తమో త్తమ స్థానమును సామాన్యమగు బుద్ధికలవారలు ఎట్లు పొందగలరు. ఇట్లు ఆత్మ విచారము మిక్కిలి అసాధ్యమైనది. అగుటచేత దానిని పరిత్యజించితిని. చిరకాలము జీవించునట్లు చేయగల ఉపాయములు ఆత్మచింతకు సమానము లైనవి అనేకములు కలవు. వానిలో ప్రాణచింత ఒకటి. అది సర్వదుఃఖ ములను నశింపజేయును. సర్వసౌభాగ్యములను అభివృద్ధినొందించును. అట్టి ప్రాణచింతనే నేను ఆశ్రయించితిని. దానివలనగూడ చిరజీవిత్వమును పొంద వచ్చును కదా ? అని ఇట్లుపలికిన ఆ భుసుండుని జూచి సర్వమును ఎఱిగి యున్నవాడనే అయినను మిక్కిలి జాగరూకతతో నేను మరల ఇట్లని ప్ర శ్నించితిని. ఓ సత్పురుషుడా ! సర్వ సందేహములను దీర్చు సామర్థ్యము కలవాడా ! నాకు ఈ విషయమును ఎఱిగింపుము. చిరకాలము జీవించుటకు కారణమని చెప్పబడిన ప్రాణచింతకు స్వరూపము ఏదిఅని అడిగితిని.

—* యోగస్వరూపము. *—

అంత భుసుండుడు ఇట్లనియె. ఓ భగవంతుడా ! వశిష్ఠమహాముసీ! ప్రాణచింతనుగూర్చి మీ ఆజ్ఞచొప్పున వివరించెదను వినుడు. ఆ ప్రాణముల కు మీదేహమే స్థానము. ఈదేహమధ్యమునందు హృదయ కమలము కలదు. దానిని ఆశ్రయించి ప్రాణవాయువు పైకిని అపానవాయువు క్రిందికిని సంచ రింపుచుండును. నేను వానిని ఆశ్రయించి ఉన్నాను. ( మనస్సుచేత సర్వకా లములయందును వాని సంచారములనే భావించు చున్నాననుట. ) ఆప్రా ణాపానములు క్రమముగ వేడిమిని చల్లదనమును గలిగి ఎప్పటికిని శ్రమను పొందక జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందును ఏక రూపముతో సంచ రింపుచు దేహమను మహాయంత్రమును భరింపుచున్నవి. క్రమముగ అగ్ని రూపమును చంద్రరూపమును ధరించి హృదయాకాశమునకు సూర్యచం ద్రులవంటివై ఉన్నవి. ఓ బ్రాహ్మణోత్తమా ! సర్వకాలములయందును ప్రాణాపానముల గమనమునే ఆశ్రయించియున్న నాకు సుషుప్త్యవస్థలో ఉన్నవానికివలె దినములు గడచిపోవుచున్నవి. అయితే తామరతూడులోని దారమును వేయు చీలికలుగ చీల్చిన అందొక చీలికకంటెగూడ సన్నమై ఆప్రాణాపానములసంచారము ( లేక సంచారమార్గము ) కనిపెట్టుటకు మిక్కిలి కష్టసాధ్యమైనది. ఓ బ్రాహ్మణోత్తమా ! వశిష్ఠమహామునీ !

ఈ ప్రాణవాయువులకు చాంచల్యమే సామర్థ్యము. ఇది సర్వకాలములయందును ఎడతెగక సంచరింపుచు శరీరమునకు లోపల వెలుపలగూడ పై భాగమునందు ఉన్నది. ఇట్లే అపానవాయువుకూడ చలనశక్తి కలదియె. అదియు సర్వకాలములయందును సంచరింపుచు శరీరముయొక్క అధోభాగమునందు లోపల వెలుపలగూడ వ్యాపించియున్నది. ఇట్టి వాయుస్థితిని ఎఱిగినవాడు నిదురించుచున్నను మేలుకొని ఉన్నను ప్రాణాయామమును చేయుచున్నవాడే అగును. ఆ ప్రాణాయామమునకు స్వరూపమును చెప్పెదను వినుము. వాయువు ( ప్రాణవాయువు ) హృదయకమల మధ్యమునుండి అప్రయత్నముగనే వెలికివచ్చుట ఏదికలదో, అది రేచకము అనబడును. పిమ్మట పండ్రెండు అంగుళములవరకు వెలికి వచ్చును. పిమ్మట శరీరముతో దానికి సంబంధము కలుగును. ( చర్మము మొదలగువానిని ఆ వాయువు స్పృశించుననుట ) దానిని పూరకమందురు. మఱియు వెలుపలనుండి అప్రయత్నముగనే వాయువు లోనికి ప్రవేశించునప్పుడు నాసికారంధ్రము మొదలు శిరస్సువరకును ఉన్న అవయవములను స్పృశించుచుండును. దానికిని పూరకమనియే పేరు. ఇందు మొట్టమొదటిది ( గాలి వెలుపలికి పోవునప్పుడు కలుగునది ) బహిఃపూరకము. రెండవది అంతఃపూరకము. మఱియు లోపలికి ప్రవేశించుట నిలచి మఱల వెలుపలికి వచ్చుటకు ప్రయత్నింపకనుండు స్థితులకు మధ్యమున నుండునది కుంభకస్థితి అనబడును. మఱియు రేచక కుంభకములు బాహ్యమునందును కలవు. అందు నాసికకు ఎదుటనున్న పండ్రెండు అంగుళముల ప్రదేశమునుండి నాసికవరకు ప్రాణాపానములు ఏకీభవించి కొంతసేపు నిలచియుండును. ( వెలుపలికిపోవు వాయువు ప్రాణమనియు, లోపలికి వచ్చు వాయువు అపానమనియు, జెప్పబడును. శ్వాస విడచిన పిమ్మట మఱల లోపలికి పీల్చుటకు గొంత అవకాశము ఉండును. అదియే ఇచ్చట ఏకీభావమని చెప్పబడియున్నది. ) ఆస్థితికి బాహ్యకుంభకమని పేరు. సంజ్ఞామాత్రమే కాని, వాయువులన్నియు నొక్కటియే. కావున " మృత్తికాఘటములకువలె " ప్రాణాపానములకుగూడ ఏకీభావము స్వతస్సిద్ధమైనదియే. మఱియు ప్రాణవాయువు హృదయకమలమునుండి వెలికిబోవునప్పుడు నాసిక కొనవరకు శరీరావయవములను తాకుచువచ్చుట ఏది కలదో, దానికి బాహ్యపూరకమని పేరు. ఆ నాసికాగ్రమునుండియు నిర్గమించి పండ్రెండు అంగుళములవరకు వెలుపలికి పోవుట ఏదికలదో, అదియు బాహ్యపూరకమే. ( ఇదివరకే బాహ్యపూరకము వర్ణింపబడి ఉన్నది.

అది ప్రాణవాయువు వెలుపలికి రా ప్రయత్నించునపుడు లోపలి భాగము లయందు గలుగు నది. దానికి అంతఃపూరకమనుటయే తగనపేరు. అయిన ను వెలుపలికివచ్చునపుడు కలుగునది. కావున ఔపచారికముగ బాహ్యపూ రకమను పేరు పెట్టబడినదని తెలిసికొనునది. అదియును అంతఃపూరకమని యే గ్రంథకారుని అభిప్రాయము.) మఱియు ప్రాణము వెలుపలికివచ్చి అపానము ఇంకను లోపలికిబోవ ప్రయత్నింపకుండిన అప్పుడు కల వాయు స్థితిని గూడ బాహ్యకుంభకమందురు. (ఇదివరకు ప్రాణవాయువు నిలచి అపానవాయువుకూడ లోనికి బోవ ఆరంభించియున్నప్పుడు నడుమ కలు గు వాని ఐక్యము కుంభకము అనబడెను. ఇప్పుడు అట్లుగాక ప్రాణనాశ మునకును అపానుని ఉదయమునకును మధ్యకాలము ఉద్దేశింపబడెను, అని భేదమును ఎఱుగునది.) లోపలికిబోవు వాయువు అపానవాయువని చెప్ప బడియున్నది. ఆవాయువు సమయమునందు లోనికి బోవ ఉద్యమించు నో ఆసమయమునకు రేచక సమయమని పేరు. ఆప్రయత్నమునకే బాహ్య రేచకమని పేరు. దీనిని ధ్యానించిన ముక్తిదొరుకును. ఇదియునుగాక ఆ అ పానవాయువు ద్వాదశాంగుళ దూరమునుండి కదలి క్రమక్రమముగ స్థూలా కారము నొందుచు నాసికాగ్రమువరకు వచ్చుట ఏది కలదో, దానినిగూడ బాహ్యపూరకమనియే చెప్పుదురు. ఈవిధముగ లోపలను వెలుపలను కలవని వర్ణింప బడిన రేచకాదులను ఎఱిగి ప్రాణాపాన స్వభావములను తెలిసి వానినెల్ల నొకఱుమారు నిరోధింప గలిగెనేని అట్టి పురుషునకు పునర్జన్మము కలుగదు.

ఓబుద్ధిమంతుడా! వశిష్ఠమహామునీ! పైన వర్ణింపబడిన ఈ ఎనిమి దింటిని (అనగా, బాహ్యరేచకాదులు మూడు ఆంతరములు మూడు మఱి కొన్ని విశేష లక్షణములచేత జెప్పబడియున్న కుంభకములు రెండు కలసి ఎనిమిది. ఇంకను రెండు కలవు కాని, వానిని అప్రధానములని ఇచ్చట చేర్చుకొనలేదు) ఏపురుషుడు సర్వకాలములయందును స్మరించుచుండ నో, అట్టివానికి ఈప్రాణవాయు స్వభావములే ముక్తి నొసంగ గలవు. ఏపురు షుడు తన చిత్తమును బాహ్య వ్యాపారములనుండి మఱలించి ఈప్రాణ స్వభావములను విచారించుటయందే ఏకాగ్రముగ నిలిపెనేని ఆసాధకునకు అల్పకాలమునందే మోక్షసుఖము దొరుకును. ఈవిధముగ ప్రాణచింతను అభ్యసించుచున్న పురుషుని చిత్తము "బ్రాహ్మణుడు కుక్కచర్మముతో జేయబడిన పదార్థముపై ఆశగొననట్లు" బాహ్యవిషయములపై ఆశగొన

దు. ఏమహాత్ములు ఈచూపును జూడనేర్తురో, అట్టివారే సర్వార్థములను బొందినవారు. వారే దుఃఖము లేనివారు. నడచుచున్నను, కూర్చుండుచున్నను, మేలుకొనియున్నను, నిదురించుచున్నను, ఈప్రాణచింత అలవాటు పడియుండునేని వానికి బంధము కలుగదు. ఓబ్రాహ్మణోత్తమా! వశిష్ఠమహాముసీ! పద్మాకారమై ఉన్న హృదయ యంత్రమునుండి ప్రాణము మొట్టమొదట బయలు దేరును. పండ్రెండు అంగుళములదూరము వరకు నాసికారంధ్రములనుండి వెలుపలికి వచ్చి అచ్చట అణగును. ఇట్లే అపానవాయువు నాసికారంధ్రమునకు ఎదుట పదిరెండు అంగుళముల దూరమున ఉదయించును. హృదయకమల మధ్యమునందు అణగును. అపానవాయువు చంద్రుడు వెలుపలనుండి దేహమును ఆహ్లాద పరచుచుండును. ప్రాణవాయువు సూర్యుడుగాని, అగ్నిగాని అగును. లోపలనుండి దేహమును తపింపజేయును. కావున అపానమనియెడు చంద్రునియొక్క కళను ప్రాణమనియెడు సూర్యుడు ఏస్థలమునందు మ్రింగివేయునో, ఆస్థలమును ఆశ్రయించినవాడు పునర్జన్మము నొందడు. (ఆస్థలము బ్రహ్మమే అనియు, దానిని ఆశ్రయించుట అనగా, ధ్యానించుటయే అనియు తెలిసికొనవలయును.) ఇట్లే ప్రాణముయొక్క అంతభాగము అపానమను చంద్రునిచేత ఏస్థలమునందు మ్రింగబడునో, దానిని ఆశ్రయించినవాడును, పునర్జన్మము నొందడు. (అపానము హృదయకమలమునందును, ప్రాణము నాసికకు వెలుపల పండ్రెండు అంగుళముల దూరమునందును నశించునని చెప్పియున్నాము. ఆస్థానములందు పరమేశ్వరుడు ఉన్నట్లు కాని, ఆస్థానములే పరమేశ్వరుడైనట్లు కాని, ఉపాసింప వలయుననుట) మఱియు ప్రాణవాయువు అపానవాయువుయొక్క కొనను భక్షింప దలంచునప్పుడు గాని, అపానవాయువు ప్రాణవాయువుయొక్క కొనను భక్షింప దలంచునప్పుడు గాని, ఆరెంటికిని మధ్యముననున్న అవకాశమే ఆత్మ. దానిని ధ్యానించువాడు పునర్జన్మము నొందడు. ప్రాణనాశమునకు సమీపమునందును అపాన ఆవిర్భావమునకు అగ్రమునందునుండి ప్రాణాపానములకు మధ్యగతుడై విలసిల్లుచున్న ఆత్మను ధ్యానించెదను. ఎచ్చట ప్రాణము నశించి అపానము ఇంకను పుట్టకనుండునో, అచ్చట కళంకరహితుడగు ఆత్మ యున్నాడు. ఆయనను ధ్యానించెదను. ఆస్థానము నాసికకు అగ్రభాగముననుండు ఆకాశములోని సుడియే (ప్రాణవాయువు బోవుట అపానవాయువు మఱలుట అను రెంటికిని ఆధారమగు స్థలమగుటచేత ఇట్లు చెప్పబడెను) ఇట్లే అపానవాయు

వు నశించుటకును ప్రాణవాయువు ఉదయించుటకును మధ్యనున్న కాలము నందుగాని, స్థలమునందుగాని, ఆపరమేశ్వరుడు కళంకరహితుడై ఉన్నాడు. ఆయనను ధ్యానింతును. ఆస్థలము హృదయకమలములోని ఆకాశమే.

శ్లో॥ యదఖిలకలనా కళంకహీనం
పరికలితంచసదాకళాగణేన ।
అనుభవవిభవంపదం తదగ్ర్యం
సకలసురప్రణతం పరంప్రపద్యే ॥

ఏస్థానము సంకల్పములనియెడు కళంకములతో ఇంచుకయైన సంబంధము లేనిదో, అట్లయ్యును సర్వసంకల్పములచేత ఏది బహురూపములు కలదిగా ఏర్పరుప బడుచున్నదో, ఏస్థానము సర్వదేవతలచేతను నమస్కరింపబడుచున్నదో, దేనికి స్వానుభవమునకంటె అధికమగు స్వరూపము ఏదియు లేదో, ఏది సర్వోత్తమమైనదో, సర్వాతీతమైనదో, అట్టిస్థానమును ఆశ్రయించెదను. ఓవశిష్ఠమహాముని ! ఈవిధముగ నేను ప్రాణచింతను జేసి దానిమూలమున పైనవర్ణించిన విధముగ ఆత్మయందు పరిపూర్ణ విశ్రాంతిని జెందితిని. నేను గడచిపోయినదానినిగూర్చి గాని, రాబోవుదానినిగూర్చి కాని, తలంపను. ఎప్పటికి ఏదివచ్చునో, దానిని అభిమానరహితుడనై ఆచరించుచు మాత్రమే ఉందును. “ ఇది నాకు కలదు. ఇంతకంటె రమ్యమగు ఈపదార్థమును సంపాదించెదను.” అను ఆలోచన లేదు. ఈకారణమువలన శ్రమ ఏమియు లేనివాడనై చిరకాలము జీవించుచున్నాను. ఎప్పటికిని ఎచ్చటను దేనినైనను స్తోత్రము చేయను. నిందింపనైనను నిందింపను. వాస్తవస్థితిలో సర్వమును ఆత్మయే అయ్యుండ స్తోత్రము చేయుటకు గాని నిందించుటకు గాని, రెండవవాడు లేడుకదా? ఈకారణమువలన శ్రమ ఏమియు లేక, చిరకాలము జీవించుచున్నాను. నామనస్సు సుఖము వచ్చినప్పుడు సంతసింపదు. దుఃఖము కలిగినప్పుడు శోకింపదు. అన్ని సమయములయందును ఏకరూపముతోనే శాంతమై ఉండును. ఈకారణమువలన నేను శ్రమనొందక చిరకాలము జీవించుచున్నాను. నేను త్యాగమును ( త్యాజ్యత్యాగమును ) ఆశ్రయించి సర్వమును విడచితిని. బ్రతుకు చావులనువానినిగూడ పరిత్యజించితిని. ఆకారణమువలన నేను చిరంజీవినై ఉన్నాను. ఓమునిశ్రేష్ఠా ! నామనస్సునందు చాంచల్యము ఇంచుకైనను లేదు. దుఃఖములు గాని, సంక్షోభములు గాని, లేవు. ఆశలు కొంచెమైనను ఉద్భవింపవు. ఎప్పటికిని పరమ శాంతి సుస్థిరమై ఉండును. ఈకారణము

వలన నేను ఏ శ్రమమును జెందక సుఖముగా చిరకాలము జీవించుచున్నా ను. ఓ బ్రాహ్మణోత్తమా! వశిష్ఠమహాముని! " వీడు బంధువు. వీడు ఇతరుడు. వీడు నావాడు. వీడు ఇతరునివాడు " అను తలంపులు నాకు లేవు. ఈ కారణమువలన నేను చిరకాలమునుండియు జీవింపుచున్నాను. ఆశలనియెడు త్రాళ్ళచేత బంధింపబడి ఇచ్చవచ్చిన వైపునకు త్రిప్పబడుచున్న మలినమగు చిత్తవృత్తికి హృదయమునందు ఇంచుకయైనను అవకాశము ఇచ్చుటలేదు. ఈ కారణమువలన శ్రమల జెందక చిరకాలమునుండియు జీవించుచున్నాను. పరులు సుఖించుచున్నచో నేనును సుఖింతును. పరులు దుఃఖించినచో నేనును దుఃఖింతును. సర్వజనులకును ప్రియమిత్రుడనై వర్తించుచుందును. ఈ కారణమువలన శ్రమల జెందక చిరకాలమునుండియు జీవించుచున్నాను. ఆపదలు వచ్చినప్పుడు పర్వతమువలె ధైర్యవంతుడనై ఉందును. సంపదలు కలిగినప్పుడు సర్వప్రపంచములకును మిత్రుడనై ఉపకారముచేయుచుందును. కలిమి లేములను తలంపులుగాని వానితో సంబంధముకాని, నాకు బొత్తిగనే లేదు. కావున నేను చిరకాలము జీవించుచున్నాను. ఓమహాత్మా! మీఆజ్ఞను అనుసరించి ప్రౌఢుడనై సర్వవిషయమును ఎఱిగించితిని. జ్ఞానవంతులలో అగ్రేసరుడా! నాపాండిత్యము ప్రకటించుటకై గాని, అన్యులను పరిహాసించుటకై కాని కాదు. అనిన అప్పుడు నేను ఇట్లంటిని. ఓభుసుండుడా! నీవు చెప్పినది మిక్కిలి ఆశ్చర్యకరమైనది. నీవృత్తాంతము మాకు విస్మయమును కలుగజేసెను. ఇక నీవు సౌఖ్యదాయకమగు నీగూటిలోనికి జేరుము. నాకు మధ్యాహ్నకాలమైనది. నేను దేవలోకమునకు బోయెదను.

ఓరఘురామా! ఇట్లు పలికి నేను ఆసనమునుండి లేచి పక్షులు ఎగయునట్లు ఆకాశమునకు ఎగసితిని. ఆభుసుండుడును గౌరవార్థమై కొంతవరకు నన్ను అనుసరించుచుండగా " ఓపక్షిశ్రేష్ఠా! ఇక నిలువుము " అని చెప్పి అతనిని నిలిపి అతిశీఘ్రముగ వెడలి పోతిని. అట్లు నిలిపినను ఆభుసుండుడు ఒక ఆమడవరకు నన్ను అనుసరించియే వచ్చుచుండెను. నాకును వానిని మఱలించుట అయిష్టముగనే ఉండెను. సత్పురుషులతో సహవాసము దొరికెనేని దానిని పరిత్యజించుట మిక్కిలి కష్టసాధ్యము కదా? కృతయుగ ప్రారంభమునందు కొంతికాలము గడచిన పిమ్మట మఱల ఒక తడవ ఆమేరుపర్వత శిఖరమునందే ఆకల్పవృక్షముయొక్క కొమ్మమీదనే ఆభుసుండునితో కలిసితిని. ఓరామచంద్రా! ఇప్పుడు కృతయుగము సంపూర్ణముగ

గడచిపోయినది. త్రేతాయుగముకూడ అర్ధభాగము గడచినది. ఇప్పుడు సర్వశత్రుసంహారకుడవై నీవు పుట్టితివి. మఱియు ఇప్పటికి ఎనిమిది సంవత్సరములనాడు ఆభుసుండుడు మఱల నాకు గానవచ్చెను. అప్పటికి అతడు కృతయుగమునందు ఎట్లుండెనో, అట్లే యుండెను. ఓరామభద్రా! ఇట్లు నీకు పరమాశ్చర్యకరమగు భుసుండునియొక్క వృత్తాంతమును జెప్పితిని. దీనినంతయును చిత్తమునందు విచారించి నీకేది యిష్టమగునో, దానిని ఆచరింపుము. జ్ఞానమార్గము కావలసియున్న దానినే అవలంబింపుము. యోగమార్గము కావలసియున్నదానినే ఆశ్రయింపుము.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున భుసుండోపాఖ్యానమను
ఇరువది తొమ్మిదవ సర్గము ముగిసెను.

---

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజుని జూచి ఇట్లనియె. ఓ భారద్వాజా! వశిష్ఠమహాముని ప్రాణవాయు నిరోధముచేత మోక్షము కలుగునని భుసుండోపాఖ్యానముచే నిరూపించి మఱియును ఇట్లనియె. ఓ శ్రీరామచంద్రా! ఈ కనబడునది అంతయును ఊఱక ఉండునట్లు తోచునదియే కాని, సత్యమైనది కాదు. "నాపేరు ఇది" అని అభిమానించుట ఒక్కటియే కాని దేహమను పదార్థము ఒక్కటి వాస్తవముగ లేదు. కావున మాంసము ఎముకలు మొదలగువానిచేత నిర్మింపబడిన ఈదేహమునందు ఆత్మాభిమానమును వదలుము. నీకు సంకల్పమాత్రముననే వేలవేలు శరీరములు జనించును. ఒకదానియందే ఆత్మాభిమానమును ఉంచి భ్రాంతి నొందనేటికి? నీవు హంసతూలికా తల్పముపై శయనించి నిదురించుచుండియే కలయందు ఒక క్రొత్త దేహముతో నలువంకల తిరిగి వచ్చుచుందువు. ఆ దేహము ఇప్పుడు ఎక్కడ ఉన్నది. దానిని అభిమానింపవేల? మఱియు జాగ్రదవస్థయందుగూడ ఏదియో ఒక సమయమునందు మనస్సునందు ఏదేదియో, ఆలోచించుకొనుచు దేహమును మఱచి యున్నప్పుడు (దీనికే మనోరాజ్యమనిపేరు) క్రొత్త దేహముతో మేరుపర్వతముమీద కాని, స్వర్గమునందు కాని, మఱి ఎచ్చటనైన గాని, విహరింతువు (సంకల్పానుసారముగ నాస్థలములయందు ఉన్నట్లు తోచుచుండు ననుట) ఆదేహము ఇప్పుడు ఎందు పోయినది? దానిని అభిమానింప వేల? కావున ఓరఘునందనా! ఈసంసార

మంతయు దీర్ఘమగు స్వప్నము. దీర్ఘమగు చిత్తభ్రమము. కాకపోయిన దీర్ఘమగు మనోరాజ్యము. " ఈ ప్రపంచమంతయు ఉన్నదియు గాదు. లేనిదియు గాదు. ఒకపదార్థము మొట్టమొదట సత్యమై ఉండునేని దానిని గూర్చి ఇంద్రియగోచరమగు సమయమునందు కలిగియును అట్లుగాని సమయమునందు లేమియును వ్యవహరింపబడును గాని, మొట్టమొదట పదార్థమే సత్యము కాకుండినచో అట్టివ్యవహారము ఎక్కడనుండి వచ్చును. ఈప్రపంచమన్ననో "ఉన్నట్లు గానవచ్చుటమాత్రమే కాని, బొత్తిగ లేనిది." అని నిశ్చయించి అన్య సంకల్పములను పరిత్యజించుట ఏదికలదో, అదియే జ్ఞానమందురు.

శ్లో॥ అవశ్యమేవహిమయామర్తవ్యమితినిశ్చయః ।
　　ఇత్యాత్మమరణప్రాప్తౌ కింముధాపరితప్యతే ॥

ఓ రామా ! పుట్టినవానికి ఎన్నటికైనను చావునిశ్చయము. ఇట్లుండగ దానినిగూర్చి నిరర్థకముగ లోకులు పరితాపము పడుచున్నారు. పుట్టినవాడు కొంతసంపదను ఎట్లయినను సంపాదించియే తీరవలయును. లేకున్న జీవనముగడువదు కదా ? ఇట్లుండగ ధనము కూడినప్పుడు గర్వింపనేల ? కావున నో దోషరహితుడా ! శ్రీరామా! నీవు అవివేకివిగాక సర్వపదార్థములయందును పరస్పర భేదమునెంచక సామాన్యస్థితిని జూడుము. సర్వమును ఏకమునుగా భావింపుము. అట్టి భావనయు మనస్సుతో కలిసినదియే. కావున కళంకయు క్తమైనదియే. అట్లయినను క్రమ క్రమముగ ఆభావనను కూడ వదలి నిరాభాసుడవు ( ఆత్మభిన్నమగు పదార్థము -ఏదియు తోచుటయే లేనివాడవు) కమ్ము. ఓసర్వోత్తముడా ! శ్రీరామా! రాగద్వేషములు సర్పములు. ఇవి ఎవనియొక్క మనోబిలమునందు నివసింపవో, అట్టివాడు కల్పవృక్షము. వానినుండి వాంఛితార్థములెల్ల ఫలించును.

శ్లో॥ యే ప్రజ్ఞాగర్వమాపన్నా విదగ్ధాశ్శాస్త్రశాలినః ।
　　రాగద్వేషమయామాన్యా గర్దభాస్తేధిగస్తుతాన్ ॥

ఓ గౌరవనీయుడా ! శ్రీరామా ! ఇట్లుగాక ఎవరు శాస్త్రవాదములయందు నేర్పరులై " మేము జ్ఞానవంతులము " అని గర్వముతో విఱ్ఱవీగుచు రాగ ద్వేషములను మాత్రము పరిత్యజింప లేనివారై ఉందురో, అట్టివారు గాడిదెలు. ఛీ వారిజన్మమేల ? ఓ రఘురామా ! ఈ సంసారచక్రమునకు సంకల్పమేనాభి. దానిని బాగుగ నిరోధింపగలిగిన ఈచక్రము తిరుగుటను మానును, ఇట్లు కాక మనస్సనిడెడు ఆనాభి ( కుండ )

సంతోషమును జెందెనేని ఇతరములగు ఉపాయములచేత ఎంతబలాత్కారముగ ఆటంక పరుపబడినను ఈ సంసారచక్రము అతివేగముగ తిరుగుతునే యుండును. కావున ఎంత ప్రయత్నములైనను గావించి ఎంతబలమునైనను సంపాదించి ఎంతజ్ఞాన ధనమునైనను ఆర్జించి ఎన్నియుక్తులనైనను పన్ని సంసారచక్ర నాభియగు మనస్సునే నిరోధింపవలయును. జ్ఞానమును సన్మార్గమును గలిగి రాజిల్లుచు సర్వశాస్త్రములను విమర్శించుటవలన పుట్టి వర్ధిల్లుచునుండు పురుషప్రయత్నమునకు ఏదిసాధ్యము కాదో అది దేనికిని సాధ్యముకాదు. కావున దృఢమగు పురుషప్రయత్నముతో భయంకరమును, అశుభకరమును, ధైర్యమునంతయు అపహరించునదియును, నగు మనస్సనెడు పిశాచమును ఖండించి వేయుము. అప్పుడు నీ స్వస్వరూపమే శేషించును. స్థిరుడవు కమ్ము. చిత్తమనియెడు దయ్యముచేత ఆక్రమింప బడియున్న పురుషుని శాస్త్రములు గాని, బంధువులుగాని, గురువులుకాని, రక్షింపనేరరు. ఇట్లుగాక పురుషప్రయత్న బలముచేత చిత్తపిశాచమును తొలగించుకొనెనేని అప్పుడు ఆమనుష్యుని శాస్త్రములును, గురువులును, బంధువులును, గూడసుఖముగ ఉన్నతస్థానమునకు జేర్పగలరు. "కొలదియగు బురదయందు చిక్కుకొనియున్న లేడిని సుఖముగ పైకి తీయ గలుగునట్లు" వానినిగూడ సంసార సముద్రమునుండి సుఖముగ పైకితీయ గలుగుదురు. కావున ప్రతిపురుషుడును సర్వభోగములను పరిత్యజింప వలయును. జీవన్ముక్తుని మార్గమును అవలంబింప వలయును. బాగుగ విచారించి ఆత్మరూపమును ఆశ్రయింపవలయును.

## —* దేవపూజోపాఖ్యానము. *—

ఓ నీలోత్పలశ్యామా! శ్రీరామా! ఈ విషయమునందు పరమేశ్వరుని అనుగ్రహమువలన నాకు తెలియవచ్చిన మఱియొక జ్ఞానోపాయమునుగూడ వివరించెదను. దానిచేత సర్వభ్రాంతులను ధ్వంసము చేయవచ్చును. ఓ శ్రీరామా! చంద్రకిరణ సమూహమువలె శ్వేతవర్ణముతో ప్రకాశింపుచు సర్వవిధములలో స్వర్గమునకంటె ఉత్తమమై కైలాసమను ఒక పర్వతోత్తమము ప్రకాశించు చుండును. అందుగౌరీపతియగు శ్రీశంకరుడు నివసింపుచుండును. చంద్రఖండ శిఖామణియగు ఆదేవ దేవుని పూజింపుచు గంగాతీరమునందు ఆశ్రమమును కల్పించుకొని పూర్వము ఒకప్పుడు నేను ఆపర్వతమునందే నివసించి యుంటిని. తపస్సుచేయుటయే అప్పుడు నాకు పనిగా నుండెను. ఇట్లు మునులయొక్క ఆచారమును అవలంబించి

వర్తింపుచుండగ సిద్ధులు నన్ను సేవింపుచుండిరి. నేను అప్పుడు శాస్త్రార్థములను విచారింపుచు శాస్త్రగ్రంథములను జేర్చుకొనుచు నుంటిని. మామిడి ఆకుల దొన్నెలతో పుష్పలను గోసికొని వచ్చుచు శంకరుని పూజింపుచుంటిని. ఓ రఘురామా ? నేను ఈవిధములగు ఆచారములతో తపస్సును చేయుచుండ బహుకాలము గడచెను. అంత ఒకానొక శ్రావణ బహుళ అష్టమినాడు ప్రదోషకాలము గడచెను. సర్వదిక్కులును కాష్ఠమౌనమును ఆశ్రయించెనో, అన (చేసంజ్ఞచేత నైనను తనయొక్క అభిప్రాయమును తెలుపకుండుట కాష్ఠమౌనము) శాంతినొంది యుండెను. అరణ్యముల యందును పొదలయందును అతిగాఢములై ఖడ్గములచేత కోయదగినవో, అన్నట్లు చీకటులు గ్రమ్మియుండెను. మొదటిజాము సగభాగమునకు పైగా అతిక్రమించెను. అప్పుడు నేను సమాధిని విడచి దృష్టిని బాహ్యార్థములపై ప్రసరింప జేయుచుంటిని. అప్పుడు అనేక వేల శరత్కాల మేఘములు ఒక్కమారే చూపట్టినట్లు, అనేక వేల చంద్రులు ఒక్కమారే ఉదయించినట్లు, ఆ అరణ్యమధ్యమునందు ఒక్క దివ్యతేజస్సు కనబడెను. ఆదివ్యతేజస్సు గాఢాంధకారముచేత కప్పుకొనబడిన సర్వదిక్కులను ఒక్కమారే వెలిగించెను. దానినిచూచి ఇదేమి ? అని విచారదృష్టితో పరిశీలించితిని. ఇట్లు సవిమర్శముగ నావంకకు దృష్టిని మరలించునప్పటికి చంద్రశేఖరుడగు శ్రీశంకరుడు గానవచ్చెను. వామభాగమునందు నిలచి గౌరీదేవి తన హస్తముతో అమ్మహాత్ముని హస్తమును బట్టుకొని ఉండెను. నందికేశ్వరుడు ముందుగ నడచుచు త్రోవను చక్కజేయుచుండెను. అభిముఖముగ వచ్చుచున్న వారిని నివారించుచుండెను. అప్పుడు నేను నియతుడనై పార్శ్వములయందు ఉన్న శిష్యులను హెచ్చరించివారితోగూడ పూజాద్రవ్యములను గైకొనుచు అమ్మహాత్మునికి ఎదురుగబోతిని. అట్లు పోయి ఆపరమేశ్వరునిదృష్టిచేత పవిత్రుడనగు భాగ్యమునుగంటిని. దూరముగనే నిలుచుండి పుష్పాంజలిని ఇచ్చి పూజ నాచరించి ఆసర్వేశ్వరునకు నమస్కరించి నిలచితిని. అప్పుడు ఆశంకరుడు కరుణార్ద్రమై చంద్రకిరణములతో సమానమై యుండు మనస్సు నాయందలి అనుగ్రహాతిశయముచేత వికసింప సర్వపరితాపహారమగు దృష్టితో శానాసేపు నావంక చూచెను. ఇట్లు కరుణింపబడినవాడనై పుష్పాలంకృతమగు చరియయందు కూర్చుండిన ఆత్రిలోకసాక్షిని సమీపించి పుష్పములతోను, అర్ఘ్యపాద్యాదులతోను పూజచేసితిని. మందారపుష్పములను గొనివచ్చి అనేక దోసిళులు సమర్పించితిని.

అనేకవిధములగు నమస్కారములను చేసితిని. స్తోత్రములను గావించితిని. పిమ్మట పైనవర్ణించిన విధముగానే చెలులతో గూడ పార్వతీదేవిని ఆరాధించితిని. ప్రమథగణములను అర్చించితిని. ఇట్లు ఆరాధనము ముగిసిన పిమ్మట అప్పరమేశ్వరునికి ఎదురుగ కూర్చుంటిని. అప్పుడు పూర్ణచంద్ర కిరణముతో సమానములగు చల్లని వాక్యములతో అమ్మహాదేవుడు నాతో ఇట్లనియె.

ఓ బ్రాహ్మణోత్తమా ! వశిష్ఠమహామునీ ! సంకల్పములు లోకోత్తరమగు స్థానమునందు స్థిరమగు స్థితిని జెంది విశ్రమించి ఉన్నవా ? సర్వ వ్యవహారములను ఆచరించు చున్నను, శాంతిని ప్రధానముగ జూచుకొనుచు సుఖదుఃఖ రూప సంక్షోభముల గలిగింపక శుభమును జెందించు చున్నవా? నీతపస్సునకు విఘ్నము కలుగకున్నదా ? సర్వకాలములయందును శుభావహములగు విధులు ప్రవర్తించుచున్నవా ? నీమనస్సు పొందదగిన దానిని (బ్రహ్మమును) పొందినదా ? భయము నశించిపోవుచున్నదా ? (భేద దృష్టి తొలగిపోవుచున్నదా ? అనుట) ఓ రఘునందనా! శ్రీరామా! ఇట్లు సర్వలోక-కారణభూతుడగు ఆదేవదేవుడు పలుకగానే నేనును సవినయముగ ఇట్లంటిని. ఓ మహేశ్వరా ! పార్వతీపతే ! మిమ్ము ధ్యానింపుచు మీయందు దృఢభక్తి గలవారికి పొందరానిది ఏదియు లేదు. ఏవిధమగు భయమును కలుగదు. మిమ్ము ధ్యానించుటవలన కలిగిన పరమానందముచేత నిండిన మనస్సు గలవారలకు లోకమునందు లొంగిపోవనిది ఒకటియును ఉండదు. నమస్కారమును ఆచరింపనివాడు ఒకడును ఉండడు. మిమ్ము ధ్యానించుటయందు దృఢప్రయత్నముగల మనుష్యులు ఎచ్చటనుందురో, ఆదేశములే దేశములు. ఆగ్రామములే గ్రామములు. ఆదిక్కులే దిక్కులు. ఆపర్వతములే పర్వతములు. ఓ మహాప్రభువా ! నీధ్యానమనునది పూర్వ పుణ్యములకు ఫలము (పూర్వపుణ్యముల వలనగాని, లభింపదనుట.) వర్తమాన పుణ్యములకు అభివృద్ధికరము. (పురుషునిచేత జేయబడు పుణ్యములు దైవభక్తియుక్తములుగ జేయబడెనేని అధికఫలము ఇచ్చుననుట) ఇక మీదట కలుగబోవు పుణ్యములకు విత్తనము. (శివభక్తిగలవాడు చిత్తశుద్ధి గలవాడగుటచేత రాబోవు జన్మములయందు పాపకార్యములకు దిగడనుట.) ఓ ప్రభువా ! నిన్ను ధ్యానించుట అనునది బహువిధములగు అమృతములతో గూడిన కలశము వంటిది. ధైర్యమనియెడు వెన్నెలకు చంద్రునివంటిది. మోక్షమను పట్టణమునకు ద్వారము వంటిది. ఓ భూతనాథా ! నిన్ను

ధ్యానించుట అనియెడు చింతామణి నాకు దొరికియున్నది. కావున మీఅను గ్రహమువలన నేను ఆపదలయొక్క శిరముపై పాదమును ఉంచితిని.

ఓరామచంద్రా ! ఈవిధముగ అనేకభంగుల స్తోత్రముజేసి నమస్కరించి భగవంతుడగు అప్పరమేశ్వరుని ఒక విషయమునుగూర్చి ప్రార్థించితిని. ఓభగవంతుడా! మీఅనుగ్రహమువలన నాకు ఎందును కొఱతలేదు. సర్వదిక్కులును పరిపూర్ణములయ్యే యున్నవి. అయినను ఒక్కసంశయము మాత్రము కలదు. దానిని నిర్ణయించుటకై మిమ్ము ప్రార్థించు చున్నాను. ఓమహాప్రభువా ! నాయందు కరుణించి ఆసంశయమును నివారింపుము. భయములెల్ల దర్చునదియు సర్వశ్రమలను నశింపజేయునదియు, సర్వపాపములను, నాశముచేయునదియు, సర్వశుభములను ఇచ్చునదియు, నగుదేవార్చనవిధి ఒకటికలదని వినుచున్నాను. దాని స్వరూపము ఎది ? అనినవిని అప్పరమేశ్వరుడు నాతో ఇట్లనియె. బ్రహ్మవేత్తలలో అగ్రేసరుండవగు ఓ వశిష్ఠా! వినుము. నీకు సర్వోత్తమమగు దేవార్చనమును వివరించెదను. దేవార్చనమనగా, దేవుని ఆరాధించుట. కావున మొట్టమొదట దేవుడనగా ఎవ్వడో, వివరించెదను వినుము. ప్రస్తుతము లోకమునందు ఆరాధింప బడుచుండు విష్ణువు కాని, ఈశ్వరుడు కాని, దేవుడు కానేరడు. దేహముకాని, మనస్సుకాని, ఆదేహాదులు కలవారలు కాని, దేవతలు కానేరరు. ఇకనేమి యనిన, జన్మ మరణములు లేనిదియు, పరునిచేత ఏర్పరుపబడుటకు శక్యము కానిదియు, మొదలును అంతమును లేనిదియు, నగు స్వప్రకాశ రూపమే యథార్థమగు దేవుడు. కావున ఆకారాదులచేత అల్పమై పురుషబుద్ధిచేత ఏర్పరుపబడినదై ఉండు పదార్థము ఎప్పటికిని దేవతయని తలంపబడకూడదు. అట్లు ఉపాసింప బడకూడదు. దేవత అనిన ఉపాసకునికంటె అధికుడై ఉండవలయును. ఉపాసకుడును పరిచ్ఛిన్నుడే. దేవతయు పరిచ్ఛిన్నుడే. అయినను, వారలకు ఇక భేదము ఏమికలదు. ఒకవేళ దేవతకు ఉపాసకునికంటె కొన్ని శక్తులు అధికముగ ఉండిన నుండవచ్చును కాని, అంతమాత్రమువలన అతడు సర్వశక్తుడు కానేరడు కదా? కావున ఎవ్వనిచేతను ఏర్పరుపబడక ఆద్యంతములులేక సర్వాధికుడై సర్వశక్తుడై ఉండు ఆతడే ఉపాసింప దగినవాడు. ఆతడే దేవశబ్దముతో పిలువదగినవాడు. పరిచ్ఛిన్నుని ( ఒకస్థలమునందు ఒక్కరూపముతో మాత్రమే ఉండువానిని ) పూజింపతలచిన ఆతని శక్తియు పరిచ్ఛిన్నమే అగుటచేత, తమబోటివానినే పూజించునట్లగును. సేవకుడు ప్రభువునకు గౌరవమును చూపినంతయే

అగును. మఱియు అతనికంటె శక్తిమంతుడగు మఱియొకడుండుట నిశ్చయ మగును. ఈవిషయము ఎఱుగవచ్చిన చక్రవర్తిని గాంచినప్పుడు సేవకులకు ప్రభువునందలి గౌరవమునకంటె అధికగౌరవము గలుగునట్లు ఉపాసకులకు గూడ తాము నమ్మిన దేవతమీదికంటె సర్వేశ్వరునిపైన అధిక విశ్వాసము కలుగును. ఇట్టి చాంచల్యము దృఢఫలమును కలిగింపనేరదుకదా ? కావు ననే స్వప్రకాశరూపుని విడచి అన్యులను ఉపాసించువారలకు ఫలము అల్ప మనుట ప్రత్యక్షసిద్ధమే. వైకుంఠముగాని, కైలాసముగాని, శాశ్వతఫల ములు కావు కదా ? కావున "దేవుడు ఎవ్వడు? దేవశబ్దముచేత ఎవ్వని చెప్పదగియుండును" అనువిషయమును మొట్టమొదట బాగుగ విచారింప వలయును. దేవశబ్దమునకు స్వప్రకాశ రూపుడని అర్థము. ఆస్వప్రకాశ రూపునకు సర్వశక్తులును కలవనియు, ఆద్యంతములు లేవనియు, క్రొత్తగా జెప్పనక్కఱలేదు. ప్రకాశమనగా, జ్ఞానము. కావున అజ్ఞానమునకును ఆదీ యు అంతమును ఉండుటకు వీలు లేదు. జ్ఞానము సర్వసాక్షి. కావున సర్వ ప్రపంచములయొక్క ఉత్పత్తి స్థితిలయములను జూడవలయును. తన ఉత్ప త్తి స్థితి లయములను జూచుటకును రెండవసాక్షి ఉండుటకు వీలులేదు. కావున దానికి ఆద్యంతములు ఉండవు. సాక్షిలేకున్న ఏదియు విశ్వాసయో గ్యము కాదు కదా ? కావున ఆస్వయంప్రకాశ స్వరూపుని ఆరాధింప వల యును. అజ్ఞానమే శివుడు "ఇట్లయిన ఆకార సహితులగు దేవతలను ఏల చెప్పవలయును" అనియెదవేమో, వినుము. అది జ్ఞానులకొఱకు చెప్పబడి నది కాదు. ఎవరు మూఢులై యథార్థదేవతను ఎఱుగలేక చిత్తస్థైర్య ము నొందక సంకటపడుచుందురో, అట్టివారికొఱకై చెప్పబడెనది. ఇది కల్పితముకాని, వాస్తవము కాదు. లోకమునందు దూరమనునది ఒకటటి యే. పొడవు అనునదియును ఒకటియే. అయినను మార్గస్థులకు ఒక గుఱు తు కలుగుటకై "ఇచ్చటికి కోసెడు పొడవు (దూరము) ఇచ్చటికి రెండు కోసులు" అని కల్పింపబడుచున్నది. ఇట్లే అజ్ఞానులుకూడా క్రమక్రమము గా ఉన్నత స్థానమును జెందుటకై ఇట్లు చెప్పబడెను. బాగుగ విచారిం చిన ఎప్పటికిని ఉండువాడు స్వప్రకాశ రూపుడగు దేవుడే. చిదాకాశమే. దానికంటె భిన్నమగు పదార్థమే లేదు. "అది జ్ఞానము. కావున దృశ్య మగు పదార్థము జ్ఞానముచేత ఎఱుగబడు పదార్థము దానికంటె భిన్నము కాదా" అనియెదవేమో అట్లు కాదు. దృశ్యపదార్థమంతయు భ్రాంతికి ల్పితమే. కావున పరమాత్మకంటె భిన్నముకానేరదు. ఎండమావుల నీరు,

శుద్ధజలములకు రెండవదికానేర్చునా ? కావున వివేకదృష్టితో చూచిన దృశ్యపదార్థములు కానవచ్చు సమయమునను కానరాని సమయమునను గూడ ఉండునది కేవలచైతన్యమే. దానికి ఆద్యంతములు లేవు. కొంచెమైనను విచారింపగలవానికి ప్రపంచలయమునకు అనంతరము ఈద్వితీయ ప్రపంచోత్పత్తికి పూర్వమునను ఉండు స్థితిని భావించినచో అప్పుడు "చిద్రూపము మాత్రమే శేషించును" అను విషయము స్పష్టమగును "అప్పుడు చిద్వస్తువుగాని, మఱి ఏదికాని లేదు" అని చెప్పకూడదా ? అనినేదవేమో వినుము. అప్పుడు ప్రపంచోత్పత్తికి కారణమే లేదనవలసి వచ్చును. ఉన్నను అది అసద్రూపమే అనవలసి వచ్చును. ఇందు ఎట్లన్నను (అసద్రూపమగు కారణము కలదన్నను కారణము బొత్తిగనే లేదన్నను) సమానమే. ఇట్లు చెప్పుటయు విరుద్ధమగును. కారణములేక కార్యము కలుగదు లేమినుండియు, కలిమి పుట్టదుకదా ? ఇట్లయిన "దృశ్యము కలదు దానిని చూచు సాక్షియే చిద్రూపుడు" అని భేదములు ఏల చెప్పవలయును. శాస్త్రము ఆభేదమునే ఉపదేశమునకు మార్గముగా గైకొని యున్నదికదా ? అనినేదవేమో దానివలన దోషములేదు. ఉపదేశార్హులైనవారు మొట్టమొదటనే చిరకాలమునుండియు సంసారరూపమై వచ్చుచున్న భేదబుద్ధిని విడువనేరరు. కావున వారిని అనుగ్రహించుటకై వారి అభిప్రాయమే మొట్టమొదట ఉపదేశ మార్గముగా అంగీకరింప బడెను "మీరు ఉన్నస్థితినే కొంచెము విచారింపుడు. మీకు కొన్ని పదార్థములు గోచరములగుచున్నవి కదా ? వానికిని వానిని జూచునట్టి మీఆత్మకును (మీఆత్మ అన్నను మీరన్నను ఒకటియే) అత్యంతమగు భేదము కలదనుట మీకుస్పష్టమగును. ఆద్రష్టయే మీయథార్థస్వరూపము" అని ఇట్లు ఆత్మ ప్రపంచమునుండి విభాగించి చూపబడెను. ఎవ్వాని ఉద్ధరింప తలంపు గలుగునో, వాని మార్గమునే మొట్టమొదట అవలంబింప బడవలయును. క్రమక్రమముగ ఉన్నతోన్నత విషయములు బోధింప బడవలయును. కావున ఇట్లు చెప్పుటవలన దోషము లేదు. మఱియు ఈదృశ్యముయొక్క అభావము, ఆత్మ ఒకడే ఉండుట, అనునది రెండును, సుషుప్త్యవస్థయందు అందఱకును అనుభవములోనే ఉన్నది. అందును సుఖము దృశ్యమై ఉన్నట్లు తోచినను, అది స్వస్వరూప భూతానందమే అగుటచేత ఆత్మకంటె అన్యము కానేరదు. ఒకటి సుషుప్తి సుఖమే అననేల ? సర్వసుఖములును ఆత్మానందమునకు అంశభూతములే. కావున చిద్రూపమునకంటె భిన్నముగ ఎప్పటి

కిని ఏపదార్థమును లేదు. ఇట్లు ఏకరూపుడై ప్రకాశించుచున్న ఆదేవుని పూజించుటకై ఏర్పడియున్న పుష్పములు కొన్ని గలవు. అవి మూడు జాతులు. జ్ఞానము, సర్వసమత్వము, చిత్తశాంతి, అనునవియే. ఆపుష్పజాతులకు నామములు. ఈజాతులయందు చేరిన పుష్పములు యథార్థ దేవపూజకు సర్వోత్తమములనియు, సాధ్యమైనంతవఱకు వీనినే సంపాదింప వలయుననియు పూజావేత్తలగు మహానుభావులు వచించుచున్నారు.

ఓవశిష్ఠమహామునీ! పైనవర్ణింపబడిన విధముగ అత్యుత్తమములగు పుష్పజాతులు మఱియును కొన్ని గలవు. సంతోషము, మైత్రి, ఉపేక్ష, మొదలగునవియే ఆజాతులు. వానిచేత జేయబడు చిద్రూపుని పూజయే యథార్థదేవతార్చనము గాని, తక్కినవి అనగా ఒకరూపమును ముందుబెట్టుకొని పూజించుట దేవతార్చనమే కానేరదు. అట్టి యథార్థ దేవతార్చనముచేత ఆద్యంతములు లేనిదియు, స్వతస్సిద్ధమైనదియు, సాటిలేనిదియు, కొరత గానిదియు, నగు పరిపూర్ణ ఫలము కలుగును. దేవతయు నట్టివాడే కదా? సర్వప్రకాశములను అతిక్రమించిన ఉత్తమ ప్రకాశము కలదియు, సర్వపదార్థములయందును ఏకరూపముతో వ్యాపించియున్నదియు, కలిమిలేములకు నడుమ సత్తాసామాన్యరూపముతో ఉన్నదియు "ఇది ఇట్టిది" అని నిరూపించుటకు వీలులేక కేవలము ఉనికిమాత్రమే అయినదియు, నగు జ్ఞానమే ( అనగా జ్ఞానరూపమగు బ్రహ్మమే ) స్వప్రకాశముకావున దేవశబ్దముచేత జెప్పబడుచున్నది. అట్టి ఆచైతన్యమే సంకల్ప శక్తివలన క్రమక్రమముగ జడరూపమును భావించుచూవచ్చి దృశ్యరూపముగా మాఱుచున్నది. కావున దృశ్యప్రపంచమునకును ఆచైతన్యమునకును భేదమే లేదు. పిమ్మట దేశ కాలాది శక్తులు క్రమక్రమముగ విజృంభించును. వానిచేత జుట్టబడి అప్పుడు క్రమక్రమముగ జీవరూపమును, అక్కడినుండి బుద్ధిరూపమును, అచ్చటనుండి అహంకారరూపమును, జెందును. పిమ్మట మనస్సగును. ఓవశిష్ఠమహామునీ ! ఇట్లు మనస్సుగా నేర్పడిన పిమ్మట " నేను సంసారిని, నాకు దుఃఖముకలదు " అని భావించును. " నేను చండాలుడను " అను సంకల్పముచేత బ్రాహ్మణుడు చండాలుడై పోయినట్లు ఈమనస్సుకూడ అట్టి సంకల్పములచేత సంసారియే అగును. దుఃఖియే అగును. ( సంకల్పబలము వలన బ్రాహ్మణుడు చండాలుడగుట గాధివృత్తాంతమునందు వర్ణింపబడి ఉన్నది ) ఆచైతన్యమే మనోరూపము నొందిన పిమ్మట " నేను రాముడను, కృష్ణుడను, వీడు నాబంధువు, బంధువుకాడు " అని తలంచుచు దేహాభి

మానము కలిగి ఆదేహమునందే చిక్కుబడి మహామోహ సముద్రమున మునిగి దుఃఖపరంపర నొందుచుండును.

శ్లో॥ పుష్టం సంకల్పమాత్రేణ యదిదం దుఃఖమాగతమ్ ।
తదసంకల్పమాత్రేణ క్షయికాత్రకదర్థితా ॥

ఓవశిష్ఠమహాముని ! ఇట్లువిచారించి చూచిన ప్రస్తుతము సంసారులకు అనుభవములోనున్న దుఃఖము కేవలము సంకల్పమాత్రమున గలిగినదే. కావున ఏనాడు సంకల్పములు నశించునో " ఈదుఃఖములతో నాకు సంబంధము లేదు " అను సంకల్పమైనను దృఢమగునో, ఆనాడు దుఃఖములే ఉండవు. స్వస్వరూపమే శేషించును. పురుషుడు తనకంటె అన్యముగ ఏదియైన నొకపదార్థము ఉన్నట్లు సంకల్పించెనేని అప్పుడు దుఃఖవంతుడగును. అట్టి సంకల్పమును విడచిన సంపూర్ణసుఖము నొందును. " ద్వితీయాద్వైభయం " " రెండవపదార్థము ఉన్నప్పుడేకాని, భయము కలుగదు" అని శ్రుతి ఈవిషయమునే స్పష్టము చేయుచున్నది కదా ? కావున ఓవశిష్ఠమహాముని ! వివేకమను మహావాయువుచేత సంకల్పములను మేఘములను చెదరగొట్టి శరత్కాలమునందలి ఆకాశమువలె పరిశుద్ధుడవు కమ్ము. సంకల్పించుట అనియెడు మాలిన్యమును స్వయముగనే తుడిచివేసికొని సంపూర్ణ పారిశుద్ధ్యమును జెంది పరమానందము కలవాడవు కమ్ము. పరమాత్మయొక్కడే స్వయముగనే సంసార రూపమును జెంది స్వయముగనే తన్నాశముకూడ గావించునను విషయమున ఇంచుకయైన ఆశ్చర్యము వలదు. ఆయనకు గల శక్తులు అనంతములు. ఆశక్తులయొక్క విజృంభణములచేత ఆయన యొక్కడయ్యు పెక్కువిధముల దోచుచున్నాడు. " ఎట్లున్నను ఒకపదార్థమునందే విరుద్ధ ధర్మములు ఉండుట అసంభవముకదా ? సంసారమును ఆసంసారముయొక్క అభావమునుగూడ ఒక్క ఆత్మునియందే ఉండుట ఎట్లు " అనియెదవేమో, వినుము. " ఇది దీనికి విరుద్ధము " అనునది భ్రాంతిచేత గల్పింపబడిన విషయమే కాని, స్వభావ సిద్ధమగు విషయము కాదు. భేదము ఉండిననే కాని, ఈవిషయము సంభవింపనేరదు కదా ? భేదమనునదియు అసత్యమని ముందే వివరించి యున్నాను. కావున సర్వాత్మకుడగు పరమాత్ముని విషయములో ఏదియు విరుద్ధము కానేరదు. కావున శక్తి విజృంభణములచేత ఆ ఆత్మ ఒక్కడే సర్వమును నిర్వహించుచున్నాడు. ఆయన జ్ఞానమాత్ర రూపుడై సర్వజ్ఞుడై ఉన్నను, సర్వాత్మకుడై ఉన్నను, నిరాకారుడై ఉన్నను, శక్తులకు మాత్రము మితిలేదు. ఇచ్ఛా

సత్తయు (ప్రపంచసృష్టిని గూర్చిన ఇచ్ఛయొక్క ఉనికియు) ఆకాశసత్తయు (ఆకాశముయొక్క ఉనికియు, ఇట్లు చెప్పుటచేత పంచభూతముల యొక్క ఉనికియును ఉపదేశింప బడెనని తెలిసికొన వలయును. కేవలము ఆకాశమును ఒక్కదానినిగూర్చియే చెప్పుటవలన ప్రయోజనము ఉండదు కదా?) కాలసత్తయు (దీనిచేత దిక్కులు మొదలగువాని ఉనికియు జెప్పబడెనని తెలిసికొన వలయును.) నియతిసత్తయు (ప్రాపంచిక నియమములయొక్క ఉనికియు, పుణ్యము చేసినవాడు సుఖము నొందవలయును. పాపము చేసినవాడు దుఃఖము నొందవలయును. అను మొదలగునవి, ప్రాపంచిక నియమములు) మహాసత్తయు (మహాసత్తయనగా, భావపదార్థములయందెల్ల వ్యాపించి ఏకరూపముతోనున్న ఉనికి) జ్ఞానశక్తియు (దృశ్యములను ప్రకాశింపజేయు సామర్థ్యము) క్రియాశక్తియు (సర్వకార్యములకు చేయుగల సామర్థ్యము) కర్తృత్వమును అకర్తృత్వముయొక్క అభావమును అను మొదలగు శక్తులన్నియు అపరబ్రహ్మమునకు కలవు. ఆశక్తులకు మితియే లేదు. ప్రపంచమునందు ఏ ఏ శక్తి గానవచ్చునో, అదియంతయు పరమాత్మ శక్తియే. ఇట్లగుటచేత వికాసశక్తిచేత సంసారము వికసించును. నిరోధశక్తిచేత (చిత్తమును నిగ్రహించుటయను శక్తిచేత) అది అణగును. ప్రతిపురుషుడును దేవపూజచేయు నప్పుడు ఈదేహమును ముఖ్యముగ పరిత్యజింప వలయును. ఇది సంస్కారములచేతను స్నానాదులచేతను పవిత్రమైనదియే అయినను ఆత్మకంటె భిన్నముగ దోచునది. కావున అజ్ఞాన కల్పితమైనది. కావునను, అపరిశుద్ధ మైనదియే. దీనినివిడచి దీనియందే లోకోత్తరుడై సర్వసాక్షియై ప్రకాశించుచునుండు ఆత్మను నిత్యపరిశుద్ధుని, గ్రహింపవలయును.

శ్లో॥ ఏషదేవస్య పరమః పూజ్యఏష సదాసతామ్ ।
పూజనంధ్యానమేవాంత ర్నాన్యద స్త్యస్యపూజనమ్ ॥
తస్మాత్త్రిభువనాధారం నిత్యంధ్యానేనపూజయేత్ ।
చిద్రూపంసూర్యలక్షాభం సమస్తాభాసభాసనమ్ ॥
అంతస్థచిత్ప్రకాశంస్వమహంతా సారమాశ్రయేత్ ।
అపారపరమాకాశ విపులాభోగకంధరమ్ ॥
అనంతాధస్తనాకాశ కోశపాదసరోరుహమ్ ।
అనంతదిక్తటాభోగ భుజమండలమండితమ్ ॥
నానావిధమహాలోక గృహీతపరమాయుధమ్ ।

హృత్కోశకోణవిశ్రాంతి బ్రహ్మాండౌఘపరంపరమ్ ॥
ప్రకాశపరమాకాశ పారగాపాదవిగ్రహమ్ ।
అథఊర్ధ్వంచతుర్దిక్షు విదిక్షుచనిరంతరమ్ ॥
బ్రహ్మేంద్రహరిరుద్రేశ ప్రముఖామరమండితమ్ ।
ఇమాంభూతత్రియంతస్య రోమాళింప్రవిచింతయేత్ ॥

ఈ ఆత్మయే దేవదేవుడు. ఈయననే పూజింప వలయును. ధ్యానమే ఈయనకు పూజ. ఇంతకంటె మఱి ఏమియు లేదు. కావున సర్వోత్తముడును, సర్వప్రకాశములను ప్రకాశింప జేయువాడును, త్రిభువనములకు ఆధార భూతుడును, లక్షసూర్యులు ఒక్కమాఱే ఉదయించిన ఎంతకాంతి ఉండునో అంతకాంతి గలవాడును, జ్ఞానమాత్ర రూపుడు, నగు అమ్మహాత్ముని సర్వకాలములయందును ధ్యానముచేత పూజింప వలయును. ఆద్యంతములు లేని ఆకాశమువలె అతి విశాలమై విస్తార రూపముతో ప్రకాశించునదియై "అహంకారము" అను అస్వచ్ఛపదార్థమునకు సారభూతమై జ్ఞానప్రకాశము కలదియై ఉండు ఆత్మరూపమునే ధ్యానశక్తిచేత ఆశ్రయింపవలయును. ఊర్ధ్వగతమగు ఆకాశమే ఆయనకు విస్తారమగు మెడ. దిక్కులే భుజములు. అనేకములై ప్రకాశించు ఈలోకములే ఆయుధములు. ఆయనయొక్క గర్భమునందు బ్రహ్మాండములన్నియు విశ్రమించి ఉన్నవి. ఆయన దేహము ప్రకాశరూపమై ఆకాశమంతయు పైభాగమునందును, క్రిందిభాగమునందును, దిక్కులయందును, ఇంచుకయైన ఎడము లేకుండ వ్యాపించియున్నది. బ్రహ్మ, రుద్రుడు, విష్ణువు, ఇంద్రుడు, మొదలగు అధిపతులతో గూడిన ఈసర్వభూతములు ఆయనకు రోమములు. బహువిధములగు కార్యములను చేయునవియు, త్రిలోకములను యంత్రములకు త్రిప్పునవియు, నగు ఇచ్ఛాది శక్తులు ఆయనయొక్క శరీరమును ఆశ్రయించియున్నవియే. ఈవిధముగ అమ్మహాత్ముని ఆకారమును సర్వప్రపంచమయమునుగా భావించి ధ్యానింప వలయును. ఈయనయే సర్వోత్తముడగు దేవుడు. సర్వసత్పురుషులచేత ఆరాధింప దగినవాడు. ఆత్మ జ్ఞానరూపుడనుట సర్వానుభవ సిద్ధము. సర్వపదార్థములను ప్రకాశింపజేయువాడు. కావున ఆయనయే సర్వవ్యాపకుడు. ఆయనయొక్క సహాయము లేక ఏదియు స్థిరము కానేరదు. కావున ఆయనయే సర్వమునకును ఆశ్రయ భూతుడు. ఆయనకు అంతము లేదు. సర్వమునకును ఆయన ఆధారభూతుడు. ఆధారమని చెప్పబడువానికన్నిటికిని ఆధారభూతుడు. ఉనికిమాత్రమే స్వరూపస్థితిగా

గలవాడు. సర్వప్రపంచమును తన విచిత్రము చేత పుట్టించినవాడు. (తనస్వరూపమునకు హాని కొంచమైన లేకుండ ప్రపంచమును కనబరచువాడు) ఈమహాత్మునకు కాలమే ద్వారపాలకుడు (ఈయన అనుగ్రహము కలవానికే గాని, కాలము అనుకూలమై ఉండదనుట. సుకృతకర్మలు పరిపాకము నొంది కాలము అనుకూలముగ వచ్చిననే గాని, ఈయన అనుగ్రహింపడనుట) మఱియును ఆపరమేశ్వరునకు అన్నివైపులయందును చూచు సామర్థ్యమును, స్పర్శను గ్రహించు సామర్థ్యమును, మూరొనును సామర్థ్యమును, రుచిచూచు సామర్థ్యమును, కలవు. అన్నివైపులను సంకల్పశక్తియు, సంకల్పములను అతిక్రమించి వెలుగు సామర్థ్యమునుగూడ గలవు. అన్నివైపులను లోకాతీతమగు పరమానందమే వెలుగుచుండును. ఈవిధముగ అమ్మహాత్ముని యొక్క స్వరూపమును ధ్యానించి పిమ్మట ఇట్లనిశాస్త్రోక్తప్రకారముగ పూజింపవలయును. ఆత్మరూపుడై జ్ఞానాకారుడై ఉన్న ఈదేవునకు అశాశ్వితములై కష్టపడి సంపాదింప వలసినవైయుండు కానుకలచేత తృప్తికలుగదు. ఇకనేమియనిన, శాశ్వతమై సుఖసాధ్యమై నాశరహితమై చల్లనై (శాంతిప్రదమై) ఉండు ఆత్మజ్ఞానామృతమును మాత్రమే ఆదేవుని ఆరాధించుటకై సంపాదింప వలయును. దానిచేతనే కాని, ఆయనకు పరిపూర్ణతృప్తి కలుగను. అట్టి జ్ఞానామృతమును సంపాదించి తనలో ప్రత్యగాత్మస్వరూపముతో ఉన్న పరమాత్ముని దెలిసికొనవలయును. ఇదియే ధ్యానము. ఇదియే దేవపూజ. ఇదియే పరమేశ్వరునకు తృప్తికలిగించుట. చూచుచున్నను, వినుచున్నను, తాకుచున్నను, ఆఘ్రాణించుచున్నను, తినుచున్నను, ఊపిరి విడుచు చున్నను, నిదురించుచున్నను, మాటలాడుచున్నను, మలమూత్రములు విసర్జించుచున్నను హస్తముచే దేనినైననైకొను చున్నను, మఱి ఏకార్యములనైన ఆచరించు చున్నను, సర్వకాల సర్వావస్థలయందును, ఆపరమేశ్వరునే చూచుచుండవలయును. ఆయననే ధ్యానింపుచుండ వలయును. ఆధ్యానమే ఆత్మకు కానుక. ఆధ్యానమే ఆయనకు పూజ. ఆధ్యానము లేకుండిన ఆయనకు తృప్తి లేదనుట అటుండనిండు ? మొట్టమొదట గోచరింపనైన గోచరింపడు.

శ్లో॥ ధ్యానేనానేనసుమతే నిమేషాంస్తు త్రయోదశ ।
మూర్ధోపిపూజయిత్వేశం గోప్రదానఫలంలభేత్ ॥

ఓ బుద్ధిమంతుడా ! వశిష్ఠమహామునీ ! మూఢుడైనను పైనజెప్పిన ఆకారమును మనస్సునందు ఎట్లయినను నిలుపుకొని పదమూడు నిముష

ములు ( రెప్పపాట్లు ) ధ్యానించెనేని వానికి గోదానఫలము గలుగును. ఈ విధముగ ఆప్రభువును నూఱు రెప్పపాట్లకాలము పూజించినవాడు అశ్వమేధ యాగముచేసిన ఫలమునుజెందును. ఇట్లే ఆత్మరూపుడగు ఆస్వప్రకాశ స్వరూపుని అరగడియకాలము పూజించినవాడు వేయు అశ్వమేధయాగములనుచేసిన ఫలమునొందును. మఱియు ఎవడు ధ్యానమనియెడు కానుక ఇచ్చి ఆసర్వేశ్వరుని గడియకాలము పూజించునో, వాడు రాజసూయ యాగము చేసిన ఫలమునుగాంచును. ఉదయము మొదలు మధ్యాహ్న కాలము వరకు పూజింపగలవాడు లక్ష రాజసూయ యాగముల ఫలము నొందును. ఒకదినమంతయు అట్లే పూజించెనేని వానియొక్క ఫలమునకు మితియే లేదు. శాశ్వతమగు మోక్షమునే జెందును. ఇదియే సర్వోత్తమ మగు యోగము. ఇదియే సర్వోత్తమమగు కార్యము. ఇంతదనుక చెప్ప బడినదంతయు ఆత్మయొక్క బాహ్యపూజ. ఇక ఆంతర పూజను గూర్చి చెప్పెదను వినుము.

శ్లో॥ నిత్యమేవశరీరస్థ మిమంధ్యాయేత్పరంశివమ్ ।
శయానముత్థితంచైవ వ్రజంతమథవాస్థితమ్ ॥

పైన జెప్పిన లక్షణములుగల ఆనందరూపుడే ప్రతిపురుషుని శరీరము నందు ఉన్నాడు. ప్రతిపురుషునకును ఆత్మయై ఉన్నాడు. “ నేను పరుండు చున్నాను, కూర్చుకొనుచున్నాను ” అను మొదలగు వ్యవహారములచేత వ్యవహరింప బడువాడు ఆ ఆత్మయే. ఈ తత్వమును ఎఱింగి ఏదియో ఒక స్థితిని అవలంబనముగ గైకొని ఆ పరమాత్మను సర్వకాలములయందును ధ్యానించు చుండవలయును. నిరాధారముగ ధ్యానించుట అశక్యముకదా ? మఱియును ఆ ఆత్మయే స్పృశింపబడవలసిన పదార్థములను స్పృశించు చున్నాడు. అంగీకరింపగూడని వాని సమగ్రముగ విడుచుచున్నాడు. అతి విస్తారములై స్థూలములగు భోగములను అనుభవింపు చున్నాడు. వైరాగ్య దశను అవలంబించి ఒక్కొక్కమాఱు వానిని విడుచు చున్నాడు. ఈ దశల లో దేనినైనా ఆలంబనముగా గైకొని ఆ ఆత్మను ధ్యానింప వలయును. “ ఇట్టివాడు జీవుడేకదా? ” అనియెదవేమొ, జీవ పరమాత్మలకు భేదము లేదని ముందే వివరించి ఉన్నాము. ఇదియునుగాక ఆ ఆత్ముడు మనస్సు నందును, దానికిగల సంకల్ప శక్తియందును గూడ వానికి ఆధారమై ఉన్నాడు. ప్రాణాపానములకు మధ్యమున దెలియవచ్చు చున్నాడు.( ఈవిష యము భుసుండోపాఖ్యానమునందు వివరింపబడి ఉన్నది. ) హృదయము

నందును, కంఠమునందును, దవడల మధ్యమునందును, భ్రూమధ్యమునందును, నాసాగ్రమునందును, అభివ్యక్తుఁడై ఉన్నాఁడు. (పరబ్రహ్మము హృదయాది స్థానములయందు ఉన్నాఁడని శ్రుతులు చెప్పుచున్నవి. ) ముప్పదియారవ తత్త్వమై ఉన్నాఁడు (ఇది శైవాగమ సిద్ధాంతానుసారముగ చెప్పబడెను). ఉన్మన్యవస్థను ( ఇదియే తుర్యాతీతము ) మించి ఉన్నాఁడు. ఇట్టిస్థితులలోఁగూడ దేనినైనా ఒకదానిని ఆత్మశక్తి అనుసారముగ ఆలంబనము చేసికొని ఆపరమాత్మను పూజింప వలయును. ప్రపంచమునందుగల సర్వపదార్థములను ఏకరూపముగా ప్రకాశింప జేయునది జ్ఞానమే తనకు స్వరూపము. ఈవిషయమును ఎఱిగిన దృశ్యపదార్థములకు సంబంధించిన మాలిన్యములు తనకు అంటవు. సాక్షికి సాక్ష్యములతో ఎట్టిసంబంధమును కలుగదుకదా? కావున అట్టి వివేకము కలుగుటయే ఉపాసకునకు నిర్మలజలస్నానము. "ఆ నిరాకారునకును, నాకును, భేదము లేదు" అను నిశ్చయమే పూజాద్రవ్యములు. కావున పైన వర్ణించిన విధముగా స్నానమును చేసి పరిశుద్ధుఁడై ఆపూజాద్రవ్యముల సమకూర్చి జ్ఞానమయమగు ఆత్మలింగమును భక్తియుక్తుఁడై పూజింప వలయును. ఇట్లు గాకున్నను హస్తపాదాది అంగములతోను, వెంట్రుకలు గోళ్ళు పండ్లు మొదలగు ప్రత్యంగములతోను గూడిన తనదేహముకూడా ఆత్మునియొక్క ఆభాసమాత్రమే. కావున దానిని గూడ ఆత్మునిగ భావించి పూజింప వచ్చును. ఈ ఆంతర పూజకు మఱియొక విధముకుండ గలదు. "మనస్సే నేత్రముగా గలిగ సర్వవ్యాపకుడనై ఉన్న నన్ను, విచిత్రములును సర్వేంద్రియములను ఆశ్రయించినవియు నగు చూపు వినికి మొదలగు శక్తులు "భార్యలు ఉత్తముడగు భర్తను సేవించునట్లు" సర్వకాలమును సేవించు చున్నవి. నాకు ఈ మనస్సే ద్వారపాలకుఁడు. ఈతడే త్రిలోక వృత్తాంతములను దెచ్చి చెప్పుచుండును. ఆలోచన అనునదియు మఱియొక ద్వారపాలకురాలు. ఇది నేను కోరినదాని నెల్ల సమకూర్చుచు ఉండును, ( ఇచ్చట సఫలమగు ఆలోచనే ఉద్దేశింప బడెను. పరమేశ్వరుడు సత్యసంకల్పుఁ డగుటయే ఇందుకు గారణము) మఱియు నానావిధములగు జ్ఞానములు (చూచుట మొదలగునవి. ) నాకు భూషణములు. జ్ఞానేంద్రియము లైదును, కర్మేంద్రియము లైదును, నాకు మార్గములు. ( ఆత్మప్రకాశము ఇంద్రియముల మూలమునందు వెలికి ప్రసరించి బాహ్యపదార్థములను ప్రకాశింప జేయును. ) నేను ఆ పరమేశ్వరుడనే. నాకు ఆద్యంతములు లేవు. పరిచ్ఛేదములును (విభాగములును)

లేవు. సర్వదేశ సర్వకాల సర్వవస్తువులయందును ఏకరూపముతో వ్యా
పించి ఉన్నాను. నిండి ఉన్నాను. నాకంటె అన్యము ఏదియు లేదు. నేను
సర్వసముడను. ఏకరూపుడను అగుటచేత శీతోష్ణాదులను పొందనివాడను.
ఎక్కువ తక్కువలు వృద్ధిక్షయములును లేక సమమై ఉండు ఆకారము గల
వాడను. ఏకరూపముగా ప్రకాశించువాడను. అని ఇట్లు భావించి సర్వేశ్వ
రుని ఆత్మగా ఎఱింగి పూజించిరేని అప్పుడు సంపూర్ణ శాంతి కలుగును.
కావున యథార్థదేవుని ఎఱిగినవాడు లోకోత్తరుడును, జ్ఞానమాత్రరూపు
డును, అగు పరమేశ్వరుని, శాంతమును సమమును సర్వాత్మకమునగు
బుద్ధితో వ్యవహారానుసారముగ వచ్చిన సర్వవిషయములతోను, పూజించు
చుండవలయును ( ఏకార్యమును ఎట్లు చేయుచున్నను ఆత్మపూజను చేయు
చున్నట్లే భావింప వలయుననుట. ఈ పూజకై క్రొత్తపదార్థములను సంపా
దింప వలయుననను ప్రయత్నము అక్కఱలేదు. ఇకను ఏమియనిన, తనకు
మిక్కిలి ఇష్టమైయున్న పదార్థములను ( సుఖభోగములను ) అద్దేవునికి
అర్పించినజాలును. " తాను అనుభవించు భోగములను పరమేశ్వరుడే
అనుభవించుచున్నాడు " ( అని భావించుటగాని, భోగ పరిత్యాగ రూప
మగు వైరాగ్యము కాని ఇందు వర్ణింపబడెనని తెలిసికొన వలయును. )
ఈ పరిత్యాగముచేత శుద్ధచైతన్య రూపుడగు పరమేశ్వరుడు సంతోషిం
చును. పూర్వకర్మానుసారముగ తనకు లభించిన భక్ష్యభోజ్యాదులును, శయ
నము, ఆసనము, మొదలగునవియును, ఆ పరమేశ్వరునకే అర్పింప వలయును.
ఐశ్వర్యానుగుణముగ తగినంత సమృద్ధికలిగి స్త్రీలు, మృష్టాన్నము, పాన
ము, గీతవాద్యాదులు, మొదలగు నానావిధములతో ఒప్పుచున్న భోగము
లచేత ఆ పరమేశ్వరుని అర్చింప వలయును. (తానే పరమేశ్వరుడు కావున
తన అనుభవమే పరమేశ్వరునిపూజగా భావింప వలయుననుట) సుఖభోగ
ములు మాత్రమే కాదు. మనోవ్యాధులతోను దేహ సంబంధములగు వ్యా
ధులతోను గూడి దుస్సహమై అజ్ఞానముయొక్క సంరంభముతో గలసి
మహోపద్రవమును కలిగించుచునుండు దుఃఖముకూడ పూజాసాధనమే.
జీవుడే ఆత్మ కావున జీవునిచేత అనుభవింపబడినదంతయును ఆత్మచేతగూడ
ఒకవిధముగ అనుభవింపబడినదే అగును. మఱియు పరమేశ్వరునకు సుఖ
దుఃఖముల రెంటియందును విషమబుద్ధి ( రాగద్వేషములు ) ఉండవు. జీవు
నకుగూడ నుండకూడదు ( కావున. " సుఖదుఃఖములయందు సమభావము
ఉండవలయును " అనుటయే ఈ శ్లోకమునకు అభిప్రాయము. ) మఱియు

కర్మానుగుణముగ దారిద్ర్యము సంభవించినను సామ్రాజ్యము వచ్చినను మఱియును ఎట్టి సుఖదుఃఖములు కలిగినను వానితో పరిశుద్ధాత్మను అర్చింప వచ్చును. అవి అన్నియు పరమేశ్వర ఆరాధనమునకు పుష్పములే అగును. ప్రపంచమునందు అనుభవయోగ్యములగు పదార్థములు అనేకములు గలవు. అందు పురుషులకు హితమును బోధించుటకై వేదము కొన్నిటిని నిషేధించి మఱికొన్నిటిని అంగీకరించి ఉన్నది. అట్లు అంగీకరింపబడినవికూడ అల్ప ఫలదాయకములు అగుటచేత ముముక్షువులకు పరిత్యజింప బడవలసినవియే. ఇట్లయినను కొందఱు అట్లుచేయక ఈ రెండు విధములగు భోగములను కూడ లోలురై ఆచరింపు చున్నారు. కొందఱు వేదముచేత అంగీకరింప బడిన వానిని మాత్రము ఆశ్రయించు చున్నారు. మఱికొందఱు సర్వమును పరిత్యజించు చున్నారు. ఇట్టివారు ఇరువురును కూడ పరమేశ్వర ఆరాధకులే. భోగములను అంగీకరించుటయును, విడుచుటయును గూడ పరమేశ్వర ఆరాధనమునకు సాధనములే. ఆయన జ్ఞానమాత్రస్వరూపుడు. సర్వసాక్షి. కావున సర్వమును ఎఱుగుచునే ఉండును. సర్వాధారుడు కావున సర్వముచేత ఆశ్రయింపబడుతునే ఉండును. విశేషముగా జెప్పనేటికి ? గడచిపోవువానిని గూర్చి దుఃఖింపక వచ్చినవానిని నిర్వికారుడై అనుభవించుచు నుండుట ఏది కలదో, అదియే పరమాత్ముని అర్చనము. వచ్చినతోడనే ఏది మనోహరమై కానవచ్చునో, ఏది అట్లుగాక వచ్చిన తత్క్షణమే దుఃఖకరమైయుండునో, వానిరెంటిని సమచిత్తముతో జూచుట యే ఆత్మార్చనము చేయువానిపని. ( ఇందు వర్ణింపబడిన రెంటిలో మొట్టమొదటిది ఇంద్రియ వ్యాపారము వలన గలిగిన విషయ సుఖము. రెండవది మనో నిగ్రహమువలన గలుగు మోక్ష సుఖము. ఇది ఆరంభమునందు దుఃఖకరమై ఉండుననుట స్పష్టమే. ఇదియునుగాక రెండవదానిచేత సర్వకాలములయందును అనగా ఆరంభమునందును, తుదయందును గూడ దుఃఖమును కలిగించు తమోమయ స్థితి కూడ చెప్పబడినట్లే గ్రహింప వలసి ఉన్నది. “ మొట్టమొదట దుఃఖమును కలిగించునది ” అనుటచేత తుదయందు జరుగబోవు విషయము నిర్ణయింప బడలేదు కావున అందు సుఖమైనను దుఃఖమైననుగూడ ఉండవచ్చునని ఊహింప వలసి ఉన్నదిగదా ? ఇందు మొట్టమొదట వర్ణింపబడినది రాజస సుఖము. రెండవది సాత్విక సుఖము. మూడవది తామస సుఖము. తామససుఖమనునది దుఃఖరూపమే అయినను మోహమును కలిగించునది కావున ఇట్లు చెప్పబడెను. ( నిద్ర, పరాకు, మొదలగునవి ఈజాతిలో చేరునవి. )

సర్వకాలములయందును సర్వ విధములతోను సర్వప్రదేశములయందును గల సమస్తము బ్రహ్మరూపమే. ఇట్టి నిశ్చయమును కలిగియుండుటయే ఆత్మార్చనము ఆచరించుట. కృతార్థతను జెందదలచినవాడు ఈదేవతార్చననే సర్వకాలములయందును వ్రతముగ ఆచరింపవలయును. ఇట్టివాడు దేనిని కోరగూడదు ? దేనిని పరిత్యజింప కూడదు ? కర్మానుగుణముగ ఏది వచ్చినను వానియందు రాగద్వేషములను ఉంచకూడదు. సముద్రుడు తమంతన వచ్చి కలియుచున్న నదులను అనుభవించునట్లు ( నదులను సముద్రునికి భార్యలుగా వర్ణించుట కవిసంప్రదాయము ) తనయంతన ఎప్పటికి ఏదివచ్చిన దానిని అనుభవింప వలయును. వచ్చుచు బోవుచు అనేకవిధములగు ఆకారములతో ప్రకాశించుచున్న ప్రాపంచిక పదార్థములను జూచు నప్పుడు ఇంచుకయైనను కలతనొందక ఏకరూపముతో ఉండు ఆకాశమువలె ఆ ఆత్మోపాసకుడు శ్రేష్ఠములుగాని, నీచములుగాని, అగు ఏపదార్థములను జూచినను కలతనొందకూడదు. దేశము, కాలము, కర్మ మొదలగువాని సంయోగముచేత ఏ ఏశుభాశుభములు ప్రాప్తించునో వానినెల్ల నిర్వికార చిత్తముతో గ్రహించి ఆత్మార్చనమునందు ఉపయోగింప వలయును. (అనుభవింప వలయుననుట) ఈ ఆత్మపూజకు ఉపయోగింప వలసిన పదార్థములను వివరించితిని. ఆపదార్థములు శుభాశుభ రూపములైనవియే అనిస్పష్టము చేసితిని. ఉపాసకుడు వానిని సమత్వమనియెడు రసమునందు ఊరబెట్ట వలయును. అట్లు చేసిన పులుసు, ఉప్పు, కారము, చేదు, వగరు, అనుమొదలగు రుచులను విడిచి కేవలము మధురములే అగును ( శుభాశుభములయందు కల భేదమే సుఖదాయక దుఃఖదాయకత్వములే మారిపోవును. సాధకునియొక్క మనస్సునందు రాగద్వేషములు లేకపోవుటచేత సర్వమును సుఖకరమే అగుననుట )

శ్లో॥ సమతామధురారస్యా రసశక్తిరతీంద్రియా ।
తయాయద్భావితంచేత్థ మమృతంతత్క్షణాద్భవేత్ ॥

ఓ వశిష్ఠమహాముని! సమత్వమనునది అతి మనోహరమైనది. రుచిని పుట్టించునది. ఇంద్రియములకు గోచరము కానిది. సర్వమునకును ఆహ్లాదకత్వమును గలిగింపజాలినది. ఇట్టి ఆసమత్వముచేత ( సర్వమును సమానముగా జూచుటచేత ) ఏపదార్థము భావింగబడునో ( ఊరబెట్టబడునో, సంకల్పింపబడునో ) అది తత్క్షణమే అమృతమగును. సమత్వమను అమృతమును సంపాదించి ఆరూపముతో ఏ ఏ పదార్థము భావింపబడునో, అది

మెల్ల తత్క్షణమే అమృతమగును. " చంద్రమండలమునుండి జారిపడిన శకలమువలె " పరమాహ్లాదమును గలిగించును. కావున జ్ఞానియగువాడు సర్వపరిపూర్ణుడై జ్ఞానమాత్రస్వరూపుడై అద్వితీయుడై శిలవలె సర్వవ్యాపారములను పరిత్యజించి సమత్వమనియెడు దివ్యకాంతిచేత రాజిల్లుచు సంపూర్ణచంద్రునివలె సర్వము అమృతమయముగా భావన ( ఊరబెట్టుట, లేక, సంకల్పించుట. ) చేయ వలయును.

శ్లో॥ దేశకాలకరణక్రమాదిభి
స్సర్వవస్తుసుఖదుఃఖవిభ్రమైః ।
నిత్యమర్చితశరీరనాయక
స్త్యజ శాంతసకలేచ్ఛయాధియా ॥

ఓ వశిష్ఠమహాముని ! ఈతత్వమునెల్ల బాగుగ ఎఱిగి దేశము, కాలము, సాధనములు, అను మొదలగువాని సంయోగమును అవలంబించి జనించుచున్న సుఖదుఃఖములచేతను, సర్వపదార్థములచేతను, సర్వకాలములయందును, దేహమునకు ప్రభువగు ఆ ఆత్మను పూజించుచు, సర్వకామములను వర్జించి నిర్మలబుద్ధితో నిలువుము. ఉపాయమును ఎఱిగిన చాకలి వస్త్రములను ఆశ్రయించియున్న మాలిన్యమును మలిన పదార్థములచేతనే బోగొట్టునట్లు, జ్ఞానియగువాడు తన అవిద్యను అవిద్యచేతనే బోగొట్టుకొనును. ఆ అవిద్యయందు శ్రేష్ఠములును నీచములు నగు రెండువిధముల అవయవములు కలవు. అందు శ్రేష్ఠములగునవి అట్లుకానివానిని నశింపజేయును. గురూపదేశము మొదలగునవికూడ అవిద్యాంశములేనైనను అవి శ్రేష్ఠములు. వాస్తవస్థితిలో అవిద్య తన్నుతానే నాశనము చేసికొనుననుట సంభవింపకపోయినను ఈశ్రేష్ఠమైన అవిద్య తక్కినదానిని నశింపజేయుననుట అనుభవసిద్ధమై ఉన్నది. కావున ఏదియో ఒకవిధముగా అంగీకరింపవలసి యున్నది. గురూపదేశము బ్రహ్మజ్ఞానమును గలిగించుననుట నిర్వివాదాంశముకదా ? క్రమక్రమముగ గురూపదేశము ప్రవర్తించేనేని అప్పుడు నిరూపింపరానివాడైనను, కానరానివాడైనను, తెలిసికొనుటకు వీలు లేనివాడైనను, ఆ ఆత్ముడు శిష్యులయొక్క హృదయములయందు తనంతనే ప్రకాశించుచున్నాడనుట స్పష్టమగు విషయమే " ఇట్లయిన పరమేశ్వరుడు అప్రమేయుడు ( ఏప్రమాణమునకును గోచరుడు కానివాడు ) కానేరడు కదా? " అనిచెప్పెదవేమో వినుము. వాస్తవస్థితిలో ఆపరమేశ్వరుడు శాస్త్రవిచారములవలనగాని, గురూపదేశములవలనగాని, తెలియవచ్చువాడు

కాదు. " అట్లు తెలియవచ్చును " అనిన గురువు దొరికిన ప్రతివాదును ముక్తుడే కావలసి వచ్చును. ఇది అసంభవమని చెప్పుటలో సంశయము లేదు కదా. " కావున గురూపదేశాదులవలన ప్రపంచతత్త్వము తెలియవచ్చును. అది దృఢముగ అభ్యసింప బడెనేని అప్పుడు ఆత్మరూపము తనంతనే ప్రకాశించును " అనిమాత్రమే సిద్ధాంతము చేయవలయును. ఈకారణమువలన " గురూపదేశాదులు ఔపచారికముగ బ్రహ్మజ్ఞాన సాధనములని చెప్పబడుచున్నవి " అని నిర్ణయింప వలయును. మఱియు గురూపదేశము, శాస్త్ర విచారము, అనునవి లేకుండ ఆత్మజ్ఞానము కలుగదు. వీని సంయోగమే ఆత్మజ్ఞానమును ప్రకాశింప జేయునది. గురూపదేశము, శాస్త్రవిచారము, అధికారియగు శిష్యుడు, అను నీమూడు పదార్థములును చిరకాలము సంయోగము జెందియుండునేని, సూర్యకాంతికిని భూమికిని సంయోగము కలిగినప్పుడు ( పగటియందు ) జనించు జన వ్యవహారమువలె ఆత్మజ్ఞానము స్వయముగనే ఉదయించును. పగలు జన వ్యవహారమునకు ప్రత్యక్ష కారణము కాకున్నను " జనవ్యవహారమునకు పగలు కారణము " అని ఔపచారికముగ జెప్పబడుచున్నట్లే ఈగురూపదేశము మొదలగు సంయోగముగూడ ఆత్మజ్ఞాన కారణముగ జెప్పబడుచున్నది. ఓమునిశ్రేష్ఠా! పైనవర్ణించిన విధముగ గురూపదేశ శాస్త్ర విచారములవలన ఆత్మజ్ఞానమును ఆర్జించి ఆ ఆత్మను ప్రతిదినమును పూజించువాడు మోక్షమును జెందును. ఆస్థానము మాకును నమస్కార యోగ్యము. సేవనీయము. జేమందరము అచ్చట కింకరులమే. " ప్రత్యక్షముగ గానవచ్చుచున్న ఈప్రపంచమును ఎట్లు విడువ వచ్చును. సర్వమును ఆత్మరూపమే అంటిరి కదా? " అని అనియెదవేమో, వినుము. ఈప్రపంచము ఊరక కనుపడునదియే కాని, వాస్తవస్థితిలో బొత్తిగనే లేదు.

ఓమునిశ్రేష్ఠా ! ఇది అంతయును ఆత్మ ప్రతిబింబమాత్రమే. మోహాంధకారమున మునిగియున్నవారలకు మాత్రము ఇది బహుభేదములతో ఉన్నట్లు కానవచ్చును. వాస్తవస్థితిలో ఇందు ఆత్మభిన్నమైనది ఏదియును లేదు. బ్రహ్మము ఆత్మ మొదలగు శబ్దములకు అర్థమగునది శుద్ధవిజ్ఞానమే. అది కల్పితమగు దృశ్యము పైపునకు పోవుచున్నట్లు భావింపబడెనేని అప్పుడు చిచ్ఛబ్దముచేత జెప్పబడును. కలగాంచు పురుషుడు కలయందు సంకల్ప ప్రభావముచేత ఒకక్షణమునందు అడవి ఏనుగుగా నేర్పడినట్లు, అశుద్ధజ్ఞానము కూడ " నేను దృశ్యపదార్థములను జూచుచున్నాను " అని సంక

ల్పించుట వలన అహంకారరూపము నొందును. ఇట్లు అహంకారరూపము నొందిన అజ్ఞానమునకు దేశము కాలము అను రూపములు గల ఆత్మయే చెలులై ఏర్పడుచున్నారు. ( స్వయముగనే దేశ కాల రూపములను జెంది చెలులని వ్యవహరింప బడుచుండునది అజ్ఞానమే అనుట ) ఆచెలులకు వాస్తవమగు రూపమే లేదు. ( దేశ కాలములు సత్యములు కావనుట ) అట్టి ఆచెలులతో గూడి అహంకారరూపము నొందియున్న ఆసత్తయే క్రమక్రమముగ జీవరూపమును జెంది కేవలము అజ్ఞానియై బుద్ధిరూపము నొందును. అప్పుడు దానికి నిశ్చయమే స్వరూపము అగును. అది జీవునియొక్క శక్తి. పిమ్మట దానికి శబ్దశక్తియు, ఇచ్ఛాశక్తియు, జ్ఞానశక్తియు, క్రియాశక్తియు, పూర్వమువలెనే చెలులై ఏర్పడును. పైన జెప్పిన సమూహామంతయు అనగా, శబ్ద శక్త్యాదులును బుద్ధియు గలసి స్మృతిని ( స్మరించు సామర్థ్యమును కలిగించును.) పిమ్మట ఆస్మృతి ప్రభావమువలన ఆ ఆత్మయే సర్వ సంకల్పములను మహావృక్షమునకు బీజమగు మనస్సై ఏర్పడును. ఆమనస్సునకే అతివాహిక దేహమని పేరు. దానిశక్తులకు మితియే లేదు. శబ్దాది శక్తులను ఆశ్రయించి ఆకాశాది రూపములను జెంది సర్వవిధములగు ఈప్రపంచములుగ అదియే ప్రకాశించు చున్నది.

ఇట్లు విమర్శించి చూచిన " దయ్యముయొక్క ఉనికివలె " ఈ మనస్సుయొక్క ఉనికిగూడ శూన్యరూపమే కదా- ( శాస్త్రాంతరములయందు దయ్యమనునది ప్రసిద్ధముగనే ఉన్నను ఇచ్చట భ్రాంతికల్పితమగు దయ్యమును గూర్చి మాత్రమే చెప్పబడుటవలన విరోధము ఏమియు రాదు. ) కావున ప్రపంచమనునది కేవల భ్రాంతియే అనుటలో సంశయము లేదు కదా ? కావున ఆమనస్సు శాంతినొందెనేని సంపూర్ణమగు శాంతిదొరకును. కావున అహంకారమునందును, ప్రపంచమునందును, ఎండమావుల నీటియందును, ఎవడు నమ్మకము ఉంచునో ( ఎండమావుల నీటిని వాస్తవముగ భావించువానివలె ఎవడు శూన్యప్రపంచమును వాస్తవముగ భావించునో ) ఛీ అట్టివానిబ్రతు కేల ? వానికి ఉపదేశము చేయరాదు. బుద్ధిమంతులగువారు ఎప్పటికిని కొంచెము వివేకము గలవానికేగాని, ఉపదేశము ఒసంగరు. భ్రాంతుడై సజ్జనసేవ లేక ఉండువానికి ఎవరు ఏమిబోధించినను అది అనర్థదాయకమే అగును. కావున దానిని ఎఱిగి సత్పురుషులు అట్టి పనికి ఉపక్రమింపరు. ఈ విషయమును ఎఱుగలేక ఎవడు అత్యంతమూఢునకు ఉపదేశము ఇచ్చునో, అట్టివాడు " సర్వభూషణములచేత అలంకరింప

బడిన తనపుత్రికను కలలోఁజూచిన పురుషునకు ఇచ్చిన వాఁడగును. అని ఇట్లు ఉపదేశించి అప్పరమేశ్వరుడు మరల నాతో ఇట్లనియె. ఓవశిష్ఠమహామునీ! నీవడిగిన విషయములెల్ల వివరించి చెప్పితినిగదా. ఇక మేము యథేచ్ఛగా బోయెదము. అని అక్కడినుండి ప్రయాణమగుచు " పార్వతీ ! ఇటురమ్ము లెమ్ము పోవుదము " అనిదేవిని పిలిచెను. అంత నేను నమస్కారము చేసి పుష్పాంజలిని ఇచ్చితిని. తత్క్షణమే అమ్మహాత్ముడును " నీకు శుభము కలుగును గాక " అని ఆశీర్వదింపుచు పరిజనసహితుడై ఆకాశమునకు బోయెను. ఓ రఘురామా ! ఆక్షణమునుండియు చిత్తమును ఏకాగ్రము గావించి ఇప్పటివరకును సర్వకాలములయందును ఆ ఆత్మను పూజించుచునే ఉన్నాను. అట్టి ఆరాధనమునందు దీక్షితుడనై ఉన్న నాకు సర్వ వ్యవహారములను ఆచరించుచునే ఉన్నను ఊరక గడపునదియుం బోలె చనుచున్నవి. దుఃఖములు సహితము నాకు శోకమును గలిగించుటలేదు. ఆత్మారాధనమునకు ఎప్పుడు వచ్చిన కార్యములను అప్పుడు అసంగుడై ఆచరించుట అనునదియే పుష్ప సమూహము. కావున నాకు ఎప్పటికిని ఆపూజకు విఘ్నము కలుగ లేదు. గ్రహించువాడు గ్రహింపబడునది అను సంబంధము సర్వజంతు సాధారణమై ఉన్నది. యోగియగువాడు దానిని గమనించి దాని మూలమున గ్రహింపవలసిన అర్థమును గ్రహించును. ఇదియే ఆత్మజ్ఞానము. ఇతరులు అట్లు చేయరు. అదియే అజ్ఞానము. కావున నో రఘురామా ! పై జెప్పిన ధ్యానదృష్టిని అవలంబించి మనస్సును అభిమానశూన్యముగ జేసికొనుము. అప్పుడు దట్టమైయున్న ఈ సంసార అరణ్యము పలుచన అగును. దానియందు యథేచ్ఛముగ విహరింపుము. ఖేదము నొందబోవు. అని వశిష్ఠులుచెప్పిన విని శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా ! వశిష్ఠమహామునీ ! మీ అనుగ్రహము వలన సంశయమెల్ల దీరినది. తెలియబడవలసిన విషయము సంపూర్ణముగ దెలియబడినది. సంపూర్ణమగు తృప్తి కలిగినది. సంసారమను మహాయుద్ధమునందు నామనస్సు ధైర్యవంతమై చెదరక నిలుచుటకు సామర్థ్యమును జెందినది. నామనోధైర్యమును ఇకను ఎట్టివారలైనను ఛేదింప జాలరు. ఆశ అనియెడు గొప్ప ఏనుగ కొంత వరకు దానికి విరోధియై ఉండెనుగాని దానిని నేడు నామనస్సు సంపూర్ణముగ ధ్వంసము చేసినది.

శ్లో॥ పరిగళితవికల్పతాముపేతం
ప్రశమితవాంఛమదీనసారసత్త్వమ్ ।

త్రిజగతియందతిప్రసన్నరూపం
ప్రముదితమంతరసుత్తమంమనోమే ॥

ఓ వశిష్ఠమహాముని ! మఱియు సర్వసంకల్పములను పరిత్యజించి సకల కామములవంచి దైన్యమును శాంతినొందించి త్రిలోకములయందును పరమానంద కరమనియు మిక్కిలి ప్రసన్నమనియు, ఏరూపము ప్రశంసింప బడుచుండునో, ఏది సర్వాంతరమై ప్రకాశించు చుండునో, అట్టిరూపమే నామనస్సు. అట్టిమనస్సు నేడు కలిగినది.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున దేవపూజోపాఖ్యానమను
మూప్పదియవ సర్గము ముగిసెను.

---

శ్రీవాల్మీకిమహర్షి ! శిష్యుడైన భరద్వాజునితో ఇట్లనియె. ఓ భారద్వాజా ! ఈ ప్రకారముగ శ్రీరామచంద్రుడు చెప్పి మఱియు ఇట్లనియె. ఓ వశిష్ఠమహాముని ! బ్రాహ్మణోత్తమా ! మీ వాక్యామృత పానము వలన నాకు తృప్తి కలుగకున్నది. కావున తత్వజ్ఞాన బోధకమగు మఱి యొక కథను జెప్పుడు. అని అడిగిన విని వశిష్ఠమహామునియు పరమాత్మని యొక్క సర్వవ్యాపకత్వము వర్ణించువాడై ఇట్లనియె. ఓ రఘురామా ! వినుము. ప్రపంచమునందు ప్రతివాడును సుఖానుభవమును గోరుచున్నాడు. ఆ సుఖము మొట్టమొదటి క్షణమునందు ఉన్నంత ఆనందకరముగ పిమ్మటి క్షణములయందు ఉండదు. ఇది ప్రతివానికిని అనుభవసిద్ధమగు విషయమే. మఱియును ఆశ అధికముగ ఉన్నప్పుడు కోరబడు పదార్థము ఎంత ఆనందకరముగ నుండునో, ఆవస్తువే ఇతర సమయములయందు అంత మనోహరముగ నుండదు. కావున విషయానందమనునది ( శబ్దాది పదార్థములను అనుభవించుటవలన గలుగు ఆనందము ) క్షణమాత్రము ఉండునదియేకాని, శాశ్వతమైనది కాదు. కావున ఇట్టి సుఖములను మూఢులే అభిలషింతురుకాని, జ్ఞానశాలులు అట్లు చేయనేరరు. మఱియొక విశేషము. జ్ఞానులకు విషయానందములయందు అభిలాష కలుగుననుటకే వీలులేదు. వస్తువులు ఇచ్ఛ కలిగియున్న సమయమునందు మాత్రమే ఆనందకరములగునని ఇదివరకే చెప్పియున్నాను. ఆసంతోషమునకు మనకోరికయే కారణము, కోరిక అనబడు మనస్సంకల్పమే దుఃఖరూపమగు పదార్థమునకు

తనప్రభావమువలన సౌఖ్యరూపమును కలిగించిన దనవలయును. ఇట్లు గాక వస్తువునకు ఆనందరూపమే స్వాభావికమగునేని అప్పుడు దాని అనుభవము వలన గలిగిన ఆనందము క్షణక్షణమునకు తగ్గిపోవనేటికి? ఈ యుక్తివలన ప్రతిపదార్థము దుఃఖరూపమైనదియే అనియు,మన సంకల్పము వలన మాత్ర మే దానికి ఆనందరూపత్వము గలుగుచున్నదనియు చెప్పి తీరవలయును. ఇట్లుండగ మనోజయము చేసియున్న, లేక, అట్లు చేయ దలంచుచున్న జ్ఞానులకు పదార్థములయందు అనురాగము ఎట్లు కలుగును? ఓరఘురామా! ఈకారణమువలన నీవును కోరికల విడువుము. అప్పుడు సంసారము నిన్నే మియు చేయనేరదు. సంసారమంతయు విషయానుభవమాత్ర రూపమే కదా ? ఇట్లు నీవు అన్నిటియందును అభిమానమును వదలి జీవించుచుండిన నీ ఆశ నిరాశ యగును. ప్రపంచము కలదను భావము అభావమగును. మనస్సు సంకల్ప రహితమగును. ఇట్లు సంస్కార శూన్యమై ఉండు చిత్తా దులను ఆశ్రయించి దేశకాలానుసారముగ వచ్చిన కార్యములను చేయు చుండినను ఆకాశమునకు వలె నీకు ఒకింతయైనను విచారము కలుగదు. మనస్సు సంస్కారవశగతమై వికసించుట సంసారము. సంస్కారములను పరిత్యజించి నిస్సంకల్పమై ముడుచుకొనుట మోక్షము. కావున పురుష ప్రయత్నముచేత మనస్సును ముడుచుకొనునట్లు చేయుము. తత్క్షణమే సంసారము అడుగంటును. ఇట్లే ప్రాణవాయువుయొక్క వికాసము సంసా రము. దాని సంకోచము సంసార నాశము. కావున అభ్యాసముచేతను ప్రాణచింత అనబడు యోగముచేతను, దానిని ప్రయత్నపూర్వకముగ నిరో ధింపుము. అజ్ఞానముయొక్క వికాస సంకోచములు క్రమముగ సంసార హేతువులగు కర్మలకు ఉత్పత్తి వినాశములు. కావున గురూపదేశము, శాస్త్రవిచారము, యోగాద్యభ్యాసము, అనువానిచేత ఆ అజ్ఞానమును నశింపజేయుము. ఇంతచెప్పనేల ? “ ఇది దృశ్యము, నేను దీనిని చూచు చున్నాను ” అను తలంపే జ్ఞానముయొక్క చాంచల్యము. ఇది లేకుండుట యే మనోనాశమునకు స్వరూపము. పదార్థములను జూచుట మనఅధీనమున నుండ ఇది మాత్రము మనకు అస్వాధీనమగునా ? కావున ఇంతమాత్రము పనికి శ్రమయేమి ? మఱియు ప్రాణవాయు నిరోధమనునది పురుషప్రయ త్నముచేత సాధింపదగినది యనుటచేత ఇంతకంటె సుఖకరమైనదియే. కావున నీ రెంటిలో దేనినైనను ఆర్జించి చిత్తమును నశింప జేయుము. అది యే మోక్షము. మఱియు చూచువాడు, చూడబడునది, అనువాని సంబం

ధము సర్వజనులకును ప్రత్యక్షసిద్ధము. అందు సుఖము కలుగుననుటయు ప్రత్యక్షమే. పైనవివరించిన రీతిగా ఇచ్ఛా ప్రభావమువలన కలిగిన సుఖ భ్రాంతిని విడిచి వాస్తవమగు ఆనందభాగమును గ్రహించిన దాని అంతమునందు ఉన్నదియే పరబ్రహ్మము. దానినిచూచు చూపే యథార్థమైన చూపు. ( భ్రాంతిసిద్ధముకాక స్వాభావికమై ఉండు సుఖమే బ్రహ్మము. అట్లయినను అది ఒకవస్తువువలన పుట్టినదిగ భావింప బడును. కావున పరిచ్ఛిన్న సుఖమగును. బ్రహ్మము అట్టిదికాదు కదా ? ఇట్లగుటచేత " పారమార్థికమగు సుఖమునకు అంతమున బ్రహ్మము ఉన్నది " అని చెప్పబడెనని తెలిసికొనవలయును. ) అట్టిచూపుచేత మనస్సుతత్క్షణమే లయము నొందును. చిత్తము లయమునొంది మఱల ఉదయింపకుండుటయే శాశ్వతసుఖము. అది ఒకప్పుడు ఉదయించునదికాదు. మఱియొకప్పుడు అస్తమించునదియుగాదు. స్వతస్సిద్ధమైనదియే. ఇట్లు పరమసుఖ కారణమై జ్ఞానప్రభావముచేత పరబ్రహ్మరూపమై రాగి బంగారమైనట్లు తన్మాత్రమై ( బ్రహ్మమాత్రమై) జ్ఞానవంతుని చిత్తము విలసిల్లుచుండును. కావున వ్యవహారార్థమై అతనికి చిత్తము ఉన్నను ( అది సరూప నాశమును మాత్రమే జెందియున్నను ) అది చిత్త శబ్దముచేత వ్యవహరింపబడక బ్రహ్మ శబ్దముచేతనే వ్యవహరింప బడును. కామ క్రోధాదులు ప్రపంచభ్రాంతిని అనుసరించిన సంకల్పములు కావునను, అవియున్నప్పుడు మాత్రమే " వీడు సంకల్పించుచున్నాడు. కావున వీనికి మనస్సు ( స్వస్థముగలేక, అస్వస్థముగ ) కలదు " అను వ్యవహారములు ప్రవర్తించు చున్నవి కావునను, జ్ఞానుల మనస్సునందు భ్రాంతిలేదు కావునను, భ్రాంతియొక్కటియే బ్రహ్మ చిత్తములకు కల భేదము గావునను, అట్లుచెప్పబడును. భ్రాంతిని విడిచిన మనస్సు పరబ్రహ్మమగుటలో సంశయము కొంచెమైనను లేదుకదా ? " వ్యవహార కాలమునందు ఆకామక్రోధాది సంకల్పములును, ఇది దృశ్యము, నేను చూచువాడను " అను భేద సంకల్పమునుగూడ నుండక తప్పదు. వ్యవహారమంతయు భేద సాధ్యమేకదా ? అనియెదవేమో వినుము. వ్యవహార కాలమునందు గూడ చిత్తము తనకు గానవచ్చు పదార్థములయందు బ్రహ్మత్వ దృష్టిని విడువదనుట నిర్వివాదాంశము. ఇట్లు తత్త్వమును ఎఱిగిన చిత్తము ఒకానొక సమయమునందు ఆవశ్యకతను అనుసరించి కామ క్రోధాది సంకల్పములను ఆచరించినను భేదమును అవలంబించినను, అది అభినయమాత్రమై యుండునే గాని వాస్తవముకానేరదు. " ఇది అగ్ని, దీనివలన మనకు

హాని కలుగును. దీనిని స్పృశింప కూడదు ” అని తెలిసినవాడు అగ్నియందు హస్తమును ఉంచునా ? కావున ఆమనస్సు క్షణకాలము వ్యవహరించినను, ఆసమయమునందు అజ్ఞానులచే “ మనస్సు= సంసారయుక్తమై సంకల్పించునది ” అని వ్యవహరింపబడినను, అదిమాత్రము మనస్సు కానేరదు. దానియందు పూర్వమువలె సంసార పరంపరయు, వాస్తవభ్రాంతియు, లేదు కదా ? మఱియు జ్ఞానియొక్క చిత్తము, ఎప్పుడును సుషుప్తమను పేరుగల తుర్యావస్థనే అభిలషించుచుండును. అందువిహరింప ఆరంభించినచో, పరిశుద్ధమైనది కావున వెంటనే తుర్యాతీత స్థితిని జెందును.

శ్లో॥ బ్రహ్మైవభూరిభువనభ్రమవిభ్రమోత్థై
రిత్థంస్థితంసమమనేకతయైకమేవ ।
సర్వాత్మకంభవతినేతరదంగకించి
చ్చిత్తాదికంచనహృదీవహిసన్నివేశః ॥

ఓశ్రీరామా ! వాస్తవస్థితిలో అంతటను పరబ్రహ్మము ఒక్కటియే కలదు. అదియే సర్వరూపమై ఉన్నది. ప్రపంచరూప భ్రాంతియొక్క విలాసములచేత అది ఒక్కటియే ఆకాశాది సర్వరూపములతో అనేకములుగా న్యూనాధిక భేదములు కలదిగ తోచుచున్నది. ఇంతియకాని,బ్రహ్మభిన్నములుగ పదార్థములే లేవు. మనస్సు మొదలగు ఈలోకమంతయు కలలో తన చిత్తమునందే చిత్తాభిన్న రూపములే అయినను భిన్నరూపములుగతోచు పదార్థముల వంటిదే కాని, యథార్థమైనది కాదు.

—* బిల్వఫలోపాఖ్యానము. *—

ఓదశరథనందనా! శ్రీరామా ! ఈవిషయము స్పష్టమగుటకై నీకు ఒక అపూర్వమైన కథను సంక్షేపముగ జెప్పెదను. అది మిక్కిలి మనోహరమైనది. అత్యాశ్చర్యమును కలిగించునది. ఒకానొక స్థలమునందు అనేకవేల యోజనముల పొడుగు గలిగి ఎన్ని యుగములకైనను క్షీణింపక శాశ్వతమై యుండు ఒకానొక బిల్వపండు కలదు. అది మిక్కిలి నిర్మలమైనది. అతిప్రకాశము గలిగినది. మిక్కిలి పురాతనమైనదియే అయినను, బాలచంద్రఖండమువలె మిక్కిలి మృదువై యున్నది. సూర్యకిరణములయొక్క వేడిమికి వాడిపోదు. ప్రళయకాలమునందు అతివేగముతో విసరు సప్తమారుతముల ధాటికిగూడ ఇంచుకయైనను చలింపలేదు. దాని వైశాల్యమును గణించుటకే అలవి కాదు. కోటి కోటి లక్షకోటి సూర్యమేళ్లైనను అన్ని ఆమడలైనను దాని వైశాల్యమునకంటె దక్కువే యగును. అదియే సర్వ

ప్రపంచస్థితికిని మూలమై ఉన్నది. దాని ఎదుట అతివిశాలములనీ ప్రసిద్ధికెక్కిన బ్రహ్మాండములన్నియు, సర్వలోకాధారమగు మేరుపర్వతము లెదుటనుండు ఆవగింజలవలె ఉన్నవి. లోకమునందు అన్ని ఫలములును పండగానే శిథిలములై చెట్టునుండి రాలిపడుట సహజము. ఈబిల్వఫలమునకు మాత్రము అట్టిపాకము ( పడవేయునట్టిపాకము ) లేదు. అయినను, అది ఎప్పటికిని సర్వజనభోగ్యమై పండియే ఉండును గాని, శిథిలత్వమును మాత్రము పొందదు. ఒకప్పుడు కాయగా కూడ ఉండదు. ఇట్లు మహాప్రభావ సంపన్నమై అతివిశాలమై ఫలజాతిలో ఉత్తమోత్తమమై ఉండు ఈబిల్వఫలమునకు దృశ్యపదార్థములను జూచుచున్న జ్ఞానమే లోపలి గుజ్జు. ఇట్లు చెప్పుటవలన జ్ఞానము ఒక్కటియే సంకల్ప భేదములతో చలించుచు సర్వకారణమై సర్వరూపమై ప్రకాశించుచు స్వస్వరూపమునందే నిలచి ఉన్నది అని తెలిసికొననగును. ఆజ్ఞానమే సర్వసాక్షి సర్వాధారము అని గ్రహింపనగును. సంకల్పములు మాత్రమే కదా, ఈజ్ఞానమునకును బ్రహ్మమునకును భేదమును కలిగించునవి. “ ఇది అనంతమగు ఆకాశము. ఇది కాలరూపమగు అంశము. ప్రపంచమును నియమించునట్టి నియతి ఇది. ఇది చలనాత్మకమగు వ్యాపారము. ఇది బ్రహ్మాండము. ఇవి దిక్కులు. ఇదివరుస ” అను ఇట్టి సంకల్పభేదములు అన్నియును, వానివలన బహిర్ముఖమై ప్రసరించునట్లు భేదదృష్టికలిగి ఉన్నట్లు తోచు జ్ఞానమును, బహువిధములగు దాని చమత్కారములును, ఆబిల్వఫలమునకు లోపలి గుజ్జే. ( అనగా దానిని ఆశ్రయించి దానితో ఐక్యము నొంది యున్నవియే యనుట ) అని వసిష్ఠమహర్షి చెప్పిన విని శ్రీరామచంద్రుం డిట్లనియె. సర్వశాస్త్రార్థములను ఎఱిగిన ఓభగవంతుడా! మీరు చెప్పిన కథవలన తాత్పర్యమును గ్రహించితిని. సర్వోత్తమమును సర్వవ్యాపకమును ఏకరూపమునగు చైతన్య సత్తయే ( పరబ్రహ్మముయొక్క ఉనికియే ) ఈకథయందు బిల్వఫల రూపముతో వర్ణింపబడి ఉన్నది అని తలంచెదను. ఈలోకమునందు గానవచ్చు అహంకారాదు లన్నియును ఆచైతన్యమునకు గుజ్జువంటివి. దానిలో ఇమిడియున్నవి. ఫలములకు గుజ్జకంటె భిన్నమగు రూపము ఎట్లు లేదో, అట్లే ఆచైతన్యమునకును అహంకారాది భిన్నమగు రూపము లేదు. కావున మీరు చెప్పిన బిల్వఫలమునకు దృశ్యజ్ఞానమే లేక, దానివలన కలిగిన ప్రపంచమే మజ్జయని చెప్పబడెను. కావున అది ( బిల్వఫలము ) పరమేశ్వరుడేయై తీరవలయును. “ ఇది ప్రపంచము, వీడు పరమేశ్వరుడు ” అను అభిప్రాయమును నిర్ణయించుటకు ఎప్ప

టికిని వీలులేదు. భేదమనునది ఇంచుకమైనను లేనే లేదు కదా ? కావున బ్రహ్మాండమను కూశ్మాండమునకు మేరువు మొదలగు పర్వతములు ఎట్లు లోపలిగుజ్జు అగుచున్నవో, అట్లే ఈసర్వ బ్రహ్మాండములును చైతన్యమను బిల్వఫలమునకు లోపలిగుజ్జు అగుచున్నవి. ఫలమునకును గుజ్జునకును వాస్తవముగ భేదము లేనట్లే ఈబ్రహ్మాండములకును పరమేశ్వరునకును గూడ భేదము లేదు. మఱియును ఈ ఆత్మ సర్వవ్యాపకుడు కావునను, ఆద్యంతములు లేనివాడు కావునను "బిల్వఫలముయొక్క వైశాల్యమునకు పరిమితి లేదు" అను విషయము సరిపడును. ఆనందరూపు డగుటచేతను ప్రపంచమునందు అనుభవింప బడుచున్న పరిచ్ఛిన్నానందము (ఒక పదార్థమువలన మాత్రమే పుట్టెనని తలంపబడుచున్న ఆనందము) కూడ యథార్థస్థితిలో ఆతడే కావునను "ఆబిల్వఫలము ఎప్పటికిని పండియే యుండును" అను అంశము సరిపడును. నాశము లేనివాడు కావునను, వృద్ధి క్షయములు, జరయు, లేనివాడు కావునను "ఆబిల్వఫలము ఎప్పటికిని రాలదు. శిథిలముకాదు" అని చెప్పుట యుక్తమగును. మార్పు నొందనివాడు కావున "ఆబిల్వఫలము ఒకప్పుడును కాయగా ఉండలేదు" అనుటయు చెల్లును. కావున ఈ ఉపాఖ్యానమునందు వర్ణింపబడినవాడు పరమేశ్వరుడే. అనుటలో సంశయము లేదు. "ఈప్రపంచమును ఆబిల్వ ఫలమునకు మజ్జగా జెప్పియున్నాను. అదిమాత్రము అభిప్రాయమునందు సరిపడునట్లు ఉండలేదు" అనియెదవేమో వినుడు. దానిని సమన్వయించుటయు గష్టసాధ్యము కాదు. మజ్జయనునది ఫలమునకు ఒక అవయవమనియు, అట్లే ప్రపంచము కూడ బ్రహ్మమునకు అవయవము కావలసి వచ్చుననియు, అది అభేద సిద్ధాంతమునకు భంగకరమనియు కొందఱు తలంచుచుండుట నిశ్చయమే కాని, దానివలన దోషము మాత్రము కొంచెము విమర్శింప గలవారికి దోపదు. శిష్యులు భేదబుద్ధిగలవారైయుండ వారిబుద్ధిని త్రిప్పి యుక్తులచేత అభేదనిశ్చయమునందు నెలకొనునట్లు చేయుటకై గదా అద్వైతశాస్త్రము, లేక, శ్రుతి, ప్రవర్తించు చున్నది. అప్పుడు వారిని ఉద్ధరించుట ఎట్లు ? కొంచెము విచారింపుడు. అట్టిస్థితిలో ఉన్నవానికి ఐక్యమును ఉపదేశించిన పట్టుబడునా ? ఇంత ఏల ? మొట్టమొదట ఐక్యమును ఉపదేశించుటయనునది ఎట్లు సంభవింప గలదు ? భేదమే లేదనిన ఉపదేశించువాడు ఎవ్వడు? ఉపదేశింపబడువాడు ఎవ్వడు ? కావున ప్రశ్నోత్తరములు ఉన్నంతవరకు భేదమును విడుచుట శక్యము కాదు, ఇంతమాత్రమువలన సిద్ధాంతమునకు

భంగమును రాదు. శిష్యులకు బ్రహ్మస్వరూపము తెలియుటకై మొట్టమొదట బ్రహ్మప్రపంచ భేదము కల్పించి చెప్పబడును అను నంతమాత్రమున సిద్ధాంతమునకు హాని ఏమి ? కల్పితములు పరమార్థమును ధిక్కరింప గలవా ? ఇదియంతయు గాక లోకమునందు ఫలమంతయు మజ్జయే యైయుండుటను ప్రత్యక్షముగా జూచుచున్నాము. కావున ఎట్లుచూచినను ఈకల్పన వలన సిద్ధాంతమునకు భంగము రాదు. మీరు చెప్పిన కథయందలి తాత్పర్యమును నేను సంపూర్ణముగ గ్రహింపగలిగితిననియే చెప్ప సాహసించుచున్నాను.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున బిల్వఫలోపాఖ్యానమను
ముప్పదియొకటవ సర్గము ముగిసెను.

—*—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునిజూచి ఇట్లనియె. ఓభారద్వాజా ! ఇట్లు బిల్వఫలరూపముతో పరబ్రహ్మమును వర్ణించి వశిష్ఠమహాముని మఱియు నిట్లనియె.

## —* మహాశిలోపాఖ్యానము. *—

చంద్రసమానముఖబింబముగల యో రామచంద్రా ! నేను మఱియొక కథను చెప్పెదను వినుము. అదిమిక్కిలి చిత్రమైనది. ఆశ్చర్యకరమైనది. ఒకానొకచోట నునుపుగలదియు, ప్రకాశించునదియు, స్పృశించిన మిక్కిలి మెత్తగనుండునదియు, మిక్కిలి విస్తారమైనదియు, దట్టమై ఎడము ఇంచుకైనను లేక వ్యాపించి యున్నదియు, నగు గొప్ప రాయికలదు. దాని లోపల “ జలపూర్ణమగు సరస్సునందువలె ” బాగుగ వికసించి మనోహరములై లెక్కకు మిక్కిలియైన కమలములు ఉన్నవి. వానిలో కొన్నిటికి పరస్పర సంబంధముకలదు. ( గ్రహమండలమునకును దాని కిరణములచేత బహువిధములగు మార్పులను జెందునట్టి భూమ్యాదులకును సంబంధము కలదనుట స్పష్టము కదా ? ) మఱికొన్నిటికి అట్టి సంబంధము లేదు. ( విష్ణులోకాదులు గ్రహముల యొక్క కిరణములతో సంబంధపడవు. ) వేఱొక కొన్నిటికి ప్రకాశమే లేదు ( అట్టి నక్షత్రములు మొదలగునవి కొన్ని గలవనుటయు స్పష్టమే. ) మఱికొన్ని స్పష్టమై గానవచ్చుచున్నవి. ( ఇట్టివి భూమ్యాది లోకములని తెలిసికొన వలయును. ) కొన్ని పైభాగ

మునందే నాటుకొని అచ్చటనే వేరు గలిగి ఉన్నవి. ( స్వర్గాది లోకములు పైభాగమున ఉన్న ధ్రువమండలమును ఆశ్రయించి నిలచి ఉన్నవి. కావున వానికి ఆధ్రువమండలమే మూలమని తెలిసికొనవలయును ) మఱియు గొన్నిటికి క్రిందనే మూలము గలదు. ( పాతాళాదిలోకములు క్రిందనున్న కూర్మరాజును ఆశ్రయించి ఉన్నవి అని తెలిసికొన వలయును ) ఇంకను కొన్నిటికి మూలమే లేదు ( విష్ణులోకము, శివలోకము, మొదలగునవి నిత్యములు కావున వానికి మూలమే లేదు. మఱికొన్ని పైన జెప్పినట్లే గాక. అనిర్వాచ్యములై ఉన్నవి. ( ఇవి సత్యలోకాదులనుట ) సత్యలోకము కార్య బ్రహ్మ లోక మగుటచేత అది దేనితోను సంబంధింపక సృష్టికర్త యొక్క లోకమగుటచేత అన్నిటితోను సంబంధించి సర్వాధారమగుట చేతను పరబ్రహ్మమునుండి సంభవించిన దగుటచేతను ఊర్ధ్వమూలమై నిత్యమగుటచేత అమూలమై ఈ విధముగ అనిర్వచనీయమై ఉన్నది. ఇట్టి పద్మములయొక్క సమీపమున శంఖములును, చక్రములును, కోట్లు కోట్లుగా నున్నవి. అవియు పద్మములవలెనే నానావిధములుగ నున్నవి. అని వశిష్ఠు చెప్పినవిని శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓ వశిష్ఠమహాముని ! ఇప్పుడు మీరుచెప్పిన మహాశిల నాకు దెలియును. విష్ణుస్థానమగు సాలగ్రామము ఇట్టిదియేకదా ? దానియందును పద్మములు శంఖములు చక్రములు బహువిధములుగ నుండును. శ్రీరాముడుచెప్పిన వశిష్ఠమహాముని ఇట్లనియె.

ఓ శ్రీరామా ! నేను పరబ్రహ్మమునే శిలగా వర్ణించితిని గాని, సాలగ్రామ శిలనుగూర్చి చెప్పలేదు. ఆశుద్ధచైతన్యము మిక్కిలి దట్టమైనది. ఏకరూపమైనది. నిశ్చలమైనది. కావున దానిని శిలగా పోల్చిచెప్పవచ్చును కదా. దానియందు కలవని వివరింపబడిన పద్మము మొదలగునవి ప్రపంచములే. ఆచైతన్యము మిక్కిలి దట్టమై యెడము ఇంతయైనను లేకుండ సర్వవ్యాపకమై ఉన్నను " ఆకాశమునందు అతి విశాలరూపుడగు వాయువు ఉన్నట్లు " దానియందు బ్రహ్మాండములు లక్షలు లక్షలుగ ఉన్నవికదా ? ఆకాశము భూమి, వాయువు, అగ్ని, జలము, అనునివి అన్నియును ఆరాతియందే ఉన్నవి కాని, దానికి మాత్రము సందు కొంచెమైనను లేదు. శంఖములు, పద్మములు, మొదలగు ప్రపంచము రాతిపై జెక్కబడునుకదా? ఇట్లే భూత భవిష్య ద్వర్తమానములన్నియు చైతన్యమను రాతియందు చెక్కబడును ( సర్వమును ప్రతిమలవలె అచేతనములై చైతన్యముయొక్క సహాయముచేత ప్రకాశించుచున్నవనుట ) మఱియు పృథ్వీ పరమాణువులు

అనేకములు గూడి ఒకటిముద్దగ ఏర్పడి ఒకటిశిలయే అయినట్లు ప్రపంచ కోట్లన్నియు గలసి ఒకటిముద్దగా నేర్పడి ఒకటిచైతన్యమే అగుచున్నది ( ఇచ్చట చైతన్య ప్రపంచములకు అభేదము చెప్పుటకై ఇట్లుచెప్పబడెను. అవయవావయవ విభేదమును ఉపదేశసమయమునందు పాటింపరాదని ఇది వరకే [ ముప్పదియవసర్గకు కడపట ] వివరించి ఉన్నాము ) మఱియు రాతియందు చెక్కబడిన పద్మము ఆగాతికంటె భిన్నముగా దోచుచున్నను రాయియే అయియున్నట్లు ఈ ప్రపంచముకూడ బ్రహ్మమునకంటె భిన్న ముగా తోచుచున్నను బ్రహ్మమేయై యున్నది. ఇదియునుగాక రాతియందు కల్పింపబడిన పద్మమును, మిరియములోని కారమును, మొదలగునవి అట్టు ఉదయాస్తమయముల జెందక స్వభావ సిద్ధములై ఏకరూపములై ఉండు నో, అట్లే చైతన్యమునందును ప్రపంచము ఉన్నది. " స్త్రీగర్భమునందు శిశువువలె, బిల్వఫల మధ్యమునందు ఉండు గుజ్జువలె " చైతన్యమునందు సర్వవికారవంతమగు ఈ బ్రహ్మాండ సమూహము ఎప్పటికిని ఉన్నది ( ఇచ్చట మొదటి ఉపమానము అంత శ్రేష్ఠముకాదు. శుక్లశోణిత సంయో గము గలుగునంతవరకు స్త్రీగర్భమునందు శిశువు ఉండడు. కావుననే సరిగా నుండుటకై రెండవ దృష్టాంతము చెప్పబడెను. మారేడుకాయయందు పిందెగా నున్నప్పటి నుండియు గుజ్జు ఉండునుగదా ? ) మఱియు రాతిలో నున్న పద్మశంఖాదులకు ఎట్లు శాశ్వత సుషుప్త్యవస్థ ( ఏకార్యములను జేయనేరక ఊరకుండుట ) కలదో, ఆవిధముగనే చైతన్యమునందు ఉన్న బ్రహ్మాండములకుగూడ శాశ్వత సుషుప్త్యవస్థ కలదు. ( అవియు చైతన్య సహాయము లేక కొంచమైనను ప్రవర్తింప నేరవనుట ) ఆశిల తనయందే ఏచిత్తరువు చెక్కబడునో, ఆయారూపములనే జెందియుండును. అట్లే ఈ బ్రహ్మమును తనయందే ఏబ్రహ్మాండము ఎట్లెట్లుండునో, ఆయారూప మునే జెంది యుండును. ఆశిల సర్వరూపములను జెంది యుండియు ఎట్లు నిర్వికారమో, దేనితోను సంబంధింపక స్వస్వరూప హానినొందక సుషు ప్తావస్థతో ( సుషుప్త్యవస్థయందు బ్రహ్మము సాక్షిమాత్రమై ప్రకాశిం చుననుట స్పష్టము. ఇట్లే శిలయు చాంచల్యము లేవియు లేక, నిలచియుం డును. కావున " సుషుప్తావస్థతో నున్నదో " అని చెప్పబడెను ) ఉన్న దో, అట్లే బ్రహ్మమును సర్వప్రపంచములకును ఆధారమయ్యు వాని వికా రములతో సంబంధపడక సుషుప్తావస్థతో ఉన్నది. ఏపదార్థము ఎప్పటికి ఏరూపమున నుండునో బ్రహ్మముకూడ అప్పటికి ఆరూపముతోనే ఉండును,

ఆపదార్థముగానే ఉండుచు. ఆకాలముయొక్క రూపముతోనే ఉండును. ఇప్పుడు ప్రపంచము ఎట్లు కానవచ్చుచుండునో, సర్వకాలమును అట్లే యుండును. ఆధారమగు బ్రహ్మము శాశ్వతమైయుండగ దానిపై గల్పిత మగు నీప్రపంచము ఎట్లు అసత్యమగును. భ్రాంతియున్నప్పుడైనను, లేనప్పు డైనను ప్రపంచము ప్రపంచమే. భ్రాంతికలిగినప్పుడు అదిబ్రహ్మభిన్నరూప ముతోను, లేనప్పుడు బ్రహ్మరూపముతోను, తోచును. ఇంతియకాని, ఈ ప్రపంచమునకు స్వరూపహాని ఎప్పటికిని లేదు. కావున బ్రహ్మము ఎప్ప టికిని సుషుప్తావస్థయందే ఉండును. "బ్రహ్మమునకు సుషుప్తావస్థయన ఎట్టిది" అనిసెదవేమొ వినుము. ఈ ప్రపంచము బ్రహ్మమాత్రమే అని ఇది వరకే చెప్పియున్నాము కదా? ఈ ప్రపంచము కూడ భ్రాంతి ఉన్నప్పుడు బ్రహ్మభిన్నముగ దోచుననియు, వివరించియున్నాము. కావున ప్రపంచము నకు సంబంధించిన భ్రాంతి బ్రహ్మమునకు సంబంధించినదిగనే కావలయును. బ్రహ్మమును ప్రపంచమని తలంచుటయే కదా, భ్రాంతిస్వరూపము. కావున నీభ్రాంతికి లోబడియుండుటనే బ్రహ్మమునకు సుషుప్త్యవస్థ శిలను ప్రతి మారూపముగ దలంచుట భ్రాంతిగదా? అట్టిసమయమునందు భ్రాంతి శిలకు సంబంధించినదిగనే అగుననుటకును దానివలన శిలాగూపమే నశించి పోయెననుటకును సంశయములేదుకదా? ఇట్లే "బ్రహ్మమే ప్రపంచము" అను భ్రాంతికి లోబడుటవలన బ్రహ్మరూపముకూడ నశించెననవలయును (తేజస్సు గానరాకుండ అణగిపోయె ననవలయును) ఇది సుషుప్త్యవస్థ అనుటలో సంశయ మేమి "సుషుప్త్యవస్థయందును బ్రహ్మమునకు స్వ రూపహానియే లేదుకదా" అనిసెదవేమో, అట్లయినను ఆస్వరూపము అజ్ఞానావృతమగు చిత్తమునకు దెలియరాదుకదా? కావున ప్రపంచభ్రాం తియే బ్రహ్మమునకు సుషుప్తావస్థ అని తెలిసికొనుము. శాంతుడును సర్వసముడును నగు పరమాత్మునియందు ప్రపంచము రాతియందున్న పద్మాదులవలె సుషుప్తావస్థనే జెందియున్నది. స్వస్వరూపమగు బ్రహ్మమున కంటె భిన్నముకాకున్నది. ఆబ్రహ్మము జ్ఞానఘనమై (సర్వమునుజ్ఞానమేయై) ఉన్నది. ప్రపంచముగూడ అట్టిదియే. "పరబ్రహ్మమునకంటె భిన్నముగ ప్రపంచమను పదార్థము ఒకటి జనించెననుటకే వీలులేదు. రాతికంటె భిన్నముగ నందలి ప్రతిమలు జనించెననుటకు వీలుకలదా? కావున ఈప్రపం చమునకు వాస్తవస్థితిలో స్వరూపమే లేదు. కావున బ్రహ్మమును రాతితో పోల్చుటయంతయు యుక్తియుక్తమై ఉన్నది. సంకోచ వికాసములు కలవి

కావున లోకములు పద్మశబ్దముచేతను, కాంతిగలవి కావున గ్రహములు శంఖశబ్దముచేతను, సముద్రముచేత జుట్టబడి యుండుటచేత వర్తులముగా నుండుననుఊహావలన చక్రశబ్దముచేత ద్వీపములును చెప్పబడెనవి.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున శిలోపాఖ్యానమను
ముప్పది రెండవ సర్గము ముగిసెను.

—(*)—

—* పుర్యష్టకస్వరూపము. *—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునిజూచి ఇట్లనియె. ఓ భారద్వాజా! ఇట్లువశిష్ఠమహర్షి చెప్పిన మరల శ్రీరామచంద్రుండిట్లనియె. ఓ మహాత్మా! వశిష్ఠమహామునీ! నేను ఇప్పటికి కృతార్థుడనైతిని. తెలియవలసినదానిని తెలిసికొంటిని. చూడవలసినదానిని చూచితిని. అయినను, జ్ఞానము మఱింత అభివృద్ధియగుటకై విలాసార్థముగ ప్రశ్న చేయుచున్నాను. ఓభగవంతుడా! వశిష్ఠమహామునీ! అష్టపురములనునవి సర్వప్రపంచమునుకనపరచు సామర్థ్యము గల అర్థములు. వానిస్వరూపమును బాగుగ వివరించి చెప్పుము. అని ప్రశ్నించెను. అంత నవ్వశిష్ఠమహాముని రామచంద్రునితో నిట్లనియె. ఆద్యంతములు లేనిదియు, సర్వప్రపంచ కారణమైనదియు, వికారములులేనిదియు, నగు పరబ్రహ్మము ఎయ్యదికలదో, అదియే సంకల్పశక్తియుక్తమై జీవశబ్దముచేత జెప్పబడుచున్నది. శ్రేష్ఠమగు ఆనందరూపము కలదియు నిత్యపరిశుద్ధమగు చైతన్యమే అయినదియు విభాగములు కాని, సంకల్పములు కాని, స్వభావముగ లేనిదియు, నగు నాపరబ్రహ్మమే సంకల్పించుటకు ఉపక్రమించిన అప్పుడు జీవశబ్దముచేత వ్యవహరింపబడును. ఆజీవుడే ఈదేహమునందు చేరుచున్నాడు. క్రమక్రమముగ విస్పష్టరూపుడై చలించుచున్నాడు. ఆతడే "నేను" అని అభిమానించుటవలన అహంకారమనియు, విషయములను ధ్యానించుట వలన మనస్సనియు, జెప్పబడుచున్నాడు. మఱియు నిశ్చయించుటచేత బుద్ధియనియు, తానే తనకంటె అన్యుడై తనచేతనే చూడబడుచున్నట్లు భావించుటచేత ఇంద్రియములనియు, "నేను దేహము" అని భావించుటచేత దేహమనియు, జెప్పబడుచున్నాడు. మఱియు "నేనుఘటము" అని భావించిన ఘటమును "నేను మృగమును" అని భావించిన మృగమును, అగుచున్నాడు. సర్వ

మునకును మనస్సే ఆధారము. కావున ఆజీవునకే సంకల్పానుసారముగ
అన్యరూపములును కలుగుచున్నవి. ఇట్టి ఈ ఆత్మ ఒకనినే జనులు ఉపా
ధి భేదములను ఆశ్రయించి అష్టపురములని వ్యవహరించుచున్నారు. తెలి
సికొనువాడుగ నుండుట, చేయువాడుగా నుండుట, అనుభవించువాడుగా
నుండుట, సర్వసాక్షినై యుండుట, అను మొదలగు విషయములను విమ
ర్శించిన అందు ఏకరూపమై విజ్ఞానము తెలియవచ్చుచున్నదో, స్వాభావిక
ముగ నిర్వికారమే అయినను విజ్ఞానము సంకల్ప వశమున బహురూపము
లను జెందుచున్నదో, అదియే జీవుడని ముందే వివరించి యున్నాముకదా?
లోకులందరును జీవునే అష్టపురములని అనుచున్నారు. ( పంచభూతములు
ను, మనోబుద్ధ్యహంకారములును, గలసి అష్టపురము లనబడును. ఇచ్చట
ఇంద్రియములను గూర్చియు, ఘటపటాది భౌతిక పదార్థములను గూర్చియు,
జెప్పబడుటవలన భూతములు ఉద్దేశరూపముతో చెప్పబడినవని తెలిసికొన
వలయును. ) ఈ అష్టపురముల వలననే జనులు అసత్యమగు ఈప్రపంచ
మును సత్యరూపముగ జూచుచున్నారు. " కలగాంచువాడు అప్పటిభ్రాం
తివలన మఱియొకకలను జూచునట్లు " మోహబద్ధులై బ్రహ్మాభిన్నములని
వివిధ పదార్థములను జూచుచున్నారు.

—* అర్జునోపాఖ్యానము. *—

అని ఇట్లు వశిష్ఠమహాముని చెప్పి మఱియు ఇట్లనియె. ఓకమలలోచ
నా! వీరుడా ! శ్రీరామా! ఇంతకుముందే " దేనితోను సంబంధింపకుండు
టయే సర్వోత్తమమైనది. సర్వమును ఆచరించుచునే యున్నను, రాగద్వేష
ములను జెందకుండెడి వానిని ఏదియు బంధింప నేరదు " అని వివరించియుం
టిని కదా ? శ్రీకృష్ణుని అనుగ్రహమువలన అట్టి ఆవైరాగ్యమును ఆశ్ర
యించి జీవన్ముక్తుడై విచారవంతుడై పాండురాజుయొక్క పుత్రుడగు అర్జు
నుడు తనజీవితకాలమును గడుపబోవుచున్నాడు. ( శ్రీరాముని కాలమున
కంటె అర్జునునికాలము వెనుకటిది కావున దానిని దివ్యదృష్టితో ఎఱిగి వశి
ష్ఠమహాముని భవిష్యత్కథను చెప్పుచున్నాడు. ఇట్లు కానున్నను, ప్రతిక
ల్పమునందు అట్టివాడు ఒకఁడుండుననుట నిశ్చితార్థ మగుటచేత దానిని
అనుసరించియైనను చెప్పియుండ వచ్చును. ఈపక్షమున భవిష్యత్కాల
క్రియలకుగూడ భూతార్థమునే చెప్పవలయును ) అట్లే నీవును నీజీవితకాల
మును గడపుము. అనినవిని శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓమునీంద్రా! పాం
డుమహారాజుయొక్క పుత్రుడగు ఆ అర్జునుడు ఎప్పుడు జన్మింపగలడు.

శ్రీకృష్ణుడు ఏవిధమున వానికి వైరాగ్యమును ఉపదేశింప గలడు. అని శ్రీరాముడు అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియెను.

ఓరామా ! వినుము. సర్వభూతములను సంహరించునట్టి ఆయమధర్మరాజు తనకు పాపము గలుగునేమో, అను సందేహముచేత నాలుగు యుగములును ఒకొ్కకమారు గడచునంతకాలములో ఎప్పుడో ఒకప్పుడు కొంతకాలము తపస్సుచేయును ( నాలుగు యుగములును కలసిన కాలమునకు మహాయుగమని పేరు ) ఒక మహాయుగమునందు ఎనిమిది సంవత్సరములును, మఱియొక మహాయుగమునందు పది సంవత్సరములును వేఱొక మహాయుగమునందు పండ్రెండు సంవత్సరములును ఒకప్పుడు ఐదేండ్లును మఱియొకప్పుడు ఏడేండ్లును, వేఱొక కాలమునందు పదియాఱు సంవత్సరములును తపస్సును చేయుచుండును. ఈవిధముగ అమ్మహాత్ముడు ఉదాసీనుడై ( దేనిని నియమింపబోక ఊరకుండువాడు ఉదాసీనుడు ) శాంతుడై తపస్సును చేయుచుండు సమయమునందు ప్రాణులను సంహరించుట మృత్యుదేవత పనిగానుండును. అప్పుడు ఆమృత్యుదేవత ప్రమాదవశమువలన కొన్ని భూతములను సంహరింపక విడుచును. ఈకారణమువలన లోకమునందు ప్రజలు మిక్కుటముగుదురు. సంచరించుటకైనను స్థలము లేకుండును. " వర్షాకాలమునందు నీటిచేత దడసి దోమలచేత ఒడలెల్ల ఆక్రమింపబడియుండి ఏమియు జేయజాలక పడియున్న గజమువలె " భూదేవి ఏమియు జేయజాలకుండును. ఆసమయమునందు ఆభూతములన్నియు నివసించుటకు స్థలముచాలక పోవుటచేత అనేకయుక్తులతో దేవభూములను, అరణ్యములను, ఉద్యానవనములనుగూడ పాడుచేయును. ఈవిధముగ ఇప్పటికి వేలవేలుగ మహాయుగములును, జంతుజాలములును, ప్రపంచములునుగూడ ఎన్నియో గడచిపోయినవి. ( ఇట్లు ఇప్పటికి ఎన్నిమారులో జరిగెననుట.)

ఓసత్పురుషుడా ! శ్రీరామా ! ప్రస్తుతము పితరులకు ప్రభువై దక్షిణదిశ పాలించుచున్న యమునకు వైవస్వతుడను పేరు ( " యచ్ఛతీతియమః=నియమించువాడు కావున యముడు " అను వ్యుత్పత్తిచేత యమపదము ఉద్యోగస్థానమును చెప్పునదియే కాని, పురుష నామమును చెప్పునది కాదు. కలక్టరు, జడ్జి, అనునవి ఎట్లు పురుష నామములు కావో, ఆయా ఉద్యోగములను వచ్చినవారు ఆయా పేరులతో ఎట్లు పిలువబడుచున్నారో, అట్లే యమపదముకూడ పురుషనామము కాదు. ఆ ఉద్యోగమునకు వచ్చినవారు ఆపేరుతో పిలువబడుచుందురు. ) ఇతడును పూర్వపు య

ములవలెనే ఇక కొంతకాలము గడచినపిమ్మట దీక్షబూని పండ్రెండు సంవత్సరములు తపస్సు చేయగలడు. ఆసమయమునందు మృత్యువునకే పూర్వమువలె జనసంహారమునందు అధికారము వచ్చును. అదియును ప్రమాదమువలన కొందఱిని సంహరింపక విడువగా భూమిపై ప్రజలు అధికులగుదురు. భారమగుదురు. వొదలవలె దట్టముగ సంచరించుటకైన ఎడములేకుండ నిండిపోవుదురు. ఆ ప్రజాభారమును భరింపజాలక దుఃఖించి భూదేవి రక్షణార్థమై విష్ణువును శరణుజొచ్చ గలదు. అప్పుడు ఆశ్రీహరి భూభారమును నివారించుటకై రెండు దేహములతో అవతరింప గలడు. వాసుదేవుడను పేరుగలిగి ఆవిష్ణుదేహములలో ఒకటొటి వసుదేవునకు పుత్రుడు గాగలడు. రెండవది అర్జునుడను పేరుతో పాండుమహారాజునకు పుత్రుడు కాగలడు. పిమ్మట ఆ అర్జునునకు ధృతరాష్ట్రపుత్రులగు దుర్యోధనాదులతో రాజ్యమునకై యుద్ధము తటస్థించును. అప్పుడు బంధువులందరును శత్రుపక్షమునందు నిలచి ఆతనితో యుద్ధము చేయవత్తురు. తన సైన్యమునందును బంధువులే చేరి శత్రువులచేత హతులగుటకు సిద్ధపడియుందురు. ఆసమయమునందు ఉభయ సేనలయందును మరణమునకు సంసిద్ధులై ఉన్న ఆత్మబంధువులను అవలోకించి ఆ అర్జునుడు దుఃఖించును. యుద్ధప్రయత్నమును మానుకొనును. అప్పుడు అర్జునుడను పేరుతో ఒప్పుచున్న దేహముచేత కావలసినపనిని సాధింప జేయువాడై శ్రీకృష్ణుడు తనజ్ఞానవంతమగు వాసుదేవదేహముతో బహువిధ యుక్తుల మూలమున జీవన్ముక్తస్థితి ఇట్లని బోధింపగలడు.

శ్లో॥ అనంత మవ్యక్త మనాదిమధ్య
మాత్మాన మాలోకయ రాజసింహ ।
సంవిద్వపుః స్ఫార మలబ్ధ దోష
మజోసి నిత్యోసి నిరామయోసి ॥

శ్లో॥ నజాయతే మ్రియతేవా కదాచి
న్నాయంభూత్వా భవితావా నభూయః ।
అజో నిత్య శ్శాశ్వతోయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే ॥

ఓ రాజశ్రేష్ఠా ! అర్జునా ! నీవు స్వస్వరూపమును చూచుకొనుము. అది ప్రాపంచిక వ్యాపారములయందు మనస్సు మగ్నమై ఉండుటచేత స్పష్టముగ గానరాకున్నది. కొంచెము విమర్శించిన సర్వమును తేటప

దును. నీస్వస్వరూపమునకు ఆదిమధ్యాంతములు లేవు. భ్రాంతిచేత " నేను పుట్టితిని, జీవించుచున్నాను, మృతి జెందబోయెదను " అని ఊరకతలంచుటయే కాని, నీకు ఇందు దేనితోను సంబంధము లేదు. నీవు పుట్టువాడవు కావు. నశించువాడవు కావు. వికారములను చెందువాడవు కావు. ఎప్పటికిని ఒక్కటే విధముగ నుండువాడవే. జ్ఞానమాత్ర రూపుడవే. సర్వవ్యాపకుడవే. ఈ ఆత్మ ( నీవు ) ఒకప్పుడు పుట్టువాడు కాడు. నశించువాడును కాడు. ఒకప్పుడు పుట్టి ఉండలేదు. ఒకప్పటికి పుట్టబోవుచుగూడ ఉండలేదు. ఎప్పటికిని జన్మమరణములు లేనివాడే. ఎప్పటికిని ఏకరూపముతో ఉండువాడే. సర్వకాలములయందును ఇట్లే యుండువాడే. ఆదియనునది లేనివాడే. కావున నీదేహము శస్త్రాదులచేత ఖండింపబడినను, అగ్నిచేత గాల్చబడినను, జలముచేత తడుపబడినను, గాలిచేత ఎండింపబడినను, ఖండింపబడువాడు కాడు. కాల్చబడువాడుకాడు. తడుపబడువాడు కాడు. ఎండింప బడువాడును కాడు. కావున ఓ అర్జునా ! నీవు ఇతరులకై శోకింపనక్కఱలేదు. దేహమన్ననో, దానికి నాశము ఎప్పటికైనను నిశ్చయమే. ఇట్లుండగ నీవు ఇక్కడ ఎవ్వరికై దుఃఖించు చున్నావు. సర్వమును ఆత్మయే అయియుండగ నీకు బంధువు డెవ్వడు ? బంధువు కానివా డెవ్వడు ? కావున సర్వమును మనఃకల్పితమే అని ఎఱుగుము. పురుషునకు ఎప్పటికే వది వచ్చిన దానిని అనుభవించుటయే ఆచరించుటయే పని. సర్వము ఆత్మయే అయియుండగ జంపువా డెవ్వడు ? చంపబడువా డెవ్వడు ? చంపబడినవానికై దుఃఖించువా డెవ్వడు ? వానిని ఓదార్చువా డెవ్వడు ? సర్వమును అసత్యమే. సర్వమును భ్రాంతికల్పితమే. కావున ఏకార్యము చేయవలసి వచ్చినను ఎవ్వఃకిని వెనుదీయ వలసిన పనిలేదు.

అట్లు చేయుటకు కారణమే ఉండదు కదా ? కావున నీవు అభిమానమును వదలి ఫలాఫలములయందు రాగద్వేషములు లేక, సర్వ విషయములయందును, పరమాత్మను గాంచుచు ఎప్పటికి ఏదివచ్చిన దానిని చేయుచుండుము. ఫలాఫలములయందు గల సమభావమే యోగ మనబడును. ఇట్లు చిత్తమును పరమేశ్వరునియందు అర్పించితివేని క్షణకాలములో పరమేశ్వరుడవే అగుదువు. కావున వేఱే తలంపులు మాని సర్వవిషయములను పరమేశ్వరునియందు సమర్పించి నిర్వికారుడవై ఆ ఈశ్వరుడే ఆత్మరూపుడని ఎఱిగి సర్వభూతములకును నాకును, భేదములేదని నిశ్చయించి పరమేశ్వరుడవేయై, భూలోకమునకు అలంకారభూతుడవు కమ్ము. సర్వకర్మ

అను యథాపూర్వముగనే చేయుచున్నను మనస్సుమాత్రము అభిమాన శూన్యమై రాగద్వేషాది రహితమై ఉండునేని అప్పుడు నీవు సర్వకర్మ సన్యాసమును చేసినవాడవే అగుదువు. సర్వ సంసారములకును సంకల్పములే మూలము. కావున వాస్తవస్థితిలో వానిని పరిత్యజించుటయే గాక, అన్యమును పరిత్యజించుట సన్యాసమగునా? కావున సర్వమునందును సమచిత్తుడవై విచారశీలుడవై యుండుము. అదియే చిత్తవిశ్రాంతి. అనిన విని అర్జునుడు మహాత్ముడగు శ్రీకృష్ణభగవంతుని ఇట్లు ప్రశ్న చేయును. ఓ భగవంతుడా ! జగదీశ్వరా ! అభిమానమును విడచుట, సర్వమును పరబ్రహ్మమునకు అర్పించుట, ఈశ్వరార్పణము, సన్యాసము, జ్ఞానము, యోగము, అనువాని లక్షణములు ఎవ్వి ? ఈ విషయములను బాగుగా వివరింపుము. నాయొక్క అజ్ఞానమును తొలగింపుము. అని అడిగిన శ్రీకృష్ణభగవంతుడిట్లు ఉపదేశించును. ఓ అర్జునా ! వినుము. సర్వసంకల్పములును నశించెనేని అప్పుడు ప్రపంచ కారణములగు సంస్కారములన్నియును అణగును. అప్పుడు సంకల్పమనునదియే లేక, ఇంచుకయైనను చలింపకను ఉండుస్థితి ఏదికలదో, అదియే ( అప్పటి శుద్ధ జ్ఞానమే ) పరబ్రహ్మ మందురు. ఆ పరబ్రహ్మము బహిర్ముఖముగుటయే జ్ఞానము ( పరబ్రహ్మ ప్రకాశముతో గూడి వెలికి వచ్చు చిత్తవృత్తియే జ్ఞానమనుట ) అదియే యోగము. ( చూచువానికిని చూడబడు పదార్థమునకును, అప్పుడే సంయోగము కలుగును. కావున దానికి యోగమని పేరు కలిగెను. ) " ఆ బ్రహ్మమే సమస్త ప్రపంచము. అదియే నేను " అను జ్ఞానమే బ్రహ్మార్పణము. ( బ్రహ్మమునందు ప్రపంచముతోగూడ తన్ను అర్పించుట. ) మఱియు వివేకవంతులగు పెద్దలు కర్మఫలములపై ఆశ లేకుండుటయే సన్యాసమందురు. సంకల్పములను పరిత్యజించుటయే అసంగము ( అభిమానమును విడచుట ) అనిచెప్పుదురు, ఇదియుగాక సంకల్పములు ఎన్ని జనించుచున్నను ఎన్ని భేదములతో ప్రపంచము గానవచ్చుచున్నను "అంతయును ఈశ్వరుడే, ఆయనకంటె భిన్నము ఒక్కటియు లేదు " అని నిశ్చయించి అంతట అభేదమును చూచుట ఏదీ కలదో, అదియే ఈశ్వరార్పణము. ( సర్వమును ఉన్నది ఉన్నట్లుగనే ఈశ్వరునకు సమర్పించుట ) కావున నో అర్జునా ! నీవు నాయందే చిత్తమును నిలుపుము. నాయందే నీ ఆత్మను సమర్పింపుము. సర్వపదార్థములయందును నన్నే చూచుచు ఆరాధింపుము. నాకే నమస్కారమును గావింపుము. ఇట్లు చేసితివేని, నన్నే పరమగతినిగా ఆశ్రయించితివేని, నన్నే

ఆత్మరూపునిగా దెలిసితివేని, నన్నే చెందుదువు. "నీవు విష్ణుదేవుడవు కదా ? పరమాత్మ విషయమును జెప్పుచు నడుమ నీవిషయమును ఏల చెప్పు కొనియెదవు" అనియెదవేమో వినుము. నాకుసామాన్య మనియు, పరమ మనియు, రెండురూపములు గలవు. అందు హస్తపాదాదులతో గూడి శంఖ చక్రాది యుక్తమై ఉండు రూపము సామాన్య రూపము. ఇదియే విష్ణు శబ్దముచేత జెప్పబడుచున్నది. ఇట్లు కాక ఆకార శూన్యమై ఆద్యంతములు లేనిదై - నిర్వికల్పమై యుండు రూపము పరమరూపము. (శ్రేష్ఠమగు రూప ము) దానినే బ్రహ్మయనియు, ఆత్మయనియు, పరమాత్మయనియు, జెప్పుచున్నారు. కావున ఇచ్చట ఆ పరమ రూపమును గూర్చి చెప్పువా డనై ఇట్లంటిని. అర్జునా! నీకు ఎంతకాలమువరకు ఆత్మస్వరూపము తెలియ రాదో, వివేకము అబ్బదో, అంతవరకు చతుర్భుజములుకల నారూపమును పూజింపుము. దానిచేత క్రమక్రమముగ చిత్తము పరిశుద్ధమగును. అప్పుడు ఆద్యంతములు లేని, నాపరమరూపమును గుఱుతెరుగ గలవు అప్పుడు నీకు పునర్జన్మము కలుగదు.

శ్లో॥ నిర్మానమోహా జిత సంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్త కామాః ।
ద్వంద్వైర్విముక్తాస్సుఖదుఃఖ సంజ్ఞై
ర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్ ॥

ఓ అర్జునా ! అజ్ఞానమును ధ్వంసము చేసినవారును, అభిమాన మును కోసివేసిన వారును, ఆత్మయందు బుద్ధిని నెలకొల్పిన వారును, కామ క్రోధాదులను మఱచినవారును, సుఖదుఃఖాది రూపములగు జతలను (సుఖ దుఃఖములు, మేలుకీడులు, మొదలగునవి ఒకటి విడచిన మఱియొకటి ఆశ్ర యించియే ఉండు స్వభావము కలవి) విడిచినవారును, విజ్ఞాన వంతులు నగు పురుషులు నాశరహితమైన నాయొక్క దివ్యతేజస్సును జెందుదురు. నాతో ఐక్యము నొందుదురు. భ్రాంతిచేత దెలిసికొనలేక పోవుటగాని, ఐక్యము ఎప్పటికిని స్వతస్సిద్ధమే కదా ? ఏమహాత్మునియొక్క ప్రయత్న ములు కోరికలను అనువర్తింపక సంకల్పమును ఆశ్రయింపక యదృచ్ఛగ నిర్వహింప బడుచుండునో, వాడే జ్ఞానియని పెద్దలు చెప్పుదురు. ఆచరింప బడుచునే యున్నను వానికర్మలు నశించినవే. జ్ఞానమనునది అగ్నిహోత్ర మువలె వానియొక్క భ్రాంతిని దహించునుకదా ? కావున ఓ అర్జునా ! నీవు సుఖ దుఃఖాది రూపములగు జతలను విడువుము. ఎల్లప్పుడును శుద్ధ

సత్వమును ఆశ్రయింపుము. ఆత్మజ్ఞానము కలిగి యోగక్షేమములను అపేక్షింపకుము. ఎప్పటికి ఏది వచ్చినదాని అసంగుడవై ఆచరింపుము. ఇట్టివాడవు అయితివేని భూలోకమునకు అలంకారభూతుడవు అగుదువు.

శ్లో॥ అపిస్ఫుటతి వింధ్యాద్రౌ వాతివా ప్రళయానిలే ।
గురు శాస్త్రానుగో మార్గః పరిత్యాజ్యో నధీమతా ॥

ఓ అర్జునా ! వింధ్యపర్వతము ప్రకటులైనను ప్రళయకాల మారుతములు వీచినను, బుద్ధిమంతులగువారు గురూపదేశముచేతను, శాస్త్రార్థ్యానముచేతను, నిర్ణయింపబడిన మార్గమును విడువరాదు. కావున నీవు నా ఉపదేశమును చిత్తమునందు స్థిరము గావించుకొనుము. ఓ సత్పురుషుడా ! అర్జునా ! ప్రపంచమును విడచుట అశక్యమని తలంపకుము. ఇది అంతయు సంసారమయమే. మఱి ఏమియు లేదు. ఆ సంసారమును అజ్ఞానము ఉన్నంతకాలమే ఉండును. కంటిని ఇంచుక తెరచిచూడ గలుగునేని తత్క్షణమే అంతర్ధానము నొందును. ఓ రఘురామా ! ఈ విధముగ బలికి త్రిలోకేశ్వరుడగు శ్రీకృష్ణ భగవంతుడు నీలోత్పలమునందు మకరంద పానాసక్తమై నిశ్చలముగ ఉన్న తుమ్మెదవలె (శ్రీకృష్ణభగవంతుని శరీరము నల్లనిది కావునను, వచించువాడు ఆత్మయే కావునను, ఊరకుండుట స్వస్వరూపస్థితియే కావునను, ఇట్లువర్ణింప బడెను) మౌనమునుబూని ఎదుట గూర్చుండియుండగ అంత అర్జునుడిట్లని తన అభిప్రాయమును ఎఱిగింప గలడు. ఓ శ్రీకృష్ణ భగవంతుడా! సూర్యకిరణములచేత మేలుకొలుపబడిన తామరతీగవలె నాబుద్ధి సర్వలోకేశ్వరుడగు నీవాక్యములచేత అభ్యుదయము నొందినది. నాకుగల దుఃఖమంతయు నశించిపోయినది. మీ ఆజ్ఞ చొప్పున వర్తించెదను.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున అర్జునోపాఖ్యానమను
ముప్పదిమూడవ సర్గము ముగిసెను.

---

## —* శతరుద్రోపాఖ్యానము. *—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడగు భరద్వాజునితో ఇట్లనియె. ఓ భరద్వాజా ! ఈ విధముగ అర్జునోపాఖ్యానముచేత " ఎట్టికర్మలును చిత్త విశ్రాంతికి బాధకములు కావు " అని ఉపదేశించి ప్రకృతమున " జన్మ

పరంపరయు సంకల్పమాత్రముచేత కలుగునదియే" అని చెప్పదలంచి వశిష్ఠ మహాముని ఇట్లనియె. ఓ రఘురామా! ఇప్పుడు నీకు ఒక కథను చెప్ప బోవుచున్నాను. వినుము. దానియందు ఒకసన్యాసికి సంకల్ప ప్రభావము వలన గలిగిన విధమును వర్ణింపబడెను. ఒకానొక కాలమునందు ఒకచోట ఒక సన్యాసి ఉండెను. అతడు మహాశ్రేష్ఠుడు. ధ్యానికతో సమాధిని అభ్య సించువాడు. ఆత్మ ధ్యానముతోనే దినమంతయు గడపువాడు. ఇట్లు సర్వ కాలమును సమాధినే ఆచరించుచుండుటచేత వాని చిత్తము స్థిరమై యుం డెను. కావున ప్రపంచానుసారముగ ఆ మనస్సునకు ఏదియైన నొక సంక ల్పము తోచెనేని "నీరు అలలు అగునట్లు" సంకల్పిత పదార్థరూపమును జెందుచుండెను. ఇట్టిమనస్సుతో ప్రకాశించుచుండిన ఆసన్యాసి ఒకనాడు సమాధిని చాలించి స్వస్థుడై కూర్చుండి ఉండెను. ఒకకార్యమును గూర్చి ఇట్లని విచారింప దొడగెను. అప్పుడు వాని సంకల్పములు ఇట్లు పుట్టమొ దలుపెట్టెను. "నేను విలాసముగ సామాన్య జనులయొక్క వృత్తిని అంగీకరింతును గాక" అని సంకల్పించినతోడనే ఆతని చిత్తము "గాలి చేత చలించు జలము ఆత్మరూపమును విడువకయే తరంగాది రూపములను జెందునట్లు" పురుషాంతర రూపమును జెందెను. ఆ సంకల్పమయ పురు షుడును తన ఇచ్ఛను చెల్లించుకొన నారంభించెను. "నేనుజీవటుడను" అనితత్క్షణమే కాకతాళీయ న్యాయమును అనుసరించి సంకల్పము జనిం చెను. ఇట్లు కలలోని పురుషుడగు ఆజీవటుడు తన వంటిదేయగు ఒకానొక పట్టణమునందు విహరింప నారంభించెను. ఆపురవీధులయందు సంచరించుచు ఒక కల్లంగడికి పోయి అచ్చట మద్యపానమునుచేసెను. మదముచేత నిద్రను కూడ జెందెను. ఆ నిద్రయందు ఆ జీవటునకు ఒక కల వచ్చెను. సంకల్ప బలమువలన స్వప్నమునందు సామాన్యముగ ఒకస్థలమునుండి మఱియొక స్థలమును జేరినట్లును, వాడు వేదాధ్యయనాదులతో గూడిన శుద్ధబ్రాహ్మణు డైనట్లును తనకలలో చూచెను. ఇట్లు ఆజీవటుడు బ్రాహ్మణుడై పగటియం దంతయు కర్మలను ఆచరించి అలసి ఒకనాటిరేయి నిదురించెను. వృక్షమం తయు బీజమునందు అణగునట్లు అణగిపోయెను. వానికి అప్పుడు వచ్చిన స్వప్నమునందు తాను ఒకసామంత ప్రభువైనట్లు తోచెను. ఆసామంతు డును బహుకాలము రాజ్యముచేసి ఒకనాడు భుజించి నిదురించుచుండి అందు తాను సర్వదిక్కులను పరిపాలించుచున్న ప్రభువైనట్లు కలగాంచె ను. ఆచక్రవర్తియును ఒకానొకనాడు స్వస్థుడై నిదురబోవుచు స్వప్నము

నందు సంకల్ప ప్రభావముచేత అతిసౌందర్యవతియగు దేవకన్యక ఆయెను. ఆదేవకన్యకయు బహుకాలము ఇష్టభోగములను అనుభవించుచుండి ఒకనాడు గాఢనిద్రను జెంది అందు కలలో అతిచంచల స్వభావమగు లేడి ఆయెను. ఆలేడియును ఒకనాడు నిదురించుచుండి తాను ఒకతీగెయైనట్లుకల గాంచెను. దానికి తీగలతో పరిచయము అధికము కావున దానిచిత్తమునందు అట్టి సంకల్పమే వాడుకయైయుండెను.

ఓరామభద్రా ! లేడికి కలవచ్చుననుటవలన నీవు ఆశ్చర్యమును జెందవలదు. మనస్సు ఉన్నప్పుడు అది చూచినవానిని గాని, వినినవానిని గాని, స్మరింపక మానదు. కావున ప్రతిదానికిని స్వప్నము రావచ్చును. ఆతీగె చిగుళ్ళు, పూలు, పండ్లు మొదలగువానితో గూడి విస్తరించెను. వనదేవతలు వనవిహారములు సలుపునప్పుడు వారికి లతాగృహమై ప్రకాశించుచుండెను. ఒకటితీగె అయ్యును పొదవలె విస్తారముగా అల్లుకొనెను. "వృక్షములయందును పరమాత్మస్వరూపము ఉండును" అని ఇదివరకే చెప్పియున్నాను. కావున నాతీగెయందును అట్లు పరమేశ్వరుడు కలడనుటలో సంశయము ఉండదు. బీజములోని అంకురమువలె అతిసూక్ష్మరూపుడై అందును దివ్యజ్ఞాన రూపుడగు పరమేశ్వరుడు ఉండుటచేత దానికిని జాగ్రత్స్వప్నాది అవస్థలు కలవనుట నిర్వివాదాంశము. ఇంద్రియములు లేకున్నను, బాహ్య విషయక జ్ఞానము జాగ్రదవస్థ అనుటకు దగియుండును గదా? వృక్షములకు ఇట్టిజ్ఞానము కలదనుట కేవల యుక్తులచేతనే కాక, ప్రస్తుతకాలమునందు యంత్ర సహాయముచేతను, పూర్వకాలమునందు యోగాదులచేతను, ప్రత్యక్షముగనే చూపుచుగూడ నుండిరి. మఱియును ఒకపక్షమునందు వానికి స్థూలములగు కరచరణాదులే లేవు కాని, సూక్ష్మములగు ఇంద్రియములు కలవని కొందరి మతము. ఏది ఎట్లున్నను పరమేశ్వరుడు ఉన్నప్పుడు బహిరంతర్ముఖములగు జ్ఞానములు లేకుండుననుట యుక్తియుక్తము కాదు. ఇవియే జాగ్రత్స్వప్నావస్థలు. కదా? కావున ఆతీగె తన యొక్క జాగ్రదవస్థయందు తాను ఒక వృక్షమునకు జుట్టుకొని ఉన్నట్లును, గాలి మొదలగువానిచేత కదలుచున్నట్లును, తన్నుజూచి బహుజనులు సంతోషించుచున్నట్లును, అరణ్యమధ్యమున ఉన్నట్లును, దలంచుచుండెను. పిమ్మట సుషుప్తావస్థను జెంది అందు దట్టమైయున్న జడత్వమును అనుభవించి పిమ్మట తాను ఒక తుమ్మెదగా నున్నట్లు వృక్షములపై దుముకుచున్నట్లును మకరందపానము చేయుచున్నట్లును తలంచెను. ఆతుమ్మెదయును

అనేక స్థలములయందు విహరించి తుదకు కమలములను చూచెను. అప్పటి నుండియు ఆతుమ్మెదకు కమలములయందు ప్రీతి అధికమాయెను. అదిమొదలుకొని ఆతుమ్మెద సర్వకాలములయందును తామరతూడులయందే నివసించుచు తన్మయమయ్యె యుండును. జడబుద్ధిగలవాని చిత్తముగూడ ఏదియో ఒకదానియందు ఏదియో ఒక అనుకూల గుణమును గ్రహించి ఆశగొనుచుండునుగదా. ఇట్లు ఒకనాడు ఆతుమ్మెద కమలగర్భమునందు ఉండగా తామరతీగెను త్రెంచివేయు తలంపుతో ఒక ఏనుగు అచ్చటికి వచ్చెను. మూర్ఖుల ప్రభావమంతయు వారి బలమంతయు మనోహరమగు వస్తుసమూహమును నాశము జేయుటయందే సామాన్యముగ వినియోగింప బడుచుండును. అంత నా ఏనుగు ఆతామరతీగెలను పెళ్ళగించి త్రొక్కి వేసెను. దానియందు నిలచియున్న దగుటచేత ఆతుమ్మెదయు తామరపువ్వుతోగూడ చూర్ణమయ్యెను. అయినను అంతకుముందు ఏనుగును చూచియున్నది. కావున ఆసంకల్పముచేత అది ( తుమ్మెద ) మత్తగజముఆయెను. జీవుడు నశించువాడు కాడుగదా ? అంత ఆమదగజము ( తుమ్మెద సంకల్ప బలముచేత ఉత్తరజన్మమునందు జెందినరూపము ) ఎండిపోయిన సముద్రమో, యన అతి-గంభీరమగు ఒకగుంటలో పడెను. ( ఏనుగులను బట్టువారు మొట్టమొదట వాటిని ఒక గుంటలో పడునట్లు చేయుదురు ) ఇట్లు చిక్కిన ఆ ఏనుగును కొందరు గొనిపోయి బంధించి శిక్షించిరి. ఒక రాజునకు విక్రయించిరి. ఆరాజును దానిని తనకు పట్టపు ఏనుగుగా జేసికొని మిక్కిలి ప్రేమించుచుండెను. ఇట్లుండగ ఒకానొకప్పుడు ఆప్రభువునకు మఱియొకనితో యుద్ధము తటస్థించెను. ఆయుద్ధములో ఈ ఏనుగు దెబ్బతగిలి మృతినొందెను. గండస్థలమునందు ఎప్పుడును మదజలమును పానము చేయుటకై తుమ్మెదలు వాలియుండును. కావున ఆ ఏనుగునకు జీవితకాలము నందంతయు తుమ్మెదతోనే పరిచయము ఉండెను. కావున ఆసంకల్పబలముచేత ఉత్తరజన్మమునందు అది మఱల తుమ్మెద ఆయెను. మఱల పూర్వమువలెనే కమలమునందే నివసించుచుండి ఒక ఏనుగు ఆతామరతీగెను తెంచి త్రొక్కగా దానితోగూడ పొడి ఆయెను. పిమ్మట హంసమై రెండవమారు జన్మించెను. తుమ్మెదయు హంసయు కమలముపై నుండునవియే. కావున పరస్పరము పరిచయము అధికముగ నుండునుకదా ? ఇట్లు జన్మించిన ఆహంస తన సంకల్ప వశమున అనేక జన్మములను ఎత్తి ఎత్తి తుదకు బ్రహ్మవాహనమగు హంస యాయెను. ఆజన్మమునందు స్వేచ్ఛగా విహరించుచుండెను. ఇట్లు సంచ

రించుచు ఆహంస ఒకనాడు కైలాసమునకు పోయి రుద్రుని గాంచెను. అట్లుగాంచి " నేను ఈశ్వరుడను కావలయును " అని నిశ్చయముగ సంకల్పించెను. ఆసంకల్ప బలముచేత తత్క్షణమే ఈశ్వరుడై ప్రమథగణములతో జేరి ఆస్థితికి దగిన చేష్టలతో కైలాసమునందు సంచరించు చుండెను. ఇట్లు రుద్రత్వమును చెందుటచేత దానిమనస్సు మిక్కిలి నిర్మలమాయెను. అందువలన ఆరుద్రుడు తన పూర్వవృత్తాంతమును అంతయు స్ఫురింప గలిగెను. భగవంతుడగు ఆరుద్రుడు ఆవరణము ( భ్రాంతి ) లేని విశుద్ధజ్ఞానమే స్వరూపముగ గలవాడగుటచేత ఏకాంతమునందు ఒకనాడు విచిత్రములగు తన వెనుకటి కలలను అన్నిటిని స్మరించి ఆశ్చర్యపడెను. అహా, ఈమాయ ఎంత గొప్పది ? భ్రాంతిగ లేనిదైనను సత్యమైనట్లు కానవచ్చును. భేదించుటకు అలవికానట్లు తోచును. ఎండమావులనీటిని చూచి దాటలేమని తలంచు మృగాదులవలె జనులు మాయను జూచి బెదరుచున్నారు. దానికి వశగతు లగుచున్నారు. అహా, శూన్యములయ్యును మిక్కిలి బాధకరములై ఉన్న సంసారారణ్యములయందు నామట్టుకు నేను ఎన్నిమారులు పొరలాడితిని. అహా, ఇంతకంటె చిత్రము కలదా ? పూర్వము ఒకజన్మమునందు జీవటుడను పేరుగలవాడనై జన్మించితిని. పిమ్మట బ్రాహ్మణుడనైతిని. మఱి యొకజన్మమునందు ప్రభువునైతిని. ఒక తామర కొలనిలో హంసనై వింధ్యపర్వత సమీపమునందు ఏనుగునై కొన్నిజన్మములయందు ఉంటిని. ఇట్లు లెక్కకు మిక్కిలియగు జన్మలను ఎత్తి ఎత్తి తుదకు ఇట్లు రుద్రుడనైతిని. నాకు గడచిన జన్మాంతరములలో అనేక వేల సంవత్సరములును, అనేక నూర్ల మహాయుగములును, అనేకవిధములగు చర్యలతో గూడిన దినములును గడచి పోయినవి. లెక్కకు మిక్కిలిగ అతిక్రమించి పోయినవి. ఇప్పుడు నేను నాపూర్వదేహములను అన్నిటిని జూడబోయెదను. వానికిగూడ పరిపూర్ణ జ్ఞానము నొసంగి నాతో సమానులుగ చేసికొందును.

ఓరఘునందనా ! శ్రీరామా ! ఆరుద్రుడు ఈవిధముగ నిశ్చయించి భిక్షుడు " నిదురించువానివలె, శవమువలె " మనస్సుతో మాత్రము విచిత్ర సంకల్పములను జేయుచు గూర్చుండి యున్న చోటికి బోయెను. అప్పటికి వానిమనస్సు భ్రాంతికి జిక్కిన దగుటచేత వానియందే యుండియు లేనట్లుండెను. జ్ఞానము సర్వ వ్యాపక మయ్యు ప్రకాశింపకుండెను. ఇట్టి ఆతని ఆరుద్రుడు మెలకువజేసి మనస్సునకు స్వస్థస్థితిని సంపాదించి దానిమూలమున జ్ఞానమునకు గూడ ప్రకాశమును కలిగించెను. జ్ఞానము బ్రహ్మమే కా

వున అది సర్వవ్యాపకము. ఒకచోట ఉండునదియు, మఱియొకచోట లేక పోవునదియు, కాదు. అయినను చిత్తవృత్తి ఉన్నపుడేకాని, దాని ప్రకాశము పరులకు గానరాదనుటయు, ఈకారణమువలననే సామాన్యులు వృక్షాదులయందు చైతన్యము లేదని తలంచు చున్నారనుటయు చదువరులకు ఇప్పటికే స్పష్టమై ఉన్నది. పైన చెప్పిన విధముగా మెలకువ రాగానే ఆసన్యాసి తనస్థితిని తెలిసికొనియెను. తాను జీవటాది బహురూపములను ఎత్తినట్లును, తుదకు ఇప్పుడు రుద్రరూపముతో ఉన్నట్లును, తెలిసికొనియెను. ఆహా, మాయ ఎంతజేసెను. అనుచు మిక్కిలి ఆశ్చర్యమును జెందెను. దివ్యజ్ఞానము కలిగియుండుటచేత ఆతనికి ఎట్టి సంభవములు కలిగినను, ఆశ్చర్యము కలుగరాదు. ఐనను మాయయొక్క ప్రభావము వానికి అవశ్యముగ అబ్బురపాటును గలిగించెను. ఇట్లు పరమాశ్చర్య భరితుడగు ఆసన్యాసియు రుద్రునితోగూడి ప్రయాణమాయెను. వారిరువురును చిదాకాశమునందు ఒకమూలనున్న జీవటుని ఇంటికి పోయి వానిని మేల్కొలిపి బుద్ధి జ్ఞానములతో గూర్చిరి. వాడును, సర్వార్థమును ఎఱిగి ఆశ్చర్యమును జెందగూడనివాడైనను వారలతోగూడి పరమాశ్చర్యము నొందెను. వాస్తవస్థితిలో నాజీవటునికిని పరిశుద్ధ విజ్ఞానము కలిగెను. కావున ఎట్టిస్థితి సంభవించినను వానికి ఆశ్చర్యము కలుగకూడదు కదా ? మఱియు విచారించిన వారుమువ్వురును ఒక్కటియేయైనను సంకల్ప ప్రభావమువలన ముగ్గురుగ దోచుచుండిరి. పిమ్మట ఆమువ్వురును క్రమక్రమముగ బ్రాహ్మణుడు మొదలగు వారి గృహములకుగూడ పోయి వారలను మేల్కొలిపి మనోయుక్తలనుగాను, జ్ఞానప్రకాశ సమన్వితులనుగాను గావించుచు వారలతోగూడి తుదకు రుద్రలోకమును జేరిరి. ఒక పక్షమునందు దివ్యజ్ఞానవంతులగుటచేతను, మఱియొక పక్షమునందురుద్రునకు పూర్వులై కారణభూతులై ఉండుటచేతను, వారందరును రుద్రులేయై యుండిరి. పిమ్మట మొట్టమొదటి రుద్రుడు వారల నందఱను పంపివేసెను. వారును తమయొక్క నివాసములను జేరిరి. ఆ రుద్రుడు ఈవిధముగ మాయాప్రభావమును విమర్శించి తనకు అంశీభూతులగు జీవటాదులను అందఱను వారివారి ఇండ్లకు బంపుటయు వారును అచ్చటనే నివసించి భార్యాపుత్రాదులతో తమజీవితకాలమును గడపి జ్ఞానవంతులగుటచేత అంతమునందు రుద్రునితో ఏకీభవించిరి.

ఓ శ్రీరామచంద్రా ! దీనివలన నీవు ఏమియు ఆశ్చర్యము నొంద నవసరము లేదు. చైతన్యము ( బ్రహ్మము ) సర్వవ్యాపకము. మనస్సు సర్వ

శక్తివంతము. కావున నిశ్చయ సంకల్పముచేత ఏదేది ఎట్లెట్లు భావింప బడునో, చైతన్యము అట్లట్లెల్ల నిస్సంశయముగ గానవచ్చును. "అట్లు అగునుగాక, ఒకమాఱు నశించిపోయిన శరీరము మఱియొక కాలమునందు ఎట్లుగాననగును. ఎన్నియుగములకు పూర్వమో, నశించియున్న జీవటుడు రుద్రునకు ఎట్లుగానవచ్చెను" అనియెదవేమో వినుము. చైతన్యమునందు సర్వమును (కలిగినదియు, కలుగుచున్నదియు, కలుగబోవునదియు) గలదు. ఏదేది కలయందు చూడబడునో, సంకల్పములచేత మనోరాజ్య రూపము నందు అనుభవింపబడునో, అదియంతయు, నట్లట్లే పరబ్రహ్మమునందు ఉన్నది. బ్రహ్మరూపముతోనే ఉన్నది. ఇట్లుండుటచేతనే రుద్రునకు జీవటాదులు దొరికెరి. "మనముకూడ అట్లు స్వప్నగత పదార్థములను, మనోరాజ్యగత వస్తువులను సంపాదింపగలమా" అనియెదవేమో, అట్లుసంపాదించుటకు వీలు లేకపోలేదు. అట్టివానిని సంపాదింప దలంచువానికి కొంత విశేష సామర్థ్యము కావలయును. అది సంపూర్ణమగు ప్రాణ నిరోధము వలన గాని, యోగాభ్యాసమువలన గాని, కలుగును. అట్టి అభ్యాసము లేకపోవుటచేత సామాన్యులు వాని సంపాదింప నేరకున్నారు. కావున ఎవ్వరికి ప్రాణ నిరోధమును, జ్ఞాన యోగాభ్యాసమును, దృఢములై ఉండునో, అట్టివారు అన్నిచోట్లయందును అన్నిపదార్థములను కనుగొనగలరు. ఈ రుద్రాదులు అట్టివారే. ఇంతయేల? ఏకాగ్రస్థితిని జెందినవాడు, ఏక పదార్థమునందు స్థిరముగ చిత్తవృత్తిని నెలకొల్పినవాడు, తన అభిమతములనెల్లను పొందగలడు. ఎప్పటికిని వాని తలంపునకు విఘ్నము ఉండదు. దక్షిణదిశను చూచి పోవుచున్నవాడు ఎన్నటికైనను ఉత్తరదిశను జెందునా? మఱి యొక విశేషముకూడ గలదు. ఆత్మజ్ఞానులకు యోగనిష్ఠులకు, ప్రాణాయామ పరాయణులకు వీరలకందఱకును ఇట్లు స్వప్నకల్పిత పదార్థములును, మనోరాజ్యకల్పిత పదార్థములును, గోచరములు కావలయునను నియమము లేదు. అందెవ్వరికి వానిని జూడవలయునను ఇచ్ఛ కలుగునో, వానికిమాత్రమే అవి గానబడును. ఎదుటనున్న పదార్థమైనను దానిపై దృష్టినిలిపిననే కాని, కానరాదు కదా? యోగనిష్ఠ లేనివారలకు సంకల్ప కల్పిత పదార్థము గానరాకుండుటకు కారణమును వినుము. వారలకు తమ ఎదుటనున్న పదార్థములు బుద్ధికి గోచరించుచుండును. ఏఏ పదార్థము బుద్ధికి గోచరించుచున్నదో, ఆయాపదార్థము బుద్ధియందే ఉన్నది అగును. కావున వారల బుద్ధి బాహ్యముఖమై బాహ్యపదార్థనిష్ఠగలదై ఉండును. ఏకాగ్ర

స్థితి ఉండిననేకాని, ఏదియు గానరాదు. కావున బాహ్యపదార్థములుకూడ అట్టిస్థితి లేనివారలను గానరావు కదా ? కావున బుద్ధి అన్యాయత్తమై యుండ దానికి సంకల్ప కల్పిత పదార్థములు ఎట్లుగానవచ్చును ? " నేను విద్యాధరుడను, నేను వైదికుడను. " అని ఏకపదార్థభావనను దృఢముగ గావించుచుండువారు ఎప్పటికిని అట్టివారే అగుచున్నారు. స్వప్నమునందు గాని, మనోరాజ్యమునందుగాని, తాము అన్యరూపమును జెందినను దానిని అసత్యముగ భావించు చున్నారు. ఇది సర్వానుభవ సిద్ధము గదా ? ఏకాగ్రతవలన ఎట్టిఫలము కలుగునో చూడుము. ఆ విద్యాధరుడే విద్యాధరత్వము మీద నున్న బుద్ధిని తొలగించి సమాధిపరుడై, ఏపదార్థమునందు నిలువవలయుననిన ఆపదార్థమునందే నియమముతో నిలచు సామర్థ్యమును ఆబుద్ధికి గలిగించి,స్వప్న కల్పిత పదార్థములయందు అభిమానమును ఉంచునేని ఆవియే తానగును. ఆ వైదికుడును తన వైదికత్వమునందలి అభిమానమును విడచి బుద్ధిని సర్వసమము గావించి సంకల్ప కల్పిత పదార్థములను ఆత్మగా భావింప గలుగునేని అప్పుడు తద్రూపుడే అగును. పై ఇతిహాసమునందు విషయము స్పష్టమయ్యెనుకదా. సన్యాసి తన సన్యాసిత్వముమీది అభిమానమును వదలి బుద్ధిని ఏకాగ్రత నొందించిన వాడు కావున " నేను జీవటుడను " అని సంకల్పింపగానే జీవటుడయ్యెను. ఇట్లే ఆజీవటాదులును సన్యాసికి అంశభూతులె కావున సంకల్ప కల్పిత రూపములను జెందిరి. కాకున్నను, అజ్ఞానికికూడ మరణకాలమునందు మనస్సు స్వయముగనే పూర్వపదార్థములను వదలి కర్మానుగుణముగ ఏకాగ్రభావముతో ఉత్తర జన్మమునుగూర్చి సంకల్పించును. తత్క్షణమే ఆయాకారముతో పరిణామమును జెందును. స్వర్గ నరక భోగములనుగూర్చి విచారించిన నవియు సంకల్ప మాత్రములే. " నేను ఈ పాపమును ఆచరించితిని. నాకు ఇట్టి శిక్ష తటస్థింప గలదు " అను సంకల్పము పురుషుని ఒకక్షణమునందు మహానరక బాధ నొందించును. " నేను ఈ పుణ్యమును జేసితిని. నాకు ఇట్టి సుఖము గలుగును " అను సంకల్పము స్వర్గభోగమును సంపాదించును. " తనకు కలుగబోవు దుఃఖము ఇట్టిది, సుఖము ఇట్టిది " అని తెలియనివారలుకూడ కలరనుట నిర్వివాదాంశమే కాని, ఏకాగ్రచిత్తమునకు తెలియరానిది ఒకటియును లేదు. " నేనుఅజ్ఞానిని " అని తలంచుటయు భ్రాంతియే కదా ? సర్వప్రపంచ నిర్మాణ సమర్థమగు చిత్తమునకు తెలియరానిది ఒకటి యుండునా ? అట్లు కాకున్నను, సుఖ దుఃఖములనుగూర్చి కొందరకు తెలి

యెదనుమాట యథార్థమేయైనను "సుఖదుఃఖానుభవము సంకల్పజన్యము" అను సిద్ధాంతమునకు భంగము రాదు. పాపకర్మవలన గలుగు పశ్చాత్తాపమును పుణ్యకర్మవలన గలుగు తృప్తియును అనునీ రెండే నరకస్వర్గములను సంపాదింప జాలును. ప్రతిపురుషుడును పాపకర్మము నాచరించునప్పుడు మొట్టమొదట బుద్ధిచేత బహువిధములుగ నిరాకరింప బడుచుండుటయు, తుదకు మోటుతనముచేత ఆపనిని గావించినను పశ్చాత్తాపాగ్నికి బరితపించువనుటయు, వాడుక వలన నదియు గొంత సహ్యమే యైనను, తనచేత బాధనొందినవారి దుఃఖసహిత వాక్కులనుగాని, తనయట్టివారికి గలుగు శిక్షలనుగాని, రాజభటులచేత దనకు గలుగుచున్న దండనములను గాని, దలంచునప్పుడు మనస్సు కలకబాఱుననుట దప్పదనుటయు, నిర్వివాదాంశములుకదా ఈ నిదర్శనమువలన ఎట్టి క్రూరునకైనను పశ్చాత్తాపము కలదనుట నిస్సంశయము. అది ప్రకాశముగానైన, గుప్తముగానైన, నుండును. అంతియకాని, భ్రాంతిగామాత్రము లేకపోదు. పుణ్యకర్మవలన గలుగు తృప్తికూడ ఇట్టిదియే. ఈ పశ్చాత్తాప తృప్తులు బాహ్య పదార్థములపై చిత్తము నిలచియున్నప్పుడు ఒకవేళ ప్రకాశింపకున్నను వానిని విడిచి మరణసమయమునందు ఏకాగ్రస్థితిని జెందినప్పుడు తప్పక ప్రకాశములగును. "ఇట్లయిన పరలోకమనునది లేకుండ వలయు కదా?" అనియెదవేమో, అట్టిసంశయముతో పనిలేదు. ఆలోకములును సంకల్ప జన్యములే. ఈ ప్రపంచ మంతయునుగూడ సంకల్ప జన్యమేయనిన పరలోకమొకటిమాత్రము అట్టిది కాకపోవునా కావున ఇందలి తత్వము ఏమనిన; మరణకాలమునందు స్వభావముగనే ఏకాగ్రస్థితిని జెందిన చిత్తము "ఇది నరకము, ఇందు నేను పడియున్నాను. వీరు రంపములతో నన్ను గోయుచున్నారు" అనిగాని "ఇదిస్వర్గము, నేను దేవతాస్త్రీలతో గూడి నందనవనమునందు విహరింపుచున్నాను" అని గాని, సంకల్పించును. కావున పరలోకములు ఇంతమాత్రమువలన లేకపోవ నక్కఱలేదు. తాను ఉన్నచోటే పురుషునకు సంకల్ప ప్రభావమువలన సర్వలోకములు నగును. సన్యాసికి తాను ఉన్నచోటే తుదకు కైలాసమగునుకదా. ఈ రహస్యము సామాన్యులకు ఎఱుగవచ్చుట అశక్యమగుటచేత సుఖబోధకై పౌరాణికులు పరలోకగమనమును వర్ణింపుచున్నారు. ఇంతమాత్రమువలన ధర్మశాస్త్ర పురాణ పద్ధతులను ఆక్షేపింపదగదు. ఒకటి ధర్మశాస్త్ర పురాణములే అననేల? సర్వశాస్త్రములును ప్రమాణములని తలంపబడు సర్వవ్యవహారములునుగూడ

ఇట్టివే. సంకల్పమయములై సర్వపదార్థములును ఆత్మరూపములేయై యుం
డగ వానిని భిన్నములుగ నిరూపించి చెప్పుచున్నవి కదా ? “ ఇట్లయిన
ప్రతివానియొక్క మనస్సును ఒక కాలమునందు క్రొత్తలోకములను కల్పించు
నంతటి ఏకాగ్రస్థితి కలది అనవలయును. అట్టి మనస్సు మఱల రెండవ జన్మ
మునందు శక్తిహీనమై ఏల వీర్పడును ? అనియెదవేమో వినుము. ఒకపక్ష
మునందు దానికి శక్తిహీనత అనునది ఎప్పటికిని లేదు. బాహ్యపదార్థము
లపై దృష్టియున్నప్పుడు తనశక్తిచేత వానిని కల్పించును. అట్లు కానప్పుడు
అన్యములను కల్పించును. మఱియొక పక్షమునందు ఉత్తరజన్మస్మృతియే
మరణము. కావున అప్పుడు పూర్వసంసార భావన తనంతనే నశించిపోవు
ననుటయు, ఉత్తర సంసార భావన కలుగుటకు ముందు అవశ్యముగ ఏకా
గ్రస్థితి అలవడి తీరవలయు ననుటయు నిర్వివాదాంశము. మఱియు కొన్ని
కొన్ని ప్రతిబంధములవలన శక్తివంతములగు పదార్థములు శక్తిహీనములుగ
గనుపడినను అది కేవలము భ్రాంతియేకాని, వాని వాస్తవ శక్తికి ఎప్పటికిని
లోపముకలుగదు. కావున పైన చేయబడిన ప్రశ్న కేవలము భ్రాంతిసిద్ధమై
నదియే. మనకు గానవచ్చు పదార్థములు త్రికాలములయందును ఇట్లే ఉం
డుననియు, మనస్సుచేత కల్పింపబడినవి కావనియు ఒక నిశ్చయమును జేసి
కొని స్వప్నకల్పిత పదార్థములు మొదలగునవి మనస్సుచేత మాత్రమే
కల్పింపబడుననియు, అసత్యములనియు, భావించి పైప్రశ్న చేయబడినది.
“ సర్వప్రపంచమునుమనఃకల్పితమే ” అను జ్ఞానము లేకపోవుటచేత పై
ప్రశ్న చేయబడినది. కావున నిర్వివాదముగ నది భ్రాంతిసిద్ధమే. “ ఇప్పటి
కిని మఱియొక సంశయము కలదు. మనస్సుగాని, మఱిఏదిగాని సంకల్పింప
వలయుననిన ఆసంకల్పిత పదార్థమును పూర్వము ఒకమాఱు చూచి యుం
డవలయును. కావున మున్ను ఒక ప్రపంచము నిత్యమై యుండవలయును.
దానిని చూచిన దగుటచేత మనస్సు క్రొత్త ప్రపంచమును తనశక్తిచేత
కల్పింపవచ్చును. మఱియు ఇట్లు చెప్పుటచేత జాగ్రదవస్థయందు జూడబడు
ప్రపంచము అసత్యప్రపంచమే అనియు, స్వప్నాదిదృష్టప్రపంచము కేవల
మనఃకల్పితము అసత్యము అనియు జెప్పనొప్పును. దీనిచేత మనశ్శక్తికి పరి
మాణము ఏర్పడును. ప్రత్యక్షముగ ఎదుట గానవచ్చు ప్రపంచమునుకూడ
కల్పితమాత్రముగా జెప్పవలసిన అవస్థ తప్పిపోవును. శాస్త్రములకును
సార్థక్యము కలుగును ” అనియెదవేమో వినుము. ఈప్రపంచము అనాది.
దీనికి ఇదిమొదలు, ఇదితుద, అని నిర్ణయము లేదు. ఇట్లే అవశ్యముగ అంగీ

కరించి తీరవలయును. అది సమ్మతము కాకుండిన ప్రస్తుత ప్రపంచము నందలి జంతువులకు గలుగు సుఖదుఃఖములు ఆకస్మికములు కావలసీవచ్చును. దీనికి బూర్వమునందు మఱియొక సృష్టి లేదనినచో "జీవులు తాము చేయని కర్మములయొక్క ఫలములనే అనుభవించుచున్నారు (పూర్వము నందు పాపకర్మలను ఆచరింపకయే ప్రకృతమునందు దుఃఖమును అనుభవించుచున్నారు. పుణ్యకర్మములను ఆచరింపకయే సుఖమును అనుభవించుచున్నారు)" అని చెప్పవలసివచ్చును. ఉత్తరసృష్టి లేదనినచో "జీవులు ప్రకృతకాలమునందు చేయుపుణ్యపాపములు ఇంతటితోనే పోవును. వానికి ఎప్పటికిని ఫలమే కలుగదు" అనవలసివచ్చును. ఇది యుక్తము కానేరదు కదా? ప్రతికార్యమునకును ప్రతిఫలము ఉండుననుట లోకదృష్టమైయుండ శాస్త్రము దానికి విరుద్ధమైయుండగలదా? కావున ఎట్లు చూచినను పూర్వోత్తర జన్మములవలెనే పూర్వోత్తరసృష్టులను (కల్పములను) అంగీకరింపవలయును. అట్లంగీకరించిన పైనజూపిన దోషములనే నివారించుటకై లెక్కకు మిక్కిలియగు పూర్వకల్పములను ఉత్తరకల్పములనుగూడ అంగీకరింపవలసి వచ్చును. ఇట్లగుటచేత ఎట్లు విచారించినను "ప్రపంచము అనాది, అనంతము" అని తీరవలయును. ఇదియునుగాక జీవుడు ఆద్యంతములు లేనివాడు. ఆతనికి ముక్తి కలుగునంతవరకు సంసారము ఉండియే తీరును. సంసారమే ప్రపంచము. ఆజీవుడును మాయాప్రభావమువలన పరిచ్ఛిన్నుడై బహురూపములతో ఉన్నాడు. ఇట్లగుటచేత అందరు జీవులకు ముక్తి కలుగునంతవరకు ప్రపంచము ఉండవలసినదియే. ఈ యుక్తిని బట్టి చూచిన ఇప్పటికే "ప్రపంచము అనాది" అనియు "దానికి అంతము మాత్రము ఎప్పటికైన గలుగవచ్చును" అనియు సిద్ధాంతమైనది. ఒకపక్షమునందు అనాదియగు పదార్థమునకు అంతము గలుగుననుట అసంభవము. కావున ప్రపంచమునకు అంతము లేదనియే స్థాపింపవచ్చును. ఆస్థాపనను ఆధారము చేసికొని సర్వజీవ ముక్తి అనునదియే లేదనవచ్చును. "ఇట్లు చెప్పనేల అజ్ఞానమను పదార్థము అనాదియయ్యును అంతము నొందుచున్నదిగదా? ఇట్లే ప్రపంచమును అనాదియు గావచ్చును. ఒకప్పుడు దానికి అంతముకూడ నుండవచ్చును." అనియెద వేమో అట్లు కాదు. అజ్ఞానమునకు మాత్రము ప్రత్యేకముగా అట్టి స్వభావము కలదు కాని, అన్యపదార్థములకు లేదు. రత్నమును ఎఱుంగనివానికి రత్నవిషయకమగు అజ్ఞానము అనాదియే యయ్యును, దానిని ఎఱుగగానే నశించి పోవు

యుండుట ప్రత్యక్షమై యున్నది. ఇతర పదార్థములయందు ఎచ్చటను ఇట్టి స్థితి గానవచ్చుట లేదు. కావున ప్రపంచమునుగూర్చి మాటలాడునప్పుడు అజ్ఞాన స్వభావము దృష్టాంతము కానేరదు. కావున ప్రపంచ నిర్ణయమున కై ఈ యుక్తి చాలదు. ఇక రెండవపక్షమును ఆశ్రయించిన జీవోత్పత్తికి కారణమగు చాంచల్యము సర్వకాలములయందును బ్రహ్మమునందు ఉండు నదియే యగుటచేత విజ్ఞానమువలన ఒకజీవుడు ముక్తుడైన మఱియొకడు ఆస్థానమునకు వచ్చుచునే ఉండవచ్చును. సంసారమునకును నాశము లేక పోవచ్చును. ఈ విషయము భుసుండోపాఖ్యానమునందు ఒకతీరుగ వర్ణింప బడెను. శిఖిధ్వజోపాఖ్యానమునందు కొంత విశేషముగ వివరింపబడును "ఇట్లైన మోక్షమునకు అనిత్యత్వము వచ్చునుకదా" అనియెదవేమో అట్లు చెప్పనక్కఱలేదు. ఒకపక్షమునందు మోక్షమనునది స్వతస్సిద్ధమగుట చేత దానికి నిత్యత్వమునందు నిత్యత్వము అనువిభాగమే లేదు. మఱి యొకపక్షమునందు మహాసముద్రమునందు ఉంచిన నీటిని మఱల గ్రహించుట సంభవింపనట్లు పరబ్రహ్మమునందు గలసిపోయినజీవుని గ్రహించుట సంభ వింపదు. మనము ఒకచెంబు నీటిని సముద్రములోపోసి దానినే మఱల గైకొనవలయుననిన గైకొనగలమా? ఆజలమే మనపాత్రలోనికి వచ్చునను టయు నిశ్చయమా? ఇట్లే కలిసిపోయిన జీవుడే మఱల సంసార సముద్ర మునకు జిక్కుననుటకు గాని, దానిచేత మోక్షమునకు నిత్యత్వమును ఆపా దించుటకు గాని, వీలులేదు. కావున ఎందఱు జీవులు క్రొత్తగా చాంచల్య ప్రభావముచేత పుట్టినను ముక్తులకు పునరావృత్తి కలుగదు. ఈ విధముగ విమర్శించిన ప్రపంచమునకు ఆదియును లేదు. అంతమును లేదు. ఇదియే సిద్ధాంతము. ఇట్లగుటచేత మనస్సు పూర్వాపూర్వ ప్రపంచములను అనుస రించి ఉత్తరోత్తర ప్రపంచములను కల్పింపవచ్చును. "ధాతా యథా పూ ర్వ మకల్పయత్" సృష్టికర్త పూర్వప్రపంచమును అనుసరించియే ఉత్తర ప్రపంచమును కల్పించెను. అను శ్రుతి ఈ విషయమునే స్పష్టము చేయు చున్నది. నీవు అన్నట్లు స్వర్గాదికల్పనకు పూర్వానుభవము ఆవశ్యకమగుట నిశ్చయమే అయినను, దానికి పూర్వప్రపంచము ఒకటి ఉండుటయే చాలు ను. అది యథార్థముగాగూడ నుండవలయునను నియమము ఎక్కడనుండి వచ్చును. సత్యముకాని, భ్రాంతిసిద్ధముకాని, ఒక పదార్థము ఉండుటయే కల్పనకు ప్రధానముకదా. చీకటియందు ఒకమూల త్రాటినిచూచి సర్ప మని భ్రాంతినొందువానివద్దనుండి అప్పుడే "సర్పమనగా ఎట్టిది" అని

సర్పరూపమును క్రొత్తగా గ్రహించిన బాలుడుకూడ మఱియొకమారు వాస్తవ సర్పమును చూచినప్పుడు కాని చీకటియందు త్రాటినే చూచినప్పుడు కాని "ఇదిసర్పము" అని యథార్థాఽయథార్థానుభవములను బొందవచ్చును గదా ? ఈ దృష్టాంతమునందు కేవలభ్రాంతి సంస్కారమే మఱియొక భ్రాంతికి గూడ కారణమగుననుట స్పష్టమయ్యెను. కావున మనస్సుకూడ ఈ విధముగనే పూర్వాపూర్వ ప్రపంచభ్రాంతిని ఆశ్రయించి ఉత్తరోత్తర ప్రపంచమును కల్పింప వచ్చును. ఇట్లుగాక ఒక ప్రపంచము నిత్యమై ఉన్నదనిన అప్పటికెని ఒకపక్షమున పూర్వము చెప్పబడిన దోషములన్నియు వచ్చును. రెండవ పక్షమునందు శబ్దమాత్రముననే వివాదము కలుగును గాని, తాత్పర్యము మాత్రము మాపక్షమునకును నీపక్షమునకును గూడ ఒకటియే అగును. ఎట్లనిన ; "ప్రస్తుత ప్రపంచము మాత్రమే కలదు గాని, దీనికి పూర్వాపర ప్రపంచములు ( కల్పములు, లేక, సృష్టులు ) లేవు" అనిన, వచ్చుదోషములను పూర్వమునందే వివరించి ఉన్నాను. ఇక దీనికే ఉత్పత్తి వినాశములు లేవనిన నేను చెప్పునదియు నదియే కదా ? "మీరు ప్రపంచమునకు నాశమును ఒకదానిని అంగీకరించుచు, పూర్వ ప్రపంచానుసారముగ ఉత్తర ప్రపంచము కల్పింప బడుచున్నది, అనుచున్నారు గదా" అనియెదవేమో, అది నిశ్చయమే. ప్రత్యక్షసిద్ధమగు విషయమును నీవుమాత్రము ఎట్లు నిరాకరింపగలవు ? లోకమునందు సర్వపదార్థములకును ప్రత్యక్షముగ వినాశము గానవచ్చుచున్నది. ఇట్లుండగ ప్రపంచమునకు నాశము లేదని ఎట్లు సాధింపగలవు ? వాస్తవస్థితిలో ప్రపంచమనగా, విస్తారము. బ్రహ్మాభిన్నముగ తోచునది యంతయు ప్రపంచమే. ఉత్పత్తియు ప్రపంచమే. స్థితియు ప్రపంచమే. లయమును ప్రపంచమే. కావున ఎట్లుచూచినను సత్యమగు ప్రపంచము ఒకటి కలదనుటయు స్వప్నకల్పిత పదార్థములు దాని ఆధారముచేతనే మనస్సుచేత గల్పింపబడుననుటయు అవిమాత్రము సత్యములనుటయు యుక్తిశూన్యవాదము. మఱియు అసత్యములగు స్వప్నకల్పిత పదార్థములకు మనస్సు కారణమైన అదియును అసత్యమే కావలసివచ్చును. కార్యకారణములకు అభేదము ప్రత్యక్షసిద్ధము అగుటచే సత్యపదార్థమునుండి పుట్టినవి అసత్యములు కానేరవు కదా ? ఇట్లైన ఇక సత్యప్రపంచమునకు కారణము ఎయ్యది ? బ్రహ్మమా? లేక, మఱియొకటియా? బ్రహ్మమే అనినచో అసత్య ప్రపంచ కారణమగు మనస్సు సత్యప్రపంచములోనిదా ? లేక అసత్య ప్రపంచము

లోనిదా ? కాక అన్యమా ? అను ప్రశ్నములు వచ్చును, సత్యప్రపంచము లోనిదే అనిన అప్పుడు సత్యప్రపంచమునకుగూడ మనస్సే కారణము కావలసి వచ్చును. అసత్యప్రపంచములోనిదే అనినచో " ఆమనస్సునకు కారణము ఏది " అను ప్రశ్న వచ్చును. పరమేశ్వరుడు ఏకరూపుడగుటచేత ఆయనయే అన్నిటికిని కారణము కావలయుననుట నియమము కదా ? కావున ఆ ప్రశ్నమునకు ఈ నియమమును ఆశ్రయించియే " మనస్సునకు పరమేశ్వరుడే కారణము " అనిన అప్పుడు పరమేశ్వరుడు నిత్యుడగుటచేత ఆయనతో అభిన్నమగు మనస్సును దానివలన పుట్టినదని చెప్పబడు అసత్యప్రపంచమునుగూడ సత్యమే కావలసి వచ్చును. ఈ పక్షమునుకూడ వదలిన ఇక సిద్ధాంతమునకు మార్గమే లేదు కదా. ఇట్లు కాక " మనస్సు ప్రత్యేకమగు స్వతంత్ర పదార్థము " అని మూడవపక్షమును సాధింపజూచిన అది ఎట్లును సరిపడదు. మనస్సు సత్యమైనచో బ్రహ్మమగును. అసత్యమైనచో శూన్యమగును. శూన్యమగుదానినుండి ఒకటి పుట్టుటయే అసంభవము. కావునను, సత్యమునుండి పుట్టిన సత్యమే కావలసి వచ్చును. కావునను, ఏపక్షమును ఆశ్రయించినను అసత్యప్రపంచము అనునది సిద్ధింపనే సిద్ధింపదు. " శూన్యమునుండి పుట్టినది సత్యము కాకపోయినను శూన్యము కావచ్చును. స్వప్నకల్పిత పదార్థాదులు శూన్యములగుట నాకు సమ్మతమే " అనియెదవేమో, అప్పుడు ఆపదార్థములు బొత్తిగ లేకుండవలయునే కాని, ఉన్నట్లు తోచుటయైనను సంభవింపదు. స్వప్నకల్పితాది పదార్థములు అట్టివికావు కదా. " ఇట్లననేల ? భ్రాంతియందు లేనిపదార్థము తోచుచున్నదికదా " అనియెదవేమో, అచ్చట ఆధారమగు పదార్థము సత్యము. దానియందు తోచు పదార్థమును దానికంటె అన్యము. ఇచ్చట అన్ననో, అట్లులేదు. ఒకవేళ సత్యప్రపంచము అనునది దానికి ఆధారమన్నను, అది ( అసత్యప్రపంచము ) ఆధారభిన్నరూపము కాకపోవుటచేత ప్రస్తుత సందర్భము భ్రాంతికానేరదు.

కావున ఎటుచూచినను ప్రపంచము ఒకటియే కాని, దానియందు సత్యాసత్యభేదములు లేవు. జనులు అజ్ఞానులై కేవలము బాహ్యవిషయములందు మాత్రమే చిత్తస్థైర్యము కలిగియుండుటచేత, వానినిచూచినంత బాగుగ స్వప్నకల్పిత పదార్థాదులను జూడలేక, అవి అల్పకాలము మాత్రమే తోచి అంతర్ధానము అగుటచేత వానిని అసత్యములుగభావించుచున్నారు. ఇంతకంటె విశేషము ఏమియు లేదు. పైన జెప్పిన ఇతిహాసము

నందు ఏకాగ్రనిష్ఠ గలవారికి స్వప్నకల్పిత పదార్థములుకూడ సత్యములే అగుననుట నిరూపింపబడెను. ఇట్లుగాక " సత్యప్రపంచమునకుగూడ బ్రహ్మాభిన్నమగు ఇతరపదార్థమే కారణము " అనిన అప్పుడు వచ్చు దోషములు " మనస్సు బ్రహ్మాభిన్నమగు స్వతంత్ర పదార్థము " అను పక్షమును ఖండించునప్పుడే నిరూపింపబడెను. కావున బాగుగ విచారించిన ప్రపంచమనునది ఒకటియే. అది అనాది. అనంతము. పరబ్రహ్మమునుండియే పుట్టినదగుటచేత ఎప్పటికిని అట్లే యుండును. సర్వప్రపంచకారణము మనస్సే. అది పరమాత్ముని చాంచల్యమే. దానికి భ్రాంతియే స్వరూపము. ఇట్లగుటచేత ప్రపంచమంతయు భ్రాంతికల్పితమే. పూర్వపూర్వ భ్రాంతిని ఆశ్రయించి ఉత్తరోత్తర భ్రాంతి కలుగుచుండును. స్వర్గాది పరలోకములును అందలి అనుభవములునుకూడ ఇట్టివే. మృతిజెందువానికి తాను ఉన్నచోటనే స్వర్గము. అచ్చటనే నరకము. అచ్చటనే రెండవ జన్మము. కావున చిత్తము ఏకాగ్రస్థితిని చెందవలయును. అంతియకాని, ఎవ్వడు దేనిని సంకల్పించినను వాడు ఆయారూపమును జెందుననుటలో ఇంచుకయైనను సంశయము లేదు.

ఓరఘురామా ! ఈకారణమువలన ఏకాగ్రచిత్తము కలవాడగుటచేత అసన్న్యాసియొక్క జీవుడు సంకల్ప పరంపరలవలన రుద్రరూపమును జెందెను. మధ్యజన్మములన్నియును వివేకవంతములు కాకపోవుటచేత వానియందు చిత్తమునకు ఏకాగ్రస్థితి దొరుకలేదు. మరణకాలమునం దన్ననో, చిత్తము ప్రస్తుత జన్మవిషయములను అన్నిటిని పరిత్యజించి ఉత్తరజన్మమునుగూర్చి ఏకాగ్రతతో భావించుననుట స్వాభావికము. కావున జన్మపరంపరలు కలుగుటలో అవివేకము ఎట్లును విఘ్నకారి కానేరదు. ప్రపంచ వ్యవహారములందు ఉండి ప్రారబ్ధకర్మము చేయు బలవంతమగు ప్రేరణను నిగ్రహించి మనస్సును అన్యవిషయమునందు ఏకాగ్రము చేయవలయు నన్నప్పుడే కదా, ఈ అవివేకము అందులకు ఆటంకమగును. కావున ఆభిక్షుక జీవునకు రుద్రరూపము వచ్చునంతవరకు సంకల్పసిద్ధి కలుగలేదు. రుద్రుడు మహాప్రభావ సంపన్నుడు కావున దేనియందనిన దానియందు మనస్సును ఏకాగ్రము చేయగలడు కదా ? కావున ఆరుద్రునియొక్క సంకల్ప ప్రభావముచేత సన్న్యాసియొక్క సంకల్పమువలన బుట్టిన జీవటాది జీవులందఱును గూడ రుద్రులేయైరి. వారు ఒక్కొక్కడు ఒక్కొక్క ప్రపంచమును సృష్టించుటకు సామర్థ్యమునుగూడ నొందిరి. ఈవిధముగ భిక్షువుయొక్క సం

కల్పమువలన పుట్టిన జీవట బ్రాహ్మణాదులందఱును రుద్రునకు గల మహా
జ్ఞానమువలన దివ్యజ్ఞానవంతులై సంకల్ప సిద్ధులై తమతమ సంకల్పములవలన
పుట్టినపట్టణమునకు బోయిరి. కాలక్రమమున రుద్రునితో సహవాసముచేసి
ముక్తిని జెందిరి. ( రుద్రలోకమునుజేరి అక్కడినుంచి రుద్రునితో కూడ ము
క్తులైరనుట) అని వశిష్ఠమహర్షి చెప్పిన విని శ్రీరామచంద్రుండు సంశయ
ముగలవాడై ఇట్లనియె.

ఓవశిష్ఠ మహాముని ! ఇది ఏమిచిత్రము ? సంకల్పము వలన పుట్టినప
దార్థములు ఎందైనను సత్యములగుట కలదా ? ఇట్లుండగ సన్యాసియొక్క
సంకల్పమువలన పుట్టిన జీవటాదులు ఎట్లు సత్యరూపులైరి. అనిన విని వశిష్ఠ
మహాముని ఇట్లనియె. ఓరామభద్రా ! ఇందు చిత్రము ఏదియును లేదు.
విష్ణుమూర్తియొక్కడే అయ్యును అనేకసహస్రసంఖ్య గల రూపములను
జెంది ప్రపంచమును ఎట్లు బహువిధములుగ పరిపాలన చేయుచున్నాడో,
అట్లే సత్య సంకల్పులగు మహాత్ములు తమ సంకల్ప ప్రభావముచేత బహువి
ధములగు రూపములను ఒక్కమాఱే ధరించి పరస్పరభిన్నములగు బహు
కార్యములను ఆచరింతురు. ఆరూపములన్నియు సత్యములవలె గానవచ్చు
టయే కాని, యథార్థములు కావు. ఆరూపములే అననేల? సత్యమని తలం
పబడుచుండు రూపము ( సంకల్పములను చేయుచున్నది అని చెప్పబడు
రూపము ) గూడ బాగుగ విచారించిన అసత్యమే కదా ? కావున ఈవిష
యమునందు అంతగా సంశయింప వలసినపనిలేదు.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున శతరుద్రోపాఖ్యానమను
ముప్పదినాలుగవ సర్గము ముగిసెను.

—(*)—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడగు భరద్వాజునితో ఇట్లనియె. ఓభార
ద్వాజా ! ఈవిధముగ " జన్మపరంపరలు కేవల సంకల్ప జన్యములే "
అనువిషయమును స్పష్టము గావించి వశిష్ఠమహాముని మఱల ఇట్లనియె.

—* సుషుప్త మౌన లక్షణ ప్రయోజనములు. *—

ఓ రఘురామా ! ప్రాపంచిక విషయములయందు మనస్సును బో
నీక వ్యవహారములును ఆచరించుచున్నను ఆత్మతత్వమునుండి మనస్సును మ
ఱలింపక సుషుప్త మౌనమును ఆశ్రయించి నిర్వికారుడవై నిలువుము. అనిన

శ్రీరామచంద్రుం డిట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా ! వశిష్ఠమహాముని ! వాఙ్మౌనము, ఇంద్రియమౌనము, కాష్ఠమౌనము, అనునవి నాకు దెలియును. ఇవిగాక సుషుప్తమౌనమనగా, ఎద్ది ? దాని స్వరూపము ఎట్టిది ? దయచేత ఆనతిండు. అనిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓరామచంద్రా ! మహాత్ములందఱును మునులను రెండువిధములు గలవారినిగ అభివర్ణించుచున్నారు. అందు ఒకఁడు కాష్ఠమౌని, రెండవవాడు జీవన్ముక్తుడు. ఈతడే సుషుప్తమౌని. అందు ఎవ్వడు ఆత్మభావన ఇంచుకయైనను లేక, పురుషార్థము నొసంగలేని కర్మయందు దృఢమగు పట్టుదల కలిగి తత్సాధనమునకై మొఱటుతనముతో ఎట్లెట్లో ఇంద్రియములను చిక్కబట్టి కూర్చుండునో, వాడు కాష్ఠమౌని. ఇట్లుగాక, ఏమహాత్ముడు ఆత్మజ్ఞానము కలిగి ప్రపంచస్వభావమును ఎఱిగి లోకులతోబాటు సర్వవ్యవహారములను ఆచరించు చున్నను, మనస్సునందు మిక్కిలి తృప్తిని వహించియుండునో, అట్టివాడు జీవన్ముక్తుడు. ఈతడే సుషుప్తమౌనమును ఆశ్రయించినవాడు. ఇట్లు వర్ణింపబడిన ఈ ఇరువురును శ్రేష్ఠులే. కాష్ఠమౌని సిద్ధుడుకాకున్నను, శీఘ్రకాలములో సిద్ధినొందగలవాడే. ఏవిధముగనైనను, చిత్తమును, ఇంద్రియములును, ఒక విషయమునందు నియతములై యుండుటయే పురుషార్థ సౌధారోహణమునకు ప్రథమసోపానము కదా ? కావున వీరిరువురకును మౌనము కలదు. అది నిశ్చయరూపమగు సంకల్పమే అని తెలిసికొనుము. కాష్ఠమౌనికి కర్మ విషయములందును జీవన్ముక్తులకు బ్రహ్మవిషయములందును నిశ్చయ సంకల్పములు కలవు కదా ? ఆసంకల్పమే వాగ్విషయమై ఉండునేని అనగా " ఇక మాటలాడకూడదు " అను సంకల్పము స్థిరమగునేని అది వాఙ్మౌనమగును. అట్లే అది ఇంద్రియవిషయమై ఉండునేని అనగా " ఇంద్రియములను కదలింపరాదు " అను సంకల్పము నిశ్చయమగునేని అది ఇంద్రియ మౌనమగును. అదియే పరులవిషయమునందు స్థిరమగునేని అనగా " ఇక మనము ఏపనినికాని చేయకూడదు " అను సంకల్పము దృఢమగునేని అది కాష్ఠమౌనమగును. ఈమూటియందును ప్రాపంచిక సంకల్పములకు హానిలేదు. వీనివలన కొంత ఏకాగ్రత మాత్రము అభ్యాసము అగుననుట నిశ్చయమేకాని, సంసార నాశము మాత్రము కలుగదు. కావున వీనిని ఆశ్రయించినవాడు కాష్ఠమునియే అగునుకాని, సిద్ధుడగు జీవన్ముక్తుడు కానేరడు. కావున జీవన్ముక్తులకు గల స్థితి సుషుప్తమౌనమని వేఱుగ జెప్ప నక్కఱలేదు కదా ? కావున దాని స్వరూపము చెప్పెదను వినుము. పైన వర్ణించిన విధముగ

అదియు నిశ్చయ స్వరూపమే అనుటలో సంశయము లేదు. అయినను ఆని
శ్చయమునకును తక్కిన నిశ్చయములకును గల భేదమును గూర్చి కొంత వివ
రింప వలసి యున్నది. వాఙ్మానాదులయందు గల నిశ్చయములు దేశకా
లాది విభాగమును ఆశ్రయించి ఉండును. పురుషుడు ఆనిశ్చయములయొక్క
జాగ్రదవస్థయందు మాత్రమే చేయగలడనుట సర్వలోక ప్రసిద్ధము. నిదు
రవలన దేహము పరవశత్వమును పొందినప్పుడు పురుషుడు వాఙ్మానాదు
లను ఎట్లు నిశ్చయింపగలడు ? సుషుప్తమాత్రమునకు సంబంధించిన నిశ్చ
యము అట్టిది కాదు. దీనికి దేశకాల నియమములతో పనిలేదు. ఇది బ్రహ్మ
మునుగూర్చిన నిశ్చయము కావునను, ఆబ్రహ్మము ఆత్మరూపమే అగుటచే
తను, ఇది సర్వకాలములయందును ఏకరూపముతోనే ఉండును. నిదురించు
చున్నను మేలుకొని ఉన్నను ఎవ్వడుగాని తన్ను దాను మరువడు కదా ?
మఱియు వాఙ్మానాదులయందలి నిశ్చయములు కుదురుటయుకుదిరిన పిమ్మట
నిలుచుటయు నిలిచినను దానిచేత సాధింపబడిన పనియు ( మాటలాడకుం
డుట మొదలగునవియు ) కష్టసాధ్యములు. దేహమునకు శ్రమను కలిగించు
నవి. ప్రస్తుత బ్రహ్మ నిశ్చయము అట్టిది కాదు. ఇది పరమానందకరమైనది.
వాఙ్మానాదులయందు తనకంటె భిన్నమగు విషయములనుగూర్చి మనస్సును
నిశ్చలము చేయవలయును. బ్రహ్మము ఆత్మభిన్నము కాదు. ఇట్లుండగ ఆబ్ర
హ్మమునందు మనస్సును ఏకాగ్రము చేయుట ఏమికష్టము. ఇదియునుగాక
ఆవాఙ్మానాదులయందలి నిశ్చయములకు ఆద్యంతములు కలవు. ఆనిశ్చయ
ములు ఒకప్పుడు లేకుండుటయు, ఒకప్పుడు ఆరంభమగుటయు, కొంతకాల
మునకు నశించుటయు, అనునవి లోకానుభవ సిద్ధములై ఉన్నవి. బ్రహ్మ
నిశ్చయము అట్టిదికాదు. బ్రహ్మము ఆత్మయే. కావున ఆబ్రహ్మ విషయక
మగు నిశ్చయము సర్వకాలములయందును ఏకరూపముగా నుండునదియే.
జ్ఞానుడైనను, ప్రతివాడును తన విషయమునందు నిశ్చయమును పొందియే
యున్నాడు. " నేను ఉన్నాను " అను నిశ్చయము ఎవ్వనికైనను, లేకున్న
దా? కావున బాగుగ విచారించిన " నేను బ్రహ్మమునకంటే వేఱు, అను
భ్రాంతి ఒక్కటియే విశేషముకాని, ఆత్మనిశ్చయము ఎప్పటికిని ఉన్నదియే.
కావున వాఙ్మానాది నిశ్చయములకు వలె ఈబ్రహ్మ నిశ్చయములకు ఆద్యంత
ములు లేవు. ఇవి అన్నియు గాక ఈరెండు విధములగు నిశ్చయములకును
విచిత్రమగు మఱియొక భేదము కలదు. ఆవాఙ్మానాది విషయక నిశ్చయ
ములు పురుషుడు తమవైపునకు మఱలియున్నప్పుడు మాత్రమే నిలిచి యుం

డును. బ్రహ్మనిశ్చయముఅన్ననో, అట్లు కాదు. సాధకుడు సంసారాభిము
ఖుడై బాహ్యదృష్టితో ఉన్నను, అంతర్ముఖుడై యున్ననుగూడ ఏకరూప
ముతోనే ఉండును. ఎన్నివ్యవహారములు చుట్టుకొనినను, తన్ను తాను మఱ
చువాడు ఎవ్వడును ఉండడుకదా ? కావున ఓరఘుకులతిలకా ! శ్రీరామా!
కాష్ఠమౌనాదులకును ఈసుషుప్తమౌనమునకును భేదము అనంతముగ
గలదు. బాగుగ విచారించి చూచిన స్వభావసిద్ధమగు ఆత్మనిశ్చయమే
సుషుప్తమౌనము. ఈ ప్రపంచముయొక్క స్థితి ఉన్నదానిని ఉన్నట్లు తెలిసి
కొనియుండుటయే సుషుప్తమౌనము. తాను సాక్షియగుట దెలిసికొని ప్ర
పంచ దుఃఖములతో దనకు సంబంధము కలదని దలంచు సందేహమును
విడుచుటయే సుషుప్తమౌనము. ఇది యంతయును పరమేశ్వరుడే. ఆయన
ఒక్కడే బహుభేదములతో గానవచ్చు చున్నాడు. ఆయనయే నేను. అను
నిశ్చయము ఏదికలదో అదియే సుషుప్తమౌనము. ఈప్రపంచమంతయు
బ్రహ్మరూపమగు చిదాకాశమే. ఆ జ్ఞాన ప్రభావము వలన ఒక్కపదార్థ
మే ఇట్లు అనేకవిధములుగా దోచుచున్నది. త్రాటిని జూచి సర్పమని
తలంచునట్లు బ్రహ్మమును చూచి ప్రపంచమని తలచు చున్నాను. కావున
ఇదియంతయును ఆకాశమే. ఆకాశమునకు స్వాభావికములు కాని రూ
పాదులు ఇచ్చట కానవచ్చు చున్నవి. కావున దీనిని ఆకాశము అనుటకును
వీలు లేకున్నది. ఇదియే అజ్ఞానముయొక్క ప్రభావము. మఱియు దీనికి
ఆధారమగు బ్రహ్మము సత్యము. కావున ఇదియు సత్యమే అనవలయును.
కల్పితమగుటచేత అసత్యమనియు జెప్పవలసి వచ్చుచున్నది. ఇట్లు ఈప్రపం
చము అనిర్వాచ్యము. ( కలదనికాని, లేదనికాని, నిర్ణయించుటకు వీలులేనిది
అనిర్వాచ్యము ) ఎట్లైనను ఇది బ్రహ్మభిన్నము కానేరదు. అను ఈనిశ్చ
యమే సుషుప్తమౌనము. ఇట్టి ఈసుషుప్తమౌనమును రెండు విధములగు
యోగులు సంపాదించు చున్నారు. అందు ఒక తెగవారు సాంఖ్యులు.
రెండవ తెగవారు యోగులు. సాంఖ్యులనగా, పరమాత్మ విషయకమగు
చక్కని జ్ఞానమును సంపాదించి చిత్తమును ఏకాగ్రము గావించి ఉండు
వారు. వారు " దేహాదిపదార్థములు ఇవి. ఈశ్వరుడు ఈపదార్థములకం
టె ఆవలివాడు. బాగుగా విచారించిన ఇవి అన్నియుగూడ ఈశ్వరుడే "
అని సంఖ్యచేతనే జ్ఞానము నొందుదురు. కావున వారికి సాంఖ్యులని పేరు
వచ్చెను. యోగులనగా, ప్రాణ నిరోధమును ఆశ్రయించి చిత్తమును స్థిర
ముగావించి ఆద్యంతశూన్యమును సర్వవికార రహితమును నగు పరబ్రహ్మ

మును ఎఱిగినవారు. యోగశబ్దమునకు జ్ఞాన, ప్రాణాయామములు రెండును అర్థములే అయినను ప్రాణాయామము ముఖ్యార్థమని ఇదివరకే చెప్పియున్నాను. కావున ప్రాణాయామమే యోగమగుటచేత దానిని ఆశ్రయించినవారు యోగులైరి. మొత్తముమీద జ్ఞానమార్గమును ఆశ్రయించినను, యోగమార్గమును ఆశ్రయించినను, పోవలసినస్థలము ఒకటియే. సాంఖ్యులైనను యోగులైనను కట్టకడకు జన్మ మరణ శూన్యమును స్వతస్సిద్ధమును అగు ఆబ్రహ్మమునే చెందుదురు. సంసారములను వలచేత పట్టుబడి ప్రాణమనోవృత్తులు సర్వకాలములయందును గిజగిజ లాడుచున్నవి. ఎడతెగక పనిచేయుచున్నవి. ఇట్టి ఈప్రాణ మనస్సులు ఏస్థలమునందు విశ్రాంతములగునో, అదియే పరబ్రహ్మమని ఎఱుగుము. వాస్తవస్థితిలో మనస్సను ఒకపదార్థమే లేదు. అది కేవలము కల్పితమే. స్వప్నమునందు కలుగు మరణ భ్రాంతివలె ఈమనోభ్రాంతియు గలుగుచున్నది. విచారింపలేకపోవుటచేత బ్రహ్మమునే మనస్సునుగా భావించు చున్నాము. వాసనలు కలవనుటయు వానికి జిక్కి మనస్సు బ్రహ్మాభిన్నముగ ప్రపంచమును కల్పించుచున్నది. అనుటయు లోకమును ఉద్ధరించు నిమిత్తముగ లోకస్థితిని అనుసరించి చేయబడు బోధయొక్క ఉపక్రమమే కాని, వేఱుకాదు. మనస్సను పదార్థము ఒకటి బ్రహ్మాభిన్నముగ ఉండెనేని అది ఎన్నటికైనను, తనకార్యమును వీలమానును. బ్రహ్మప్రాప్తి కలిగిన కలుగనిమ్ము. ఇంతమాత్రముచేత మనస్సునకు ఏమివచ్చెను. ఆనందముయొక్క అనుభవమునకై ఆపరబ్రహ్మమును ఆశ్రయించునంటివేని అప్పుడును తనచేష్టలను విడువ నక్కఱలేదు. ఒకక్షణము ఆనంద పరవశత్వముచేత అట్లువిడచినను, అనంతరక్షణముననే దానిని గైకొనవచ్చును కదా ? కావున ఎట్లుచూచినను మనస్సు బ్రహ్మాభిన్నమై ఉండిననేకాని, అందు ఉపశాంతి నొందనేరదు. అప్పుడు భ్రాంతివలన బ్రహ్మాభిన్నముగ దోచునప్పుడు సర్వచేష్టలును ఉండవచ్చును. ఆభ్రాంతి తొలగిన పిమ్మట పారమార్థికమగు బ్రహ్మాభేదము తేటపడుటచేత సర్వచేష్టలను విడువవచ్చును.

ఓ రఘురామా ! ఈకారణమువలన బాగుగా విచారించిన ఏకరూపమగు పరబ్రహ్మమును ఆత్మగభావించి దృఢాభ్యాసము చేయుటయు, దానిచేత ప్రాణమనోవృత్తులు అణగుటయు, అనునదియే మోక్షము. మఱి ఒకవిశేషము. పైన వర్ణింపబడిన మూడును అనగా, బ్రహ్మధ్యానాభ్యాసము, ప్రాణలయము, మనోనిగ్రహము, అను మూడును సిద్ధించుటకై

ప్రత్యేకముగ ప్రయత్నింప నక్కఱలేదు. ఇందు ఏది సుఖముగా తోచిన దానినే అవలంబింప వచ్చును. దానియందు సంపూర్ణ సిద్ధిగలిగిన తక్కినవియు, పరిపూర్ణముగ సిద్ధించును. అందు బ్రహ్మప్రాప్తి ఫలమునకు ప్రాణ మనో నిరోధములు సాధనములు. అందు ప్రాణ మనస్సులు రెండును ఎప్పుటికిని పరస్పరము విడిచియుండునవి. కావు. "పువ్వు వాసనయు వలె" ఎప్పుడును ఒండొంటితో కలసి ఉండును. "నువ్వులలోని నూనెవలె" ఐక్యము నొందియుండును. ఒకదానిపై నొకటి ఆధారపడి ఉండును. ఇట్లగుటచేత అందొకటి నశించిన రెండవది యుండదు. కావున ఒకదానిని నాశనము చేయుటకే ప్రయత్నించిన చాలును. ఈవిధముగ రెండును నశించెనేని మోక్షమను లోకోత్తమఫలము కలుగును. కావున మోక్షార్థియగువాడు సంకల్పనాశము అగునంతవరకు ఏకరూపమగు పరబ్రహ్మ తత్త్వమును గూర్చిన సంకల్పములనే చేయుచుండ వలయును. అట్లు చిరకాలము అభ్యాసము జరుగునేని ఆమనస్సు బ్రహ్మరూపమే అగును. బ్రహ్మభిన్నమగు పదార్థము ఎప్పుడు మనస్సునకు తోచకుండునో అప్పుడే దానికి బ్రహ్మరూపము కలిగనని తెలిసికొనుము.

## —* భేతాళోపాఖ్యానము. *—

ఓ శ్రీరామచంద్రా ! ఈప్రస్తావమువలన నాకు భేతాళునిప్రశ్నలు జ్ఞప్తికి వచ్చినవి. అవి సంసారముయొక్క భ్రాంతి మయత్వమును బోధించునవియై ఉన్నవి. ఆప్రశ్నలను వివరించెదను వినుము. వింధ్యపర్వతముయొక్క ప్రాంతమునందలి అరణ్యమునందు అతిదీర్ఘకాయుడగు ఒక భేతాళుడు నివసించుచుండెను. వాడు మనుష్యులను, సంహరించి భక్షించు ఉద్దేశముతో ఒక దేశమునందు ప్రవేశించెను. అచ్చట సత్పురుషులకు నివాసమగు ఒకానొక పట్టణమునకు సమీపమునందు ఉన్న అరణ్యమున కాపురము ఉండెను. ఆపురములోనివారు అందఱు వానికి భయపడి అనేకవిధములగు కానుకలను సమర్పించుచు ప్రతిదినమును తృప్తిని కలిగించు చుండిరి. ఇట్లు నిత్యతృప్తుడై బహుకాలము అచ్చటనే ఆభేతాళుడు నివసించి ఉండెను. ఆసమయములయందు వాడు నిరపరాధియగు పురుషుడు తన ఎదటికి వచ్చిన తనకుకొంత ఆకలిగా ఉన్నను వానిని హింసించు వాడు కాడు. ఏదియో ఒకకారణమును కల్పించికాని, ఎవ్వరిని హింసింపడు. సత్పురుషులు ఎన్నటికిని న్యాయమార్గమును అతిక్రమించువారు కారుకదా ? తర్వాత ఒకానొకప్పుడు బలవంతమగు ఆకలిచేత బాధింపబడి ఒక్కనాడు ఆ అర

ణ్యామునుండి బయలుదేరి మఱియొక పట్టణము వద్దకు వచ్చెను. అప్పటికిని వానిమనస్సు న్యాయమార్గమును అతిక్రమింపలేదు. ఎదటికి వచ్చినవాని నెల్ల అక్రమముగా హింసింపవలయునను ఉద్దేశము వానికి కలుగలేదు. ఇట్లు ఆపురమునందు ప్రవేశించునప్పటికి అర్థరాత్రమాయెను. ఆసమయమునందు ఆపట్టణమును పాలించు ప్రభువు రాత్రిసంచారమునకై పట్టణములోనికి వచ్చి తిరుగుచుండెను. వానిని జూచి మేఘధ్వనివంటి గంభీరధ్వనితో ఆభేతాళుడు ఇట్లనియె. ఓ ఓ రాజా ! నేను భేతాళుడను. సర్వజనులకును భయంకరుడను. నీవు నాకు చిక్కితివి. ఇక ఎందు పోగలవు. ఇప్పుడే నిన్ను భక్షింతును. అని చెప్పిన ఆప్రభువు ఇట్లనియె. ఓరాక్షసుడా ! అన్యాయముగ నన్ను నీవు కేవలము బలగర్వముచేత భక్షింతువేని అప్పుడు నీశిరస్సు వేయి వ్రక్కలగును. ఇందుకు సంశయము లేదు. అనిన భేతాళుడు ఇట్లనియె. ఓమహారాజా ! నిన్ను నేను అన్యాయముగ హింసింపను. ఒక న్యాయమును చెప్పెదను వినుము.

## —* భేతాళుని ప్రశ్నలు. *—

ఓ భూపాలా ! నీవుమహారాజవు. యాచకులయొక్క కోరికలను తీర్పవలసినవాడవు. కావున నేను అడుగబోవు ప్రశ్నములకు ఉత్తరము ఇవ్వవలయును.

శ్లో॥ కస్యసూర్యస్య రశ్మీనాం బ్రహ్మాండాని కృశాణవః ।
కస్మింస్ఫురంతి పవనే మహాగగన రేణవః ॥

(౧) ఓ రాజా ! ఈబ్రహ్మాండములు ఏసూర్యుని కిరణములకు పరమాణువులు ( ఒకసన్నరంధ్రముగుండ సూర్యకిరణములు గృహములోనికి ప్రవేశించినప్పుడు వానిని చక్కగ పరిశీలించినచో నడుమ నడుమ సన్నని రేణువులవంటి పదార్థములు కానవచ్చును. అవియే పరమాణువులని తెలిసికొనవలయును.) (౨) ఓ రాజా! ఈ మహాకాశములన్నియు ధూళివలెనే ఏమహావాయువునందు ఆడుచున్నవి.

శ్లో॥ స్వప్నాత్స్వప్నాం తరంగచ్ఛన్శతశోథ సహస్రశః ।
త్యజన్నత్య జతిస్వచ్ఛం కఃస్వరూపం ప్రభాస్వరమ్ ॥

(౩) ఓ రాజా! ఏమహాత్ముడు ఒకకలనుండి మఱియొక కలనుజెందుచు వేలవేలుపూటలు సంచరించుచు ఉన్నను, ఆసమయములయందు తాను క్రొత్తవాడగుచు ఉన్నట్లే ఉన్నను, ప్రకాశమానమగు తన స్వరూపమును విడువకున్నాడు.

శ్లో॥ రంభా స్తంభో యథాపత్ర మాత్రమేవ పునఃపునః ।
అంతరంత స్తథాంతశ్చ తథాకోణు స్వపవహీ ॥

(౪) ఓ రాజా! అరటిచెట్టు విచారించి చూచిన ఎట్లు అంతయు ఆకులే అగుచున్నదో, అట్లే విచారించిన ఈ ప్రపంచమంతయును ఎవ్వనిరూపముగఉన్నది.

శ్లో॥ బ్రహ్మాండాకాశ భూతౌఘ సూర్యమండల మేరవః ।
అపరిత్యజతో ణుత్వం కస్యాణోః పరమాణవః ॥

(౫) ఓ రాజా! బ్రహ్మాండములు,ఆకాశము,పంచభూతములు, సూర్యచంద్రాది మండలములు, మేరువు, మొదలగునవి అన్నియు ఏఅణువుయొక్క పరమాణువులు (కొన్నిపరమాణువులు కలసికాని అణువు కానేరదని తెలిసికొన వలయును.

శ్లో॥ కస్యానవయ వస్యైవ పరమాణు మహాగిరేః ।
శిలాంతర్నిబిడైకాంత రూపామజ్జా జగత్రయీ ॥

(౬) ఓ రాజా!అవయవములు లేక,సర్వప్రపంచమునందును వ్యాపించి సూక్ష్మమై ఉన్న పరమాణువైన ఏమహాపర్వతముయొక్క రాళ్ళనడుమ బ్రహ్మాండములను బురద నిలచియున్నది ? ఓ శ్రీరఘురామా ! అని ఈవిధముగ ప్రశ్నింపగానే ఆరాజు నవ్వి తనదంతకాంతిచేత ఆకాశమెల్ల స్వచ్ఛమగుచుండ ఇట్లని ఉత్తరము ఇవ్వ నారంభించెను.

—※ భేతాళునియొక్క ప్రశ్నములకు ఉత్తరములు. ※—

(౧) ఓ భేతాళా! జ్ఞానరూపుడగు సూర్యుడు సర్వకాలములయందును ఉదయించియే యున్నాడు. ఇది సర్వజనులకును ప్రత్యక్షమే. సాక్షికలదు అనువిషయమును ఎఱుగనివాడు ఎవ్వడు ? ఈతడే సర్వమును ప్రకాశింపజేయుచున్నాడు. ఈతడే సర్వప్రసిద్ధుడగు జీవుడు. ఈతడే తేజోవంతుడును లోకోత్తరుడు నగు పరమాత్మ. ఈతడే మనస్సునకు మూలకారణభూతుడు. ఈ ప్రపంచ విస్తారములన్నియును ఆ సూర్యునియొక్క కిరణమునకే రేణువులై యున్నవి. సూర్యకిరణముయొక్క కాంతిచేతనే అందలి రేణువులు ఎట్లు ప్రకాశించుచు చలించుచున్నవో, అట్లే ఈ ప్రపంచములును ఆత్మసూర్యునియొక్క కిరణముల సహాయముల చేతనే చలించుచు ప్రకాశించుచునున్నవి. (౨) కాలముయొక్క ఉనికియు (కాలముకలదు. అను వ్యవహారమునకు కారణము ) ఆకాశముయొక్క ఉనికియు చాంచల్యముయొక్క ఉనికియు, కేవలము జ్ఞానమయమైయుండు శుద్ధచైతన్యముయొక్క

ఉనికియు, మఱియు గల తక్కిన పదార్థములయొక్క ఉనుకులును (ప్రపంచ మంతయు) పరమాత్మ అనెడు వాయువునందు రేణువులవలె పుష్పమునందు ఉన్న పరాగములయొక్క కణములవలె దిరుగుచున్నవి. (౩) మఱియును ఆ పరబ్రహ్మమే ప్రపంచమను పేరుగల పెద్దకలయందు జన్మ పరంపరా రూపములైన చిన్నచిన్న కలలను లెక్కకు మిక్కిలిగ గాంచుచున్నను, పరమశాంతమగు స్వస్వరూపమును విడువదు. అది సర్వసాక్షియగుటచేత ఎన్నివృత్తాంతములు జరుగుచున్నను దానికి వానితో సంబంధము లేదు.(౪) అరటిచెట్టు విచారించిన అంతయును ఎట్లు ఆకులుగా మాత్రమే ఉన్నదో, అట్లే ఈ ప్రపంచముకూడ బ్రహ్మముగా మాత్రమే ఉన్నది. అనులే స్తంభముగ గానవచ్చుచున్నట్లు బ్రహ్మమే ప్రపంచముగా గానవచ్చుచున్నది. (౫) అతిసూక్ష్మరూపుడగుటచేతను, అవాఙ్మానసగోచరుడగుటచేతను, పరమాత్మ పరమాణువై ఉన్నాడు. ఆద్యంతములు లేనివాడగుటచేత సర్వప్రపంచమునకును మేరుపర్వతాదులకును గూడ ఆదికారణ భూతుడయ్యెను. ఆధార భూతుడుకూడ అయ్యెను. ఈ కారణమువలన ఆ పరమాత్మను గ్రహించి చూచునప్పుడు ఈమేరువుమొదలగునవి పరమాణువులవలె ఉన్నవి.(౬) ఈపరమాత్ముడే అవాఙ్మానస గోచరుడు కావున పరమాణురూపుడు. సర్వవ్యాపకుడు కావున మహాపర్వతము. జ్ఞానమే ఈయనయందుండు సారాంశము. అదియే శిలలయొక్క మధ్యభాగము. ఈ ప్రపంచమంతయునుకూడ జ్ఞానమాత్ర స్వరూపమే. కావున సర్వాధిష్ఠానమగు ఆపరబ్రహ్మపర్వతమునకు ఈ లోకత్రయము పజ్జ. (సారము, లేక, బురద) ఓ సత్పురుషశ్రేష్ఠుడా! భేతాళా! నీప్రశ్నములకు ఉత్తరమును చెప్పితిని గదా? అనెను. ఓ రామచంద్రా! ఇట్లు ఆ ప్రభువు ప్రశ్నములకు ఉత్తరము చెప్పగానే ఆ భేతాళుడు శాంతుడయ్యెను. ఆప్రశ్నములకు ఉత్తరములను చెప్పకుండిన భక్షింపవలయునని వాని అభిప్రాయము. అట్లు జరుగలేదు కదా? మఱియు వాడును బ్రహ్మజ్ఞాని. బ్రహ్మజ్ఞానులకు పరబ్రహ్మ ప్రస్తావము గలుగగానే చిత్తము వికాసము నొంది సమాధిసుఖమునందు ఇచ్ఛజనించును. కావున ఆ భేతాళుడును విచారసహితములగు రాజుయొక్క వాక్యములను వినగానే మనస్సు ఉప్పొంగి తన ఆకలిని గూడ మఱచిపోయెను. ఒక్క బ్రహ్మజ్ఞానులకే లననేల? ఏ తెగవారికి ఆ తెగవారితో సమాగమము దొరికినప్పుడు సంభాషణము తటస్థించినప్పుడు వారికి అభిమతమగు అర్థము సవిచారముగ ప్రశంసింప బడినప్పుడు మనస్సు పరవశమగుననుట లోకాను

భవసిద్ధము. కావున తత్క్షణమే వాడు శాంతమగురూపమును దాల్చి ఒక
ఏకాంత స్థలమును జేరి అచ్చట సమాధియందు నిలిచి యుండెను.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున భేతాళోపాఖ్యానమును
ముప్పదియైదవ సర్గము ముగిసెను.

—*—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడగు భరద్వాజునిజూచియిట్లనియె. ఓ భార
ద్వాజా! ఇట్లు ఆత్మనిష్ఠను పర్యాయమగు సుషుప్త మౌనమును ఇతిహాస
పూర్వకముగ చెప్పి వశిష్ఠమహాముని మఱియు నిట్లనియె. ఓ రఘురామా!
చిత్తమును బాహ్యావృత్తులనుండి మఱలించి శాంతమును గావించి ఎందును
రాగద్వేషములను పొందక ప్రవాహమును అనుసరించి వచ్చినదానిని ఆచ
రించుచు ఉండుము. మఱియు చిత్తశాంతిచేత మిక్కిలి ప్రసన్నుడవై శత్రు
మిత్రాదులను అందఱిని సమచిత్తముతో జూచుచు సుషుప్త మౌనమును
ఆశ్రయించి ఉండుము. అయితే మనస్సును జయించుటకు మాత్రము ఆమన
స్సే సాధనము. ఇట్లగుటచేత చిత్తశాంతి అనునది మిక్కిలి కష్టసాధ్యము.
అయినను, పూనికగలిగి త్వరపడక సుఖదుఃఖము సంప్రాప్తము లగుచున్నను
వానిని అనుభవించుచు వానియందు స్వభావసిద్ధములై కలుగు రాగద్వేష
ములను మాత్రము రానీక ప్రవర్తింతువేని అప్పుడు భగీరథ మహారాజు
నకువలె నీకును ఆచిత్తశాంతి చేకూర గలదు.

—* భగీరథోపాఖ్యానము. *—

అని వశిష్ఠమహాముని చెప్పిన విని రామచంద్రుండిట్లనియె. ఓ మహా
త్మా! వశిష్ఠమహామునీ! ఆభగీరథమహారాజు విచిత్రమగు తన చిత్త
స్థైర్యముచేత ఆకాశమునందున్న గంగాభవానిని క్రిందికి దెచ్చెను. అట్టి
మనస్థైర్యము అతనికి ఎట్లుకలిగెనో, ఆగంగను ఎట్లు తెచ్చెనో, ఆవిధము
నెల్ల వివరించి చెప్పుము. అని శ్రీరామచంద్రుడు అడిగిన వశిష్ఠమహాముని
ఇట్లనియె. ఓ రఘుకులసార్వభౌమా! వినుము. సముద్ర సమన్వితమగు
ఈ భూమండలమున కంతయు తిలకమువంటివాడై ప్రకాశించుచు భగీ
రథుడను ఒకమహారాజు రాజ్యపరిపాలనము చేయుచుండెను. అతనివద్దకు
వచ్చిన అతిథులు ఎవ్వరును తాము కోరిన కోరికెలను బడయక పోవువారు
లేరు. సర్వకాలములయందును ముఖము చంద్రునివలె ప్రసన్నమై ఉండగ

అతడు చింతామణియో, అన సర్వప్రజలకును సర్వాభీష్టదాతయై విల
సిల్లుచుండెను. అమ్మహాత్ముడే పాతాళలోకమునందు కపిల మహాముని
యొక్క రోషాగ్నిచేత భస్మీభూతులై పడియున్న తనపూర్వులకు స్వర్గా
రోహణార్థమై గంగానదిని సోపానపఙ్క్తిగా గల్పించెను. ఈ కార్యము
వలన సర్వలోకములకునుగూడ పరమబంధువయ్యెను. ఆమహారాజు యౌవన
దశయందు ఉండగానే ఒకానొకనాడు అతివిచిత్రముగానున్న ఈ సంసార
గతి దైవాధీనముగ జ్ఞప్తికి వచ్చెను. వెంటనే వైరాగ్యము ఆవిర్భవించెను.
అదియౌవన సమయమేయైనను మనస్సు విషయ విముఖము కాని కాలమే
యైనను, దైవయోగమువలన చవుటిభూమియందు పుష్పలత పుట్టినట్లు అతి
విచిత్రముగ ఆరాజునకు వైరాగ్యము పుట్టెను. ఇట్లు మనస్సు కొంచెము
అంతర్ముఖముకాగానే ఆప్రభువు ఒక్కనాడు ఏకాంతమునందు కూర్చుండి
అతివిచిత్రమగు ఈ ప్రపంచ సంస్థానమునుగూర్చి విచారింప నారంభిం
చెను. పగలుపోయి రాత్రివచ్చుచున్నది. రాత్రిపోయి పగలువచ్చుచున్నది.
ఎన్నికర్మలను చేసినను దానికి వచ్చుఫలము నిస్సారమైనదియే. ఒక్కమాఱు
అనుభవింపబడినదియే, ఒకమారనుభవించిన దానినే, మఱల మఱల అను
భవింప వలయుననిన అందు ఎవనికి అభిరుచి కలుగును. కావున దేనిని పొం
దిన పొందవలసినవి ఏవియును మిగులకుండునో, అదియే ప్రధాన ఫలము.
దానిని పొందించు కర్మయే కర్మ. మిగిలినవి విషూచికా వ్యాధియే. లోకు
లు మూఢులై యుండుటచేత ఒక్కటే కర్మను పలుమారు చేయుచున్నను,
ఒక్కటే ఫలమును పలుమారు అనుభవించుచున్నను సిగ్గుపడకున్నారు.
పిల్లవాండ్ర ఆటవలె ఉన్న ఈసంసారమును చూచి సిగ్గుపడనివాని బ్రతు
కేల? జ్ఞానవంతుడైన ఇట్టికార్యములయందు బుద్ధిని ప్రవేశపెట్టడుకదా?
ఇట్లు చెప్పనేల? ఇట్టికార్యములయందు బుద్ధిని ప్రవేశపెట్టనివాడే జ్ఞాన
వంతుడు. ఓ రఘురామా! ఈవిధముగ విచారించి ఆభగీరథుడు సంసార
మువలన భీతుడై ఒక్కనాడు తనగురువగు త్రితుడను మహామునియొద్దకు
పోయి అమ్మహాత్మునితో ఏకాంతమునందు ఇట్లని ప్రశ్నించెను.

ఓ మహాత్ముడా! ముదిమి, మరణము, శోకము, మొదలగు బహు
విధబాధలను కలిగించుచున్న ఈసంసారమునకు నాశము ఎట్లు కలుగును?
అనిన ఆత్రితుడు ఇట్లనియె. ఓమహారాజా! భగీరథా! వినుము. తెలిసి
కొనవలసినదానిని తెలిసికొనిన తెలివి సర్వపరిపూర్ణమై అఖండమై ఉండె
నేని అప్పుడు సర్వదుఃఖములును నశించును. హృదయగ్రంథులు విడిపోవును.

సర్వసంశయములును ధ్వంసమగును. సమస్తకర్మములును క్షీణించును. ఓపాపరహితుఁడా! ఈప్రపంచమునందు ప్రస్తుతము కానవచ్చుచున్న భేదములన్నియు నశించుటయే అజ్ఞానమునకు ఫలము. సమదృష్టియే అజ్ఞానమునకు స్వరూపము. అజ్ఞానముచేత ఎఱుఁగదగినవాఁడును ఆత్మయేకాని, అన్యుఁడు కాఁడు. తన్ను దాను ఎఱుఁగుట ఏమికష్టము. ఆత్మ (తాను) జ్ఞానమాత్రరూపుఁడు. తన ఎదుటనున్న పదార్థములకు తానే సాక్షియనుట ఎవనికి తెలియదు? మఱియు ఆయన సర్వవ్యాపకుఁడు. ఒకప్పుడు ఉదయించువాఁడు కాఁడు. ఒకప్పుడు అస్తమించువాఁడును కాఁడు. జ్ఞానమునకు ఇవి స్వరూపములే కదా? మఱియు సర్వవ్యాపకుని నిత్యప్రకాశరూపుని తెలిసికొనుటయనగా, ఎంతపని. అని త్రితులుఁడు చెప్పిన విని ఆభగీరథుఁడు ఇట్లనియె.

ఓ మహామునీ! ఈకానవచ్చునది అంతయు కేవల జ్ఞానరూపమే అనియు జ్ఞానరూపుఁడగు ఆ ఆత్మయే సర్వమయుఁడుగాను, సర్వవ్యాపకుఁడుగాను కూడ ఉన్నాఁడనియు, అతనికంటె భిన్నమై దేహాదిరూప పదార్థము ఎద్దియు లేదనియు, ఎఱుఁగుదును. అయితే ఓప్రభువా! మహామునీ! ఈజ్ఞానమునందు నాకు నిలుకడ దొరకలేదు. కావున అట్టి నిలుకడను సంపాదించుటకు ఉపాయము ఎయ్యది? అని అడిగిన త్రితులుఁడు ఇట్లనియె. ఓమహారాజా! వినుము. జ్ఞానము బాగుగ దృఢమయ్యెనేని మనస్సు పరబ్రహ్మముతో ఐక్యమై హృదయాకాశమునందు నిలుచును. అప్పుడు అంతఃకరణోపాధియందు నిలచియున్న జీవుఁడు బ్రహ్మమగుటచేత సర్వాత్మకుఁడై పునర్జన్మము నొందనేరఁడు. ఒకపాత్రముతో జలమును గొనిపోయి సముద్రమునందు వైచిన మఱల ఆజలమే వెలుపలికి తియ్యుటకు వీలుకానట్లు ఉపాధిభేదమై జీవుఁడు బ్రహ్మమునందు కలసిపోయిన పిమ్మట సంకల్పబలముచేత ఎందరు జీవులు సృష్టియగుచున్నను కలసిపోయిన జీవుఁడు మాత్రము అదియే స్వరూపముతో వెలుపలికిరాఁడు. అనగా, మఱల జన్మింపఁడు. ఇదియే ముక్తికి స్వరూపము.

## —❋ జ్ఞానస్వరూపము. ❋—

ఓ భగీరథమహారాజా! ఇకను అజ్ఞానముయొక్క స్వరూపమును వివరించెదను. వినుము. జ్ఞానమనగా, సామాన్యమగు పరోక్షజ్ఞానముకాదు. (పరోక్ష జ్ఞానమనగా, కలదు, అనిమాత్రమే తెలిసికొనుట) ఇకను ఏమియనిన అనుభవపూర్వకముగ గలుగు అపరోక్ష జ్ఞానమే (అపరోక్ష జ్ఞాన

మనగా, తాను ఎఱిగిన విషయమును స్వయముగ అనుభవించుట, అనగా, చూచుట, రుచి చూచుట, స్పృశించుట, మూర్కొనుట) అప్పుడుకాని, ఆజ్ఞానము ఫలవంతము కాజాలదు. ఫలమును ఇవ్వని కార్యము అసంపూర్ణ కార్యమే అనుటలో వివాదము కొంచెమైనను లేదుకదా ? కావున అపరోక్ష జ్ఞానమువలన సాంసారిక వ్యవహారములయందు సంబంధము తొలగునో, పుత్రదార గృహాదులయందు అభిమానము నశించునో, శుభములు వచ్చినను అశుభములు వచ్చినను వానియందు స్వాభావికముగా గలుగు అభిమాన అసూయలు ధ్వంసములగునో, అదియే పరిపూర్ణ విజ్ఞానము. ఏజ్ఞానమువలన సర్వ సంకల్ప వర్జితముగ ఆత్మధ్యానము కుదురునో, జనసంఘమునందు నిలచునట్టి అభిలాషతొలగి ఏకాంతదేశమున సర్వకాలములయందును ఉండవలయునను అభిరుచి పుట్టునో, అదియే పరిపూర్ణ విజ్ఞానము. మఱియు దేనివలన ఏ ఏ వ్యవహారములను ఆచరించుచున్నను ఎట్లెట్లు చలించుచున్నను సర్వమును ఆత్మయే అను సంకల్పము స్థిరమగునో, ఏపదార్థమును జూచినను అందలి బ్రహ్మస్వరూపమే గానవచ్చుచుండునో, ఆజ్ఞానమే పరిపూర్ణ విజ్ఞానము. తక్కినది అజ్ఞానమే. అది ఉండినను ప్రయోజనము లేదుకదా ? కావున జ్ఞానము స్థిరముకావలయునని అపేక్షించువాడు మనస్సును చిక్కబట్టి వైరాగ్యముచేత సర్వసమత్వమును అభ్యసింప వలయును. మఱియు జ్ఞాన ఫలములుగా వర్ణింపబడిన వానిని అన్నిటిని బలాత్కారముగ అభ్యసింప వలయును. వాని అభ్యాసముచేత జ్ఞానమును, జ్ఞాన దార్ఢ్యముచేత అవియును, పరస్పరము అభివృద్ధి నొందుచుండును. కావున వైరాగ్యమును ఆధారముచేసికొని సర్వకార్యములను సాధింప వలయును. ఆజ్ఞానము అభివృద్ధి అయ్యోనేని అదియే రాగద్వేషాదులను క్షీణింపజేయును. సంసారమను మహావ్యాధిని కుదుర్చును. అది అహంకార నాశమైన తత్క్షణమువనే సంపూర్ణమైన అభివృద్ధి నొందును. ఓభగీరథమహారాజా ! ఈకారణమువలన అన్నిటికంటె ముందుగ అహంకార వినాశమునకై ప్రయత్నింపవలయును. అనిన విని భగీరథు డిట్లనియె.

ఓమహాత్మా ! త్రితులమహామునీ ! పర్వతమునందు నాటుకొనియున్న వృక్షమువలె ఈదేహమునందు బహుకాలమునుండియును ఆత్మాభిమానము గలిసి ఉన్నది. అది నశించుట ఎట్లు ? అనిన విని త్రితులమహాముని ఇట్లనియె. ఓభగీరథమహారాజా ! వినుము. ఈ అహంకార నాశమునకు పురుషప్రయత్నమే ముఖ్య సాధనము. గురువేదాంత శాస్త్రాదుల వలన

ఆత్మరూపమును ఎఱిగి దానిని ఎల్లప్పుడును ధ్యానముచేత దృఢానుభవము నకు దెచ్చికొని ఉండునేని అప్పుడు అహంకారము నశించును. ఎట్లనిన వైరాగ్యము కలుగనివాడు ఆత్మనిష్ఠకై ప్రయత్నింపనే ప్రయత్నింపడు కదా ? కావున వైరాగ్యమువలన సర్వభోగములయందలి ఇచ్ఛయు అణగును. క్రమక్రమముగ "సర్వము బ్రహ్మమే" అను సంకల్పము దృఢమగును. పరోక్ష జ్ఞానము కలిగినప్పుడే "బ్రహ్మమే ఆత్మ. శరీరము కాదు" అను నిశ్చయము కలుగును. ఇట్లుండగ ఇక అనుభవ వంతునకు దేహాత్మాభిమానము ఎక్కడనుండి వచ్చును. ఈకారణమువలన అహంకార పరిత్యాగమునకు మొట్టమొదట వైరాగ్యము, భోగములను పరిత్యజించుట, బ్రహ్మస్వరూప జ్ఞానము' సర్వమును బ్రహ్మమేయని నిశ్చయించుట, అట్లే ధ్యానించుట, అనునవి సాధనములు. మఱియు దేహమను ఈయంత్రముల పంజరము, లజ్జ, దయ, శంక, ఇచ్ఛ, జుగుప్స, ( విసుకు ) కులము, శీలము, జాతి, అను ఈఎనిమిది పాశములచేత నిర్మింపబడి ఉన్నది. కావున జ్ఞాన ప్రభావముచేత ఈలజ్జమొదలగునవి అన్నియు నశించునేని దేహము పైకి గానవచ్చుచున్నను నిరాధారమగుటచేత నశించినదియే. ఇట్లయ్యేనేని అప్పుడు ఆత్మాభిమానము ఎచ్చట నుండును. నశించిన దేహమును ఎట్లాశ్రయించి ఉండును. అవశ్యముగ ధ్వంసమయ్యే తీరును. కావున ఓ భగీరథమహారాజా ! వైరాగ్య సంపన్నమగు మనస్సుతో ఈసర్వప్రపంచమును వదలి నిశ్చలుడవై అహంకార రహితుడవై ఉండువేని అదియే మోక్షము. అప్పుడు నీస్వస్వరూపమే మోక్షమగును. మఱి ఒకవిశేషము. నీవు చక్రవర్తివి కావున ఇతరులకంటె నీకు అభిమానము మెండు. కావున నీకు అట్టి స్థితి రావలయుననిన అహంకారము నశింపవలయును. అట్లు అహంకారమునశించుటకు కొన్ని విశేషకార్యములను ఆచరింపవలసి యుండును.

ఓ మహారాజా ! రాజ్యము ఉన్నంతవరకు నీకు అట్టి అభిమానము తొలగదు. కావున మొట్టమొదట "నేను క్షత్రియుడను, చక్రవర్తిని" అను తలంపులను వదలివేయుము. దారా పుత్రాదులయందలి ఇచ్ఛను తొలగింపుము. భయమును వర్జింపుము. అభిమానము కొంచెమైనను లుంచక మహాసమృద్ధమగు ఈరాజ్యమును శత్రువులకు ఇచ్చివేయుము. రాజచిహ్నములను విడచి ఆశత్రువులవద్దనే భిక్షాచర్యము చేయుము. నన్నును విడనాడుము. ఇట్లు పురుషప్రయత్నమును ఆశ్రయించి బలాత్కారముగ ఒనర్తువేని క్రమక్రమముగ నీమనస్సు సర్వాభిమానములను విడచివేయును. అప్పుడు నీవు

బ్రహ్మరూపుడవే అగుదువు. అని త్రితులమహాముని చెప్పెనని వశిష్ఠమహర్షి శ్రీరామునితో చెప్పి మఱియును ఇట్లనియె. ఓరాజీవలోచనా! వినుము. పైన వర్ణించిన విధముగ త్రితుల మహాముని చెప్పగానే ఆభగీరథ మహారాజును చేయవలసినపని అదియే అని నిశ్చయించి తనకుగల ధనమునంతయును సద్వినియోగము చేయదలచి జ్యోతిష్టోమ యాగమును ఆరంభించెను. ఆయాగమునందు గుణాగుణములను విచారించి తనకుగల గో భూ హిరణ్యాదులను అన్నిటిని బ్రాహ్మణులకును, దేవతలకును (అనగా, దేవాలయములకును) దరిద్రులకును, మిత్రులకును, బంధువులకును, దానముచేసెను. ఈవిధముగ సర్వస్వమును మూడు దినములలోగా సద్వినియోగము గావించి కట్టుగుడ్డతో మాత్రమే నిలువబడియెను. పిమ్మట ధనశూన్యమై ఉండు ఆరాజ్యమును తన ప్రక్కనున్న ( తనప్రక్క రాజ్యమునందు ఉన్న ) శత్రువునకు ఇచ్చివేసెను. దానికి ప్రజలు దుఃఖించుచుండిరి కాని, బ్రహ్మజ్ఞానార్థియగుటచేత ఆప్రభువుమాత్రము దానిని లక్ష్యము చేయలేదు. ఆశత్రువును రాజ్యమును ఆక్రమింపగానే కట్టుబట్టతో ఆప్రభువు తనరాజ్యమును విడచిపోయెను. ఏస్థలమునందు ఉన్నవారు ముఖమును జూచిగాని, పేరును వినిగాని, తన్ను గుఱుతింపనేరరో, అట్టి దేశమునకుపోయి అచ్చటి అరణ్యములయందును, గ్రామములయందును, నివాసము కల్పించుకొనెను.

ఓ రామచంద్రా! ఈ విధముగ ఆభగీరథుడు అత్యల్పకాలములోనే సర్వబంధములను త్రెంచివేసి సర్వసముడై దేనియందును కోరికలేనివాడై పరమ శాంతి నొంది బ్రహ్మానందానుభవమును బడసెను. ఇట్లు పరమశాంతుడై భిక్షాచర్యముచేత జీవించుచు భూమండలమునం దెల్లను దిరుగుచుండి ఒకనాడు అప్రయత్నముగనే శత్రువుచేత ఆక్రమింప బడియున్న తనపట్టణమునకు వచ్చి చేరెను. ఇట్లుచేరి తనరాజధానియందే భిక్షాచర్యము చేయుచుండగా మార్గమధ్యమునందు వెనుక రాజ్యము చేయుచున్నప్పుడు మంత్రులుగా ఉన్నవారియొక్కయు, తదితర ప్రధాన ఉద్యోగులయొక్కయు, మిక్కిలి గుఱుతు గల పురజనులయొక్కయు, ఇండ్లు కూడ వచ్చెను. లజ్జాదులను వర్జించినవాడు కావున కొంచమైనను మనోవికారము లేక, వారలనుగూడ భిక్షను అడిగెను. అప్పుడు ఆ మంత్రి మొదలగువారు ఆ భగీరథుని గుఱుతుపట్టి దుఃఖించుచు మిక్కిలి గౌరవముతో బూజించిరి. ఆ కాలమునందును ప్రభువుగానున్న ఆ శత్రుడును అతని ఆదరించి " ఓ భగీరథమహారాజా ! నీవు నీరాజ్యమును మరల తీసికొనుము "

అని ప్రార్థించెను. అయినను ఆతడు ఆ ప్రార్థనమును అంగీకరింప లేదు. ఆతడు భోజనముతప్ప తక్కిన వానిని అన్నిటిని తృణప్రాయములుగ వర్జించి పరమశాంతుడై మునివృత్తితో ఉండెను. అత్యావశ్యకమగుటచేత ఆహారమును మాత్రము భిక్షాచర్యచేత నిర్వహించుచుండెను కదా ? అయినను కొంతకాలము రాజ్యమునందే నివసించి ప్రతిగ్రామమునందును పురమునందును భిక్షాచరణము చేయుచుండెను. అచ్చటివారలు అందఱును "ఈతడు భగీరథుమహారాజు ఇతనికి దైవయోగమువలన ఇట్టి స్థితి సంభవించెను. ఆహా, ఎంత శోచనీయమైన విషయము" అనుచు దుఃఖింపసాగిరి. ఇట్లుండగ కొంతకాలమునకు ఆతడును అచ్చటనుండి వెడలిపోయెను. పిమ్మట మఱియొక స్థలమునందు నివసించుచుండి శాంతుడై మహానిద్రా కాలము గడపుచు ఒకసమయమునందు దేశాటనము చేయుచు మార్గవశమున తనగురువగు త్రితులుని ఆశ్రమమును జేరెను. అచ్చట తనగురువునకు పూజా నమస్కారాదులను ఆచరించి కొంతకాలము ఆయనతోగూడ పర్వతములయందును, గ్రామములయందును పట్టణములయందును, నివసించెను. ఇట్లు ఆగురు శిష్యు లిరువురును సమానమగు చిత్తశాంతిని కలిగి స్వస్థులై ఒకనాడు ఏకాంతమున నుండి దేహధారణవలన కలుగు దుఃఖములను తలపోసి కొనిరి. ఈ దేహమును ఏల ధరింప వలయును ? ధరింపక విడచిన మాత్రమున ఏమి అధికము వచ్చును. ఎట్లు చూచినను ఇది ఉన్నను, లేకున్నను, మనకు ఏమియు హాని కానరాలేదు. కావున ఎప్పటికి ఇది పోవునో, అప్పటికే పోనిమ్ము. అంతవరకు ఇష్టము వచ్చినట్లు ఉండనిమ్ము. దీనివలన మనకు ఏమియు నష్టము లేదు. అని ఇట్లు నిశ్చయించి వారు ఇరువురును ఒక వనమునుండి మఱియొక వనమునకు బోవుచు స్వేచ్ఛగా దొరికిన ఫలాదులను శరీర ధారణార్థమై ఉపయోగించుచు సంచరింపుచుండిరి. ఆ సమయమునందు వారికి ఆనందమును లేదు. దుఃఖమును లేదు. రెండునుంగాని, మధ్యస్థితియు లేదు. ఈ మూడును మనోవికార రూపములే కదా ? అప్పుడు వారియొక్క ఈ లోకోత్తర స్థితిని జూచి సిద్ధులు సంతసించి ఏనుగులు, గుఱ్ఱములు, లెక్కకు మిక్కిలియగు ధనము మొదలగు వానిని దెచ్చి ఇచ్చిరి. అష్టైశ్వర్యములనుకూడ సమర్పించిరి. అయినను త్రితుల భగీరథులు ఇరువురును గడ్డిపోచవలె దానినంతయును నిరాకరించిరి. ఇట్లు కాలము గడచుచుండగ ఒకసమయమునందు ఒకానొక రాజ్యమునందు అచ్చటి ప్రభువు సంతానరహితుడయ్యే కాలధర్మము నొందెను. మృత్యుదేవత కాల

మును అపేక్షించునది కాదు. ఆకలిగొన్నవాడు తన ఎదుటనున్న ఆహార
మును ముందు వెనుక ఆలోచింపకయే భుజించునట్లు మృత్యుదేవత తన
ఎదుట ఉన్నవానిని మ్రింగివేయును. అంత దేశమునందలి జనులు రాజు
యొక్క మరణమునకు మిక్కిలి శోకించుచు తమ ఉత్తరాభివృద్ధికి దగిన
ప్రభువునుగూర్చియు వెదుక నారంభించిరి. సద్గుణవంతుడగువాడు మనకు
ఎట్లు దొరుకును ? అని విచారింపసాగిరి. అప్పటికి ఈ భగీరథమహారాజు
ఋషివేషముతో ఆరాజధానియందే భిక్షాచరణము చేయుచుండెను. ఆప్రజ
లయందలి ప్రముఖులు ఎట్లెట్లో ఆ భగీరథమహారాజును గుఱుతెంచి బలా
త్కారముగ తమకు ప్రభువును చేసికొనిరి. "వర్షాకాలమునందు సరస్సు
నకు నాలుగు వైపులనుండియు నీరు వచ్చి చేరునట్లు" ఆ భగీరథుడు
గుఱుతింపబడిన సమయమునందే ఆదేశపు మంత్రులు మొదలగువారి సైగ
చేత చతురంగసైన్యము వచ్చి అచ్చట జేరెను. అలంకరింపబడిన ఒక ఏనుగు
ఆ భగీరథునివద్ద నిలచెను. ఆతడును సర్వసముడు అగుటచేత నిర్వికారుడై
ఆ ఏనుగును అధిరోహించెను. అప్పుడు "సర్వభూపాలకుడగు భగీరథునకు
జయము కలుగునుగాక" అని ప్రజలయొక్క ధ్వనులును ఆకాశమునందును
వ్యాపించెను. పర్వతగుహలను పూర్ణములనుగావించెను. ఈ విధముగ
ఆరాజ్యమునకు ప్రభువై ఆ భగీరథుడు నూతనదేశమును పరిపాలించుచుం
డగ కొంతకాలమునకు పూర్వపు ప్రజలువచ్చి ఇట్లని విన్నవించుకొనిరి.
అప్పటికి వారిప్రభువు అనగా, భగీరథునివలన రాజ్యమును తీసికొనిన శత్రు
రాజు మృతుడై యుండెను.

ఓ భగీరథమహారాజా ! వెనుక మీరు మాకు ప్రభువుగా నిలిపియు
న్న మీశత్రురాజు మృతుడయ్యెను. కావున మీరు మమ్ము పాలింప అనుగ్ర
హింపవలయును. ఈ రాజ్యప్రాప్తి చిత్తమునకు విక్షేపకరము అగునే
మో, అని శంకింపవలదు. దీనివలన ఆత్మనిష్ఠకు హానికలుగునేమో, అని
సంశయింపవలదు. మనోజయముగల మీబోటి మహాత్ములకు ఎద్దియును
ఏమియు చేయజాలదు. మఱియును సర్వసములగువారు తమంతన ఏదివచ్చి
నను పరిత్యజింపరు. ఏది ఎట్లువచ్చిన దానిని అట్లే ఆదరించుటయే కదా,
జీవన్ముక్తులకు లక్షణము. ఓ రఘురామా ! ఈ విధముగ వారలు ప్రార్థిం
పగనే ఆ భగీరథుడును సమ్మతించెను. చక్రవర్తియై సర్వసముద్రముల
వఱకు గల భూమండలమును ఏకఛత్రముగా పరిపాలించెను. ఆతని చిత్తము
శుభాశుభములయందు సమానమై ఉండెను. దేనికిని సంక్షోభింపక శాంత

మై సుషుప్త మౌనమును ఆశ్రయించి రాగద్వేషములను వర్జించి ఉండెను. సర్వేంద్రియములును మనస్సునకు వశగతములై యథేచ్ఛా సంచారమును మాని యుండెను. ఇట్లగుటచేత ఆ ప్రభువు ఎప్పటికి ఏది తటస్థమైన దానిని ఆచరించు చుండెను. ఎట్టివిచిత్రము కానవచ్చినను మాయా స్వభావమును ఎఱిగినవాడు కావున ఆశ్చర్య పడకుండెను. ఇట్లు పరిపూర్ణ చిత్తస్థైర్యము నొంది ఒకప్పుడు తన పితామహులయొక్క దుర్గతిని విని అనేక వేల సంవత్సరములు తపస్సుచేసి గంగను భూమిమీదికి దెచ్చి పాతాళలోకమునకును గొనిపోయి వారిని ఉద్ధరించెను.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున భగీరథోపాఖ్యానమను
ముప్పదియాఱవ సర్గము ముగిసెను.

———*———

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునిజూచి ఇట్లనియె. ఓ భరద్వాజా! ఈ విధముగ స్వప్రయత్నముచేతనే చిత్తవిశ్రాంతిని సంపాదింప వచ్చునని నిరూపించి గురువుయొక్క ప్రయత్నమువలనకూడ అట్టిస్థితి సంభవింపవచ్చునని వశిష్ఠమహాముని చెప్పబోవువాడై శ్రీరామునిజూచి యిట్లనియె.

—※ శిఖిధ్వజోపాఖ్యానము. ※—

ఓ నీలోత్పలశ్యామా! రామా! " ఇది " అను-తలంపును మొట్టమొదట వదలి మనస్సనిమెడు పక్షిని బిగియపట్టి నీవు శిఖిధ్వజునివలె నిశ్చలుడవై నిలువుము. అనిచెప్పిన రామచంద్రుడు ఇట్లనియె. ఓ బ్రాహ్మణోత్తమా! వశిష్ఠమహాముని! ఆ శిఖిధ్వజుడెవ్వడు? అతనికి బ్రహ్మజ్ఞానము ఎట్లు కలిగినది. జ్ఞానాభివృద్ధికై మఱల ఆ విషయమును గూడ వివరించి చెప్పుము. అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె. కడచిన ఏడవ మన్వంతరమున ద్వాపరయుగమునందు మాళవదేశమును బరిపాలించు చున్న ప్రభువునకు శిఖిధ్వజుడనినామధేయము. ధైర్యము, దానశీలత్వము, ఓర్పు, దయ, శమదములు, సదాచారము, మొదలగువానికి ఆరాజు పుట్టినిల్లై యుండెను. సురాష్ట్రదేశపు రాజునకు పుత్రికయగు చూడాల సర్వగుణములయందును అతనికి అనురూపమై యుండెను. అందువలన ఆమహారాజు ఆకన్యకను వివాహమయ్యెను. సర్వకాలములయందును ఒకరికార్యములు ఒకరికి మిక్కిలి ప్రియములై ఉండుటచేతను, ఒకరిస్వరూపము ఒకరికి మిక్కిలి

ఆనందజనకములై ఉండుటచేతను, ఒకరిమనస్సుతో మఱియొకరి మనస్సు కలసియుండుటచేతను వారి అనురాగములు దినదినాభివృద్ధి కలిగియుండెను. మఱియు ఒకరికి తెలిసిన కళల (కళలనగా, సంగీతాదివిద్యలును శాస్త్రములును) మఱియొకరు నేర్చికొనిరి. ఇంత ఏల? వారలను అనురాగాతిశయముచేత దేహములయందుకూడ భేదము లేదేమో, ఇరువురు నొకటియే ఏమో, అని పరులకు దోచుచుండెను. ఇట్లు మహానురక్తులై వారు ఇరువురును యథేష్టముగ యౌవన లీలలను బహుకాలము అనుభవించిరి. అంత సంవత్సరములు అనేకములు గడచిపోయెను. కాలమునకు ఎప్పుడును పరుగెత్తుచుండుటయే పనికదా? పగిలిపోయిన కుండనుండి నీరు కారిపోవునట్లు వారియౌవనము క్రమక్రమముగ నశింప నారంభించెను. అప్పుడు వారు ఇట్లని విచారింప నారంభించిరి. పండినపండు రాలుట నిశ్చయమైనట్లు "దేహియు మరణము నొందుట నిశ్చయము. దానిని ఎవరును తప్పింపలేరు. ఇప్పుడు మనకును "కమలములమీదికి మంచువలె ముదిమి వచ్చినది. "చేతిలోనున్న నీటివలె" ఆయుస్సు ప్రతిక్షణమునకును తరిగిపోవుచునే ఉండును. ఇట్లున్నను ఆశయను తీగ మాత్రము "వర్షాకాలమునందలి సొరతీగవలె" అంతకంతకు శాఖోపశాఖలతో విస్తరించుచుండును. కొండపైనుండి దుముకు నదియొక్క ప్రవాహమువలె యౌవనము పారిపోవును. ధనుస్సునుండి విడువబడిన బాణములవలె" సుఖములు పలాయనము చేయుచుండును. ఈవ్యవహారమును చూడబోయిన "అరటిచెట్టులోపలి భాగమువలె" నిస్సారమైనది. దీనిని చూచుకొలది విసుకు అగుచున్నది. కావున విచారించి చూచిన ఈసంసారమునందు మనస్సునకు తృప్తినికలిగించు పదార్థము ఏదియు గానరాలేదు. దేనిని ఆశ్రయించినను ఈసుఖదుఃఖములయొక్క ఆటోపము తగ్గునట్లుగాని, మనస్సునకు పరమానందము కలుగునట్లుగాని తోచలేదు. ఈసంసారము ఏ ఔషధమునకుగాని, కుదరని మహావ్యాధివలె ఉన్నది.

ఓ రఘుకులసార్వభౌమా! రామా! అని ఇట్లు ఆదంపతులు నిశ్చయించి సంసారవ్యాధికి ఔషధమగు ఆత్మతత్వమును విచారించువారై వేదాంతశాస్త్రములను పరిశోధించిరి. ఇట్లు విచారించి సంసారమనియెడు విషూచికావ్యాధి ఆత్మజ్ఞానమనెడు మంత్రముచేతగాని, శాంతింపదని నిశ్చయించి వారు ఇరువురును ప్రయత్నములోనే ఉండిరి. అప్పటినుండియు వారిమనస్సు ప్రాణములు, ఆ ఆత్మయందే ఉండెను. వారికిని ఆ ఆత్మయే శర

ణ్యుడై ఉండెను. వారి కార్యములన్నియు ఆత్మవిషయములుగానే ఉండెను. వారిదృష్టి అంతయును ఆత్మవిషయమయ్యే ప్రసరించు చుండెను. ఇట్లగుటచేత వారు స్వభావమును మించి లోకోత్తరముగ ప్రకాశించుచుండిరి. మఱియు వారు అధ్యాత్మతత్త్వమునే పలుమారు అభ్యసించు చుండిరి. ఒకరికొకరు చెప్పుకొనుచు ఉండిరి. ఇతరకార్యములను అన్నిటిని వదలి ఆత్మజ్ఞానము దృఢ మగుటకయ్యే మహాప్రయత్నములను గావించు చుండిరి. ఇట్లు చాలాకాలము గడచిపోయెను. అంత ఆరాజపత్నియగు చూడాల సంసారతారణమునందు సమర్థములగు వేదాంతశాస్త్రార్థములను మనోహరపదసందర్భములతో వేదాంతవేత్తలు వర్ణించుచుండగ పలుమాఱువిని తనలో ఇట్లని తలంప నారంభించెను. ఆమె బుద్ధి, పూర్వ జన్మపరిపాకము వలన మిక్కిలి స్వచ్ఛమై ఆత్మతత్త్వమును శ్రవణమాత్రముననే గ్రహించెను. అప్పుడు ఆమెకు ఇతరకార్యములను చేయుచున్నప్పుడైనను, ఏకాంతమునందైనను గూడ ఆత్మవిషయకమగు చింతయే మనస్సునందు వ్యాపించి ఉండెను.

ఓరామచంద్రా! ఆమె ఆలోచనను వినుము. నాస్వస్వరూపము ఏదియో తెలిసికొన వలయును. నేనెవతెను? ఈభ్రాంతి ఎవ్వనికివచ్చినది. ఇది ఎందు పుట్టినది ? శరీరమే నేను అని తలంచిన అది సరిగా నుండలేదు. ఇది జడము. మూఢము. నేను జ్ఞానవంతురాలను. కావున ఈదేహము నేనగుటకు వీలులేదు. ఇక ఇంద్రియములను గూర్చి విచారించిన ఆ ఇంద్రియములన్నియు దేహమునకు సంబంధించినవియే కాని, భిన్నములు కావు. అవి సూక్ష్మములైనను సూక్ష్మదేహమునకు సంబంధించుటకాని, అన్యములు కానేరవు. కావున దేహమువలెనే ఇవియును నాస్వరూపములు కానేరవు. ఇదియునుగాక ఈ ఇంద్రియములను వీనికార్యములతోగూడ నేను చూచుచున్నాను. ఇట్లుండగ ఈ ఇంద్రియములు నేను అగుట ఎట్లు. చూచువాడును, చూడబడునదియును, ఎప్పటికిని ఒకట్టి కానేరదుకదా ? మఱియు కర్మేంద్రియములవలెనే జ్ఞానేంద్రియములును జడములే యని తెలియుచున్నది. వానికి జ్ఞానము ఉన్నను ఆజ్ఞానము ఎక్కడినుండియో వచ్చియుండ వలయును కాని, స్వాంతముగ నుండుటకు వీలులేదు. ఏలయనగా, కుండను చేయునప్పుడు కొయ్య మట్టిముద్దను త్రిప్పునట్లు మనస్సు ఈజ్ఞానేంద్రియములను ప్రేరేపించుచున్నది. వీనికే జ్ఞానము స్వాభావికము అగునేని ఇట్లేల యగును. స్వతంత్రునికి పరప్రేరణ ఏల? కావున నిశ్చయముగ ఈజ్ఞానేంద్రియములు

కూడ జడములే. ఇదియునుగాక సంకల్పరూపమగు మనస్సుకూడ ఇట్లే జడ
మని సిద్ధాంతము చేయవలసియున్నది. దానికిగూడ పరప్రేరణ కలదు.
మనుష్యుడు రాతిని చేతితో విసరివేయునట్లు బుద్ధి తననిశ్చయములచేత మన
స్సును ఇంద్రియములమీదికి విసరుచున్నది. బుద్ధి నిశ్చయింపకుండిన దీనికి
ప్రచారమే లేదు. ఆబుద్ధియు చేతనరూపము కానేరదు. దానికిని పరప్రే
రణ పరసహాయము కలదు. “ నది స్వతంత్రముగనే పారుచున్నదానివలె
కనబడుచున్నను దానికి రెండు దరుల మధ్యనుండు పల్లము ఎట్లు ఆధార
మో, అట్లే ఈబుద్ధికిని అహంకారము ఆధారము. అహంకారములేక, ఇది
ఏకార్యమును నిశ్చయింప నేరదు. ఆ అహంకారమునుగూర్చి విచారించిన
అదియు చేతనము కాదు. పిల్లవాండ్రు తననీడనుచూచి దయ్యమని భ్రమిం
చునట్లు జీవుడు తన స్వరూపమును తానే చూచి అహంకారమని భ్రాంతి
నొందుచున్నాడు. ఇట్లగుటచేత మొట్టమొదట ఆ అహంకారము శూన్య
రూపమైనదియే. మఱియు దానికి చేతనుడగు జీవునియొక్క సహాయము
కావలసి ఉన్నది. కావున అది జడమే. చేతనము స్వతంత్రమగుటచేత దా
నికి పరసహాయముతో పనిలేదుకదా ? జీవుని స్వరూపమును విచారించిన
అతడు చేతనుడే. వాయువువలె హృదయాకాశ మధ్యమునందు ఉన్నాడు.
అయినను వానికిగూడ లోపల ఏదియో ఒకపదార్థము ఉన్నట్లును అదియే
ఆజీవునికి సామర్థ్యమును ఇచ్చుచున్నట్లును గానవచ్చుచున్నది. కావున
జీవుడుకూడ చేతనుడైనను అచేతనమువంటివాడే అనవలసియున్నది. ఆహా,
ఇప్పటికి తెలిసికొంటిని. ఆజీవునికి ఆధారభూతుడై ఉన్నవాడు జ్ఞానరూపు
డగు పరమేశ్వరుడే. అతడు సర్వసాక్షికావున దృశ్యపదార్థములతో సంబం
ధపడి ఉన్నట్లు ఉన్నాడు. ఇదియే ఆయనకు గలిగిన కళంకము. దీనిచేతనే
ఆయనను ఇంతకాలమువరకు నేను గుఱుతింపక ఉంటిని. స్పష్టముగ దెలి
యువచ్చుచునే యున్నను, సర్వప్రజలుగూడ గుఱుతింపలేక ఉన్నారు.
ఆబ్రహ్మమే యాత్మ. ఆయన ఆద్యంతములు లేనివాడు. ఆయనయే నేను.
పుష్పసుగంధము వాయువుచేతను, నదీవేగము రెండుదరులకు నడుమనున్న
పల్లముచేతను, జీవించు విధమున ఈజీవుడు ఆపరమేశ్వరునిచేతనే జీవించు
చున్నాడు. దృశ్యరూప భ్రాంతిచేత ఆవరింపబడి కళంకమునుజెంది ఉన్న
ప్పుడు ఆపరమేశ్వరుడే జీవుడు. చిత్తశుద్ధిచేత అట్టి కళంకము పోయినప్పు
డు ఆజీవుడే పరమేశ్వరుడు. “ అధికమగు నీటిలో వేయబడినప్పుడు అగ్ని
తనరూపమును విడచి జలముతో ఏకీభవించునట్లు ” ఈజ్ఞానరూపుడగు పర

మేశ్వరుడును భ్రాంతి సిద్ధములును జడములును అగు ఈదృశ్యపదార్థముల తో సంబంధించుటవలన తన రూపమును విడచుచున్నాడు. ఏదియో ఒక జడపదార్థమువలెనే గానవచ్చుచున్నాడు. బాగుగ విచారించిననేగాని, స్పష్టము కాకున్నాడు. ఇట్టి స్థితియందు ఉన్న పరమేశ్వరుడే జీవుడు. ఈ జీవుడు స్వాయముగ చేతనరూపుడే అయి యుండియును దృశ్యాభిముఖుడగు టచేత శూన్యుడు, జడుడు, ఉండియు లేనట్లు తోచువాడు నగుచున్నాడు. కావున దనకుగల స్వాతంత్ర్యమును పోగొట్టుకొనుచున్నాడు. ఈకారణ మువలననే మఱి ఒక చేతనపదార్థము ఈతనిని ప్రబోధింపవలసి వచ్చినది. ఆచేతనపదార్థమే శుద్ధచైతన్యము. అదియే పరబ్రహ్మము. ఇప్పుడు ఈశు ద్ధచైతన్యమునకు సాక్షి ఎవ్వడైనను కలడేమో యని విచారింపవలయును. ఈచైతన్యమునకు ఆధారము ఏదియైనను కలదేమో విచారింప వలయును. ఎట్లుచూచినను అట్టిది ఏదియును ఉన్నట్లు కానరాలేదు. ఆహా, నేటికి సర్వేశ్వరుని కనుగొంటిని. అపాయరహితమగు ఆత్మరూపమును తెలిసి కొంటిని. కళంకరహితమగు పరంజ్యోతిని పొడగాంచితిని. ఆహా, ఈమనో బుద్ధ్యాదులు అన్నియును ఆచైతన్యము యొక్క విలాసమాత్రములే. బొత్తిగ శూన్యములైనవియే. పొరబాటువలన భ్రాంతిచేత పుట్టినవియే. బాగుగ విచారించిన కళంకరహితమై సర్వసమమై పరిశుద్ధమై అహంకార వర్జితమై మహాసత్త (గొప్పఉనికి) అని పిలువబడుచున్న శుద్ధ చైతన్యము ఒకట టియే ఈప్రపంచమునందు గలదు. దానికంటె భిన్నమైనది ఎద్దియును లేదు. అది నిత్య పరిశుద్ధమై సర్వకాలములయందును ఏకరూపముగ ప్రకాశించుచు ఒకప్పుడైన అస్తమానము నొందక యున్నది. అదియే బ్రహ్మమనియు, పర మాత్మయనియు, స్వస్వరూపమనియు, పిలువబడుచున్నది.

ఓరఘునందా ! శ్రీరామా ! ఈవిధముగ ఆచూడాల ఆత్మస్వరూ పమును ఎఱిగి ప్రతిదినమును దానినే అనుసంధానము చేయుచు అందే అత్యాశకలిగి అంతర్ముఖియై ఉండుటచేత బ్రహ్మరూపిణియే అయ్యెను. ఆమెకు ఒకపదార్థమునందు అభిలాషగాని, మఱియొకదానియందు ద్వేష ముగాని, లేకుండెను. ఏపదార్థముతోను సంబంధము అనగా, దేనిమీద గాని అభిమానము లేకుండెను. శీతోష్ణాది ద్వంద్వములు బాధకరములు కాకుండెను. దేనియందును అభిలాషయే పుట్టకుండెను. అప్పుడు ఆమె సం ప్రాప్తమైనదానిని ఎట్టిదైనను నిర్వికారియై ఆచరించుచుండెనుగాని " ఇది అనిష్టము " అని ఒకదానినైనను విడుచుటలేదు. ఇది ఇష్టము, లేక, యుక్త

ములని ఒకదానినైనను, స్వీకరించుట లేదు. ఇట్లు పరమాత్మ లాభము వలన పరిపూర్ణమగు హృదయము కలిగి సర్వలోకములను లోకాధిపతుల నుగూడ మించినదయ్యెను. అట్టి పరిపూర్ణస్థితిని వర్ణింప గలుగుట ఎట్లు ? దేహాదులనుండి ఆత్మను విభాగించి ఎడతెగక అభ్యాసము చేయుకొలది పరమానంద సముద్రమునందు మునిగి ఆమె వృద్ధురాలయ్యెను "పుష్పశోభితయగు తీగెవలె" ప్రకాశింపసాగెను. ఇట్లుండగ ఒకనాడు అతికాంతిమతియై ప్రకాశించుచున్న ఆచూడాలను చూచి నవ్వుచు శిఖిధ్వజుడు ఇట్లనియె.

ఓ ప్రాణేశ్వరీ! నీశరీరమునకు క్రొత్తగా అధికమగు కాంతి వచ్చినది. అతి నిర్మలముగ ఉన్నది. నీవు యౌవనవతివలె సర్వాలంకార భూషితవలె, ప్రకాశించుచున్నావు. నీశరీరమునందు ఉన్న ముసలితనము అంతర్ధానమైనట్లు ఉన్నది. అమృతపానము చేసినట్లు ఎవనికిని పొందరాని ఉత్తమస్థానమును పొందినవిధమున పరమానంద సముద్రమునందు ఓలలాడుచున్నట్లు నీవు మిక్కిలి ప్రకాశించు చున్నావు. నీమనస్సుయొక్క స్థితిని విచారించిన అది వైరాగ్యయుక్తముగాను, శాంతిపూరితముగాను, నిశ్చలముగాను, సర్వసమత్వ రంజితముగాను, గాంభీర్య శోభితముగాను, ప్రసాద రుచిరముగాను, గానవచ్చుచున్నది. ఇట్లగుటకు కారణమేమి ? అనిన చూడాల ఇట్లనియె.

ఓ ప్రాణనాథా ! వినుము. ఏమియును గాకుండియు ఏదియో ఒక రూపముతో ఉన్న ఈసర్వమును విడచి ఏమియుగాకయు అన్నియునైయున్న ఒకపదార్థమును ఆశ్రయించితిని. దానిచేత నాకు, ఈకాంతి గలిగినది. ఈసమస్తమును వదలి సర్వరూపమగు నట్టియు, ఉన్నదియు, లేనిదియు నైనట్టియు, ఒకపదార్థమును ఆశ్రయించితిని. దానిచేత నాకు ఈ కాంతి కలిగినది. ఏది సృష్టికాలమునందు ఒకపదార్థముగ నుండి ప్రళయకాలమునందు ఏదియును గాకుండునో, దానిస్వరూపమును ఉన్నది ఉన్నట్లు ఎఱిగితిని. కావున నాకు ఈకాంతి కలిగినది. ( పరబ్రహ్మము ప్రపంచముతో సంబంధించునది కాదు. కావున "ఏమియు కానిది" అని చెప్పబడెను. సర్వరూపము కావున "అన్నియు నైనది" అని వర్ణింపబడెను. సర్వసాక్షియగుచు అనుభవసిద్ధమై ఉన్నది కావున "సత్యము" అనియు, ఇంద్రియ గోచరము కాదు. కావున "అసత్యము" అనియు వర్ణింపబడెను. సత్యాసత్య వ్యవహారములు ఇంద్రియగోచరములగు పదార్థములను గూర్చి మాత్రమేకదా ప్రవర్తించు చున్నది ? మఱియు సృష్టికాలమునందు మనస్సు

మొదలగువానిచేత ఆవరింపబడి ఉండును. కావున ఆబ్రహ్మమునకు ఏది
యో ఒకరూపము ఉన్నట్లు తోచును. కావుననే " సృష్టికాలమునందు
ఒకానొక పదార్థమై " అని చెప్పబడెను. ప్రళయకాలమునందు ఆ ఆవరణ
ములన్నియు నశించిన అప్పుడు స్వస్వరూపముతోనే మిగులును. కావున
" ప్రళయకాలమునందు ఏమియుగానివాడై " అని చెప్పబడెను. ఆవరణ
ములు లేకున్నప్పుడు పరబ్రహ్మరూపము ఇట్టిదియని చెప్పుటకే వీలులేదు
కదా ? మఱియు ఓహృదయేశ్వరా ! పూర్వమువలె భోగములను అనుభ
వించుటచేత మాత్రమే తృప్తియు లేకున్న అతృప్తియు నాకు లేదు. ఆభో
గములు ఎంతదూరములోనున్నను వానిని అనుభవింపకున్నను నాకు పరి
పూర్ణతృప్తి కలుగుచున్నది. ఎప్పటికిని నామనస్సునందు సంతోషముగాని,
కోపముగాని, పుట్టుట లేదు. ఈకారణమువలన నాకు ఇట్టికాంతి కలిగి
నది. నేను ఏకాంతముగా ఆకాశ సమానమగు హృదయ కమలమునందే
క్రీడించు చున్నాను. ఆక్రీడచేతనే తృప్తి జెందుచున్నాను. రాజభోగముల
యందు తృప్తినొందుటలేదు. వానిని అపేక్షించుటయు లేదు. ఈకారణము
వలన నాకు ఇట్టికాంతి కలిగినది. " నేను ప్రపంచమధ్యమునందు ఉన్న సా
మాన్యస్త్రీని కాను. సర్వలోకములకును ప్రభువును " అని సర్వకాలముల
యందును తలంచు చున్నాను. ఈకారణమువలన నాకు ఇట్టికాంతి కలిగి
నది. ( పరమేశ్వరుడు లోకేశ్వరుడు కావున ఆయనతో అభిన్నుడగు జీవు
డును లోకేశ్వరుడే అనుట. ) రాగ ద్వేష శూన్యలై ఉన్న శాస్త్రజ్ఞాన
ములను చెలులతోగూడి ఎప్పుడును క్రీడించు చుందును. ఈకారణమువలన
నేను కాంతిమంతురాలనై ఉన్నాను.

ఓప్రాణనాథా ! నేత్రములచేతను, తక్కిన ఇంద్రియములచేతను,
మనస్సుచేతను, చూడబడుచున్న పదార్థములు ఏవేవికలవో, అవి అన్ని
యు, శూన్యరూపములే. వానియథార్థరూపము పరబ్రహ్మమే. కావున
ఈబాహ్యరూపములను విడిచి సర్వకాలములయందును లోలోన సర్వాం
తరుడగు ఆపరమేశ్వరునే చూచు చున్నాను. ఏవస్తువు కనపడినను అందలి
బ్రహ్మతత్వమునే గుఱుతించు చున్నాను. కావున ఇప్పటికి చక్కని చూపు
చూడ కలిగితిని గదా? అని తృప్తి నొందుచున్నాను. ఈకారణమువలననే
నాకు చక్కని అభివృద్ధికలిగినది. ఓ శ్రీరామచంద్రా! ఈవిధముగ తనఅనుభ
వమును వర్ణించి చెప్పుచున్న అక్కాంతామణిని చూచి ఆమె వాక్యములకు
అర్థమును తెలిసికొనలేక నవ్వుచు ఆశిఖిధ్వజుడు ఇట్లనియె. ఓసుందరాంగీ !

నీవు బాలికవు. సంబంధములేని మాటలను మాటలాడుచున్నావువేల ? "నేను రాజ వినోదములయందు రమించుట లేదు" అని చెప్పితివి కదా, ఇది ఏటిమాట ? నావలెనే నీవును సర్వవినోదములను జూచి ఆనందించుచునే ఉన్నావుకదా ? ప్రత్యక్షమునందు గానవచ్చుచున్న పదార్థములను విడిచి ఏమియును గానిదానిని ఆశ్రయించినవాడు ఎవ్వడైన గలడా ? ఉన్నను, వాడు ఇట్లు ప్రకాశించునా ? శూన్యమును ఆశ్రయించినవానికి ప్రకాశము ఎక్కడిది ? "భోగములను అనుభవింపకున్నను నాకు తృప్తి కలుగును" అని భోగములను విడిచిపెట్టు వెఱ్ఱి ఎవ్వడు? అట్టివాడు ప్రకాశించుట ఎట్లు ? అట్టివానికంటె దౌర్భాగ్యవంతుడు దరిద్రుడు వేరొకడు లేడు కదా ? "నేను కనబడుదానిని చూచుటలేదు. కనబడనిదానిని చూచుచున్నాను" అని చెప్పుటకంటెను అసత్యము ఇంకేది కలదు ? అట్టి విపరీతదృష్టి గలవాడు ఎట్లు ప్రకాశించును ? కావున నీవు బాలికవు. ముగ్ధాంగనవు. చంచలస్వభావము గలదానవు. ఓవిలాసవతీ ! ఓనాహృదయేశ్వరీ ! చమత్కారవాక్యములచేత నాతో ఆడుకొనుచున్నావు. అట్లే ఆడుకొనుము. ఓసత్యపరాక్రమా ! శ్రీరామా ! ఈవిధముగ ఆశిఖిధ్వజమహారాజు పెద్దగ నవ్వుచు ఆమెను పరిహాసముచేసి మధ్యాహ్నకాలమగుటచేత స్నానార్థమై అచ్చటనుండి వెడలి పోయెను. ఆచూడాలయు తనభర్తకు ఆత్మనిష్ఠ కలుగకున్నందులకును, తన వాక్యములను గ్రహింపలేక పోయినందులకును, వగచుచు తన పనిమీద నుండెను.

### —* చూడాల ఆకాశగమనాదులను సాధించుట. *—

ఓరామచంద్రా ! ఈవిధముగ విజ్ఞానవతియై ఆచూడాలయు శాస్త్రవిచారము ఎంతగావించినను ఆత్మజ్ఞానము నొందని ఆశిఖిధ్వజుడను స్వేచ్ఛగానుండగ బహుకాలము గడచిపోయెను. అంత ఒకానొకప్పుడు పరిపూర్ణతృప్తి నొందినదియే యైనను,కోరికలు ఏమియును లేనిదియే యైనను, ఆచూడాల విలాసముగ ఆకాశ గమనాది శక్తులను సంపాదింపవలయునని తలంచెను. తత్క్షణమే ఆసంకల్పమును నెరవేర్చుకొనుటకై సర్వభోగములను పరిత్యజించి ఏకాంత స్థలమును జేరెను. అచ్చట ఒక్కతెయే యుండి ఆసనముపై గూర్చుండి శరీరమును నిక్కించి ప్రాణవాయువులను అధోభాగమునుండి ఊర్ధ్వభాగమునకు ఆకర్షించుచు బహుకాలము యోగాభ్యాసము చేసెను.

## — { ఆకాశగమనాది సిద్ధులనొసంగు యోగముయొక్క స్వరూపము. } —

అని వశిష్ఠమహాముని చెప్పిన విని శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓమునీంద్రా ! ధ్యానికతో ప్రయత్నించిన ఆకాశగమనాది సిద్ధులు ఎట్లు గలుగును? ఏప్రాణగతిని అభ్యసింపవలయును ? ఈవిషయమును నాకు వివరించి చెప్పుము. అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓ శ్రీరామచంద్రా! శిఖిధ్వజ మహారాజ కథా ప్రస్తాపము వలన యోగస్వరూపమునుగూడ వర్ణింపవలసి వచ్చినది. వినుము. పరిపూర్ణముగ ఈవిషయమును వివరించుచున్నాను. యోగమును సాధింప దలంచువాడు మొట్టమొదట తనమనస్సునందు తాను సంకల్పించిన విషయమును మాత్రమే ( యోగమును మాత్రమే ) స్థిరముచేసి కొనవలయును. తక్కిన సంకల్పములను సంపూర్ణముగ విడువ వలయును. పిమ్మట యోగ శాస్త్రోక్తములగు ఉపాయముల చేత నవరంధ్రములను నిరోధింప వలయును. భోజనమును మితముగ ఆచరింప వలయును. యోగశాస్త్రోక్తములగు ఆసనములను అభ్యసింప వలయును. వేదాంత శాస్త్రార్థమును యోగశాస్త్రార్థమును బాగుగ విమర్శింప వలయును. సదాచారములను అవలంబింప వలయును. సత్పురుషులతో స్నేహమును చేయవలయును. సర్వమును పరిత్యజించి శాంతి జెంద వలయును. ప్రాణనిరోధమును పలుమారు అభ్యసించుటచేతను, కామక్రోధాదులను విడుచుటచేతను, ప్రాణమనస్సులను రెంటిని నిరోధింప వలయును. సర్వభోగములను పరిత్యజింప వలయును. ఇట్లు చేసిన " రాజునకు భృత్యులు వశగతు లగునట్లు " ఆజ్ఞానికి ప్రాణములు వశగతములు అగును. వానిని విడుచుటకుగాని, నిలుపుకొనుటకు గాని, నిరోధించుటకు గాని, శక్తిగలుగును.

ఓరామచంద్రా ! ఇట్లు ప్రాణములు లోబడెనేని రాజ్యము మొదలు మోక్షమువరకు గలుగు సర్వసంపత్తులును ఆసాధకునకు కరతలామలకములే అగును. వాడు చేసిన కావలయుననిన దానినే సాధింప వచ్చును. శరీరమధ్యమున నాభిస్థానమునందు అంత్రవేష్టనిక అను ఒక నాడి కలదు. అది చుట్టబడిన ఆకారముతో నుండును. తిగెచుట్టవలెను, నీటిసుడివలెను, చలికి చుట్టచుట్టుకొని నిదురించుచున్న సర్పమువలెను ఆనాడి ప్రకాశించుచుండును. దానిని నూఱు నాడులు ఆశ్రయించి ఉన్నవి. ఈనాడి పురుగు మొదలు బ్రహ్మావరకుగల సర్వజంతువులయందును ఉన్నది. ( శరీరమునం

దలి అవయవములలో కొన్ని కొన్ని జంతువులకు కొన్ని కొన్ని తక్కువగా నుండును. ఈయంత్రవేష్టనికా నాడి మాత్రము అన్నిటికిని ఉండుననుట ) ఆనాడి వాయువశమున సర్వకాలములయందును చలించుచునే ఉండును. "అరటి మొగ్గవలె" అతికోమలమై ఉన్న దానియొక్క లోపలి భాగమందు, లేక, మధ్యమునందు సర్వనాడులకును వేగమును ఇచ్చుచు అతిపవిత్రమగు ఒకానొక శక్తి కలదు. అదియే శరీరచలనమునకుగూడ హేతువు. "కోపించిన సర్పమువలె" అది ఎప్పుడును నిశ్శ్వాసము విడుచుచున్నట్లు ఉండును. (అనగా, ఆనరముయొక్క చుట్టను విడదీయు ప్రయత్నమును బలవంతముతో చేయుచుండుననుట. కడియారమునందలి తీగె చుట్టయొక్క స్వభావమువలెనే దీని స్వభావముకూడ నుండునని తెలిసికొనవలయును. ఆతీగెచుట్ట తనతో సంబంధపడియున్న చక్రములకు చాంచల్యమును కలిగించునట్లే ఇదియు తనతో సంబంధపడియున్న నరములకు చాంచల్యమును కలిగించుచున్నది అని తెలిసికొనవలయును ) దానిముఖము ఊర్ధ్వభాగమునకు త్రిప్పబడియుండును. హృదయమధ్యమును ఆశ్రయించియున్న నరములన్నియు దానితో సంబంధపడి ఉన్నవి. దానికి అంతఃకుండలిని అని పేరు. అదియే చాంచల్యశక్తి స్పర్శజ్ఞానము. దేహమునకు గలుగు ప్రకాశము. సర్వకార్యములను చేయుటవలన దానికే కళ అని పేరు. చేతనమగుటచేతను, జ్ఞానశక్తికి ఆధారమగుటచేతను, అదియే చిత్తు. ప్రాణాధారమగుటచేత అదియే జీవుడు. సంకల్పాదులను చేయుచుండుటచేత అదియే మనస్సు. సంకల్పించుచుండుటవలనను అదియే సంకల్పము తెలిసికొనుచుండుటవలనను అదియేబుద్ధి. "నేను" అని అభిమానించుటచేత అదియే అహంకారము. కావున ఆశక్తియే అష్టపురములనుపేర బరగుచున్నది. ఈకుండలినీశక్తి సర్వప్రాణములకు ఆధారమై దేహమునందు ఉన్నది. దానికి ప్రాణాపానములే స్వరూపమగుటచేత అది క్రిందికిని మీదికిని పోవుచుండును. ఎప్పుడైనను అది అంతయును సంపూర్ణముగ మీదికిగాని క్రిందికిగాని పోయెనేని మనుష్యుడు మృతుడగును. అదియే ప్రాణముకదా? ఇట్లుగాక ఆశక్తి పైకిని క్రిందికిని చలింపక దానిస్థానమునందే స్థిరముగ నుండునేని అప్పుడు సాధకునకు వ్యాధులు కలుగనేరవు. మృతియు కలుగదు. ఇట్టిస్థితి వాయునిరోధమువలన వచ్చును. ఆశక్తికి ప్రాణాపానములే స్వరూపమని ఇదివరకే చెప్పియున్నాముకదా ?

———※———

—* ఆధివ్యాధి స్వరూపములు. తన్నాశోపాయము. *—

అని వశిష్ఠమహర్షి చెప్పిన శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓమునీంద్రా! యోగప్రభావము ఇట్టిదియే అగునుగాని, మఱియొక విషయమును ప్రశ్నించెదను. శరీరమునందు ఆధివ్యాధులు ఎక్కడనుండి పుట్టును. దేని సహాయముచేత నశించును. అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లని ఉత్తర మిచ్చెను. ఓరామచంద్రా! వినుము. శరీరమునందు కలుగు జ్వరము మొదలగు దుఃఖములు వ్యాధు లనబడును. కేవల సంసారమువలన మాత్రమే పుట్టి మనస్సును బాధించు చింతలు ఆధు లనబడును. ఈరెండును ఆత్మజ్ఞానము లేకపోవుటచేత కలిగినవియే అని తెలిసికొనుము. తత్వజ్ఞానమువలన నశించునని నిశ్చయింపుము. అందు ఆత్మజ్ఞానము లేకపోవుటచేత ఇంద్రియములు స్వేచ్ఛగ చలించుచు ఉన్నప్పుడు, మనస్సు క్షీణింపక విజృంభించుచున్నప్పుడు, రాగద్వేషములు అభివృద్ధిని జెందుచున్నప్పుడు " ఇదికలదు, ఇదిలేదు, దీనిని ఇంకను సంపాదింప వలయును " అను మొదలగు రూపములతో ఆధులు కోట్లు, కోట్లుగా, పుట్టును. అవి జడములగుటచేత మంచువలె పురుషుని జడునిగా గావించును. దట్టమగు భ్రాంతిని కలిగించును. మితిమీరని శోకము నొందించును. ఇవి ఆధులవిధము. ఇక వ్యాధులనుగూర్చి వినుము. కోరికలు అధికములై మూర్ఖత మితిమీరి ఉండు సమయమునందు పురుషుడు యుక్తాయుక్తములను ఎఱుగక నాలుకకు రుచియనితోచు పదార్థములనెల్ల భుజియించును. కంటికి ఇంపనితోచిన స్థలములకెల్ల మంచిచెడ్డలను విచారింపక నడచును. కాల విభాగమును గుఱుతెరుగక ఇచ్ఛవచ్చినట్లు సంచరించును. ఇవి అవి అనక చెడ్డకార్యములను ఆచరించును. చెడ్డవారితో సహవాసము చేయును. మంచివారియొక్క మాటలకంటె చెడ్డవారి మాటలు రుచిగా నుండుననుట లోకానుభవ సిద్ధము కదా ? కావున వారు దుష్టులనే ఆశ్రయింతురు. ఎప్పుడును చెడ్డతలంపులనే తలచుచుందురు. ఇంద్రియ నిగ్రహమునకంటె ఇంద్రియస్వేచ్ఛ మొట్టమొదట సుఖకరముగ గానవచ్చును కదా ? ఈవిధముగ మనస్సు దుష్టమై ఉండుటచేత నియమములను అతిక్రమించుటవలన వ్యాధి జనించును. పూర్వజన్మ సంబంధమువలన గాని, ప్రస్తుత జన్మమునందలి సహవాసాదులవలనగాని, పుట్టిన సంసారమే సర్వమునకును గారణము. అది మంచిదైన మంచివిషయముల యందు పురుషుని ప్రవర్తింప జేయును. ఆధివ్యాధులను కలుగకుండునట్లు చేయును. చిత్తశుద్ధిని కలిగించి ముక్తిని గూడ సంపాదించును. అది అశుభ

మయ్యేనేని సంసారాంతరమువలన కలిగిన జ్ఞానమునుకూడ నాశముచేసి చిత్తమును కలచి బహువిధ దుర్వ్యాపారములలో ప్రవేశపెట్టి ఆధివ్యాధి పరంపరలకు లోబరచును. సర్వమును సంసారాధీనమే. కావున పురుషుడు ప్రయత్నపూర్వకముగా దుస్సంసారములను తొలగింప ప్రయత్నింపవలయును. సంపూర్ణముగ వానిని తొలగింపలేకున్నను, శుభసంసారములనైనను, హెచ్చింపవచ్చునుకదా? ఏది ప్రబలమైయున్న దాని సామర్థ్యమే కార్యకారి అగుననియు, రెండవది ఏమియు పనిచేయజాలదనియు, లోకానుభవమువలన స్పష్టము. కావున ఈ ఆధివ్యాధులకు సంసారములే కారణములు. వీనిస్థానము పంచభూతములే. పంచభూతాత్మకమగు మనస్సే ఆధిస్థానము. శరీరమే వ్యాధిస్థానము. ఇక ఇవి నశించు విధమును చెప్పెదను వినుము. ఆధి రెండు విధములు. సామాన్యము, సారభూతము, అని. సామాన్యమనగా, ఆకలి దప్పి మొదలగు స్వరూపములు గల వ్యవహారము. సారభూతమనగా, జన్మపరంపరకు గారణమగు భ్రాంతి. అందు సామాన్యములగు ఆధులు కోరిన వస్తువు దొరకగానే నశించును. కడుపు నిండిన పిమ్మట ఆకలి ఉండదు. దప్పి తీరిన పిమ్మట దానిని ఆశ్రయించిన బాధయుండదు కదా ? ఇట్లు ఆ ఆధులు నశించిన వానివలన పుట్టిన వ్యాధులు కూడ నశించును. ఆకలి దప్పులు అధికములైనప్పుడు బలహీనత చెవులు గడియలుపడుట, మొదలగు వ్యాధులు పుట్టుననుటయు, ఆ ఆకలి దప్పులు తీరగానే అవియు నశించుననుటయు, అనుభవ సిద్ధము.

ఓరామచంద్రా ! ఇక సారభూతమగు ఆధి ఆత్మజ్ఞానములేక నశింపదు. త్రాటినిచూచి పామని జనించిన భ్రాంతి త్రాటియొక్క స్వరూపజ్ఞానములేక, నశింపదుకదా ? ఇట్లే ఆత్మనుచూచి ప్రపంచమని జనించిన భ్రాంతి ఆత్మస్వరూప జ్ఞానములేక, నశింపదు. దానివలన పుట్టిన సంసారమను మహావ్యాధియు అది నశింపకున్న నశింపదు. మఱియు కొన్నివ్యాధులు ఆధులతో సంబంధము లేకయే ప్రమాదాదులవలన గలుగును. వాతపిత్తాదిదోష ప్రకోపముచేత పుట్టును. అట్టి వ్యాధులు వైద్యశాస్త్రము మొదలగువాట్లలో జెప్పబడిన పదార్థ సంయోగాదులచేతను మంత్రశాస్త్రములలో జెప్పబడిన శాంతి హోమాదులచేతను నశించును. ఇది నీవును ఎఱిగిన విషయమే. మఱియును అన్నిటికిని భ్రాంతిరూపమగు ఆధితో సంబంధము కలిగేయున్నది. అయినను అది పరంపరా సంబంధము. ప్రత్యక్షముగనే ఆకలి మొదలగు ఆధులతో సంబంధము కలిగి దుర్బలము మొదలగు

వ్యాధులు కొన్ని కలుగును. మఱికొన్ని భ్రాంతితో పరంపరా సంబంధము కలిగియున్నను, ఆహారాదులతో ప్రత్యక్ష సంబంధము కలిగి పుట్టుచుండును. ఇందు మొదటివి ఆధులనుండి జనించిన వ్యాధులన్నియు రెండవమారు చెప్పబడినవి ఆధిసంబంధము లేకయే పుట్టినవనియు జెప్పబడును.

—* ఆధివలన వ్యాధిపుట్టునట్టి ప్రకారము. *—

అని వశిష్ఠమహాముని చెప్పిన శ్రీరామచంద్రుడు విని మఱల ఇట్లనియె. ఓభగవంతుడా! వశిష్ఠమహర్షీ! ఆధియనగా, మనోవ్యధకదా? దానినుండి శరీరమునందు వ్యాధి ఏల పుట్టవలయును? ఈవిషయమును సవిస్తరముగ చెప్పవలయును. అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె. మనస్సునకు ఆధివలన విక్షోభము కలుగును. దానిచేత దేహము సంక్షోభమునొందును. ఈవిషయము ప్రత్యక్షము. కోపము అధికముగా వచ్చిన సమయమునందు పురుషుడు తన ఎదుట ఉన్నదానినికూడ చూడలేదనుట సర్వానుభవ సిద్ధముకదా? ఇంతయేకాదు. “బాణముచేత వ్రేటుపడ్డ లేడివలె” వాడు పోవలసిన మార్గమును విడచి అన్యమార్గమును అవలంబించుననుటయు అనుభవ సిద్ధమే కదా? కావున మనస్సునందు సంక్షోభము కలిగిననప్పుడే దేహమునందును కలత జనించుననుట నిర్వివాదము. ఇట్లు దేహము కలతనొందిన ప్రాణవాయువులు సమముగ సంచరింపక అతి విషమముగ దిరుగ ఆరంభించును. దానిచేత వానిని ఆశ్రయించియున్న నరములన్నియు చెదరును. అప్పుడు “ప్రభువు సరిగానుండకున్న వర్ణాశ్రమ ధర్మములు చెడిపోవునట్లు” ప్రాణనాడులయొక్క వైపరీత్యముచేత భుజించిన ఆహారము బొత్తిగనే జీర్ణింపకగాని, అధికముగ జీర్ణించికాని, ఉండును. ఇవి రెండును విషమస్థితులేకదా? ఇట్టి అన్నము శరీరమునందు ఉండిన అదియే రోగమగును. దుష్టాన్నమే రోగరూపముగ పరిణామమును జెందుననుట స్వభావము. అన్నమునకు పరిణామము నిత్యసిద్ధము. కావున దీనికంతకును ఆధియే కారణము. కావున ఆధి నశింపగానే ఇట్లుజనించిన వ్యాధియు నశించును. ఇక మంత్రములచేత వ్యాధినశించువిధమును వినుము. కరకకాయలు స్వభావముగనే విరేచనముచేయునట్లు యరలవాదులగు మంత్రాక్షరములు ధ్యాన బలము వలన కొంతకార్యమును ఆచరింప సమర్థము లగును.

ఓ సత్పురుషుడా! శ్రీరామా! పరిశుద్ధములగు కార్యములచేతను, సజ్జన సేవచేతను, పవిత్రములగు తలంపులచేతను, ఒరయబడిన సువర్ణమువలె మనస్సు నిర్మలమగును. ఈవిషయమునందు మంత్రములు తోడ్పడును.

వానికి భావనాబలముచేత అపరిశుద్ధ చిత్తములను నిర్మలములను చేయుసామర్థ్యము కలదు. ఇట్లు మనస్సు శుద్ధముకాగానే పూర్ణచంద్రోదయము చేత ప్రపంచము ప్రకాశించునట్లు,స్వచ్ఛమగునట్లు దేహమంతయును ఆనందప్రవాహముచేత పరిపూర్ణమగును. ఈవిధముగ మనస్సు పరిశుద్ధమై దేహము స్వస్థమగునేని, అప్పుడు ప్రాణవాయువులు సరిగా సంచరించును. అన్నము చక్కగా జీర్ణమగును. దానిచేత వ్యాధినశించును. ఇదియే మంత్రములవలన వ్యాధులు నశించు విధము. ఔషధాదులును తమప్రభావముచేత వాతపిత్తాది దోషములను అణగించి వానిప్రకోపమువలన కలిగిన చిత్తసంక్షోభమును అణచి పైనవర్ణించిన విధముగనే క్రమముగ ఆరోగ్యమును కలిగించును. ఓరఘురామా ! కుండలినీశక్తిని వర్ణించు ప్రసంగమువలన నీకు ఆధివ్యాధుల పుట్టుకనుగూర్చియు వాని నాశమును గూర్చియు వివరించితిని. ఇక కథాసందర్భమును వినుము.

—* ఆకాశ గమనాది సిద్ధి కథనము. *—

ఓనీలోత్పలశ్యామా! రామా! పుర్యష్టకమను పేరుగలదియు, జీవులకు ఆధారమైనదియు, ప్రాణరూపమైనదియు, నని వర్ణింపబడిన కుండలినీశక్తి ఏదికలదో, అదియే వాసనకు పుట్టుగుత్తివలె సర్వసిద్ధులకును ఆధారమైనది అని తెలిసికొనుము. కావున పూరకమును ( వాయువును దేహమునందు నిండించుట ) బాగుగ అభ్యసించి దానిబలమున కుండలిని పూరించి స్థిరముగ నిలుచునేని అప్పుడు సాధకునకు మేరుపర్వతముతో సమానమగు స్థిరత్వము బరువుకూడ వచ్చును. శరీరము మిక్కిలి లావగును. ( మహిమ, గరిమ, అను రెండుసిద్ధులను కలుగుననుట ) అట్లు పూరింపబడిన వాయువువలన చుట్టవలెనున్న కుండలిని దండాకారము గావించి ఊర్ధ్వముఖముగ సంకల్పబలముచేత ఆకర్షించిన అప్పుడు శిరస్సునుండి పడుచున్న అమృతము తగులుటచేతను, యోగము బాగుగ అలవాటు పడియుండుటచేతను, దేహమునకు గలుగు శ్రమ సుఖముగనే సహించుటకు సాధ్యమగును. ప్రాణమును లోపల నిండించునప్పటికే ఎంతయో కాలముపట్టును. ఇట్లుండ కుండలిని పైకి ఆకర్షించునప్పటికి ఎంతకాలము పట్టవలయును, అంత అలవాటు కావలయును. ఈకారణమువలన అప్పుడు శ్రమ ఏమియుం దోపదు. ఇట్లు ఆకుండలిని పైకి నీడ్చిన అది సర్పమునుబోలె సన్నమై తనతో సంబంధపడి తీగెలవలె దేహమునందు అంతటను చుట్టబడియున్న నరములను అన్నిటిని గైకొని పైకిబోవును. ఇట్లు అతిత్వరితముగ బోవునప్పుడు ఈదేహము

అంతయునుగూడ పైకిబోవును. ప్రాణవాయువు పరిపూర్ణముగ నిండియుం డుటచేత అప్పుడు ఈశరీరము తేలికయై యుండును. కావున కుండలిని కదలగానే, బావిలో వేయబడిన తోలుతిత్తిచేత తాటిని పైకి ఈడ్వగానే తనలోనున్న జలముతోకూడ పైకివచ్చునట్లు ఆకుండలినితోకూడ పైకిపోవును. (ఆకుండలిని దేహమునందే తాను ఉన్నస్థానమును విడచి శిరస్సునకు బోవును. అయినను దేహము తేలికయగుటచేత భూమిపైనుండి కదలి మహావాయు పథమును జేరును. అని తెలిసికొనవలయును. గాలికంటె తేలికయైన పదార్థములు గాలికి పైభాగమునకు పోయి నిలచును. ( దీనికి ప్రస్తుతపు విమానములే ఉదాహరణము ) ఓరామచంద్రా ! దరిద్రులగువారైనను సత్కర్మానుష్ఠానమువలన ఇంద్రపదమును సంపాదించునట్లు యోగులు అభ్యాసబలమువలన పైనజెప్పిన విధముగ ఆకాశగమనాది సిద్ధులను సంపాదించుకొందురు.

—* సిద్ధదర్శనోపాయము. *—

ఓశ్రీరామా ! " ఇట్టియోగులు కలరేని మనకు ఏల గానరారు " అనియెదవేమో, వినుము. వారిని చూచుటకుగూడ కొంత ప్రయత్నము కావలయును. రేచకముచేత ( ప్రాణవాయువును వెలికివిడుచుట ) సర్వనాడులను సర్వహించి కుండలినిని మాత్రము ఊర్ధ్వమునకు ఆకర్షించి కపాలమునకు వెలుపల ఒకక్షణము నిలిపిన అప్పుడు ఆకాశగమనము చేయుచున్న సిద్ధులు గానవత్తురు. వారు ఇష్టార్థములను ఇచ్చువారైనను ప్రత్యక్షముగ అనగా, చర్మనేత్రములకు గానరారు. వీనికి అంతదూరము చూడగలుగునంత సామర్థ్యము లేదుకదా ? కావున యోగాభ్యాసయుక్తమై ఎంతదూరమైనను చూడగల బుద్ధినేత్రము మాత్రమే వారిని చూడగలదు. కావున వారిదర్శనము స్వప్నమువంటిదే అగును.

—* పరకాయప్రవేశము. *—

ఓశ్రీరామా ! మఱియు మహాత్ములగు యోగులు రేచకమును దృఢముగ అభ్యసించుటవలన శరీరమునందుండు వాయువులు అంతయు నోటినుండి వెలుపలికి విడిచి అచ్చట బహుకాలము నిలుపగలిగిన తనదేహమును విడచి మఱియొకని దేహమునందు ప్రవేశింప వచ్చును.

—* అణిమాదుల వివరము. *—

అని వశిష్ఠమహర్షి చెప్పిన మాటల రామచంద్రుడు ఇట్లనియె. ఓమహాత్మా! వశిష్ఠమహామునీ! మఱి యొక విషయము. సూక్ష్మములగు రంధ్రా

దులనుండి పోవుటకును ఆకాశమునంతయు నిండించుటకును యోగులుసమర్థులని వినుచున్నాము. ఈదేహము అట్లు మిక్కిలి సన్నమగుట ఎట్లు? లావగుటయు నెట్లు? అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓశ్రీరామా! వినుము. కలదు అని చెప్పబడునది బ్రహ్మము ఒక్కటియే. అంతకంటె భిన్నముగ ప్రపంచముగాని, పాంచభౌతిక పదార్థములుగాని, లేవు. అది సూక్ష్మమునకంటె సూక్ష్మమైనది. అట్టి ఆబ్రహ్మమే సంకల్పవశముచేత తన్ను దాను అన్యరూపునిగా చేసికొనినది. కళంకమును స్వయముగనే చెందినది. ఇట్టి స్థితికి వచ్చిన పిమ్మట అదియే జీవుడయ్యెను. కావున ఆజీవుడు బొత్తిగనే లేని ఈశరీరమును భ్రాంతిచేత ఉన్నదానివలె చూచుచున్నాడు. బాలుడు చీకటియందు ఏమియు లేని స్థలమునందే దయ్యము ఉన్నది అని తలంచునట్లు ఏమియు లేకున్నను " దేహముకలదు " అని తలంచుచున్నాడు. ఈవిధముగనే ఆత్మజ్ఞానము కలవారు సత్యసంకల్పులు అగుటచేత ఎప్పటికి దేనిని ఎట్లు తలంతురో, అప్పటికి అట్లే చూడకలుగుదురు. ఇంతేల? అజ్ఞానులైనను దృఢభావనను కలిగియుందురేని విషమును అమృతముగా మార్చగలరు. అమృతమును విషముగా చేయగలరు. కావున దృఢభావనవలన ఏదేది భావింపబడునో, అదియంతయును అట్లే అగుచుండును. సర్వమునకును మనోజయమే ప్రధానము. కావున ఈదేహమును సత్యముగా దలంచిన సత్యమగును. అసత్యముగా దృఢభావన చేసిన అసత్యమే ఆకాశకల్పమే అగును.

ఓబుద్ధిమంతుడవగు శ్రీరామా ! అణిమాది సిద్ధులకుగూడ ఇట్టిదృఢసంకల్పమే కారణము. "నాదేహము సన్నము కావలయును" అను దృఢభావన కలుగునేని సన్నమే అగును. నాదేహము ఆకాశమునంతయు నిండించునంత స్థూలము కావలయును " అను దృఢభావన ఉండునేని అట్లే అగును. ఈమార్గము తక్కినవానికంటె మిక్కిలి సులభము. ఈవిధముగ ఎడతెగక అభ్యాసమును గావించి రాజకన్యకయగు ఆచూడాల అణిమాద్యష్టైశ్వర్యములను పొందెను. అమృతమువలె మిక్కిలి శాంతమై ఆమె ఆకాశముపై యథేచ్ఛముగా విహరించెను. సముద్రమధ్యమునందు దూరెను. భూమిపై విహరించెను. గంగవలె త్రిలోకములలోను సంచరించెను. ఇట్లు సంచరించుచు భర్త సమీపమునకు వచ్చినప్పుడెల్ల ఆతనితో సంభాషణములాడ తటస్థించునప్పుడెల్ల అతని అజ్ఞానమునుగూర్చి వగచుచు ఎట్లైనను అతనికి జ్ఞానోదయమును కలిగింపవలయునని ఉపాయములను ఆలో

చించు చుండెను. ఇట్లుతలంచి ఏవియో కొన్ని ఉపాయములను నిర్ణయించి దానికి అనుగుణముగ అనేక మారులు భర్తకు ఆత్మస్వరూపమును బోధించెను గాని, ఆతడు మాత్రము వివేకవంతుడయ్యును ప్రతిబంధవశమున ( ప్రతిబంధమనగా, పూర్వకృత పాపములు ) తత్వమును ఎఱుగలేక పోయెను. ఇంతకాలమునుండియు ఆమెతో కూడియే ఉన్నను ఆమెకు అట్టి మహోదయము కలిగియున్నదను విషయమునుకూడ ఆతడు ఎఱుగలేక పోయెను. ఆచూడాల చెప్పు విషయములను పరిహాసమాత్రములుగ దలంచుచు మాత్రమే ఉండెను. ఎన్నిపుస్తకములు సమీపమునందు ఉన్నను, ఎంతవివేకవంతుడగు వానితో సహవాసము చేసినను, అవివేకియగు బాలుడు విద్యాస్వరూపమును ఎఱుగలేడు కదా ? ఆచూడాలయు ఇట్లు ఆత్మజ్ఞాన శూన్యుడైయున్న తనభర్తకు శూద్రునకు యజ్ఞక్రియను జూపని విధమున తనకు గల యోగసిద్ధిని చూపలేదు. అట్లు చూపుటవలన ఆశ్చర్యము ఒకటియే కాని, ఇక ఏమియు ఫలము కలుగదు. తనయందును ఆప్రభువునకు మాయాశీలయను బుద్ధి జనించును కదా ?

—* బ్రహ్మజ్ఞానప్రాప్తి. *—

అని వశిష్ఠమహర్షి చెప్పిన విని శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓమహాత్మా ! వశిష్ఠమహాముని ! చూడాల మహాయోగిని. అట్టిదియే మహాప్రయత్నముచేసి బోధింప జూచినను, శిఖిధ్వజునకు జ్ఞానము రాలేదు. ఇక సామాన్యులయొక్క ఉపదేశమువలన అన్యులకు జ్ఞానము ఎట్లు కలుగును ? అనిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓరామచంద్రా ! ఇట్టి సంశయము వలదు. గురూపదేశము అనునది నియమమును రక్షించుట మాత్రమే అగును కాని, ఎప్పటికిని బ్రహ్మజ్ఞానమునకు సాధనము కానేరదు. దానికి ఎప్పటికిని శిష్యుని బుద్ధియే కారణము. శిష్యులకు తగినంత జ్ఞానము ఉండిన పరమాత్మరూపము తెలియబడును. లేకున్న తెలియబడదు. ఇంతయే కాని, ఇందు గురువు చేయునది ఏదియు లేదు. అనిన మఱల రామచంద్రుడు ఇట్లనియె. ఓఋషిశ్రేష్ఠా! ఇట్లయిన, లోకమునందు గురూపదేశమువలన కాని,బ్రహ్మజ్ఞానము దొరుకుట లేదుకదా ? అది ఎట్లు ? గురూపదేశము బ్రహ్మజ్ఞానమునకు ఎట్లు కారణమగుచున్నది. వివరించి చెప్పుడు. అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓశ్రీరామా! వినుము. వింధ్యపర్వత ప్రాంతారణ్యమునందు ధన ధాన్య సమృద్ధిగల ఒకానొక కోమటిశెట్టి " బ్రాహ్మణులవలె " కుటుంబసహితుడై నివసించుచుండెను. అతడు ఒకనాడు కొంత

ధనమును చేతదీసికొని ఎక్కడికో పోవుచుండగా ఆ అరణ్య మధ్యమునందు గడ్డిమొదలగువానిచేత దట్టముగ ఆక్రమింపబడియున్న ప్రదేశములయందు వానిచేతిలోనుండి ఒక గవ్వ జారి పడెను. వాడు అతిలోభి యగుటచేత ఆగవ్వకొఱకై అచ్చోటనుండు గడ్డిమొదలగువానిని అన్నిటిని ఖూనికెతో మూడు దినములవరకు కోసివేసెను. ఇట్లుఆహారాదులను సహితము వర్జించి కష్టపడగా మూడవనాటి సాయంకాలమునకు అచ్చట చంద్రబింబముతో సమానమగు చింతామణి దొరికెను. ఇట్లే ఓరఘురామా! గురూపదేశ మువలన బ్రహ్మజ్ఞానము దొరుకుచున్నది. ఆకోమటి గవ్వకై వెతకినను రత్న ము దొరకినట్లు సాధకుడును గురూపదేశమును ఆశ్రయించి సోపాధిక బ్రహ్మమును (అవిద్యాదులతో గూడిన బ్రహ్మమును) వెదకుచున్నను నిర్గు ణబ్రహ్మము దొరుకును. బాగుగ విచారించిన నిరుపాధిక బ్రహ్మమును ఉప దేశించుటగాని, తెలిసికొనుటగాని, సంభవింపదు. అది స్వస్వరూపమేయై యుండ దానిని అన్యుడెవ్వడు ఉపదేశింపగలడు. ఎవ్వడు తెలిసికొనగల డు. కావున గురూపదేశము బ్రహ్మజ్ఞానమునకు నిమిత్తమాత్రము. ఆకోమ టికి దొరకిన మణికి గవ్వ కారణముగాకయు, కారణమైనట్లు, ఈ నిర్విశేష బ్రహ్మజ్ఞానమునకును గురువు కారణముకాకయు కారణమగుచున్నది. ఆకో మటి గవ్వ క్రిందపడకుండిన అట్లు గడ్డిమొదలగువాటిని తొలగించి శోధిం పడు. చింతామణియు దొరకదు. ఇట్లే శిష్యుడును గురూపదేశము లేకు న్న అంతర్ముఖుడు కాడు. నిర్విశేష బ్రహ్మజ్ఞానమును కలుగదు. ఇంతమా త్రమువలననే "గురూపదేశము బ్రహ్మజ్ఞానమునకు కారణము" అని లోక మునందు చెప్పబడుచున్నది.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున వరాటికోపాఖ్యానమను
ముప్పదియేడవ సర్గము ముగిసెను.

——*——

శ్రీవశిష్ఠమహర్షి శ్రీరామునితో ఇట్లనియె. ఓరామచంద్రా! అవతలి వృత్తాంతమును వినుము. పైన వర్ణించిన విధముగ ఆచూడాల ఎంత ప్రయ త్నమును గావించినను ఆత్మను ఎఱుగలేక "చీకటియందు జనులు గ్రుడ్డి వారగునట్లు" శిఖిధ్వజుడును గ్రుడ్డివాడాయెను. ఇట్లు కొంతకాలము జరి గిన పిమ్మట ఒకనాడు శిఖిధ్వజుడు మిక్కిలి శోకము నొందెను. సంసా

రమునందు దుఃఖమునకు ఏమికొదువ ? ఇట్లగుటచేత ఆ శిఖిధ్వజుడు మనస్సునందు ఎప్పుడును ఏదియో యొక చింతచేత బాధింప బడుచు ఎంత ఐశ్వర్యములు ఉన్నను ఎన్ని భోగములు ఉన్నను, వానియందు తృప్తి కలుగలేదు. అగ్నిజ్వాలలయందువలె ద్వేషమును మాత్రమే పూనుచుండెను. ఇట్లు ఎందును నిలుకడను జెందలేక తన మనస్సునందు సంసారవశముచేత కలిగిన అనిర్వచనీయమగు చింత దొలగుటకై అధికముగ దానముచేసెను. తీర్థయాత్రలును చేసెను. కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతములను ఆచరించెను. సర్వదేశములను జూచివచ్చెను. ఏమిచేసినను చిత్తమునకు స్వాస్థ్యము కలుగలేదు. వానికి అంత కంతకు చింత అధికమగుచు ఉండెను. దైన్యము హెచ్చుచుండెను. రాజ్యము విషతుల్యముగ గానవచ్చుచుండెను.

—* శిఖిధ్వజుడు తపస్సునకు బోవుట. *—

అంత ఒకనాడు ఆ శిఖిధ్వజుడు ఏకాంతమునందు తన తొడపై కూర్చుండియున్న చూడాలను చూచి మధురముగ ఇట్లనియెను. ఓ ప్రియురాలా ! ప్రాణేశ్వరీ ! చిరకాలమునుండియు రాజ్యమును చేసితిని. అమితముగ భోగములను అనుభవించితిని. ఇప్పుడు నాకు దీనియందు విసుకు పుట్టుచున్నది. కావున తపస్సు చేయుటకై అరణ్యమునకు పోయెదను. అట్లు చేసిన సుఖములుగాని, దుఃఖములుగాని, ఆపదలుగాని, సంపదలుగాని, నన్నేమియు చేయలేవు. అరణ్యమునందు తపోనిష్ఠయందు ఉండు వారికి ఇవి అన్నియు లేవు కదా? మఱియును అట్టి వనవాసులకు దేశమును శత్రువులు హరింతురేమో, అను భయము లేదు. యుద్ధమునందు గలుగు జనవినాశమును లేదు. కావున రాజ్యమునకంటె ఆ వనవాసమే సుఖదాయకమని తలచెదను. మఱియు ఏకాంతస్థలమునందు ఉన్నప్పుడు మనస్సునకు ఎట్టి నైర్మల్యము కలుగునో, అట్టి నైర్మల్యము చంద్రమండలమునందు ఉన్నను, బ్రహ్మరుద్రాదుల నివాసభూములగు సత్యలోక కైలాసాదులయందు ఉన్నను, కలుగనేరదు. ఓ ప్రాణనాయకీ ? ఈకారణమువలన నేను అరణ్యమునకు పోవుటకు నిశ్చయించితిని. దీనికి నీవు ఆటంకము చెప్పకూడదు. కులకాంతలు భర్తలయొక్క సంకల్పములకు కలలోనైనను, భంగమును కలిగింపరు. అని శిఖిధ్వజుడు చెప్పినచూడాల ఇట్లనియె. ఓ నా మనోనాయకా ! ఈ విషయమున నామనవి ఒకటికలదు. దేనికైనను తగినకాలము వచ్చిననేగాని ప్రకాశము కలుగదు. పుష్పము వసంతకాలమునందు ప్రకాశించినట్లు మఱియొక సమయమునందు ప్రకాశింపదు. పంటయు

శరత్కాలమునందు రాణించినట్లు మఱియొక కాలమునందు రాణింపదు ఇట్లే మీరు ఉద్దేశించిన కార్యముకూడా తగినకాలమునందే ప్రకాశించును గాని, ఎప్పుడన్న నప్పుడు ప్రకాశింప నేరదు. వనమునకుపోయి తపస్సును చేయవలసినవారు వృద్ధులుగాని యౌవనవంతులు కాదు. కావున మీరు ఇట్టి ఉద్దేశమును పెట్టుకొనుట నాకు ఇష్టములేదు. అని చూడాల చెప్పగానే శిఖిధ్వజుడు మరల ఇట్లనియె. ఓ ప్రియురాలా ! నామనోహారీ ! నీవు ఈ విఘ్నవాక్యములను చాలింపుము. నేను వనమునందు చేరి యున్నాననియే తలంపుము. ఓ కమలలోచనా ! సుందరాంగీ! నీవు నాతోకూడ రావలదు. నీవు సుకుమారివి. అరణ్యము లన్ననో, పురుషులకుగూడ చొరనశక్యమైనవి. కావున నీవు ఇక్కడనేయుండి రాజ్యమును పరిపాలించు చుండుము. భర్త గ్రామమున లేనప్పుడు కుటుంబభారము నంతయు నిర్వహించుట స్త్రీలకు వ్రతము. ఓ రామచంద్రా ! ఈవిధముగ ఆ శిఖిధ్వజుడు భార్యకు తన ఉద్దేశమును దెలిపి మధ్యాహ్నమగుటచేత స్నానమునకు వెడలిపోయెను.

పిమ్మట కాలక్రమమున తనకార్యమునంతయు ముగించి సూర్యుడు అస్తమానపర్వతమునందు విశ్రమింపబోయెను. రాత్రియను వనిత తామర-మొగ్గలను స్తనములతో నిండుయౌవనమును వహించెను. అంత శిఖిధ్వజుడు సంధ్యావందనాది కార్యములను నిర్వర్తించెను. ఇట్లు నిర్వర్తించి ప్రభువగు శిఖిధ్వజుడు చూడాలతోకూడ శయనించి నిదురించెను. మైనాకుడు సముద్రమునందు నిదురబోవు విధమున కొంతసేవు నిదురబోయి అర్ధరాత్రము కాగానే దేశమంతయు నిశ్శబ్దముకాగానే నిద్ర అనియెడు రాత్రియొక్క మధ్యమునందు జనులందరు లయమునొందగానే ఆ ప్రభువగు శిఖిధ్వజుడు మేలుకొని నిదురించుచున్న భార్యను అట్లే వదలి వెలుపలికి వచ్చెను. అచ్చట తనసేవకుని జూచి " ఒరే! సేవకా! నేను వీరవ్రతమును (రాజులు తమపరిపాలనాక్రమమును గూర్చి ప్రజలయొక్క అభిప్రాయమును తెలిసికొనుటకై అర్ధరాత్రమున స్వపురమునందు సంచరించుటకు వీరవ్రతమని పేరు ) జరుపబోవుచున్నాను " అనిచెప్పి వెలుపలికివచ్చి పురమును నిర్గమించి అరణ్యమునందు ప్రవేశించెను. ఆతనిమనస్సు తపోవిషయమునందు దృఢనిశ్చయము కలిగినదియై ఉండెను. ఇట్లు కొంతదూరము పోయి తన దేశపు సరిహద్దునుకూడ అతిక్రమించి వెనుకతట్టు తిరిగిచూచి " ఓ జడస్వరూపురాలా ! రాజ్యలక్ష్మీ ! నీకొక నమస్కారము " అనుచు చెప్పి, ఏకాకియై " నదము సముద్రమునందు ప్రవేశించునట్లు " అతిభయంకరమగు

మఱియొక అరణ్యమునందు ప్రవేశించెను (పశ్చిమమునుండి తూర్పునకుబోవు ప్రవాహమునకు నదియనియు, తూర్పునుండి పశ్చిమమునకు బోవు ప్రవాహమునకు నదము అనియుపేరు.) ఇట్లు అరణ్యమునుండి అరణ్యమును, రాజ్యమునుండి రాజ్యమును పర్వతమునుండి పర్వతమును, నదినుండి నదిని, గడచుచు పది దినములవరకు నడచుచునే ఉండెను.

ఓ రామచంద్రా ! మఱియు, యుక్తములగు స్థలములయందు రాత్రులలో విశ్రమించుచు పగలెల్ల ప్రయాణము చేయుచుండెను. ఇట్లు నడచి నడచి కట్టకడకు మందరపర్వతమునకు సమీపమునందు ఉన్న ఒకానొక మహారణ్యమును ప్రవేశించెను. అది ఎవరికిని చొరరానిది. దానికి పురములు బహుదూరమున నుండెను. అచ్చటి వృక్షములకు సమీపమునందు ఉన్న నడబావులలోనుండి కాలువలువచ్చిధ్వనితోగూడ జలమును ఇచ్చుచుండెను. అచ్చటచ్చట కొన్ని అరుగులు విరిగి పడియుండునవి కానవచ్చుచున్నందున పూర్వమునందు పదినైన నొక బ్రాహ్మణ కుటుంబము ఇచ్చట నివసించి ఉండవచ్చునని తోచుచుండెను. మఱియును అందు క్షుద్ర మృగములు ఏవియు లేవు. మహాపురుషులగు సిద్ధులు అందలి పొదరిండ్లను ఆశ్రయించియుండిరి. అట్టివనమునందు ప్రవేశించి ఒకటి సమప్రదేశమునందు ఆప్రభువు పర్ణశాలను నిర్మించుకొనెను. ఋషులకు కావలసిన వానిని అన్నిటిని సంపాదించుకొనెను. చికటిని వెదురుకట్టె, పండ్లు తినుటకు ఒకపాత్ర, జపమాల, కమండలము, చలికి కప్పుకొనుటకు ఒక బొంత, దర్భాసనము, కృష్ణాజనము, అనుమొదలగువానిని అన్నిటిని తెచ్చి ఆ ప్రభువు ఆపర్ణశాలలో జేర్చెను. సూర్యోదయమునకు ముందుగనే లేచి నిత్యకృత్యములను దీర్చి మొదటి జామున సంధ్యావందనమును జపమును అచరించి పిమ్మట పువ్వులను దెచ్చి మధ్యాహ్నస్నానమును దేవపూజను ముగించుచుండెను. తర్వాత అడవిలోని ఫలములను గడ్డలను తామరతూళ్ళను భుజించి పిమ్మట జపమును చేయుచు సర్వకాలమును గడపుచుండెను.

—✱ చూడాల శిఖిధ్వజుని స్థితిని ఎఱిగివచ్చుట. ✱—

ఓ నీలమేఘశ్యామా ! రామా ! ఇది శిఖిధ్వజునియొకటి విధము. ఇకచూడాలయొకటివిధమును వినుము. అట్లు అర్ధరాత్రమునందు శిఖిధ్వజుడు తన్ను విడచిపోగానే "గ్రామమధ్యమునందు నిదురించు లేడివలె" బెదరి ఆచూడాల మేలుకొనెను. పార్శ్వమునందు భర్త లేకుండుటను ఎఱిగెను. కొంచెము దుఃఖించుచు అకటడినుండి లేచెను. ముఖము కొంచెము వాడ,

" ఆధార వృక్షములేని తీగెవలె " శరీరము నిరుత్సాహ మగుచుండ బుద్ధి
ఖిన్నయగుచుండ, కొంతకాలము అటు ఇటు తిరిగి మరల ఆ శయ్యమీదనే
కూర్చుండి కొంతసేపు మౌనమును బూని పిమ్మట ఇట్లని తలపోసెను.
ఆహా, నాభర్త నాతో చెప్పినట్లే రాజ్యమును విడచి అడవికిపోయెను.
ఇప్పుడు నేను చేయవలసిన పనియేది? నేనును ఆయనతోగూడ పోయెదను.
స్త్రీలకు భర్తయే గతియని బ్రహ్మదేవుడు నిర్ణయించి ఉన్నాడు. ఈ విధ
ముగ నిశ్చయించి తత్క్షణమే ఆచూడాల అక్కడినుండి లేచి యోగసా
మర్థ్యమువలన గవాక్ష రంధ్రముగుండ ఆకాశమునకు నిర్గమించెను. ఇట్లు
నిర్గమించి నూతన ముఖకాంతిచేత సిద్ధులకు రెండవచంద్రుడు ఉదయించు
నేమో, అనుభ్రాంతిని కలిగించుచు పోయిపోయి వనమార్గమునుపట్టి ఖడ్గ
ధరుడై పోవుచుండిన భర్తను కలుసుకొనెను. ఇట్లు పోవుచున్నవాని గాం
చినతోడనే ఆకాశమునందే నిలువబడి ఆయనకు గలుగబోవు భవిష్యద్వృ
త్తాంతమునుగూర్చి మనస్సునందు ఇట్లని తలపోసెను. ఇప్పుడు మనము మన
భర్తకు కానరాకూడదు. తపోవిఘ్నకరములగు వాక్యములనుచెప్పకూడదు.
పురుషునియొక్క బుద్ధి, పూర్వకర్మాధీనమై కావలసిన విషయములను ఎట్ల
యినను కలిగించుచుండును. కావున ఇప్పుడు మనము ఏమిచెప్పినను ప్రయో
జనము లేదు. కావున కావలసినదానిని కానిమ్ము.దానికి విఘ్నమును కల్పిం
చుటకంటె తోడ్పడుటయే మంచిది. అని ఇట్లునిశ్చయించి క్రిందికి దిగకయే
వెనుకకు మరలెను. అట్లు మరలి మఱియు " నేనిప్పుడు ఆయనతోకూడ
పోకూడదు. ఎంతయో కాలము గడచిన పిమ్మటగాని ఆయనకును నాకును
సంబంధము కలుగుటకు వీలులేదు. దీనిని తప్పింప ఎవ్వరితరము ? ఇది దేవ
నిశ్చయము " అనుచు అంతఃపురమునందు ప్రవేశించి ఆకాశమున చంద్ర
కళవలె శయనముపై బరుండి రాత్రిశేషమును నిద్రతో గడపెను. ఈ వృ
త్తాంతమును ఇతరులు ఎవ్వరును ఎఱుగరు. మరునాడు ఉదయమున రాజు
లేకపోవుటవలన పలువిధములచేత తహతహపడుచున్న జనులనందఱకు
ఏదియో ఒక కారణముచెప్పి తృప్తిపరచి నాటినుండియు రాజ్యభారమును
తానే వహించుచుండెను. భర్తచేసిన ఏర్పాటులను అనుసరించియే సర్వ
వ్యవహారములను నిర్వర్తించుచుండెను. పక్షపాతబుద్ధి ఇంచుకయైనను
లేక,ధర్మమును తీర్చుచుండెను. ఇట్లుండగ దినములు, పక్షములు, మాస
ములు,సంవత్సరములును, గడచిపోయెను. విశేషించి చెప్పనేల ? శిఖిధ్వజు
డు వనమునుచేరిన పిమ్మట పైనవర్ణించిన విధముగ చూడాల ఏకాకినియై

పదునెనిమిది సంవత్సరములు గృహమునందు ఉండెను.

—* చూడాల భర్తవద్దకు పోవుట. *—

ఓ సత్యపరాక్రమా ! శ్రీరామా ! ఇట్లుండగ అంత చూడాల ఒకనాడు "భర్తయొక్క సమీపమునకు పోదగిన కాలము ఇప్పుడు వచ్చినది" అని చెప్పుచు భర్తను జూడబోవ మనస్సులో ఆమె నిశ్చయించుకొనెను. అంత ఒకనాడు రాత్రి అంతఃపురమునుండి బయలుదేరి ఆకాశమార్గమును ఆశ్రయించి మహావాయువుయొక్క సహాయముచేత అతిశీఘ్రమున మందర పర్వతముయొక్క గుహను ప్రవేశించెను. యోగశక్తి కలది అగుటచేత భర్తయొక్క స్థానమును కరతలామలకముగ తెలిసికొనగలిగెను. ఇట్లు ప్రవేశించి అదృశ్యాకారముతోనే ఆకాశమార్గముగానే భర్తయున్న పర్ణశాలవద్దకు బోయెను. అప్పటికి శిఖిధ్వజుడు తపస్సు చేయుచున్నవా డగుటచేత మునుపటి ఆకారమే గోలుపోయి యుండెను. గురుతించుటకే శక్యముకాని స్థితిలో ఉండెను. అప్పుడు హారములు, భుజకీర్తులు, కుండలములు, మొదలగు భూషణములు, ఆయనకు లేవు. ఆయన శరీరము ఇదివరకువలె బలసినదిగాక మిక్కిలి కృశించి పోయినదిగా ఉండెను. శరీరము, శరీరముయొక్క వర్ణము పూర్వమువలె కళావంతముకాక కప్పువేయబడినట్లు ఉండెను. చర్మమంతయు ముడుతలు పడియుండెను. ఇట్టి భర్తను గుఱుతించి సౌందర్యవతియగు ఆచూడాల కొంచెము ఖేదమును బొంది తనలో ఇట్లని తలచెను. ఆహా, మూర్ఖత ఎంత కష్టమైనది. సర్వశాస్త్రములను ఎఱిగినవారైనను ఆమూర్ఖతవలన పురుషులు దుర్గతికి వచ్చుచుందురు. ప్రస్తుతము నాప్రాణేశ్వరుడు ఇట్టివాడే ఆయెను. కావున ఇకను ఉపేక్షింప దగదు. నేను అవశ్యము ఈయనకు బ్రహ్మోపదేశమును గావించెదను. భోగ మోక్షములను జెందించెదను. ఈరూపమును వదలి మఱియొక రూపమును ధరించి జ్ఞానోపదేశార్థమై ఆయనయొద్దకు బోయెదను. నేను ఈరూపముతోనే పోదునేని ఆయన నన్ను గుఱుతించి "ఇది స్త్రీ. నాభార్య" అనుచు నేనుచేసిన ఉపదేశమును ధరింపడు. కావున మునివేషముతో ఆయన కడకు బోవలయును. ఆయనయొక్క చిత్తము వనవాసము, తపస్సు, మొదలగువానిచేత నిర్మలమై ఉన్నది. కావున ఇప్పుడు జ్ఞానోపదేశము జరిగినచో పరమాత్మతత్వము ఆయనమనస్సునందు బాగుగ ప్రతిబింబించును. కావున ఒకక్షణములోపల నాజీవితేశ్వరుని జీవన్ముక్తునిగ గావింపగలను.

## మునివేషముతో చూడాల శిఖిధ్వజునకు జ్ఞానోపదేశము చేయుట.

ఓదశరథనందనా! శ్రీరామా! ఈవిధముగ నిశ్చయించుకొని ఆచూడాల సత్యసంకల్ప కావున తన సంకల్ప మాత్రముననే బ్రాహ్మణ కుమారుడై ఆకాశమునుండి భర్త ఎదురుగ దిగెను. ఆశిఖిధ్వజుడును తన ఎదుట నున్న బ్రాహ్మణ కుమారుని చూచెను. ఆబ్రాహ్మణచిన్నవాని శరీరము పుతము వేసిన బంగారమువలె మెఱయుచుండెను. ముత్యాల హారములు మొదలగు భూషణములచేత అలంకరింపబడి ఉండెను. ఆతడు శుభ్రమగు యజ్ఞోపవీతముతోను, తెల్లని వస్త్రములతోను, ప్రకాశించుచుండెను. భూమికి మూరపైగా అంతరాళమున నిలచి యుండెను. హోమధామము ఆతనిపాదములకు అంటుచుండెను. ఇట్టి ఆబ్రాహ్మణ కుమారుని చూడగానే "స్వర్గలోక నివాసియగు దేవకుమారుడు ఎవ్వడు వచ్చెను? లేకున్న పాదములు భూమిని అంటకుండునా" అనుచు ఆశిఖిధ్వజుడు పాదుకలను విడచి లేచి నిలువబడియెను. "ఓదేవకుమారా! నీకు నమస్కారము, ఈఆసనముపై కూర్చుండుము" అనుచు తన హస్తముచేత - అచ్చటనున్న ఒక ఆకును చూపెను. ఆబ్రాహ్మణకుమారుడును "ఓరాజర్షిశ్రేష్ఠా! నీకు నమస్కారము" అనుచు ఆ ఆసనముపై గూర్చుండెను. శిఖిధ్వజుడును పుష్పములచేత అతనిని పూజించెను. అప్పుడు శిఖిధ్వజుడుకూడ తన ఆసనముపై కూర్చుండి ఇట్లనియె.

ఓదేవపుత్రుడా! ఎచ్చటనుండి విచ్చేసితిరి. నీరాకవలన నానివాసస్థానము పవిత్రమాయెను. నీదర్శనమువలన నేనును కృతార్థుడనైతిని. అని ఇట్లు చెప్పుచు ఆశిఖిధ్వజుడు బ్రాహ్మణవేషముతో ఆసనముపై కూర్చుండి ఉన్న చూడాలకు మరల అర్ఘ్యపాద్యాదులను ఇచ్చెను. అప్పుడు ఆచూడాల ఇట్లనియె. ఓదోషరహితుడా! రాజర్షిశ్రేష్ఠా! ఈవినయముచేతను, భక్తిచేతను, మహాత్ములయెుందలి ఆదరముచేతను, నీకు గలుగు సమృద్ధికి మితియే ఉండదు. నీవు సర్వకాలములయందును జీవించువాడవే కాగలవు. (దేవపుత్రపక్షమున ఇది ఆశీర్వాదము. చూడాలపక్షమున ఇది రాబోవు విషయమును సూచించుట. బ్రహ్మజ్ఞానము కలిగిన అనాదిసిద్ధమగు బ్రహ్మరూపమే తానగుటచేత ఆపురుషునకు ఎప్పటికిని వినాశమే లేదు. కావున ఆతడు చిరంజీవియే అగునుకదా!) ఓసత్పురుషుడా! రాజర్షీ! నీయందు గాన వచ్చుచున్న సౌశీల్యాదులు మఱియెవ్వరి యందును కానరావు.

ఓశాంతుడా! నీవు విస్తారమగు రాజ్యమునువదలి అరణ్యమునకు వచ్చి వ్రతములను ఆచరించుట ఖడ్గధారపై నడచుటవలె ఉన్నది. భోగానుభవముచేత తృప్తినొందుచున్న ఈదేహమును ఇట్లు తపస్సుచేత కృశింపజేయుటకు గారణమేమి? సర్వకల్పనా రహితమై నిత్యానందరూపమై ఉన్న ఆబ్రహ్మపదమును సాధించుటకై మనస్సును శాంతి పరచుకొని ఇట్లు తపస్సును చేయుచున్నావా? ఏమి? ఇట్లు కాకున్న అల్పఫలములకై ఇంత ఆయాసమును జెందవలసిన పనియుండదుకదా ? అని బ్రాహ్మణకుమారవేషముతోనున్న చూడాల అడిగిన శిఖిధ్వజుడు ఇట్లనియె.

ఓ భగవంతుడా ! దేవకుమారా! మీరు పలికినదంతయును యథార్థము. మీరు దేవపుత్రులు, మీశరీరకాంతియే ఆవిషయమును స్పష్టము చేయుచున్నది. మీకు ఈవిషయమంతయు తెలిసెననుటలో ఆశ్చర్యమేమి? ఇకను మీవిషయమునుగూర్చి ప్రశ్నించుటకు స్వాతంత్ర్యము ఇవ్వుడు ? మీరు ఎవ్వరిపుత్రులు? ఇచ్చటికి ఏమికారణముచేత విచ్చేసితిరి. నన్ను అనుగ్రహించుటకయ్యే అని తలచెదను. ఓపూర్ణచంద్రవదనా ! ఈ వృత్తాంతమును సర్వమును వివరింపుము.

—✽ చూడాల తన యథార్థస్థితిని కప్పిపుచ్చుట. ✽—

ఓశ్రీరామా ! అని శిఖిధ్వజుడు చెప్పినవిని బ్రాహ్మణ వేషముతోనున్న చూడాల ఇట్లనియె. ఓమహారాజా! అట్లే నావృత్తాంతమును సర్వమును వివరింతును. ప్రశ్నించుచున్నవానిని తిరస్కరించుట ఎవనికిని భావ్యముకాదు కదా ? ఈలోకమునందు నారదుడను నొక మహాముని కలడు. ఆయన పుణ్యమను లక్ష్మికి తిలకమువంటివాడు. ఒకనాడు అమ్మహాముని మేరుపర్వత గుహాయందు ధ్యానము చేయుచుండెను. ఆగుహకు పార్శ్వమునందే ఆకాశగంగ గొప్ప అలలతోగూడి ధ్వనించుచు ప్రవహించుచుండును. ఇట్లు గంగాతీరమునందు ఉన్న గుహయే ఆశ్రమముగ చేసికొని అమ్మహాముని నివసించుచుండి ఒకనాడు ధ్యానము ముగిసిన పిమ్మట బాహ్యవృత్తిగల చిత్తముతో కూర్చుండి ఉండెను. అప్పుడు గంగానదీతీరమున కంకణధ్వనులతోగూడిన ఒక కలకలము వినవచ్చెను. అప్పుడు ఆయనకు ఆకలకలము ఎక్కడనుండి వచ్చెనో, చూడవలయునను ఉద్దేశము కలిగెను. అంతట ఆనదివంక చూడగానే అచ్చట స్నానము చేయుచున్న కొందరు దేవకన్యలు కానవచ్చిరి. వారు రంభా తిలోత్తములవలె అతి సౌందర్యవంతులై ఉండిరి. ఆసమీపమునందు పురుషులు ఎవ్వరును లేకపోవుటచేత దిగం

బరులై జలక్రీడ లాడుచుండిరి. అతి స్వచ్ఛములగు వారలయొక్క అవయవములు ఎచ్చటజూచినను అచ్చటనే గానవచ్చుచుండెను. బంగారుమయములై దేదీప్యమానములగు పర్వతప్రదేశములయందును అతి స్వచ్ఛములై యుండు గంగాజలములయందునుగూడ వారి అవయవములు గానవచ్చుచుండెను. ఇంతయేల ? అద్దములయందువలె వారలయందే ఒకరి అవయవములయందు మఱియొకరి అవయవములు ప్రతిబింబించుచుండెను. ఇట్టియాస్త్రీలను చూడగానే అనాదినుండియు వచ్చుచున్న సంసారముయొక్క బలమువలన ఆనారదుని చిత్తము వివేకమును మరచి ఆనందములో జిక్కి చలించెను. ఇట్లు మనస్సు చలించిన ప్రాణములు సంక్షోభమును జెందెను. దానిచేత రేతస్సు స్ఖలితమయ్యెను.

—* బ్రహ్మవేత్తకూడ వాసనను గెలుచుట కష్టమనుట. *—

అని బ్రాహ్మణకుమార వేషముతో నున్న చూడాలచెప్పిన విని శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓమహాత్మా ! ఇది ఏమిచిత్రము ? ఆనారదమహాముని లోకోత్తముడు. సర్వశాస్త్రార్థవేత్త. జీవన్ముక్తుడు. ఇట్టివాడు మన్మథునికి వశుడయ్యెననుట ఎట్లు ? అని అడిగిన విని బ్రాహ్మణ వేషముతోనున్న చూడాల ఇట్లనియె. ఓమహారాజా! ఇది యొక చిత్రము కాదు. వినుము. సత్యమై పరిశుద్ధమై ఉన్న స్వస్వరూపము నిమిష మాత్రమైనను మరువబడునేని అప్పుడు వర్షాకాలమునందలి మేఘమువలె దృశ్యపదార్థము అభివృద్ధిని జెందును. ఎల్లప్పుడును ఆత్మధ్యానము కావించుచునే ఉన్నప్పటికి, ఒక నిమిషమైనను దానిని మరచినయెడల ఈదృశ్యపిశాచము తత్క్షణమే విజృంభించును. బాగుగ విచారించిన బంధమోక్షములు రెండును గూడ ఇట్టివే. "ఇదీ సుఖము, ఇది దుఃఖము" అను తలంపు పుట్టుటయే బంధము. అది లేకుండుటయే మోక్షము. కావున బ్రహ్మజ్ఞానము పరిపూర్ణముగ గలిగి ఒకక్షణమైనను ఆబ్రహ్మమును మరువకుండునంతటి స్థైర్యము కలిగి సుఖదుఃఖాదిరూపమగు ఈప్రపంచము లేదని తెలిసికొనియెనేని అట్టివాడు చిత్తవిక్షోభములేక శాంతిని జెంది యుండును. మఱియు ఎప్పటికిని మఱపునకు రాకుండునంత స్థిరముగ "ఈసర్వమును చిదాకాశమే. దీనికంటె ఇతరమగునది ఏదియును లేదు" అను నిశ్చయము కుదురునేని అప్పుడు జీవుడు దృశ్యపదార్థములను జూడక నిశ్చలుడై నిలచును. తైలము, వత్తి, మొదలగునవి వేయుటతో పనిలేక ప్రకాశించు దీపమువలె ఎప్పటికిని అస్తమయములేక ప్రకాశించుచుండును. ఈప్రపంచమంతయును ఆత్మస్వరూపము వలననే

పుట్టినవి. అంతేయును ఆశ్చర్యమే. అయినను భ్రాంతిరూపమగు వాసనచేత నిలుకడను జెందుచున్నది. వాసన లేకుండిన ఈ భేదములు కానరావు కదా. మఱియు ఆవాసనను ఆశ్రయించియే పుణ్యపాపములు ప్రవర్తించుచున్నవి. ఆ పుణ్యపాపములే జీవునకు ఒక జన్మమునుండి మఱియొక జన్మమును కలిగించుచున్నవి. కావున ఎవ్వడైనను జ్ఞానబలమువలన చిత్తమును నిగ్రహించి అందలి సంస్కారములను అణచిన ఇక పుణ్యపాపములు ఉండవు. వాసనయే భేదదృష్టికి కారణము. కావునను, అభేదదృష్టి లేకున్న సాధ్యసాధన ఫలములు సంభవింపవు కావునను, వాసనాత్యాగముచేత కర్మలు నశించి తీరవలయును. సాధ్యసాధన ఫలములు లేకున్న కర్మలు లేవు కదా! కావున వాసనా క్షయ మయ్యెనేని ఇక జీవునకు బంధము ఉండదు. ఆవాసనయు బహుకాలమునుండి మనస్సును ఆశ్రయించి యున్నది కావున పరమాత్మ ధ్యానమును ఎంతమాత్రము ఏమరినను తలచూపు చుండును. కావుననే జీవన్ముక్తుడైనను నారదునకు అట్లు స్ఖలితమైనది. అని చెప్పినవిని మఱల శిఖిధ్వజుడు ఇట్లనెను. ఉపన్యాసకులలో శ్రేష్ఠుడవగునో మహాత్మా! మీరు అతిగంభీరముగాను, పరమాశ్చర్యకరముగాను, అనుభవ సిద్ధముగాను, ఉపన్యసించితిరి. ప్రస్తాపవశమున పరమార్థ స్థితినంతయు వెల్లడించితిరి. ఓ సుందరాకారా! నీవాక్యములను వినుటచేత అమృతపానమును చేసినవానివలె నేను చల్లనైతిని. నాహృదయము తాప విముక్తమై పరమ శాంతిని అనుభవించు చున్నది. కావున నోమహాత్మా! మొట్టమొదట నీయొక్క ఉత్పత్తిని వివరింపుము. పిమ్మట ఏకదృష్టితో బ్రహ్మజ్ఞాన పూరితములగు నీవాక్యములను విని మోదను. చెప్పుచున్న సందర్భము పూర్తియైన పిమ్మట గాని, రెండవదానియందు మనస్సునకు ఏకాగ్రత కలుగదు కదా! కావున తెలుపుము. ఓ సుందరాకారా! బ్రహ్మపుత్రుడగు ఆ నారదుడు అట్లు స్ఖలితమైన వీర్యమును ఎందు ఉంచెను. మహాత్ములయొక్క వీర్యము నిష్ఫలముకాదు కదా? అని పలికిన విని ఆచూడాల ఇట్లనియె.

ఓ రాజర్షి శ్రేష్ఠా! వినుము. అమ్మహాత్ముడు అట్లు చలించిన మనస్సును మదవుటేనుగును వివేకమను స్తంభమునకు పరిశుద్ధ బుద్ధియనెడు త్రాటిచే గట్టివేసెను. స్ఖలితమైన తన వీర్యమును పార్శ్వమునయున్న స్ఫటిక కుంభమునందు ఉంచెను. సంకల్ప ప్రభావమువలన జనించిన క్షీరములతో నాకుంభమును నిండించెను. దానిని సురక్షితమగు స్థలమునందు ఉంచి రక్షించు చుండగ ఒకమాసమునకు పరిపూర్ణ చంద్రబింబముతో

సమానుడగుచు ఒక శిశువు అచ్చటినుండి బయలు వెడలెను. అంత క్రమక్రమముగ ఆబాలునకు నారదుడు సర్వ సంస్కారములను గావించి ఒక కుండయందుండు పదార్థములను నిశ్శేషముగ మఱియొక దానియందు బోయునట్లు తనకుగల విద్యనంతయు వానికి ఉపదేశించెను. తర్వాత కొంత కాలమునకు తనపుత్రుని దీసికొని బ్రహ్మదేవునివద్దకు బోయెను. ఆ బ్రహ్మయు తన మనుమనికి బ్రహ్మజ్ఞానమును కలిగించెను. ఓ సత్పురుషుడా ! మహారాజా ! ఆనారదపుత్రుడను నేనే. కుంభమునుండి పుట్టితిని. కావున నాకు కుంభుడనియే పేరు. నాలుగు వేదములును స్వరూపములను ధరించి నాతో ఆడుకొనుచుండును. గాయత్రి నాకు పినతల్లి. తల్లిలేనివాడను అగుటచేత నాకు అవ్వయగు సరస్వతీదేవియే తల్లి. ( గాయత్రీదేవి సరస్వతీదేవికి తోబుట్టువు. కావున పినతల్లి అని ఎఱుగునది ) అని చెప్పినవిని శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ మహాత్మా! ఇప్పటికి నేను ధర్మాధిక్యముచేత ధన్యాత్ములలో నెల్ల ధన్యాత్ముడనైతిని. అమృతమును వర్షించుచున్న మీవాక్యములను వినుటతోడనే నాకు పరమ తృప్తి కలిగినది. సత్పురుష సమాగమమువలె రాజ్యలాభము మొదలగునవికూడ నాకు ఆనందమును కలిగింపలేవు. నా మనస్సునందలి తాపమును చల్లార్పలేవు.

### —* చూడాల శిఖిధ్వజుని బ్రహ్మనిష్ఠకు పురికొల్పుట. *—

అని శిఖిధ్వజుడు చెప్పుచుండగ నివారించి ఆచూడాల ఇట్లనియె. ఓ సత్పురుషుడా ! మహారాజా ! ఇప్పుడు ఈ కథతోటి మనకుపనియేమి? ప్రకృతము చూచుకొందము. నేను నాకథనంతయును ఎఱిగించితిని కదా? ఇకను నీవృత్తాంతమును తెలియచేయుము. నీవు ఈ పర్వతసమీపమునందు ఏమి చేయుచున్నావు ? నీవు ఎవ్వరవు ? అనిపలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ మహాత్మా! నీవు దేవకుమారుడవు. దివ్యదృష్టిచేత సర్వమును ఎఱిగియే యున్నవాడవు. అయినను నావలననే వినుటకు కోరిక కలదేని అట్లే నా వృత్తాంతమును వివరించెదను. ఓ నారదపుత్రుడా ! నేను సంసారమువలన సుఖము గాంచక భీతుడనై వనమును ఆశ్రయించితిని. నాపేరు శిఖిధ్వజుడు. నేను మండలాధీశ్వరుడను. రాజ్యమును వదలి అడవికి వచ్చితిని. తత్త్వవేత్తలలో అగ్రేసరుడవగు నో మహానుభావా ! పునర్జన్మమువలన నాకు భయము మిక్కుటముగ ఉన్నది. ఇట్టి సంసార దుఃఖమును మఱల అనుభవింప వలసి వచ్చునేమో, అని చింత అధికముగ కలిగి ఉన్నది. ఈవిధముగ ఇప్పుడు మిక్కిలి పూనికతో దేవార్చనాది రూపములగు కర్మలను

ఆచరించుచున్నను నామనస్సునకు శాంతి కలుగలేదు. దుఃఖపరంపర ఎత తెగక వచ్చుచునే ఉన్నది. కాలము గడచుకొలది అమృతమే నాకు విష మగుచున్నది. అని పలికిన విని చూడాల ఇట్లనియే. ఓ మహారాజా! నీయుద్దేశము మంచిదే కాని, దానికి తగిన కార్యమును నీవు చేయుట లేదు. సర్వసంసార దుఃఖమును నశింపవలయుననిన జ్ఞానమునే ఆర్జింప వలయును గాని, కర్మలను ఆచరింపనక్కఱ లేదు. జ్ఞానముకలిగిన ఉత్తరక్షణమునందే మోక్షము కలుగును. మోక్షమనునది స్వస్వరూపస్థితియే. కావున దానిని సాధించుటకు కర్మలతో ఆవశ్యకత ఉండదు. కర్మచేత సాధింపబడునది స్వతస్సిద్ధమై ఉండనేరదనుట ప్రత్యక్ష సిద్ధము. స్వస్వరూపస్థితి అనిన అది ఒకప్పుడు లేనిదయు, మఱి ఒకప్పుడు క్రొత్తగ వచ్చునదియు గాదు కదా! కావున భ్రాంతిచేత "ఇది సుఖము, ఇది దుఃఖము" అని తలంచు తలంపులను విడచుటయే "నేను బ్రహ్మమునే" అని తెలుసుకొనుటయే మోక్షము. కర్మలును ఎప్పటికో ఇట్టి జ్ఞానమును కలిగించియే మోక్షమును ఇచ్చును. కావున జ్ఞానమే సులభమై ఉండగా, జ్ఞానవంతులగు మహాత్ములు అనేకులు ఉండగా వారిని ఆశ్రయించి ఆజ్ఞానమును సంపాదించుటకు ప్రయత్నింపక, కర్మలను ఆచరించుటయెల్ల కేవలకాలయాపనమే. బాగుగ విచారించిన మొట్టమొదట కర్మలను విధించుటకుగూడ ఉద్దేశము అదియే. కేవల లౌకిక విషయములయందే మనస్సును పోనీక పరమేశ్వరుని విషయమునందుగూడ కొంత కాలము గడుపుదురుగాక అనియే. కావున కర్మ కావలసినది అజ్ఞానులకే కాని, జ్ఞానులకుకాదు. మఱియు నది అజ్ఞానులు చేసిన ఫలమును ఇచ్చునే కాని, జ్ఞానులు చేసిన అట్లు ఇవ్వజాలదు. ఏల అనిన, జ్ఞాననేత్రము లేనివారలకు సర్వకర్మ మూలమగు సంసారము నశింపదు. వారికి సంసారమే సర్వార్థము. కావున దానివలన జనించిన కర్మయు ఫలమును ఇచ్చును. అదియే వారికిగతి. ఇక జ్ఞానుల విషయమన్ననో, వారికి సంసారము లేదు. కర్మలును లేవు. దాని ఫలములును లేవు. రెండవ ఋతువు వచ్చినప్పుడు పూర్వ ఋతుధర్మములన్నియు ఎట్లు నశించునో, పూర్వ ఋతువుయొక్క ఫలములన్నియు ఎట్లు నశించునో, అట్లే వాసనాక్షయముకాగానే కర్మ ఫలము లన్నియు నశించును. కావున కాల్లు పువ్వు స్వభావముగ ఫలింపని విధమున వాసనా శూన్యమగు కర్మయు స్వభావముగ ఫలింపనేరదు. ఏదియో ఒక దోహద సంసారమున గాని, కాల్లు ఫలింపనట్లుభ్రాంతి సంసారమున గాని కర్మ ఫలింపదు. కావున

సర్వవిధములచేతను పురుషుడు సంసార నాశనమునకై ప్రయత్నింప వలయును. బ్రహ్మజ్ఞానమును ఆర్జింప వలయును. అట్లుచేసిన తెలివిగలవానికి ఎండమావులయందు నీరు తోపనట్లు సంసారము తోపదు. ఇట్లు ప్రయత్నముతో వాసనలను మాత్రము వర్జించిన యెడల అదియే మోక్షమగును. జీవుడు పునర్జన్మమును జెందడు. మఱియు జ్ఞాన జ్ఞేయములకు కూడ భేదము లేదు. అన్నియుమనస్సే. వాసనాయుక్తమై తెలిసికొనబడువాడు తెలిసికొనునది తెలివి అను భేదములు గలిగి లేనకంటె అన్యమగు పదార్థములను ఉన్నట్లు భావించుచుండు మనస్సే జ్ఞానము. అట్టి సంసారములను విడచిన అదియే జ్ఞేయము. కావున ఏపురుషుడైనను జ్ఞానమును ఆశ్రయించి దానిమూలమున జ్ఞేయ భావమును జెందునేని మరల పుట్టడు.

ఓ మహారాజా ! ఆబ్రహ్మాదులుకూడ జ్ఞానమే పరమ సుఖ సాధనమని దానిని మహాప్రయత్నముతో సంపాదించుచున్నారు. ఇట్లుండగ నీవు మాత్రము దానిని ఇంకను సంపాదింపక ఉన్నావు ఏల ? "నేను ఎవ్వడను? ఈ ప్రపంచము ఎట్లుకలిగినది ? నాకును ఈ సంసారమునకును సంబంధము ఏమి ?" అను విషయములను ఏల విచారింపక ఉన్నావు ? సర్వశాస్త్రార్థములను ఎఱింగినవాడవయ్యును ఇట్లేల మూర్ఖునివలె కోరకున్నావు? "బంధము ఎట్లువచ్చినది ? మోక్షము ఎట్లువచ్చును?" అని ప్రశ్నించుచు బ్రహ్మవేత్తలగు మహానుభావులయొక్క పాదములను ఇప్పటికిని ఏల సేవింపకఉన్నావు? ఇట్లు ఊరకుండిన మోక్షసాధనమగు జ్ఞానము ఎట్లుదొరకును. సత్పురుషులను ఆశ్రయింపవలయును. వారిని సేవింప వలయును. తనసంశయములను ప్రశ్నింప వలయును. వారలతో సహవాసము చేసి వారి ఆచారములను గ్రహింప వలయును. అనిచెప్పెను. ఓ రఘురామా ! వినుము. పైన వర్ణించిన విధముగా దేవకుమార రూపమును దాల్చియున్న తనపత్నియగు చూడాల బోధింపగానే బొటబొట కన్నీరుగార్చుకొనుచు ఆ శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ దేవకుమారా ! నీ అనుగ్రహమువలన ఇప్పటికి తెలివి వచ్చినది. ఇంతకాలము నిరర్థకముగ గడపితిని. సత్పురుషులను సేవించుటను మాని ఊరక అరణ్యమునందు కాలము గడపితిని. ఆహా, ఇప్పటికి నాపాపమంతయు నశించిపోయెనని తలంచెదను. లేకున్న మీబోటి మహాత్ములు ఇట్లువచ్చి నన్ను ప్రబోధింతురా ? ఓ మహాత్మా ? గురువైనను నీవే, తండ్రివైనను నీవే, మిత్రుడవైనను నీవే, ఇదిగో నీకు శిష్యుడనైతిని, నమస్కరించెదను. ఓ సుందరాకారా ! నాకు ఉపదేశమిమ్ము. ఏది సర్వోత్తమ

మైనదియో, దేనిని తెలిసికొనిన సర్వదుఃఖములును నాశనమగునో, దేనిని ఎఱుగుటచేత నామనస్సునందలి తాపమంతయును అణగునో, అట్టి పరబ్రహ్మమును నాకు ఉపదేశింపుము.

—* చూడాలచేసిన ఉపదేశము. *—

అని శిఖిధ్వజుడు చెప్పిన విని చూడాల ఇట్లనియె. ఓ రాజర్షిశ్రేష్ఠా! నావాక్యములపై ఆదరము కలదేని అట్లే సర్వార్థమును వివరించెదను. ఆదరము లేకున్న ఎన్ని విధములచేత చెప్పినను,మాట వృథయగును కాని, ఫలము ఇయ్యనేరదు కదా. ఆదరముతో గాక, కేవలము చమత్కారముగ నడుగబడి ఎవ్వడైనను వచించునేని వాని వాక్యములు చీకటియందు దృష్టివలె విఫలము లగును. అని చూడాలచెప్పిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ దేవకుమారా ! ఈ విషయమునందు ఇంచుకయైనను సంశయింప వలదు. వేదవిధినివలె నీవు చెప్పినదానిని ముందు వెనుకలగూడ విచారింపకయే ఆచరించుదును. ఇది యథార్థము. అనిపలికిన చూడాల ఇట్లనియె. బాలుడు కారణములను ఎఱుగకున్నను, తండ్రి చెప్పిన వాక్యమును అట్లే గ్రహించి ఆచరించునట్లు నీవును నావాక్యమును గ్రహించి ఆచరింప వలయును. మొట్టమొదట నీకు ఒక విచిత్రమగు కథను చెప్పెదను. వినుము. పిమ్మట బ్రహ్మమును ఉపదేశించెదను.

—* చింతామణి ఉపాఖ్యానము. *—

ఓ మహారాజా ! ఈభూలోకమునందు ఒకానొక పురుషుడు కలడు. వాడు మిక్కిలి ధనవంతుడు. గుణవంతుడు. సర్వశాస్త్రార్థములను ఎఱిగినవాడు. అయినను ఆతనికి బ్రహ్మజ్ఞానము మాత్రము లేదు. ఆతడు శ్రమను లెక్కింపక అతి ప్రయత్న సాధ్యమగు చింతామణియొక్క మంత్రసాధనమునందు పూనిక వహించెను. “ బడబాగ్ని మహాసముద్రమును పీల్చుటకై ప్రయత్నించునట్లు అమ్మహాకార్యమునకై ఎడతెగక ప్రయత్నము చేయుచుండెను. ఇట్లు మహాప్రయత్నముతో బహుకాలము తపస్సు చేయగా, చేయగా, కాలవశమున వానికి ఆ చింతామణి ప్రత్యక్షమాయెను. విడువక ప్రయత్నించువారలకు సిద్ధింపని పనిఒకటికలదా? కావున తన సమీపమునకు వచ్చి ఆచింతామణి చేతితో గైకొనునంత సమీపమునందు ఉండగా ఆపురుషుడు చూచెను. మేరుపర్వతమునందలి ఉదయశిఖరముననున్న చంద్రునివలె ఆతడు ఆచింతామణియొక్క సాన్నిధ్యమువలన ప్రకాశింప సాగెను. అయినను అది చింతామణియే అను నిశ్చయము మాత్రము వానికి లేదు. ఆక

స్మికముగ రాజ్యముదొరికిన అప్పుడు దరిద్రుడగు వానియొక్క చిత్తవృత్తి పలుపోకల బోవునట్లు వాని చిత్తవృత్తియు పలువిధములుగ చంచలింప నారంభించెను. అప్పుడు వాడు ఇట్లని తలపోయనారంభించెను. ఇది చింతామణియేనా ? కాదు. చింతామణి కాదు. చింతామణియే అగునేని నాకు ప్రత్యక్షము కాదు. పరీక్షకై దీనిని తాకిచూతునా ? అట్లు చూడను. భాగ్యహీనుడనగు నాచెయ్యి సోకినతోడనే ఒకవేళ అది అదృశ్యము అగునేమో. ఇంత అల్పకాలములోనే ఆచింతామణి ప్రత్యక్షమగునా? కానేరదు. జీవిత కాలమంతయు మహాప్రయత్నముతో గడపిన అప్పటికిగదా? చింతామణి సిద్ధికలుగునని శాస్త్రములు చెప్పుచున్నవి. కావున ఇది భ్రాంతియే కావలయును. నేను మహాదరిద్రుడను. కావున చింతామణినే ఎప్పుడును ధ్యానించు చున్నాను. కనుక “ కొరవికట్టెను త్రిప్పుచుండిన దూరమునందు ఉన్నవాడు భ్రాంతిచేత దానిని తేజోమయమగు తీగెనుగా దలంచునట్లు ” నేత్రరోగము కలవాడు “ ఆకాశమునందు రెండవచంద్రుని చూచునట్లు ” ఈ మణినిచూచితిని. దౌర్భాగ్యవంతుడనగు నాకు ఇంత మహాభాగ్యము ఎక్కడినుండి వచ్చును ? ఈ చింతామణి నాబోటివానికి ఇంతలోకే దొరుకునా ? అల్పకాలములోనే లక్ష్మీప్రసాదమును పొందగల మహాత్ములు ఎందఱికో ఒక్కడుండుట దుర్ఘటము. నాకు అట్టిభాగ్యము కలదా ? నేను మనుష్యుడను. అల్పకాలము మాత్రమే తపస్సుచేసినవాడను. నీచుడను. దౌర్భాగ్యవంతుడను. ఇట్టినాకు ఇంత శీఘ్రముగ ఇట్టి మహాసిద్ధి కలిగెననుట ఏటిమాట ? ఓ మహారాజా ! ఈ విధముగ ఆ పురుషుడు మూఢుడై “ ఇదిమణియా ? కాదా ” అను ఆలోచనతోనే చాలాకాలము గడపి ఎదుటనున్న మణిని గ్రహించు ప్రయత్నమునే చేయకుండెను. ఇట్లు ఉపేక్షాపరుడై ఉన్న ఆపురుషునిజూచి కొంతసేపటికి ఆమణియును అంతర్ధానము నొందెను. విడువబడిన బాణములు అల్లెత్రాటిని విడచిపోవునట్లు చేతికి వచ్చిన సిద్ధికూడ ఉపేక్షాపరుని విడచిపోవును కదా ? అట్లు ఆరత్నము అంతర్ధానము కాగానే ఆ పురుషుడును అది చింతామణి కాదనియు తన భ్రాంతి విచారమువలన తొలగెననియు నిశ్చయించి రత్నసాధనకై మఱల ప్రయత్నింప నారంభించెను. దృఢోత్సాహము కలవారు తమకార్యము సిద్ధించునంతవరకు పట్టుదలను విడువరుకదా ? ఓ మహారాజా! ఈవిధముగ బహుకాలము గడచినపిమ్మట ఈ పురుషునియొక్క అజ్ఞానమును ఎఱిగి మోసగాండ్రగు కొందరు సిద్ధులు బాగుగ ప్రకాశించుచున్న ఒక అద్దపు

గుండును చేతనుంచుకొని తమ ఆకారములను అదృశ్యములుగ చేసికొని అతనికి ఎదుట నిలువబడిరి. అప్పుడు ఆయద్దపుగుండు ఒకటియే అంతరిక్షము నందు నిలువబడియున్నట్లు ఉండెను. ఆపురుషుడు దానిని చూచినతోడనే " ఇది చింతామణియే, ఇప్పటికి నేను చాలాకాలమునుండియు తపస్సు చేసితిని. కావున నాకు మణి ప్రసన్నమైనది " అనిచెప్పుచు దానియందు పరిపూర్ణ విశ్వాసమును ఉంచెను, మూఢుడగువాడు మట్టిని చూచి కూడ సువర్ణమని తలంపవచ్చునుకదా ? మఱియును అట్టి నిశ్చయముచేత వాడు ఆ అద్దపుగుండును గైకొని " దీనిచేత సర్వసమృద్ధులును కలుగును. ఇక ధనము ఏల " - అనుచు తనకు పూర్వమునందు ఉన్న ధనమునంతయును కొల్లబెట్టెను. " ఈ దేశము సుఖకరమైనది కాదు. ఉష్ణమైనది. పాపాత్ము లగు మనుష్యులచేత ఆవరింపబడినది. కావున ఈ దేశమును వదలి దూర దేశమునందు ఏకాంతస్థలమున ధనసహితుడనై యుందునుగాక " అని తలం చుచు గాజురాయిని తీసికొని ఒక నిర్జనారణ్యమును ప్రవేశించెను. గాజు రాయి వాంఛితార్థములను ఏమి ఇవ్వగలదు ? ఇట్లగుటచేత వాడు దానిని నమ్ముకొని ఉన్నవాడు కావున ఆవనమునందు బహువిధములగు ఆపదలకు చిక్కువలసినవాడాయెను.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున ముప్పదియేడవ సర్గయందు
చింతామణ్యుపాఖ్యానమను ప్రథమప్రకరణము
ముగిసెను.

—*—

—* గజోపాఖ్యానము. *—

ఓ రామచంద్రా ! ఇట్లు చింతామణి ఉపాఖ్యానమును చెప్పి మఱల చూడాల శిఖిధ్వజునితో ఇట్లనియె. ఓ రాజర్షిశ్రేష్ఠా ! మఱి యొకవృత్తాం తమును చెప్పెద వినుము. అది మిక్కిలి రమ్యమైనది. బుద్ధిని వికసింప జేయు నది. నీచరిత్రమునకు సమమైనది. ఓ మహారాజా ! వింధ్యపర్వత ప్రాంత అరణ్యమునందు ఒకగొప్ప ఏనుగ నివసించు చుండెను. అది అనేకకోట్ల ఏనుగులకు ప్రభువై యుండెను. దాని దంతములు వజ్రాయుధమువలె మిక్కిలి కఠినములై వాడిగలవిగాను ఉండెను. ఇట్లుండగ ఉపాయముచేత ఒక మావటివాడు దానిని ఇనుపగొలుసులతో చిక్కునట్లుచేసి బరువగు సంకెళ్ళతో బంధించెను. అప్పుడు అది తనకుగలిగిన స్వేచ్ఛాభంగమునకు

చింతించుచు తనయొక్క దంత సహాయముచేత అతి ప్రయత్నముతో ఆ గొలుసులను త్రెంచివేసెను. సంకెళ్ళనుకూడ నూడబెరికెను. ఇట్లు ఆగజము తనబంధమును విడిపించుకొనుటను మావటివాడు చూచి మఱలదానినే ఏదియో ఒకవిధముచేత బంధించవలయునను ఉద్దేశ్యముతో ప్రకటన ఉన్న ఒక తాటిచెట్టు పైకి ఎక్కి దానిశిరముపై దూకవలయునని వేగముతో దుమికెను. గురిదప్పి ఆ ఏనుగుయొక్క శిరముపై బడుటకు మారుగ దానిముందు వైపున బడెను. అట్టి యామావటివానిని జూచి ఆగజము కోపింపకదయతో జూచెను. లోకమునందు శ్రేష్ఠులును సద్గుణవంతులును నగువారలు అన్ని జాతులయందును ఉన్నారు. ఓ మహారాజా! తిర్యగ్జంతువులయందును శాంతములగువానిని అనేకములను జూచుచునే ఉన్నాము. ప్రస్తుతము మనమువర్ణించుచున్న ఏనుగు ఇట్టి జాతిలో చేరినదియే. అంత ఆ ఏనుగు "క్రిందపడినవానిని చీల్చి పారవేసిన ఛీ నాపౌరుషమేమి" అనుచు తనకు ప్రబలశత్రువైన అమ్మావటివానియందు సహితము దయజూపెను. వానికి ఇంచుకయైనను బాధను కలిగింపక ఆస్థలమును మాత్రము వదిలిపెట్టి వెళ్ళిపోయెను. ఇట్లాయేనుగు పోయినపిమ్మట అంతకుముందు భయపడుచుండిన ఆమావటివాడు స్వస్థుడై లేచి భయపడుచుండిన తనబుద్ధి స్వాధీనమునకువచ్చిన పిమ్మట దేహమునకు తాటిచెట్టుపైనుండి పడుటవలన గలిగిన బాధ పోయిన పిమ్మట మఱల ఆ ఏనుగును వెతుక నారంభించెను. చాలాకాలమువరకు వానికి ఆ ఏనుగు కానరాలేదు కాని, పిమ్మట ఒకానొక వనమునందు గానవచ్చెను. వెంటనే ఆ మావటివాడు ఆ వనమునందు ఒక్కచోటచాలాలోతుగ ఒకపల్లముత్రవ్వి దానిని తీగెలు గడ్డి మొదలగు వానిచేత మరుగుపరచి ఉంచెను. ఆ ఏనుగును, ఆవనమునందు తిరుగుచుండి కొన్ని దినములకు "జలములేని సముద్రమునందు పడిన పర్వతమువలె" మార్గవశముచేత ఆపల్లమునందు పడెను. అప్పుడు ఆమావటివాడు మఱల దానిని పూర్వమునకంటె దృఢతరముగ బంధించి కొనిపోయెను. దానిని తప్పించుకొను ఉపాయమును గానక ఆ గజరాజము ఇప్పటికిని "పాతాళలోకమునందు ఉన్న బలిచక్రవర్తివలె" ఆ అస్వాధీనస్థితియందే ఉన్నది. ఎంతప్రమాదము జరిగినదియో చూడుము. మొట్టమొదట తనయెదుట క్రిందబడియున్నప్పుడే ఆ మావటివానిని తొండముతో కొట్టి చంపియుండినచో ఆ ఏనుగునకు ఈ బంధప్రాప్తి కలుగదుకదా? శత్రుశేషమును ఉంచుటవలన ఎట్టి హానికలిగెనో చూడుము. కావున ఏ పురుషుడైనను భవిష్య

తాత్కాలమునందు రాబోవుదానినిగూర్చి ఆలోచింపక కార్యమును చేయునేని ఈ గజరాజమువలె మహాదుఃఖములకు పాల్పడును.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున ముప్పదియేడవ సర్గమునందు
గజోపాఖ్యానమను రెండవ ప్రకరణము
ముగిసెను.

—*—

## —* చింతామణ్యుపాఖ్యానవివరణము. *—

ఓ శ్రీరామా ! ఈ రెండు కథలను విని ఈ కథలచేత సూచింప బడిన అర్థము ఏదియో ఒకటి ఉండవలయునని నిశ్చయించి ఆ శిఖిధ్వజ భూపాలుడు ఇట్లనియె. ఓ దేవకుమారా ! నీవు చెప్పిన కథలు ఏదియో ఒక గొప్ప విషయమును సూచించుటకై చెప్పబడి యున్నట్లు కానవచ్చుచున్నవి. కావున వాని యందు ఉద్దేశింప బడిన అర్థమును వివరింపుము. చింతామణి సాధకునిగూర్చి చెప్పుటవలన దేనిని తెలిసికొందును ? వింధ్యగజము పట్టుబడుటనుగూర్చి చెప్పిన కథవలన ఏవిషయమును గ్రహించుదును. అని అడిగిన చూడాల ఇట్లనియె. ఓ మహారాజా ! మొట్టమొదట చింతామణి కథనుగూర్చి వివరించెదను వినుము. సర్వశాస్త్రార్థ వేత్తయనియు, తత్వజ్ఞాన శూన్యుడనియు, చింతామణిని సాధించుటకై ప్రయత్నించెననియు, జెప్పబడిన పురుషుడవు నీవేను. నీవు శాస్త్రములను ఎఱుగుదువుగాని, తత్వమును ఎఱుగవు కదా ? ఓ సత్పురుషుడా ! మనఃపూర్వకముగ సర్వవిషయములను పరిత్యజించుట అనునది ఏదికలదో, అదియే చింతామణి అనియీకథ యందు వర్ణింప బడినది. చింతామణిచేత దారిద్ర్యము నశించునట్లు సర్వ పరిత్యాగముచేత విషయ సంబంధమువలన కలిగిన దుఃఖములు నశించునుకదా. నీవు అట్టి సర్వ పరిత్యాగమునే సాధింప ప్రయత్నించితివి. వానివలెనే నీవును భార్యా పుత్ర ధనాదులతోగూడి రాజ్యసంపదను వదిలితివి. నీమనస్సు సర్వ పరిత్యాగమను విషయమునందే నిలుకడ జెంది ఉండెను. సర్వ పరిత్యాగమను చింతామణి అత్యల్పప్రయత్నమునందే చిక్కినట్లు ఉండెను. ఆపురుషునకు చేతితో అందుకొనునంతటి దూరములో నిలచిన చింతామణివలె నీకును సర్వ పరిత్యాగస్థితియే అత్యాసన్నమై ఉండెను. అదిసంపూర్ణముగ చేత జిక్కినమునుపే నీకు దానిని గూర్చిన వికల్పములు ఈ క్రిందివిధముగ గలిగెను. సర్వత్యాగము ఇదేన ? కాదు, కాదు,

ఇంతలో నేను సర్వత్యాగమును చేయ గలిగితినా? మహాత్ములు ఎవ్వరో, చేయగలరు కాని, నాకు ఇంతలోనే అది సాధ్యమగునా ? కావున ఇంక ఎప్పటికో గాని, నాకు అది సిద్ధింపదు. అట్టి మహాభాగ్యము నాకు ఇంత లోనే కలిగినదనుట ఏటిమాట ? ఓ మహారాజా ! ఆకాశము మేఘముచేత ఆవరింప బడినట్లు నీమనస్సు ఇట్టి సంకల్పములచేత ఆక్రమింపబడగానే, ఈ ఆలోచనచేత ఆ సర్వత్యాగమునందు ఉపేక్ష అధికము కాగానే, పెద్ద గాలిలో ఎండిపోయిన ఆకు ఎగురునట్లు ఆ సర్వత్యాగ చింతామణి నీయొద్ద నుండనోల్లక ఎగిరిపోయెను. ఓ కమలనేత్రుడా ! మహారాజా ! ఈ విధ ముగ సర్వత్యాగచింతామణి అదృశ్యము కాగానే, తపస్సనియెడు గాజు రాయి నీకు దొరికెను. సంకల్పమను నేత్రముతో దానిని చూచితివి. గ్రహించితివి.

శ్లో॥ అమితానంద ముత్సృజ్య సుసాధ్యం యః ప్రవర్తతే ।
మితేవస్తుని దుస్సాధ్యే స్వాత్మహా సశఠస్స్మృతః ॥

ఓ రాజా ! ఏ మూర్ఖుడు పరమానందము సులభముగ దొరుకునదియై యుండగ నీచమగు అన్యపదార్థమును, కష్టసాధ్యమును, నగుదాని యందు దృఢప్రయత్నముతో ప్రవర్తించునో, అట్టివాడు ఆత్మహత్యను గావించుకొనిన వాడే అగును. ఓ సత్పురుషుడా (ఇట్లు తపస్సనెడు) గాజురాయిని మాత్రమే ఆశ్రయించియుండియు, నీవు చింతామణిని సంపాదించితివని సంతోషించు చున్నావు. నీకుమాత్రముచింతామణి కాదుగదా, ఒకస్ఫటికపురాయియైనను, దొరుకలేదు. నీకుదొరికినది గాజురాయే.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణప్రకరణమున ముప్పదియేడవ సర్గమునందు
చింతామణ్యుపాఖ్యానవివరణమను మూడవ
ప్రకరణము ముగిసెను.

—*—

## —* గజోపాఖ్యాన వివరణము. *—

వశిష్ఠమహాముని శ్రీరామునితోనిట్లనియె. ఓరామచంద్రా ! ఇట్లు చింతామణ్యుపాఖ్యాన వివరణమును వివరించి చూడాల మఱల ఇట్లనియె. ఓ మహారాజా ! ఇకగజోపాఖ్యాన వివరణమును వినుము. వింధ్యపర్వత వనమునందు కలదని చెప్పబడిన ఏనుగు నీవె. దానికి కలవని చెప్పబడిన దంతములు వివేక వైరాగ్యములే. మఱియును ఆగజమును పట్టెనని చెప్ప

బడిన మావటివాడు అజ్ఞానమే. వాడు దానికి దుఃఖమును కలిగించినట్లు ఈ యజ్ఞానము మొట్టమొదట నీకును మహాదుఃఖమును కలిగించుచుండెను కదా ? ఓ రాజా ! మహాబలవంతమయ్యు, ఆ ఏనుగు తనకంటె ఎంతయో బలహీనుడైన మావటివానిచేత బహువిధములగు దుఃఖములను గలిగింపబడుచున్నట్లు నీవును మహాజ్ఞానవంతుడవయ్యు నీకంటే ఎంతయో బలహీనమైన మూర్ఖతచేత బహుదుఃఖములపాలు చేయబడుచున్నావు. బహువిధములగు భయములను గలిగింపబడుచున్నావు. ఇదియునుగాక ఆకథయందు "ఏనుగు ఇనుప గొలుసులలో చిక్కించబడెను" అనిచెప్పబడియున్నది. అది ఏది అనిన, నీకు ఆశాపాశములచేత కలిగిన బంధమే. ఓ రాజా ! వాస్తవస్థితిలో ఆశ అను త్రాటికిని ఇనుపగొలుసునకును ఎంతయో అంతరము కలదు. ఆశ ఆ ఇనుపగొలుసులకంటే కఠినమైనది. గట్టిది. పొడవైనది. మఱియు ఆ ఇనుపగొలుసులు కాలక్రమమున క్షీణించును. ఆశయన్ననో, అభివృద్ధినొందును. ఆ ఏనుగు తనశక్తిచేత సంకెళ్ళను ఊడబెరికినంటిని కదా ? నీవును అట్లే రాజ్యము మొదలగు సర్వభోగములను విడిచి ఆశాపాశమును ఛేదించితివి. ఆ మావటివాడు తాటిచెట్టుపైనుండి పడెననుటకు, రాజ్యమును విడువగానే నీ అజ్ఞానము పోయెనని అర్థము. ఓ రాజా ! ఏక్షణమునందు పురుషుడు వైరాగ్యమును జెంది భోగేచ్ఛను వదలునో, ఆక్షణమున, తనకు ఆధారమగు వృక్షమును ఛేదింపబోయిన అందున్న పిశాచము పడకునట్లు అజ్ఞానము పడకును. కావున ఎవ్వడైనను మనఃపూర్వకముగ భోగములను విడిచెనేని వాని అజ్ఞానము నిరాధారమై క్రిందపడును. ఆశయే అజ్ఞానమునకు ఆధారము. కావున ఆశా పరిత్యాగమును గావించిన క్షణముననే, చెట్టుకొట్టిన తత్క్షణమే అందున్న పిశాచము పరుగిడి పోవునట్లు అజ్ఞానము పరువిడిపోవును. కావున నో రాజా ! నీవు భోగములను విడచి అరణ్యమునకు వచ్చినప్పుడే నీ అజ్ఞానము పోయినది. ఓ రాజా ! ఈ విధముగ అజ్ఞానముచేత చిక్కినను సర్వపరిత్యాగమను మహాఖడ్గముచేత నీవు దానిని ఖండింపక విడచితివి. ఆ ఏనుగు తన ఎదుట పడియున్న మావటివానియందు దయ జూపినట్లు ఆ అజ్ఞానమునందును నీవు దయ జూపితివి. అదిమాత్రము నిన్ను విడువలేదు. తనకు గలిగిన అవమానమును జ్ఞప్తియందు ఉంచుకొని ఆమావటివాడు ఏనుగును మఱల గుంటలో త్రోసి బంధించినట్లు ఆ అజ్ఞానము నిన్ను మఱల బంధించినది. తపస్సనియెడు గుంటలో పడద్రోసినది. నీవు అట్లు చేతచిక్కిన అజ్ఞానమును రాజ్యత్యాగము

చేసిననాడే సర్వపరిత్యాగమను ఖడ్గముతో ఖండించి యుండువేని అది నిన్ను ఇప్పుడు ఇంత చేసియుండదు. అప్పుడే అది సంపూర్ణముగ నాశము నొందియుండును కదా ? కావున ఏనుగు పడుటకై త్రవ్వబడెనని చెప్పబడిన ఫలము ప్రస్తుతము నీవు అనుభవించుచున్న మహాదుఃఖమే. మఱియును ఆ మావటివానికి గల పరివారమంతయును జ్ఞానమునకు పరివారభూతమగు మనోవిచారమే, అని తెలిసికొనుము. మఱియు అచ్చట మావటివాడు ఏనుగుకై త్రవ్వబడిన గుంటమీద కొన్ని లేత తీగెలను పరచెను. ఇచ్చటను, తపస్సనియెడు మహాదుఃఖము సద్గుణములచేత ఆవరింపబడి ఉన్నది. కావున ఓ రాజా ! నీవును ఆ ఏనుగువలె పల్లములో బడియున్నావు. విష్ణుమూర్తిచేత బంధింపబడిన బలిచక్రవర్తివలె పాతాళమునకు బోయి యున్నావు.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున ముప్పదియేడవ సర్గమునందు
గజోపాఖ్యాన వివరణమను నాలుగవ
ప్రకరణము ముగిసెను.

—*—

## —* సర్వత్యాగ స్వరూప నిరూపణము. *—

వశిష్ఠమహాముని శ్రీరామునితో ఇట్లనియె. ఓ రామచంద్రా ! వినుము. ఇట్లు కథలలోని అభిప్రాయమును ఎఱిగించి ఆచూడాల మఱల ఇట్లనియె. ఓ మహారాజా ! నీకు చూడాలయను ఒక భార్యయుండెను కదా ? ఆమె బ్రహ్మవేత్త. నీయందు మిక్కిలి భక్తికలది. ఆమె నీకు జ్ఞానమును పలుమారు ఉపదేశించి ఉండెను. ఆమె వాక్యములను ఏల ఆదరింపవైతివి ? ఓ రాజోత్తమా ! ఆమె తత్వవేత్తలలో శ్రేష్ఠురాలు. ఆమె చెప్పువాక్యములును, చేయుకార్యములును, పరమార్థములు. పరమార్థవస్తుబోధకములు. అప్పుడే నీవు ఆమె చెప్పిన చొప్పున నడచియుండిన మిక్కిలి యుక్తముగ ఉండును. పోనిమ్ము, ఏదియో ఒక కారణముచేత ఆమె చెప్పిన వాక్యములను ఆదరింపకున్న ఆదరింపకుందువు గాక. ఇప్పుడు చేసిన సర్వపరిత్యాగమునైనను, ఏల సంపూర్ణముగ గావింపవైతివి అని చూడాల చెప్పిన శిఖిధ్వజుడువిని ఆశ్చర్యభరితుడై ఇట్లనియె. ఓ దేవకుమారా ! ఇట్లు పలికెదవేల ? నేను నిష్కంటకమగు రాజ్యమును విడిచితిని. మహాభోగ సంపన్నమగు గృహమును విడిచితిని. భార్యను విడిచితిని. పుత్రులను

విడిచితిని. మహా సౌఖ్యావహమును, బంధుపూర్ణమును, అగు స్వదేశమును విడిచితిని. ఇక నాకు సర్వ పరిత్యాగమునందు కొరత ఏది కలదు ? అన్నిటిని పరిత్యజించియే ఉన్నాను కదా? అనిన దేవకుమార వేషముతో నున్న చూడాల ఇట్లనియె. ఓ రాజా ! నిశ్చయమే నీకు ధనముగాని, రాజ్యముగాని, బిడ్డలుగాని, లేరనుట నిశ్చయమే కాని, అయినను నీవుమాత్రము సర్వపరిత్యాగము చేసినవాడవు కానేరవు. నీకు ఇప్పటికిని అన్నిటికంటె అధికమగు రాగము ( కామము ) కలదు. దానిని పరిత్యజించిన కాని, సర్వపరిత్యాగము కానేరదు. అనిన మఱల శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ దేవకుమారా ! వినుము. రాజ్యమును విడిచి ఇప్పుడు పర్వతవృక్షాదులతో గూడిన ఈ వనమును ఆశ్రయించి ఉన్నాను. రాజ్య పరిత్యాగము సర్వపరిత్యాగము కాదేని ఇప్పుడు నాకు ఆశ్రయమై ఉన్న ఈ వనముకూడ విడిచెదను. అనిచెప్పుచునే ఓ రామచంద్రా ! ఆ శిఖిధ్వజుడు జితేంద్రియుడు కావున తత్క్షణమే ఆవనమునందలి ఆశను వదలివేసెను. వర్షజలము దుమ్మును అణచివేయునట్లు వనమునందలి అభిమానమును అణచివేసి ఆ కుంభునితో ఇట్లనియె. ఓ దేవకుమారా ! కుంభుడా ! ఇప్పుడు నేను చేసినది సర్వపరిత్యాగమే. రాజ్యాదులయందలి అభిమానము ఇదివరకే పోయినది. అరణ్యమునందలి అభిమానముకూడ ఇప్పుడు పోయినది. ఇక నాకు కొరత ఏమియు లేదుకదా ? అని పలికిన కుంభుడు మఱల ఇట్లనియె. ఓ రాజా ! ఇప్పటికిని నీవు సర్వపరిత్యాగివి కావు. పర్వతారణ్యాదులయందలి అభిమానమును పోయినను, ఇంకను నీకు ఆశపోలేదు. ఇంకను అభిమానము నశింపలేదు. అనికుంభుడు పలికెను. అంతశిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ దేవకుమారా ! ఇప్పటికిని ముగియకున్న ఇక నాకు కొరత ఏమి యున్నది. నాపర్ణశాలయును, బొంత మొదలగునవియును, మాత్రమే కదా ? వానినిగూడ పరిత్యజించెదను. నేటినుండియు వానియందునుగూడ అభిమానమును ఉంచను. అని రాజుచెప్పిన కుంభుడు ఇట్లనియె. ఓ రాజా ! అప్పటికిని నీవు సర్వపరిత్యాగమును చేసినవాడవు కాజాలవు, అప్పటికిని పర్ణశాలాదులపైనుండు అభిమానము మాత్రమే పోవునుగాని అభిమానమంతయును నిశ్శేషముగ పోనేరదు. రాగము నశింప నేరదు. అని చూడాలచెప్పిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ దేవకుమారా ! ఈ పర్ణశాలనుగూడ విడిచిన ఇంక నాకు అభిమానము ఎందుండును ? పాత్రలు మొదలగువానియందే కదా ? సరి, వానినిగూడ పరిత్యజించెదను. ఓ రామచంద్రా ! ఇట్లు పలుకుచు ఆ జప

మాలాది పదార్థములను ఒకచోట కుప్పవైచి కాల్చివేసెను. ఇదియే అభిమాన పరిత్యాగమని ఆ శిఖిధ్వజుని అభిప్రాయము. వస్తువులు లేకున్న ఇక అభిమానము ఎందుండునని వాని సంకల్పము. ఇట్లు సర్వమును ఎండు కట్టెలతో గాల్చుచు వానిపైని ఇంచుకయైన ప్రీతిని జూపక వాని నాశమునకు మిక్కిలి సంతసించుచు ఆ శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ దేవకుమారా! ఇక నాకు అభిమానము ఎందును లేదు. నేను బహుకాలమునకు సర్వపరిత్యాగిని అయితిని. నీఅనుగ్రహమువలన అతి శీఘ్రకాలములోనే నాకు జ్ఞానముకలిగినది. పరమానందమును బొందితిని. వాస్తవస్థితిలో ఈ పదార్థములన్నియు వస్తువులే కావు. మనస్సు తన సంకల్పములచేత వీనియందు లేని సారాంశమును కల్పించినది. వానితో పురుషునకు లేని సంబంధమును కల్పించినది. కావున ఆవస్తువులను పరిత్యజించిన ఇక మనస్సు వానినిగూర్చిన సంకల్పములను చేయనేరదు. అట్టివస్తువులు అనగా, ఆ వస్తువులయందలి అభిమానము విడిచిపోవుకొలది మనస్సునకు సుఖము కలుగును. ఈవస్తువులే బంధహేతువులు. ఇవి పోయిన ముక్తి కలుగును. నేనన్ననో, ఇప్పుడు సర్వవస్తువులను అభిమాన పూర్వకముగ పరిత్యజించితిని. కావున శాంతుడనైతిని. నిర్వాణము నొందితిని. పరమానందమును జెందితిని. అందరికంటెను అధికుడనైతిని. నాబంధములన్నియు నశించినవి. ఇక నేను దిగంబరుడనాదును. ఆ దిక్కులును నేనును ఒకటియే. ఓదేవకుమారా! సర్వమును విడిచివేసితినికదా ? ఇక నేను చేయవలసిన పని ఏదియో చెప్పుము. అని పలికిన మఱల కుంభుడు ఇట్లనియె.

ఓ శిఖిధ్వజమహారాజా ! ఋషిశ్రేష్ఠా ! ఇప్పటికిని నీవు సర్వత్యాగమును చేయలేదు. కావున ఊరికె సర్వత్యాగముచేత గలుగు పరమానందమే ఇప్పుడు కలిగెనని సంతోషింపకుము. ఊరికె అట్టిస్థితి కలిగినట్లు అభినయింపకుము. ఓ రామచంద్రా ! పైనవర్ణించిన విధముగ సర్వమును పరిత్యజించిన తన్నుగూర్చి ఆ కుంభుడు పలుకగానే ఆరాజు తనలోనొకింత విచారించి ఇట్లనియె. ఓ దేవకుమారా! ఇప్పటికి నేను అన్నిటిని విడిచితిని. ఇంద్రియములను సర్పములతో గూడినదియు, రక్తమాంసములచేత ఆవరింపబడినదియు, నగు దేహము ఒకటియే ఇక మిగిలియున్నది. కావున ఇప్పుడు పర్వత శిఖరముపైకి ఎక్కి క్రిందికి దుమికి ఇప్పుడే ఈ శరీరమునుకూడ ధ్వంసము కావించి దీనియందలి అభిమానమునుకూడ విడిచెదను. అప్పటికైనను, సర్వ పరిత్యాగిని అగుదునుకదా ? ఓ రామచంద్రా ! అనియిట్లు

పలుకుచు నాశిఖిధ్వజుడు అచ్చటనున్న గోతిలో పడుటకై లేవబోగా ఆ కుంభుడు నిలు, నిలుమని, అతనిని నివారించి ఇట్లనియె. ఓరాజర్షిశ్రేష్ఠా! ఇది ఏల ? కోపమువలన ఏమియు ఎఱుగలేని ఎద్దు, నిరపరాధియగు లేగ దూడనుకూడ సంహరింప జూచునట్లు నీవు ఈ దేహమును నశింప జేయ దలంచుచున్నావు ఏల ? ఎద్దు తిర్యగ్జాతి కావున దానికి జ్ఞానము లేదు. అది యుక్తాయుక్తములను ఎఱుగనేరదు. నీవు మనుష్యుడవుకదా ? ఇప్పుడు గుంటలోపడి శరీరమును విడిచినను నీకు సర్వత్యాగము కలుగనేరదు. అదీ మహా విషమమైనది. దానిని ఎఱిగి ఆచరించుట మిక్కిలి కష్టము. ఏది జన్మ కర్మలకు కారణమైయున్నదో, దేనిచేత నీవు ఇట్టి దుఃఖమునకు పాల్పడు చున్నావో, అట్టి దానిని ఎఱిగి విడిచిన అది సర్వత్యాగమగునుకాని, బాహ్యపదార్థత్యాగము అట్టిది కానేరదు. సర్వకారణమగు పైన వర్ణించిన విషయమును విడిచితివేని ఈబాహ్యపదార్థములు ఉండినను ఒక్కటియే లేకున్నను ఒక్కటియే. అప్పుడు ఇవి అన్నియు చుట్టును ఉండి తమవలన గలుగు సౌఖ్యములను అనుభవింప జేయుచున్నను నీకు ఇంచుకయైన విక్షేపమును కలిగింపనేరవు. అని పలికినవిని శిఖిధ్వజుడు ఇట్లనియె. సుందరాకారా ! నీవు చెప్పిన పదార్థము ఏది ? ఈదేహము దేనిచేత చలింప చేయబడుచున్నది ? జన్మకర్మలకు కారణము ఏది ? దేనిని విడిచిన సర్వమును విడిచినట్లగును ? దీనినంతయును నాకు వివరింపుము. అనిన దేవకుమార వేషముతోనున్న ఆ చూడాల ఇట్లనియె. ఓ సత్పురుషుడా ! మహారాజా ! వినుము. సర్వ వ్యాపకమై ఉండు మనస్సు సర్వానుభవసిద్ధమై ఉన్నది. దానినే లోకులు జీవుడు ప్రాణము, అను మొదలగు పేరులతో పిలుచుచున్నారు. దాని స్వరూపమును విచారింపబోయిన ఎట్లును నిర్ణయించుటకు వీలులేదు. అది జడమును కాదు. చేతనమును కాదు. సర్వప్రపంచమును కల్పింప గలుగుట చేత అది జడముకాదు. సాక్షిలేక ప్రకాశించునది కాకపోవుటచేత చేతన మును కాదు. ఇట్టి ఈ చిత్తమే సర్వమును అగుచున్నది. చిత్తమే ప్రపంచ సమూహము. చిత్తమేబంధము. ఓ సత్పురుషుడా ! ఈ కారణమువలన ఆ చిత్తమును విడుచుటనే సర్వపరిత్యాగము. జన్మకర్మలకును ఆ చిత్తమే కారణము. "వృక్షమును గాలి కదలించునట్లు ఆ చిత్తమే ఈ దేహమును కదలించు చున్నది. బహువిధములగు వ్యాపారములయందు ప్రవర్తింప జేయుచున్నది. త్యాగస్వరూపమును ఎఱిగిన మహాత్ములు చిత్త పరిత్యాగ మునే సర్వ పరిత్యాగమందురు. చిత్తము నశించెనేని భేదాభేదములు

రెండును తోడనే నశించును. వాస్తవస్థితిలో కల్పితముగానైనను, యథార్థముగానైనను, మఱి ఏ విధముగానైనను, భేదమునది ఉండిననేకాని, అభేద వ్యవహారము కలుగదు. ఎప్పటికిని ఒకటిగానే ఉండుపదార్థమును గూర్చి "ఇది అభేదముతో ఉన్నది" అని ఎవ్వరును చెప్పరు. భేదమే లేకున్న దానిని నిషేధించుట ఎట్లు సయుక్తికమగును ? ఏకపదార్థమునందు భేదము ఎక్కడ కలుగును. కావున ఎట్లు చూచినను భేదమనునది ఉండిననే కాని, భేదాభేద వ్యవహారములు కలుగవు. ప్రస్తుతము మనకు గానవచ్చుచున్న భేదమన్ననో, శూన్యరూపమైనదియే. మనస్సుఉన్నప్పుడు మాత్రము దానిచేత ఏకపదార్థమునందు కల్పింపబడుచున్నదియే. తిమిరరోగముచేత కల్పింపబడిన చంద్రద్విత్వమువలె అసత్యమైనదియే. కావున మనస్సును విడుతువేని తత్క్షణమే ఇదియెల్ల అణగును. ఇదిపోయిననే భేదముకూడ నశించును. "నేను పరబ్రహ్మముతో ఏకీభవించితిని" అను వ్యవహారము కూడ "నేను పరబ్రహ్మమునకంటె భిన్నుడనై ఉన్నాను" అను వ్యవహారమువలె భ్రాంతి జన్యమే. ఒకప్పుడు భేదముతో ఉండిననే కదా. మఱియొకప్పుడు ఐక్యము నొందవలయును ? భేదమేలేదనిన ఐక్యముమాత్రము ఎక్కడనుండి వచ్చును ? ఈ కారణమువలన చిత్తనాశమైన ఉత్తరక్షణముననే ఈ భేదాభేదములు అన్నియును అదృశ్యములై పోవును. సర్వోత్తమమును, శాంతరూపమును నిర్మలమును, నిరుపాధికమును బంధమోక్షవర్జితమును, నిర్వికారమునగు పరమేశ్వరరూపము ఒకటియే శేషించును. ఈ ప్రపంచము కానవచ్చినప్పుడును, సుషుప్త్యవస్థయందు లీనమైనప్పుడునుగూడను, ఉండుపదార్థము ఆ ఈశ్వరుడు ఒక్కడేకదా ? ఈ విధముగ చిత్తము సంపూర్ణముగ నశించెనేని అదియే పరమానందము. తక్కినది అంతయు దుఃఖమే. పరమేశ్వరుడు అమృతరూపుడు. ఆయనయే, స్వస్వరూపము. ఇట్లుండగ చిత్తప్రభావమువలన ఆయనయందు లేనిభేదములను ఆరోపించి జీవభావమును కల్పించి జనులు నిరర్థకముగ శోకింపుచున్నారు. కావున మనస్సును పరిత్యజించినచో, ఇట్టి కల్పనలన్నియును అణగును. అమృతమయమగు స్వస్వరూపము శేషించినచో, స్వతస్సిద్ధమగు పరమానందము అభివ్యక్తమగును. ఓ మహారాజా ! నేను చెప్పవలసిన దానినెల్ల జెప్పితిని. దీనిని విని అంగీకరించి నీ ఇష్టమువచ్చినట్లు చేయుము. నేను చెప్పిన విధమున సర్వత్యాగమును చేయుదువేని, నీకు ఎట్టి సంక్షోభములును ఉండవు. స్వస్థుడ వయ్యెదవు. ఎట్టి భోగములను అనుభవించుచున్నను ఆకాశము

వలె వానితో సంబంధమును కలిగి ఉండవు. మృదుస్వభావము కలవాడవు అగుదువు. ఇంత ఏల? పరమార్థ స్థితిలో నీస్వరూపము ఏదియో, దానినే చెందుదువు. నామాటను ఆలకించి ఇట్టి స్థితిని నీవు సంపాదింతువని నా నమ్మకము.

## —✱ చిత్తస్వరూప నాశోపాయములు. ✱—

అని చూడాల పలికిన విని శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓభగవంతుడా! సుకుమారా! మొట్టమొదట నాకు చిత్తస్వరూపమును ఎఱిగింపుము. ఉపన్యాసకులలో శ్రేష్ఠుడా! పిమ్మట చిత్తపరిత్యాగోపాయమును వర్ణింపుము. అని అడిగిన కేశవకుమార వేషముతో నున్న ఆచూడాల ఇట్లనియె. ఓరాజర్షిశ్రేష్ఠా! వినుము. మనకు అనుభవములో ఉన్న భ్రాంతియే మనస్సునకు స్వరూపము. "ఇది ప్రపంచము" అను దృఢవాసనయే మనస్సునకు స్వరూపము. చిత్తశబ్దము వాసనాశబ్దమునకు పర్యాయమే. వాసనాశబ్దము దేనిని చెప్పునో చిత్తశబ్దముకూడ దానినే చెప్పును. కావున చిత్తశబ్దమువలన వాసనాశబ్దార్థ భిన్నమగు మఱియొకటి చెప్పబడెనని భ్రాంతిని జెందకుము.

ఓబుద్ధిమంతుడా! మహారాజా! మఱియొక విశేషము. "నేనునాది" అనుచు అహంకారము విజృంభించు చుండుటను చూచు చున్నాముకదా? ఇదియే సర్వానర్థములకును మూలము. ఇదియే చిత్తమను మహావృక్షమునకు వేరు. దీనినుండి మొట్టమొదట పుట్టిన మొలకయే, బుద్ధి. ఆబుద్ధికి, బాగుగ విచారించిన ఆకారము ఏదియు నిర్ణయింప బడకున్నను కార్యనిశ్చయమే దానియొక్క స్వరూపము. భ్రాంతిసిద్ధమగుటచేత ఈస్వరూపము కూడ లేనిదే. కావుననే విచారదశయందు దానికి రూపము లేదని చెప్పితిని. ఇట్టి బుద్ధియను మొలక అభివృద్ధినొంది వృక్షమైన పిమ్మట దానికే సంకల్పమని పేరు. చిత్తము, చేతస్సు, మనస్సు, అను మొదలగునవి అన్నియు దానియొక్క నామధేయములే. దానికి పదార్థములను భావించుటయే స్వరూపము. కావున ఓ మహారాజా! ఇట్టి చిత్తమను దుష్టవృక్షము నీలోపల నాటుకొని ఉన్నది. కావున దానిని ఎట్లయినను సమూలముగ ధ్వంసము చేయుటయే నీకు కార్యము. దానియొక్క స్వరూపము వాసనలే అని ఇదివరకే చెప్పి యున్నాను. కామ క్రోధాది రూపములగు ఆవాసనలు ఆవృక్షమునకు శాఖలై జనించుచు మిక్కిలి అభివృద్ధిని కలిగించు చుండును. వృక్షమునకు శాఖలేకదా, అభివృద్ధి కారణములు. మఱియు మూలమును శా

ఖమును ఒక్కటియే, అను విషయముకూడ ప్రత్యక్షము. కావున వాసన అనునది తానే మూలమై తానే శాఖయై తనను తానే అభివృద్ధి చేసికొనుచున్నది. అహంకారమును ఆధారముగ జేసికొని ఉన్నది. కావున వృక్షాభివృద్ధి కారణములై ప్రతిక్షణమునందును పుట్టుచున్న కామక్రోధాదిరూపములగు కొమ్మలను ప్రతిక్షణమును ఛేదించు చుండుము. మూలధ్వంసమును గావించుటకు దృఢప్రయత్నమును చేయుము. అది ఎట్లనిన, వినుము. ఓరాజా! వాసనలు చిత్తవృక్షమునకు శాఖయై బహువిధములగు అనర్థములను ఫలించు చున్నవి. లోకమునందు వట్టి అభిమానమే కాని, చిత్తవిక్షోభ కారణ మగుటచేత సుఖముకూడ అనర్థమే కదా? ఈవాసనలు సంకల్పమాత్ర రూపములు కావున వీనిని అణచుట మిక్కిలి సులభము. సంకల్పింపకుండిన నంతయే చాలును. ఇకను ఇవి తలయెత్తవు. కావుననే పురుషుడు దేనియందును తగులని మనస్సు కలవాడై మానశీలుడై శాంతస్వభావుడై తనకు దోచిన పదార్థములయందెల్ల తత్త్వమును గ్రహించువాడై ఎప్పటికి ఏదివచ్చిన దానిని రాగద్వేష శూన్యముగ ఆచరించువాడై ఉండునో, అట్టివాడు ఆచిత్తవృక్షమును త్రెంచివేసినవా డగును. మఱియు నోరాజా! ఈచిత్తవృక్షమును ఛేదింపవలయు ననిన దీనిమూలమునే ఛేదింపవలయును. ఏవృక్షమును ఛేదింపవలయునన్నను, ఇదియే కదా కర్తవ్యము? అప్పుడు కొమ్మలు పుట్టనే పుట్టవు. ఉన్నవియును ఎండిపోవును. కావున కొమ్మలను గొట్ట ప్రయత్నించుట అనునది అప్రధానము. మూలచ్ఛేదము చేయ లేనివాడు ఆపనిని ఆచరింపవలయును. ఇట్లును చెప్పుటకు వీలు లేదు. అదియు వివేకవంతునకే కాని, సాధ్యము కాదు కదా? కావున ఎట్లు చూచినను నిరుత్సాహ వంతుడగు వాడే మూలచ్ఛేదమునకు ప్రయత్నింపక కొమ్మలనుమాత్రమే ఎప్పటికప్పటికి ఛేదించుచు కాలము గడుపజూచు ననవలయును. నీవుమాత్రము అట్టి నిరుత్సాహస్థితిని జెందకుము. చిత్తవృక్షముయొక్క మూలమగు అహంకారమునే మొట్టమొదట ఛేదింప ప్రయత్నింపుము. నిరర్థకముగా కొమ్మలకు ఉత్పత్తియొక్క అవకాశమును ఇచ్చి వానిని మఱల మఱల త్రుంచివేయుచు శ్రమ జెందనేటికి? ఓబుద్ధిమంతుడా! మహారాజా! మఱి యొక విశేషము. ఈచిత్తవృక్షముయొక్క మూలము ఇతరవృక్షములయొక్క మూలములవలె త్రవ్వి పారవేయగానే, ఊరకుండునది కాదు. స్వయముగనే సాటుకొని మఱల ఆచిత్తవృక్షమును పుట్టునట్లు చేయునది సుమీ. ఈకారణమువలన ఊరక త్రవ్వి పెల్లగించి అంత

మాత్రముచేత విడువక జ్ఞానాగ్నిచేత దానిని భస్మము కావింపుము. అప్పటికి చిత్తవృక్షము నామమాత్రావశేషమగును.

—✱ శిఖిధ్వజుని ఆత్మనిశ్చయము. ✱—

అని దేవకుమార వేషముతోనున్న చూడాల పలికిన విని శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓమహాత్మా! దేవకుమారా! చిత్తవృక్షమునకు మూలమగు ఆ అహంకారమును కాల్చుటకు అగ్ని ఏది? దానిని దయతో చెప్పుము. అనిన దేవకుమార వేషముతో నున్న చూడాల ఇట్లనెను. ఓమహారాజా! "నేను ఎవ్వడను" అని ఆత్మస్వరూప విచారము చేయుట ఏది కలదో, అదియే చిత్తవృక్ష బీజమగు నహంకారమును కాల్చుటకు అగ్ని యని తెలిసికొనుము. అనిపలికిన విని శిఖిధ్వజుడు ఇట్లనియె. ఈవిచారమునుకూడ ఇంతకుముందే ఆచరించి ఉన్నాను. ఓదేవకుమారా! నాలో నేనే పలుమారు నాస్వస్వరూపమునుగూర్చి విమర్శించుకొని ఒకవిధమగు నిశ్చయమును గావించుకొని ఉన్నాను. ఆవిచారమువలన నాకు ఈక్రిందివిధముగ తోచినది. నేనుచేతనుడను. నా ఎదుట ఉన్నవి జడములు. కావున వానికిని నాకును సంబంధము ఉండుటకు వీలు లేదు. వానిని నేను చూచుచున్నాను. చూచువానికిని చూడబడువానికిని సంబంధము ఎట్లు కలుగును? అది లోకమునందు అనుభవములో లేదు కదా? కావున ఈప్రపంచము గాని, రక్తమాంసాది యుక్తమగు ఈదేహము కాని, ఇంద్రియములు కాని, మనస్సు కాని, బుద్ధి కాని, అహంకారము కాని, నాస్వరూపములు కావు. అహంకారమునకును నాకును భేదము లేనట్లు కానవచ్చుచున్నది కాని, అది యథార్థము కాదు. "నేను పదార్థమును చూచుచున్నాను. అను విషయము నాకు తెలియుచునే ఉన్నది" అను మొదలగు వ్యవహారములను బట్టి విమర్శించిన "నేను" అను శబ్దముచేత వ్యవహరింప బడుచున్న అహంకారముకూడ ఆత్మకు గోచర మగుచున్నట్లు స్పష్టము అగుచున్నది. కావున విచారించి చూచినచో, సువర్ణమునందు "ఇది కడియము" అని కటకత్వమును ఆరోపించినట్లు ఆ ఆత్మయందే అహంకారత్వమును ఆరోపించి ఉన్నారని తెలియవచ్చుచున్నది. కావున నేను వీనికన్నిటికంటె వేరైనవాడను. అని రాజుపలికిన చూడాల ఇట్లనియె.

ఓబుద్ధిమంతుడా! రాజర్షిశ్రేష్ఠా! నీ ఆలోచన మేలుగా నున్నది. అహంకార పర్యంతముగనున్న ఈసర్వ పదార్థములును ఆత్మరూపములు కావని నిశ్చయించితివి కదా? ఇక నీవు ఎవ్వడవు? నీమనస్సునందు నిశ్చయ

ము ఎట్లున్నది. నాకు తెలుపుము. అనిపలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఇదిగో వివరించు చున్నాను. ఈసర్వ సంకల్పములును ఏస్థలమునందు పుట్టుచున్నవో, దేనిచేత ప్రత్యేకముగ నిర్ణయించి ఎఱుగ బడుచున్నవో, అట్టి జ్ఞానమే నాకు స్వస్వరూపము. అదియే కదా, సర్వసాక్షి. నేను ఇట్టివాడనే అయినను నాలోన చిత్తవృక్షముయొక్క బీజమగు అహంకారమను మాలిన్యము నిరర్థకముగ నిష్కారణముగ తగులుకొని ఉన్నది. ఓదేవకుమారా! దానిని విడువవలయునని ఎంతయో ప్రయత్నించు చున్నాను. అట్లు విడుచుటకు సాధ్యము కాకున్నది. ఎన్నిమారులు విడచినను మగల మరల వచ్చి ఆక్రమించుచున్నది. ఇట్లగుటచేత తపస్సువలన దానిని విడచుటకు సాధ్యమగునేమో, అని ఇట్లు ఘోరవ్రతమును బూని ఉన్నాను. అనిపలికిన కుంభుడిట్లనియె. ఓరాజర్షిశ్రేష్ఠా! నీవనినది నిశ్చయమే కాని, ఏమియు దెలియక ఊరక తపమును చేసిన ఏమివచ్చును. ప్రతివాడును ఏదియైన ఒక కార్యమును చేయ బూనునేని మొట్టమొదట ఆకార్యసిద్ధికి తగిన సాధనములను వెదకికొన వలయును. సాధన సాధ్యములకు గల సంబంధమును యుక్తియుక్తముగ నిర్ణయించుకొనవలయును. పిమ్మట ఆసాధనమును గైకొన వలయును. ఇట్లుగాక దేనినో సాధించుటకు దేనినో ఆశ్రయించిన ప్రయోజనమేమి? ఓరాజా! ప్రస్తుతము నీకు తపస్సునకును అహంకార నాశనమునకును గల సంబంధ మేదియో, తెలియదు. అహంకారము ఏల నాశము గాకున్నదో, అదియును తెలియదు. ఇది సత్యమే కదా? ఇట్లుండగ ఊరక తపస్సును చేసినంతమాత్రమున నీయొక్క ఇష్టసిద్ధిని జెందుట ఎట్లు? కావున ఇప్పటికైనను విచారించి చూడుము. నీకు ఆత్మస్వరూపము తెలిసినది. అహంకారము అసత్యము అను విషయమును గోచరమైనది. దానిని విడచుటకును పలుమారు ప్రయత్నించితివి. ఇట్లుండగ అది ఏల నశింపక పోవలయును. లోకమునందు కారణము లేకనే ఏకార్యమును గలుగనేరదు. కావున దీనికిగూడ ( అహంకారము నశింపకుండుటకుగూడ ) ఏదియో ఒక కారణము ఉండవలయును. దానిని వెదకి చెప్పుము. అని చూడాలపలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె.

ఓమునిశ్రేష్ఠా! అదియును నాకు దెలియక పోలేదు. దానినిగూడ ఇదివరకె నిర్ణయించి ఉన్నాను. శుద్ధచైతన్యము దృశ్యాభిముఖమై ఉండుటయే ఆ అహంకారమునకు కారణము. ఓమహాత్మా! అది ఎట్లు శాంతి ఒగును? శుద్ధచైతన్యము నిర్వికారమైయుండక దృశ్యాభిముఖమై ఉండుట

చేత ఎంత ప్రయత్నించినను ఈ అహంకారమునశింపక సర్వదుఃఖాకార
ణమై మఱల మఱల పుట్టుచున్నది. ఆచైతన్యమునకు అట్టి స్థితి కలుగుటకు
కూడ ఈ దృశ్యమే కారణము. కావున ఓ మహాత్మా! ఈదృశ్యమునశించు
విధము ఎది. శాశ్వత సుఖము దొరుకు మార్గము ఎది ? దయతో చెప్పు
ము. అనిపలికిన కుంభుడు ఇట్లనియె. ఓ రాజర్షిశ్రేష్ఠా ! నీబుద్ధికి మిక్కిలి
మెచ్చు వచ్చుచున్నది. నీవు అన్నిటికిని కారణములను బాగుగ ఊహించితివి.
కావున జెప్పుము. ఆశుద్ధచైతన్యము దృశ్యాభిముఖమగుటకు కారణము
ఎది ? దీనిని చెప్పితివేని పిమ్మట కార్యకారణ భావము నంతయును నీకు
వివరించెదను. అనిపలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ మహాత్మా ? దేవకు
మారా ? వినుము. ఆ శుద్ధచైతన్యము దృశ్యాభిముఖ మగుటకు దేహాది
రూపములగు దృశ్యపదార్థములయొక్క ఉనికియే కారణము. ఈ దేహా
దులు అసత్యములే నాశవంతములే అయినను సత్యములన్యే కానవచ్చు
చున్నవి. దీనివలననే గాలియందు చాంచల్యము కలుగునట్లు శుద్ధచైతన్యమా
నందు దృశ్యాభిముఖత్వము కలుగుచున్నది. దానిచేత అహంకారమును
దానిచేత సర్వానర్థములును పుట్టుచున్నవి. నాకు ఇంతవరకు విచారముపై
తెలియవచ్చినది కాని, ఈదేహాది పదార్థములయొక్క ఉనికినిగూర్చి ఏమియు
దెలియరాలేదు. దీనిఉనికి యథార్థము కాకుండిననే గాని, శుద్ధచైతన్యము
నిర్వికారరూపము కానేరదు. యథార్థమైననే కాని, ప్రపంచ వ్యవహారము
జరుగనేరదు. ఇది ఎట్లు సరిపడునోయని నిశ్చయింపలేక ఉన్నాను. ఇట్లుం
డుటచేతనే నాకు ఆత్మనిశ్చయమున్నను అహంకారనాశము కలుగలేదు.
కావున నో మహాత్మా ! ఈ దేహాదులయొక్క ఉనికినిగూర్చి నాకు ఉప
దేశింపుము. ఇది కలదా ? లేదా.

—* దృశ్యములు శూన్యరూపము లనుట. *—

అని శిఖిధ్వజుడు పలికిన కుంభవేషముతోనున్న ఆ చూడాల ఇట్ల
నియె. ఓ రాజోత్తమా! దృశ్యమనునది ఒకకొటి మొట్టమొదట ఉండినచో,
చైతన్యము దానికి అభిముఖము కావచ్చును. దృశ్యము శూన్యరూపమే.
ఇక చైతన్యమునకు తద్విషయమగు మార్పు కలుగుట ఎట్లు? కావున విచా
రించిన చైతన్యము దృశ్యాభిముఖము అగుటయే లేదు. దానివలన అహం
కారమును దానివలన సర్వానర్థములును పుట్టుటయే లేదు. అనిపలికిన శిఖి
ధ్వజుడు ఇట్లనియె. ఓదేవకుమారా ! మీరు అన్నట్లు దృశ్యపదార్థము లేని
దగునేని చైతన్యమునకును దృశ్యాభిముఖత్వము లేకపోవుననుట సత్యమే

అగును కాని, అదృశ్యము ఎట్లు లేకపోవును? కరచరణాది వంతమై బహు కార్యములను ఆచరించుచు అనుభవ గోచరమై ఈదేహము ఉన్నది. ఇట్లే సర్వపదార్థములును ఉన్నవి. ఇవి అన్నియు శూన్యరూపములు అగుట ఎట్లు? అనిపలికిన కుంభుడు ఇట్లనియె. ఓమహారాజా! వినుము. కారణము ఉండిననే గాని, కార్యము ఉండదు. ఇది లోక ప్రసిద్ధము. కారణము లేకున్నను కొన్నికొన్నిపదార్థములు ఉన్నట్లు గానవచ్చును. త్రాడు చీకటిలో ఉన్నదానిని చూడగనే సర్పముగ దోచును. అచ్చట సర్పజన్మమునకు దగిన కారణములు ఎవ్వియును లేవుకదా? ఈవిధముగ దోచు పదార్థములను మనము అసత్యములని చెప్పుదుము. అప్పటి సంకల్పములను భ్రాంతియందుము. ప్రకృతము ఈప్రపంచమునకు గారణము లేదనుటను నీవు ఎఱుగుదువు. కావున ఇదియు రజ్జు సర్పాదులవలెనే అసత్యమైనదియే కావలయును. భ్రాంతి జన్యమే కావలయును. ఇట్లగుటచేత ఇది బొత్తిగనే లేదు. ఉన్నట్లు మాత్రమే తోచుచున్నది. ఇంతమాత్రమువలన శుద్ధచైతన్యమునకు వికారము కలుగవలయునా? కావున శుద్ధచైతన్యము ఎప్పటికి దృశ్యోన్ముఖము కానే లేదు. అనిపలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె.

ఓదేవకుమారా! ఇట్లు చెప్పెదవు ఏల? ఈప్రపంచమునకు కారణమే లేదా? బ్రహ్మదేవుడు దీనిని సృష్టించుచున్నాడు కదా! ఆయన దీనికి కారణభూతుడు కానేరడా? అనిన కుంభుడు ఇట్లనియె. నీవు చెప్పినట్లు బ్రహ్మదేవుడు ఈప్రపంచమును సృష్టించిన సృష్టించును గాక. మొట్టమొదట ఆబ్రహ్మదేవుడియొక్క ఉత్పత్తికే కారణము లేదు. సృష్టికి పూర్వము ఏకస్వరూపమును, సర్వ సంక్షోభ శూన్యమును అగు పరబ్రహ్మము ఒకటిమాత్రమే కలదు. రెండవది లేనే లేదు. ఇట్లుండగ బ్రహ్మదేవుడు ఎచ్చట నుండి వచ్చెను? అనిపలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓసత్పురుషుడా! నాకు ఈవిషయమునందు ఇంకను నమ్మకము కుదుర లేదు. ఆబ్రహ్మదేవునకు పరబ్రహ్మము కారణము కాకూడదా? అనిపలికిన కుంభుడు ఇట్లనియె. ఓమహారాజా! ఆపరబ్రహ్మమునకు జ్ఞానమే స్వరూపము. కావున దానికి ఉత్పత్తి ప్రళయములు లేవు. ఏపదార్థమునకైనను ఉత్పత్తి ప్రళయములు కలవనిన వానికి సాక్షి ఉండవలయును. చేతనరూపమగు జ్ఞానమునకు మఱి ఒక చేతనము సాక్షిగా ఉండు ననుటకు వీలు లేదు. అప్పుడు అనవస్థా దోషము వచ్చును. ( ఈవిషయము ఇదివరకే సవిస్తరముగ వివరింపబడి ఉన్నది. ) మఱియును ఆబ్రహ్మము ప్రకాశించునది కాదు. అనగా, స్వాయముగనే

తెలిసికొనవలయును గాని, అన్యులచేత ఎఱుగబడునది కాదు. సంకల్పించుటకును, విచారించుటకును, వీలులేనిది. నాశరహితమైనది సర్వసంక్షోభ శూన్యమైనది. తనకంటె రెండవ పదార్థము ఏదియు లేనిది. పైనజూపిన యుక్తిని అనుసరించి చూచిన జ్ఞానమునకంటె భిన్నమగు రెండవ పదార్థము ఉండుటకే వీలులేదు కదా? మఱియును ఆబ్రహ్మము ఆనందరూపమైనది. ఇట్టి ఈబ్రహ్మము ఏసాధనమును గైకొని దేనికి కర్త కాగలదు. దానికంటె భిన్నమగు పదార్థము ఏదికలదు. ఇట్లే భోక్తయగుటకుగూడ వీలులేదు. అప్పుడును అనుభవింపబడు పదార్థము, అనుభవము, అనునవి రెండును ఉండవలయును కదా? కావున ఈప్రపంచమును ప్రత్యక్షముగా గాని, పరంపరగా గాని, బ్రహ్మము కల్పించె ననుటకు వీలు లేదు. కావున ఈప్రపంచమునకు ఎట్లుచూచినను కారణము ఉండదు. ఇట్లగుటచేత ఇది అసత్యమే. శూన్యరూపమే. అయినను ఒకటి విశేషము. వాస్తవస్థితిలో ఆబ్రహ్మదేవునికిగూడ బ్రహ్మము కారణము కాదు. అయినను భ్రాంతిచేత ఆబ్రహ్మమునందే బ్రహ్మదేవుడు కల్పింపబడెను. కావున త్రాటియందు కల్పింపబడిన పాము ఆత్రాటికంటె భిన్నము కానట్లు ఈబ్రహ్మదేవుడును పరబ్రహ్మమునకంటె భిన్నుడు కాదు. ఆయనయందు భ్రాంతిచేత కల్పింపబడిన ఈప్రపంచమున్ను, ఆయనకంటె భిన్నము కాదు. కావున ఇది అనేక భేదములతో తోచుచున్నను, పరమాత్మకంటె అన్యము కాదు. సర్వమును పరబ్రహ్మమే. సర్వమును జ్ఞానమాత్ర రూపమే. బ్రహ్మమునకంటె భిన్నముగ ప్రపంచము అనునది ఒకటి లేదు. కావున బ్రహ్మము దృశ్యాభిముఖము అగుట అనునదియు లేదు. అహంకారము పుట్టుటయు లేదు. అనర్థములును లేవు. సర్వమును భ్రాంతి కల్పితమే. ఇదియే యథార్థస్థితి ఓరాజా! నీవు ఈనిశ్చయమును మనస్సునందు స్థిరము చేసికొని "నేను కర్తను గాను, భోక్తను గాను" అను నిర్ణయమును కలిగి అనాది సిద్ధమై ఉన్న అజ్ఞానమును క్షీణింప జేయుము. ఇట్లు చేసితివేని ఆ అజ్ఞానము మొట్టమొదట క్షీణించుచు వచ్చి తుదకు సంపూర్ణముగనే నశించునని పెద్దలు చెప్పుదురు. శిథిలత్వము నొందకుండిన ఏపదార్థము గాని, తన స్థానమునుండి భ్రంశము నొందనేరదు కదా? మఱియును ఏపదార్థములు మొట్టమొదట కృశత్వమును జెందునో, అవి క్రమక్రమముగ, తన స్థానమును విడుచుటయు, నశించుటయు, గూడ ప్రత్యక్షముగనే కానవచ్చుచున్నది. కావున పైన జెప్పిన యుక్తిచేత అజ్ఞానము క్షీణించునేని అవశ్యముగ నశించును.

ఓరాజోత్తమా! సారాంశమును వినుము. స్వప్రకాశ రూపుడగు అప్పర
మేశ్వరుడు చిత్త ప్రభావమువలన స్వయముగనే సర్వ రూపములతో
ప్రకాశించు చున్నాడు. స్వయముగనే బ్రహ్మశబ్దముచేత జెప్పబడుచు
ఉన్నాడు. కావున బాగుగ విచారించిన ఈప్రపంచమును ప్రపంచకారణ
మని చెప్పబడు బ్రహ్మదేవుడును పరమేశ్వరుడే. దృశ్యమనునది ఒకటి
బ్రహ్మభిన్నమై క్రొత్తగ లేదు.

—* శిఖిధ్వజుడు సమాధిస్థితిని జెందుట. *—

ఇట్లు దేవకుమార వేషముతోనున్న చూడాల చెప్పిన విని శిఖిధ్వ
జుడు ఇట్లనియె. ఓమహాత్మా! ఇప్పటికి నాకు సర్వమును తెలిసినది. మీరు
చేసిన ఉపదేశము మిక్కిలి యుక్తియుక్తముగ నున్నది. ఈప్రపంచమునకు
ఎట్లుచూచినను కర్తయే లేదు. కర్తలేకున్న కార్యము ఎట్లుండును? కావున
ఈప్రపంచము ఎప్పటికిని లేదు. ఇది వట్టి భ్రాంతిచేతనే ఉన్నట్లు కానవ
చ్చుచున్నది. ఇట్లు చూచిన ప్రపంచము శూన్యరూపమగుటచేత చైతన్య
ము దృశ్యాభిముఖము అగుటయనునదియు లేదు. అది లేకున్న అహంకార
ము లేదు, దానివలన కలుగుచున్నవి, అని చెప్పబడిన అనర్థములును లేవు.
ఓభగవంతుడా! దేవకుమారా! ఈవిషయమును నాకు స్పష్టముగా తెలియ
జేసితివి. ఈకారణముగలన నేను జ్ఞానవంతుడను అయితిని. మేలుకొంటిని.
పరబ్రహ్మ రూపుడనే అయితిని. "ఇవి దృశ్య పదార్థములు" అను మొద
లగు జ్ఞానము కేవలము అసత్యమైనదియే. కావున ఈసర్వమునువదలి ఆకా
శమువలె నిర్మలుడనై ఉందును. ఆహా, దేశకాలాది భేదములతోనున్న
ఈప్రపంచ దృష్టి అంతయును పూర్వము మహాదుఃఖకరమై ఉండెను. నేడు
విజ్ఞానమువలన సర్వమును బ్రహ్మము కాగానే అదియు అమృతమయమే
ఆయెను. ఓరఘుకులవర్ధనా! శ్రీరామా! ఇట్లు దేవకుమార రూపముతో
నున్న ఆచూడాల సర్వార్థమును ఉపదేశింపగానే ఆశిఖిధ్వజుడు బహుకా
లము తపస్సుచేసినవాడు కావున విజ్ఞానవంతుడాయెను. అజ్ఞానమను సం
పుటమునుండి వెలివడి ప్రకాశింపసాగెను. అంత ఆకుంభుడు చెప్పిన వాక్య
ములను చిత్తమునందు భావింపుచు ఆరాజు క్షణకాలము ఆపరబ్రహ్మము
నందే ఏకీభవించి నిలచెను. మనస్సుచేయు సంకల్పములను అణచి ఇంద్రియ
వ్యాపారములను నాశము గావించి ఎత్తునుండి పడినవానివలె కాలుచేతు
లను కదలింపక ఏకాగ్రస్థితితో ఉండెను. ఇట్లు రెండు గడియల కాలము
ఉండె ఆతడు మేలుకొనెను. అంతకుమున్ను మూయబడియున్న కన్నులు

మనో నేత్రముతో కూడ తెరువ బడినెను. అప్పుడు ఆత నిజూచి చూడాల ఇట్లనియె. ఓ రాజర్షి శ్రేష్ఠా ! ఇప్పుడు అతి విస్తారమైనట్టియు, నిర్మలమై నట్టియు, బాధలు లేనట్టియు, మృదువైనట్టియు, సంకల్పా భావములకు శయ్యవంటిదై నట్టియు, ఆ లోకోత్తమ స్థానమునందు సుఖముగ విశ్రాంతి నొందితివా ? నీకు లోపల చక్కని జ్ఞానము కుదిరెనా ? భ్రాంతిని సంపూర్ణముగ వదిలివేసితివా ? తెలిసికొనవలసిన విషయము తెలిసినదా ? చూడ దగిన దానిని చూచితివా ? అనిన సంతుష్టుడై శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ మహాత్మా ! దేవకుమారా ! నీ అనుగ్రహమువలన కృతార్థుడనైతిని. సర్వ పదవులకంటెను ఉన్నతమై మహదైశ్వర్య సంపూర్ణమై ఉన్న స్థానమును నేను గాంచితిని. ఆహా, మహాత్ములయొక్క సమాగమము ఎంత గొప్పది. బ్రహ్మవేత్తలతో సహవాసము చేయుట ఎంత ఉత్తమమైనది. ఎంత అమృత తుల్యమైనది. అది ఇచ్ఛాఫలము సర్వోత్తమమై ఉండును. ఆ ఫలమును పొందినవానికి ఇక కోరవలసినది ఏదియును ఉండదు. ఎన్ని జన్మములెత్తినను ఎప్పటికైనను సంపాదించుటకు వీలు లేని మహామృతము ఒకక్షణమున నీసహవాసముచేత లభించినది. ఓ కమలనేత్రా ! మఱియొక సంశయము కలదు. అనాదియును అనంతమును, పరమానంద రూపమును, నగు ఆత్మతత్త్వము నేడు నీవు ఉపదేశించితివి. అంతమాత్రముచేతనే నాకు తెలిసెను కదా ? ఇది మొట్టమొదటనే ఏల తెలియలేదు ? శాస్త్రార్థమును ఎంత విచారించినను చూడాల ఎన్నిమారులు బోధించినను నాకు ఏల తెలియలేదు.

## —* జ్ఞానప్రతిబంధ నిరూపణము. *—

అని శిఖిధ్వజుడు పలికిన కుంభుడు ఇట్లనియె. ఓమహారాజా ! సామాన్యముగ గురువు ఎంత ఉపదేశించినను సమయము తగినట్లు తటస్థింపకున్న ఆజ్ఞానము దొరుకదు. చిత్తము నిర్మలము కావలయును. సంకల్పములు శాంతి నొందవలయును. ఇంద్రియములును పరిపక్వస్థితిని జెంది తనకు లోబడవలయును. ఇట్లయిన గాని, మనస్సునకు విక్షోభము లేకుండ నుండదు కదా? ఇట్టిస్థితిని సంపాదించిన పిమ్మట పరిశుద్ధమగు అద్దమునందువలె ఆ పురుషుని చిత్తమునందు గురూపదిష్టార్థము స్పష్టముగ ప్రతిబింబించును. ఓ సత్పురుషుడా ! మహారాజా ! ఇట్టిస్థితి కలుగుటకు కొంతకాలము కావలయును. సాధకుడు ఎడతెగక ప్రయత్నించుచునేని కొంతకాలమునకు పండిన పండు చెట్టునుండి రాలునట్లు పరిపక్వ చిత్తమునుండి మాలిన్యములు అన్నియు

తొలగిపోవును. ఇట్లు సర్వమాలిన్యములును తొలగకుండుటచేత నీకు మొట్ట మొదట ఎంత ఉపదేశించినను ఈ జ్ఞానము పట్టుబడలేదు. ఇప్పుడు తపో వశమున అట్టిమాలిన్యము లన్నియు తొలగి పోయెను. కావున చెప్పిన తత్క్ష ణమునసే అది పట్టుబడెను. ఓ రాజా " ఇది వేరు, నేనువేరు, అది నాది, కావున నాకును దానికిని భేదము లేదు " అను ఇట్టితలంపులే చిత్తమన బడును. అవియే అజ్ఞాన మనబడును. అవి రెండును నశించుటయే జ్ఞానము. అదియే పరమగతి. ఓ రాజా ! నీకు ఇప్పుడు ఆ అజ్ఞానము లేదు. నీవు అజ్ఞాన నిద్రనుండి మేలుకుంటివి. జీవన్ముక్తిని జెందితివి. సర్వాధారమగు చిత్తమును పరిత్యజించితివి. ఇక నీకు ఎందును కొఱత లేదు. మహాభ్యుద యమును జెందితివి. మునివైతివి. నీవు ఏకార్యమును చేసినను మౌనివే. ఇక పరిశుద్ధుడవై స్వస్వరూపమునందు నిలువుము.

—* జీవన్ముక్త వ్యవహారమును నిరూపించుట. *—

అని కుంభుడు పలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ మహాత్మా ! జ్ఞాన వంతులకు చిత్తము లేదు కదా ? వారు ప్రపంచమునందు ఎట్లు విహరిం తురు. దానిని వివరింపుము. అనిన కుంభరూపిణియగు చూడాల ఇట్లనిచెు. ఓ రాజా ! వినుము. వాసనలను నది రెండు విధములు. శుద్ధవాసనయు, మలినవాసనయు. అందు అజ్ఞానులకు గల వాసన మలినవాసన. అది పున ర్జన్మమును కలిగించును. దానికే చిత్తమనిపేరు, జ్ఞానవంతులకు లేనిది అదియే. ఇక రెండవదియగు శుద్ధవాసన వారికి కలదు. అది సత్వగుణ ప్రధానమైనది. అదియును వాసనయే కావున తాను ఆశ్రయించియున్న పురుషుని కర్మలయందు ప్రవర్తింప జేయగలదు. అయినను ఆకాశమువలె దృశ్యపదార్థములతో అది సంబంధ పడదు. తాను ఆశ్రయించిన పురుషుని కూడ సంబంధ పడునట్లు చేయదు. కావుననే అది పునర్జన్మమును ఇవ్వదు. జ్ఞానులు దానిని ఆశ్రయించియే సర్వవ్యవహారములను ఆచరింతురని తెలిసి కొనుము. " శుద్ధవాసనకూడా వాసనయే కావున అదియు చిత్తమే కావల యును కదా " అనిసెుదవేమో వినుము. అదియు చిత్తమే అగుటలో సంశయము లేదు కాని ( అది ) నిర్మలమగుటచేత మలిన వాసనారూప చిత్తమువలె పురుషుని చేరుపనేరదు. సామాన్యముగ దృశ్యపదార్థములను చూచినను పూర్వమువలె దృశ్యదృష్టితో కాక బ్రహ్మదృష్టితో చూచును. ఇప్పుడు ఏ వ్యవహారము ఎట్లు జరిగినను లోపము ఏమి ? భ్రాంతి కలుగదు కదా ? ఈ కారణమువలననే మౌర్ఖ్యముగల చిత్తమును చిత్తమనియు

లేనిచిత్తమును సత్యమనియు జ్ఞానులు చెప్పుచున్నారు. కావున ఓ రాజా ! నీవును ఆ సత్యమును ఆశ్రయించియే వ్యవహరింపుము. స్వర్గ మోక్షాది సర్వ ఫలములను ఇచ్చునట్టి విధులతో నీకు పనిలేదు. మోక్షము అనునది యు నీకంటె అన్యమగు ఒక స్థానము కాదు కదా ? కావున విధులనెల్ల వర్జించి సర్వసంగ పరిత్యాగివై స్వస్వరూపముతో నుండుము. ఇప్పుడు నీకు యథార్థరూపమే దొరికినది. ఓ రాజా ! ఆరూపమునే ఆశ్రయించి ఏపదార్థములను మనస్సునందు గైకొనక నిశ్చలుడవై నిలచి యుండుము. నిశ్చల చిత్తుని సంసారము ఏమియు జేయనేరదు. ఓ రాజా! లోకమునందు ఏ ఏ దుఃఖములు గానవచ్చుచున్నవో, అవి అన్నియు చిత్త చాంచల్యము వలన గలిగినవియే. నిశ్చల చిత్తునకు ఏదియు కలుగదు. ఇది సమాధిస్థితుని విధము. ఇట్లు గాక " నేను తత్వజ్ఞుడను, నాకు ఎట్లున్న నేమి ? సర్వము బ్రహ్మమే కదా ? " అని తలంతువేని అప్పుడు చిత్త చాంచల్యమును గాని, దాని నిశ్చలత్వమును గాని, సమానముగనే చూచుచు సర్వవ్యవహార ములను ఆచరించుచుగాని, ఆచరింపక గాని, స్వేచ్ఛగ నుండుము. ఎప్పటి కిని అనగా, వ్యవహారమును ఆచరించినను, ఆచరింపకున్నను, నీ స్వరూ పము బ్రహ్మమే అగును కదా ? నీకు ఎట్లుచేసినను హానిఏమి? అనిపలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ సర్వజ్ఞా ! మనశ్చాంచల్యమును దాని నిశ్చలత్వ మును సమానమగుట ఎట్లు ? వాని రెంటికిని పరస్పరము విరోధము కదా? ఈ సంశయమును నివారింపుము. దీనితో సర్వ సంశయములును తీరును. అనిన కుంభవేషముతోనున్న చూడాల ఇట్లనియె. ఇందు క్రొత్త ఏమియు లేదు. ఓ రాజా ! ప్రపంచమంతయును చిద్రూపమే, సముద్రమంతయును జలమే, అయినట్లు ప్రపంచమంతయును బ్రహ్మమే. ఆజలము అలలచేత కదలునట్లు ఈ బ్రహ్మమును బుద్ధివృత్తులచేత కదులుచున్నది. బ్రహ్మమనియు, జ్ఞానరూపమనియు, శుద్ధమనియు, సత్యమనియు, జ్ఞానులగువారు ఏపదార్థ మును వర్ణించుచున్నారో, మూఢులగువారు దానినే దుఃఖాత్మకమనియు, పరిచ్ఛిన్నమనియు, జడమనియు, అపరిశుద్ధమనియు, అసత్యమనియు, దలం చుచున్నారు. ప్రపంచమునుగా జూచుచున్నారు. ఈ ప్రపంచము చైతన్య చలనరూపమైనదియే. కావున రజ్జువునందు భ్రాంతిచేత గలిగిన సర్పము వలె బాగుగ చూచిన అణగిపోవును. బాగుగచూడలేకున్న సత్యమై తోచు ను. ఓ బుద్ధిమంతుడా ! మహారాజా ! ఈ కారణమువలన శాస్త్రాభ్యాస పాటవము వలనను, సజ్జన సాంగత్యము వలనను, కాలక్రమమున మనస్సు

నిర్మలమై చంద్రునివలె ఉదయించెనేని పైన వర్ణించిన యథార్థస్థితి. అనగా ఈ ప్రపంచము అంతయు పరబ్రహ్మమే, అనుట సర్వమును స్వానుభవ రూపమే అనునిశ్చయము, తనంత దానే ఉదయించును. ఇట్లయిన అమ్మహాత్ములు ఎట్లున్నమాత్రము ఏమి లోపము? సమాధియందు చేతులు గాలు కదల్పక నిలచి యుండవలయు ననియే నియమము కలదా ? యథేచ్ఛా సంచారము వలన ఈ బాహ్య పదార్థములు అన్నియు తన్ను బంధించునేమో, అని శంక కలవాడేకదా వానికి భయపడి సమాధియందు నిలచి ఉండవలయును. అట్టి సంశయములేక బాహ్యాంతర పదార్థములు అన్నిటిని ఏకరూపముగ జూడగలవానికి అట్టిస్థితి అవసరము లేదుకదా ? ఓ శిఖిధ్వజ మహారాజా ? నీకు చెప్పవలసిన దానినెల్ల జెప్పి ముగించితిని. ఈ ప్రపంచమంతయును ఎట్లు ఉదయించునో, ఎట్లు లయమునొందునో, ఆ విషయమునెల్ల ప్రకటించితిని. చలనమును నిశ్చలత్వమును అను నీరెండును ఏకము ఎట్లగునో, దానిని వర్ణించితిని. సముద్రము జలరూపమే అయినట్లు ప్రపంచము బ్రహ్మరూపము అగుటచేత, దీనియందు గానవచ్చు చాంచల్యములు అన్నియు నిశ్చల బ్రహ్మమే అనియు, నిశ్చలమగు జలమే తనకు అభిన్నములగు అలలచేత చంచలించునట్లు ఆ బ్రహ్మమును భ్రాంతి వశమున ప్రపంచరూపముతో జలించుచున్నది అనియు, ఇట్లగుటచేత చలన నిశ్చలత్వములు భ్రాంతిజ్ఞాన యథార్థజ్ఞానమువలన కలిగినవియే కాని, వాస్తవస్థితిలో బ్రహ్మస్వరూపము ఎఱిగినవానికి అవి లేవనియు వివరించితిని. జీవన్ముక్తులకు అట్టి బ్రహ్మరూపనిశ్చయము ఉండుటచేత వానిని ఏదియును ఏమియు చేయజాలదనియు, వాడు స్వేచ్ఛగా వ్యవహరింప వచ్చుననియు, వివరించితిని. సర్వము ముగిసినది.

ఓ రాజర్షిశ్రేష్ఠా ! ఈవిషయమును బాగుగ గ్రహించి జ్ఞప్తియందు ఉంచుకొని విచారణచేత నిశ్చయించి దృఢముచేసికొని అనుభవమునకు తెచ్చుకొని పిమ్మట నీ ఇష్టము వచ్చినట్లు ఉండుము. సంసార సంసర్గభయము లేకున్నను, నిత్యసుఖమునే అనుభవించుచు ఉండవలయుననిన అట్లే సమాధియందు ఉండుము. ప్రపంచమంతయును నిత్యసుఖరూపమే కావున సర్వమును సమాధియే అని తలంతువేని యథాపూర్వముగా సర్వ వ్యవహారములను ఆచరించుచు ఉండుము. సత్యమగు పరమపదము స్పష్టముగ తెలిసిన పిమ్మట ఎట్లున్నను ఒకటియే. ఒకటి సమాధి అనియు, మఱియొకటి (వ్యవహారము ) సమాధి కాదనియు, విభాగమున్నదా? సర్వమును

బ్రహ్మమే అగుటచేత ఏపదార్థమును జూచినను వినినను మూర్కొనినను అపరబ్రహ్మమును చూచినట్లే వినినట్లే మూర్కొన్నట్లే. కావున సర్వపదార్థదర్శనమును సమాధియేయై తీరును. ( ఇచ్చట బ్రహ్మము ఇంద్రియ గోచరము కాకున్నను, పదార్థ సామ్యముచేత ఔపచారికముగా అట్లు చెప్పబడెనని తెలిసికొన వలయును) మఱియు ఇంద్రియములుకూడ జడములగుటచేత స్వయముగ ఏపదార్థములును ప్రకాశింప జేయనేరవు కావునను, శుద్ధ చైతన్య ప్రకాశమే ఇంద్రియముల మూలమున వెలికి వచ్చి అట్లుచేయుచున్నది కావునను, బాహ్యపదార్థములుకూడ చైతన్యమయములే అగుటచేత దాని స్వస్వరూపము స్వస్వరూపముచేతనే ప్రకాశించునది అగును. ( కావున ఎట్లు చెప్పినను సిద్ధాంత విరోధము రాదు ) కావున నోరాజా! నీఇచ్ఛ వచ్చినట్లు ఉండవచ్చును.

—* చూడాల స్వపురమునకు బోవుట. *—

ఓ మహారాజా ! ఇకను నేను ఇక్కడ ఉండుటకు వీలు లేదు. ఇది పర్వకాలము. ఇప్పటికి నాతండ్రియగు నారదమహాముని బ్రహ్మలోకము నుండి తన నివాసమునకు వచ్చి యుండును. వచ్చుచునైనను ఉండును. ప్రతి పర్వకాలమునందును ఆయన దేవసభకు వచ్చుట వాడుక అచ్చట నేను గానరాకుందునేని ఆయనకు కోపము వచ్చును. కావున నేను స్వర్గమునకు పోవలయును. పెద్దవారిని కష్టపెట్టుట యుక్తమైన పని కాదు కదా? కావున నోరాజా ! నీవుమాత్రము బహు జాగరూకుడవై చిత్త పరిత్యాగమును దృఢము గావించి దేనియందును రాగద్వేషములను జెందక సర్వ కాలములయందును సమచిత్తముతో నుండుము. ఓరామచంద్రా! ఇట్లు చెప్పి ఆకుంభుడు క్షణకాలములో అంతర్థానము ఆయెను. ఇట్లు అతడు పోగానే రాజు మిక్కిలి ఆశ్చర్యభరితుడు ఆయెను. తనలో ఇట్లని విచారించెను. ఆహా, సిద్ధులు ఎట్టివారు. ఎంత లోకోపకారులు. నిష్కారణముగనే ఈతడు నాకడకు వచ్చి ప్రబోధించి దివ్యమగు మోక్షమును ఇచ్చిపోయెను కదా ? ఆహా, ఈస్థానము ఎంత సుఖకరముగ ఉన్నది. ఇదివరకు మనస్సునందు ఉన్న తాపములన్నియు అమృతసేకముచేతవలె ఒకక్షణములో అణగి పోయినవి. ఆహా, కృతార్థుడనైతిని. ఓరామచంద్రా! ఇట్లు తనకు గలిగిన మహాహ్లాదయమునకు సంతోషించుచు సర్వ సంకల్ప శూన్యముగ మనస్సును బ్రహ్మమునందు ఐక్యము చేసి " కొండపై నుండి పడినవానివలె " కూర్చున్నవాడు కూర్చున్నట్లే సమాధియందు నిలచెను. పిమ్మట సంకల్ప శూన్య

మైనట్టిదియు, ఆశ్రయ రహితమైనట్టిదియు (అనగా, ఏపదార్థమును ఆశ్రయింపనిదియు, ప్రస్తుతము వర్ణింపబడుచున్న సమాధికి వాస్తవస్థితిలో ఆశ్రయము ఏదియు లేదు. మనస్సనునది ఒకటి ఉండినకదా, అది బ్రహ్మమును కాని, ప్రపంచమును కాని, ఆశ్రయించుట. ప్రస్తుతము శిఖిధ్వజునకు మనస్సే లేదు. బ్రహ్మమన్ననో, అది అన్యపదార్థమును ఆశ్రయించునది కాదు. మొట్ట మొదట బ్రహ్మమునకంటె భిన్నమగు పదార్థమే లేదు కదా? సమాధియన్ననో, బ్రహ్మస్వరూపముతో నిలచుటయే కాని, మనస్సును అచ్చట ధ్యాన బలమువలన ఐక్యము చేయుట కాదు. బ్రహ్మము అభేదరూపమై ఉండనందున ధ్యానించువాడు, ధ్యానము, ధ్యానింపబడునది, అను భేదము ఎక్కడనుండి వచ్చును? సవికల్ప సమాధియందు ఇట్టి భేదము ఉన్నను, అది సాధకునకై విధింపబడినదియే కాని, సిద్ధునకై కాదు. కావున ఎట్లు చూచినను సమాధికి ఆశ్రయమే లేదు) నగు ఆసమాధియందు నిశ్చలమగు స్థితిని జెంది అతడు పర్వతశిఖరమువలె అట్లే బహుకాలము నిలచి ఉండెను. కట్టెవలెను, గోడవలెను, నిశ్చేష్టుడై నిస్సంకల్పుడై ఆశిఖిధ్వజుడు సమాధియందుండగ చూడాల అక్కడనుండి వెడలిపోయి ఏమిచేసెనో దానిని చెప్పెదము. వినుము. ఓశ్రీరామా! పైన వర్ణించిన విధముగ ఆచూడాల కుంభవేషముతో శిఖిధ్వజునకు ఉపదేశము చేసి అనుజ్ఞతీసికొని అంతర్ధానము నొంది యోగసామర్థ్యముచేత ఆకాశమునందు నిలచెను. అచ్చట మనోహరమైనట్టియు, మిక్కిలి సుందరమైనట్టియు, తన స్త్రీరూపమును ధరించెను. అట్లు ధరించి తన రాజధానికిపోయి అంతఃపురమున ప్రవేశించెను. అందరకును తనస్వరూపము గోచరమగునట్లు చేసెను. రాజ్యమును పరిపాలించెను. ఇట్లు మూడుసంవత్సరములు గడచెను. పిమ్మట ఒకనాడు ఆచూడాల పూర్వమువలెనే ఆకాశమునకు ఎగిసి యోగబలముచేత కుంభరూపమును ధరియించి శిఖిధ్వజుడు ఉన్న వనమునకు బోయెను. ఆతడు అప్పటికిని నిర్వికల్ప సమాధియందే నిలచి ఉండుటను చూచి "ఇకను ఈప్రభువును సమాధినుండి మేలుకొలిపెదను" అని నిశ్చయించి అరణ్యవాసులకందరకును భయము గలుగునట్లు గొప్ప సింహనాదమును పలుమారు గావించెను. ఇట్లు ఎన్నిమారులు గావించినను పర్వతమువలె అతడు చలింపనైనను లేదు. అప్పుడు ఆచూడాల అతనిని కదలించెను. అప్పటికిని మేలుకొనకున్న క్రిందికి పడద్రోసెను కాని, అప్పటికిని ఆశిఖిధ్వజునికి మెలకువ కలుగనే లేదు. ఆచూడాల దానికి ఆశ్చర్యపడి ఇట్లని విచారించెను.

ఆహా, ఈమహాత్ముడు స్వస్వరూపమునందు దృఢమగు నిలుకడ నొందినాడు. ఇతనికి పునరుత్థానము కలుగునో, లేదో. ఈతని హృదయమునందు సత్వగుణరూపమగు బుద్ధి ఇంచుకయైన శేషించి ఉన్నదో, లేదో. అదియే కదా మేలుకువకు ఆధారము. నేను యోగశక్తిచేత ఈమహాత్ముని దేహమును పరిశీలించి ఈవిషయమును నిర్ణయించుకొనియెదను. ఆబుద్ధి కొంచెమైనను మిగిలి ఉండునేని మరల మెలుకువ రాగలదు. కావున ఈయనకు భార్యగానుండుటకై నేనును ప్రాణములను ధరించెదను. ఆబుద్ధి లేదేని ఈయనకు ఇదియే విదేహకైవల్యము. కావున నేనును ఈస్త్రీదేహమును విడిచి ముక్తినొందెదను. నాకుమాత్రము బ్రతికి చేయవలసిన కార్యము ఏమికలదు.

ఓరఘుకులసార్వభౌమా! శ్రీరామా! అని ఈవిధముగ నిశ్చయించి ఆచూడాల జాగ్రతతో చేతితో తాకియు, బాగాచూచియు, శిఖిధ్వజుని దేహమును పరీక్షించెను. తనలో ఇట్లని తలచెను. ఈమహాత్మునకు బుద్ధి శేషించియే యున్నది. మెలకువకు తగినకారణము కలుగునేని అప్పుడు అది యథాపూర్వముగ విజృంభింప గలదు. అని చూడాల తలచెను. అని వశిష్ఠ మహర్షి చెప్పిన రామచంద్రుడువిని ఇట్లనియె. ఓబ్రాహ్మణోత్తమా! శాంత చిత్తుడై కాష్ఠము, శిల, మొదలగువానితో సమానుడై ఉన్న యోగికిసత్వశేషము కలదా, లేదా, అను విషయము ఎట్లు తెలియబడును. అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె.

శ్లో॥ ప్రబోధ కారణం జ్ఞస్య దుర్లక్ష్యోణు వపుర్హృది।
విద్యతే సత్వశేషోంత ర్బీజే పుష్ప ఫలం యథా ॥
చిత్త స్పంద విముక్తస్య తస్యాచల సమస్థితేః ।
కాయ స్సమ శమా భోగో నగ్లాయతి నహృష్యతి ॥
నాస్తమేతినచోదేతి సమమేవావతిష్ఠతే ॥

ఓరామచంద్రా! చెప్పెదను వినుము. ఏయోగియొక్క శరీరమునందు అతిసూక్ష్మమగుటచేత గానరాకున్నను, బీజమునందున్న పుష్పమువలె సత్తామాత్రమై బుద్ధిశేషము ఉండునో, అట్టివాడు చిత్తచాంచల్యరహితుడై పర్వతమువలె ధ్యానబలముచేత నిశ్చేష్టుడై ఉన్నను, వానిదేహము మాత్రము శాంతమై శీతవాతాతపములకు శోషింపదు. పూర్వము ఉన్న స్థితికంటె అభివృద్ధి నొందదు. క్షీణింపదు. సమాధియొక్క ఆరంభకాలమునందు ఉన్నరీతిగనే ఉండును. ఆబుద్ధిశేషము లేకున్న అప్పుడు ఛేదించివేసిన

కాష్ఠమువలె శీతవాతాదులకు శోషించి నశించి పోవును. ఈగుఱుతువలన "ఈ యోగికి బుద్ధిశేషము ఉన్నదా, లేదా" అను విషయమును ఎఱుగవచ్చును. ఓ శ్రీరామా! నీవు అడిగినదానికి ఉత్తరము ఇచ్చితిని. ఇక నేను చెప్పదలచిన అవతల జరిగిన వృత్తాంతమును చెప్పెదను వినుము. పైన వివరించిన విధముగ ఆచూడాల ఆప్రభువునకు సత్వశేషము కలదు. అను విషయమును నిశ్చయించి తన కుంభ దేహమును వదలి ఆద్యంతశూన్యమగు పరబ్రహ్మతత్వమును జేరి ఆశిఖిధ్వజునియొక్క మనస్సును కదలించెను. వెంటనే ఆకాశమునందు ఉన్న పక్షి తనగూటిలోనికి జేరునట్లు చిదాకాశమును విడిచి మఱల తన దేహమునందు ప్రవేశించెను. ఆప్రభువుయొక్క పార్శ్వమున నున్న ఆకుపై గూర్చుండి సామగానమును చేయ నారంభించెను. ఆసామగానధ్వని కర్ణములగుండ ప్రవేశింపగానే అంతకుముందే చలించి యున్న ఆతని చిత్తము మేలుకొనెను. తక్షణమే కన్నులు తెరువబడెను. ఇట్లు ఆశిఖిధ్వజుడు మేలుకొని తన ఎదుట ఉన్న కుంభుని జూచెను. "ఆహా, నేను ధన్యుడనైతిని. నన్ను కృతార్థుని గావించిన మహానుభావుడు మరల వచ్చినాడు" అని చెప్పుచు ఆకుంభునికి పువ్వులతో పూజచేసెను. "ఓ మహాత్మా! మరల ఈవనమునకు విచ్చేసితిరి. నా అదృష్టమువలన మఱల గానబడితిరి. నన్ను కృతార్థుని పవిత్రుని గావించితిరి" అని అతనిని ప్రశంసించెను. అంత ఆకుంభుడు ఇట్లనియె. ఓ రాజా! నీవద్దనుండి వెడలిపోయినది మొదలు నా మనస్సు నీయందే ఉన్నది. నాకు స్వర్గభోగములయందుగూడా అంత ఇచ్ఛ పుట్టలేదు. అంత తృప్తి కలుగలేదు. ఈప్రపంచమునందు నాకు నీవంటి బంధువుగాని, మిత్రుడుగాని, శిష్యుడుగాని, మఱియొకఁడు లేడని తోచుచున్నది. నీవంటి విశ్వాసపాత్రుడును మఱియొకఁడు లేడు. కావున నేను సర్వకాలములయందును నీవద్దనే ఉందును. అనిన సంతోషించి శిఖిధ్వజుడు ఇట్లనియె.

ఓ మహాత్మా! బహుజన్మములనుండియు ఆచరింపబడిన నాపుణ్యములు నేడు ఒకఁమారే ఫలించినవి. దేనియందును అభిమానము లేకున్నను మీరు నాతో సహవాసము చేయవలయునని కోరుచున్నారు. ఓ సత్పురుషుడా! సుందరాకారా! ఇంతకంటె అధికమగు భాగ్యము నాకు ఏదికలదు. ఓ మహాత్మా! మీరు అనుగ్రహించిన యోగముచేత స్వర్గనివాసులకుగూడ లభింపని పరమానందమును అనుభవించు చున్నాను. ఆస్థితి మిక్కిలి నిర్మలమైనది. దానికై క్రొత్తగా ప్రయత్నింప వలయునని ఇదివరకు దలంచు

చుంటిని గాని ఇప్పుడు ఆ సందేహము తీరినది. "నేను సుఖిని" అను మొదలగు తలంపులతో గూడియున్న పూర్వస్థితియే అస్వాభావికస్థితియే గాని, ఇప్పటి పరమానందస్థితి అట్టిది కాదు. ఇది స్వస్వరూప స్థితియే. మీ అనుగ్రహమువలన ఈ విషయము ఇప్పటికి తెలిసికొంటిని. కృతార్థుడనైతిని. ఇక స్వర్గమునందు కాని, భూలోకమునందు కాని, మఱి ఎందు కాని, యథేచ్ఛముగా విహరింపగలము. అనిన కుంభుడు ఇట్లనియె. ఏమి, ఓ మహారాజా! నా ఉపదేశము బాగుగా ఫలించెనా? పరమానందరూపమగు పరమపదమునందు సంపూర్ణముగ విశ్రమించితివా? భేదరూపమగు దుఃఖమును సంపూర్ణముగ పరిత్యజించితివా? తత్త్వజ్ఞానము కలిగియుండుటచేత నీకు సంకల్పములయందలి ఇచ్ఛ సంపూర్ణముగ తొలగిపోయినదా? ఈ సంకల్పములు ఊరక లేనిపదార్థములను జూపి తత్కాలమునకు మాత్రము కొంత ఇంపును కలిగించును. అదియే కాని, పరమానందమును కలిగింప నేరవు కదా? నీమనస్సు పూర్వమువలె హర్ష శోక భయాదులను జెందక రాగద్వేషములు లేక విడువదగినవియు, అంగీకరింప దగినవియు, అనిభేదమును ఎన్నక వచ్చినదాని దేనినైనను స్వీకరింపుచు కాలానుగుణముగ అభిమానరహితముగ కార్యములను ఆచరింపుచున్నదా? అనిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ మహాత్మా మీ అనుగ్రహమువలన నాకు ఆ యుత్తమ స్థితి చేకూరినది. మీరు చెప్పిన విధమెల్ల గలిగినది. సర్వ దృశ్యములకును అతీతమై ఉన్న స్థలమును జూచితిని. సంసార సముద్రమునకు ఆవలిదరిని జేరితిని. పొందవలసిన నిశ్చయమును పొందితిని. ఇక మాకు ఉపదేశింప వలసినది ఇంచుకయైనను లేదు. మాకు పరిపూర్ణ తృప్తి గలిగినది. సర్వసంతాపములును దీరినవి.

శ్లో॥ నిస్సంస్మృతి ర్విగతమోహ భయో విరాగో
నిత్యోదిత శ్శమసమాశయ సర్వ సౌమ్యః ।
సర్వాత్మక స్సకల సంకలనా విముక్త
ఆకాశ కోశవిశద స్సమ మాగతోఽస్మి ॥

ఓ మహాత్మా! ఇప్పుడు నాకు సంసారము కాని, రాగద్వేషములు కాని, లేవు. శాంతిచేత నాచిత్తము సర్వసమమైనది. సర్వ సంకల్పములను పరిత్యజించినది. నాకు నిత్యాభివృద్ధి దొరికినది. ఆకాశమువలె అతి నిర్మలుడనైతిని. సర్వమయుడనైతిని. అని పలికెను. ఓ రామచంద్రా! ఈ విధముగ బ్రహ్మానుభవ సూచకములై అతివిచిత్రములై ఉన్న కథల

చేత ప్రోద్బుద్ధులగుచు నాసుంభశిఖిధ్వజులు అన్యోన్యమిత్రులై ఆ వనమునందు యథేచ్ఛగా విహరించుచు ఉండిరి. బహువిధములగు అరణ్యములయందును, చిట్టడవులయందును పర్వత శిఖరములయందును, విశాలములగు తటాక ప్రాంతములయందును, పొదలయందును, విహరించుచు ఉండిరి. వారు ఎప్పుడును ఒకరినొకరు విడుచువారు కారు. ఉత్సాహము, బలము, సంతోషము, సంకల్పములు మొదలగునవి వారలకు ఏకరూపములయ్యే ఉండెను. వారి స్నేహము మిక్కుటమై ఉండెను. ఓ రామచంద్రా! వారిరువురును ఒక్కమాత్రే దేవతలను, పితృదేవతలను, పూజించుచు ఉండిరి. ఒక్కమాత్రే భుజించుచు ఉండిరి. వారిమనస్సునకు దీనిని అంగీకరింప వలయును, దీనిని విడువ వలయును. అను మొదలగు రాగద్వేషపూర్వక సంకల్పములు లేకుండెను. వారి మనస్సు మేరుపర్వతమువలె కామక్రోధాది సంకల్పములను గాలికి కదలలేదు. మఱియును ఆ మిత్రులు ఒక్కచో మట్టి పూసికొని పరుండుచు ఉండిరి. మఱియొక్కచో చందనలేపనమును గావించుకొనుచు ఉండిరి. మఱియొక్కమాఱు భస్మోద్ధూళనము జేసికొనుచు ఉండిరి. వారికి అన్నియును ఏకముగనే ఉండెను. ఇట్లు కొంతకాలము గడచునప్పటికి రాజు కుంభునితో సమానుడాయెను. అతిశాంతమై సర్వసమమై ఉన్న చిత్తముతోడను, అతి గంభీరమగు చిత్తముతోడను, ఆ కుంభునితో సరిపోలెను. ఈ విధముగ దేవపుత్రునివలె పరమానందమయుడై తేజోవంతుడై ఉన్న ఆ శిఖిధ్వజునిచూచి చూడాల ఇట్లని తలపోసెను. ఆహా, నాభర్త ఇప్పటికి బ్రహ్మవేత్తయై శాంతుడయ్యెను. రోగములు కాని, మనోవ్యధలు కాని, ఆయనకు లేవు. వయస్సా మధ్యవయస్సు. నేనును అట్టిదానినే. మిక్కిలి మనోహరములైన గృహములును, ఉద్యానవనములును, కలవు. ఇట్లుండగ ఏ స్త్రీ కామభోగములను అనుభవింపదో, అట్టిస్త్రీ సర్వవిధముల చేతను చెడినదే అగును. జీవన్ముక్తురాలు కాకుండిన భర్తకు కల భోగేచ్ఛను విఘ్నము చేసినది అగుటచేత చెడును. జీవన్ముక్తురాలైన లోకాచారమును చెరచుటచేత చెడిపోవును. మఱియు జీవన్ముక్తుడు తనకు చేకూరిన సుఖములను పరిత్యజించుటచేత అధికముగ దేనిని సంపాదింపగలడు. ( వానికి అట్టి పరిత్యాగమువలన వచ్చు లాభము ఏదియు లేదు కదా. ) కావున బుద్ధి ప్రభావముచేత క్రొత్తగా ఒకప్రపంచమును కల్పించి ఈ భర్తను నాతో రమించునట్లు చేసికొనియెదను. అని ఇట్లు నిర్ణయించి ఆ చూడాల ఒకనాడు వనమధ్యమునందు శిఖిధ్వజునితో విహరించుచు

ఇట్లనియె. స్త్రీకోకిల పురుషకోకిలను గూర్చి చెప్పినట్లు ఆమె వాక్యములను మిక్కిలి మనోహరములుగాను జెప్పెను.

ఓ శిఖిధ్వజమహారాజా ! నేడు చైత్రశుక్ల పాడ్యమి ఈ దినమునందు స్వర్గములో సమస్త లోకపాలాదులతోగూడి ఇంద్రుడు కొలువు దీరును. కావున నేను అచ్చటికి బోవలయును. మాతండ్రి అచ్చటికి వచ్చును. నేను అతని ఎదుట నిలువవలయును. మాతండ్రి నాకు అట్లు ఆజ్ఞాపించి ఉన్నాడు. దానిని నేను గడువకూడదు గదా. కావున నో రాజా ! నీవు కుసుమ శోభితమగు ఈ అరణ్యమునందు క్రీడించుచు విహరించుచు నేను వచ్చునంతవరకు కాచి యుండవలయును. ఏమియు దుఃఖమును జెందవలదు. నేను శీఘ్రముగనే వత్తును. నేటిసాయంకాలమునకే వత్తును. నీతోటి సహవాసమే నాకు స్వర్గవాసమునకంటె ఆనందకరము. అనిచెప్పి ఓ శ్రీరామా! ఆ కుంభుడు నందనోద్యానమునందు పుట్టినదానివలెనుండు మిక్కిలి మనోహరమైయున్న ఒక పూలగుత్తిని స్నేహ జ్ఞాపకార్థమై శిఖిధ్వజునిచేతికి ఇచ్చెను. అంత శిఖిధ్వజుడు ఇట్లనియె.

" ఓ మిత్రుడా ! శీఘ్రముగ రావలయును సుమా " అని శిఖిధ్వజుడు చెప్పుచుండగనే శరత్కాలమునందలి మేఘమువలె ఆ కుంభుడు అంత ఆకాశమునకు ఎగసెను. ఇట్లు ఎగసిపోయి శిఖిధ్వజుని కనుచూపు మేర గడువగానే ఆ చూడాల తన పురుషశరీరమును విడిచి మనోహర స్త్రీరూపమును దాల్చెను. ఆరూపముతో తనరాజధానిని చేరి అదృశ్యయాయెను. పిమ్మట స్త్రీజనముచేత ఆవరింపబడియున్న తన అంతఃపురమును ప్రవేశించెను. అచ్చట రాజకార్యములను అన్నిటిని సమకూర్చి మరల సాయంకాలమునకు కుంభరూపముతో శిఖిధ్వజుని ఎదుట ఆకాశము నుండి దిగెను. తనకు వాస్తవస్థితిలో ఏ విధమగు చింతయు లేకున్నను దుఃఖమును అభినయించుచు తనముఖమును మంచుగప్పిన చంద్రునివలె, ముకుళించిన కమలమువలె, కాంతిహీనము గావించెను. అప్పుడు ఆకుంభుని ముఖము వాడియుండుటను జూచి దుఃఖితుడై ఆ శిఖిధ్వజుడు ఆదరముతో సమీపమునకు పోయి ఇట్లనియె. ఓ దేవకుమారా ! నీకు నమస్కారము. నీమనస్సు ఏకారణమువలననో ఖిన్నమైనట్లు ఉన్నది. భయమును వదలి ఈ ఆసనముపై కూర్చుండుము. " నీటియందే బుట్టి నీటియందే అభివృద్ధి నొందినను తామర ఆకులు నీటితో తడువనట్లు " జ్ఞానులగు మహాత్ములు సంసారమునందే ఉన్నను దానివలన గలుగు హర్ష శోకములచేత బాధింప

బడదుకదా. ఓ రామచంద్రా ! ఆ శిఖిధ్వజుడు ఇట్లు పలుకగానే కుంభుడును ఆసనముపై కూర్చుకొనుచు అతి దుఃఖముతో విరిగిన బొంగుయొక్క ధ్వనివలెవెలితియగు గద్గదస్వరముతో ఇట్లనియె. ఓమహారాజా! ఎవరు దేహము ఉండునంతవరకు పలుమారు వచ్చుచుండు దశలను కర్మేంద్రియములతో అనువర్తింపక సమచిత్తములేక నుందురో, వారు జ్ఞానులు కారు. లోకవంచకులే. అజ్ఞానులగువారు తత్వమును ఎఱుగకపోవుటచేత సుఖదుఃఖములు వచ్చినప్పుడు అవి తనకు సంబంధించినవని అవి తలంచి చిత్తశాంతి లేనివారు కావున ఆదశలనుండి కర్మేంద్రియములను మరలింపజూతురు. జ్ఞానులు కూడ ఇట్లే జేసిన వారిజ్ఞానము ఏటిజ్ఞానము ? వాస్తవస్థితిలో దశలు తన్ను బాధింపవని తెలిసికొని మనస్సును నిర్వికారముగ నుంచుకొనవలయును గాని, కర్మేంద్రియములను వానినుండి మరలించుటకు ప్రయత్నింపరాదు. అంతకంటె అధమగు వెఱ్ఱి ఏదియు లేదు. నువ్వులు ఉన్నంతవరకు నూనె ఉండినే తీరినట్లు దేహమున్నంతవరకు మేలుకీడులు ఉండియే తీరును. వానిని తొలగించుకొనుట ఎట్లు ? అట్లుతొలగించుకొనుటకు ప్రయత్నించువాడు కత్తితో ఆకాశమును చెక్క ప్రయత్నించువాడే. అయితే ఈ మేలుకీడులు వచ్చినప్పుడు మనస్సు మాత్రము హర్షశోకములవలన సంక్షోభము నొందకూడదు. సమముగనే ఉండవలయును. అదియే యోగము. అదియే దేహదశా పరిత్యాగము. అదియె పురుషార్థసాధనము. ఇంతయే గాని, ఇచ్చట కర్మేంద్రియములతో పనియేమియు లేదు. అవి మేలుకీడులను పరిత్యజింప నేరవు. చిత్తస్థైర్యములేక బలాత్కారముగ ఒకవేళ అట్లుచేయ ప్రయత్నించినను అది లోకవంచనయే యగును.

శ్లో॥ ఏష దేహదశా దుఃఖ పరిత్యాగో హ్యనుత్తమః ।
యదాన్యత్వం చేతసో యోగాన్నతు కర్మేంద్రియ స్థితేః ॥
యావద్దేహం యథాచారం దశా స్వంగ విజానతా ।
కర్మేంద్రియైర్హి స్థాతవ్యం నతు బుద్ధీంద్రియైః క్వచిత్ ॥
పరమేష్ఠి ప్రభృతయ స్సర్వ ఏవోదితాశయాః ।
దేహావస్థాసు తిష్ఠంతి నియతే రేష నిశ్చయః ॥
అజ్ఞ తత్త్వజ్ఞ భూతాని దృశ్యజాత మిదంహి యత్ ।
తత్సర్వమేవ నియతిం ధావత్యంబు యథాంబుధిమ్ ॥
తజ్జ్ఞ బుద్ధ్యాది సామ్యేన పాణ్యాది చలనేనచ ।
నియతిం యాపయంతీమాం యావద్దేహ మఖండితామ్ ॥

అజ్ఞాస్తు సర్వ క్షోభేన సుఖ దుఃఖ దశా హతాః ।
నియతిం యాపయంత్యంగ దేహలక్ష్యైర్వాఖండితామ్ ॥

ఓరాజా! జ్ఞానియగువాడు దేహము ఉన్నంతకాలము ఎప్పుడెప్పుడు ఏదశ ప్రాప్తించునో దానినెల్ల కర్మేంద్రియములతో లోకాచారానుసారముగ అనుసరింపుచు నుండవలయును. మనస్సునందుమాత్రము నిర్వికారుడై ఉండవలయును. జ్ఞానవంతులైయున్న బ్రహ్మాదులును దేహదశలను (భుజించుట, జలపానమును ఆచరించుట, మొదలగు కార్యములను) అనువర్తింపుచునే ఉన్నారు. ఇది విధి. జ్ఞానులైనను అజ్ఞానులైనను ఈదృశ్య జీవులందరును నీరు సముద్రమునందు చేరునట్లు విధిని జేరుచుందురు. అందు జ్ఞానులు సమచిత్తులై చేతులు, కాళ్ళు, మొదలగు కర్మేంద్రియములచేత మాత్రమే విధిని అనుసరింపుచు ఉందురు. విధియు చక్కగనే నెరవేరుచుండును. మనస్సునకును వికారము లేకుండును. ఇక అజ్ఞానులన్ననో, వారు సమచిత్తము లేనివారగుటచేత మహాక్షోభమును చెందుచు సుఖదుఃఖములచేత పీడింపబడుచు నియతిని అనుసరింపుచు ఉందురు. వారికి దేహమే ఆత్మ, అను అభిమానము ఉండుటచేత ఆవిధియు నడుమ నడుమ బలాత్కారముగ ఖండింపబడుచుండును. ( అనగా, ప్రారబ్ధమును బలాత్కారముగ వారు విడుచుచుందురనుట ) అనికుంభుడు చెప్పిన విని శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓమహాత్మా! వాస్తవమే. ఇట్లుండగ నీకు ఈ యుద్వేగము ఎట్లు కలిగెను? నీవు సామాన్య జ్ఞానివేకాక దేవతవుకూడనై యున్నావు కదా. అనిపలికిన కుంభుడు ఇట్లనియె.

ఓరాజా ! స్వర్గమునందు జరిగిన వృత్తాంతము నంతయును నీకు దెలిపెదను. తన దుఃఖమును మిత్రునితో చెప్పికొనిన సగము నశించిపోవును. అట్లునేను నీకు పూగుత్తిని ఇచ్చి నీయెదుటనే ఆకాశమునకు ఎగసితినికదా. పిమ్మట ఒక క్షణమాత్రముననే స్వర్గమునకు జేరితిని. మా తండ్రితో జేరి ఇంద్రసభకు పోయి అచ్చట తగినరీతిగ ఉండి సభ ముగియగానే తండ్రియొద్ద సెలవుతీసికొంటిని. తత్క్షణమే ( ఇచ్చటికి రావలయునని అతివేగముతో బయలుదేరి సూర్యాశ్వములతోగూడ వాయుమార్గమున వచ్చుచుంటిని. తరువాత సూర్యుడు మఱియొక మార్గమున పోయెను. నేను ఏకాకినై పైనుండి క్రిందపడు పదార్థమువలె అతి వేగముతో నీసమీపమునకు వచ్చుచుంటిని. అప్పుడు జలపూర్ణములగు మేఘములయొక్క నడిమిత్రోవలో నాకు ఎదురుగ దూర్వాస మహాముని వచ్చుచుండెను. ఆయనకు నమ

సహరించి చమత్కారముగ ఇట్లంటిని. ఓమహామునిగారూ ! నల్లని మేఘములు మీకు వస్త్రముగానున్నవి. మీరును వాని ఆవరణమువలన అభిసారికవలె (పెనిమిటినిగూర్చి సంకేతస్థానమునకు వెళ్ళెడి నాయికవలె) ఉన్నారు. అని పరిహాసమునకు నేను ఇట్లు పలుకగానే ఆమహామునియు నాకు శాపము ఇచ్చెను. ఓయీ! నీవు నన్ను పరిహాసించితివి. కావున నేడు మొదలుకొని రాత్రులయందు స్తనములును, వెంట్రుకలును, మొదలగు అవయవములు గలిగి హావభావాది వికారములతోఁగూడి స్త్రీవగుదువు గాక. నీపరిహాసమునకు ఇది ఫలము. వెళ్ళుము. అని ఆవృద్ధమహాముని శపియింప అంత నేను దానిని విమర్శించునప్పటికే ఆతడు అంతర్ధానము నొందెను. ఈకారణమువలననే నేను దుఃఖించుచు నీవద్దకు వచ్చితిని. నేటినుండియు రాత్రులయందు నేను స్త్రీ అయ్యెదను. అప్పుడు ఒంటిగా ఎట్లుండ గలుగుదును. స్త్రీలకు లజ్జ స్వాభావికము. అట్టి లజ్జతో గురువులు బ్రాహ్మణులు దేవతలు మొదలగువారి ఎదుట ఎట్లు నిలుతును. నీఎదుటమాత్రము ఎట్లుందును? అని పలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓదేవకుమారా ! సర్వజ్ఞుడవయ్యు నీవు ఏల శోకించుచున్నావు. శోకముచేత దీరునది ఏది కలదు. ఏదివచ్చిన దానిని రానిమ్ము. అన్నియు దేహమునకే గాని, ఆత్మకు లేవుకదా. ఇంత జ్ఞానము కలిగి దుఃఖింపవలసిన అవకాశము లేనివాడవయ్యు నీవే దుఃఖింతువేని ఇక ఇతరులనుగూర్చి చెప్పవలసినది ఏమి ఉన్నది. వారు దుఃఖము నుండి తరించుమార్గము ఏది కలదు ?

ఓరామచంద్రా ! ఈవిధముగ వారు ఇరువురును ఏకవాక్యములచేత ఒకరినొకరు ఊరడించుకొనుచు పూర్వమునకంటె స్నేహము అభివృద్ధి అగుచుండగ ఆకాశముననున్న ఇంద్రస్వర్గ, త్రిశంకుస్వర్గములవలె ఆవనమునందు నివసింపుచుండిరి. అంత ప్రపంచదీపమగు సూర్యుడు చమురు లేకున్న నశించు దీపమువలె ఆకుంభునకు స్త్రీరూపమును సంపాదించుటకో, అన, అతిశీఘ్రముగనే అస్తమించెను. అంత ఆమిత్రులు ఇరువురు జలాశయమునకు బోయి సంధ్యావందనము ఆచరించి జపమును ముగించిరి. పిమ్మట ఆకుంభుడు క్రమక్రమముగ స్త్రీరూపమును దాల్చెను. ఎదురనున్న శిఖిధ్వజుని జూచి తడబడు పదములతో ఇట్లనియె. ఓరాజా ! నాకు పడుచున్నట్లు ఉన్నది. అదరుచున్నట్లు ఉన్నది. కరిగిపోవుచున్నట్లు ఉన్నది. వనమధ్యమునందు నాకు స్త్రీత్వము వచ్చెను. అమితముగ లజ్జబొడముచున్నది. చూడుము. నావెంట్రుకలు అభివృద్ధి అగుచున్నవి. వక్షమునందు స్తనములు పుట్టు

చున్నవి. నావస్త్రములు మడమలవరకు బోవుచున్నవి. పిరుదులును ఘనముగ ఏర్పడినది. ఓరామచంద్రా! ఈవిధముగ బలికి ఆకుంభుడు ఊరకుండెను. వానిరూపమును జూచి ఖిన్నుడై ఆశిఖిధ్వజుడు ఇట్లనియె. ఓసత్పురుషుడా! నీవు బ్రహ్మవేత్తవు. విధి నియమమును ఎఱుగుదువు. ఇప్పుడు నీకు సంభవించినస్థితి ఏమిచేసినను తొలగునది కాదు. కావున ఖేదము నొందకుము. అనిన కుంభుడు ఇట్లనియె. ఓరాజా! చింత ఏమియును లేదు. స్త్రీరూపమునే అనుసరించి సంచరింతును గాక. నియమమును తప్పించుట ఎవరితరము. ఓరామచంద్రా! అని ఈవిధముగ వారు ఇరువురును తమ దుఃఖములను పోనడచికొని ఏకతల్పముపై శయనించి మౌనభావముతోనే రాత్రిని గడపిరి. సూర్యుల ఉదయముకాగానే ఆకుంభుడు స్త్రీరూపమును విడచి స్తనాది అవయవశూన్యుడై పురుషరూపమును ధరించెను. ఓరఘురామా! ఈవిధముగ త్రిలోకసుందరియు రాజపత్నియు నగు, అచూడాల మొట్టమొదట పురుషుడై పిమ్మట స్త్రీగా మారెను. రాత్రులయందు స్త్రీయగుచు పగళ్ళయందు పురుషుడగుచు మిత్రభావముతో ఉన్న తన భర్తతోగూడి అరణ్యములయందు విహరించుచు ఉండెను. ఈవిధముగ కొంతకాలము గడచిన పిమ్మట ఒకనాడు భర్తను చూచి ఆమె కుంభరూపముతోనున్న సమయమునందే ఇట్లనియె.

ఓకమలలోచనా! మహారాజా! నేను ఒకవాక్యమును చెప్పెదను. నేను ప్రతిదినమును రాత్రులయందు స్త్రీనగుచునే ఉన్నాను. కావున నాకు స్త్రీధర్మమునందు కోరిక కలదు. ఒకానొక భర్తను వివాహము చేసికొనవలయునని ఉన్నది. విచారించిన మూడులోకములయందును నీకంటె తగిన భర్త ఎవడును గానరాలేదు. కావున నీవు నన్ను వివాహమగుము. రాత్రులయందు స్త్రీనగుదును. కనుక నీకు భార్యనై ఉందును. అని కుంభుడు పలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓబుద్ధిమంతుడా! మిత్రరత్నమా! ఈకార్యము చేయుటవలన నాకు గాని, నీకుగాని, వచ్చు మేలు కీడులు ఏమియును గానరాలేదు. మన జ్ఞానమునకు లోపముకూడ ఏమియు తటస్థింపదు. కావున నీఇష్టము వచ్చినట్లు చేయుము. అని శిఖిధ్వజుడు పలికిన కుంభుడు ఇట్లనియె. ఓరాజా! అట్లయిన ఇదియే శుభలగ్నము. నేడు శ్రావణశుద్ధ పూర్ణిమ. ఈయుద్దేశము నాకు నిన్ననే కలిగినది. దానివలననే అప్పుడే ముహూర్తమునుకూడ నిశ్చయించి ఉంచితిని. నేటిరాత్రి పరిపూర్ణ కళావంతుడై చంద్రుడు ఉదయింపగానే మనకు వివాహము జరుగవలయును. కా

వున లేలెమ్ము. వివాహామునకై చందనము, పుష్పములు, రత్నములు, మొదలగువానితో గూడిన సంభారము సమకూర్పుము. ఓ రామచంద్రా ! ఇట్లు చెప్పి ఆకుంభుడు శిఖిధ్వజుని గూడ తీసికొని పుష్పములను గోసెను. రత్నములను సమకూర్చెను. ఈవిధముగ వివాహ సంభారము జేర్చికొని సువర్ణమయమగు మందరపర్వత గుహాయందు బెట్టి గంగాజలములయందు మంగళస్నానమును ఆచరింప బోయిరి. స్నానముచేసి దేవతలకును పితృదేవతలకును పూజ లొనరించిరి. వారికి కర్మఫలములయందు ఎట్లు ఇచ్ఛ లేదో, అట్లే కర్మలను పరిత్యజించుటయందును ఇచ్ఛ లేదు. అంత కల్పవృక్షము ఇచ్చిన తెల్లని వస్త్రములను ధరించి ఫలములను భుజించి క్రమక్రమముగ వివాహమునకై ఏర్పఱచుకొనిన స్థానమునకు వచ్చి చేరిరి. ఇంతలో సూర్యుడు అస్తమించెను. సంధ్యావందనము ముగియగానే కుంభుడు స్త్రీ ఆయెను. అట్లు స్త్రీయై శిఖిధ్వజునితో ఇట్లనియె.

ఓ ప్రాణనాథా ! నాకు భూషణములను పెట్టుము. అగ్నిని ప్రజ్వలింప జేసి హోమాదులను చేయుము. పాణిగ్రహణమును గావింపుము. నేను స్త్రీరూపముగల్గి మదనిక అను పేరుతో నుండెదను. నీకు భార్యనయ్యెదను. అనిన ఆశిఖిధ్వజుడును శీఘ్రముగ సర్వము నిర్వర్తించెను. ఈవిధముగ ఆశిఖిధ్వజ చూడాల ఇరువురును మహేంద్రపర్వత గుహాయందు వివాహితులై అతి ప్రేమగల దంపతులైరి. అదిమొదలుకొని యథేచ్ఛముగ పువ్వులు, చిగుళ్ళు, పండ్లు, మొదలగునవి అనంతముగ గలిగిన అరణ్యములయందు యథేచ్ఛముగ విహరింపుచు క్రీడింపుచుండిరి. రాత్రులయందు శిఖిధ్వజుడు నిదురించిన పిమ్మట చూడాల స్వతంత్రముగ ఏకార్యమునైనను జేయజాలి ఉండెను. కావుననే మూడుదినములకు ఒకమాఱు రాజధానికిపోయి రాజకార్యములను చూచి వచ్చుచుండెను. ఇట్లు కొన్ని మాసములు గడచినపిమ్మట చూడాల ఇట్లని ఒకనాడు విచారింప సాగెను. ఇప్పుడు ఈశిఖిధ్వజుని చిత్తమును పరీక్షింప వలయును. మఱియు బ్రహ్మజ్ఞానము దృఢమై ఎప్పటికిని ఈతని చిత్తము భోగములయందు చొరబడక ఉండునట్లు చేయవలయును. కావున యోగబలముచేత కొన్ని భోగ్యపదార్థములను గల్పింతును గాక. అని ఇట్లు నిశ్చయించి ఒకనాడు వనమునందు సంచరించుచు ఉండి తన యోగబలముచేత దేవతలతోను, అప్సర స్త్రీలతోను, ఇంద్రుడును వచ్చినట్లు ఆశిఖిధ్వజునకు కనబరచెను. అప్పుడు శిఖిధ్వజుడును ఆఇంద్రుని భక్తితో బూజించెను. సవినయముగ ఇట్లనియెను.

ఓ దేవనాథా! ఇంతదూరము వచ్చుటకు కారణమేమి? ఇంత ఆయాసమును ఏల గైకొంటిరి. దయతో నాకు సెలవిమ్ము. అనిన ఇంద్రుడు ఇట్లనియె. ఓశిఖిధ్వజమహారాజా! అరణ్యమునందలి పక్షులు త్రాటిచేత, లేక, వలచేత ఆకర్షింప బడునట్లు నీ సుగుణములను త్రాటిచేత ఆకర్షింప బడి మేము ఇచ్చటికి వచ్చితిమి. లెమ్ము. స్వర్గమునకు రమ్ము. అచ్చట ఉన్న వారలందరును నీకై ఎదురుచూచుచున్నారు. దేవస్త్రీలందఱును నీ గుణములను వినుటచేత నిన్ను చూడను మిక్కిలి మనస్సు గలిగి ఉన్నారు. నీవు జీవన్ముక్తుడవై స్వర్గలోకమునందు సర్వభోగములను కల్పాంతము వరకును అనుభవింప వలయును. ఇది నీయొక్క పూర్వకర్మ ఫలము. ఇట్లగుటచేతనే నేను నిన్ను పిలువ వచ్చితిని. అని చెప్పిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓదేవేంద్రా! స్వర్గలోకముయొక్క ఆచారములన్నియును నాకు దెలియును. అయితే నాకు మాత్రము అంతయు స్వర్గమే. ఒకచోట స్వర్గము క్రొత్తగా వేఱుగా లేదు. మఱియొకచోట లేకపోలేదు. ఓ ప్రభువా! దేవేంద్రా! అన్నివిషయములయందును సంతోషము కలిగియే ఉన్నాను. సర్వ పదార్థములయందును. తృప్తి కలిగియే ఉన్నాను. మనస్సునందు కోరిక లేదు. కావున నాకు సర్వమును ఆనందకరముగనే ఉన్నది. ఇట్లగుట చేత ఓ ఇంద్రుడా! నియతమై నియత పరిమాణముగలిగి ఒక ప్రదేశమున నుండి పరిచ్ఛిన్నమై యున్న స్వర్గమునకు బోవుటనాకు ఇష్టములేదు. ఈ కారణమువలన ఈ విషయమునందు మీ ఆజ్ఞను తిరస్కరింపవలసి ఉన్నది. ఓ రామచంద్రా! ఇట్లు శిఖిధ్వజుడు పలుకగనే ఆ ఇంద్రుడు ఓ కుంభశిఖిధ్వజులారా! మీకు శుభమగును గాక. అని చెప్పి దేవసహితుడై అంతర్ధానము నొందెను. ఇట్లు ఆ చూడాల ఆ మాయను ఉపసంహరించి మనస్సునందు ఇట్లని తలపోసెను. నా అదృష్టము ఎంతో మంచిది. నేటికి నా భర్తకు భోగేచ్ఛ సంపూర్ణముగ తొలగినది. శాంతుడై సమచిత్తుడై ఇంద్రుడే స్వయముగ తన్ను బిలువ వచ్చినను కించిత్తైన తొట్రుపాటు పడక నిష్ఠనుండి తొలగక వ్యవహారమును బాగుగ ఆచరించినాడు. కావున మఱియొక మారు ఈతని పరీక్షించెదను. ఈతూరి భోగపదార్థమును గాక రాగద్వేషములను అభివృద్ధిచేయగల ఒకానొకదానిని కల్పింప వలయును.

——* చూడాల తనపతిని పరీక్షించుటకు జారుని గల్పించుట. *——

ఇట్లు నిశ్చయించి నాటిరాత్రి శిఖిధ్వజుడు జపమును చేయుచు నదీ

తీరమునందు కూర్చుండియుండగ చంద్రుడు తనకిరణములతో పరిపూర్ణుడై ప్రకాశించుచుండగ సంకల్పబలముచేత ఒక మాయను నిర్మింపదలచి పూలగుత్తులతో నిండియున్న ఒకపొదరింటిని ప్రవేశించి కామపరతంత్రయై అచ్చట సంకల్పముచేత కల్పింపబడిన పుష్పశయనమునందు పరుండి పుష్పమాలాదులచేత అలంకృతుడగు ఒక సంకల్పిత పురుషుని గాఢాలింగనము చేసికొని ఆ పుష్పశయ్యపై పరుండి యుండెను. అంత ఆ శిఖిధ్వజుడును సంధ్యావందనము ముగియగానే వచ్చి పొదరిండ్లలో వెదకి ఒకచో పైన చెప్పిన విధముగ జారపురుషునితోగూడి సరస సల్లాపము లాడుచున్న తనభార్యను జూచెను. అట్లు చూచి కొంచమైనను వికారము నొందక వెడలిపోయెను. అంతమాత్రమే కాదు " ఓ జారులారా ! సుఖముగ నున్నారా ? అట్లే సుఖముగ నుండుడు. మీ ఇచ్ఛవచ్చినట్లు సంచరింపుడు " అనిచెప్పి వారి సంచారమును అనుమతించెను. " ఓ జారులారా! నావలన మీరు భయపడవలదు. మీ సుఖమునకు విఘ్నము చేసికొన వలదు. ఇదిగో నేను వెడలిపోవుచున్నాను " అని చెప్పుచును అస్థానమునందైనా నిలువక దూరముగ వెళ్ళిపోయెను. అంత ఒకక్షణములో ఆ మాయను తొలగించి ఆ చూడాల రతిక్రీడవలన ఖిన్నమగు తన దేహమును జూచుచు భర్త వద్దకు వచ్చెను. అప్పటికి ఆతడును ఒక సువర్ణశిలపై గూర్చుండి ఉండెను. ఏకాంతస్థితి దొరుకుటచేత సమాధియందు నిలచి యుండెను. కన్నును సగము మూసి యుండెను. ఇట్టి భర్తవద్దకు వచ్చి సిగ్గుచేత తలవంచుకొని ఆ చూడాల క్షణముసేపు ఏమియు మాటలాడక ఉండెను. ఆ శిఖిధ్వజుడును ఒక క్షణమునకు సమాధిని చాలించి ఆ మదనికను జూచి ఇట్లనియె. ఆతని చిత్తమునందు సంక్షోభము కొంచెమైనను కలుగలేదు. శాంతి తరుగలేదు. వాక్యములయందు పారుష్యము కొంచెమైనను లేదు. ఇట్టి స్థితితోనే ఆ శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ కాంతా ! నీవు భయమునొంది నీ ఆనందమునకు విఘ్నము గావించుకొంటివా ? ఏమి ? కావలసియున్న నీ ప్రియనాథుని తృప్తిపరచుటకై మరల పొమ్ము. లోకమువందు అన్యోన్యానురాగముగల స్త్రీపురుషులు తటస్థించుట దుర్ఘటముకదా ? అనిపలికిన మదనిక ఇట్లనియె.

శ్లో॥ ఏవ మేష మహాభాగ స్త్రీస్వభావోఽపి చంచలః ।
కామో హ్యష్టగుణః స్త్రీణాం నకోపం కర్తు మర్హసి ॥

ఓ నాథా! ఇది స్త్రీస్వభావము. మిక్కిలి చంచలమైనది. స్త్రీలకు

పురుషులకంటె కామము ఎనిమిదిరెట్లు అధికము. అని వినియుండలేదా ? కావున నాపై గోపము చేసికొనవలదు. దయ జూపుడు. నేను స్త్రీని. మూఢురాలను. బాలికను. తప్పుజేసి ఉన్నదానను. మీరు దయగలిగి క్షమింపవలయును. సత్పురుషులకు శాంతియే స్వభావముకదా ? అనెను. అంత శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ బాలికా! ఆకాశమునందు వృక్షము ఉండనట్లు నాకు కోపము లేదు. అయితే సత్పురుషులు దూషింతురు. కావున నిన్ను భార్యగ నొల్లను. ఈ విధముగ నాశిఖిధ్వజుడు సమచిత్తముతో నుండుటకు మిక్కిలి సంతోషించి యో రామచంద్రా! పిమ్మట ఆచూడాల ఇట్లని తలంచెను. ఆహా, ఈ మహాత్ముడు పరమశాంత స్థితిని జెందెను. సమభావము నొందెను. భోగములు కాని, గొప్ప సంపదలు గాని, ఈయన చిత్తమును త్రిప్పలేక ఉన్నవి. కావున ఇప్పుడు నా వృత్తాంతమునంతయు ఈయనకు జెప్పెదను. మదనికారూపమును విడిచి చూడాలనే అయ్యెదను. అని ఇట్లు నిశ్చయించి మదనికారూపమును విడిచి చూడాలరూపమునే ధరించెను. పూర్వమువలెనే బహువిధ విలాసములను జూపుచు ఎదుర నిలువబడియెను. ఇట్లు తన భార్యతన ఎదుట నిలువబడుటను గాంచి పరమాశ్చర్యభరితుడై నేత్రములు వికాసమునొందగ ఆశ్చర్య పూర్ణమగు ధ్వనితో ఇట్లనియె. ఓ స్త్రీ! నీవు ఎవ్వతెవు. ఇచ్చోటికి ఏలవచ్చితివి? ఎంత కాలమునుండి ఇక్కడ ఉన్నావు ? ఏమి కారణమువలన ఉన్నావు ? నీ అవయవ సన్నివేశమును కంఠధ్వని సంచారభేదమును, వయస్సును, విలాసములును, మొదలగువానిని బట్టి చూడగ నాభార్యయగు చూడాలవలె ఉన్నావు. అని పలికిన చూడాల ఇట్లనియె. ఓ మహారాజా ! మీ ఊహ నిజము. నేను చూడాలనే. సంశయములేదు. ఓ మహాత్మా ! ఇప్పటికినిజరూపముతో నిన్ను గాంచుటకు వీలు కలిగినది. ఓ మహానుభావా ! నీకు బ్రహ్మజ్ఞానమును కలిగించుటకయ్యే నేను కుంభాది బహురూపములను దాల్చి మీకు అనేకవిధములగు చర్యలను చూపితిని. ఈ విషయమునందు మీకు సంశయము ఏల ? మీరు బ్రహ్మవేత్తలు. ధ్యానముచేత విమర్శించిన సర్వమును మీకు తేటపడును. అట్లు చేయుడు. ఓ రామచంద్రా ! అని ఇట్లు చూడాల చెప్పగనే ఆశిఖిధ్వజుడును తగిన సన్నాహముతో యోగమును ఆచరించి తన విధమునెల్ల దెలిసికొనెను. తాను రాజ్యమును వదలి వచ్చినది మొదలు చూడాలను చూచునంతవరకు జరిగిన సర్వ విషయమును ప్రత్యక్షముగ జూచి పిమ్మట యోగమును చాలించెను. ఇట్లు సమాధిని

చాలించి పరమానంద భరితుడై తనబాహువులను చాచి అతిప్రీతితో భార్యను ఆలింగనము చేసికొనెను. ఇట్లు కొంతకాలము పరమానందమునే అనుభవింపుచును ఊరకుండి పిమ్మట ఆమెను తొడపై గూర్చుండబెట్టుకొని ఇట్లనియె, ఓ చూడాలా ! మిక్కిలి పాటుపడి నన్ను దుస్తరమగు సంసార సముద్రమునుండి తరింప చేసితివి. నీకు ఎవ్వరుసాటి. కులస్త్రీలు మిక్కిలి పాటుపడి భర్తలకై ఎంతకార్యమునైనను గావింతురు. వారిని ఎట్టి కష్టములనుండియైనను తొలగింతురు. నీవుమాత్రము అతి దుస్తరమై అనాదియై ఉన్న అజ్ఞానమునుకూడ నివర్తింప జేసితివి. ఇంత మహోపకారము చేసి నందులకు నీకు నేను ఏ ప్రత్యుపకారమును గావింతును ? దేనిని గావించినను చాలదు. అట్లుండ నీవు జీవన్ముక్తురాలవు. కోరికలేనిదానవు. ఇక నీయెడ ప్రత్యుపకారము ఏది పనికివచ్చును. అనిన ఆచూడాల ఇట్లనియె.

ఓ ప్రాణనాథా! వినుము. మీరు తత్వమును ఎఱుగలేక పలుమారు నిష్ప్రయోజనములగు కర్మలను చేయుచుండుటను వ్యాకుల చిత్తముతో జూచి నేను మిక్కిలి శోకించితిని. కావున నేను మీకు జ్ఞానమును కలుగ చేయుటచేత నాదుఃఖమునే నివారించుకొంటిని. ఇట్లు స్వార్థపరనై ప్రయత్నించిన నాకు ఇంత గౌరవము ఏలచేసెదరు. ఆకాశమునందు పర్వతములు లేనట్లు స్వచ్ఛముగు ఆ చిదాకాశమును సంకల్పములవలన కలుగు కల్పనలును మీయందు ఇపుడు గానవచ్చుటలేదు. అనిపలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓ దేవీ ! చూడాలా ! నిశ్చయముగ నేను ఇప్పుడు అట్లే యున్నాను. నాకు సంకల్పములుగాని, దేశకాలాది భేదములుగాని, కోరికలుగాని, లేవు. ఆకాశమువలె నిర్మలుడనైతిని. చిరకాలమునకు పరమ శాంతమగు అహంశబ్దార్థమునైతిని. నాకు దేనియందును అభిమానము లేదు. ఏదియుగాని పరమాత్మయందే నిలుకడను జెంది యున్నాను. స్వస్థుడనై యున్నాను. నాకు సంతోషము లేదు. దుఃఖమును లేదు. నేను ఈ స్వరూపముతోను లేను. మఱియొక స్వరూపముతోను లేను. లోకమునందు సర్వవ్యాపకమగు ప్రకాశమునకంటె గోడలు మొదలగు వానిపై బడిన ప్రకాశముఅధిక కాంతిగలదై యుండును. అయినను దానికి ఆవరణము కలదు. అట్టి ఆవరణము లేకున్న అది ఎంతకాంతితో నుండునో నేను అట్టికాంతితో ఉన్నాను ( పరిశుద్ధ తేజోమయుడనై ఉన్నాననుట. ) నాశమును, అభివృద్ధియును, లేని తేజస్సుతో ఉన్నాను. ఇంతయేల ? నేను యథార్థస్థితిలో ఎవ్వడుగనుండవలయునో, వాడుగనే ఉన్నాను. నాస్థితిని నేను చెప్పలేను.

ఓ హృదయేశ్వరీ ! చూడాలా ! నీవే గురువు నీకు నమస్కారము.

ఓవిశాలలోచనా ! నీకృపచేత దుస్తరమగు సంసార సముద్రము నుండి తరించితిని. సర్వమును అతిక్రమించి సర్వవ్యాపకుడనై ఆకాశము వలె ఉన్నాను. అని శిఖిధ్వజుడు పలికిన చూడాల ఇట్లనియె. ఓమహాత్మా! ప్రాణనాథా! ఇది అంతయు ఇట్లే. మీకు ఇప్పుడు కావలసినది ఏమి? మీమనస్సునకు ఏది ఇంపై యున్నది. దానిని దయచేత సెలవిండు. అనిపలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె. ఓకాంతారత్నమా! "ఇది కావలయును, ఇది అక్కఱలేదు" అను విషయములు నాకు తెలియదు. నీవు ఎప్పుడు దేనిని ఎట్లు గావింతువో, అప్పుడు దానిని అట్లే అంగీకరింతును. ఓసుందరీమణీ! ఆకారణమువలన నీకు ఏది తోచునో, దానినే చేయుము. రత్నము ప్రతిబింబమును ధరించునట్లు నేనును దానిని దృఢముగా ధరింతును. దేనినైనను నేను నుతింపను. నిందింపను. నీవు ఏదిచేసినను సరియే. అనిన చూడాల ఇట్లనియె. ఓమహారాజా! నామతమే మీకు సమ్మతమగునేడల నా అభిప్రాయమును చెప్పెదను వినుడు. మీరుజీవన్ముక్తి నొందితిరి. కావున దేనిని నిషేధింపరాదు. నావాక్యమును అంగీకరించి ఆచరింపుడు. నేటికి మనము ఇరువురమును అజ్ఞానశూన్యులమై వివేకవంతులమై కామక్రోధాది వర్జితులమై ఆకాశము వలె నిస్సంగులమై ఉన్నాము. సర్వపదార్థములను ఏకమగు బ్రహ్మరూపముతో చూచు చున్నాము. ఈకారణమువలన మనకు అన్నియును ఒక్కటియే. కావున మనము మొట్టమొదట ఎవ్వరమో, ఆరూపమునే మఱల గలిగి యుందము. మొదటినుండియు రాజులము. కావున ఇప్పుడును రాజులమే అగుదము. మూర్ఖత ఒక్కటియే మనలను ఇంతజేసెను. దానిని విడచిన ఎట్లున్నను ఒక్కటియే కదా? మనవృత్తిని ఏల విడువ వలయును. పూర్వమువలెనే రాజ్యమును పరిపాలించుచుండి దేహము నశించిపోగానే విదేహ కైవల్యము నొందుదము. ఓప్రభువా! ప్రాణనాథా ! పూర్వమువలెనే నీవు రాజధానియందు సింహాసనమును అధిష్టించి రాజవగుము. నేనును కామభోగములచేత మిమ్ము సంతసింపజేయుచు రాణినయ్యెదను. "ఇది సుఖము, ఇదిసుఖముకాదు" అను ద్వంద్వములు నశించిపోయినవి. కావున ఇక దేనియందును ఇచ్ఛజనింపదు. కావున ఆశా విరహితుడవై సుఖింపుము. అని చూడాల పలికిన శిఖిధ్వజుడు ఇట్లనియె.

ఓకమలలోచనా! నీవు సత్యము పలికితివి. ఉచితమును యోచించి చెప్పితివి. జీవన్ముక్తునకు రాజ్యమును విడుచుటచేత అధికముగ గలుగు ఫల

మేము? అంగీకరించుట చేత గలుగు నష్టమేమి? ఏది ఎట్లువచ్చినను మన శుభ్రతకు భంగము రాదు. సుఖదుఃఖాభిమానమును వదలి కామక్రోధాదులను వర్జించి నిర్వికారులమయ్యే యుందము. ఓరామచంద్రా! ఇట్లు ఆశిఖిధ్వజుడు రాజ్యపరిపాలనమునకు అంగీకరింపగానే ఆచూడాల శీఘ్రముగ లేచి తనయెదుర సప్తసముద్రజలములతో నిండియుండు ఒక రత్నకలశము రావలయునని సంకల్పించెను. తత్క్షణమే అట్టి కుంభము ఒకటి ఆసన్నమగుటయు, దానిని గైకొని తన భర్తను పూర్వాభిముఖముగ గూర్చుండబెట్టి ఆచూడాల ఆయనకు పట్టాభిషేకము గావించెను. అంత ఆశిఖిధ్వజుడును ఆచూడాలను ఆసనముపై గూర్చుండబెట్టి పట్టపుదేవిగా అభిషేకించెను. ఇట్లు అభిషేకము ముగిసిన పిమ్మట శిఖిధ్వజుడు భార్యతో ఇట్లనియె.

ఓదేవీ! ప్రాణనాయకీ! మనము ఇక రాజ్యమునకు బోవలయును. కావున నీవు సంకల్పప్రభావముచేత మహావైభవముతో గూడిన సైన్యమును కల్పింపుము. ఓరామచంద్రా! ఇట్లు భర్త ఆజ్ఞాపింపగానే యాచూడాలయు, ఆ అరణ్యమంతయు క్రిక్కిరియునంత సైన్యము కావలయునని సంకల్పించెను. ఆసైన్య మధ్యమునందు సామంతులచేత రక్షింపబడుచు రాజునకు తగినట్లుగా అలంకరింప బడియున్న మదపుటేనుగు ఒకటి యుండెను. ఆసైన్యమునందలి ప్రధానులు దానిని రాజువద్దకు దెచ్చిరి. అప్పుడు భార్యాభర్తలు ఇరువురు దానిని అధిరోహించిరి. పిమ్మట కాల్బలము రథములు అశ్వములు మొదలగువానిచేత సంకులమై ఉన్న సైన్యము తోడరాగా ఆశిఖిధ్వజుడు మహేంద్రపర్వతమును విడిచి అత్యల్పకాలములోనే తనరాజధానిని స్వర్గమును బోలుదానిని జేరెను. ( ఈ ఉపాఖ్యానమునందు మొట్టమొదట శిఖిధ్వజుడు మందరపర్వత సమీప అరణ్యమును జేరెననియు, ఇచ్చట మహేంద్ర పర్వతమునుండి పురమునకు బోయెననియు, నడుమ గంగాస్నానము జేసెననియును ఉన్నది. ఇందు మొట్టమొదట ఆశిఖిధ్వజుడు మందరపర్వత సమీపమునందే ఉండి పిమ్మట కుంభునితోగూడి స్వేచ్ఛగా సంచరించునప్పుడు మహేంద్రపర్వతమునకు వచ్చియుండుననియు, గంగాస్నానమనునది కుంభునియొక్క ప్రభావముచేత గలిగిన ఆకాశగంగాస్నానమనియు, నిర్ణయింపవలసియున్నది. ) అంత చూడాలయొక్క సంకల్ప ప్రభావముచేత రాజాగమనమును ఎఱిగిపురములో ఉన్న సామంతరాజులు అందఱును మంత్రి పురోహితాది సహితులై జయ జయ శబ్దములను ఉచ్చరించుచు పురమును నిర్గమించి ఆశిఖిధ్వజునకు ఎదురు నడచిరి. బహు విధము

లగు మంగళ వాద్యములు వారి ముందుగ నడచు చుండెను. చతురంగ సైన్యము వారిని అనుసరించు చుండెను. ఇట్లుపోయి రాజధానిలోనున్న సామంతులు శిఖిధ్వజుని జేరగనే పురములోని సైన్యమును, చూడాలయొక్క సంకల్పమువలన జనించి అరణ్యమునుండియు వచ్చుచున్న సైన్యమును గలసి మహాసైన్యమాయెను. పూర్వమునుండియు వచ్చుచున్న చూడాలయొక్క సంకల్ప ప్రభావములగు వాద్యములును, పురమునుండి వచ్చిన వాద్యములును, గలయగానే, ధ్వని మిక్కుటమాయెను. ఇట్లు ఉభయ సైన్యములతో గూడి ఆప్రభువు పురమునందు ప్రవేశించెను.

ఓరఘునందనా! శ్రీరామా! ఇట్లుమహావైభవముతో పురప్రవేశమునుచేసి జీవన్ముక్తస్థితితో యథాపూర్వముగనే పదివేల సంవత్సరములు రాజ్యపాలనమును చేసి పిమ్మట చూడాలతోగూడ దేహమును విడిచెను. చమురులేని స్వాయముగ వెలుగు దీపము వలె స్వయంప్రకాశరూపులై వారిరువురు బ్రహ్మమునందు ఏకీభవించిరి. ఓరామచంద్రా! ఈవిధముగ ఆశిఖిధ్వజుడు రాజశ్రేష్ఠుడై సకలభోగములను అనుభవించి బహుకాలము రాజ్యపాలనమును చేసి జీవన్ముక్తుడయ్యే యుండి అంతమునందు అకృత్రిమమైనట్టియు, ఆద్యంత శూన్యమైనట్టియు, ముక్తిని చెందెను. కర్మాదులు ఏమియు శేషించి ఉండక పోవుటచేత పునర్జన్మ రహితుడయ్యెను. నీవును ఈవిధముగనే ఎప్పటికి ఏదివచ్చిన దానిని సమచిత్తముతో ఆచరింపుచు సుఖదుఃఖములను చెందకుండుము. ఇంతయేకాదు భోగమోక్షములను స్వాయముగ ఒనర్చినను దోషము లేదు. ఒనర్చువాడవు నీవు కావుకదా? ఇంద్రియములు ఇంద్రియకార్యములను చేయును. నీవు సర్వసాక్షివి. నీవు వానిచర్యను చూచువాడవు మాత్రమే అయి యున్నావు.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున శిఖిధ్వజోపాఖ్యానమను
ముప్పదియేడవ సర్గము ముగిసెను.

—❋—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడగు భరద్వాజునితో ఇట్లనియె. ఓభారద్వాజా! ఇట్లు శిఖిధ్వజోపాఖ్యానమును వివరించి "చిత్తత్యాగమే సర్వత్యాగము" అను విషయమును మఱింత దృఢపరచుటకై వశిష్ఠమహాముని శ్రీరామునితో ఇట్లనియె. ఓరామచంద్రా! నీకు శిఖిధ్వజునియొక్క చరిత్ర

మును వివరించితిని. ఇదియే ఉత్తమమైన మార్గము. దీనిని అనుసరించిన ఎప్పటికిని సంక్షోభమును చెందవు. ఆశిఖిధ్వజుడును, బృహస్పతి పుత్రుడగు కచుడును, ఏవిధముగ జ్ఞానము నొందిరో నీవును ఆవిధముగనే జ్ఞానము నొందుము.

—* కచోపాఖ్యానము. *—

అని వశిష్ఠమహర్షి చెప్పిన శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓభగవంతుడా! వశిష్ఠమహాముని! మహాత్ముడగు ఆబృహస్పతికి పుత్రుడైన కచుడు ఏవిధముగ జ్ఞానవంతుడయ్యెనో, ఆవిధమును నాకు ఎఱిగింపుడు. అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓరామచంద్రా! వినుము. కచుడు పదములను వాని అర్థమును మాత్రమే ఎఱిగి పూర్వాపరములను విమర్శింపనేరని సమయమునందే బాల్యచాపలముచేత బృహస్పతిని జూచి ఇట్లనియె. ఓగురువా! వాస్తవస్థితిలో సంసారముతో జీవునకు సంబంధము లేకున్నను, ప్రతివాడును ముక్తుడేమై ఉన్నను, ఈవిషయమును నిర్ణయింపలేక " సంసారమును తరింపవలయును " అను తలంపు గలిగి ఉన్నారు. కావున ఓమహాత్మా! సర్వధర్మజ్ఞా! కర్మబంధముచేత బంధింపబడియున్న జీవుడు ముక్తుడు ఎట్లగును ? ఈసంసారసముద్రమును ఎట్లు తరించును. అని కచుడు అడిగిన బృహస్పతి ఇట్లని ఉత్తరము ఇచ్చెను. ఓవత్సా! కచుడా! ఈసంసారసముద్రమునందు అనర్థములను మొసళ్ళు అనంతముగ గలవు. దీనిని సర్వత్యాగము చేసినవాడుగాని, తరింపనేరడు. ఓపుత్రుడా! కచుడా! ముక్తికి ఇంతకంటె ఉపాయము లేదు. ఓరామచంద్రా! ఇట్లు బృహస్పతి చెప్పినవాక్యమును విని తత్క్షణమే ఆకచుడు తనకుగల ధనధాన్యాదులను అన్నిటిని పరిత్యజించి అరణ్యమునకు పోయెను. ఇట్లు పుత్రుడు వెడలిపోయినను దానివలన బృహస్పతియొక్క చిత్తము సంక్షోభము జెందలేదు. మహాత్ములు సంయోగ వియోగములయందు హర్షశోకములను జెందరుకదా ? క్రమక్రమముగ ఎనిమిది సంవత్సరములు గడచిపోయెను. అప్పుడు ఆకచుడు ఒకానొక అరణ్యమునందు సంచరించుచుండగ బృహస్పతి అతనికి గానబడెను. తత్క్షణమే అతడు తనతండ్రిని పూజించి నమస్కారముచేసెను. ఆయనయు చిరకాలమునకు గానవచ్చిన తన పుత్రుని కౌగలించుకొనెను. ఇట్లు ప్రేమానురూపమగు వ్యవహారము ముగిసిన పిమ్మట కొడుకు తండ్రిని జూచి ఇట్లనియె. ఓతండ్రీ! నేను కలదానినెల్ల విడిచి ఇప్పటికి ఎనిమిది సంవత్సరములైనది. అయినను నాకు సర్వోత్తమమగు చిత్తవిశ్రాంతి దొరకలేదు.

ఓ రామచంద్రా ! ఇట్లు కచుడు దీనుడై పలికిన విని పుత్రుడా !
సర్వత్యాగమునే ఆచరింపుము. అని చెప్పుచు ఆ బృహస్పతి స్వర్గమునకు
పోయెను. ఇట్లు బృహస్పతి వెళ్ళిపోగానే ఆ కచుడు " ఇంకను విడువవల
సినది ఏది కలదు. దేహముమీద వల్కలములు ఉన్నవి. కుటీరము ఉన్నది.
ఇంకను కొన్ని పరికరములు ఉన్నవి. వీనిని గూడ విడిచెదను గాక " అనుచు
వానిని అన్నిటిని వర్జించి దిగంబరిగనై నిలచెను. సూర్య నక్షత్ర చంద్రా
దులు లేని శరత్కాల ఆకాశమువలె శుభ్రుడై ఉండెను. ఇట్లు విహరింపు
చుండియు చిత్తశాంతిని గానక దుఃఖపడుచుండ మఱల మూడు సంవత్సర
ములు గడచెను. అప్పుడు మఱల ఒక వనమునందు అతనికి తండ్రి గాన
బడెను. అప్పుడు ఆబృహస్పతికి నమస్కరించి పూజచేసి గద్గద స్వరము
తో ఇట్లనియె. ఓ తండ్రీ ! బొంత, వెదురుకఱ్ఱ, మొదలగు వానిని అన్ని
టినిగూడ పరిత్యజించితిని. ఇప్పటికిని నాకు స్వస్వరూపమునందు విశ్రాంతి
దొరకలేదు. ఇకను ఏమి చేయుదును ? అని అడిగిన బృహస్పతి ఇట్లనియె.

శ్లో॥ చిత్తం సర్వ మితిప్రాహు స్తత్త్యక్త్వా పుత్ర రాజసే ।
చిత్తత్యాగం విదు స్సర్వ త్యాగం సర్వవిదో జనాః ॥

ఓ వత్సా ! కుమారా ! చిత్తమే సర్వము. దానిని విడుచుటయే
సర్వత్యాగము. ఇంతయేకాని చిత్తమును అట్లేయుంచి దేనిని విడిచినను
సర్వత్యాగము కానేరదు. ఇదియే మహాత్ములయొక్క అభిప్రాయము.
కావున చిత్తమును పరిత్యజించితివేని నీవు సుఖమును జెందెదవు. ఓ రామ
చంద్రా! ఆ బృహస్పతి ఈవిధముగ పుత్రునకు పరమార్థమును ఉపదేశించి
స్వర్గమునకు పోయెను, అంత ఆ కచుండును, దృఢప్రయత్నముతో చిత్త
పరిత్యాగమునకై ప్రయత్నింప నారంభించెను. అయితే అతడు ఎంతవిచా
రించినను చిత్తమును తెలిసికొనలేక పోయెను. చిత్తస్వరూపమును తెలిసికొ
నిన పిమ్మటకదా దానినిపరిత్యజించుటకు ఉపాయమును వెదకికొనుట. ఇట్ల
గుటచేత ఆ కచుడు విసుకు చెందకయే ఈక్రిందివిధమున విచారింపసాగెను.

—* కచుని ఆలోచన. *—

దేహము, వల్కలములు, గృహములు, మొదలగునవి చిత్తము
కాదు. వానివలన నాకు వచ్చిన కీడును లేదు. ఇట్లు నిరపరాధులైన వస్త్రా
దులను ఏల విడువవలయును. ఇక చిత్తము ఏదియో నాకు తెలియలేదు.
అదియేకదా నాకు శత్రువు. దానియొక్క స్వరూపము తెలిసికొనుటకై
తండ్రివద్దకు పోయెదను. దానిస్వరూపమును ఎఱిగి పిమ్మట దానిని పరిత్య

ఇంచెదను. సుఖినై యుందును. ఓరఘునందనా! శ్రీరామా! ఇట్లునిశ్చయించి ఆ కచుడు గురువగు తన తండ్రి వద్దకు బోయి నియతుడై ఇట్లని ప్రశ్నించె. ఓ తండ్రీ! చిత్తమనగా, ఏదియో నాకు తెలియలేదు. చిత్త స్వరూపమును దయతో ఎఱిగింపుడు. అనిన బృహస్పతి ఇట్లనియె. ఓ పుత్రుడా! చిత్తమనగా, అహంకారమే అని పెద్దలు చెప్పుదురు.ప్రతివారి మనస్సునందును “ నేను, నేను ” అని పుట్టు అభిప్రాయము ఏదికలదో, అదియే చిత్తము. అనిచెప్పిన కచుడు ఇట్లనియె. ఓ మహాత్మా! తండ్రీ దీనిని విడుచుట మిక్కిలి దుష్కరమని తోచుచున్నది. ఓ యోగిశ్రేష్ఠా! తండ్రీ! దానిని విడుచు ఉపాయము ఎట్లు. అని అడిగిన బృహస్పతి ఇట్లనియె. ఓ పుత్రుడా! అహంకార పరిత్యాగమునందు శ్రమ ఇంచుకయైనను లేదు. పువ్వుల రేకును చీల్చుటకంటెను కన్ను మూయుటకంటెనుగూడ అహంకార పరిత్యాగము సులభము. అది ఎట్లనిన, వినుము. అద్వితీయమైనదియు, ఆద్యంతములు లేనిదియు, జ్ఞానమాత్ర రూపమైనదియు, నిర్మలమైనదియు, ఆకాశమునకంటె మిక్కిలి స్వచ్ఛమైనదియు, నగు పరబ్రహ్మము ఒక్కటియే ఎప్పటికిని కలదు. ఇదియే సర్వానుభవ సిద్ధమగు జ్ఞానము. ఆ పరమాత్మ తత్వమునే భావించుచు శోకరహితుడవై ఉండుము. ఈ తత్వభావనవలన మిథ్యా రూపమగు ఆ అహంకారము స్వయముగనే అణగి పోవును. ఓ పుత్రుడా! ఇట్టి నిర్వికారమగు పరమాత్మ తత్వమే ఎప్పటికిని కలిగియుండగ, ఈఅహంకారము ఎక్కడనుండి వచ్చును. ఎందు జనించును. నీటిలోనుండి మన్ను పుట్టుట ఎందైన గలదా ? అగ్నిహోత్రమునుండి జలము పుట్టునా ? పరస్పర విరోధమగుటచేత అట్లు కలుగనేరదు కదా ? అట్లే పరమేశ్వరుడును నిర్వికారుడగుటచేత అతనినుండి సవికారమగు అహంకారము పుట్టలేదు. కావున కేవల భ్రాంతిసిద్ధమై “ నేను బ్రాహ్మణుడను, నాపేరు కచుడు ” అను మొదలగు స్వరూపము కలిగియున్న అహంకారమును విడువుము. ఇది మిక్కిలి తుచ్ఛమైనది. దిక్కులు, కాలము, మొదలగు విభాగములచేత కలుషమైనది. దీనిని విడువుము. ఈ పరిచ్ఛిన్నమైన అహంకారమును విడిచి “ పరమేశ్వరుడనే నేను ” అను పరిపూర్ణమైన అహంకారమును ఆశ్రయింపుము. ఓ పుత్రుడా! వాస్తవస్థితిలో నీకు దిక్కాలాది విభాగములు లేవు. నీవు నిర్మలుడవు. ఉదయాస్తమయములు లేక, సర్వకాలములయందును ఒక్కతీరుగనే ఉండువాడవు. సర్వవ్యాపకుడవు. సర్వ స్వరూపుడవు. అద్వితీయుడవు. జ్ఞానమాత్ర రూపుడవు. పరబ్రహ్మమవు. ఇంతయే కాని, బ్రాహ్మ

ణుడవు, కదుడవు, ఏదియో ఒక వయస్సు కలవాడవు, ఏదియో ఒక రూపము కలవాడవు, ఒక ప్రదేశముననమాత్రమే ఉండువాడవును కావు. కావున ఈ అభిమానమును వదలి బ్రహ్మాత్మాభిమానమును కలిగి ఉండుము. ఇదియే అహంకార పరిత్యాగము. చిత్తపరిత్యాగము. సర్వపరిత్యాగము. చిత్తశాంతి. ముక్తి. అని గురువు చెప్పిన కచుడు విని ఓ శ్రీరామచంద్రా! పిమ్మట ఆ కచుడు బ్రహ్మభావనమును ఆచరించి జీవన్ముక్తుడయ్యెను. అహంకార మమకారములులేక, సర్వ సంశయములును విచ్ఛిన్నములగుటచేత శాంతి కలిగి ఆ కచుడు ఏరీతిగా నుండెనో ఓ శ్రీరామా! నీవును ఆరీతిగనే ఉండుము. అహంకారము శూన్యరూపమే అని తెలిసికొనుము. ఇదియే దానికి పరిత్యాగము. లేనిదానిని విడచుటయు, స్వీకరించుటయు, ఎక్కడనుండి వచ్చును. ఉండేటికి కొమ్మును స్వీకరించువారుకాని, విడుచువారు కాని, కొందరు కలరా? కావున సంసారదశయందు భ్రాంతివశమున ఉన్నదిగా భావింపబడుచున్న అహంకారముయొక్క తత్వస్వరూపము ఎఱుగబడుటయే దానికి పరిత్యాగము.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున కచోపాఖ్యానమను
ముప్పదియెనిమిదవ సర్గము ముగిసెను.

—*—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునితో ఇట్లనియె. ఓ భరద్వాజా! ఇట్లు కచోపాఖ్యానమును చెప్పి వశిష్ఠమహాముని శ్రీరామునితో ఇట్లనియె. ఓ రామచంద్రా! ఈ కారణమువలన నీవును భేదాభేదములను విడిచి ( భేదము ఉండిననే కాని, అభేదమనునది సంభవింపదు. కావున అభేదముకూడ పరిత్యాజ్యమే. వాస్తవస్థితిలో పదార్థము ఒక్కటియేయై యుండ అభేదమనునదిమాత్రము ఎక్కడనుండి వచ్చును. ) మిగిలినదానియందు నిలిచి శాశ్వత సుఖమును జెందుము. మిథ్యాపురుషునివలె లేనిదానిని ఉన్నదానినిగా భావించి నిరర్థకముగ దుఃఖింపకుము.

—* మిథ్యాపురుషోపాఖ్యానము. *—

అని వశిష్ఠమహర్షి చెప్పిన శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓ మునిశ్రేష్ఠా! మీ ఉపదేశమువలన నేను సంపూర్ణతృప్తిని జెందితిని నాకు దివ్యజ్ఞానము కలిగినది, అయినను మిమ్మును ఈ చిన్నప్రశ్న చేసెదను. సత్యభూతమగు బ్రహ్మము మిథ్యగాను, మిథ్యయగు ప్రపంచము సత్యము

గాను, చేసిన మిథ్యాపురుషుడు ఎవ్వడో చెప్పుడు. అని అడిగి వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓ రామచంద్రా ! మిథ్యాపురుష స్వరూపమును వివరించుటకై నేను ఒక కథను చెప్పెదను వినుము. అది నవ్వు పుట్టించును. యంత్రముచేత నిర్మింపబడి బాలునివలె అల్పబుద్ధి కలిగియున్న ఒకానొక పురుషుడు కలడు. వాడు తన మూర్ఖత్వవలననే ఆత్మాభిమానమును కలిగి ఉండెను. మూర్ఖుడై పూర్వాపరములను విమర్శింపలేక ఉండెను. వాడు చవిటి భూమిలో ఎండమావులు పుట్టినట్లు ఆకాశమునందు నీలవర్ణము కలిగినట్లు ఒకానొక శూన్యప్రాయమగు ఏకాంత స్థలమున జనించెను. అచ్చటనే ఉండెను. కావున బాగుగ విచారించినచో అచ్చట స్వస్వరూపమున కంటె భిన్నమగు పదార్థము ఏదియు లేదు. అచ్చట కలది తన స్వరూపమే. తనకంటె భిన్నముగ ఏదియో ఒకటి కలదని తోచినను అది స్వస్వరూపమునకంటె అన్యము కానేరదు. ఇట్లున్నను ఆ యంత్రమయ పురుషుడు బుద్ధిహీనుడు అగుటచేత ఆ యథార్థతత్త్వమును ఎఱుగలేక ఉన్నాడు. ఇట్టి ఆ పురుషుడు అభివృద్ధి అగుకొలది అతనికి ఇష్టపదార్థము సంపాదించి రక్షింపవలయునను తలంపు కలిగెను. ఇట్లు తలంచి తన ఎదుటనున్న ఆకాశమును తనకు వలసినంతవఱకు సంపాదించి దాచి పెట్టవలయునను ఉద్దేశముతో ఒకగృహమును కట్టెను. సర్వవ్యాపకమగుటచేత ఆకాశము అందును ప్రవేశించెను. దానినిచూచి "నేను నేడు ఆకాశమును సంపాదించితిని. నా గృహమునందు పెట్టి కట్టివేసితిని. అని ఆ పురుషుడు తలచెను. అంత కొంతకాలమునకు శరత్కాలమునందు మేఘము నశించిపోవునట్లు, గాలిచేత అల నశించునట్లు, కాలక్రమమున వాని ఇల్లు నశించిపోయెను. అప్పుడు ఆ మూర్ఖుడును "ఓ గృహాకాశమా ! నీవు ఎందుబోతివి. నన్ను విడచి పోయెదవా ? అయ్యయో, నిన్ను ఎట్లు మరల సంపాదింతును" అని మితిమీరిన దుఃఖము గలవాడాయెను. ఈ విధముగ చాలాకాలము దుఃఖించి మఱల ఎట్లైనను ఆకాశమును సంపాదింప దలంచుచు ఆస్థలమునందే ఒకబావిని త్రవ్వెను. దానిలోగూడ సర్వవ్యాపకమగు ఆకాశము ప్రవేశింపగనే "నాకు మఱల ఆకాశము దొరకెను" అనుచు దానిపై ప్రేమ కలిగి యుండెను. తర్వాత కొంతకాలమునకు ఆ బావియు పూడిపోయెను. అప్పుడు "ఓ బావియందున్న ఆకాశమా ! నన్ను విడిచి పోతివా" అనుచు అతడుమిక్కిలి దుఃఖించెను. ఇట్లు దుఃఖించి దుఃఖించి దుఃఖముచల్లారిన పిమ్మట ఒక కుండను నిర్మించెను. దానియందు ప్రవేశించిన

ఆకాశముపై అభిమానమును ఉంచి సంతోషించుచుండెను. ఓరామచంద్రా! కొంతకాలమునకు ఆకుండయు పగిలిపోయెను. దౌర్భాగ్యవంతులకు ఏది నిలుకడగా నుండును? దేనిని ఆశ్రయించినను అదియెల్లను చెడిపోవు చునే ఉండును కదా. ఇట్లు కుండ నశింపగానే అందలి ఆకాశము పోయె నని మిక్కిలి దుఃఖించి దుఃఖించి మరల ఆకాశమును రక్షింపవలయుననను ఉద్దేశముచేత ఒకక్క హామకుండమువంటి చిన్నపల్లమును చేసి దాని యందు ప్రవేశించిన ఆకాశమును జూచి దానిని తానే రక్షించు చున్నట్లు తలపోయు చుండెను. ప్రకాశమానమగు సూర్యతేజస్సుచేత చీకటి నశించి పోయినట్లు కొంతకాలమునకు ఆకుండమును చెడిపోయెను. అప్పుడును ఆయంత్రమయ పురుషుడు అందలి ఆకాశమునకై మిక్కిలి శోకించెను. పిమ్మట అతి విశాలమగు ఒకచావడిని నిర్మించి అందలి ఆకాశమునందు అభి మానము కలిగి ఉండెను.

అంత సర్వలోకములను సంహరించుకాలము ఆచావడినిగూడ అప హరించెను. అజ్ఞానిఅగుటచేత అందలి ఆకాశముకూడ బోయెనని ఆయం త్రమయపురుషుడు మిక్కిలి వ్యసనమునుజెందెను. ఇట్లు మహావాయువు నందు ఆకుయెగిరిపోయినట్లు ఆచావడి పోయినందుకు బహుకాలము చింతిం చియును మరల ఎట్లయిన ఆ ఆకాశమును పట్టుకొనవలయుననను తలంపు చేత మేఘములను అంటునట్లు అత్యున్నతమగు ఒకబొట్టను నిర్మించెను. ఆకాశమును ఎచ్చటికిబోకుండ రక్షించు చున్నానని తలచెను. ఇట్లుండగ గాలి మేఘమును ఎగురగొట్టునట్లు కాలము ఆబొట్టను నశింపజేసెను. ఓరా మచంద్రా! ఈవిధముగ నాయంత్రమగుపురుషుని కాలమంతయు దుఃఖమ యముగనే గడచిపోయెను. వాడు ఆకాశమును రక్షింపవలయునని ఎంత ప్రయత్నము చేసినను ప్రయోజనము లేకపోయినది కదా? ఇట్లు, బావి, కుండ, కుండము, చావడి, బొట్ట, అను మొదలగునవి ఎన్ని నిర్మింపబడినను ఆకాశము అందు నిలువక వానివినాశముతోగూడ నశించిపోవుచు ఉండెను. ఓరామచంద్రా! ఈవిధముగ వాడు అతిమూఢుడై తాను కల్పించిన రం ధ్రములతో ఆకాశమును పట్టుకొన దలంచియు పట్టుకొంటినని అభిమా నించియు, దానినే తనధనముగా సంకల్పించియు, మూర్ఖతచేత తాను గల్పించిన గృహాదులు నశించిన ఆయాకాశముగూడ నశించెనని భావించి యు, నిరర్థకముగ పలుమారు దుఃఖపరంపర నొందుచుండెను. నిర్లేపమై సర్వవ్యాపకమై ఉండు ఆకాశమును తాను గల్పించిన గృహాదులలోనికి

క్రొత్తగా వచ్చినదానిగను వాటినాశముచేత ఎచ్చటికో పోయినదానిగను, ఆగృహమునందు ఉన్నప్పుడు దానితో సంబంధము కలదానిగను, భ్రాంతిచేత భావింపుచు ఉండెను. అని వశిష్ఠమహర్షి చెప్పిన శ్రీరామచంద్రుడు ఇట్లనియె.

ఓమహాత్మా! మిథ్యాపురుషుడను పేరుతో మీరు మాయామయపురుషుని జెప్పితిరా? సరియే. ఆకాశ రక్షణమనుటకు అర్థమేమి? అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె. నిశ్చయమే. ఓరఘునందనా! శ్రీరామా! మాయాయంత్ర స్వరూపుడని చెప్పబడిన పురుషుడు అహంకారమని తెలిసికొనుము. నేనుచెప్పిన పురుషుడను శూన్యమునందు జనించినాడే. అహంకారమును అట్టిదియే. ఇకను ఆకాశ లక్షణమునుగూర్చి చెప్పెదను వినుము. ప్రకృతమునందు గానవచ్చు ఈ ప్రపంచమంతయును ఏ ఆకాశమునందు బ్రహ్మమునందు ఉన్నదో, అది ఒకటియే సృష్టికి పూర్వమునందు నిర్వికారమై ఉండెను. అచ్చటినుండియే వాయువునందు చలనము పుట్టునట్లు అహంకారము పుట్టును. అది స్వయముగ అనాత్మయే అయినను తన్ను దాను రక్షించుకొనుటకై ఒకదాని వెనుక ఒకదానినిగా దేహములను సృష్టించుచుండును. దేహనాశమునందు ఆత్మనాశము కలిగెనని తలచుచు వ్యాకులత నొందుచుండును. గృహము, చావడి, బావి, కుండ, మొదలగునవిగా వర్ణింప బడినవి దేహములే. అట్టి దేహములను నిర్మించి వానియందు సర్వవ్యాపకమగుటచేత వ్యాపించియున్న చిదాకాశమును రక్షింపబడినదానినిగా తలచుచుండును. ఆదేహములతో సంబంధము కలదానినిగాను, వానిలోనికి క్రొత్తగా వచ్చి నిలిచియున్నదానినిగాను, అవి నశించినప్పుడు వానితోగూడ నశించుదానిని గాను, తలచుచుండును. కావున నో శ్రీరామా! ఆమిథ్యాపురుషుడు ఆకాశమును తన ధనముగగాని, స్వస్వరూపముగాగాని, భావింపుచు గృహాదులను గట్టుటచేత దానిని రక్షించితినని దలంచుచు ఆగృహాదులయొక్క నాశముచేత అది నశించెనని ఎట్లు దుఃఖించెనో, ఆవిధముగ నీవు మిథ్యాభిమానమువలన దుఃఖింపకుము. ఆకాశమునకంటె విశాలుడై శుద్ధుడై, పరమానందరూపుడై, నిర్లేపుడై, శాశ్వతుడై, ఏ ఆత్మయున్నాడో, అట్టివాడు ఎవనికి చిక్కును? ఎవనిచేత రక్షింపబడును. శరీరము నశించినప్పుడు హృదయాకాశము ( మనస్సు ) మాత్రము నశించును. ( మఱి ఒకదేహమును ప్రవేశించును. ) ఇట్లుండగ జనులు మూఢులై "ఆత్మనశించెను" అను సందేహముతో దుఃఖించు

చున్నారు. ఘటాదులునశించినను అందలి ఆకాశమునశింపక ఎట్లు ఏకరూప ముతో నున్నదో, అట్లే దేహములు నశించినను దేహి సంగరహితుడై సర్వకాలములయందును ఏకరూపముతో నున్నాడు. ఈ ఆత్మ,జ్ఞానమాత్ర స్వరూపుడు. సూక్ష్మమగు ఆకాశమునకంటె సూక్ష్మరూపుడు. అనుభవ మాత్ర స్వరూపుడగుటచేత ఆకాశమువలె ఎన్నటికి నశింపడు. ఎచ్చటను ఏదియు ఎప్పటికిని పుట్టలేదు. మృతి నొందలేదు. పరబ్రహ్మము ఒకటొటి యే ప్రపంచముగ ఉన్నట్లు గానవచ్చుచు ఉన్నది. " ఇదిఅంతయును ఒకటొ టియే దీనికి ఆద్యంత మధ్యములు లేవు. భావాభావములు (కలిమిలేములు) లేవు" అని నిశ్చయించి పరమానందమును బొందుము.

శ్లో॥ సర్వాపదాం నిలయ మధ్రువ మస్వతంత్ర
మాసన్నపాత మవివేక మమాన మజ్ఞమ్ ।
బోధా దహంకృతిపదం సకలం విముచ్య
శేషే సుబుద్ధపద ఉత్తమతాం ప్రయాహి ॥

ఓ శ్రీరామా! సర్వానర్థములకు నివాసస్థానమై, వినాశశీలమై,స్వతం త్రశక్తిలేనిదై, పాపములకు చేరువయై, అజ్ఞానరూపమై, నింద్యమై, విభాగ శక్తిలేనిదై, ఉన్న అహంకార స్థానమును జ్ఞానబలముచేత నిశ్శేషముగ వదలి శేషించిన ఆత్మస్థానమునందు నిలచి లోకోత్తరుడవు కమ్ము.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున మిథ్యాపురుషోపాఖ్యానమను
ముప్పదితొమ్మిదవసర్గము ముగిసెను.

—*—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునిజూచి ఇట్లనియె. ఓభర ద్వాజా! ఈవిధముగ వశిష్ఠమహాముని శ్రీరామునితో చెప్పి మఱియు ఇట్ల నియె. ఓరామచంద్రా! వినుము. ఈప్రపంచము పరమేశ్వరునియొక్క య థార్థ స్వరూపమును మఱచుటచేతమాత్రమే త్రాటియందు పాము పుట్టి నట్లు జనించినది. దీనికి ఇంతకంటె ఇతరకారణము ఏదియు లేదు. ఒక ప్ర త్యక్షమును చూతుము. సూర్యుడును సూర్యకిరణములును ఉన్నవికదా ? ఇవి భాగుగ విచారించిన పరస్పరము భిన్నములు కావు. అయినను వేఱు గనే ఉన్నట్లు కానవచ్చుచున్నవి. మఱియు సువర్ణమునకంటె దానిచేత నిర్మింపబడిన భుజకీర్తి విచారించినచో అన్యము కానేరదు. అయినను లో

కమునందు మాత్రము దానిని సువర్ణశబ్దముతో వ్యవహరించుట లేదు. చూచితివా? కావున ఈపరమార్థమును ఎఱిగి కిరణములను సూర్యునికంటె అభిన్నములుగ నెవ్వడు చూచునో వానికి అవి సూర్యరూపములే అగును. వాడును నిర్వికల్పుడనియే చెప్పబడును. వికల్పమనగా ఒకవిధముగ ఉన్న దానిని మఱి ఒకవిధముగ భావించుటయే కదా? ఇట్లే భుజకీర్తిని సువర్ణమునకంటె అభిన్నముగ నెవ్వడు భావించునో, వానికి ఆభుజకీర్తి సువర్ణమే. వాడును నిర్వికల్పుడే. కావున నీవును ప్రపంచము బ్రహ్మరూపమగుట ఎఱిగి ఇందలి భేదములను పరిత్యజించి సర్వమును బ్రహ్మమాత్రముగనే చూచుచు ఆ పరమేశ్వర తత్త్వమునందు స్థిరుడవు కమ్ము. ఆపరమేశ్వరుడు తనంత దానే వాయువు చాంచల్యమును కలిగించుకొనునట్లు సంకల్ప శక్తిని ఏక్షణమునందు కలిగించునో, అప్పుడు తనకుదానే అన్యుడైనట్లు తోచును. తనస్వరూపమును తానే భిన్నముగ భావించును. అదియే మనస్సు. దానినుండియే ప్రపంచము పుట్టెను. కావున ఓ రామచంద్రా! ఈసర్వప్రపంచమును సంకల్పమాత్రముగ ఎఱుగుము. ఇది స్వప్నమువలె సత్యమును కాదు, మిథ్యయును, కాదు. చూచుచున్నను వినుచున్నను వ్యవహారములను చేయుచున్నను, నిదురించుచున్నను " ఇందు క్రొత్త ఏమియు లేదు. సర్వమును సత్యరూపమగు బ్రహ్మమే " అను నిశ్చయమును కలిగియుండుము. ఏది కార్యములను ఆచరించునో, ఏది ఆచరింపబడునో, అదియంతయు సర్వవ్యాపకమగు బ్రహ్మమే అను నిశ్చయమును కలిగియుండుము. వాస్తవములో విచారించిన పదార్థములన్నియు బ్రహ్మమాత్రరూపములుగానే ఉన్నవి. ఇట్లుండగ సర్వమును బ్రహ్మమేయగును గాని, మఱి ఒకటికాదు కదా. రెండవ కల్పనయే లేకపోవును కదా. ఇట్లు సర్వమును కేవల పరమేశ్వరాకారమే అగుట సంభవించుచుండ దానియందు తెలిసికొనువాడు తెలిసికొనబడునది అనువిభాగము ఎక్కడనుండి వచ్చును. బంధమోక్షములు ఎట్లు కలుగును.

శ్లో॥ మోక్షోయ మేష ఖలు బంధ ఇతి ప్రసహ్య
చింతాం నిరస్య సకలాం వికలాభిమానః ।
మానీ వశీ విగతమానమదో మహాత్మా
కుర్వన్ స్వకార్య మనహంకృతి రేవ తిష్ఠ ॥

ఓరామచంద్రా! " ఇది బంధము, ఇది మోక్షము " అను మొదలగు అభిప్రాయములను వదలి అభిమానమును వర్జించి చేయవలసివచ్చిన

కార్యములను అసంగుడవై చేయుచు మానివై జితేంద్రియుడవై నిరహంకారుడవై ఉండుము. ఓ దోషరహితుడా ! శ్రీరామా ! సర్వసంశయములను విడిచి ధైర్యమును అవలంబించి సర్వకర్తవును, సర్వభోక్తవును, సర్వత్యాగివిని, కమ్ము. అని చెప్పిన శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓమహాత్మా ! మహాకర్త మహాత్యాగి మహాభోక్త అనిన, ఏమి. ఆ పదములచేత మీరు దేనిని వర్ణించి చెప్పితిరి.

—* భృంగీశోపాఖ్యానము. *—

ఓ రామచంద్రా ! వినుము. ఈ మూడు వ్రతములను పూర్వము పరమేశ్వరుడు భృంగీశ్వరునకు ఉపదేశించెను. ఆతడును ఆ వ్రతములను ఆచరించుటచేత స్వస్థుడయ్యెను. పూర్వము ఒకప్పుడు ఈశ్వరుడు తన సర్వపరివారములతోగూడి అగ్నివలె ప్రకాశించుచున్న మేరుపర్వతముయొక్క ఉత్తర శిఖరమునందు ఉండెను. అట్టిసమయమునందు తేజస్వియగు భృంగీశుడు తత్త్వవిజ్ఞానమును గోరుచు ఆ శివునకు నమస్కరించి సవినయముగ ఇట్లనియె. ఓ మహాత్మా ! పరమేశ్వరుడా ! ఈ సంసారము అతి విచిత్రముగ విస్తరించి ఉన్నది. దీనిని చూడ చూడ నాకు చిత్రమగుచున్నది. దుఃఖమగుచున్నది. తత్త్వజ్ఞానము లేకపోవుటచేత చిత్తవిశ్రాంతి దొరకక ఉన్నది. కావున దయయుంచి నాకు తత్త్వమును ఉపదేశింతురేని ఆ నిశ్చయమును మనస్సునందు స్థిరముగనుంచుకొని ప్రపంచమను ఈ పాత ఇంటియందు పరితాపములేకనే నివసింతును. అనిఅడిగిన ఈశ్వరుడు ఇట్లనియే. ఓ భృంగీశుడా ! ఇక విశేషము ఏమియు లేదు. సంశయములను అన్నిటిని వదలి మహాకర్తవును, మహాభోక్తవును, మహాత్యాగివిని, కమ్ము. అనిన భృంగీశ్వరుడు ఇట్లనియె. మహాకర్తయనగా, ఎవ్వడు ? మహాభోక్తయనగా, ఎవ్వడు ? మహాత్యాగియనగా, ఎవ్వడు ? దానిని నాకు స్పష్టముగ వివరింపుము

—* మహాకర్తృలక్షణము. *—

అని భృంగీశుడు అడిగిన ఈశ్వరుడు ఇట్లని ఉత్తరమిచ్చెను. భృంగీశా ! వినుము. ఏమహాత్ముడు రాగద్వేషముల నొందక సుఖదుఃఖములను ఆశ్రయింపక ( అనగా, సుఖమును సంపాదింపవలయునని కాని, దుఃఖమును విడువవలయునని కాని, తలంపక. ) ధర్మాధర్మములను పాటింపక సిద్ధికి సంతోషింపక సిద్ధింపకున్న దుఃఖింపక ఎవ్వడు కర్మలను ఆచరించునో, అట్టివాడు మహాకర్త అనబడును. మానము కలిగి అహంకారమును

విడచి మదమాత్సర్యములను వర్జించి నిర్వికారుడై ఎవడు కర్మలను ఆచరించునో, అట్టివాడు మహాకర్త అగును. దేనియందును ప్రేమలేక, ఎవడు సాక్షివలె నుండునో, చేయవలసి వచ్చిన పనులయందు కోరికలేకయే కేవలము విధియను ఉద్దేశముతో మాత్రమే ప్రవర్తించునో, అట్టివాడు మహాకర్త అనబడును. సంతోషము, దుఃఖము, అనునవి లేక, నిర్మలమును, సర్వసమమును, నగు మనస్సుతో ఏమహాత్ముడు సర్వకార్యములను చేయుచుండియు, నిర్వికారుడై యుండునో, అట్టివాడు మహాకర్త అనబడును. ఉత్పత్తి, స్థితి ప్రళయములయందును, తన జన్మ మరణములయందును, ఎవనిమనస్సు సమానమై ఉండునో, అట్టివాడు మహాకర్త అనబడును.

—* మహాభోక్తృ లక్షణము. *—

ఏమహాత్ముడు ఏపదార్థమును గాని, ద్వేషింపక దేనిని కాని, కోరక ఎప్పటికి ఏదివచ్చునో, దానిని నిర్వికార చిత్తముతో అనుభవించుచుండునో, అట్టివాడు మహాభోక్త అనబడును. మఱియును ఎవనికి సుఖమును అనుభవించునప్పుడు కాని, దుఃఖమును అనుభవించునప్పుడు గాని, సర్వజనులకును భ్రాంతికారణములై యున్న కలిమి లేములను అనుభవించుచున్నప్పుడు గాని, మనస్సు వికారము నొందదో, అట్టివాడు మహాభోక్త అనబడును. ఎవడు మునలితనము,మరణము, రాజ్యము, ఆపద, దారిద్ర్యము, అనువానిని అన్నిటిని సమానముగ జూచునో, వాడే మహాభోక్త. కారమైనను, పులుసయినను, ఉప్పయినను, చేదైనను, చెడ్డదైనను, మంచిదైనను, ఆహారమును నిర్వికారుడై ఎవడు భుజించునో, వాడు మహాభోక్త అనబడును. ఎవడు అతిశాంతుడై రసవంతమగు దానిని రసహీనమగు దానిని, రసానుగుణమగు సన్నివేశముతో గూడిన దానిని విరుద్ధ సన్నివేశముతో గూడిన దానినిగూడ సమాన దృష్టితో చూచునో, వాడు మహాభోక్త అనబడును. "దీనిని భుజింప వచ్చును, భుజింప రాదు" అను వికల్పమును వదలి ఎవడు సర్వము భుజించునో, అట్టివాడు మహాభోక్త అగును.ఆపదను గాని, సంపదను గాని, భ్రాంతిని కాని, బ్రహ్మానందమును గాని, విషయానందమును గాని, ఎవడు సమదృష్టితో అనుభవించునో, వాడు మహాభోక్త అనబడును.

—* మహాత్యాగి లక్షణము. *—

సుఖము, దుఃఖము, జన్మము, మరణము, ధర్మాధర్మములు అనువానిని మనస్సుచేత ఏమహాత్ముడు పరిత్యజించి ఉన్నాడో, అట్టివాడు మహా

త్యాగి అగును. సర్వవిధములగు కోరికలును, సర్వవిధములగు ఆటంకము లును, సమస్తవిధములగు చేష్టలును, సమస్తవిధములగు నిశ్చయములను గూడ ఎవడు పరిత్యజించునో, అట్టివాడు మహాత్యాగి అగును. ఎవనిచేత ధర్మాధర్మములును, మనస్సు, సంకల్పములు, వానివలనబుట్టు చేష్టలు, అను నవి విడువబడునో, వాడు మహాత్యాగి అనబడును. ఇప్పుడు దృశ్యప్రపంచ ము ఏది కానవచ్చుచున్నదో, అదియంతయు సంపూర్ణముగ పరిత్యజింప బడునేని, వాడే మహాత్యాగి అనబడును. ఓ రామచంద్రా! ఈ విధముగ ఆ శివుడు భృంగీశ్వరునకు ఉపదేశించెను. నీవును ఇట్లే మహాకర్తవును, మహాత్యాగి విని, మహాభోక్తవును అగుచు సుఖింపుము. సర్వకాలముల యందును ఏకరూపముగా నున్నదియు, నిర్మలమైనదియు, ఆద్యంతములు లేనిదియు, నగు పరబ్రహ్మము నేనేను, తక్కినది ఏదియును కాదు. అని ఇట్లు నిశ్చలముగా భావింపుము. నిర్లేపుడవై సర్వసముడవై పరమశాంతిని జెందుము. నిర్వికారమైనదియు, సర్వకల్పనలకును ఆధారమైనదియు, పర మాత్మమైనదియు, సర్వవ్యాపకమైనదియు, ఒక చిదాకాశము ఒక్కటియే కలదు. ఈ సర్వమును తన్మాత్ర రూపమే. ఉన్నట్లు తోచుటయే కాని, వాస్తవమున లేదు. "బ్రహ్మభిన్నముగ ఇది ఎప్పటికిని కొంచెమైనను పుట్టనేలేదు. ఇది త్రికాలములయందు లేనిదే" అని ఇట్లు నీవు దృఢనిశ్చ యమును జెంది నిస్సంశయముతో నుండుము. ఈ విధముగ నీవు అంత ర్ముఖుడవై ఉందువేని వెలుపల సర్వకార్యములను చేయుచున్నను, ఎప్పటి కిని శోకము నొందవు. ఎప్పటికిని అహంకార శూన్యుడవయ్యే ఉందువు.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున భృంగీశోపాఖ్యానమను
నలుబదియవ సర్గము ముగిసెను.

---

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునితో ఇట్లనియె. ఓ భర ద్వాజా ఇట్లు వశిష్ఠమహర్షి చెప్పిన శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓ మహా త్మా! అహంకారమను పేరుగల చిత్తము తొలగిపోయినప్పుడును తొలగి పోవ నున్నప్పుడును ఆపురుషునియందు కానవచ్చు గుఱుతులు ఏవి? ఆగుఱు తులను వివరించి చెప్పుము.

## అహంకార నాశచిహ్నములు.

అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓ రామచంద్రా! నీరు

తామర ఆకును అంటని యట్లు కామ లోభాదులు బలాత్కారముతో వచ్చియును, అహంకార రహితుని చిత్తమును బాధింపనేరవు. మఱియును నిత్యతృప్తి పరమానందము, మొదలగునవి ఎప్పుడును వానిముఖమును ఎడబాసి పోవు. అహంకారమను రూపము కల దృష్టి, చిత్తము, నశించెనని ఈ గుఱుతులచేత తెలిసికొననచ్చును. మఱియు అహంకార నాశమునందు సంస్కారములను ముడులు క్రమక్రమముగ తమంతనే శిథిలములగును. కోపము సన్నగిల్లును. మోహము మందమగును. కామము వాడిపోవును. లోభము ఎక్కడికో పరుగెత్తి పోవును. ఇంద్రియములు పూర్వమువలె విజృంభింపవు. దుఃఖము అధికమై బాధింపదు. దుఃఖములు గాని, సుఖములు గాని, పూర్వమువలె విజృంభింపవు. శోక హర్ష వేగములచేత మనస్సును సంక్షోభము నొందింపవు. హృదయమును చల్లబరుచుచు సమభావన జనించును. ఒకానొక సమయమునందు అట్టివానికికూడ ముఖమునందు సుఖదుఃఖాదులచేత కలిగిన వికారములు తోచినను తోచునుగాని, అవి మనస్సునుమాత్రము అంటనేరవు. ఇట్లు చిత్తము నశించినవాడు దేవతలకు గూడ పూజనీయుడగును. వానికి త్రిలోకములయందును దుర్లభమగు సర్వసమత్వమును వెన్నెల దొరికెను కదా? వాని శరీరమును శాంతరూపమై మనోహరమై పతివానికిని సేవింపవలయునను అభిలాషను గలిగింప జేయునదియై సర్వసులభమై ప్రకాశించును. నిశ్చలమై గంభీరమై ప్రసిద్ధమై నిర్మలమై ప్రకాశించును. కలిమి లేములతో గూడినది అయినను, అల్పమైనదైనను, అధికమైనదైనను, ఎట్టిదైనను, ఈ సంసారము అహంకార రహితునకు ఆనందమునుగాని, దుఃఖమునుగాని, కలిగింపనేరదు.

శ్లో॥ బుద్ధ్వాలోకన సాధ్యేస్మిన్ వస్తున్యస్తమితాపది ।
ప్రవర్తతేన యో మోహాత్తం ధిగస్తు నరాధమమ్ ॥

ఓ రామచంద్రా! మనస్సును కొంచెము నిర్మలము చేసి చూచినంతమాత్రమున స్పష్టమగునంతటి సులభముగనుండి, సర్వాపదలను ఒక్కమాత్రే ధ్వంసము చేయగలిగినదియై యుండి పరబ్రహ్మము ప్రకాశించుచున్నను, దానిని తెలిసికొనలేక దానివైపునకు తిరుగక సాంసారిక దుఃఖములను అనుభవించుచు అత్యల్పకార్యమునకు అనేకులు పాటుమాలి ఉన్నారు. ఛీ, వారిజన్మమేల.

శ్లో॥ విశ్రాంతి మాప్తు ముచితాం చిరసంగదుఃఖ
రత్నాకరం జననసాగర ముత్తితీర్షోః ।

కోఽహం కథంజగదిదంచ పరశ్చ కస్స్యా ద్

ఇత్యంభోగకై రితి మతిః పరమాఽభ్యుపాయః ॥

ఓ శ్రీరామా! అనాదినుండియు సాంగత్యమువలన కలిగిన బహుదుఃఖములకు ఆకరమై యున్న ఈసంసార సముద్రమును దాటి సుఖింప దలచువానికి “ నేను ఎవ్వడను ? ఈ ప్రపంచము ఎట్టిది ? పరతత్త్వము ఎద్ది ? భోగములతో ఏమి ప్రయోజనము ? అను తలంపే శ్రేష్ఠమగు తారణోపాయము. ఇట్టి తలంపుగలవాడు విచారవశముచేత క్రమముగ ముక్తుడగును.

—* ఇక్ష్వాకు ఉపాఖ్యానము. *—

ఓ శ్రీరామా! మీకు మూలపురుషుడగు ఇక్ష్వాకు మహారాజు ముక్తిని జెందిన విధమును-వివరించెదను వినుము. ఆ ఇక్ష్వాకు మహారాజు తనరాజ్యమును పరిపాలింపుచుండి ఒకనాడు ఏకాంతముగ కూర్చుండి ఇట్లని విచారించెను. జననము, ముసలితనము, మరణము, సుఖదుఃఖములు, మొదలగునవి ఈ ప్రపంచమునందు వచ్చినవే మరల మరల వచ్చుచున్నవి. వీనిసంచారమే ప్రపంచము. దీనికి కారణము ఏమి ? ఇది ఎక్కడనుండి పుట్టినది? అని ఎంతో ఆలోచించినను ఆ ప్రభువునకు ప్రపంచకారణము తెలియలేదు. తుదకు ఒకనాడు ఆతని సభకు బ్రహ్మలోకమునుండి మనుప్రజాపతి వచ్చెను. ఆతడు తన సంశయమును తీర్చునను సంతోషముచేత ఉప్పొంగుచు పూజా నమస్కారాదులచేత ఆయనను గౌరవించి ఇట్లనియె. ఓమహాత్మా! దయామయా! మీఅనుగ్రహమే నన్ను ఒక సాహస కార్యమునందు నియోగించు చున్నది. గౌరవనీయులగు మిమ్ము సాహసినై ఒక ప్రశ్న చేయబోవుచున్నాను. ఈ ప్రపంచము ఎక్కడనుండి పుట్టినది? దీని స్వరూపము ఏమి? ఇది ఎంతకాలము ఉండును? ఎప్పుడు పుట్టినది? ఎవనిచేత పుట్టింప బడినది ? ఈవిషయములను అన్నిటిని నాకు సవిస్తరముగ ఉపదేశింపుడు. మఱియును ఈ ప్రపంచమునకు అధికారి ఎవ్వడో, వాని స్వరూపమునుకూడ వివరింపుము. ఇదియును గాక, ఈసంసారము భ్రాంతిసిద్ధమువలె కానవచ్చుచున్నది. అయినను, దుఃఖ పరంపరల గలిగించు చున్నది. దట్టమగు వల నుండి యుక్తిగల పక్షి తప్పించుకొని పోవునట్లు నేను ఈసంసారమును బాసి ఎట్లు పోగలుగుదును ? సంసారనాశము కాకున్న పరమానందము లేదు కదా! అని అడిగిన మనుప్రజాపతి ఇట్లనియె.

ఓ మహారాజా ! నేను ఎన్నిమాఱులో ఇచ్చటికి వచ్చిపోవుచుంటిని కాని, నీవుమాత్రము ఎన్నడును ఇట్టి ప్రశ్నమును అడిగి యుండలేదు.

ఆహా, చిరకాలమునకు నీవివేకము అభివృద్ధినొంది సారభూతమగు ఈప్రశ్నమును చేయునట్లు చేసెను. మిక్కిలి సంతోషమైనది. ఈ ప్రశ్నమునకు ఉత్తరముగ జెప్పవలసినది పరమాత్మ తత్వమును గూర్చియే. ఓమహారాజా! ఈకానవచ్చునది అంతయు గంధర్వ నగరమువలెను, ఎండమావులయందలి నీటివలెను, ఊరక ఉన్నట్లు గానవచ్చు చున్నది. ఇంతయే కాని, ఇందు వాస్తవమగు పదార్థము కొంచెమైనను, లేదు. ఇక ఇదియంతయు వాస్తవస్థితిలో ఏది అనియెద వేమో వినుము. జ్ఞానేంద్రియములు అయిదింటికిని ( చెవు, చర్మము, కన్ను, నాలుక, నాసిక, అను ఈఅయిదును శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను తెలిసికొనునవి అగుటచేత జ్ఞానేంద్రియములు అనబడును. ) మనస్సునకును, గోచరముగాక ఎప్పటికిని నాశము నొందక ఏపదార్థము వెలుగుచున్నదో, అదియే ఈకానవచ్చుదానికి పారమార్థిక రూపము. అదియే సత్తనియు, ఆత్మయనియు, జెప్పబడును. ఓ. ఇక్ష్వాకుమహారాజా! బహువిధములగు భేదములతో గానవచ్చు నీప్రపంచము అంతయును సర్వవ్యాపకమగు ఆబ్రహ్మమునందే ప్రతిబింబించి ఉన్నది. అది ఎట్లనిన; పరబ్రహ్మము ప్రకాశమాత్ర స్వరూపము. ప్రకాశమునకు ఒకవిధమగు చాంచల్యము స్వభావముగ ఉన్నది. ఇది లోకప్రసిద్ధము. సన్నరంధ్రమునుండి సూర్యకిరణము లోనికి ప్రవేశించినప్పుడు దానిలో సన్నని అణువులు కొన్ని ఎగురుచున్నట్లు గానవచ్చుటను మనము ప్రత్యక్షముగనే చూచు చున్నాము కదా ? ఈవిధముగనే బ్రహ్మ ప్రకాశమునందును అట్టిశక్తులు కొన్ని గలవు. ఇది స్వాభావికము. దీనినిగూర్చి పైన ప్రశ్నించుటకు అవకాశము లేదు. అట్టి శక్తులలో కొన్ని బ్రహ్మాండము అగుచున్నది. మఱికొన్ని బ్రహ్మాండములోపల నివసించు భూతసముదాయము అగుచున్నది.

శ్లో॥ నబంధోస్తి నమోక్షోస్తి బ్రహ్మైవాస్తి నిరామయమ్ ।
నైక్య మస్తి నచద్విత్వం సంవిత్స్ఫారం విజృంభతే ॥

ఓమహారాజా! బంధమును లేదు. మోక్షమును లేదు. అంతయు బ్రహ్మమే. జీవుడు బ్రహ్మముతో ఐక్యము నొందుటయు లేదు. భేదముగానుండుటయు లేదు. సర్వమును చిన్మాత్రమే. అదియే ఇన్నివిధముల వెలుగుచున్నది.

శ్లో॥ ఏకం యథా స్ఫురతి వారి తరంగ భంగ్యా
రేవంపరిస్ఫురతి చిన్నచ కించి దేతత్ ।

త్వంబంధ మోక్షకలనే ప్రవిముచ్యమారే
స్వస్థోభవాభవ భయోఽభయసారఏవ ॥

ఓమహారాజా ! సముద్రము ఒకటియేయై యుండియు అలలు, నురుగు, మొదలగువానిచేత అనేక భేదములతో ఎట్లు గానవచ్చుచున్నదో, అట్లే ఈబ్రహ్మము తన శక్తులయందలి భేదములతో ప్రపంచరూపమున విజృంభించుచున్నది. కావున నీవు బంధ మోక్షాది రూపములగు సంకల్పములను పరిత్యజించి బ్రహ్మరూపుడవై బ్రహ్మమునే ఆత్మగా భావించుచు స్వస్థుడవై నిలువుము. సంసార భయమును విడువుము. అనిచెప్పి మఱియు మనువు ఇట్లనియె. ఓమహారాజా ! బ్రహ్మమాత్రములగు ఆశక్తులు సంకల్పించుటకు ఉపక్రమింపగానే నీరు తరంగములైనట్లు జీవరూపము దాల్చును. తర్వాత ఆజీవులు పూర్వమునందు పుట్టిన సంసారమునందు తిరుగులాడుదురు. సుఖదుఃఖములును భ్రాంతియు మనస్సునందు మాత్రమే కలవు గాని, ఆత్మయందు లేవు. మనము స్వతంత్రించి రాహువును చూడలేము. అయినను ఆరాహువు గ్రుచంద్ర గ్రహించినప్పుడు ( చంద్రగ్రహణకాలమునందు ) ఆచంద్రునితో గూడుటచేత గానవచ్చుచున్నాడు. ఇట్లే ఆత్మయు స్వయముగ అదృశ్యుడేయైనను దృశ్యపదార్థములతో జేరి కానవచ్చుచున్నాడు. కావున ఈ ఆత్మయొక్క యథార్థస్వరూపము ఎన్నిశాస్త్రములను విచారించినను తెలియునదికాదు. ఆయన అనుభవమాత్ర స్వరూపుడగుటచేత తన్ను తానే తనబుద్ధిచేతనే తెలిసికొనవలయును. ఎవనికైనను బుద్ధి ప్రసన్నమయ్యెనేని కామాది వికారములను పరిత్యజించి సత్వగుణమునందు నిలచెనేని వానికి స్వస్వరూపము తనంతనే ప్రకాశించును. త్రోవ నడుచునప్పుడు తనతో కలుసుకొనిన బాటసారులను పురుషుడు రాగద్వేషాదులులేని బుద్ధితో ఎట్లుచూచునో, అట్లే " తనవి " అని అభిమానింపబడుచున్న ఈ ఇంద్రియాదులగూడ జూడవలయును. సత్పురుషుడగువాడు ఈ ఇంద్రియములను ఆదరింపను గూడదు. తిరస్కరింపను గూడదు. ఎట్లున్నవి అట్లే యుండనిమ్ము. ఆ ఇంద్రియములతో విద్వాంసునకు పని ఏమియు నుండరాదు. అవి ఏమి ఆచరించినను అందు విద్వాంసునకు ఆత్మాభిమానము ఉండకూడదు. కావున ఓమహారాజా! నీవును దేహాదిరూపములగు ఈ సర్వపదార్థములను బుద్ధిచేత పరిత్యజించి చల్లని మనస్సుకలవాడవై ఆత్మరూపుడవై సర్వకాలమునందును సుఖింపుము. " దేహమే నేను " అను బుద్ధి ఒకటియే సంసారమునకు మూలమై ఉన్నది. మోక్షే

చ్ఛగలవాఁడు దీనిని ఎప్పటికిని ఆదరింప కూడదు. "నేను ఏమియుఁగాని పరమాత్మను, దివ్యవిజ్ఞాన స్వరూపుడను" అను నిశ్చయమే సంసారమును ధ్వంసము చేయునది. మోక్షేచ్ఛ గలవానికి ఇదియే శాశ్వతమై ఉండవలయును. నిర్మల జలములకు వెలుపలను లోపలను సూర్యతేజస్సు ఏవిధముగ నుండునో, అట్లే ఆత్మయు ఈ ప్రపంచమునకు లోపలను వెలుపలను ఉన్నాడు. భుజకీర్తులు, హారములు, కుండలములు, మొదలగునవి సువర్ణము యొక్క సన్నివేశ భేదములుమాత్రమే (పనిలోని భేదములు మాత్రమే, అనగా, ఆసువర్ణమునకు గలుగజేయు ఆకారములోని భేదములు మాత్రమే.) అయినట్లు, పదార్థముతో ఏమియు భేదము లేక, సర్వము సువర్ణమే అయినట్లు ఈ ప్రపంచమంతయును పరమేశ్వరునియొక్క సన్నివేశభేదము మాత్రమే. పదార్థస్థితిలో భేదము కొంచెమైనను లేదు. మఱియు భూతములను అలలతోఁగూడిన ఈప్రపంచనదులు వినాశమను బడబాగ్నితోఁగూడిన ప్రళయకాల సముద్రమునందు ఎడతెగక గలియుచున్నవి. ఆసముద్రము మాత్రము ఇప్పటికిని నిండలేదు. ఇట్టి మహాగంభీరమగు కాలసముద్రము తన అరచేతిగుంటలో ఇమిడ్చుకొని ఆచమనము గావించిన పరమేశ్వరుడను అగస్త్యమహర్షిని మనస్సునందు భావింపుము. ఆ అగస్త్యమహర్షి నీవే. ప్రతివానికిని స్వస్వరూపమే బ్రహ్మము కదా. దేహాది రూపమగు అనాత్మ పదార్థ సమూహమునందు ఇంతవరకును నీకు ఆత్మభావన యుండెను. ఓ ఇక్ష్వాకుమహారాజా! దానిని విడచి సత్వగుణమును అవలంబించి తత్వమును తెలిసి అదృశ్యుడవై సుఖముగ ఉండుము. ఈదృశ్య పదార్థమునకు నీవు సాక్షివిగాని, నిన్ను దీనిలో ఒకటియు తెలిసికొనఁ నేరదు. బాగుగ విమర్శించిన ఇంద్రియములకు అగోచరుడవు అగుటచేత నీవు అదృశ్యుడవే కాని, దృశ్యుడవుకావు. వాస్తవస్థితిలో పరమేశ్వరుడు తనస్వస్వరూపమే అయి యుండగ ఆయనకై వెదకుటకంటె వెఱ్ఱితనము కలదా? అయినను అజ్ఞాన ప్రభావమువలన జనులుమాత్రము అట్లే చేయుచున్నారు. తనప్రక్కయందు పరుండి నిదురించుచున్న పుత్రుని మఱచి వానికై శోకించు తల్లివలె స్వస్వరూపముగానున్న పరమేశ్వరుని మఱచి ఆయనకై పరితపించు చున్నారు. గ్రంథములలో వెదకికొనుచున్నారు. ఆత్మ జరామరణ రహితుడై యుండగ ఆఆత్మను తెలిసికొనలేక శరీరమునకు ఆపదరాగానే "ఆహా, నేను చెడిపోతిని. నాకు దిక్కులేరు. నేను చచ్చిపోవుచున్నాను" అని శోకింపుచున్నారు. వాస్తవస్థితిలో బ్రహ్మాభిన్నమగు

నది ఒక్కటియు లేదు. జలము చాంచల్యముచేత అలలు బుద్బుదములు మొదలగు రూపములతో ఎట్లు గానవచ్చుచున్నదో, అట్లే ఆత్మయు చలనముచేత ప్రపంచాది రూపముతో గానవచ్చుచున్నాడు. కావున నీవు చిత్తమును మొట్టమొదట సంకల్పశూన్యమును గావించి పరబ్రహ్మమును దెలిసి సర్వసందేహ వర్జితుడవై వ్యవహారకాలమునందు ఒకవేళ దానికి చాంచల్యము కలిగినను అది ఆత్మకు కలిగెనని మిథ్యాభావన లేక, స్వస్థుడవై సుఖింపుము. రాజ్యమును పరిపాలింపుము. మనస్సు చేయు వ్యవహారములకును నీకును సంబంధము లేదు. మఱియును ఆ పరమేశ్వరుడు సృష్టిరూపములగు చలనములచేత నానాభేదములుగల ఈప్రపంచమునువిస్తరింపజేయుచు ఆ పరమేశ్వరుడు బాలకునివలె క్రీడించును. అంతమునందు సంహారరూపములగు సంకల్పములచేతసర్వమును నశింపజేసి ఏకరూపుడై నిలుచును. బాలకుడు ఆటలాడుకొనిన పిమ్మట ఆఆట వస్తువులను పారవేసినట్లు బ్రహ్మముగూడ ప్రపంచమును కొంతకాలమునకు ఉపసంహరించును. ఇందు ప్రపంచ సంస్థానమే బంధము. అదిలేకపోవుటయే మోక్షము అగుననుటకు సంశయములేదుకదా ? ఈ రెంటికిని కావలసిన శక్తులు ఆ బ్రహ్మమునకు స్వాభావికములే కాని, క్రొత్తగావచ్చునవి కావు. బాగుగ విచారించిన ఈబంధ మోక్షములు కాని, వీనికి గారణములగు ప్రపంచ తదభావములు కాని, వానికి సంబంధించిన సృష్టి ప్రళయ శక్తులు కాని, బ్రహ్మాభిన్నములుగ లేవు. చంద్ర సూర్యాగ్ని ప్రకాశములు ప్రతిఫలించినప్పుడు ఇనుము రత్నములు మొదలగువానియందు ఉజ్వలములై ప్రకాశించు స్వాభావిక కాంతులవలెను, వృక్షములయందు స్వాభావికములయ్యె యుండియు తద్భిన్నములుగ వ్యవహరింపబడు ఆకులు మొదలగు వానివలెను, జలమాత్రములే అయ్యును ప్రవాహాభిన్నములుగ వ్యవహరింపబడు జలకణములవలెను, ఈ ప్రపంచమంతయును బ్రహ్మాభిన్నముగ వ్యవహరింప బడుచున్నది. బ్రహ్మమే అయ్యు ఆ బ్రహ్మముకంటె అన్యమై యున్నది. అజ్ఞానులకు దుఃఖరూపమై ఉన్నది. ఆహా, ఈ మాయ ఎంత చిత్రమైనది. ఇది సర్వ ప్రపంచమును మోహింపజేయుచున్నది. ఎంత వివేకియైనను తనకు శరీరభూతుడై యున్న ఆత్మనే ఎఱుగలేక ఉన్నాడు కదా. కావున మిథ్యాభావనమును విడిచి ఏమహాత్ముడు ఈ సర్వమును చిదాకాశమాత్రముగా జూచునో, వానికి ఆ పరబ్రహ్మమే కవచమగును. వానికి నిత్యసుఖము కలుగును. ఓ ఇక్ష్వాకు మహారాజా ! అట్టిభావన కుదురుటకు ఏది ఉపాయము అని అనిమెదవేమో,

వినుము. మొట్టమొదట అహంకారమును పరిత్యజింపవలయును. మనస్సును శూన్యముగా భావింపవలయును. మనస్సు శూన్యమైన సర్వమును శూన్యమే అగును. కావున అప్పుడు ప్రపంచమునంతయును బ్రహ్మమాత్రమునుగా భావింపవలయును. “ఇది మనోహరమైనది, ఇది మనోహరమైనది కాదు” అను తలంపే సర్వ దుఃఖములకును కారణము. ఆ తలంపువలన రాగద్వేషములు “ఇది మనోహరమైనది, కావున నాకు కావలయును. ఇది మనోహరమైనది కాదు. కావున నాకు అక్కఱలేదు” అను రూపముతో కలుగును. వానివలననే క్రోధాదులు ఉత్పన్నములై బుద్ధి నాశమును కలిగించును. అప్పుడు ఉచితానుచిత వివేకము చెడిపోవును. సర్వదుఃఖములకును ఇదియే ఆధారము కదా? కావున సర్వపదార్థములను సమదృష్టితో చూడగలిగిన ఇక దుఃఖము పుట్టుటకు అవకాశము ఎక్కడనుండి వచ్చును. సర్వమునకును పరమానందరూపమగు బ్రహ్మమే పారమార్థికరూపమై ఉండగ వస్తువులలో పరస్పర భేదము ఎట్లు కలుగును. కొన్ని రమ్యములై మఱికొన్ని ఎట్లు రమ్యములు కాకపోవును? కావున పదార్థములను రమ్యములనియు రమ్యములు కావనియు దలచుట భ్రాంతియే కాని, మఱి ఏదియు కాదు. ఇట్లగుటచేత ఓ ఇక్ష్వాకుమహారాజా! నీవు తత్త్వజ్ఞుడవై సంకల్పాభావమనియెడు అస్త్రమును సిద్ధపఱచుకొని దానిచేత రమ్యారమ్య భావనను లోలోన ఛేదింపుము. వెలుపలికి వ్యవహారకాలమునందు ఒకవేళ అట్టి భేదభావన వచ్చినను అది అభినయమాత్రమే అగును కాని, పారమార్థికము కానేరదు. పారమార్థికము కాకున్నను నీముక్తికి ఇంచుకయైన భంగమును కలిగింపనేరదు. కావున ఓ మహారాజా! సమస్తకర్మలకును, సర్వసంసారమునకును, కారణమగు సంకల్పమును నిస్సంకల్ప శస్త్రములచేత ఛేదించి సుఖింపుము. సంకల్పములు సంపూర్ణముగ నశించుటకు వీలులేదు కదా, అని అనియెదవేమో అవి సంపూర్ణముగ నశింప నక్కఱలేదు. సన్నగిలినం జాలును. పూర్వమువలె చిత్తవిక్షోభమును గలిగింపక ఊరక అభినయమాత్రములై ఉండుటయే సన్నగిల్లుట. ఈ విధముగ సర్వతత్త్వార్థమును ఎఱిగి పరిచ్ఛిన్నత్వమును (నేను క్షత్రియుడను, ఒక్కడను, నాకంటె ఇతరముగ అనేక జీవ సముదాయము ఉన్నది అను తలంపును) విడిచి “నేనే సర్వపరిపూర్ణుడను” అను జ్ఞానమును దృఢముచేసి ప్రపంచరూప సంకల్పములను పరిత్యజించి బ్రహ్మప్రపంచములను వేఱుచేసి సాక్షియగు బ్రహ్మమే నిజస్వరూపముగ దెలిసి పరమానందరూపమగు బ్రహ్మమే తన చాంచల్య

శక్తివలన ప్రపంచ మయ్యెనని గ్రహించి నిర్వికారుడవై శాంతుడవై సర్వసముడవై స్వచ్ఛుడవై మోక్షరూపమగు పరమేశ్వరుడే ఆకారముగా గలవాడవై జీవన్ముక్తుడవై సుఖింపుము.

—✱ జ్ఞాన భూమికలు. ✱—

అని ఇట్లుమనుప్రజాపతి చెప్పి ఇక్ష్వాకుమహారాజును జూచి మఱియును ఇట్లనియె, ఓ ఇక్ష్వాకుమహారాజా ! ఇక ఈ పరమపదము చేరుకుటకు సోపానములను వివరించెదను. శాస్త్రవిచారము, సత్పురుష సమాగమము మొదలగువానిచేత మొట్టమొదట బుద్ధిని అభివృద్ధిచేసికొన వలయును. ఇది మొదటిమెట్టు. శాస్త్రాదులవలన తత్వమును విచారించుట, రెండవమెట్టు. “ నేను సర్వసాక్షిని నాకు ప్రపంచముతో సంబంధము లేదు ” అని తలంచుచు సంకల్పము దృఢముచేసికొనుట, మూడవమెట్టు. ఏ సంకల్పమును లేక, సర్వవాసనలను నాశమునొందించుట నాలుగవమెట్టు. శుద్ధ బ్రహ్మానందమును సమాధియందు ఉండి అనుభవించుట అయిదవమెట్టు. దీనిని అధిరోహించిన జీవన్ముక్తుడు నిదురించియు నిదురింపనివానివలె సర్వవ్యవహారమును చేయుచుండియు, చేయనివాడై ఉండును, నిదురించువాని స్థితివలె సంకల్పశూన్యమై దృశ్యపదార్థములను గ్రహించుట, భావించుట, అనునదియే లేక, కేవల పరమానందరూపముతో నిలకడగనుండుటఆరవమెట్టు. ఈమెట్టు శాంతిస్వరూప మైనది. ఇదియే తుర్యావస్థ. ఇదియే జీవన్ముక్తి. సర్వసమత్వము, నిర్మలత్వము, శాంతత్వము, అనునవియె సప్తమభూమిక. ఇదియె తుర్యాతీతావస్థ. దీనికి విదేహముక్తియే స్వరూపము. ఈ స్థితి మిక్కిలి గొప్పది. ఇది శరీరముతో గూడియున్నవారికి సాధ్యము కాదు. ఇందు మొదటి మూడుభూమికలును జాగ్రదవస్థ అనబడును. ఆ భూమికలయందు ప్రపంచము స్పష్టముగనే తోచుచుండును. కావున వానికి ఈపేరు కలిగినది. నాలుగవ భూమిక స్వప్నావస్థ అనబడును. అందు ప్రపంచము స్వప్నకల్పమై ఉండును. ఆనందరూపముతో నుండుటయే స్వరూపముగా గలది అగుటచేత ఐదవభూమిక సుషుప్త్యవస్థ అనబడును. అందు ప్రపంచమనునదియే లేదు కదా. ఇక ఆరవ భూమిక తుర్యావస్థ అనబడును. సుషుప్త్యవస్థయందువలె పంచమ భూమికయందు “ప్రపంచము శూన్యము. ఇప్పుడు అది గోచరమగుటలేదు ” అని ప్రపంచ అభావ జ్ఞానము కలదు గాని, ఇచ్చట అదియు లేదు. ఏడవభూమికకు తుర్యాతీతావస్థయని పేరు. అది పరమాత్మరూపమే అగుటచేత దాని స్వరూపము ఇట్టిది అని నోటితో

చెప్పుటకు గాని, మనస్సుతో ఊహించుటకు గాని, వీలు లేదు. మహా రాజా ! ఇది యోగసిద్ధికి జెప్పబడిన మార్గము. ఇందు నాలుగవ అవస్థ వచ్చునంతవరకే ప్రయత్నము. తర్వాత తక్కిన అవస్థలు అభ్యాసబలము చేత స్వయముగనే వచ్చును. కావున ఎవ్వడు చిత్తమును జయించి సంసారములను నాశము చేయుటవలన ప్రపంచమును భావింపడో, వాడు వెలుపలికి ఎట్లున్నను ముక్తుడే సంశయము లేదు. సమభావము కలుగుటయే ముక్తి అనుట నిస్సంశయము. ఎప్పుడు పురుషుడు సుఖ దుఃఖానుభవముల వలన చలింపక సర్వకాలములయందును ఆనంద పరిపూర్ణమగు బుద్ధితో ఆత్మారాముడై సంతోషించుచుండునో, పరిపూర్ణ తృప్తినొంది యుండునో, అప్పుడు ఆ స్థితి ముక్తి అనబడును. ఆస్థితియందు సుఖమువలన అధిక సంతోషముగాని, దుఃఖమువలన బాధగాని, కలుగదు. సర్వ వ్యవహారములను ఆచరించువాడైనను ఏమియును ఆచరింపనివాడైనను, గృహస్థుడైనను, యతియైనను, శరీరసహితుడైనను, శరీరాభిమానము లేనివాడైనను, పైన వివరించిన జ్ఞానమును జెందవచ్చును. అట్టివాడు "మృతిచెందను, జనింపను, నేను సత్స్వరూపుడను గాని, అసత్స్వరూపుడనుగాని కాను. ( అనగా. ఇంద్రియ గోచరుడను కాననుట ) నేను ఏమియుగాకయు, అన్నియునై ఉన్నాను." అని వర్ణించుటకు అలవికాని బ్రహ్మస్వరూపమే తానని ఎఱిగి శోకింపడు. బ్రతికియుండియే సర్వ వ్యవహారములను యథాపూర్వముగ చేయుచునే ఉన్నను భ్రాంతిని చెందడు. "నేను దేనితోను సంబంధపడువాడను కాను. జరామరణములు లేనివాడను. కామక్రోధాదులు నాకు లేవు. సంకల్పములు నాకు లేవు. నాకు విభాగములు లేవు. నేను చిదాకాశ స్వరూపుడను" అని నిర్ణయించి అట్టివాడు శోకింపడు. "నాకుమనస్సు కాని, జరామరణములు కాని, లేవు. నేను నిత్య శుద్ధుడను, జ్ఞానమాత్రరూపుడను, సర్వ సంక్షోభములు లేనివాడను, సర్వ సముడను" అని నిశ్చయించి అట్టి మహాత్ముడు శోకింపడు. "గిరికి, ఆకాశాది పంచభూతములు, దేవ మనుష్య పశు పక్ష్యాది జంతువులు, మొదలగు సర్వ పదార్థములయందు ఏది వ్యాపించియున్నదో, అదియే నేను అని నిశ్చయించి ఆ విజ్ఞాని శోకింపడు. వాస్తవస్థితిలో సంచరించువాడు ఎవడు ? ఎవనికై శోకింపవలయును ? అస్వచ్ఛబుద్ధార్థమగు పదార్థము ఏకరూప స్వరూపమే క్రింద మీద సర్వదిశలయందునుగూడ వ్యాపించియున్నది. ఆ పదార్థంబును సర్వసాక్షియగుటచేత చలించునది కాదు కదా ? ఇట్లుండగ ఈ విషయమును తెలిసికొనినవాడు

ఎట్లు దుఃఖించును? " నశించువాడు ఎవడును లేకున్నను సుఖదుఃఖములు కలవుకదా? కొన్ని పదార్థములు రమ్యములైయుండును. మఱికొన్ని అట్లుండవు. కావున దుఃఖమును జూచియు, రమ్యములుకాని పదార్థములనుజూచియు, దుఃఖింపవచ్చునుకదా " అని అనియెదవేమో వినుము. లోకమునందు రమ్యములనియు, కావనియు, కొన్ని పదార్థములు ప్రత్యేకముగ లేవు. పురుషుడు అధిక ఆసక్తితో ఏపదార్థమును సేవించునో, అదియే రమ్యపదార్థమగును. ఒకనికి రమ్యముగనున్నది, మఱియొకనికి రమ్యముగాక ఉండుటయే ఇందుకు దృష్టాంతము. రమ్యత్వముకాని, అరమ్యత్వముకాని, పదార్థస్వభావమే అగునేని ఇట్లుండుటకు వీలులేదు కదా. ఇంతయేల? రమ్యమని తలచి సేవింపబడుచున్న పదార్థమే దాని నాశముయొక్క అవస్థయందు మనస్సునకు బాధ కలిగించు చుండుట ప్రత్యక్ష సిద్ధమయ్యే ఉన్నది. నాశమనునది అవస్థాభేదమే కాని, అభావము కాదని ఇదివరకే నిరూపించినట్లు ఆయెను. సర్వము పరమేశ్వరాభిన్నమే అయియుండ పరమేశ్వరునకు లేనినాశము వీనికి ఎక్కడినుండి వచ్చును ? కావున రమ్యమని తలంప బడుచున్న పదార్థముకూడ దానియందు అభిమానముకల ఆపురుషునకే అవస్థాంతరమునందు దుఃఖజనకము అగుచున్నది. ఇక దాని రమ్యత్వమేమి? రమ్యమనిన సర్వావస్థలయందును రమ్యమయ్యే ఉండవలయును. కాదనిన ఎప్పటికిని శోకనే పోపలయును. ఇదియును లేదు. రమ్యముకావని తలంపబడు పదార్థములు నాశావస్థయందు తమపై ద్వేషము గల పురుషునకు సుఖమును కలిగించు చున్నవి. కావున రమ్యత్వారమ్యత్వములు కేవల మనఃకల్పితములే. వానివలన గలిగిన సుఖదుఃఖములును అట్టివే. ఇట్లుండగ సంకల్పమే లేని, ఆవిజ్ఞాని దేనికై శోకించును ? సంకల్పములు ఉండినప్పుడే కదా రమ్యత్వారమ్యత్వములు మొదలగునవి ఏర్పడుట? కావున జ్ఞానియగువాడు సర్వపదార్థములను వ్యవహారకాలమునందు సేవించుచున్నను వానిపై అత్యల్పమగు అభిమానమును మాత్రమే ఉంచును. అభిమానమును బొత్తిగ పెట్టకుండగనేమైన ఉండును. ఇట్లుండుటచేత అనుభవకాలమునందు ఆపదార్థములు వానికి సుఖమును కలిగింపవు. నాశకాలమునందు దుఃఖమునుగూడ కలిగింపవు. ఎప్పటికిని సుఖదుఃఖములకు ఎడబాటు లేదనుట ప్రత్యక్ష సిద్ధము. కావున ఎవనికి పదార్థములు అనుభవకాలమునందు సుఖము కలిగించునో, వానికి ఆపదార్థములయొక్క వినాశకాలమునందు దుఃఖమును కలిగించును? సుఖము నీయకున్న దుఃఖమునుగూడ నియ్యవు. కా

వున ఓ దోషరహితుడా! ఇక్ష్వాకుమహారాజా ! వాసనలులేని బుద్ధితో ఏకర్మ ఆచరింపబడునో, అది వేపబడిన విత్తనమువలె మఱల మొలకవేయదు. ( పునర్జన్మమును, లేక, సంసారాంతరమును, కలిగింపదు. శాస్త్రవేత్తలలో ప్రధానుడవగు ఓమహారాజా ! బాగుగ విచారించి చూడుము. దేహేంద్రియాదులు కర్మలను చేయుచున్నవనుట నిశ్చయమే. ఇచ్చట చేయువాడెవడు ? అనుభవించువాడెవడు ? సర్వమును శుద్ధ చైతన్యమే యైయుండ ఎట్టిభేదము ఎక్కడనుండి వచ్చును. కావున విచారించినను విచారింపకున్నను, ఉన్న యథార్థ తత్వము ఇదియే. కర్మలు ఎప్పటికిని పురుషుని బంధించునవి కావు. ఊరక “ ఇవి నన్ను బంధించు చున్నవి. అని భ్రాంతిని చెందుటయే కాని, అందు పరమార్థము ఏమియును లేదు. కావున ఆవిజ్ఞాని సర్వసంకల్పములను విడిచి సంకల్పమాత్ర సారములగు సర్వపదార్థములను పరిత్యజించి వెలుపలికివచ్చి చంద్రునివలె నిర్మలుడై సర్వపరిపూర్ణుడై చల్లనై, స్వప్రకాశముచేత ప్రకాశించుచు సర్వమనోహరుడై, ఉండును. దేహమను బూరుగచెట్టుకు పూర్వజన్మ సంచితమైనట్టియు, ప్రకృతజన్మమునందు ఆచరింపబడుచున్నట్టియు, కర్మలు దూదివంటివి. ఆకర్మలు జ్ఞానమను గాలి వీచినతోడనే ఎగిరి ఎటకో పరుగెత్తిపోవును. మఱియును ఈజ్ఞానమును మొట్టమొదట సంపాదించుటయందే కొంత ప్రయత్నింప వలయును కాని, దీని అభివృద్ధివిషయమై కొంచెమైనను ప్రయత్నింప నక్కఱలేదు. లోకమునందు ఏవిద్యయైనను ( అనగా, ఇతరవిద్యలు .) అభ్యాసము లేకున్న క్రమక్రమముగ నశించిపోవును గాని, ఈ బ్రహ్మవిద్యమాత్రము అట్టిది కాదు. ఒక్కమాఱు మనస్సునందు నాటెనేని ఇక నశింపనే నశింపదు. సుక్షేత్రమునందు నాటబడిన బీజమువలె దినదినమునకును శాఖోపశాఖలతో అభివృద్ధి నొందును.

శ్లో॥ ఏకః స్ఫుర త్యఖిలవస్తుషు విశ్వరూప
ఆత్మా సరస్సు జలధిష్వివ తోయమచ్ఛమ్ ।
సంశాంత సంకలన భూరి కలాప మేకం
సత్తాంశమాత్ర మఖిలం జగ దంగ విద్ధి ॥

ఓఇక్ష్వాకు మహారాజా! పరిపూర్ణార్థమును వినుము. తటాకములు, బావులు, సముద్రములు, మొదలగు వానియందు అంతటను ఉన్న జలము ఉపాధి భేదములచేత ప్రత్యేకముగ నున్నట్లు కానవచ్చినను, దానికి భేదము ఎట్లులేదో, అట్లే ఈ పరమేశ్వరుడును ప్రతి పదార్థమునందును

ప్రత్యేకముగ నున్నట్లు గానవచ్చినను, ఆయనకు భేదములేదు. ఆయన ఒకడే సర్వమయుడై ఉన్నాడు. కావున ఈ ప్రపంచమంతయును ఒక్కటియే. ఇందు గానవచ్చు భేదములు సంకల్పమాత్రములే. ఈ ప్రపంచమంతయు కేవల సత్తారూపమే అని తెలిసికొనుము. విషయేచ్ఛ ఎంతవరకు ఉండునో, అంతవరకే ఆత్మకు జీవనామము ఉండును. బాగుగ విచారించిన ఆ ఆశయు, అజ్ఞాన కల్పితమే కాని, స్వాభావికము కాదు. కావున జ్ఞానోదయముచేత ఆ ఆశ ఎప్పుడు నశించునో, అప్పుడే జీవుడు తన జీవత్వమును వదలి నిర్వికారుడై బ్రహ్మత్వమును బొందును. ఇట్లగుటచేత ఓ ఇక్ష్వాకుమహారాజా! బుద్ధిసాధ్యమగు అల్పవిషయములను పాలుమాలి సంసారమను ఏతమునందు చింతయను త్రాటిచేత కట్టబడి మీదనుండి క్రిందికిని క్రిందనుండి మీదికిని విడువక దిరుగుచు ఏతపుబాన కావలదు. ఇట్టి సూక్ష్మ విషయమును సాధింపనేరక ఏమూర్ఖులు "ఇదినాది, నేను దీనివాడను" అను భ్రాంతిని విడువకుందురో, అట్టివారు అధోగతినుండి మఱింత అధోగతికి పోవుదురు. "ఇది నాది, నేను ఇట్టివాడను, నేను దీనివాడను" అను భ్రాంతిని ఏమహాత్ములు విడుతురో, అట్టివారు ఊర్ధ్వగతినుండి మఱింత ఊర్ధ్వగతికి పోవుదురు. కావున ఓ మహారాజా! నీవు స్వప్రకాశ స్వరూపుడగు ఆత్మను శీఘ్రముగ గ్రహించి ఈ ప్రపంచములను అన్నిటిని తన్మాత్రములనుగా ఎఱుగుము. ఏక్షణమునందు సర్వవ్యాపకమగు చైతన్యరూపము తెలిసికొనబడునో, ఆక్షణముననే సర్వ సంసారమును వర్జించి పరమేశ్వరుడవు అయ్యెదవు. అప్పుడు "బ్రహ్మ, ఇంద్రుడు, విష్ణువు, రుద్రుడు, వరుణుడు, మొదలగువారు ఏ ఏ కార్యములను చేయుచున్నారో, అవియన్నియు నాకార్యములే" అని భావింపవచ్చును. పరమేశ్వరుడు సర్వరూపుడు కదా. ఎప్పు డెప్పుడు ఏదేది కానవచ్చునో, అది యంతయు బ్రహ్మమే. ఆపదార్థములన్నియు బ్రహ్మవిలాస భేదములే. పరమేశ్వర విలాసమునకు అంతమే లేదు కదా. మఱియు బ్రహ్మరూపుడై మృత్యువును అతిక్రమించి మనోనాశము కలిగియుండునేని అప్పుడు వానికి గలుగు ఆనందమును దేనితోను పోల్చుటకు వీలులేదు. ఈ ప్రపంచము బాగుగ విచారింపబడునేని సద్రూపమును కాదు. శూన్యమును కాదు. అచేతనరూపమును కాదు. చేతనరూపమును కాదు. ఆత్మయు కాదు. అన్యమును కాదు. కావున దీని రూపము అనిర్వచనీయము. నీవును ఇట్లే దీనిని భావింపవలయును. అట్లు భావింతువేని అప్పుడు ప్రపంచకారణమగు అజ్ఞానము నశించును. ఓమహా

రాజా! మోక్షమని ఎచ్చటను ఒకప్రదేశము లేదు. ఒక కాలమును లేదు, ఒక స్థితియు లేదు. ఇకను ఏమియనిన, జ్ఞానముచేత అహంకారమును, భ్రాంతియు, నశించిన సంసారమను నామాంతరము గల ప్రపంచకారణము నశించును. ఇదియే మోక్షము.

శ్లో॥ ప్రశాంత శాస్త్రార్థ విచార చాపలో
నివృత్త నానారస కావ్యకౌతుకః ।
నిరస్త నిశ్శేష వికల్ప విప్లవః
సమ స్సుఖం తిష్ఠతి శాశ్వతాత్మకః ॥

శ్లో॥ యేన కేనచి దాచ్ఛన్నో యేన కేనచి దాశితః ।
యత్ర క్వచన శాయీచ స సమ్రాడివరాజతే ॥

ఓమహారాజా! బ్రహ్మజ్ఞానముకలవాడు శాస్త్రార్థ విచారణలను చాపల్యమును వదలి రసవంతములగు కావ్యములను అవలోకింపవలయునను కుతూహలమును పరిత్యజించి సంకల్పములనియెడు ప్రవాహములను నిశ్శేషముగ నణగించి సర్వసముడై ఏకరూపుడై, స్వస్థుడైయుండును. మఱియును అసిద్ధుడు దొరికిన పదార్థమును కప్పుకొనుచు దొరికినదానిని భుజించుచు ఎచ్చటనో, ఒకచోట పరుండుచు నిత్యానందుడై సార్వభౌమునివలె ప్రకాశించు చుండును. జాతులు, ఆశ్రమములు, ధర్మాధర్మములు, సదాచార దురాచారములు అను నియమములను వదలి బోనులోనుండి విడిపించుకొనిన సింహమువలె ప్రపంచమునుండి విడుదలను జెందును. మనోవాక్కులకు అగోచరుడై విషయేచ్ఛ అనునది ఇంచుకయైనను లేక, అనిర్వచనీయముగు కాంతిని జెంది శరత్కాలమునందలి ఆకాశమువలె అతడు ప్రకాశించును.

ఓ ఇక్ష్వాకుమహారాజా! పర్వతమునందున్న గొప్ప తటాకమువలె గంభీరుడై శాంతుడై సంక్షోభము కొంచెమైనను లేక, పరమానంద రసపూర్ణుడై, తేజరిల్లుచుండును. మఱియును అతడు సర్వకర్మ ఫలములను పరిత్యజించి ఉండుటచేత అతనికి పుణ్యముతోగాని, పాపముతోగాని, మఱి దేనితోనైనను గాని, సంబంధము ఉండదు. "నేను కర్మలను చేయుచున్నాను" అను అభిమానమును, కర్మఫలేచ్ఛయు, అను ఈరెండును గలవానికే కర్మలతో సంబంధము ఉండును గాని, అన్యులకు ఉండదు. స్ఫటిక మణి, దాసానిపువ్వు, మొదలగు వానియొక్క ప్రతిబింబములచేత ఎట్లు రక్తాదివర్ణములను జెందదో, అట్లే విద్వాంసుడును కర్మఫలములచేత కామక్రోధాది రూపములగు రంజనములను జెందడు. వెలుపలికి అందరితో పాటు

వ్యవహారములను చేయుచునే ఉన్నను లోపల వానికి వికారములు ఏవి యునుఉండవు. జనసమూహ మధ్యమునందు విహరించుచునే ఉన్నను ఆత నికి వికారమే ఉండదు. ఇంత ఏల? శరీరావయవములను ఛేదించినను, పూజించినను గూడ వానికి తెలియదు. ఆ ఛేదనాదులవలన గలుగు సుఖ దుఃఖములను ఆతడు ఎరుగడు. ప్రతిబింబమునకు గలుగు పూజాదులను బింబమెరుగనట్లు వాడును ఆత్మగతుడగుటచేత భ్రాంతి కల్పితమగు దేహ మునకు ఏది కలిగినను దానిని ఎఱుగకుండును. ఇదియునుగాక, ఆ మహా త్మునకు ఒకనిని స్తోత్రముచేయవలసిన పనిలేదు. ఒకనిచేత నుతింపబడవల యునను ఆశయు లేదు. అట్లు ఒకడు తన్ను నుతించినను వికారము లేదు. మఱియు అతనికి పూజింప దగినవాడని ఒకఁడు లేడు. పూజ అనునదియు ఒకఁటి లేదు. సంచారమంతయు స్వేచ్ఛా ప్రధానమై ఉండును. కావుననే వ్యవహారకాలమునందు ఆతనికి ఆచారము నీతులు మొదలగునవి ఉండి యు, లేనివై, యుండును. అమ్మహాత్మునివలన లోకమునకు గాని, లోకము వలన అమ్మహాత్మునకు గాని, భయము లేదు. అమ్మహాత్ముని ఒకఁ హృదయ మునందు రాగ ద్వేష భయాదులు కొంచెమైనను ఉండవు, అయినను వ్యవ హారార్థమై మాత్రము అభినయింప బడుచునే ఉండుటచేత ఉన్నట్లే కాన వచ్చును. అజ్ఞాని మిక్కిలి గొప్పబుద్ధి కలవాడగుటచేత ఎట్టివానికిని అనగా, చక్రవర్తికైనను సులభుడు కానేరడు. మనస్సునందు క్రోధాదులు లేకుండు టచేత బాలునకుగూడ సులభుడగును. మఱియు అతడు తన దేహము ఏస్థల మునందు పడిపోయినను లక్ష్యము చేయడు. మరణముజెందునపుడు పుణ్య తీర్థమైనను, చండాలుని గృహమైనను, అతనికి సమానమే. మఱియు అతడు తనదేహమును ఎప్పటికిని విడువకనే అయినను ఉండును. తన్నది మే విడచి నను విడుచును. ఇంత చెప్పనేల! వాడు మనస్సులేనివానివలె అనగా, ప్రతిమాదులవలె సంచరించు చుండును. వానికి వాస్తవస్థితిలో మనస్సే లేదు. జ్ఞానము కలుగగానే, అది నశించి పోయెను. అహంకారమే మన స్సు. అదియే బంధకారణము. కావున అహంకార నాశమే మోక్షము కదా. ఓ ఇక్ష్వాకుమహారాజా! ఇట్టి ఆ మహాపురుషుని జీవన్ముక్తుని పూ జింప వలయును. స్తోత్రము చేయువలయును. నమస్కరింపవలయును. దర్శ నము చేయవలయును. ఐశ్వర్యమును గోరువాడు ప్రయత్న పూర్వకముగ అతని అనుగ్రహమును సంపాదింప వలయును.

శ్లో॥ న యజ్ఞతీర్థై ర్నతపః ప్రదానై
రాసాద్యతే యత్పరమం పవిత్రమ్ ।
ఆసాద్యతే క్షీణ భవామయానాం
భక్త్యాసతా మాత్మవిదాం పదం యత్ ॥

ఏపరమపదము ఎన్నియజ్ఞములను చేసినను, వేదాధ్యయనములను ఆచరించినను, తపస్సులను, చేసినను, దానములను ఆచరించినను, తీర్థసేవలను గావించినను, దొరుకదో, అట్టి సర్వోత్తమమగు స్థానము సర్వపవిత్రమగు స్థితి జీవన్ముక్తులసేవచేత దొరుకును. ఓ రామచంద్రా ! ఈ విధముగ తత్వమును ఉపదేశించి ఆమనుప్రజాపతి బ్రహ్మలోకమునకు బోయెను. ఆ ఇక్ష్వాకుమహారాజును ఆత్మయందు బుద్ధిని నెలకొల్పి సుఖించెను. జీవన్ముక్తుడయ్యెను.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున ఇక్ష్వాకుమహారాజు ఉపాఖ్యానమను
నలుబదియొకటవ సర్గము ముగిసెను.

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునితో ఇట్లనియె. ఓ భారద్వాజా ! ఇట్లు జీవన్ముక్తుని సంచారముకూడ లౌకిక సంచారము వలెనే యుండునని చెప్పిన విని విశేషమును తెలిసికొనగోరి శ్రీరామచంద్రుడు ఇట్లని ప్రశ్నజేసెను. బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడవగు నో వశిష్ఠమహామునీ ! ఇట్లు జీవన్ముక్తుడుకూడ సామాన్యులవలెనే సంచరించువాడగునేని వానికిని ఇతరులకును భేదమేమియుకలదు ? అట్లు భేదము ఉన్నను ఎట్లు తెలిసికొననగును ? కరుణచేత ఈ విషయమును వివరించి చెప్పుడు. అని అడిగి జీవన్ముక్తవ్యవహారమును వర్ణించువాడై వశిష్ఠమహాముని ఇట్లని సమాధానము చెప్పెను. ఓ రామచంద్రా! వినుము. అజ్ఞానులగువారు సర్వపదార్థములయందును ప్రీతిగలిగి అన్నిటిని అపేక్షించుచు దానివలన కలిగిన సుఖదుఃఖములను తనవిగానే భావించుచు హర్షశోక వేగములచేత కలతనొందుచు ఉందురు. జ్ఞానియగువాడు అట్లుగాక ఒకఆత్మయందు మాత్రమే ప్రీతికలిగి తత్పరుడై ఉండును. తక్కినవానిని ఉపేక్షించును. ఆ ఉపేక్షవలన అతనికి విషయ సంయోగ వియోగములవలన కలుగు హర్ష శోకములు సంక్షోభమును కలిగింపనేరవు. ఇదియే వీనికి ఇతరులకంటె గల భేదము. ఇట్లుగాక ఇక తావలయునన్న విశేషము ఏది కలుగును ఆకాశ యానాదులువిశేషముగునేమో, అనిన వానిని బ్రహ్మవేత్తలు మాత్రమే చేయుచున్నారనుటయు, ఇతరులు

చేయుట లేదనుటయు, నియమము కాదు. మంత్రసిద్ధినొందినవారలును, తపస్సిద్ధినొందినవారలును, తంత్రసిద్ధినొందినవారలునుగూడ విరివిగ ఆకాశయానాదులను చేయుచునే ఉన్నారుకదా ? ఇందు జ్ఞానికి గలుగును ఆధిక్యమేమి ? ఇందుత్కృష్టవిషయము ఏమికలదు ? అణిమాదిసిద్ధులే అట్టి విశేషమగునేమో అనిన, అదియు సంభవింపదు. ఆ అణిమాదులును బాగుగ పూని సాధింపబడుటచేత మంత్రసిద్ధులు మొదలగునవిగల వారిచేతనే సాధింప బడుచున్నవి. జ్ఞానులచేతమాత్రమే సాధింప బడవలయునను నియమము వాటికిగూడ లేదుకదా ? కావున సర్వ పదార్థములయందును ఆశలేక పరిపూర్ణమగు ఆత్మనిష్ఠమాత్రమే కలిగియుండుటయు, కామక్రోధాదులు లేక, మనస్సు నిర్మలమగుటయు, అనునదియే జ్ఞానికిని ఇతరులతోగల భేదము. వాస్తవస్థితిలో వ్యవహారకాలమునందు ఈతడు జీవన్ముక్తుడు అను విషయమును గ్రహించుటకు తగిన గురుతులు ఏవియు లేవు. అయితే అజ్ఞానులకు కామముగాని, క్రోధముగాని, దుఃఖముగాని, భయముకాని, మోహముకాని, మిక్కిలి అధికముగ నుండును. జ్ఞానికి అట్లుగాక అవి అన్నియును అతి స్వల్పముగ నుండును. ఇదియే వారికిగల భేదము. వాస్తవస్థితిలో జీవేశ్వరులు ఒకటియే. బ్రాహ్మణుడు తన సత్వగుణమును ఏమరి క్రమక్రమముగ శూద్రత్వము నొందునట్లు ఆ ఈశ్వరుడును సంకల్ప బలముచేత క్రమక్రమముగ జీవత్వమును జెందును. స్థావర జంగమ రూపములగు భూతములు సృష్ట్యాదియందు పరమేశ్వరుని సంకల్పవశమున ఆ పరమేశ్వరునికంటె భిన్నముగనే జనించును. ఆభూతములకు అప్పుడు పరమేశ్వర సంకల్పమునకంటే కారణాంతరము ఏదియు లేదు. పరమేశ్వరునకు గారణము ఏదియు లేదు. కావున ఈ భూతములకును కారణాంతరము లేదు. ఇట్లు జన్మించిన పిమ్మట కర్మలను ఆచరించును. ఆకర్మలను అనుభవించుటకై ఉత్తర జన్మమును అంగీకరించును. ఆ జన్మమునందును కర్మలను చేసి దానిని అనుభవించుటకై రెండవ జన్మమును అంగీకరించును. ఇదియే జన్మకర్మలకు గల కార్య కారణ భావము. ( వాస్తవస్థితిలో బీజము వృక్షమునను వానియందువలె జన్మకర్మలయందును " ఇదిముందు, ఇది వెనుక " అను విభాగము లేకున్నను ఏదియో ఒక దానిని ముందుగా జెప్పవలయును. కావున జన్మము ప్రథమముగ జెప్పబడెను. జన్మ కర్మ సంబంధము అనాది అగుటచేత ఎట్లయినను చెప్పవచ్చునుకదా ? ) మొట్టమొదట జీవులందఱును నిష్కారణముగనే పరమేశ్వరునుంచి పుట్టుదురు. పిమ్మట వారి సుఖ

దుఃఖములు వారి కర్మలవలన పుట్టును. ఇట్లు సర్వ సుఖదుఃఖములకును కారణమగు కర్మకు సంకల్పమే కారణము. ఆ సంకల్పమునకు ఆత్మ స్వరూపము ఎఱుగలేక ఉండుటయే కారణము. కావున సంకల్పములు కలిగి ఉండుటయే బంధము. ఆ సంకల్పములు లేకుండుటయే మోక్షము. కావున ప్రయత్నపూర్వకముగా నీవు బంధము విడిచి మోక్షస్థితిని అభ్యసింపుము. దానికి ఉపాయమును దెలిపెదను. వినుము. నీకు విషయములతో సంబంధము కలుగునప్పుడెల్ల కలుగు సంకల్పములను ప్రయత్నపూర్వకముగ మెల్ల మెల్లగ పరిత్యజింపుచు మిక్కిలి జాగ్రత గలిగి ఉండుము. ఆ సమయమునందు "నేను దీనిని గ్రహించుచున్నాను, ఇది నాచేత గ్రహింపబడుచున్నది" అను సంకల్పములు దుర్నివారములై పుట్టును. వానికి లోబడకూడదు. వానిని విడచి ఏది మిగిలియున్నదో, అదియే నీవు కావలయును. పురుషుడు తాను ఏపదార్థమును జూచినను దానియందు కామము లేకపోవునేని ముక్తుడే అగును. కామము కలదేని బంధము నొందును. నీ మనస్సునకు ఇంపైన పదార్థము ఏదిన్నైన నుండునేని అప్పుడు నీవు సంసారమునకు జిక్కినవాడవే. అట్లులేక సర్వమును నీ మనస్సునకు సమానమే అగునేని అప్పుడు ముక్తుడవే. కావున తృణము మొదలు బ్రహ్మవరకు గల సర్వపదార్థములయందును నీకును ఏదియు రుచింపకుండును గాక. నీకు దేనియందు అభిమానము ఉండకుండును గాక. అసక్తి లేపమేనేని నీవు దేనిని అనుభవించినను దేనిని ఆచరించినను, దేనిని అంగీకరించినను, దేనిని పరిత్యజించినను, బద్ధుడవు కానేరవు. కర్తవు కానేరవు. భోక్తవు కానేరవు. అంగీకరించిన వాడవు కానేరవు. పరిత్యక్తవు కానేరవు. సర్వమును ఆశామూలమే. ఆశచేత దేనినైనను అనుభవించువాడు భోక్త. చేయువాడు కర్త. ఓ దోషరహితుడా! శ్రీరామా! ఇట్లగుటచేత సత్పురుషులు గడచిపోయినదానికి వగవరు. రాబోవుదానిని విచారింపరు. క్రమానుసారముగ సంప్రాప్తమైన దానిని గూర్చిమాత్రమే విచారింతురు. ఆశ, మోహము, మదము, అను మొదలగు పాశములు మనస్సునందు దృఢముగ పురిపెట్టబడి ఉన్నవి. కావున బుద్ధిమంతులగువారు ఆ దుష్టమనస్సును వివేకయుక్తమగు మనస్సుతోనే ఛేదింపవలయును. ఇంతకంటె అన్యమగు ఉపాయము లేదు, కామాది నాశమునకు ఇతరసాధనము లేదు. కావున వాడిగల ఇనుముతో ఇనుమునే ఛేదించునట్లు వివేకముచేత మిక్కిలి వాడియైన మనస్సుతోనే మనస్సును బలాత్కారముగ ఛేదింపుము. లోకమునందు

మాలిన్యమును పోగొట్టుటయందు నేర్పరులగువారు తమకు మలిన పదార్థముచే సాధనముగ గైకొనుచున్నారు. అస్త్రమును నివారించు నేర్పరులు తమకు మఱియొక అస్త్రమునే సాధనముగ అంగీకరించు చున్నారు. విషమును శమింపజేయు యుక్తిశాలులు తమకు సాధనముగ మఱియొక విషమునే గ్రహించు చున్నారు.

మఱియు జీవునకు మూడు రూపములు గలవు. దేహాభిమానమువలన స్థూల సూక్ష్మ రూపములు రెండు వచ్చినవి. స్థూలదేహమును అభిమానించి స్థూలుడును, సూక్ష్మదేహమును అభిమానించి సూక్ష్ముడు నయ్యెను. ఈ రెండు రూపములును గాక ఆజీవునికి స్వాభావికమగు పరమేశ్వర రూపము ఒకటికలదు. ఓరామచంద్రా ! నీవు ఈమూడవ రూపమును ఆశ్రయించి తక్కిన రెంటిని విడువుము. చేతులు, కాళ్ళు, మొదలగువానితో గూడి సుఖ భోగమునకై పరుగులిడుచున్న ఈస్థూలదేహమే; అభిమానవశముచేత జీవునకు స్థూలరూపము సంకల్పమే ఆకారముగాగలిగి బ్రహ్మజ్ఞానము కలుగునంతవరకు చెడక నిలచి బహువిధ దుఃఖములకు పాల్పరుచుచు ఉండు మనస్సే ఆజీవునకు సూక్ష్మరూపము. ( మనస్సే సూక్ష్మశరీరమునందు ప్రధాన అవయవము అగుటచేత ఇట్లు చెప్పబడెను. ) మఱియు ఆద్యంత శూన్యమును, సత్యమును, చేతనస్వరూపమును, సంకల్ప వికల్ప రహితమునగు పరబ్రహ్మమే జీవునకు స్వాభావిక రూపము. ఇదియే ఆజీవుని మూడవ రూపము. ఇదియే తుర్యావస్థ ఇదియే నిత్యపరిశుద్ధము. ఇచ్చటనే ఆత్మాభిమానమును ఉంచుము. తక్కిన రెంటిని పరిత్యజింపుము. అందు ఆత్మాభిమానమును ఉంచకుము. అనిచెప్పినవిని శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఇప్పుడు మీరు చెప్పిన వాక్యములను పట్టిచూచిన తుర్యావస్థయనునది జాగ్రత్స్వప్న సుషుప్తులయొక్క అంతమునగాక వానిమధ్యమున గూడ ఉండవలసి వచ్చుచున్నది. పరమేశ్వరుడు సర్వకాలములయందును ఏకరూపముగ నుండువాడే. కావున ఆయనయే తుర్యావస్థ యగునేని ఆతుర్యావస్థయు సర్వకాలములయందును ఏక రూపముతో నుండవలయును కదా ! కావున ఆతుర్యావస్థయొక్క స్వరూపమును విభజించి అదియే ఏఅవస్థయందు ఎట్లెట్లుండునో, దానిని వివరించి చెప్పుడు.

—* తుర్యావస్థాలక్షణము. *—

అని శ్రీరామచంద్రుడు అడిగిన విని వశిష్ఠమహాముని ఇట్లనియె. అహంకారమును, అహంకారము లేకుండుటయును, కలిమిని లేమిని గూడ

పరిత్యజించి దేనియందును ఆసక్తిలేకుండ నిర్మలముగ సుఖముగ నుండుట యేది కలదో, అదియే తుర్యావస్థ. నిర్మలమై సమభావముతోఁగూడి జీవన్ముక్త గమ్యమై వ్యవహారకాలమునందు సంసర్గ రహితమై సాక్షివలెనుండు టనికి ఏది కలదో, అదియే తుర్యావస్థ అనబడును. ఇట్టి స్థితి సర్వకాలములయందును సంభవింప వచ్చుననుటలో సంశయమేమి ? విచారించి చూచిన ఇది ఏ అవస్థయందును ఏకీభవింపదు. జాగ్రత్స్వప్నములయందు బహువిధములగు ప్రపంచకల్పనలు గలవు. సుషుప్త్యవస్థయందు సర్వ ప్రపంచాభావమును, జడస్థితియు, గలవు. పైనవర్ణించిన స్థితియందు ఇవి ఏవియు లేవు. కావున అది ఈమూడవస్థలలో దేనియందును జేరదు. శాంతులును, వివేకవంతులును నగు మహాత్ములకు ఈప్రపంచము ఉన్నది ఉన్నట్లై పరమేశ్వరునియందు లీనమగును. ఇది స్వరూపముతో గానవచ్చుచునే ఉన్నను ఆమహాత్ములకు దీనియందు బ్రహ్మదృష్టియే ఉండును. కావున ఇది తుర్యమనబడును. అజ్ఞానుల విషయము ఇట్టిది కాదు. వారికి ప్రపంచము ఎట్లును బ్రహ్మమునందు లీనము కాదు. వారు దీనిని ప్రపంచ రూపముతోనే చూతురు గాని, బ్రహ్మరూపముతో జూడరు కదా. కావున అహంకారము నశించెనేని సర్వసమత్వము కలిగెనేని మనస్సు సన్నగిలిన వాసనలతో పూర్వమువలె సంసార సముద్రమునందు పడద్రోయునది కాకపోయెనేని అప్పుడు వానికి అన్ని అవస్థలును తుర్యావస్థలే.

—* మునివ్యాధోపాఖ్యానము. *—

ఓసత్యపరాక్రమా ! శ్రీరామా ! నీకు నిస్సంశయముగ జ్ఞానము కలిగినది. అయినను, అది అతి విశద మగునట్లుగా పైన చెప్పిన విషయమునకు ఒక దృష్టాంతమును చూపి చెప్పెదను వినుము. ఒకానొక అరణ్యమునందు ఒకముని మౌనముతో నిశ్చేష్టుడై గూర్చుండి ఉండెను. ఆయనను జూచి ఆశ్చర్యపడి ఒక కిరాతుడు ఇట్లని ప్రశ్న చేసెను. ఆకిరాతుడు ఒకలేడిని కొట్టి అది పరుగెత్తగా దానివెంబడి ఈమునివద్దకు వచ్చియుండెను. ఆలేడిమాత్రము వానికి గానరాలేదు. ఇట్లగుటచేత వాడు అక్కడ గూర్చుండియున్న ఆమునిని చూచి “ ఓమహాత్మా ! నాలేడి ఈవైపునకు వచ్చినది. అది ఎందుపోయెను ” అని ప్రశ్న చేసెను. దానికి ఆమహాముని ఇట్లనియె. ఓమానవుడా ! మేము సర్వసములమై అరణ్యమునందు ఉన్నాము. మాకు అహంకారము లేదు. అహంకారము ఉండిననేగాని, ఏవ్యవహారములును చేయుటకు వీలు లేదు. ఓస్నేహితుడా ! అహంకారమే మన

స్సు. అహంకారమే సర్వకార్యములను ఆచరించుచున్నది. సర్వేంద్రియకర్మలను చేయుచున్నది. మాకు ఆమనస్సు నిశ్చయముగ లేదు. అదిపోయి ఇప్పటికి చాలాకాలమైనది. నాకు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు తెలియవు. ఎప్పటికిని తుర్యావస్థనే ఆశ్రయించి ఉన్నాను. ఆతుర్యావస్థయందు ఏదియును గానరాదు. మీరేదినిగూర్చి నేను ఎట్లుచెప్పగలను? అనిచెప్పెను. ఓరామచంద్రా! ఈవాక్యములను విని దాని అర్థమును ఎఱుగలేక ఆబోయవాడు తనయిచ్ఛ వచ్చినట్లు పోయెను. ఓశ్రీరామా! ఈకారణమువలననే నేను అట్లుచెప్పితిని. విచారించిన తుర్యావస్థకంటె భిన్నమగు అవస్థ లేదు. సంకల్పరహితమగు ఆచిత్తు ఏదికలదో, అదియే తుర్యావస్థ. వేఱే ఒకటి లేదు. అని ఎఱుగవలయును.

—* చిత్తరూపభేదములు. *—

ఓవీరుడా! శ్రీరామా! మఱియొక విశేషము. ఘోరము, శాంతము, మూఢము, అని మనస్సునకు మూడురూపములు కలవు. ఇవియే జాగ్రత్స్వప్న సుషుప్తు లనబడును. జాగ్రదవస్థయందు ఉన్న చిత్తము ఘోరమని చెప్పబడును. అందుగల సుఖ దుఃఖ భావన అపరిమితమై కర్మానుబంధమువలన ఎడతెగక మృతిని జెందు వరకు బాధించును. స్వప్నావస్థయందు ఉన్న చిత్తము శాంత మనబడును. అప్పుడును సుఖ దుఃఖాద్యనుభవము ఉన్నను ఉత్తర క్షణమునందే అసత్యభావన కలుగుటచేత అదినశించును. కావున మనస్సునకు దానివలని బాధ అంతగా నుండదు. మఱియు సుషుప్త్యవస్థయందు ఉన్న చిత్తము మూఢ మనబడును. అప్పుడు దానికి ఏమియు దెలియదు కదా. కావున ఈమూడవస్థలును మనస్సునకు స్వరూపములు. ఇవి లేకున్న అది మృతి నొందినట్లే. యోగులందరును ఇట్టి మృతచిత్తమునే ప్రయత్నపూర్వకముగ సంపాదింతురు. అట్టిచిత్తమే కాని, సమభావముతో నుండదు కదా. కావున ఓ రామచంద్రా! నీవు నిర్వికారుడవై జీవన్ముక్తులును, మహాత్ములును, నగు మునులు ఎద్దానిని ఆశ్రయింతురో, అట్టి సంకల్ప శూన్యమగు తుర్యావస్థను జెంది నిత్యానందమును అనుభవింపుము.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున మునివ్యాధోపాఖ్యానమను
నలుబదిరెండవ సర్గము ముగిసెను.

—*—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునితో ఇట్లనియె. ఓభరద్వాజా! ఇట్లు జీవన్ముక్త వ్యవహారము తుర్యావస్థామాత్రమని నిరూపించి ఇప్పుడు శాస్త్రసిద్ధాంతమును సంగ్రహించువాడై వశిష్ఠమహాముని ఇట్లనియె. ఓరఘుకులసార్వభౌమా! శ్రీరామా ! సర్వ వేదాంత శాస్త్రముల యొక్కయు సిద్ధాంతము సర్వాభావమే. ఈలోకమునందు ఏదియు లేదు. అవిద్యకాని, మాయకాని, వానివలన జనించిన భూత భౌతికములు గాని, బొత్తిగనే లేవు. ఉన్నది సర్వ సంక్షోభ రహితమగు పరబ్రహ్మమే. ఈవిధముగ శాంతమై సర్వశక్తి సమన్వితమై మహాప్రభావ సంపన్నమై బ్రహ్మమనుపేరు కలిగియున్న ఆచిదాకాశము ఒక్కటియే వెలుగుచుండగ దానిని కొన్నికొన్ని యుక్తులచేత కొందఱు శూన్యమేననియు, మఱికొందఱు జ్ఞానమాత్ర స్వరూపమనియు, వేఱొక కొందఱు ఈశ్వరుడనియు, చెప్పుచు ఒకరితో నొకరు వాదించు కొనుచు ఉందురు. కావున నీవు అట్టివాదముల యొక్క చెంతకు పోక భేదమును ఎంచక వాసనారహితుడవై సంకల్పశూన్యుడవై మనోనాశము గలిగి సంక్షోభవర్జితుడవై మౌనమును ఆశ్రయించి నిర్వాణసుఖము నొందుము. మఱియు సర్వకాలములయందును అంతర్ముఖుడవై శాంతచిత్తుడవై మూగవానివలె, చెవిటివానివలె, గ్రుడ్డివానివలె, నీలోన నీవే సర్వ వ్యవహారశూన్యుడవై ఉండుము. జాగ్రదవస్థయందే సుషుప్తిని జెంది లోన సర్వమును పరిత్యజించి వెలుపలికి మాత్రము అభినయమాత్రముగ సర్వమును ఆచరింపుము.

ఓ శ్రీరామా ! చిత్తము ఉండుటయే మహాదుఃఖము. అది నశించుటయే మహాసుఖము. ఈకారణమువలన కేవల బ్రహ్మరూపమునందు నిలిచి సంకల్పములను శూన్యము గావించి చిత్తమును నాశము నొందింపుము. ఇందు అసాధ్యమగు ప్రయత్నము ఏదియు లేదు. మనోహరమగు వస్తువును జూచినను, మనోహరము కాని, వస్తువును చూచినను, రాగ ద్వేష సంకల్పములను కొంచెమైనను, తగులనియ్యక రాతివలె నిశ్చలుడవై యుండుట మాత్రమే ఇచ్చట చేయవలసిన ప్రయత్నము. ఇంతమాత్రపు యత్నమువలననే సర్వానర్థకరమగు సంసారము నశించిపోవును. మఱియు సుఖములు గాని, దుఃఖములు గాని, సుఖదుఃఖ మధ్యస్థితిని గాని, మనస్సుచేత భావింపకుండ నుండుటయే ఇచ్చట చేయవలసిన ప్రయత్నము. ఇంత మాత్రపు ప్రయత్నముననే శాశ్వతమగు మోక్షసుఖము దొరుకును.

శ్లో॥ ఆపీనమండల శశాంకవ దంతరేవ
శ్రీమద్రసాయనమయ స్సుఖమేతి తజ్ఞః।
విజ్ఞాత సర్వ భువనత్రయ వస్తుసారః
కుర్వన్ననామ కురుతే పర మభ్యుపేతః ॥

ఓ శ్రీరామా ! జ్ఞానవంతుడగువాడు త్రిలోక సారభూతమగు పదార్థమును గుఱుతెఱిగి ఉండుటచేత లోలోన పూర్ణచంద్ర బింబమువలె శాశ్వత సుఖమను అమృతసారముచేత పరిపూర్ణుడై సంతోషించుచుండును. నిత్యతృప్తుడై ఉండును. ఇట్టి మహాత్ముడు వెలుపలికి కార్యములను ఆచరించినను అది అభినయమాత్రమే అగును కాని, అంతకంటె అధికము కానేరదు.

—* సప్తభూమికో పాఖ్యానము. *—

అని వశిష్ఠమహర్షి చెప్పినవిని శ్రీరామచంద్రుడు ఇట్లనియె. ఓ మహాత్మా ! వశిష్ఠమహామునీ ! యోగసిద్ధి నొందుటకు క్రమము ఎట్లు ? దానికి సప్తభూమికలు కలవని ఇదివరకే చెప్పియుంటిరి. ఆభూమికలను అభ్యసించు విధము ఎయ్యది. ఒక్కొక భూమికయందు సిద్ధినొందినవానియందు ఏవ గురుతులు కానవచ్చును ? అని, అడిగిన వశిష్ఠమహాముని ఇట్లని ఉత్తర మిచ్చెను. రామచంద్రా ! వినుము. లోకమునందు ప్రవృత్తిమార్గమనియు, నివృత్తి మార్గమనియు, రెండుమార్గములు గలవు. స్వర్గాది సాధనమగు కర్మమార్గము ప్రవృత్తిమార్గము. మోక్షసాధనమగు జ్ఞానమార్గము నివృత్తిమార్గము. ఈ మార్గములను ఆశ్రయించినవారియందు కానవచ్చు గురుతులను క్రమముగ దెలిపెదను. వినుము. "మోక్షమనగా, ఎంత ? దానివలన అధిక సుఖము ఏదివచ్చును ? సంసారమే నాకు మేలుగనున్నది" అని నిర్ణయించి ఎవడు కర్మలను ఆచరించునో, వాడు ప్రవృత్తుడనబడును. ఈతడే ప్రవృత్తిమార్గమును అవలంబించినవాడు. మఱియు నివృత్తునిగూర్చి వివరించెదను. వినుము. అతివేగముతో చలించుచున్న రెండు సముద్రములకు నడుము నిలచియున్న తాబేలునకువలె జీవునకు బాగుగ విచారించిన పూర్వజన్మమునందు గాని, ఉత్తరజన్మమునందు గాని, నడుమగాని, సుఖము లేదు. ఆ తాబేలు ఏసముద్రములోనికి బోయినను, అవి చలించుచు నుండుటచేత అందు దానికి నిలుకడ చిక్కదు. నడుమనుండిన రెంటి తాకిడికిని ఓర్వలేక పోవును. ఇట్లే బాగుగ విచారించిన జీవునకును జన్మము దుఃఖకరమే కాని, సుఖకరము కాదు. కావున ఒక జన్మమును విడచి మఱియొక జన్మమునకు బోవుచు మధ్యభాగమునందు ఉన్నప్పుడు ఆతనికి ముందు జూచి

నను, వెనుక జూచినను, తాను ఉన్నస్థానమునే చూచినను దుఃఖము ఒక్క టియే కానబడును. దానిని తప్పించుకొనుటకు మాత్రము ఎట్లును వీలుపడ దు. జన్మ పరంపర నొందుట జీవునకు నియతి కదా. కావున అనేక జన్మ ములయందు ఇట్టిదుఃఖమును అనుభవింపగా, అనుభవింపగా, కొంతకాల మునకు సంసారమునందు విసుకు పుట్టి పురుషునకు వివేకము ఉత్పన్న మగు ను. అప్పుడు ఆతనికి ఇట్టి నిశ్చయము కలుగును. ఆహా, ఈ సంసారస్థితి నిస్సారమైనది. ప్రతిదినమును చేసినదానినే మఱల చేయుచున్నాము. అను భవించిన దానినే మఱల అనుభవించుచున్నాము. దీనివలన ప్రయోజన మేమి ? కాలమంతయును ఇట్లు నిరర్థకముగనే గడచిపోవుచున్నది. కర్మల వలన విశేషము లేక, నిత్యసిద్ధమై యుండు పదార్థము ఏది కలుగునో ? ఓ రామచంద్రా ! ఈ విధముగ మనస్సునందు నిశ్చయము కలిగినవాడు నివృత్తు డనబడును. వీనికి ప్రవృత్తిమార్గము అనబడు కర్మలయందును అకర్మలయొక్క ఫలములయందును ఇచ్ఛ లేదుకదా ? వీడే నివృత్తిమార్గ మును అవలంబించినవాడు. వీడే జ్ఞానభూమికలను అధిరోహించువాడు. ప్ర యత్నమునుచేసిన ముక్తిసిద్ధి నొందువాడు. ఆభూమికలను అధిరోహించున ప్పుడు క్రమక్రమముగ వచ్చు లక్షణములను వివరించెదను. వినుము.

—* ప్రథమ భూమికను అధిరోహించిన వాని లక్షణము. *—

ఓ శ్రీరామా ! అందు శుభేచ్ఛ అనునది ప్రథమభూమిక. దానిని అధిరోహించినవాని లక్షణమును వినుము. " నాకు వైరాగ్యము ఎట్లు దృఢమగును. సంసారము ఎట్లు నాశమగును " అను విచారము మొట్ట మొదట వానిబుద్ధియందు కలుగును. ఇట్టి దృఢమగు మోక్షేచ్ఛయేకదా శుభేచ్ఛ. ఇట్టి ఇచ్ఛ కలిగినప్పుడు కాలక్రమమున సర్వ విషయములయం దును వానికి వైరాగ్యము జనించును. మనస్సునందు ఏ ఏ సంకల్పము ఉద యించునో, దానినెల్ల వైరాగ్యశక్తిచేత మరలించు చుండును. గంభీరములై ధర్మోత్తరములై పశ్చాత్తాపమును కలిగింపనివియై ఉండు కార్యములను చేయును. మనస్సునందు దుఃఖమునంతయును విడిచి " సర్వము, అనిత్యమే " అను తలంపుతో ఏది ఎట్లు జరిగినను వగవకుండును. గ్రామ్యములగు మూ ఢ కార్యములను జూచినప్పుడెల్ల విసికికొను చుండును. ( లోకమునందు అనుభవములోనున్న ప్రేమ, దుఃఖము, విషయభోగములు, మొదలగునవి అన్నియు గ్రామ్యచర్యలే అని ఎఱుగునది. ) పరుల మర్మములను అనగా, రహస్యములను వచింపడు. పుణ్యకర్మలనే చేయును. ఎప్పుడును పరులకు

ఏమియు భయముకలుగకుండ శాంతములగు కార్యములనే చేయుచుండును. పాపము చేయుటకు మిక్కిలి భయము నొందును. భోగములను కోరడు. స్నేహముతోడను, ప్రేమతోడను, గూడినట్టివియు, మృదువులైనట్టివియు, వాక్యములను ఉచితముగాను, దేశకాలములకు, అనుకూలములుగాను, మాటలాడును. మఱియు మనోవాక్కర్మలచేత సత్పురుషులను సేవించును.

—* రెండవ భూమికను పొందినవాని లక్షణము. *—

ఓ శ్రీరామా ! రెండవ భూమికకు విచారణ అని పేరు. దానిని అధిరోహించినవాడు ఒకానొక గురువును జేరి వేదాంత శాస్త్రములను విమర్శించును. శ్రుతులను స్మృతులను ఆచారములను ధారణ ధ్యానము మొదలగు యోగాంగములనుగూడ ప్రధానమగు తాత్పర్యముతో వివరింపగల పండితులను ఆశ్రయించును. అట్టి పండితులయొద్ద సర్వమును వినుటచేత ఆ మహాత్ముడు, " గృహస్థుడు తన గృహమునందలి విషయములనెల్ల బాగుగా నెఱిగి కార్యాకార్యములను నిర్ణయించునట్లు " పదార్థవిభాగమును ఎఱిగి కార్యాకార్యములను నిర్ణయించును. సర్వ ప్రపంచమును బ్రహ్మరూపముగ నిశ్చయించి దానికి అనుగుణముగ ప్రవర్తించును. మదము అభిమానము, మాత్సర్యము, రోషము, మొదలగు దుర్గుణములను " సర్పము కుబుసమును విడుచునట్లు " విడచి వేయును, వెలుపలికైనను పదార్థములపైన అభిమానమును జూపడు. ఈ విధముగ నిర్మలమగు చిత్తముతో శాస్త్ర ప్రచారము వలనను, సజ్జన సాంగత్యము వలనను, రహస్యమునంతయు బాగుగ నెఱుగును.

—* మూడవ భూమికను అధిరోహించినవాని లక్షణము. *—

ఓ శ్రీరామా! ఇట్లు రెండవభూమికయందు స్థిరుడయ్యెనేని పిమ్మట సర్వ వస్తు సంబంధ రాహిత్యమను మూడవ భూమికలోనికి వచ్చును. " పుష్పశయ్యపై పరుండినట్లు " ఆ భూమికను ఆశ్రయించినవాడు పరమానంద భరితుడగును. ఆ భూమికను ఆశ్రయించిన మహానుభావుడు శాస్త్రార్థమునందు బుద్ధిని స్థిరముచేసి సర్వభోగములను పరిత్యజించి ఋష్యాశ్రమములయందు నివసించుచు పర్వతములమీద గాని, రాతిమీద గాని,నిలుచుచు తన జీవితకాలము అంతయును బ్రహ్మప్రసంగములతోను, సంసారమును నిందించునట్టి వైరాగ్య ప్రసంగములతోను, మునులతో గూడి గడపుచుండును. నీతిమంతుడై ఏపదార్థములతోను సంబంధపడక గ్రామములయందైనను నివసింపక అరణ్యము మొదలగు ఏకాంత స్థలములయందు చిత్తశాంతి

యుక్తుడై సంచరించుచు కాలమును గడుపును. ఓ రామచంద్రా! శాస్త్రములను బాగుగ అభ్యసించుటవలనను, పుణ్యకర్మలను చేయుటవలనను, ఆపురుషునకు వస్తుతత్వ జ్ఞానము బాగుగనే కలుగును. అవివేకదా ప్రథమ ద్వితీయ భూమికలు. ఇట్లు ఆ భూమికలను గడచి ఈ మూడవ భూమికను ఆశ్రయించినవానికి గలుగు వస్తు సంసర్గాభావము రెండు విధములై యుండును. దానిని వివరించెదను. వినుము.

—* అసంగముయొక్క భేదములు. *—

ఓ శ్రీరామా! ఆ అసంగము సామాన్యమనియు, శ్రేష్ఠమనియు, రెండువిధములై యున్నది. అందు "నేను కర్తనుగాను. భోక్తను గాను. ఒకనిచేత బాధింపబడువాడను గాను. ఒకనిని బాధించువాడను కాను" అని సర్వపదార్థములతోను తనకు కలదని తోచుచున్న సంబంధమును తొలగించుకొనుట సామాన్యమగు అసంగము. నాచేత అనుభవింప బడుచున్న దుఃఖము, సుఖము, మొదలగునవి అన్నియు, పూర్వజన్మ కర్మము వలన కలిగినవి. లేక, ఈశ్వరాధీనములైనవి. ఇందు, నేను చేయునది ఏది కలదు. సుఖదుఃఖానుభవములయొక్క విస్తారములు వ్యాధులవంటివి. సంపత్తులు, ఆపత్తులు, పుత్ర మిత్ర భార్యాదులతో గలుగు సంయోగములన్నియు, వియోగముకొరకే గలుగుచున్నవి. సంకల్పములు బుద్ధికి వ్యాధులే అగును కాని, సంతోష జనకములు కానేరవు. సంసారమునందు విహరించుట అంతయు దుఃఖమయమే. కాలము అన్నిటిని మ్రింగుటకు సిద్ధముగ నున్నది. "ప్రతిపదార్థములును నశించునే కాని, శాశ్వితముగ నిలువదు" అను నిశ్చయము ఏది కలదో, అది సామాన్యమగు అసంగ మనబడును. ఓ శ్రీరామా! ఇట్టి సామాన్య అసంగమును దృఢముగ అభ్యసించి సత్పురుషులను ఆశ్రయించి దుష్టులను పరిత్యజించి మనస్సునందు బ్రహ్మభావనను స్థిరపరచి నిరంతరము ధ్యానించుచు దృఢమగు పురుష ప్రయత్నముతో బ్రహ్మజ్ఞానాభ్యాసమును చేయుచుండిన ఆవస్తుతత్వజ్ఞానము దృఢమగును. కరతలామలకమువలె ( అనగా, అరచేతియందుండు ఉసిరకపండువలె ) సర్వ పదార్థములయందును బ్రహ్మము స్పష్టముగ గానవచ్చును. అప్పుడు "నేను కర్తను కాను. ఈశ్వరుడును కర్త కాడు. నాకు పూర్వజన్మ కర్మ అనునదియు లేదు" అని కాని "నేనుమాత్రము కర్తనుగాను. నాకు గలుగు సుఖదుఃఖములు ఈశ్వరాధీనములై కాని, కర్మాధీనములై కాని, కలుగుచున్నవి" అని కాని, చేయబడు సంకల్పములను దూరముగ విడిచి

నిస్సంకల్పుడై సమస్త కారణంబును త్రిలోకములయందును సారభూతము నగు సంసార సాగర తీరమునందు సుషుప్తి పదమును ఆశ్రయించి విశ్రాంతి నొందును. ఇదియే శ్రేష్ఠమని చెప్పబడిన అసంగము. ఏది లోప లగాని, వెలుపలగాని, క్రిందగాని, మీదగాని, దిక్కులయందుగాని, ఆకాశ మునందుగాని, పదార్థములయందుకాని, శూన్యమునందుకాని, జడమునం దుకాని, చేతనమునందుగాని, నిలువక సర్వమును ప్రకాశింపజేయుచు స్వ యంప్రకాశమై సర్వసంక్షోభరహితమై సంకల్పశూన్యమై ఆద్యంతములు లే నిదై ఉత్పత్తి వినాశములు లేనిదై సర్వమనోహరమై ఉన్నదో, అదియే (బ్రహ్మమే) శ్రేష్ఠమని చెప్పబడిన అసంగ మగును. సంతోషమను సువా సనచేత మిక్కిలి రమ్యమైనదియు, గురుశుశ్రూష, దైవభక్తి, మొదలగు సత్కార్యములే చిగురుటాకులుగ గలదియు, విఘ్నములను ముండ్లచేత వ్యాపింపబడిన చిత్తమను కాడయందు నిలచియున్నదియు, హృదయాకాశ మునందు మొలచినదియు, విచారణయను సూర్యునిచేత వికసింప జేయబడు చున్నదియు, నగు వివేకమను కమలము శ్రేష్ఠాసంగ మనదగిన ఈమూడవ భూమికను ఫలముగ ఫలించును.

—* భూమికాసంప్రాప్తి. *—

ఓరఘునందనా ! శ్రీరామా ! వినుము. అనేక జన్మములనుండియు చేయబడుచున్న పుణ్యకర్మలు ఒక్కటిగగూడి ఫలించేనేని అప్పుడు " కాక తాళీయ న్యాయమున " శుభేచ్ఛ అను మొదటి భూమిక జనించును. అప్పుడు అది భూమిలోపలనుండి తలచూపిమాత్రమే ఉన్న మొలకవలె మిక్కిలి దుర్బలమై ఉండును. అది అమృతమయమైన మొలక కావున దా నిని వివేకమను నీటితో మహాప్రయత్నముచేత పెంచవలయును. మఱియు భూమిని దున్ని జీవించువాడు తగిన ఎరువువేసి మొలకలను అభివృద్ధి చేయు నట్లు ఆశుభేచ్ఛను తగిన విచారముతో అభివృద్ధి చేయవలయును. అది ఏప దార్థముపైనున్న విసుకుచే జనించెనో, ఆపదార్థమును గూర్చియే పలు మారు విమర్శింపు చుండవలయును. శుభేచ్ఛకు సామాన్యాకారము వైరా గ్యము. అది సంసారములో ఏదియో ఒక పదార్థమునందు గల దోషము ను గ్రహించుటచేత సామాన్యముగా గలుగును. కావున దాని ఉత్పత్తికి ఏపదార్థము కారణమో, అదియే పలుమారు విమర్శింప బడునేని ఆవైరా గ్యము స్థిరముగ నిలుచును. ఈ ప్రథమ భూమికయే బాగుగ అభివృద్ధి చేయబడునేని క్రమక్రమముగ తక్కిన భూమికలను జనింప జేయును. కా

వున దీనిని రక్షించి ప్రయత్న బలముననే రెండవ భూమికను సంపాదింప
వలయును. దానినుండి మూడవ భూమికను పొందవలయును. మూడవ భూ
మిక అనగా, శ్రేష్ఠమని చెప్పబడిన అసంగమే. ఇది ఫలరూపమైనది. దీని
యందు నిలచిన పురుషుడు సర్వ సంకల్ప రహితుడై ఒప్పును. అదియే
కదా ముక్తి. కావున మహా ప్రయత్నముతో దీనిని సాధింపవలయును.
తక్కిన నాలుగు భూమికలును సమాధి తారతమ్యములవలన ఏర్పడిన జీవ
న్ముక్త విదేహముక్త స్థితి భేదములే కాని, వేఱుకాదు. అందు క్రొత్తగా,
సంపాదింప వలసినది ఏదియు లేదు. అని వశిష్ఠమహర్షి చెప్పిన విని శ్రీరా
మచంద్రుడు ఇట్లనియె.

## —* మూఢయోగభ్రష్టులగతి. *—

ఓమహాత్మా! వశిష్ఠమహామునీ! ఒకానొక పురుషుడు మూఢుడై
శ్రేష్ఠమైన కుల జాతుడుగాక ప్రవృత్తి మార్గముననుండి అధముడై యో
గము పొంతబోక ఉన్నవాడు కడతేరువిధము ఎద్ది? మఱియు యోగముచే
యుచున్నవాడే యైనను, దానియందు సంపూర్ణ సిద్ధి నొందక ఒక్క భూ
మికనేగాని, రెంటినిగాని, మూటినిగాని, అధిరోహించి అంతలోనే, మృ
తినొందిన వానిగతి ఏమి అగును? అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియె.
ఓశ్రీరామా! నీవు చెప్పినట్లు అత్యంత మూఢుడై సంసార దోషములను
ఎఱుగక ఉండువానికి జన్మాంతర సంస్కారవశమువలన ప్రథమభూమిక
ఉదయించునంతవరకు సంసారము నియతమేయై యుండును. అట్లుకాకున్న
ను, కాకతాళీయ న్యాయమున సత్పురుష సమాగమము దొరికెనేని విచా
రమువలన సంసార దోషములు మనస్సునకు తట్టి ఆకస్మికముగ వైరాగ్య
ము పుట్టినను, పుట్టవచ్చును. వైరాగ్యము గలిగిన వెంటనే ప్రథమ భూమిక
జనించును. వెంటనే క్రమ క్రమముగ మోక్షము కలుగును. ఓశ్రీరామా!
ఇదియే సర్వశాస్త్ర సిద్ధాంతము. ఇక యోగభ్రష్టుని విధమును వినుము.
వాడు ఎన్నవ భూమికను అధిరోహించి మృతుడగునో, ఆభూమికానుసార
ముగ పూర్వపాపము నశించిపోవును.

శ్లో॥ తత స్సుర విమానేషు లోకపాల పురేషు చ ।
మేరు పర్వత కుంజేషు రమతే రమణీసఖః ॥

శ్లో॥ తత స్సుకృత సంభారే దుష్కృతేచ పురాకృతే ।
భోగక్షయా త్పరిక్షీణే జాయంతే యోగినో భువి ॥

శ్లో॥ శుచీనాం శ్రీమతాం గేహే గుప్తే గుణవతాం సతామ్ ।
జనిత్వా యోగమేవైతే సేవంతే యోగ వాసితాః ॥

ఓ శ్రీరామా ! అట్లు పాపము నశింపగానే అతడు మరణానంతర మున అప్సరస్త్రీసమేతుఁడై స్వర్గలోకమునందును, దేవ విమానములయం దును, లోకపాలుర పట్టణములయందును, మేరుపర్వతముల యందలి పొదరిం డ్లయందును, క్రీడించుచుండును. ఆభోగములచేత పూర్వార్జిత పుణ్యమం తయు నశించును. పాపము అదివరకే పోయెను కదా. ఇట్లు పుణ్యపాప వినిర్ముక్తుఁడై వాడు మరల భూలోకమునందు యోగియై జనించును. భూమిక లన్నియు సిద్ధింపలేదు. కావున వానికి కొంత పాపము ఇంకను జన్మకార ణమై శేషించి ఉండును. పుణ్యమును, మనుష్య లోకమునందు అనుభవింప బడవలసిన భాగము మిగిలియే ఉండును. చిత్తమునందు యోగసంస్కార ముకూడ దృఢమై సమాప్తిని గోరుచు నుండును. కావున కర్మవశముచేత జన్మము ఎత్తి యోగ సంస్కారవశమున యోగి యగును. పుణ్యవశమున పరిశుద్ధులును, ధనవంతులును, ధర్మపరులును,నగు వారియింట జన్మించును. పూర్వ సంస్కారమువలన జ్ఞానము వచ్చినది మొదలు మోక్షమునే కోరు చు మరల యోగమునే ఆచరించును. ఆజన్మమునందు అప్రయత్నముగనే అతిశీఘ్రముగనే పూర్వాభ్యస్తములగు భూమికలు సిద్ధించును. కావున అత్యల్పకాలములోనే వారు అనంతర భూమికలను ఆరోహించుటకు ప్రయ త్నించువారలగుదురు. ఓరామచంద్రా ! మీప్రశ్నములకు ఉత్తర మిచ్చితిని. ప్రకృతమును వినుము. పైన వర్ణింపబడిన మూడు భూమికలును జాగ్రదవస్థ అనబడును. ఈభూమికలయందును బుద్ధికలదు. కావున ఇచ్చట జాగ్రదవ స్థయందువలె భేదము విస్పష్టమై ఉన్నదికదా ? ఈ ప్రపంచమునందు యో గులకుగల సామాన్య చిహ్నము ఏది అనిన ఆర్యత్వమే. వారిని చూచినతో డనే మూఢునకుగూడ మోక్షేచ్ఛ కలుగును.

—* ఆర్యలక్షణము. *—

ఓ శ్రీరామా ! ధర్మయుక్తమగు కార్యమును యథేచ్ఛముగ చే యుచు చేయరానిపనిని చేయక తటస్థించినదానిని అనువర్తింపుచు గడచిన దానికి వగవక నుండువాడు ఆర్యుడు. లోకాచారమును అనుసరించి మన స్సునకును శాస్త్రమునకును విరుద్ధముగాకుండ ఉన్నదానిని ఉన్నట్లుగా గ్రహించి ఎవడు వ్యవహారమును చేయునో, వాడు ఆర్యుడు. ఇట్టి ఈఆర్య త్వము ప్రథమ భూమికయందు అంకురించును. రెండవ భూమిక రాగానే,

పుష్పించును. మూడవ భూమికను అధిరోహించినతోడనే ఫలించును. ఇట్టి ఫలముఁ బొంది తక్కిన భూమికలను అధిరోహింపకయే మృతినొందిన యోగి సంకల్ప జనితములగు నానాభోగములను అనుభవించి కొంతకాలమునకు భూలోకమునందు యోగిగా జన్మించును. (మూడవ భూమికను అధిరోహించినవాడు సంకల్పజన్య భోగములను అనుభవించుననుటచేత అప్పటికి సర్వకర్మములును నిశ్శేషముగ నశించునని నిర్ణయింప వలసియున్నది. అప్పటికిని భోగేచ్ఛ ఇంచుకయైనను శేషించి ఉండునేని అప్పుడు సంకల్పమయ భోగములు కలుగుననియు, కొంత తీరక పోయెనే అను సంకల్పము కలదేని దానికై రెండవజన్మము సంకల్పప్రభావముతోనే వచ్చుననియు లేకున్న ఏదియు లేదనియు, అదియే విదేహముక్తి అనియు, నిర్ణయింప వలసి యున్నది.)

—* నాలుగవ భూమికను పొందినవానిలక్షణము. *—

ఓ రామచంద్రా! ఇక నాలుగవ భూమికను ఆశ్రయించినవారి విధమును వినుము. పైనవర్ణించిన మూడు భూమికలను దృఢముగ అభ్యాసముచేయుటవలన వారి అజ్ఞానము అంతయు నశించును. శ్రేష్ఠమగు బ్రహ్మజ్ఞానము కలుగును. మనస్సు పూర్ణచంద్రోదయ కాలమువలె మిక్కిలి ప్రసన్నమగును. ఆద్యంతశూన్యమగు పరబ్రహ్మతత్వమునందే నిలుకడ నొందును. కావున వారు సర్వపదార్థములను బ్రహ్మాభిన్నములనుగా జూతురు. వారి హృదయమునందు ఏకత్వము స్థిరమగును. భేదము తొలగిపోవును. కావున వారికి ఈ ప్రపంచము అంతయును కలవలె తోచును. మొదటి మూడు భూమికలును జాగ్రదవస్థ అనబడునని ముందేచెప్పితిని. ఈనాలుగవ భూమిక స్వప్నమనబడును. ఇందు చిత్తము శరత్కాల మేఘము సూర్యకాంతిలో లీనమగునట్లు పరమేశ్వరునియందు లీనమగును. ప్రతిపదార్థమునందును పరమేశ్వరునే చూచును కదా?

—* ఐదవ భూమిక నొందినవాని లక్షణము. *—

ఓ శ్రీరామా! ఐదవ భూమికయందు చిత్తము బొత్తిగనే ఉండదు. సత్త (ఉనికి) మాత్రమే శేషించి ఉండును. కావున ఆభూమికను ఆశ్రయించినవానికి ప్రపంచమే కానరాదు. ఈకారణమువలన దీనికి సుషుప్తమని పేరు. దీనిని ఆశ్రయించిన యోగి సర్వభేదములును లేక, కేవల పరబ్రహ్మమునందే నిలచి ఉండును. ఐదవ భూమికను ఆశ్రయించిన యోగి భేదసంకల్పము కొంచెమైనను లేక, నిత్యతృప్తుడై విజ్ఞానవంతుడై సుషు

ప్తిని జెందిన వానివలెనే ఉండును. బాహ్యవ్యాపారములను చేయుచు ఉన్నను అంతర్ముఖుడేయై సంక్షోభశూన్యుడై నిదురించువానివలెనే కానవచ్చుచుండును.

—* ఆఱవభూమిక నొందినవాని లక్షణము. *—

ఓ శ్రీరామా ! ఈ అయిదవ భూమికను క్రమముగ అభ్యసింపగా, అభ్యసింపగా, వాసనలు నశించి తనంతనే ఆఱవభూమిక వచ్చును. దానికి తుర్యావస్థ యని పేరు. ఈభూమికను ఆశ్రయించిన యోగి ఇంద్రియగోచరుడగుటచేత అసద్రూపుడు కాడు. పరబ్రహ్మమే అగుటచేత ఇంద్రియములకు అగోచరుడగుటచే సద్రూపుడును గాడు. అభిమానము లేకపోవుటచేత అహంశబ్దవాచ్యుడు కానేరడు. దేహమును స్వవ్యాపారములయందు ప్రవర్తింప జేయువాడే అగుటచేత అహంకార శూన్యుడును కాడు. ఇట్టివాడై సంకల్పములు బొత్తిగనే లేక, భేదమనునదియే లేక, ఉండును. మనోరూపమగు హృదయగ్రంథి లేనివాడును సర్వసంశయ వర్జితుడును బ్రతికియు సర్వసంబంధ వర్జితుడగుటచేత ముక్తినొందినవాడును, భావనయే లేనివాడును, భేదాభేదములను అంటనివాడును, ఇంద్రియ వ్యాపారములు అస్తమించుటచేత వినాశము నొందనివాడైనను, మనోలయముచేత నశించినవాడును, చిత్తరువునందు లిఖింపబడిన దీపమువలె నిశ్చల ప్రకాశము కలవాడునై ఉండును.

శ్లో॥ అంతశ్శూన్యో బహిశ్శూన్య శ్శూన్యకుంభ ఇవాంబరే ।
అంతఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవార్ణవే ॥

ఓ శ్రీరామా ! ప్రపంచకారణములగు సంస్కారములు లేకుండుటచేత లోపలను, పరమేశ్వరుడు ఒకడే కాని, అన్యము ఏదియు లేదనుటచేత వెలుపలను, శూన్యుడై ఆకాశమునందున్న శూన్యకుంభమువలె నిలచియుండును. ఆశూన్యకుంభమునకును లోపల ఏపదార్థమును లేకుండుటచేతను చుట్టును ఉన్నది ఆకాశమే అగుటచేతను అంతట శూన్యమే కదా. మఱియు లోపల ఆత్మబ్రహ్మభావన ఉండుటచేతను, వెలుపల ప్రపంచమంతయు బ్రహ్మరూపమే అను భావన ఉండుటచేతను అన్ని వైపులను పరిపూర్ణుడేయై సముద్రమధ్యమునందు ఉన్న జలపూర్ణ కుంభమువలెగూడనుండును.

—* ఏడవభూమికను బొందినవాని లక్షణము. *—

ఓరామచంద్రా! ఆఱవభూమికయందు ఉన్నవానిస్థితి యిట్టిది ఏది

త్కృష్టమైనది. దానికి బ్రహ్మప్రాప్తి కలుగును. దానిని విచారించిన ఆబ్రహ్మ
ము సంసారదశయందు అపూర్వము. ( శ్రోత్రది ) స్వాభావికముగ స్వత
స్సిద్ధము. ఏపురుషుడైనను తాను ఒక క్రొత్తపదార్థము జెందునేని అప్పుడే
“ వీడు ఈపదార్థమును సంపాదించెను ” అని చెప్పబడును. ఆపదార్థము
స్వభావ సిద్ధమై స్వస్వరూపాభిన్నమై ఉండునేని అట్లు చెప్పబడదు. ప్రస్తు
త యోగివిషయమునందు ఈ రెండును సంభవించుచున్నవి. బ్రహ్మము దశా
భేదమువలన రెండు విధములుగగూడ ఉన్నదికదా ? కావున ఇతనిగూర్చి
“ వీడు ఒక పదార్థమును సంపాదించెను. సంపాదింపలేదు ” అని చెప్పవ
లసి వచ్చుచున్నది. ఇట్లు అనిర్వచనీయ ప్రభావుడై ఆరవ భూమికనుండి
అభ్యాసపాటవమువలన సప్తమభూమికను ఆశ్రయించును. ఇదియే విదేహ
కైవల్యము అని చెప్పబడును. దీనిని వర్ణించుటకు సాధ్యము కాదు. ఇదియే
జ్ఞానభూమికలలో కట్టకడపటిది. సంసార సముద్రమునకు ఆవలిదరి. ఈస
ప్తమ భూమికనే కొందరు శివుడనియు, కొందరు బ్రహ్మయనియు, మఱి
కొందరు విష్ణువనియు, వేఱొక కొందరు శూన్యమనియు, చెప్పుచున్నారు.
కొందరు అచేతన పదార్థమనియు, కొందరు కాలమనియు, మఱికొందరు
ప్రకృతి పురుష విభాగ మనియు, వర్ణింపుచున్నారు. మఱియు అనేకులు
అనేకవిధములుగ వచియింపుచున్నారు. వాస్తవస్థితిలో ఈకైవల్యము
శుద్ధబ్రహ్మమే అగుటచేత దీనిని ఎట్లును నిర్దేశించుటకు వీలులేదు. ఇట్లయి
నను వారువారు స్వమతానుసారముగ ఆత్మయందు కల్పింపబడిన నామ
రూపాదులతో దీనిని వ్యవహరించుచున్నారు. ఓరామచంద్రా! నీకు ఏడు
విధములగు భూమికలను సవిస్తారముగ వివరించి చెప్పితిని. వీనిని అభ్య
సించిన దుఃఖము కలుగదు.

——* ఇచ్ఛాజయము ప్రధానమనుట. *——

ఓశ్రీరామా ! మఱియొక విశేషము. అమితమగు మదముతోగూడి
యుద్ధములయందు ఆసక్తిగలదై గొప్పదంతములు గలిగి మృదు మంద గమ
నముతో సంచరించుచుండు ఒక ఏనుగు కలదు. అదియే పురుషునకు సర్వ
విధములచేతను అనర్థములు గావించుచున్నది. దానిని సంహరింపకుండిన
పురుషుడు ఈభూమికలయందు సిద్ధి నొందడు. తనపరాక్రమముచేత ఆఏను
గును జయింపకుండునేని వాడు ఏటివీరుడు. యుద్ధములయందు వానికి
ఎక్కడిజయము ? ఎక్కడి సంపద ? అని చెప్పిన శ్రీరామచంద్రుడు ఇట్ల
నెను. ఓమహాత్మా ! ఆఏనుగు ఎయ్యది. యుద్ధభూములు ఏవి. దానిని

జయించు ఉపాయము ఎద్ది ? అది ఎచ్చోట సంచరించు చుండును. అని అడిగిన వశిష్ఠమహాముని ఇట్లనియెను. ఆ ఏనుగు ఇచ్ఛయే. అది మదించి శరీరమను అరణ్యమునందు నివసించుచు బహువిధములగు విలాసములను ఆచరింపు చున్నది. దానికి " ఇది నాకు కావలయును " అను సంకల్పమే స్వరూపము. ఇంద్రియములు బిడ్డలు. నాలుకయే కంఠస్వరము. మనస్సనునది దానికి ముఖ్య నివాసస్థానమగు అరణ్య మధ్య ప్రదేశము. ధర్మాధర్మరూపములగు కర్మలే దానిదంతములు. సర్వవ్యాపకములై ఉండు సంసారసమూహమే ఆ ఏనుగుకు మదము. ఇట్టి ఈ ఆశాగజము దీనులై సంసారబద్ధులై ఉన్న జీవులను సంహరించు చుండును. బాధించు చుండును. సంసారదృష్టులే దానికి యుద్ధభూములు. వీరుడగువాడు యుద్ధ భూములయందు జయాపజయముల నొందునట్లు జీవులు సంసార దశయందు ఆశతో యుద్ధము చేసి జయ పరాజయములను అనుభవించు చుందురు. వివేకియగువాడు సంసారదశయందే ఆ ఇచ్ఛను జయించును. అవివేకి దానికి లోబడును. మఱియు వాసన, ఈహ, మనస్సు, చిత్తము, సంకల్పము, భావనము, స్పృహ, అను మొదలగునవి అన్నియు ఈ ఆశాగజమునకు నామధేయములు. ఇవియే అననేల ? ఎవ్వడెవ్వడు ఏనామమును చెప్పునో, అదియంతయు దీని నామమే. ఇచ్ఛవలననే కదా, మనుష్యుడు మనుష్యుడయ్యెను. ఇతరపదార్థములును ఆయాపదార్థరూపము జెందెను. ఇట్లయినను, ఈఏనుగు సర్వరూపిణియేయైనను, బాగుగ విచారించిన దీనికి స్వరూపమే లేదు. ఇది మిథ్యయే. కావున దీనిని జయించుటకు ప్రయాస-లేదు. సులభసాధ్యమగు ఒకఁ శస్త్రము కలదు. అదియు సర్వవ్యాపక మైనదియే. దానిపేరు ధైర్యము. ఏపురుషుడు ఆమహాస్త్రమును గైకొని ఎదురించునో, వానిని చూడగనే ఆ ఏనుగు అదృశ్యమై పోవును. ఎంతకాలమువరకు ఈ ఆశాగజము " ఇది నాకు కావలయును. ఇది నాకు కావలయును. అను ఆకారముతో చిత్తమునందు విజృంభించు చుండునో, అంతవరకు సంసారమను విషూచికావ్యాధి అత్యుగ్రరూపమై అనువర్తింపు చుండును.

ఓరామచంద్రా! జ్ఞానశాస్త్రార్థమును రెండుమాటలలో చెప్పెదను. వినుము " ఇది నాకుకావలయును " అను సంకల్పము ఏది కలదో, అదియే సంసారము. ఆసంకల్పము నశించుటయే మోక్షము. ఈవిధముగ ఏపురుషుడు ఇచ్ఛను జయించి పరిశుద్ధమగు ఆకారముతో నుండునో, అట్టివాని యొకఁ మనస్సునందు " అద్దమునందు తైలబిందువు వలె " గురూపదేశ

వాక్యము విశ్రమించెను. నిర్మలమగుటచేత ఆమనస్సునుకూడ నిర్మలము చేయ గలుగును. ఈకారణమువలన ఈ ఇచ్ఛ ఏమాత్రము తలజూపినను తత్క్షణమే ఖండింప బడవలసినదే. అది సర్వానర్థములను గలిగించునది. విషవృక్షములు ఎవరును ఉపేక్షింతురు. నిస్సంకల్ప స్థితియను శస్త్రము ఈవిషయమునందు ఉపయోగించునని ఇదివరకే చెప్పి యున్నాముకదా ? ఇచ్ఛ ఉన్నంతకాలము జీవునికి సుఖము లేదు. దైన్యము పోదు. కావున అవశ్యముగ ఇచ్ఛను జయింపవలయును. అదియు పదార్థభావనము లేకుం డుట, అను అల్పకార్యముచేత నశించిపోవునని చెప్పియున్నాము. మనస్సు ఊరక ఉండుటయే అసంవేదనము అనబడును. ఇదియే ఇచ్ఛను జయించు టకు ప్రధాన శస్త్రము. దీనికే ప్రత్యాహారమని పేరు. ఇంతమాత్రపు కార్యమునకు పాలుమాలి చెడుట ఎంత వెర్రితనము. " ఇది నాకు కావ లయును " అను సంకల్పమే కల్పన అనియు, అట్టి సంకల్పము లేకుండుట యే కల్పనా పరిత్యాగమనియు, పెద్దలు చెప్పుదురు. మఱియు గడచినదా నిని స్మరించుటయే సంకల్పమనియు, అదిలేకుండుటయే సంకల్ప రాహిత్య మనియు, జెప్పుచున్నారు. సంకల్ప రాహిత్యమే పరబ్రహ్మ రూపము. కా వున ఇదివరకు అనుభవింపబడినట్టికాని, లేనట్టికాని, పదార్థములను భావిం చుటయే స్వరూపముగాగల స్మృతిని విడువ వలయును. అట్లు విడిచి కా ష్ఠమువలె మూఢుడవై యుండుము. మనస్సు లేకుండుటచేత మౌఢ్యము నొందియును, తత్త్వము నెఱిగినవాడవు అగుటచేత బుద్ధిమంతుడవై యుం డుము.

శ్లో॥ ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష నచ కశ్చిచ్ఛృణోతి తత్ ।
అసంకల్పః పరం శ్రేయః స కిమంత ర్నభావ్యతే ॥

ఓ రామచంద్రా ! నేను హస్తములను పైకెత్తి అఱచుచున్నాను. సంకల్పములను విడిచిన అదియే మోక్షము. దానిని మీరు ఏల అంగీకరింప రు. ఓజనులారా ! నిరర్థకముగ ఏల చెడిపోయెదరు. ఏదీ నామాటను ఎవ్వరును వినువారు లేరు. ఎంత విచిత్రముగా నున్నదో, చూడుము. సం సారదశయందు ఉన్నప్పుడు మనుష్యులు తీరిక లేకుండునట్లు బహువిధము లగు కార్యములను చేయుచున్నారు. అది మిక్కిలి వారికి శ్రమను కలిగించు చున్నది. అంత శ్రమపడినను వారికి కలుగు ఫలము అత్యల్పముగా ఉన్నది. మోక్షవిషయమై ప్రయత్నింపబోయిన అప్పుడు చేయవలసిన కార్యము ఏమియు లేదు. ఊరక కూర్చుండినం జాలును. దానివలన కలుగు ఫలమా,

వర్ణనాతీతము. ఆహా, ఇట్లుండియు జనులు మోక్షమును అభిలషింపక ఉన్నారు. "ఊరికె ఉండిన వ్యవహారము ఎట్లు జరుగును ? విశేష వ్యవహారములు లేకున్నను భోజనాదులైన అవశ్యముగ జరుగవలయునుకదా" అనిమెదవేమో వినుము. ఒక గ్రామమునుండి మఱియొక గ్రామమునకు బోవ ప్రయాణమైనవాడు తన గమ్యస్థానమును గూర్చియే ఉద్దేశించుచుండును. అట్లయినను వానియొక్క పాదములు నడచుచునే ఉన్నవి. ప్రతి అడుగునకును "నేను అడుగు వేయవలెను" అని పురుషుడు సంకల్పించుచున్నాడా ? ( లేదు ) కావున ఈదృష్టాంతమునందు సంకల్ప రహితముగనే సంచారరూప కార్యము ఎట్లు జరుగుచున్నదో, అట్లె మనస్సు సంకల్పరహితమై ఉన్నను, సర్వకార్యములును యథాపూర్వముగనే జరుగవచ్చును.

శ్లో॥ బహునాత్ర కిముక్తేన సంక్షేపా దిదముచ్యతే ।
సంకల్పనం పరో బంధ స్తదభావో విముక్తతా ॥

ఓ శ్రీరామా ! అధికముగ జెప్పనేల ? సంక్షేపముగ సర్వార్థమును వివరించెదను. సంకల్పమే బంధము. అదిలేకుండుటయే మోక్షము. కావున నీవు సర్వ సంకల్ప వర్జితుడవై ఈసర్వ ప్రపంచమును శాంతరూపముగాను, ఆద్యంతములు లేనిదిగాను, శాశ్వతముగాను, వృద్ధిక్షయములు లేనిదిగాను, నిత్యసిద్ధమైనదిగాను జ్ఞానమాత్ర స్వరూపమును గాను, చూచుచు శాంతుడవై యథాసుఖముగ ఉండుము. సంకల్పరాహిత్యమే యోగమని పెద్దలు చెప్పెదరు. మఱియు సంక్షోభరహితముగ నుండుటయే యోగమని మహాత్ములు పలుకుచున్నారు. ఇట్టియోగమును ఆశ్రయించి నీవు వేద శాస్త్రోక్త కర్మములను ఆచరింపుము. విరుద్ధ కర్మములను ఆచరింపకుము. సంకల్ప రాహిత్యమే చిత్తనాశము. అదియే యోగము. దానిని ఆశ్రయించి స్వస్వరూపముతో నిలువుము.

శ్లో॥ అహం మమేతి సంవిద న్నదుఃఖతో విముచ్యసే ।
అసంవిద న్విముచ్యసే యదీప్సితం తదాచర ॥

ఓరామచంద్రా ! "నేను, నాది" అని సంకల్పించుచుందువేని నీయొక్క దుఃఖము ఎన్నటికిని అణగదు. అట్టి సంకల్పము లేకున్న తత్క్షణమే అణగును. ఇందునీకు ఏమార్గము రుచించునో, దానిని అవలంబింపుము.

శ్లో॥ శివం సర్వగతం శాంతం బోధాత్మక మజం శుభమ్ ।
తదేక భావనం రామ కర్మత్యాగ ఇతి స్మృతః ॥

ఓ శ్రీరామా! పరమానంద స్వరూపమగు ఆపరబ్రహ్మము సర్వ సంక్షోభ రహితమై జ్ఞానమాత్ర స్వరూపమై మంగళకరమై జన్మమృత్యు శూన్యమై సర్వమును వ్యాపించియున్నది. ఇతర పదార్థములను విడచి ఆబ్రహ్మమునే ఏకాగ్రచిత్తముతో భావించుటయే కర్మత్యాగము అనబడుచున్నది. ఇంతయేగాని, కర్మత్యాగము అనగా, కర్మలను పరిత్యజించుట కాదు.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున సప్తభూమికోపాఖ్యానమను
నలుబదిమూడవ సర్గము ముగిసెను.

—*—

—* శాస్త్రఫలనిరూపణము. *—

శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునితో ఇట్లనియె. ఓ భారద్వాజా! ఆవశిష్ఠమహాముని ఈవిధముగ ఉపన్యసించి ముగించు నప్పటికి సూర్యుడు అస్తమించెను. అంత సభయంతయు వశిష్ఠమహామునికి నమస్కరించి సాయంకాల స్నానాదులను చేయుటకై వెడలిపోయిరి. రాత్రియు క్రమక్రమముగ క్షీణించెను. సూర్యోదయము కాగానే సభయెల్ల మఱల సంపూర్ణముగ నిండియుండెను. అట్టియెడ వశిష్ఠమహామునియు శ్రీరామప్రశ్నమునకు ఉత్తరమిచ్చుచు సర్వశాస్త్రార్థమును మఱల ఉపదేశింప నారంభించెను. ఇట్లు శ్రీరామచంద్రుడు పదునెనిమిది దినములు వశిష్ఠమహామునితో ఆత్మవిచారము చేసెను. నిస్సంశయుడై చాంచల్యములేని సముద్రము వలె తత్త్వపరిపూర్ణుడై సంసార రోగమును జయించి నిలచెను. ఆక్షణముననే పరమసంతుష్టులై దేవతలు ముత్యములవలె అతి స్వచ్ఛములగు కల్పవృక్ష పుష్పములను ఆకాశమంతయు నిండునట్లు వర్షించిరి. ఈవిధముగ రామనామముతో మనుష్యలోకమునందు అవతరించిన మహావిష్ణువు సంసారమువలన భిన్నుడు గాగా, వశిష్ఠమహామునిచేత ప్రబోధింప బడెను. ఈప్రకారముగ ఉపదేశము ముగియగానే, ఆరామచంద్రుడు తమ్ములతోను, తండ్రితోను, గూడి ఆవశిష్ఠమహామునికి పూజలు చేసి నమస్కరించి ఇట్లనియె. ఓమహాత్మా! వశిష్ఠమహామునీ! మీ అనుగ్రహముచేత నాసంశయములెల్ల దీరినవి. నామనస్సు తాపశూన్యమై సంక్షోభములు లేక, చల్లనై నిర్వికారమై ఉన్నది. ఓమహాత్మా! మీరు గురువులగుటచేత నాతాపమెల్ల జల్లారినది. మీరే నాకు సర్వదేవ స్వరూపులు. సూర్యునివలె నాయొకర-

హృదయమునందలి అజ్ఞానాంధకారము నంతయును అణచివేసితిరి. మీరు సర్వజ్ఞులు. అని ఇట్లు అనేకవిధముల నుతించిన పిమ్మట ఆవశిష్ఠమహాముని యొక్క తన ఉపన్యాసమును వినుటకై వచ్చి ఆకాశమునందు నిలచియున్న దేవతలను పిలిచి రామునకు జూపెను. వారలలో దేవగణములన్నియు చేరియే యుండెను. సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, గంధర్వులు, కిన్నరులు, యక్షులు, నాగకుమారులు, మొదలగువారందరు వారలలో నుండిరి. శ్రీరాముడును వారలను జూచి భక్తియుక్తుడై నమస్కరించెను. అప్పుడు ఆదేవతలు సంతుష్టులై ఇట్లనిరి.

ఓరామచంద్రా! మహాత్మా! నీకు వశిష్ఠమహాముని చేసిన ఉపదేశమును నీవడిగిన ప్రశ్నలను, మేము సమగ్రముగ విన్నాము. నిస్సంశయమగు జ్ఞానముతో తృప్తులమైతిమి. మీరు ఇరువురును త్రిభువనములయందును గల అజ్ఞానాంధకారమునెల్ల అణగింప జనించిన మహానుభావులు. మీఉభయులకు వందనములు. ఓమహాత్మా! నీకును మీగురువగు వశిష్ఠమహామునికిని జరిగిన సంవాదమంతయును మోక్షప్రదము. ఇదియేజ్ఞానము. అని దేవతలు చెప్పిరి. అనిఇట్లు శ్రీవాల్మీకిమహర్షి శిష్యుడైన భరద్వాజునితో చెప్పి మరల ఇట్లనియె. ఓభారద్వాజా! ఇట్లు దేవతలు ప్రశంసించి ఆరామ వశిష్ఠులచేత అనుజ్ఞ తీసికొని సిద్ధులు మొదలగువారందఱును లోకహితార్థమై ఈజ్ఞాన శాస్త్రమును కాశ్మీరదేశమునందలి అయోధ్యలో ప్రకటించి అంతర్ధానము నొందిరి. పిమ్మట రామచంద్రుడు " జనకమహారాజువలె " అహంకార మమకార వర్జితుడై రాగద్వేష శూన్యుడై తత్త్వవేత్తయై జీవన్ముక్తుడై సర్వకార్యములను చేయుచుండెను. " తామరాకు నీటియందు మునిగినను ఆనీరు దానికి అంటనట్లు " ఆరాముని చిత్తమును రాజ్యభోగములయందు సంసక్తము కాకుండెను. " పాములవాడు పామునోట వ్రేలు పెట్టినను బాధ పడనియట్లు " ఆశ్రీరాముని మనస్సుకూడ సంసారమునందు తిరుగు చున్నను, వికారము నొందలేదు.

శ్లో॥ శాస్త్రం త్విదం విరక్తా యే సత్సంగా స్సతిక్రియాపరాః ।
తేషాం ధర్మాత్మనామేవ ప్రదాతవ్యం ప్రయత్నతః ॥

మఱియు ఓభరద్వాజా ! ఈశాస్త్రమును అందఱకును ఉపదేశింపరాదు. ఎవ్వరు ధర్మాత్ములై విరక్తులై సత్పురుష సహవాసమును ఆచరించువారై యుందురో, అట్టివారికే ప్రయత్నపూర్వకముగ ఉపదేశింప వలయును. నీమనస్సు లోకోపకారము చేయుటకు అభిలాష కలదై ఉండునేని

అప్పుడు నీవు చేయవలసిన పని విద్యాదానమే. ఇతరదానము ఏదియు దీని
వలె లోకమును ఉద్ధరింప నేరదు.

శ్లో॥ దుర్గ్రహగ్రస్త మనసా మసాధూనాం ప్రమాదినామ్ ।
నిందకానా మిదం శాస్త్రం రహస్యం న ప్రకాశయేత్ ॥

ఓభరద్వాజా ! ఎవ్వరు దురభిమానము కలిగి ఉందురో, దుష్టులై
యుందురో, పొరబాటు గలిగి నిలకడలేక, ఉందురో, నిందాపరులై దేని
యందును విశ్వాసము లేక, ఉందురో, అట్టివారికి ఈశాస్త్రమును ప్రకటిం
పకూడదు.

శ్లో॥ పూర్వం నారాధితో యేన భగవా నిందుశేఖరః ।
హరి ర్బ్రహ్మా రవిశ్చాపి నలభే దిద మచ్ఛృతమ్ ॥

ఓభరద్వాజా! పూర్వజన్మమునందు ఎవరు శంకరునిగాని, విష్ణువును
గాని, చతుర్ముఖుడైన బ్రహ్మదేవుని గాని, సూర్యునిగాని, పూజించియుండ
రో ( అనగా సగుణోపాసన ఆచరించి యుండరో ) అట్టివారికి ఈదివ్యజ్ఞా
నము దొరకదు. పరమేశ్వరుడు పార్వతీదేవికి ఉపదేశించినదియు, విష్ణువు
నారదాది మహర్షులకు బోధించినదియు ఈజ్ఞానమునే. ఓభరద్వాజా !
క్షీరసముద్రమువలె అనంతమైన మోక్షోపాయమని చెప్పదగిన వశిష్ఠ రామ
సంవాదమునుండి అమృతమునువలె ఈ అల్పవిషయమును గ్రహించి నీకు
ఉపదేశించితిని. ఓభరద్వాజా ! దీనిని సామాన్యముగ విచారించెనేని అంత
మాత్రముచేతనే వానియొక్క పాపమంతయు క్షీణించును. ఇక శ్రద్ధగలిగి
బాగుగ విచారించిన ముక్తినొందనివాడెవ్వడుండును ?

శ్లో॥ ఏకవేల మధీతేన శాస్త్రేణానేన కిల్బిషమ్ ।
ప్రణశ్యతి నృణాం సర్వం క్షిప్రం బోధశ్చ జాయతే ॥

ఓభరద్వాజా ! ఈశాస్త్రమును ఒకమాఱు సమగ్రముగ బఠించు
నేని వానికి సర్వపాపక్షయమై శీఘ్రముగ జ్ఞానోదయముకూడ గలుగును.
ఎవ్వడు స్వయముగ జ్ఞానవంతుడు గాకయు, భక్తియుక్తుడై దీనిని పఠించు
నో, అట్టివానికిగూడ నైర్మల్యము కలుగును. చిత్తము స్వచ్ఛమగును. ఇందు
సంశయము లేదు. మూఢులైనను, మోక్షేచ్ఛువులైనను నియమము కల
వారైనను, లేనివారైనను, దీనిని విచారింప వలయును. కరతలామలకముగ
పరబ్రహ్మమును జూపునట్టి ఈశాస్త్రము విచారించుటకైనా, అందఱికిని
దొరుకునది కాదు. ఇట్లు గాక, కొంచెము వివేకవంతులగువారికి అతి శీఘ్ర
ముగా ఈశాస్త్రము అజ్ఞానమును పోగొట్టి వికాసమును కలిగించును.

ఈ కార్యమునందు దీనితో సాటియగునది మఱియొకటి లేదు. ఇది భుక్తి ముక్తులను ఇచ్చునది. యోగులకు మిక్కిలి ప్రేమాస్పదమైనది. అరచేతిలో నున్న పదార్థమువలె పరమేశ్వరుని అతి సులభముగ ఆశ్రయింపజేయునది. ఇట్టి ఈశాస్త్రమును సంపాదించుటకును పూర్వపుణ్యములు ఫలించియే తీరవలయును. బ్రహ్మమును చేతికి అందిచ్చినట్లు బోధింపగల శాస్త్రము ఊరికే దొరుకునా? ఓ భరద్వాజా! ఆ వసిష్ఠమహాముని సర్వజ్ఞుడు. ఆయన జేసిన ఉపదేశముకూడ లోకోత్తరమైనదియే. ఇప్పుడు నీకు నేను బోధించినది అందలి సారాంశమే. ఈ విషయములు అన్నియు సర్వలోకప్రసిద్ధములు.

శ్లో॥ ప్రియార్థాది వియోగేన జాతఖేదస్య దేహినః ।
శాస్త్రం వినా కిమత్ర స్యా దంతస్సంతాప శాంతిదమ్ ॥

ఓ భరద్వాజా! ఈ లోకమునందు భార్య, ధనము, మొదలగువాని వియోగముచేత దేహి భ్రాంతుడై మిక్కిలి శోకించుచున్నాడు. అట్టివాని యొక్క తాపము చల్లార్చగలయుననిన శాస్త్రమునకంటె ఇక దిక్కెవరు? అది ఈశాస్త్రమే. ఈశాస్త్రము సర్వోత్తమమని ఇదివరకే నిరూపించి ఉన్నాను. వాస్తవస్థితిలో శాస్త్రముకూడ ఎచ్చటనుండియో వచ్చినది కాదు. షోడశకళాపరిపూర్ణమై సర్వప్రపంచవ్యాపకములగు కిరణములతో ప్రకాశించు శాస్త్రచంద్రుడు చిదాకాశమునుండియే ఉదయించెను. దట్టముగ మోక్షరూపమగు అమృతముతో నిండియున్నాడు. అందును ప్రకృతశాస్త్రము కావ్యరూపమై నవరసాలంకారభరితమై ఉండుటచేత మిక్కిలి రమ్యమై యున్నది. సామాన్యులనుగూడ తన రసపుష్టిచేత ఆకర్షించుచు వారియొక్క అజ్ఞానాంధకారమును ధ్వంసము చేయుచున్నది.

శ్లో॥ స్నాతం తేన సమస్త తీర్థ సలిలైః స్సర్వాపి దత్తావనిః
యజ్ఞానాంచ కృతం సహస్ర మఖిలా దేవాశ్చ సంపూజితాః ।
సంసారాచ్చ సముద్ధృతా స్స్వపితర స్త్రైలోక్య పూజ్యో ప్యసౌ
యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్ ॥

ఓ భరద్వాజా! ఏ మహాత్మునియొక్క చిత్తము బ్రహ్మవిచారణమునందు క్షణమాత్రమైనను, స్థిరమగునో, అట్టివాడు సర్వతీర్థములయందును స్నానము చేసినవాడే. సర్వభూమిని దానము ఒసగినవాడే. అనేక వేల యజ్ఞములను చేసినవాడే. దేవతలనందఱిని పూజించినవాడే. పితృదేవతలను

సంసారమునుండి ఉద్ధరించినవాఁడే. స్వయముగ గూడ త్రిలోకములయొక్క శిరస్సునందు నిలచినవాఁడే.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ-రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున శాస్త్రఫలనిరూపణమను
నలుబదినాలుగవ సర్గము ముగిసెను.

---*---

అని శ్రీవాల్మీకిమహర్షి చెప్పిన విని భరద్వాజుడు ఇట్లనియె. ఓమహాత్మా! వాల్మీకిమహాముని! వశిష్ఠమహాముని ఒనర్చిన బోధ ముగసిన పిమ్మట శాంతుడై పరిపూర్ణ విజ్ఞానవంతుడై నిర్మలచిత్తుడై ఉన్న అరఘుకులశ్రేష్ఠుడగు శ్రీరాముడు స్వయముగ ఏమిమైన మఱల అడిగెనా? లేదా? చెప్పుడు. ఆశ్రీరాముడు మనుష్యజన్మమగుటచేత కించిత్‌జ్ఞుడై ఉన్నట్లు గానవచ్చుటయే కాని వాస్తవస్థితిలో అట్టివాడు కాడుగదా. ఓమహాత్మా! వాల్మీకిమహాముని! శ్రీరాముడు యోగీశ్వరులలో నుత్తముడు. శుద్ధవిజ్ఞాన స్వరూపుడు. త్రిలోకములకును నమస్కారార్హుడు. దేవతలకు ప్రభువు. జన్మమరణ శూన్యుడు. సమస్త సద్గుణములకు ఆశ్రయ భూతుడు. లక్ష్మీదేవికి నివాసస్థానము. త్రిలోకములను పుట్టించుటకును, పెంచుటకును, సంహరించుటకును, అనుగ్రహించుటకును కూడ, సమర్థుడు. ఇట్టివాడగుటచేత లోకానుగ్రహార్థమై ఏదిమైన కొఱతయుండిన దానిని గూర్చి ప్రశ్నించియే యుండి తీరవలయును కదా? అని అడిగిన విని వాల్మీకిమహాముని ఇట్లనియె. ఓభరద్వాజా! వశిష్ఠమహాముని ఒనర్చిన ఉపదేశమునందు కొఱత ఏమియు లేదు. ఆశ్రీరాముడు సర్వవిషయములను సంపూర్ణముగ ఎఱిగి నిస్సంశయుడయ్యెను. అడగవలసిన కొఱత ఏమియును ఆయనకు లేకుండెను. మఱియు వశిష్ఠమహాముని యొనర్చిన శక్తిపాతమువలన చిత్తము వికసింపగా పరమానంద సముద్రమునందు కొంత తడవు ఓలలాడెను. అప్పుడు ప్రశ్నయును ఉత్తరమునను విభాగమే ఆయనకు లేకుండెను. ఆనంద పరిపూర్ణుడగుటచేత శరీరమంతయు పులకాంకురములచేత ఉప్పొంగెను. సత్తాసామాన్య స్థితిని జెంది సర్వవ్యాపకుడై నిలచెను. శాశ్వతముగ వ్యవహారదశయందుకూడ సమాధిస్థుడై నిలచెను. అష్టైశ్వర్యములను గూడ తృణప్రాయముగ నిరాకరించెను. ఇట్టివాడగుటచేత పరమపదమునందు నిలచి. సర్వపరిపూర్ణుడై మాత్రమే ఉండెను కాని, ఏమియు నడుగలేదు. కొఱత

యుండినగదా, అడుగుట. అని వాల్మీకిమహాముని చెప్పిన విని భరద్వాజుడు ఇట్లనియె. ఓమహాత్మా! వాల్మీకిమహామునీ! ఆహా, రామచంద్రుడు వశిష్ఠునియొక్క ఉపదేశమువలన పరమపదము నొందెను. నాకును అట్టిస్థానము దొరుకుట ఎట్లు? మూర్ఖులు, అల్పబుద్ధులు, పాపాత్ములు, నగు నావంటివారెక్కడ? శోచనీయస్థితిలోనున్న నావంటివారెక్కడ? అత్యుత్తమ లోకములయందు ఉన్న బ్రహ్మాదులకు సహితము ప్రార్థనీయమైన రాముని స్థితి ఎక్కడ? కావున ఓ మహాత్మా! నేను కడతేరుట ఎట్లు? మహాభయంకరమగు ఈసంసార సముద్రమునుండి ఎట్లు వెలివడుదును? ఆ ఉపాయమును నాకు దయతో వివరింపుడు. అని అడిగిన వాల్మీకిమహాముని ఇట్లనియె.

ఓశిష్యుడా! భరద్వాజా! వినుము. నీకు వశిష్ఠ శ్రీరామ సంవాదమును అంతయును సవిస్తరముగ వివరించి చెప్పితిని. దానిని పలుమారు విమర్శింపుము. నీయంతట నీవే సర్వవిషయమును బుద్ధిబలముచేత ఎఱుగుము. నేనును ప్రత్యేకముగా, కొంత విషయమును చెప్పెదను. ఓభరద్వాజా! ఈకానవచ్చునది అంతయు అజ్ఞానమే. భ్రాంతిసిద్ధమే. ఇందు సత్యమనునది ఇంచుకయైనను, లేదు. అజ్ఞానులు దీనిని ఊరికె విచారింతురు. ఒకరితో నొకరు ఊరికె వివాదము చేయుదురు. పరమేశ్వరునికంటె భిన్నమగునది ఒక్కటియు లేదు. ఇట్లుండగ ప్రపంచము నిన్ను ఏమి చేయగలదు? ఇట్లగుట చేత నీవు రహస్యమును గుఱుతెరిగి అభ్యాసము చేసితివేని సర్వ విషయమును కరతలామలకము అగును, ముక్తిదొరుకును. ప్రపంచ విషయమునందు ప్రవర్తించుచున్న మనోవృత్తి జాగ్రన్నిద్ర అనబడును. అది భ్రాంతులకు జాగ్రదవస్థయే గాని, వివేకులకు కాదు. ప్రపంచము స్వప్నమగుటచేత ఆప్రపంచ విషయమగు వృత్తి నిద్రయే కావలయును కదా? కావున ఏపురుషుడు వివేకవశముచేత ఆనిద్రనుండి మేలుకొనునో, వాడే శుద్ధ చైతన్యుడు. బ్రహ్మజ్ఞానమే మెలకువ. ఓభరద్వాజా! మఱియొకవిశేషము. ఈప్రపంచమునకు ఆదియు శూన్యమే. అంతమును శూన్యమే. ఇది వచ్చుటకుగాని, నశించుటకుగాని, కారణమే తెలియదు కదా! నడుమమాత్రము ఉన్నట్లు కానవచ్చుచున్నది. ఇట్టిదానిని ఎట్లు విశ్వసింప నగును. మనము లోకమునందు ఇట్టిదానిని ఇంద్రజాలమందుము కదా? ఈకారణమువలన ఇది శూన్యరూపమే అనవలయును. "ఉన్నట్లు కానవచ్చుచున్నది కదా" అనియెదవేమో, అది సంస్కార బలము. అనాదినుండియు ఈజీవుడు సంసారమును భోగ్యముగ జూచుచున్నవాడు అగుటచేత ఎప్పటికిని జూచు

రున్నాడు. తాఁటియందు సర్వమును జూచునట్లు సర్వవ్యాపకమగు పర
బ్రహ్మమునందు ఈప్రపంచమును జూచుచున్నాడు. " అయితే ఒక ప్రపం
చమైన సత్యముగ నుండెనగదా, దాని సంస్కారమువలన అన్యప్రపంచము
తోఁచుట " అనిరెదవేమో, వినుము. భ్రాంతి కలుగుటకు సమాన పదా
ర్థమును ఒకదానిని చూచి ఉండవలయు ననుటమాత్రమే నియమము కాని,
అది ( ఆచూడబడిన పదార్థము ) సత్యముగగూడ నుండవలయుననుట నియ
మము కాదుకదా ? కావున భ్రాంతి ప్రపంచములయొక్క సంబంధము
అనాదియగుటచేత ఆరంభమునందు చూడబడినదియు, భ్రాంతి సిద్ధప్రపం
చమే. ఇప్పుడు చూడబడునదియు, అట్టి ప్రపంచమే. ఈసంసారము అనేక
విధములుగ విజృంభించుచున్నను ఇది గంధర్వ నగరము వంటిదే. ( గంధ
ర్వ నగర మనగా, కొరవి దయ్యములచేత నిర్మింపబడిన పట్టణము. అందు
వట్టి దయ్యములుకూడ నుండును. గ్రామమునకు అంతయు ఆకస్మికముగనే
ఒక్కమాఱే ఆపద తటస్థించునేని అట్టిస్థలములయందు రాత్రివేళ సామా
న్యముగ ఈగంధర్వ నగరములు గానవచ్చు నందురు ) ఇట్లుండ ఓ భర
ద్వాజా ! నీవు చైతన్యమను అమృత రసమును అనుభవింపక ।వాసనలను
విషవృక్షములను ఆశ్రయించి ఏల మోహమును నొందెదవు. ప్రపంచ విష
యమునందు ఇంచుకయైనను సంశయింపవలదు. అది అసత్యమనుట లోకా
నుభవ సిద్ధము. లోకానుభవ మనగా, విద్వాంసుల అనుభవమే అనుట
యు, విద్వాంసు లనగా, బ్రహ్మానుభవము కలవారే, అనుటయు, నిర్వివా
దాంశము. కావున ఏమహాత్ములకు పరమేశ్వర సాక్షాత్కారము అగుట
చేత జాగ్రన్నిద్ర నశించెనో, సమాధి నిష్ఠచేత స్వప్న సుషుప్తులుకూడ
అణగెనో, ఎవరిజ్ఞానము నిరాలంబమై ఉన్నదో, అట్టివారికి ఈవిషయము
అనుభవ గోచరమై యున్నది. యుక్తిమంతులై అమృత రసముగల పర
బ్రహ్మ మను నదిలో ఎంతకాలము వరకు స్నానమును ఆచరింపరో, అంత
కాలము వరకు ప్రపంచ మను తరంగములు మనోనదియందు విస్తరించు
చునే ఉండును. ఈప్రపంచము ఆదియందు శూన్యము. అంతమునందును
శూన్యము. ఇట్లగుటచేత మధ్యమునందును శూన్యమే. కావున ఇది అంత
యు, కలవంటిదే. మఱేమియు కాదు. ఈకానవచ్చు భేదములన్నియు అవి
ద్యావశముచేత సముద్రమునందు జనించు నీరుబుగ్గవలె పుట్టుచున్నవి. ఒక
క్షణమునందే లీనము లగుచున్నవి. దీనికి ఆధారము చైతన్య రూపము.
ఓభరద్వాజా ! ఇట్లగుటచేత పరమేశ్వర స్వరూపము చల్లని నీరుగల నది

నీగా తెలిసికొని అందు స్నానమును చేయుము. భ్రాంతియను ఎండవలన పుట్టిన తాపము ఆరిపోవును. శాంతిసుఖము చేకూరును. ఈఅవిద్యా రూప మగు సముద్రముకూడ ప్రపంచమును వ్యాపించి ఉన్నది. "నేను శ్రేష్ఠుడను" అను భావములే ఇందలి అలలు. ఆఅలలు అవిద్యయను గాలివలన చలించును. మనస్సు విషయములయందు ప్రవర్తించుటకు కారణములగు కామ క్రోధాదులు ఆఅజ్ఞాన సముద్రమునకు చిన్న అలలు "ఇదినాది" అను భావము దానికి సుడి. సర్వసంసార వర్ధకములగు రాగద్వేషములు అందు జలజంతువులు. ఇట్టి ఆసముద్రమునందు ప్రవేశించిన అనర్థపరంపరయను పాతాళమునకు బోవుటలో సందేహమేమి. దానిని నివారింపగలవా డెవ్వడు? కావున ఓ భరద్వాజా! తత్త్వవేత్తవై అలలు లేని అమృతసముద్రము నందు ఓలలాడుము. నిరర్థకముగ భేదమను ఉప్పునీటి సముద్రమునందు ఏల మునిగెదవు. ఓభరద్వాజా! బాగుగ విచారించిన అందరును ముక్తులే! ఉన్నది ఏది? పోయినది ఏది? ఒకప్పుడు సంసారము ఉండను లేదు. మఱి యొకప్పుడు పోవను లేదు. అందఱును సర్వకాలములయందును ముక్తులే. భ్రాంతివలన "నేనుబద్ధుడను ముక్తిని సంపాదింపవలయును" అని తలంచుటయే గాని, బంధము ఎవరికిని లేదు. కావున నీవు మాయయందు ఏల మునిగెదవు. ప్రమాదమును ఏలజెందెదవు. జాగరూకుడవై ఈభ్రాంతిని విడువుము. లోకమంతయు బ్రహ్మవ్యతిరిక్తముగ లేదనియు, ఉన్నపదార్థము ఒకటియే అనియు, మహాత్ములు చెప్పుదురు. ఇట్లుండగ నీవు దేనిని గూర్చి దుఃఖించెదవు. బ్రహ్మాభిన్నముగ నీకు దుఃఖజనకమై సంసారమను నది ఒకటి బొత్తిగనే లేదు కదా? ఈప్రపంచము అంతయును పరబ్రహ్మముయొక్క వివర్తమనియు, పరబ్రహ్మమునుండి జనించెననియు, చెప్పుటయెల్ల అజ్ఞానులకొఱకే. వారు బ్రహ్మాభిన్నముగ ప్రపంచమును చూచుచు "ఇది ఎట్లు వచ్చెను" అని సంశయించువారగుట. కావున వారికి ఉత్తరము చెప్పుటకై అట్లు కల్పింపబడెను. వాస్తవస్థితిలో ఈప్రపంచము పుట్టనే లేదు. కావుననే వివేకవంతులగు మహాత్ములు భేదశూన్యమగు పరమానందమును అనుభవింతురు. కావున వివేకశూన్యుడగువాడు ఒకప్పుడు సంతసించును. మఱియొకప్పుడు ఆకస్మికముగనే దుఃఖించును. విషయభోగములే పురుషార్థముగ దలంచును. జ్ఞానియగువాడు అట్లుగాక సర్వకాలములయందును పరమానందముతోనే ఉండును. వ్యవహార కాలమునందు ఒకవేళ వాడును శోకాదులను జెందినట్లు కానవచ్చినను, అది అభినయమా

త్రమే కాని, పరమార్థము కాదు. వాని మనస్సునకు సర్వమును ఒకటటి యే కదా. "ఇట్లయినను ఆత్మ అందఱికిని ఏల ప్రత్యక్షుఁడుకాఁడు ?" అనియెదవేమో, వినుము. ఆయన స్పష్టముగనే ఉన్నాఁడు. అయినను జను లకుగల అజ్ఞానమే ఆయనకు ఆవరణము అగుచున్నది. జనులు తమ అజ్ఞాన ముచేత తామే తమ స్వరూపములను ఎఱుఁగలేక ఉన్నారు "జీవబ్రహ్మలు ఒకటటియేయైన అవిద్య ఎవ్వరికి ? దానిచేత గలుగు ఆవరణము ఎవ్వరికి" అనియెదవేమో, వినుము.

ఓభరద్వాజా ! వాస్తవస్థితిలో అవిద్య ఎవ్వరికిని లేదు. అయినను "నేను దుఃఖపడుచున్నాను" అని ప్రశ్నించువారికి సమాధానము చెప్పు టకై జీవ బ్రహ్మ భేదము అంగీకరింపబడినది. అవిద్యయు జీవునకే కలదని యు దానిచేత పరమేశ్వరునకు ఆవరణము కలుగుననియు చెప్పబడినది. ప్రశ్నోత్తరములన్నియు భేదమును ఆశ్రయించియే కాని, చెప్పబడుటకు వీలు లేదు కదా ? కావున విచారించిన ఎండమావులు మొదలగు కారణ ములచేత జలమునందు స్థలమనియు, స్థలమునందు జలమనియు, సంశయము కలుగునట్లు ఆత్మయందు సంశయము కలుగుచున్నది. భూగర్భముననున్న జలమువరకు దృష్టిని ప్రసరింపనీకుండ ఆవరణమైయున్న మృత్తికను జలా వరణముగ దలంచునట్లును, లేక, తనదృష్టికి ఆవరణమైన మేఘమును సూ ర్యునికి ఆవరణముగ గ్రహించునట్లును, అట్టి గ్రహణముచేత నీరు ప్రకా శించుట లేదు. సూర్యుఁడు ప్రకాశించుటలేదు. అని తలంచునట్లును, ఆత్మ ప్రకాశించుట లేదు. అని తలంచు చున్నారు. "ఇట్లుచెప్పనేల? ప్రపంచము పృథివ్యాది భూత పరమాణువులచేత నిర్మింపబడి సత్యమై ఉన్నది కదా" అనియెదవేమో, అప్పటికిమాత్రము నీకు శోకకారణము ఏది కలదు. పర మాణువులు నిత్యములు. ప్రపంచము లయము నొందినను పరమాణు రూప ముతోనే నిలచును. ఇందు ఏదిపోయినది. ఓభారద్వాజా ! దుఃఖమనునది ప్రియవస్తువు నశించుటవలన గాని, అప్రియవస్తువు ప్రాప్తించుట వలనగాని, కలుగును కదా ? ఇందు సంసారవేగమునందు నీకు గలుగు దుఃఖము ఎందు లో జేరినది. ప్రియపదార్థము ఏదియైన బోయెనేమో, అనిన అది సరిప డదు. అప్రియపదార్థము సత్యమైన నశింపదు. అసత్యమైన ఉత్పత్తియే లేకపోవుటచేత వినాశమును లేదు. కావున నీకు దుఃఖ జనకమగు పదార్థ ము ఏతెగలోను జేరినది అగుటకు వీలులేదు. ఇక అప్రియము ఏదియైన వచ్చెనేమో, అనిన అదియు సంభవింప నేరదు. లోకమునందు దుఃఖము

వచ్చిపోవునదిగాను, సుఖము శాశ్వతముగ నున్నదిగాను, తోచు చున్నది. ఎంత గొప్ప దుఃఖము వచ్చినను దిన దినమునకు నశించి పోవుచున్నది. ఏదియో ఒక ఉపాధివలన ( అనగా, ధనప్రాప్తి మొదలగు వానివలన ) కలిగిన సంతోషము మాత్రము అట్లేనశించును గాని, ఆజన్మ సిద్ధమగు స్వస్థత మాత్రము నశింపదు. ఇట్లగుటచేత ఈ అప్రియము సద్రూపమగుటకును అసద్రూపమగుటకును గూడ వీలులేక పోవును. సద్రూపమైన పైనవర్ణించిన అనుభవమునకు విరోధము వచ్చును. అప్రియపదార్థము ఎప్పుడును నశింపక సంప్రాప్తమయ్యే ఉండునేని దుఃఖమునకు అంతమే ఉండకూడదు కదా? " ఇట్లుచెప్పనేల ? దుఃఖముకూడ ఏదియో ఒక ఉపాధివలన ( ఇష్టనాశము మొదలగు వానివలన ) జనించి నప్పుడు మాత్రమే మీరన్నట్లు క్షీణించు చున్నదిగాని, " జన్మము మొదలు సంసార ప్రవేశముచేత గలిగిన దుఃఖముమాత్రము అట్లు నశించుట లేదు" అనియెదవేమో, లోకమునందు స్వస్థతమాత్రము నిత్యసిద్ధంబును, ఉపాధికృతంబునై ద్వివిధముగ నున్నది కాని, దుఃఖము అట్లు లేదు. ఇష్టనాశము కాని, అనిష్టప్రాప్తి గాని లేక, ఎవ్వడును శోకింపడు. కావున దుఃఖము ఎట్లును శాశ్వతము కానేరదు. " సంసారము దుఃఖరూపము " అనుటకు తాత్పర్యమేమి అనిన; పైనవర్ణించిన దుఃఖములకు భ్రాంతియే మూలము అగుటచేత ఈసంసారమునందు ఆభ్రాంతి యుండుటచేత అట్లు చెప్పబడెను. కావున అప్రియ పదార్థము సద్రూపమై ఎప్పటికిని పురుషుని విడువకున్నది. అనిన దుఃఖము శాశ్వతము కావలసి వచ్చుటచేత విరోధమువచ్చును. అసద్రూపమనిన దానికి ఉత్పత్తియే లేకుండుటచేత ఆదుఃఖప్రాప్తియే సంభవింపదు. ఇట్లుండగ నీవు దేనిని జూచి దుఃఖించు చున్నావు. పైన వర్ణింపబడిన యుక్తులను అనుసరించి చూచిన ప్రపంచమునే నిర్వచనము చేయుటకు (" దీనిస్వరూపము ఇట్టిది " అని నిర్ణయించి చెప్పుటకు ) వీలు లేకపోవుటచేత ఈకానవచ్చు పదార్థములు అన్నియు అజ్ఞానమాత్ర రూపములే, శూన్యములే, అని తేలు చున్నది. లోకమునందు ఎవ్వడైనను త్రాటియందు సర్పమును జూచినచో, ఆసర్పమునకు ఆకారము ఎయ్యది ? ఉండును. అచ్చట సర్పావయవములు లేకుండుటచేత వాని అజ్ఞానమే దానికి ఆకారము కావలయును. ఇట్లే ఈప్రపంచమునకు గూడ కేవల అజ్ఞానమే స్వరూపము. ఈపదార్థములు ఒకప్పుడు పుట్టను లేదు. మఱి యొకప్పుడు నశింపను లేదు. ఇంద్రజాలమువలె నిష్కారణముగనే కానవచ్చుచు అణగిపోవుచు ఉన్నవి. ఈఅ

విర్భావ తిరోభావములనే ( కానవచ్చుటను అణగిపోవుటను మాత్రమే ) మనము ఉత్పత్తి వినాశములనుగా, భావించి, ప్రియములుగ కొన్ని పదార్థములను, అప్రియములుగా కొన్ని పదార్థములను, సంకల్పవశమున నేర్పరచి, ప్రియ వినాశముచేతను, అప్రియ ప్రాప్తిచేతను, దుఃఖించుచున్నాము. వాస్తవస్థితిలో ప్రియాప్రియములు అనునవియు, మనోమాత్ర కల్పితములే కాని, పరమార్థములు కావు. ఒకనికి ప్రియముగానున్న పదార్థము మఱియొకనికి అప్రియమగుటయే గాక, వానికిగూడ వినాశకాలమున అప్రియ మగుచున్నది. కావున ఎట్లుచూచినను ప్రాపంచిక పదార్థములు భ్రాంతిసిద్ధములే. వానిని ప్రియాప్రియములనుగా భావించి విచారశూన్యులై దుఃఖించుటకంటె వెఱ్ఱితనము లేదు. రామునకు దొరికిన ముక్తి అందఱకును దొరికియే యున్నది. " ఇట్లయిన ఈ ప్రపంచము ఇంద్రజాలమువలె ఎదురుగ గానబడవలయును. అంతియకాని, సుఖదుఃఖాదులను కలిగించుటకు హేతువు ఏమికలదు " అనియెదవేమో వినుము. నిశ్చయముగ అట్టి హేతువు లేదు. అయినను ఇది అనాది. కావున ప్రతిజన్మమునందును కానవచ్చుచున్నది. దీనిపై అభిమానమును ఉంచి జీవులు కొన్ని కర్మలను ఆచరించుచున్నారు. అవి వాని ఫలములను ఇచ్చుచున్నవి. పూర్వ జన్మము నందలి కర్మలు పరజన్మమునందును, అందలి కర్మలు తర్వాత జన్మమునందును ఫలములను ఇచ్చుచున్నవి. పుణ్యకర్మలు సుఖములను ఇచ్చుచున్నవి. పాపకర్మలు దుఃఖము గూర్చుచున్నవి. ఇట్టి దుస్థితికి కారణమగుటచేత ఈ ప్రపంచము మొట్టమొదట తటస్థముగనే ( ఎదుట నూరికె గానవచ్చునదిగనే ) ఉండియు క్రమక్రమముగ విషమైనది. ఆత్మజ్ఞానము ఎంత బోధించినను మనస్సునందు పట్టకున్నది. కావున చిత్తశుద్ధికై లోకగురువగు సగుణబ్రహ్మమును విష్ణురుద్రాది రూపములలో దేనితోనైనను ఉపాసింపుము. అప్పుడు నిర్మలమై చిత్తము ప్రపంచ సంస్కారమును విడుచును. భేదభావనను పరిత్యజించును. ఆభేదభావనయే సర్వానర్థ కారణము. కావున ఆభేదభావన పరిత్యాగముచేత ఒక్కమాఱే సర్వానర్థమును తొలగును. పూర్వ జన్మములయందు చేయబడిన పాపములన్నియు నీకు నశింపలేదు. అది నిశ్చయము. లేకున్న నీకు బంధభ్రాంతి ఉండదు. ఈపుణ్యపాప కర్మలే జీవునకు పాశములని శ్రుతులు మొదలగునవి చెప్పుచున్నవి. కావున చిత్తము నిర్మలము అగునంతవరకు ఆకార సహితముగ పరమేశ్వరుని ఆరాధింపుము. పిమ్మట నిరాకార తత్వమునందు నిలుకడ కుదుర గలదు. ఇట్లు చిత్తమును

నిర్మలము గావించి సత్వగుణమును అభివృద్ధి చేసికొని అజ్ఞానాంధకార మును తొలగించి గురూపదిష్టార్థమునందును, శాస్త్రార్థమునందును నమ్మ కము కలిగి ఈ క్రిందిమార్గ మును అవలంబింపుము.

శ్లో॥ సమాధాయ క్షణం పశ్య ప్రత్యగాత్మాన మాత్మనా ।
ఇయం విభాతు సావ్యక్తం ప్రాగ్బుద్ధి రజనీ తవ ॥

ఓ భరద్వాజా ! ఒక క్షణకాలము చిత్తమును సర్వవిషయముల నుండియు మరలించి ప్రత్యగాత్మ స్వరూపమును జూడుము. బుద్ధి అను రాత్రిని తెల్లవారునట్లు జేయుము. ఇట్లు యోగమార్గమును ఆరంభించితి వేని అది స్వయముగనే అభివృద్ధియై పరమసిద్ధిని ఇచ్చును. మఱియు కేవల పురుష ప్రయత్నముతో మాత్రమే ప్రయత్నింప నేటికి ? కర్మములను మా త్రమే ఆచరింప దలంపనేటికి ? సగుణ బ్రహ్మమును ఆరాధించిన ఆ సగుణ బ్రహ్మానుగ్రహముచేత ముక్తిని బొందవచ్చును. ఇది ( భక్తిమార్గము) అన్నిటికంటె సులభమగు మార్గము. " ఇదివరకు పురుషప్రయత్నముచేతనే సర్వమును సాధింపవచ్చునని సిద్ధాంతము చేయబడియున్నది. " ఇప్పుడు ఈశ్వరానుగ్రహము కావలయునని చెప్పియున్నారు. ఇది విరుద్ధము కదా ? అనిమొదవేమో వినుము. పురుష ప్రయత్న మనునది కులము, నడత, నీతి, పరాక్రమము, అనువానిని అన్నిటిని గాని, కొన్నిటిని గాని, ఆశ్రయించి ఉండును. కొందఱు తమ జాతిని ఆశ్రయించి విహిత కర్మములను చేయుచు జాతి నియమములను అనుసరించుచు చిత్తశుద్ధిని చేసికొన ప్రయత్నింతురు. మఱికొందఱు జాతి హీనమైనను, శుభాచారములను అవలంబించి చక్కని నడతచేత మనోదోషములను బాపుకొన జూతురు. వేఱొక కొందఱు నీతి మార్గమును అవలంబించి కాని, పరాక్రమముచేత గాని, ధనాదులను ఆర్జించి ఆ ధనమూలముచేత సజ్జన సముదాయమును జేర్చి ఆ సజ్జనసహ వాసముచేత హృదయమును పరిశుద్ధము జేసికొన దలంతురు. ప్రయత్న మంతయు మనశ్శుద్ధికయ్యే కదా. అయినను పూర్వజన్మ కర్మములకంటె ఈ జాతి మొదలగునవి అన్నియును బలహీనములు. వీనిని ఆశ్రయించి చేయబడు పురుష ప్రయత్నములును అట్టివే. ఆ కర్మలు అనాదినుండియు వచ్చుచున్నవి. ఈ ప్రయత్నములన్ననో, ప్రకృత జన్మమునందు మాత్రమే జరుపబడునవి. ఇవి వానిని ఎట్లు జయింపగలవు. ఇట్లగుటచేత కేవల పురుష ప్రయత్నముతో ప్రయోజనము లేదు. ఈశ్వర సహాయముకూడ ఉండి తీరవలయును. కావుననే ఇచ్చట పురుష ప్రయత్నమునకంటె ఈశ్వ

రుడు బలవంతుడని చెప్పబడెను. పూర్వమునందును ఈ ఉద్దేశమును మనస్సునందు ఉంచుకొనియే పురుషప్రయత్నముచేత కార్యసిద్ధి కలుగునని చెప్పబడినది. అచ్చట పురుషప్రయత్నము అనగా, ఈశ్వరానుగ్రహసహిత పురుష ప్రయత్నమే కాని, కేవల-పురుష ప్రయత్నము కాదు. "ఇట్లయిన ఈశ్వరోపాసన ఒకటియే చాలును కదా, ఇక జ్ఞానాదులతో పనియేమి" అని యెదవేమో, అట్లు చెప్పకూడదు. ఇచ్చట కావలసినది సర్వకర్మ నిరాసము. అది ఆత్మస్వరూప జ్ఞానమువలన గాని, కలుగదు. ఆత్మ యయుక్తి మొదలగు వాటికి గోచరుడగువాడు కాడు. వేదముచేత మాత్రమే తెలియ దగినవాడు. ఇట్లుండగ నీవేల జ్ఞానాగులను సంపాదించుటను నిరర్థకమని దలచెదవు. ఆ విషయమున ఉత్సాహము నొందక ఏల శోకించెదవు. పరమేశ్వరుడైనను జ్ఞానమువలన భ్రాంతిని తొలగించియే ఈ సంసారమును ధ్వంసము చేయగలడు కాని, సుఖ దుఃఖములను నాశము నొందింప గలడు కాని, స్వయముగ లలాటముననున్న వ్రాతను (అనగా, పూర్వకృత పుణ్యపాపానుసారముగ వచ్చిన సుఖ దుఃఖములను) తుడిచివేయ నేరడు. కావున జ్ఞానాదులును ఆవశ్యకములే. ఆజ్ఞానాదులు పరస్పర సంబంధముతో సమకూడుటకు ఈశ్వరేచ్ఛయే కారణము కావున తత్ప్రసాదమును ఆవశ్యకమే. ఈశ్వరేచ్ఛ కాకున్న అవాఙ్మానస గోచరమగు ఆత్మతత్త్వమును ఒకసామాన్యుడు బోధించుట ఎక్కడః మఱియొకడు దానిని గ్రహించుట ఎక్కడ ? అజ్ఞానాంధకారము నశించుట ఎక్కడ ? ఇవి అన్నియును సంబంధములే. పరమేశ్వరుడు అవాఙ్మానస గోచరుడగుటచేత వచించుటకుగాని, ఆత్మాభిన్నుడగుటచేత గ్రహించుటకుగాని, శక్యుడు కాడు. అజ్ఞానమును శూన్యరూపమగుటచేత ఒకదానిచేత నశించునది కాదు. ఇట్లయినను గురువు ఉపదేశించుట, శిష్యుడు గ్రహించుట, దానిచేత అజ్ఞానము నశించుట, అనునవి జరుగుచున్నవి. ఇది అంతయు పరమేశ్వరుని యొక్క ప్రభావమే. కావున అమ్మహాత్ముని అనుగ్రహము లేక వీని సమ్మేళనము కలుగదు. తాను బుద్ధిమంతుడైన తగిన గురువు దొరుకడు. గురువు శ్రేష్ఠుడైన తనకు తత్త్వమును గ్రహించు నంతటి బుద్ధిసామర్థ్యము ఉండదు. రెండును గలిగిన ప్రతిబంధవశముచేత ఆ తత్త్వజ్ఞానము దృఢముగ నిలువదు. కావున అన్నియును అనుకూలముగ నుండుటకై పరమేశ్వరుని ఆరాధింపవలయును. జ్ఞానాదులు లేక, ఆయనయు ఏమియు చేయ నేరడు. కావున పురుషప్రయత్న బలముచేత వానినిగూడ ఆర్జింపవలయును.

కావున నో భరద్వాజా ! ఈశ్వరానుగ్రహ సహితమగు పురుష ప్రయత్నముతో జ్ఞానాదులను సంపాదించి జ్ఞానమును జయింప ప్రయ త్నింపుము. అప్పుడు బ్రహ్మైక్యము నొందగలవు. ఉత్సాహమును విడిచి నడుమ శోకించిన ప్రయోజనమేమి. గంభీర స్వభావముగల రాజు తనకు ఎంత ఆపదవచ్చినను జంకక ఉత్సాహ పరిపూర్ణుడయ్యే ఉండును. దుర్బల స్వభావము గలవాడు తనకెంత అల్పమగు ఆపదవచ్చినను మహాఘోర ముగ శోకించును. రాజునకు వచ్చు ఆపదలకును, సామాన్యులకు వచ్చు ఆపదలకును. భేదము ఎంతయుండును ? జ్ఞానమనునది ఒకదినమునందు వచ్చునది కాదు. అది పుణ్యకర్మ పరిపాకమువలన గలుగవలసినది. అనేక జన్మములకుగాని, సిద్ధించునది కాదు. అది సిద్ధించినందుకు జీవన్ముక్తి కలు గుటయే దృష్టాంతము. కావున విడువక కర్మచేతనే జ్ఞానమును సంపా దింప పాటుపడ వలయును. సంసారాభిమానము ఉన్నప్పుడు కర్తృత్వ భోక్తృత్వ అభిమానము ఉన్నప్పుడు ఆ కర్మయే నీకు శత్రువై బంధమును కలిగించేను. ఆ అభిమానము తొలగి ఫలాశ అణగినచో అదియే మిత్రుడై మోక్షమును కలిగించును. ధర్మమార్గనిష్ఠుడై సత్కర్మలను ఆచరించు నేని అవి మేఘము దావాగ్నిని ఆర్పునట్లు పూర్వపాప సముదాయమును అంత యును ఆర్పివేయును. పాపనాశముకాగానే అప్పుడు బ్రహ్మజ్ఞానము స్థిర పడును. ముక్తి దొరుకును. పిమ్మట నీవు ఎట్లున్నను ఉండవచ్చును. సంసా రమునందు ఉండుటకు ఇచ్ఛగలదేని అట్లే యుండుము. అట్లుకాదేని సర్వ కర్మసన్యాసమును ఆచరించి బ్రహ్మమాత్రనిష్ఠుడవై నిలువుము. సముద్రము తనయందలి జలము చాంచల్యము నొందునప్పుడే తీరమువరకు వ్యాపిం చును. లేనప్పుడు కేవల జలమాత్రమై ఉండును. ఇట్లే మనస్సుకూడ బాహ్యపదార్థములను గ్రహించునప్పుడు ప్రపంచ రూపముతో పరిణమిం చును. లేనప్పుడు అట్లు పరిణమింపదు. నీమనో నేత్రము గుడ్డిదై దుఃఖమును ఏల చూచు చున్నది ? ఏల నిన్ను బాధించు చున్నది. నీవు దానికి ఆధార ముగ జ్ఞానమను చేతికఱ్ఱను ఊనుకొనుము. అప్పుడు నేత్రము గుడ్డిదైనను నీకు సన్మార్గము దొరుకును. క్రమముగ పరమపద ప్రాప్తియు గలుగును. ఈ జ్ఞానమునకును కర్మయే మూలము. కావున మొట్టమొదట దానినే ఆశ్రయింపుము. అదియే క్రమ క్రమముగ నిన్ను సన్మార్గమునందు నడు పును. హర్ష శోక వేగమునకు జిక్కకుము. ఎవ్వరు హర్ష శోకములను అలలలోబడి గడ్డిపోచలవలె కొట్టుకొని పోవుచుందురో, వారు గడ్డిపోచల

వంటివారుగానే భావింపబడుదురు. లెక్కలోనికి రారు. మహాత్ములలో జేరరు. ధనాది విషయములయందు ఎంతవారైనను, అక్కఱకురారు.

ఓ భారద్వాజా ! అనివార్యమగు విషయమునందు నీకు దుఃఖమేల? ఈ ప్రపంచమంతయును సుఖ దుఃఖ దశలను ఉయ్యాలపై నెక్కియున్నది. కామ క్రోధాదులను త్రాళ్లచేత ఊగింప బడుచున్నది. దీనిని తప్పించుకొనుట ఎవ్వరికిని తరముగాదు. ఆత్మజ్ఞానముచే యథార్థస్వరూపమును స్పష్టముగ ఎఱిగిన అప్పుడు ఈ ప్రపంచము శూన్యరూపమే అగును. కావున ఈ సుఖదుఃఖదశలను కామక్రోధాదులునుకూడ అట్టివే అగును. మఱియు విలాసముగ కుతూహలముతో కాలమే ఈ ప్రపంచమును సృష్టించుచున్నది. సంహరించు చున్నది. మఱల సృష్టించు చున్నది. మఱల సంహరించు చున్నది. ఈ సర్వమును కాలాధీనము. కాలము వచ్చునంతవరకు యథార్థ స్వరూప జ్ఞానభిన్నమగు ఉపాయముతో మనము దీనిని ఏమియు చేరనేరము. ఈ లోకమంతయు కాలమను సర్పమునకు బలాత్కారముగ ఆహారమగును. అట్లుకానిది ఏదియును ఎచ్చటను లేదు. అన్నియు ఎప్పటికైనను కాలమునకు గోచరములు కావలసినవియే. చిరజీవులని ప్రసిద్ధులైయున్న దేవతలుకూడ కాలమునకు గోచరు లగుచుండ క్షణమాత్రము జీవించువారగు మనుష్యులనుగూర్చి ఏమి చెప్పవలయును. కావున సర్వవిధములచేతను ఆత్మయొక్క యథార్థరూపమునే తెలిసికొనవలయును. ప్రపంచముతో నాకు సంబంధము లేదను విషయమునే నిర్ణయింప వలయును. నేను సాక్షి అను భావమునే దృఢ పరుప వలయును. " ఈ ప్రపంచ వికారములు నాకు అంటవు " అను విషయమును సిద్ధాంతము చేసికొన వలయును. ఇంతకంటె సంసార దుఃఖనాశమునకు అన్యమైన వేరే ఉపాయము లేదు.

శ్లో॥ స్వయం నృత్యసి కింప్రీతో విపత్తౌ వికలేంద్రియః ।
క్షణం నిశ్చల మాసీనః పశ్య సంసార నాటకమ్ ॥

ఓ భరద్వాజా ! ఇట్లుండగ నీవు నిస్వరూపమును ఎఱుగలేక హర్ష శోకములకు వశగతుడవై సంక్షోభము నొందెద వేల ? దుఃఖము వచ్చినప్పుడు దుఃఖించునవియు సంతోషము వచ్చినప్పుడు సంతోషించునవియు ఇంద్రియములే కాని, నీవు కావు. నీవు వానికి సాక్షివి. కావున కొంతసేపు నిశ్చలుడవై నిలిచి వేడుకగా, సంసార నాటకమును జూడుము. అనేకఅలలు గలదియై ఈ ప్రపంచము క్షణమాత్రమునకు నశించునదియై ఉన్నది. నేను

సర్వసాక్షినని నిశ్చయించిన మహాత్ముడు జ్ఞానవంతుడు. దీని సంక్షోభముం వలన కొంచెమైనను సంక్షోభము నొందడు. కావున ఓ భరద్వాజా! నీవును అమంగళకరమగు ఈశోకమును పరిత్యజింపుము. శుభకరమగు మోక్షమును గూర్చి చింతింపుము. జ్ఞానానందములే ఆకారముగా గలిగి నిర్మలమైయున్న ఆపరబ్రహ్మమే స్వస్వరూపమని తలంపుము. ధ్యానింపుము. నిర్ణయింపుము. సర్వమునకును పరమేశ్వరానుగ్రహము ఆవశ్యకము. దానిని సాధించుటకు ఉపాయమును చెప్పెదను, వినుము.

శ్లో॥ దేవ ద్విజ గురు శ్రద్ధా భర బంధుర చేతసామ్ ।
సర్వాగమ ప్రమాణానాం మహేశానుగ్రహో భవేత్ ॥

ఓభరద్వాజా! దేవతలయందును, గురువులయందును, బ్రాహ్మణులయందును, భక్తియు, వారి వాక్యములయందు విశ్వాసము అధికముగా నుండవలయును. శాస్త్రములయందు చక్కని నమ్మకము కలిగి ఉండవలయును. ఆగురువు మొదలగు వారలయొక్క ఉపదేశానుసారముగ ప్రవర్తించుటకు మొట్టమొదట నమ్మకమేగదా ఆవశ్యకము. శాస్త్రోక్తవిధిగా ఆచరింపకుండిన ఏదియు ఫలింపదు. కావున ఇట్టి విశ్వాసమును పూని ప్రవర్తింపుము. పరమేశ్వరుని ఆరాధింపుము. అప్పుడు అమ్మహాత్ముని ప్రసాదము చేకూడును. జ్ఞానము కలుగును. దానిచేత ముక్తి దొరుకును.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు
నిర్వాణ ప్రకరణమున జ్ఞానసారనిరూపణమను
నలుబదియైదవ సర్గము ముగిసెను.

—*—

## —* వేదాంతశాస్త్రార్థసారము. *—

ఈప్రకారముగ వాల్మీకిమహర్షి చెప్పిన విని భరద్వాజమహాముని ఇట్లనియె. ఓమహాత్మా! వాల్మీకమహాముని! మీ అనుగ్రహమువలన సర్వ విషయమును గోచరమైనది. వైరాగ్యమునకంటె ఐశ్వర్యము లేదు. సంసారమునకంటె శత్రువులేదు. ఈవిషయము నామనస్సునందు నిశ్చయమైనది. అయినను, నాకు ఒక కోరిక కలదు. వశిష్ఠమహాముని తన ఉపన్యాసమునందు సముదాయరూపకముగ చెప్పిన జ్ఞానము ఏది. దానిని నిశ్శేషముగ విన గోరుచున్నాను. దానిలోని సారాంశమునంతయును దయతో వివరింపుడు. అని అడిగినవిని వాల్మీకమహాముని ఇట్లనియె. ఓభరద్వాజా! అక్లే

సర్వసారమును చెప్పెదను వినుము. దానిని వినిన మఱల సంసారమునందు మునగవు. ముక్తిని జెందుదువు. ఏపరమేశ్వరుడు సత్యజ్ఞానానందరూపుడై ఏకమై ఉండియు, సృష్టి స్థితి ప్రళయ భేదములతో నున్నాడో అట్టి పరమేశ్వరునికి నమస్కారము. ఈప్రపంచమును లయము నొందించిన పిమ్మట గాని, ఆతత్వము ప్రకాశింపదు. కావున వేదానుసారముగ సంక్షేపముగ నీకు దీని ఉపాయమును వివరించెదను. వినుము. ఓభరద్వాజా ! సాధకుడు మొట్టమొదట మనస్సును వైరాగ్యముచేత నిగ్రహించి బాహ్యేంద్రియ వేగములను అణచి కర్మలయందలి ఆసక్తిని ఫలేచ్ఛను, విడువ వలయును. సర్వకర్మలను పరిత్యజింపకున్నను వేదోక్తములగు పాపకర్మలను పరిత్యజింప వలయును. విషయేంద్రియముల సంయోగము వలన కలుగు సుఖమునందుకూడ ఆశను వదల వలయును. శాస్త్రమునందును, గురువాక్యమునందును, శ్రద్ధను కలిగి ఉండ వలయును. ఇట్లు వైరాగ్యమును దృఢముచేసికొనియున్నేని, మనస్సు నిర్మలమై గురూపదేశమును బాగుగ గ్రహింప గలుగును. నమ్మకము అధికమయ్యెనేని విచారణయందును, అర్థనిర్ణయమునందును, మనస్సునకు ఉత్సాహము కలుగును. దానిచేత బహువిధయుక్తులతో ఉపదిష్టార్థము సిద్ధాంతము చేయబడును. ఇట్లు సిద్ధాంతమైన పిమ్మట మనస్సునందున్న మాలిన్యమును తొలగించుటకై ధ్యానమును ఆచరింప వలయును. సమమైన స్థలమునందు మృదువుగా వస్త్రము, కృష్ణాజినము, దర్భాసనము, మొదలగు వానితో ఆసనమును ఏర్పరుచుకొని దానిపై సుఖముగ గూర్చుండి మనస్సు సర్వవిషయములను వదలి వచ్చునంతవరకు, ఓమ్, అని ప్రణవమును ఉచ్చరించు చుండవలయును. ప్రణవార్థము ఆపరమేశ్వరుడే కావున ఆపరమేశ్వరునే భావింపుచు ఉండవలయును. అర్థభావనలేని జపము నిరర్థకము. ఇట్లు పరమేశ్వరుని స్వరూప స్వభావములతో భావింపుచు ఓంకారోచ్చారణమును చేయుచుండిన మనస్సు ప్రపంచమును విడచి ఆత్మయందే నిలుచును. అట్లు నిలిచిన పిమ్మట ప్రణవోచ్చారణమునుకూడ నిలిపి ఆపరమేశ్వరునియందే దానిని ( చిత్తమును ) బంధింప వలయును. పిమ్మట ఆమనస్సు మఱల చలింపకుండుటకయ్యే ప్రాణాయామమును ఆచరింపవలయును. వాయు చాంచల్యమే మనస్సు. కావున వాయువు నిలిచేనేని మనస్సుకూడ నిలుచును. పిమ్మట ఇంద్రియముల మూలమున నైనను, విషయములు చిత్తమునకు చాంచల్యమును కలిగింపకుండుటకై ఆ ఇంద్రియములను నిరోధింపవలయును. తర్వాత దేహము, బుద్ధి, మనస్సు, మొదల

గునవి అన్నియును ఏకారణములనుండి జనించినవో, దానిని ఎఱిగి కార్యము లను కారణములయందు జేర్పవలయును. బుద్ధ్యాదులు పంచభూతముల నుండి జనించినవి. కావున వానిని పంచభూతమాత్రములనుగా, భావింప వలయును. ఆపంచభూతములును, తన్మాత్రలనుండి జనించిన వగుటచేత వానిని తన్మాత్రరూపములనుగా జూడవలయును. అవియు త్రిగుణ వికార ములు కావున వానిని త్రిగుణమాత్రములనుగా, ఎఱుగవలయును. ఆగుణ ములను తత్కారణమగు మాయనుగా వీక్షింపవలయును. దానిని తదభిన్న మగు పరమేశ్వరునిగా నిర్ణయింపవలయును. ఇట్లు యోగబలముచేత జూచిన సర్వమును పరమేశ్వరమాత్రమే అగును. మఱియు సాధకుడు దేహాభిమా నమును పరిత్యజించి మాంసాదులను తత్కారణమగు భూమియందును రక్తము, శ్లేష్మము, మొదలగు వానిని దత్కారణమగు జలమునందును పిత్తరసము మొదలగు తేజోభాగములను అగ్నియందును, గలిపి ( అనగా, తన్మాత్రమునుగా జూచి ) వ్యష్టిభావమును ( నేనువేఱు, వాడువేఱు, అను భావమును ) వదల వలయును. " సర్వప్రపంచము నాశరీరమే " అనుభా వమును అంగీకరింప వలయును. ఈతడే విరాట్పురుషుడు. ఓంకారమునందు ప్రథమమాత్రయగు అకారమునకు అర్థమగువాడు. ఇట్లు తన్ను విరాట్పు రుష రూపునిగా భావించి పిమ్మట " సూక్ష్మశరీరము లేక, ఈస్థూలదే హము, ప్రవర్తింపనేరదు. నేనును స్థూలదేహమునకు నియామకుడనుగా నున్నట్లు గానవచ్చుచున్నాను. కావున దీనికిని నాకును భేదము ఉండవల యును. నేను స్థూలరూపుడను కాను అనవలసియున్నది " అను మొదలగు యుక్తులచేత ఆస్థూలాభిమానమును విడువవలయును. " సూక్ష్మమే నేను " అను అభిమానమును ఉంచవలయును. అప్పుడును వ్యష్టిభావమును వదలి సమష్టిభావమునే ( ప్రపంచమంతయు నొకటియే అను భావమునే ) అంగీకరింపవలయును. సమష్టి సూక్ష్మశరీరాభిమానియగు హిరణ్యగర్భుని నాఆత్మరూపునిగా భావింప వలయును. అప్పుడు స్థూలమే కానరాదు. ఈహిరణ్యగర్భుడే ఓంకారమునందలి రెండవమాత్ర అగు ఉకారమునకు అర్థము. ఇట్లు సూక్ష్మరూపముతో నిలచిన పిమ్మట " ఇది అంతయు త్రిగు ణకార్యము. హిరణ్యగర్భుడును జీవుడు. కావున అవిద్యాకల్పితుడు. కా వున ఇప్పుడు ఉన్నస్థానము పరమార్థము కాదు " అను మొదలగు యుక్తుల చేత అందలి అభిమానమునుగూడ పరిత్యజింప వలయును. దానికి గారణ మగు మాయతోగూడియున్న పరమేశ్వరునే ఆత్మగా భావింప వలయును.

ఈతఁడే ఓంకారముయొక్క మూఁడవమాత్రయగు మకారమునకు అర్థము. కార్యములు కారణములకంటె భిన్నములు కావు. కావున ఈస్థూల సూక్ష్మ ప్రపంచమంతయు మాయాయుక్త పరమేశ్వర మాత్రమే కదా. అప్పుడును వ్యష్టిభావమును ఉంచక సమష్ట్యభిమానమును నెలకొల్ప వలయును. ఈవిధముగ మాయాసహిత పరమేశ్వరుని ఆత్మరూపునిగా నిర్ణయించి తర్వాత "పరమేశ్వరుఁడు అద్వితీయుఁడు. ఇతనికంటె భిన్నమై మాయ ఎట్లుండగలదు. ఈతఁడే సత్తాస్వరూపుడగుటచేత ఈతనికంటె భిన్నముగ ఏపదార్థముకాని ఉండుటకు వీలులేదు. కావున ఈమాయ శూన్యరూపిణియే. వాస్తవస్థితిలో ఇది పరమేశ్వర రూపముగా గాని, అన్యరూపముగా గాని, నిర్ణయింపబడుటకు శక్యము కాదుకదా ?" అను మొదలగు యుక్తుల చేత అందలి అభిమానముకూడ విడువ వలయును. అప్పుడు మాయారహితమగు శుద్ధబ్రహ్మమే ఆత్మయై నిలుచును. ఇదియే ఓంకార నాదరూపమగు నర్ధమాత్రకు నర్థము. ఇట్లు మాయనశింపగానే మనస్సు మొదలగు నవికూడ దానితో నశించెను. కావున పరమేశ్వర సాక్షాత్కారమైన పిమ్మట అభిమానము కాని, అభిమాన రాహిత్యమునుగాని, లేదు. మొట్టమొదటినుండియు చేయబడుచున్న వికూడ సమష్ట్యభిమానములే. కావున అంతమునకు వచ్చినప్పుడు "ఈబ్రహ్మము సర్వరూపుడా, లేక, పరిచ్ఛిన్నుడా" అను సంశయము కలుగదు. "ఈబ్రహ్మము సర్వవ్యాపకుడే" అను విషయము తేటబడును. సర్వము ఆత్మయే అగును. అదియే ముక్తి. ఇట్లు ఈస్థూలశరీరమునందు గల మాంసాది పార్థివాంశములను కారణమగు భూమికంటె అభిన్నముగాను, రక్తాది జలాంశములను జలములకంటె అభిన్నముగాను, తేజోంశములను తేజస్సుకంటెను, వాయువ్యాంశములను వాయువుకంటెను, ఆకాశాంశములను ఆకాశమునకంటెను, అభిన్నములునుగా జూడవలయును. పిమ్మట ఇంద్రియములను వాని దేవతలయందు జేర్పవలయును. ఇంద్రియ గోళకమునందు పృథివ్యాద్యంశములగు మాంసాదులు కలవు. కావున అవి పూర్వముననే పృథివ్యాదులయందు చేరిపోవును. ఇక వినుట, చూచుట, మొదలగు కార్యములను చేయుసామర్థ్యముగల సూక్ష్మ పదార్థములు మాత్రమే మిగిలియుండును. వానిని వాని అధిదేవతలలో జేర్పవలయును. శ్రోత్రేంద్రియమును దిక్కులయందును, త్వగింద్రియమును విద్యుత్తునందును, నేత్రేంద్రియమును సూర్యునియందును, జిహ్వేంద్రియమును వరుణునియందును, ఘ్రాణేంద్రియమును వాయుదేవునియందును,

వాగింద్రియమును అగ్నిహోత్రమునందును, పాణింద్రియమును ఇంద్రుని యందును, పాదేంద్రియమును విష్ణువునందును, పాయురింద్రియమును మిత్రునియందును, ఉపస్థేంద్రియమును, కశ్యప ప్రజాపతి యందును, లయము గావింప వలయును. మనస్సును చంద్రునియందును, బుద్ధిని బ్రహ్మదేవునియందును, చేర్పవలయును. ఇచట ఉద్దేశింపబడినవారే ఇంద్రియ దేవతలు. వీరికిని ఇంద్రియములకును ఇంచుకైనను భేదము లేదు. సాధకుడు "ఇది నా శ్రోత్రము" అని భావించుటకు మారుగ "దిక్కులన్నియు నాకు శ్రోత్రము" అని భావింప వలయును. ఇట్లే పనేంద్రియ విషయము లందును భావింప వలయును. ఇంద్రియములే దేవతానామములతో చెప్పబడుచున్నవి కాని, మఱి ఏమియు లేదు. ఇట్లు తన్ను సర్వదేవమయునిగా భావించి "నేనే విరాట్పురుషుడను" అని సమష్ట్యభిమానమును ఉంచవలయును. పైన వర్ణించిన విధముగా సర్వదేవమయుడై బ్రహ్మాండమయుడై ఉన్న పురుషుడే అర్ధనారీశ్వరుడు. సృష్టికంతయు స్త్రీపురుష విభాగమే మూలము. కావున ఈ విరాట్పురుషుని దేహమునందు స్త్రీపురుష విభాగములు కలవు. ఇట్లగుటచేతనే ఈతనిని అర్ధనారీశ్వరుడని అందురు. ఈయనయే సర్వభూతములకును ఆధారభూతుడు. సర్వకారణము. ఆయనయే యజ్ఞస్వరూపుడు. ఆయనయే పరమేశ్వరునియొక్క సృష్టిరూపము. ఆయనయొక్క వృత్తి జాగ్రదవస్థ. మఱియు బ్రహ్మాండమునకు వెలుపల భూమి బ్రహ్మాండమునకు రెండింతలై ఉన్నది. దానిపై దానికంటె రెండింతలై శాల్యములో జలము ఉన్నది. దానిమీద దానికి రెండింతలధికముగ అగ్ని యున్నది. అంతకు రెండింత లెక్కువగా వాయువు కలదు. దానికి రెండింతలధికముగా ఆకాశము ఉన్నది. ఈ పంచభూతములు ఒకదానిపై నొకటి ఉన్నవి. ఇవి సూక్ష్మములును స్థూలములునని రెండువిధములు. సూక్ష్మములకు పంచీకరణము లేదు. స్థూలములకు అది కలదు. ఈ రెండు విధములగు భూతములచేత ప్రపంచమంతయు వ్యాపింపబడి ఉన్నది. ఈ విషయమును ఎఱిగి స్థూల పంచభూతములను వానికారణములయందు లయము నొందింప వలయును. భూమిని జలమాత్రముగాను, జలమును అగ్నిమాత్రముగాను, ఆ అగ్నిని వాయుమాత్రముగాను, వాయువును ఆకాశమాత్రము గాను, భావింపవలయును. ఇప్పటికి స్థూలప్రపంచము నాశమగును. పిమ్మట ఆ ఆకాశమును సర్వోత్పత్తికారణమగు చిదాకాశమునందు చేర్చి కేవల సూక్ష్మశరీరరూపుడై నిలువ వలయును. సంస్కారములు సూక్ష్మభూతములు,

కర్మలు, విద్య, దశేంద్రియములు, మనోబుద్ధులు, అనువాని సముదాయ
మునే మహాత్ములు సూక్ష్మశరీరమందురు. ఇట్టి లింగశరీరమును ఆశ్రయించిన
బ్రహ్మాండమునుండి నిర్గమించినట్లు అగును. ఇట్లు నిర్గమించి సూక్ష్మ శరీ
రాభిమానియే నేనని తలంపవలయును. ఆ సూక్ష్మశరీరమును అభిమానించు
హిరణ్యగర్భుడు మొట్టమొదట తాను ఒక శరీరమును కల్పించుకొని బ్రహ్మాం
డమునంతయును అనుభవించెను. మనము చతుర్ముఖుడని వ్యవహరించుచున్న
బ్రహ్మ ఆతడే. ఇట్టి ఆ హిరణ్యగర్భుని ఆత్మగా అభిమానించిన పిమ్మట
ఆలింగశరీరమునుగూడ లయము నొందింప వలయును. భూమ్యాది సూక్ష్మ
భూతములను పైన జెప్పిన విధముననే లయము జేసి కారణమాత్రములనుగా
భావింప వలయును. పిమ్మట కర్మాదులను అన్నిటిని సర్వభూత కారణమగు
ఆకాశముతోగూడ అవ్యాకృతునియందు లయము నొందింప వలయును.
ఆయన ఉపాధి రూపముతో మాయయై దానిచేత వర్ణింపబడి మాయా
విషై ఉన్నాడు. ఆయనయందే సృష్టికి పూర్వమునందును స్థితియందును
నాశసమయమునందును ప్రపంచము ఉన్నది. కార్యము ఎప్పటికిని కార
ణాత్మకమే కదా. సృష్టికి పూర్వమునందు కార్యము నామరూప రహిత
మై కారణమున నుండును. దానికి నామరూపములు కలుగుటయే సృష్టి.
కొంతకాలము ఆనామరూపములతోనుండి పిమ్మట ఆకారణమునందే లయ
మగును. అదియును నామరూప నాశమే కాని, వస్తునాశము కాదు. ఇది
యే నియమము. ఇట్లే ఈ ప్రపంచముకూడ త్రికాలములయందును ఆఅవ్యా
కృతునియందు కలదు. ఇట్లు ఉన్న పదార్థము ఒకటియే ఏకవిధమగు
స్వభావముకలదియేయైనను, తర్కవశగతులై పలువురు పలువిధముల
చెప్పుచున్నారు. సాంఖ్యులు సుఖదుఃఖ మోహాత్మకమగు ఈ ప్రపంచము
నకు అట్టిపదార్థమే కారణమగుట యుక్తమని తలచుచు అంతకంటె అన్యు
డగు పరమేశ్వరునితో పనిలేదని తలచుచు స్వతంత్రమును, జడమును, త్రిగు
ణాత్మకము నగు ప్రకృతినే జగత్కారణముగ జెప్పుచున్నారు. వేదాం
తులు ప్రపంచము జడము కావునను, జీవులు చేతనులు కావునను, శ్రుతి
యందు జగత్కారణము ఒక దానిని ఎఱిగిన సర్వమును ఎఱుగబడినట్లే
అగునని ప్రతిజ్ఞ చేయబడి ఉండుటచేతను, సాంఖ్యప్రకృతినే జగత్కారణ
ముగ అంగీకరించిన ఆస్వరూపజ్ఞానము చేత చేతనజీవజ్ఞానము కలుగుటసంభ
వింపకపోవుటచేతను, ఈశ్వరుని అంగీకరించి ఆయనకు స్వాధీనముగ ఒక
మాయకలదని చెప్పుకొని ఆమాయా ప్రభావమువలన ఆ పరమేశ్వరుడే

ప్రపంచరూపమున వివర్తము నొందెననియు, ఆ మాయయే జగత్కారణ మనియు, జెప్పుచున్నారు. వైశేషిక నయ్యాయికులు గుణములనుండి కాని, అజ్ఞానమునుండి కాని, ఈ పృథివ్యాది పిండములు పుట్టుటకు వీలులేదనియు, వీనికి కొన్ని సూక్ష్మపదార్థములు కారణములై ఉండి తీరవలయుననియు, తలంచి పృథివ్యాద భూతములు పుట్టుటకు ఆయాసజాతీయములగు పరమాణువులే కారణములని చెప్పుచున్నారు. బౌద్ధులు ఈ సర్వప్రపంచము బాహ్యమున లేదనియు, మనస్సునందే ఉన్నదనియు, వెలుపలిది ప్రతిబింబమాత్రమే అనియు, తలచి, ఈ ప్రతిబింబమును సత్యరూపముగ దలచుట భ్రాంతియే. కావున ఆ భ్రాంతియే ప్రపంచ కారణ మనుచున్నారు. ఇట్లు ఆ అవ్యాకృతుడగు పరమేశ్వరుని అనేకులు అనేకవిధములుగ జెప్పుచున్నారు. వాస్తవస్థితిలో అచ్చటనున్నది ఒకటితత్త్వమే. దానియందే లయకాలమునందు సర్వప్రపంచమును అణగుచున్నది. నామరూపములు లేనిదై నిలచియున్నది. జ్ఞేయ పదార్థములకు అభిముఖమగు తెలివియు, దాని అనుభవమును లేనిదై ఉండును. మరల కర్మవశమున అందుండియే జనించును. సృష్టి కలుగునంతవరకుగూడ ఆ అవ్యాకృత స్వరూపముతోనే ఉండును. ఆకాశాదిగ సృష్టి జరుగును. మరల పృథివ్యాదిగా ప్రళయము కలుగును. ఇట్లగుటచేత జాగ్రదవస్థారూపమగు స్థూల ప్రపంచము విడిచి స్వప్నావస్థారూపమగు సూక్ష్మప్రపంచమును పరిత్యజించి దీనికి కారణమగు అవ్యాకృతమున జేరవలయును. సూక్ష్మభూతములనుకూడ వానివాని కారణములయందు లయము నొందించిన ఆ భూతకార్యములగు బుద్ధ్యాదులు కూడ లయమునొందును. ఆలింగశరీరమును అవ్యాకృతమాత్రముగ భావింపవలయును. ఇట్టి భావనయే తత్స్వరూపస్థితి. ఇదియే కారణప్రపంచము. సుషుప్త్యవస్థారూపము. దీనిని పరిత్యజించి తుర్యరూపమగు శుద్ధబ్రహ్మమును ధ్యానింప వలయును. అవ్యాకృతము శుద్ధబ్రహ్మమాత్రమే అని తలంపవలయును. ఈ స్థితియందు మనస్సు అతి సూక్ష్మరూపముతోనుండును. సర్వోత్పత్తికారణమగు మాయ ( అవ్యాకృతోపాధి ) కూడ మనస్సేకదా ? ఇట్లు భావనాబలమున శుద్ధబ్రహ్మరూపుడవై నిలచిన అప్పుడు ఆ మనస్సు సంపూర్ణముగ నశించిపోవును. ఇదియే లింగశరీర భేదము. సూక్ష్మభూతములు మొదలగునవి తమతమ కారణములయందు లయమైనను మనస్సుమాత్రము జగత్కారణభూతము కావున పరబ్రహ్మ ప్రాప్తివరకు నిలచి ఉండుటచేత సంసారములును కర్మలును, అవిద్యయును, దానిని

ఆశ్రయించి యుండును. భూతములును ఇంద్రియములును ఉన్ననేమి, నశించిననేమి ? మనస్సు మిగిలియున్న సర్వమును పునస్సృష్టి అగునుకదా ? కావున బ్రహ్మప్రాప్తివలన కలుగు మనోనాశమే లింగశరీరభేదము. ఇట్లు లింగశరీరమును నశింపజేసి నిరహంకారుడై (అహంకారమే మనస్సు కావునను మనోభేదమే సూక్ష్మశరీర భేదము కావునను, అహంకారత్యాగమే సూక్ష్మశరీర భేదమని తెలిసికొనవలయును.) గురుశుశ్రూషాది సత్కర్మలను ఆచరించుచు బ్రహ్మమాత్రనిష్ఠుడై ఇట్లు భావింపవలయును. ఇప్పుడు నాకు లింగశరీరమను సంకెళ్ళు ఊడిపోయినది. నిస్సంశయముగ ఊడిపోయినది. ఇట్లగుటచేత నేను పరమానందరూపమగు చైతన్య సముద్రమునందు మునిగిపోతిని. కలసిపోతిని. నేనును, ఆ చైతన్యముయొక్క అంశమునే కదా ? ఇట్లు చెప్పుట ఏల ? ఆ పరమాత్మనే నేను. అనేక ఘటములయందు వ్యాపించియున్న ఆకాశమునకు ఉపాధిభేదమును అనుసరించి "రక్తఘటాకాశము నీలఘటాకాశము" అను మొదలగు వ్యవహారభేదములు కలుగునట్లు పరమేశ్వరునియందును మాయావిద్యాది ఉపాధులచేత జీవేశ్వరాది వ్యవహారభేదము కలుగుచున్నది. ఇంతమాత్రమే కాని, వాస్తవస్థితిలో నాకును బ్రహ్మమునకును భేదమే లేదు. ఆఉపాధులన్నియు శూన్యరూపములే కావున వానివలన గలుగు భేదముకూడ పరమార్థము కానేరదు. కావున నేను ఉపాధిరహిత పరబ్రహ్మమునే. నేను నిర్వికారుడను. అద్వితీయుడను. సర్వవ్యాపకుడను. కేవల జ్ఞానమాత్ర రూపుడను. ఈ జ్ఞానము నాకు స్వరూపమే కాని, గుణము కాదు. ఘటములు నశించినప్పుడు ఘటాకాశములు ఎట్లు వేఱుకావో, అట్లే ఉపాధులునశించినప్పుడు జీవబ్రహ్మములును వేఱుకానేరవు. శ్రుతులు అనేకములు ఈవిధముగనే జీవబ్రహ్మైక్యము బోధించుచున్నవి. అగ్ని అగ్నియందు జేర్పబడినచో ఏకరూపమై ప్రత్యేకముగ గ్రహింపబడక సమాన నామరూపములతోనే వ్యవహరింపబడును. గడ్డిమొదలగు పదార్థములు ఉప్పుకొఠారునందు పడవేయబడినచో తననామరూపములను విడచి ఉప్పే అగును. ఇట్లే ప్రపంచముకూడ బ్రహ్మభిన్నముగ గానవచ్చుచున్నను, అచేతనమైనను పరబ్రహ్మమున జేర్పబడినచో పరబ్రహ్మమే అగును.

అగ్నిదృష్టాంతమును విమర్శించినప్పుడు "సమానధర్మములుగల పదార్థములే ఒకదానితో నొకటి చేరినప్పుడు అవిభాగముగ ఐక్యము నొందును". అని తెలుచున్నది గాని, తృణదృష్టాంతమును పట్టి జూచిన ఆసంశయము

కూడ లేదుకదా? తృణము ఉప్పునకు సజాతీయము కాదనుట నిస్సంశయము కదా. కావున నేనే పరమేశ్వరుడను. ప్రపంచమంతయును పరమేశ్వరుడే. ఉప్పురాయి సముద్రమునబడి తన నామరూపములను విడిచి సముద్రమే అగుచున్నదో, అట్లే ఈప్రపంచము పరమేశ్వరునిజేరి పరమేశ్వరుడే అగుచున్నది. ఇందు సంశయమేమి? సముద్రోదకమునుండి జనించినది అగుటచేత, ఇట్లు చెప్పనేల? సముద్రోదకముయొక్క ఆకార భేదమే అగుటచేత ఆఉప్పురాయి సముద్రమునందుగలసి ఏకమైనది. ఈప్రపంచమును పరమేశ్వరునుండి జనించినది అగుటచేత ఆయనయందు ఐక్యము నొందును. ఇట్లును చెప్పనక్కఱలేదు. ఈప్రపంచము పరమేశ్వరునుండి భిన్నరూపముతో గాని, ఆపరమేశ్వరునియొక్క పరిణామమువలనగాని, జనించినది కాదు. త్రాడు భ్రాంతిచేత సర్పముగ తోచునట్లు పరమేశ్వరుడు ప్రపంచరూపముతో దోచుచున్నాడు. కావున ఈప్రపంచము ఎప్పటికిని పరమేశ్వరుడే. ఇట్లయిన పరమేశ్వరునకు పరమేశ్వరునితో ఐక్యము సంభవించుననినను, ప్రపంచపరమేశ్వరులకు ఐక్యము సంభవించుననినను, ఒక్కటియే అగును. కావున నీరు నీటియందును, పాలు పాలయందును, నేయి నేతియందును, కలసినట్లు ప్రపంచము బ్రహ్మమునందు కలయును. కావున నేను ఎట్లును పరమేశ్వరుడనే. ఈజలము మొదలగునవి జలము మొదలగు వాటియందు ప్రవేశించినప్పుడు నాశమునొందక ప్రత్యేక నామరూపములతో గ్రహింపబడక నుండునో, ఈప్రపంచముకూడ అట్లే పరమేశ్వరునియందు ఉండును. కావున నేను ఎట్లుచూచినను సద్రూపుడను, చైతన్యమాత్రుడును, పరమానంద స్వరూపుడును, సర్వజ్ఞుడును, జగత్కారణమును, పరాత్పరుడును, అగు పరమేశ్వరునియందు సంపూర్ణముగ గలసితిని. ఇట్లు కలయుటచేత పరమేశ్వరుడనే అయితిని. నాకు మూడుకాలములయందును నాశములేదు. దేశ కాల వస్తు పరిచ్ఛేదములు లేక, నేను సర్వపదార్థములయందును వ్యాపించి ఉన్నాను. నాకు సంక్షోభములు లేవు. ఏవిషయమునందును కొఱతలేదు. దేనితోను సంబంధము లేదు. విభాగములు లేవు. కార్యము, సాధనము, అను మొదలగునవి లేవు. నేను కర్మలను ఆచరించువాడను కాను. సర్వకాలములయందును పరిశుద్ధుడనై ఉండువాడను. పరబ్రహ్మ రూపుడను. అద్వితీయుడను. సత్యసంకల్పుడను. నాకు పుణ్యపాపములతో సంబంధము లేదు. ప్రపంచమంతయును నావలననే జనిలచుచున్నది. నాకంటె అన్యమగునది ఏదియు లేదు. నేను ప్రకాశరూపుడను,

ఆనందరూపుడను. నాశరహితుడను. నాకును ఈసత్వ రజ స్తమోగుణము లకును సంబంధము లేదు.

ఓభరద్వాజా! సర్వకాలములయందును, ఈవిధముగ తలపోయుచున్న పురుషునకు మనస్సు నాశము నొందును. దాని నాశముతోగూడ పరమేశ్వరుడు ప్రకాశించును. ఆత్మప్రకాశము కలిగిన సర్వదుఃఖములును నశించును. ఆనందప్రాప్తి కలుగును. ఇదియే మోక్షము. ఆనందమనగా, ఆత్మభిన్నమగు పదార్థము కాదు. లోకమునందు ఆనందకరములని తోచుచున్న పదార్థములన్నియు ఆత్మానందములోని అత్యల్పమైన అంశమును ఆశ్రయించియే ఆనందకరము లగుచున్నవి. ఇట్లుండగ ఇక ఆత్మకంటె ఆనందము ఎయ్యేది. కావున ఓశ్రీరామా! పైన జెప్పిన విధముగ ప్రవర్తించిన పురుషుడు తనంతదానే తన ఆత్మను జెందును. ఎప్పటికిని చెందియే ఉన్నాడు. అయినను శూన్యరూపిణియగు అవిద్య లేనిభేదమును కల్పించి బాధపెట్టినది. అది జ్ఞానముచేత నశింపగానే తానే తానై నిలుచును. ఈవిషయమంతయు శ్రుతిమూలకముగ చెప్పబడినదియే కాని, స్వతంత్రముగ జెప్పబడినది కాదు. ఓభరద్వాజా! ఇదియే వశిష్ఠమహాముని చేసిన ఉపదేశమునందలి సారాంశము. నీకు సర్వమును వివరించి చెప్పితిని. నీవును పైన వర్ణించిన విధముగా, జ్ఞానమార్గమును, యోగమార్గమును, అవలంబించితివేని సర్వతత్వమును తెలిసికొనగలవు. ఓబుద్ధిమంతుడా! భరద్వాజా! నిశ్చయముగ తెలిసికొనగలవు. శాస్త్రప్రచారముచేతను, సద్గురూపదేశమును ఎఱుగుటచేతను, జ్ఞానయోగములలో ఒకదానిని గాని, రెంటిని గాని, అభ్యసించుటచేతను, సర్వసిద్ధియు కలుగుననుట వేదసిద్ధాంతము. కావున నీవు సర్వమును పరిత్యజించి జ్ఞానయోగములను అభ్యసించుటయందే మనస్సును నెలకొల్పుము.

—* శ్రీరామవ్యవహారవిధానము. *—

అని వాల్మీకిమహర్షి చెప్పిన విని భరద్వాజుడు ఇట్లనియె. ఓవాల్మీకి మహాముని! శ్రీరామచంద్రుడు ఉపదేశబలముచేత స్వస్వరూపమునందు నిలిచెను కదా? ఆస్వస్వరూపస్థితి వ్యవహారమునకు కొంత విరుద్ధము కదా. అట్టిస్థితియందు ఉన్నవారు సంసారమునందు నిలుచుటకు సామాన్యముగ ఉత్సహింపరు గదా? ఇట్లుండగ ఆవశిష్ఠమహాముని శ్రీరాముని వ్యవహారపరునిగా ఏవిధమున గావించెను? దానిని వివరించి చెప్పుడు. ఆవిషయమును ఎఱిగితినేని నేనును మొట్టమొదట అభ్యాసమును చేసి ము

క్తిని సంపాదించుటకు ప్రయత్నించునట్లు సమాధినుండి మేలుకొనిన పిమ్మట వ్యవహారమును ఆచరించుటకుకూడ ప్రయత్నించెదను. అని అడిగిన వాల్మీకి మహాముని ఇట్లని ఉత్తరము చెప్పనారంభించెను. ఓశిష్యా ! భారద్వాజా! ఉపదేశము చేసిన పిమ్మట జరిగిన వృత్తాంతమును చెప్పెదను వినుము. అట్లు రామచంద్రుడు పదునెనిమిది దినములు ముగిసిన పిమ్మట పరమసుఖ చిత్తవిశ్రాంతిని జెంది స్వస్వరూపానుభవము నొందగనే విశ్వామిత్రుడు వశిష్ఠునిజూచి ఇట్లనియె.

ఓమహాత్మా! బ్రహ్మకుమారా! వశిష్ఠా! నీవు సర్వోత్తముడవు. శక్తిపాతముచేత ( జీవునకు ఉపాధిని నశింపజేయుటచేత ) నీప్రభావమును క్షణమందే కనబరచితివి. ఉపదేశము చేసిన వెంటనే శిష్యుని ఇట్లు జీవన్ముక్తుని గావించుశక్తి అన్యులకు ఉండదు. గురువనిన నీవే గురువు. ఎవ్వడు చూచుటచేతను, తాకుటచేతను ఉపదేశించుటచేతను, కరుణచేతను, శిష్యునిదేహమునందు నిర్విశేష బ్రహ్మ సమావేశమును ( అనగా, జీవబ్రహ్మైక్యమును ) కలిగించునో, అట్టివాడే గురువు కాని, అన్యుడు గురువా ? ఈరామచంద్రుడును నీకు తగిన శిష్యుడే. ఈతని మనస్సు మిక్కిలి నిర్మలమైనది. ఉపదేశమునకు పూర్వమునందే స్వయముగనే వైరాగ్యము నొందియున్నది. ఈకారణమువలన ఈతడు విశ్రాంతినిమాత్రమే కోరియుండెను. మీ అనుగ్రహమువలన దానిని సంపాదించెను. వాస్తవస్థితిలో గురూపదేశమువలన కలుగు ఫలమునకు శిష్యుని ప్రజ్ఞయే ముఖ్యకారణము. మఱియు శిష్యునిబుద్ధియే కారణము. శిష్యుడు తగినంత ప్రజ్ఞ లేనివాడైనచో, కామకర్మవాసనలచేత ఆవరింపబడి ఉన్నవాడయినచో, గురువు ఎంతవాడైనను ఆగురువు ఉపదేశించినవాటిని ఎట్లు తెలిసికొనగలుగును. ఇట్లుగాక, గురుశిష్యులిరువురును యోగ్యులై యుండిన సర్వపురుషార్థములును కరతలామలకముగ చేకూరును. శాస్త్రమునకును ప్రయోజనము కలుగును. జనులకు ఉపయోగపడుటయేకదా శాస్త్రమునకు ప్రయోజనము. కావున ఎచ్చటనైనను గురుశిష్యులు మీవలెనే ఉండవలయును. అని ఇట్లు విశ్వామిత్రమహర్షి గురుశిష్యులనుప్రశంసించి కార్యార్థియై శ్రీరామచంద్రునితో ఇట్లనియె. ఓశ్రీరామచంద్రా ! మహాత్మా ! మమ్ము దయతో జూచి సమాధినుండి మేలుకొనుము. వ్యవహారములను ఆచరించుటకు ప్రారంభింపుము. ఓశ్రీరామా ! నీవు పరబ్రహ్మమునందు జేరి ఆనందమును అనుభవించు చున్నావు. మేమన్ననో, కార్యార్థులమై ఉన్నాము. కావున

నీదయను యాచింపవలసి వచ్చినని. నాకార్యమునుగూర్చి కొంచెము ఆలోచింపుము.

ఓప్రభువా! శ్రీరామా! నేను దేనికై ఇచ్చటికి వచ్చితినో, దేనికై దశరథుని ప్రార్థించితినో, ఆకార్యమును స్మరింపుము. ఓమానశీలా! రామచంద్రా! నాఉద్దేశమును నిరర్థకము జేయకుము. మోక్షసిద్ధి కలిగెనుకదా? అని వ్యవహారమును విడిచిపెట్టకుము. అట్లు విడిచిపెట్టితివేని నాకార్యము ఒకటియే కాక, నీఅవతారమునకు ఫలమగు రావణాసురవధ రూపమగు దేవకార్యముగూడ చెడిపోవును. అట్లు చేయవద్దు. వ్యవహారము వలన నీయొక్కస్థితికి వచ్చు హాని ఏమియు లేదు. అని ఇట్లు రామునిగూర్చి పలికి సభ్యులనుజూచి ఇట్లనియె. ఓసభ్యులారా! ఈరామచంద్రుడు నాయందు ప్రసన్నుడాయెను. ఇప్పుడు ఈశ్రీరాముని నా ఆశ్రమమునకు తాటకా సంహారార్థమై గొనిపోయెదను. అచ్చటనుండి క్రమక్రమముగ ఇతడు చేయబోవు కార్యములను వినుడు. సీతాస్వయంవరమునకై మిథిలానగరమునకు బోవుచు మార్గమధ్యమునందు అహల్యకు శాపవిమోచనము గావించును. శివునియొక్క ధనుస్సును విరిచి మిథిలలో సీతను వివాహమగును. అక్కడనుండి అయోధ్యకు మరలివచ్చుచు త్రోవలో పరశురామ గర్వభంగమును గావించును. ఆయనయొక్క పరలోకమార్గమును ఖండించును. తర్వాత కులక్రమముగ వచ్చుచున్న రాజ్యమును విడిచి వనమునకుబోయి ఆనెపముచేత సర్వమునులకును అభయప్రదానము చేయును. స్వయముగ భయరహితుడును, ఆశలేనివాడును, అగుటచేత వనవాసమును రాజ్యపదవిని గూడ ఒక్కటిగనే చూచుచు తనచర్యచేత మూడులోకములకును జ్ఞానోపదేశమును, సమతోపదేశమును, గావించును. పిమ్మట రావణాసురుడు సీతను హరింపగా ఆనెపముచేత శోకమోహములను అభినయించి లోకులకు దారాపుత్రాది అభిమానమువలన కలుగు శోకమోహములను ప్రకటనము చేయును. దీనిమూలమున "సంసారాభిమానము బహుదుఃఖకారణము, దానిని విడువ వలయును" అను విషయమును బోధించును. పిమ్మట రావణాసుర వధను గావించి కామాసక్తులు పడవలసిన పాట్లను లోకమునకు విశదము చేయును. ధర్మపరత కలిగినచో, తిర్యగ్జంతువులుకూడ వానికి సహాయము చేయునని ప్రకటించుటకై వానర సైన్యముతోగూడి యుద్ధమును చేయును. పిమ్మట అతి పవిత్రయగు సీతనుగూడ అగ్నిప్రవేశ ప్రమాణముచేత పరీక్షించి "సర్వజనులకును లోకానుసరణమే కర్త

వ్యము ” అను విషయమును తేటపరచును. ఇట్లు ముల్లోకములకును సమస్తతీర్థములకును పవిత్రతను సమకూర్చుచు సంచరించును. తనను చూచినను, తాకినను, తనతో మాటలాడినను, తనను ధ్యానించి ననుగూడ జీవన్ముక్తి ఒసగును. ఈవిధముగ ఈరామచంద్రుడు అవతారకాలమునందు నాయొక్కయు, దేవతలయొక్కయు, ముల్లోకములయొక్కయు, కార్యములను సాధింప గలడు. ఓసభ్యులారా! ఈమహాత్మునకు నమస్కరింపుడు. మీరును ఈశ్రీరామునివలెనే జీవన్ముక్తి నొందుడు. మీకు సర్వోత్కర్షము గలుగునుగాక. ఓభారద్వాజా! ఇట్లు పలికి ఆవిశ్వామిత్రుడు ఊరికె ఉండెను. అంత వశిష్ఠ మహాముని ఇట్లనియె.

ఓశ్రీరామా! ఏరుడా! జ్ఞానమాత్రస్వరూపా! ఇది విశ్రాంతికి సమయముకాదు. లే లెమ్ము. లోకములకు ఆనందమును కలిగింపుము. యోగియగువానికి లోకమునుగూర్చిన విచారము స్థిరమైననే కాని (అనగా, లోకస్వభావము ఇట్టిది, అని తెలిసిననే గాని) సమాధిస్థిరముకాదు. కావున నీవు లోకమునకును, దేవతలకును, ఉపయుక్తములగు కార్యములను సాధించి “ లోకస్థితి ఇంతమాత్రము” అని తెలిసికొని కార్యము ముగిసిన పిమ్మట సమాధియందు నిలువుము. అని ఇట్లు చెప్పుచుండినను, ఆ శ్రీరాముడు పరబ్రహ్మమునందు ఐక్యమైయుండుటచేత ఏమియు పలుకలేదు. అప్పుడు ఆఘనుని మేలుకొలుపుటకై ఆవశిష్ఠమహాముని సుషుమ్నానాడీ మార్గమున లోనికి ప్రవేశించెను. అట్లు ప్రవేశించి చిత్తమును కదలింపగానే ఆశ్రీరాముని దేహమునందు ఉన్న జీవుడు తన ప్రకాశముతో దేహధారణశక్తిని, ప్రాణమును, మనస్సును ప్రకాశింపజేసి నాడులకు పుష్టిని కలిగించి క్రమక్రమముగ కన్నులు తెరచెను. ఎదుటనున్న వశిష్ఠుడు మొదలగువారిని జూచి ఏప్రస్తావముచేయకనే కార్యమును సంకల్పింపక ఊరికె కూర్చుండెను. అందఱిని గౌరవించి పూజలనుమాత్రము చేసెను. అంత వశిష్ఠమహాముని మఱల జరగవలసినకార్యమును ఉపదేశించగానే మహాత్ముడగు శ్రీరామచంద్రుడు శాంతుడయ్యె ఇట్లని బదులుచెప్పెను. గురువుగారి వచనముకదా, అని ఆదరించెను.

శ్లో॥ నవిధేర్న నిషేధస్య త్వత్ప్రసాదా దయం విభుః ।
తథాపి తవ వాక్యంతు కరణీయంహి సర్వదా ॥
వేదాగమ పురాణేషు స్మృతిష్వపి మహామునే ।
గురువాక్యం విధిః ప్రోక్తో నిషేధ స్త ద్విపర్యయః ॥

ఓమహాత్మా! వశిష్ఠమహాముని! మీఅనుగ్రహమువలన నాకువిధినిషేధములుతొలగిపోయినవి. అయినను, మీవాక్యమును అవశ్యముగ ఆచరింపవలయునుకదా? వేదమునందును, శాస్త్రమునందును,పురాణములయందును, స్మృతులు మొదలగువానియందును గురువాక్యమును ఆచరించుటయే విధియనియు, దానిని ఆచరింపకుండుట నిషేధమనియు, వర్ణింపబడి ఉన్నది. విధినిషేధములను బోధించుపని గురువుదే, కావున విధినిషేధములను చెప్పు శాస్త్రమంతయు "గురూపదేశము కర్తవ్యము" అని చెప్పునదియే అగును. "గురూపదేశ పరిత్యాగము కర్తవ్యము కాదు" అని నిరూపించునదియే అగును. గురువు "శాస్త్రమునందు విధింపబడినదానిని ఆచరింప వలయును, నిషేధింపబడినదానిని ఆచరింప గూడదు" అని చెప్పును. ఈ ఆజ్ఞను అనువర్తించినచో, శాస్త్రాభిమతమును ఆచరించినట్లు అగును. దానిని తిరస్కరించినచో, శాస్త్రమును తిరస్కరించినట్లు అగును. కావున సర్వశాస్త్రములయొక్క అభిప్రాయమును గురువుయొక్క ఆజ్ఞను పరిపాలించుటయే. ఓభరద్వాజా ! ఇట్లు చెప్పి దయామయుడును, సర్వరూపుడు నగు ఆరామచంద్రుడు వశిష్ఠమహామునీంద్రునియొక్క చరణములను శిరమునబూని సకలమునులను అవలోకించి ఇట్లనియె.

శ్లో॥ సర్వే శృణుత భద్రం వో నిశ్చయేన సునిశ్చితమ్ ।
ఆత్మజ్ఞానా త్పరం నాస్తి గురోరపిచ తద్విదః ॥

ఓసభికులారా! మీకు శుభము కలుగునుగాక. ఒక-వాక్యమును వినుడు. లోకమునందు ఆత్మజ్ఞానమునకంటె శ్రేష్ఠమను లాభము లేదు. గురువునకంటె శ్రేష్ఠుడగు బంధువుడు లేడు. ఇదియే నిశ్చయము. ముమ్మాటికిని నిశ్చయము. మీకును ఈవిషయము క్రొత్తదిగాదు. అనిచెప్పిన విని సిద్ధాదులు ఇట్లనిరి. ఓరామచంద్రా! మాహృద

యములయందును ఈవిషయమే దృఢపడినది. ఓమహాత్మా ! మీ అను గ్రహమువలన మేముకృతార్థుల మైతిమి. మీసంవాదమువలన సర్వవి షయమును తేటపడినది. ఓమహారాజా ! నీకు శాశ్వత సుఖము కలు గును గాక. ఓరామచంద్రా! నీకు నమస్కారము. వశిష్ఠమహాముని యొద్దనుండికూడ ఆజ్ఞను గైకొంటిమి. ఇక మానివాసములకు బో యెదము. ఓభరద్వాజా ! ఇట్లు పలికి రామునిస్తోత్రము చేయుచు ఆసిద్ధాదులు తమతమ నివాసములకు వెడలిపోయిరి. అంత దేవత లును రాముని శిరస్సుపై కల్పవృక్ష కుసుమములను వర్షించిరి.

శ్లో॥-ఇతి రఘుపతిసిద్ధిః ప్రోదితాయా మయాతే
వరముని వచనాళీ రత్నమాలా విచిత్రా ।
నిఖిల రవికులానాం యోగినాం సేవ్యరూపా
పరమ గురు కటాక్షా న్ముక్తిమార్గం దదాతి ॥

ఓభరద్వాజా! నీకు శ్రీరామచంద్రుని వృత్తాంతమును అంత యును వివరించి చెప్పితిని. ఈక్రమమును ఆశ్రయించి నీవును సుఖిం పుము. జీవన్ముక్తినొందుము. వశిష్ఠవాక్య సమూహమను రత్నమాల చేత మనోహరమై ఉన్న ఈవశిష్ఠ రామ సంవాదమును సంపూర్ణ ముగ నీకు వివరించితిని. శ్రీరామునకు జీవన్ముక్తి కలిగిన విధమును ప్రకటించితిని. ఆతడు వ్యవహారమును ఆచరించిన విధమును చెప్పి తిని. ఇక ఇందు చెప్పవలసిన శేషము ఏదియు లేదు. సర్వవిద్వాంసు లును, యోగులును ( అనగా, మోక్షేచ్ఛగలవారును, దానికై ప్రయత్నించువారును, సిద్ధినొందినవారును ) గూడ దీనినే సేవింప వలయును. అట్లు చేసిన మోక్షేచ్ఛగలవారు దానికితగిన ఉపాయ మును సాధించుకొందురు. దానికై ప్రయత్నించువారు మార్గభ్రం శము నొందకుందురు. సిద్ధినొందినవారు తమ సిద్ధిని స్థిరముగ నిలుపు కొందురు. శాస్త్రాభ్యాసమువలన పరమేశ్వర స్వరూప స్వభావ ములు ఎల్లప్పుడును మనస్సునకు వచ్చుచునే యుండునుకదా ? అట్లుం డుటయే స్థైర్యమునకు కారణ మగుచుండును గదా. కావున ఈ శా స్త్రమును నిరంతరము అభ్యసించు చుండినచో, అందఱికిని పరమసి ౽ ( జీవన్ముక్తిని ) కలిగించును.

శ్లో॥ యఇమం శృణుయాన్నిత్యం విధింరామ వశిష్ఠయోః ।
సర్వావస్థోపి శ్రవణా న్ముచ్యతే బ్రహ్మ గచ్ఛతి ॥

ఓభరద్వాజా! ఏపురుషుడు ఈరామవశిష్ఠ సంవాదమును వినునో, వాడు ఏవిధముగానున్నను మోక్షమునే చెందును. శ్రద్ధయున్నను, లేకున్నను, అర్థగ్రహణము ఆచరించినను, ఆచరింపకున్నను, పరులవలన వినినంతమాత్రముననే పరబ్రహ్మమును జెందును. దీనిప్రభావము అపరిమితమైనది. శుభమ్.

ఇట్లు శ్రీవాల్మీకిమహర్షి ప్రణీత శ్రీజ్ఞానవాశిష్ఠ రామాయణమునందు నిర్వాణ ప్రకరణమున శ్రీరామవ్యవహార విధానకథనమును నలుబది ఆరవ అధ్యాయము

సర్వము సంపూర్ణము.

శ్లో॥ యదక్షరపదభ్రష్టం మాత్రాహీనంచ యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాందేవ నారాయణ నమోస్తుతే ॥
ఓంతత్సత్ - పరబ్రహ్మార్పణమస్తు. స్వస్త్యస్తు.

---

జనముల్ శాంతిశమాది సద్గుణయుతిన్ సత్వావతారాభులై ।
మనమున్ గెల్చి సమత్వమేర్పడగ నిర్మానాత్మలై గ్రాలుతన్ ।
ఘనురాముండమ యొజ్జగాగొనుచు నుత్కర్షంబునన్ వెల్గునీ ।
వినుతగ్రంథమునార్య సత్కరుణ నాపృథ్వీధరాంభోధిగన్ ॥

గీ॥ సత్ప్రసంగంబు గల్గించి సదయనీల ।
చిత్తమును నిర్మలముచేసి చెలగినట్టి ।
ప్రేరకుని త్యాగరాయు బరూరుకులజు ।
నెంతయును సన్నుతించెద నింపుమీర ॥

ఇట్లు శ్రీహారితసగోత్ర పవిత్ర వెన్నెలకంటి కులకలశాంబుధి రోహిణీకళత్ర సుచరిత్ర పరదేశామాత్యపుత్ర సుందరాంబికాగర్భశుక్తి ముక్తాయమాన సుజనజనతాభజమాన సుందరరామాభిధాన ప్రణీతమగు శ్రీజ్ఞానవాశిష్ఠరామాయణ వచనకావ్యము సర్వము సమాప్తము—ఓంతత్సత్.

---

# ఆంధ్ర గ్రంథములు

## వచనగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశ స్కంధములు, ఒకేసంపుటం | 9 | 0 |
| ,, మూడుసంపుటములు | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము— | | |
| ,, ఆదిసభాపర్వములు | 3 | 0 |
| ,, ఆరణ్యపర్వము | 3 | 0 |
| ,, విరాటోద్యోగపర్వము | 3 | 0 |
| ,, భీష్మద్రోణపర్వము ,, | 4 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 3 | 0 |
| ,, శాంతిపర్వము | 4 | 8 |
| ,, ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వము వరకుగల సంపుటము | 4 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, 2 సంపుటములు | (అచ్చు) | |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | 1 | 12 |
| ఆంధ్రకవిత్వచరిత్ర, బసవరాజు అప్పారావుగారిది | 1 | 12 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | 4 | 0 |
| అరేబియన్‌నైట్సుకథలు | 1 | 4 |
| న్యాయవిచారము, ప్రహసనం | 0 | 4 |
| తులసీదాసురామాయణము | 8 | 0 |
| తిలకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | 0 | 14 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ద్వాదశోపనిషత్తులు, వచనం | 3 | 8 |
| భారతరమణీమణులు, 1 భా॥ | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 10 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 8 |
| శ్రీమహాభక్తవిజయము, నూతనముద్రితము | 6 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరి | 0 | 8 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | 0 | 8 |
| నవనాథభక్తులచరిత్ర | 2 | 0 |
| నీతిరత్నాకరము | 0 | 8 |
| సంగ్రహరామాయణము | 0 | 12 |
| సంగ్రహభారతము | 1 | 4 |
| సంగ్రహభాగవతము | 1 | 4 |
| ప్రాచీనదేశచరిత్రలు | 1 | 12 |
| పతివ్రతలచరిత్రలు | 2 | 0 |
| దక్కనుపూర్వకథలు | 2 | 0 |
| భోజునికథలు | 0 | 8 |
| హితోపదేశము, సులభశైలి | 0 | 12 |
| భోజకాళిదాసకథలు, 1 భా॥ | 0 | 12 |
| ,, 2 భా॥ | 0 | 12 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 6 |
| సంస్కృతనాటకకథలు | 1 | 8 |
| దశకుమారచరిత్రము | 1 | [illegible] |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు | 0 | 14 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| రాజశేఖరుడు, గోపాలుడు | 0 | 8 |
| విక్రమార్కునికథలు | 0 | 8 |
| చార్ దర్వేషుకథలు | 0 | 8 |
| తాతాచార్యులకథలు | 0 | 6 |
| వైద్యులకథలు | 0 | 4 |
| బేతాళునికథలు | 0 | 8 |
| వీరాంగనలు | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | 0 | 3 |
| నలుగురుమంత్రులకథలు | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు | 0 | 6 |
| రేచుక్కపగటిచుక్కకథ | 0 | 3 |
| సత్యసేనవిజయము | 0 | 4 |
| ఋషులచరిత్ర | 0 | 8 |
| పురాణగాథలు I | 0 | 12 |
| ,, II | 0 | 12 |
| బాజీరాయని చరిత్ర | 0 | 14 |
| రఘువంశకథ | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర | 1 | 0 |
| వివేకానందవిజయము | 2 | 0 |
| పరిహాస్యవినోదకథలు | 0 | 12 |
| ఈసపునీతికథలు, 1-వ భా॥ | 0 | 6 |
| డిటో 2-వ భా॥ | 0 | 8 |
| పంజాబుఅల్లరి | 0 | 8 |
| శుకసప్తతికథలు | 0 | 6 |
| మర్యాదరామన్నకథలు | 0 | 3 |
| మైరావణచరిత్ర | 0 | 1 |
| షేక్స్పియర్ నాటకకథలు | 1 | 8 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్ర | 0 | 12 |
| ప్రహ్లాదచరిత్ర, ప్రతిమలతో | 0 | 6 |
| శకుంతల ,, | 0 | 6 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| నల | ,, | 0 | 8 |
| సావిత్రి | ,, | 0 | 6 |
| హరిశ్చంద్ర | ,, | 0 | 8 |

**నవలలు.**

| | | | |
|---|---|---|---|
| సీతారామము | | 1 | 4 |
| ఐవన్హో, | నవల | 0 | 8 |
| మదాలస | ,, | (అచ్చు) | |
| సుజనరంజని | ,, | 0 | 8 |
| విజ్జలదేవి | ,, | 1 | 8 |
| ఉన్మాదిని, | నవల | 0 | 4 |
| రాధారాణి | ,, | 0 | 4 |
| అస్తమయము | ,, | 1 | 8 |
| దుర్గేశనందని | ,, | 0 | 12 |
| కపాలకుండల | ,, | 0 | 12 |
| లక్షణ | ,, | 0 | 12 |
| టిప్పుసుల్తాన్ | ,, | 1 | 8 |
| లీల | ,, | 0 | 6 |
| రాజర్షి | ,, | 1 | 0 |
| తారాబాయి | ,, | 0 | 14 |
| దిలారామ | ,, | 1 | 4 |
| కోవలన్ కన్నకి | | 0 | 12 |
| మనోహరి | ,, | 0 | 14 |
| వీరబాల | ,, | 0 | 8 |
| ఆనందమఠ | ,, | 0 | 12 |
| లాలాబాయి | ,, | 0 | 8 |
| ఆంధ్రరాష్ట్రము | ,, | 1 | 8 |
| రోషనార | ,, | 0 | 12 |
| బాలాదిత్య | ,, | 2 | 0 |
| దేశభక్తుడు | | 1 | 0 |
| శంభుతోనొకనాటిసహవాసం | | 0 | 4 |
| చంద్రగుప్తుడు, నవల | | 2 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| నీతిసింధువు ,, | 0 | 10 |
| వనజాక్షి ,, | 0 | 12 |
| స్వప్నయాత్ర ,, | 0 | 12 |
| ముగ్గురుమూర్తులు | 1 | 4 |

**బాలగ్రంథములు.**

| | | |
|---|---|---|
| హిందీ ఇంగ్లీషు బాలశిక్ష | 0 | 4 |
| హిందీ తెలుగు బాలబోధ | 0 | 4 |
| పెద్దబాలశిక్ష బజారుప్రతి | 1 | 0 |
| డిటో అట్టబైండు | 1 | 8 |
| చిన్నబాలశిక్ష | 0 | 3 |
| ఆంధ్రకన్నడబాలశిక్ష | 0 | 4 |
| ఆంధ్రద్రావిడబాలశిక్ష | 0 | 4 |
| ఆంధ్రద్రావిడ మొదటివాచకం | 0 | 6 |
| ,, రెండవవాచకము | 0 | 6 |
| నేరములు చేయుజాతులచరిత్ర, ప్రతిమతో | 1 | 0 |
| పాకశాస్త్రము, కంచి సుబ్బారావుగారిది | 1 | 12 |
| చిత్రలేఖనము (Drawing) | 1 | 4 |
| జంత్రి, భూమిశిస్తు, అధికసన్నాల విభజనలు విశదముగ నున్నవి | 0 | 8 |
| గాంధిమహాత్ముని హైందవ స్వరాజ్యము | 1 | 0 |
| ఆకాశవిమానములు, ప్రతిమలతో సహా | 0 | 8 |
| భావలహరి | 0 | 8 |
| వ్యవసాయబోధిని | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ | |
|---|---|---|

**నిఘంటువులు.**

| | | |
|---|---|---|
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యకా॥ | 0 | 6 |
| బాలచంద్రోదయము | 0 | 8 |
| పద్యాభాషామంజరి (అనుభాషల ఒకేబుక్కులరి) | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీక, అకారాద్యనుక్రమణికతో | 1 | 4 |
| డిటో క్యాలికోబైండు | 1 | 8 |
| శబ్దార్థచంద్రిక | 6 | 0 |
| తెలుగుసామెతలు with English-Translation by Capton-Carr | 1 | 4 |
| Translation Guide - English ot Telugu & Vice Versa. | 2 | 8 |
| Sankaranarayana's English-Telugu Dictionary. శంకరనారాయణగారి నిఘంటువు (ఇంగ్లీషుపదములకు తెలుగు అర్థముగలది) | 12 | 0 |
| English-Telugu Pocket Dictionary ఇంగ్లీషు-తెలుగు పాకెట్టుడిక్షనరి | 3 | 0 |
| సంస్కృతాంధ్రనిఘంటువు | 3 | 8 |

**ఆంధ్రవ్యాకరణాలంకారములు.**

| | | |
|---|---|---|
| అథర్వణకారికావళి | 1 | 8 |
| అనంతునిఛందము | 1 | 0 |
| అప్పకవీయము | 3 | 0 |


**వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్**

292, ఎస్ప్లనేడ్. చెన్నపురి.